# తెలుగు వ్యుత్పత్తి కోశం

అయిదో సంపుటం

ప - భ

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ లకంసాని చక్రధరరావు

ఎమ్. ఏ., పిఎచ్. డి.

ఆంధ్ర విశ్వకళా పరిషన్ముద్రణం

వాల్తేరు, విశాఖపట్నం 530 003

# తెలుగు వ్యుత్పత్తి కోశం

## (ప - భ)

### అయిదో సంపుటం

ప్రధాన సంపాదకుడు

డా॥ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

సహాయకులు

డాక్టర్ బాల అరుణకుమారి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ లక్కింశెట్టి కోట మల్లేశ్వరరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ కందాళ కనకమహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ శ్రీపాద సీతామహాలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, ఎమ్.ఏ., పిఎచ్.డి.
డాక్టర్ సజ్జా మోహనరావు, ఎమ్.ఏ., పిఎచ్.డి.

1987

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు

వాల్తేరు, విశాఖపట్టణం 530 003

బహుముఖ ప్రజ్ఞాశాలి



# ఆచార్య కోనేరు రామకృష్ణారావు

పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్రవిశ్వకళా పరిషత్), డి.ఎస్‌సి. (ఆనరరీ) (నాగార్జున విశ్వవిద్యాలయం)

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# ము న్నుడి

లక్షాధిక పదపూరితమైన ఎనిమిది సంపుటాల తెలుగు వ్యుత్పత్తికోశ నిర్మాణ కార్యక్రమం 1986 సంవత్సరం జూన్ నెలాఖరుకు పూర్తి ఐంది. సుమారు 19,000 పదాలతో కూడిన ఈ అయిదో సంపుటాన్ని (ప-భ) ఇప్పుడు ప్రకటిస్తున్నాం. 500 పుటలతో ఉన్న ఈ సంపుటం ఎనిమిది సంపుటాలలోను పెద్దది. ప్రచురణలోని ఆలస్యానికి ఇది ఒక కారణం. మిగిలిన మూడు సంపుటాలను ఈ సంవత్సరాంతానికి ప్రచురించాలని నిర్ణయం. ఆంధ్ర విశ్వకళా పరిషద్వజ్రోత్సవ సందర్భంగా తెలుగు వ్యుత్పత్తి కోశావిష్కరణ జరుగుతుంది.

సకాలంలో ఈ ఎనిమిది సంపుటాల రాత ప్రతిని అందించిన ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర శాఖాధ్యక్షులు, తెలుగు వ్యుత్పత్తికోశ పథక ప్రధాన సంపాదకులు, పర్యవేక్షకులు డాక్టరు లకంసాని చక్రధరరావుగారికి, ఈ పథక సిబ్బందికి, ఈ సంపుటాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది పూర్తికావించాలని దృఢసంకల్పంతో ఉన్న ప్రెస్ డైరెక్టర్ ఆచార్య యద్దనపూడి రంగారావు, ఆచార్య కె. సుబ్బారావు గార్లకు తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘ సభ్యులకు కృతజ్ఞతలు తెలుపుతూ ఈ అయిదో సంపుటాన్ని అందిస్తున్నాను.

మీ

విశాఖపట్నం
2-2-1987

ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# పీఠిక

ప్రముఖ విద్యావేత్త ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు (1949-61) విశ్వవిద్యాలయ వితరణ సంఘాధ్యక్షులు (1961) కీ.శే. డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ, బి.ఏ. (ఆక్స్‌ఫర్డ్), పిఎచ్.డి. (వియన్నా) గారు దూరదృష్టితో ద్రావిడ భాషాశాస్త్రాభిమానంతో 1957 లో ప్రారంభించిన ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ పథక పరిసమాప్తి సహృదయ సార్వభౌములు ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత విద్యా విధాన పరిషదధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్. (ఆంధ్ర విశ్వకళాపరిషత్), డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం) వారి హయాంలో పరిసమాప్తికావటం నాకు ప్రమోదాన్ని కల్గిస్తోంది.

మొత్తం ఎనిమిది సంపుటాల రాతప్రతి సిద్ధంగా ఉంది. మొదటి నాలుగు సంపుటాల ముద్రణ ఎప్పుడో పూర్తైంది. రమారమి 19,000 పదాలతో మీముందుంచుతున్న ఈ సంపుటం (ప – భ) అయిదోది. 9,754 మకారాది పదాలతోకూడిన ఆరో సంపుటం ముద్రణ దాదాపు పూర్తైంది. ఇంకా 10,132 పదాలతో ఉన్న ఏడో సంపుటం (య – వ) సుమారు 8,000 పదాలతోకూడిన ఎనిమిదో సంపుటం ముద్రించబడవలసి ఉన్నాయి. అనతికాలంలోనే ఏడు ఎనిమిది సంపుటాల ముద్రణ పూర్తికాగలదని ఆశిద్దాం.

ఈ ఐదో సంపుటంలో భాగస్వాములు: ఈ సంపుట ప్రధాన సంపాదకులు – డా॥ లకంసాని చక్రధరరావు కాగా సహాయకులుగా ఉన్నవారు – డా॥ బాల అరుణ కుమారి, డా॥ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, డా॥ లక్కంశెట్టి కోట మల్లేశ్వరరావు, డా॥ కందాళ కనక మహాలక్ష్మి, డా॥ శ్రీపాద సీతామహాలక్ష్మి, డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి, డా॥ సజ్జా మోహనరావు, శ్రీ గోనెళ్ళ వెంకట సీతారాం టైపిస్టుగాను, శ్రీ బోర వెంకటరమణారెడ్డి అటెండరుగాను పనిచేశారు.

డాక్టర్ లంకపల్లి బుల్లయ్యగారు, డాక్టర్ వాసిరెడ్డి శ్రీకృష్ణ మొదలయిన పండిత ప్రకాండుల దగ్గర విద్య నభ్యసించి ఆర్థిక శాస్త్రంలో బి.ఏ. (ఆనర్స్) పట్టాన్ని ఆంధ్ర విశ్వకళా పరిషత్ నుంచి పొందారు. బి.ఇడి. పట్టాన్ని పొందిన వీరు రాష్ట్ర ప్రభుత్వోన్నత విద్యాశాఖాధికారిగా (డి.పి.ఐ.) ఉండి విద్యాభివృద్ధికి విశేష సేవ కావించారు. 1968 లో ఆంధ్ర విశ్వకళా పరిషదుపాధ్యక్షులుగా నియమించబడ్డ వీరు 1974 వరకు ఆ పదవిలో ఉండి విశ్వవిద్యాలయాభివృద్ధికి విశేషించి తెలుగు భాషాభివృద్ధికి విశిష్ట సేవల నందించారు. అనేకాంధ్ర సత్కృతులను అంకితం పొందటమే కాకుండా తెలుగు వ్యుత్పత్తి కోశ పథక పునరుద్ధరణకుగాను వీరు చేసిన కృషి ప్రశంసాపాత్రమైనది. 1957 నుంచి 1962 వరకు కొనసాగి అనివార్యకారణాలవల్ల 1962 ఏప్రిల్ 1 నుంచి 1970 మే 30 వరకు ఆపివేయబడింది. డాక్టర్ ఎల్. బుల్లయ్యగారు ఉపాధ్యక్షులైన మరుక్షణం తెలుగు వ్యుత్పత్తికోశ పథక పునరుద్ధరణకుగాను ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి (ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైద్రాబాద్ ఉపాధ్యక్షులు), ఆచార్య జి. ఎన్. రెడ్డి (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు 1984-87) గార్లతో ఒక నిపుణుల సంఘాన్ని నియమించారు. ఈ నిపుణుల సంఘ నివేదికను అంగీకరించి యు. జి. సి. వారు 2,50,000 రూపాయల్ని మంజూరు చేశారు. మరల ఈ నిఘంటు కార్యక్రమం జూన్ 1970 నుంచి డాక్టర్ బుల్లయ్యగారి ప్రయత్నాలవల్ల ప్రారంభించబడింది. ఈ అయిదో సంపుటాన్ని విద్యావేత్త ఆంధ్ర భాషాయోషాప్రియులు మృదుహృదయులు ఆంధ్ర విశ్వకళాపరిషత్తుచే గౌరవ డి.లిట్. పట్టాన్ని పొందిన డాక్టర్ బుల్లయ్యగారికి అంకితం కావించటానికి అనుమతించిన సదసద్వివేక చతురులు గుణగణగ్రహణ ప్రవీణులు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత విద్యా విధాన పరిషదధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావుగారికి కృతజ్ఞతలు.

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్వహణకు ముద్రణకు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్న నా మాతృసంస్థ ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు కృతజ్ఞతలు.

ఈ సంపుటానికి సొంపైన మున్నుడిని తెలుగులో ప్రసాదించిన అంతర్బహిఃస్ఫుర ద్రూపులు, ఆంధ్రాంగ్ల భాషాపండితులు, సహృదయ సమ్రాట్టులు, మన స్తత్త్వ పరామన స్తత్త్వ పారావారపారంగతులు, తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘాధ్యక్షులు, ఆంధ్ర విశ్వ కళాపరిషదుపాధ్యక్షులు, ఉన్నత విద్యావిధానపరిషదధ్యక్షులు ఆచార్య కోనేరు రామకృష్ణారావు, పిఎచ్.డి., డి.లిట్., డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం) గారికి మనోవాక్కాయకర్మలతో ఈ కోశ స్ఫూర్తికి కారకులైనందుకుగాను కృతజ్ఞతా కుసుమాంజలులు.

తమ అమూల్యాలైన సలహాలద్వారా శుభాశంసలద్వారా ఈ తెలుగు వ్యుత్పత్తి కోశ పథక పరిసమాప్తికి కారకులయిన అనుభవజ్ఞులు మేధావులు తెలుగు వ్యుత్పత్తి కోశ సలహా సంఘ సభ్యులు: డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఉపాధ్యక్షులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం 1984–87, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీమతి టి. ఎన్. అనసూయాదేవి, ఆచార్య చేకూరి రామారావు గార్లకు—

తెలుగు వ్యుత్పత్తి కోశ పథక నిర్మాణ కార్యక్రమానికి సంపూర్ణ సహకారాన్ని అందిస్తున్న ఆంధ్ర విశ్వకళాపరిషద్విద్యాధికారులు ఆచార్య బోడేపూడి ప్రసాదరావు, ఎమ్.ఎ., ఎమ్.ఎ. (ఆనర్స్), పిఎచ్.డి. (ఓహియో స్టేట్) గారికి—

ఈ కోశం అయిదో సంపుటాన్ని సర్వాంగసుందరంగా ముద్రించడంలో సహకరించిన ఆంధ్ర విశ్వకళాపరిషన్ముద్రణాలయ డైరెక్టర్లు ఆచార్య యద్దనపూడి రంగారావు, ఎం.ఎ., బి.ఎల్., ఎమ్.కామ్., పిఎచ్.డి. (ఆంధ్రా), సి.సి.ఎ. (అమెరికా); ఆచార్య కసిరెడ్డి సుబ్బారావు, డి.యస్‌సి. గార్లకు; డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. మదనరాజ్, బి.ఎ. గారికి హార్దిక కృతజ్ఞతలు.

తమ నిరంతర కృషివల్ల ఈ కోశ సంపూర్తికి కారకులయిన మా తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సిబ్బందికి—

మనఃపూర్వకాభినందనలు.

లకంసాని చక్రధరరావు
డైరెక్టరు, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం
కార్యదర్శి, సభ్యులు
తెలుగు వ్యుత్పత్తి కోశ పథక సలహా సంఘం

విశాఖపట్నం
20-4-1987

ఆంధ్ర రాష్ట్ర అవతరణకు
అసువులను అర్పించిన



అమరజీవి

# శ్రీ పొట్టి శ్రీరాములు

# తెలుగు వ్యుత్పత్తి కోశ సలహాసంఘం

అధ్యక్షులు:

**డాక్టర్ కోనేరు రామకృష్ణారావు**, పిఎచ్.డి., డి.లిట్.
(ఆంధ్రవిశ్వకళాపరిషత్), డి.ఎస్‌సి. (ఆనరరీ, నాగార్జున విశ్వవిద్యాలయం)
ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్
ఉన్నత విద్యావిధాన పరిషదధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

సభ్యులు:

**డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి**, డి.లిట్.
గౌరవాచార్యులు, రవీంద్ర సాహిత్యం
ఆంధ్రవిశ్వకళాపరిషత్

**ఆచార్య జి.ఎన్. రెడ్డి**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
ఉపాధ్యక్షులు, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం

వాఙ్మయమహాధ్యక్ష
**డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
హైదరాబాదు

**డాక్టర్ వావిలాల గోపాలకృష్ణయ్య**
కళాప్రపూర్ణ
సత్తెనపల్లి

**శ్రీమతి టి.ఎన్. అనసూయాదేవి**
వనపల్లి

**ఆచార్య చేకూరి రామారావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
భాషాశాస్త్రవిభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం

**డాక్టర్ ఎల్. చక్రధరరావు**, ఎమ్.ఏ., పిఎచ్.డి.
కార్యదర్శి, సభ్యులు
డైరెక్టర్, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తికోశపథకం
తెలుగు శాఖాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

## ప-ఫ అయిదో సంపుటం

అంకితం



సుప్రసిద్ధ విద్యావేత్త

# డాక్టర్ లంకపల్లి బుల్లయ్య

ఎమ్.ఏ., బి.ఇడి., డి.లిట్. (ఆనరరీ), ఆంధ్ర విశ్వకళా పరిషత్

ఆంధ్ర విశ్వకళాపరిషదుపాధ్యక్షులు (1968–74) గారికి

# ప

ప¹ వి. అధరోష్ఠ్య శ్వాసస్పర్శం, అల్పప్రాణం.
అన్ని ద్రావిడభాషల్లోనూ ఈ వర్ణం ఉంది.
<మూ.ద్రా. *ప

-ప² అప. వృత్తిలో గురుపూర్వకమైన నామ్న్యాదుల 'ము' వర్ణక స్థానంలో బిందు పూర్వకంగానూ, లఘుపూర్వకమైన కనుమ్న్యాదుల 'ము' వర్ణక స్థానంలో నిర్బిందుకంగానూ వచ్చేది.

**పకపక** రూ. పకాపక. వి. నవ్వటంలోని ధ్వనికి అనుకరణం. ఉ. హరి. 2.148.
క. పక. నవ్వినప్పుడు వచ్చేధ్వనికి అనుకరణం. పక పక (నె) నగు. పెద్దగానవ్వు. ముసిముసినవ్వులు. పక్కనె. అకస్మాత్తుగా. పక్కనె.నగు. పెద్దగానవ్వు; తు. పకపక. తొందరగా, పక్క, పక్కనె. అకస్మాత్తుగా; త. పక్కుపక్కెనల్, పక్క్-ఎనల్. ఆకస్మికంగా పెద్దగా వచ్చేనవ్వుకు అనుకరణం.
**పకపకనవ్వు** రూ. పకాపకనవ్వు. స.క్రి. తిరస్కరించు. శాకు. సం. 17.365; అ.క్రి. పెద్దగానవ్వు. క. పకపక నగు. గట్టిగానవ్వు. **పకపకలాడు** అ. క్రి. గట్టిగానవ్వు.
<పకపక + -లు + ఆడు.

**పకాడి** రూ. పకాయి, పగాడి. వి. 1. పలకడి. పెనుగాడికి సమాంతరంగా వేసినవాసం; 2. పిల్లవాలాలమీద అడ్డంగా పరచిన వాసం.
హిం. పగ్డీ. తలపాగ.

**పకాపక** రూ. చూ. పకపక. వి. నవ్వటంలోని ధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 5.63.
**పకాపకనవ్వు** రూ.చూ. పకపకనవ్వు. అ.క్రి. విరగబడి నవ్వు, పెద్దగానవ్వు. శుక. 3.230.

**పకాయి** రూ.చూ. పకాడి. వి. 1. పలకడి. పెనుగాడికి సమాంతరంగా వేసినవాసం; 2. పిల్లదూలాల మీద అడ్డంగా పరచిన వాసం.

**పకాలి** రూ. పకాళి, పకాళి, పక్కాలి, పఖాలీ. వి. 1. తబగం. ఎద్దుమీద నీళ్ళుతెచ్చే తోలుసంచి; 2. నీళ్ళుమోయటం, వృత్తిగా కలవాడు.
హిం. పం. సిం. గు. మరా. పఖాల్. నీళ్ళుతెచ్చేతోలు సంచి, కొలిమితిత్తి, పఖాలీ. నీళ్ళు మోసేవాడు; పఖాల్యా; క. పకాలి, పకాళి; త. పక్కాలి.
< మరా. పకాల్.

పకాలీ రూ.చూ. పకాలి; వి. 1. ఎద్దుమీద నీళ్ళు తెచ్చేతోలు సంచి; 2. నీళ్ళు మోసేవాడు.

**పకాలువనవ్వు** అ.క్రి. పకపకమని నవ్వు. పకాలుధ్వన్యనుకరణ శబ్దం.

**పకాలుమనినవ్వు** అ.క్రి. పకపకమనినవ్వు.

**పకాళం** రూ. పకాళ. వి. నీరుకలిపిన అన్నం. ద. హిం. గా. సంపు. 6. గా. సం. 695. క్రీ.శ. 1519.
ఒ. పఖాళి. నీళ్ళుకలిపిన అన్నం;
హిం. పఖాల్. నీరునింపిన సంచి.
<ఒ. పఖాళ.

**పకాళి** రూ.చూ. పకాలి. వి. తబగం. గంత.

**పకాళి** రూ.చూ. పకాళం. వి. గంజితో కలిపిన వేడన్నం.

**పకీర్** రూ.చూ. పకీరు. వి. 1. మహమ్మదీయుల్లో వైరాగ్యం పొందిన పురుషుడు; భిక్షుకుడు. బిచ్చగాడు. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 753. క్రీ.శ. 1600; 2. దరిద్రుడు.
**పకీర్తంగేడి** వి. తంగేడి జాతికి చెందినమొక్క. దీనికంప నల్లగా చేవగలిగి ఉంటుంది. కాల్పుకు చింతనిప్పలాగా మండిది.

**పకీరు** రూ. పకీర్, పక్కిరి, పక్కీరు, ఫకీడు; ఫకీరు. వి. 1. మహమ్మదీయుల్లో వైరాగ్యం పొందినవాడు. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 753. క్రీ. శ. 1600; 2. దరిద్రుడు, తిరిపమెత్తు కొనేవాడు. సింహ. శ. 41.
హిం. ఫకీర్. భిక్షమెత్తుకొనేవాడు. సాధువు; మరా. ఫకీర్. మహమ్మదీయ సాధువు, పేదవాడు; ఉ. ఫకీర్. భిక్షమెత్తుకొనేవాడు. సాధువు, ధనహీనుడు; పార. ఫకీర్. సాధువు, సన్యాసి: అర. ఫకీర్. పేదవాడు;
క. పకీర పకీర. మహమ్మదీయ సన్యాసి.
<ఉ. ఫకీర్.

**పకీలు** వి. నరకటం మొ॥ వాటిలో వచ్చే ధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 4.90.
త. పకిర్ (-వ్-, -న్త్-). ముక్కలగు.

**పకోడి** వి. సెనగపిండితో తయారు చేసే భక్ష్యవిశేషం.
హిం. పకౌడా, పకోడీ. ఒకరకం భక్ష్యం;
<హిం. పకోడీ.

**పక్క¹** వి. 1. శయ్య. దశా. 7.70; 2. పరుపు.
క. పఱ్కె, పక్కె. కిందపరుండు, విశ్రాంతి తీసుకొను; తు. పర్కె. పడక, నిద్ర, విశ్రాంతి; కో. పక్. కింద పరుండు, కిందపరుండి నెమరువేయు, పక్వడ్. కింద పరుండి నెమరువేయు, (పడ్. పరుండు). పక్మె. క-. నెమరువేయటం ఆపివేయు.
**పక్కదుప్పటి** వి. పక్కవేసుకునే దుప్పటి.

**పక్క²** రూ.చూ. పక్కము. వి. 1. పార్శ్వం. పార్శ్వస్థలం. యయా. 2.10; 2. దిక్కు. వైపు; 3. సహాయం; 4.

మట్టిపాత్ర మెడకి కిందిభాగంలో, అడుగుకుపైన పొట్టలో చుట్టూ ఉబ్బెత్తుగా ఉండేభాగం.

**పక్కకట్టురాతు** వి. చేరాతు, కట్టుబడి చేసేటప్పుడు సమయానికి అందుబాటులో ఉన్నరాయి. **పక్కకరవ** వి. గుండుగా కాకుండ పక్కల్లో బద్దలాగ వచ్చేటట్లు చేసిన కరవ. **పక్కకూన** వి. **1.** గోరపెంకు, పచ్చకూన; **2.** కూననుంచి పగలగొట్టి తీసిన నగభాగం. **పక్కకొయ్య** వి. మిడిగూటానికి వేసిన నేతమోకు. పడుగుకు అడ్డరాకుండా తగిలించటానికి పాతిన గూటం. **పక్కగుంజ** వి. కాలిగుంజ, నిల్రాటికి చుట్టూగాని, పందిరిగుంజకు పక్కనగాని. పాతిన పొట్టిగుంజ. **పక్కగుది** వి. పడుగు దాపేటప్పుడు, ఈత్తై అడ్డపట్టెనూ పడుగేరు క్రిందనూ కలిపేదారు. **పక్కగొట్టు** (-కొట్టు') అ.క్రి. కుండఅడుగుమూసిన తరువాత రాతి నలపలతో కుండ పక్కలను సాగగొట్టు. **పక్కగోడ** వి. ఇంటికి ఒకవైపున ఉన్న గోడ. **పక్కచిల్ల** వి. పన్నెకట్టుబడిలో ఈనెపల్లల వరసకు చివర బిగించిన వెదురుబద్ద. నేతనేసేటప్పుడు ఈనెలు చెదరకుండా ఆపేది. **పక్కచెక్క** వి. **1.** ఒరుపబల్ల. ఒరబల్ల, వత్తిచెక్క; **2.** ద్వారబంధపు నిలువుకమ్మీపక్కన గోడకు అతికేచెక్క. **పక్కజల్లి** వి. అంచుల్లో డిజైన్లు నేయటానికి. మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో పక్కతాళ్ళు దూర్చిన ఈనెలచట్రం. **పక్కతాడు** వి. **1** చేతిమగ్గం పలకను. గుండునుకలిపి బిగించిన దారం; **2.** మగ్గం ఉదతకు పైన కట్టినదారం; **3** చేతి మగ్గంపలకను పైనుంచి వేలాడదియ్యటానికి పలకబుజానికి కట్టిన దారం; **4.** కుచ్చుతాళ్ళతో జైమను తాడుకు ఒకవైపు కట్టిన దారం; **5.** ఒసి క్రలపై వేసిన నర్నాటను పారు పట్టెకు కట్టే తాడు. **పక్కదావులు** వి.బ.వ. ఆముగోడవెంబడి అనిచ్చే ఒటికుండల వరస. **పక్కదారం** వి. కుచ్చుతాళ్ళలో జైనును తాడుకు ఒకవైపు కట్టిన దారం. దీన్నిపైన మగ్గం నిలువు పట్టెకూ. కింద ఉదతకూ కడతారు. **పక్కదొడ్డి** వి. అంచులో డిజైన్లు పడటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో పక్కతాళ్ళు దూర్చిన ఈనెలచట్రం. **పక్కపట్టె** వి. పక్కవాసం. వెనుగర్రనుంచి అడ్డనరం మీదికి వేసే వాసం. **పక్కపంటాసం** రూ.చూ. పక్కపంటివానం. వి. వెనుగర్రనుంచి అడ్డనరం మీదికి వేసే వాసం. **పక్కపంటివాసం** చూ. పక్కవాసం. రూ. పక్కపంటానం. వి. వెనుగర్రనుంచి అడ్డనరంమీదికి వేసే వాసం. **పక్కపండ్లు** వి.బ.వ. పక్కనుండే పళ్ళు. **పక్కపన్నె** వి. పేటుపన్నెలో రెండు పాయలుగా విడదీసిన పేటు దారాలను అంచు పడుగులోకి వేలాడదియ్యటానికి పక్కగా అమర్చిన చిన్న పన్నె. **పక్కపందుపెంచు** స.క్రి. విరోధం పెంచు. **పక్కపోటు** వి. నేతలో ఒకవైపు ఎక్కువ, మరొకవైపు తక్కువ పడ్డినప్పుడు పోగులు మళ్ళించి రెండవసారి నాడెవేసి నేయటం. **పక్కపోట్లుపొడుచు** స.క్రి. పక్కన పొడుచు. **పక్కబద్ద** వి. **1.** పక్కవాసం. వెనుగర్రనుంచి అడ్డనరంమీదికి వేసేవానం; **2.** రాటితడికలను కలిపే నిలువవల్ల. **పక్కబావ** వి. పక్కపెట్టి చేసినట్టి మట్టిపాత్ర. **పక్కబిసువు** వి. గాలిదెబ్బకు ఇంటిచట్రం దెబ్బ తినకుండా ఉండేందుకు గుజ్జు పీటలమీది నందులగుండా బిగించిన సన్నవాసం. **పక్కబుడ్డి** వి. పక్కఉండి మూతి చిన్నగా ఉండే చిన్న మట్టిపాత్ర. **పక్కబెదురు** వి. **1.** కొంచెం భయం; **2.** పక్కలో బల్లెంవంటి నుడికారం. **పక్కబొంగు** వి. నిచ్చెనకూ రెండువైపులా ఉండే పొడుగాటి కర్ర. **పక్కబొమ్మ** వి. మరమగ్గం సొరుగుకు చివర నాడెబయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **పక్కయిల్లు** (-ఇల్లు) వి. పక్కనుండే ఇల్లు. **పక్కయెముక**(-ఎముక) వి. పక్కనున్న ఎముక. **పక్కరాట** వి. నిట్రాటికి చుట్టూగాని, పందిరిగుంజలకు పక్కనగాని పాతిన పొట్టిగుంజ. **పక్కరాళ్లు** వి.బ.వ. ఆముగోడలో ఆము పొయ్యికి ఇరువైపులా అమర్చిన రాళ్ళు. **పక్కరేవులు** వి.బ.వ. ఆము పక్కల్లో పంట రేవుల పక్క ఉండే రేవులు. **పక్కరౌతు** వి. కట్టుబడి చేసేటప్పుడు సముయానికి అందుబాటులో ఉన్న రాయి. **పక్కలటిక** వి. గుండ్రంగా కాకుండా పక్కలో బద్దలాగా తిర్చి చేసినట్టి మట్టిపాత్ర. **పక్కలోబల్లెము** వి. హృదయ శల్యం. నిరంతర భయహేతువు. **పక్కవరసేయు** అ.క్రి. కుండ అడుగు మూసిన తర్వాత రాయి నలపతో కుండ పక్కలను సాగగొట్టు. <పక్క[3]+వరస+వేయు. **పక్కవాసం** వి. దరివాసం, పక్కపట్టె, పక్కపంటివాసం, పక్కబద్ద, వాలువాసాం, వెనుగర్రనుంచి అడ్డనరంమీదికి వేసే వానం. **పక్కవేయు** అ.క్రి. కుండఅడుగు మూసిన తర్వాత రాయి నలపతో కుండపక్కలను సాగగొట్టు. **పక్కశూల** వి. కడుపులో పక్కనొచ్చే నొప్పి **పక్కసట్టి** వి. పక్కపెట్టి చేసిన మట్టిపాత్ర. **పక్కొమ్మ** వి. ఉపశాఖ. రెమ్మ. ద్వి. పరమ. వి. 4.266 ప. <పక్క[3]+కొమ్మ.

**పక్కం** వి. మట్టినితొక్కి పాత్రల తయారీకి అనువుగా చేసిన పద్ధతి.

సం. పక్వ-. పరిణతమైన, పండబడిన; ప్రా.పా. పక్క-. పండిన, పండబడిన; పం.ల. పక్కా. పండిన <ప్రా. పక్క-.

**పక్కటి** రూ.చూ. పక్కటి. వి. బరిణె.

**పక్కటి** రూ. పక్కటి. వి. బరణి. నీలా. 3.90.

క. పక్కరె. పక్కలె. ఒకరకం పాత్ర. కాలువలు మొ॥ వాటితో తవ్వే తాత్కాలికమైన సుయ్యి.

<క. పక్కలె.

**పక్కము** రూ. పక్క[2], ప్రక్క[1]. వి. **1.** పార్శ్వం. భార.ఆది. 6.159; **2.** తోడు. సహాయుడు. బసవ. 8.804; **3.** మిత్రుడు. ఆం.భా. 2.186; **4.** మాసార్ధం.

సం. పక్ష-. వైపు. పార్శ్వం; ప్రా. పక్ఖ-. పార్శ్వం, మాసార్ధం. రెక్కభాగం. పక్ఖ. పక్ఖో; అ.మా. పక్ఖ. పక్క. సమీపం. పక్షం; మా. పక. పగ్గ; పా. పక్ఖ; క. పక్క; కొడ. పక్క. దగ్గర; తు. పక్క, పక్క; త.మ. పక్కము.; గద. ఒల్లా. పకి.; ఒరయాన్. పక్ఖ. పక్కె.; బ్రా. పాహోషు. ఒంటి జీను కింది కొయ్యచట్రం. <ప్రా. పక్ఖ-.

**పక్కర** రూ.చూ. పక్కెర. వి. గుర్రం మొ॥ వాటికి తొడిగే కవచం. కు.సం. 12.3.

**పక్కళము** వి. చలించేది. స్థిరం కానిది. ప్రబంధ. 388; విశే. అల్పమయిన. ప్రబంధ. 788.

సం. ప్రస్ఖల-. తడబాటు. తొట్రుపడు: ప్రా. పక్ఖల-. చలించు. ప్రస్ఖలితమగు.

< ప్రా. పక్ఖల-.

**పక్కా** విశే. 1. సిసలైన; 2. పక్వమైన; 3. నిండైన; 4. ఖచ్చితమైన; 5. నిక్కచ్చి. ఖచ్చితం; 6. మంచి; 7. గట్టి.

సం. పక్వ-. పరిణతమైన, పండబడిన; ప్రా.పా. పక్క. పండిన, పండబడిన; హిం. పక్కా. దృఢం, శాశ్వతం, నిక్కచ్చి; పం.ల. పక్కా. పండిన; గు. పక్కుం. అనుభవం. అధిక్యం. శాశ్వతం; మరా. పక్కా. పరిపక్వం. దృఢం, ఖచ్చితం.

< మరా. పక్కా.

**పక్కారంగు** వి. 1. మామూలుగా వేళ్ళలో ఉదకబెట్టిన రంగు; 2. ద్రావకం ఎక్కువ వేసి తయారుచేసిన రంగు. **పక్కారాతి** వి. గట్టి రాయి, గట్టిగా ఉండే రాయి.

**పక్కాలి** రూ.చూ. పకాలి. వి. తణగం, ఎద్దుమీద నీళ్ళు తెచ్చే తోలు సంచి.

**పక్కి**[1] వి. పక్షి, పిట్ట. సారంగ. 1.122.

సం. పక్షిన్. పిట్ట; ప్రా. పక్ఖి. పక్ఖఅ. పిట్ట; శౌ. పక్ఖ; అ.మా. పక్ఖి; మా. పక్ఖ; పా. పక్ఖిన్; శా. పఖిన్; బెం. పాఖి; ఒ. పఖీ, బీ. పాఖీ; హిం. పాంఖీ; సిం. పక్షి, పంఖీ; గు. పంఖీ;

క. పక్కి, హక్కి; కొడ.తు. పక్కి; త. పక్కి, పట్చి; మ. పక్కి.పచ్చి.

< ప్రా. పక్ఖి.

**పక్కిదాలువేలుపు** రూ.చూ. పక్కిదాల్వేలుపు. వి. గరుడ ధ్వజుడు, విష్ణువు. వ్యు. పక్షి (గరుత్మంతుడు) డాలు (కేతనం, జెండా) గా కలవాడు. **పక్కిదాల్వేలుపు** రూ. పక్కి డాలువేలుపు. వి. గరుడధ్వజుడు, విష్ణువు. ఆం నా.సం.దేవ. 8. (వ్యు). పక్షి (గరుత్మంతుడు) డాలు (కేతనం, జెండా)గా కలవాడు. **పక్కిదొర** వి. ఖగేశ్వరుడు, గరుత్మంతుడు, పక్షి రాజు. అచ్చ. బా. 2.31. **పక్కిపాప** వి. పక్షిపిల్ల. **పక్కి మొదలివాడు(-ఒదలివాడు)** వి. కిన్నరుడు. **పక్కిరా** వి. గరుత్మంతుడు. నిరంకు. 1.2. **పక్కిరాచెలి** వి. గరుడస్త్రీ, గరుడజాతి స్త్రీ. అచ్చ.రా.బాల. 144. **పక్కిరాజక్కిదొర** వి. గరుడ వాహనుడు, విష్ణువు, కృష్ణుడు. సీలా. 2.16. **పక్కిరాయడు** వి. పక్షిరాజు, గరుత్మంతుడు. **పక్కిరాయని రాయి** వి. గరుడపచ్చ, మరకతం. సాంబ. స్తా. 62. **పక్కి ఱేడు** వి. పక్షిరాజు, పక్షిశ్రేష్ఠుడు, జటాయువు. అచ్చ.రా. యు. 64. **పక్కిహామి** వి. గరుత్మంతుడు. అచ్చ.రా.యు. 341.

**పక్కి**[2] వి. పండిటిక. బాగా కాలిన ఇటిక.

సం. పక్వ-. ముగ్గిన, ఉడికిన; ప్రా. పక్క-; హిం. పక్నా. పక్వమగు, పకాఈ. వంట.

< ప్రా. పక్క-.

**పక్కిరాతుగిక్కిరాతు** వి. మంచి రెండు రాళ్ళను పేర్కొంటూ వాడే ఊతపదం.

**పక్కి**[3] వి. కొండజువ్విచెట్టు (Ficus gibbosa).

**పక్కి**[4] వి. పలివిచెట్టు. ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలప నిచ్చే చెట్టు (Tamarix gallica).

**పక్కి**[5] వి. కర్రకు. దంతాలకు సగిపీపెట్టటానికి ఆకులు ఉప యోగపడే ఒకచెట్టు (streblus axper).

**పక్కి**[6] రూ.చూ. పక్కె[3]. వి. ఓళ్ళపాటు చిన్న మంచినీటి చేప.

**పక్కిటి** రూ. పక్కటి. వి. బరిజె, డప్పు.

**పక్కియ**[1] రూ.చూ. పక్కె[1]. వి. పిచులం, పక్కెచెట్టు. బరివెంక, కాటోట.

క. పక్కె. ఒకరకం చింతచెట్టు (Tamaric indica).

**పక్కియ**[2] రూ. పక్కె[2]. వి. 1. పక్క, పార్శ్వం, పార్శ్వస్థలం. భార. అరణ్య. 1.300; 2. తెగ, పక్షం. భార. కర్ణ. 1.60.

సం. పాక్షిక-, పక్షర-, పక్షక-. ఒకపక్కకు చెందిన; ప్రా. పక్ఖిఅ., పఖ్ఖిక. పక్షపాతి, అర్ధమాన సంబంధి, చతుర్థి; అ.మా. పక్ఖిణయం; పా. పక్ఖిక. పక్ష సంబంధి.

< ప్రా. పక్ఖిఅ.

**పక్కియ**[3] రూ. చూ. పక్కె[3]. వి. మత్స్యవిశేషం.

**పక్కిరాలు** వి. అంతఃపురం కావలికత్తె. రామాభ్యు. 6.171.

సం. పక్ష-. పక్క; ప్రా. పక్ఖ-.

**పక్కిరి** విశే. 1. పచ్చి; 2. పనికిరాని.

**పక్కిరికాల్వు** వి. పచ్చికాల్వు. ఇటుక మొదలైనవి కాలీకాలకుండా ఉండటం. **పక్కిరిబిక్కిరి** వి. పనికిరాని చెత్తా చెదారం. **పక్కిర్రాయి** వి. గడగరాతు, పగిలి పనికిరాని రాయి. **పక్కిర్రాతు** వి. 1. గడగరాతు, గట్టిరాయి, గట్టిగాఉండే రాయి; 2. పగిలి పనికిరాని రాయి.

**పక్కిర్రాయి** చూ. పక్కిరి.

**పక్కిర్రాతు** చూ. పక్కిరి.

**పక్కిలి** చూ. పక్కియ[2]. వి. 1. పార్శ్వం. పక్క. బసవ. 3779; 2. ప్రిగన్ను, కంటికొన.

**పక్కిరి** రూ.చూ. పకీరు. వి. మహమ్మదీయుల్లో వైరాగ్యం పొందినవాడు, దరిద్రుడు, తిరిపమెత్తుకొనేవాడు. రా.వా. 61.

**పక్కిరు** రూ.చూ. పకీరు. వి. మహమ్మదీయుల్లో వైరాగ్యం పొందిన పురుషుడు, దరిద్రుడు, తిరిపమెత్తుకొనేవాడు.

**పక్కు**[1] వి. నవ్వటం, పడగొట్టటం. వేయటం, తెంపటం, పొడ వటం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. ధ్వన్యను. మను. 4.103.

త. పక్కు. పగులు.

**పక్కున** క్రి.విశే.ప్రు. శీఘ్రంగా, ఆకస్మికంగా, తటా లున. మను. 3.29. క. పక్కనె. అకస్మాత్తుగా; తు. పకపక. వేగంగా, పక్క, పక్కనె. అకస్మాత్తుగా, అను కోకుండా. **పక్కునవవ్వు** అ.క్రి. గట్టిగానవ్వు. **పక్కుమని నవ్వు** అ.క్రి. ఒక్కసారిగానవ్వు.

**పక్కు**[2] రూ.చూ. పొక్కు[1]. వి. 1. పరిపాకం. హర. 7.134;

2. ఎండినవట్టు, వరుగు. విష్ణుపు. 6.28; 3. ఎండు మెదుకు. ఆం. భా. 2.257; 4. పగులు, బీట; 5. వైకల్యం; 6 లొంగుబాటు; 7. బొక్క; 8. పండుపై విచ్చిన ఎండుచెక్క; విశే. వృద్ధుడు, ముసలివాడు. ఆం.భా. 2.119.

పక్కుగట్టు(-కట్టు) రూ.చూ. పొక్కుగట్టు. అ.క్రి. కురుపు మానుతూ పైన గట్టిపడు. పక్కుగొను(-కొను) అ.క్రి. బీటలు వారు. కు.సం. 5.29.

పక్కువ చూ. పక్కి¹. వి. పారావత విశేషం. ఒకజాతి పావురం. సారంగ. 5 33.

సం. పక్షిన్. పిట్ట; ప్రా. పక్ఖి:

పక్కె¹ రూ. పక్కియ¹. ప్రక్క¹, ప్రిక్క, ప్రక్కె. వి. పిచుల వృక్షం. పలివిచెట్టు, ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలపనిచ్చే చెట్టు. మను. 4.37. నె.గా.పు. 14. క్రీ.శ. 1549 (Tamarix gallica).

సం. స్ప్రిక్కా. పక్కచెట్టు.

పక్కెపక్కెచెట్టు వి. పిచులవృక్షం. పలివిచెట్టు. ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలపనిచ్చే చెట్టు.

పక్కె² రూ.చూ. పక్కియ². వి. పార్శ్వం. పక్క.

పక్కె³ రూ. పక్కి⁶, పక్కియ³. వి. మత్స్యవిశేషం. ప్రబంధ. 196.

సం. పక్షక-. రెక్కలు గలది: ప్రా. పక్ఖఅ.

పక్కెతుమ్మ వి. తెల్లని పూలు పూసే, ఇంధనంగా ఉపయోగపడే ఎర్రని కలపనిచ్చే చెట్టు ((Acacia latronum).

పక్కెర రూ. పక్కర. వి. 1. ఏనుగు, గుర్రం మొదలైనవాటికి తొడిగే కవచం. భార.అరణ్య. 1.378; 2. అంతఃపురం; 3. కవచం.

సం. ప్రక్షర-, ప్రఖర-. ఏనుగు, గుర్రం మొదలైనవాటి జనపకవచం; ప్రా పక్ఖర-. పక్ఖరా. అశ్వకవచం, పక్ఖరా, పఖర-, పహర-; అప. పక్ఖర-. తురగసన్నాహం; హిం. పాఖర్. గుర్రం, ఏనుగు మొదలైనవాటి కవచం; సిం. పఖర. ఫకీరు సామాన్యులకిచ్చిన దుస్తు; గు.మరా. పాఖర్. అశ్వకవచం;

క. పక్కరకె, పక్కరకెక్క, పక్కరికె, పక్కరికెక్క, పక్కరె కవచం.

<ప్రా. పక్ఖర-.

పక్కెమ్మ చూ. పక్క².

పక్త రూ. పక్తు. పొక్తు. విశే. గట్టి; వి. గట్టిదనం.

హిం.ఉ. పక్త్. కేవలం, మాత్రం.

<ఉ. పక్త్.

పక్తు రూ.చూ. పక్త. క్రి.విశే. 1. గట్టిగా; 2. పూర్తిగా.

పక్వము వి. 1. వంట; 2. మట్టిని తొక్కి పాత్రల తయారీకి అనువుగా చేసిన పద్ధతి.

సం. పక్వ-. పరిణతమైన. వండబడిన; ప్రా.పా. పక్క. పండిన. వండబడిన; పం.ల. పక్కా. పండిన.

<సం. పక్వ-. (అర్థవిపరి.).

పక్షవాతం రూ. పక్షైవాతం. వి. శరీరంలో ఏదో భాగం చైతన్యం లేకుండాపోయే జబ్బు.

సం. పక్ష-. పక్క, వాత-. ఎదురొక్కన్నది:

క. పక్షవాత. ఒకరకం జబ్బు.

<సం. పక్షవాత- (అర్థవిపరి.).

పక్షాలబట్టీ వి. పలకల పట్టీ. నల్పదరంగా ఉండే ఇటికబట్టీ.

సం. పక్ష-. వైపు. పార్శ్వం.

<సం. పక్ష-+-ము+-లు+-అ+బట్టీ.

పక్షుర్ వి. పన్నెకట్టే జంత్రం బొమ్మ బెజ్జంలో లొంగుసు బిగించటానికి దూర్చిన చిన్నబద్ద.

పఖవాజీ వి. డోలు కొట్టటం వృత్తిగా కలవాడు.

హిం.ఉ. పఖావజ్. టముకు, ఒకవిధమైన డోలు, పఖావజ్. పఖావజీ. డోలు వాయించేవాడు.

<ఉ. పఖావజీ.

పఖాలీ రూ.చూ. పకాలి. వి. నీళ్ళు మోయటం వృత్తిగా కలవాడు.

పగ రూ. పవ. వి. 1. విరోధి. శత్రువు. పల్లగంటివారిపల్లి శాసనం. క్రీ.శ. 9. 10 శ.. నిర్వ.రా. 5.133; 2. విరోధం. వైరం. భార.ఆది. 3.116; 3. ద్వేషం. కు.సం. 4.50; 4. విరోధి సమూహం. ఆము. 4.228.

క. పగె, హగె. పగ, ద్వేషం. శత్రుత్వం, శత్రువు. పగెకాఱ. శత్రువు; తు. పగె. పగ, ద్వేషం, శత్రుత్వం; త. పకై. పగ, ద్వేషం. (-ప్ప్-, -త్త్-). అసహ్యించు కొను, వ్యతిరేకించు. పకైఞన్. పకైవన్. శత్రువు, పకైమై. శత్రుత్వం; మ. పక. వేరుచేయటం. శత్రుత్వం, పకయన్. శత్రువు. పకెక్క. వ్యతిరేకించు, అసహ్యించు కొను; కొ. అక్సాఙ్, అక్సెక్సాఙ్. శత్రువు.

పగకెదిరించు స.క్రి. అభియోగించు. <పగ+-కు+ ఎదిరించు. పగకెదురు వి. 1. అభిగ్రహుడు, అభియుక్తుడు; 2. లూటీ, కొల్లగొనటం. < పగ + -కు + ఎదురు. పగగెల్చు స.క్రి. శత్రువులను గెల్చు. పగగొను (-కొను) అ.క్రి. వైరం పూను, ద్వేషించు. భార.ఉద్యో. 4.227. పగగోలు (-కోలు) వి. పగగొనటం, వైరంపూనటం. కు.సం. 10.164. క. పగెగోళ్. పగచాటు స.క్రి. 1. పగను ప్రకటించు. విక్ర. 8.44: 2. దూషించు. వేంక.పంచ. 1.600; 3. పనమింక విరోధులమని చెప్పు. మన 6.50. పగచాటుది విశే. విరోధం కలది. కవిక. 3.88. పగతుఁడు రూ. పవతుఁడు. వి. శత్రువు. పగవాడు. భార.విరా. 2.351. క. పగె, హగె. శత్రువు. పగెకాఱ. శత్రువు; త. పకైఞన్. పకైవన్. శత్రువు; మ. పకయన్, పకైఞన్. శత్రువు; కొ. అక్సాఙ్, అక్సెక్సాఙ్. శత్రువు. పగతురాలు వి. శత్రురాలు. పగతువాఁడు విశే. శత్రుసంబంధి. పగతురకు సంబంధించినవాడు. భాస్క.రా. అరణ్య. 255. పగదాయ వి. పగతుడు, శత్రువు. వసు. 4.45; విశే. విరోధం కలది, శత్రుత్వం పూనినది. శృం. 2.136. పగదాయతనము వి. శత్రుత్వం. హ.న. 3.24. పగదారి వి. పగవరించేవాడు. శత్రువు. శృం.నై. 7.130. పగదెంచు (-తెంచు) స.క్రి. వధించు. ఆం.భా. 3.123. పగపీను అ.క్రి. పగసాధించుకొను. భాస్క.రా.యు. 1067. పగపట్టు రూ.చూ. పగపట్టు. అ.క్రి. స.క్రి. వైరంపూను,

ద్వేషించు. శశా. 3.67. పగ(బట్టు (-పట్టు) రూ.చూ. పగపట్టు. అ.క్రి. విరోధించు. ద్వి.సా.చ. 1. భా. 364 పం, పగయా(గు(-ఈ(గు) వి. వైరశుద్ధిచేయు. ఆం భా. 2.224. పగర రూ.చూ. పగఱ. వి. శత్రువు. పల్నా.పు. 20. పగరు రూ.చూ. పగఱు. వి.బ.వ. శత్రువులు. పల్నా.పు. 94. పగఱ రూ. పగర. వి. శత్రువు. భార.ఆది. 6.140. వసు. 4.23; తు. పగెర. పగఱు రూ. పగరు. వి.బ.వ. శత్రువులు. పండి.చ. 3.521. పు. 3 పం. తా. అక్నాళ్ఙ్, అక్నెక్నోళ్ఙ్. శత్రువు. పగలుచాటు అ.క్రి. పగను ప్రకటించు; స.క్రి. దూషించు. పగపట్టు (-పట్టు) రూ. పగపట్టు, పగ(బట్టు. అ.క్రి. స.క్రి. వైరంపూను, ద్వేషించు. కకుత్స్థ. 4.143. పగవా(డు విణ. శత్రువు, విరోధి. భార. ఉద్యో. 3.224. త. పగైవన్.

పగగాలలు చూ. పగులు, కాలు[1]. వి బ.వ. మట్టి పాకం లోపంవల్లగాని, ఆముకాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవటం.

పగటిగ్రుడ్డి చూ. పగలు.

పగటిచీకు చూ. పగలు.

పగటిజోతి చూ. పగలు.

పగటిదివిటీ చూ. పగలు

పగటిదీపములు చూ. పగలు.

పగటిఱే(డు చూ. పగలు.

పగటివేలుపు చూ. పగలు.

పగటివేల్పు చూ. పగలు.

పగటివేషగాడు చూ. పగలు.

పగటు వి. 1. ప్రకాశం. ప్రాకట్యం. రం.రా. సుందర. 241 పు. 5 పం; 2. కాంతి, శోభ, చక్కదనం, సౌందర్యం. వసు. 3.70; 3. విధం, రీతి. ఉల్లా. 1.50; 4. విప్రలాపం, విరోధోక్తి. ఆం.భా. 1.116; 5. వైరం. ఆం భా. 1.134; స.క్రి. 1. ప్రకటించు, బయలుపరుచు. కళా. 8.177; 2. తిరస్కరించు. పారిశ్ర. 2.41; విణ. కాంతిగల, మనోజ్ఞమైన. ప్రబంధ. 5.20.

సం. ప్రకట-. బహిర్గతం చేయబడిన; ప్రా. పయడం, పగడ-, పయడ-. ప్రకాశంచేయు; అ.మా. పాగడ-, ప్రకటనం; పా. పకట-, పాకట-. బయలుచేయటం. తెలియటం.

త. పకర్ (-ప్-, -న్ద్-). ప్రకటించు, చెప్పు, గొణుగు. పకర్చి. ఉపన్యాసం, మాట.

<ప్రా. పగడ-.

పగటు(దనము(-తనము) వి. 1. మనోజ్ఞం. హ.న. 2.87; 2. ఉద్ధతి, ఉదుటు. హ.న. 2.87. పగటులాడు స.క్రి. దూషించు. శాశ్వ. సం. 7.221.

పగడ[1] వి. 1. పాచికల ఆటలో ఉపయోగించే ఒకటి అనే సంఖ్య. ఆం.భా. 2.305; 2. పాచికలమీది ఒంటి చుక్క; 3. పాచిక.

సం. పటిక-. పాచిక; ప్రా. పగడ-. ప్రకటన, స్పష్టం; మరా. పగడా. క్రీడాఫలక;

క. పగడె. పాచికమీదిగుర్తు; కొడ. పగడె. చదరంగం ఆట; తు. పగడె.; త. పకడై.; మ. పకడు, పకిడు.

<ప్రా. పగడ-.

పగడచౌవంచయడుగులుగలపక్కి వి. తుమ్మెద. <పగడ[1]+చౌవంచ+అడుగు+-లు+కల పక్కి. పగడపంటివాఁడ వి. ఏకదంతుడు, వినాయకుడు. వేంక.ఆం.దేవ 6. పగడ(సాల వి. 1. పాచికలు, సొరెలుగల సొగటాల జత; 2. సొగటాల ఆట, సొగటాలు. పగడసాల వి. 1. పాచికలు సొరెలుగల సొగటాలపలక. విష్ణుపు. 2 ఆ.; 2. పాదపు పలక. చంద్రభా. 1.64; 3. పాచికల ఆట. శశా. 4.66; 4. ఇష్టజనద్యూతం, నెచ్చెలులాడే జూదం. ఆం.భా. 2.305. త. పగడైచ్చాలై.

పగడ[2] రూ.చూ పొగడ[1]. వి. సువాసనకల తెల్లని చిన్న పూలుపూసే ఒకరకం చెట్టు (Mimusops elengi).

పగడం చూ. పవడము. రూ. పగుడం. వి. 1. కొన్ని జలచరాల శరీరంమీది కవచం; 2. సాధారణంగా ఎరుపు రంగులు కలిసిన వన్నెలో ఉండి చెట్టులాగా ఏర్పడే పదార్థం; 3. నానిరకం నగల్లో రాళ్లల్లో వాడేది.

పగడంరంగు చూ. పగడము.

పగడతంగేడు చూ. పగడము.

పగడపుకూర చూ. పగడము.

పగడపు(గెమ్మోవి చూ. పగడము.

పగడపుతీ(గెలు చూ. పగడము.

పగడపు(దీ(గెలు చూ. పగడము.

పగడపురెక్క చూ. పగడము.

పగడపెఱ్ఱ చూ. పగడము.

పగడమల్లె చూ. పగడము.

పగడము రూ.చూ. పవడము. వి. 1. నవరత్నాల్లో ఒకటి. పార. 7.121; 2. అడవిగోరింట చెట్టు, ఇంధనంగా ఉపయోగపడే ఎఱ్ఱని గట్టి కలపనిచ్చే చెట్టు (Erythroxylon Monogynum); 3. ఎల్లరిచెట్టు (Breynia Rhamnoides).

పగడంరంగు వి. జాజు, గావిరంగు. పగడతంగేడు రూ. పగడితంగేడు. వి. పచ్చని పూలుపూసే అందమైన మొక్క (Cassia montana). పగడపుకూర వి. ఒకరకం ఆకు కూర. పగడపుతీ(గెలు రూ.చూ. పగడపు(దీ(గెలు. వి.బ.వ. ధాన్యవిశేషం. పగడపు(గెమ్మోవి (-కెమ్మోవి) విణ. ఎఱ్ఱని పెదవి. హర. 4.19. పగడపు(దీ(గెలు రూ. పగడపుతీ(గెలు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. పగడపురెక్క వి. ఆర్ద్రానక్షత్రం. పగడపెఱ్ఱ వి. ఎఱ్ఱమట్టి మొక్క ఎరువు. <పగడము+ఎఱ్ఱ. పగడమల్లె వి. పొదగాపెరిగి సువాసన కల పూలుపూసే చెట్టు (Nyctanthes arbortristis). పగడంపుజిట్ట వి. ఒకజాతిపక్షి. ఆం.భా. 2.98. పగడంపు(జిపురు(-చిపురు) వి. లేత చిగురు. భీమ. 5.101. పగడంపుమోవి విణ. ఎఱ్ఱనిపెదవి. భా.మం. 1.121. పగడపారబల్లె రూ.చూ. పగడసారవల్లె. వి. ఒకరకం చిన్న చీర. పగడపారవల్లె రూ. పగడసారబల్లె. వి. ఒకరకం చిన్నచీర.

పగడంపుజిట్ట చూ. పగడము.

**పగడంపు(టిపురు** చూ. పగడము.
**పగడంపుమోవి** చూ. పగడము.
**పగడపారఒల్లె** చూ. పగడము.
**పగడపారవల్లె** చూ. పగడము.
**పగడితంగేడు** రూ.చూ. పగడతంగేడు. వి. పచ్చనిపూలు పూసే అందమైన మొక్క (Cassia Montana).
**పగడీ** రూ.చూ. పగిడి. వి. తలపాగ, తలగుడ్డ.
**పగలగొట్టు** రూ.చూ. పగులగొట్టు. స.క్రి. పదుగులో కర్ర ఎక్కించి పోగులు ఏరు.
**పగలింటికెడ** చూ. పగలు.
**పగలింటిదొర** చూ. పగలు.
**పగలు** రూ. పవలు. వి.బౌ. 1. దివాభాగం, సూర్యోదయం మొదలుకొని సూర్యాస్తమయకాల పర్యంత సమయం. భార.ఆది. 1.68; 2. మధ్యాహ్నం. ఉ.హరి. 1.152.

క. పగల్. పగటివేళ; కొడ. పొలి. పగటివేళ; తు. పగెలు. పగటివేళ, పగరు. కాలం; త. పకల్, పగలు, పగటికాలం. ఉదయ సూర్యుడు, సూర్యుడు. పకలవన్, పకలోన్. సూర్యుడు, పకల్-మాఱు. పగటివేళలో, పకరి (-వ్-, -న్ద్-). కాంతిప్రసరింపజేయు, పకరమ్. కాంతి, వెలుగు; మ. పకల్. ఉదయం. పగటివేళ, పకలవన్, పకలోన్. సూర్యుడు; కో. పా.ల్. పగటివేళ, పల్క్-ర్క్. పగటివేళ. పా.ల్. పగలు. పగటివేళ; తొ. పొక్సల్. పగటివేళ; గోం. పిఅల్. పియాల్, పియుల్, పెయల్, పగలు. పియల్. మిట్టమధ్యాహ్నం; పర్జి. పక్ష. పగలు, పజ్గ. వేకువజాము, ఉదయం; మాల్తొ. పల్గె. ఉదయానికి.

పగటిగ్రుడ్డి వి. ఘూకం, గుడ్లగూబ. సాంబ. తిర్య. 82. పగటిచీకు వి. 1. పైడికంటి, కనకాక్షి. సాంబ. తిర్య. 82; 2. నల్లంపపురుగు. పగటిజోతి వి. సూర్యుడు. సాంబ. దేవ. 9. పగటిదివిటి వి. రాజులు మొ॥ వారివెంట పగలుకూడా తీసుకొని పోయేకాగడా. పగటిదీవములు వి. బ. వ. గురువు ఎదురువచ్చినపుడు గౌరవార్థం పగటిపూటకూడ వెలిగించే దివిటీలు. పగటితే(డు వి. అహర్పతి, సూర్యుడు. కందు. 4.71. పగటి. వేలుపు రూ. చూ. పగటివేల్పు. వి. సూర్యుడు. పగటివేల్పు రూ. పగటివేలుపు. వి. సూర్యుడు. అధ్యా.రా. అయోధ్యా. 46 వ. 13పం. పగటి వేషగాడు రూ. పైటి వేషగాడు. వి. 1. పరాచకపువాడు; 2. ఆడంబరంగా వేషభాషలుకలవాడు. పగలింటికెడ వి. దినాంతం, సాయంకాలం. అచ్చ. రా. అయోధ్యా. 13. పగలింటిదొర వి. అహర్పతి, సూర్యుడు. పగలుచీకటి వి. నల్లనివాడు. శాక్ల. సం. 1.25. పగలుదివిటీలు వి.బ.వ. రాచమర్యాదను తెలిపే ఆచారం. మను. 5.52. పగలువత్తి రూ. పగలొత్తి. పగల్వత్తి. వి. పగలులాగచేసే వత్తి. ఒకవిధమైన బాణాసంచు. కృష్ణ. 4.116. క. హగలుబతి; త. పకల్వర్తి. పగలుసేయువలంతి (-చేయువలంతి) వి. పగటి జోతి, సూర్యుడు. పగలొత్తి రూ.చూ. పగలువత్తి. వి. ఒకవిధమైన బాణాసంచు. హంస. 3.25. పగలొత్తులు వి.బ.వ. కరదీపికాభేదం. పగల్వత్తి రూ.చూ. పగలువత్తి. వి. మరాబు. ఉపా. 2.24.
**పగలొత్తి** చూ. పగలు.
**పగలొత్తులు** చూ. పగలు.
**పగల్వత్తి** చూ. పగలు.
**పగాడి** రూ.చూ. పగాడి. వి. 1. వెనుగాడికి సమాంతరంగా వేసిన వాసం; 2. పిల్లదూలాలమీద అడ్డంగా పరచిన వాసం.
**పగిడయిరేని** రూ. పగిడిఅయిరేని. పైడిఅయిరేని. వి. జాజు పెట్టిబొమ్మలు గీచినఅరివేణి పాత్రలు.
**పగిడి**[1] వి. 1. కప్పం. పన్ను. ద్వి. పరమ. వి. 6.461పు; 2. ఉపద, కానుక. హంస. 4.65; 3. లంచం; 4. పనికి ముందే ఇచ్చే సొమ్ము.

క. పగడి. పన్ను; త. పకుటి. పన్ను, రాబడి. ఆదాయం; మ. పకుతి. భాగం.
**పగిడి**[2] వి. వట్రువపండు. దోసజాతిపండు, కరబూజ.
**పగిడిఅయిరేని** రూ.చూ. పగిడయిరేని. వి. జాజుపెట్టి బొమ్మలు గీచిన అరివేణి పాత్రలు.
**పగిడిపట్టె** రూ.చూ. పడగపట్టె. వి. పడిగవాసం, వెనుగాడి దాలున మూలవాసాలకు మధ్యగా పరచినవాసం.
**పగిడిపత్తి** రూ.చూ. పైడిప్రత్తి. వి. ఎర్రనిపూలుపూసే రకం పత్తిమొక్క.
**పగిడీ** రూ. పగడీ. పగ్గిరీ. వి. తలపాగా.

కా. పాగురు. తలపాగ; బెం. పాగడీ; ఒ. పగడీ; హిం. పం. ఒ. పగడీ; సిం. పగిడీ; గు. పాగడీ. పాఘడీ; మరా. పగడీ. తలపాగ.

<మరా. పగడీ.
**పగిది**[1] చూ. పవిది. వి. రీతి, విధం, ప్రకారం. కు.సం. 5.86. భార. కల్యా. 2.233.

సం. ప్రకృతి-. పగిది. రీతి; ప్రా. పఇఇ. పఇది. పకిది. పగఇ. ప్రకారం, సాధారణస్వభావం; శౌ. పకిది; జై. శౌ. పయిడి; అమా. పగఇ. పగడి, పగతి. స్వభావం.

<ప్రా. పకిది.
**పగిదివోలె** (-పోలె) అవ్య. ద్రు. వలె, ఉపమావాచకం. కు. సం. 9.64.
**పగిది**[2] చూ. పగిడి1. వి. కప్పం. పన్ను. విష్ణుపు. 7.78.

క. పగది, పాగడి. పన్ను; తు. పాంగు. భాగం, వంతు, పాంగల్. భాగం, వంతు; త. పక్తి, పకతి, పకుతి. మ. పకుతి. భాగం.
**పగిరి** వి. ఏరు, నది.
**పగిరె** రూ.చూ. పైరు. వి. పచ్చగా పొలమంతటా లేచిన మొక్కలు.
**పగిలించు** చూ. పగులు.
**పగుడం** రూ.చూ. వగడం. వి. కొన్నిజలచరాల శరీరంమీది కవచం; 2. సాధారణంగా ఎముక. పసుపురంగులు కలిసిన వన్నెలో ఉండి రెట్టులాగా ఏర్పడే పదార్థం; 3. నాసికం

నగర్లో తావళాల్లో వాడేది.

**పగులఁగొట్టు** చూ. పగులు.

**పగులఁదీయు** చూ. పగులు.

**పగులఁబాఱు** చూ. పగులు.

**పగులఁబొడుచు** చూ. పగులు.

**పగులు** రూ. పవులు, పొలు. అ.క్రి. 1. బద్దలగు. భేదిల్లు. భార. విరా. 3.169 ; 2. భయపడు. శృం. నై. 7.90 ; 3. తెగు. హర. 6.16. 4. చినుగు. భీమ. 2.128. 5. చెదరు. శ్రీరం. మా. 2.51 ; వి. 1. స్ఫోటం. భీష. అం. భా. 2.130 ; 2. చీలిక.

క. బగి, బగరు. వేరుచేయు, పగలదీయు, పసు. పస్సు. హాస్సు. విభజించు, పజ్గ. పంగలకొమ్మ ; తు. పగియుని. విభజించు, ముక్కలగు. ఇచ్చివేయు, పగిపుని, వేరుచేయు, చింపు ; త. పకు (పకువ్-, పక్క్-). విడదీయు, విడివడు, వేరుచేయు, (ప్పు-, -త్త్-). పంచు. విభజించు. ముక్కలుగాచేయు, చింపు, పకిర్ (-ప్-,-న్త్-). భాగాలుగా విభజించు, పంచు, ముక్కలుచేయు, పొత్తు (పొత్తి-). విభజించు. పంచు, పక్కు. ఒకభాగం ; మ. పకుక. వేరుగాకించు. పకుక్క, పకయుక. విభజించు. పకెక్క. ఎదిరించు. సహించుకొను. పక. విభాగం. పకుప్పు. ఒకభాగం; కో. పత. ర్-(పత్ప్-). విభజించు ; తొ. పక్స్- (పక్స్ఫ్). విభజించబడు. (పక్స్త్). పక్స్ఫ్. పంచు, విభజించు ; గోం. పై(య్). (పై-స్). విభజించబడు. గొడ్డలితో కలపకొట్టు, పక్క. వెదురు ముక్కలు ; కుఇ. పన్గ (పన్గి-). ముక్కలగు. విభజించు, పక్క (<పక్- ప్, పక్త్-). విభజించు, మొదటి దుక్కి దున్నటం, బద్దలగు ; కువి. పక్హాలి. లోతుగా గియు, పక్హ్ ; పర్జి. పయ్ప్- (పయ్త్-). విభజించు, భాగం ; కొలా. పై. విభజించు. నా. పయ్క్. విభజించు ; గ. పయ్. విభజించు ; కురు. పాఖ్, బలవంతంగా తెరుచు ; మాల్తొ. పక్యె. ఇంటిలో ఒకభాగం.

<మూ.ద్రా. *పయ్, *పయ్-క్-, *పయి-జ్క్-.

**పగిలించు** స.క్రి. 1. భేదించు, బద్దలుకొట్టు. భార. విరా. 4.180 ; 2. చించు. చిత్రభా. 3.75. <పగులు + ఇంచు[3]. **పగులఁగొట్టు** రూ. పగలగొట్టు, పల్గొట్టు[2]. స.క్రి. పగుల్చు. భేదించు. దశా. 9.194. < పగులు + -అ[7] + కొట్టు[1]. **పగులఁదీయు** స.క్రి. కార్యం సాధించు. <పగులు + -అ[7] + తీయు. **పగులఁబాఱు** అ.క్రి. పగులు. < పగులు + -అ[7] + పాఱు (స్వార్థంలో). **పగులఁబొడుచు** స.క్రి. కార్యంసాధించు. <పగులు + -అ[7] + పొడుచు. **పగులుచు** రూ.చూ. పగుల్చు. స.క్రి. 1. బద్దలుచేయు. భేదించు. భార. కర్ణ. 3.293 ; 2. విరుచు, ముక్కలుచేయు. **పగులుపొట్ట** వి. ఆకులు విడబడి కంకివేసే ముందున్న పైరుదశ, ఈనటానికి సిద్ధమైనపైరు. **పగులుపాఱు** అ.క్రి. చీలు, బద్దలగు. కాళిం.డి. 2.108. <పగులు + పాఱు (స్వార్థంలో). **పగుల్చు** రూ. పగులుచు. స.క్రి.1. బద్దలుచేయు, భేదించు. భార. ద్రోణ. 3.162; 2. విరుచు, ముక్కలుచేయు. భాగ. 10 ఉ. 849. **పగుళ్ళువాఱు** అ.క్రి. చీలు, బద్దలగు, విదారితముగు. <పగులు + -లు + పాఱు (స్వార్థంలో).

**పగులొత్తులు** చూ. పగలువత్తి. వి.బ.వ. తెల్లగామంతే పండు పెట్టిన ఒకరకపు చిప్పబుడ్లు.

**పగుల్చు** చూ. పగులు.

**పగుళ్ళువాఱు** చూ. పగులు.

**పగోడా**[1] వి. పకోడి, భక్ష్య విశేషం.

ఉ. పగోడ. భక్ష్యవిశేషం.

త. పకోడ. పకోడి.

<ఉ. పగోడ.

**పగోడా**[2] వి. గోపురం ఆకారంలో కట్టే కట్టడం.

ఇం. *Pagoda*. గోపురం, చైనా, బర్మా మొ. వాటిలో దేవాలయం.

<ఇం. Pagoda.

**పగ్గపత్రి** చూ. పగ్గము.

**పగ్గము** రూ. ప్రగ్గము. వి. 1. (గుర్రం మొ. వాటి కళ్ళెం తగిలి లాగిపట్టే) పెద్దతాడు. కు.సం. 2.25 : 2. రజ్జువు. తాడు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 748. క్రీ.శ. 1499. ప్రబోధ. 1.32 ; 3. ఉరితాడు. కన్నంతాడు. మను. 5.50 ; 4. సాలెవాడు పడుగును ఈడ్చికట్టే తాడు. హంస. 2.11 ; 5. గానుగ దూలాన్ని కాడితో కలిపికట్టే లావుపాటి తాడు ; 6. ఒక సెంటునేల.

సం. ప్రగ్రహ-, ప్రగాహ-. పగ్గం, కళ్ళెం ; ప్రా. పగ్గహ -. కళ్ళెం, పశువుల మూకుతాడు; అ.మా. పగ్గహ-. తాడు ; సులక ; పా. పగ్గహ-, పగ్గాహ-. పట్టుకోవటం ; క. పగ్గ, హగ్గ, హగ్గవ ; కురు. పఘా.

<ప్రా. పగ్గహ-.

**పగ్గపత్రి** వి. పత్తాకాలంలో సువాసన ఉన్న పెద్ద సిరి పూలుపూసే ఒకానొక మొక్క. **పగ్గముపేను** స.క్రి. నారను తాడుగా పేను. రా.గో.శ. 5.45. **పగ్గంపట్టుదూరం** వి. ఒక పగ్గం దూరంనేల. **పగ్గాలకొరిచెవాళ్ళు** వి.బ.వ. చేనేతపని వారికి పగ్గాలు పేనిఇచ్చే ఒకతెగ.

**పగ్గంపట్టుదూరం** చూ. పగ్గము.

**పగ్గాలకొరిచెవాళ్ళు** చూ. పగ్గము.

**పగ్గించు** చూ. పగ్గె.

**పగ్గియ** రూ.చూ. పగ్గె. వి. 1. సామర్థ్యం, శక్తి; 2. లేని సామర్థ్యాన్ని ఉన్నట్లు ప్రకటించే మాట, డంబోక్తి; 3. ప్రజ్ఞ, నైపుణ్యం.

**పగ్గిరీ** రూ.చూ. పగిడీ. వి. తలపాగ, తలగుడ్డ.

**పగ్గె** రూ. పగ్గియ, పెగ్గి, పెగ్గె, బగ్గె[1]. వి. 1. సామర్థ్యం శక్తి. కువ.చ. 5.59 ; 2. లేని సామర్థ్యాన్ని ఉన్నట్లు ప్రకటించేమాట, డంబోక్తి. శక. 3.23 ; 3. ప్రజ్ఞ, నైపుణ్యం.

సం. ప్రజ్ఞా. తెలివి ; ప్రా. పణ్ణా, పజ్జా, పణ్ణా. సామర్థ్యం, దక్షత, పణ్ణ-. నిపుణుడు ; పా. పఞ్ఞా. జ్ఞానం, ప్రతిభ.

<సం. ప్రజ్ఞా.

**పగ్గించు** అ.క్రి. 1. ప్రజ్ఞలు పలుకు, డంబాలుకొట్టు. ఉ.హరి. 6.108 ; 2. బడాయి మాటలాడు. < పగ్గె +

-ఇంచు³. పగ్గెలుపోవు స.క్రి. ప్రగల్భాలు పలుకు.

**పంకగోడ** వి. చెన్న. చుట్టుగోడమీద ముక్కోణం ఆకారంలో కప్పువరకు కట్టిన పక్కగోడ.

సం. పంక-. బురద, అడుసు.

**పంకము** వి. 1. గట్టిగా బురదలాగ ఉండే పాలు. జున్నుపాలు. జైమిని భా. 4.79; 2. పట్టుదల. రసిక. 1.14.

సం. పంక-. బురద.

<సం. పంక- (అర్థవిపరి.).

పంకంమన్ను వి. బురదమట్టి, చిక్కటి పాకంలో ఉన్న అడుసు.

**పంకంమన్ను** చూ. పంకము.

**పంకా** రూ. పంఖా. వి. 1. విసనపంకా, గాలిపంకా; 2. గాలి పంపు. పంకాబట్టిలోకి గాలినిపంపే యంత్రం: 3. కమానుకు ఒకవైపున ఉండే వెడల్పు కొయ్యపలక: 4. పెద్ద విసనకర్ర. కర్రచెక్కడు గుడ్డను అతికి వేలాడగట్టి లాగే ఒకానొక పెద్ద విసనకర్ర.

హిం. ఉ. పంఖా. గాలినిచ్చే సాధనం.

<ఉ. పంఖా.

పంకాబట్టీ రూ. పనకాబట్టీ. వి. గాలిబట్టి. పొడుగుబట్టీ. పంకాతో గాలి విసురుతూ సున్నం రాళ్ళను కాల్చేబట్టీ.

**పంకి** వి. 1. బురద. బంకమన్ను. జవాదిపంకి. యయా. 5.12; 2. పాకంవచ్చిన చింత అంబలి.

సం. పంక-.; బురద. ప్రా. పంక-.

<ప్రా. పంక-.

**పంకించు¹** స.క్రి. 1. (నూనె మొ. వాటిని) జుట్టుకు పట్టించు, రాచు. జైమినిభా. 6.85; 2. దుద్దు. చదును. పాండు. 2.41; 3. బురదలాగా పట్టించు, అంకితమొనరించు. చంద్రరే. 1.13.

సం. పంక-. బురద.

<సం. పంక-+-ఇంచు.³

**పంకించు²** అ.క్రి. చలించు, భయపడు. జైమినిభా. 3.40, పాండు. 2.41; స.క్రి. 1. సరిచేయు, హెచ్చుతగ్గులు కాకుండాచేయు. మటికా. 2.34; 2. ఆడించు, ఊపు.

సం. పక్ష-; రెక్క, పక్షం; ప్రా. పంఖ-.

<ప్రా. పంఖ-+-ఇంచు³.

**పంకిణి** వి. పరిమళ ద్రవ్యాలుంచే పాత్ర.

సం. పంకిన్, పంకినీ. బురదలో కూడిన. మన్నుతో కూడినది.

<సం. పంకినీ.

**పంకిరీ** వి. పూవురేకు ఆకారంలో ఉండే ఆభరణ విశేషం.

హిం ఉ. పంఖుడీ. పూవురేకు.

<ఉ. పంఖుడీ.

**పంకిల్లు** వి. చెన్నగోడలఇల్లు.

సం. పంక . అడుసు. బురద.

<సం. పంక-+ఇల్లు. (మిశ్రన.).

**పంకు** రూ.చూ. మంకు. వి. మొండిపట్టు.

**పంకెన** వి. తడి. పదును. హంస. 2.146.

సం. పంక-. బురద.

**పంగ¹** రూ.చూ. ప్రంగ. వి. 1. ఎడంగా సాగిన శాఖ. మను 4.73; 2. రెండుకాళ్లమధ్య దూరం: 3. మూడడుగులు.

పంగకట్టె వి. ఆముదాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకొని రావటానికి వాడే తమరకట్టె. **పంగకాలు** వి. ఒంకాము, పంగలుగా చీలిన కొయ్యభాగం. **పంగకొమ్ము** వి. పంగలకర్ర మాదిరి కొసలు క్రమంగా దూరమైన కొమ్ము. **పంగజెట్టి** వి. గిట్టల సందుల్లో వాపు. **పంగటికాళ్లవాడు** విణ. ప్రగతజానుకుడు, దొడ్డికాళ్ళవాడు. **పంగటికాళ్ళు** వి.బ.వ. ముడికాళ్ళు. **పంగటించు** రూ. పంగడించు. స.క్రి. ఎడంగాదాచు. వేణు. 4.22. **పంగడించు** రూ.చూ. పంగటించు. స.క్రి. కాళ్ళు ఎడంగా దాచు. **పంగతల** వి. పంగకొమ్ముల తల. **పంగనామము** వి. 1. నడుమ ఎడం కలిగి తీర్చిన తిరుమణి: 2. ఒకానొక ఇంటిపేరు; 3. మోసం చేయటం. **పంగనామములుపెట్టు** అ.క్రి. 1. పంగనామాలుతీర్చు: 2. పంకలు తీర్చు: 3. మోసగించు. **పంగరించుకొను** అ.క్రి. కాళ్ళు దాటదాచుకొను. **పంగలకట్టె** రూ. పంగలుకట్టె, పంగాలకట్టె. వి. ఆముదాల్పుకు ముళ్లకంపల్ని తీసుకొనిరావటానికి వాడే తమరకట్టె; **పంగలకర్ర** రూ.చూ. పంగలకట్టె. వి. 1. దంతెనుమోసే పంగలకొయ్య: 2. ఆముదాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకొని రావటానికి వాడే తమరకట్టె: 3. పిట్టల్ని కొట్టే పంగనామాల్లా వంగిన కర్ర. **పంగలకఱ్ఱ** రూ. పంగలకర్ర. వి. పిట్టల్నికొట్టే పంగనామాల్లా వంగిన కర్ర. **పంగలకొయ్య** వి. దంతెనుమోసే పంగలకొయ్య. **పంగలగడ్డి** వి. మొదళ్ళు గుబురుగా పెరిగే ఒకరకం గడ్డి (chloris virgata). **పంగలగుంజ** వి. 1. ఇరుకుమాను; 2. కోటిపీట, నాగదిసర. **పంగలగొర్రు** వి. నాలుగు మొదలు ఆరు వరకూ చెక్కలు (కర్రు దిగించే కొయ్యలు ఉన్న పెద్ద గొర్రు. **పంగలపల్ల** వి. ఆముదాల్పుకు ముళ్ళకంపల్ని తీసుకొని రావటానికి వాడే తమరకట్టె. **పంగలమాదు** వి. చేతివేళ్ళమధ్య అరచేతిలో పట్టే పుండు. **పంగలమొద్దు** వి. నూలుమట్టేటప్పుడు పంచెముక్కు మోపటానికి పంగల కొయ్య దిగించిన మొద్దు. **పంగలినాగ** వి. గొర్రు, గుంటక మొదలైనవాటికి నాగగా వేసిన పంగలకొయ్య. **పంగలిపల్లి** వి. కండెలు మట్టేటప్పుడు. నూలుదబ్బా తగిలించే ఒకరకం పల్ల. **పంగలుకట్టె** రూ.చూ. పంగలకట్టె. వి. కంపలో దూర్చి ఎత్తే కర్ర.

**పంగ²** రూ. పంగము. వి. పన్ను. భాగధేయం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 257. క్రీ.శ. 1211.

సం. ప్రగ్రహ-. గ్రహించు, స్వీకరించు; ప్రా. పంగ-.

<ప్రా. పంగ-.

పంగతప్పు వి. పంగం, (పన్ను) చెల్లించనందుకు విధించే అపరాధం. ద.హిం.శా. సంపు. 10. శా.నం. 482. క్రీ.శ. 1296.

పంగాయము వి. పంగకల్యం. నెల్లూరిశాసనాలు, ఒంగోలుశాసనం. 82. క్రీ.శ. 1275.

**పంగటి** విణ. ఎడంగల.

క. పంగడ-. ఎడమైన, విలక్షణమైన, విడివడిన;

తు. పంగడ. ఎకమైన, విలక్షణమైన, విడివడిన.

**పంగము** రూ.చూ. పంగ². వి. భాగధేయం. పన్ను. దేవ బ్రాహ్మణ వృత్తుల మీద దొరతనం వారు వేసే నాల్గోవంతు కప్పం. ఆం.భా. 2.192.

**పంగలం** రూ.చూ. ప్రంగ. వి. కొయ్యకు సహజంగా ఉన్న పాయ.

  **పంగలంబొంగు** వి. ఆరుగ్ర, నొగకింద ఆపుగా పెట్టిన కఱ్ఱ.

**పంగాయము** చూ. పంగ².

**పంగాలకట్టె** చూ. పంగాలు.

**పంగాలు** వి. రెండుగా చీలిన కఱ్ఱ మొదలైనవి.

  < పంగ¹ + కాలు.

  **పంగాలకట్టె** రూ.చూ. పంగలకట్టె. వి. ఆవు కాళ్ళకు ముళ్ళకంపల్ని తీసుకొనిరావటానికి వాడే తమరకట్టె.

**పంగి¹** వి. కాళ్ళు.

**పంగి²** వి. పరుగులో పైపోగులూ కిందిపోగులూ కలవకుండా ఉండటం.

  సం. పంగు-. కుంటి ; హిం. పంగా.

**పంగి³** వి. అనుకూలమైనకాలం.

**పంగించు** అ.క్రి. **1.** కోపగించు. దశకు. 10.90 ; **2.** వెనుక చేసిన పొరపాట్లని ఎత్తిచూపి ఏడిపించు. శాల్వ.నం. 10.164.

  సం. పంగు-. కుంటి ; ప్రా. పంగు-. ; హిం. పంగా. ; మరా. పంగూ, పాంగా. కుంటి.

  < ప్రా. పంగు + -ఇంచు³.

**పంగిడి** రూ. పంగిడీ, పంగిణి. పంగెన¹. వి. **1.** ఏనుగుల్ని పట్టేటప్పుడు అవి పడటానికి తవ్విన గొయ్యి. ఓదం, ఒక విధమైన ఓదం. కకుత్స. 4.89 ; **2** ఎత్తుగడ, కుట్ర.

**పంగిడీ** రూ.చూ. పంగిడి వి. ఏనుగుల్ని పట్టేటప్పుడు అవి పడటానికి తవ్విన గొయ్యి. ఓదం, ఒకవిధమైన ఓదం.

**పంగిణి** రూ.చూ. పంగిడి. వి. ఏనుగుల్ని పట్టేటప్పుడు అవి పడటానికి తవ్విన గొయ్యి. ఓదం. ఒకవిధమైన ఓదం.

**పంగు¹** వి. భయం.

  సం. పంగు-. కుంటి.

  < సం. పంగు- (అర్థవిపరి.).

**పంగు²** రూ.చూ. ప్రంగ. వి. **1.** యోని ; **2.** పంగ.

**పంగు³** రూ. పంజు³. వి. **1.** చెరువుగాని, కాలువగాని ఒక మనిషి రోజుకు తవ్వగలిగిన భాగం ; **2.** పని.

**పంగెన¹** రూ.చూ. పంగిడి. వి. ఏనుగుల్ని పట్టేటప్పుడు అవి పడటానికి తవ్విన గొయ్యి. ఓదం. ఒకవిధమైన ఓదం. ఆం.భా. 2.195.

**పంగెన²** వి. **1.** పట్టుదల, బింకం. తాళ్లపాకవారి శృంగార శతకం. 76 ; **2.** సంకోచం. తాళ్లపాకవారి శృంగార శతకం. 77 ; విజ.ద్రోహ. తాళ్లపాకవారి శృంగారశతకం. 88.

**పంగెవ** వి. ఎత్తుపొడుపు.

**పచరణ** వి. **1.** ఉపచారం కోసం పలికేమాట, ముఖప్రీతి వచనం. ఇచ్చకం. పాండు. 4.189 ; **2.** నటన, టక్కు. గౌ.హరి.పూ. 1000.

  సం. ప్రచరణ-. ముందుకుసాగటం, ప్రచారంలో ఉండటం.

  క. పసరణ.

**పచరించు** రూ. పచారించు, పొచారించు. స.క్రి. **1.** అమ్మటానికి అంగట్లో సరుకుల్ని అమర్చు. భార.ఆది. 8.73. కు.సం. 8.44 ; **2.** దాచు. దాపు. కు.సం. 5.119 ; **3.** ప్రసరింపజేయు, వ్యాపింపచేయు. భార.విరా. 1.135 ; **4.** సవరించు, సిద్ధపరుచు. విప్పు. భార.విరా. 2.306 ; **5.** చూపు, కనబరుచు. హరి.ఉ. 2.69 ; **6.** చేయు, కావించు. హరి.ఉ. 2.158 ; **7.** (వల మొ॥ వాటిని) పరచు, పడేటట్లుచేయు. ఉ.హరి. 4.271 ; **8.** నుడువు, పలుకు. శృం.నై. 7.109 ; **9.** బయలుపరుచు. కాశీ. 2.79 ; **10.** ప్రయోగించు, ఉపాయం నెరపు. భోజ. 7.143 ; **11.** వర్తించు, కలగచేయు. విక్ర. 4.223 ; **12.** (లేనిదానిని ఉన్నట్లు పైకి) చూపు, అభినయించు. మను. 3.83 ; **13.** బాణం (ప్రయోగించు) వేయు. వసు. 5.60 ; **14.** లగ్నంచేయు, నిలుపు. అ.క్రి. **1.** ప్రవర్తించు, మెలగు. పారి. 1.42 ; **2.** విహరించు. శుక. 1.146 ;

  సం. ప్రసర-. ముందుకుపోవటం, పొడిగింపు ; ప్రా. పసర-. పొడిగింపు ; కు. పసర్. వంగానుక్రమణిక ; మరా. పసర్. పొడిగింపు ;

  క. పసరిసు. వ్యాపింపజేయు.

  < ప్రా. పసర-.

  **పచరింపు** వి. ప్రసరణం. వ్యాప్తి. కవిరాజ. 2.135.

**పచరింపు** చూ. పచరించు.

**పచరు** వి. ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Dalbergia Pariculate).

**పచారము** రూ.చూ. పసారము¹. వి. **1.** సరుకు. వేంక.పంచ. 4.450 ; **2.** అంగడి. విష్ణుమా.ఉ. 4 ఆ.

  **పచారించు** రూ.చూ. పచరించు. స.క్రి. **1.** చూపు. ఉ.హరి. 6.65 ; **2.** ప్రసరింపచేయు. వ్యాపింపచేయు. మను. 5.101 ; **3.** తిరస్కరించు. ప్రభు. 2.24 పు. 1 పం. ; **4.** నడుపు, నలుపు. రామాభ్యు. 6.144 ; **5.** (పంతం) పట్టు. అష్టమ. క. 2.67 పు. 10 పం. ; **6.** పలుకు, చెప్పు. నైష. 1.128 ; **7.** వర్తించు, కలిగించు. చంద్రాంగ. 4.78.

**పచారి** వి. చిల్లరసామాన్లమ్మేవాడు.

  సం. ప్రసారక-. వర్తకుడు ; పా. పసార-. వర్తకుడు ; నే. పసా్రీ. ; బెం. పసారీ. ; హిం. పసారీ, పాంసారీ ; పం. పసారీ ; మరా. పసారా. ; అర. పోహర్.

  < మరా. పసారా.

  **పచారిదినుసులు** వి.బ.వ. చిల్లరసామాన్లు.

**పచారించు** చూ. పచారము.

**పచారీకొట్టు** చూ. పచారి. వి. పచారీ దినుసులు అమ్మే కొట్టు.

**పచారు** రూ.చూ. పచేరము. వి. **1.** విహారం ; **2.** ఇటూ

అటూ కొంచెం తిరగటం.

**పచారుచేయు** అ.క్రి. ఇటూఅటూ కొంచెం తిరుగు.

**పచేరము** రూ. పచారు, పచేరు. వి. విహారం.

సం. ప్రచార-. వ్యాపించటం, తిరగటం, ప్రవర్తన; ప్రా. పయార-.

<సం. ప్రచార-.

**పచేరు** రూ.చూ. పచేరము. వి. విహారం.

**పచ్చకున్ని** రూ.చూ. పసకున్ని. వి. పచ్చలో ఎరుపు వన్నె కలిసిన ఉన్ని.

**పచ్చ** రూ. బచ్చ. విశ. 1. పసరురంగుకలది, ఆకుపచ్చరంగు కలది. కు.సం. 9.3, శృం.నై. 3.177; 2. పీతం, పసుపు వన్నెకలది. ఆము. 4.94; వి. 1. మరకతమణి, గారుత్మణి. రం.రా.బాల. 75 పు. 3 పం.; 2. ప్రకాశమానమగు ఒకవిధమైన నాణెం. ద.హిం.గా. సంపు. 5 గా.సం. 1216; 3. (పసరువన్నెగల) తృణాదికం. పాండు. 3.46; 4. వృక్ష విశేషం. విప్ర. 2.25; 5. రసం. వేమ. 3.142; 6. ఆకుపచ్చని వర్ణం, హరిత వర్ణం. దశా. 1.113; 7. పసుపువన్నె, పసుపుపచ్చవన్నె. ఆం. భా. 1.103; 8. కరచరణాదుల్లో పొడుచుకోటంవల్లఏర్పడే పసరువన్నె రేఖ; 9. మగ్గంమీద నేతగుడ్డచుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు.

క. పసి, పసు, పసిర్, పసుర్, పచ్చె, పచె, పచ్చ, పచ్చు, పచ్చనె. ఆకుపచ్చని. పచ్చరంగు, కొత్త ఆకులు, లేతకాడలు. పక్వంకాని యౌవనం. పసలె, లేత గడ్డి, బాగాగడ్డిపెరిగిన ప్రదేశం, పయిర్. పచ్చనిధాన్యం పెరిగేపైరు; కొడ. పచ్చె. ఆకుపచ్చ, నీలం, చల్లని; ప. పజ్జో. మలువనీటిమీద మడ్డి; తు. పచ్చ. ఆకుపచ్చ, నిర్మలం, పచ్చె. ఆకుపచ్చతనం, పజి. ఆకుపచ్చ. తేమ, పజిరు. గడ్డి, పసె. తేమ. తడి; త. పచ (ప్ప-,-ంత్ర-). పచ్చగాఉండు. బంగారురంగుగా అగు, పచఃప్పై. తడి, తేమ, పచ్చదనం. పచప్పు. ఆకుపచ్చరంగు. తేమ, పచలై. బంగారురంగు. పచితు. ఆకుపచ్చనిది. పచు. ఆకుపచ్చ. ఆకుపసుపు. పచుమై. ఆకుపచ్చని. చల్లని, యౌవనం. కొత్తదనం. స్వచ్ఛత. పచై. తేమ. రసం, పచ్చై. ఆకుపచ్చని. పాలిపోయిన, పక్వంకాని. చల్లదనం, పయ (-ప్ప-న్త-). పాలిపోవ (విరహంవల్ల) పయప్పు. రంగుమారు. పాలిపోవు. బంగారురంగు. పయిర్. పెరిగే ధాన్యంమృదువైనకాడ. పై. ఆకుపచ్చదనం. యౌవనం, అందం.(-ప్ప-త్త-). ఆకుపచ్చగాఅగు, పైతు. పైత్తు.ఆకుపచ్చదనం, తేమ. పైమ్మై, పైమై. ఆకుపచ్చదనం; మ. పచు, పై. పైయ్. మృదువైన, తేమ, ఆకుపచ్చ, పచ, పస, పయ, తేమ, పసిమ. మెత్తని, తేమ, నైర్మల్యం, పచ్చ. ఆకుపచ్చని, పయిర్. ఆకుపచ్చనిధాన్యం; కో. పచ్. ఆకుపచ్చ, పచ్చిపదార్థం(మాంసం), కాగని (నీరు). ప.ట్య. పాచి, నాచు. పచ.ల్. ఆరుబయలుపచ్చని ప్రదేశం; కొ. పాచ్. పచ్చని. పస్త్. నాచుపట్టిన చదునైన బండ; పా. ఫ్య. పాచి, నాచు; పర్జి. పయ్. ఆకుపచ్చ; కొలా. పసుది. పసుపు, నారింజ, పచ్చాడి, పస్పుతాడ్. పసుపు; గ. పయ్. ఆకుపచ్చ.ప సూర్. పచ్చిపదార్థం.

<మూ. ద్రా. *పచ్.

**పచ్చకట్టె** వి. మృగయాసాధన విశేషం. శుక. 1.165. **పచ్చకట్లపాము** వి. పచ్చని అడ్డదారలున్నపాము. **పచ్చకంది** వి. ఒక రకం కంది. **పచ్చకన్నులమెకము** వి. హర్యక్షం, సింహం. అచ్చ. రా. యు. 142. **పచ్చకన్నులవేల్పుమాఁడు** వి. పింగా (గళా) క్షుడను పేరుగల రాక్షసుడు. అచ్చ. రా. సుందర. 104. **పచ్చకప్పురపుసరులు** వి.బ.వ. ఒకరకంవడ్లు. **పచ్చకప్పురమగు** అ. క్రి. అలభ్యమగు. విజయ. వి. 12. **పచ్చకప్పురము.** రూ. పచ్చకప్పూరము. వి. చల్లదనం, పరిమళం గల సుగంధ ద్రవ్య విశేషం. భీమ. 5.120. **పచ్చకప్పూరము** రూ. చూ. పచ్చకప్పురము. వి. చల్లదనం, పరిమళంగల సుగంధ ద్రవ్యవిశేషం. **పచ్చకర్పూరము** వి. చల్లదనం, పరిమళం గల సుగంధ ద్రవ్య విశేషం. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 1079. సం. కర్పూర. కర్పూరం. **పచ్చకప్పూరసరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **పచ్చకాటు** వి. బంతివవ్వవన్నె. **పచ్చకామెరులు** వి. బ. వ. చర్మాన్ని, కళ్ళను పచ్చగాచేసి ఆకలిని మందగింపచేసే కాలేయ సంబంధమైన రోగవిశేషం. **పచ్చకూవ** వి. కూన నుంచి పగలగొట్టి తీసిన నగభాగం. **పచ్చకూర** వి. చెంచలి, ఒకటి రెండడుగుల ఎత్తుపెరిగే ఆకులు కూరదినుసుగాను, పశువులకు పచ్చిమేతగాను ఉపయోగపడే మొక్క (Digeria arvensis, Digeria muricata). **పచ్చగవప** వి. బండారు చెట్టు, పరికరాల తయారీకి ఉపయోగించే కలప నిచ్చేచెట్టు (Adina cordifolia). **పచ్చగవరు** రూ.చూ. పచ్చగన్నెరు. వి. తోటల్లో పెంచబడి పచ్చనిపూలు పూసే చెట్టు. (Thevetia nerifolia). **పచ్చగండవి** (-కండవి) విశ. పసిమిగోల్పని, ఎండిపోని, శృం. నై. 6.122. **పచ్చగన్నెరు** రూ. పచ్చగనరు, పచ్చగన్నేరు. వి. పుష్ప వృక్ష విశేషం, పచ్చనిపూలు గల కరవీరం. ఆము. 1.66. **పచ్చగన్నేరు** రూ.చూ. పచ్చగన్నెరు. వి. తోటల్లో పెంచబడి పచ్చనిపూలు పూసే చెట్టు. భాను. 1.9. (Thevetia neriifolia). **పచ్చగన్నేర్లు** వి.బ.వ. మెట్టవడ్లలో ఎన్ను ముద్దగా ఉండే మూడునెలల్లో పండే ముతకరకం వడ్లు. **పచ్చగడికకాలము** వి. అశాశ్వతం, చంచలం. భాగ. వం. 10.24. **పచ్చగాఉండు** అ.క్రి. 1. దబ్బుతో సుఖంగా సంతోషంగాఉండు; 2. ఎలాంటికష్టాలు లేకుండాఉండు. **పచ్చగాకర**(-కాకర) వి. ఒకరకం కాకర. **పచ్చగాత** వి. ఒక జాతికి చెందిన ముళ్ళచెట్టు. **పచ్చగుఱ్ఱము** వి. 1. సూర్యుని గుర్రం; 2. పచ్చగా ఉండేగుర్రం. **పచ్చగుఱ్ఱముగలాఁడు** వి. సూర్యుడు. ఆం. భా. 1.81. **పచ్చగొట్ల** వి. పచ్చని పూలుపూసే ఒకచెట్టు (Tecoma stans). **పచ్చగోరంట** వి. పచ్చని తెల్లని పూలుపూసే బంజరు భూముల్లో పెరిగే మొక్క. (Barleria prionitis). **పచ్చగొరలు** వి.బ.వ. ఒకరకం ధాన్యం. **పచ్చంగూడు** రూ. పచ్చెంగూడు. వి. నలుపలకలుగా ఉండేగూడు. **పచ్చచేమంతి** వి. పసుపువన్నె పువ్వులుగలసేమంతిలత. **[పచ్చజవము** వి. కొండజువ్వి.

కలుజువ్వి. పచ్చజిట్ట వి. పసుపు, ఆకుపచ్చ కలిగినరంగు గలచిన్నపిట్ట. పచ్చజీనువాయి వి. ఒకరకం పిట్ట. పచ్చజువ్వి వి. కొండజువ్వి, కలుజువ్వి. పచ్చజొన్న రూ. పజ్జొన్న. వి. భోజనానికి శ్రేష్ఠమైన ఒకరకం జొన్న. పచ్చటమోట వి. దక్షిణ అమెరికానుంచి మిగిలిన దేశాలకు వ్యాపించిన ఒక రకంటమోట. పచ్చడవిమొల్ల రూ. పచ్చయడవిమొల్ల. వి. పచ్చనిపెద్దపూలుపూసే మొక్క (Tasminam humile). పచ్చతత్తడులవజీరు(డు వి. సూర్యుడు. అచ్చ. రా. కిష్కిం. 12. పచ్చతలపిచ్చుక వి. పక్షివిశేషం. పచ్చతామర వి. స్థలపద్మం, మెట్టతామర. ఉం. దా. 2.69. పచ్చతెగులు వి. మిరప, వరి మొ॥ పైర్ల ఆకులుతినే పచ్చపురుగుతెగులు. పచ్చతోరణము వి. ఎదతెగకుండా శుభసమయాల్లో వాడకుండా కట్టేతోరణం. దగా. 1.2. పచ్చదివసరులు వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. పచ్చదిమసులు వి.బ.వ. పెస్లు, ఉలవలు మొదలైనవి. పచ్చన వి. 1. పసుపువన్నె. మను. 4.28 ; 2. పసరువన్నె; 3. సౌభాగ్యం. పచ్చనికొంపమాస్చు స.క్రి. కలకలలాడుతున్న సంసారాన్ని కూల్చు. పచ్చని కోకవా(డు విశే. పీతాంబరుడు, విష్ణువు. కుచే. 2.53. పచ్చనివింటిజోదు వి. మన్మథుడు. చెన్నబసవ. 4.278. పచ్చనివింటివా(డు రూ.చూ పచ్చవింటివా(డు. విశే. మన్మథుడు. రాజవా. 8.75. పచ్చనివిలుకా(డు రూ.చూ. పచ్చనివిల్కాడు. వి. మన్మథుడు. పచ్చనివిల్కా(డు రూ. పచ్చనివిలుకాడు, పచ్చవిలుకా(డు, పచ్చవిల్కా(డు. వి. మన్మథుడు. పారి. 4.47. వ్య. చెరకువింటిని కలవాడు. పచ్చనీరుల్లి వి. పలాండు విశేషం, ఒకరకం ఉల్లి. పచ్చనేల వి. పచ్చరంగునేల. పచ్చ(దనము (-తనము) వి. 1. పసరురంగు. వేంక. పంచ. 2.198 ; 2. పసుపురంగు. పచ్చపచన రూ. పచ్చపచ్చన. వి. మిక్కిలిపచ్చన. చము. 1.43. పచ్చపచ్చన రూ.చూ. పచ్చపచన. వి. ఎక్కువ పచ్చన. పచ్చపట్టు వి. 1. పచ్చనిపట్టుబట్ట, పీతాంబరం. ద. హిం. గా. సంపు. 7. గా.సం. 734. క్రీ శ. 1228 ; 2. స్త్రీలు ధరించే వస్త్రవిశేషం. ప్రబంధ. 272. పచ్చపంటి వి. అర్థంగా అమర్చినరాటి. పచ్చపందిరి వి. పచ్చనిఆకులతో కట్టినపందిరి. కు.సం.9.8. పచ్చపయికము రూ. పచ్చపైకము. వి. కాసుపీసం, ఎర్రనిఏగాని. విక్ర. 7.124. పచ్చపయికము గుఱ్ఱము వచ్చినదా(కనె అన్య. గుర్రంవిలువ వచ్చేవరకే (అంటేగుర్రంబతికి ఉండేవరకే దానివిలువ అనటం). నిరంకు. 2.187. పచ్చపాఱు రూ.చూ. పచ్చవాఱు. అ.క్రి. పసుపువర్ణం కలదగు. పచ్చపిట్ట వి. 1. పసరురంగురెక్కలు గల పక్షివిశేషం, హారీతం. పచ్చపురుగు వి. అన్నిరకాల పైర్లకుపట్టేపచ్చరంగుపురుగు. పచ్చపులు(గు వి. పక్షివిశేషం, హారీతం. పచ్చపువ్వాకు రూ. పచ్చపొగాకు, పచ్చిపొగాకు. వి. ఒకరకం ఆకుపచ్చరంగు. పచ్చపూమొగలి వి. హేమ పత్రిక, పచ్చగాఉన్నమొగలిపువ్వు. పచ్చపూమొల్ల వి. మొల్ల. పచ్చపూప వి. 1. పచ్చరంగుగలపూస. విజయ. 3.12; 2. అమాయకురాలు కాకుండా అమాయకురాల్లాగ కనపడే స్త్రీ. సంగనాచి. పచ్చపెదగోరంట రూ.చూ. పచ్చపెద్ద గోరంట. వి. చిన్నఆకులు కలిగితెల్లని పూలుపూసేమొక్క, ఆకులు ఎర్రని రంగునిస్తాయి. (Lawsonia alba). పచ్చ పెద్దగోరంట రూ. పచ్చపెదగోరంట. వి. చిన్నఆకులు కలిగి తెల్లనిపూలుపూసేమొక్క, ఆకులుఎర్రనిరంగునిస్తాయి (Lawsonia alba). పచ్చపెసర వి. ఒకరకం పెసర మొక్క (Phaseolus trinervius). పచ్చపెసలు వి.బ.వ. ముద్గధాన్యవిశేషం ; ఒకరకంపెసలు. పచ్చపైకము రూ.చూ. పచ్చపయికము. వి. కానుపీనం. ఎర్రనిఏగాని. గౌ. హరి. ఉ. 154పం. పచ్చపొగాకు రూ. చూ. పచ్చ పువ్వాకు. వి. ఒకరకం ఆకుపచ్చరంగు. పచ్చపొట్ల వి. కాయరంగు ముదురుగా పచ్చగా ఉండేరకం. పచ్చపొడుచు అ.క్రి. పచ్చపోయు. పచ్చపోలి వి. పచ్చపోలానికి ఏట బలితో చేసేపూజ. పచ్చబావి వి. నల్పదరంగా ఉండే చుట్టు గోడగలబావి. పచ్చబిళ్లపురుగు వి. వరిగ ఆకులు తినే పచ్చపురుగు. పచ్చబెండ వి. బెండకాయల్లో ఒకరకం. పచ్చబెసరు వి. ఒకరకం పెసలు. పచ్చబొటుక[1] వి. తెల్లనిపూలూ, పసుపుపచ్చ లేక లేతఎరుపురంగు పళ్ళు కాసే చెట్టు. దీని కలప వ్యవసాయాది పరికరాల తయారీకి ఉపయోగపడుతుంది (Cordia rothii). పచ్చబొటుక[2] రూ. పచ్చబొతుక. వి. తెల్లగాఉండే మెత్తని నిరుపయోగ మైన కలపకల చెట్టు (Kydia calycina). పచ్చబొటుకు వి. పెనుగేరిచెట్టు, తెల్లని పూలూ, పచ్చని పళ్ళూ కాసే ఒకరకం చెట్టు (Cordia monoica). పచ్చబొట్టు వి. పచ్చాకు పసరుతో పొడిచే బొట్టు. శుక. 1.18. పచ్చబొట్టు కాడ వి. మెట్టనేలల్లో పెరిగే పచ్చని కలుపుమొక్క. పచ్చబొతిక రూ. పచ్చబొత్రుగ. వి. బండారుచెట్టు, పరికరాల తయారీకి ఉపయోగించే కలప నిచ్చే చెట్టు (Adina cordifolia). పచ్చబొతుక రూ.చూ. పచ్చ బొటుక[2]. వి. తెల్లగాఉండే మెత్తని నిరుపయోగమైన కలప కల చెట్టు (Kydia calysina). పచ్చబొత్రుగ రూ.చూ. పచ్చబొతిక. వి. బండారుచెట్టు, పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Adina cordifolia). పచ్చమట్టి వి. పీలమట్టి, పచ్చరంగులోనూ, గోధుమవన్నె లోనూ దొరికే ఈ మట్టి లోహాల్లజనితం. పచ్చమల్లిజొన్న వి. జొన్నలలో ఒకరకం. పచ్చమామిడి వి. ఊరగాయలకు ఉపయోగించే రకం మామిడి. పచ్చమిడత వి. ఆకు తినే పచ్చని మిడత. పచ్చమినుము వి. మినుముల్లో ఒకరకం. పచ్చమిర్చి వి. మిరపకాయలలో ఒకరకం. పచ్చముల్లు గోరంట వి. పచ్చని లేక తెల్లని పూలు పూసే మొక్క (Barleria prionitis). పచ్చ(బాఱు (-పాఱు) రూ.చూ. పచ్చవాఱు. అ.క్రి. పసుపువర్ణం కలదగు. పచ్చ(బ్రాలు (-ప్రాలు) వి.బ.వ. పచ్చని అక్షింతలు, శోభనాక్షతలు, హరిద్రాక్షతలు. యయా. 4.84. పచ్చయగు (-అగు) అ.క్రి. ధనవంతమగు. వేంక.పంచ. 1.774. పచ్చయడవి మొల్ల (-అడవిమొల్ల) రూ.చూ. పచ్చడవిమొల్ల. వి. పచ్చని పెద్ద పూలు పూసే మొక్క (Jasminum humile). పచ్చయర(టి (-అర(టి) రూ.చూ. పచ్చర(టి. వి. పసరు వన్నె పళ్ళుగల కదళీ విశేషం. పచ్చయిరుగుడు(-ఇరుగుడు) వి. పచ్చపూలుగల ఇరుగుడుచెట్టు (Dalbergia sissoi-

des). పచ్చయెమ్ము (-ఎమ్ము) వి. స్త్రీ వశీకరణాపవార్లో ఉపయోగించే ఓషధి విశేషం. ప్రబంధ. 640. పచ్చయెమ్ము విల్లు (-ఎమ్మువిల్లు) వి. చిగురువిల్లు. వేంక.ఆం. 9. పచ్చరంగు వి. చెట్ల ఆకుల రంగు. పచ్చరంగురాయి వి. సాంకేతికంగా 'సున్నపురాయి' అనబడే ఈ శిలాజాతి భిన్నరూపాల్లో, భిన్నలక్షణాల్లో విస్తృతంగా దొరుకుతుంది. పచ్చరటి రూ. పచ్చయరటి, పచ్చరిటి. వి. ఒకరకం అరటిచెట్టు (Musaparadisiaca troglodytarum). పచ్చరాతినారరాయి వి. నారగా అణుఘటితంగా బంధలుగా చాలా రకాల్లో దొరికే ఈ ఖనిజశిలను సాంకేతికంగా 'సర్పెంటీన్' అని పిలుస్తారు. పచ్చరాయి రూ.చూ. పచ్చడాయి. వి. 1. మరకతమణి. మను. 243; 2. నల్లరాతి నారరాయి; 3. రాతినార దాగా దొరికే ఆకుపచ్చరంగు కల రాయి. పచ్చరిటి రూ.చూ. పచ్చరటి. వి. అరటికాయలలో ఒకరకం. పచ్చరెక్క వి. పక్షి విశేషం. ఒకానొక పిట్ట. రసిక. 1.115. పచ్చరెక్కలపక్కి వి. చిలుక. ప్రద్యుమ్న. 3.75. పచ్చఱాయి రూ. పచ్చరాయి. వి. మరకతమణి. శృం.నై. 6.122. పచ్చఱెక్కలపిట్ట వి. చిలక. పచ్చలకలమంపి వి. ముత్యాలముగ్గులాగ పచ్చలతో వేసే కళ్ళాపు. పచ్చలక్క వి. వర్ణపట్టికలోని అయిదవ వన్నె. పసుపుపచ్చరంగు. పచ్చలబావి వి. నల్పదరంగా ఉన్న చుట్టు గోడఉన్న బావి. పచ్చవంకాయ వి. కాయ తెల్లగా లావుగా గుండ్రంగా ఉండే వంకాయ. పచ్చవడ్లు వి.బ.వ. వడ్లలో ఒకరకం. పచ్చవలువవారి వి. విష్ణువు. పీతాంబరుడు. పచ్చవాకాంబరము వి. మందుల్లో ఉపయోగపడే ఆకులు కలిగి నీలిరంగుతో కలిసిన పసుపుపూలు పూసే మొక్క (Ecbolium linnaeanum). పచ్చవారువపు జోదు రూ.చూ. పచ్చవార్వపుజోదు. వి. 1. హరిదశ్వుడు. సూర్యుడు; 2. చిలుకతత్తిరౌతు, మన్మథుడు. పచ్చవారువవజీరు రూ. పచ్చవార్వపువజీరు. వి. హరిదశ్వుడు. సూర్యుడు. అచ్చ.రా.బాల. 94. పచ్చవార్వపుజోదు రూ. పచ్చవారువపుజోదు. వి. 1. హరిదశ్వుడు, సూర్యుడు. అచ్చ.రా.పీఠి. 3; 2. చిలుకతత్తిరౌతు. మన్మథుడు. అచ్చ.రా.పీఠి. 3. పచ్చవార్వపువజీరు రూ.చూ. పచ్చవారువవజీరు. వి. హరిదశ్వుడు, సూర్యుడు. పచ్చవాఱు (-పాఱు) రూ. పచ్చపాఱు, పచ్చబాఱు. అ.క్రి. పసుపువర్ణం కలదగు. ఆము. 1.64. పచ్చవింటిదొర వి. చెరకువింటివాడు. మన్మథుడు. అచ్చ.రా. 3.65. పచ్చవింటివాడు రూ. పచ్చనివింటివాడు. విఱ. మన్మథుడు. పీర.వి. 2.91. పచ్చవిలుకాడు రూ.చూ. పచ్చనివిల్కాడు. వి. మన్మథుడు. పచ్చవిలుతుడు రూ.చూ. పచ్చవిల్తుడు. వి. ఇక్షుధన్వుడు. చెరకువిలుకాడు. మన్మథుడు. శార.విరా. 2.58. పచ్చవిలుతవికేతి వి. చిలుక. సాంబ.తర్క. 8. పచ్చవిల్కాడు రూ.చూ. పచ్చనివిలుకాడు. వి. మన్మథుడు. యయా. 4.13. పచ్చవిల్తుడు రూ. పచ్చవిలుతుడు. వి. ఇక్షుధన్వుడు, చెరకువిలుకాడు. మన్మథుడు. కు.సం. 5.3. పచ్చవిల్తునయ్య వి. మన్మథుని తండ్రి. విష్ణువు. అచ్చ.రా.బాల. 60. పచ్చసరులు వి.బ.వ. రాస్య విశేషం. హంస. 4.128. పచ్చసుద్ద వి. 1. ఎరుపురంగు రాయి; 2. సుద్దరాయి. పచ్చాకు వి. 1. హరితపత్రి, కాపత్రం, పచ్చాకుచెట్టు ఆకు. వేంక.పంచ. 2.192: 2. బాలక్రీడావిశేషం; 3. ఉదకమండలం మొదట్ల పెరిగే లావు చెట్టు (Cinnamomum wightii). <పచ్చ+ఆకు. పచ్చాకుబొట్టు వి. పచ్చాకు పసరుతో పొడిచే బొట్టు. పచ్చావగ (-ఆవగ) వి. ఆవగలో ఒకరకం. పచ్చారి[1] వి. ఎర్రపసరు చెట్టు, అందమైన పెద్ద చెట్టు (Dalbergia lanceolaria). పచ్చారి[2] రూ. పచ్చారె[1]. వి. పసరు చెట్టు, ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Dalbergia panicu'ata). పచ్చారిమాను వి. ఆరె చెట్టు భేదం. నెల్లూరి శాసనాలు. G.P. 99 (Dalbergia lanceolaria). పచ్చారె[1] రూ.చూ. పచ్చారి[2]. వి. పసరుచెట్టు, ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Dalbergia paniculata). పచ్చారె[2] వి. ఆరెచెట్టు భేదం. ద్వి.సార.చ. 2.80 పా. 3 పం. (Bauharia spicafa). <పచ్చ+ఆరె. పజ్జొన్న రూ.చూ. పచ్చజొన్న. వి. గింజ పచ్చనిరకం జొన్న, అన్నిటికంటె భోజనానికి శ్రేష్ఠమైన జొన్న.

పచ్చం రూ. పచ్చాం, పచ్చెం. వి. 1. అరవైమూరలనేత; 2. ఒక నేతలో దిగిన నాలుగు చీరలుగాని, ఎనిమిది పంచెలుగాని; 3. ఒకే నేతలో దిగిన మూడు చీరలు; 4. మగ్గం మీద నేతగుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు; 5. చదరంవంటివాటిలోని ఒక భుజం; 6. తాను, 24 గజాలు పొడుగున్న వస్త్రం.

సం. పక్ష-. వైపు, నెలలో సగభాగం, రెక్క; ప్రా. పా. పక్ఖ. రెక్క.

<సం. పక్ష-.

పచ్చకరా వి. లోహాదులకు వేసినపూత.

హిం. పచ్చీకారీ. నేలమీదకాని, లోహంమీదకాని చేసే చెక్కడం, పొదగడం, జవకట్టడం మొదలైనవి; ఉ. పుచ్ కారా. పల్చని మట్టిపూత.

<ఉ. పచ్‌కారా.

పచ్చడము రూ. పచ్చరము, పచ్చురము, పసడం, పసరం. వి. 1. కప్పుకోటానికి, పరచుకోటానికి ఉపయోగించే దుప్పటి. నృసింహ. 3.89; 2. వస్త్రం. ఉ.హరి. 2.178; 3. సాలువ. హర. 2.93; 4. అంతరీయం, కట్టుబట్ట. భీమ. 1.115: 5. ఉత్తరీయం, పైబట్ట. నిరంకు. 2.16; 6. జంటపొరల దుప్పటి.

సం. ప్రచ్ఛద-. పైన కప్పేది; ప్రా. పచ్ఛద-, పచ్ఛఅ, పచ్ఛయం. వస్త్ర విశేషం, దుప్పటి;

క. అచ్చడ, పచ్చడ, పచ్చవడ, హచ్చడ. ముతక దుప్పటి; తు. పచ్చడె; త. పచ్చటమ్, పచ్చవటమ్; మ. పచ్చవటం; కుఱ. పసుడి.

<ప్రా. పచ్ఛద-.

పచ్చడి వి. 1. అల్పాశంతం. ఉ. హరి. 4.196: 2. ఉపదంశం, పప్పుదినుసుల్నిగాని, కూరగాయదినుసుల్నిగాని ముద్దగా రుబ్బి చేసే వ్యంజన విశేషం. నాశ.పంచ.

1.318 ; 3. ఊరుపిండి.

క. పచడి, పచ్చడి. వ్యంజన విశేషం, ఊరుపిండి ; త.మ. పచ్చడి.

పచ్చడికివటికిపట్లు అవ్య. ముక్కలు ముక్కలుగా. ఉ. హరి. 4.229. పచ్చడిచిప్ప వి. నన్నని అంచుతో కొంచెం లోతుగాఉండే మట్టికంచం. పచ్చడిచేయు రూ. పచ్చడిసేయు. స.క్రి. నలగగొట్టు, నురుమాడు. ఉ.హరి. 4.196. పచ్చడి మామిడి వి. ఊరగాయలకు ఉపయోగించే రకం మామిడి కాయ. పచ్చడిసేయు(-చేయు) రూ.చూ. పచ్చడిచేయు. స.క్రి. పచ్చడిలాచేయు, నలగగొట్టు. కవిక. 5.113. పచ్చళ్లకుండ వి. పచ్చళ్ళు, ఊరగాయ మొదలయినవి పెట్టుకోటానికి వాడే మధ్యరకం మట్టిపాత్ర.

పచ్చపదొంగలు వి.బ వ. పశ్యతోహరులు, చూస్తూండగానే దొంగిలించేవారు.

సం. పశ్యతః. చూస్తూండగనే.

పచ్చముపాదు విశ. మిక్కిలి పాడైనది. జైమినిభా. 4.20.

త. పంపైప్పొట్టు, దరిద్రం, పేదతనం.

పచ్చర్ రూ.చూ. పిచ్చెరు. వి. పెరల్పుగా పడునుగా ఉండే ఉక్కుముక్క.

పచ్చరము రూ.చూ. పచ్చడము. వి. జంటపొరల దుప్పటి.

పచ్చళ్లకుండ చూ. పచ్చడి.

పచ్చాం రూ.చూ. పచ్చం. వి. 1. అరవై మూరల నేత ; 2. ఒకనేతలో డిగిన నాలుగు చీరలు లేక ఎనిమిది పంచెలు ; 3. ఒకేనేతలో డిగిన మూడుచీరలు ; 4. మగ్గంమీద నేత గుడ్డ చుట్టే నలుపలకల దోనెలో ఒకవైపు.

పచ్చాకు చూ. పచ్చ.

పచ్చాకుబొట్టు చూ. పచ్చ.

పచ్చాసగ చూ. పచ్చ.

పచ్చారి[1] చూ. పచ్చ.

పచ్చారి[2] చూ. పచ్చ.

పచ్చారిమాసు చూ. పచ్చ.

పచ్చారె[1] చూ. పచ్చ.

పచ్చారె[2] చూ. పచ్చ.

పచ్చి[1] చూ. పచ్చ. విశ. 1 ఆర్ద్రం, తడిగల, ఎండని. బసవ. 4.480 ; 2. నూతనమైన, కొత్త. శివరా. 2.77 ; 3. (రోగాదుల నుంచి) తేరని. వేంక. పంచ. 3.250 ; 4. వేగని. ఆము. 2.97 ; 5. ఉడకని, కాగని. పారి. 2.48 ; 6. కఠినాత్ముడు. విజయ. 3.66 ; 7. కాలని ; 8. ముదరని, ముగ్గని ; 9. ఎక్కువైన ; వి. 1. క్రలు మొ. వాటి ఆర్ద్రత్వం, పచ్చిదనం ; 2. శృంగారాది రసస్ఫురణం, రసం పైకి స్ఫురించటం.

పచ్చిఅబద్ధం వి. శుద్ధఅబద్ధం, పూర్తిఅసత్యం. పచ్చి ఆంధ్రుడు వి. ఆంధ్రేతరులందరూ చపటలన్నంతదాకా వెళ్ళే ఆంధ్రుడనటం, నిరసనలోనే దీన్ని ఉపయోగిస్తారు. పచ్చి ఒండ్రు వి. ప్రవాహంలో కొట్టుకొచ్చి పేరుకొన్న మెత్తని మట్టి. పచ్చికంకర వి. జిగటగా ఉండే రాతిముక్క. పచ్చి కడుపు వి. అతివృష్టివల్ల ఏర్పడిన క్షామం, రొంపి కడుపు. పచ్చికసి వి. విపరీతమైన కసి. పచ్చికసువు వి. పశువులకు వేసే పచ్చిమేత, పొలంలోనుంచి కోసితెచ్చేమేత. పచ్చి కాల్పు వి. ఆముకాల్పులో కుండలు దాగా కాలక పచ్చిగా నిలిచేస్థితి. పచ్చికాల్పురాయి వి. పగిలి పనికిరానిరాయి. పచ్చికూన రూ. పచ్చిగూన. వి. కాల్చనికూన. పచ్చిగంగ వి. మంచినీళ్ళు. పచ్చిగర్దమిత్ర వి. పగలాడి. పచ్చిగడ్డి రూ. పచ్చిగెడ్డి. వి. పశువులకువేసే పచ్చిమేత. పచ్చిగూన (-కూన) రూ.చూ. పచ్చికూన. వి. కాల్చనికూన. పచ్చిగెడ్డి రూ.చూ. పచ్చిగడ్డి. వి. పశువులకువేసే పచ్చిమేత. పచ్చిటిక రూ.చూ. పచ్చిటుక. వి. కాల్చని ఇటుక. <పచ్చి[1] + ఇటిక. పచ్చిటికి రూ.చూ. పచ్చిటుక. వి. కాల్చనిఇటుక. <పచ్చి[1] + ఇటికి. పచ్చిటికె రూ.చూ. పచ్చిటుక. వి. కాల్చని ఇటుక. <పచ్చి[1] + ఇటికె. పచ్చిటుక రూ. పచ్చిటిక, పచ్చిటికి, పచ్చిటికె, పచ్చివిటుక. వి. కళ్ళంమీద కాల్చటానికి సిద్ధంగా ఉంచిన ఇటుక. <పచ్చి[1] + ఇటుక. పచ్చితురక వి. కసాయివాడు, అతిక్రూరుడు. పచ్చితేనె వి. ఆపక్వమైన కాచనితేనె. పచ్చితేఱు రూ. పచ్చిదేరు. అ.క్రి. పచ్చిఅగు. పచ్చిడుక్కి వి. నీళ్ళుపెట్టి దున్నిన మాగాణి పొలం. పచ్చిదేరు(-తేఱు) రూ.చూ. పచ్చితేఱు. అ.క్రి. పచ్చిఅగు. పచ్చిదేరగబల్కు అ.క్రి. బూతులు మాటలాడు. హంస. 2.104. <పచ్చి[1] + తేఱు + -అ[7] + అగు + -అ[7] + పల్కు. పచ్చిదొంగ వి. ఆరితేరిన దొంగ. పచ్చి నూలు వి. చలవచెయ్యని ముడినూలు. పచ్చిపట్టె వి. తడి ఆరని పిడూరిరేకు. దుర్మా.చ. 5.68. పచ్చిపడుగు వి. గంజి పెట్టని పడుగు. పచ్చిపలువ వి. చాలా దుర్మార్గుడు. పచ్చి పాలు వి. కాచనిపాలు. ద.హిం.గా. సంపు. 6. గా.నం. 1000. క్రీ.శ. 1307. పచ్చిపులుసు వి. ఉడకని పులుసు కూర. పచ్చిపెంకు వి. కాల్చనిపెంకు. పచ్చిపెర్కవాళ్ళు విశ.బ వ. తెలంగాణా ప్రాంతానికి చెందిన పెర్కల్లు. పచ్చి పెల్ల వి. కాల్చటానికి సిద్ధంగాఉంచిన ఇటుక. పచ్చిపొగాకు రూ.చూ. పచ్చపువ్వాకు. వి. 1. ఒకరకం ఆకుపచ్చరంగు. 2. ఆకుపచ్చలో నలుపవన్నె. పచ్చిబాలెంత వి. అప్పుడే ప్రసవించిన స్త్రీ. శివరా. 2.77. పచ్చిబాలెంతరాలు వి. అప్పుడే ప్రసవించినస్త్రీ. హర. 2.93. <పచ్చి[1] + బాలెంత + అలు. పచ్చిబియ్యపుమామిడి వి. 1. నారలేక కండకల మామిడి ; 2. ఉప్పుడు చేయని బియ్యం. పచ్చిబూతు వి. బండబూతు. పచ్చిబొగ్గు వి. కాలీకాలని బొగ్గు. పచ్చిబోగ ముది విశ. విశృంఖల వ్యభిచారిణి. పచ్చిమట్టి వి. తడిగా ఉండే మట్టి. పచ్చిమంద వి. పొలాలకు సత్తువకోసం తోలించే గొర్రెలగుంపు లేదా ఆవులగుంపు. పచ్చిమప్పు వి. బురదమట్టి, చిక్కటిపాకంలోఉన్న అడుసు. పచ్చిమామిడి కాయ రూ. పచ్చిమామిడికాయి. వి. 1. ఒకరకం ఆకుపచ్చ రంగు ; 2. ఆకుపచ్చలో నీలంవన్నె కలిసినరంగు ; 3. పచ్చిపొగాకురంగు ; 4. పంచలోహాలమాదిరి రంగు ; 5. ఆలివరంగు. పచ్చిమామిడికాయి రూ.చూ. పచ్చిమామిడి కాయ. వి. 1. ఒకరకం ఆకుపచ్చరంగు ; 2. ఆకుపచ్చలో నీలంవన్నె కలిసిన రంగు ; 3. పచ్చిపొగాకురంగు ; 4. పంచలోహాలమాదిరి రంగు ; 5. ఆలివరంగు. పచ్చిమాల వి. అచ్చంమాల. బసవ. 7.188 వ. పచ్చిమిరప వి. మిరప

కాయలలో ఒకరకం. పచ్చిరక్కసు(డు వి. కఠిన రాక్షసుడు. బసవ. 4.644. పచ్చిరంగు వి. 1. నీళ్ళలో కలిపి ఉడక పెట్టిన రంగు; 2. పన్నీళ్ళలో వేసి నూలు పిసికేరంగు. పచ్చిరట్ట వి. పచ్చిటూస, కాల్చనిటూస. పచ్చిరాగిడి వి. మెత్తటి రేగడినేల. పచ్చిరాయి వి. 1. ఎర్రకంచురాయి; 2. కల్లంమీద కాల్చటానికి సిద్ధంగా ఉంచిన ఇటుక. పచ్చిరి వి. గానుగచక్రం వెనగకుండా ఓగించే గొయ్యముక్క. పచ్చిరౌతు వి. పచ్చిటిక, కల్లంమీద కాల్చటానికి సిద్ధంగా ఉన్న ఇటుక. పచ్చివరసంతగుడ్డు వి.బ.వ. అగాళ్ళలు. శాక్ల.సం. 7.34. పచ్చివార వి. పట్టిడు లేదా పంపుం గింజలు పోసుకోటానికి వీలైన పెద్ద మట్టిపాత్ర. పచ్చివిటుక రూ.చూ. పచ్చిటుక. వి. కాల్చని ఇటుక. <పచ్చి[1] + ఇటుక. పచ్చివిషము వి. ఎక్కువచేదైనది. పచ్చివెచ్చి విశ. ఉచ్చిపచ్చి, అపరిపక్వమైన. శాక్ల. సం. 10.220. పచ్చి సున్నపురౌతు వి. సరిగా కాలక సున్నం బాగా ఇవ్వని రాయి. పచ్చిసేయు(-చేయు) స.క్రి. ఆరడిచేయు. శాక్ల.సం. 3.47. పచ్చిసోదా వి. పచ్చిపలవ.

పచ్చి[2] వి. పిట్ట. పక్షి.

సం. పక్షిన్. రెక్కలుగలది. పిట్ట; ప్రా. పక్ఖి, పక్ఖిఅ-, పంఖి. పక్షి; కా. పక్షిన్; బెం. పాఖి; ఒ. పఖీ; హిం. పాంఖీ; పం. పక్ఖీ, పంఖీ; ల. పక్ఖీ; గు. పంఖీ.

<సం. పక్షిన్.

పచ్చిక చూ. పచ్చి[1]. వి. 1. పచ్చికసవు, గాదం. అము. 4.100; 2. చీపురువంటి కంపగా పెరిగే ఒకరకంగడ్డి; 3. సంతల్లో గంప గంపకూ సుంకంగా కాయలు తీసుకొనే పద్ధతి.

పచ్చికమంద వి. పొలాలకు నత్తువకోసం తోలించే గొర్రెల గుంపు, లేక ఆవులగుంపు. పచ్చికదాల్ మేనిసామి వి. దూర్వాశ్యామాంగుడు, విష్ణువు. పటికా. 2.157.

పచ్చియము రూ. పచ్చెము. వి. పశ్యతోహరణం, చూస్తూండగా దొంగిలించటం.

సం. పశ్యతోహరణ-. చూస్తూండగానే దొంగిలించటం.

పచ్చీసు వి 1. 25 గళ్ళు ఉండి గవ్వలతో ఆడే ఆట; 2. ఇరవైఐదు.

హిం.మరా. పచ్చీస్. ఇరవైఐదు.

<మరా. పచ్చీస్.

పచ్చీసుకడాలు రూ.చూ. పచ్చీసుకానాలు. వి.బ.వ. ఒకరకం గళ్ళచీర, పచ్చీసు గళ్ళచీర. పచ్చీసుకంట్లచీర వి. నేతలో నిలువ, అడ్డం నలభయ్యేని రంగు కొలుకులు పెట్టి నేసిన మామూలు గడిచీర. పచ్చీసుకంట్లపమాలు వి. పచ్చీసుగళ్లమాదిరిగా నేసిన తలపాగ. పచ్చీసుకంట్లు వి.బ.వ. నేతలో అయిదు వన్నెలు నిలువుకు, అయిదు వన్నెలు అడ్డానికి వచ్చేట్టు రంగు దారాలతో నేసిన గళ్ళు. పచ్చీసుకానాలు రూ. పచ్చీసుకడాలు. వి.బ.వ. ఒకరకం గళ్ళచీర. పచ్చీసుగడి వి. అయిదురంగులుపెట్టి నేసిన ఒకరకంగడి. పచ్చీసుగళ్ళకోక వి. పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్లమాదిరిగా ఉండే గళ్లచీర. పచ్చీసుగళ్ళచీర వి. పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్లమాదిరిగా ఉండే గళ్లచీర. పచ్చీసుగళ్ళు వి.బ.వ. నేతలో అయిదు వన్నెలు నిలువుకు. అయిదు వన్నెలు అడ్డానికి వచ్చేట్లు రంగు దారాలతో నేసిన గళ్ళు. పచ్చీసుమడ్చుచీర వి. పచ్చీసుల ఆట ఆడుకొనే గళ్ళ మాదిరిగా ఉండే గళ్ళ చీర. హిం. పచ్చీస్. ఇరవై అయిదు. <పచ్చీసు + మడి + -లు + చీర.

పచ్చురము రూ.చూ. పచ్చరము. వి. చేతితో వడికిన నూలుతో గట్టిగా నేసిన గుడ్డ.

పచ్చెం రూ.చూ. పచ్చం. వి. చదరం వంటివాటిలోని ఒక భుజం.

పచ్చెకా(డు చూ. పచ్చెము.

పచ్చెంగూడు రూ.చూ. పచ్చంగూడు. వి. నలుపలకలుగా ఉండే గూడు.

పచ్చెవ వి. కప్పేటప్పుడు వెల్లికల పెట్టిన పెంకు.

పచ్చెము రూ.చూ. పచ్చియము. వి. చూస్తూండగానే దొంగిలించటం.

పచ్చెకా(డు వి. పశ్యతోహరుడు, చూస్తుండగానే దొంగిలించేవాడు.

పచ్చెలు చూ. పచ్చి. వి.బ.వ. ముక్కలు.

పచ్చెవాతం రూ.చూ. పక్షవాతం. వి. శరీరంలో ఏదో భాగం చైతన్యం లేకుండా పోయే ఒక జబ్బు.

పఛాడి వి. ఒకవిధమయిన గుడ్డ.

ఉ. పఛాడీ. వస్త్రం. ఒక రావు.

<ఉ. పఛాడీ.

పజ వి. ప్రజలు, జనం. చంద్రాంగ. 2.66, సీలా. 2.52.

సం. ప్రజా. సంతానం, జనం; ప్రా. పజా, పయా; అశో. పజాకాల్సి-ధౌలి; అ.మా. పయా; పా. పజా.

<సం. ప్రజా.

పజపొర వి. నలువ, బ్రహ్మ. వేంక.అం. 4.

పజీతి రూ. పజీతు, పసీతు, బజీతు. వి. 1. అవమానం; 2. నిర్బంధం.

హిం.ఉ.పార. ఫజీహత్. దుర్దశ, అవమానం.

త. పచీతు. అవమానం.

<ఉ. ఫజీహత్.

పజీతు రూ.చూ. పజీతి. వి. అవమానం.

పజ్జ వి. 1. వెనుక, పశ్చాద్భాగం. భార.ఆది. 7.271; 2. అనుసారం, వెంబడించటం. భార.విరా. 2.85; 3. ఒద్ద, కడ. భార.ద్రోణ. 4.78, రం.రా:బాల. 7 ప. 7 పం.; 4. కొన్నిచోట్ల, అంప, లో మున్నగు అర్థాల నిస్తుంది. శృం.నై. 2.112; 5. తోవ, మార్గం. శృం.నై. 5.170; 6. సమీపం, చేరువ. కకుత్స. 3.18; 7. చోటు. స్థలం. కకుత్స. 4.89; 8. ప్రాంతం, సమీప ప్రదేశం. దశా. 5.68.

సం. పశ్చా, పశ్చాత్, పద్యా. వెనుకనుండి, వెనుక; ప్రా. పచ్ఛా-. తరువాత, వెనుక, శేషం, పజ్జా-, మార్గం; శౌ. పశ్చాదో; అ.మా. జై. మహా. పచ్ఛా; మా. పశ్చా, పశ్చాదో; పా. పచ్ఛా.; హిం. పాఛ్. వెనుక.

<ప్రా. పచ్ఛా-.

పజ్జరించు అ.క్రి. ఉపసర్పించు <పజ్జ+-ఇంచు[3].
పజైవమందుం చూ. పడి.
పజైవిమిది చూ. పడి.
పజ్జొవ్వ చూ. పచ్చ.
పజ్జైవమందుం చూ. పడి.
పంచ[1] వి. 1. (పర్వతాదుల) పార్శ్వ ప్రదేశం. ఉ.హరి. 4.270; 2. పంచాడి, వసార. హర. 7.22, భాగ. 8.471; 3. మందిరనికటం, అంత. పద్మ. 3.33; 4. ఆశ్రయం.

సం. పార్శ్వ-. పక్కభాగం, సమీపం; ప్రా. పాస-.; బెం.హిం. పాస్.; గు. పాంసు; మరా. పాస్, పాశీ. సమీపంలో ఉన్న.

<ప్రా. పాస-.

పంచకమ్మి వి. పంచస్తంభాల మీద వేసే అడ్డవాసం. పంచకువచ్చు అ.క్రి. ఆశ్రయించు, శరణుజొచ్చు. పద్మ. 3.33. పంచగడ్డి వి. కళ్ళంలో ఇంకా తొక్కించని గడ్డి. పంచగూడు వి. దర్వాజాపక్కన ఉన్న గూడు. పంచచేరు అ.క్రి. ఆశ్రయించు. పంచటరుగు రూ. పంచరుగు. వి. పంచతిన్నె. హర. 2.40. <పంచ[1]+అరుగు. పంచతిన్నె వి. ఇంటి ముందున్న పంచఅరుగు. వేంక పంచ. 1.244. పంచది విశే. చెడ్డది, పోకిరిది. (వసారాలో ఉండేది). పంచదూలం వి. పంచస్తంభాలమీద వేసే అడ్డవాసం. పంచపట్టి రూ. పంచపట్టె. వి. చింపటానికి వీలుగా గోడలోకి దన్నుపెట్టిన కొయ్యవాసం. పంచపట్టె రూ.చూ. పంచపట్టి. వి. చింపటానికి వీలుగా గోడలోకి దన్నుపెట్టిన కొయ్యవాసం. పంచపాక రూ. పంచపాగ. వి. 1. పంచాడి, వసార; 2. మందిరనికటం, అంత; 3. (పర్వతాదుల) పార్శ్వ ప్రదేశం. పంచపాగ రూ.చూ. పంచపాక. వి. పంచవైపు. పంచపాళి వి. 1. పంచాడి, వసార; 2. మందిరనికటం, అంత; 3. (పర్వతాదుల) పార్శ్వ ప్రదేశం సం. పాళి-. వరుస. పంచమిద్ది వి. పంచలు దించిన మట్టికప్పు గల ఇల్లు. పంచరా వి. పంచ ఇంటి ముందున్న కప్పువేసిన అరుగు. <పంచ[1]+రాయి. పంచరాలు వి.బ.వ. పంచదించడానికి వాడిన గుంజ. పంచరుగు రూ.చూ. పంచటరుగు. వి. పంచతిన్నె. ద్విపరమ. వి. 3.253. పంచలఁడోయు(-త్రోయు) స.క్రి. పాలదోలు, పాడుచేయు. శాశ్వ. సం. 9.22. పంచలపడు అ.క్రి. పడిగాపులు పడి ఉండు. శాశ్వ. సం. 11.65. <పంచ[1]+లు+-అ[7]+ఉండు. పంచలుపాటించు స.క్రి. శ్రమ కలిగించు, బాధ కలిగించు. రాజవా. 4.110. పంచశీలాపేట వి. అంచులో నేసే ఒకరకం డిజైను. పంచాది[1] రూ. పంచోది[1]. వి. 1. పంచ, పంచపాక. పరమ. 3.250; 2. పిక్కకొట్టు; 3. ఇంటిపంచ, వరండా; 4. వంటగది, వంటచేసే గది. పంచోది[1] రూ.చూ. పంచాది[1]. వి. 1. పిక్కకొట్టు; 2. ఇంటిపంచ.
పంచ[2] రూ.చూ. పంచె. వి. మగవాడు కట్టుకొనే ధోవతి.
పంచ[3] విశే. అధికమైన.

సం. పంచన్. అయిదు.

పంచం వి. పంచాంగం.

సం. పంచాంగ-. తిథివారనక్షత్రయోగ కరణాలు అనే అయిదు అంగాలు కలది.

<సం. పంచాంగ-.

పంచకము[1] వి. అశ్వం, పశ్చాత్ప్రదేశం, గుర్రం వెనక భాగం. సారంగ. 1.81, ఆం.భా. 2.200.

సం. పంచక-. అయిదుభాగాలు కలది (నాలుగు కాళ్ళు తలమీద లేదా తోకమీద చుక్క కలది.)

<సం. పంచక- (అర్థవిప.).

పంచకము[2] వి. అయిదు తూములు.

సం. పంచక- ఐదుకు సంబంధించిన, అయిదింటి సమూహం.

<సం. పంచక- (అర్థవిప.).

పంచకజ్జాయము వి. 1. ఉడికించిన ఎండు కొబ్బరి, చక్కెర కలిపిన పొడి; 2. పప్పులు బొరుగులు, ఎండు ఖర్జూరం, బెల్లం కలిసిన పదార్థం.

సం. పంచ-. ఐదు.

<సం. పంచన్+కజ్జాయము.

పంచకరపాట్లు వి.బ.వ. అత్యధిక కష్టాలు. భీమ. 4.109.

సం. పంచన్. ఐదు.

పంచకల్యాని రూ. పంచకళ్యాణి. వి. నాలుగు కాళ్ళు తెలుపు, నడినెత్తిన తెల్లటి చుక్క, పూడోక ఉన్న గుర్రం.

సం. పంచకళ్యాణక-. నాలుగు తెల్లకాళ్ళు తెల్లని నోరుకల గుర్రం.

<సం. పంచకళ్యాణక-.

పంచకళ్యాణి రూ.చూ. పంచకల్యాని. వి. నాలుగు కాళ్ళు తెలుపు, నడినెత్తిన తెల్లటిచుక్క, పూడోక (తెల్లటి తోక కుచ్చు) ఉన్న గుర్రం.

పంచకూర్లకషాయము రూ. పంచకోర్లకషాయము. వి. 1. అయిదు రకాల మూలికలతో కాచిన కషాయం; 2. నానా జాతి సంకరం.

సం. పంచన్. ఐదు, కషాయ-. ఒగరైనది.

పంచకోర్లకషాయము రూ.చూ. పంచకూర్లకషాయము. వి. 1. అయిదు రకాల మూలికలతో కాచిన కషాయం; 2. నానా జాతి సంకరం.

పంచదార రూ. పంచారా. వి. చక్కెర. శృం.నై. 2.82.

సం. పంచన్. అయిదు, ధారా. కత్తి మొ॥ వాటి అంచు.

<సం. పంచధారా.

పంచదారతిండితేజీరౌతు వి. మన్మథుడు, పంచదార తిండిగాకల వాహనమైన చిలుకకు సంబంధించిన రవుతు.

పంచదివెహరణ వి. ఉద్యోగ విశేషం. ద.హిం.శా సంపు. 6. శా.సం. 751, క్రీ.శ. 1376.

సం. పంచన్. ఐదు.

పంచపాది వి. ముగ్గులుంచే అరలకర్ర పెట్టె.

సం. పంచపాద-, పంచపాదిన్, పంచపాదికా. ఐదుకాళ్ళు కలది.

<సం. పంచపాదిన్.

**పంచబంగాళము** చూ. పంచము[1].

**పంచబేరము** వి. పంచలోహాల వర్తకం. శాశ. సం. 7.130.
సం. పంచన్. ఐదు.

**పంచమన్** రూ. పాచిమాను. వి. పన్ని, నదుల గట్లమీద పెంచబడే ఒకరకం పెద్దచెట్టు (Anogeissus acuminata).

**పంచము**[1] విణ. 1. చెదిరిన ; 2. నాశనం చేయబడిన.
పంచబంగాళము విణ. 1. చెల్లాచెదరయిన, దృగ్గోచరమైన. భీమ. 4.61, కాశీ. 1.122 ; 2. అదృశ్యం, కనపడనిది. ఆం.నా.శే. 18 ; 3. అదృశ్యమువటం, మాయమవటం. పారి. 5.37. పంచముపారగు అ.క్రి. పారిపోవు. వరాహ. 3.59. పంచముపాదు విణ. 1. బగ్గంపాడు, మిక్కిలిపాడు, ధ్వస్తం. వరాహ. 1.30 ; 2. చెల్లాచెదరైన, మిక్కిలి చెదరిన.
సం. పంచ్. విస్తరించు.

**పంచము**[2] వి. ఇతరుల్ని వశపరచుకోటానికి బహిరంగంగా చేసే ఉపకారాదికం. ద్వి.పరమ.వి. 6.458.

**పంచరించు** రూ.చూ. పంచారించు. అ.క్రి. వ్యాపించు. పి.శకు. 4.67.

**పంచరు** వి. బెజ్జం.
ఇం. *Puncture*. గుచ్చు, బెజ్జం.
<ఇం. Puncture.

**పంచవక్త్రకోహళి** వి. శివాలయంలో లింగానికి పెట్టే మస్తకాభరణం. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 667. క్రీ.శ. 1412.
సం. పంచవక్త్ర-. ఐదుముఖాలుకలవాడు, శివుడు.
<సం. పంచవక్త్ర- + కోహళి.

**పంచవట్టి** వి. అయిదుపట్టెలు. రుక్మాం.చ. 5.
సం. పంచన్. అయిదు.

**పంచవన్నియ** రూ. పంచవన్నె. మి.విణ. అయిదువర్ణాలుకల చిలుక. భీమ. 1.110.
సం. పంచన్. అయిదు.

**పంచవన్నె** రూ.చూ. పంచవన్నియ. మి.విణ. అయిదువర్ణాలు కలది. శివా. 2.26.
పంచవన్నెచిరుములు వి.బ.వ. బాణనంచు.

**పంచవారము** వి. ప్రభుత్వం విధించిన ఆరోవంతు ధాన్యాదిరూపకమగు పన్ను అయిదోవంతు వసూలు చేయటానికి సంబంధించిన ఒక సంఘం. E.I. సంపు. 5 శా.సం. 16.
సం. పంచవార-. అయిదోపర్యాయం.
<సం. పంచవార- (అర్థవిపరి.)

**పంచశారదికల** వి. ఆభరణ విశేషం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1227. క్రీ.శ. 1341.
సం. పంచన్. అయిదు.

**పంచహాణంవారు** వి.బ.వ. వడ్రంగి, కమ్మరి, కంచరి, కంసాలి, కాసె అనే అయిదుగురు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 200.
సం. పంచన్. అయిదు.

**పంచాంగం** వి. బాకులు.
సం. పంచాంగ-. తిథివారనక్షత్ర యోగకరణాలు అనే అయిదు అంగాలుకల.
<సం. పంచాంగ- + -ము (అర్థవిపరి.).
పంచాంగంఇనాం వి. బ్రాహ్మణులు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ॥వారు ఇచ్చిన భూమి. పంచాంగంమాన్యం వి. బ్రాహ్మణులు చేసిన సేవకు పారితోషికంగా జమీందారులు, నవాబులు మొ॥వారు ఇచ్చిన భూమి.

**పంచాణము** వి. 1. శిల్పకారజాతి, వడ్రంగి ; 2. కంసాలి ; 3. కమ్మరి ; 4. రాతిపనివాడు ; 5. కుమ్మరి (అని బ్రౌన్) ; 6. శిల్పం.
పంచాణమువాడు విణ. శిల్పి. ద్వి.పరమ.వి. 5.15.

**పంచాది**[1] చూ. పంచ[1].

**పంచాది**[2] వి. ఒకానొకచెట్టు. ద్వి.సార.చ. 2.79 పు. 21 పం.

**పంచాదులు** చూ. పంచహాణంవారు. వి. పంచహాణంవారు. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1179. క్రీ.శ. 1306.

**పంచాయతి** రూ. పంచాయితి, పంచాయితీ. వి. 1. అయిదుగురు సభ్యులుకల సభ ; 2. ఊరి పెద్దలు చేసే న్యాయ విచారణ.
హిం. పంచాయతీ. ఐదుగురు సభ్యులున్న సభకు సంబంధించిన.
<హిం. పంచాయతీ.

**పంచాయతీనామా** వి. శవపరీక్ష నివేదిక.
హిం. పంచాయతీనామా. శవపరీక్ష నివేదిక.
<హిం. పంచాయతీనామా.

**పంచాయతు** వి. సంఘం.
హిం. పంచాయత్. సంఘం, సమావేశం, మధ్యస్థం.
<హిం. పంచాయత్.

**పంచాయతువారు** వి. పంచాయతీచేసే వ్యక్తి.
హిం. పంచాయత్‌దార్. పంచాయతీ చేసేవాడు(రు).
<హిం. పంచాయత్‌దార్.

**పంచాయితగు** చూ. పంచాయితి.

**పంచాయితి** రూ.చూ. పంచాయతి. వి. ఐదుగురు సభ్యులున్న సభ.
పంచాయితగు అ.క్రి. 1. తెగనివిషయమగు ; 2. బాధాకరమైన విషయమగు. <పంచాయితి + అగు.

**పంచాయితీ** రూ.చూ. పంచాయతి. వి. 1. అయిదుగురు సభ్యులుకల సభ ; 2. ఊరి పెద్దలు చేసే న్యాయ విచారణ.

**పంచారతి** వి. ఆరాత్రికా విశేషం.
సం. పంచన్. అయిదు ; ప్రా. అరత్తియ-. ఆరతి.
<సం. పంచన్ + ఆరతి.

**పంచారము**[1] వి. 1. తరటు, కొరడా. అష్టమ.క. 5.223 పు. 188 పం. ; 2. ధనుస్సు, విల్లు. దశా. 17.206.
సం. పంచన్. అయిదు, అర-. వేగం.
<సం. పంచార- (అర్థవిపరి.).

**పంచారము**[2] విణ. 1. అధికం, అతిశయించినది. పాండు. 1.115 ; 2. విస్తృతి, అతిశయం.
సం. ప్రసార-, ప్రచార-. విస్తరించటం ; ప్రా.

పసార-; నే. పసార్; బెం. పసార్; ఒ. పసార; హిం. పసార-.

<ప్రా. పసార-.

పంచారించు రూ. పంచరించు. అ.క్రి. 1. అతిశయించు, అధికమగు, మిక్కుటమగు. కాశీ. 6.125: 2. విస్తరిల్లు, పెంపుమరించు. క్రీడా. 90; 3. సంచరించు, తిరుగు. వరాహ. 5.95; 4. సంసిద్ధమగు. వరాహ. 11.105.

పంచారి వి. వృక్షవిశేషం. పి.శకు. 2.14.

పంచారిము చూ. పంచారము².

పంచాళమనిషి చూ. పంచాళి. రూ.చూ. పంచాళీమనిషి. వి. అస్తవ్యస్తపు అల్లరిమనిషి.

పంచాళి విణ. వదురుబోతు, వాదాలుడు. శ్రీరం.మా. 3.485.

త. పంచాళి. వదురుబోతు.

<త. పంచాళి.

పంచాళీమనిషి చూ. పంచాళి. రూ. పంచాళమనిషి. వి. 1. కంగాళీమనిషి, మోసంచేసేవ్యక్తి; 2. అనుమానాస్పదమైనవ్యక్తి.

పంచి రూ.చూ. పంచె. వి. 1. అధరీయం; 2. ఊర్ధ్వవస్త్రం; 3. అంగవస్త్రం.

పంచిలజత రూ.చూ. పంచెలజత. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెల నేతబట్ట.

పంచిక¹ వి. ఆభరణ విశేషం. వేణు శ. 59.

సం. పంచిక-. అయిదు పొరుగులుకల.

<సం. పంచిక- (అర్థవిపరి.).

పంచిక² వి. ప్లాను (Blue print).

సం. పంచికా. ఐదుకల.

<సం. పంచికా.

పంచికొను చూ. పంచు².

పంచింగు వి. కాగితం మొ॥వాటికి చిల్లులు పొడవటం.

ఇం. *Punching*. కాగితం మొ॥వాటికి చిల్లులు పొడవటం.

<ఇం. Punching.

పంచితము వి. పశుమూత్రం. భార.విరా. 1.286.

సం. పంచత్. ఐదుతోకూడిన.

<సం. పంచత్.

పంచితిలు రూ. పంచితిల్లు. అ.క్రి. మూత్రం విడుచు. హరి.పూ. 8.165. పంచితిల్లు రూ.చూ. పంచితిలు. అ.క్రి. మూత్రం విడుచు. భాగ. 10 పూ. 519.

పంచితిలు చూ. పంచితము.

పంచితిల్లు చూ. పంచితము.

పంచిపాలిడు చూ. పంచు².

పంచియ రూ.చూ. పంచె. వి. 1. అధరీయం: 2. ఊర్ధ్వవస్త్రం, కండువా, తలగుడ్డ; 3. అంగవస్త్రం.

పంచివేత చూ. పంచు².

పంచివేయు చూ. పంచు².

పంచు¹ రూ. పణ్చు, పనుచు, పన్చు. స.క్రి. 1. ఆజ్ఞాపించు, నియోగించు. భార. ఆది. 1.31; ఇదికొన్ని తుమున్నంత ధాతువులకనుప్రయుక్తమై ప్రేరణార్థాన్నిస్తుంది. భార. ఆది. 2.188; 3. అరగచేయు, గమింపచేయు. భార. ఉద్యో. 1.229; 4. (శస్త్రమొ॥ వాటిని) ప్రయోగించు. ఉ. రా. 2.100.

తు. పణ్పిని. బోధించు, చెప్పు; త. పణి. ఆజ్ఞాపించు (పణి), ఆజ్ఞ. పణిప్పు, పణిక్కన్. ఉపాధ్యాయుడు; మ. పణిక్క. మాట్లాడు; కుఇ. పన్దొ. పంపు. (పన్డి-); కువి. పన్డ్. పంపించు. పన్త్. పంపు, పన్దలి, పన్టిన్రె. పంపు; కొలా. పన్క్-(న్క్-). పంపు; నా. పన్క్. పంపు; బ్రా. పానింగ్ (పా. పార్). చెప్పు, మాట్లాడు. పో. చూ. క. పనవు. కలును కోటానికి నిర్ణయించిన స్థలం.

మూ. ద. ద్రా., మూ. మ. ద్రా. *పణ్-/.

పంచు² స.క్రి. 1. విభాగించు, విభజించు. భార. విరా. 4.23; 2. పంచిఇచ్చు, విభజించిఇచ్చు. దశా. 2.354.

క. పంచు, పసు (పచ్చ్-), పాంచు. విభజించు, విడదీయు, పంచు; కొడ. పవ్విజ్. ఆటలో పంపకం (జట్లు); తు. పసలు. చేపలవాడి భాగం; గోం. పైజా. విడగొట్టబడు; కుఇ. పహ్ప (పహ్-). భాగంపంచు; పర్జి. పయ్ప్-(పయ్త్). భాగంపంచు; కొలా. పయ్. విభజించు, పైయ్. విభజించు, పోయు; నా. పయ్క్. అందరికీపంచు; గ. పయ్. భాగాలుగా విభజించు.

<మూ. ద్రా. *పచ్- *పయ్-.

పంచికొను రూ. పంచుకొను. స.క్రి. విభజించుకొను, విభజించిపుచ్చుకొను. భార. ఉద్యో. 3.63. పంచిపాలిడు స.క్రి. కోసిపాళ్ళువేయు. కవిక. 2.211. పంచివేత వి. 1. ఒక్కొక్కప్పుడు ఇంతింత ఇవ్వవలసిందని భాగాలు వేసుకోవటం, చందా; 2. ఒక్కొక్కరికి ఇయ్యవలసిందని విభజించటం. పంచివేయు స.క్రి. 1. విభాగించు, విభజించు; 2. పంచిఇచ్చు, విభాగించిఇచ్చు. పంచుకొను రూ.చూ. పంచికొను. స.క్రి. విభజించుకొను, విభజించిపుచ్చుకొను. విక్రి. 2.8.

పంచుడు వి. దుష్టుడు. దశకు. 7.70.

సం. పంచమ-. ఐదోకులానికి చెందినవాడు, హరిజనుడు.

<సం. పంచమ-.

పంచులు వి.బ.వ. పంచాయితీదారులు.

సం. పంచన్. ఐదు; హిం. పాంచ్.

పంచె రూ. పంచి², పంచి, పంచియ. వి. 1. అధరీయం. ఉ. రా. 1.99; 2. ఊర్ధ్వవస్త్రం, కండువా, తలగుడ్డ. హంస. 1.157; 3. అంగవస్త్రం, పడుచువాడు లేక పడుచుది కట్టుకునే చిన్నవస్త్రం; 4. పెళ్ళిచీర; 5. వితంతువులు కట్టుకోటానికి నేసిన ఒకరకం బట్ట.

త. పంచు. వస్త్రం, బట్ట, పత్తి; మ. పంచా. చిన్న ధోవతి, గుడ్డముక్క.

పంచెకమ్మిచీర వి. చిన్నకమ్మిపెట్టినచీర. పంచెలచాపు రూ. పంచెలసాపు, పంచెల్సాపు. వి. మగవాళ్ళుకట్టుకొనే రెండుపంచెల నేతబట్ట. పంచెలజత రూ. పంచిలజత. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండు పంచెలనేతబట్ట. పంచెలసాపు

రూ.చూ. పంచెలదావ. వి. మగవాళ్ళు కట్టుకొనేరెండు పంచెల నేతబట్ట. పంచెల్చాపు రూ.చూ. పంచెలదావ. వి. మగవాళ్ళు కట్టుకొనే రెండుపంచెల నేతబట్ట.

**పంచేటు** రూ చూ. పనిచేటు. వి. పాడు, పనినష్టం.

**పంచేరు** వి. 1. పీసె; రెండుపీసెలు.

**పంచోటికొలు** చూ. పంచు. వి. పొలంచేసేరైతు భూకామందుకు డబ్బుకాని పంటకాని ఇంతఇచ్చేట్టుఅని ముందుగా చేసుకొనే ఒప్పందం.

**పంచోతుకం** రూ.పంచోడి[2]. వి. నిర్మాణద్రవ్యంగా పనికివచ్చే కలపనిచ్చే అడవిచెట్టు.

**పంచోది[1]** చూ. పంచ[1].

**పంచోది[2]** రూ.చూ. పంచోతుకం. వి. నిర్మాణద్రవ్యంగా పనికి వచ్చే కలపనిచ్చే అడవిచెట్టు.

**పంచ్బేర విగ్రహాలు** వి. ధ్రువబేరం, కౌతుకబేరం, బలి బేరం, స్నపనబేరం, ఉత్సవబేరం అనే అయిదు విగ్రహాలు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 709. క్రీ.శ. 1558.

సం. పంచన్. అయిదు, విగ్రహ-. రూపం.

<పంచబేరము + సం. విగ్రహ- + ము + -లు.

**పంజ[1]** వి. తివాసీ నేసేటప్పుడు పడుగులో దూర్చిన ఉన్ని దారాల్ని దట్టించటానికి వాడే ఇనపపనిముట్టు.

ఉ. పంజా. ఐదువస్తువుల సమూహం.

**పంజకొట్టు** రూ. పందకొట్టు. స.క్రి. చేతిలో వరిగడ్డి కట్టలు పట్టుకొని బల్లమీదగాని, బండిచక్రంమీదగాని కొట్టి గింజలు రాల్చు. పంజగడ్డి రూ.చూ. పందగడ్డి. వి. పిడి కొట్టుడు కొట్టి గింజలు రాల్చిన గడ్డి.

**పంజ[2]** వి. రవిక; విణ. క్షుద్రమైన, నీచమైన.

**పంజగడ్డి** రూ.చూ. పందగడ్డి. వి. పిడికొట్టుడుకొట్టి గింజలు రాల్చినగడ్డి.

**పంజవ** చూ. పంజు[1].

**పంజర** రూ.చూ. పందిరి. వి. 1. పందిరి, నీడకోసం స్తంభాల మీద తడికలో ఆకులో పరిచి కట్టిన తాత్కాలిక నిర్మాణం; 2. వానపోత, ఇంటికి వాసాలు ఎత్తటం; 3. ఇంటికప్పు నేత మొదలుకాకముందు కూడాలపైఅడ్డకమ్మలు వేసి వాటి మీద ఆకులు పరిచిఉంచిన చట్రం.

**పంజరపువేత** చూ. పంజరము.

**పంజరము** రూ. పంజెర. వి. 1. గవసెన, గర్రసేన. ఆము. 6.107; 2. (పక్షులు మొ॥ వాటినిఉంచే) గూడు. అచ్చ. రా. అయోధ్యా. 90; 3. చెక్కకు రెండువైపులా బొంగులు బిగించి మోతకు పనికివచ్చేట్లు చేసిన సాధనం: 4. మగ్గంచట్టం.

సం. ప్రా. పా. పంజర-. పిట్టలగూడు;

త. పంచరమ్; ద్రా. పింజిర.

<ప్రా. పంజర-.

**పంజరపువేత** వి. బంతికట్టు, చుట్టింటికి చుట్టూ కట్టిన మండలకట్టు. **పంజరంపుచిలుక (-చిలుక)** వి. పంజరంలోని చిలుకవంటివాడు.

**పంజరముచేయు** రూ. పంజారముచేయు. స.క్రి. పంచు. తార. ఉద్యో. 3.166.

**పంజరంపుచిలుక** చూ. పంజరము.

**పంజళము** వి. తాయాల్లో ఒకటి, సంగీతస్థాయిల్లో ఒకటి. బసవ. 3.937పం. 2. గీతవిశేషం, గానవిశేషం. కాశీ. 6.265.

సం. పంచాలికా. సంగీతస్థాయిల్లో ఒకటి; ప్రా. పంచాలిఅ; బెం. పాంచాలీ. ఒకానొక ఛందస్సు;

క. పంజల. సంగీతస్థాయిల్లో ఒకటి.

<ప్రా. పంచాలిఅ.

**పంజళి** వి. నృత్యం. ద్వి. పరమ. వి. పు. 522.

సం. ప్రాంజలి-. నమస్కారం; ప్రా. పంజలి. హస్తన్యాసవిశేషం.

<ప్రా. పంజలి.

**పంజళ్లుద్రొక్కు (-త్రొక్కు)** అ. క్రి. నృత్యంచేయు. నాట్యంచేయు. ద్వి. పరమ. వి. 5.422.

**పంజళ్లుద్రొక్కు** చూ. పంజళి.

**పంజా** రూ.చూ. పంజాయా. వి. 1. పిడికిలి పంజా; 2. అయిదు వేళ్ళలాగా ఉండేదీపయష్టి; 3. గులకరాళ్ళు మొదలైనవి లాగి కుప్పచేయటానికి పనికివచ్చేసాధనం; 4. పళ్ళు బిగించిన అద్దుకర్ర: 5. పట్టుకోటానికి పొడుగాటికర్రఉన్న పనిముట్టు; 6. తివాసీ నేసేటప్పుడు పడుగులో దూర్చిన ఉన్నిదారాల్ని దట్టించటానికి వాడే ఇనప పనిముట్టు.

**పంజాయా** రూ. పంజా, పంజావ. వి. దీపవిశేషం, అయిదు వేళ్ళలాగా ఉండే దీపయష్టి, ఒకరకం దివిటీ. హంస. 3.28.

హిం. పంజా. అయిదు వస్తువుల సమూహం; ఉ. పంజా. అయిదువస్తువుల సమూహం, సహాయత; పార. పన్జా. అయిదువేళ్ళలాగా ఉండేదీపం, పంజహ్. అధికారం, వశం, సహాయత.

<ఉ. పంజా.

**పంజారముచేయు** రూ.చూ. పంజరముచేయు; స.క్రి. పంచు.

**పంజావు** రూ.చూ. పంజాయా. వి. అయిదువేళ్ళలాగా ఉండే దీపయష్టి.

**పంజి** వి. కష్టం, పన్ను. ఆం. రా. 2.192.

త. పంచి. కష్టం.

**పంజియ[1]** రూ.చూ. పంజె[1]. విణ. 1. నీచమైన; 2. పిరికితనం గల, భీరువైన; 3. విరర్థకమైన, డబ్బులేని.

**పంజియ[2]** రూ.చూ. పంజె[2]. వి. దారంగి, వృక్షవిశేషం.

**పంజు[1]** రూ. పముజు, పొంజు[2]. వి. 1. గుర్రగొడుక్కి ఊచలతో కూర్చినకూర్పు. హరి. పూ. 7.178; 2 ఒకవిధమైన బాణ సంచు. కాశీ. 4.294; 3. కరదీపం, కాగడా, దివిటీ. వేంక. పంచ. 4.345; 4. గడ్డి మొ॥ వానిగంట, దుబ్బు, స్తంభం. రామాభ్యు. 5.41; 5. రత్నం; 6. ఒకవిధ మైన కర్ణ భూషణం; విణ. ప్రకాశించుల. హర. 7.187.

హిం. పంజియు. కరదీపిక; ఉ. పంజ్. అయిదు; పార. పన్జ్, పంజ. అయిదు, అయిదు వేళ్ళలా ఉండే కాగడా;

క. పంజు, పొంజు; తు. పంజు. కరదీపిక; త. పంచ్. దూది, వత్తి మొదలైనవి.

<ఉ. పంజ్.

**పంజవ** వి. నిగరమైనది. **పంజుకమ్మ** వి. రత్నాలు పొది

గిన కమ్మ, రత్న తాటంకం, కర్ణభూషా విశేషం. ఉ.రా. 3.81. పంజుమంచము వి. రత్నమంచిక, రత్నాలు పొదిగిన మంచిక. హర. 2.132. పంజులకమ్మ వి. రత్నాలు పొదిగిన కమ్మ, రత్న తాటంకం, కర్ణభూషావిశేషం. ప్రబంధ. 15, ఉ.రా. 3.81. పంజులవా(డు విణ. కాగడా వేసేవాడు. హరిశ్చ. 5.101. పంజుసేవ వి. దివిటీలతోచేసే నాట్యం.

పంజు[2] అ.క్రి. 1. కురుపువల్ల నరాలు నొప్పిచేయు ; 2. వ్రణం మొ. నవి నొప్పిపెడుతూలాగు.

పంజు[3] రూ.చూ. పంగు[3]. వి. చెరువుగాని, కాలువగాని ఒక మనిషి రోజుకు తవ్వగలిగిన భాగం

పంజుగొడ్డు వి. బెంజిగొడ్డు, గొడ్డుబోతు.

పంజె[1] రూ. పంజియ[1]. విణ. 1. నిరర్థకం. ధనహీనం. ప్రబంధ. 747 ; 2. నీచం. అహల్యా. 1.82 ; 3. పిరికివాడు, భీరువు. వేఱ.శ. 85.

క. పంజె ; తు. పంజి. త. పంచమ్, పంచై ; మ. పంచమ్, పఞ్చమ్.

<క. పంజె.

పంజె[2] రూ. పంజియ[2]. వి. దారంగి, వృక్షవిశేషం.

పంజెర రూ.చూ. పంజరము. వి. 1. దాలీకైన బిగించిన ఇనపఊచల చట్రం ; 2. మగ్గం చట్టం.

పటం రూ. పొటం. వి. పాత్ర అంచుకు కిందిభాగంలో వెడల్పుగా ఉండే గుండ్రటి మధ్యభాగం.

సం. పట-. బట్ట, ఆవరించేది.

పటంగర్ర వి. మడికిమడికి మధ్య అడ్డుగావేసిన మట్టికట్ట. పటంపట్టు రూ.చూ. పుటంపట్టు. స.క్రి. సారెమీదవాట తయారవుతున్నప్పుడు వాటలోపల ఒకచేయి, బయట ఒక చేయిపెట్టి మధ్యభాగం లావుగా వచ్చేటట్లు చేయు.

పటకర రూ.చూ. పట్టుకాఱు. వి. పన్నెఈసెలుతీసే పనిముట్టు, పట్టుకారు.

పటకా రూ.చూ. పట్కా. వి. నడుంచుట్టు గట్టిగా కట్టుకునే గుడ్డ.

పటకారు రూ.చూ. పట్టుకాఱు. వి. నిప్పులో కాల్చిన లోహాన్ని ఎత్తే ఇనప పనిముట్టు. హంస. 2.182.

పటంగి వి. పొగరుబోతు.

పటంజు రూ.చూ. పట్టంజు. వి. నాగటిమోకు మొదటికొన మెలితిప్పి వేసిన ముడి.

పటపట వి. 1. పగలటంలోనూ బద్దలవటంలోనూ అయ్యేధ్వనికి అనుకరణం. పండి.చ. 3.201 ప. ; 2. పళ్ళుకొరకటంలోని ధ్వనికి అనుకరణం. వరాహ. 5.114 ; 3. ముళ్ళు మొదలైనవి గాలి మొదలైనవాటిచే కదలటంలో ధ్వనికి అనుకరణం. మను. 4.54 ; 4. కదలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పారి. 3.32 ; 5. కాలటంలోనూ వేగటంలోనూ ధ్వనికి అనుకరణం. సానంద. 5.91 ప. ; 6. చినుకులు, వడగళ్ళు మొ.నవి పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కుక. 2.340.

క. పడ, పడపడ. పెళపెళ ధ్వని అనుకరణం, పట, పటపట, పటారనె, పట్టనె. దెబ్బలు తగిలేటప్పుడు శరీరవు కదలికలో కుక్కనుంచి వచ్చే ధ్వని, రెక్కలు ఆడించటం, వేలాడగట్టిన గుడ్డలు గాలికి కదలటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం, పటిర్, పట్లిల్-. కొట్టటం, బాదటంలో అయ్యే ధ్వని ; తు. పడపడ, పట పటనె. దబదబలేక గలగల శబ్దం ; త. పటపట (-ప్ప్-, -త్త్-). దబదబ లేక గలగల ధ్వని. పట-పట్-ఎనల్. గడగడధ్వని, బద్దలవటం, పటార్-ఎనల్, పటార్-పటార్-ఎనల్. పగిలేధ్వని, కూలటంలో అయ్యేధ్వని, పటిర్-ఎనల్. పెళపెళధ్వని ; మ. పటపట. గలగల శబ్దం ; కో. పటిన్-(ఇన్-). పెళపెళశబ్దం, పట.ర్న్. (కత్తి, కఱ్ఱ మొ.) విరిగేటప్పటి ధ్వని ; కుఱు. పట్ పట్. వస్తువులు పడేటప్పుడు అయ్యేధ్వని. పట్ ప్(రునా, పట్ ప్(ట్ నా. ఆగకుండా అయ్యే పెళపెళధ్వని.

పటపటకొఱుకు స.క్రి. ఒకవిధమైన ధ్వనితో కొరుకు. పటపటపట వి. పగలటంలో అయ్యేధ్వనికి అనుకరణం. చంద్రాంగ. 1.152. పటపటపళ్లకొరుకు అ.క్రి. ధ్వని కలిగేటట్లు పళ్ళుకొరుకు. పటపటలాడించు స.క్రి. పటపట అనే ధ్వని కలిగేటట్లు నమలు. <పటపట+-లు+ఆడించు.

పటము[1] వి. 1. పాముపడగ ; 2. ఒకానొక ఆటవస్తువు.

క. పటుప ; త. పటం ;

సం. స్ఫటా. పాముపడగ.

పటము[2] వి. చిత్తరువు. బొమ్మ.

సం. పట-. బట్ట.

<సం. పట- (అర్థవిపరి.).

పటము[3] వి. ఆవరించేది. ద.హిం.శా. సంపు.10. శా.సం. 256. క్రీ.శ. 1211.

పటలము వి. మల్లవిద్యా విశేషాలైన దండల్లో ఒకటి. మల్లుపు. 369.

సం. పటల-. సమూహం.

<సం. పటల- (అర్థవిపరి.).

పటవ రూ. పట్వ. వి. నీళ్ళు తేవటానికి వాడే పక్కలేని మట్టి పాత్ర.

పటవరాయి రూ. పట్వరాయి. వి. కడవలు మొదలగు వాటిని నర్సటానికి ఉపయోగించేరాయి. పటవరౌతు రూ. పట్వరౌతు. వి. కడవలు మొదలగువాటిని నర్సటానికి ఉపయోగించే రాయి.

పటవణి వి. విజృంభణం. ఉ.హరి. 3.27.

పటవణించు అ.క్రి. విజృంభించు, వ్యాపించు. కవిక. 2.159. <పటవణి+-ఇంచు[3].

పటా రూ.చూ. పట్టా. వి. 1. ఆయుధవిశేషం, పట్టాకత్తి. రసిక. 1.75 ; 2. ఇనుము మొదలైన లోహాలతోచేసిన బద్దె ; 3. గోనెపట్టా మొదలగునవి.

పటాకా రూ.చూ. పటాకి[1]. వి. టపాకాయ.

పటాకి[1] రూ. పటాకా. వి. 1. పటాసు, మందుగుండు సామాను ; 2. టపాకాయ.

క. పటాకి, పటాకి. మందుగుండు సామాను ;

హిం. పటాకా, పటాఖా. పటపటధ్వని, ఒకరకం దాణాసంచు ; మరా. ఫటాకడా, ఫటాకడీ, పటాకా.

మందుగుండు సామాను.

**పటాకి**[2] వి. గాలిపడగ.

**పటాణము** వి. ధాన్యవిశేషం. హంస. 4.127.

నే. పఠాన్. ఒక ముస్లింజాతి; బెం. పాఠాన్; ఒ. పఠాణ; హిం. పఠాన్; పం. పఠాణ్; సిం. పఠాణు; గు. పఠాణ్.

**పటాణి** రూ.చూ. పటాని. వి. యవనదేశపుగుర్రం. వాహనం. శుక. 1.254.

**పటాణీ** రూ.చూ. పటాని. వి. యవనుడు. రాజవా. 5.13.

**పటానమహాదేవి** వి. పట్టపుదేవి, రాణి. ద.హిం.గా. సంపు. 4. గా.సం. 1194. క్రీ.శ. 1128.

**పటాని** రూ. పటాణి, పటాణీ, పటానీ, పఠాణి, పఠాణీ, పఠాని. వి. 1. కచ్ఛిదేశపు గుర్రం. రాజవా. 2.46; 2. పఠాన్ దేశీయుడు. చంద్రరే. 5.127; 3. యవనభేదం, విణ. 1. పఠాన్ వంశానికి చెందిన; 2. పఠాన్‌దేశ సంబంధమైన.

హిం. పఠానీ, పఠానుస్త్రీ, పఠాన్‌దేశీయుడు, ప్రాంతత్వం; ఉ. పఠానీ. పఠానుదేశ సంబంధమైన; మరా. పఠాణ, మహమ్మదీయులలో ఒకజాతి;

క. పటాణి; త. పట్టాణి.

<ఉ. పఠానీ.

**పటానీ** రూ.చూ. పటాని. వి. 1. పఠాన్ వంశానికి చెందిన; 2. పఠాన్ దేశ సంబంధమైన.

**పటాను** వి. మహమ్మదీయుల్లో ఒక జాతి పేరు.

హిం.ఉ. పఠాన్, ఆఫ్ఘనిస్థాన్ యొక్క పర్వత ప్రదేశాల్లో జీవించే మనుషులు.

<ఉ. పఠాన్.

**పటాపంచ** రూ. పటాపంచము. వి. 1. అగోచరం. పాండు. 2.8; 2. చెల్లాచెదరు; విణ. చినిగిన, చినిసిన. దశా. 7.315.

**పటాపంచలు** వి.బ.వ. 1. మిక్కిలి చెదరు, చెల్లాచెదరు. పారి. 5.37; 2. అగోచరం, నశించేది; 3. చినిగిన, చినిసిన, తెగిన. క. పటాపంచ; త. పటాపంచణమ్, **పటాపంచసేయు(-చేయు)** స.క్రి. చిన్నాభిన్నంచేయు.

**పటాపంచము** రూ.చూ. పటాపంచ. వి. అగోచరం. విజయ. 2.65.

**పటాపటిచీర** చూ. పటాపటీ. చూ. పటాపటీచీర. వి. 1. పేకకు ఒకరంగు, పడుగుకు మరొకరంగు పెట్టి నేసిన ఒకరకం గళ్ళచీర; 2. సాలారి మూడిరి నేతలో రెండు గీరల మధ్య ఎడం ఎక్కువగా పెట్టి నేసిన చీర.

**పటాపటీ** వి. కపిల, కిర్మీరరంగులు వచ్చేట్టు పట్టు, నూలు కలిపి నేసిన పెద్ద గళ్ళ చీర.

హిం. పటాపటీ. రంగురంగుల వస్తువు;

క. పటా. చార, పటాపటి. చారలు గలిగిన.

<హిం. పటాపటీ.

**పటాపటీచీర** రూ.చూ. పటాపటిచీర. వి. 1. పేకకు ఒకరంగు, పడుగుకు మరొకరంగు పెట్టి నేసిన ఒకరకం గళ్ళచీర; 2. సాలారిమూడిరి నేతలో, రెండుగీరల మధ్య ఎడం ఎక్కువగా పెట్టి నేసిన చీర.

**పటాప్** వి. టపాకాయ.

హిం. పటాక్. టపాకాయ; ఉ. పటాకా, పటాఖా; త. పటాకా.

<హిం. పటాక్.

**పటారము** రూ.చూ. బటారము. వి. ఆడంబరం.

**పటారాకొమ్ము** వి. వెలుపలికి వంగిన కొమ్ము.

**పటాలము** రూ. పటాళము, పఠాళము. వి. దండు, సేన, సిపాయీలదళం.

సం. పటల-. సమూహం, గుంపు; మరా. పట్లాళ; ఇం. *Battalion*;

క. పటాలం. సేన; త. పట్టాళం.

<మరా. పట్టాళం.

**పటాలు** వి. 1. కొట్టడంలో అయ్యేధ్వనికి అనుకరణం. అచ్చ. రా.యు. 864; 2. నడవటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**పటాలుపటాలు** వి. కొట్టడంలో అయ్యేధ్వనికి అనుకరణం. పటాల్న అవ్య. ఎదుట.

**పటాల్న** చూ. పటాలు.

**పటాళము** రూ.చూ. పటాలము. వి. సిపాయీలదళం.

**పటాసు** చూ. పటాకి. వి. మణిసిలతో చేరి ప్రమాదాన్ని కలగచేసే ఒకానొక మందు.

క. పటాకి, పటాసు. మందుగుండు సామాను.

**పటాస్‌కమ్మి** వి. దాతి స్తంభపు గడ్డె అడుగు భాగం.

**పటిక**[1] రూ.చూ. పటికము. వి. ఒగరుగా కఠినంగా తెల్లగా ఉండే ఒక పదార్థం. ద్వి. పరమ. వి. 2; హంస. 2.227.

**పటికబెల్లము** వి. పటికలా తెల్లగా ఉండే బెల్లం, కండ చక్కెర. **పటికారము** వి. పటికలా తెల్లగాఉండే పదార్థం. వెలిగారం. < (పటిక + కారము). క. పటికారవు. వెలిగారం.

**పటిక**[2] వి. భూపరిమాణ విశేషం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 408. క్రీ.శ. 1366.

**పటికము** రూ. పటిక, పటికి. వి. 1. స్ఫటికం. కు.సం. 6.47; 2. మణి విశేషం, ఒకరకం తెల్లరాయి. శృం.నై. 8.16.

సం. స్ఫటిక-. స్ఫటికం; ప్రా. ఫడిగ-, పడిఅ, ఫలిహ. స్ఫటికమణి, పాలిఅ, ఫాలిగ, ఫాలిహ. రత్న విశేషం; గా. పటిహ, ఫడిహ, పలిహ; అ.మా. జై.మహా. ఫలిహ; పా. ఫలిక;

క. పటికవు, పటిక, పళిక, పళికు, పళుకు. తు. పటికార; త. పటిక్కారమ్, పళుకు; మ. పటిక్కారం, పళుకు; కువి. పటిక్క.

<ప్రా. ఫడిగ-.

**పటికారము** చూ. పటిక[1].

**పటికి** రూ.చూ. పటికము. వి. పటిక, ఒకానొక లవణం. హంస. 2.227.

**పటికినీ** రూ.చూ. పటికి. వి. అంచువేసిన పొడవైన గుడ్డ ముక్క.

**పటికరించు** చూ. పటికి. అ.క్రి. పలపట్టు.

**పటికరింత** వి. చలం, పట్టుదల. గౌ.హరి.ఉ.

484 పం.

**పటికరింత** చూ. పటికరించు.

**పటికే** రూ. పటికసి. వి. అంచువేసిన పొడవైన గుడ్డముక్క.
హిం. పటీ. బట్ట, పట్‌కా. గుడ్డ, వస్త్రం.
<హిం. పట్‌కా.

**పటితకించు** రూ. పటితాకించు. స.క్రి. 1. (చేయిపట్టుకొని) ఆపు. ఉ.హరి. 3.122; 2. చరచు, కొట్టు. ఉ.హరి. 6.85.
క. పడితలిసు. కృపచేయు, గ్రహించు;
మరా. పడదర(ణే). వ్యాపించు.

**పటితాకించు** రూ.చూ. పటితకించు. అ.క్రి. చప్పట్లుకొట్టు. క్రీడా.వ. 24.

**పటిల్లు** రూ.చూ. పటీలు. వి. బద్దలవటంలో అయ్యేధ్వని అనుకరణం. ఉ.రా. 2.168.

**పటీలు** రూ. పటిల్లు. వి. పగలటంలో అయ్యేధ్వని అనుకరణం. ధ్వన్యను. సమీర. 2.221.

**పటు**[1] రూ.చూ. పట్టు[3]. వి. ఒకజాతి పురుగులవల్ల వచ్చే దారం. బసవ. 890 వ.

**పటు**[2] రూ.చూ. పట్టు[2]. వి. స్థలం. E.I. 27. క్రీ.శ. 600–700.

**పటుకారు** రూ.చూ. పట్టుకారు. వి. సందంశం, పట్కారు. అప్ప. 2.196.

**పటుకాలు** రూ.చూ. పట్టుకాలు. వి. నిప్పులో కాచిన లోహాన్ని ఎత్తే ఒక ఇనప కొరముట్టు, సందంశం.

**పటుకు** రూ. పటుక్కు. వి. 1. పాత్రాదుల్ని భూమిమీద పడవేయటం, కొట్టటం మొదలైన వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. భీమ. 2.103; 2. తెగటంలో అయ్యేధ్వనికి అనుకరణం. శుక. 2.328; 3. (గుండె) అదరటంలో అయ్యేధ్వనికి అనుకరణం; 4. అభ్యంతరం, ఆక్షేపణ. ధ్వన్యను.

**పటుక్కు** రూ.చూ. పటుకు. వి. 1. పాత్రాదుల్ని భూమిమీద పడేయటం, కొట్టటం మొదలైన వాటి యందయ్యే ధ్వనికి అనుకరణం. శుక. 3.218; 2. తెగటంలో అయ్యేధ్వనికి అనుకరణం. కృ.శత. 1.80; 3. (గుండె) అదరటంలో అయ్యేధ్వనికి అనుకరణం.
పటుక్కున అవ్య.క్రి. 1. మొగమాటంలేకుండా; 2. తటాలున. పటుక్కుపటుక్కు వి. (గుండె) అదరటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

**పటుతరం** వి. ఇంటిదర్వాజా ముందుకట్టిన కట్టడం.
సం. పటుతర-. మిక్కిలి బలమైన.
<సం. పటుతర- (అర్థవిపరి.).

**పటుతాకించు** చూ. పటితకించు. స.క్రి. ఇటునటు బెళుకుగ చూచు. క్రీడా. 75, ఆం.రా. 3.138.

**పటువ** వి. 1. పాలు, పెరుగు పోయటానికి తగిన పాత్ర. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 966. క్రీ.శ. 1421; 2. భిక్షాపాత్ర. కాశీ. 6.122; 3. మద్యరకం కుండ.
తు. పటవ్ర.

**పటువలి** రూ. పట్టువలి. వి. పట్టుతో నేసిన సన్నని వస్త్రం. బసవ. 4.890 వం.
పటువలిపట్టము వి. పట్టుతో నేసిన సన్నని వట్టం. బసవ. 3.346 వం.

**పటుసాలియ** రూ.చూ. పటుసాలె. వి. తంతువాయభేదం, పట్టులో బట్టలునేసే ఒక జాతివాడు.

**పటుసాలె** రూ. పటుసాలియ, పట్టుసాలియ, పట్టుసాలె. వి. తంతువాయభేదం, పట్టుతో వస్త్రాలు నేసే ఒక జాతివాడు. ఆము. 4.35.

**పటుసొవ** రూ.చూ. పట్టుసోగ. వి. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడి చివర అమర్చిన అడ్డపల్ల.

**పటుసోగ** రూ.చూ. పట్టుసోగ. వి. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడి చివర అమర్చిన అడ్డపల్ల.

**పటెమంచము** రూ.చూ. పట్టెమంచము. వి. పట్టె నేసిన మంచం. ఆం.రా. 2.164.

**పటేల్‌ఇనాం** చూ. పటేలు.

**పటేలు** రూ. పట్టెలు. వి. 1. గ్రామాధికారి, తెలంగాణా శాసనం సం. 1. క్రీ.శ. 1545; 2. పేలటంలో అయ్యేధ్వని అనుకరణం; 3. ఒకానొక జాతివారి బిరుదు.
సం. పట్టపాల- రాజ్యాధికారి; ప్రా. పట్టవాల; హిం.గు. పటేల్; సిం. పటేలు; మరా. పాటీల, పటేల్, పాటిల్.
<మరా. పటేల్.
పటేల్‌ఇనాం వి. తమకుచేసిన సేవకుగాను జమీందారులు గ్రామ మున్సబుకు ఇచ్చిన బహుమానం.

**పటొంజు** రూ.చూ. పట్టంజు. వి. నాగటి మోకు మొదటి కొస మెలితిప్పి వేసిన ముడి.

**పట్కి** రూ.చూ. పట్కా. వి. పొడుగు ఎక్కువ, వెడల్పు తక్కువ పెట్టి నేసిన తలకు చుట్టుకొనే బట్ట.

**పట్కరిపంటి** చూ. పట్టు[3].

**పట్కరివాండ్లు** చూ. పట్టు[3].

**పట్కా** రూ. పటకా, పట్క. వి. 1. ఒకరకం తలపాగా; 2. నడుం చుట్టూ గట్టిగా కట్టుకొనే గుడ్డ.
సం. పట్టక-. చిన్నగుడ్డ; నే. పటుకా. తలగుడ్డ; హిం. పటుకా; పం. పటుకా; సిం. పటకో; మరా. పటుకా. తలపాగ.
<మరా. పటకా.

**పట్కారి** చూ. పట్టు[3].

**పట్కారు** చూ. పట్టు[1].

**పట్గంబం** చూ. పట్టు[1].

**పట్గామ** చూ. పట్టు[1].

**పట్ట** రూ.చూ. పట్టము[2]. వి. 1. దూలం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 926. క్రీ.శ. 1514; 2. పట్టెడ, నవారు. ఉ.రా. 6.160; 3. చెట్టు మొ॥వాటి చర్మం, తొక్క, నార. ఉ.హరిశ్చ. 3.59; 4. గోగు మొ॥వాటి నారతో నేసిన గుడ్డ మొ॥నవి; 5. దర్వాజా మొ॥వాటికి కదలకుండా ఉండటానికి బిగించే ఇనుము మొ॥వాటి బద్దె; 6. నేత నేసేటప్పుడు దోనెమీద పరిచే కేన్వాసుగుడ్డ.
పట్టకంటం వి. అంబలి దాకలు మొ॥వాటికి వెడల్పుగా

బద్దలాగ సాఫీగా పెట్టే ఒక అంచు. పట్టదిండు వి. నరిచేసే టప్పుడు మట్టిపాత్రలకు కింద ఒత్తుగా వాడే మడతపెట్టిన గోతాం. పట్టసారాయి వి. చెట్టు చర్మంనుంచి తీసే సారాయి. మద్యవిశేషం. క. పట్టసారాయి. ఒకరకం సారా ; త. పట్టైచ్చారాయం.

పట్టకారు(డు చూ. పట్టు[3].

పట్టంచాపు చూ. పట్టు[3].

పట్టంచుచాపు చూ. పట్టు[3].

పట్టంచుచీర చూ. పట్టు[3].

పట్టంచుపంచె చూ. పట్టు[3].

పట్టంజు చూ. పట్టు[1]. రూ. పటంజు, పటాంజు. వి. నాగటి మోకు మొదటి కొన మెలితిప్పి వేసిన ముడి.

పట్టడ రూ.చూ. పట్టెడ[1]. వి. కుమ్మరి వడ్రంగి మొదలైన శిల్పులు పనులుచేసే చోటు, ఆవేశనం.

క. పట్టడె, పట్టడి-, కంసాలివాని దాగలి ; త. పట్టరై, పట్టఱై. కంసాలివాని దాగలి, కంసాలి పనిచేసే చోటు.

పట్టతీగ వి. ఆకుపచ్చరంగు కలిసిన తెల్లనిపూలు పూసే పాకే పెద్ద పొద (Capparis ineferoclifa).

పట్టతీగె వి. ఆకుపచ్చతో కూడిన పసుపురంగు పూలు పూసే తీగ (Maerua arenaria).

పట్టణసామి వి. పట్టణ వ్యాపారులకు నాయకుడు. E.C. X. చింతామణి 95. క్రీ.శ. 1361.

పట్టనబు వి. నగరం. ఆహదనకర శాసనం. క్రీ.శ. 847.

సం. పట్టణ-, పత్తన-. పెద్దఊరు ; ప్రా. పట్టణ-. <ప్రా. పట్టణ-.

పట్టనావురు చూ. పట్టనబు. వి. బ. వ. పట్నంలోనివారు. ఆహదనకర శాసనం. క్రీ.శ. 847.

పట్టపెత్తి వి. బట్టతల.

పట్టపగటిటపాకాయ చూ. పట్టపగలు.

పట్టపగలు రూ. పట్టపవలు. వి. మిట్టమధ్యాహ్నం. భార.సభా. 2.300.

త. పట్టప్పకల్. మిట్టమధ్యాహ్నం ; మ. పట్టాపకల్. మిట్టమధ్యాహ్నం ; కో. పటురిన్. పూర్తికాంతి గల ఉదయం.

పట్టపగటిటపాకాయ వి. వ్యభిచారి.

పట్టపగ్గాలులేకుండు చూ. పట్టు[1].

పట్టపరమర వి. ఆభరణ విశేషం. నె.శా. కనిగిరి. 16. క్రీ.శ. 1657.

పట్టపయ్య చూ. పట్టము[1].

పట్టపవలు రూ.చూ. పట్టపగలు. వి. మధ్యాహ్నం. భార. ద్రోణ 4.231.

పట్టపుటేను(గు చూ. పట్టము[1].

పట్టపుదంతి చూ. పట్టము[1].

పట్టపుదేవి చూ. పట్టము[1].

పట్టపువెలవు చూ. పట్టము[1].

పట్టపురాణి చూ. పట్టము[1].

పట్టపువా(డు విశే. 1. జాలివాడు, పలరేడు, చేపలుపట్టేవాడు ; 2. సముద్రతీరంలో ఉండే అరవబెస్తవాడు.

పట్టపేను(గు చూ. పట్టము[1].

పట్టమార్పుది వి. పందెపుకోడిపుంజు.

పట్టము[1] వి. 1. ఆధిపత్యం, అధికారం. ముదివేడు శాసనం. క్రీ.శ. 825. భార.ఉద్యో. 4.113 ; 2. పట్టాభిషేకం. E.I. 19. 47. క్రీ.శ. 848 ; 3. (గ్రహం మొ॥ వాటికికట్టే) కట్టు. భార.ఆది. 5.12 ; 4. రాజ్యం. కు.సం. 10.199 ; 5. పట్టమహాదేవి. HAS. 19.27 ; 6. బిరుదు.

సం. పట్ట-. సింహాసనం, పీఠం, రాజు రైతుకిచ్చే పట్టా, రాజ్యాభిషేక సమయంలో రాజుకు నుదుట కట్టే పట్టి, పాగా ; హిం. పట్టా. అధికారపత్రం ; మరా. పట్టా, పటా. కాగితం, పత్రం, కత్తి ;

క. పట్టె. బెరడు లేక చెట్టుపట్ట ; త. పట్టై ; మ. పట్ట. బెరడు లేక చెట్టుపట్ట.

<సం. పట్ట- (అర్థవిపరి.).

పట్టపయ్య వి. రాజు, అధికారి. <పట్టము[1]+అయ్య. పట్టపుటేను(గు (-ఏనుగు) రూ. పట్టపేను(గు వి. భద్రగజం. రం.రా.అయోధ్యా. 142 పు. 27 పం. పట్టపుదంతి వి. భద్రగజం, పట్టపుటేనుగు. దశా. 3.306. పట్టపుదేవి వి. మహిషి, కృతాభిషేక అయిన రాజపత్ని. కాశీ. 5.336. పట్టపువెలవు వి. రాజ్యం. ద.హిం.శా.సంపు. 6, శా.సం. 1187. క్రీ.శ. 1178. పట్టపురాణి వి. మహిషి, కృతాభిషేక అయిన రాజపత్ని. శృం.నై. 7.57. పట్టపేను(గు (-ఏను(గు) రూ.చూ. పట్టపుటేను(గు. భద్రగజం. కళా. 8.30. పట్టము గట్టు (-కట్టు) స.క్రి. రాజుగాచేయు, అధికారిగాచేయు. భార.ఉద్యో. 4.159.

పట్టము[2] రూ.చూ. పట్ట. వి. చెట్టు బెరడు.

పట్టవర్ధనము రూ.చూ. పట్టివర్ధనము. వి.బ.వ. నామాలు. శాశ్వ.సం. 7.36.

పట్టశక్యంలేకుండు చూ. పట్టు[1].

పట్టశాల వి. గుడి, ఆలయం. HAS. 73.56.

సం. పట్ట-. పట్టుబట్ట, నన్నెకల్లు, శిలాపట్టం, సింహాసనం. శాలా. ఇల్లు ;

క. పట్టశాలె. చదువుకొనే పెద్దగది, పట్టుబట్టల దుకాణం.

<సం. పట్టశాలా (అర్థవిపరి.).

పట్టసార వి. ఒకరకం కంచెమొక్క.

పట్టా చూ. పట్టము[1] రూ. పటా, పట్టా. వి. 1. రెండువైపులా వాదరగల పెద్దకత్తి. మల్లుప. 2.48 ; 2. రాజురైతులకిచ్చే కవులు ; 3. పరీక్షాదుల్లో ఉత్తీర్ణులైనట్లు తెలిపే యోగ్యతాపత్రం ; 4. పటకా ; 5. భూమినిరైతు ఆధీనంచేస్తూ ప్రభుత్వంవారిచే చీటి ; 6. రైలుబద్దీ ; 7. బండిచక్రం చుట్టూ బిగించిన ఇనపకట్టు ; 8. గోగు మొ॥ వాటినారతో నేసిన గుడ్డలు ; 9. చెట్టుపట్ట ; 10. ఎన్నికమ్మి, కత్తెర మూలల్లో అతికిన రేకుపలక ; 11. బండు. తలుపురెక్కలు పిడసలమీద తిరిగేటట్లు చేసే ఇనపబద్దె ; 12. పెంకు పేర్పులోని వరస ; 13. బేలుకట్టు, మున్నబ్బట్టీ పగలకుండా చుట్టూవేసిన ఇనపకట్టు ; 14. నేతనేసేటప్పుడు

గోనెమీద పరిచే కిన్నాసుగుడ్డ; **15.** రంగు తొట్టిలో పింజెరమీద కప్పిన గోనెగుడ్డ; **16.** ఒకజాతిపందెం కోడి; **17.** అంటు బతికి చిగిర్చిన మొక్క.

సం. పట్ట-. సింహాసనం, పీఠం, పీట, భూమ్యాదికర గ్రహణ లేఖ్యపత్రం, రాజ్యాభిషేక కాలంలో నొసటకట్టే పట్టె, పట్టుసూలు. కౌశేయం, పట్టుబట్ట, ఉత్తరీయం, వైర వాసం. తలపాగా, పాగా, చెట్టుమీది పట్ట, ఆపట్టలా ఉండే వస్తువు, ఫలకం, డాలు, పేషణపాషాణం, నన్నికల్లు. (వ్రణం మొ॥ వాటికి కట్టే) కట్టు, పట్టణం, నగరం, చతుష్పథం, చమకం, నాలుగుదారులు కలిసేచోటు, నేత్రం, కన్ను; హిం. ఉ. పట్టా. భూమినిరైతు ఆధీనం చేస్తూ ప్రభుత్వం వారిచ్చే పత్రం, సనదు, పటకా, కత్తి; సిం. పట్టా, పట్టు; మరా. పటా. పట్టా;

క. పట్టె.

<ఉ. పట్టా.

**పట్టాకత్తి** వి. రెండువక్కలా వాదర కల కత్తి. **పట్టా కొంగు** వి. రైలు పట్టాలమాదిరిగా గీరలు పడేట్లునేసిన చీరకొంగు. **పట్టాచేయు** స.క్రి. ఆస్తిని తనపేరమార్పించు. **పట్టాపిడక** వి. ఇనపబద్దీని వంచిచేసిన పిడక. **పట్టాబందు** వి. బందు, తలుపురెక్కలు పిడకలమీద తిరిగేటట్లు చేసే ఇనపబద్దీ. **పట్టాపీడు** వి. రైతు కిస్తుచెల్లించేచీడు. **పట్టాభూమి** వి. రైతు కిస్తుచెల్లించి ఉన్నుకొనే సొంతభూమి. కిస్తు చెల్లించే వాడికి అనుభవ విక్రయహక్కులు గలభూమి. **పట్టాలశతరంజి** వి. అడ్డంలో పట్టెలు పట్టెలుగా నేసిన జంబానా. **పట్టాలుతప్పు** అ. క్రి. గతితప్పు, స్థిరత్వంకోల్పోవు. **పట్టావా(డు** విణ. ఒకానొక జాతివాడు.

**పట్టాదారు** రూ. పట్టాదారు(డు, పట్టేదారు. వి. వ్రాతపూర్వకమైన ఒడంబడిక ద్వారా భూమిపైన అధికారం గలవాడు.

హిం. ఉ. పట్టా. భూమిని స్వాధీనంచేస్తూ ప్రభుత్వం వారు ఇచ్చే చీటి; పార. -దార్. మతుబర్థ ప్రత్యయం.

<ఉ. పట్టా + పార. దార్.

**పట్టాదారు(డు** రూ.చూ. పట్టాదారు. వి. భూమికౌలుపత్రం ఉన్నవాడు.

**పట్టావి** రూ.చూ. పటాపి. విణ. **1.** ఒకవిధమైన డిజైను కలిగిన; **2.** గుంత్రని; వి. ఒకరకమైన పప్పుదినుసు.

**పట్టి**[1] వి. **1.** కూతురు, కొడుకు. క్రీ.శ. 8వ శతాబ్ది. చిలంకూరు శాసనం; **2.** కుమారుడు; కొడుకు. భార. విరా. 5.236; **3.** కూతురు. శృం. నై. 2.46; **4.** అపత్యం, సంతతి. దశా. 1.106.

త. పట్టి-. కొడుకు.

**పట్టికా(డు** వి. (స్వార్థంలో) చిన్నవాడు, కుర్రవాడు. శుక. 3.50. **పట్టితల్లి** వి. బిడ్డతల్లి. **పట్టిపట్టి** వి. మనుమడు, మనుమరాలు.

**-పట్టి**[2] అవ్య. **1.** ఇది హేత్వర్థక ద్వితీయానుబంధాలకు అనుప్రయుక్తమవుతుంది. భార. ద్రోణ. 5.812; **2.** ద్వితీయా సప్తమ్యంతాలైన కాలవాచకాల కనుప్రయుక్తమై 'ప్రారంభించి' అనే అర్థాన్ని తెలుపుతుంది. కాశీ. 7.140.

<పట్టు[1] + -ఇ[13].

**పట్టి**[3] వి. **1.** భూపరిమాణ విశేషం. (పట్టి. పందుము లాంటిది); **2.** పంచుకున్న నేలలో ఒకభాగం.

క. పట్టి, హట్టి; త. పట్టి. భూపరిమాణవిశేషం;

సం. పట్టిక-. దానశాసనాదులు రాసేరాగిరేకు వాని రేకు, పట్టికా-. పలక; ప్రా. పట్టియ-. పట్టామీద ఇవ్వబడ్డ గ్రామాదికం.

<త. పట్టి.

**పట్టి**[4] రూ.చూ. పట్టీ[2]. వి. చిన్నకాగితం.

**పట్టి**[5] రూ.చూ. పట్టె[1]. వి. **1.** కొయ్యవాసం; **2.** ద్వారబంధపునిలువుకమ్మి; **3.** జాపికమ్మి, కత్తెరపక్కల వాలుగా ఉన్నకమ్మి; **4.** తలుపురెక్కమీద అడ్డంగా బిగించే కొయ్యబద్ద; **5.** ఫలకం, బల్లచెక్క; **6.** పత్తిపట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కిపట్టటానికి అమర్చినపట్టె; **7.** పత్తిరాట్నంకింది పీట; **8.** రంగుఅద్దిన సూలులపీలు పిండే కర్ర; **9.** తద్వారాట్నం చక్రానికి చుట్టూ అమర్చిన పావచెక్కలు; **10.** పొయ్యిలు ఏర్పాటు చేయటానికి బట్టి అడుగుభాగంలో పేర్చిన ఇటికల వరస.

**పట్టికర్ర** వి. బట్టిగొట్టం పడకుండా తీగలను కట్టిన కొయ్య. **పట్టిచెక్క** వి. మాగాణిలో దున్నిన తరవాత చదునుచేసే సాధనం, గోరుఆకారంలో వున్నపలకను ఒక కర్రకు అమరుస్తారు. **పట్టిపార** రూ.చూ. పట్టెపార. వి. పడుగులో ఒకపాయపట్టెపైకి, ఒకపాయకిందికి వచ్చినపార. **పట్టిమార్చు** రూ.చూ. పట్టెమాఱుపు. వి. రెండురకాల రంగుల పట్టెలు వరసగా వచ్చేట్టు నేసిన నేత. **పట్టిమార్చు తాపు** రూ.చూ. పట్టెమార్పుతాను. వి. రెండురకాలపట్టెలు ఒకటి విడిచి మరొకటి వచ్చేట్టు నేసిన తాను.

**పట్టిక** చూ. పట్టెడ. వి. **1.** కమసాలివానిదాగలి; **2.** జాబిత; **3.** భాగం.

సం. పట్టిక-, పట్టికా. ఫలకం, గుడ్డముక్క, వస్త్రం, పలకంపై ఉన్నహక్కుపత్రం.

**పట్టికట్టాడు** చూ. పట్టు[1].

**పట్టిచూచు** చూ. పట్టు[1].

**పట్టిచ్చు** చూ. పట్టు[1].

**పట్టించు** చూ. పట్టు[1].

**పట్టించుకొను** చూ. పట్టు[1].

**పట్టిడ** రూ.చూ. పట్టెడ[2]. వి. గొడ్లమెడలకు అందానికిగాని, వాటినికాడికి పూన్చటానికిగాని కట్టేదాడు, లేకతోలు.

**పట్టిడిసంబవులు** రూ. చూ. పట్టెడిసంబావులు. వి.బ.వ. బియ్యంలో ఒకరకం.

**పట్టిడిసంబావులు** రూ. పట్టెడిసంబవులు. వి.బ.వ. ఒకరకం బియ్యం.

**పట్టివకాయవండగు** చూ. పట్టు[1].

**పట్టివకేలుపట్టిపట్లేయుండు** చూ. పట్టు[1].

**పట్టివచెలు** చూ. పట్టు[1].

**పట్టివదివిడవకుండు** చూ. పట్టు[1].

**పట్టివదెల్లబంగారమగు** చూ. పట్టు[1].

**పట్టివపములు** చూ. పట్టు[1].

**పట్టిపల్లార్చు** చూ. పట్టు[1].

వి.బ.వ. గుమ్మందగ్గర పడిఉండి దర్శనం కోసం చేసే నిరీక్షణలు. పడుగాయ(-కాయ) వి. రాలినకాయ. పడుగింజ వి. చల్లకుండా రాలిన విత్తు, పడినగింజ. దశా. 4.121. పడుగొమ్మ(-కొమ్మ) వి. 1. కప. కింద పడున్న కొమ్మ; 2. ఊర. పడుచెట్టులు వి.బ.వ. వేయకా పెట్టకా వాటంతటవిగా మొలచిన చెట్లు. పండి.చ. పర్వత. వ. 240. పడుతెంచు అ.క్రి. పడు.భార. అరణ్య. 1.191. పడు పడుకకు(చెప్పక(-చెప్పక) అవ్య. అతిరహస్యంగా. పాండు. 3.49. పడుబాటు వి. చిన్నదిగా కింద పడే నీటిదారులు. పడుమంత వి. చిన్నకర్మకోటున పిండం పెంచటానికి వాడే మట్టిపాత్ర. పడువరి వి. కోతకోసేటప్పుడు గింజలురాలి మొలచినపైరు. పడువాడు విశ. పతనశీలుడు. ఆం.భా. 3.9. పర్డదియెపాటుగ అవ్య.క్రు. పడింది పడినట్లుగా. కశా. 6.77. పడ్రంగము వి. నదీ ముఖద్వారంలో ఆటుపోటుల వల్ల ఏర్పడిన దిబ్బ, డెల్టా. సం. రంగ-. ప్రదేశం, స్థలం. < పడు[1] + సం. రంగ- + -ము. పమ్నుందు అ.క్రి. శయనించు, పరుండు. పరుండు అ.క్రి. 1. నిద్రించు. హరి.పూ. 8.166; 2. శయనించు. ఆము. 2.74; 3. పతితుడగు, పడినవాడగు. దశా. 6.118.

పడు[2] స.క్రి. 1. కర్మార్థంలో వచ్చే అనుబంధం. భార.ఆది. 2.252; 2. పొందు. భార.ఆది. 6.74, 6.220; 3. అనుభవించు. భార.అను. 4.184; 4. అనుసరించు. దశకు. 3.36; 5. స్వార్థంలో సహాయక క్రియగా ఉపయోగ పడుతుంది. హంస. 4.213.

క. పడు (పట్ట్-). వడె-. పొందు, పట్టుకొను, సంభవించు, అనుభవం; కొడ. పడ్ (పడువ్-, పట్ట్-). బాధపడు, తగులు (ఏదైనా వస్తువు), పడిత్- (పడితి-). బాధపడేట్లుచేయు; తు. పడెయుని, పడెప్పుని, బాధపడు, అనుభవించు, ఆనందించు, పడెపిని, పడపుని. పొందు, కలిగియుండు, సంపాదించు, పడెపాప్పని. కలిగించు, సందర్భం; త. పడు (పడువ్-, పట్ట్-). జరుగు, సంభవించు, అనుభవంలోకివచ్చు, స్పర్శ, పట్టుబడు, బాధపడు, పడు (-ప్పు-, -త్త్-). చేయు, పట్టుకొను, నిర్మించు, పెరిగేటట్లుచేయు, పడుత్తు (పడుత్తి-). సృజించు, ఉత్పత్తిచేయు, పొందు; మ. పడుక (పట్ట్-). పొందు, జరుగు, పట్టుకొను, ఉన్నస్థితి, పడుక్క. పట్టుకొను, పొందు, పెడుక (పెట్ట్-). జరుగు, ఉండు, చెందు; కో. పడ్- (పట్-). అనుభవించు, పట్టుబడు; తొ. పాడ్- (పాట్-). బాధ పడు, అనుభవం, పజ్య్- (పజ్స్-). పిలు కలుగు; తొ. పాడ్- (పాట్-). బాధపడు, అనుభవం, పజ్- (పజ్స్-). పిలు కలుగు; పర్జి. పడ్. సంపాదించు, పడిప్- (పడిత్-). పొందేటట్లుచేయు; కొలా. పడ్- (పట్ట్-). (దెబ్బ) కలిగియుండు. (కన్ను) దుమ్ముతో నిండియుండు; గ.(ఒ). పర్. స్వీకరించు.

< మూ.ద్రా. *పట్-, *పత్-.

పడుక రూ. పడక, పడగ[1]. వి. 1. పానుపు, శయ్య, మెత్త, మంచం. ఆము. 4.127; 2. పండుకొనటం; 3. సంభోగం, సమావేశం.

త. పడై-. పాన్పు; తొ. పాడ్య-. నిద్రించే స్థలం; గోం. ఫత్‌పడేంగానా-. ఒకరి వెనక నిద్రించటం; నా. పడ్-(పట్ట్-). పడు, పయిప్/పయ్ప్. పడేట్లుచేయు; పెంగొ. పజ్-(పస్త్-). పట్టుబడు (జంతువు, పక్షి మొ.).

పడుకటిల్లు రూ.చూ. పడుకిలు. వి. శయనగృహం. పడుకయిల్లు రూ.చూ. పడుకిలు. వి. శయనగృహం. కువ. చ. 2.115. పడుకిలు రూ. పడకటిల్లు, పడకయిలు, పడక యిల్లు, పడకిలు పడకిల్లు, పడుకటిల్లు, పడుకయిల్లు. వి. శయనగృహం. దశకు. 6.157. < పడుక + ఇల్లు.

పడుకు వి. రాయి, శిల. భోజ. 5.252.

కొం. పణుక్-. రాయి.

పడుకొను రూ.చూ. పండుకొను. అ.క్రి. శయనించు.

పడుక్కట్టు చూ. పడుగు.

పడుక్కట్టి చూ. పడుగు.

పడుక్కఱ్ఱ చూ. పడుగు.

పడుక్కొట్టు చూ. పడుగు.

పడుక్కొయ్య చూ. పడుగు.

పడుక్కోల చూ. పడుగు.

పడుగట్టి చూ. పడుగు.

పడుగతుకు చూ. పడుగు.

పడుప రూ. పడుగువు, పొడుగు[2]. వి. 1. వస్త్రపునేతలో నిడువు నూలు. మను. 5.71; 2. కళ్ళంలో తొక్కించ టానికి పరిచిన వరి మొ. గడ్డి; 3. కుప్ప వేయటానికి ముందు అడుగున పరిచిన వరి మొదలి కట్టలు; 4. వంశం; 5. పోలిక, సంప్రదాయం; 6. తాడు, నారతు పరిపెట్టిగాని పేనిగాని తయారుచేసిన లావపాటి సులక; 7. గుట్ట, మండి, మదిర, రాశి; 8. సున్నపు కుప్ప; 9. బున్యాదిపాయ, పునాదిగుంట; 10. తిన్నని అతుకు; 11. లాడులో నిలువుగా పేర్చిన శారనరాయి; 12. అపరాయి, ఆర్చి గట్టిపడేవరకు మూసమీద ఆధారంగా పేర్చిన రాయి; 13. కుండలు పేర్చటానికి ఆము గోడ వెనక ఏటవాలుగా ఉండే చదును నేల; 14. ఆము పైభాగం, పడుప; 15. కోటలో నిలువు దాళ్ళు దున్నే పద్ధతి.

పడుక్కట్టు రూ.చూ. పడుగుకట్టు. వి. చుట్ట చుట్టిన పడుగు నూలు. పడుక్కట్టి రూ.చూ. పడుగుకట్టి. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరు చేసే గుండ్రటి సున్నటికఱ్ఱ. పడుక్కఱ్ఱ రూ.చూ. పడుగు కఱ్ఱ. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటి కఱ్ఱ. పడుక్కొట్టు అ.క్రి. ఆములో కుండల్ని పరచటానికి కంప ఊక వేసి పడుగు ఏర్పరచు. < పడుగు + కొట్టు[1]. పడుక్కొయ్య రూ.చూ. పడుగుకొయ్య. వి. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్యగూటం. పడుక్కోల రూ.చూ. పడుగుకోల. వి. 1. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటి కఱ్ఱ; 2. పడుగులో ఆని పెంబడి దూర్చిన పెడుదులద్ద. పడుగట్టి

(-కట్టె) రూ.చూ. పడుగుకట్టె. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటి కర్ర. పడుగతుకు అ.క్రి. బద్దె పోగులకు పడుగుపోగులు కలిపి వడిపెట్టు. <పడుగు+అతుకు. పడుగుకట్ట రూ. పడుక్కట్ట. వి. చుట్టచుట్టిన పడుగునూలు. పడుగుకట్టు స.క్రి. అను కొయ్యలకు చుట్టి వచ్చేట్టు చేయు. పడుగుకట్టె రూ. పడగట్టె, పడుక్కట్టె, పడుగట్టె. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటి కర్ర. పడుగుకర్ర రూ. పడుక్కర్ర. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటి కర్ర. పడుగుకొట్టు అ.క్రి. గుడ్డ పిడచతో పడుగుకు గంజి పట్టించు. పడుగుకొయ్య రూ. పడుక్కొయ్య. వి. ఊత్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన కొయ్య గూటం. పడుగుకోల రూ. పడుక్కోల. వి. 1. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సన్నటి కర్ర; 2. పడుగులో అని వెంబడి దూర్చిన వెదురుబద్ద. పడుగుగుంజ రూ. పడుగ్గుంజ. వి. 1. ఊత్తెను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; 2. అరుబయట దాపినప్పుడు రెండోవైపు కట్టటానికి పాతిన కొయ్య. పడుగుగుది రూ. పడుగ్గుతి, పడుగ్గుది. వి. పడుగు దాపేటప్పుడు ఊత్తె అడ్డపట్టెనూ పడుగేరుకర్రనూ కలిపే తాడు. పడుగుగూటం వి. ఊత్తె గూటాన్ని నేలలోకి దిగగొట్టే ఇనపమొద్దు. పడుగుచాలు వి. మొదటిసారి దున్నిన నిలువుచాలు. పడుగుచివ రూ.చూ. పడుగుచివ్వ. వి. 1. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; 2. పడుగు దాపినప్పుడు అనివెంబడి దూర్చిన సన్నబెత్తం. పడుగుచివ్వ రూ. పడుగుచివ, పడుగుసివ. వి. 1. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; 2. పడుగు దాపినప్పుడు అనివెంబడి దూర్చిన సన్నబెత్తం. పడుగుచుట్ట వి. చుట్టచుట్టిన పడుగునూలు. పడుగుచుట్టకర్ర వి. మగ్గం దగ్గర పడుగు చుట్టిన కర్ర. పడుగుచేయు స.క్రి. 1. గంజి పెట్టిన పడుగును ఊత్తెలకు దాపి కుంచెతో దువ్వుతూ నేతకు అనుకూలంగా చేయు; 2. కంప, ఊక వేసి ఆములో కుండలు పేర్చే స్థలాన్ని ఏర్పరుచు. పడుగుతడుపు రూ. పొడుగుతడుపు. స.క్రి. గుడ్డ పిడచతో పడుగుకు గంజి పట్టించు. పడుగుతాడు వి. ఊత్తెను నిలబెట్టి కింది గూటానికి బిగించే తాడు. పడుగుతీడు అ.క్రి. గంజి పెట్టిన పడుగును చేత్తో దుద్దు. పడుగుతోడు స.క్రి. 1. నేతలో నిలువుకువాడే నూలు మరానుకు చుట్టు; 2. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చేయు. పడుగుతోలు స.క్రి. నవారు నేతలో నిలువుకు వాడే నూలు అనుమీద చుట్టు. పడుగుదండె వి. అనుపీటలు బిగించిన పొడుగుపట్టె. పడుగుదిద్దు అ.క్రి. కచ్చిపోగులు సాపుచేయు. పడుగుదీయు (-తీయు) స.క్రి. పడుగుకు సరిపోయేటంత నూలు అను గూటాలకు తోడు. పడుగుదోవి రూ.చూ. పడుగుదోనె. వి. మగ్గం చివర పడుగు నూలు చుట్టే కొయ్యదూలం. పడుగుదోవిగ రూ.చూ. పడుగుదోనె. వి. మగ్గంమీద నేసిన బట్ట చుట్టే కొయ్య దూలం. పడుగుదోనిగె రూ.చూ. పడుగుదోనె. వి. మగ్గంమీద నేసిన బట్టచుట్టే కొయ్యదూలం. పడుగుదోనె రూ. పడుగుదోని, పడుగుదోనిగ, పడుగుదోనిగె. వి. మగ్గం చివర పడుగునూలు చుట్టే కొయ్యదూలం. పడుగునూలు వి. నేతలో పడుగుకు వాడే నూలు. పడుగుపెట్టు వి. మొత్తం పడుగునూలు. పడుగునేర్పు స.క్రి. పడుగు నెరపు. పడుగుపాయ వి. పడుగుపోగుల్లో కొంతభాగం. పడుగుపిండు స.క్రి. గంజిపెట్టిన పడుగును చేత్తో పిండు. పడుగుపాట్టె వి. పడుగుపోగుల్లో కొంతభాగం. పడుగుపోయు రూ. పడుగుబోయు, పొడుగుపోయు. అ.క్రి. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చేయు. పడుగుబండ వి. గంజి, అంబలి మొ. వాటితో పడుగు తడపటానికి పరిచినరాయి. పడుగుబయలు రూ. పడుగు బైలు. వి. పడుగు దాపకొనే బహిరంగ ప్రదేశం. పడుగు బల్ల వి. పడుగునూలు పోసే కొయ్య పనిముట్టు. పడుగు బెంతు వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో కూర్చిన పోగులు. పడుగుబైలు రూ.చూ. పడుగుబయలు. వి. పడుగుదాపకొనే బహిరంగ ప్రదేశం. పడుగుబోయు రూ.చూ. పడుగుపోయు. అ.క్రి. నేతలో నిలువుకు వాడే దారం అను షల్లలకు చుట్టు. పడుగుమేకు వి. ఊత్తెను నిలబెట్టి కింద గూటానికి బిగించే తాడు. పడుగుఁబేక (-పేక) వి. అడ్డం, నిలువు. కు.సం. 11.127. పడుగురుద్దు అ.క్రి. పడుగుకు అంబలి దాగా పట్టేటట్లు గొంగడి పిడచతో తట్టు. పడుగులాకె వి. పడుగులో అని వెంబడి దూర్చిన వెదురుబద్ద. పడుగులాడె రూ. పడుగులేడె వి. నేత నేసేటప్పుడు పడుగు పై పోగులకు కింది పోగులకు మధ్య వేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు. పడుగులేడె రూ.చూ. పడుగులాడె వి. నేత నేసేటప్పుడు పడుగు పైపోగులకు కింది పోగులకు మధ్యవేసే పేకదారం కండె అమర్చిన పనిముట్టు. పడుగువివ్వు స.క్రి. పడుగు ఏరేటప్పుడు పోగులు విడదీయు. పడుగువిసురు అ.క్రి. 1. నేతలో నిలువుకు వాడే పడుగు నూలు మరానుకు చుట్టటానికి చక్రంతిప్పు; 2. అనుగొట్టంలోకి పోగుతీసుకొని అనుకొయ్యలకు చుట్టి వచ్చేట్టు చేయు. పడుగువేయు అ.క్రి. కంప, ఊకవేసి ఆములో కుండలు పేర్చే స్థలాన్ని ఏర్పరచు. పడుగుపాసు వి. సరి చెయ్యటానికి నిలబెట్టిన ఊత్తెలమధ్య దూరం. పడుగుసివ రూ.చూ. పడుగుచివ్వ. వి. 1. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం; 2. పడుగు దాపినప్పుడు అని వెంబడి దూర్చిన సన్న బెత్తం. పడుగు పీడు వి. పడుక్కు వాడే నూలుచుట్ట. పడుగెత్తుగుది వి. పడుగుచుట్టకు రెండువైపులా కట్టి మగ్గానికిపైన, కొన్నిచోట్ల రాయదారపు కర్రకు వేలాడదీసిన తాడు. పడుగెరబద్ద రూ.చూ. పడుగేరుబద్ద. వి. ఉన్నిపడుగులో అని పోగుల్లో దూర్చిన వెదురుబద్ద. పడుగెరిలాకె రూ. పడగెరిలాకె, పడిగెరిలాకె పరిగెడిలాకె. వి. పడుగులో అని వెంబడి దూర్చిన వెదురుబద్ద. పడుగేపుకర్ర రూ. పడుగేరుకర్ర.

వి. పడుగుదాపి నప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటికఱ్ఱ. **పడుగేరు** స.క్రి. పడుగుపోగులు చేత్తో విడదీయు. **పడుగేరుకట్టె** రూ. పడిగేరికట్టె, పడిగేరుకట్టె, పొడుగేరుకట్టె. వి. పడుగు దాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే కట్టె. **పడుగేరుకఱ్ఱ** రూ. పడుగేనుకఱ్ఱ, పడేనిగఱ్ఱ, పొడుగేరుకఱ్ఱ. వి. పడుగు దాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటికఱ్ఱ. **పడుగేరుకోల** రూ. పడిగెరికోల. వి. పడుగుదాపినప్పుడు కిందిపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటికఱ్ఱ. **పడుగేరుబద్ద** రూ. పడిగెరిబద్ద, పడుగెరబద్ద. వి. ఉన్నిపడుగులో అని పోగుల్లో దూర్చిన వెదురుబద్ద. **పడుగ్గుంజ** రూ.చూ. పడుగుగుంజ. వి. 1. ఊత్తైను నిలబెట్టి తాడుతో బిగించటానికి నేలలో పాతిన గూటం; 2. ఆరుబయట దాపిన పడుగు రెండోవైపు కట్టటానికి పాతినగొయ్య. **పడుగ్గుతి** రూ.చూ. పడుగుగుది. వి. పడుగు దాపేటప్పుడు ఊత్తై అడ్డపట్టెనూ పడుగేరుకఱ్ఱనూ కలిపే తాడు. **పడుగ్గుది** రూ.చూ. పడుగు గుది వి. పడుగు దాపేటప్పుడు ఊత్తై అడ్డపట్టెనూ పడుగేరుకఱ్ఱనూ కలిపేతాడు.

**పడుగుపు** రూ.చూ. పడుగు. వి. వస్త్రపు నేతలోని నిడుపు నూలు.

**పడుగెత్తుగుది** చూ. పడుగు.

**పడుగెరబద్ద** చూ. పడుగు.

**పడుగెరిలాక** చూ. పడుగు.

**పడుగేమకఱ్ఱ** చూ. పడుగు.

**పడుగేరు** చూ. పడుగు.

**పడుగేరుకట్టె** చూ. పడుగు.

**పడుగేరుకఱ్ఱ** చూ. పడుగు.

**పడుగేరుకోల** చూ. పడుగు.

**పడుగేరుబద్ద** చూ. పడుగు.

**పడుగ్గుంజ** చూ. పడుగు.

**పడుగ్గుతి** చూ. పడుగు.

**పడుగ్గుది** చూ. పడుగు.

**పడుచఁడు** చూ. పడుచు[1].

**పడుచు**[1] వి. 1. కన్య, బాలిక. బసవ. 3.408 పం.; 2. బాలుడు. తార. శాంతి. 3.246; విణ. యువతి, యౌవనం గల స్త్రీ.

క. పడతి. స్త్రీ; పర్జి. పడిచ్- బాలుడు; కొలా. పడస్- బాలుడు, కుమారుడు.

**పడుచఁడు** రూ. పడుచుఁడు. వి. పడుచువాడు. నిరంకు. 2.129; **పడుచుకార్యములు** వి.బ.వ. పిల్లచేష్టలు, దుడుకు పనులు. సిం.ద్వా. 1.169. సం. కార్య-. పని. **పడుచుకూఁతలు** వి.బ.వ. పరస్త్రీ ప్రసంగాలు. నిరంకు. 2.83. **పడుచుఁజేఁత(-చేఁత)** వి. జారత్వం. **పడుచుఁడు** రూ.చూ. పడుచఁడు. వి. బాలుడు. **పడుచుతనము** రూ.చూ. పడుచుఁదనము వి. 1. బాల్యం; 2. యౌవనం. **పడుచుతోఁ బరిహాసము** వి. ప్రమాదకారి. వేంక. అం. 52. సం. పరిహాస-. కేళీకం. **పడుచుది(-అది)** విణ. యౌవనంగలది. **పడుచువిచ్చు(-ఇచ్చు)** అ.క్రి. 1. కన్యనిచ్చి పెళ్ళిచేయు. పండి.చ. 2.293 ప.; 2. పిల్లనిచ్చు. **పడుచుఁదనము(-తనము)** రూ. పడుచుతనము. వి. 1. బాల్యం. దశా. 6.6; 2. యౌవనం. సారంగ. 3.48. **పడుచుఁదనములపెద్ద** వి. మన్మథుడు. కవిరాజ. 3.116. **పడుచుమాటలు** వి.బ.వ. చిన్నతనంచేకాని పడుచుదనంచేగాని కార్యభారం ఎరగని మాటలు, అనుభవం లేని మాటలు. రాఘవ. 4.60. **పడుచుఁబని(-పని)** వి. చిన్నతనంచేకాని పడుచుదనంచేగాని చేసే అవివేకపు పని. జైమినిభా. 5.59. **పడుచురాపి** వి. కన్యారాశి. **పడుచులతిండి** వి. శిశుఘాతిని. హరిశ్చ. 5.130. **పడుచువాఁడు** విణ. యౌవనంగలవాడు. అచ్చ.రా.యు. 123.

**పడుచు**[2] అ.క్రి. వ్యభిచరించు, జారత్వంచేయు. వరాహ. 9.129.

క. పడుపు. జీతంపొందు, పడుపుగార్తి. డబ్బు సంపాదించే స్త్రీ, కలిగిఉన్న స్త్రీ. బడ్తి, బొడ్తి. జారిణి, పడికెంతి. చెడ్డ; త. పట్టి. నిరంకుశ వ్యక్తి, దొంగతనం, జారిణి, పట్టికన్. దొంగ, పట్టిమై. మోసం, పటు. నీచమైన, క్రూరమైన, పటిరన్. కల్లరి, క్రూరుడు, పటిటి. కల్లలాడే స్త్రీ;

సం. పటు-. క్రూరమయిన, దిట్టమయిన.

**పడుచుకొను** అ.క్రి. వ్యభిచరించు. **పడుపు** వి. 1. వ్యభిచారం. వేంక. పంచ. 4.240; 2. వ్యభిచారంచే గడించే సంపాదన. **పడుపుకత్తియ** రూ. పడుపుకత్తె. వి. పడుపువృత్తి చేసుకొని జీవించే స్త్రీ. వేశ్య. **పడుపుకత్తె** రూ.చూ. పడుపుకత్తియ. వి. పడుపువృత్తి చేసుకొని జీవించే స్త్రీ. వేశ్య. **పడుపుకూడు** రూ.చూ. పడుపుఁగూడు. వి. వ్యభిచారంవల్ల దొరికే ఆహారం. పోతన దాటువ. **పడుపుకొమ్మ** రూ.చూ. పడుపుఁగొమ్మ. వి. వేశ్య. **పడుపుఁగూడు(-కూడు)** రూ. పడుపు కూడు. వి. వ్యభిచార వృత్తిచే కలిగిన ద్రవ్యం. కేయూ. 1.13. **పడుపుఁగొమ్మ(-కొమ్మ)** రూ. పడుపుకొమ్మ. వి. వారాంగన. విప్ర. 5.78. **పడుపుఁగోమలి (-కోమలి)** వి. వ్యభిచారవృత్తిచే జీవించే స్త్రీ వేశ్య. సీలా. 3.7. **పడుపుది (-అది)** విణ. వేశ్య. భోగం స్త్రీ, అం. భా. 2.100. **పడుపుఁబరఁతి(-పరఁతి)** వి. లంజ. వ్యభిచారిణి. **పడుపువృత్తి** వి. వ్యభిచారజీవనం.

**పడుదల**[1] వి. భుజావలంబి కృత్తి, దాబా. దశా. 10.113.

**పడుదల**[2] వి. పక్షివిశేషం, డాబ.

**పడుదలు** రూ.చూ. పడిదల. వి. ఇంటికప్పువాటం.

**పడుపు** చూ. పడుచు[2].

**పడుపుకత్తియ** చూ. పడుచు[2].

**పడుపుకత్తె** చూ. పడుచు[2].

**పడుపుకూడు** చూ. పడుచు[2].

**పడుపుకొమ్మ** చూ. పడుచు[2].

**పడుపుఁగూడు** చూ. పడుచు[2].

**పడుపుఁగొమ్మ** చూ. పడుచు[2].

**పడుపుఁగోమలి** చూ. పడుచు[2].

**పడుపుది** చూ. పడుచు[2].

**పడుపుఁబరఁతి** చూ. పడుచు[2].

**పడుప్రవృత్తి** చూ. పడుమ².

**పడుమర** రూ. పడమర, పనమర, పరమర, పడుమర. వి. పశ్చిమదిక్కు. ధరణికోట శాసనం. క్రీ.శ. 742.-798.

క. పడు (పట్టు-). పడు, పడువ, పడవల్, పడువల్, పడువు. పడమర ; కొడ. పడి-. గొ. డి. పడమర ; తు. పడ్డాయి ; మ. పటిఞ్ఞాఱు.

**పడువ** చూ. పడవ¹.వి. సైన్యం. E. I. 19.

**పడువ²** విశ. మిక్కిలిపల్లమైన (నేల). కోరుమిల్లిశాసనం. క్రీ. శ. 1022.

తు. పడ్పు-. మైదానం ; తొ. ఒ. ఢ-. చదును ప్రదేశం. బడగ-, హాత-. బయలు, గ్రామంలోని పచ్చికనేల.

**పడువరము** రూ.చూ. పడువారము. వి. పన్ను మినహాయింపు రాయితీ. కొరవిశాసనం. క్రీ. శ. 892-922.

**పడువారము** రూ. పడువరము. వి. పన్ను మినహాయింపు రాయితీ. ద. హిం.శా. సంపు 6. శా. సం. 584. క్రీ.శ. 641.

సం. పరిహార-. విడవటం, తొలగించటం, ఊరుచుట్టే ఉండే సామాన్య ప్రదేశం, పన్ను మొ. వాటి నిర్బంధం లేనిది ; ప్రా. పరియార-.

<ప్రా. పరియార-.

**పడుపర** వి. పట్టణం. వేంక. పంచ. 1.240.

**పడుసోగ** రూ.చూ. పట్టుసోగ. వి. దున్నేటప్పుడు పట్టుకోవటానికి మేడిచివర అమర్చిన అడ్డుపల్ల.

**పడె** రూ.చూ. పడియ¹. వి. నీళ్ళునిలిచిన చిన్నపల్లం.

**పడెంగర్ర** చూ. పడుగు. రూ.చూ. పడిగెనగర్ర. వి. పడుగు దాపినప్పుడు కండెపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటికర్ర.

**పడెవాళ** రూ. పడవలు, పడవాలు, పడాలు. వి. సేనాపతి. కలకడశాసనం. క్రీ.శ. 972.

సం. భటపాల-సేనాపతి ; ప్రా. భడవాల-.

క. పడెయిల. సైనికుడు, పడెవళ, పడెవళ్ళ. సేనాధిపతి ; త. పడైయాళ్ ;

<ప్రా. భడవాళ-.

**పడెవాళ్ళపన్ను** వి. సేనాధిపతి జీతానికై విధించేపన్ను.

**పడెవాళ్ళపన్ను** చూ. పడెవాళ.

**పడేవిగర్ర(-కట్టె)** వి. పడుగు దాపినప్పుడు కండెపోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటికర్ర, పడుగేరేకర్ర.

**పడోలు** చూ. పడు. వి. ఉపేక్ష. తాత్సారం.

**పడ్డ** వి. 1. ఆవు. (తొలిచూలు ఆవ లేదా గేదె). ద్వి. భాగ. 10స్కం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 224 ; 2. క్రేవు. దూడ. సాంబ. తిర్య. 73 ; 3. నాలుగేళ్ళ వయసు కల ఆవు. ఆం. భా. 2.263 ; 4. తొలిచూలు గేదె.

క. పడ్డె-. పరిపక్వం. గర్భం దాల్చటానికి తగిన ; గోం. పడ్డా-. ఆవుదూడ, పడ్డపియ-. ఆవుదూడ ; కొం. పడ-. ఆవుదూడ ; పర్జి. పెడ-. ఆవుదూడ. కొలా. పడ్డ. లె. జ-ఆవుదూడ ; నా. పడ్డ-. ఆవుదూడ ;

పో.చూ.సం. పడ్డిక-. దూడ ; ప్రా. పడ్డియా-. ఆవు దూడ. అర గేదెదూడ, పడ్డీ. తొలిచూలుఆవు.

పడ్డదూడ రూ. పడపూడ. వి. ప్రాయంలో ఉన్న లేగదూడ. పడ్డపెయ్య వి. పాలువిడిచినపెయ్య.

**పడ్డదియెపాటుగ** చూ. పడు¹.

**పత్త** రూ చూ. పతత. వి. 1. అడ్డంగా అమర్చినరాతి ; 2. గుమ్మటంలాంటి పనిముట్టు.

పత్తమిద్దె రూ.చూ. పతతమొద్దు. వి. రాతి తిరగటానికి రాతి దూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు.

**పత్తరం** రూ. చూ. పతతరం. వి. 1. కడపబండ, దర్వాజా చట్రంకింద బేసుమెంటుపైనా గడపగా వేసేరాయి ; 2. స్లాబు, సిమెంటుపోతపోసి తయారుచేసిన కప్పు.

**పత్రంగము** చూ. పడు¹.

**పణ** చూ. పడత. రూ. పన వి. నొసలు, నుదురు.

క. పణె. నుదురు.

పణతాడు రూ. చూ. పనతాడు. వి. ఎద్దకొమ్ములకు మేడికి కలిపికట్టి ఎద్దను మలపటానికి ఉపయోగించేతాడు.

పణపగ్గం రూ. పనపగ్గం. వి. ఎద్దకొమ్ములకు మేడికి కలిపి కట్టి ఎద్దను మలపటానికి ఉపయోగించే తాడు.

**పణం** వి. నూలుపోగుల లెక్క.

**పణకు** రూ.చూ. పడకు. వి. 1. పెద్దరాయి, దావరాయి. పను. 2.21 ; 2. చరియ, ప్రపాతం. ఆం. భా. 2.80.

**పణత** రూ.చూ. పడత. వి. 1. కొమ్ములతో ఉన్న శరీర భాగం (తల) ; 2. నాగేటిగొరగ.

**పణత** రూ.చూ. పడత. వి. హనువు, చెక్కిలిమీదిభాగం. వరాహ. 2.45.

పణతయూరగొట్టు అ.క్రి. పంచెమొద్దు. ద్వి. భాగ. కల్యా. వ. 129. పణతపడు అ.క్రి. దవడసరాలు పట్టుకొను. పణతపుడి రూ. పడతనుడి. వి. నొసటిమీద ఉండేసుడి.

**పణతి** రూ.చూ. పడతి. వి. స్త్రీ. అతివ. భార. ఉద్యో. 3.175. శృం. నై. 3.195.

**పణతుక** రూ.చూ. పడతి. వి. స్త్రీ.

**పణము** వి. ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. మల్లవిద్యా విశేషం. ప్రబంధ. 78.

**పణి¹** రూ.చూ. పడి¹. వి. 1. తవ్వ. మానికలో సగం ; 2. ప్రమాణంగలది, నియమితద్రవ్యం.

**పణి²** రూ. పని¹. విప్పర్లశాసనం. క్రీ. శ 641 ; 2. చిత్రం మొ.వి రాయటం, శిల్పం మొ.వి చెక్కటం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 47 ; 3. నియోగం. ద. హిం. శా సంపు. 6. శా.సం. 584 ; 4. ఆజ్ఞ, శాసనం.

క. పణ్ణు. సిద్ధంచేయు, అలంకరించు, పణ్ణిక-, పణ్ణిగె, పణ్ణుగె-. సిద్ధంచేయు, తయారుచేయు ; కొడ. పణి. పని ; తు. పణిపుని. ఆకారంఇచ్చు (పాత్రలు మొ॥ వాటికి) ; త. పణ్-. సేవ, వ్యాపారం, ఉద్యోగం, పణి-. పని, క్రియ, సేవ, పణతి-. పనితనం, పణితి-. పని, నిర్మాణం, పణిక్కన్-. వడ్రంగి, పణిక్కమ్, పణిక్కు-. పనిలో అధికంగా శ్రమపడు, పణినల్. పనివారు, పణ్ణు-. పని, పణ్ణు (పణ్ణి-). చేయు, ఉత్పత్తిచేయు, పణి-. శ్రమ సేవ, పణిక్కన్-. పనివాడు, పణియుక-. కట్టించు.

పణియన్. కొండప్రాంతాల్లో వ్యవసాయంచేసే ఒకజాతి. పణ్ణుక- పణ్ణిక్క. తెలియజేసే సమాగమం; కొ. పణియ్న్. గుడలూరు ప్రాంతంలోని మనిషి. తు. పణిప్పు. పణ్. కంసాలి వాని దాగలి; తొ. పొణ్- పని; గోం. పణి- పని; పర్జి. పన్డ్ప్- (పన్ట్-). చేయు; కొలా. పణ్ణి. పని. శ్రమ; గ. ఒల్లా. పన్డ్- చేయుగలుగు; పో. చూ. త. పణై.

<మూ.ద్రా.*పణ్.

**పడిదియ** రూ. చూ. పడిదియు. వి. పడివియ, చాకలివాడు బట్టల్ని అద్దెకివ్వటం.

**పడిమాటు** రూ. పడిమాడు. స.క్రి. పీచు. ద.హిం.గా. గా.సం. 818. క్రీ.శ. 1366.

**పడిహారి** రూ.చూ. పడియేరి. వి. 1. సేవకుడు. భార.విరా. 5.267; 2. ద్వారపాలకుడు. విక్ర. 2.140.

**పడిహారుఁడు** రూ.చూ. పడియేరి. వి. ద్వారపాలకుడు.

**పణుకు** రూ. పణుగు. వి. 1. దరి; 2. ఆశ్రయం.

**పణుగు** రూ.చూ. పణుకు. వి. 1. శిల; 2. చరియ.

**పడ్డి** వి. వడ్డీధనం.

క. పట్టిసు. తూలు. పిల్లిమొగ్గవేయు.

**పంట** చూ. పండు[1]. వి. 1. (సస్యాదులు) ఫలించటం. పండటం. భార.శాంతి. 3.3; 2. ధాన్య సమృద్ధి. హర. 1.13; 3. భూమి. యయా. 2.44; 4. ఫలోన్ముఖ సస్యం. హంస. 1.215; 5. (పుణ్యపాపాలు మొ. వాటి) ఫలం. ఫలితం. అచ్చ.రా.సుందర. 90; 6. కృషి సన్నాహం. ఆం.భా. 2.282; 7. కృషి; 8. ఒక శూద్ర జాతి; 9. వ్యవసాయం.

త. పంటుమ్. పండు.

**పంటకాలేరిచీర** రూ.చూ. పంటకాట్రేడుచీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తికాకుండా ఉంతటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర. **పంటకాలేరుచీర** రూ.చూ. పంటకాట్రేడుచీర. వి. గర్భవతులు దుష్టగ్రహాల వల్ల గర్భవిచ్ఛిత్తికాకుండా ఉండటానికి అయిదో నెలలో కట్టుకొనే చీర. **పంటకాట్రిడుచీర** రూ.చూ. పంటకాట్రేడు చీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా అయిదో నెలలో కట్టుకొనే చీర. **పంటకాట్రేడుచీర** వి. కూనలమ్మ చీర మాదిరిగా నేసి సిరికొలికి బదులు ఎర్రకొలికి పెట్టి నేసిన చీర. **పంటకాట్రేడుచీర** రూ. పంటకాజేరిచీర, పంటకాలేరుచీర, పంటకాట్రెడుచీర, పంటకాట్రేలుచీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భ విచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదోనెలలో కట్టుకొనే చీర. **పంటకాట్రేలుచీర** రూ.చూ. పంటకాట్రేడుచీర. వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండ టానికి అయిదోనెలలో కట్టుకొనే చీర. **పంటకాఁపు** వి. 1. శూద్రుల్లో ఒకజాతివారు. హంస. 4.136; 2. పంటచే జీవించే కాపు. కృషీవలుడు. **పంటకారి** వి. వరిపంటకు పనికివచ్చే కారినేల. **పంటకాలు** వి. పంటకాలం, శరదృతువు. పాండు. 3.150. **పంటకాలువ** యా. పంట కాల్వ. వి. చెరువు, ఏరు మొ. వాటినుంచి పంట పొలాలకు చేరుపగా తెచ్చిన కాలవ. **పంటకాల్వ** రూ.చూ. పంట కాలవ. వి. చెరువు, ఏరు మొ. వాటినుంచి పంట పొలాలకు చేరువగా తెచ్చిన కాలవ. **పంటకులము** వి. ఒకానొక శూద్ర జాతి. హరి.పూ. 1.22. సం. కుల-. వంశం. **పంటకోడు** వి. పంట పండేందుకు ఉపయోగపడే కుల్యాది (కాలవ మొ. వాటి) విశేషం. కల్వ.శా. (శ్రీనాథుడు). **పంటగవం** యా. పంటగెనం. వి. చెరువు అలుగు కింద పారే కాలవ. **పంటగాలి** వి. ఆగ్నేయ దిక్కు నుంచి వీచే చల్లగాలి. **పంటగెవం** రూ.చూ. పంటగనం. వి. చెరువు అలుగు కింద పారే కాలవ. **పంటచాలు** వి. మాగ డికి నీళ్ళుపెట్టి దున్నిన మొదటి చాలు. **పంటచీర** వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదోనెలలో కట్టు కొనే చీర. **పంటచెలి** వి. నేల, భూమి, భూదేవి. రామాభ్యు. 5.19; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైనది. **పంటజాతి** వి. ఒకానొక శూద్రజాతి. ఉ.హరివ. 4.21. సం. జాతి-. తెగ. **పంటతల్లి** వి. పిల్లలతల్లి. **పంటకొయ్యలి** వి. నేల, భూమి, భూదేవి. ఉ.రా. 6.144. విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైంది. **పంటదమ్ము** వి. మాగాడికి నీళ్ళు పెట్టి రెండు మూడు సార్లు దున్నటం. **పంటది** విణ. పంటజాతి స్త్రీ. పాండు. 3.61. <పంట+ అది. **పంటదుక్కి** వి. విత్తనం వెయ్యటానికి ముందు దున్నటం. **పంటవెలఁది** వి. నేల, భూమి, భూదేవి. అచ్చ. రా. కిష్కిం. 55; విణ. సస్యాదులు పండటానికి అను కూలమైంది. **పంటపగవట్టు** అ.క్రి. కక్కగట్టు. శుక. 1.487. **పంటపండు** అ.క్రి. అదృష్టం ఫలించు. **పంటపూఁబోడి** వి. నేల, భూమి, భూదేవి. అచ్చ.రా. కిష్కిం. 68; విణ. సస్యాదులు పండటానికి అనుకూల మైంది. **పంటపొలఁతి** వి. నేల, భూదేవి, భూమి. కుచే. 1.22; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైంది. **పంటముగుద** వి. నేల, భూమి, భూదేవి. అచ్చ.రా.యు. 468; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైంది. **పంటమూవ** వి. వరి దుబ్బును పసుపు కుంకుమలతో పూజించి ఉండ్రాళ్ళు గుగ్గిళ్ళు పెట్టే ఆచారం. **పంటరాపాము** వి. ఓషధీశుడు, చంద్రుడు. పె.శకు. 1.234; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైనవాడు. **పంటరెడ్లు** వి.బ.వ. రెడ్లలో ఒక తెగ. **పంటలముగుద** వి. నేల, భూమి, భూదేవి. అచ్చ.రా.యు. 19; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైంది. **పంటలువేసుకొను** అ.క్రి. ముగ్గురు పిల్లలు ఒకరిచేతులు ఒకరు పట్టుకొని ఒకేసారివిడిచి తమ ఒకచేతిలో రెండవ చేతిని వేసుకొంటూ ఇద్దరికి వ్యతిరేకంగా వేసిన వ్యక్తిని దొంగగా నిర్ణయించుకుందు. **పంటవెలఁతియల్లుఁడు** వి. భూదేవి అల్లుడు. శ్రీరాముడు. ఉ.రా. 6.57. **పంటవెలఁతి** వి. నేల, భూమి. భూదేవి. పి.శకు. 4.176; విణ. సస్యాదులు పండటానికి అనుకూలమైంది. శగా. 3.3. **పంటవెలఁతితోడికోడలు** వి. లక్ష్మి. ఆం.పవా.సుర. 14. **పంటవెలఁతిపట్టి** వి. భూజాత, సీతాదేవి. దగా. 7.209. **పంటవెలఁతివిల్లు** వి. ఇక్షుధనువు. శగా. 3.3. **పంటవాల్గంటి** వి. నేల, భూదేవి, భూమి. దగా. 1.113.

పంటసాల వి. 1. బియ్యపుకొట్టు : 2. కణజం, గాదె, ధాన్యం పాతర.

**పంటంగి** రూ.చూ. పంజేగి. వి. పలచని పెద్ద ఆకులుకల చిన్నచెట్టు (Bridelia montana).

**పంటి**[1] రూ.చూ. పనంటి. వి. 1. ఘటం, కుండ. బహుగా. 5.92 : 2. చప్పన నీళ్ళు ముంచి తెచ్చుకోతగినకుండ. కడవ. ఆం.రా. 2.246 : 3. ఇనపరేకుతో చేసిన పెద్ద పాత్ర.

పంటికడవ వి. గిరలుగాని పూవులుగాని లేని చిన్న కడవ. పంటికుండ వి. గిరలుగాని పూవులుగాని లేని మట్టి కడవ.

**పంటి**[2] రూ.చూ. పంజె[2]. వి. మగ్గానికి తగిలించిన పడుగు చివరకొన చుట్టే కొయ్య.

పంటికఱ్ఱ రూ.చూ. పంజెకఱ్ఱ. వి. 1. పంజెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కఱ్ఱ : 2. చేత్తో నూలు చుట్టే పనిముట్టు. పంటికామ రూ.చూ. పంజెకామ. వి. పంజెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువుకఱ్ఱ. పంటిగుతి రూ.చూ. పంటిగుది. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పల్లకు కట్టిన తాడు. పంటిగుది రూ. పంటిగుతి. వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పల్లకు కట్టిన తాడు. పంటితాడు వి. దోనెగాడిలో బద్దెచువ్వ బిగించటానికి పల్లకు కట్టిన తాడు. పంటిమూతి రూ.చూ. పంజెమూతి. వి. పంజెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన.

**పంటిగ** రూ.చూ. పంజేగి. వి. పలచని పెద్దఆకులకల చిన్న చెట్టు (Bridelia montana).

**పంటించు**[1] అ.క్రి. 1. సంకోచపడు. సందేహపడు. పండి.చ. 1.41 ప : 2. వర్తించు, ఉండు. పండి.చ. 4.283 ప : 3. బాగుచేయు, తడయు. భాగ. 10 పూ. 145 : 4. వ్యాపించు. భాను. 4.44.

పంటించుపట్టగు అ.క్రి. తడబడు. శాన్క.రా.యు. 494.

**పంటించు**[2] స.క్రి. జల్లించు, జల్లెడపట్టు.

క. పంటిసు, తూలివడు, పైకిప్పు.

**పంటితెవులు** చూ. పన్ను[3].

**పంటిబలింకలవారు** చూ. పన్ను[3].

**పంటియ** రూ.చూ. పంజె[2]. వి. సాలెవాడు, నూలుచుట్టే సాధన విశేషం.

**పంటిసౌర** చూ. పన్ను[3].

**పంజె**[1] రూ.చూ. పనంటి. వి. బుంగ, ఇనపరేకుతో చేసిన పెద్ద పాత్ర.

పంజెడుపాలలోఒక్కచల్లబొట్టుచేమిరి వి. మంచి ఎంత ఉన్నా చెరచటానికి కొంచెమేచాలు అనటం. శాక్ల.నం. 10.77.

**పంజె**[2] రూ. పంటి[2], పంటియ, పరిజె2, పైట. వి. సాలెవాడు నూలుచుట్టే సాధన విశేషం. ఆం.రా. 2.295.

పంజెకఱ్ఱ రూ.చూ. పంజెకట్టు. వి. 1. పంజెమధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువ కఱ్ఱ : 2. చేత్తో నూలు చుట్టే పనిముట్టు. పంజెకట్టు రూ. పంటికఱ్ఱ, పంజెకఱ్ఱ, పైటకఱ్ఱ. వి. నూలు చుట్టటానికి ఉపయుక్తమయ్యే సాధన విశేషం. ఉక. 2.423. పంజెకార వి. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కఱ్ఱ. పంజెకామ రూ.చూ. పంజెకాము. వి. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువ కఱ్ఱ. పంజెకాము రూ. పంటికాము, పంజెకామ. వి. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కఱ్ఱ. పంజెకొమ్ము వి. పంజె ఆకుల్లోనుంచి దూర్చిన చిట్టి కొన. పంజెకోల వి. 1. సాలెవాడు నూలు చుట్టే సాధన విశేషం. ఆం.రా. 2.295 : 2. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువు కఱ్ఱ. పంజెచెవి వి. 1. పంజె ఆకుల్లోనుంచి దూర్చిన చిట్టికొన : 2. చిట్టికొన దూర్చటానికి ఆకుకు చేసిన చిల్లి. పంజెదామ వి. పంజె మధ్య ఆకులకు ఆధారంగా ఉండే నిలువ కఱ్ఱ. పంజెముక్కు రూ.చూ. పంజెముక్కు. వి. పంజెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. పంజెముక్కు రూ. పంజెముక్కు, పరజె ముక్కు. వి. పంజెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. పంజెమూతి రూ. పంటిమూతి. వి. పంజెకు కిందివైపున ఆకుల చివర్లను కలిపి కట్టిన కొన. పంజెమొట్టి వి. ఆను పోసేటప్పుడు పంజె అమర్చుకొనే సాధనం. పంజెమొద్దు వి. పంజెకు నూలు చుట్టేటప్పుడు ముక్కుకు ఊనికగా పెట్టే మొద్దు. పంజెమొల వి. పంజె కిందిభాగంలో ముక్కుకు బిగించిన ఇనపమేకు. పంజెసూలం వి. పంజె ఆకులకు ఆధారంగా ఉండే నిలువ కఱ్ఱ.

**పంజె**[3] రూ.చూ. పెండియ. వి. మోట బొక్కెన వలిగానికి వేసిన అడ్డచువ్వ.

**పంజెంగ** రూ.చూ. పంజేగి. వి. పలచని పెద్దఆకులుకల చిన్న చెట్టు.

**పంజేగి** రూ. పంటంగి, పంటిగ, పంజెంగ. వి. పలచని పెద్ద ఆకులుకల చిన్నచెట్టు (Bridelia montana)

**పంటొల్లెకోక** వి. గర్భవతులు దుష్టగ్రహాలవల్ల గర్భవిచ్ఛిత్తి కాకుండా ఉండటానికి అయిదోనెలలో కట్టుకొనే చీర.

<పంట+పల్లెకోక.

**పంట్ర** వి. చిల్లులుగల ఆలుగులు మూడు నాలుగు కల కఱ్ఱ. మను. 4.54.

పంట్రించు స.క్రి. పంట్రతో పొడుచు.

**పంట్రించు** చూ. పంట్ర.

**పంట్లం** రూ.చూ. పంట్లాం. వి. గుమ్మటంలాంటి పనిముట్టు.

**పంట్లాం** చూ. పంజె[3]. రూ. పంట్లం. వి. గుమ్మటంలాంటి పనిముట్టు.

**పంట్లాము** వి. లాగు. వస్త్ర విశేషం.

ఇం. *Pants, Pantaloon.* మగవాడు కట్టుకొనే దుస్తు ; ఫ్రె. *Pantalon.*

<ఫ్రె. Pantalon.

**పంఠ** వి. మెరక పొలాలకు కాలవ నీరు ప్రవహించటానికి తాడిమొద్దు తొలిచి కట్టిన కాలవ.

పంఠగఱ్ఱ (-కట్టు) రూ.చూ. పండిగఱ్ఱ. వి. పడుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటి కఱ్ఱ.

**పండగించు** అ.క్రి. నిలబడిపోవు. పండి.చ.ప్రథ. 2.229 ప.

**పణ్ణభూమి** చూ. పంట. వి. పండే చేను, పంటలో ఉన్న పొలం. చిట్టివలస శాసనం. విశాఖపట్నం. క్రీ.శ. 1086.

**పండబారు** చూ. పండు[2].

**పండబాఱు** చూ. పండు[1].

**పండప** రూ.చూ. పండె. వి. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టెలు, కొనుభాగం పెయ్యని వామి.

**పండా** రూ.చూ. పణ్డా. వి. 1. జగన్నాథ ప్రాంతంలో ఉండే ఒక పూజారి జాతి బ్రాహ్మణుడు ; 2. బిరుదువాచకం ; 3. దేవాలయ పూర్ణాధికారి.

పండావారు విశే.బ.వ. జగన్నాథాది దేశాల్లో ఉండే జనులు.

**పండాకులు** చూ. పండు[1].

**పండారము** వి. శివపూజ చేసేవారు, తంబళి.

త.మ. పండారమ్. శైవభక్తుడు.

<త. పంటారమ్.

**పండి** రూ.చూ. పండె. వి. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టెలు.

**పండికి** వి. పచ్చబొట్టుక, తెల్లగా ఉండే మెత్తని నిరుపయోగమైన కలపకల చెట్టు (Kydia calycina).

**పండికె** వి. రంగు కొలుచుకొనే చిన్నపాత్ర.

**పండిగర్ర (-కఱ్ఱ)** రూ. పండగర్ర. వి. పదుగు దాపినప్పుడు కింది పోగులు కలిసిపోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటి కర్ర.

**పండించు** చూ. పండు[1].

**పండిటిక** చూ. పండు[1].

**పండిటికె** చూ. పండు[1].

**పండిటుక** చూ. పండు[1].

**పండితవారము** వి. గురువారం. ద.హిం.గా. గా.సం. 183. క్రీ.శ. 1156.

సం. పండితవార-. పండితులరోజు.

<సం. పండితవార- (అర్థవివరి.).

**పండిరాసులగు** చూ. పండు[1].

**పండు[1]** వి. ఫలం. భార.ఆది. 2.199. అ.క్రి. 1. తపస్సు. నోము మొ. నవి ఫలోన్ముఖమగు. ఫలమునుతవించ తగిన స్థితిని పొందు. భార. ఆది. 4.89 ; 2. పండు మొ.నవి పరిపక్వమగు, పలుకెక్కు. కు.సం. 4.87 ; 3. సస్యాదులు ఫలవంతమగు. కు.సం. 7.94 ; 4. ముగియు, సమాప్తమగు. భార.భీష్మ. 1.19 ; 5. సిద్ధించు, నెరవేరు. హరి.ఉ. 7.160 ; 6. కలుగు, సంభవించు. వసు. 4.33 ; 7. పరిణతమగు, ముదియు ; 8. నెగ్గు ; విశే. 1. నిండు పూర్ణం. కు.సం. 8.6 ; 2. పక్వమయిన, ముదిరిన. మను. 4.18 ; 3. (పండువంటిది) ముసలిది, వార్ధకావస్థనొందిన. మల్లభూ.వైరా. 73.

క. పళ్. (పండిన పండు), ఉత్పత్తిచేయబడు. పణ్ణు. పండినపండు. పక్వం ; కొడ. పణ్ణో. పండు ; తు. పల్కుని, పళ్కుని. మెత్తగాఅగు (మిగలముగ్గినపండు), సులభంగా వంగు. పర్నుని. పక్వమగు, యుక్తవయసువచ్చు. (బొట్టు) తెల్లగామారు, పర్నుదాయ్నని. పండబెట్టు, పర్ను. పక్వం, పండినపండు, పండిన అరటిపండ్లు, పలు. పండటం (పండు), సగం పండు, పన్దడె. చెట్టు యొక్క పండ్లనిచ్చే శక్తి, సఫలమగు ; త. పఴు (-ప్ప్-, -త్త్-). పక్వమగు (పండ్లు), వృద్ధులగు, యుక్తవయసువచ్చు, పఴుప్పు. పక్వం, పచ్చదనం (పండు), ఆకు ముదిరి పచ్చబడు, పఴును (పఴుని-). పక్వానికి ఎదుగు, యుక్తవయసు, నిండు, పరిపూర్ణత, పఴమ్. పండు. పఴ్ఴామ్. పండు ; మ. పఴుక్కు. పరిపక్వమగు, చీముపట్టు, నశించు, పండు. పండబెట్టు, పఴుప్పు. పండు యొక్క పరిపక్వం. పఴుప్పిక్క. కృత్రిమంగా పండబెట్టు, పఴమ్, పండిన పండు, పండిన అరటిపండ్లు ; కో. పడ్వ్- (పడ్డ్-). (పండ్లు) పక్వానికివచ్చు. (బొబ్బ పండు) పగులు, పణ్. పండు ; తొ. పొస్ఫ్-(పొస్త్-). పక్వమగు, పస్. పండు, పుయ్. (పాటలలో) పండు. పొ.ప్ఫ్-(పొ.ష్త్-). ఫలాన్నిపొందు ; గోం. పన్దానా, పస్తిన, పడిజ, పడ్హ్‌తల్. పక్వం ; కొం. పన్డ్-. పక్వానికివచ్చు, పన్జిస్. పక్వమగు ; కువి. పన్డు. పండినపండు ; పర్జి. పన్ద్-. (మొక్క) యుక్తవయసుకు వచ్చు. పడ్‌హా. పండబెట్టు, పల్. పండినపండు, చీము ; కొలా. పన్ద్-(పన్త్-). పక్వమగు, పణ్డోప్-(పణ్డోప్త్-). పండటానికిపెట్టు, పన్డుడ్. పండినపండు, పన్ (బహు-వన్దల్). పండు ; నా. పన్ద్. పక్వానికివచ్చు, పన్దె. పండినపండు ; గ. (ఒల్లా). పడ్జ (గ్)-, పడిజ. (పడ్డి-). పక్వానికి వచ్చు ; కురు. పాన్నా (పన్జా-) పక్వమగు, పచ్చబడు (అనారోగ్యంవల్ల). పన్జ్‌కా. పండ్లు, పణ్ణుఆర్నా. (బాగాపండినపండు) ముదురుపసుపురంగుకువచ్చు. పెణ్డో, పెణ్డొకో. పచ్చదనం (పండు పక్వానికి వచ్చే మొదటిస్థితి) ; మాల్తో. పనె. పక్వమగు. పన్దరె. పక్వమగు, సభ్యతనేర్చు. పన్జెక్, పన్జెకె. పండు, పాన్-(పాన్జ్-). పండబెట్టు ;

చూ. సం. ఫల-. పండు, ఫలతి. పక్వమగు, పండు, ఉత్పత్తిచేయు.

<మూ.ద్రా. *పఴ -న్ -.

పండబాఱు రూ. పండుబారు. అ.క్రి. ఫలోన్ముఖమగు, పండటానికి సిద్ధమగు. ఆము. 4.162. <పండు + -ఆ + పాఱు. పండాకులు వి.బ.వ. పండిపోయిన ఆకులు. <పండు[1] + ఆకు + -లు పండించు స.క్రి. 1. పండించు, బండించు. ఆము. 6.40 ; 2. పండబారిన కాయలు కాపవేయు ; 3. శవాన్ని కాల్చు ; 4. ఆటలో గెలుపొందు ; 5. ఆములో కుండల్ని బాగా రంగు వచ్చేటట్లు కాల్చు. <పండు[1] + -ఇంచు[3]. పండిటిక రూ. పండిటికె, పండిటుక. వి. పండుగాల్చినరాయి. బాగా కాలిన ఇటిక. <పండు[1] + ఇటిక. పండిటికె రూ.చూ. పండిటిక. వి. బాగా కాలిన ఇటిక. పండిటుక రూ.చూ. పండిటిక. వి. బాగా కాలిన ఇటుక. పండిరాసులగు అ.క్రి. ఎక్కువగా పండు. కాళ్ల. సం. 11.3. పండుఒలిచి చేతికిచ్చినట్లు అవ్వ. అతి విశ

దంగా, మిక్కిలి విస్పష్టంగా. పండుకప్పు రూ. పండుగప్పు. పండుగొప్పు. వి. చాలా పెద్ద తెల్లని ఉప్పుచేప, ఒకానొక చేప. పండుకాల్వు రూ. పండుగాల్వు. వి. 1. నల్లకాల్వులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్వు; 2. ఇటుక మొ. వి బాగా కాలటం. పండుకోతి వి. పండురంగులాంటి రంగున్న కోతి. పండుగప్ప(-కప్ప) రూ.చూ. పండుకప్ప. వి. ఒకరకం చేప. పండుగాల్వు(-కాల్వు) రూ.చూ. పండు కాల్వు. వి. ఎర్రగాల్వు, ఇటుక మొ.నవి సరిగా కాలటం. పండుగాల్వురాయి వి. పండిటిక, బాగా కాలిన ఇటిక. పండు గెలలు రూ. పండుగొలలు. వి.బ.వ. పళ్లగెలలు. పండు గొప్ప రూ.చూ. పండుకప్ప. వి. ఒకరకం చేప. పండుగొలలు రూ.చూ. పండుగెలలు. వి.బ.వ. పళ్ళగెలలు. పండుచేప వి. పండులాంటి రంగున్న చేప, ఎండినచేప. పండుజుట్టు వి. నెరసినజుట్టు. పండుటాకు వి. పండినఆకు. <పండు[1] + ఆకు. పండుటెండ వి. సంధ్యాతపం. సిం.ద్వా. 4.93. < పండు[1] + ఎండ. పండుతడి వి. పైరుకోతకు ముందు చేనుకు పెట్టిన చివరి నీటితడి. పండుతెగులు రూ. పండుదెగులు. వి. జొన్న, వరి, మిరప మొ.వాటి తెగులు. పండుదెగులు (-తెగులు) రూ.చూ. పండుతెగులు. వి. జొన్న, వరి, మిరప మొ.వాటి తెగులు. పండుపక్కి వి. మంచి చిన్ననీటిచేప. పండుపచ్చ వి. తెలుపును మించని ఎరుపు, పండెరుపు. పండుబారు(-పాఱు) రూ.చూ. పండబారు. అ.క్రి. గింజ గట్టిగా ముదిరి పైరుకోతకు సిద్ధమగు. పండుమామకట్ట వి. ఎండుచేప. పండువండిపడుసు వి. అతివృద్ధాప్యం. కుచే. 3.57. పండువంటి సంసారం వి. చక్కగాఉన్న కాపురం. పండువెన్నెల వి. పూర్ణచంద్రిక. నిండువెన్నెల. ప్రబోధ. 1.48. పండువెన్నెలలుగాయు(-కాయు) అ.క్రి. వెన్నెలబాగా కాయు. వాశ. 2.136. పండెఱ్ఱది విశే. ఒకరకం పందెం కోడి పుంజు. <పండు[1] + ఎఱ్ఱ + అది. పండ్లుఅమ్ము అ.క్రి. ఒకరి తప్పునుగూర్చి ఊరంతా తెలియజెప్పు. <పండు[1] + -లు + అమ్ము.

పండు[2] అ.క్రి. శయనించు. బహుళా. 2.13.

పర్జి. పన్ద్. అలయు, ఓడించబడు, పడులు; గ. ఒల్లా. పన్ద్. అలసిపోవు.

పండ(బడు అ.క్రి. శయనించు, పడుకొను. చిత్రభా. 3.149. <పండు[2] + -అ[7] + పడు. పండుకొను చూ. పడుకొను. అ.క్రి. శయనించు.

పండుగ రూ.చూ. పండువ. వి. 1. ఉత్సవం, ఆనందం. విష్ణుమా.పూ. 3ఆ.; 2. (సంక్రాంతి, సంవత్సరాది మొ.) ఉత్సవదినం. బహుళా. 5.8.

పండుగరబ్బు వి. బహుమతి, ఇనాం. పండుగనెల వి. ధనుర్మాసం. పండుగపబ్బము వి. పండుగ. ద్వి. భల్లా. 5ఆ. పండుగసేయు(-చేయు) అ.క్రి. విందుచేయు. పండి.చ. 5.304 ప.

పండుగు రూ.చూ. పండువ. వి. 1. ఉత్సవం, ఆనందం. విష్ణుపు. 3; 2. (సంక్రాంతి, సంవత్సరాది మొ.) ఉత్సవ దినం.

పండుప రూ.చూ. పండువ. వి. ఉత్సవం. ఆము. 4.187; విశే. ఆనందకరమైన.

పండువా వి. ఒకదేశం. కాశీ. 1.35.

పండువు రూ. పండుగ, పండుగు, పండుప. విశే. ఆనందకరం. నిర్వ.రా. 7.26; వి. ఉత్సవం. భార. ఉద్యో. 3.67.

త. పణ్డిగై. పండుగ, ఉత్సవం; మ. పణ్టిక.

పండువులు పర్వములు వి.బ.వ. పండుగలు మొ.నవి పండి.చ. ద్విత. 4183 ప.

పండె రూ. పందవ, పండి. వి. గడ్డివామి వేసేటప్పుడు అడుగున పరచిన కట్టెలు.

పండెఱ్ఱది చూ. పండు[1].

పండేరము రూ.చూ. పణ్యారము. వి. భక్ష్యవిశేషం. మను. 1.28.

పణ్పు రూ.చూ. పంచు[1]. స.క్రి. పంపు, నియమించు. అద్దంకి శాసనం. క్రీ.శ. 848.

పణ్డ్య రూ. పండా, పాండా. వి. పండ, పూజారి బ్రాహ్మణుడు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1120. క్రీ.శ. 1151.

ఒ. పండా. సునిశితమైన వివేకం, పూజారి బ్రాహ్మణుడు; హిం. పండా. విజ్ఞానఖని, పండితుడు.

<ఒ. పండా.

పండ్యాణి వి. పండావాని భార్య. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 967. క్రీ.శ. 1804.

పండ్యాణి చూ. పండ్య.

పంద్ర రూ. పెంద్ర. వి. 'నల్లఊక' అని వ్యవహరించబడే పొదగా పెరిగేచెట్టు.

పండ్రెండ్డు రూ.చూ. పణ్డెండు. సర్వ. వి. బొ. పన్నెండు. హనుమకొండ శాసనం. క్రీ.శ. 1079.

పంద్రెండు రూ.చూ. పణ్డెండు. సర్వ.బొ. పన్నెండు, ద్వాదశాంకం. భార. ఆది. 1.58.

పణ్డెణ్డు రూ. పండ్రెండు, పంద్రెండు, పన్నెండు సర్వ.బొ. పన్నెండు. రామేశ్వర శాసనం. క్రీ.శ. 625-50.

కొర. పన్న్-ఎరణ్డో. పన్నెండు, పన్నెరణ్డో; త. పన్నిరణ్డు, పన్నిణ్డు.

పండ్లపాచి చూ. పన్ను[3].

పండ్లపూప చూ. పన్ను[3].

పండ్లప్రూకు చూ. పన్ను[3].

పండ్లప్రూప చూ. పన్ను[3].

పండ్లమత్తె చూ. పన్ను[3].

పండ్లగిల్చు చూ. పన్ను[3].

పండ్లుఅమ్ము చూ. పండు[1].

పండ్లుకొఱుకొప చూ. పన్ను[3].

పండ్లుకొఱుకు చూ. పన్ను[3].

పండ్లుకొఱుకుకొప చూ. పన్ను[3].

పండ్లుగిటు చూ. పన్ను[3].

పండ్లుదీయు చూ. పన్ను[3].

పండ్లెలు అ.క్రి. చిక్కిపోవు.

పణ్ణు రూ. పన్ను[2]. వి. పన్ను. (Tax). కలుకత శాసనం.

క్రీ.శ. 972.

పణ్ణెరము రూ.చూ. పణ్యారము. వి. భక్ష్యవిశేషం. అహల్యా. 3.43.

పణ్ణేరము రూ.చూ. పణ్యారము. వి. భక్ష్యవిశేషం.

పణ్యరము రూ.చూ. పణ్యారము. వి. భక్ష్యవిశేషం. అహల్యా. 3.45.

పణ్యారము రూ. పంతేరము, పణ్ణెరము, పణ్ణేరము, పణ్యరము. వి. భక్ష్యవిశేషం. భీమ. 2.67.
సం. పణ్యాహార-. బజారుతిండి; ప్రా. పణ్ణార-, పాణియ-.
క. పనియార, పనివార. తీపిరొట్టె; తు. పణియార; త. పణియారమ్. రొట్టెలు, మిఠాయి. మ. పణియారం;
<సం. పణ్యాహార-.

పతకము¹ రూ. పదకము¹. వి. 1. కంఠాభరణ విశేషం. హారం నడుమ ఉండే రత్నాదులు పొదిగిన బిళ్ళ. సింహాచల శాసనం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 830. క్రీ.శ. 1420; 2. చిలుకు తాళం వేయటానికి వీలుగా అమర్చిన పరికరం.
సం. పదక-. ఆభరణ విశేషం; ప్రా. పతక-; క.తు. పదక; త. పతక్కం; మ. పదక్కం.
<సం. పదక-.

పతకము² రూ.చూ. పదకము². వి. 1. మార్గం; 2. పన్నాగం, పన్నికన; 3. మూనా, కట్టవలసిన ఇంటిశేవారూపం.

పతకబిగువు చూ. పతకము². వి. పెంకుటిల్లు దూలంమీద పరిచి వానకట్టె బిగించే బిగింపు.

పతంగి¹ వి. గాలిపటం.
హిం. పతంగ్. గాలిపటం.
<హిం. పతంగ్.

పతంగి² వి. వృక్షవిశేషం.
సం. పతంగ-. ఒకరకం మంచిగంధపుచెట్టు; హిం. పతంగ్-. ఒకరకం చెట్టు.
<సం. పతంగ-.

పతలా వి. జోడు, నీళ్ళుమట్టి కలిసీ కలియకుండా ఉన్న స్థితి.
హి.ఉ. పల్‌లా. సన్నని, పల్చని.
<ఉ. పత్‌లా.
పతలాకమ్మి వి. బెత్తెడు వెడల్పు నేసిన కమ్మి.

పతాకం వి. నార్థపాయింటు. దిక్సూచి, దిక్కులను నిర్దేశించే అయస్కాంతపు ముక్కలుగల యంత్రం.
సం. పతాకా. జెండా; ప్రా. పడాగ-, పడాయా-, పడాఇఆ, పడాహ; గు. పడాయి. గాలిపడగ.
<సం. పతాకా (అర్థవివరి.).

పతావపుసీర వి. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.
సం. ప్రదాన-. కానుక, పెళ్ళిలో ఇవ్వటం, వరాన్నివ్వటం, చీర-. వస్త్రం.
<సం. ప్రదాన-+సం. చీర-.

పతాయి రూ.చూ. పరాయి. వి. చేతులు లేని కోటు.

పతాయ్‌సిద్ధ చూ. పతాయి. వి. చంక బనీన్లకోసం నేసిన ఒకరకం గుడ్డ.

పతి రూ. పడిద. వి. ఒక కొలతను బట్టి చెరువులో తవ్విన గుంట లేక గాడి.

పతిపాపగడ్డి వి. ఒకరకం గడ్డి (Arundinella setosa).

పతిమ వి. ప్రతిమ, ప్రతికృతి, బొమ్మ. యయా. 5.5.
సం. ప్రతిమా. బొమ్మ; ప్రా. పడిమా; జై.మహా. పడిమా; అ.మా. పడిమా; చూ.పై. పటిమా; పా. పటిమా, పడిమా; అప. పడిమ.
<సం. ప్రతిమా.

పతిపెట్టు (-పెట్టు) ఉ.క్రి. రక్షణయిచ్చు. తాళ్ల.సం. 3.520.
సం. పతి-. భర్త.
<సం. పతి-+పెట్టు.

పతివేయు అ.క్రి. అమ్మవారు పూని భవిష్యం చెప్పు.
సం. పతి-. భర్త, యజమాని, ప్రభువు, పరిపాలకుడు.
<సం. పతి-+వేయు.

పతుకులాట చూ. ప్రదుకు. వి. దేవులాట, ఇటూఅటూ వెదకటం.

పతేర రూ.చూ. పత్యార. వి. పరపతి.

పత్త వి. భగం, ఆడుగురి. చంద్రరే. 2.67.
సం. పాత్ర-. పాత్ర; ప్రా. పత్త-; పా. పత్త. పాత్ర;
క. పత్తె.
<ప్రా. పత్త-.

పత్తరిండి వి. ఒక ఆభరణం.
హిం. పత్తా. కర్ణాభరణం.
<హిం. పత్తా.

పత్తల వి. ఇద్దరు ముగ్గురు కలిసి చేసే పని.
హిం. పత్తల్. ఆకులపాత్ర.
పత్తలకమ్మి వి. అయిదు పట్టెలు ఒకరంగువి, రెండు పట్టెలు మరొకరంగువి నేసిన కమ్మి.

పత్తలంచీర వి. పెళ్ళికూతురు కట్టుకొనే తెల్లచీర.

పత్తా వి. 1. జాడ, ఆచూకీ; 2. సూచన.
హిం. పతా. చిరునామా; ఉ. పతా, పత్తా; మరా. పత్తా.
<ఉ. పత్తా.

పత్తాదార్లు వి.బ.వ. ఆచూకీ కనుగొనేవారు.
ఉ. పతా-దార్, పత్తాదార్. జాడతీసేవాడు;
క. పత్తె-దార.
<ఉ. పత్తా-దార్+-లు.

పత్తాయి రూ.చూ. పతాయి. వి. చేతులులేనికోటు.

పత్తి రూ.చూ. ప్రత్తి. వి. 1. విత్తులతో ఉండే దూది, కార్పాసం; 2. దూదినిచ్చే చెట్టు (Gossypium herbaceum).

పత్తికంకణకురము రూ.చూ. పత్తికంకణంకురము. వి. గొంగళ్ళు నేసే కురమల్లో ఒకశాఖ. పత్తికంకణంకురము రూ. పత్తికంకణకురము, పత్తికంకనంకురుము. వి. గొంగళ్ళు నేసే కురమల్లో ఒకశాఖ. పత్తికంకవంకురుమ రూ.చూ. పత్తికంకణంకురము. వి. గొంగళ్ళు నేసే

కరమల్లో ఒకగాజు. **పత్తికట్టు** వి. లోహపాత్రాదులకు వేసే అతుకు. **పత్తికట్టువేయు** అ.క్రి. పత్తికట్టుతో బిందె మొ.వి అతుకు. **పత్తికాయలు** వి.బ.వ. 1. పత్తిచెట్టుకాయలు; 2. మెత్తని పకోడీలు. **పత్తిగిరక** రూ. పత్తిగిర్క. వి. పత్తినుంచి గింజలు విడదీసే కొయ్యపనిముట్టు. **పత్తిగిర్క** రూ.చూ. పత్తి గిరక. వి. పత్తినుంచి గింజలు విడదీసే కొయ్య పనిముట్టు. **పత్తిదాల్చిన విధమున** (-తాల్చిన విధమున) అవ్య. క్రమ. దీపం వత్తి పట్టుకొన్నట్లు. ఉ.హరి. 5.181. **పత్తిమాలు** వి. పత్తినుంచి తీసిన దారం. **పత్తిపాళ్ళు** వి.బ.వ. తెలిక వేవురులో జాతిభేదం. **పత్తిపువ్వురంగు** వి. 1. చేకలేటురంగు; 2. కిర్మంజి. **పత్తిపూలాహిరీ** వి. పత్తిపువ్వు నమూనాలో లాహిరీ పడేటట్లు నేసిన డిజైను. **పత్తిరాటం** రూ.చూ. పత్తిరాట్నం. వి. 1. పత్తినించి గింజలు విడదీసే కొయ్య పనిముట్టు; 2. దారం తీసే రాట్నం. **పత్తిరాట్టం** రూ.చూ. పత్తిరాట్నం. వి. 1. పత్తి నుంచి గింజలు విడదీసే కొయ్య పనిముట్టు; 2. దారం తీసే రాట్నం. **పత్తిరాట్నం** రూ. పత్తిరాటం, పత్తిరాట్టం, పత్తిరాట్లం. వి. 1. పత్తినుంచి గింజలు విడదీసే కొయ్య పనిముట్టు; 2. దారం తీసే రాట్నం. **పత్తిరాట్లం** రూ.చూ. పత్తిరాట్నం. వి. 1. పత్తినుంచి గింజలు విడదీసే కొయ్య పనిముట్టు; 2. దారం తీసే రాట్నం. **పత్తిరాయి** వి. పత్తి పరుచుకొనే నున్నటిరాయి.

**పత్తింగ** వి. కొండపాటలి, నాలుగడుగుల ఎత్తు పెరిగి పచ్చని పూలుపూసే మొక్క (Thespesia Lampas).

**పత్తిరాకు** చూ. పత్త్రి.

**పత్త్రి** రూ. ప్రత్రి. వి. 1. ప్రత్రి, దేవపూజకు ఉపయోగించే దళాల సమూహం. కాశీ. 2.49; 2. పర్ణం, ఆకు. ఆం. రా. 2.33.

సం. పత్త్ర-. ఆకు; ప్రా. అ.మా. అప. పత్తం;
క. పత్ర, పత్రి; మ. పత్రి.
<సం. పత్ర-.

**పత్తిరాకు** వి. 1. పూజకు ఉపయోగించే ఓషధిదళాదులు. కాశీ. 2.49; 2. గంజాయిపత్త్రి. **పత్త్రిబొట్టు** వి. ఒక విధమైన బొట్టు, తిలకవిశేషం. ఆం.రా. 2.160.

**పత్త్రించు** రూ.చూ. ప్రత్రించు. స.క్రి. కట్టడం, నరకటం, చెక్కటం మొ. వాటిలో కింది వరసకంటె పైవరసను లోపలికి నెట్టు.

**పత్త్రింపు** రూ.చూ. బ్రదింపు. వి. కొంతపైకి కట్టబడిన గోడ వెడల్పు తగ్గించటానికి పడిలే గాడి.

**పత్తిలేకు** వి. లోహాన్ని అతికేటప్పుడు రెంటింటికి సంధిని వేసే సజాతీయమైన రేకు. ఆము. 5.27.

**పత్తిలిక** వి. కంసాలివాళ్ళు వాడే ఒకరకం పనిముట్టు.

**పత్తు**[1] వి. 1. నేల; 2. చేకంరాయి, నాలుగుపైపులా మలచబడి కట్టుబడిలో వాడబడే రాయి.

త. పత్తు. భూమి, పొలం.

**పత్తుకొట్టు** స.క్రి. (రాతిని) నాలుగువక్కలా సమంగా చెక్కు.

**పత్తు**[2] రూ.చూ. పస్తు. వి. లంకణం, నిరాహారంగా ఉండటం.

**పత్తైచ్చము** విశే. 1. యథాస్థితం, ఉన్నది ఉన్నట్లు. మృత్యు. 2.38; 2. కనబడేది, గోచరం.

సం. ప్రత్యక్ష-, ప్రా. గా. అ. మా. పా. పచ్చక్ఖ-.
<సం. ప్రత్యక్ష-.

**పత్తైభాదరీ** రూ. పత్తైబాద్రీ. వి. ఒకఆభరణం.

ఉ. పతే-బహాదుర్. గెలుపుగల పరాక్రమవంతులు; పార. పతే. విజయం, గెలుపు, బహాదుర్. బలంగల, ధైర్యవంతుడయిన, శక్తిగల.
<ఉ. పతే-బహాదుర్.

**పత్తైబాద్రీ** రూ.చూ. పత్తైబాదరీ. వి. ఒక ఆభరణం.

**పత్తైరిక** వి. ఎడికోలను పటతలో దూర్చేచోట కిందగాని పైన గాని ఎలుప నలుపలకు కొట్టేపేడు.

**పత్యార** రూ. పతేర. వి. పరపతి.

**ప్రత్రి** రూ.చూ. పత్త్రి. వి. 1. పర్ణం, ఆకు. హంస. 1.182; 2. ప్రత్రి, దేవపూజకు ఉపయోగించే దళాల సమూహం.

**ప్రత్రించు** రూ. పత్త్రించు. స.క్రి. 1. తెంపు, మట్టగించు; 2. క్రమంగా తగ్గించు.

**ప్రత్రింపు** రూ. బ్రదింపు. వి. 1. కత్తిరింపు, దర్శింపు; 2. కట్టుబడిలో క్రమంగా తగ్గించే తగ్గింపు, పెంచేపెంపు.

**ప్రత్రింపుగోడ** వి. పైఅంచువైపుకు క్రమంగా చిన్నదైన గోడ. **ప్రత్రింపుపునాది** వి. 1. పైపొందేపను, దేసుమెంటు గోడ; 2. నేలమట్టాన వెడల్పు తగ్గించి పునాదిగోడమీద కట్టినగోడ.

**పథ్యం** వి. జబ్బుచేసినప్పుడు పెట్టే ప్రత్యేకమైన ఆహారం.

సం. పథ్య-. దారికి సంబంధించినది, తగినది.
<సం. పథ్య- (అర్థవిపరి.).

**పద** చూ. **పోవు.** అవ్య. నడువు. మార్క. 1.218.

**పదం** వి. 1. గణన, సంఖ్య; 2. పద్దు. 3. పేరుపలాన్ని నిర్ణయించి ఇంటికి నిర్ణయించిన ఆయువు.

సం. పద-. స్థానం, పాదం.
<సం. పద- (అర్థవిపరి.).

**పదకము**[1] రూ. చూ. పతకము.[1] వి. లలంతిక, కంఠభూషావిశేషం. యయా. 4.89.

**పదకము**[2] రూ. పతకము[2]. వి. పద్ధతి. నిర్వ.రా. 4.31.

సం. పథక-. మార్గం.
<సం. పథక-.

**పదకవాదము** వి. పిడివాదం. బసవ. 1.505.

సం. పథక-. మార్గం, వాద-. తర్కించటం.
<సం. పథక- + సం. వాద-.

**పదకొందు** చూ. పది.

**పదకొండుం** చూ. పది.

**పదకొట్టుము** చూ. పది.

**పదచారి** వి. నాట్యభేదం. ఉ. రా. 6.139.

సం. పదచారిన్. బాటసారి;
త. పతచారి. నాట్యభేదం.
<సం. పదచారిన్.

**పదటిగలయు** చూ. పదటు[1].

**పదటిగలియు** చూ. పదటు[1].

**పదటము** రూ. పదటిమి, పదటు[2]. వి. 1. ఆత్రం, తత్తరపాటు, తొందర. విష్ణు. ఉ. 4ఆ.; 2. తొందరమాట, తొందరపని. పార్వ. 4.146.

క. పదఱు. ఎక్కువ తొందరపాటు, పనికిమాలినది మాట్లాడు, తికమకపడు, ఆత్రం; పతఱు (పతఱ్-)- తికమకపడు, త్వరపడు, ఆత్రం, పతఱుమ్-. తొందర. పతై (పతైప్పు- పతైత్-). కంగారుపడి తిరుగు, బాధలో ఉండు, వణుకు, పతపత్-ఎనల్. గుండె వణకటాన్ని తెలియచేయు; మ. పతఱుక- త్వరపెట్టు, తికమకపడు, పతఱక్క. కలవరపెట్టు, పతపత-. బున్నుమని పొంగటం, పతుపత-. బుడగలులేచు, మాల్తొ. ప్దరె పద్కరె-. పిచ్చిమాటలాడు.

**పదటఁబుచ్చు** చూ. పదటు[1].

**పదటి** రూ.చూ. పదరు. వి. ధూళి. ఆం. భా. 2.220.

**పదటిపాలగు** చూ. పదటు[1].

**పదటిపాలుచేయు** చూ. పదటు[1].

**పదటిమి** చూ. పదటు[2].

**పదటు[1]** రూ. చూ. పదరు. వి. దౌ. ధూళి, బుగ్గి, భార. శాంతి. 5.480.

**పదటఁగలయు** రూ.చూ. పదటఁగలియు. అ.క్రి. బూడిద పాలగు. వ్యర్థమగు. శివరా. 3.62. **పదటఁగలియు** రూ. పదటఁగలయు. అ.క్రి. బూడిదపాలగు, వ్యర్థమగు, భార. శాంతి 5.480. <పదటు[1] +- అ[7]+ కలియు. **పదటఁబుచ్చు** స.క్రి. బూడిదలో కలుపు. సత్య. సాం. 4.57. <పదటు[1] +- అ.[7] +- పుచ్చు. **పదటిపాలగు** అ.క్రి. వ్యర్థమగు. వరాహ. 5.52. **పదటిపాలుచేయు** స.క్రి. భ్రష్టంచేయు, పాడుచేయు. బసవ. 7.916పం. **పదటుచేయు** స.క్రి. బూడిదగా చేయు, తృణీకరించు. ఉ. హరివం. 4.95.

**పదటు[2]** రూ.చూ. పదటము. వి. ఆత్రం, తొందర. విష్ణు. 1.ఆ.

**పదటిమి** రూ.చూ. పదటము. వి. భయాదులచే కలిగే తొందర, ఆత్రం. ఉ. హరివం. 372.

**పదరు** రూ. పదటి, పదటు[1]. వి. 1. బూడిద, భస్మం. పండి. చ. 2.138వ: 2. గుండ, చూర్ణం, పొడి. చంద్ర. రే. 1.65.

త. పతటి-. పొట్టు, రాలు, ఊక; మ. పతిర్-. పొట్టు, ఊక.

<త. పతటి.

**పదరి** వి. పారావత విశేషం, ఒకజాతి పావురం. సారంగ. 1.117.

సం. పతత్రిన్. పిట్ట.

<సం. పతత్రిన్.

**పదవక** వి. అడుగురాయి, ఇంటినేలమీద పరిచే పలుపనిరాయి.

**పదవికారి** వి. పీచునిచ్చేమొక్క (Urena sinuata).

**పదవిచ్చు** చూ. పదను[2].

**పదను[1]** రూ. అదను. వి. దౌ. అనా. 1. అనుకూల్యం, అనుకూలస్థితి. భార. ఉద్యో. 3.69: 2. యుక్తసమయం. తరి. సమయం. భార. ఉద్యో. 3.163; 3. విధం, రీతి. కళ. 1.79; విశే. పరిపక్వం. రం. రా. సుందర. 2.45 ప. 18పం.

క. హదను. యుక్తసమయం.

**పదను[2]** రూ. పదును, పొదును. వి. దౌ. అనా. 1. ఆర్ద్రత, తడి. భార. అను. 2.175; 2. దున్నటానికి తగినంత వాన; 3. చెంగుకంవాన; విశే. 1. త్రాగటానికి. జీర్ణించుకోవటానికి అనుకూలంగా ఎక్కువ పలచన మిక్కిలి గట్టికాకుండా చేసిన. దశకు. 1.160; ఆర్ద్రత, తడిసిన. పారి. 4.72; 3. బురదకల. వసు. 2.11.

తు. పదమ్పుని-. తడియగు, పదనుని, పదఱుని-. తడియగు చలిగాఉండు; త. పత (-ప్పు-, త్త్-). తడిగా అగు బురదమైన, పతమ్. నీరు తడి; కో. పద్మ్-. వర్షం పడిన తరవాత నేలయొక్కతడి; కుయి. పెతె- మెత్తని మరియు తడిసిన, బెదెబెదెఇన్పు. తడిగాఉండు, మెత్తని. పుహా (పుహి-). తడియగు, పుహ్పు (పహ్త్-). తడిచేయు; బ్రా. పుదెన్. చల్లని, చలి, మెల్లని. పుదే. చల్లదనం.

**పదవిచ్చు** అ.క్రి. తడుపు. భాగ. 10ఉ. 331. <పదను[2]+ఇచ్చు. **పదనుకాను** అ.క్రి. 1. తడియు. పాండు. 4; 2. రసవంతమగు. కవిక. 3.14. **పదనుచెడు** అ.క్రి. పాడంచెడు. **పదనుదీర్చు** (-తీర్చు) అ.క్రి. తడి ఆరు, సారవిహీనమగు. హర. పీఠి. 2. **పదనుతివిసినకస్తూరి** వి. తడిఆరిపోయిన కస్తూరి, చెడిపోయిన కస్తూరి. పాండు. 3.22.

**పదను[3]** వి. దౌ. అనా. తీక్ష్ణత, వాడిమి, క్రూరత్వం. భార. విరా. 5.354; విశే. తీక్ష్ణం, వాడియైన. ప్రబోధ. 1.80.

క. పద-. సరియైనలేక మంచిస్థితిలేక పరిస్థితి: త. పతమ్. వాడియైన, చురుకుదనం, పండినబియ్యం; మ. పతమ్. పరిపక్వం, ఉష్ణోగ్రతయొక్క సరియైన కొలత. కో. పద్మ్. ఇనుంన్వభావం; తొ. పాథ్, పాథిల్. ఆకుపచ్చ, పాథ్ఫా. స. స్వచ్ఛమైనపాలు; మాల్తొ; పతొ. పదను, పత్రె. పదునుచేయు, పత్తి. విధం, రీతి.

**పదనుకాను** రూ. పదనుగాను. అ.క్రి. 1. మెరయు, ప్రకాశించు. పాండు. 4.83; 2. మనోజ్ఞమగు. కవిక. 3.14. **పదనుగాను** రూ. చూ. పదనుకాను. అ.క్రి. అధికమగు, అతిశయించు. కవిక. 2.203. **పదనుతప్పు** అ.క్రి. తీక్ష్ణతనువిడుచు. కాశి. 3.84. **పదనుదివియు** (-తివియు) అ.క్రి. మొనతేరు. పాండు. 3.182. **పదనుపెట్టు** స.క్రి. నిశితంచేయు, వాడికలదిగాచేయు. యయా. 2.68.

**పదపడి** రూ. పదంపడి. అవ్య. 1. మరియు. భార.ఆది. 1.63; 2. వెనుక, పిమ్మట, తర్వాత. భార.అరణ్య. 1.897; 3. అప్పుడు. ఆసమయంలో. భార.భీష్మ. 1.241; 4. వెంటనే. పీర.వి. 1.73.

**పదపడు** రూ.చూ. పదంపడు. అ.క్రి. 1. పూను, యత్నించు. భాగ. 3.97; 2. స్థానమగు, గురిఅగు. రాజవా. 2.37.

**పదముత్తుము** చూ. పది.

**పదమూడు** చూ. పది.

**పదంపడి** రూ.చూ. పదపడి. అవ్య. 1. పిమ్మట, తరువాత, వెనుక. భార.ఆది. 1.131; 2. మరియు. విజ్ఞా.ప్రా. 64.

**పదంపడు** రూ. పదపడు. అ.క్రి. యత్నించు, పూను. ఉ.హరి. 2.197.

**పదర** రూ. పదరం. వి. మడతలో ఒకవైపు భాగం, పొర.
క. పదర, పదరు. గుడ్డ మొ॥ వాటి మడత, మరా. పదర.

**పదరం** రూ.చూ. పదర. వి. 1. మడతలో ఒకవైపు భాగం, పొర; 2. రాళ్ళలో ముఖ్యంగా మస్తురాళ్ళలో రేకులు రేకులుగా కనిపించే నన్నటి పల్చటి రాతిపలక.

**పదరము** రూ.చూ. పదరికము. వి. తమలపాకుల్ని పడిలపరచే పాత్ర, ఆడపం. చంద్రరే. 1.92.

**పదరికము** రూ. పదరము. వి. పెట్టె. జైమినిభా. 8.56.

**పదరికొను** చూ. పదరు.

**పదరు** చూ. పదటము. రూ. పదురు[1], పదరు. అ.క్రి. 1. కినియు, కోపించు. భార.ఆది. 2.46; 2. త్వరపడు, తొందరపడు, తహతహపడు. భార.ఆది. 5.98; 3. క్షోభించు, కోపభయాదులచే కలతపొందు. భార.శాంతి. 1.47; 4. పలుకు, మాట్లాడు. భార.శాంతి. 4.409; 5. పేలు, అసందర్భపుమాటలాడు. భాగ. 7.270; 6. కూయు, అరచు. ద్వి.పరమ.వి. 4.385 పు. 8 పం.; 7. డంబాలుపలుకు, డాబులుకొట్టు. బహుళా. 2.29; 8. చలపట్టు, మచ్చరించు. బహుళా. 3.76; 9. చలించు. వాల్మీ. 2.17; స.క్రి. ఆక్షేపించు, పరిహసించు, దూషించు. భార.ఆది. 5.251; వి. 1. గర్రు. బసవ. 7.104; 2. ధ్వని. ఆము. 4.102; 3. పలుకు, మాట. కళా. 6.100; 4. క్షోభ, కలత. కకుత్స. 3.107; 5. అరపు. శుక. 3.278; 6. త్వరితోక్తి. ఆం.భా. 1.118.
క. పదఱు. ఎక్కువ తొందరపాటు, పనికిమాలినమాటలాడు; త. పతఱు. అతితొందర, తికమకపడు, పతఱ్ఱమ్. తొందర, పత్తై. వణుకు, తొందరపడు; మ. పతఱుక. అతితొందర, తికమకపడు; మాల్తో. ప్దర్-, పద్కర్. పిచ్చిమాటలాడు, పనికిమాలినమాటలాడు.
<మూ.ద్రా. *పత్- అఱ్.
**పదరికొను** స.క్రి. తొందరపెట్టు. కు.సం. 5.150.

**పదలము** రూ.చూ. పదులము. వి. అరవీసె, అడిసేరు (1/2 వీసె = రెండు ఏబులాలు = 60 తులాల ఎత్తు).

**పదవి** వి. 1. సంపద. ఉ.రా. 3.92; 2. ఉన్నతస్థితి.
సం. పదవి. అధికారం, అధికారస్థానం.
<సం. పదవీ (అర్థవిపరి.).

**పదవు** రూ.చూ. పదువ. వి. గుంపు.

**పదస్థ** విశే. 1. అధికమైన; 2. అమూల్యమైన.

**పదస్థుడు** వి. అధికారంలోఉన్నవాడు.
సం. పదస్థ-. స్థానంలోఉన్నవాడు.
<సం. పదస్థ-.

**పదహారు** చూ. పది.

**పదహార్తుం** చూ. పది.

**పదహార్దుం** చూ. పది.

**పదారము** వి. చిరుదం.

**పదార్తుం** చూ. పది.

**పదార్దుం** చూ. పది.

**పదార్వాళ్లదొర** చూ. పది.

**పదార్వురు** చూ. పది.

**పదాఱింటతరమునుగాఁగ** చూ. పది.

**పదాఱింటితరము** చూ. పదాఱు.

**పదాఱు** చూ. పది.

**పది** సర్వ. సం. దశార్థకం, తొమ్మిదిన్నొకటి. భార.ఆది. 1.265, హనుమకొండ శాసనం. క్రీ.శ. 1079.
క. పత్తు, హత్తు. పది; తు. పత్తు, పత్, పదు-, పదున్, -ప-, -ప-. పది; త. పత్తు, పక్తు, పతిన్-, -పతు. పది, పతిన్పర్. పదిమంది, పత్తృత్తు. పదుహ్లో; మ. పత్తు, పతు. పది, పతుప్పత్తు-. పదుహ్లో; కో. పత్, పద్, పద్ను, పన్, పాన్, పాద్, -వత్, బత్, -అత్. పది, పతత్. పదుహ్లో; తొ. పొత్, పొన్, -ఫొత్, -పొత-, -పొత్, -ఒత్. పది; గోం. పద్, పది. పది; కొలా. పది, పది. పది;
పో.చూ. సం. పంక్తి. వరుస. సమూహం; ప్రా. పంతి.
<మూ.ద్రా. *పత్.
**పద్దెనమండుం** రూ.చూ. పద్దెనమిండుం. వి. 18 తూముల ధాన్యం కొలత. **పద్దెనిమిది** రూ.చూ. పదునెనిమిది. సర్వ. పది ఎనిమిది. **పద్దెనమండుం** రూ. పద్దెనముండుం, పద్దెనముండుం. వి. ధాన్యం కొలత, 18 తూములు. **పదకొండు** సర్వ. పదిమీద ఒకటి, 11 సంఖ్య. **పదకొండుం** రూ.చూ. పదుకొల్తుము. వి. ధాన్యపుకొలత, 11 తూములు. **పదకొల్తుము** రూ. పదకొండుం. వి. పదకొండు తూముల పరిమాణం. **పదముత్తుము** వి. పదమూడు తూముల పరిమితి. **పదమూడు** సర్వ. పది + మూడు, పన్నెండు ఒకటి. **పదహారు** రూ.చూ. పదాఱు. సర్వ.సం. 16 అనే సంఖ్య. **పదహార్తుం** రూ.చూ. పదియార్దుము. వి. ధాన్యపు కొలత, 16 తూములు. **పదహార్దుం** రూ.చూ. పదియార్దుము. వి. ధాన్యపు కొలత. 16 తూములు. **పదార్తుం** రూ.చూ. పదియార్దుము. వి. ధాన్యపు కొలత, 16 తూములు. **పదార్దుం** రూ.చూ. పదియార్దుము. వి. ధాన్యపు కొలత. 16 తూములు. **పదార్వాళ్లదొర** వి. చంద్రుడు. అం.పదా. సుర. 23. < పది + ఆఱు + పాలు[1] + -లు + దొర. **పదార్వురు** రూ. పదునార్వురు. సర్వ.బ.వ. పదహారుగురు మహన్మహత్వర్ధకరూపం, పదహారుమంది. భార.ఆది. 3.65. < పది + అర్వురు. **పదాఱింటతరమునుగాఁగ** అవ్య. ద్రు. అప్పటంగా. శుక. 2.419. **పదాఱింటితరము** వి. ప్రశస్తం. ఉ.హరి. 3.117. **పదాఱు** రూ. పదహారు, పదియాఱు, పదునాఱు. సర్వ.సం. 1. పదహారు. షోడశార్థకం. 16 అనే సంఖ్య. భార.అరణ్య. 2.293; 2. పదహారవది, శుక. 2.418. < పది + ఆఱు. **పదిఏడ్** రూ. పదియేను, పదిహేడు, పదునేడు, సర్వ. పదిహేడు, 17 అనే సంఖ్య. ద.హిం.గా.సంపు. 10 గా.సం. 16 క్రీ.శ. 909. **పదిఏడుం**

పన్నెకట్టే జంత్రం బొమ్మలకు బిగించిన దండెలమధ్య జొన్న, కొన్నిటోట్ల, కలప, గలుగు, పుల్లలు, దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా బిగించి పన్నెతయారు చేయు. పవ్నెగట్టువాళ్ళు రూ. చూ. పన్నుగట్టువాళ్ళు. పుం.బ.వ. పన్నెలు తయారుచేసేవాళ్ళు. పవ్నెగట్టుసాయేబులు వి.బ.వ. పన్నెలుతయారుచేసే తురకలు. పవ్నెగట్లవాళ్ళు విఙ. బ.వ. పన్నెలు తయారుచేసేవాళ్ళు. పవ్నెగర్ద వి. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టిన పైభాగం. పవ్నెగది రూ. పైనగది, పైనెగది. వి. పన్నెదండెలకు బిగించిన పుల్లలమధ్య వెలితి. పవ్నెగాడి వి. మరమగ్గం పలకకు, పన్నెబిగించటానికి చేసిన సందు. పవ్నెగూడు రూ. పనిగూడు, పనెగూడు. వి. పన్నెదండలకు బిగించిన పుల్లలమధ్య వెలితి. పవ్నెగెర్దం వి. తయారైన పన్నెలో అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టినపైభాగం. పవ్నెగోర రూ. పన్నెగోడు. వి. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టిన పైభాగం. పవ్నెగోరు రూ.చూ. పన్నెగోర. వి. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టిన పైభాగం. పవ్నెచూరు రూ. పన్నెనూరు. వి. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురు దండెలు బిగించి కట్టిన పైభాగం. పవ్నెతుంట వి. మరమగ్గం చట్రంలో మామూలు పన్నె అమర్చగా మిగిలిన ఖాళీని నింపటానికి పెట్టిన చిన్నపన్నె. పవ్నెదండె రూ. పనిదండ, పనిదండి, పనిదంతె, పనెదండె, పనెదండెం, పన్నెదండెం, పైనదండె, పైనిదండె. వి. 1. పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; 2. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద. పవ్నెదండెం రూ.చూ. పన్నెదండె. వి. 1. పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం; 2. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద. పవ్నెదబ్బ రూ.చూ. పన్నెబద్ద. వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద. పవ్నెదవక వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద. పవ్నెదిండు వి. తయారయిన పన్నెలో ఈనెపుల్లల వరసకు చివరబిగించిన వెదల్పుబద్ద. పవ్నెపుల్ల వి. 1. పన్నెకట్టుబడిలో ఈనెలవరసకు చివర బిగించిన వెదల్పు బద్ద; 2. పన్నె కట్టుబడిలో దండెలమధ్య దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న, కలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటిపుల్ల; 3. పన్నెకట్టుబడిలో ఈనెలబిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం. పవ్నెబద్ద రూ. పన్నెదబ్బ. వి. 1. పన్నెకట్టుబడిలో ఈనెపల్లల వరసకు చివర బిగించిన వెదల్పుబద్ద; 2. పన్నెకట్టుబడిలో ఈనెలబిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురుబెత్తం. పవ్నెబద్దె వి. అచ్చుకుక్కటానికి సుమారు బెత్తెడు వెదల్పు నేసి చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ. పవ్నెబల్ల వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పు బద్ద. పవ్నెబిళ్ళ వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరుసకు చివర బిగించిన వెదల్పుబద్ద. పవ్నెబెంతు రూ. పన్నెబెండు. వి. అల్లుచేసేటప్పుడు పడుగు పోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు. పవ్నెబెండు రూ. చూ. పన్నెబెంతు. వి. అల్లుచేసేటప్పుడు పడుగు పోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు. పవ్నెముక్కలదొడ్డి వి. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి మగ్గానికి పైన అమర్చిన దొడ్డిలో రాళ్ళుదూర్చిన ఈనెల చట్రం. పవ్నెముల్లు వి. అచ్చు కట్టేటప్పుడు పన్నెగూళ్ళలో పోగులు దూర్చేపుల్ల. పవ్నెవాడు విఙ. పన్నెలు తయారుచేసేవాడు. పవ్నెసిబర వి. పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపు కోసం అడ్డంగా అమర్చిన కట్టిన వెదురు బెత్తం. పవ్నెసూరు (-చూరు) రూ.చూ. పన్నెచూరు. వి. తయారయిన పన్నెలో అడ్డంగా వెదురుదండెలు బిగించి కట్టిన పైభాగం.

పవ్నెండు చూ. పది.

పవ్నెండూళ్లపారావత్తు చూ. పది.

పవ్నెశ రూ.చూ. పన్నస. వి. పొలం, పసన. కపిలేశ్వరపురం శాసనం. క్రి.శ. 740.

పవ్వడు చూ. పన్ను.

పవ్వరి చూ. పన్ను.

పన్ను రూ.చూ. పంపు[1]. స.క్రి. నియోగించు, ఆజ్ఞాపించు. భార. సభా. 1.89 ; వి. నియోగం, ఆజ్ఞ, ఆజ్ఞాపించినపని. భార. అరణ్య. 5.416.

పన్వడు రూ.చూ. పనుపడు. స.క్రి. పొందు ; అ.క్రి. 1. కలుగు, ఉండు ; 2. పొడవు, సంభవించు ; 3. తగు, అర్హమగు ; 4. ప్రకటమగు ; 5. వశమగు, లొంగు ; 6. సిద్ధపడు ; 7. అలపడు ; 8. ఒప్పు ; 9. కడగు, పూను ; 10. అడగు, నిగూఢమగు ; 11. దృఢమగు ; 12. అగు, పరిణమించు. పవ్వరి రూ.చూ. పనుపరి. వి. ఆజ్ఞకు లోబడినవాడు.

పవ్మక్తా వి. కొంత పన్నుమాత్రమే చెల్లించవలసిన ఇనాం.

ఇం. *Pawn*. తాకట్టు ;

ఉ. మక్తా. కౌలుకు తీసుకున్న భూమి.

< ఇం. Pawn + ఉ.మక్తా.

పవ్య రూ.చూ. పన్నె. వి. దువ్వెన.

పవ్యారము రూ.చూ. పణ్యారము. వి. పడపప్పు.

పవ్లసుత్తె చూ. పన్ను[3].

పవ్వి వి. పంచమన్, నదులగట్లమీద పెంచబడే ఒకరకం చెట్టు (Anogeissus acuminata).

పపంచుపేయు స.క్రి. ప్రపంచం చేయు, ప్రకటించు. ప్రభా. 3.147.

సం. ప్రపంచ-. విస్తారం, వివరణం, వ్యాఖ్యానం.

< సం. ప్రపంచ- + చేయు.

పపయ రూ.చూ. బొప్పాయి. వి. మదనాకప, ఒకజాతిఫలం. బొబ్బాస.

పప్ప[1] చూ. పప్పు.

పప్ప[2] వి. తండ్రి.

ఇం. *Papa*. తండ్రి ; ఫ్రెం. *Papa*.

< ఇం. Papa.

పప్పెటకరాయి వి. చిన్న మట్టిపాత్రలను నర్సేరాయి.

**పప్పన్నముపెట్టు** చూ. పప్పు.

**పప్పర** రూ. పొప్పరం[1]. వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క.

**పప్పరము** రూ.చూ. పొప్పరం[2]. వి. పొర.

**పప్పలమూకుడు** చూ. పప్పు.

**పప్పళము** రూ.చూ. పప్పళి. వి. స్త్రీలు ధరించే గళ్ళుకల వస్త్ర విశేషం.

**పప్పళి** రూ. పప్పళము. పప్పిళి, పొప్పళి, పొప్పిళి. వి. 1. వస్త్రంలోని వర్ణ విశేషం. పాంచాలి. 3.77 ; 2. స్త్రీలు ధరించే వస్త్ర విశేషం. చంద్రాంగ. 3.21 ; 3. గడి, ఇల్లు, చిత్రవర్ణంగల వస్త్రం. కుక. 1.148.

క. పప్పళి, పొప్పళి, పాపళి. పాప్లిన్ బట్టతో తయారుచేసిన స్త్రీల ఉడుపు ; త. పప్పళి-, వెల్లై-. చీర : ఇం. *Poplin* ; పో. పాపిలీనా ; ఫ్రెం. పాపెలేం ; స్పా. పాపెలినా ; డ. పాపెలిన్.

**పప్పళిచీర** రూ. పొప్పళిచీర, పొప్పిళిచీర, పొప్పిటిచీర. వి. నల్పుదరప గడిచీర. **పప్పళి పచ్చడము** వి. బొంత.

**పప్పాయ** రూ.చూ. బొప్పాయి. వి. బొబ్బాయిపండు.

**పప్పాయగువ్వ** వి. నల్లని తలగల మైనా పక్షి.

**పప్పిరతత్రాయి** వి. పిడతల్ని నర్రే రాయి.

**పప్పిళి** రూ.చూ. పప్పళి. వి. 1. వస్త్రంలోని వర్ణవిశేషం ; 2. స్త్రీలు ధరించే వస్త్ర విశేషం ; 3. గడి, ఇల్లు, చిత్రవర్ణం గల వస్త్రం.

**పప్పు** రూ. పొప్పు. వి. 1. సూపం. భార. ఆది. 6.291 ; 2. ఉడికించిన కందిపప్పు. శృం.నై. 6.120 ; 3. పొట్టు పోయి బద్దలైన కాయధాన్యం. దశా. 4.1015 ; 4. కొయ్య మొ. వాటి మాంసం.

క. పప్పు-. బాదం మొ. కాయధాన్యాలలో ఉండే గింజ ; త. పరుప్పు-. చిక్కుడు, బాదం మొ.వాటి కాయ లోపల ఉండే గింజ ; మ. పరిప్పు-. కాయధాన్యాలలో ఉండే గింజ ; గోం. పుర్‌పుర్, పుల్‌పుల్. కాయధాన్యాలు.

<మూ.ద్రా. *పర్‌ప్.

**పప్పు**[1] రూ.చూ. పొప్పు. వి. భక్ష్యం, పిండివంట. **పప్పన్నముపెట్టు** అ.క్రి. పెళ్ళివిందుచేయు. < పప్పు + అన్నము + పెట్టు. **పప్పలమూకుడు** వి. రెండంగుళాల లోతులో అడుగు వెడల్పుతో రెండంచుల్తో ఉండే మట్టి పాత్ర. **పప్పుఅటిక** వి. ఒకవిధమైన భక్ష్యం. ద.హిం.శా. సంపు. 6 శా.సం. 731. క్రీ.శ. 1406. **పప్పుఉడుకు** అ.క్రి. అటలుసాగు. **పప్పుకట్టు** వి. పప్పువేసి కాచిన చారు. **పప్పుకుండ** రూ. పొప్పుకుండ. వి. పప్పు వండటానికి వాడే మట్టి పాత్ర. **పప్పుకూర** వి. 1. ఒకరకం ఆకుకూర ; 2. కూర లాగ వండిన పప్పు. **పప్పుగుత్తి** వి. రంగులు కలిపే ఒక రకం గరిటె. **పప్పుగోంగూరచీర** వి. 1. నలుపు, పసుపు వన్నెల్లో పడుగు. పేకనేసిన కలనేత చీర ; 2. సుమారు అరవై పోగుల చొప్పున రెండురంగులు పెట్టి పడుగు, పేక నేసిన చీర. **పప్పుచారు** వి. 1. పప్పుపులుసు ; 2. కంది పప్పు వేసి చేసిన చారు. రసం. **పప్పుచిడి** వి. భక్ష్య విశేషం. ద.హిం.శా. సంపు. 835, క్రీ.శ. 1391. **పప్పుచేయు** స.క్రి. నురుంచేయు, సంహరించు. కవిక. 2.154. **పప్పుజారిపట్టుజారు** అ.క్రి. జావయిపోవు. నీళ్ళుకారిపోవు. **పప్పుటెంకి** వి. సెనగపప్పు మొ. వాటిని వేయించటానికి వాడే మట్టిపాత్ర. **పప్పుతెడ్డు** వి. 1. రంగులు కలిపే కొయ్య గరిటె ; 2. ఎక్కడబడితే అక్కడ కూర్చునేవాడు. **పప్పుపత్తి** వి. పప్పు ఉడికిన తర్వాత ఎనిమే కొయ్య సాధనం. ముద్ద కవ్వం. **పప్పుపిండె** వి. లేతకాయ. **పప్పుపెనము** వి. సెనగ పప్పు మొ. వాటిని వేయించటానికి వాడే మట్టిపాత్ర. **పప్పుమండ** వి. సెనగపప్పు మొ. వాటిని వేయించటాని· అర్ధగజం వెడల్పుతో చీలు పంచుతో లోపల గీతలుగీసి ఉండే మట్టిపాత్ర. **పప్పులోఅడుగువేయు** అ.క్రి. తప్పు చేయు. **పప్పులోకాలువేయు** అ.క్రి. పొరపాటుచేయు. **పప్పుపుద్ద** వి. ఎక్కడబడితే అక్కడ చతికిలబడేవాడు. చురుకు దనం లేనివాడు. **పప్పెసల** రూ. పప్పెసలె. వి. పప్పు వండుకోవటానికివాడే చిన్న మట్టిపాత్ర. < పప్పు + ఎసల. **పప్పెసలె** రూ.చూ. పప్పెసల. వి. పప్పు వండుకోటానికి వాడే చిన్న మట్టిపాత్ర.

**పప్పెసల** చూ. పప్పు.

**పప్పెసలె** చూ. పప్పు.

**పప్పోయ** రూ.చూ. బొప్పాయి. వి. మదనానప, ఒకజాతి ఫలం.

**పబువు** వి. ప్రభువు. రాజు. ఏలిక.

సం. ప్రభు- ; ప్రా. ప్రభు, పహు. యజమాని, ఏలిక, రాజు, అర్హుడు, పరమేశ్వరుడు ; పా. పభు ;

క. పబు, హాబు ; తు. పర్బు ; మ. పర, వో, పరో.

<ప్రా. పభు-.

**పబ్బ** వి. నర్విచెట్టు మాదిరిగా ఉండే ఒకరకం చిన్నచెట్టు (Colamus rotang: Limn).

**పబ్బటు** వి. పై పొర. పైకప్పు. లక్ష్మి. వి. 5.5.

హిం. పపడే, పప్‌డా, పప్‌డి-. సన్నని ఎండిపోయిన కొయ్యబెరడు. రొట్టెపొర, కురుపుమీదిపొర ; ఉ. పప్‌డా. రొట్టెపొర, ఎండిన కొయ్యబెరడు.

<హిం. పప్‌డా.

**పబ్బటుచీటి** వి. సంచిలో ఉంచిన ఉత్తరం. లక్ష్మి. వి. 5.5.

**పబ్బతిపట్టు** అ.క్రి. అంజలి ఘటించు.

**పబ్బము** వి. 1. భోజనం. నార. పంచ. 5.56 ; 2. పండుగ. రామాభ్యు. 429 ; 3. ఉత్సవం. కుక. 2.520.

సం. పర్వన్-. ఉత్సవం ; ప్రా. పబ్బ- ; ప్రా.జై. మహా. శౌ.అ.మా. పవ్వం ;

క. పబ్బ. పర్బ, హబ్బ. ఉత్సవం, పండుగ ; తు. పబ్బ. పర్బ ; త.మ. పరువమ్ ; గ. పర్వాబ్.

<ప్రా. పబ్బ-.

**పబ్బముపెట్టు(-పెట్టు)** అ.క్రి. భోజనంపెట్టు. శివరా. 4.81.

**పబ్బవ** చూ. ప్రబ్బ. వి. నదీతీర ప్రాంతాల్లో పెరిగే అంద మైన ఒకరకం మొక్క (Tamarix ericoides).

**పబ్బు** వి. తీగెలు అల్లుకోవటానికి దోహదంగాపెట్టే దడి లేదా నిలువకొయ్య.

**పబ్బుపరుపు** వి. కమ్మపరుపు. మట్టికప్పుమీద ఆకులు పేర్చటం.

**పబ్లిక్** రూ. పబ్లికు. విశే. 1. ప్రజాసంబంధమైన ; 2 బహిరంగమైన. వి. ప్రజానీకం.

ఇం. *Public*. ప్రజాసంబంధమైన.

< ఇం. Public.

**పబ్లిషరు** వి. గ్రంథ ప్రచురణకర్త.

ఇం. *Publisher*. గ్రంథ ప్రచురణకర్త.

< ఇం. Publisher.

**పబ్లీకు** రూ.చూ. పబ్లికు. విశే. అందరికీచెందిన. బహిరంగమైన.

**పమిట** రూ.చూ. పైట. వి. స్త్రీల రొమ్ముల మీది వస్త్రం. **పమిటఅద్దకంకమ్మి** వి. పేకదారం ఏరంగులో ఉంటే అదే రంగు పైటకొంగుకు అద్దినకమ్మి. **పమిటచెరగు** రూ. పమిట సెరగ, పైటచెరగు, పైటచెరుగు, పైటసెరగు. వి. చీర కట్టుకున్నప్పుడు భుజంమీద వేలాడేటట్లు వేసుకొనే చివరి మూరెడు భాగం. **పమిటలువేయు** అ.క్రి. పయ్యెదలు వేసుకొను. **పమిటసెరగ(-చెరగు)** రూ.చూ. పమిటచెరగు. వి. చీర కట్టుకున్నప్పుడు భుజంమీద వేలాడే టట్లు వేసుకొనే చివరి మూరెడు భాగం.

**పమిటి** రూ.చూ. పైట. వి. స్త్రీల రొమ్ము మీది వస్త్రం.

**పమిటిఅంచు** వి. బట్ట అడ్డ కొనలో నేసిన భాగం. **పమిటికండువా** రూ. పైటుకండవా, పైటకండువా, పైటికండువా. వి. ఆడపిల్లలు పరికిణీ మీద నడుముకు చుట్టుకొని పైన కప్పుకొనే బట్ట. **పమిటికొంగు** వి. చీర కట్టుకొన్నప్పుడు భుజం మీద వేసుకొనే చెరగు. **పమిటిచెంగు** రూ. పైటచెంగు. వి. చీర కట్టుకొన్నప్పుడు భుజం మీద వేలాడేట్టు వేసుకొనే చివరి మూరెడు భాగం.

**పమిటె** రూ. పైట. వి. పైటకండువా, ఆడపిల్లలు నడుముకు చుట్టుకొని పైన కప్పుకునే బట్ట.

**పమిడి** రూ.చూ పసిడి. విశే. బంగారం.

**పమిడికంటి** రూ. పమిడికంటిక. వి. తోడేలు. **పమిడికంటిక** రూ.చూ. పమిడికంటి. వి. తోడేలు. **పమిడితంగేడు** వి. తోటల్లో పెంచబడే ఒకరకం మొక్క. **పమిడివత్తి** రూ.చూ. పైడిప్రత్తి. వి. ఒకరకం పత్తి, దీన్ని ఎక్కువగా దీపం వత్తులకు వాడతారు.

**పమిద** రూ.చూ. ప్రమిద. వి. దీపం వెలిగించే చిన్న మట్టిపాత్ర.

**పమిది** రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టి పళ్ళెం.

**పమిదె** రూ.చూ. ప్రమిద. వి. దీపం వెలిగించే చిన్న మట్టి పాత్ర.

**పమిందె** రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టి పళ్ళెం.

**పముజు** రూ.చూ. పంజు[1]. వి. 1. కరదీపం ; 2. గడ్డి మొ. వాటి దుబ్బు, స్తంభం.

**పంపకము[1]** చూ. పంపు[1].

**పంపకము[2]** చూ. పంపు[3].

**పంపర** వి. పశురోగ విశేషం, పశువులకు చెలపన గడ్డ లేవటం. నవనాథ. 1.41 వ. 8 పం.

**పంపరపనస** రూ. పంపర పనాస, పంపరమాస, పంపలమాసం, పంపలమాసి, పొంపరపనస. వి. నారింజ జాతికి చెందిన పెద్ద కాయలుకాసే ఒకరకం చెట్టు (Citrus decumana-typica).

డచ్ *Pampelmoes*. నారింజజాతికి చెందిన పండు ; త. పంపలిమాసు.

< డచ్ Pampelmoes.

**పంపరపనాస** రూ.చూ. పంపరపనస. వి. పంపరపనస.

**పంపరమాస** రూ.చూ. పంపరపనస. వి. పంపరపనస.

**పంపలమాసం** రూ.చూ. పంపరపనస. వి. నారింజ జాతికి చెందిన పెద్దకాయలు కాసే ఒకరకం చెట్టు.

**పంపలమాసి** రూ.చూ. పంపరపనస. వి. నారింజ జాతికి చెందిన పెద్ద కాయలుకాసే ఒకరకం చెట్టు.

**పంపించు** చూ. పంపు[1].

**పంపిడు** చూ. పంపు[1].

**పంపిడి** చూ. పంపు[3].

**పంపిణీ** చూ. పంపు[3].

**పంపిన** రూ. పంపెన. వి. లేత పసుపురంగు మెత్తని కలప కలిగిన నిరుపయోగమైన చెట్టు (Oroxylum indicum).

**పంపు[1]** రూ. పనుపు, పన్పు. స.క్రి. 1. పంపించు, పోవచేయు. కలమళ్ళగానసం. క్రీ.శ. 576–600 ; 2. ఆజ్ఞాపించు, నియోగించు. నిర్వ.రా. 5.102 ; 3. విధించు, ఏర్పరుచు. వరాహ. 10.44 ; 4. (కృత్య మొ॥ వాటిని) ప్రయోగించు. ఆము. 2.24 ; వి. 1. ఆజ్ఞ, నియోగం. భార.ఆది. 2.34, ద.హిం.గా.సంపు. 10. గా.సం. 194. క్రీ.శ. 1176 ; 2. ఆజ్ఞాపింపబడినపని. నిర్వ.రా. 8.82 ; 3. (మారణ కర్మల్లో ప్రయోగించే) శక్తి, కృత్య. ఇందు. 3.57 ; 4. అభిచారం, ప్రయోగం. లక్ష్మి. వి. 1.19 ; 5. చంపే క్షుద్రవిద్యా ప్రయోగం.

**పంపకము[1]** వి. పంపటం, అరగచేయటం, అంపకం. హరభక్తవిలాసము 1 ఆ. **పంపించు** స.క్రి. పంచు, అరగచేయు. < పంపు[1] + -ఇంచు[3]. **పంపిడు** స.క్రి. ఆజ్ఞాపించు. కవిక. < పంపు[1] + -ఇడు. **పంపుచేయు** రూ.చూ. పంపపేయు. స.క్రి. 1. కొట్టు, ప్రహరించు. కవిక. 2.154 ; 2. ప్రయోగించు ; అ.క్రి. ఆజ్ఞను నిర్వర్తించు. **పంపులిడు** స.క్రి. శాసించు. శగా. 3.33. < పంపు[1] + -లు + ఇడు. **పంపులుపంపు** స.క్రి. ఆజ్ఞాపించు. భాగ.సం. 5.158. **పంపుపడు(-వడు)** అ.క్రి. ఆజ్ఞ గొను. జైమినిభా. 4.122. **పంపుపెట్టు(-వెట్టు)** స.క్రి. 1. ఆజ్ఞాపించు. జైమినిభా. 2.26 ; 2. ప్రయోగించు. చంద్రాంగ. 5.104. **పంపుపేయు(-చేయు)** రూ. పంపుచేయు. అ.క్రి. ఆజ్ఞను నిర్వర్తించు. మను. 3.128 ; స.క్రి. 1. ప్రయోగించు. దశా. 2.338 ; 2. కొట్టు, ప్రహరించు.

**పంపు[2]** వి. గాలి మొదలైనవి ఎక్కించే గొట్టం.

ఇం. *Pump*. గాలి మొ. వి ఎక్కించే గొట్టం.

< ఇం. Pump.

పంపుకాల్వ వి. ఏటినుంచి చీలే పెద్ద కాలవ. పంపు కూజా వి. పక్క భాగంలో గొట్టాయి అమర్చిన కూజా. పంపుగొట్టు(-కొట్టు[1]) అ.క్రి. 1. ప్రేరేపించు; 2. ఉబ్బించు.

పంపు[3] వి. 1. భాగ విశేషం, క్షేత్రం, పొలం. ద.హిం.గా. సంపు. 5. గా.సం. 29. క్రీ.శ. 1324; 2. దాయ విభాగం. నెల్లూరి శాసనాలు 30. క్రీ.శ. 1346; 3. భాగం. ఆం.భా. 2.275; 4. తులామాన విశేషం, వీసెలో ఎనిమిదో భాగం, వీసెలో నాలుగో భాగం అని కొందరు; 5. కోట, చేను మొ. వాటిలోని భూభాగం; 6. శూన్యం.

క. పచ్చు, పచ్చు. భాగం, వంతు, పమ్పు. సమాన భాగం, విభాగం; త. పయల్. సగం, భాగం.

పంపకము[2] వి. పంచటం, విభజించటం. క. పంప. సమభాగం. పంపిణి రూ. పంపిణీ. వి. పంచి పెట్టటం. పంపిణీ రూ.చూ. పంపిణి. వి. పంచిపెట్టం.

పంపెన రూ.చూ. పంపిన. వి. లేత పసుపురంగు మెత్తని కలప కలిగిన నిరుపయోగమైనచెట్టు (Oroxylum indicum).

పంబ[1] వి. పణవం, చర్మవాద్యవిశేషం. హంస. 3.29.

త. పమ్పు(పమ్పి-). పమ్మ(పమ్మి-). శబ్దంచేయు, పమ్పల్. శబ్దం, పమ్పై(పంపై). ఒకరకం వాద్యం, చిన్నడోలు;

సం. పణవ-. వాద్యవిశేషం; ప్రా. పణవ-. డోలు, వాద్యవిశేషం; అ.మా. పణవ-. సంగీతసాధనం; పా. పణవ-. చిన్న డోలు.

పంబకా(డు వి. పంబవాయించేవాడు. రామలిం. శ. 23. పంబలపాట వి. పంబలవారు పాడే పాట. పంబలవా(డు విణ. పంబవాయించేవాడు.

పంబ[2] వి. ఏకినప్పుడు విడివడిన దూది.

పంబకంతాడు వి. బండికాడినుంచి పోలుగర్ర కిందగా దొలువవరకు అమర్చిన తాడు. పంబకొట్టు అ.క్రి. దూది ఏకేటప్పుడు కమాను నరం కొట్టు. పంబజోడు వి. దూది ఏకే కొయ్యపనిముట్టు. పంబరాలగొట్టు అ.క్రి. పంబరేపు.

పంబపెన వి. సువాసన కల గులాబిరంగు పూలు పూసే పెద్దచెట్టు (Heterophragma Roxburghii).

పంబు[1] రూ. పమ్ము. అ.క్రి. 1. అతిశయించు, హెచ్చు, ఉత్కృష్టమగు, గొప్పదగు. భార. ఆది. 1.46; 2. విజృంభించు, చెలరేగు. కు. సం. 6.115; 3. అచ్చమగు, నిజమగు. పండి. చ. 1.40 పు.; 4. ఒప్పు. పండి. చ. 4.291 పు.; 5. వ్యాపించు. నిర్వ. రా. 6.43; 6. కలుగు. భార. విరా. 2.139.

క. పర్వు, పర్పు, హబ్బు. వ్యాపించు, విశాలం చేయబడు; తు. పరమ్పుని, పర్పుని. వ్యాపించు, హెచ్చించు; త. పరమ్పు. (పరమ్పి-). వ్యాపించు, వ్యాకోచించు, పమ్పు (పమ్పి-). మూయబడిన, మందమైన, నిండుగాఉండు, పరుచు, పమ్మ (-పమ్మి). మూయబడిన, మందమైన, క్రిక్కిరిసిన.

మూ. ద. ద్రా. *పక్-ఉమ్పు-, *పర్-ఉమ్పు-.

పంబు[2] వి. డేరాతాడు. అష్టమ. శ. 3.171 పు. 26పం.

పంబుతాడు వి. డేరాతాడు. రసిక. 3.141.

పంబు[3] వి. ఎద్దుమీద వేసేపెద్ద సిద్దె. హంస. 5.97.

పంబోతు వి. పోతరించిన ఎద్దు.

పంబోది వి. పంచపాళి.

పమ్మకము చూ. పమ్మ.

పమ్మిక రూ.చూ. ప్రమిద. వి. ప్రమిద, దీపంవెలిగించేమట్టి పళ్ళెం.

పమ్మిద రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

పమ్మిది రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

పమ్ము రూ.చూ. పంబు[1]. అ.క్రి. 1. అతిశయించు, అధికమగు. భార.ఆది. 4.88; 2. విజృంభించు, మేనుపెంచు. మార్క. 5.245; 3. కలుగు, సంభవించు. భోజరా. 6.178; స.క్రి. 1. కవియు, మూర్కొను. పల్నా. 264; 2. నిర్మించు. వసు. 1.144; 3. (కత్తి మొ. వి) విసరు. కృష్ణరా. 3.29; 4. వర్ణించు. హంస. 2.87; 5. అంచులుమడిచికుట్టు.

పమ్మకము వి. అంచులు మడిచి కుట్టేకుట్టు. పమ్ముకొను అ.క్రి. పూను, విజృంభించు. సిం. ద్వా. 7.64.

పమ్ములు వి. అడుగు మూయగొట్టి కొద్దిగా సర్పిన పచ్చి పాత్రలు.

పయ్ రూ.చూ. పయి. క్రి. విశ. మీద. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934.

పయ రూ.చూ. పేయ. వి. చిన్నవయసు ఆవు.

పయదూడ రూ.చూ. పెయ్యదూడ. వి. ఆవుదూడ.

పయంట రూ.చూ పైట. వి. పయ్యెద. నీలా. 3.108.

పయ(ట రూ.చూ. పై(ట. వి. పయ్యెద, స్త్రీలరొమ్ము మీది వస్త్రం. మను. 6.30.

పయన రూ.చూ. పన్నె. వి. జొన్న, వెదురు మొ. వాటి ఈనెలుగాని, ఇత్తడి, ఇనుము, ఉక్కు మొ. వాటి ఊచలు గాని దువ్వెనపండ్లమాదిరిగా బిగించిన ఒకరకం పనిముట్టు.

పయనకట్టు రూ.చూ. పైనకట్టు. వి. పన్నెకట్టుబడిలో ఈనెల బిగింపకోసం అడ్డంగా రెండు వెదురుబెత్తాలు పెట్టివేసిన దారపుకట్టు; అ.క్రి. పన్నెకట్టే జంత్రం బొమ్మలకు బిగించిన దండెలమధ్య జొన్న, కొన్నిచోట్ల కలప, గలుగు వల్లలు దువ్వెన పళ్ళమాదిరిగా వరసగా బిగించి పన్నె తయారుచేయు.

పయనపుచట్టి చూ. పయనము.

పయనమగు చూ. పయనము.

పయనము రూ. పయినము, పైనము. వి. 1. ప్రస్థానం, బయలు దేరటం. గమనం. భార. ఆది. 7.37; 2. మార్గనివాసం, విడిది. కాశీ. 3.51.

సం. ప్రయాణ-. ప్రస్థానం, దాడి; అ. పయాన్. దండయాత్ర, దావు; బెం. పయాన్. దాడి, నిష్క్రమణం; ఒ. పయాణ. నిష్క్రమణం; హిం. పయాన్, పయానా. నిష్క్రమణం; గు. పియాణు(. దైర్ఘిక

సమూహం; మరా. పెణెం. మజిలీ;

క. పయణ. ప్రయాణం; త. పయణం.

<ప్రా. పయాణ-.

వయనపుచట్టి వి. ప్రయాణంలో ఎడ్లకు దానా పెట్టటానికి ఉడికించిన ఉలవల్ని తీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. వయనమగు రూ. పైనమగు. అ.క్రి. బయలుదేరు. భీమ. 4.175. <పయనము + అగు. వయనముతూగించు అ.క్రి. ప్రయాణానికి అన్ని ఏర్పాట్లుచేయు. ఆము. 2.94. వయనించు అ.క్రి. ప్రయాణమగు. <పయనము + ఇంచు[3].

వయనించు చూ. పయనము.

వయర రూ.చూ. పయ్యెర. వి. 1. గాలి, మారుతం; 2. దక్షిణపుగాలి; 3. దక్షిణపుగాలిచే పండే పెసలు మొ. కాయధాన్యం; 4. పచ్చగా పొలమంతటా లేచినమొక్కలు.

వయపు[1] వి. అగ్ని, నిప్పు.

వయరు[2] రూ.చూ. పైరు. వి. పచ్చగా పొలమంతటాలేచిన మొక్కలు.

వయరు[3] రూ.చూ. పయ్యెర. వి. 1. దక్షిణపుగాలి; 2. గాలి.

వయాట చూ. పయి.

వయాలు వి. అరుగు, తిన్నె, వేదిక.

బ. పాయాల్-. పంచటరంగు, తిన్నె, పాయల్, పయల్; స్పా. పాయో-. అరగు; ఇం. ప్యాల్. పంచటరుగు.

<పో. పొయాల్.

వయి రూ. పయ్, పయిన్, పై, పైని; క్రి. విశే. ప్రదు. 1. మీదు, ఉపరిభాగం. భార. ఆది. 1.156, అహదన కరణావసం. క్రీ.శ. 847; 2. వెనుక, వెంట, మీద సీవలిగానసనం. క్రీ.శ. 892.922, నిర్వ. రా. 7.56; 3. విషయం, ఎద, శృం. నై. 2.32; వి. శరీరం.

క. పై. మీదు, పైభాగం, అధికం.

వయాట రూ. చూ. పైయాట. వి. వ్యభిచారం. <పయి + ఆట. వయికాఁపు రూ.చూ. పైకాఁపు. వి. పైజాగ్రత్త. వయికివచ్చు అ.క్రి. 1. నిండవచ్చు. సిరంకు. 2 129. 2. అభివృద్ధికివచ్చు. వయికూటమి రూ.చూ. పైకూటమి. వి. ఉపరిసురతం. వయికొను రూ.చూ. పైకొను. అ.క్రి. 1. పడు, మీదపడు. భార. శల్య. 1.121; 2. పేచు, కనిపెట్టుకొను. భాస్క. రా. కిష్కిం. 107; 3. చలపట్టు. కా. 7.226; 4. మీరు; 5. యత్నించు; 6. కలుగు. వయికొలుపు రూ.చూ. పైకొలుపు. స.క్రి. 1. కలగచేయు; 2. వ్యాపింపచేయు. వయికొల్పు రూ.చూ. పైకొలుపు. స.క్రి. 1. కలగచేయు; 2. వ్యాపింపచేయు. వయిగస్తి రూ.చూ. పైగస్తు. వి. రాత్రుల్లో వీథుల్లో గస్తీ తిరిగేవాడు. వయిచీర రూ.చూ. పైచీర. వి. ఉత్తరీయం, పైబట్ట. భార. శల్య. 2.374. వయిచేయి రూ. పైచే. వి. అధికుడు. వయిజాలు మట్టి రూ.చూ. పైజాలు మట్ట. వి. మత్స్యవిశేషం. వయివడు రూ.చూ. పైపడు. అ.క్రి. 1. కవ్వించు; 2. ఉద్యమించు; 3. అతిశయించు; 4. మీరు; స.క్రి. పొందు, రతిలోకూడు; అ. క్రి. స.క్రి. ఎదుర్కొను. ఎదిరించు. వయివయిగ రూ. పైపైగ, పైపైగా. క్రి. విశే. ప్రదు. సులభంగా. వయిపాటు రూ.చూ. పైపాటు. వి. 1. అనుషంగికత్వం: 2. ఆలింగనం. వయిపెచ్చు రూ. పైపెచ్చు. విశే. ఒకదానికంటె అధికమైన. ఆము. 1.8. వయిపెచ్చులగు అ.క్రి. అధికమగు. విజయ. 1.173. వయిఁబక్కఁబడు (-పడు) అ. క్రి. స్నేహంగాఉండు, ఎక్కువమమతగా ఉండు. వయిఁబూనికొను (-పూనికొను) స.క్రి. సంబంధంలేని వాటిలో కలగచేసికొను. వయివోవు (-పోవు) రూ.చూ. పైవోవు. అ.క్రి. తోవతప్పినడుచు. వయ్యెద రూ.చూ. పయ్యెద. వి. పైట. భాస్క.రా.యు. 2346. <పయి + ఎద. వయ్యాకులు వి.బ.వ. వడ్లలో ఒక రకం. <పయి + ఆకు + -లు. వయ్యాఁడువారు విశే బ.వ. వేశ్యలు. భాగ. సం. 17.147. <పయి + ఆఁడువారు. వయ్యింటిదబ్బ రూ.చూ. పైవింటిదబ్బ. వి. వాడుకట్టిన ఇంటిబద్ద. <పయి + ఇంటిదబ్బ. వయ్యెద రూ. పయ్యద, పైమెద. వి. పైట. భార. విరా. 2.64. వయ్యెసరుబుడ్డి వి. ఎసరు పాత్రమీద మూతగా నీళ్ళుపోసి పెట్టినట్టి చిన్న మట్టిపాత్ర. <పయి + ఎసరుబుడ్డి. వయ్యెసరుముంత వి. ఎసరు పాత్రమీద మూతగా నీళ్ళుపోసి పెట్టినట్టి చిన్న మట్టిపాత్ర. < పయి + ఎసరుముంత. వయ్యెసరుసట్టి రూ. పైఎసరుసట్టి. వి. ఎసరుకుండమీద మూతగా నీళ్ళుపోసి పెట్టినట్టి చిన్న మట్టిపాత్ర. <పయి + ఎసరు సట్టి.

వయికము రూ.చూ. పైకము. వి. 1. రెండుకానుల నాణెం, కాకిణీద్వయం; 2. రొక్కం, వెల; 3. సమూహం.

వయిగస్తి రూ.చూ. పైగస్తు. వి. రాత్రులందు వీథుల్లో గస్తీ తిరిగేవాడు.

వయిజారు రూ.చూ. పైజారు. వి. పాదరక్షలు.

వయిజు వి. వదరుతనం.

హిం. పైజ్. ప్రతిజ్ఞ, శత్రుత్వం.

వయిటీ రూ.చూ. పైఁట. వి. పైట కండువా ఆడపిల్లలు నడుముకు చుట్టుకొని పైన కప్పుకొనే బట్ట.

వయితాణి రూ.చూ. పైతాణము. వి. జరీబట్ట. మల్లుప. 4.18.

వయిఠాణి రూ.చూ. పైఠాణము. వి. వస్త్రవిశేషం.

వయింటు రూ.చూ. పైంటు. వి. నియామకం.

వయిఁట రూ.చూ. పైఁట. వి. పయ్యెద. దశా. 6.43.

వయిఁడి రూ.చూ. పసిఁడి. వి. బంగారం. శ్రీనాథుని చాటువు. సారంగ. 1.129.

వయిఁడికంటి రూ.చూ. పైడికంటి[1]. వి. బంగారు కళ్ళు గలది, ఒకరకం పక్షి. వయిఁడికుండలు రూ. పైఁడికుండలు. వి.బ.వ. దేవాలయ శిఖరంపై ఉంచే బంగారు కలశం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 702. క్రీ.శ. 1518. వయిఁడిచూలాలు రూ.చూ. పైఁడిచూలాలు. వి. బంగారం గర్భంలో కలది, భూమి. వయిఁడితామర వి. మెట్టతామర. వయిఁడివెలఁది రూ.చూ. పైఁడివెలఁది. వి. లక్ష్మి. వయిఁడి పత్తి రూ.చూ. పైఁడిప్రత్తి. వి. ఎర్రని పూలుపూసే పత్తి. వయిఁడిపుంజకామతోటి వెంజామరము వి. బంగారంతో పూత చేయబడిన కామగల చామరం. ద.హిం.శా. సంపు. 6,

గా.నం. 758. క్రీ.శ. 1888. పయిఁడిప్రత్తి రూ.చూ. పైఁడి ప్రత్తి. వి. ఎఱ్ఱని పూలుపూసే రకం పత్తిచెట్టు. పయిఁడి దానము రూ.చూ. పైఁడిదానము. వి. గాలిమూట. పయిఁడి ముడుచు రూ.చూ. పైఁడిముడుచు. అ.క్రి. 1. నిశ్చితార్థం చేయు ; 2. గర్భాదానంచేయు. పయిఁడిముడుపు రూ.చూ. పైఁడిముడుపు. వి. నిశ్చితార్థం. పయిఁడియుమ్మెత్త రూ.చూ. పైఁడియుమ్మెత్త. వి. ఒకరకం ఉమ్మెత్త. పయిఁడిఱేఁడు రూ.చూ. పైఁడిఱేఁడు. వి. కుబేరుడు.

**పయిద**[1] రూ.చూ. పైద[1]. వి. పిల్లవాడు.

పయిదలి రూ.చూ. పైదలి. వి. ఆడది, స్త్రీ.

**పయిద**[2] రూ. పైద[2]. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టిపళ్ళెం.

**పయిన్** రూ.చూ. పయి. క్రి.విశ.ద్రు. మీద. దీర్ఘాసి కానసం క్రీ.శ. 1075,76.

**పయినము** రూ.చూ. పయనము. వి. 1. ప్రయాణం, యాత్ర, ప్రస్థానం. రం.రా. ఉ. 150 పు. 11 పం.; 2. మార్గం, తోవ. ద్వి.దార.విరా. 1.15.

**పయిపు** రూ.చూ. పైపు. వి. గొట్టం.

**పయిమాయిషి** రూ.చూ. పైమాయిషీ. వి. కొలత, సర్వే.

**పయిమాషిదారు** వి. సర్వేచేసేవాడు.

హిం. పైమాయిశ్‌దార్-. భూమిని కొలిచేవాడు; ఉ. పైమాయిశ్‌దార్-; పార. పైమాయిశ్-. కొలుచు, కొలవటం. కొలత. భూమిని కొలవటం.

<ఉ. పైమాయిశ్‌దార్.

**పయిర** రూ.చూ. పయ్యెర. వి. 1. గాలి, మారుతం ; 2. దక్షిణపు గాలి ; 3. దక్షిణపు గాలిచే పండే కాయధాన్యం.

**పయిరము** రూ.చూ. పసరము. వి. ధేనువు, ఆవు.

**పయిరు** రూ.చూ. పైరు[1]. వి. 1. సస్యం, చేను. మను. 3.9 ; 2. ఒవరి.

పయిరుచేయు రూ.చూ. పయిరుసేయు. స.క్రి. సేద్యం చేయు, సాగుచేయు. దశ. 1.89. పయిరుమబ్బు రూ.చూ. పైరు దుబ్బు. వి. ఒకరకం దుబ్బు. పయిరుల యెకిమీఁడు (-ఎకిమీఁడు) రూ.చూ. పైరుల యెకిమీఁడు. వి. ఓషధీశుడు. చంద్రుడు. పయిరులుసుఋ(-ఉసురు) రూ. పైరులుసుఋ వి. మేఘం. పయిరుసేయు(-చేయు) రూ. పయిరుచేయు, పైరుచేయు. స.క్రి. సాగుచేయు. శాకు. సం. 13.83. పయిరెకిమీఁడు వి. ఓషధీశుడు, చంద్రుడు. అచ్చ.రా.యు. 125.

<పయిరు + ఎకిమీఁడు.

**పయిరుమాను** రూ.చూ. పయిలుమాను. వి. వస్తాదు.

**పయిరెకిమీఁడు** చూ. పయిరు.

**పయిలుమాను** రూ. పయిరుమాను, పైరుమాను, పైలుమాను. వి. వస్తాదు.

హిం.ఉ. పహిల్వాన్. వస్తాదు ; ఉ.పార. పహిలవాన్. ; మరా. పహేలవాన్.

<ఉ. పహిల్వాన్.

**పయిస** రూ.చూ. పయిసా. వి. ఒకనాణెం.

**పయివర** రూ.చూ. పైవర. వి. మల్లవిద్యా సంబంధమైనవిధాల్లో ఒకటి.

**పయిసలా** రూ.చూ. ఫైసలు. వి. తీర్పు, పరిష్కారం.

**పయిసలు** రూ.చూ. ఫైసలు. వి. తీర్పు, పరిష్కారం.

**పయిసా** రూ. పయిస, పయిను, పయిస్సు, పైస, పైసా. వి. నయాపైసా, రూపాయిలో నూరవ భాగం.

హిం.ఉ. పైసా. చిన్న నాణెం ; మరా. పైసా ; క. పైసా.

<ఉ. పైసా.

**పయిసు** రూ.చూ. పయిసా. వి. రూపాయిలో నూరవ భాగం.

**పయిస్సలు** రూ.చూ. ఫైసలు వి. పరిష్కారం.

**పయిస్సు** రూ.చూ. పయిసా. వి. రూపాయలో నూరవభాగం.

**పయె** రూ.చూ. పయ్య[1]. వి. తెలుపుతనం ఎక్కువ కలిగిన ఎరుపు.

**పయెఁట** రూ.చూ. పైఁట. వి. స్త్రీల రొమ్ముమీది వస్త్రం.

**పయ్య**[1] రూ. పమె, పమ్మె. వి. పాటలవర్ణం. ఆం.భా. 1.108 ; విశ. పల్లవన్నెకల.

**పయ్య**[2] వి. చక్రం, బండికుండలో బిగించిన ఆకులను పట్టి ఉంచే గుండ్రటి కొయ్యచట్రం.

హిం. పహియా. బండిలోని ఆకులను పట్టిఉంచే గుండ్రని కొయ్యచట్రం.

<హిం. పహియా.

**పయ్య**[3] రూ.చూ. పేయ. వి. దూడ.

**పయ్యఁట** రూ.చూ. పైఁట. వి. పయ్యెద. విజయ. 2 134.

**పయ్యద** చూ. పయి.

**పయ్యర** రూ.చూ. పయ్యెర. వి. 1. దక్షిణపుగాలి. మను. 3.84 ; 2. గాలి, మారుతం; 3. దక్షిణపుగాలిచే పండే కాయధాన్యం.

పయ్యరకుఱ్ఱఁడు వి. 1. పవనసుతుడు, హనుమంతుడు. అచ్చ.రా యు. 405 ; 2. భీముడు. పయ్యరదూది వి. అతిశీఘ్రంగా పోయేది. ఉ.హరి. 5.181. పయ్యరమేపరి వి. పవనాశనం, సర్పం, పాము. ప్రబంధ. 153. పయ్యరయనుంగు(-అనుంగు) వి. వాయుసఖుడు. అగ్ని. అచ్చ.రా. బాల. 63.

**పయ్యాకులు** చూ. పయి.

**పయ్యాట** రూ.చూ. పైఁట. వి. పయ్యెట.

**పయ్యాడువాడు** చూ. పయి.

**పయ్యంటిదబ్బ** చూ. పయి.

**పయ్యె** రూ.చూ. పయ్య[1]. విశ. పాటలవర్ణంగల ; వి. పాటలవర్ణం.

పయ్యెద్దు వి. ఎరుపుపసుపు కలిసిన వన్నెగల ఎద్దు. పయ్యెబట్ట రూ. పెయబట్ట, పైబట్ట. వి. పసెరంగు మీద మరేరంగుదైనా ఐన మచ్చ.

**పయ్యెఁట** రూ.చూ. పైఁట. వి. స్త్రీల రొమ్ము మీది వస్త్రం.

**పయ్యెద** చూ. పయి.

**పయ్యెర** రూ. పయర, పయరు[3], పయిర, పయ్యర, పైర. వి. 1. గాలి, మారుతం. కాశీ. 3.28 ; 2. మందమారుతం. ఆం.భా. 1.59.

క.త. పయిర్, పైరు.

**పయ్యెసరుబుద్ధి** చూ. పయి.

పయ్యెసరుముంత చూ. పయి.

పయ్యెసరునట్టి చూ. పయి.

పయ్యెంట రూ.చూ. పైంట. వి. స్త్రీల రొమ్ము మీది వస్త్రం.

పర[1] రూ.చూ. పొర[2]. వి. 1. కంటిపొర. జనవ. 3.57 పు. 9 పం.; 2. అరటి మొ. వాటి పొర.

పరగొవ్వు వి. తోటల్లో కలుపు మొక్క మొదటి తవ్వకం. పరలెత్తు రూ.చూ. పొరలెత్తు. అ.క్రి. లేచిన పొరలు కలది అగు. భాను. 4.18.

పర[2] వి. పటలం, సమూహం. ఆం.భా. 2.82. శపథ. 1.2.

-పర[3] వి. సమాసాల్లో పరము శబ్దం యొక్క మీది వర్ణం లోపింపగా మిగిలిన రూపం.

పర[4] రూ.చూ. పరము[1]. వి. 1. కోడిపట్టె, చంకపట్టె; 2. తొక్కుడుపట్టె, బండిపరం నుండి నొగమాను మీదికి బిగించిన పట్టె; 3. కొలతట్ట, కొలత తొట్టె; 4. సున్నం, గులక మొ. వాటి కొలతకు వాడే సాధనం.

పర[5] రూ.చూ. పఱు[2]. వి. 1. ఇసకనేల, పొరలు పొరలుగా ఇసక ఇతర విధాల మట్టితో కలిసి ఉండే నేల; 2. ఇసక, సిమెంటు నీళ్ళలో కలిపిన ద్రవ్యం; 3. గ్రామ నామాంత పదం. E.I. సంపు. 6.9.

పరకాల్వ వి. మడికి నీళ్ళు పెట్టిన చిన్న కాలవ. పరనేల రూ.చూ. పఱ్రనేల. వి. పొరలు పొరలుగా ఉండే మట్టి, కొన్ని చోట్ల పాటినేల, మరికొన్ని చోట్ల ఇసక, రాయి కలిసిన నేల, పంటకు అసలు పనికిరాని నేల.

పరం రూ.చూ. పరము[1]. వి. 1. బండి నొగకు రెండు పక్కలా బిగించిన పొడవు దూలం; 2. పక్షం; 3. బియ్యంతో కలిసిన మిక్కిలి సన్న నూక.

పరంరాయి వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతిన రాయి.

పరక[1] రూ.చూ. పఱ్క. వి. 1. ఎనిమిదో వంతు, మొత్తంలో ఎనిమిదో పాలు. దశా. 7.18; 2. పదమూడు వస్తువుల సమూహం; 3. రెండు పీసాలు. ఆం.భా. 2.272; 4. అర్ధణా; విశే. విలువతక్కువైన. హంస. 3.158.

పరకపైపాటిక అన్నట్లు అవ్య. ఎక్కువగా. పరకకెత్తు కొమ్మన్న(బాతికకెత్తుకొను అ.క్రి. కొంచెం సందు ఇస్తే నెత్తికెక్కు. హంస. 3.158. వ్య. ఎనిమిదోవంతు తీసు కొమ్మంటే నాలుగోవంతు తీసుకొను.

పరక[2] రూ.చూ. పొరక[2]. వి. 1. గడ్డిపోచ. మను. 4; 2. చీపురు; 3. బట్టనుంచి చెడిపోయిన మన్నాని తొలగించటానికి వాడే పెట్టె లాంటి ఇనప సాధనం; 4. పొరాకు.

పరకకట్ట రూ.చూ. పొరక కట్ట. వి. కళ్ళంఊడ్వటానికి ఉపయోగించే కందిమండల చీపురు. పరకచేప వి. ఓడు. నెల్లూరిశాసనాలు, దర్శిశాసనం. 52. క్రీ.శ. 1597. పరకవల్ల వి. అరిసెల్లకు రంగులు పూయటానికి బట్ట పీలిక చుట్టి బ్రష్‌గా వాడే పొరక వల్ల. పరకపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

పరక[3] వి. మత్స్య విశేషం. ప్రబంధ. 195.

పరక[4] వి. భూమి కొలత, 6 కుంటలు.

పరక[5] రూ.చూ. పొరక[1]. వి. పూరిళ్ళమీద కప్పగావాడే ఒకరకం గడ్డి (Cyperas bulbous, vahl).

పరక[6] రూ.చూ. పొరక[3]. వి. ఊడ్పులకు, విత్తనం చల్లటానికి ముందు మళ్ళలో ఎరువుగా వేసి తొక్కే చెట్ల ఆకు.

పరకతము వి. వస్త్ర భేదం. ధనాభి. 3.38.

పరకమిట్ట చూ. పర[5]. వి. ఎర్రమట్టి, అంతర్గత శిలల శైథిల్యం వల్ల ఉష్ణ దేశాల్లో ఏర్పడే ఎరుపు డాలు మట్టి.

పరకామణి రూ.చూ. పరఖామణి. వి. హుండీలో వేయబడిన నాణేల్ని లెక్క బెట్టటం.

పరకాయించు స.క్రి. బాగా పరిశీలించి చూచు.

హిం. పరఖ్‌నా. పరీక్షించటం.

<హిం. పరఖ్(నా)+-ఇంచు[3].

పరకాళా రూ. చూ. పరకాళీ. వి. అరటిమోవి వంటిగుడ్డ.

పరకాళాసుద్ద వి. తెల్లని నాజూకుబట్ట.

పరకాళీ రూ. పరకాళా. పరగాళా. వి. 1. ఒకవిధమైన బట్ట, పరకాళీదేశపుబట్ట. రఘు. 9 పు. 25 పం. ప్రబంధ. 78; 2. దేశ విశేషం.

హిం. పర్కాలా. గాజుముక్క, ముక్క, మెట్లవరుస, తలుపుచట్రం, వరండా, కట్టె నిప్పులు; ఉ. పర్‌కాలా. మెరుపు, ఖండం; మరా. పర్‌కాళీ, పర్‌కళా. వస్త్ర విశేషం; పార. పర్‌కాల. గాజుముక్క, నిప్పురవ్వ;

త. పర్కాళి, పరైక్కాళి.

<ఉ. పర్‌కాలా.

పరకి రూ. పరగి. వి. తినటానికుపయోగించే నల్లని పళ్ళు కాసే, కొమ్మలు దళ్ళు కట్టటానికుపయోగించే ముళ్ళు కలిగిన పెద్ద చెట్టు (Tityphus oenoplia).

పరఖామణి రూ. పరకామణి. వి. రూకల నాణ్యం చూడటం.

హిం. పరఖ్. పరీక్ష, పరిశీలన, తనికీ, వన్నె. ఉ. పర్ఖణీ.

త. పరాక్కవణి, పరకు. పరీక్ష. రూకల నాణ్యం పరీక్షచేయు.

<ఉ. పర్ఖణీ.

పరగడ రూ. పరగడు, పరవడ. వి. ఊరి వెలుపలి పొలం.

పరగడగాలి వి. వానవచ్చే ముందు దుమ్ముతో బలంగా వీచే గాలి.

పరగడపు చూ. పరము[2].

పరగడమాను వి. విత్తనం వేసిన తరవాత గడ్డి, కలుపు మొదలైనవి పోవటానికి, మాగాణినేల దున్నిన తరవాత చదును చెయ్యటానికి ఉపయోగించే పరికరం.

పరగడు రూ.చూ. పరగడ. వి. ఊరివెలుపలి పొలం.

పరగడుపు చూ. పరము[2].

పరగణా రూ.చూ. పరగణే. వి. 1. దేశభాగం, ప్రాంతం. పల్నా. అనుగురాజు పలనాటి సంపాదనము. 380 పు.; 2. జమిలో భాగం.

పరగణి రూ.చూ. పరగణే. వి. దేశభాగం, ప్రాంతం.

పరగణె రూ.చూ. పరగణే. వి. దేశభాగం, ప్రాంతం.

పరగణే రూ. పరగణా, పరగణీ, పరగణె, పర్గణా, పర్గణె, పర్గణే, పర్గనా, ఫరగణా. వి. రాష్ట్రభాగం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 77. క్రీ.శ. 1692.

హిం.ఉ. పర్‌గనా. అనేక గ్రామాలు కల భూభాగం; మరా. పరగణా. దేశ భాగం, ప్రాంతం; పార. పర్‌గనా. జిల్లా, రాష్ట్ర భాగం.

<ఉ. పర్‌గనా.

**పరగళ్ళకట్టి** వి. పదుగు దాపినప్పుడు కింది పోగులు కలిసి పోకుండా వేరుచేసే గుండ్రటి సున్నటి కర్ర.

**పరగాళా** రూ.చూ. పరకాళి. వి. ఒకవిధమైనబట్ట.

**పరగి** రూ.చూ. పరకి. వి. తినటానికుపయోగించే నల్లని పళ్ళు కాసే, కొమ్మలు దళ్ళు కట్టటానికుపయోగించే ముళ్ళుకలిగిన పెద్దచెట్టు (Tizyphus oenoplia).

**పరగు** రూ.చూ. పర్వు. అ.క్రి. 1. ప్రసిద్ధమగు. యుద్ధమల్లుని బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934. భార. ఆది. 2.189; 2. ప్రవర్తిల్లు, ఉండు. భార. ఆది. 2.84; 3. ఇదికొన్ని చోట్ల కావ్యాలంకారంగా ఉపయుక్తమవుతుంది. భార. ఆది. 4.212; 4. ప్రసరించు, వ్యాపించు. భార. విరా. 1.308; 5. ఒప్పు. భార. విరా. 2.216; 6. ప్రవహించు. భార. ద్రోణ. 1.195; 7. పరు, ప్రసరించు. భార. కర్ణ. 2.847; 8. అతిశయించు, అధికమగు. భార. శాంతి. 2.292; 9. కోరు, ఉత్సహించు. రుక్మాం. చ. 5.137; 10. విహరించు. ప్రభా. 1.121.

త. పరయు-. వ్యాపించు, చెదరు, పర్వు-, పర్భు, పబ్బు-. వ్యాపించు, చెదరు; కొడ. పర- (పరప్-, పరన్ద్-). పాకు, పరత్-. (పరతి-). పరచబడు (ధాన్యం,) పబ్బ్-. (పబ్బి-). (అల్లుకొనే మొక్కలు). తీగసాగు; క. పర. (-ప్పు-, -న్ద్-). వ్యాపించు, చెదరిన, పరక్కు-. (పరక్కి-). తిరగటం, పరక్టై-. వ్యాపించు, పరత్తు (పరత్తి-). వ్యాపించటం, పరవై-. వెడల్పు, సముద్రం, పార్-. భూమి, విశాలం, పారి-. భూమి; మ. పరక్క-. వ్యాపించు, పెంచబడు, పెద్దదగు, పరన్న. విశాలం, పెంచబడు, పరత్తుక-. వ్యాపించు, చదును, పరవ-. సముద్రం, పరవ్రక-. వ్యాపించు, పార్. భూమి, ప్రపంచం; కో. పర్ద్-. (పర్ది-). పరచుకొను, వ్యాపించు, పర్త్-. (పర్తి-). (ఎండటానికి ధాన్యం మొ. నవి) పరచు; తొ. పర్‌మె. ఒర్-. పెద్దమానున్న చెట్టు; గోం. పఱితానా-. గుంపుగూడు (తలలో పేలువలె). పర్‌హానా-. వ్యాపించు; కుఇ. ప్రహప (ప్రహత్-). బయటికి ప్రసరించు, చెదరు; కువి. ప్రెస్సలి. ధాన్యం ఎండటానికి పరచు; పర్జి. పర్ప్- (పర్త్-). వ్యాపించు: చూ. మాల్తొ. పర్ప్-. స్పష్టంగా చూడబడు, ప్రకాశించు

<మూ. ద్రా. *పర్-. ఉన్/(-అవ్-).

**పరగుంజ** రూ. పనగుంజ, పరిగుంజ. వి. 1. పారుగుంజ; 2. గోడలో నాటినగుంజ.

**పరంకట్టిల్లు** చూ. పరము[1].

**పరంకట్టు** చూ. పరము[1].

**పరంకొమ్ము** చూ. పరము[1].

**పరంగి** రూ. పరంగీ, ఫరంగి. వి. 1. దేశవిశేషం. రాజవా. 2.46; 2. శ్వేతముఖుడు, పాశ్చాత్యజాతివాడు, ముఖ్యంగా బుడతకీచు జాతి. శుక. 1.107; 3. విదేశీయుం. ప్రబంధ. 605; 4. శూరుడు. హంస. 1.299; 5. మూలికా విశేషం; 6. రాతి ప్రదేశాల్లో పెరిగే ఒకరకం పెద్దచెట్టు (Boswellia serrate).

హిం. ఉ. పరంగీ. ఫ్రాన్సుదేశస్థుడు; పార. పరెంగీ. విదేశీయుడు, యూరోపియను జాతివాడు; పో. పరంగీ; క. పరంగి, విదేశీయుడు; పరెంగి; త. పరంకి, పరంకియన్.

<పో. పరంగి.

**పరంకికత్తులు** వి.బ.వ. విదేశీయమైన ఖడ్గాలు. హంస. 5.360. **పరంగికాయ** వి. 1. బొప్పాయికాయ; 2. ఒకరకం మిరపకాయ. క. పరంగిహణ్ణు. బొప్పాయికాయ; తు. పెరింగి పెలకాయ. బొప్పాయి. **పరంగికొండ** వి. శాంతోంకొండ. **పరంగిపీట** వి. ఒకరకం సింహాసనం. శుక. చ. 5.91. **పరంగిపేట** వి. వరహా. **పరంగిపేటు** వి. అంచులో ముక్కోణాకారంగానేసి దానికి చుట్టూమొగ్గలు పనేటట్లునేసిన డిజైను. **పరంగిమవిషి** వి. పోర్చుగీసువ్యక్తి. **పరంగిముడాసు** వి. పోర్చుగీసువ్యక్తి. హంస. 4.427. **పరంగిలాగి** రూ. పరంగీలాగి. వి. కెంపుజాతి దినుసు. శుక. చ. 4.172. **పరంగివరహా** వి. ఒకనాణెం. **పరంగివాండ్రు** విబ. సంకరజాతివారు. **పరంగివెధవ** వి. 1. ఒకతిట్టు, విదేశీయుడనే ఉద్దేశంతో పుట్టిన నిందావాచక శబ్దం; 2. సోమరి. **పరంగిసాంబ్రాణి** వి. రాతిప్రదేశాల్లో పెరిగే ఒకరకం పెద్దచెట్టు (Boswellia serrata).

**పరంగీ** రూ.చూ. పరంగి. వి. 1. దేశవిశేషం; 2. శ్వేతముఖుడు; 3. మూలికావిశేషం.

**పరంగీలాగి** రూ.చూ. పరంగిలాగి. వి. కెంపుజాతి దినుసు. చంద్రాంగ. 2.36.

**పరచంటివాడు** విబ. స్తనపాయి.

సం. పర-. ఇతరమయిన.

**పరచి** వి. యాచితకం (కొన్నిరోజులు వాడుకొని మళ్ళాఇవ్వటానికై తెచ్చుకొనే వస్తువ మొదలైనవి). ఎరవు. శాశ్న. సం. 15.167. ఆం. భా. 2.228.

**పరచు** రూ.చూ. పఱచు[1]. స.క్రి. 1. వ్యాపించు; 2. చెల్లాచెదరుచేయు.

**పరతెంచు** రూ.చూ. పఱతెంచు. అ.క్రి. 1. పారివచ్చు, పరుగునవచ్చు. భార. శాంతి. 1.356; 2. కలుగు, సంభవించు; 3. వెళ్ళు, పోవు; 4. వ్యాపించు, ప్రసరించు.

**పరజ** రూ. పరద. వి. పక్షి విశేషం. రసిక. 1.115.

**పరజా[1]** వి. ఒకానొకజాతివారు. రామలిం. శ. 23.

**పరజా[2]** రూ.చూ. పరదా. వి. బాల్కనీ, గోడమీదనుంచి ముందుకు పొడుచుకొని వచ్చినకప్పు.

**పరజాగోడ** వి. బాల్కనీ, గోడమీదనుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.

**పరజు** రూ.చూ. పరుంజు. వి. కత్తిఒరపైభాగం; తిరుపతి దేవస్థానం శాసనాలు. సంపు. 8 శా. సం. 60. క్రీ.శ. 1517.

**పరంచ** రూ.చూ. పరంజ. వి. గోవ, ఎత్తుగాఉండే గోడలను

కట్టటానికి వాటి పక్కనె కట్టిన తాత్కాలికపు నిర్మాణం.

పరంచకట్టె వి. పచ్చిబంగాళాపెంకును ఆరబెట్టేగడి చెక్కిన కొయ్య.

పరంజ రూ. పరంచ, పరంజా, పరంజి, పరంజీ, పరంజు, పరింద. వి. ఇల్లు కట్టేటప్పుడు పనివాళ్ళకొరకు కొయ్యలతో కట్టిన కట్టడం, సారువ.

స్పా. ప్రాంప్-. సారువ, కొంకి ; గు. పరాంచ్ ; మరా. పరాంచి ;

తు. పరెంజి.

పరంజా రూ.చూ. పరంజ. వి. గోడ, ఎత్తుగాఉండే గోడలను కట్టటానికి వాటిపక్కనె కట్టిన తాత్కాలికపు నిర్మాణం.

పరంజాగూడు వి. పరంజాకన్నం. పరంజాబొక్క వి. సారువ, కొయ్యలుంచే గోడకన్నం.

పరంజి రూ.చూ. పరంజ. వి. గోడ, ఎత్తుగాఉండే గోడలను కట్టటానికి వాటి పక్కనె కట్టిన తాత్కాలికపు నిర్మాణం.

పరంజీ రూ.చూ. పరంజ. వి. సారువ, ఇల్లుకట్టుకొనేటప్పుడు పనివాళ్ళకొరకు కొయ్యలతో కట్టిన కట్టటం.

పరంజు రూ.చూ. పరంజ. వి. ఇల్లుకట్టేటప్పుడు పనివాళ్ళకొరకు కొయ్యలతో కట్టిన కట్టడం, సారువ.

పరంజ్యోతి వి. సప్తర్షిమండలంలో వశిష్ఠుడు చుక్కదగ్గర కనబడీ కనబడకుండా ఉండే చిన్నచుక్క.

సం. పరంజోతిస్. అద్వితీయజ్యోతి, పరబ్రహ్మం.

<సం. పరంజ్యోతిస్ (అర్థవిపరి.).

పరంజు రూ.చూ. పడంజు. వి. కత్తిపిడి.

పరటా రూ.చూ. పరాట. వి. రీపరు, ఇంటికప్పు వేయటంలో వాడే పలచని చెక్క.

పరటి రూ.చూ. పంటె[2]. వి. నూలుచుట్టే సాధనం.

పరంటె రూ.చూ. పంటె[2]. వి. నూలుచుట్టే సాధన విశేషం. హంస. 2.11.

పరంట వి. ఏడుపిడక, కరీషం. ఆం.భా. 2.258.

పరంటి రూ. పంటి[1], పంటె[1], పనంటి. వి. 1. తూము. హర. 2.10 ; 2. కుండ. భోజ. 6.133.

పరంటి పుట్టువు వి. కుంభసంభవుడు. సుయా. 1.95.

పరతబొంగు వి. ఒకరకం వెదురు బొంగు.

పరతువనేల రూ. పరతూనేల. వి. పొరలు పొరలుగా ఉండే తువ్వనేల.

పరతూనేల రూ.చూ. పరతువనేల. వి. పొరలు పొరలుగా ఉండే తువ్వనేల.

పరతెంచు చూ. పరచు.

పరద రూ.చూ. పరజ. వి. ఒకరకం కొంగ.

పరదా రూ. పరదా, పరజా[2], పర్దా, ఫరదా, ఫర్దా. వి. 1. తెర. వసు. వ్యా. 4.71 ; 2. ప్రావరణం, దుప్పటం. ఆం.భా. 2.159 ; 3. పట్ట, గోగునారగుడ్డ ; 4. ముస్లిం స్త్రీలు కప్పుకొనేగుడ్డ ; 5. ఎండ తగలకుండా వేలాడగట్టేది ; 6. బాల్కనీ.

హిం. పర్దా-. తెర, చాటుచేసే వస్తువు ; ఉ. పర్దా. తెర, అడ్డుతెర ; పార. పర్ద్. తెర, ముసుగు, గుమ్మాలకి కట్టే తెర.

<ఉ. పర్దా.

పరదాగట్టు రూ. పర్దాగట్టు. వి. బాల్కనీ, గోడమీది నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు. పరదాగోడ రూ. పర్దాగోడ. వి. 1. ప్రహరీగోడ, ఇంటి ఆవరణచుట్టూ కట్టిన గోడ ; 2. సింహద్వారానికి ఎదురుగా ఇంటి ముందున్న ప్రహరీగోడ. పరదాచెక్క రూ. పర్దాచెక్క. వి. 1. రీపరు, ఇంటికప్పు వేయటంలో వాడే పల్చనిచెక్క ; 2. అడ్డుచెక్క. అలమరను అరలుగా విభజించేచెక్క.

పరదానిషిన్ వి. గోషాలో ఉండే స్త్రీ.

హిం. పరదానశీన్. రహస్యంగా గోషాలో జీవించే స్త్రీ. ఏకాంతం, రాజీవాసంగా ఉండటం ; పం. పర్ద-నిషిన్. పతివ్రత అయిన. ఉ. పర్ద-నశీన్. తెర వెనక ఉండటం.

<ఉ. పర్ద-నిశీన్.

పరదేసి విణ. వైదేశికుడు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 556 క్రీ.శ. 1458.

సం. పరదేశిన్. విదేశస్థుడు ; ప్రా. పరదెస-. భిన్న దేశం, అన్యదేశం ; హిం. పర్ దేశీ. ఇతర దేశస్థుడు.

<సం. పరదేశిన్.

పరదేసికొయ్య వి. నేతబయలులో చివర పాతినకొయ్య. పరదేసి తపస్వులు వి.బ.వ. పరదేశీయులైన సన్యాసులు. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1104. క్రీ.శ. 1150.

పరవ వి. తేయాకు తోటల్లో నీడకోసం పెంచబడే చెట్టు (Grevillca fobusta).

పరమ వి. పరికి, ముళ్ళుకలిగిన ఒకమొక్క. కొమ్మలు దడికట్ట టానికి దీని నల్లని పళ్ళు తినటానికి ఉపయోగిస్తాయి (Zigyphyoenoplia).

పరందిందు చూ. పరము[1].

పరండు రూ.చూ. పద్దు[1]. వి. చెక్క, పద్దు. తాళ్ల.సం. 11.85.

పరపంగము వి. దేవబ్రాహ్మణ వృత్తులమీద సర్కారువారు తీసే చతుర్థాంశం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 492. క్రీ.శ. 1303.

పరపటికె చూ. పరవు.

పరపట్టె రూ.చూ. పిఁరపట్టు. వి. 1. మగ్గంముందు నేతపని వాడు కూర్చునే చోటు ; 2. నేతపనివాడు కూర్చోటానికి మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ.

పరపతి రూ. పరపత్తెము. వి. 1. అప్పియ్యవచ్చుననే విశ్వాసం, నమ్మకం. రుక్మా.చ. 4.110 ; 2. ఇతరులవద్ద చేబదులుగా ద్రవ్యం పుచ్చుకొనటం ; 3. అగౌరవం.

సం. పరభృతి-. ఇతరులచే పోషించబడటం.

<సం. పరభృతి-.

పరపత్తెము రూ.చూ. పరపతి. వి. 1. ఇతరులవద్ద చేబదులుగా ద్రవ్యం పుచ్చుకొనటం ; 2. అప్పియ్యవచ్చుననే విశ్వాసం, నమ్మకం.

పరపపాత్రలు వి.బ.వ. పాత్రవిశేషం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1052. క్రీ.శ. 1350.

పరపర వి. ఖండించటం, కోయటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. ధ్వన్యను.

పరపరగిలు స.క్రి. వేగంగా వ్రాయు. పరపరచేయు స.క్రి. ఖండితం చేయు, ఉల్లంఘించు, అతిక్రమించు. బసవ. 6.109. పరపరయగు(-అగు) అ.క్రి. ఖండితమగు, పోవు, నశించు. తగ్గు. బసవ. 4.338. పరపరవ్రాయు స.క్రి. గబగబ వ్రాయు.

పరపారు చూ. పరపు.

పరపు రూ.చూ. పఱపు. విశే. 1. విరివిగల, విశాలమైన. భార. భీష్మ. 1.84 ; 2 బహుళ సంఖ్యాకమైన, అసంఖ్యాకమైన. భార. అను. 1.254 ; 3. అధికమైన, గొప్ప. గాథం. భాస్క రా.యు. 1424 ; 4. చదును, సమం, ఎచ్చు తగ్గు లేని. ఉ.రా. 6 5 ; వి. 1. విధం, రీతి. భార. భీష్మ. 1.94 ; 2. పాతం, పరటం. భార. ద్రోణ. 1.266 ; 3. వెదల్పు. భార. శాంతి. 2.383; 4. శయ్య. భార. ఆరణ్య. 4 400 ; 5. (బండి మొ.) వాటిమీద కప్పు. హరి.పూ. 5.172 ; 6. పొరవు. వరాహ. 10.228 ; 7. విశాలత, వైశాల్యం. దశా. 5.115 ; 8. పేర్పు, పన్నకం, ఇటుక లారన రాళ్ళను వాటి మందంమీద పడుకోబెట్టటం. స.క్రి. 1. ప్రవహింపచేయు. హరి.పూ. 2.70 ; 2. బాణాదులు ప్రయోగించు. భాస్క.రా.యు. 937.

పరపటికె రూ. పొరుపటిక. వి. సంగటి చేయటానికి వాడే గుండ్రంగా లావుగా ఉండే మట్టిపాత్ర. పరపారు అ.క్రి. ఒప్పు. కావ్య.చూ. 7.30. పరపుకరము వి. నమస్కార విశేషం. హంస. 4.213. పరపుకోవె వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. దీనిమీదే పరం ఉంటుంది.

పరపుకొమ్ము చూ. పరము¹.

పరప్పట్టి చూ. పరము¹.

పరబడు(-పడు) అ.క్రి. తప్పించుకొని తిరుగాడు.

సం. పర-. ఇతరమయిన.

పరబారా అవ్య. ఇతరులద్వారా.

సం. పర-. ఇతరుడు, ద్వారా. గుండా, వల్ల.

పరమటిచుక్క చూ. పరమర.

పరమటిల్లు చూ. పరమర.

పరమపొక్క వి. తూము, నీళ్ళుపోయేదారి.

సం. పరమ-. ఉత్కృష్టమయిన, ఉన్నతమైన.

పరమర రూ.చూ. పడుమర. వి.ఔ. సూర్యుడు అస్తమించే దిక్కు.

పరమటిచుక్క వి. శుక్రుడు పేరుతో ఉండే నక్షత్రం, పొద్దుగూకిన తరవాత పడమట ఆకాశంలో కనిపిస్తుంది. పరమటిల్లు రూ.చూ. పడమటిల్లు. వి.ఔ. పల్లెలలో పెద్ద తవంతులలో పడమటివైపున ఉండే పూజా మందిరం.

పరమహంసక్రియ రూ. పరమాషిక్రియ. వి. గోసాయిచిట్కా.

సం. పరమహంసక్రియా. జ్ఞాని యొక్క చేష్ట.

< సం. పరమహంసక్రియా (అర్థవిపరి.).

పరమా వి. సున్నం, గులక మొదలైన వాటి కొలతకు వాడే సాధనం.

సం. పరమ-. శ్రేష్ఠమయిన, ఉన్నతమైన.

పరమాన రూ. పరమానము, పరమానా, పరమానావు, పరవానా, పరుమానా, పరుమాను, పర్మానా, పర్వాన, పర్వాన, ఫరమానా, ఫరమాను, ఫరవానా, ఫరుమానా, ఫరుమాను, ఫరువానా, ఫర్మానా, ఫర్మాను. వి. అధికారులు పంపే ఆజ్ఞా పత్రం, ఆజ్ఞ. దశా. 3.45.

హిం.ఉ.పార. ఫర్మానా. ఆజ్ఞ ఇవ్వటం, చెప్పటం, చేయటం.

< ఉ. ఫర్మానా.

పరమానము రూ.చూ. పరమాన. వి. అధికారులు పంపే ఆజ్ఞా పత్రం.

పరమానా రూ.చూ. పరమాన. వి. అధికారులు పంపే ఆజ్ఞా పత్రం ఆజ్ఞ.

పరమానావు రూ.చూ. పరమాన. వి. ఆజ్ఞ.

పరమాయించు రూ. పురమాయించు, పుర్మాయించు. స.క్రి. సెలవిచ్చు, వస్తువునుకాని పనినికాని చెయ్యమని ఒకరిని ఏర్పాటుచేయు.

హిం.ఉ. ఫర్మానా. ఆజ్ఞ.

< ఉ. ఫర్మా(నా) + -ఇంచు³.

పరమాయిషీచీర వి. భారంగా నేసిన చీర.

హిం.ఉ. ఫర్మాఇశ్. ఆజ్ఞాపించి ప్రత్యేకంగా తయారు చేయించటం.

< ఉ. ఫర్మాఇశ్ + చీర.

పరమాషిక్రియ రూ.చూ. పరమహంసక్రియ. వి. గోసాయి చిట్కా.

పరము¹ రూ. పర⁴, పరం, పరవ, ప్రాం. వి. 1. చదును. రుజుత్వం. కాశీ. 5.205 ; 2. కట్టిబండి మీద పరపు మ్రాను, చక్రం నిలువుకమ్మి. భాగ. 10 పూ. 251 ; 3. బండిపై పరచే గూడు. చంద్రాంగ. 2.41 ; 4. కూబరం, నొగ. ఆం.శా. 2.202.

పరంకట్టిల్లు వి. పెండెకట్టు కల ఇల్లు. పరంకట్టు వి. పూరింటిచట్రం మీది పెండెకట్టు. పరంకొమ్ము వి. 1. అడిగ, పారపట్టి, పారు ; 2. బండి చట్రంలోని నిలువ పట్టి. పరందిండు వి. పెళ్ళలు నలగటానికి కోసే కొయ్య మొద్దు. పరపుకొమ్ము వి. పరంకొమ్ము, బండిచట్రంలోని నిలువపట్టి. పరప్పట్టి రూ. పరంపట్టి. వి. బండి పరంలోని అడ్డపట్టి. పరంపట్టి రూ.చూ. పరప్పట్టి. వి. బండిపరంలోని అడ్డ పట్టి. పరంబడె వి. పంగలగా ఉన్న ఒనికర్రలపై పొడుగ్గా వేసిన కర్ర. పరంబండి వి. అడ్డమీద పరం ఉన్న బండి.

పరము² వి. అనశనవ్రతం, ప్రాణాధారం. (దీనికి వృత్తిలో "ము" వర్ణలోపం జరుగుతుంది).

పరగడపు రూ.చూ. పఱగడుపు. వి. 1. మరుపు ; 2. ఉదయంనుంచీ ఏమీ తిండిలేని కడుపు. పరగడుపు రూ.చూ. పఱగడుపు. వి. పత్రివలె ఏమీ లేని కడుపు. ఆహారం వేయని కడుపు. పరముపడు(-పడు) అ.క్రి. ప్రాణాధారంపడు. ఆము. 6.98.

పరంపట్టి చూ. పరము¹.

పరంపోకు రూ.చూ. పరంబోకు. వి. గవర్నమెంటు వారి ఆదీనంలో ఉన్న భూమి.

సం. పరమభోగ-. బాగా అనుభవించటం.

**పరంపోగు** రూ.చూ. పరంబోకు. వి. గవర్నమెంటు వారి అధీనంలో ఉన్న భూమి.

**పరంబడె** చూ. పరము[1].

**పరంబంచి** చూ. పరము[1].

**పరంబోకు** రూ. పరంపోకు, పరంపోగు, పరంబోగు, పురంబోకు, పొరంబాక, పొరంబోకు, పొరంబోగు, పోరంపోగు, పోరంబోకు, పోరుంబాక. వి. ప్రభుత్వం వారి అధీనంలో ఉన్న భూమి, గ్రామస్థులందరు ఉమ్మడిగా ఉపయోగించుకునే రోడ్లు, కాల్వలు, శ్మశానం మొ. వాటికి గవర్నమెంటు వారు వదిలిన నేల.

సం. పరమభోగ-. బాగా అనుభవించటం.

<సం. పరమభోగ-.

**పరంబోగు** రూ.చూ. పరంబోకు. వి. ప్రభుత్వంవారి అధీనంలో ఉన్న భూమి.

**పరకులు** వి.బ.వ. కాయలు. కు.సం. 6.37.

**పరవ** రూ.చూ. పరము[1]. వి. పరంకొమ్ము.

**పరవదోలు(-తోలు)** స.క్రి. 1. అడవి జంతువులను వేటాడటంలో వలయాకారంగా దూరంగా మనుషులు చేరి తప్పెటలు కొట్టి బాకాలు ఊది గలాటా చేస్తూ కమ్ముకొని వస్తూ లోపలచిక్కిన జంతువుల్ని మాటులలోవేచి ఉన్న వేటగాళ్ళ గుండు దెబ్బ మేరలోకితోలు ; 2. నిర్బంధంగా జనాన్ని ఒకచోటకుతోలు.

**పరవంజు** స.క్రి. 1. కమ్ముకొను, ఆవరించు. వేంక.పంచ. 1.496 ; 2. ప్రసరించు.

సం. ప్రపంచ-. విస్తరించటం, వ్యాపించటం ; ప్రా. పవంచ-. విస్తారం.

<సం. ప్రపంచ-.

**పరవంజుకొను** స.క్రి. కమ్ముకొను, వ్యాపించు. వేంక. పంచ. 1.469.

**పరవర** రూ.చూ. పరగర. వి. ఊరి వెలుపలి పొలం.

**పరవడి** రూ.చూ. పరువడి[2]. వి. గంతు.

**పరవళ్లుచుట్టు** అ.క్రి. గంతులువేయు, ఉత్సాహంగా ఉండు. సత్య.సాం. 4.140. **పరవళ్లుద్రొక్కు(-త్రొక్కు)** రూ.చూ. పరువడుల్ ద్రొక్కు. అ.క్రి. గంతులువేయు, ఉత్సాహంగా ఉండు.

**పరవళ్లుచుట్టు** చూ. పరవడి.

**పరవళ్లుద్రొక్కు** చూ. పరవడి.

**పరవర్దిగారు** వి. ఈశ్వరుడు, ఖుదా. విశ్వే.శ. 67.

హిం.ఉ. పర్వర్దిగార్-. ఈశ్వరుడు ; పార. పర్వర్దగార్-. పాలకుడు, ఈశ్వరుడు.

<ఉ. పర్వర్దిగార్.

**పరవరిష్** రూ. పరవరీ, పరువరవి. వి. సంరక్షణ, పెంపకం.

హిం. పర్వరిశ్. ఆధారం, పోషణ, రక్షణ, పెంపకం ; ఉ. పర్వరిశ్. చదువు, నాకరం, పెంపకం, పోషణ ;

క. పరవర్తి.

<ఉ. పర్వరిశ్.

**పరవషీ** రూ.చూ. పరవరిష్. వి. సంరక్షణ, పెంపకం.

**పరవా**[1] చూ. పరదా. వి. పరదా, ప్రావరణ వస్త్రం.

**పరవా**[2] రూ. పర్వా, పర్వా. వి. 1. లక్ష్యం : 2. ప్రమాదం.

హిం. పర్వాహ్, పర్వాఈ, పర్వా-. చింత, ధ్యానం, ఆధారం ; ఉ. పర్వా-. చింత, భయం, ధ్యానం, కోరిక, లక్ష్యం ; పార. పర్వా, పర్వాహ్.

<ఉ. పర్వా.

**పరవాది** విణ. ఆత్రగొట్టు. మను. 3.84.

సం. పర-. ఇతరుడు, వాది. వాదించేవాడు.

**పరవానా** రూ.చూ. పరమాన. వి. 1. ఆజ్ఞ ఇవ్వటం, ఆజ్ఞ. భద్ర.శ. 47 ; 2. పరిష్కారం.

**పరవాళులు** వి.బ.వ. ధారాగృహంలో యంత్రముఖంలో జారే జలధారలు. కు.సం. 5.109.

సం. పరవారి. ఎత్తునుంచి వచ్చే నీరు.

<సం. పరవారి + -లు.

**పరవిడుచు** స.క్రి. వదలివేయు. కాశ్మ. సం. 5.201.

సం. పర-. దూరం.

<సం. పర- + విడుచు.

**పరవు** రూ.చూ. పర్వు. అ.క్రి. వ్యాపించు. భీమ. 3.87 ; వి. వ్యాపించటం.

**పరష** రూ.చూ. పరుస[1]. వి. బ్రహ్మోత్సవంలో రథోత్సవానంతరపు ఉత్సవం ; 2. ప్రదర్శనం.

**పరస** రూ.చూ. పరుస[1]. వి. ఉత్సవానికి వచ్చే జనసమూహం. బసవ. 2.145 ; 2. ఒకజాతి బిచ్చగాడు. హంస. 3.29 ; 3. పశుపులసంత.

**పరసము** రూ.చూ. పరుసము[2]. వి. పరసవేది.

**పరసలు** వి.బ.వ. మృతిచెందిన అయిదో నాడుగాని తొమ్మిదో నాడుగాని చేసే క్రియలు.

**పరసవేది** రూ.చూ. పరుసవేది. వి. ఇనుమును బంగారంచేసే రసం.

**పరసాల**[1] వి. పగులు.

**పరసాల**[2] వి. ఇంటిలోని ముందుహాలు, ముందరిల్లు.

సం. పరశాలా. ఉన్నతగృహం.

<సం. పరశాలా.

**పరసు** రూ.చూ. పరుసు[1]. వి. విధం. హరి. ఉ. 4.158.

**పరస్థలము** వి. 1. చెక్కుడు పనిలో అక్కరలేని భాగం ; 2. గోడ కట్టటంలో రెండురాళ్ళ మధ్య వదిలే చోటు.

సం. పరస్థల-. ఇతర ప్రదేశం.

<సం. పరస్థల- (అర్థవిపరి.).

**పరాకిపేటు** రూ. పరాకుపేటి. వి. అంచులో గువ్వకళ్ళ మాదిరిగా నేసిన డిజైను.

**పరాకు** వి. 1. ఉపేక్షాభావం, ఉదాసీనత. శ్రం. నై. 5.106 ; 2. ఏకాగ్రత, సావధానత. శ్రం. నై. 6.63 ; 3. తత్పరతను తెలిపేమాట, హెచ్చరికను తెలిపేమాట. ప్రభా. 2.33 ; 4. మైమరపు, వివశత్వం. ప్రభా. 5.159 ; 5. మగ్నత. కళా. 3.81 ; 6. అసవధానత, ఏమరిపాటు. నరస. 3.23 ; 7. అసత్యం. విప్ర. 3.45 ; 8. హెచ్చరిక. కుప. చ. 3.115.

క. పరాకు, నిర్లక్ష్యం, మరపు, ఉదాసీనం.

**పరాకుచేయు** రూ. పరాకుసేయు. స.క్రి. 1. ఉపేక్ష చేయు. కకుత్స. 4.12 ; 2. హెచ్చరించు. విజయ. 2.198 ; 3. ప్రకృత విషయంనుంచి మరల్చు, మరపు కలిగించు. పరాకుచేసికొను అ.క్రి. వినిపించుకోనట్లునటించు, ఉపేక్షాభావం వహించు. విజయ. 2.200. పరాకుదెల్పు (-తెల్పు) అ.క్రి. సేవచేయు. శుక. 1.200. పరాకుపడు అ.క్రి. ప్రమాదపడు ; స.క్రి. మరచు. పరాకుసేయు(-చేయు) రూ.చూ. పరాకుచేయు. స.క్రి. 1. ప్రకృత విషయం నుండి మరల్చు, మరపు కలిగించు. కువ. చ. 3.115 ; 2. ఉపేక్షచేయు. విజయ. 1.65 ; 3. హెచ్చరించు.

**పరాకుపేటి** రూ.చూ. పరాకిపేటు. వి. అంచులో గువ్వకళ్ళ మాదిరిగా నేసిన డిజైను.

**పరాంగులు** చూ. పరంగి. వి.బ.వ. పరంగి స్త్రీలు. చెన్న. వి. 59.

**పరాచకము** రూ. చూ. పరియాచకము. వి. పరిహాసం, ఎకసెక్కెం. శుక. 1.77.

**పరాజి** వి. దొడ్డి, ఇంటివెనక స్థలం.

హిం. ఉ. పరాఈ, పరాయా, పరాయీ. వేరే. ఇతరమయిన, ఆత్మీయంకాని.

**పరాట్-** రూ.చూ పరాట. వి. రీపరు, ఇంటికప్పు వేయటంలో వాడే పలచని చెక్క.

**పరాట** రూ. పరటా, పరాట్, పరాటా, పరాటు. వి. 1. పంచ, ఇంటిముందున్న కప్పువేసిన అరుగు ; 2. రీపరు, ఇంటికప్పుకు వాడే పలచనిచెక్క.

**పరాటచెక్క** వి. రీపరు, ఇంటికప్పు వేయటంలో వాడే పల్చనిచెక్క. **పరాటబద్ద** వి. రీపరు, ఇంటికప్పువేయటంలో వాడే పలచని చెక్క. **పరాటవానం** రూ. పరాటానం. వి. గొయ్యకప్పుకు ఆధారంగా ఉండేవానం.

**పరాటా** రూ.చూ. పరాట. వి. రీపరు, ఇంటికప్పు వేయటంలో వాడే పలచని చెక్క.

**పరాటానం** రూ. చూ. పరాటవానం. వి. గొయ్యకప్పుకు ఆధారంగా ఉండేవానం.

**పరాటు** రూ. చూ. పరాట. వి. రీపరు, ఇంటికప్పుకువాడే పలచనిచెక్క.

**పరాడిగోడ** రూ.చూ. పారిగోడ. వి. ప్రహరీగోడ, ఇల్లు మొ. వాటి ఆవరణం చుట్టూ కట్టినగోడ.

**పరాతు** వి. పళ్ళెం.

హిం. పరాత్. లోహంతో ప్రత్యేకంగా కంచుతో చేయబడిన లోతులేని పెద్దపాత్ర ; ఉ. పరాత్, పరాతి.

< ఉ. పరాత్.

**పరాందవ** చూ. పరంగి. వి. బొప్పాయి.

సం. పర-. ఇతరులకు సంబంధించిన.

< సం. పర- + అనప.

**పరామరిక** వి. 1. వివేచనం, మంచిచెడ్డలను చక్కగా విచారించటం. విక్ర. 3.63 ; 2. విచారణ, పరిశీలనం. మను. 3.129.

సం. పరామర్శ-. జ్ఞప్తికి తెచ్చుకోవటం, పరిగణన, ఆలోచన ; ప్రా. పరామరిస-. వివేచన, విచారం, యుక్తి, ఉపపత్తి, న్యాయశాస్త్రంలోని వ్యాప్తివిశేష రూపాల విజ్ఞానం.

**పరామరిస** వి. 1. వివేచనం, మంచిచెడ్డలను చక్కగా విచారించటం. విష్ణుపు. 7.16 ; 2. విచారణం, పరిశీలనం.

సం. పరామర్శ-. జ్ఞప్తికి తెచ్చుకోవటం, పరిగణన, ఆలోచన ; ప్రా. పరామరిస-. వివేచన, విచారం, యుక్తి, ఉపపత్తి ; శౌ. పరామరిస- ;

క. పరామరిసు, పరాంబరిసు, పరామ్మరిసు. దయతోపోషించు, ఓదార్చు, పరీక్షించు ; త. పరామరి. పరీక్షించు, కోపించు.

< ప్రా. పరామరిస-.

**పరామరిసించు** స.క్రి. 1. న్యాయాన్యాయాలు విచారించు. వైజ. 4.89 ; 2. విచారించు, ఆలోచించు. సమీర. వి. 1.178 ; 3. వెదకు. విప్ర. 5.6 ; 4. (నలుదిక్కులు) పరీక్షించు. కువ. చ. 2.114 ; 5. పరికించు, చక్కగాచూచు. ప్రబంధ. 743.

**పరామరిపించు** చూ. పరామరిస.

**పరాయి** రూ. పరాయీ. విశ. ఇతరమయిన, వేరే.

హిం. ఉ. పరాఈ, పరాయా, ఇతరం, ఇతరులకు సంబంధించిన, కొత్త, వింతైన, పరదేశానికి సంబంధించిన.

< ఉ. పరాఈ.

**పరాయివాఁడు** విశ. అన్యుడు, ఇతరుడు.

**పరాయీ** రూ.చూ. పరాయి. విశ. ఇతరులు.

**పరారి** వి. ఎత్తుపడి ఊరు విడిచి పారిపోయిన వాడు.

హిం. ఉ. ఫ़రారీ. తప్పించుకొని తిరిగేవాడు.

< ఉ. ఫ़రారీ.

**పరారిగోడ** రూ.చూ. పారిగోడ. వి. ప్రహరీగోడ, ఇంటి ఆవరణం చుట్టూ కట్టిన గోడ.

**పరారీ** వి. పారిపోవటం.

హిం.ఉ. ఫ़రార్. పారిపోయిన ;

క. ఫరారి ; త. ఫరారి.

< ఉ. ఫ़రార్.

**పరాటిగోడ** రూ.చూ. పారిగోడ. వి. ప్రహరీగోడ, ఇంటి ఆవరణం చుట్టూ కట్టిన గోడ.

**పరాశకము** రూ.చూ. పరియాచకము. వి. నానావిధ వేషాలు వేసి గ్రామంలో తిరిగి హాస్యం పట్టించి డబ్బు దండుకొనే వాడు.

**పరాసు** వి. ఫ్రాన్సుదేశం.

ఇం. *France*. ఫ్రెంచిదేశం ;

త. పరాసుకళ్. ఫ్రెంచివారు.

< ఇం. France.

**పరాసుఁడు** వి. ఫ్రాన్సుదేశస్థుడు. రంగా.చ. 1.138, 140. **పరాసుపేటు** రూ. పరాస్‌పేటి. వి. అంచులో నేసే ఒకరకం డిజైను. **పరాస్‌పేటి** రూ.చూ. పరాసుపేటు. వి. అంచులో నేసే ఒకరకం డిజైను.

**పరాస్‌పేటి** చూ. పరాసు.

**పరి** రూ. పఱి[3], పారి[1]. వి. 1. సైన్యం, దండు, కాల్బలం. కు.సం. 9.91, రాధ.విరా. 2.37 ; 2. పర్యాయం.

మారు. భార. విరా. 3.119 ; 3. వేష్టనం, చుట్టు ముట్టటం. భార.శాంతి. 3.505 ; 4. చలం, పట్టుదల. నృసింహ. 8.72 ; 5. వరుస. మను. 4.4 ; 6. ప్రవాహం, ఒకవిధమైన జలాశయం. హంస. 4.210 ; 7. కొల్ల. ఆం.భా. 2.223 ; 8. మూక, గుంపు, సమూహం ; 9. భారం ; 10. బాధ ; 11. కాడిని నొగకు లేదా ఏడికోలకుగాని కట్టినప్పుడు ఏర్పడ్డ మోకు వరుస.

సం. పర్యాయ-. మారు, చుట్టు ; ప్రా. పరియాయ-, పజ్జాయ.

<ప్రా. పరియాయ-.

పరికట్టె వి. దరిద్రుడు. ఆం.భా. 3.14. పరికాడు వి. 1. తెగకు ముఖ్యమైన ఏనుగు, యూథపం. భార.ఆది. 4.207 ; 2. తెగకు ముఖ్యమైనది, నాయకత్వంలో ఉన్నది. పండి.చ. 2.89 పు., 26 పం. పరికొను రూ.చూ. పరిగొను. అ.క్రి. 1. గుంపుకట్టు. రుక్మా.చ. 1.166 ; 2. బారుతేరు, బారుకట్టు. వాల్మీ. 2.64 ; 3. పరివేష్టించు, వలయాకారంగా చుట్టు నిలుచు ; 4. చలపట్టు ; 5. కవియు, పడు ; 6. దండువెడలు ; 7. అతిశయించు, అధికమగు ; 8. ఉత్సాహయుక్తమగు ; స.క్రి. చుట్టుముట్టు. పరిగడచు (-కడచు) అ.క్రి. సమానమగు. ప్రభా. 2.42. పరిగొను (-కొను) రూ. పరికొను, పఱిగొను. అ.క్రి. 1. దండువెడలు, దండెత్తు. కు. సం. 2.64 ; 2. పడు. కు. సం. 6.128 ; 3. అతిశయించు, అధికమగు. బసవ. 2.168 ; 4. ఉత్సాహయుక్తమగు. బసవ. 3.21 ; 5. చలపట్టు. భార.విరా. 4.20 ; 6. పరివేష్టించు, వలయాకారంగా చుట్టు నిలుచు. హరి.పూ. 6.65 ; 7. బారుతీరు, బారుకట్టు. ఉ.హరి. 3.25 ; స.క్రి. చుట్టు ముట్టు. భార శాంతి. 5.130. పరిగొలుపు-(కొలుపు) స.క్రి. హెచ్చుచేయు, అధికంచేయు. కేయూ. 3.284. పరిచిచ్చు వి. గ్రామాది నిరోధార్థమై పెట్టిన నిప్పు. విజ్ఞా.ప్రా. 13. పరిమార్చు రూ. పరిమాఱుచు. స.క్రి. 1. చంపు, వధించు. కు.సం. 10.164 ; 2. జయించు, నిర్జించు. భార.శాంతి. 1.48 ; 3. పోగొట్టు, నశింపచేయు. హర. 7.24 ; 4. వేటాడు. రామాభ్యు. 2.58. పరిమార్పించు స.క్రి. చంపించు. వేంక.పంచ. 1.417. పరిమార్పు వి. 1. హింస. ఆం.భా. 2.224 ; 2. చంపటం. పరిమాఱు అ.క్రి. 1. రూపు మాయు. కు.సం. 2.54 ; 2. విసురు. ద.హిం. శా.సంపు. 6. శా.సం. 752. క్రి.శ. 1383 ; 3. ఖండిత మగు ; 4. చచ్చు. పరిమాఱుచు రూ.చూ. పరిమార్చు. స.క్రి. 1. చంపు ; 2. జయించు, నిర్జించు ; 3. నరుకు ; 4. వేటాడు ; 5. పోగొట్టు, నశింపచేయు. పరిమొగము వి. 1. సేనాముఖం. కు.సం. 2.69 ; 2. అతిముఖ్యం. పరియెత్తు (-ఎత్తు¹) అ క్రి. అతిశయించు. కవిక. 3.221. పరివిరుచు స.క్రి. పారవిరుచు. శాళ్వ. సం. 3.405. పరి వెడలు అ.క్రి. దండువెడలు. కు.సం. 9.91. పరివోవు(-పోవు) రూ.చూ. పఱివోవు. అ.క్రి. కొల్లపోవు. విష్ణు పు. 2.127. పరిపీఁ (-చీల) వి. కాడిమధ్య పైపైపగొట్టే మేకు.

పరిక¹ రూ.చూ. పరిగ¹. వి. మత్స్య విశేషం.

పరిక² వి. రంగవల్లి విశేషం, ఒకరకం ముగ్గు. కువ.చ. 3.131.

పరిక³ రూ.చూ. పరిగె¹. వి. తృణ విశేషం. ప్రబంధ. 201 (Trapa bispinosa).

పరికతిగలు రూ.చూ. పరిగతిగలు. వి.బ.వ. సారెచక్రం తయారీలో మట్టిని మెత్తటానికి పెట్టిన పరికచెట్టు చువ్వలు. పరికలువెట్టు (-పెట్టు) అ క్రి. ఉవ్విళ్ళూరు. శాళ్వ.సం. 4.93.

పరిక⁴ రూ. పరిగె³. వి. పక్షి విశేషం, ఒకజాతి పిట్ట. ఆం.భా. 2.98.

పరికి¹ రూ.చూ. పరిగె¹. వి. తృణ విశేషం. హంస. 5.45.

పరికిగుండ్లు వి.బ.వ. సారె చక్రం తయారీలో మట్టిని మెత్తటానికి పెట్టిన పరికిబద్దలు. పరికిపెండి రూ. పరికి పెండె. వి. సారె చక్రం తయారీలో మట్టిని మెత్తటానికి పెట్టిన పరికచెట్టు బద్ద. పరికిపెండె రూ.చూ. పరికిపెండి. వి. సారె చక్రం తయారీలో మట్టిని మెత్తటానికి పెట్టిన పరికచెట్టు బద్ద.

పరికి² రూ. పరికె⁴. వి. కాతభేదం.

పరికించు స.క్రి. 1. పాటించు, లెక్కచేయు. భార.ఆది. 3.181 ; 2. పరిశీలించు. భార.సభా. 1.49 ; 3. విచారించు, ఆలోచించు. కు.సం. 8.164 ; 4. వెదకు, అన్వేషించు. భాస్క.రా.బాల. 404 ; 5. కాంచు. భాస్క. రా.బాల. 418 ; 6. పరీక్షించి చూచు. కాశీ. 4.154 ; 7. చూచు, దర్శించు. ప్రబోధ. 4.27.

సం. పరీక్ష్. పరీక్షించు ; పరీక్షా. పరిశీలన ; ప్రా. పరిక్ఖ-. పరీక్షించు, పరిక్ఖా, పరిక్ఖణ-, పరిక్ఖణం ; జై. మహా. పరిక్ఖ- ; అ.మా. పరిక్ఖణ-, పరిక్ఖి ; పా. పరిక్ఖా.

క. పరికె-. పరీక్ష, పరికిసు-. పరికించు.

<ప్రా. పరిక్ఖ-+-ఇంచు³.

-పరికిణి రూ. పరికిణీ, పరికినీ. వి. స్త్రీలు కట్టుకునే పావడ, గాగర. మృత్యు. 1.8.

సం. పరికర-. కటివస్త్రం ; మరా. పర్కర-. బాలికలు ధరించే గౌను ; పార. పర్కార్.

<మరా. పర్కర-.

పరికిణీ రూ.మా. పరికిణి. వి. గాగర, బాలికలు ధరించే కుచ్చిళ్ళు పోసి కట్టిన వస్త్ర విశేషం.

పరికిణీగుడ్డ రూ. పరికినీగుడ్డ. వి. ఆడవాళ్ళ పరికిణీల కోసం నేసిన గుడ్డ.

పరికిని రూ.చూ. పరికిణి. వి. స్త్రీలు కట్టుకొనే పావడ.

పరికినీగుడ్డ రూ.చూ. పరికిణీగుడ్డ. వి. ఆడవాళ్ళ పరికిణీలకోసం నేసిన గుడ్డ.

పరిఖ¹ వి. కందకం, అగడ్త. పి.శకు. 1.75.

సం. పరిఖా. అగడ్త ; పా. పరిఖా ; దే.ప్రా. పరక్క-. అల్పప్రవాహం ;

క. పరికె. కందకం ; త. పరికై.

<సం. పరిఖా.

పవుదరు రూ.చూ. పౌదరు. వి. 1. పొడి, పిండి ; 2. ముఖానికి రాసుకొనే పరిమళ ద్రవ్యం.

పవుతి రూ.చూ. ప్రవుతి. వి. చనిపోవటం ; విశే. చనిపోయిన.

పవును రూ.చూ. పౌను. వి. ఒక తూనిక, పదహారు కొన్నుల బరువు, నలభై తులాలు.

పవులు రూ.చూ. పగులు. అ.క్రి. 1. బద్దలగు, బీటిల్లు. కు.సం. 6.138, భార.భీష్మ. 2.360 ; 2. చిన్నమగు, తెగు. ఉ.హరి. 3.104.

పవ్వ వి. బాన, వెడద మూతిగల భాండ విశేషం. ఆం.శా. 2.246.

పవ్వగిట్ట వి. వల్పుగా వెడల్పుగా ఉన్న గిట్ట.

పవ్వడించు రూ. పవడించు, పవళించు, పవ్వళించు. అ.క్రి. 1. నిద్రించు. కు.సం. 8.118 ; 2. శయనించు. పరుండు.

సం. ప్రసుప్త-, బాగా నిద్రించిన, ప్రపాత-. క్రింద పడటం, కునికిపాటు ; ప్రా. పవడ-, పవడ్డ, పహుడ-, కిందపడు, పవడణ-, పవాడ- ; దే.ప్రా. పవడ్డ-. నిద్రించు ;

క. పవడిసు, పవళిసు. పరుండు, విశ్రాంతి తీసుకొను.

<ప్రా. పవడ్డ-+-ఇంచు[3].

పవ్వళించు రూ.చూ. పవ్వడించు. అ.క్రి. 1. శయనించు. పరుండు. భార.ఉద్యో. 2.121 ; 2. నిద్రించు. భార. అను.2.323 ; 3. ఉండు. హర. 7.140.

పవ్వళింపు రూ. పవళింపు. వి. పడక, శయనం, పరుండటం. ఆం.శా. 1.141.

పవ్వళింపు చూ. పవ్వళించు.

పశాకు వి. ఔషధానికి ఉపయోగించే ఆకు, మంచాకు.

<పస+ఆకు.

పశినికుండ రూ.చూ. పసినికుండ. వి. మేడమీద కలగాల్లాగా పెట్టే బుడ్డి.

పశువడు అ.క్రి. యజ్ఞాదుల్లో చంపబడే పశువగు.

సం. పశు-. జంతువు.

పశువరించు రూ. పశువళించు. స.క్రి. 1. యజ్ఞాదుల్లో చంపటానికి పశువుగా చేయు. భార.సభా. 1.189 ; 2. చంపు.

సం. పశు-. జంతువు.

<సం. పశు-+-ఇంచు[3].

పశువళించు రూ.చూ. పశువరించు. మి.స.క్రి. 1. పరిమార్చు. బసవ. 6.155 ; 2. (యజ్ఞాదుల్లో చంపటానికి) పశువుగా చేయు.

పశువుచు మి.స.క్రి. (యజ్ఞాదుల్లో చంపటానికి) పశువుగా చేయు. భార.అరణ్య. 3.215.

సం. పశు-. జంతువు.

<సం. పశు-+పఱుచు.

పస వి. 1. శౌర్యం. భార.ద్రోణ. 2.57 ; 2. పచ్చితనం. భార.శల్య. 1.232 ; 3. సారం. చేవ. హరి.పూ. 6.78 ; 4. పరిమళం, వాసన. భీమ. 1.117 ; 5. శక్తి. సామర్థ్యం. భాగ. 6.111 ; 6. ప్రేమ. భాగ. 6.136 ; 7. చాతుర్యం, నేర్పు. వరాహ. 3.92 ; 8. చతురోక్తులు, పారి. 1.125 ; 9. మేలిమి, పసిమి. మను. 3.23 ; 10. అనుబంధం. మను. 6.70 ; 11. ఒప్పిదం. అందం. కాంతి. ఆము. 2.58 ; 12. స్ఫురణం. ఆము. 5.130 ; 13. కోవిదత, పాండిత్యం. శశా. 1.10 ; 14. అతిశయం, సమృద్ధి, ఆధిక్యం. శశా. 1.33 ; 15. విధం, పద్ధతి, రీతి. శశా. 2.40 ; 16. మృదుత్వం. శశా. 3.13 ; 17. గర్వం. శశా. 5.45 ; 18. బండాలం, సామగ్రి ; విశే. 1. అధికమైన. గౌ.హరి.పూ. 543 పం. ; 2. మిసిమి గల. వేమ. 314.

క. పసి, పసు, పసిర్, పసుర్, పచ్చె, పచె, పచ్చ, పమ్చె, పచ్చనె, హస-. ఆకుపచ్చతనం, పసుపురంగు, బంగారు వర్ణం, కొత్త ఆకుల లేత కొమ్మ, పండని, పచ్చి, యౌవనం ; తు. పచ్చ-. ఆకుపచ్చ. స్వచ్ఛం, పచ్చె, పజి-. ఆకుపచ్చ. స్వచ్ఛం. తడి. చెమ్మ. పసె-. తడి, చెమ్మ ; త. పచ (-ప్ప-, -న్త-). ఆకుపచ్చగాఉండు. లేతపసుపు లేక పాలిపోయిన రంగుగా మారు, బంగారు వర్ణంగా అగు (సాయంత్రం ఆకాశంలా). పయ (-ప్ప-, -న్త-). రంగులో మార్చు, పయిర్-. పెరిగే ధాన్యం. పచ్చిక, పై-. పచ్చతనం, యౌవనం, అందం, పసై ; మ. పచ, పై, పైయ్-. మృదువైన, స్వచ్ఛమైన, ఆకుపచ్చ. పచ, పస, పయ-. లేమ, తడి, పచ్చ-. ఆకుపచ్చతనం, స్వచ్ఛమైన, పయిర్-. ఆకుపచ్చ ధాన్యం ; కో. పచ్-. ఆకుపచ్చ. పచ్చి (మాంసం). కాగని (సీరు), కాలని (కుండ) ; కొలా. పచ్చిక్ పస్-. పండని పండు. ముగ్గని పండు. పయ్ల్-. పైత్యం ; గ.(ఒల్లా). పసూర్-. పచ్చి.

<మూ.ద్రా. *పచ్.

పసకదుగు రూ.చూ. పసగదుగు. వి. బియ్యపు కడుగు నీళ్ళు. పసగదుగు (-కదుగు) రూ. పసకదుగు. వి. కడుగు, శుక్తం. పసచెడు స.క్రి. రూపుమాయు. నశించు. భాగ. 8.343. పసదవ్వు (-తవ్వు) అ.క్రి. క్షీణమగు, చెడు. వరాహ. 1.98. పసపడు అ.క్రి అభిలాషపడు, వాంఛించు. ప్రభు. 4.111 పం. పసపసపు వి. 1. మానిపసుపు ; 2. పసుపురంగు ; 3. రాతిమీద రాచి పూసుకొనే పసుపు, బండారు ; విశే. పసుపువన్నె కల. పసబయటపడు అ.క్రి. బండారం బయటపడు. పసలారు అ.క్రి. వృద్ధిచెందు, సమృద్ధమగు. బసవ. 1.100. <పస+-లు+-ఆరు. పసలుకొను అ.క్రి. అతిశయించు. భాగ. 8.396 పసలుపుట్టించు అ.క్రి. ఆసక్తి కలిగించు. శార్ఙ్గ.సం. 63.

పసకఉన్ని రూ. పచ్చఉన్ని, పస్కఉన్ని. వి. పచ్చలో ఎరుపువన్నె కలిసిన ఉన్ని.

పసకగొర్రె రూ. పస్కగొర్రె. వి. పచ్చలో ఎరుపువన్నె కలిసిన బొచ్చుగల గొర్రె.

పసగర వి. బంధనం.

పసగరగొను (-కొను) స.క్రి. 1. పీడించు, పాయచేయు. హరి.పూ. 7.167 ; 2. బంధించు.

పసఁగు రూ.చూ. పౌనఁగు. అ.క్రి విశదమగు.

**పసడం** రూ.చూ. పచ్చడము. వి. 1. ఉత్తరీయం; 2. వస్త్రం.

**పసదనము**[1] (-తనము) వి. 1. అలంకారం. కు.సం. 5.145; 2. అలంకరించటం. ఆం.భా. 2.146.

సం. ప్రసాధన-. అలంకరణ; ప్రా. పసాహణ-. సాధన, భూషణం, అలంకారం;

క. పసదన-. భూషణాలు.

<సం. ప్రసాధన.

**పసదనము**[2] రూ. పసాదము. వి. 1. పారితోషికం. నిర్వ.రా. 10.150; 2. అన్నం. సాంబ.మాన. 22.

సం. ప్రసాదన-. అన్నం, సంతోష పెట్టటం, ఉత్సాహాన్ని కలిగించేది; ప్రా. పసాయణ-. ప్రసన్నం చేసుకోవటం;

క. పసదన, పసాయన. కానుక.

<సం. ప్రసాదన-.

**పసదము** వి. ప్రసాదం, కృప.

సం. ప్రసాద-. స్వచ్ఛత, ప్రశాంతత, దయ, అభిమానం; ప్రా. పసాయ-. సుఖం; పా. పసాద-. స్వచ్ఛత; హిం. పసాఉ. అభిమానం; గు.మరా. పసాయ్. అభిమానం, సంపద.

<సం. ప్రసాద-.

**పసన** రూ.చూ. పసను. విశే. పసుపు పచ్చన. పండి.చ. పరా. 160 పు. 1 పం; వి. పసుపు పచ్చన.

**పసనారు** చూ. పసను.

**పసనిపండు** చూ. పసను.

**పసను** రూ. పసన. విశే. 1. ఎరుపు మించిన పసుపు వర్ణం కల. కు.సం. 12.205; 2. పరిపక్వమైన, చక్కగా పండిన. పండి.చ. 2.160 పు.; 3. అందమైన, బాగైన. రం.రా.బాల. 83 పు. 5 పం.; 4. మృదువైన, మెత్తని. శృం.నై. 6.133; 5. నిర్మలమయిన, స్వచ్ఛమైన. రాజ. చ. 2.126; వి. 1. అందం, చక్కదనం. భాస్క.రా.యు. 1481; 2. ఎరుపుమించిన పసుపువన్నె. శృం.నై. 8.157; 3. వర్ణం, రంగు. చమ. 1.43.

క. హసను. అందం.

**పసనారు** అ.క్రి. ఒప్పారు. విక్ర. 6.44. **పసనిపండు** వి. కలమాగిన పండు. పండి.చ. 2.470 పు.

**పసందు** రూ. ఫసందు. విశే. 1. చక్కని, మనోజ్ఞమైన. హంస. 5.355; 2. రుచికరమైన; వి. 1. మెచ్చుకోవటం. రంగా.చ. 2.91; 2. బాగు, సేబాసు; 3. సొగసుదనం, అందం.

హిం. పసంద్-. అభిరుచి, మంచిగాతోచినది; ఉ. పసంద్. రుచికరం, ఇచ్ఛ, అంగీకారం; పార. పసంద్, పిసంద్-. ప్రశంసచేయబడినది, అంగీకరింపబడినది, అంగీకారమైనది.

<ఉ. పసంద్.

**పసందుచేయు** స.క్రి. 1. మెచ్చుకొను; 2. అందంగల దానినిగా చేయు, బాగుచేయు. **పసందుమామిడి** వి. తీపి ఎక్కువగా ఉండే పెద్దరకం మామిడికాయ.

**పసపస** వి. 1. వానయొక్క ముసరు; 2. వానకురవటం మొ. వాటివల్ల దారి బురదగా ఉండటం; 3. రసాభాసం, చెడటం.

**పసపాడు** చూ. పసపు.

**పసపొప్పు** చూ. పసపు.

**పసపు** రూ. పసుపు, పస్పు. వి. హరిద్ర. పసుపు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 560. క్రీ.శ. 1342. భార.శాంతి. 4.97.

క. పసి, పసు, పసిర్, పసుర్, పచ్చె, పచె, పచ్చ, పచ్చు, పచ్చనె-. పసుపురంగు; త. పచు-. పసుపు రంగు; కొలా. పసుడి-. పసుపు రంగు, పచ్చాడి, పస్పాతాద్; నా. పసప్-. పసుపు; గ(ఒల్లా). పరిప్. పసుపు.

**పసపాడు** రూ. పసుపాడు. అ.క్రి. పసుపు పూసుకొని స్నానమాడు. శృం.నై. 3.156. <పసపు+ఆడు. **పసపార్చు** స.క్రి. 1. పసుపు పూసికొను. బసవ. 3.340; 2. పసుపు పూసి స్నానమాడించు. పసుపుకొమ్మైనాయిన్నవి అవ్య. అతిలోభి అయిన. **పసపుగన్నెర్లు** వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **పసపుంజాయ**(-చాయ) వి. పసుపు రంగు. **పసపుందోట**(-తోట) వి. పసుపుతోట. నెల్లూరు శాసనాలు. కందుకూరు శాసనం 83. క్రీ.శ. 1526. **పసపుముద్ద** రూ.చూ. పసుపుముద్ద. వి. పచ్చపిట్ట, పక్షి విశేషం. రసిక. 1.67.

**పసరం** రూ.చూ. పచ్చడము. వి. 1. ఉత్తరీయం; 2. వస్త్రం.

**పసరగన్ని** వి. ఎర్ర పసరుచెట్టు, గట్టిగా ఉండే నిరుపయోగకరమైన కలప కలిగిన అందమైన చెట్టు (Dalbergia lanceolaria).

**పసరగాలి** వి. ముసురులో తుప్పరతో వచ్చే చలిగాలి.

**పసరగున్న** వి. గట్టిగా ఉండే ఎర్రని కలపనిచ్చే లేతపసుపు రంగు పూలుపూసే చెట్టు (Acacia catechu).

**పసరపూత** వి. దళసరిగా ఉన్న పెద్ద ఆకులు కలిగి అలంకరణ సామగ్రి తయారీకి ఉపయోగపడే గట్టిగా ఉండే ఎర్రని కలప నిచ్చే చెట్టు (Diospyros tomentosa).

**పసరంచుక్క** చూ. పసరము.

**పసరము** రూ. పయిరము, పసలము, పసురము, పసులము, పైరము. వి. గొడ్డు, గోమహిష్యాదిపశువు. భార.విరా. 1.180.

సం. పశు-. గొడ్డు; పా. పసు; ప్రా.అ.మా. పసవ-. చారలు గలజింక.

<ప్రా. పసవ-.

**పసరంచుక్క** వి. శుక్రుడనే నక్షత్రం, పొద్దు గూకిన తరవాత పశువుల్ని ఇళ్ళకు తోలే వేళ పడమట పొడిచే చుక్క. **పసరము(గొడ్డివట్టుకొట్టు** స.క్రి. దావగొట్టు. మను. 4.85.

**పసరిక** చూ. పసరు[1].

**పసరికెమండ** చూ. పసరు[1].

**పసరించు** స.క్రి. 1. వ్యాపింపచేయు. బసవ. 1. 2పు. పం. 1,

బసవ. 1.150; 2. ప్రశంసించు. బసవ. 3.63 పు. 14 పం; 3. చెప్పు, పలుకు. బసవ. 3ఆ. 88పు. 23పం; 4. రచించు. పండి.చ. 1.4 పు; అ.క్రి. 1. భావించు, విచారించు. బసవ. 2.621 పం; 2. సాగు. బసవ. 3.886 పం; 3. ముందరకు పోవు. పండి.చ. 5.356 పు; 4. చలించు, చంచలమగు. భార.శాంతి. 4.174; 5. వ్యాపించు. శివ.ఉ. 2.34, అచ్చ.రా. కిష్కిం. 69.

సం. ప్రసార-. వ్యాపనం;

క. పసరిసు. వ్యాపించు.

<సం. ప్రసార-+-ఇంచు[3].

పసరింపు వి. వ్యాపనం. సం. ప్రసార-. వ్యాపనం. పసరిలు రూ. పసరిల్లు. స.క్రి. పసరింపచేయు. హరి.ఉ. 8.158. సం. ప్రసార-. వ్యాపనం. పసరిల్లు రూ.చూ. పసరిలు. స.క్రి. ప్రసరింపచేయు.

**పసరింపు** చూ. పసరించు.

**పసరిలు** చూ. పసరించు.

**పసరిల్లు** చూ. పసరించు.

**పసరు[1]** చూ. పచ్చి. రూ. పసురు. వి. 1. ఆకురసం. ఆము. 2.8; 2. ఆకుపచ్చని రంగు. ఆము. 4.166; 3. పిత్యం, రేతస్సు. ఆం.శా. 2.131; 4. జ్ఞానం; 5. పైత్యాదుల వల్ల కడుపులో పుట్టిన దుర్ద్రవం; విశే. 1. ఆకుపచ్చని. ఆము. 4.162; 2. పసరు వాసన కల.

క. పసలె. పచ్చగడ్డి; త. పచఇ.

పసరిక రూ.చూ. పసిరిక. వి. 1. పసరురంగు; 2. పచ్చపిట్ట; 3. కామెర్లజబ్బు; 4. నల్లగరిక; 5. చెట్లమీద ఉండే ఒకరకం పాము; విశే. పసరు వన్నెగల. పసరికెమంద రూ.చూ. పసరుమంద. వి. వానాకాలంలో పొలంలోకి తోలించే పశువులమంద. పసరుకట్టు రూ.చూ. పసురుకట్టు. వి. కనుకట్టు విద్య. పసరుకాయ రూ.చూ. పసరుఁగాయ. వి. పసరువాసనకల కాయ, లేతకాయ. పసరుకాను రూ.చూ. పసర్కొను. అ.క్రి. పసరువాసన కలిగి ఉండు. పసరుగవరు వి. ఎర్ర పసరుచెట్టు. గట్టిగా ఉండే నిరుపయోగకరమైన కలప కలిగిన అందమైన చెట్టు (Dalbergia lanceo'aria). పసరుగాత వి. దళసరిగా ఉన్న పెద్ద ఆకులు కలిగి, అలంకరణ సామగ్రి తయారీకి ఉపయోగపడే గట్టిగా ఉండే ఎర్రని కలపనిచ్చే చెట్టు (Diospyros tomentosa). పసరుగాయ (-కాయ) రూ.చూ. పసరుఁగాయ. వి. పసరువాసనకల కాయ, లేతకాయ. పసరుసుబ్బి వి. ఒకరకం పక్షి. పసరుఁగాయ (-కాయ) రూ. పసరుకాయ, పసరుగాయ. వి. పసరు వాసన కల కాయ, లేతకాయ. హరి. పూ. 6.82. పసరుచాయ వి. పసరురంగు. పసరుచీర వి. ఆకుపచ్చ రంగుచీర. పసరుజొన్న రూ. పొనురుజొన్న. వి. అన్నిటి కంటె భోజనానికి శ్రేష్ఠమైన పచ్చజొన్న. పసరుపాఱు రూ. పసరువాఱు. అ.క్రి. పసరు వర్ణం కలిగిఉండు, ఆకుపచ్చ పడు. భీమ. 2.55. పసరుపాలి వి పచ్చపొలానికి ఏట బలితో చేసేపూజ. పసరుమంద రూ. పసరికెమంద, పసిరికె మంద, పసురుమంద, పైరమంద. వి. వానాకాలంలో పొలంలోకి తోలించే పశువులమంద. పసరుమొగ్గ వి. లేత మొగ్గ. పారి. 3.51. పసరురంగు రూ. పసర్రంగు. వి. ఆకుపచ్చరంగు. పసరుఱెక్కలపక్కి వి. చిలుక. భీమ.2.55. పసరువన్నె రూ. పసురుఒన్నె. పొనురుఒన్నె. వి. ఆకుపచ్చ రంగు. పసరువాఱు (-పాఱు) రూ.చూ. పసరుపాఱు. అ.క్రి. పసరువర్ణం కలిగిఉండు. ఆకుపచ్చపడు. మను. 6.27. పసరువేయు అ.క్రి. కోరాగుడ్డను తెలుపు చెయ్యటానికి పేడ నీళ్ళలో నానబెట్టు. పసరెక్కు అ.క్రి. 1. జ్ఞానంవచ్చు. పాండు. 5.101; 2. పసరుకలుగు. <పసరు[1]+ఎక్కు. పసర్కొను రూ. పసరుకొను. అ.క్రి. పసరువాసనకలిగి ఉండు. ఆము. 5.117. పసర్రంగు రూ.చూ. పసరురంగు. వి. ఆకుపచ్చరంగు.

**పసరు[2]** అ.క్రి.1. పసరించు, చలించు. భార. శాంతి. 4.174; 2. వ్యాపించు, సాగు. అచ్చ. రా. కిష్కిం. 69; వి. వ్యాపనం. హరి. ఉ. 8.158.

సం. ప్రసర-, ప్రసార-. విస్తరణ; ప్రా. పసర-, పసార-, ప్రసారం, పసార-. వ్యాపించు, విస్తరించు; శౌ. పసరడి; అ.మా. పసర-. విస్మరించటం. పసలు-. ప్రసారం; మా. పశల;

క. పసరిసు-. ప్రసరించు, పసర, హసర-. ముందుకు పోవటం, వ్యాపించటం, వ్యాప్తి.

<ప్రా. పసర-.

**పసరెక్కు** చూ. పసరు[1].

**పసర్కొను** చూ. పసరు[1].

**పసర్రంగు** చూ. పసరు[1].

**పసలచుక్క** రూ.చూ. పసులచుక్క. వి. పొద్దుగూకిన తరవాత పశువుల్ని ఇళ్ళకు తోలేవేళ పడమట ఆకాశంలో కనిపించే చుక్క.

**పసలపావాది** రూ.చూ. పసులపానాది. వి ఆకాశంలో ఉత్తరం నుంచి దక్షిణానికి తెల్లటి దోవలాగా మెరుస్తూ ఉండే చుక్కలబారు.

**పసలపోలిగాడు** రూ.చూ. పసులపోలిగాఁడు. వి. భరద్వాజపక్షి.

**పసలబావాది** రూ. చూ. పసులపానాది. వి. ఆకాశంలో ఉత్తరం నుంచి దక్షిణానికి తెల్లటి దోవలాగా మెరుస్తూ ఉండే చుక్కలబారు.

**పసలము** రూ.చూ. పసరము. వి. ఆవు, గేదె మొ. పశువు, గొడ్డు.

**పసలి** రూ.చూ. ఫసలీ. వి. వ్యవసాయ సంవత్సరం లేదా నూర్పె సంవత్సరం.

**పసల్‌జాస్తి** రూ.చూ. ఫసలుజాస్తి. వి. సంవత్సరానికి ఒకటి కంటె ఎక్కువగా పంటపండే భూమిపైన వేసే అదనపు పన్ను.

**పసాడీలు** రూ. పిచోడీలు. వి. సన్నటి తెలికరకం ధాన్యం. మూడ్నెల్ల పంట.

**పసాదపడు** చూ. పసాదము.

**పసాదము** రూ.చూ. పసదనము[2]. వి. అన్నం, వంటకం. భోజ. 3.4.

పసాదపడు రూ. చూ. పసాపడు. స.క్రి. భుజించు,

తిను. పసాదముగొను (-కొను) స.క్రి. భోజనం చేయు. పసాపడు రూ. పసాదపడు స.క్రి. భుజించు, తిను. దా.మం. 1.128. వైజ. 2.126. పసాపాటు వి. భోజనం. వైజ. 2.109.

పసాపడు చూ. పసాదము.

పసాపాటు చూ. పసాదము.

పసారము[1] రూ. పదారము, పసారు. వి. అంగడి, దుకాణం. వేంక. పంచ. 1.773.

సం. ప్రసార-. పర్తకుడు; ప్రా. పఆర, పసార-; హిం. పంసాలీ, పసాలీ. దుకాణదారుడు; మరా. పసారా. దుకాణం;

క. పసార. కొట్టుకొట్టు.

< ప్రా. పసార-.

పసారము[2] వి. తళుకు, జిగి. క్రీడా. పీఠి. 53.

పసారీ వి. 1. మందులమ్మేవాడు; 2. చిల్లరసామాన్లు, మసాలా పదార్థాలు అమ్మే అంగడి.

హిం. పసారీ. బెల్లం, తేయాకు, బియ్యం, మసాలా మొ॥వి అమ్మేవాడు; ఉ. పస్‌పారీ.

< హిం. పసారీ.

పసారు రూ.చూ. పసారము[1]. వి. 1. అంగడి, పదారం, అచ్చ. రా. బాల. 34; 2. నడప.

పసి[1] వి. 1. గోగణం, ఆలమంద. భార. విరా. 4.40; 2. గ్రామ్యపశువులు. భార. ద్రోణ. 4.80; 3. ధేనువు. రం. రా. బాల. 79ప. 12పం.; 4. సింహం, ఆవు మొ. చతుష్పాజ్జంతువు. ఆం. భా. 2.86.

సం. పశు-. జంతువు; ప్రా. పసు. జంతువు: అ. మా. పా. అప. పసు;

క. పసు, హస, హసివు, హసు, హసువు. జంతువు; కొడ. పయ్యు, పైవు; త. పచు; మ. పై.

< ప్రా. పసు.

పసికొలువుదొరదాలు వి. వృషభధ్వజం. అచ్చ. రా. బాల. 216. పసిగాడి వి. పశువుల్ని కట్టేచోటు. వేంక. పంచ. 4.446. పసిగాపు[1] (-కాపు) వి. 1. గొల్లజాతి. పాండు. 2.128; 2. గొల్లవాడు. పసితిండి రూ.చూ. పసిదిండి. వి. వ్యాఘ్రం, పెద్దపులి. పసిదిండి (-తిండి) రూ. పసితిండి. వి. వ్యాఘ్రం, పులి. నిరంకు. 3.85. పసిదిండిమెకపురక్కసి వి. వ్యాఘ్రాసురుడు. నీలా. 1.18. పసిదిండివలువ వి. వ్యాఘ్రాజిన వస్త్రం. పసిబిడ్డ[2]. వి. క్రేపు, గోవత్సం. ఆం. భా. 3.56. పసిమసపరి వి. గోపకుడు. పసిమసపు వి. గోరక్షణం. పసిమంద వి. ఆవులమంద. పసులకాపరి వి. గోపాలకుడు. గొల్లడు. భాగ. 10పూ. 194. పసులకాపించు స.క్రి. 1. నీచమైన నౌకరీ చేయించు. కు. సం. 4.25; 2. పశువులనుగాపేటట్లుచేయు. పసులకొట్టము వి. పశువులశాల. పసులచుక్క రూ. పసల చుక్క. వి. పొద్దుగూకిన తరవాత పశువుల్ని ఇళ్ళకు తోలే వేళ పడమట ఆకాశంలో కనిపించే చుక్క. పసులదారి వి. పశుమార్గం. పసులపండగ రూ.చూ. పసులపండుగ. వి. సంక్రాంతి వెళ్ళిన మర్నాడు చేసేపండుగ. పసులపండుగ రూ. పసులపండగ. వి. సంక్రాంతి వెళ్ళిన మర్నాడు చేసే పండగ. పసులపాన రూ. చూ. పసులపానాది. వి. ఆకాశంలో ఉత్తరం నుంచి దక్షిణానికి తెల్లటి దోవలాగా మెరుస్తూ ఉండే చుక్కలదారు. పసులపానాది రూ. పసల పానాది, పసలదానాది, పసులపాన. వి. ఆకాశంలో ఉత్తరంనుంచి దక్షిణానికి తెల్లటి తోవలాగా మెరుస్తూఉండే చుక్కలదారు. పసులపుంత వి. పశుమార్గం. పసులపుల్లరి వి. పశువులు గడ్డి మేయటానికి ఉపయోగపడే బీళ్ళపైపన్ను. తృణ భాగధేయం. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 509. క్రీ. శ. 1314. పసులపోలిగాడు రూ. పసల పోలిగాడు. పసులు పోలిగాడు. వి. ఏట్రింత, భరద్వాజ పక్షి. రసిక. 1.115. పసులబడి వి. పశువులపై పన్ను. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 753. క్రీ.శ. 1600. పసులమంద వి. శతభిషా నక్షత్రం, దగ్గర దగ్గరగా ఉండే నూరు చుక్కలగుంపు. పసులమారి వి. పులి, శార్దూలం. సిం.ద్వా. 10.53. వ్యు. పశువులను చంపేది. పసులవాడు విణ. గొల్లవాడు, గోపాలకుడు. భార. ద్రోణ. 1.332. పసులు వి.బ.వ. గోవులు. భార. విరా. 3.157. క్రీ.శ. 9.10 శతాబ్దులు. మదనపల్లి శాసనం. పసులుపోలిగాడు రూ.చూ. పసులపోలిగాడు. వి. 1. పొడుగుతోక కలిగిన చిన్న నల్లనిపిట్ట, భరద్వాజ పక్షి. వ్యు. ఇది పశువులపైవాలి తోక పైకి కిందికి ఆడిస్తుంది; 2. తెలివి పడని వ్యక్తి.

పసి[2] వి. 1. వాసన, వాపి, పూలమీదిగాలి. కు.సం. 3.108; 2. పశ్వాదులమీది గాలి. వరాహ. 11.83.

క. హసుకు-. పడుసు, అంగీకరించలేని వాసన.

పసిగట్టు(-కట్టు) స.క్రి. సూచనగా తెలిసికొను. పసిగొను (-కొను) అ.క్రి. దావిని గ్రహించు, వాసనపట్టు, ఆఘ్రాణించు, మూర్కొను. కు.సం. 3.108. పసిపట్టు రూ.చూ. పసిపట్టు. అ.క్రి. పసిగొను, గాలిపట్టు. పసిపట్టు(-పట్టు) రూ. పసిపట్టు. స.క్రి. ఆఘ్రాణించు, మూర్కొను. మను. 4.27; అ.క్రి. 1. జాడపట్టు. మను. 4.51; 2. పశ్వాదుల పై గాలిని గ్రహించు.

పసి[3] వి. క్షుత్తు, ఆకలి. ఆము. 6.7.

క. పసివు, హసి. ఆకలి; త. పచి. ఆకలి; మ. పయి, పయిక్కమ్, పయిప్పు. పై, పైక్క. ఆకలి.

పసిపడు(-పడు) అ.క్రి. 1. కామాతురఅగు. శాకు. సం. 12.197; 2. ఆకలిగొను. త. పచి (-ప్పి-, -త్తి-). ఆకలిగా ఉండు; మ. పయిక్క, పైక్క. ఆకలితో ఉండు.

పసి[4] విణ. శైశవదశలో ఉన్న. లేత. శ్రీనాథుని చాటువు.

క. పసి, పసు. లేత చిగుళ్ళు.

పసికందు వి. చిన్నబిడ్డ. మటా. 1.22. పసిగాపు[2] (-కాపు) వి. బాలిక. కృ.శకు. 3.24. పసివాడు వి. పసి తనం, శైశవం. హరి.ఉ. 8.248. పసిపాప రూ.చూ. పసుబాప. వి. శిశువు, పసిబిడ్డడు. రసిక. 1.118. పసిపాపడు రూ.చూ. పసుబాప. వి. శిశువు, పసిబిడ్డడు. హరి. ఉ.5.197. పసిపాపయెండ(-ఎండ) వి. లేతఎండ, ఉలెండ. శృం.నై. 8.12. పసిబిడ్డ[1] ~~రూ. పసిబిడ్డడు~~. వి. చిన్నబిడ్డ

భార. విరా. 2.213. పసిబిడ్డ(డు రూ.చూ. పసిబిడ్డ[1]. వి. చిన్నబిడ్డ. పసిమొగ్గ వి. క్షారకం. పసరుమొగ్గ. ఆం.భా. 2.40. పసివా(డు విశ. శిశువు. సాంబ. మాన. 5.

పసి[5] రూ. పసికె, పసె, పస్సె. విశ. (పసిమి శబ్దానికి వ్యుత్పత్తి యందంత్యవర్ణం లోపించగా మిగిలినది) పచ్చన. కృ.శకు. 3.48 ; వి. తెలుపుదనం ఎక్కువ కలిసిన ఎరుపు.

పసిక రూ.చూ. పసిగ. వి. 1. సారం. చేవ. నృసింహ. 2.3 ; 2. సమృద్ధి ; 3. ఉత్సాహం ; 4. పసరు.

పసికె రూ.చూ. పసి[5]. వి. తెలుపుదనం ఎక్కువ కలిసిన ఎరుపు.

పసికెమంద వి. వానాకాలంలో పొలంలో తోలించే మంద.

పసిగ రూ. పసిక. వి. 1. సమృద్ధి. బసవ. 6.56 ; 2. ఉత్సాహం.బసవ. 6.633 ; 3. సారం, చేవ.

పసిడితపము చూ. పసిఁడి. వి. బాగు, ఒప్పు. ద్వి. పరమ. వి. 4.1070.

పసిండి రూ. పమిడి, పయిఁడి, పసిఁడి, పహిడి, పహిండి, పహిండి, పైఁడి. వి. బంగారం. తేరాల శాసనం. క్రీ.శ. 678. I.A. 7. 185-191 క్రీ.శ. 668-9.

క. పసి, పసు, పసిర్, పసుర్, పచ్చె, పచె, పచ్చ, పచ్చ, పచ్చనె-. ఆకుపచ్చతనం. పసుపురంగు. బంగారురంగు ; కొడ. పచ్చె-. ఆకుపచ్చ, నీలం ; తు. పచ్చ-. ఆకుపచ్చ, స్వచ్ఛం. పచ్చె-. పజె-. ఆకుపచ్చ, తడి ; త. పచ (-ప్ప-, -న్త-). ఆకుపచ్చగా ఉండు, బంగారు రంగుగా ఉండు (సాయంత్రం ఆకాశంలా). పచల్ల-. పచ్చదనం. లేత. పచప్ప-. ఆకుపచ్చరంగు, కొంచెం పచ్చగాఉన్న రంగు. పచలై-. బంగారురంగు, లేత పచ్చదనం. పచితు-. ఆకుపచ్చ రంగుగాఉన్న, పచు-. ఆకుపచ్చ. పసుపపచ్చ. పచుమై-. చల్లదనం, యవ్వనం. కొత్తదనం. ఆకుపచ్చని పసుపు. పయప్ప-. కొంచెం పచ్చబడు, బంగారం రంగు ; మ. పచు, పై, పైయ్-. లేత. స్వచ్ఛమైన. ఆకుపచ్చ. పచ్చ-. ఆకుపచ్చ తనం. స్వచ్ఛమైన ; కో. పచ్-. ఆకుపచ్చ. ఉడకని (నీళ్ళలో) ; తో. పొచ్-. ఆకుపచ్చ ; పర్జి. పయ్-. ఆకుపచ్చ. పర్యోప్-. పసుపురంగు ; కొలా. పసుడి-. పసుపురంగు, పచ్చొడి, పస్పొరాడ్-. పసుపురంగు.

పసిఁడి రూ.చూ. పసిండి. వి. 1. బంగారం, స్వర్ణం. భార. సభా. 2.85 ; 2. ఒకవిధమైన బంగారునాణెం. కు.సం. 4.92 ; 3. బంగారు జలతారు, బంగారు సరిగ. హర. 4.11 ; 4. స్వర్ణాభరణం, బంగారునగ. ఆము. 1.61 ; 5. ధనం. అము. 2.22.

పసిఁడికంటి రూ.చూ. పైఁడికంటి[1]. వి. పక్షివిశేషం. రసిక. 1.115. పసిఁడికంటె రూ.చూ. పైఁడికంటి[1]. వి. పక్షి విశేషం. పసిఁడికాయ[1] వి. బంగారు వంటి పాలు కలిగిన చెట్టుకాయ. మేడికాయ. భాగ. 2.51. పసిఁడికాయ[2] వి. పట్టు పురుగు కూడు. పసిఁడికుండ రూ.చూ. పైఁడికుండ. వి. 1. బంగారు కలశం ; 2. దేవాలయాదుల్లో శిఖరాలపై ఉంచే బంగారు కలశం. పసిఁడికొండ వి. కనకగిరి, మేరు పర్వతం. కృం.నై. 1.51. పసిఁడిగట్టు వి. బంగారుకొండ, మేరుపర్వతం. పారి. 4.43. పసిఁడిగద్దియ వి. బంగారు పీఠం. పరా. 1.14. పసిఁడిగుబ్బలి వి. బంగారుకొండ, మేరుపర్వతం. పసిఁడిగేదఁగి వి. బంగారువలె పచ్చని రేకులుగల మొగలి. గొ. హరి. ఉ. 392 పం. పసిఁడి తంగేడు రూ.చూ. పైఁడితంగేడు[1]. వి. రోడ్లపక్కను బంజరు నేలల్లోను ఏటా లేచి గుబురుగా పెరిగే మొక్క. పసుప్పచ్చటి పూలు పూస్తుంది, ఆకును పచ్చి ఎరువుగా ఉపయోగిస్తారు (Cassia Auriculata). పసిఁడిపీఁట్రావ్రాఁత వి. ద్రవరూపమైన బంగారంతో చేసిన చిత్తరువు పని. ఆము. 6.128. పసిఁడిపీరు వి. ద్రవరూపమైన బంగారం, బంగారు నీరు. మను. 6.3. పసిఁడిపప్పు వి. చాయపప్పు, ఒలుప పప్పు. పాండు. 2.86. పసిఁడిపలుకులు వి.బ.వ. సూక్తులు, సుభాషితాలు. పసిఁడిపాదములకాల్చు స.క్రి. బంగారంతో చేసిన పాదాలు దేవునికి అర్పించు. పండి.చ. 2.471 వ. పసిఁడిపుట్టముదాల్పు వి. విష్ణువు. పసిఁడిపురుగు రూ.చూ. పసిఁడి పురువు. వి. ప్రత్తిసూరి కాయలోని పురుగు. పసిఁడి పురువు రూ. పసిఁడిపురుగు. వి. ప్రత్తిసూలు కాయపురుగు. మార్క. 2.118. పసిఁడిపెన్బొజ్జరా వి. బ్రహ్మదేవుడు. అచ్చ.రా.బాల. 108. పసిఁడిబొజ్జదొర వి. హిరణ్యగర్భుడు. బ్రహ్మదేవుడు. అచ్చ. రా. బాల. 154. పసిఁడిమూట వి. చాల విలువైనది. రుక్మాం.చ. 4.87. పసిఁడి యాకు(-ఆకు) వి. బంగారు కమ్మ. స్త్రీ కర్ణాభరణం. పండి. చ. 1.93 పు. పసిఁడిఱేఁడు రూ.చూ. పైఁడిఱేఁడు. వి. కుబేరుడు. పసిఁడివత్తి వి. స్త్రీల ఆభరణ విశేషం. ధనా. 3.37. పసిఁడివ్రాఁత వి. బంగారు చిత్తరువు పని. వసు. 4.78. పసిఁడివ్రాఁతచెఱఁగు వి. జరీ అంచు చీర. ఉషా. 3.114.

పసిపికుండ చూ. పసిఁడి. రూ. పశినికుండ, పసెంకుండ. వి. మేడమీద కలశాల్లాగా పెట్టే బుడ్డి.

పసిమి వి. 1. ఆకుపచ్చన. కు.సం. 3.18 ; 2. గోరోచన వర్ణం. హరి.ఉ. 7.60 ; 3. ఒప్పు, అందం, నవకం. కాశీ. 2.48 ; 4. ఎరుపు మించిన పసుపువన్నె. పసుపు వన్నె. కాశీ. 7.26 ; 5. పసుపుపచ్చన. హంస. 4.138.

త. పచుమై, పచ్చై. ఆకుపచ్చ.

పసిమిచెరు అ.క్రి. నవకంచెరు, ఎండు. వరాహ. 10.28. పసిమిడి విశ. పసిమిరంగుగల. కా. 7.181 ; వి. పసుపుపచ్చ రంగు. (పసిమి+-మిడి). పసిమివడు అ.క్రి. సమృద్ధమగు. సిం.ద్వా. 7.92.

పసిరి చూ. పచ్చ. విశ. ఆకుపచ్చని.

పసిరికాయ వి. పట్టుపురుగు.

పసిరిక చూ. పసరు1. రూ. పసరిక, పసిరికె. వి. 1. వృక్ష విశేషం. వేంక.పంచ. 4.522 ; 2. పచ్చపిట్ట, హారీతం. హంస. 3.12 ; 3. కామెర్లరోగం. ఆం.భా. 2.127 ; 4. పసరువన్నె, ఆకుపచ్చవన్నె ; 5. నల్లగరిక ; 6. గడ్డి ; విశ. ఆకుపచ్చ వన్నెకల.

పసిరికపాము వి. పసరువన్నెగల పాము, సర్ప విశేషం. పసిరికపిట్ట వి. పచ్చపిట్ట, హారీతం. పసిరికబయలు వి. పచ్చగడ్డి మైదానం. పసిరికమొగ్గ వి. పసరుమొగ్గ. పసిరిక.

వి.బ.వ. కామెర్లు.

**పసిరిక** రూ.చూ. పసిరిక. వి. రామచిలక రెక్కరంగు.

**పసిరికమంద** రూ.చూ. పసరుమంద. వి. వానాకాలంలో పొలంలో తోలించే మంద.

**పసీతు** రూ.చూ. పజీతి. వి. అవమానం.

**పసుపాడు** చూ. పసుపు.

**పసుపార్చు** చూ. పసుపు.

**పసుపిడు** చూ. పసుపు.

**పసుపు** రూ.చూ. పసపు. వి. 1. పసుపురంగు. ఉ.హరి. 3.147 ; 2. పసుపు. శృం.నై. 5.68.

**పసుపాడు** రూ.చూ. పసపాడు. అ.క్రి. పసుపు పూసికొని స్నానం చేయు. పసుపు నలుచుకొను. శివరా. 3.130. <పసుపు+ఆడు. **పసుపార్చు** స.క్రి. పసుపు పూసి జలక మాడించు. బసవ. 3.50. **పసుపిడు** అ.క్రి. పసుపు రాసుకొను. ఆము. 1.60. <పసుపు+ఇడు. **పసుపుకదిమి** వి. బండారుచెట్టు, గృహాది నిర్మాణాలకూ, వ్యవసాయపరికరాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు (Adina cordifolia). **పసుపుకంటలు** వి.బ.వ. వడ్లలో ఒకరకం. **పసుపు కుంకంచీర** వి. లగ్న నిశ్చయ సమయంలో పెళ్ళికూతురికి కట్టే చీర. **పసుపుగొట్టాలగన్నేరు** వి. పసుపుపచ్చని పెద్ద పూలు పూసే తోటల్లో పెంచబడే చిన్న చెట్టు (Thevetia neriifolia). **పసుపుగొట్టాలు** వి.బ.వ. మెట్ట వడ్లలో ముతకరకం. ఎన్ను ముద్దగా ఉండే రకం. **పసుపుగోచి** వి. ఉపనయనాదుల్లో మంగళార్థం పసుపులో తడిపిన కౌపీనం. ఆము. 4.66. **పసుపుచాపు** వి. పెళ్ళికొడుకు లగ్నానికి కట్టుకొనే పంచెలజత. **పసుపుచాయ** వి. పసుపు రంగు. **పసుపుచీర** వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర. **పసుపుతెగులు** వి. కొర్ర మొ.వాటి తెగులు, ఆకులు కాడ పచ్చగా అయిపోతాయి, క్రమంగా మొక్క ఎండిపోతుంది, పొగాకు పసుప్పచ్చగా అవుతుంది. **పసుపువకొసగు** స.క్రి. ఆడబిడ్డ పసుపు కుంకాలకోసం కొంత భూమిని ఇచ్చు. మను. 5.102. **పసుపువిందుకొను** అ.క్రి. విడంతువగు. **పసుపుపచ్చ** రూ. పసుప్పచ్చ వి. 1. అరరంగు, గోపి చందనం, గోపిరంగు ; 2. పచ్చలక్క, పసుపురంగు, వర్ణ పట్టికలోని అయిదో వన్నె. **పసుపుపట్టె** వి. దర్వాజామీద పసుపుతో రాసిన అక్షుగీత. **పసుపుపిట్ట** రూ.చూ. పసువుఁబిట్ట. వి. పసిరికపిట్ట. **పసుపుబట్టలు** రూ. పసుబ్బట్టలు. వి.బ.వ. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే బట్టలు. **పసుపుబియ్యం** వి. అక్షింతలు, శుభకార్యాల్లో వాడే పసుపు కలిపిన బియ్యం. **పసుపుముత్తుచీర** రూ. పసుమ్ముత్తుచీర. వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర. **పసుపుముద్ద** రూ. పసపుముద్ద. వి. పసిరికపిట్ట, హారీతం, గిజగాడు. రసిక. 1.66 ; వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. **పసుపుమొల్ల** వి. పచ్చపూవులమొల్ల, హేమపుష్పి. **పసువుఁబిట్ట** (-పిట్ట) రూ. పసుపుపిట్ట. వి. పసిరికపిట్ట, హారీతం. **పసుపులమ్మ** వి. మహాలక్ష్మి. **పసుపువన్నె** వి. బూడిద రంగుతో కూడిన పసుపురంగు గల గట్టి కలపనిచ్చే చెట్టు. **పసుపుసుడి** వి. గంగడోలుకు రెండువైపులా ఉండే సుడి. **పసుపాల్లె** వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చిన్న చీర. **పసుప్పచ్చ** రూ.చూ. పసుపుపచ్చ. వి. 1. పసుపుకొమ్ముల పొడి రంగు : 2. బీరపువ్వు రంగు. **పసుప్పచ్చచాపు** వి. దేవుళ్ళకు మొక్కుకొన్నప్పుడు పెట్టే పంచెలజత. **పసుప్పచ్చచీర** వి. దేవతల పేర్లు చెప్పి పెట్టే చీర. **పసుప్పచ్చరాయి** వి. 1. రాతినార కొద్దిగ వచ్చే రాయి; 2. పసుప్పచ్చ రంగు గల రాతినార్రాయి. **పసుప్పొత్తుచాపు** వి. పెళ్ళికొడుకు కట్టుకొనే పంచెల జత. **పసుప్పొత్తుచీర** వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర. **పసుప్పొత్తులు** వి. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే పసుపు బట్టలు. **పసుబ్బట్టలు** రూ.చూ. పసుపు బట్టలు. వి.బ.వ. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు కట్టుకొనే బట్టలు. **పసుమ్ముత్తుచీర** రూ.చూ. పసుపుముత్తుచీర. వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర.

**పసుపాల్లె** చూ. పసుపు.

**పసుప్పచ్చ** చూ. పసుపు.

**పసుప్పచ్చచాపు** చూ. పసుపు.

**పసుప్పచ్చచీర** చూ. పసుపు.

**పసుప్పచ్చరాయి** చూ. పసుపు.

**పసుప్పొత్తుచాపు** చూ. పసుపు.

**పసుప్పొత్తుచీర** చూ. పసుపు.

**పసుప్పొత్తులు** చూ. పసుపు.

**పసుబ్బట్టలు** చూ. పసుపు.

**పసుఁబాప** (-పాప) రూ. పసిపాప, పసిపాపఁడు. వి. చిన్న బిడ్డ. కు.సం. 10.172.

**పసుమ్ముత్తుచీర** చూ. పసుపు.

**పసురము** రూ.చూ. పసరము. వి. 1. గోమహిషజాతి ; 2. చిన్నదూడ.

**పసురు** రూ.చూ. పసరు[1]. విశ. పసరువర్ణంకల, ఆకుపచ్చ రంగుగల. అష్టమ.క. 1.22 పు. 8 పం. ; వి. ఆకు మొ.వాటి రసం. ఆం.భా. 2.40.

**పసురువన్నె** రూ.చూ. పసరువన్నె. వి. ఆకుపచ్చ రంగు. **పసురుకట్టు** రూ. పసరుకట్టు. వి. కనుకట్టు విద్య. **పసురుమంద** రూ.చూ. పసరుమంద. వి. వానాకాలంలో పొలంలో తోలించే మంద.

**పసులు** వి. నగరం లేక కోటచుట్టూ ఉండే గోడ.

హిం. ఫసీల్-. నగరం లేక కోటచుట్టూ గోడ ; ఉ. ఫసీల్. కోటగోడ, నగరంచుట్టూ ఉండే గోడ.

<ఉ. ఫసీల్-.

**పసులగోడలు** వి.బ.వ. కోటగోడలు. శుక. 1.139.

**పసులకావరి** చూ. పసి[1].

**పసులకాపించు** చూ. పసి[1].

**పసులకొట్టము** చూ. పసి[1].

**పసులచుక్క** చూ. పసి[1].

**పసులదారి** చూ. పసి[1].

**పసులపండగ** చూ. పసి[1].

**పసులపండుగ** చూ. పసి[1].

**పసులపాప** చూ. పసి[1].

**పసులపాడి** చూ. పసి[1].

**పసులపుంత** చూ. పసి[1].

**పసులపుల్లరి** చూ. పసి[1].

**పసులపోలిగా(డు** చూ. పసి[1].

**పసులబడి** చూ. పసి[1].

**పసులమంద** చూ. పసి[1].

**పసులమూరి** చూ. పసి[1].

**పసులము** రూ.చూ. పసరము. వి. **1.** గోమహిష జాతి; **2.** చిన్న దూడ.

**పసులవా(డు** చూ. పసి[1].

**పసులు** చూ. పసి[1].

**పసులుపోలిగా(డు** చూ. పసి[1].

**పసువ** రూ.చూ. పసుపు. వి. గొడ్డు, జంతువు.

**పసుపు** రూ. పసువ. వి. గొడ్డు. జంతువు.

సం. పశు-. జంతువు; ప్రా. పసు.

<ప్రా. పసు.

**పసె** రూ.చూ. పసి[5]. వి. తెలుపుదనం ఎక్కువ కలిసిన ఎరుపు.

**పసెదుబ్బ** వి. తెల్ల మట్టితో కలిసిన తువ్వనేల.

**పసెంకుంత** రూ.చూ. పసినికుంత. వి. మేతమీద కలగాల్లాగా పెట్టే బుడ్డి.

**పస్కఉన్ని** రూ.చూ పసకఉన్ని. వి. పచ్చలో ఎరుప వన్నె కలిసిన ఉన్ని.

**పస్కగొ(రె** రూ.చూ. పసకగొ(రె. వి. పచ్చలో ఎరుప వన్నె కలిసిన బొచ్చుగల గొ(రె.

**పస్కా** రూ. పస్థా, పాస్క, పాస్కా. వి. ఐగుప్త చక్రవర్తుల దాస్యంనుంచి విముక్తులై ఇశ్రాయేలీయులు తరలి వచ్చిన ముహూర్త సంస్మరణార్థం చేసే ఏడురోజుల పండుగ, మేష సంక్రాంతి పౌర్ణమినాడు మొదలయి వరసగా ఏడు రోజులు ఈ పండుగ జరుగుతుంది.

పో. పష్కఆ; స్పా. పాస్కుఆ-. క్రిస్మస్ పండుగ; ఫ్రెం. పేక్.

<పో. పష్కఆ.

**పస్థా** రూ.చూ. పస్కా. వి. ఐగుప్త చక్రవర్తుల దాస్యం నుండి విముక్తులయి ఇశ్రాయేలీయులు తరలి వచ్చిన సంస్మరణార్థం చేసే ఏడురోజుల పండుగ.

**పస్తము** వి. ఇల్లు.

సం. పస్త్య-, పస్త్యా. వాసస్థానం, ఇల్లు.

<సం. పస్త్యా.

**పస్తాయించు** అ.క్రి. **1.** పశ్చాత్తాపపడు; **2.** తటపటాయించు.

హిం. పఛ్‌తానా. పశ్చాత్తాపపడు.

<హిం. పఛ్‌తా(నా)+-ఇంచు[3].

**పస్తు** చూ. పసి[3]. రూ. పస్తు[2]. వి. ఉపవాసం, నిరాటు. వేంక. పంచ. 1.430.

క. పసి-. ఆకలిక, ఆకలి, పసివ్ర-. ఆకలి; త. పచి(-ప్పి-, -త్తి-). ఆకలిగా ఉండు, ఆకలి; మ. పయి, పై, పయిక్కమ్, పైక్కమ్, పయిప్పు-. ఆకలి, పయిక్క, పైక్క-. ఆకలిగా ఉండు, పయ్యవన్-. ఆకలిగా ఉన్నవాడు; కొ. ఒసఫ్-(ఒస్త్-). ఆకలి ఉండు (మనిషికి), ఒసఫ్-. ఆకలి.

**పస్తుగామండు (-ఉండు)** అ.క్రి. ఉపవాసముండు. **పస్తుండు** అ.క్రి. ఉపవాసంచేయు, ఉపవాసం ఉండు. కాశ. 3.85. <పస్తు+ఉండు.

**పస్పు** రూ.చూ. పసపు. వి. మామూలుగా పంగ, ఆముదం, మొక్కజొన్న మొ. వాటితో కలిపి వేసే రొక్కపు పైరు (Cucurma longa).

**పస్పె** రూ.చూ. పసి[5]. వి. పాటలవర్ణం. ఆం.బా. 1.108; విణ. పాటలవర్ణం కల. ఆం.బా. 1.108.

**పహదషా** రూ.చూ. పాదషా. వి. రాజు, ముస్లించక్రవర్తి, సమ్రాట్టు.

**పహరా** రూ.చూ. ఫారా. వి. కావలి, చౌకి.

**పహరీగోడ** రూ.చూ. పారిగోడ. వి. ఇంటి ఆవరణచుట్టూ కట్టిన గోడ.

**పహరీరాయి** చూ. ప్రహరి. వి. ప్రహరీగోడ కట్టుబడికి వాడే రాయి.

**పహిండి** రూ.చూ. పసిణ్డి. వి. బంగారం. ద.హిం.గా.సంపు. గా.సం. 975.

**పహిణ్డి** రూ.చూ. పసిణ్డి. వి. **1.** బంగారం. ద.హిం.గా.సంపు. **4.** గా.సం. 1190; **2.** ధనం. ద.హిం.గా.సంపు. **4.** గా.సం. 1281.

**పహిండి** రూ.చూ. పసిణ్డి. వి. బంగారం. ద.హిం.గా. సంపు. **4.** గా.సం. 1281.

**పహిండిఅకు** వి. బంగారు చెవి కమ్మ. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 431. క్రీ.శ. 1272. **పహిండికామ ఆలవటము** వి. బంగారు కామగల ఆలవట్టం. ద హిం. గా. సంపు. 4. గా. సం. 975. క్రీ. శ. 1353. **పహిండికామకుంచెము** వి. బంగారు కామగల కుంచె, గుత్తి కట్టిన నెమలి పురి కట్ట లేదా చామరం. ద.హిం.గా.సంపు. 4. గా.సం. 1344. క్రీ.శ. 1390. **పహిండినీరువణిచిన కాముల పెంజామరలు** వి.బ.వ. బంగారు హూతకోలలు కల చామరాలు. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 1190. క్రీ. శ. 1143. **పహిండివల్య** వి. బంగారు భోజన పాత్ర. ద. హిం. గా. సంపు. 4. గా.సం. 1142. క్రీ. శ. 1142. **పహిండిపాడిసంకులు** వి.బ.వ. బంగారు చేతి కడియాలు. ద. హిం. గా. సంపు. 4. గా.సం. 1190. క్రీ.శ. 1143. **పహిండిపివ్నండు** వి. బంగారు ఆభరణ విశేషం. ద. హిం. గా. సంపు. 4. గా.సం. 1334. క్రీ.శ. 1470. **పహిండిరవవకామశ్వేత చామర** వి. బంగారు హూతకామ గల తెల్లని చామర. ద. హిం. గా. సంపు. 5. గా.సం. 1167, క్రీ.శ. 1145. **పహిండిసహస్రధార** వి. స్వర్ణపాత్రకు అనేక చిల్లులు పొడిచి దానిలో నీళ్ళు పోసి ఆ చిల్లుల ద్వారా నీటి ధారలు పడేటట్లు దేవుడికి అభిషేకం చేయటం. ద. హిం. గా. సంపు. 6. గా. సం. 882. క్రీ. శ. 1365.

పాక[1] వి. 1. దూలం ఉండకుండా కట్టినఇల్లు, పాక; 2. గుడిశ; 3. దావడి.

క. పాక-. నాడుజోగి. ఒకరకం అయిన శూద్రజాతికి చెందిన ముష్టివాడు; త. పాక్కమ్. సముద్రం పక్కనే ఉన్నగ్రామం, పట్టణం; మ. పాక్కనార్. ప్రఖ్యాతి పొందిన తక్కువ జాతికి చెందిన జ్ఞాని యొక్క ఆశ్రమం.

పాక[2] రూ.చూ. పేక[2]. వి. 1. బండిచక్రంలోని అడ్డపట్టె: 2. దిబ్బకు కింద మంచెకు బిగించే అడ్డపట్టె; 3. నేతలో అడ్డానికి వాడే దారం.

పాకగొట్టం రూ. పేకగొట్టం. వి. గొంగడి నేసేటప్పుడు మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి వాడే వెదురుగొట్టం. పాకచెక్క రూ. పాకసెక్క. పాగాచెక్క. పోకసెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. పాకచెక్కగుడి రూ. చూ. పాకచెక్కగుడి. వి. హనుగ్రనూ, పావచెక్కనూ కలిపేతాడు. పాకచెక్కగుడి రూ. పాకచెక్కగుడి, పాకసెక్కగుడి. వి. హనుగ్రనూ పావచెక్కనూ కలిపేతాడు. పాకచెక్కతాడు వి. హనుగ్రనూ పావచెక్కనూ కలిపేతాడు. పాకచెక్కతొక్కు రూ. పావచెక్కతొక్కు. అ.క్రి. పడుగు పోగులు కొన్ని పైకి కొన్ని కిందికి వచ్చి పోగులు విడిపడటానికి పావ చెక్కను కాలితో తొక్కటం. పాకచెక్కలకొయ్య రూ. పాకచెక్కల గొయ్య. వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు పాతినకొయ్య. పాకచెక్కలకోల వి. పావచెక్క తొక్కినప్పుడు అచ్చుగ్రను కిందికి లాగేకర్ర. పాకచెక్కలగుంజ వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. పాకచెక్కలగొయ్య (-కొయ్య) రూ.చూ. పాకచెక్కల కొయ్య. వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు పాతినకొయ్య. పాకచెక్కలతాడు వి. పావచెక్కను గూటానికి బిగించే పెనకతాడు. పాకట్టె రూ.చూ. పేకకట్టె. వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టినకర్ర. పాకబద్ద వి. పాటక, పాట, బడి, నలాక, జల్లను పట్టిఉంచే గడగొయ్యల మీద అడ్డంగా పరచిన కర్ర, పంగలుగాఉన్న ఒసికర్రలపై పొడుగ్గావేసిన కర్ర. పాకహూమ వి. మాగాణిలో దమ్ము చేసిన తరవాత నేలచదును కావటానికి తోలే పరికరం. పాకపెక్క (-చెక్క) రూ.చూ. పాకచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కేకొయ్య చెక్కలు. పాకపెక్కగుడి రూ.చూ. పాకచెక్కగుడి. వి. హనుగ్రనూ పావచెక్కనూ కలిపేతాడు.

పాకవా(డిరెడ్లు చూ. పాకనా(డు.

పాకవా(డు వి. 1. బ్రాహ్మణుల్లో శాఖాభేదం. హంస. 1.53; 2. దేశవిశేషం.

పాకవా(డిరెడ్లు వి.బ.వ. 1. కాపుల్లో ఒకరకం ఉపశాఖ, పాకనాడునుంచి వచ్చిన రెడ్లు; 2. హరిజనుల్లో ఒక ఉపశాఖ.

పాకపుచలిమిడి చూ. పాకము.

పాకమగు చూ. పాకము.

పాకము వి. 1. బెల్లం మొ. వాటితో చేసిన చిక్కటిద్రవం; 2. మట్టిని జిగురు తేలేటట్లు తొక్కి పాత్రల తయారీకి పక్వంగా చేసినస్థితి; విశే. 1. పరిపక్వమైన; 2. పొగరు తగిన; 3. అల్పమయిన.

సం. పాక-. వంట.

పాకపుచలిమిడి వి. బెల్లం పాకంలో చేసిన పిండిముద్ద. పాకమగు అ.క్రి. పండగు. < పాకము + అగు. పాకము దప్పు (-తప్పు) అ.క్రి. ఉచిత స్థితితప్పు. చెదు. భార. భీష్మ. 1.13. పాకంపప్పులు వి.బ.వ. బెల్లం పాకంలో చేసిన పప్పులు. పాకంమట్టి వి. మట్టిపాత్రల తయారీకి అనువుగా బ్రాగా చిక్కటి పాకంలో ఉన్నబురదమట్టి.

పాకంపప్పులు చూ. పాకము.

పాకంమట్టి చూ. పాకము.

పాకొన్నము రూ.చూ. ప్రాకెన. వి. పెళ్ళిలో మూడవనాటి ఉత్సవం.

పాకాలదున్న వి. పాకాల ప్రాంతానికి చెందినదున్న, స్థానికంగా ప్రశస్తమైన దున్న.

పాకీ రూ. పాకీ. వి. 1. మరుగు పెరటికుప్ప ఎత్తేవాడు. పాకీవాడు; 2. స్వచ్ఛత. శుద్ధత.

హిం. ఉ. పార. పాక్. శుద్ధత, పవిత్రత, స్వచ్ఛత.

< ఉ. పాక్.

పాకీవా(డు రూ. పాకీవా(డు. విశే. 1. పాయిఖానా శుభ్రపరిచేవాడు; 2. ఒకజాతివాడు.

పాకీజా వి. పాయిఖానాలు శుభ్రంచేసేవాడు.

పం. పాకీజ ఉ. పార. పాకీజ-. శుభ్రమైన, పవిత్రమైన, తేటయయిన, అమాయకమైన, పచ్చి.

< ఉ. పాకీజ.

పాకిస్తానులు వి.బ.వ. బాస్మతి అనే పలావుధాన్యం కావచ్చు..

హిం. ఉ. పాకిస్తాన్. భారతదేశపు వాయవ్య సరిహద్దులోని ముస్లిం దేశం.

< ఉ. పాకిస్తాన్.

పాకీ రూ.చూ. పాకీ. వి. మరుగు పెరటికుప్ప ఎత్తేవాడు, పాకీవాడు.

పాకీతుమ్మ వి. ఇంధనంగా పనికివచ్చే ఒకఅందమైన, చెట్టు (Acacia Latronum). పాకీదొడ్డి వి. మరుగుదొడ్డి, మలవిసర్జన చేసే తావు. పాకీవా(డు రూ.చూ. పాకీవాడు. విశే. 1. పీతిదొడ్డి తుడిచేవాడు; 2. ఒకజాతివాడు.

పాకు[1] రూ.చూ. ప్రాకు. వి. తీగపక్కన పెట్టిన కర్ర; అ.క్రి. వ్యాపించు.

పాకుడు రూ.చూ. ప్రాకుడు. వి. పాచిష్టి. చెమ్మవల్ల బూజులాగా పట్టిన మకిల. పాకుడుపట్టులు వి.బ.వ. చేసు అక్కడా ఇక్కడా తడియటం.

పాకు[2] రూ.చూ. పాగు. వి. చిక్కటి ద్రవరూపం.

పాకు[3] స.క్రి. కొట్టు.

పాకుర రూ.చూ. ప్రాకుడు. వి. నాచు, నీటిలో పెరిగే పొడుగాటి ఆకులుగల కలుపుమొక్క.

పాకురు రూ.చూ. ప్రాకుడు. వి. పాచిష్టి, చెమ్మవల్ల బూజులాగా పట్టిన మకిల.

పాకురుగడ్డి వి. పశుగ్రాసంగా ఉపయోగపడే ఒకరకం గడ్డి (Digitaria longiflora). పాకురుమేఘం వి. కెరటాల మాదిరి కనబడే మబ్బు.

పాకెన రూ.చూ. ప్రాకెన. వి. పదుగు. పెళ్ళిళ్ళలో తృతీయ దినం.

పాకెన్న రూ.చూ. ప్రాకెన. వి. పదుగు. పెళ్ళిళ్ళలో తృతీయ దినం. రాజవా. 5.80.

పాకోడు రూ.చూ. పావకోడు. వి. 1. పాదుక: 2. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేత పనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క.

పాకోడుకర్ర వి. పావచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. పాకోడుగుది వి. హనుగర్రనూ పావ చెక్కనూ కలిపే తాడు. పాకోడుచివ్వ రూ. పాకోడునివ్వ. వి. నేత నేసేటప్పుడు అని పోగులు తెరవటానికి నేత పనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. పాకోడుచెక్క రూ.చూ. పావకోడుచెక్క. వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. పాకోడుచెక్కతాడు వి. పావచెక్కను గూటానికి బిగించే వెనకతాడు. పాకోడుతొక్కు రూ. పాంకోడుతొక్కు. అ.క్రి. పడుగు పోగులు కొన్ని పైకి కొన్ని కిందికి వచ్చి అని పోగులు విడిబడటానికి పావ చెక్కను కాలితో తొక్కటం. పాకోడువలుపు రూ. పాగోడు వల్పు. వి. హనుగర్రనూ పావచెక్కనూ కలిపే తాడు. పాకోడుచివ్వ రూ.చూ. పాకోడుచివ్వ. వి. నేత నేసేటప్పుడు అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. పాకోళ్ళకొయ్య రూ. పాగోల్లకొయ్య. వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. పాకోళ్ళచువ్వ రూ. పాగోళ్ళనువ్వ. వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల. పాకోళ్ళచెక్క వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క.

పాకోళ్ళకొయ్య చూ. పాకోడు.

పాకోళ్ళచువ్వ చూ. పాకోడు.

పాకోళ్ళచెక్క చూ. పాకోడు.

పాగ[1] రూ. పాగా[1]. వి. శిరోవేష్టనం, తలపాగ. శృం.నై. 7.93.

సం. ప్రగ్రహ-. పట్టుకోవటం, కళ్ళెం; ప్రా. పగ్గహ-. ఉపకరణం, పనుల మెడతాడు, పట్టుకోవటం; హిం.ఉ. పాగ, పగియా. తలపాగ; గు. పాఘడీ; మరా. పాగ్, పాగ, పాగోటం. పాగ.

క. పాగు. ఒకరకమైన తలపాగ; త. పాకై;

<ఉ. పాగ.

పాగకాడు వి. తలపాగ ఉన్నవాడు. తాళ్ల.సం. 13.151. పాగచెల్ల రూ.చూ. పాగసెల్లా. వి. పెళ్ళికొడుకు తలకు చుట్టుకొనే బట్ట. పాగపెల్లా రూ. పాగచెల్ల. వి. పెళ్ళికొడుకు తలకు చుట్టుకొనే బట్ట.

పాగ[2] వి. ఒక చిన్న నాణెం. E.I. 9.267.

పాగ[3] రూ. పాగా[2], పాము, పావ[1], పావా. వి. పాదరక్ష. పండి.చ. 5.333.

సం. పాదుకా. పాదరక్ష; ప్రా. పాదఅ; అ.మా. పాఉఅ, పాదుయ, పాయయా-. పాదుక; పా. పాదుకా; సా. పావ్రర్; ఒ. పారి; హిం. పాంగ్రీ; గు. పాల్డీ;

క. పావుగె, హావిగె, హావుగె; త. పావర్.

<ప్రా. పాఉఅ.

పాగచివ్వ వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్య చెక్క. పాగచివ్వకర్ర వి. పావచెక్క కిందికి తొక్కేటప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. పాగచెక్కదారం రూ. పాగసెక్కదారం. వి. హనుగర్రనూ పావచెక్కనూ కలిపే తాడు. పాగపెక్కదారం రూ.చూ. పాగచెక్కదారం. వి. హనుగర్రనూ పావచెక్కనూ కలిపే తాడు.

పాగ[4] రూ.చూ. పాగా[3]. వి. 1. అశ్వాది శాల. మందుర; 2. అశ్వ సముదాయం, అశ్వాల వరుస, అశ్వపంక్తి వాహనాలైన జంతువుల సమూహం.

పాగ[5] రూ.చూ. బాగా. అవ్య. సొగసుగా.

పాగంసార్లి వి. మూరెడు వెడల్పుతో లోతు తక్కువగా కడె మంచుతో ఉండే మట్టిపాత్ర.

పాగడ[1] రూ.చూ. పడగ[1]. వి. 1. కర్ణభూషా విశేషం. హం. 5.5; 2. భోగం, పణం. వరాహ. 6.71; 3. గంప మొ. వి.

పాగడ[2] రూ.చూ. పాగడి. వి. 1. పడుగులో కొంత భాగం; 2. గంజితో తడిపిన పడుగు నూలు; 3. నరి చేసిన పడుగు; 4. చుట్టు చుట్టిన పడుగు నూలు; 5. అను కొయ్యలకు అనులు పడేట్టు చుట్టిన పట్టుదారం.

పాగడఅతుకు రూ. పాగడిఅతుకు. అ.క్రి. బద్దెపోగులకు పడుగుపోగులు కలిపి వడిపెట్టు, అచ్చుతుకు. పాగడగుంజ వి. జంపఖానా నేతకు వాడే పడుగునూలు చుట్టటానికి గోడకు బిగించిన కొయ్య. పాగడదావు స.క్రి. గంజి పెట్టిన పడుగు నూలుకు అల్లు దావ. పాగడచుట్టు స.క్రి. గంజి పెట్టిన పడుగు నూలుకు పాగడిగా చుట్టు. పాగడజిల్ల వి. నరి చేసిన చిన్న నూలుచుట్ట. పాగడపావు స.క్రి. నేతలో నిలువుకు వాడే పట్టుదారం పాయలు పాయలుగా విడదీయు. పాగడపోయు స.క్రి. అను గొట్టంలోకి పోగు తీసుకొని అను కొయ్యలకు చుట్టి వచ్చేట్లు చేయు. పాగడవేయు అ.క్రి. 1. నరి చేసిన పడుగు చుట్టివెయ్యటం; 2. నేతకు కావలసిన పడుగు తక్కువయినప్పుడు కొంత మిగులు నూలు తెచ్చి కలపటం.

పాగడము[1] రూ. పాదగము, పావడ[2], పావడా[1]. వి. 1. పౌరుష చిహ్నంగా కాలిలో ధరించే ఆభరణం. వేంక.పంచ. 4.416; 2. స్త్రీ పాదభూషా విశేషం, పాదాభరణ విశేషం. ఆము. 1.56.

సం. పాదకటుక-. కాళ్ళకు ధరించే ఆభరణ విశేషం; ప్రా. పాఅఅడగ-; మరా. పాగుడేం;

క. పాడగ; తు. పాడగ, పాడుగ; త.మ. పాటకమ్.

<ప్రా. పాఅఅడగ-.

**పాగడము[2]** రూ.చూ. పావడము[1]. వి. వస్త్ర వేష్టనం. హర. 5.5.

**పాగడా[1]** రూ.చూ. పాగడి. వి. **1.** పరుగులో కొంతభాగం; **2.** గంజితో తడిపిన పడుగునూలు; **3.** సరిచేసిన పడుగు; **4.** చుట్టచుట్టిన పడుగు నూలు; **5.** ఆసు కొయ్యలకు అనులు పదేట్లు చుట్టిన పట్టుదారం.

**పాగడా[2]** రూ.చూ. పావడా[2]. వి. **1.** ఏదైనా తన్వే సాధనం: **2.** సెలగపార.

**పాగడి** రూ. పాగడ2, పాగడా[1], పాగడు. వి. **1.** పడుగులో కొంతభాగం; **2.** గంజితో తడిపిన పడుగు నూలు; **3.** సరిచేసిన పడుగు; **4.** చుట్ట చుట్టిన పడుగు నూలు: **5.** ఆసు కొయ్యలకు అనులు పదేట్లు చుట్టిన పట్టుదారం.

**పాగడిఅతుకు** రూ.చూ. పాగడ అతుకు. అ.క్రి. బద్దె పోగులకు పడుగుపోగులు కలిపి పడి పెట్టటం.

**పాగడు** రూ.చూ. పాగడి. వి. **1.** పడుగులో కొంతభాగం, **2.** గంజితో తడిపిన పడుగు నూలు; **3.** సరిచేసిన పడుగు; **4.** చుట్ట చుట్టిన పడుగు నూలు; **5.** ఆసు కొయ్యలకు అనులు పదేట్లు చుట్టిన పట్టుదారం.

**పాగా[1]** రూ.చూ. పాగ[1]. వి. తలకు చుట్టుకోవటానికి నేసిన బట్ట.

**పాగాకొయ్యలు** వి.బ.వ. గుడ్డలు తగిలించటానికి గోడకు కొట్టిన కొయ్య మేకులు.

**పాగా[2]** రూ.చూ. పాగ[3]. వి. పావకోడు, పాదరక్ష. శృం.నై. 8.108.

**పాగాచెక్క** రూ.చూ. పాకచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్య చెక్క. **పాగాచెక్కలగూటం** రూ. పావ చెక్కల గూటం. వి. మగ్గం గుంటలో పావచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. **పాగాపెల్లా** వి. రెండు బట్టలు పెట్టటం.

**పాగా[3]** రూ. పాగ[4]. వి. **1.** అశ్వాలు. భీమ. 1.87; **2.** అశ్వసమూహం. అశ్వదళం. ఆము. 4.168; **3.** వాహన పంక్తి, ఆము. 4.169.

గు. పాగా, పాయగా-. అశ్వదళాన్ని ఉంచే ప్రదేశం, అశ్వాల; మరా. పాగా-. అశ్వదళం, అశ్వాల; పార. పాయ్‌గాహ్. ప్రాంగణం, అశ్వాల, వ్రతం.

<మరా. పాగా <పార. పాయ్‌గాహ్.

**పాగా[4]** రూ.చూ. బాగా. అవ్య. సొగసుగా.

**పాగాబు** వి. నర్తకి. విశ్వ. శ.

ఉ. పార. పాకోచ్-. నర్తకి.

<ఉ. పాకోచ్.

**పాగి** వి. **1.** వసతి; **2.** దారి; **3.** వంశం.

**పాగిచిక్కు** అ.క్రి. పిలుచిక్కు. **పాగివేయు** వి. **1.** చేను కోతకు వచ్చినప్పుడు పిట్ట బయటకు పట్టు; **2.** అనువుచేయు.

**పాగు** రూ. పాకు[2]. వి. గుడపాకం, శర్కరాపాక భేదం చంద్రాంగ. 2.74.

సం. పాక-. వండటం, కాల్చటం, వేయించటం; ప్రా. పాగ-. పచనక్రియ; అ.మా. పాగ-. వండటం; పా. పాక-. వండినది, వండటం.

<ప్రా. పాగ-.

**పాగెవ** రూ.చూ. ప్రాకెన. వి. పడుగు, పెళ్ళిళ్ళలో మూడో రోజు.

**పాగోడు** రూ.చూ. పావకోడు. వి. **1.** పావచెక్క తొక్కినప్పుడు అచ్చు క్రిందు కిందికిలాగే కర్ర; **2.** పాదుక.

**పాగోడుపల్పు** రూ.చూ. పాకోడు పలుపు. వి. హను గర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు. **పాగోడుచెక్క(-చెక్క)** రూ.చూ. పావుకోడుచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. **పాగోల్లకొయ్య** రూ.చూ. పాకోళ్ళ కొయ్య. వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. **పాగోళ్ళనువ్వ** రూ.చూ. పాకోళ్ళచువ్వ. వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల.

**పాగోల్లకొయ్య** చూ. పాగోడు.

**పాగోళ్ళసువ్వ** చూ. పాగోడు.

**పాంకోడు** రూ.చూ. పాపుకోడు. వి. **1.** పాదుక; **2.** పావ చెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర.

**పాంకోడుచెక్క** రూ.చూ. పావుకోడుచెక్క. వి. పావ చెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర. **పాంకోడుతొక్కు** రూ.చూ. పాకోడుతొక్కు. అ.క్రి. పడుగు పోగులు కొన్ని పైకి కొన్ని కిందికి వచ్చి అనిపోగులు విడిబడటానికి పావచెక్కను కాలితో తొక్కటం. **పాంకోళ్లమేకు** వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య.

**పాంకోళ్లమేకు** చూ. పాంకోడు.

**పాంగు** వి. అందమైన స్త్రీ. సుందరి. (సానులనామాంతాల ప్రయుక్తమయ్యే పదం). ద.హిం.శా.సంపు. 10. శా.సం 171. క్రీ.శ. 1170.

**పాంగెము** రూ.చూ. పాఁగెము. వి. **1.** సంబంధం. తాళ్ల. సం. 17.194; **2.** ఒక కులవ కట్టు బాటు, **3.** చుట్టరికం.

**పాంగొట్టడం** వి. పాడుచేయటం.

**పాఁకు** రూ.చూ. ప్రాఁకు. వి. **1.** శైవలం, సీటిపైన బయలు దేరే తీగ. కు.సం. 6.85; **2.** పాకుడు.

**పాఁకుడు** రూ.చూ. ప్రాఁకుడు. వి. **1.** పశ్చపాచి మొదలైనవి; **2.** పాచితీగ.

**పాఁకులాడు** చూ. ప్రాఁకు. రూ.చూ. ప్రాఁకులాడు. అ.క్రి. పొర్లాడు, దొరలు; స.క్రి. ఆశ్రయించు, బతిమాలు.

**పాఁగు** రూ.చూ. పాఁగెము. వి. విధం, రీతి. సిం.ద్వా. 5.66.

**పాఁగె** రూ.చూ. పాఁగెము. వి. విధం, రీతి.

**పాఁగెము** రూ. పాంగెము, పాఁగు, పాఁగె. వి. **1.** విధం, రీతి. పండి.చ. 4.278; **2.** సంబంధం. పండి.చ. 5.398; **3.** సామ్యం. యయా. 2.107; **4.** మైత్రి, స్నేహం.

క. పాంగు-. విధం, రీతి, ఆకృతి; త. పాన్కు-. ఇరుగు పొరుగు, స్థలం, స్నేహం, భాగస్వామ్యం, సమానత్వం. అందం; మ. పాన్కు, పాన్ను-. పక్కపక్షం;

ప్రా. పంగ-. గ్రహించు.

<ఉ. పాన్కు.

**పాచతీగ** రూ.చూ. పాచితీగె. వి. చిన్నచిన్న చెట్లమీదా పొదలమీదా పెరిగే తీగ (Cassytha filiformis).

**పాచవము** రూ. పాననము. వి. పాననం, విరేచనం.

సం. పాచన-. వండేది, పక్వంచేసేది, కరగించేది, పులుసు.

క. బాసు-. మలం విసర్జించు; త. పాచనమ్- నీళ్ళ విరేచనాల వ్యాధి;

<సం. పాచన-.

**పాచలా** రూ.చూ. ఫాసలా. వి. రెండు ప్రాంతాల మధ్య ఉండే చోటు, దూరం.

**పాచా** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**పాచి** రూ.చూ. ప్రాచి. వి. 1. నన్నటి ఆకుగల ఆకు పచ్చని జిగురు తీగె; 2. తడుపవల్ల వచ్చే ఆకుపచ్చటి మయిల; 3. ఉదయాన ఊశ్చే కనపు.

పాచికలరు రూ. పాచిక్రలు. వి. పాకుడురంగు. పాచిక్రలు రూ.చూ. పాచికలరు. వి. పాకుడురంగు. పాచితీగె రూ. పాచతీగ, పాచితీగ, ప్రాచితీగ. వి. చిన్న చిన్న చెట్లమీదా పొదలమీదా పెరిగే తీగ (Cassytha filiformis). పాచిపని రూ.చూ. ప్రాచిపని. వి. పొద్దున కసవు ఊడ్చటం, నీళ్ళు చల్లటం మొ. పనులు. కుమారీశ. 89. పాచిమాను రూ.చూ. పంచమస్. వి. పన్ని. నదుల గట్లమీద పెంచబడే ఒకరకం పెద్దచెట్టు (Anogeissus accuminata). పాచిరంగు రూ. పాసిరంగు. వి. పచ్చి పెసర రంగు.

**పాచిక** రూ.చూ. పాసిక. వి. ద్యూతక్రీడకు ఉపయోగించే సాధనం, అక్షం, జూదమాడె అర్ధసారె. హరి. ఉ. 3.228.

పాచికపాఱు అ.క్రి. ఎత్తులు ఫలించు. పాచికవేయు స.క్రి. 1. పాచికల్ని వేయు. పండి.చ. 2.368 వ; 2. యుక్తిపన్ను.

**పాచితము** రూ.చూ. ప్రాచితము. వి. పాపాన్ని పోగొట్టటానికి చేసే కర్మ విశేషం, ప్రాయశ్చిత్తం. ఆము. 6.69.

**పాచివచ్చు** చూ. పాయు[1].

**పాచు**[1] చూ. పాయు[1].

**పాచు**[2] వి. గుండెలదరటంలో వచ్చే అనుకరణం. చంపూరా. 3.140.

**పాచ్చా** రూ.చూ. పాదశా. వి. మహమ్మదీయ చక్రవర్తి.

**పాచ్చాయా** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**పాఛా** రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 775.

**పాచ్చా** రూ.చూ. పాదశా. వి. పాదుషా చక్రవర్తి. అనంద. టీకి. 68; కవిచా. శ. 101.

**పాచ్చాయి** రూ.చూ. పాదశా. వి. పాదుషాచక్రవర్తి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 772. క్రీ.శ. 1775.

**పాచ్చావు** రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి.

**పాంచీ** రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకునే ఒకవిధమైన నగ.

**పాంచు ప్రకరణ** వి. అధికార విశేషం. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 751, క్రీ.శ. 1376.

సం. పంచన్-. ఐదు.

**పాంజ** వి. జట్టీ. రెండు పొడుగాటి బొంగులను కలుపుతూ మధ్యలో రేకు బిగించి మోతకు పనికివచ్చేటట్లు చేసిన సాధనం.

**పాంజీ** రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకునే ఒకవిధమైన నగ.

**పాంజెపు** రూ.చూ. పాంజేబు. వి. కాళ్ళకు వేసుకునే గజ్జెగొలుసు.

**పాంజేబు** రూ. పాంజెపు, పైస్‌జబు, పొంజెపు. వి. కాలికి ధరించుకొనే గొలుసు, గజ్జెగొలుసు.

హిం.ఉ. పాజేబ్, పాయ్‌జేబ్. నూపురం.

<ఉ. పాజేబ్.

పాంజేబుపట్టీలు వి.బ.వ. కాళ్ళకు ధరించే వెండి నగ.

**పాఁచి** రూ.చూ. ప్రాఁచి. వి. 1. నీరునిలవ ఉండటంవల్ల కలిగే పచ్చని మురికి. ఆము. 2.46; 2. శైవాలం, నాచుతీగ. కువ.చ. 3.10; 3. వక్కపులం. భల్లా. 4.

పాఁచిచేయు అ.క్రి. ఇల్లు వాకిలి దొడ్డి మొ.నవి కుడిచి గోమయం కలిపిన నీళ్ళుచల్లి ముగ్గుపెట్టు. పాఁచితీగ రూ.చూ. పాచితీగె. వి. మజ్జిగ చిక్కనచేసే ఒకానొక తీగ. పాఁచితీయు అ.క్రి. ఇల్లు, వాకిలి, దొడ్డి మొ. వాటిని కుడిచి గోమయం కలిపిన నీళ్ళుచల్లి ముగ్గుపెట్టు. పాఁచిది విణ. పాచిపని చేసేది. దాసి. పాఁచిపట్టు అ.క్రి. నిలవఅగు. శేషధ. 2.99. త. పాసిపఱు. పాఁచిపని రూ.చూ. ప్రాఁచిపని. వి. గతదినం ఉపయోగించిన పాత్రల్ని శుద్ధిచేయటం మొ.పని. శుక. 2.561.

**పాఁచు** అ.క్రి. అన్నం మొ. నవి కాలాతిక్రమణంచే చెడిపోవు, సారహీనమగు.

త. పాళ్-. పనికిరాకుండాపోవు, పఴుతు-. ఏదైనా కుళ్ళినది; మ. పళచోఱు-. ముందురోజు వండిన అన్నం, పళక్క-. కుళ్ళనవాసన కలిగిఉండటం, పళుక్క-. నశించు; కొలా. పాస్-. పులిసిపోవు (ఆహారం) చూ.క. పళసు-. నశించు, పాడగు.

<మూ.ద్రా. *పాళ్-/ *పాచ్-.

**పాట**[1] వి. 1. పద్ధతి. భార. ఆది. 3.51; 2. విధం, రీతి. భార. ఆది. 6.127; 3. నమయం. భీమ. 3.72; 4. స్థలం, ప్రదేశం. భీమ. 5.157; 5. గాదెలోంచ రాశ్ళు అమర్చిపెట్టే ఎత్తు.

సం. పాటీ. గణనాదుల వ్యుష్టక్రమం, పరిపాటి, అనుక్రమం.

సం. పాటి (అర్థవిపరి.).

**పాట**[2] వి. ఒకరకం తీగ. (cissampelospareira).

పాటతీగె వి. కొండలమీద పెరిగే ఒకరకం తీగ. (Cyclea peltata). పాటపాలము వి. చిరువేరుపైరయ్యే నేల. పాటవేరు వి. పచ్చని పూలుపూసే ఒకరకం తీగ (Tiliacora racemosa).

సం. పాఠా, పాఠా. చిరుబొద్ది; ప్రా. పాదా.

పాట[3] వి. 1. పల్లవితోను అనుపల్లవితోను చరణాలతోనుకూడి ఉండే గేయ విశేషం. భార. ఆది. 8.174; 2. గానం. ఆము. 4.35; 3. సంగీత పద్ధతి విశేషం. ప్రబంధ. 100; 4. చెప్పిందే చెప్పటం.

క. హాడు, పాడు-. పాడటం. పాట; కొడ. ప.ట్-. పాట; త. పాటల్-. పద్యాలు చదవటం, పాట, పాటి-. పాడేవాడు, రాగం, పాట్టు-. పాడటం, పాట, సంగీతం; మ. పాటి-. రాగం, పాట్టు-. పాడటం, పాట, పద్యం; కో. ప.ట్-. పాట; తొ. పా.ట్-. ఒక ప్రత్యేకమైనపాట; గోం. పాటా-. పాట; కొం. పాట; పర్జి. పాటు-. పాట, కథ, మాట, భాష; కొలా. ప.టు-. పాట; నా. పాట.

పాటకచ్చేరి వి. పాటకచేరి.

పాట[4] వి. 1. అగలుసొంటి; 2. ధాన్యాదికాన్ని కొలిచేవాడు.

పాట[5] అవ్య. తర్వాత. ఉదా. తిన్నపాట కాస్త పండుకో.

పాటక్ రూ.చూ. పాటకు. వి. గేటు.

పాటక రూ.చూ. పాటకు. వి. దర్వాజా తగిలించే రాతి దిమ్మ.

పాటకము రూ. పోటకము, పోదకము, వి. స్ఫోటకం. ఆం.భా. 2.130.

సం. స్ఫోటక-. మశూచి; ప్రా. ఫుడియా, ఫోడ-, ఫోడఅ, ఫోడియా. బొబ్బ; పా. ఫోట-, ఫోటక-.

ద్రా. ఫుటన్. స్ఫోటకం.

<పా. ఫోటక-.

పాటకి రూ.చూ. పాటకు. వి. ఇనుపదువ్వ.

పాటకు రూ. పాటక్, పాటక, పాటకి, పాటాకి. వి. గేటు.

సం. పాటుక-. చిల్చేది, రాచనగరు మధ్యప్రాంతం; హిం. పాట్, పాటా. సింహాసనం, పాటక్.

పాటకుడు వి. పాటకాడు, గాయకుడు. యయా. 5.155.

నం పాఠక-. చదివేవాడు, అధ్యాపకుడు; ప్రా. పాఢయ-. చదివేవాడు; పా. పాఠక-. చదివేవాడు.

<నం. పాఠక-.

పాటడి చూ. పాటు[1].

పాటవ చూ. పాటు[2]. వి. 1. సొంపు. సౌందర్యం. గౌ. హరి. పూ. 1708; 2. సంస్కారం. చక్కబరచటం. మను. 8.53; 3. ఆదరణ పాత్రం. ఆదరణం; 4. అలంకారం.

పాటపాట చూ. పాటు[3]. విశ. కొంచెం కొంచెం. కాశీ. 7.159.

పాటబంధి చూ. పాటు[1].

పాటము[1] వి. 1. కెంపులనాణెం చూడటానికి తగిన వెలుగుకల వేళ. ఆం.భా. 2.277; 2. కెంపుల ఎండ; విశ. తగినట్టి.

పాటము[2] వి. పాఠం. భాగ. సం. 14.122.

సం. పాఠ-. చదవటం, అధ్యాపనం; ప్రా. పాఢ-. చదవటం; పా. పాఠ-.

<సం. పాఠ-.

పాటవ వి. పాకబద్ద. జల్లను పట్టి ఉంచే గడ గొయ్యల మీద అడ్డంగా పరచిన కర్ర.

పాటాకి రూ.చూ. పాటకు. వి. దర్వాజా తగిలించే రాతి దిమ్మ.

పాటాకొట్టు అ.క్రి. పడగొట్టివేయు.

హిం. పాట్-. కర్రలను కొట్టివేసే పురుగు.

పాటాపెట్టు(-పెట్టు) అ.క్రి. కొట్టివేయు.

హిం. పాట్. కర్రలను కొట్టివేసే పురుగు.

పాటి[1] విశ. 1. విధమైనది. భార.ఆది. 7 43; 2. సామాన్యుడు, సామాన్యం. బసవ. 7.327; 3. అనుకూలం శృం.నై. 3 93; 4. అల్పం, చిన్నది. ఆము. 4.35; వి. 1. సాటి, సమానం. భార. విరా. 1.61. 2. న్యాయం. భార.ఉద్యో. 2.287; 3. రీతి, విధం. భార.శాంతి. 2.178; 4. పెంపు, ఔన్నత్యం. పండి.చ. 5.311; 5. శక్తి, సామర్థ్యం. భాగ. 10 పూ. 1764; 6. తగవు. జగడం. సిం.ద్వా. 7.30; 7. ఆధారం, వాడుక. దశా. 4.58.

క. హాడు, పాడు-. పొందు, బాధ, కష్టం, స్థితి, విధం, పాటి-. విధం, యుక్తమైన, సామ్యం; తు. పాడు-. సామ్యం, విధం, రీతి; త. పాడు-. సంభవించు, జరుగు, అనుభవం, స్థితి, వ్యాపారం, బాధ, స్థలం, పరిస్థితి, పాట్టుమ్-. ఆటలో మలుపు; మ. పాడు-. నొప్పితో బాధపడు, అనుకూలత, స్థలం, పరిస్థితి, ప్రకృతి.

పాటిగొను(-కొను) స.క్రి. 1. సరిచేయు. హ.స. 4.43; 2. లక్ష్యంచేయు. పాటించు స.క్రి. 1. సవరించు, చక్కబరచు. కు.సం. 5.147; 2. పూను, అవలంబించు, పొందు. కు.సం. 12.194; 3. చూపు, కనబరచు, ప్రకటించు. నిర్వ.రా. 3.61; 4. ఆదరించు. భార.విరా. 1.101; 5. ప్రమాణంగా తీసికొను, లక్ష్యంగా చేసికొను, ప్రధానంగా చేసికొను. భార.విరా. 2.261; 6. పొసగించు. కలిగించు. భార.ఉద్యో. 3.69; 7. ఉంచు. భార.ఉద్యో. 4.42; 8. ప్రతీక్షించు, నిరీక్షించు. భార. శల్య. 1.320; 9. పరిశీలించు. భార.శాంతి. 2.284; 10. విచారించు, ఆలోచించు. భాస్క.రా.యు. 1819; 11. లెక్కించు, గణనచేయు. శృం.నై. 1.59; 12. చేయు, కావించు. శృం.నై. 2.77; 13. ధరించు. పారి. 3.37; 14. అనుకరించు. పోలు. కవిక. 1.58. <పాటి[1]+-ఇంచు[3]. పాటివ వి. 1. నియమం; 2. అనుకరింపు.

పాటిమాలు రూ. పాట్మాలు. వి. చేత్తో వడికిన నూలు.

పాటిబద్ధములేవి అవ్య. సత్యంలేని. సం. బద్ధ-. కట్టబడిన, కూర్చబడిన, స్థిరమయిన. పాటింపు వి. మదింపు, పనిచేసే వాడుక. పాటిలు రూ. పాటిల్లు. అ.క్రి. 1. కలుగు, జనించు, సంభవించు, తటస్థించు. భార.ఉద్యో. 2.498; 2. ఉండు. భాస్క.రా.యు. 1356; 3. ఒప్పు. రామాభ్యు. 3.82; 4. నెరవేరు, సిద్ధించు. ద్వి. పరమ. వి. 5.274; 5. ప్రకాశించు. నీలా. 3.114. మ. పటుప్పు-. సృష్టి, ప్రజలు; గోం. పరానా, ఫుర్రానా, ప్రారానా, పర్-, పర్(ర్). పడ్-. చేయగలిగి ఉండు. బాగుగా ఉండు. పడ్కనా-. చేయగలిగి ఉండు; కుడు. పడ్పనా, పాడ్పనా-. ఒకరి మీద బరువు ఎత్తుకొను. పాటిల్లు రూ.చూ. పాటిలు. అ.క్రి. 1. కలుగు, జనించు, సంభవించు, తటస్థించు. భార.ద్రోణ. 2.201; 2. ఒప్పు. ఆము. 2.55; 3. నెరవేరు, సిద్ధించు. మల్ల. సితి. 60; 4. ఉండు; 5. ప్రకాశించు. పాట్మాలు

రూ.చూ. పాటిసూలు. వి. చేత్తో వడికిన నూలు, సన్న నూలు.

పాటి[2] రూ.చూ. పాటు[3]. విశ. 1. (కుంచం మొ.వి) స్థిరపరచబడిన పరిమాణం కలది. బసవ. 1.56; 2 గణింప తగినది, ఆదరింప తగినది. భార.విరా. 5.278; 3. ప్రమాణం. భార.శాంతి. 6.372; 4. కొలదిది, పరిమాణం కలది. వరాహ. 3.125; 5. తగు పాటిది, తగిన పరిమాణం కలది. హంస. 1.218.

పాటికొల వి. సరియైన కొలత. పాటిచేయు రూ.చూ. పాటిసేయు. స.క్రి. ప్రమాణంగాగొను, లక్ష్యంచేయు. పాటిసేయు(-చేయు) రూ. పాటిచేయు. స.క్రి. ప్రమాణంగా గొను, లక్ష్యంచేయు. భాస్క.రా.యు. 2350.

పాటి[3] వి. గ్రామకివారు. కొటికాననం. క్రీ.శ. 669.

సం. వాట-. వీథి, కంచె.

పో.చూ. క. పాటి. పీథి; త. పాటమ్, పాటి; మ. పాటకమ్.

పాటిక వి. పావి, ఎనబై గవ్వల ఎత్తు పరిమాణంగల రాగి నాణెం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1248.

పాటిగరువు చూ. పాడు[3].

పాటికొరవు చూ. పాడు[2].

పాటివేల చూ. పాడు.[3]

పాటిపాటిమ్మ చూ. పాడు[3].

పాటిబండలగోల చూ. పాడు[3].

పాటిమట్టి చూ. పాడు[3].

పాటిమన్ను చూ. పాడు[3].

పాటిమీఁదిగంగావమ్మకు కూటిమీఁదవేలోకము చూ. పాడు[3].

పాటిరాటి చూ. పాడు[3].

పాటిరేవడి చూ. పాడు[3].

పాటిరేవు చూ. పాడు[3].

పాటిషన్‌గోడ యా.చూ. పాటిసన్‌గోడ. వి. అడ్డుగోడ, ఇంటి లోపల రెండుగదులమధ్యన కట్టిన గోడ.

పాటిసన్‌గోడ యా. పాటిషన్‌గోడ. వి. అర్ధగోడ, ఇంటిలోపల రెండుగదులమధ్యన కట్టిన గోడ.

ఇం. *Partition*. విభజన.

<ఇం. Partition+గోడ.

పాటీలు వి.బ.వ. స్త్రీ హస్తభూషా విశేషం.

మరా. పాటలీ;

తె. పాట్లిల్. కంకణం.

<మరా. పాటలీ.

పాటు[1] చూ. పడు[1]. వి. 1. చావు, మరణం. కు.సం. 9.159; 2. కష్టం. నిర్వ.రా. 7.64; 3. బాధ, పరిశ్రమం. భార. ఉద్యో. 1.59; 4. ఆపద, ఇడుము. భార. మౌసల. 1.216; 5. దురవస్థ, దుస్థితి. భార. స్వర్గా. 24; 6. పతనం. పడటం. మార్క. 1.51; 7. సముద్రజలోల్బణ శమనం, సముద్రం పొంగు తీసిపోవటం. మను. 3.136; 8. పోటు. సిలమర, సెలవారు, గోడకట్టేటప్పుడు కొన్ని లోపలకు ఉండేటట్లు చివరలు వదిలివేసి కట్టిన రాళ్ళు; 9. పరుపు. ఇటుక. బారన రాళ్ళను వాటి మందం మీద పడుకోబెట్టటం; 10. బట్టీలో పచ్చి ఇటుకలను అడ్డంగా పేర్చిన పేర్పు; 11. ఎరువులు దాగా వేయటం; 12 దెబ్బ; 13. వైపు.

పాటడి వి. 1. పాటుపడి పనిచేసేవారు; 2. క్షుద్ర కర్మకారి. పాటబండి వి. 1. రథవిశేషం, గాడీ.హరి.పూ. 5.140; 2. కంబళి వాహ్యకం, ఎద్దులబండి. ఆం.భా. 2.201. త. పెట్టివండి. ఎద్దులబండి. పాటుకొర్ర వి. కొర్రల్లో ఒకరకం. పాటుగొట్టు(-కొట్టు[1]) వి. పిల్లలు కింద పడినప్పుడు కలిగే కీడు. పాటుగోడ వి. 1. మంట పైకి పోకుండా ఇటిక బట్టీ పొయ్యిలచుట్టూ పచ్చిటుకతో కట్టిన చిన్న గోడ; 2. అర్ధగోడ, ఇంటిలోపల రెండుగదులమధ్య కట్టిన గోడ. పాటుతివ్వ స.క్రి. అచ్చు పళ్ళలో పడుగు పోగులు తగిలే భాగం పక్కకు జరప టం. పాటుదీయు(-తీయు) అ. క్రి. దిగదుడుప తీయు. పాటుపఱచు(-వడు) అ. క్రి. 1. కుదురు కొను. యథాస్థితికివచ్చు. భార.అను. 4.101; 2. దేవని రథం ఉత్సవానికి బయలుదేరి తిరిగి యథాస్థితికి వచ్చు. పాటువడు రూ. పాటుబడు. అ.క్రి. శ్రమపడు, వేసరు. పాటుబడు రూ.చూ. పాటుపడు. అ.క్రి. శ్రమపడు. వేసరు. పాటుమనిషి వి. పాటుపడే మనిషి. పాటురాయి రూ. పాట్రాయి. వి. 1. చదరపురాయి, చదరంగా నాలుగు పల కలుగా ఉన్న రాయి; 2. అడుగురాయి, ఇంటి నేలమీద పరిచే పల్చనిరాయి; 3. ఇటికబట్టీలో వాటంగా పేర్చిన రాయి. పాటువరస రూ. పాటొర్ప. వి. చదరపు రాళ్ళను మట్టంగా అతుకుతూ ఒకవైపునుంచి కట్టేతీరు. పాటొర్ప రూ.చూ. పాటువరస. వి. చదరపు రాళ్ళను మట్టంగా అతు కుతూ ఒకవైపునుంచి కట్టేతీరు. పాట్రాయి రూ.చూ. పాటు రాయి. వి. 1. చదరపురాయి, చదరంగా నాలుగు పలకలు ఉన్న రాయి; 2. అడుగురాయి, ఇంటినేలమీద పరిచే పల చని రాయి; 3. ఇటికబట్టీలో వాటంగా పేర్చిన రాయి. పాట్లమారి వి. మిక్కిలి శ్రమపడు స్వభావం కలవాడు.

పాటు[2] చూ. పడు[2]. వి. 1. స్థితి, మంచిస్థితి. భార. ఉద్యో. 4.90; 2. ప్రవర్తన; 3. కర్మార్థంలో వచ్చే అనుబంధం; 4. స్వార్థంలో వచ్చే అనుబంధం; విశ. 1. వీలు, శక్యం, అర్హం. వేంక. పంచ. 1.191; 2. తుల్యం, సమానం. తపతీ. 2.17.

పాట్లుచేయు అ.క్రి. వేడినీళ్ళు చన్నీళ్ళతో కలిపి స్నానా నికి తగినట్లు చేయు. పాట్లువడు(-వడు[2]) అ.క్రి. మామిడి కాయలు పండటానికి తగిన స్థితికి వచ్చు.

పాటు[3] రూ. పాటి[2]. వి. పరిమాణ విశేషం. పండి.చ. 5.384.

క. పాటు, పాడు, హాడు- స్థలం, కాలం మొ. నవి కొలిచే పరిమాణం; కో. ప.టి. పరిమాణం, జరగవలసిన దానికి తగిన శక్తి.

<క. పాటు.

పాటులాగు యా.చూ. పాట్లాకు. వి. చిలుకు, తాళం వేయటా నికి వీలుగా అమర్చిన పరికరం.

పాటేరు వి. పక్షివిశేషం. హంస. 3.121.

పాటొర్ప చూ. పాటు[1].

పాటోళీ రూ. పాతోళీ. వి. పెసరపప్పుతోగాని సెనగపప్పుతో గాని చేసే ఒకరకం తినుబండారం.

పాట్నికమ్మి రూ.చూ. పాట్నాకమ్మి. వి. ఒకటి రెండు వేళ్ళ వెడల్పు పట్టెలు నాలుగయిదు ఎడం ఎడంగా నేసిన చీర కమ్మి.

పాట్నా వి. కమ్మిలో నేసిన పట్టె.

హిం. పాట్నా. పాటలీపుత్రం, ఇప్పుడు బీహారు ముఖ్య పట్నం.

<హిం. పాట్నా.

పాట్నాఅంచు రూ. పాట్లాఅంచు. వి. అంచు పడుగులో కొంతవరకు రంగునూలు అతికి పేకకు అదేరంగు పెట్టి నేసిన అంచు. పాట్నాకమ్మి రూ. పాట్నికమ్మి, పాట్లా కమ్మి. వి. ఒకటి రెండువేళ్ళ వెడల్పు పట్టెలు నాలుగయిదు ఎడం ఎడంగా నేసిన చీరకమ్మి. పాట్నాపైజారు వి. ఒకరకం డిజైనులో నేసిన చీరచెరగు.

పాట్నాలు చూ. పాటి[1].

పాత్రి వి. పాకబద్ద, జల్లను పట్టిఉంచే గడికొయ్యలమీద అడ్డంగా పరిచిన కర్ర.

పాత్రిబద్ద వి. బండి దొలుపుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య. పాత్రిబల్ల వి. బల్ల, బండితోలేమనిషి కూర్చోటానికి నొగమీద అమర్చిన చెక్క.

పాత్రాయి చూ. పాటు[1].

పాత్రేవడి చూ. పాడు[3].

పాత్రేవు చూ. పాడు[3].

పాట్లవి విణ. ఖలుడు, దుష్టుడు. ఆం.రా. 8.13.

పాట్లమారి చూ. పాటు[1].

పాట్లాఅంచు రూ.చూ. పాట్నాఅంచు. వి. అంచు పడుగులో కొంతవరకూ రంగునూలు అతికి పేకకు అదే రంగుపెట్టి నేసిన అంచు.

పాట్లాకమ్మి రూ.చూ. పాట్నాకమ్మి. వి. ఒకటి రెండు వేళ్ళ వెడల్పు పట్టెలు నాలుగయిదు ఎడం ఎడంగా నేసిన చీర కమ్మి.

పాట్లాకు రూ. పాటులాగు, దాట్లాకు. వి. చిలుకు, తాళం వేయటానికి వీలుగా అమర్చిన పరికరం.

పాట్లుచేయు చూ. పాటు[2].

పాట్లువడు చూ. పాటు[2].

పాట్వారీ రూ.చూ. పట్వారీ. వి. గ్రామ లెక్కలను చూసే ఉద్యోగి.

పాఠోళీ రూ.చూ. పాటోళీ. వి. పప్పులతో వండిన ఒకరకం కూర.

పాఠ రూ.చూ. పాడు[3]. వి. జిగురు ఇసక సమపాళ్ళగా ఉన్న మట్టి.

పాఠగము రూ.చూ. పాగడము[1]. వి. స్త్రీ పాదభూషా విశేషం, అందెల్లో భేదం. ఆం.రా. 2.150.

పాఠరు చూ. పాడు[3].

పాఠలు చూ. పాడు[2].

పాఠలు చూ. పాడు[2].

పాడి[1] వి. 1. సంస్థాపనం. నిర్దేశం, నిర్ధారణం. ఏడువారం పాలెపు శాసనం. త్రి.శ. 1018; 2. స్వభావం. భార. ఉద్యో. 1.71; 3. న్యాయం. భార. ఉద్యో. 2.48; 4. ఆచారం, పద్ధతి. భార. ఉద్యో. 3.9; 5. ధర్మం. భార. శల్య. 2.325; 6. ధర్మశాస్త్రంలోని వ్యవహారం. అభియోగం, వివాదం. విజ్ఞా. వ్యవ. 11; 7. వివాదం. విజ్ఞా. వ్యవ. 26; 8. తగవు. విజ్ఞా. వ్యవ. 53; 9. తీర్పు. విజ్ఞా. వ్యవ. 75; విణ. 1. న్యాయం, న్యాయంతప్పని, ధర్మయుక్తమైన. భార. ఆది. 3.217. 2. సదృశమైన, సమానమైన. ఆం. రా. 2.302.

క. పాళి-. పంక్తి, వరస, క్రమం, సరియైన క్రమంలేక దారి, పద్ధతి, నిబంధన; త. పాడు.

చూ. సం. పాలి-. వరుస, పంక్తి.

పాడికట్టు వి. రాతినిచెక్కి కట్టే పద్ధతి. పాడిదొలగు (-తొలగు) అ.క్రి. న్యాయమార్గం తప్పు. పారి. 1.36. పాడిపంతాలు వి.బ.వ. న్యాయాన్యాయాలు. శాశ్వ. సం. 15.243. పాడిమానిసి వి. న్యాయంకలవాడు. భార. స్త్రీ. 76. పాడిరాతి వి. ఒంటిమొగం రాయి, ఒకవైపుచదునుగా నున్నగా చెక్కబడినరాయి. పాడివాడు విణ. అర్హుడు తగినవాడు. కాశీ. 5.217.

పాడి[2] రూ.చూ. పాడి. వి. ఆవు, బర్రెపాలు కలిగిన స్థితి.

పాడిచేయు వి. పాలుపితికి, కాచి, చిలికి ఉపయోగానికి సిద్ధంచేయు. పాడిపంట వి. పచ్చీసు వంటి ఒకఆట. పాడి పంటలు వి.బ.వ. పశుసంపద, ధాన్యసంపద. పాడిపనులు వి.బ.వ. పాలుతీసి చేసేపనులు. పాడిపేట నుండంచు వి. జమిలి పోగులతో నేసిన ఒకరకం అంచు. పాడిసుడి వి. ముడ్డి పూసమీద ఉండే సుడి.

పాడి[3] రూ.చూ. పాడు. వి. కట్ట, కుండి, మధ్యలోనీళ్ళుపోసి గచ్చును గట్టి పరచటానికి వీలుగా మట్టితో కట్టినకట్ట; 2. కుండి, నీరునిల్వచేసి చుట్టూ కట్టిన గుండ్రటి మట్టికట్ట; 3. కుయ్యంరాయి, రాతితోకట్టిన ఆర్చికి మధ్య భాగంలో బలంకోసం బిగించిన పెద్దరాయి.

పాడివదేపాడు చూ. పాడు[1].

పాడివవదమెపాడు చూ. పాడు[1].

పాడిపేల చూ. పాడు.[3].

పాడియ రూ. చూ. పాడె[1]. వి. శవవాహనం. విష్ణుపు. 4.236.

పాడు[1] స. క్రి. 1. (రాగం) ఆలాపించు, గానం చేయు. భార. ఆది. 8.175; 2. కీర్తించు, స్తుతించు. భాగ. 10పూ. 1686; 3. (ధాన్యాదులు కొలిచేటప్పుడు పేలంలో ఒగ్గరగా సంఖ్యను) చెప్పు; అ.క్రి. గానంచేయు. సంగీతం పాడు. దశా. 2.301.

క. పాడు, హాడు-. పాడటం, పాడు, పాడు-. పాడటం, పాట; కొడ. ప. డ- (ప. డి.). పాడు; త. పాడు (పాడి-). పాడు, కంపన స్వరంతో పాడు, కూనిరాగం తీయు, పాడ్డు-. పాడటం, పాట; మ. పాడుక-. పాడు, పాడ్డు-. పాడటం, పాట; కో. ప. డ్వ-. (ప. డ్డ-).

శబ్దంచేయు. (తేనెటీగలు, తుపాకీ మొ॥ నవి); తె. పా.డ్-. పా. డ్య-). పాడు. పా.ట్-. (పా.ట్య-). అరుచు; గోం. పారానా, పాడ్, పార్; కొం. పాళ్; కువి. పయా, పావలి-. పాడు; పర్జి. పాడ్-. పాడు; కొలా. ప. డ్- (వ. డ్త-). పాడు; నా. పాడ్-. పాడు; గ. (ఒల్లా). పార్-. పాడు; కురు. పాడ్‌నా; మాల్తొ. పడె, పాడ్.

<మూ. ద్రా.* పాట్-.

**పాడినదేపాడు** స.క్రి. చెప్పినదే తిరిగి చెప్పు. **పాడిన పదమెపాడు** స.క్రి. చెప్పినదేచెప్పు. ద్వి. సార. చ. 1.618.

**పాడు²** విశే. 1. శూన్యం, కాపురం లేనిది. భార. ద్రోణ. 2.337; 2. పాతకం, దుష్టం. హర. 2.63; 3. చెడు. శిథిలమగు. పల్నా. పు. 53; 4. నిష్ఫలం, పనికిమాలినది, కళా. 3.260.

క. హాళు, పాళ్-. నాశనం, శిథిలం, పనికిరాని, పాళ్‌తన-. శిథిలమైన స్థితి; కొడ. ప.లి- చెత్త, నాశనమైన, పోయిన; తు. పాళు, హాళు-. నాశనం, పాడుపడిన, పనికిరాని, నశించిన; త. పాఴు, పాళ్ (-ప్ప-, -న్త-). నాశనమగు, వ్యర్థంగా పడిఉండు, పనికి రాకుండా పోవు. (ఇల్లు, స్థలం) శిథిలమగు, నాశనం, నష్టం, చెడు, పాఴ్-. పాడు, దిక్కుమాలిన స్థితి; మ. పాఴ్-. ఖాళీస్థలం, పాడుపడిన, పనికిరాని, పాఴన్-. దుర్మార్గుడైన, చెత్త, తప్పించుకొను, సాగుచేయక వదలివేయు; కో. ప.య్. (అచ్చుముందు) ప. (హల్లు ముందు) ఖాళీ, వ్యర్థపరచినది (ఇల్లు, స్థలం, చెయ్యి, కుండ). హ.ళ్, అ.ళ్-. నాశనం; తొ. పొ.య్. పొ. చెయ్యి, కుండ, ఒ.గొ. డ్. ఒ.చి.మ్య-. శిథిల పరచిన స్థలం.

**పాడికొరవు** వి. మరణసమయంలో శరీరంపై ఉన్న ఆభరణాలు. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 812. **పాదరు** రూ.చూ. పాతరు. అ.క్రి. పారగు. వర. రా. అరణ్య. పు. 119; 3పం. **పాతట** విశే. పాడు పడినది. పి.శకు. 4.168. **పాదరు** రూ. పాతరు. అ.క్రి. 1. నశించు. కు.సం. 7.47; 2. ఉచితస్థితి చెడు, పాడుపడు. భార. ద్రోణ. 2.126; 3. శూన్యమగు. మార్క. 1.168. **పాడు కన్నులు** వి.బ.వ. దిష్టికళ్ళు. **పాడుకాపులు** వి.బ.వ. వ్యర్థనిధికలు. కళా. 3.272. **పాడుచిక్కు** అ.క్రి. పారగు. **పాడు చెఱువు** వి. ఉపయోగంలేని చెరువు. గడ్డి మొ. నవి మొలచిన చెరువు. **పాడునుయ్యి** వి. ఉపయోగం లేని నుయ్యి. గడ్డి మొ.నవి మొలచిన నుయ్యి. **పాడుపొనలు** వి. అలంకారం లేని పొలభాగం. శుక. 2.426. **పాడుపడు** రూ.చూ. పాడువడు. అ.క్రి. శూన్యమగు, పారగు, నశించు. **పాడుపాతరమట్లు** వి.బ.వ. బాలక్రీడావిశేషం. హంస. 3.146. **పాడుబావి** వి. ఉపయోగం లేనినుయ్యి. గడ్డి మొ. నవి మొలచిననుయ్యి. సానంద. 2.23 వ. **పాడుమాట** వి. అశుభమైనవాక్కు. **పాడుముండ** వి. పాడుపనులు చేసేఆడది. **పాడుమొగము** వి. కళావిహీనమైన మొగం. **పాడువడు (-వడు)** రూ. పాడుపడు. అ.క్రి. శూన్యమగు, పారగు, నశించు. భాగ. 6.324. **పాడువఱచు (-వఱచు)** స.క్రి. పాడుపడేట్లుచేయు. సానంద 4.43. **పాడువాఱు (-పాఱు)** అ.క్రి. 1. పారగు బసవ. 7.192; 2. పాడుపడు, శూన్యమగు. భాస్క. రా. అరణ్య. 2.255. **పాడువిధవ** రూ. పాడుబెధవ. వి. పాడుపనులు చేసేముండమోపి, ఒకతిట్టు. సం. విధవా. భర్త లేని స్త్రీ. <పాడు² + సం. విధవా. **పాడుబెధవ** రూ.చూ. పాడువిధవ. వి. తుంటరి, ఒకతిట్టు. **పాడుసంత** రూ. పాడుసంతన. వి. 'వెధవగోల' అనేచోట ఉపయోగించే పలుకుబడి. **పాడుసంతన** రూ.చూ. పాడుసంత. వి. వెధవ గోల, దాదరబందీ. **పాడూరిలోబ్రతుకు** అ.క్రి. పనికిమాలి బ్రతుకు. భాగ. సం. 11.3. **పాడూరిసంత** వి. నిరుపయోగ మైంది. శుక. 3.18.

**పాడు³** రూ. పాడ, పాండ్ర, పాండ్రి. వి. దే. 1. అప్రహత దేశం, దున్నని భూమి. రం. రా. అయోధ్యా. 112; 2. గ్రామం నశించిన ప్రదేశం. వేంక. పంచ. 1.467; 3. నివసించటానికి ఏర్పరచుకొన్న స్థలం; 4. జిగురూ ఇసక సమపాళ్ళుగా ఉన్న మట్టి; ప్రత్య. ఊళ్ళపేర్లకి చివర్లో వచ్చే అనుబంధం. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 26.

క. పాడి-. కొత్తగా ఏర్పరచుకొన్న గ్రామం, పల్లె; కొడ. ప.డి. కురుంబ జాతివారి గుడిసె; త. పాటి-. పట్టణం, నగరం, పల్లెటూరు, గొల్లకాపర్ల గ్రామం, పాట్టమ్-. పేట. గొల్లకాపర్లపేట, పాటకమ్. పేట. గ్రామంలో ఒకభాగం; మ. పాటి, పాటకమ్-. గ్రామంలో ఒకభాగం.

మరా. పాడా-. పల్లె, వ్యవసాయదారుల ఇళ్ళ సమూహం.

చూ. సం. పాటక-. ఒకరకమైన గ్రామం.

**పాటిగరువు** వి. పాటిమన్ను గులక కలిసిన నేల. **పాటినేల** రూ. పాడినేల, పాడునేల, పాండ్రినేల. వి. 1. ఊరెత్తు పడిపోయి పాడుపడిన నేల; 2. మెరకనేల. **పాటిపాటెమ్మ** రూ.చూ. పాతపాటెమ్మ. వి. ఒక గ్రామ దేవత. **పాటిబండలగోల** వి. అర్థం పర్థం లేని అల్లరి. **పాటిమట్టి** వి. పాటిదిబ్బలమీదనుంచి వర్షానికి కరిగి పల్లం లోకి వచ్చి నిలిచిన మట్టి. **పాటిమన్ను** వి. మెరకగల చోటున ఉన్న రేగడిమన్ను. **పాటిమీఁదిగంగావమ్మకు కూటిమీఁదవే లోకము** వి. అత్యాశతో కూడిన జిజ్ఞాస. **పాటిరాటి** వి. ఒకరకం చిన్నరాటి. **పాటిరేవడి** రూ. పాట్రేవడి. వి. పాటిమన్ను కలిసిన రేగడి. **పాటిరేవు** రూ. పాట్రేవు. వి. ఎక్కువ లోతు లేకుండా దిగి నడిచి పోవటానికి వీలైన నదీ భాగం. జాహ్నవి. 4.154. **పాట్రేవడి** రూ.చూ. పాటిరేవడి. వి. పాటిమన్ను కలిసిన రేగడి. **పాట్రేవు** రూ.చూ. పాటిరేవు. వి. ఎక్కువ లోతు లేకుండా దిగి నడిచి పోవటానికి వీలైన నదీ భాగం. **పాడినేల** రూ.చూ. పాటినేల. వి. ఊళ్ళు పాడుపడ్డచోటు, సారవంతమైన నేల. **పాడునేల** రూ.చూ. పాటినేల. వి. ఊళ్ళు పాడుబడ్డ చోటు. **పాడువర** వి. పైన మాత్రం ఒక పొర పాటిమన్నుగల నేల. **పాడుభూమి** వి. ఊరు పాడుబడ్డచోట ఏర్పడిన నేల.

సారవంతమైన నేల. పాయురాటు వి. గరగరాతు, పగిలి పనికిరాని రాయి.

**పాయూరిలో[బతుకు** చూ. పాడు[2].

**పాయూరిసంత** చూ. పాడు[2].

**పాడె[1]** రూ. పాడియ. వి. శవవాహనం. భార.అను. 5.472.

క. పాడు-. పడటం, పడు, క్షీణదశ, కెరటం విరగటం, పాడి-. క్షీణించటం, నాశనం ; త. పాడు-. సాగిలపడు, పాటు, నిద్ర, చావు, నాశనం, నష్టం, పాడై-. శవ వాహనం, పీనుగు బండి ; మ. పాడు-. పడటం, ఒకరి అధికారంలో పడు ; కొలా. పార్- (పాడ్-). పడటం.

**పాడెగట్టు(-కట్టు)** వి. ఒకానొక తిట్టు. హంస. 5.113.వి. శవవాహనం పాడెసుడి వి. వీపుమీదగాని, పొట్టమీదగాని నాలుగువైపులా ఉండే నాలుగు సుళ్ళు, చాలా చెడుప, వీపుకు రెండువైపులా పాడె ఆకారంలో చారలుగా ఉండే సుళ్ళు.

**పాడె[2]** వి. దారప పొలం, బురద భూమి. E.I. సంపు. 13 గా.సం. 23. క్రీ.శ. 1434.

**పాడెక్కు** అ.క్రి. నివాన మేర్పరచుకొను.

**పాడ్యమి** వి. ప్రతిపత్తు, పక్షాల్లో మొదటి తిథి. భార.అను. 3.161.

సం. ప్రథమా-. ప్రతిపద్, పాడ్యమి : ప్రా. పడివయా, పడివఅ, పడవా, పధుమా-. : అ.మా. పడివయా ; పా. పఠమా-. మొదటిది ; అవ. పథమిల్లి :

క. పడ్డమి, పాడియ, పాడివ. పాడ్యమి ; తు. పాడ్య ; త. పాట్టియమి.

< ప్రా. పడివయా-.

**పాణపి** వి. మాలజాతి, మాలజాతిది. శపరా. 3.58.

త. పాణన్. ప్రాచీన తమిళగాయకజాతి : ను. పాణ. ప్రా. పాణ-. చండాలుడు, పాణకుడీ-. చండాల కుటీరం.

**పాణి** వి. ముత్తెపునీరు. భార.విరా. 5.286.

సం. పానీయమ్-. తాగదగింది, నీరు ; ప్రా. పాణీఅ, పాణి-. నీరు ; పా, పాని- ; హిం. పానీ. నీరు ;

త. పాణి-. నీరు.

< ప్రా. పాణి-.

**పాణిద్వారం** రూ. పాళిద్వారం. వి. సింహద్వారానికి ఎదురుగా ఇంట్లో ఉండే దర్వాజా.

సం. పాణి-. చెయ్యి. ద్వార్. గుమ్మం.

< సం. పాణిద్వార్ (అర్థవికృ.).

**పాణిపరము** రూ.చూ. పాణిపతము. వి. అమ్ములపొది.

**పాణిబల్ల** వి. చూరుచెక్క, పెంకుటింటి చూరు కింద వేసిన వెడల్పాటి చెక్క.

**పాణిపతము** రూ. పాణిపతము. వి. అమ్ముల పొది. ఆం.రా. 2.214.

**పాంటిక** రూ. పాంటికి, పాంటికె. వి. మెట్టు, ఎక్కటానికి చిగటానికి వీలుగా కట్టిన నిర్మాణం.

**పాంటికి** రూ.చూ. పాంటిక. వి. సోపానం, మెట్టు.

**పాంటికిలు** వి.బ.వ. దసరా పద్యాలు రాసిన పుస్తకాలు.

**పాంటికె** రూ.చూ. పాంటిక. వి. మెట్టు.

**పాండవపొంగలి** వి. వాన రాకపోతే పాండవుల పేర ఐ బొమ్మలు పెట్టి పొంగించే పొంగలి.

సం. పాండవ-. పాండురాజ సంతతి.

< సం. పాండవ- + పొంగలి. (మిశ్రస.).

**పాండవబీడు** వి. చిరాప్రహతభూమి, చాలా కాలంనుం డున్న బీడునేల. ఆం.రా. 2.7.

సం. పాండవ-. పాండురాజ సంతతి.

< సం. పాండవ- + బీడు. (మిశ్రస.).

**పాండా** రూ.చూ. పడ్యా. వి. ఒక బిరుదువాచకం.

**పాండిమొదపు** చూ. పాఁడి. వి. పాడిఆవు. ద.హిం.గా.సంపు 4. గా.సం. 950. క్రీ.శ. 1326.

**పాండి** వి. చేనేతపనిచేసే పద్మసాలీల పంగానికి మూల పురుషుడు.

**పాండి(డు** వి. పాండ్యదేశపు రాజు. ఆము. 2.88.

సం. పాండ్య-. పాండ్యదేశ సంబంధమైన ; ప్రా. పండ-. పాండ్యదేశ సంబంధి. పండి ;

క. పాండ్య. పాండ్యదేశానికి చెందిన ; తు. పాండి-. పాండ్యదేశం ; త. పాటి, పాండియ.

**పాండుభుపము** వి. పాండుభూమి, వెలిచేను. మల్లారెడ్డిదుండి శాసనం, నెల్లూరు శాసనాలు, కందుకూరు శాసనం. క్రీ.శ. 1408.

సం. పాండుభూ. తెల్లనేల.

< సం. పాండుభూ.

**పాండ్యంరాయి** వి. ఎర్రరాయి, రాయలసీమ, కర్నూలుజిల్లా లోని పాణ్యం ప్రాంతంనుంచి వచ్చే చలవరాయి.

**పాం[ర** రూ.చూ. పాడు[3]. వి. బీడునేల.

**పాం[డి** రూ.చూ. పాడు[3]. వి. జిగురు, ఇసక సమపాళ్ళగ ఉన్న మట్టి.

పాం[డివేల రూ.చూ. పాటినేల. వి. ఊళ్ళు పాడుబడ్డ చోట ఇటువంటి నేలలు ఏర్పడతాయి.

**పాఁడి** రూ. పాడి[2]. వి. **1**. గోగణం, ఆలమంద. భార.ఆది. 5.3 ; **2**. క్షీరం, పాలు ; **3**. క్షీరదధ్యాది సమృద్ధి.

క. పాల్-. పాలు, మొక్కలనుంచి వచ్చే తెల్లని ద్రవం, చెరుకురసం, కొబ్బరినీరు ; కొడ. ప.వి. పాలు, ప.కుట్టి-. పాలకుండ ; తు. పెరు-. పాలు, కొబ్బరినీరు, మొక్కల నుంచివచ్చే తెల్లని ద్రవం ; త. పాల్. పాలు, మొక్కలు, పళ్ళు మొ. వాటినుంచి వచ్చే పాలవంటి ద్రవం ; మ. పాల్-. పాలు, కూరగాయలపాలు ; కో. ప.ల్-. పాలు ; తొ. పొ.స్-. పాలు, పొ.ల్.పి క్-. పాలు నిండుగా ఉన్న కడుపు. పొ.ల్.ఫె.ల్-. మధ్యవేలు ; గోం. పాల్ ; కొం. పాల్-. పాలు, చనుబాలు ; కుయి. పాడు. పాలు-. పాలు. చెట్టుకి ఎక్కే రసం లేక నీరు ; కువి. పాలా, పాలు-. పాలు ; పర్జి. పెల్- పాలు, తల్లిపాలు ; కొలా. ప.ల్ ; గ(ఒల్లా). పాల్-. పాలు ; బ్రా. పాల్-.

పాలు. మొక్కలకు ఎక్కే దాక వచ్చే తెల్లని ద్రవం.

**పాత** రూ.చూ. ప్రాత. వి. **1.** జీర్ణవస్త్రం, గుడ్డ పేలిక; **2.** జము దాని నేతలో డిజైన్లు, బుటాలు వెయ్యటానికి వాడే రంగు దారాలు చుట్టిన చిన్న గుడ్డముక్క; **3.** సారెపైవాటలకు నునుపు పట్టటానికి అంచు ఏర్పరచటానికి వాడే తడిబట్ట; విణ. జీర్ణమైన, చిరిగిన.

పాతకాటు వి. పసుపులో తెలుపువన్నె కలిసిన రంగు. పాతగుడ్డ వి. సారెపైని వాటలకు నునుపు పట్టటానికి అంచు ఏర్పరచటానికి వాడే తడిబట్ట. పాతచెక్క వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోటానికి తడిగుడ్డ పెట్టుకొనే కొయ్య చెక్క. పాతపట్టు అ.క్రి. కుడిచేత్తో అడ్డం వేలువేసి ముఖ మేర్పరచటానికి కుండ నాలుగుపక్కల సాపుగా రావటానికి బట్టతోపట్టు. పాతపాటపాడు స.క్రి. చెప్పినదే చెప్పు. పాతబట్ట వి. కుండల్ని నర్సేటప్పుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. పాతబంధ వి. కుండల్ని నర్సేటప్పుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. పాతమట్టు[1] వి. జాలికి అడుగువైపున ఉండే మట్టి. పాతమట్టు[2] వి. తడక, చెక్కడపు పని చేసిన రంధ్రాలున్న పిట్టగోడ. పాతరాయి రూ. ప్రాతరాయి. వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి. పాతవేయు రూ. చూ. పాతేయు. అ.క్రి. కుడిచేత్తో అడ్డవేలువేసి ముఖమేర్పరచటానికి కుండనాలుగు పక్కల సాపుగారావటానికి బట్టతో పట్టు. పాతేయు రూ. పాతవేయు. అ.క్రి. కుడిచేత్తో అడ్డంవేలువేసి ముఖమేర్పరచటానికి కుండ నాలుగుపక్కల సాపుగారావటానికి బట్టతో పట్టు. ప్రాతరాయి రూ.చూ. పాతరాయి. వి. నర్సేటప్పుడు నలపను తడిచేసుకోటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి. పాడాలం వి. పాతపొలం.

**పాతక** చూ. పాతఱ. వి. **1.** నేలలో బావిలాగా తవ్వి గడ్డి తాళ్ళతో అంచుకట్టి ధాన్యం నిలవ చేసే చోటు; **2.** కొన్ని చోట్ల రాతితో నేలపైనకట్టిన గదికి కూడ ఈ పేరు వాడతారు.

**పాతడి** వి. ఒక మొక్క, రాతినేలల్లో ప్రవాహాల పక్కన పెరిగే మొక్క (Homonia riparia).

**పాతదియ** వి. నారింజరంగు పూలు పూసే ఆఫ్రికానుంచి తేబడిన చెట్టు.

**పాతపాటెమ్మ** రూ. పాటిపాటెమ్మ. వి. ఒక గ్రామదేవత.

**పాతంపి** వి. తెలియకుండా వచ్చిన వారు పడి చావటానికి ఏర్పరచిన పాతబడన గొయ్యి. పల్నా. 101.

త. పాన్తు-. రంధ్రం, బాకీ. లోతైన గొయ్యి; పర్జి. పెన్ద్; గ. పెన్దుప్. (పెన్దుత్-). పూడ్చు. పాతి పెట్టు.

**పాతర**[1] వి. **1.** ఆటకత్తె, నాట్యంచేసే స్త్రీ. నర్తకి. యయా. 4.13; **2.** బాలక్రీడా విశేషం. హంస. 3.146.

సం. పాత్ర-. నటుడు, నటునిపని; ప్రా. పాత-; క. పాతర. ప్రదర్శన, నాట్యం.

<సం. పాత్ర-

పాతరకత్తె రూ. పాత్రకత్తియ, పాత్రకత్తె. వి. నర్తకి, నటి. నిరంకు. 2.9. క. పాతరగత్తి-. నర్తకి. నటి.

పాతరి- నర్తకి. పాతరలాడించు రూ. పాత్రలాడించు, స.క్రి. ఆనందాదులచే గంతులు వేయించు. నిరంకు. 2.117. <పాతరలాడు+-ఇంచు[3]. పాతరలాడు రూ. పాతురలాడు. పాత్రలాడు. అ.క్రి. **1.** నాట్యంచేయు, నర్తించు. భాగ. 10 పూ. 1331; **2.** (సంతోషాదులచే) గంతులు వేయు. ప్రబంధ. 724. < పాతర+-లు+ఆడు.

**పాతర**[2] రూ.చూ. పాతఱ. వి. **1.** నేలలో బావిలాగా తవ్వి గడ్డితాళ్ళతో అంచుకట్టి ధాన్యం నిలవచేసే చోటు; **2.** కొన్నిచోట్ల రాతితో నేలపైన కట్టిన గదికి కూడా ఈ పేరు వాడతారు; **3.** కుటకలాగా లోతుగా ఉండే మట్టిపాత్ర.

**పాతరసం** రూ.చూ. పాదరసము. వి. తెల్లగా బరువుగా ద్రవరూపంలో ఉండే మూల ద్రవ్యం.

**పాతరి** రూ.చూ. పాతఱ. వి. **1.** నేలలో బావిలాగా తవ్వి గడ్డితాళ్ళతో అంచు కట్టి ధాన్యం నిలవచేసే చోటు; **2.** కొన్నిచోట్ల రాతితో నేలపైన ధాన్యం నిలవచేయటానికి కట్టిన గది.

**పాతల్గని** వి. మందులలో వేరు ఉపయోగ పడే ఒక మొక్క (Rauwolbia Serpentina).

**పాతాళగంగ** వి. **1.** చాలా లోతులో ఉన్న నీరు; **2.** ఒక తీర్థం; శ్రీశైల సమీపంలోని కృష్ణానది.

సం. పాతాలగంగా. పాతాళంలో ప్రవహించే గంగ.

<సం. పాతాళగంగా (అర్థవిపరి.).

**పాతాళగరిగి** వి. గాలం.

సం. పాతాల-. అధోలోకాల్లో ఒకటి.

<సం. పాతాల-+గరిగి. (మిశ్రస.).

**పాతాళభేది** వి. బావిలో పడినదాన్ని తీయటానికి ఉపయోగించే ఒక సాధనం, గాలం.

సం. పాతాలభేదిన్. పాతాళాన్ని భేదించేది.

<సం. పాతాలభేదిన్ (అర్థవిపరి.).

**పాతాళసుడి** వి. మూపురం కింద ఉండేది. చెరువు.

సం. పాతాల-. అధోలోకాల్లో ఒకటి.

<సం. పాతాల-+సుడి. (మిశ్రస.).

**పాతిక** రూ. పాతిక, పాతికె. పాదిక. వి; **1.** ఇరవైఐదు. చిట్టివలన కానసం క్రీశ. 1080; **2.** ఒకటిలో నాల్గవ భాగం. ఆము. 6.66; **3.** పణంలో నాల్గవ వంతు. ఆం. భా. 2.272.

సం. పాదక-, పాదికా-, నాల్గవవంతు; ప్రా. పాదికా; పా. పాద-. నాల్గవ భాగం, ఒకనాణెం.

<ప్రా. పాదికా.

పాతికపుంజం రూ. పాతిక పుంజం. వి. పుంజంలో నాలుగో వంతు. పాతికోపరకో అవ్య. ఏకొంచెమో. కకుత్స. 31.

**పాతిక** రూ.చూ. పాతిక. వి. **1.** వందలో నాలుగోభాగం, ఇరవైఅయిదు; **2.** నాలుగో వంతు.

పాతికపుంజం రూ.చూ. పాతిక పుంజం. వి. పుంజంలో నాలుగో వంతు.

**పాటికె** రూ.చూ. పాటిక. వి. 1. ఒకటిలో నాల్గోభాగం. హంస. 3.159; 2. పణంలో నాల్గోవంతు.

**పాటికోపరకో** చూ. పాటిక.

**పాటిమోకరిలయువారు** విఅ.బ.వ. నట్టువలు. నెల్లూరు శాసనాలు. రాపూరు శాసనం. 47. క్రీ.శ. 1211.

**పాటియా** రూ.చూ. బాటియా. వి. గిన్నె.

**పాతురలాడు** రూ. చూ. పాతరలాడు. అ.క్రి. 1. నాట్యంచేయు, నర్తించు. శాకు. నం. 10.73; 2. (సంతోషాదులచే) గంతులువేయు.

**పాతురాడించు** చూ. పాతర. స.క్రి. నాట్యంచేయు.

**పాకురాయి** వి. పాతిసరిహద్దురాయి. E. I. 12. పావుగడ. 74. క్రీ.శ. 1354.

**పాతేయు** చూ.పాత.

**పాత్ర**[1] వి. ఒకపదవిని సూచించేపదం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 734. క్రీ. శ. 1379.

సం. పాత్ర-. యోగ్యుడు.

<సం. పాత్ర- (అర్థవిపరి.).

**పాత్ర**[2] రూ.చూ. పాత్రఅ. వి. 1. నేలలోబావిలాగా తవ్వి గడ్డితాళ్ళతో అంచుకట్టి ధాన్యం నిలపచేసే చోటు; 2. రాతితో నేలపైన కట్టినగది.

సం. పాత్ర-. పానపాత్ర, కుండ, ఏదైనాపోసుకొనే భోజనంపాత్ర.

<సం. పాత్ర- (అర్థవిపరి.).

**పాత్రదాక** రూ. పాత్రిదాక. వి. మూతివెడల్పుగా అంచు వాలినట్లుగా అడుగు చదరంగా పెద్దగా ఉండి రాగి అంతా ఆకారంలో నిలుపుగా ఉండేమట్టిపాత్ర. **పాత్రపాగారము** వి. పానీయపాత్రలు లేక పూజా ద్రవ్యాలు ఉంచే పాత్రలు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 645 క్రీ. శ. 1148.

**పాత్రకత్తియ** రూ. చూ. పాతరకత్తె. వి. నర్తకి. నటి. చంపూరా. 3.64.

**పాత్రకత్తె** రూ.చూ. పాతరకత్తె. వి. నర్తకి, నటి.

**పాత్రభోగమువారు** విఅ. దేవాలయాల్లో గీతవాద్యనాట్యాది కృత్యాలకు నియోగించబడ్డ స్త్రీ పురుషులు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 91. క్రీ. శ. 1132.

సం. పాత్ర-. నటుడు, నటి.

**పాత్రలాడించు** చూ. పాత్రలాడు.

**పాత్రలాడు** రూ.చూ. పాతరలాడు. అ.క్రి. నర్తించు, నాట్యంచేయు, గంతులువేయు. వరాహ. 8.74.

**పాత్రలాడించు** రూ.చూ. పాతరలాడించు. అ.క్రి. పిచ్చిగంతులు వేయించు.

**పాత్రాయి** చూ. పాత.

**పాత్రిదాక** రూ.చూ. పాత్రదాక. వి. మూతివెడల్పుగా అంచు వాలినట్లు దాక అడుగు చదరంగా పెద్దగాఉండి రాగిఅంతా ఆకారంలో నిలుపుగా ఉండే మట్టిపాత్ర.

**పాదం** వి. 1. కుర్చీరాయి, రాతికూడాలకు, స్తంభాలకు అడుగు భాగంలో మోపుకింద ఉంచబడిన గుంటగల బండరాయి; 2. పిట్టగోడలోని నీళ్ళు పొయ్యే తూము.

సం. పాద-. కాలియొక్క అడుగుభాగం; ప్రా. పాఅ-, పాద-, పాయ-; పా. పాద-.

<సం. పాద- (అర్థవిపరి.).

**పాదంగోలు** వి. పట్టెలకు మూలల్లో నెలవంకలాగా తీసేగాడి. **పాదంమూకుడు** వి. కదలకుండా ఉంచటానికి అడుగున మూడుగుబ్బలు పెట్టిన మూకుడు.

**పాదచర్య** వి. పరిచర్య, సేవ. హర. 2.55.

సం. పాద-. అడుగు. పాదం, చర్యా. పని, క్రియ.

<సం. పాదచర్యా (అర్థవిపరి.).

**పాదట్టు** చూ. పాదు[2].

**పాదట్టుపురుగు** చూ. పాదు[2].

**పాదరసమట్టం** చూ. పాదరసము.

**పాదరసము** రూ. పాతరసం. వి. రసం, తెల్లగా బరువుగా ద్రవరూపంలో ఉండే మూల ద్రవ్యం. వైద్యంలో ఉపయోగించే ఖనిజ పదార్థం. కు. సం. 8.18.

సం.. పారద-. ఒకానొక ఖనిజం; ప్రా. పారయ-; కుమా. పారో; సిం. పారో; నే. పారో; అ. బెం. ఒ; పారా, రస. ద్రవం.

<సం. పారద- + సం. రస-.

**పాదరసమట్టం** వి. 1. రసమట్టం, సీదికి, సారాయికి బుడులు పాదరసపు బొట్టును వేసి తయారు చేసిన లెవలు బాటిలు; 2. మట్టం సరిచూడటానికి తాపీపనివాళ్ళు వాడే పరికరం.

**పాదరి**[1] రూ.చూ. పాడిరి[2]. వి. క్రీస్తుమతబోధకుడయిన గురువు.

**పాదరి**[2] రూ.చూ. పాడిరి[3]. వి. కలగోరుచెట్టు, గట్టికలపనిచ్చే ఒకరకం చెట్టు (Stercospermum suaveolens).

**పాదలి** రూ. పాదలి. వి. హనుడు, తుచ్ఛుడు. శివత.సా. 301.

క. పాదరి-. వ్యభిచారిణి, పాదర, హాదర-. వ్యభిచారం, పాదరి, హాదరగిత్తి-, హాదరగితి. వ్యభిచారిణి, పాదరిగ, హాదరిగ-. వ్యభిచారుడు; తు. హాదర-. వ్యభిచారం.

<క. పాదరి.

**పాదలి** రూ.చూ. పాదటి. విఅ. అధముడు. నవనాథ 3.143 పు. 10 పం.

**పాదవట్టము** వి. అందె, కాలిఅందె, బిరుదపెండేరం, హొగడటం.

సం. పాదపట్ట-. కాలిఅందె; ప్రా. పాదవట్ట-.

<ప్రా. పాదవట్ట-.

**పాదవటియ** వి. మంచం కోళ్ళకి కిందిభాగంలో అందెపని చేయబడిన నగిషీపని. చంద్రాంగ 6.132.

సం. పాదపట్టికా-. కాలిఅందె; ప్రా. పాదవట్టిఅ.

<ప్రా. పాదపట్టిఅ.

**పాదగా** రూ. పహదషా, పాదా, పాద్చా, పాద్చాయా, పాదా, పాద్చా, పాద్చాయి, పాద్చావు, పాదగాహ, పాదషా, పాదనహో, పాదసావా, పాదిషా, పాదుగా, పాదుగావా, పాదుగాహి, పాదుగాహు, పాదుష, పాదుషహ, పాదుషహో, పాదుషా, పాదుషాయి, పాదుషాహో, పాదుషాహి, పాదుషాహు, పాదునహ, పాదునహో, పాదుసా, పాదు

సాహి, పాశ్చా, పాశ్చావు, బాదశహ, బాదషహ, బాద షహా, బాదసహ, బాదాశాహ, బాదుశా, బాదుషా. వి. రాజు, శాసకుడు, సమ్రాట్టు, ముస్లిం చక్రవర్తి. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 750. క్రీ.శ. 1590.

హిం. పాద్‌శాహ్, బాద్‌శాహ్; ఉ. పాద్‌శాహ్, బాద్‌సాహ్-. రాజు, శాసకుడు; పార. పాద్‌షాహ్, బాద్‌షాహ్-. చక్రవర్తి;

క. పాచ్ఛా, పాతషాహి, పాతుషాల్, పాదషాహ, పాయషాహ; త. పాచ్చా, పాదుషా, పాట్చా.

< ఉ. పాద్‌శాహ్.

పాదశాహ రూ.చూ. పాదశా. వి. సమ్రాట్టు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 751. క్రీ.శ. 1592.

పాదషా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదసహా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదశావా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదాంత్రపురుగు వి. సాలెపురుగు.

పాదాంధ్ర వి. సాలెపురుగు.

పాది¹ వి. వృక్ష విశేషం. సానంద. 2.23.

పాది² వి. పాదివేట.

పాదిగువ్వ వి. పాదివేటకు ఉపయుక్తమైన పెంపుడు పిట్ట. శుక. 1.165. పాదివేఁట వి. కన్నెకరకాజు మొదలైన పెంపుడు పిట్టల్ని విడిచి పిట్టల్ని పట్టే ఒకానొక వేట. కాశ. 3.46.

పాది³ వి. ఏరువాటే ఒకానొక సాధనం.

పాదికెత్తు స.క్రి. తరింపచేయు. శాక్త.సం. 12.218.

పాది⁴ రూ.చూ. పాఁదు. వి. 1. చెట్టు మొ.వాటికి మొదట నీరు నిలవటానికి గుండ్రంగా చేసే కుదురు, ఆలవాలం. ఆం.భా. 1.163; 2. (పూల) తోట; 3. గుంజలు మొదలైనవి పాతటానికి గడ్డపలుగుతో తవ్విన లోతైన గుంట.

పాదికట్టు వి. చిన్న పాదులలాగా చిన్నచిన్న కయ్యలు గల పొలం.

పాది⁵ రూ.చూ. పాదు². వి. 1. కవిలు, నెర్రె; 2. బొంగు, రప్ప, చీలికలాగా ఉండే రంధ్రం.

పాది⁶ రూ. ఆది. వి. 1. ఎనభైగవ్వల ఎత్తు పరిమాణంగల రాగినాణెం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1216; 2. కొలత, పరిమాణం.

పాదిక రూ.చూ. పాతిక. వి. పణంలో నాల్గోవంతు, ఒక రూక.

పాదిపాది వి. స్తనాలువదయించే తావు. చనుకుదురు. సుద. 4.88.

పాదిరి¹ రూ. పాదరి², పాదిరిలి, పాదిలి. వి. పాటలి, పూలమొక్క, కలిగొట్టు. కుచ.చ. 3.127 (Bignonia suaucolens).

క. పాదరి. పూలమొక్క; తు. పాదరి; త. పాతిరి-. బాగాపూలమొక్క; మ. పాతిరి-. బాగాపూవు; సం. పాటల-, పాటలా, పాటలీ. పాదిరిమొక్క; ప్రా. పాడలా, పాడలీ; అ.మా. పాడల; పా. పాటలీ.

పాదిరి² రూ. పాదరి¹, ఫాదరీ. వి. క్రైస్తవమత బోధకుడైన గురువు.

పో. ప్యాద్రి; స్పా. ప్యాద్రె; ఇటా. ప్యాద్రె; ఫ్రెం. పెర్;

త. పాతిరి.

< పో. పాద్రి.

పాదిరి³ రూ. పాదరి², పాద్రి. వి. కలగోరుచెట్టు, గట్టికలప నిచ్చే చెట్టు (Stercospermum suaveolens).

పాదిరిలి రూ.చూ. పాదిరి¹. వి. కలిగొట్టు.

పాదిలి రూ.చూ. పాదిరి¹. వి. కలిగొట్టు.

పాదిషా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదిష్టి వి. పాకుడు, చెమ్మపల్ల బూజులాగా పట్టిన మకిల.

పాదు¹ రూ.చూ. పాఁతు. వి. 1. కుదురుగా ఉండదగినచోటు, ఆశ్రయం. భార.అను. 4.101; 2. స్థైర్యం, నిలకడ. హరి.పూ. 5.29; 3. చెట్టు మొ.వాటికి మొదట నీరు నిలవటానికి గుండ్రంగా చేసే కుదురు, ఆలవాలం; 4. నీళ్ళకుండీ; 5. గుంజలు మొ.వి పాతటానికి గడ్డపారతో తవ్విన లోతైన గుంట; 6. రాటికి క్రిందా పైనా కట్టిన వెదురుబద్ద; 7. చక్రం కుండ అరగకుండా ఉండటానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా కేసిన ఇనపకట్ట; విశే. స్థిరం, కదలకుండా ఉండేది. హంస. 1.181; స.క్రి. పాతు.

పాదుకొను అ.క్రి. 1. స్థిరపడు, చలింపకుండు. వరాహ. 10.105; 2. అంకురించు, పుట్టు. పారి. 3.5; 3. మేళవించు. మను. 6.32; 4. చొచ్చు, ప్రవేశించు. పాండు. 5.292; 5. ధ్రువపడు, నిశ్చితమగు. ప్రబో. 2.3; 6. తగులుకొను, సక్తమగు. గంధ. 145. పాదుకొలుపు రూ.చూ. పాదుకొల్పు. స.క్రి. 1. నిలుపు, ఉంచు, స్థిరపడుచు. కళా. 4.41; 2. అంటేటట్లుచేయు. విప్ర. 2.21. పాదుకొల్పు రూ. పాదుకొలుపు. స.క్రి. 1. కలిగించు. ప్రబోధ. 1.75; 2. నిలుపు, ఉంచు, స్థిరపరుచు; 3. అంటేటట్లుచేయు. పాదుచెక్క వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేత పనివాడు కాలితో తొక్కే కొయ్య చెక్క. పాదువిడుచు అ.క్రి. పాదుకొను. హరి.ఉ. 6.144. పాదువడు అ.క్రి. నెలకొను, స్థిరపడు. ద్వి.పరమ.వి. 4.266. పాదుపఱచు స.క్రి. నెలకొలుపు, పన్ను, ఉంచు. వేంక.పంచ. 2.10. పాదులుదీర్చు (-తీర్చు) స.క్రి. వలలు మొ.వి ఒడ్డు. కాశీ. 3.47. పాదువఱుచు (-పఱుచు) స.క్రి. నెలకొల్పు, పన్ను, ఉంచు. వేంక.పంచ. 2.10.

పాదు² రూ. ఆదు, పాది⁵. వి. 1. కవిలు, గుది, నెర్రె; 2. బొంగు, రప్ప, చీలికలాగా ఉండే రంధ్రం.

పాదట్టు రూ.చూ. పాదుట్టు. వి. 1. ఇంటిలో లోపలి

వాసాల పట్టే బూజు ; 2. సాలెపురుగు. పాదట్టుపురుగు రూ. పాదొట్టుపురుగు. వి. సాలెపురుగు. సాంబ.తిర్య. 77. పాదుట్టు వి. పాజుట్టు. పాదుట్రు రూ. పాదట్టు, పాదొట్టు. వి. ఇండ్ల లోపలి వాసాల పట్టెలకి పట్టే బూజు. బసవ. 3.722. పాదొట్టు రూ.చూ. పాదుట్రు. వి. 1. చెలది, సాలెపురుగు. ఆం.భా. 2.82 ; 2. ఇండ్లో లోపలి వాసాలకి పట్టే బూజు. పాదొట్టుపురుగు రూ.చూ. పాదట్టుపురుగు. వి. సాలెపురుగు.

పాదు³ వి. పాక, పందను దూలాలు లేకుండా గోడపైనుంచి పక్కకు ఒంచి రాయల ఆధారంతో కట్టిన గాల. ఆం.భా. 2.16.

కొం. ప(స్ధి-. పందిరి ; కువి. పస్ దిరి-. పందిరి.

పాదురియా వి. ఒక ప్రత్యేకమైన విధంగా కట్టినది.

హిం. ఉ. పాతుర్, పాతుర్. వ్యభిచారిణి, పాతురియాఁ. వేశ్యలు.

< హిం. పాతురియాఁ.

పాదుశా రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి. రఘునాథ. 3.55 పం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 166. క్రీ.శ. 1624.

పాదుశావా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదుశాహీ రూ.చూ. పాదశా. వి. అధికారం, రాజ్యం.

పాదుశాహు రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి.

పాదుష రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి.

పాదుషహ రూ.చూ. పాదశా. వి. రాజు, ప్రభువు. హంస. 4.86.

పాదుషహా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి. రంగా.చ. 1.138.

పాదుషా రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి.

పాదుషాయి రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి. శేషధ. 1.50.

పాదుషాహా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదుషాహి రూ.చూ. పాదశా. వి. 1. రాజు, ప్రభువు. హంస. 4.86 ; 2. అధికారం, రాజ్యం.

పాదుషాహు రూ.చూ. పాదశా. వి. రాజు, ప్రభువు. ఉ.రా. 7.456.

పాదుసహ రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాదుష్షహా రూ.చూ. పాదశా. వి. చక్రవర్తి. అని. 3.19.

పాదుసా రూ.చూ. పాదశా. వి. రాజు, ప్రభువు.

పాదుసాహి రూ.చూ. పాదశా. వి. రాజు, ప్రభువు. నిరంకు. 1.2.

పాదొట్టు చూ. పాదు².

పాదొట్టు పురుగు చూ. పాదు².

పాద్రి రూ.చూ. పాదిరి³. వి. కలగోరుచెట్టు. గట్టి కలపనిచ్చే చెట్టు (Stercospermum suaveolens).

పాన వి. ప్రాణం.

సం. ప్రాణ-. ప్రాణవాయువు. శక్తి; ప్రా. పాణ-, పరాణ. జీవనం; పా. పాణ-. జీవితం, ప్రాణి.

< ప్రా. పాణ-.

పానకపూజ వి. ఒకరకం పూజ.

సం. పానక-. పానీయం. పూజా. పువ్వులు మొ. వాటితో భగవంతుడు మొ. వారిని సేవించటం.

< సం. పానకపూజా (అర్థవిపరి.).

పానకము వి. 1. పళ్ళరసం. అచ్చ.రా. అయోధ్యా. 104. 2. బెల్లం, పంచదార మొ. వాటితో తయారు చేసిన ద్రవం.

సం. పానక-. పానీయం.

< సం. పానక- (అర్థవిపరి.).

పానకములోవిపుడక వి. 1. మంచిదానిలో మధ్యవచ్చే అడ్డంకి ; 2. పానకంలో వచ్చే గడ్డి మొ. వాటి పరక. పానకాలబిందె వి. లగ్నానికి పిలవటానికి పెళ్ళికొడుకు విడిదిలోకి ఆడపెళ్ళివారు బెల్లం పానకాన్ని తీసుకొని వెళ్ళే బిందె.

పానకాలబిందె చూ. పానకము.

పానతాడు చూ. పేను¹. వి. మగ్గం చట్రం నిలువులని బిగు పెట్టిన లావు దారం.

పానప్పట్టె రూ.చూ. పానువ పట్టె. వి. మరమగ్గంలో పన్నె ఓగించిన కింది కొయ్య.

పానము వి. పానవట్టం.

సం. పాన-. పానీయం, తాగేగిన్నె.

< సం. పాన- (అర్థవివరి.).

పానలు వి.బ.వ. 1. మాటలు, పలుకులు. బసవ. 7.213 వ. 140 పం. ; 2. సందేహాలు. భల్లా. 2.

పానపట్టము వి. లింగ పీఠం. లింగంపై అభిషేకం చేయబడిన నీరు పడటానికి దాని అడుగు భాగంలో అమర్చిన వర్తులాకారమైన రాయి. శృం.నై. 8.105.

సం. పానపాత్ర-, పానవృత్త- ; ప్రా. పాణవట్ట- ; క. పాణివట్ట-. పాణిపట్టలు, పాణి బట్టలు.

< ప్రా. పాణవట్ట-.

పానాది వి. ఇంటిముందున్న బాట.

ప్రా. పాణద్ధి. బాట, దారి.

< ప్రా. పాణద్ధి.

పానారము వి. పండు పోక, పోఠం.

పాని రూ.చూ. పూను. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

పానిబల్ల వి. కుంటిబల్ల, పెంకు కింది చూరుకు బిగించే చెక్క.

పాను రూ.చూ. పూను. స.క్రి. వహించు. తాళ్ల.సం. 14.221 ; వి. మరమగ్గంలో పన్నె ఓగించిన కింది కొయ్య.

పానుకొను రూ.చూ. పూనుకొను. అ.క్రి. యత్నించు. తాళ్ల.సం. 5.125. పానుగొట్టంరాయి వి. పానువాటం రాయి, శివలింగాన్ని అమర్చటానికి పీఠంగా వాడిన రాయి. పానుపట్టిచూపు స.క్రి. పూనుకొని చూపు. తాళ్ల.సం. 11.135. పానుపట్టు అ.క్రి. ప్రయత్నించు. తాళ్ల.సం. 5.323. పానువాటంరాయి వి. పానుగొట్టంరాయి, శివలింగాన్ని అమర్చటానికి పీఠంగా వాడిన రాయి. పాన్పుకట్టె

వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య.

**పానుపు** రూ.చూ. పాన్పు. వి. 1. పరుపు. శృం.నై. 7.165; 2. మంచం. రసిక. 4.44.

**పానుపుటిల్లు** రూ. పాన్పుటిల్లు. వి. పడకటిల్లు. ఇందు. 3.15. **పానుపుపట్టె** రూ. పానప్పట్టె. వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. **పానుపురాయి** వి. కపిల బావి గుర్రపుకాళ్ళమీద అడ్డంగా పరిచిన మందపాటి బండ.

**పానసుంకాలు** వి.బ.వ. కల్లు అంగళ్ళపై విధించే పన్ను. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 739.

సం. పాన-. తాగుడు, మద్యపానం.

<సం. పాన- + సుంకాలు.

**పానె** చూ. పాను. వి. మరమగ్గంలో పన్నెబిగించిన కింది కొయ్య.

**పాన్కట్టె** చూ. పాను.

**పాంతో** వి. ఆదర సూచక శబ్దం.

**పాందీ** వి. దంతెల మధ్య ఉండే సందు.

**పాఁత** రూ.చూ. ప్రాఁత. వి. 1. వస్త్రం. గౌ.హరి. ఉ. 2089; 2. గుడ్డముక్క, చినిగిన వస్త్ర భాగం. విష్ణుపు. 3.275; విశే. పాతది.

**పాఁతగిలు** రూ. పాఁతగిల్లు, ప్రాఁతగిలు, ప్రాఁతగిల్లు. అ.క్రి. పాతది అగు. నిర్వ.రా. 8.117. **పాఁతగిల్లు** రూ.చూ. పాఁతగిలు. అ.క్రి. పాతది అగు. **పాఁతపడు** అ.క్రి. పాతది అగు. **పాఁతటికము** వి. పురాతనం, పాతదవటం.

**పాఁతగలు** చూ. పాఁతు.

**పాఁతగల్చు** చూ. పాఁతు.

**పాఁతర** చూ. పాఁతు.

**పాఁతరకన్ను** చూ. పాఁతు.

**పాఁతరంట్లు** చూ. పాఁతు.

**పాఁతరదడి** చూ. పాఁతు.

**పాంతరబండ** చూ. పాఁతు.

**పాఁతరఁబడు** చూ. పాఁతు.

**పాఁతరఁబెట్టు** చూ. పాఁతు.

**పాఁతరవేయు** చూ. పాఁతు.

**పాఁతరుబ్బులు** చూ. పాఁతు.

**పాఁతఱ** చూ. పాఁతు.

**పాఁతఱపెట్టు** చూ. పాఁతు.

**పాఁతఱవేయు** చూ. పాఁతు.

**పాఁతికొను** చూ. పాఁతు.

**పాఁతిపెట్టు** చూ. పాఁతు.

**పాఁతివేయు** చూ. పాఁతు.

**పాఁతు** రూ. పాడి[3], పాది[4], పాదు[1], ప్రాఁతు, బాదు[3]. వి. 1. భూమి. మొ. వాటిలో దిగిన పర్వతం మొ. వాటి మూలం. భార.ఆది. 2.11; 2. ద్రవ్యధాన్యాది నిక్షేపం; 3. మూలాధారం; 4. గుంజలు మొ.వి పాతటానికి గడ్డపలుగుతో తవ్విన లోతైన గుంట; 5. మధ్యలో నీళ్ళు పోసి గచ్చును గట్టి పరచటానికి వీలుగా మట్టితో కట్టిన కట్ట; స.క్రి. పాతిపెట్టు, పూడ్చు. భార. ఉద్యో. 3.142.

క. పాతి-. సాగుచేసిన భూమి, చెట్టు మొదట నీళ్ళు పొయ్యటానికి కట్టిన కుదురు; తు. పాతి-. మొక్కల సంరక్షణ;

త. పాన్తు-. గొయ్యి, లోతైనరంధ్రం; పర్జి. పెన్డ్-. పాతిపెట్టు; మాల్తొ. పథె-. చెట్టుమూలం, పతుర్-. మూలంతీయు.

పో. చూ. సం. పాద-. చెట్టుమొదలు.

<మూ. ద్రా. *పా-స్త్-/*పా-త్త్-.

**పాఁతగలు** అ.క్రి. 1. చెడు. భార. విరా. 2.308; 2. పెల్లగిలు. భాస్క. రా. యు. 471. **పాఁతగల్చు** స.క్రి. ఉన్మూలించు, పెల్లగించు. హర. 6.44. **పాఁతర** రూ.చూ. పాఁతఱ. వి. 1. పాతు, నిధి. రసిక. 1.44; 2. ధాన్యం మొ.వి ఉంచటానికి నేలతవ్విన గొయ్యి. **పాఁతరకన్ను** వి. పాతరమధ్య రంధ్రం. **పాఁతరంట్లు** వి.బ.వ. పాతర అడుగున చెడిపోయిన గింజలు. **పాఁతరదడి** వి. పాతరలోపల గడ్డితాళ్ళతో కట్టేఅంచు. **పాఁతరబండ** వి. పాతరపూడ్చేటప్పుడు కంటికి అడ్డంగా వేసే బండ. **పాఁతరఁబడు (-పడు)** అ.క్రి. మూలబడు. వర. రా. కిష్కిం. 339పు. 1పం. **పాఁతరఁబెట్టు (-పెట్టు)** రూ.చూ. పాఁతఱపెట్టు. స.క్రి. 1. నాశనం చేయమంటూ తిట్టు, చేతబడి చేసిన మంత్రద్రవ్యాలని అప్రయోగానికి గురిఅయిన వ్యక్తి వచ్చేపోయే దారిలో పూడ్చిపెడతారు. ఇలా పాతరలో పెడతానని బెదిరించే తిట్టు; 2. వస్తు మక్కటానికి నేలగుంటలో గడ్డితొక్కి పాతి పెట్టు. **పాఁతరవేయు** రూ. పాతఱవేయు. స.క్రి. 1. పూడ్చిపెట్టు, దాచు. పంచ. చ. 51 పు.; 2. చంపు. **పాఁతరుబ్బులు** వి.బ.వ. పాతరలో ముగ్గి పెద్దవైన గింజలు. **పాఁతఱ** రూ. పాతర[2], పాతరి, ప్రాఁత[2], పాఁతర. వి. 1. ధాన్యం మొ.వి ఉంచటానికి నేల తవ్విన గొయ్యి. మార్క. 3.354; 2. పాతు, నిధి. పర్జి. పెనడ్-. పాతిపెట్టు, పెనడ-. వ్యవసాయం వేరొకచోటకు మార్చు; కొలా. ప. తర-. ధాన్యంనిలవ చేసేగొయ్యి. **పాఁతఱపెట్టు** రూ. పాఁతరఁబెట్టు. స.క్రి. ధాన్యాదుల్ని నిక్షేపించు. **పాఁతఱవేయు** రూ.చూ. పాఁతరవేయు. స.క్రి. ధాన్యాదుల్ని నిక్షేపించు. **పాఁతికొను** రూ. పాఁతుకొను. స.క్రి. నిధిగా చేసికొను, పూడ్చుకొను. భార. ఆది. 7.132. **పాఁతిపెట్టు** స.క్రి. పాతు, పూడ్చు. వేమ. 1.164. **పాఁతివేయు** స.క్రి. చంపు. **పాఁతుకఱ్ఱ** వి. 1. పట్టెకఱ్ఱ, బట్టిగొట్టం పడకుండా తీగలను కట్టిన కొయ్య; 2. కంబి, గానిగమొద్దు మధ్యనాటిన మేకు. **పాఁతుకొను** రూ.చూ. పాఁతికొను. అ.క్రి. స్థిరపడు, చిరకాలంనుంచి ఊను. **పాఁతుకొయ్య** వి. 1. గానిగకఱ్ఱ తిరగటానికి ఆధారంగా నాటబడిన లావాటి కొయ్యదుంప; 2. కొయ్యమొద్దు. **పాఁతుమాను** వి. 1. స్థిరంగా నిలిచిన వాడు. శాశ్వ. సం. 17.475; 2. పాతబడిన చెట్టు. **పాఁతువెదురు** వి. ఒకరకం గడ్డి. (Arundo Donax).

**పాన్పు** చూ. పాను. రూ. పానుపు. వి. 1. పరుపు. కు.సం. 5.148; 2. మంచం. చంద్రాంగ. 6.137.

**పాన్పుటిల్లు (-ఇల్లు)** రూ.చూ. పానుపుటిల్లు. వి. పడకటిల్లు.

పె. శకు. 3.200.

పావ¹ వి. 1. పసిపిల్ల. కు. సం. 10.166 ; 2. ఆడుపిల్ల, కన్యక. భార. అరణ్య. 7.318 ; 3. శిశువు, పిల్లవాడు. ఉ. హరి. 2.14 ; విణ. మృదువు. కాశీ. 5.305.

క. పావ-. చిన్నబిడ్డ ; త. పాల్ ప్పు-. రెక్కలువచ్చిన పిల్ల పక్షి, పక్షిపిల్ల, తాబేలుపిల్ల, కప్ప, బల్లి మొ. నాలుగు కాళ్ళ జంతువుల పిల్లలు, పాలై-. స్త్రీ. పడుచు, కన్య ; మ. పార్ ప్పు-. చిన్నచేపల గుంపు, చిన్నపిల్లచేప ; తొ. పుఫుప్-. చిన్నపిల్ల ; పర్జి. పాప్ బిడ్డ, పాప, జంతువుల పిల్ల ; గ. (ఒల్లా). పాప్-. బిడ్డ. చిన్నపిల్ల, చిన్నది (వస్తువులో). పాపొన్డి-. చిన్న, లేత, పచ్చని (పండ్లు) పె. లేగదూడ. పాప్-.

పావచ్చు వి. పలచగా పెరల్పుగా ఉన్నగిట్ట. <పావ¹ + అచ్చు. పావడు వి. 1. బాలుడు, చిన్నవాడు. భార. విరా. 5.234 ; 2. మగ శిశువు. భాగ. 10పూ. 5.58.

పావ² వి. 1. కంటినల్లగుడ్డులో ప్రతిఫలించే చిన్నబొమ్మ. కు. సం. 9.49 ; 2. రసమట్టంలో కదిలే బిందువు.

క. పాపె, హాపె, ఆకారం, బొమ్మ, కంటిపాప ; తు. పాపె. ప్రతిబింబం, విగ్రహం, కీలుబొమ్మ. బొమ్మ ; త. పావై. కీలుబొమ్మ. బొమ్మ, ప్రతిబింబం, చిత్రపటం, కంటి పాప ; మ. పావ. బొమ్మ, కీలుబొమ్మ.

పావ³ చూ. పాము¹. వి. ఔషధాల్లో ఉపయోగపడే నల్లని పళ్ళు కాసే ఒకరకం చెట్టు (Clerodendron infortunatum).

పావచ్చి వి. బ్రహ్మజెముడు, పావచ్చి కళ్ళి. పావతీగె వి. ఒకరకం తీగ. పావసల్లి వి. దళ్ళు కట్టటానికి ఉపయోగపడే ఒకరకం మొక్క.

పావట¹ చూ. పాయు. రూ. పాపటము, పావడము, పాపిడి¹ వి. 1. కేశవీథి, సీమంతం ; భార. విరా. 1.28 ; 2. గుంటక, దున్నిన భూమిలో మట్టి బెడ్డల్ని పగలగొట్టి చదును చేయటానికి చల్లినవిత్తనాల్ని కప్పటానికి ఉపయోగించే ఇనపముళ్ళచట్రం.

కొలా. ప.ప్-. (వ.ప్త్-). దువ్వటం ; నా. పాప్-. చూ. త. పకు., పయల్.

పావటగోరింక వి. నల్లతల కలిగిన మైనా. పావటచేరు రూ. పావటచేఱు. వి. చేరుచుక్క, పాపటకుసరిగా నుదుట వేలాడే అలంకార విశేషం. పావటచేఱు రూ.చూ. పాపట చేరు. వి. చేరుచుక్క. పాపటకుసరిగా నుదుటవేలాడే అలంకార విశేషం. పావటకోలు వి. పాపటకు ఇచ్చే కూలి. పావటపైవడిదముపెట్టు స. క్రి. చంపుతానని తలపైకత్తిని మోపు. ఉ. హరి. 4.209. పావటపోవు అ. క్రి. దారివిడిచి తొలగు. పావటబొట్టు వి. చేరుచుక్క. పాపటకు సరిగా నుదుట వేలాడే అలంకార విశేషం. ద్వి. సార. చ. 1.256పం. పావటవుచ్చు స. క్రి. దారివిడిచి తొలగించు. రామాభ్యు. 8.165.

పావట² రూ. పాపడి, పాపిడి², పాపిరి, పాపట. వి. వృక ధూమకం, అడవిలో ఉండే పూలు పూసే ఒకరకం చెట్టు. కవిజన. 2.13. (Ixora tomentosa).

క. పావటె, పాపటె-. గిడ ; తు. పావట్టె- ; త. పావట్టై ఒకరకం చెట్టు (Pavetta indica) ; మ. పావట్ట ; తొ. పా. వ్ పెట్ ;

సం. పర్పట-. పాపటచెట్టు.

పావటకొమ్మి వి. అందమైన తెల్లనిపూలు పూసే చిన్న చెట్టు (Pavetta indica). పావటదంతె వి. పైరులో గడ్డి, గాదం కలుపు మొదలైనవి పోవటానికి తోలే పరికరం. పావటాకు రూ. పావడాకు. వి. 1. తీగెకు కణుపులు దగ్గర పుట్టిన తమలపాకు ; 2. ముదురాకు.

పావటము రూ.చూ. పాపట¹. వి. మిరపచేను మొ. వాటిలోని కలుపు పోవటానికి దున్నే సాధన విశేషం.

పావటాకు చూ. పాపట².

పావడము రూ.చూ. పాపట¹. వి. గుంటక, దున్నిన భూమిలోని మట్టిబెడ్డల్ని పగలగొట్టి చదును చేయటానికి, చల్లిన విత్తనాల్ని కప్పటానికి ఉపయోగించే బరువైన ఇనప చట్రం.

పావడాకు రూ.చూ. పావటాకు. వి. 1. తీగెకు కణుపులదగ్గర పుట్టిన తమలపాకు ; 2. ముదురాకు.

పావడి రూ.చూ. పావట². వి. అందమైన తెల్లని పూలుపూసే చిన్నచెట్టు. (Pavetta indica).

పావదమసు రూ.చూ. పదపదమసు. అ.క్రి. నడునడుసను.

పావవము వి. మిరపచేను మొ.వాటిలోని కలుపు పోవటానికి దున్నే సాధన విశేషం.

పావపల్లేరు వి. పల్లేరులో ఒకరకం ముళ్ళ కలుపు మొక్క (Tribulus species).

పావపుమెన చూ. పాము¹. రూ. పావంపుమెన. వి. మల్లబంధ విశేషం. హంస. 1.206.

సం. పాప-. పాపం, చెడ్డ.

పావంపుమెన రూ.చూ. పావపుమెన. వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78.

పావరు¹ వి. ఒక చెట్టు.

హిం. పాపరా. ఒక ఉష్ణప్రదేశపు గుల్మం, గార్డీనియా లాటి పోరిడా అనే చెట్టు ; ఉ. పాపరా.

<ఉ. పాప్రా.

పావరు² వి. దరిద్రుడు, పేదవాడు.

ఇం. Pauper. దరిద్రుడు.

<ఇం. *Pauper.*

పావర్తి వి. నూనె నిచ్చే గింజలు కాసే గట్టి కలప నిచ్చే చెట్టు (Schleichera trijuga).

పావాచి వి. అత్తిపండు ఆకారంలో ఉండి తినతగిన పండు.

పావాసు రూ.చూ. పాయపోసు. వి. చెప్పులు, మచ్చె. ఆం.భా. 2.298.

పావిడి¹ రూ.చూ. పాపట¹. వి. సీమంతం, కేశవీథి.

పావిడి² రూ.చూ. పాపట². వి. 1. అందమైన తెల్లని పూలు పూసే చిన్న చెట్టు ; 2. గట్టి కలపనిచ్చే చెట్టు (Pavetta (indica).

పావిడిబొట్టుచ్చు వి. కుంకుమమీద పాపిడిబొట్టు మాదిరి

చుట్టూ కొట్టటానికి ఉపయోగించే అచ్చు. పాపిడికంప వి. ఆము కాల్చటానికి ఉపయోగించే ఒకరకం కంప. పాపిడి రొడ్డ వి. ఆము కాల్చుకు వాడే ఒకరకం కంప.

పాపిరి రూ.చూ. పాపట². వి. అందమైన తెల్లని పూలు పూసే చిన్న చెట్టు (Pavetta indica).

పాపు¹ చూ. పాయు. స.క్రి. 1. వెడలచేయు, తొలగచేయు. భార ఆది. 6.146 ; 2. విడదీయు, వేరుచేయు, బద్దలు చేయు. భార.ద్రోణ. 2.193 ; 3. ఆకర్షించు, లాగు. భార కర్ణ. 3.316 ; 4. ఎడబావు, దూరంచేయు. భార. శాంతి. 1.66 ; 5. పోగొట్టు, నశింపచేయు. ఉ.హరి. 4.39 ; 6. (నేల విడివడచేయు) దున్ను. జైమినిభా. 8.174 ; 7. పెరిగిన చెట్లనుంచి వేరుతెనగకాయలు కోయించు ; 8. గుంటకతోలి వేరుతెనగచెట్లు పెళ్ళగించు ; 9. లడ్డిలో చిలపలు వేరుచేయు ; 10. పడుగు పోగులు పాయలు పాయలుగా విడదీయు.

పాపులుతీయు స.క్రి. పడుగు పోగులు పాయలు పాయలుగా విడదీయు.

పాపు² వి. క్రైస్తవ జగద్గురువైన పోపు.

పో. పాపా. పోపు ; స్పా. పావా.

<పో. పాపా.

పాపుట రూ.చూ. పాపట². వి. అందమైన తెల్లని పూలు పూసే చిన్న చెట్టు.

పాపెర వి. పక్షి విశేషం. హంస. 3.12.

పాపోసు రూ.చూ. పాయపోసు. వి. ముచ్చె. చెప్పు(లు). రాజ.వి. 3.125.

పాపోసువన్న వి. చందమామ మాదిరి గుండ్రంగా లోపలికి వంపు తిరిగిన కొమ్ము.

పాప్రి వి. సురతిచెక్క, ఒకరకం తీగ, దీని వేరు ఎరుపు ఒకరకం రంగు నిస్తుంది (Ventilago madraspatana).

పాబొలం చూ. పాత.

పామ రూ.చూ. పాగ³. వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్య చెక్క.

పామచివ్వ రూ.చూ. పావచివ్వ. వి. నేత నేసేటప్పుడు పడుగులో అని పోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్య చెక్క. పామతాడు రూ. పావతాడు. వి. హనుగ్రంనూ పావచెక్కనూ కలిపే తాడు.

పామంటి వి. కంచెల్లోనూ, పొదల్లోనూ 3 నుంచి 6 అడుగుల ఎత్తువాకా పెరిగే పచ్చని పూలు పూసే మొక్క (Premna corymbosa).

పామరకూర వి. ఒకరకం కలుపుమొక్క.

పామరము వి. ప్రేమ.

సం. పామర-. అనాగరకుడు.

<సం. పామర- (అర్థవిపరి.).

పామరి వి. అజ్ఞాని. తాళ్ల.సం. 5.126.

సం. పామర-. అజ్ఞుడు.

<సం. పామర-.

పామరితనము వి. అజ్ఞానం. తాళ్ల.సం. 5.136.

పాము¹ వి. 1. సర్పం. భార.ఆది. 2.200 ; 2. రాహు గ్రహం. శృం.నై. 7.108.

క. హావు, హావ్రు. పాము ; కొడ. ప.తుబి ; తు. హావు ; త. పామ్బు- ; మ. పామ్బు ; కో. ప.బ్ ; తొ. పొ.బ్, ఒ.ప్. (పాటల్లో బగడ. సో.వు.) ; పర్జి. బాయ్ ; కొలా. ప.య్ ; నా. పాంప్ ; గ(ఒ). బాయ్ బాయు.

<మూ.ద్రా. *పాప్.

పాముచుక్క వి. ఆశ్లేషానక్షత్రం, పాము ఆకారంలో ఉండే అయిదు చుక్కల వరస. పాముచెలిమి వి. అపాయకర విషయం. పాముచెవులు వి.బ.వ. సూక్ష్మగ్రహణశక్తిగల చెవులు. సింహ.శ. 6. పాముచేప వి. పాములాగా ఉండే మంచినీటి చేప. పాముతో(జెరలాటలాడినట్లు అవ్య. కఠిన మైన పని చేసినట్లు. సానంద. 3.44. పాముతోడిపొత్తు వి. పాముతోటి స్నేహం, ప్రమాదమైంది. తాళ్ల.సం. 5.319. పాముదలగాము (-తలగాము) వి. పాముతలతన్నే పిశాచం. సిం.ద్వా. 8.106. పాముదొంద వి. మంచుకు మాత్రమే పనికి వచ్చే ఒకరకం దొండ. పామునకు జడపిక చూపినట్లు అవ్య. పామును వశం చేసుకొన్నట్లు. ఉ.రా. 2.248. పామునకు తెక్కలువచ్చినట్లు అవ్య. అతిచలాకీగా పనిచేయు. భార. భీష్మ. 1.128. పామునాలుకవా(డు విశే. 1. పామువలె చీలిన రెండు నాలుకలు కలిగినవాడు అంటే అబద్ధాలాడే వాడు ; 2. రెండు మరిగినవాడు. పామునోటవేలిడు అ.క్రి. తానై అపాయం తెచ్చుకొను. ప్రభా. 5.139 పామునోరికడి వి. ప్రమాదం తప్పనిది. తాళ్ల.సం. 102. పామువన్న వి. తిరనికసి. పాముపొట్ట వి. పొట్ట పైకి కనిపించకుండా ఎక్కువ అన్నం తినేవాడు. పాముముగ్గు రూ. పామ్ముగ్గు. వి. మెలికలు తిరిగిన ముగ్గు. పాముముట్టు వి. పాము నాకినట్లు శరీరమంతా వచ్చే పొక్కలు. పాములకు పాలు పోసిన వగిది అవ్య.ప్ర. చెడ్డవారికి చేసిన సహాయంపట్ల ఉపయోగించే పలుకుబడి. ఉషా. 2.47. పాములవారి వి. పెద్దమెడకొంగ. పాములవారిగా(డు వి. పాముల్ని తినే తెల్లని కొంగజాతి పెద్దపక్షి. పాములదిబ్బ వి. పుట్ట. పాముల మెంగ(డు వి. పాములవాడు. క్రీడా. 223. పాములఱే(డు వి. శేషుడు. అచ్చ.భా. 2.26. పాములవా(డు విశే. పాములని పట్టి ఆడించి జీవించేవాడు. అహితుండికుడు. కాశీ. 2.87. పాములవే(టకా(డు వి. గరుత్మంతుడు. అచ్చ.రా.యు. 162. పాములు వి.బ.వ. సుబ్బారాయుడుచీరపైబ చెరుగులో కుట్టిన ఎడుపు నలుపు పోగులు. పాముపేలు వి. చేతి నడిమివేలు. పాముసుడి వి. గంగడోలుమీద పొడుగ్గా ఉండే సుడి. పాము సొర వి. అడవుల్లో పెరిగే రకం అనపకాయ, కాయపేరు మందం, గుజ్జుచేదు, దీన్ని ఎండబెట్టి గుజ్జు తొలిచి పాముల వాళ్ళు నాగస్వరం చేసుకొంటారు. పా(వజగము వి. నాగ లోకం. ఆం.భా. 1.145. పా(వజందెము వేలుపు వి. వినాయ కుడు. పా(వజన్నిగట్టు(-కట్టు) వి. వినాయకుడు. పా(వ జన్నిదము వి. సర్పయజ్ఞోపవీతం. మను. 2.11. పా(వతూపు వి. నాగాస్త్రం. భార.కర్ణ. 3.321. పా(వది వి. ఆహేయం, గరళం. ఆం.భా. 1.148. పా(వపట్టెన వి. పామురూపంలో

ఉంచే పట్టెడ. ద్వి.పరమ.వి. 2.26. పాఁవపాము వి. సర్పశయ్య. రామాభ్యు. 47. పాఁవమీను వి. ఒకజాతి ఆరచేప. పాఁవములికి వి. నాగాస్త్రం. ప్రబంధ. 181. పాఁవమేతపక్కి వి. 1. గరుత్మంతుడు; 2. నెమలి. పాఁవమేపరి వి. 1. గరుత్మంతుడు; 2. నెమలి. పాఁవమేపరిపచ్చ వి. గరుడపచ్చ. యయా. 1.97. పాఁవమేపుడు వి. 1. గరుత్మంతుడు; 2. నెమలి. పాఁవమేపుడుపచ్చ వి. గరుడపచ్చ. పాఁవమేపుడుపులుఁగుకల్లు వి. గరుడమణి. అచ్చ. రా.యు. 64. పాఁవరమ్ము(-అమ్ము) వి. నాగాస్త్రం. భార. కర్ణ. 3.825. పాఁవరాకన్నియ వి. నాగకన్య. నీలా. 2.14. పాఁవరాయఁడు వి. శేషుడు. చిత్రభా. 5.10. పావరాయిక్క(-ఇక్క) వి. పాతాళలోకం, నాగలోకం. అచ్చ.రా.యు. 161. పాఁవరాసెజ్జ వి. శేషశయ్య. మృత్యు. 3.33. పాఁవఱేఁడు వి. శేషుడు, నాగరాజు. భార. శాంతి. 6.610. పాఁవసమకట్లతేజీ వి. గరుత్మంతుడు. ద్వి. పరమ. వి.5.427. పాఁవసెజ్జ వి. గరుత్మంతుడు. శృం.నై. 5.47. పాముగ్గు రూ.చూ. పాముముగ్గు. వి. మెలికలు తిరిగిన ముగ్గు. <పాము[1]+ముగ్గు.

పాము[2] రూ.చూ. ప్రాము. స.క్రి. 1. రుద్దు. రాయు. ద్వి. నల. 4.407; 2. గోలెం తయారీలో బొలికలు పెట్టి నునుపుగా రావటానికి రెండు చేతులలో రుద్దు.

మంద. ప్రెమ్ప్-. రాచు. పూయు.

పాముచెక్క రూ. పావుచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క.

పాముజి రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకొనే ఒకవిధమైన నగ.

పాష్జి రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకొనే ఒకవిధమైన నగ.

పాఁవజగము చూ. పాము[1].

పాఁవజందెముపేలుపు చూ. పాము[1].

పాఁవజన్నిగట్టు చూ. పాము[1].

పాఁవజన్నిదము చూ. పాము[1].

పాఁవతూపు చూ. పాము[1].

పాఁవది చూ. పాము[1].

పాఁవపట్టెడ చూ. పాము[1].

పాఁవపాము చూ. పాము[1].

పాఁవమీను చూ. పాము[1].

పాఁవములికి చూ. పాము[1].

పాఁవమేఁతపక్కి చూ. పాము[1].

పాఁవమేపరి చూ. పాము[1].

పాఁవమేపరిపచ్చ చూ. పాము[1].

పాఁవమేపుడు చూ. పాము[1].

పాఁవమేపుడుపచ్చ చూ. పాము[1].

పాఁవమేపుడు పులుఁగుకల్లు చూ. పాము[1].

పాఁవర[1] వి. గోరుంటి. పిన్నపాపర. వేమ. 2.74.

పాఁవర[2] వి. మత్స్య విశేషం. వేంక. పంచ. 1.294. సిం.ద్వా. 1.221.

పాఁవరబురద వి. త్రివర్ణి.

పాఁవరమ్ము చూ. పాము[1].

పాఁవరాకన్నియ చూ. పాము[1].

పాఁవరాయఁడు చూ. పాము[1].

పాఁవరాయిక్క చూ. పాము[1].

పాఁవరాసెజ్జ చూ పాము[1].

పాఁవఱేఁడు చూ. పాము[1].

పాఁవసమకట్లతేజీ చూ. పాము[1].

పాఁవసెజ్జ చూ. పాము[1].

పాముగ్గు చూ. పాము[1].

పాయ చూ. పాయు. రూ. పాయి[2]. వి. 1. పక్షం. భార. భీష్మ. 1.134; 2. మునుము, వరుస, గుంపు. భార. భీష్మ. 2.5; 3. చీలిక, భాగం, ఖండం. భార. ద్రోణ. 1.365; 4. (ఒకనది నుంచి) విడిపోయిన భాగం సిం.ద్వా. 15; 5 సగభాగం. పారి. 3 32; 6. అవకాశం, తెరపి. కళా. 4.93; 7. ఒక్కసారి పూతపూసే ప్రదేశం; 8. చెట్టుకు వేసే పక్క కొమ్మ; 9. బొద్దు, కప్పు ఎగరకుండా దాని మీద వేసే కట్టె; 10. అచ్చు వళ్ళలో అచ్చుకర్రకు గుది కట్టిన చోట పాయగా చీలిన భాగం; 11. ఒడిలో దెబ్బయ్యేవంతు నూలు; 12. పడిపెట్టి చుట్టిన పట్టు పడుగు; 13. పడుగులో విడదీసిన కొంతభాగం; 14. పడుగునూలులో పాయగా విడదీసిన పోగులు; 15. డిజైను నేతకోసం రంగు అద్దటానికి వాడే పడుగునూలు; 16. రెండున్నర పిడులనూలు; 17. చిటికె పేట కొయ్యలకు తోడిన పోగులు; 18 ఏటినీరు తీసిపోయిన తర్వాత జాలుగా ఏర్పడిన ప్రవాహకాలు; 19. పొరలు పొరలుగా పిడి వచ్చేది; 20. నీళ్ళు తూము వైపుకు పారటానికి పీలుగా ఏర్పాటు చేసిన వాలం; 21. పునాదికై తవ్విన పొడుగాటి గుంట; విశే. విరక్తమైన, విడిపోయిన.

పాయకట్టు వి. 1. ఒక ముఖ్య గ్రామంలో చేరిన ఉప గ్రామాల సమూహం, జనపదం; 2. ఫిర్కా, జిల్లాలో ఒకభాగం; 3. నూలు పాయలకు కట్టిన కట్టు. పాయకట్టు దొరలు వి.బ.వ. పరగణా అధికారులు. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 75. క్రీ.శ. 1592. పాయకొమ్ము వి. పంగల కర్ర మాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము. పాయగొమ్ము(-కొమ్ము) వి. పంగలకొమ్ము. ఉ.హరి. 5.56. పాయత్రోవ వి. తొలగుదావ వంటిది, పాయచేసేది. భాస్క. రా.యు. 1396. పాయదొలఁగు(తొలఁగు) అ.క్రి. దారితొలగు. పారి. 3.10. పాయపాపు స.క్రి. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదీయు. పాయమల రూ. పాయెమల. వి. అచ్చుతికే అనిపోగుల్లో లాకలు దూర్చకుండా చుట్టిన పడుగు నూలు. పాయమొగము వి. పెదమొగం. భార. ఆది. 5.224. పాయయిచ్చు(-ఇచ్చు) అ.క్రి. దారిఇచ్చు. కళా. 4.95. పాయలుకట్టు అ.క్రి. అచ్చుతికినపడుగులో గుదిపాయలనుపట్టి చీలినపడుగుపాయలకు దారాలుకట్టు. పాయలుపాపు రూ. పాయలుబాపు. స.క్రి. పడుగుపోగులు పాయలు పాయలుగా విడదీయు. పాయలుబాపు రూ.చూ. పాయలుపాపు. స.క్రి. పడుగు పోగులు పాయలు పాయలుగా విడదీయు.

పాయలువివ్వు స.క్రి. సరిచేసేటప్పుడు పడుగు పాయల పోగులు నెరపు. పాయవడు(-వడు) అ.క్రి. 1. తొలగు, అపసరిల్లు. భార.భీష్మ. 1.269; 2. దూరమగు. హరి.పూ. 9.74; 3. విడివడు, విడిపోవు. వేంక.పంచ. 1.120; 4. చీలు, విచ్చు. ఆము. 4.8. పాయవఱచు (-వఱచు) స.క్రి. పాయవడచేయు, తొలగ చేయు. భార.ద్రోణ. 5.301. పాయవాఱు(-పాఱు²) అ.క్రి. తొలగు. భార.విరా. 5.61. పాయవిచ్చు అ.క్రి. చీలు. భార.ద్రోణ. 2.68. <పాయ + విచ్చు. పాయవెట్టు(-పెట్టు) స. క్రి. పాయ పడునట్లుచేయు. పండి.చ. 1.78 పు. పాయుల్లి వి. నాలుగైదు చిల్లలు (చిన్న పాయలు) కలిసి ఒకటిగా ఉండే రకం ఉల్లి. <పాయ+ఉల్లి.

పాయఖాం రూ.చూ. పాయిఖానా. వి. మరుగుదొడ్డి, మల విసర్జన చేసే దొడ్డి.

పాయఖానా రూ.చూ. పాయిఖానా. వి. మరుగు దొడ్డి, మల విసర్జన చేసే దొడ్డి.

పాయగారి రూ.చూ. పాయకారి. వి. ఇతరుల భూమిని కౌలుకు తీసుకొని సేద్యం చేసి ఫలసాయంలో కొంత భాగాన్ని మాత్రమే తాను తీసుకొనే తాత్కాలిక వ్యవసాయదారుడు.

పాయగారిసేద్యం రూ.చూ. పాయకారీసేద్యం. వి. 1. సొంతభూమి లేని రైతు ఇతరులభూమిని పాలికి కాని, కౌలుకు కాని సేద్యం చెయ్యటం; 2. అసామి పైగ్రామంలో ఉండి తనభూమిని కౌలుకిచ్చి చేయించే సేద్యం.

పాయగారీ రూ. పాయకారి. వి. ఇతరులభూమిని కౌలుకు తీసుకొని సేద్యంచేసి ఫలసాయంలో కొంత భాగాన్ని తాను తీసుకొనే తాత్కాలిక వ్యవసాయదారుడు.

హిం. పైకార్. డీలరు, వీధులు తిరిగి అమ్మేవాడు, చిల్లరగా అమ్మేవాడు; ఉ. పైకార్. డీలరు, ఏజంటు, దలారి, వస్తువులను అమ్మటానికి తీసుకొని వెళ్ళేవాడు; పార. పా.ఎ-కార్.

క. పయకారి; త. పాయకారి. తాత్కాలిక వ్యవసాయదారుడు.

<ఉ. పైకార్.

పాయగారీసేద్యం రూ. పాయకారిసేద్యం. వి. 1. సొంతభూమి లేని రైతు ఇతరుల భూమిని పాలికి గాని కౌలుకుగాని సేద్యం చెయ్యటం; 2. అసామి పైగ్రామంలో ఉండి తన భూమిని కౌలుకిచ్చి చేయించే సేద్యం.

పాయఖావా రూ.చూ. పాయిఖానా. వి. మరుగుదొడ్డి. మల విసర్జన చేసే తావు.

పాయగిలు చూ. పాయు¹.

పాయద్రట్టు చూ. పాయు¹.

పాయద్రోఁచు చూ. పాయు¹.

పాయవచ్చు రూ.చూ. పాయపోసు. వి. చెప్పు.

పాయపోసు రూ. పాపాసు, పాపోసు, పాయపచ్చు. వి. ముచ్చె, పాదరక్ష, చెప్పు. సాంబ.మాన. 44.

హిం. పాయ్‌పోశ్, పాపోశ్-. పాదరక్షలు; మరా. పాయపోస; ఉ. పాయ్‌పోశ్, పాపోస్; పార. పాయ్‌పోష్-. చెప్పు, పాదరక్ష; పో.చూ.సం. పాద పోష-; ప్రా. పాఅపోస.

<ఉ. పాయ్‌పోశ్.

పాయము వి. 1. ఈడు, వయసు. పద్మ. 1.150; 2. యవ్వనం. శివరా. 2.101.

సం. ప్రాయ-. వయస్సు; ప్రా. ప్రాఇవ, ప్రాయ-; క. హరయ, హరెయ.

<ప్రా. ప్రాయ-.

పాయద్రబ్బు చూ. పాయు¹.

పాయద్రాఱు చూ. పాయు².

పాయద్రెట్టు చూ. పాయు¹.

పాయల్ వి. కాళ్ళగొలుసు.

హిం. పాయల్. పాదాలకు వేసుకొనే ఆభరణం, అసాధారణమైన కాన్పు, కాన్పు సమయంలో పాదాలు ముందు బయట పెట్టి వెలుపలికి వచ్చే బిడ్డ; పం.ఉ. పాయల్. నిలకడ, ఎదురు నిచ్చెన, పాదం యొక్క స్థిరత, పాదాలకు ధరించే ఆభరణం.

<ఉ. పాయల్.

పాయల రూ. పాయిల, పాయిలి, బాయిల, బాయిలి. వి. తెలుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకు మొక్క (Portulaca Sp. Linn).

పాయలాకు వి. గోళికూర తెగలో తుప్పగా పెరిగే కలుపు మొక్క (Portulaca Meridiana).

పాయలాకు చూ. పాయల.

పాయవట్టము వి. కాలి అందె. కృష్ణ నై. 6.44.

సం. పాదపట్టు-, పాదపట్టిక; ప్రా. పాయవట్టు-; క. పాయవట్టు-. బరువందె, కాలిఅందె.

<ప్రా. పాయపట్ట-.

పాయి¹ వి. పాలు, స్తన్యం.

సం. పయస్. పాలు.

పాయి² రూ.చూ. పాయ. వి. 1. అచ్చువళ్ళలో అచ్చు క్రరకు గుదికట్టినచోట పాయగా చీలిన భాగం; 2. ఒడిలో తెల్చుయ్యే పంతు నూలు; 3. పడిపెట్టి చుట్టిన పట్టు పడుగు; 4. పడుగులో విడదీసిన కొంత భాగం; 5. పడుగునూలులో పాయగా విడదీసిన పోగులు; 6. డిజైను నేతకోసం రంగు అద్దటానికి వాడే పడుగునూలు; 7. రెండున్నరపిడుల నూలు; 8. పడుగు పోగుల్లో కొంత భాగం; 9. చిటికె పీటకొయ్యలకు తోడిన పోగులు.

పాయిలెల్లు అ.క్రి. ఆము కాల్వలో ముందు ఉన్న మంట వెనక్కి వ్యాపించు.

పాయిఖావ రూ.చూ. పాయిఖానా. వి. మరుగుదొడ్డి.

పాయిఖావకుండీ వి. లెట్రిన్ దొడ్లకు ఉపయోగించే ఒర.

పాయిఖావగాజు వి. లెట్రిన్ దొడ్లకు ఉపయోగించే ఒర.

పాయిఖావోర రూ. బాయిఖానోర. వి. లెట్రిన్ దొడ్ల కుపయోగించే చిన్నసైజు ఒర.

పాయిఖానా రూ.చూ. పాయిఖానా. వి. మరుగు దొడ్డి.

పాయిఖావోర చూ. పాయిఖాన.

పాయిఖాడా రూ.చూ. పాయిఖానా. వి. దొడ్డి, మరుగుదొడ్డి.

పాయిఖానా రూ. పాయఖాం. పాయకానా, పాయఖానా, పాయికాన, పాయిఖానా, పాయిఖాడా, పైకాన, పైకానా, పైఖాన, పైఖానా, ఫాయిఖాన, ఫాయిఖానా, ఫాయినానా. వి. మరుగుదొడ్డి, మలవిసర్జన చేసే దొడ్డి.

హిం. పాయ్‌ఖానా-. దొడ్డి : పం.ఉ. పా-ఎ-ఖానా-. దొడ్డి, మరుగు చెరదు, ఒక అవసరం ;

క. పాయ్‌ఖానె, పాయఖానె, పాయి-ఖానె ; త. పాయ్‌కానా.

<ఉ. పా-ఎ-ఖానా.

పాయింటు[1] రూ.చూ. పైంటు. వి. నియామకం.

పాయింటు[2] వి. 1. ప్రత్యేకాంశం ; 2. టైపులో పరిమాణ విశేషం ; 3. స్థానం ఉండి పరిమాణం లేని బిందువు ; 4. ఉష్ణోగ్రత మొ. వాటిని సూచించే డిగ్రీల గుర్తు ; 5. పనిముట్ల కొన.

ఇం. *Point*. ఉపరితలంపై ఉన్న చిన్న చుక్క, విరామ చిహ్నం, టైపులో పరిమాణ విశేషం. ఉష్ణోగ్రత మొ. వాటిని సూచించే డిగ్రీలగుర్తు పనిముట్టు. పనిముట్లవాడి కొన, నిర్దిష్టస్థానం.

<ఇం. Point.

పాయిదా రూ.చూ. ఫాయిదా. వి. 1. లాభం, ప్రయోజనం ; 2. ధాన్యరూపంలో ఇచ్చే వడ్డీ.

పాయిమాలి వి. నాశనం.

హిం. పాయ్‌మాలీ. నాశం ; ఉ. పా-. ఎ-. మాలి ; త. పాయ్‌మాలి. వరదవల్ల నాశనమైన భూమి.

<ఉ. పా-. ఎ-. మాలి.

పాయిల రూ.చూ. పాయల. వి. తెలుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకుమొక్క (Portulaca sp. Linna).

పాయిలి రూ.చూ. పాయల. వి. తెనుగు దేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకుమొక్క ( Protalaca sp. Linna).

పాయు[1] అ.క్రి. 1. నశించు, పోవు. భార. ఆది. 2.58 ; 2. విచ్ఛిన్నమగు, ఎడతెగు. భార. ఆది. 5 229 ; 3. అపసరిల్లు, తప్పుకొను. భార. సభా. 2.242 ; 4. విముక్తమగు, విడుపబడు. భార. సభా. 2.261 ; 5. చెడు, భ్రష్టమగు. భార. విరా. 2.70 ; 6. చిన్నమగు, తెగు. భార. ఉద్యో. 4.22 : 7. విరక్తమగు, వేరుపడు. విజ్ఞా. వ్యవ. 146 : 8. (బుణం, అపేక్ష మొ. వి) తీరు. రాఘవ. పీఠి. 10 ; స.క్రి. 1. విడుచు. భార. ఆది. 2.155 ; 2. (దారపుత్రాదుల్ని) ఎడబాయు. భార. అరణ్య. 2.78.

క. పాయ్-. మీదకు ఎగురు, ముందుకుపోవు ; తు. పాయుని-. వ్యాపించు, చెల్లాచెదరగు ; త. పాయ్-. దుముకు, పరుగెత్తు, ఎగురు ; మ. పాయుక-. ద్రోయు, ఎగురు ; గోం. పసి-. బయటికివచ్చు, వెసి ; కుఇ. పాగ-. పైనపడు ; పర్జి. పేప్-. (పేత్-). రెచ్చగొట్టు. చూ. కుఇ. పేన్‌జ-. విడుచు (కర్రలాగ), త. పా. (పా-స్త్-). వేరుచేయు, భాగంచేయు.

పాచివచ్చు స.క్రి. పోగొట్టు. ద్వి. భార. విరా. 4.70వ. పాచు[1] స.క్రి. 1. పాయచేయు, తొలగించు. భార. ఆది. 6.181 ; 2. అప్పుతీర్చు. భార. ఆది. 6.248 ; 3. చిక్కుదలించు, విప్పు. భార. సభా. 1.200 ; 4. పోగొట్టు, నశింపచేయు. భార. విరా. 3.39. త. పాయ్చు ; కొలా. పాప.ప్-. (ప-ప్త్-). దువ్వు ; నా. ప్. పాయగిలు అ.క్రి. తొలగు, జారు. శృం. నై. 8.89. పాయద్రట్టు స.క్రి. తొలగచేయు. శృం. నై. 4.2. <పాయు[1] + -అ[7] + తట్టు. పాయదోలు స. క్రి. వెడలగొట్టు. కళా. 5.31. <పాయు[1] + -అ[7] + తోలు[1]. పాయబట్టు అ.క్రి. పట్టి పాయు, కదచిచను. శివరా. 1.97. <పాయు[1] + -అ[7] + పట్టు. పాయబెట్టు స.క్రి. విడుచు, పరిత్యజించు. భార. ఉద్యో. 1.149. <పాయు[1] + -అ[7] + పెట్టు.

పాయు[2] అ. క్రి. అన్నం మొ. వి కాలాతిక్రమణంచే చెడిపోవు, సారహీనమగు. ఉ. హరి. 5.112.

కొలా. పాస్- చెడిపోవు, కుళ్ళిపోవు, పులిసిపోవు (ఆహారం) ; చూ. త. పళి, పాళ్.

పాయబారు అ.క్రి. పక్వపదార్థాలు కాలాతిక్రమణంచే చెడటానికి ఆరంభించు. పాండు. 3.22.

పాయుల్లి చూ. పాయ.

పాయెమల రూ.చూ. పాయమల. వి. అచ్చుతీసే అనిపోగుల్లో లాకలు దూర్చకుండా చుట్టిన పడుగు నూలు.

పార[1] రూ. పాఱ[1]. వి. 1. తవ్వేసాధనం. తాళ్ల. సం. 5.119 ; 2. కవాలరేకు.

క. పారె, చిన్నతొల్లిక, గడ్డపార ; తు. పారెన్‌గి-. ఇనపగడ్డపార ; త. పారై-. గునపం, గడ్డపార, గడ్డిని కత్తిరించే చిన్న తొల్లిక ; మ. పార-. ఇనపగడ్డపార, తవ్వటానికుపయోగించే కమ్మి ; కో. ప.ర్-. గునపం, గడ్డపార ; తొ. ప.ర్ ; కువి. పార ; కొలా. గడ్డపార-. పార ;

సం. ప్రహార-. ఆఘాతం, దెబ్బ ; ప్రా. పహార-, పహార-. దెబ్బ, తవ్వటం.

పారకలుపు వి. నారుమడిలో తీసే కలుపు. పారకాడు వి. 1. బురదపని చేసేవాడు ; 2. కూలివాడు, పనివాడు, దినభత్యం తీసుకొనేవాడు. పారకోల వి. దాదాపు అడుగున్నర పొడుగు కొయ్యకు చివర రేకుపార అమర్చిన తవ్వ పనిముట్టు. పారచివ్వు[1] వి. తవ్వేపార. పారదమ్ము వి. మెట్టచేలల్లో నాటువేయటానికి ముందు పారతో మట్టిబెళ్ళ సీరు పెట్టటం. పారవాగేలి వి. గరికనేలను దున్నటానికి పారతగిలించి కట్టిన నాగలి.

పార[2] వి. మత్స్యవిశేషం, ఒకజాతిచేప. ప్రబంధ. 195.

తు. పారె-. ఒకరకం సముద్రపుచేప ; త. పారై. పాత్తై-. గుర్రంలాఉండే ఒకరకం సముద్రపుచేప ; మ. పార-. ఒకచేప.

పారహిమ వి. ఒకజాతిచేప.

పార[3] వి. పాలు, భాగం.

ఉ. పారా-. ముక్క ;

త. పారా. ముక్క.

పాల్చెక్క రూ.చూ. పాలచెక్క. వి. నేత నేసేటపుడు, పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు, కాలితో తొక్కే కొయ్యచెక్క.

పాల్తాలికమూకుడు చూ. పాలు[2].

పాల్తి వి. ఆచూకి, జాడ.

హిం. పాల్ థీ, పత్తీ. కాళ్ళు ముడుచుకొని కూర్చోవటం, గొంతు కూర్చోవటం.

<హిం. పాల్ థీ.

పాల్దు వి. పేకాటలోని పరిభాష.

పాల్దొట్టి చూ. పాలు[2].

పాల్దాకి చూ. పాలు[2].

పాల్దారకుండ చూ. పాలు[2].

పాల్నామవాస్య వి. దీపావళి అమావాస్య.

పాల్పడు చూ. పాలు[1].

పాల్పఱచు చూ. పాలు[1].

పాల్మాలిక చూ. పాల్మాలు.

పాల్మాలు రూ.చూ. ప్రాల్మాలు. అ.క్రి. 1. అనపడు, కక్కుర్తిపడు. శుక. 1.446; 2. సోమరితనం పొందు, బద్ధకించు. శుక. 2.363; 3. లొంగు, వశమగు.

పాల్మాలిక రూ.చూ. ప్రాలుమాలిక. వి. సోమరితనం.

పాల్ర రూ.చూ. పాలర. వి. ఉత్తర సర్కారు జిల్లాల్లోని కొండల్లో పెరిగే చిన్నచెట్టు.

పాల్రోజా చూ. పాలు[2].

పాల్వెట్టు చూ. పాలు[1].

పాళ[1] వి. పోక మొ. చెట్లకప్పు దిప్పకో కూడిన పూలగుత్తి. భీమ. 1.96. మను. 3.84.

క. పాళె, పాళి-. పోక, తాడిచెట్ల మొదళ్లలో ఉండే విశాలమైన ఉపపత్రాలు; తు. పాళె, పాలె, పాలెమ్బు-. పోక, తాడిచెట్ల పూలగుత్తిని చుట్టి ఉన్న ఉపపత్రాలు, పోకచెట్టు పట్టతో తయారు చేసిన టోపి; త. పాళై-. తాడిచెట్టు యొక్క పూలగుత్తిని ఆవరించి ఉండే ఉపపత్రాలు; మ. పాళ-. తాడి, పోకచెట్టు కొమ్మయొక్క పట్ట, పాళు-. కొబ్బరి పూలగుత్తి యొక్క ఉపపత్రాలు.

పాళ[2] వి. ధాన్యవిశేషం. ఆము. 1.66.

త. పాళై. ఎర్రగా ఉండే ధాన్యం.

<త. పాళై.

పాళం[1] చూ. పాలు[1]. వి. పడుపు. ఇటుకల్ని తారసరాళ్ళను వాటి మందం మీద పడుకో పెట్టడం.

పాళం[2] రూ.చూ. పాలు[1]. వి. పాలు, భాగం.

పాళగుమ్మడి రూ.చూ. పాలగుమ్మడి. వి. పెరళ్ళలోను, తోటల్లోను పండించే తీగపైరు (Benincasa cerifera).

పాళము[1] రూ. పాళా[1]. వి. (బంగారం మొ.) ముద్ద. పాండు. 4.211.

సం. ఫాల-, పార-. నాగటి కఱుమోపు; ప్రా. ఫాల-. లోహపు కడ్డీ;

క. పాళ-. బంగారం లేక వెండి యొక్క లోహపు కడ్డీ; త. పాళమ్-. కరిగిన లోహం ఆకారాలుగా పోయు; మ. పాళమ్-. బంగారం మొ. వాటి లోహపు కడ్డీ, వాళమ్-. బంగారం కడ్డీ. ఉలికిదెబ్బకొట్టే సుత్తి.

<ప్రా. ఫాల.

పాళము[2] రూ. పళము. వి. 1. సమయం. పారి. 4.16; 2. హద్దు, మేర, అవధి. హరివం. 4.211; 3. విధం; 4. స్థితి.

సం. పాలి-, పాళీ-. మేర, హద్దు; ప్రా. పాలి.

<ప్రా. పాలి.

పాళముమీఱు అ.క్రి. అమితమగు. పాండు. 4.211.

పాళా[1] రూ.చూ. పాళము[1]. వి. బంగారం మొ. వాటి కడ్డీ.

పాళా[2] రూ.చూ. పాలు[1]. వి. పాలు, భాగం.

పాళాలు వి.బ.వ. చన్నీళ్ళుకలిపి స్నానానికి అనువుగా చేసిన వేడినీళ్ళు.

పాళాస్త్రి రూ.చూ. పాలాస్త్రి. వి. అచ్చుపెంకు, చదరపు పెంకు, నల్చదరంగా పలకగా ఉండే పెంకు.

పాళాస్త్రిబిళ్ల వి. ఇంటికప్పులోపలి భాగంలో రాపర్ల మీద పరచడానికి నల్చదరంగా పల్చగా ఉండే పెంకు.

పాళి[1] రూ.చూ. పాళియ. వి. 1. జాదమూసే పలక. శృం.నై. 8.132, చమ. 1.93; 2. సారెలపోత. హ.న. 3.17; 3. ధాన్యం పోసుకొనే జాడి తయారీలో దిమ్మెమీది పైభాగం.

పాళి[2] రూ. పాలి[2]. వి. 1. గుంజలకు దీర్ఘచతురస్రాకారంలో తొలిచిన రంధ్రం; 2. గట్టునమ్మెటలో గట్టును దూర్చటానికి అనువుగా తొలిచిన గుంట; 3. చెక్కిన రాతి కూసాల పైభాగంలో చదునుగా ఉన్న భాగం.

పాళి[3] వి. 1. పదునుగల అంచు, కొన; 2. పేనాముక్కు.

పాళిద్వారం రూ.చూ. పాలిద్వారం. వి. సింహద్వారానికి ఎదురుగా ఇంట్లో ఉండే దర్వాజా.

పాళియ రూ. పళ్లెం, పళ్లెము[2], పళ్లెరము, పళ్ళము, పళ్లియము, పళ్లియరము, పళ్ళెము, పళ్ళెరము, పాళి[1], పాళె[2], పాశె. వి. 1. పాత్రం, పళ్ళెం. కు.సం. 8.112; 2. జాదమూసే పలక.

తు. పల్లయి-. మట్టిసంచం; త.మ. పళ్ళియమ్;

సం. పాలికా. కుండ; ప్రా. పాలియా-. కుండ;

అ.మా. పల్ల-. గుండ్రని పాత్ర. కంచం.

పాళెము రూ.చూ. పాలెము. వి. దండువిడిచేచోటు, సేనావేశం.

పాళె[1] వి. 1. కొయ్యకు సహజంగా ఉన్న పాయ; 2. ఇటుకను అడ్డంగా పేర్చిన పేర్పు.

పాళెఅతుకు అ.క్రి. రెండు చెక్కలను నిలువుగా అతుకు. పాళ్ళెబిగింపు వి. రెండు కొయ్యలను నమంగా అతికనిక.

పాళె[2] రూ.చూ. పాళియ. వి. 1 పాత్ర, పళ్ళెం; 2. జాదమూసే పలక; 3. జాదం.

పాళె[3] వి. మల్లయుద్ధ విశేషం. భాగ. 10పూ. 1231.

త. పాడి, యుద్ధం, పోట్లాట.

పాళె[4] వి. కాలనియమం.

పాళెజ్వరము మి.వి. కాలనియమాన్ని బట్టి తగులుతూ

పిదుస్తూ ఉండే జ్వరం.

పాళి[5] వి. రాసే జనపకలం మొన.

పాళె రూ.చూ. పాళియ. వి. జూదమాడే పలక. అం.రా. 2.305.

పాళెగా(డు చూ. పాళెము.

పాళెపట్టు చూ. పాళెము.

పాళెము రూ.చూ. పాలెము. వి. 1. రాజగృహం, దివాణం. హర. 5.9; 2. చిన్నపట్టణం. పల్లె. క్రీడా. 6.8; 3. చోటు. వాసస్థానం. భాగ. 10 పూ. 962; 4. పట్టణం, పురం. పారి. 2.71; 5. దండు, సేన. నరస. 3.12; 6. సేనానివేశం, దండువిడిది చేసిన చోటు. కువ.చ. 2.107; 7. దేశం. హంస. 1.52; 8. పాళెగాని పట్టణం; 9. కావలి, కాపు.

పాళెగా(డు రూ.చూ. పాలియగాడు. వి. దొర, ప్రభువు. సేనాపతి. చంద్రరే. 2.8. పాళెపట్టు రూ. పాళెముపట్టు. వి. దండు నివసించే చోటు. నివాసం. మల్ల. నీతి. 81. పాళెముడిగు అ.క్రి. దండువిడియు. ఉ.రా. 4.47. పాళెముండు అ.క్రి. 1. విడిసి ఉండు. భీమ. 1.31; 2. కాపుండు. కాశీ. 1.35. <పాళెము + ఉండు. పాళెము పట్టు రూ.చూ. పాళెపట్టు. వి. పాళెగాని రాజ్యం. దండు నివసించే చోటు, నివాసం. ఉ.రా. 4.109. పాళెమువెడలు అ.క్రి. జైత్రయాత్రకు బయలుదేరు. బహులా. 2.13. పాళెంబుడిగ్గు అ.క్రి. దండువిడియు. వర.రా. బాల. 20ప. 7 పం. పాళెంబువిడియు అ.క్రి. దండువిడియు. ఉ.రా. 4.146.

పాళెంబుడిగ్గు చూ. పాళెము.

పాళెంబువిడియు చూ. పాళెము.

పాళ్ళబిగింపు చూ. పాళి[1].

పావ[1] రూ.చూ. పాగ[3]. వి. కొయ్య పాదుక. నృసింహ. 184.

పావకర్ర వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికిలాగే కర్ర. పావకోడికర్ర వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను కిందికి లాగే కర్ర. పావకోడు రూ.చూ. పావుకోడు. వి. పాదుక. పారి. 104, సాంబ. మాన. 44. పావగుది వి. హనుగర్రనూ, పావుచెక్కనూ కలిపేదారు. పావచిప్ప రూ. పాముచిప్ప, పావసిప్ప, పావాచిప్ప. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. పావచిప్పగుది రూ. పావసిప్పగుది. వి. హనుగర్రనూ పావుచెక్కనూ కలిపేదారు. పావచిప్పలకొయ్య వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు పాతిన కొయ్య. పావచిప్పలగజెం రూ. పావసిప్పలగజెం. వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల. పావదారు రూ.చూ. పాముదారు. వి. హనుగర్రనూ, పావుచెక్కనూ కలిపేదారు. పావమేకు వి. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య. పావలకర్ర వి. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల. పావలకొయ్య రూ. పావాలకొయ్య. వి. మగ్గంగుంటలో పావుచెక్కల బిగింపుకు పాతినకొయ్య. పావచిప్ప రూ.చూ. పావచిప్ప. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితోతొక్కే కొయ్యచెక్క. పావపిప్పగుది రూ.చూ. పావచిప్పగుది. వి. హనుకర్రనూ పావుచెక్కనూ కలిపేదారు. పావపిప్పలగజెం రూ.చూ. పావచిప్పలగజెం. వి. మగ్గం గుంటలో పావుచెక్కల బిగింపుకు వేసిన అడ్డపల్ల.

పావ[2] వి. కుండలు పేర్చడానికి ఆము గోడ వెనక ఏటవాలుగా ఉండే చదునునేల.

పావంచ రూ. పావంచా. 1. మెట్టు. ఎక్కడానికి, దిగడానికి వీలుగా కట్టిన నిర్మాణం; 2. నడవా, సింహద్వారానికి ముందు అరుగుల మధ్యగా ఉన్న నడిచేదారి.

ఒ. పావంచ. మెట్టు, సోపానం.

<ఒ. పావంచ.

పావంచకర్ర వి. పంచకు నాలుగువైపులా వేసేవాసం.

పావంచా రూ.చూ. పావంచ. వి. 1. పంచ, ఇంటిముందున్న కప్పువేసిన అరుగు; 2. మెట్టు.

పావటీలు వి.బహు. మెట్లు, సోపానాలు.

క. పావటిగె. మెట్టు;

మరా. పావకా. మెట్టు, నిచ్చెన.

పావడ[1] రూ.చూ. పావడము[1]. వి. 1. వస్త్రం. గుడ్డ. భీమ. 5.110; 2. ధౌతవస్త్రం. వరాహ. 9.139; 3. స్త్రీలు కట్టుకొనే వస్త్రవిశేషం, అంగవస్త్రం, గాగరా. ఆము. 5 143; 4. ఒకవిధమైన మురళి. ఇందు. 5.107.

పావడ[2]. రూ.చూ. పాగడము[1]. వి. పాదభూషావిశేషం. రాజ వా. 2.54.

పావడము[1] రూ. పాగడము[2], పావడ[1], పావడా[1], పావుడ. వి. వస్త్రం. భార. విరా. 3.74.

సం. పావృతి-. కప్పుకునేది, వస్త్రం; ప్రా. పాఉద-. స్త్రీలుకట్టుకొనే వస్త్రవిశేషం; అ. మా. పాఉడ- వస్త్రం; పా. పాపురణం;

క. పాగుడ, పావడ, పావుడ. గాగరా; త. పావడై, పావడు; మ. పావడు, పావాడ.

<ప్రా. పాఉడ-.

పావడము[2] రూ. పవాడము[2]. వి. కానుక, ఉపద. భీమ. 1.117.

సం. ప్రాభృత-. ఉపహారం, నివేదనం; ప్రా. పాహుడ-. ఉపహారం, కానుక :

క. పావడ, పావుడ. పాగుడ. కానుక; త. పాకుడుమ్. కప్పం.

<ప్రా. పాహుడ-

పావడముచేయు స.క్రి. కానుకగాఇచ్చు. బహూకరించు, హర. 6.15

పావడా[1] రూ.చూ. పాగడము[1]. వి. కాలిఅందె.

పావడా[2] రూ పాగడా[2], పావుడా. పొడా. వి. తమ్మెసారిన విశేషం, సెలగపార.

పావతి రూ.చూ. పావటి. వి. 1 బట్వాడా; 2. చెల్లు.

పావటి రూ. పావతి, పావుతి. వి. చెల్లుచీటి, రసీదు.

ఉ. పాఓతి. రసీదు ;

త. పావతి. రసీదు.

<ఉ. పాటి.

పావర వి. అడుగు, పాదం. ఇందు. 2.123.

క. పావల, పాదం.

పావలా రూ.చూ. పావులా. వి. రూపాయలో నాల్గోభాగం.

పావలి వి. తెనుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకుమొక్క (Portulaca specise).

పావశము వి. పక్షివిశేషం, ఒకానొకపక్షి. యయా. 2.24.

పావసం వి. పాయసం.

సం. పాయస-. పాలతోచేయబడిన; ప్రా. పాయస-. పాలు, క్షీరాన్నం; పా. పాయాస-. క్షీరాన్నం; అ. పాహ.

<సం. పాయస-.

పావా రూ.చూ. పాగ³. వి. కొయ్యపాదరక్ష. కాశీ. 7.40.

పావాచివ్వ రూ.చూ. పావచివ్వ. వి. నేత నేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కేకొయ్య చెక్క.

పావాడము రూ. పవాడము². వి. ఒకకార్యం నెరవేరటానికి దేవుని ప్రార్థించుకొని ఆప్రార్థన నెరవేరక దేవునిఎదుట చేసే జిహ్వాచ్ఛేదనాది సాహసకృత్యం.

త. పావాటమ్. దేవతముందు నాలుక కోసుకొంటానని చేసేశపథం.

పావాలకొయ్య రూ.చూ. పావలకొయ్య. వి. మగ్గంగుంటలో పావుచెక్కలు బిగింపుకుపాతిన కొయ్య.

పావి వి. పాపాత్ముడు, పాపి. పరమ. 2.176.

సం. పాపిన్. పాపాత్ముడు; ప్రా. పావి, పావ. పాపం-, పాపకృత్యం, పాహ. పాపి, పాపిష్ఠ-. అత్యంత పాపి;

క. పాయి. పాపి; త. పావి; మ. పావం; కుఇ. పాపా; కువి. పాపామి.

<ప్రా. పావి.

పావిడి వి. ఏటిలో నీటిపాయ.

పావిలి వి. చిన్నజాతిగోళి. కూర, విచిల్లి. చి. 2; ఆం. భా. 2.74 (Portulaca Quadrifida).

త. పావిరి. ఒకరకమైన తీగమొక్క.

పావు రూ. బావు. వి. 1. వరహాలో నాల్గవభాగం. ఆం. భా. 2.273; 2. సేరులో నాలుగోభాగం; 3. నాలుగోభాగం; 4. చౌక, నవా; 5. పావలా; 6. ధాన్యపుకొలత, 3/8 సేరు; 7. రంగుకొలుచుకునే చిన్నపాత్ర; 8. దాతిపై బద్దలను బిగించివాటిమధ్య దోర్లించి కట్టినచివ్వ.

సం. పాద-. కాలు; ప్రా. పాఅ, పాఅ-; అ.మా. పాఅ, పాయ; పా. పాద, నాల్గవవంతు;

క. పాగ, పాయ, పావ, పావు. నాలుగోవంతు; తు. పావు.

<ప్రా. పాఅ.

పావుకుండ వి. పావుసేరు బియ్యం ఉడికే మట్టిపాత్ర.

పావుకోడు రూ. పాకోడు, పాగోడు, పాంకోడు, పావకోడు. వి. 1. పాదుక. పల్నా. వ. 17; 2. పావుచెక్కనుతొక్కినప్పుడు అచ్చుకర్రను క్రిందికి లాగేకర్ర. త. పావకోల్.

పావుకోడుచెక్క రూ. పాకోడుచెక్క, పాగోడుచెక్క పాంకోడుచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కేకొయ్య చెక్క. పావుగుజ్జు వి. ఇంటిముందు పంచఉన్నప్పుడు ఇంటిదూలం మీదవేసేపొట్టగుజ్జు. పావుచట్టం రూ.చూ. పావుసట్టం వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను క్రిందికిలాగే కర్ర. పావుచెక్క రూ.చూ. పాముచెక్క. వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కేకొయ్యచెక్క. పావుచెక్కతాడు వి. హనుగర్రనూ, పావుచెక్కనూ కలిపేతాడు. పావుచెక్కతొక్కు రూ. చూ. పాకచెక్కతొక్కు. అ.క్రి. పాలచెక్కతొక్కు, పడుగుపోగులు కొన్నిపైకి కొన్నికిందికి వచ్చి అనిపోగులు వెడలటానికి పావుచెక్కను కాలితోతొక్కు. పావుచెక్కదారం వి. హనుగర్రనూ పావుచెక్కనూ కలిపేతాడు. పావుచెక్కలగూటం రూ.చూ.పాగాచెక్కలగూటం. వి. పాలచెక్కలగూటం, మగ్గంగుంటలో పావుచెక్కలబిగింపుకు పాతినకొయ్య. పావుచెక్కలతాడు వి. పావు చెక్కల్నిగూటానికి బిగించే పెనతాడు. పావుదెక్క రూ. పావుదెక్క. వి. పల్చగా వెడల్పుగా ఉన్న గిట్ట. పావుదెక్క రూ. చూ. పావదెక్క. వి పల్చగా వెడల్పుగా ఉన్న గిట్ట. పావుశేరుకుండ వి. పావుశేరు బియ్యం ఉడికేకుండ. పావుపట్టం రూ. పావుచట్టం. వి. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చుకర్రను క్రిందికి లాగేకర్ర.

పావుచేయు స.క్రి. అముపడుగును ఎత్తుపల్లాలు లేకుండా చదరంగా చేయు.

పావుంజీ రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకొనే ఒక విధమైన నగ.

పావుడ రూ.చూ. పావడము¹. వి. పరికిణి.

పావుడా రూ. పావడా². వి. పార, తవ్వటానికి పనికివచ్చే సాధనం.

పావుతి రూ.చూ. పావతి. వి. రైతు చెల్లించిన శిస్తురశీదు పుస్తకం.

పావుపావు వి. మల్లబంధ విశేషం. ప్రబంధ. 78.

పావురపు(బలుకు చూ. పావురము.

పావురము రూ.చూ. పారువము. వి. పక్షివిశేషం, కపోతం. అము. 2.46.

పావురపు(బలుకు(-పలుకు) రూ.చూ. పావురాపలుకు. వి. మణితం.

పావురాపలుకు చూ. పావురాయి.

పావురాయి రూ.చూ. పారువము. వి. పారావతం, పావురం. హంస. 3.13.

పావురాపలుకు రూ. పావురపు(బలుకు. వి. మణితం. ఆం.భా. 2.180. పావురాయిరంగు వి. ఒకరకం బూడిదరంగు. పావురాలంచు(-అంచు³) వి. పావురం ఆకారంలో డిజైనుపెట్టి నేసిన అంచు.

పావురాలంచు చూ. పావురాయి.

పావులా రూ. పావలా. వి. 1. రూపాయిలో నాలుగోవంతు; 2. తొమ్మిది అంగుళాలు.

సం. పాద-, ప్రా. పాఅ ; ఒ. పాఅ. నాలుగోవంతు : హిం. పావ్-. నాలుగోవంతు ; గు. పావ-. నాలుగో భాగం, పావలి, పావలో, పావలం. రూపాయిలో నాలుగోవంతు ; మరా. పావ్. నాల్గోవంతు ; పావలా-. నాల్గణాల నాణెం ;

క. పావల్.

<మరా. పావలా.

పాఠ్డి వి. నేతనేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క.

పాశముచేయు స.క్రి. చదునుచేయు.

సం. పాశ-. వరుణుని శస్త్రం, బ్రహ్మశస్త్రం.

<సం. పాశ-+-ము+చేయు.

పాశి రూ.చూ. ప్రాచి. వి. 1. నన్నని ఆకులుగల ఆకుపచ్చని జిగురుతీగ ; 2. తడుపవల్ల ఆకుపచ్చని మైల ; 3. ఉదయాన ఊడ్చే కసవు.

పాశ్చా రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాశ్చావు రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

పాషాణాలు వి.బ.వ. విరేచనాలు.

సం. పాషాణ-. రాయి, శిల.

<సం. పాషాణ-+ము+-లు (అర్థవిపరి.).

పాస రూ.చూ. పోంచ. వి. పడుకు కట్టకు కట్టిన నార.

పాసంగు వి. కాలిధాన్య విశేషం.

క. పాసగి.

పాసవము రూ.చూ. పాచనము. వి. విరేచనం.

పాసము రూ.చూ. పాసెము. వి. క్షీరాన్నం. కవిసంశ. 84.

పాసలా రూ.చూ. ఫాసలా. వి. రెండు ప్రాంతాలమధ్య ఉండే చోటు, దూరం.

పాచి[1] రూ.చూ. ప్రాంచి. వి. 1. నన్నని ఆకులుగల ఆకుపచ్చని జిగురుతీగ, నాచు ; 2. తడుపువల్లవచ్చే ఆకుపచ్చని మైల ; 3. ఉదయాన ఊడ్చే కసవు.

పాచిరంగు రూ.చూ. పాచిరంగు. వి. పచ్చిపెసరరంగు.

పాచి[2] వి. సిలువ.

పాచిక రూ. పాచిక. వి. జూదగాళ్ళు చేతుల్తో పట్టి దొర్లించే ద్యూత సాధన విశేషం, అక్షం. పండి.వ. పురా. 125 ప.

సం. పాశ-, పాచిక, పాశక-; ప్రా. పాసక-, పాసగ-; అ.మా. పాసక- :

క. పాసగె. పాచిక.

<ప్రా. పాసక-.

పాచకము వి. పాయసం.

సం. పాచక-. భుక్తాన్నాన్ని జీర్ణం చేసేది. అగ్ని.

<సం. పాచక-.

పాపిక వి. ముడి తగిలించే పలుపు భాగం.

సం. పాశక-. తాడు.

<సం. పాశక-.

పాసింజరు వి. 1. బాటసారి, ప్రయాణికుడు ; 2. ఎక్కువచోట్ల ఆగుతూ వెళ్ళే ప్రయాణికుల బస్సు లేదా రైలు.

ఇం. *Passenger*. బాటసారి.

<ఇం. Passenger.

పాసీగరు రూ.చూ. ఫాసీగరు. వి. గొంతు పిసికి చంపడం అనే ఒక నేరం.

పాసీగర్లు వి.బ.వ. హంతకులు, గొంతులు కోసేవారు, గజదొంగలు.

పాసీగర్లు చూ. పాసీగరు.

పాసు[1] వి. 1. పిసినిగొట్టు ; 2. ఏపు, శక్తి.

పాసుది వి. 1. లోభి ; 2. తక్కువజాతి స్త్రీ.

పాసు[2] వి. ఉత్తీర్ణత.

ఇం. *Pass*. ఉత్తీర్ణత.

<ఇం. Pass.

పాసు[3] రూ.చూ. ప్రాంచి. వి. పాచి.

పాసుట్టు వి. ఇంటికి పట్టే బూజు.

పాసెటు రూ.చూ. ప్రాంచి. వి. 1. నన్నని ఆకులుగల ఆకుపచ్చని జిగురు తీగ ; 2. తడుపువల్ల వచ్చే ఆకుపచ్చని మైల ; 3. ఉదయాన ఊడ్చే కసవు.

పాసెపుకాడు వి. చిన్నచిన్న ముక్కుండే అలం.

పాసెము రూ. పాసము. వి. క్షీరాన్నం. జైమినిభా. 6.82.

సం. పాయస-. పరమాన్నం ; ప్రా. పాయస-.

<ప్రా పాస-.

పాస్క రూ.చూ. పస్కా. వి. ఐగుప్త చక్రవర్తుల దాస్యంనుండి విముక్తులయి ఇశ్రాయేలీయులు తరలివచ్చిన ముహూర్త సంస్మరణార్థం చేసే ఏడురోజుల పండుగ. మేష సంక్రాంతి పౌర్ణిమ మొదలు వరసగా ఏడురోజులీ పండుగ జరుగుతుంది.

పాస్కా రూ.చూ. పస్కా. వి. ఐగుప్తచక్రవర్తుల దాస్యంనుండి విముక్తులై ఇశ్రాయేలీయులు తరలివచ్చిన ముహూర్త సంస్మరణార్థం చేసే ఏడురోజుల పండుగ. మేష సంక్రాంతి పౌర్ణిమ మొదలు వరసగా ఏడురోజులీ పండుగ జరుగుతుంది.

పాన్ప వి. రెండు నొగలబండి నొగలను వెనక వైపున బంధించిన కర్ర.

పాస్పతులు వి.బ.వ. పాశుపతులు. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 3.34. క్రీ.శ. 1251.

సం. పాశుపత-. శివభక్తుడు.

<సం. పాశుపత-+-లు.

పాహరా రూ.చూ. పహరా. వి. 1. అధీనం ; 2. తోడు, సాయం ; 3. కాపరం.

పికపికలు రూ. పికాపికలు, వకవకలు, పగావకలు. వి.బ.వ. చెల్లాచెదరు. నిర్వ.రా. 4.57.

పికరు[1] రూ. పికిరి. వి. జాడ.

హిం.ఉ. ఫ్రిక్. చింత, ఆలోచన, ధ్యానం, యత్నం.

<ఉ. ఫ్రిక్.

పికరు[2] రూ.చూ. పిక్కరు. వి. దాటిగొలును బద్దకు బిగించిన కొయ్యముక్క.

పికాపికలు రూ.చూ. పికపికలు. విణ. 1. మిక్కిలి కలిగిన, చెల్లాచెదరు. హర. 3.10. వరాహ. 4.154 ; 2. పికాపికలు చేసే, చెదరగొట్టే. కవిక. 3.229 ; క్రి.విణ. నిండుగా.

**పికాశి** రూ.చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులో నుంచి మరొక పొరుగులోకి నెట్టడానికి, వచ్చిన నాడెను పొరుగులో నిలపడానికి అమర్చిన కొయ్య.

**పికాస్** రూ.చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులో నుంచి మరొక పొరుగులోకి నెట్టటానికి పొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య.

**పికాస** రూ.చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులో నుంచి మరొక పొరుగులోకి నెట్టటానికి, పొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య.

**పికాసా** రూ.చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులోనుంచి మరొక పొరుగులోకి నెట్టటానికి, పొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య.

**పికాసి** రూ. పికాశి, పికాస్, పికాస, పికాసా, పికాసు, పిక్కాశి, పిక్కాస, పిక్కాసి, పిరకాసి, పిరకాసు, పిరాకాసి. **1.** మరమగ్గం నాడెను ఒక పొరుగులోనుంచి మరొక పొరుగులోకి నెట్టటానికి, పొరుగులోకివచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య; **2.** ఒకవైపు సూదిలాగా, రెండోవైపు వెడల్పుగా పలుగులున్న పనిముట్టు, నేలల్లో గడ్డిపెళ్ళలు కొట్టటానికి గట్లు పొయ్యటానికి పనికొస్తుంది.

ఇం. *Pickaxe.* గునపం;

క. పికాసి. గునపం.

< ఇం. Pickaxe.

**పికాసికాడు** వి. మగ్గం పికాసికి బొమ్మకూ కట్టినదారం. **పికాసిదారం** వి. మగ్గం పికాసికి బొమ్మకూ కట్టినదారం. **పికాసిపార** వి. గట్టినేల తవ్వడానికి వాడే పరికరం. **పికాసిపలక** వి. మరమగ్గం పొరుగులో, పికాసి దారపు రీలుకు దూర్చిన ఇనపపల్ల.

**పికాసు** రూ.చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులో నుంచి మరొక పొరుగులోకి నెట్టటానికి, పొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య.

**పికిరి** మా.చూ. పికరు[1]. వి. జాడ.

**పికిలి** రూ.చూ. పికిలి[1]. వి. **1.** పక్షి విశేషం. హంస. **3.12;** **2.** పికిలిపిట్టల తూలికల్తో చేసిన కుంచె. దశా. 8.68.

**పికిలిగాడు** వి. తురక పికిలిపిట్ట. **పికిలిగువ్వ** వి. తురక పికిలిపిట్ట. **పికిలిచెండు** వి. పికిలిపిట్ట యొక్క వన్నెని ఈకల్తో బంతి ఆకారంలో చేసిన కుచ్చు. రసిక. 1.116. **పికిలిపిట్ట** రూ.చూ. పిగిలిపిట్ట. వి. తురక పికిలిపిట్ట. **పికిలిపువ్వు** రూ.చూ. పికిలిపూ. వి. పికిలిపిట్టతోక కింద రెక్క. **పికిలిపూ** రూ. పికిలిపువ్వు. వి. పికిలిపిట్ట తోకకింద ఎర్రని మృదువైన తూలిక. రామాభ్యు. 2.5. **పికిలిపూవలు** వి.బ.వ. ఒకవిధమైన పూసలు.

**పికులు** రూ. పిగులు, పివులు, పీలు. అ.క్రి. **1.** పగులు. బద్దలగు. వేంక. పంచ. 1.750; **2.** (వస్త్రం మొ. బిగువ అవ్వటంతో) చిరుగు. పారి. 3.31; **3.** గుడ్డునుండి పిల్ల బయటపడు; **4.** మాట వెలువడు.

క. పిక్కు. వేరుచేయు, పిలికు-. పేలిపోవు. పగులు; త. పిళ్, పిళ్ల (పిళ్ప్- పిట్- ట్-). పేలిపోవు, పిళ్. కలవకుండా ఉండు; మ. పిక్కుక (పిచ్చ్-). ముక్కలుగా పగులు, పిళరుక. పేలిపోవు; గోం. పిన్క్; పగిలిపోవు; కుఇ. పిన్జ(పిన్జి-). ముక్కలుగా పగులు. పర్జి. పిల్. పగులు; కొం. గద. పిలిపెన్. పగులు.

< మూ.ద్రా. *పిళ్- ఇల్-/ *పిగ్- ఇగ్-/ *పిగ్- ఇళ్-.

**పిక్క[1]** వి. జంఘ, పిక్కతొడ. భీమ. 2.55.

కొం. పికకాత; కోలా. పిక్క. కాలిపిక్క; గ. పిక;

సం. పిండికా. జంఘ, పిక్కతొడ.

**పిక్కటిల్లు** వి. ఎక్కువగా కూడినది. **పిక్కపాశము** వి. పొంటిపిక్క. **పిక్కబలము-జూ(పు(-చూపు)** అ.క్రి. పరిగెత్తిపోవు. **పిక్కరి** వి. పిక్కలు గలవాడు, ధూర్తుడు. < పిక్క[1] +- అరి **పిక్కలు** వి.బ.వ. **1.** పిర్రలు. **2.** జంఘలు.

**పిక్క[2]** వి. ఒకానొక చెట్టు. కు.సం. 5.137.

**పిక్క[3]** రూ. పిక్క, పిక్కు[4]. వి. **1.** గింజ, చింతగింజ; **2.** మామిడిపండులోని టెంక; **3.** మొలక; **4.** పిరికి. **5.** ఒకటి, మూడు మొదలైన బేసిసంఖ్య; **6.** చిన్నగోళీ; **7.** కట్టుబడిలో పనికిరాని చిన్న రాతిముక్క; **8.** చిన్ననాణెం.

తు. పిచ్చి. గింజ, ముఖ్యంగా జీడిగింజ.

**పిక్కచెదరు** అ.క్రి. భయపడు, బెదరు. పాండు. 3.89; వి. భయం, బెదరు. రంగా.చ. 1.102. **పిక్కండ్లు** వి.బ.వ. పిక్కలు. **పిక్కలగంజి** వి. చింతగింజలు పిండిగొట్టి, ఉడక బెట్టి తీసిన గంజి.

**పిక్కటము** వి. తగువు. కవిరాజ. 5.115.

**పిక్కటిలు** రూ.చూ. పిక్కటిల్లు. అ.క్రి. **1.** వర్ధిల్లు, పెరుగు. నిర్వ.రా. 10; **2.** వ్యాపించు, ప్రసరించు. భార. భీష్మ. 1.292; **3.** నిండు, పూర్ణమగు. భార. మహా. 27; **4.** బీటలువారు, బద్దలగు. భీమ. 4.198; **5.** అతిశయించు. విజృంభించు. భాగ. 6.60; **6.** పగులు, చినుగు. రసిక. 3.47; **7.** ప్రకటితమగు, బయలు మెరయు. అచ్చ.రా. బాల. 24.

**పిక్కటిల్లు** రూ. పిక్కటిలు. అ.క్రి. **1.** వ్యాపించు. కు.సం. 8.117; **2.** అతిశయించు, భార. శాంతి. 5.142; **3.** బీటలువారు, బద్దలగు. శృం.నై. 2.44; **4.** నిండు. విష్ణు. 8.79; **5.** వర్ధిల్లు. సురా. 49; **6.** పగులు, చినుగు. రాధా. 3.1.8; **7.** ప్రకటితమగు, బయలుమెరయు.

**పిక్కర** చూ. పికాసి. వి. మరమగ్గం నాడెను ఒక పొరుగులో నుంచి మరొకపొరుగులోకి నెట్టటానికి, పొరుగులోకి వచ్చిన నాడెను నింపటానికి అమర్చిన కొయ్య గిలక.

**పిక్కరదారం** వి. మగ్గం పికాసికి బొమ్మకూ కట్టిన దారం. **పిక్కరవార** వి. మరమగ్గం బొమ్మకూ పికాసి పిక్కరకి కట్టిన తోలుపట్టీ.

**పిక్కరు** మా. పికరు[2], పిగరు. వి. దారిగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క.

ఇం. *Picker.* పట్టుకునేది.

< ఇం. Picker.

**పిక్కరువా** చూ. పికరు[1]. విశే. సంవత్సరానికో మూడేళ్ళకో ఒక

సారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశ చరిత్రను, ఆచార వ్యవహారాలను, గోత్రాల పేర్లను చెప్పేవాడు.

**పిక్కర్లు** చూ. పికరు[1]. వి.బ.వ. సంవత్సరానికో మూడేళ్ళకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశ చరిత్రనూ, ఆచార వ్యవహారాలను, గోత్రాల పేర్లను చెప్పేవాళ్ళు.

**పిర్కా** రూ.చూ. ఫిర్కా. వి. తాలూకాలోని కొంతభాగం.

**పిక్కారు** వి. దాళువా, శరద్ఋతువు మొదలుకొని నీటి ఆసరాతో పండే పల్లపు పంట.

త. పిన్నై. వెనక.

**పిక్కాని** రూ.చూ. పికాని వి. గట్టినేల తవ్వటానికి వాడే పరికరం.

**పిక్కాన** రూ.చూ. పికాని. వి. గట్టినేల తవ్వటానికి వాడే పరికరం.

**పిక్కాసి** రూ.చూ. పికాసి. వి. గట్టినేల తవ్వడానికి వాడే పరికరం.

**పిక్క** రూ.చూ. పిక్క[3]. వి. చిన్నగోలి.

**పిక్కిలి** రూ.చూ. పిలి[1]. వి. 1. ఒకానొక అడవి జాతివాడు. జైమినిభా. 1.45; 2. పక్షివిశేషం. హంస. 3.12.

**పిక్కు**[1] వి. 1. వంచన, మోసం. భార. ఉద్యో. 4.315. 2. మర్మం, కిటుకు. అహల్యా. 2.73; 3. మల్లవిద్యా విశేషం. మల్లు. 3 69; స.క్రి. 1. అపహరించు, దొంగిలించు. విప్ర. 5.19; 2 మోసపుచ్చు, వంచించు.

తు. పికలాటు, పిక్లాటు. మోసపుచ్చటం.

**పిక్కుమెకము** వి. నక్క.

**పిక్కు**[2] వి. పెంపు, అతిశయం. ప్రబంధ. 40.

సం. పక్వ-. పండిన, ఉడికిన; ప్రా. పిక్క-. పూర్ణమైంది; అ.మా. గ. పిక్క- పక్వం.

<ప్రా. పిక్క-.

**పిక్కు**[3] అ.క్రి. 1. వెనుదీయు; 2. లోబి అగు.

క. పింగు. వెనుదీయు; తు. పించి. లోభంగా, లోభత్వం; త. పింతు. వెనకాడు, వెనుదీయు, పిన్ను.

<మూ.ద్రా. పిన్-.

**పిక్కు**[4] రూ.చూ. పిక్క[3]. వి. 1. బాలుర గోలీల ఆటలో గోలిని ఉన్నచోటనే మరల ఉంచటం లేక కొద్దిగా కదిలించటం; 2. బలపపు ముక్క; 3. దాటిగొలును బద్దకు బిగించిన కొయ్యముక్క; స.క్రి. రాబట్టుకొను.

**పిక్చరు** వి. 1. చలన చిత్రం, 2. బొమ్మ.

ఇం. *Picture*. బొమ్మ, చలనచిత్రం.

<ఇం. Picture.

**పిక్పాకెట్టు** వి. జేబుదొంగ.

ఇం. *Pickpocket*. జేబుకొట్టు.

<ఇం. Pickpocket.

**పిఛాణంవడ్లు** రూ.చూ. పిషాణంవడ్లు. వి.బ.వ. నెల్లూరు, కడప జిల్లాల్లో పండించే మంచిరకం వడ్లు.

**పిగరు** రూ.చూ. పిక్కరు. వి. దాటిగొలును బద్దకు బిగించిన కొయ్యముక్క.

**పిగిలి** రూ.చూ. పిలి[1]. వి. పక్షివిశేషం.

**పిగిలికుమ్చు** వి. పిగిలి పిట్టయొక్క పృష్ఠభాగంలో తూలిక. **పిగిలికుచ్చెల** వి. ఎరుపు, పసుపు, తెలుపురంగు పోగులు కలిసేటట్లు నేసిన అంచు. **పిగిలికుచ్చెలచీర** వి. అంచులో ఎరుపు, పసుపు, తెలుపు రంగులు వచ్చేట్లు నేసిన ఒకరకం చీర. **పిగిలిపిట్ట** రూ. పికిలిపిట్ట వి. 1. తురకపికిలిపిట్ట. పల్నా. పు. 28; 2. ఒకరకం చిమ్మబుడ్డి.

**పిగిలిపోపు** చూ. పిగులు.

**పిగురుపొట్ట** రూ చూ. పిగులుపొట్ట. వి. ఆకులు విడబడి కంకి వెళ్ళేముందున్న స్థితి, ఈనటానికి సిద్ధమైన పైరు.

**పిగులు** రూ.చూ. పికులు. అ.క్రి. 1. వస్త్రం మొ. బిగుతు వలన పగులు, చినుగు. రాజవా. 2.42; 2. గుడ్డునుండి పిల్లబయటపడు; 3. గుడ్డపాతదై చిడుగు.

**పిగిలిపోవు** అ.క్రి. కొత్తకుండలు మొ. వి నీళ్ళు పోసిన వెంటనే కాల్చుదోషంవల్లపగిలిపోవు. **పిగులుపొట్ట** రూ. పిగురుపొట్ట. వి. ఆకులు విడబడి కంకివెళ్ళే ముందున్నస్థితి. ఈనటానికి సిద్ధమైన పైరు.

**పింకు** వి. గురాయివువ్వురంగు.

ఇం. *Pink*. ఒకరకం ఎరుపురంగు.

<ఇం. Pink.

**పింగటించు** రూ. పింగళించు. అ.క్రి. 1. అతిశయపుమాటలాడు; 2. గజ్జలలోని దారవల్ల ఎడం ఎడంగా అంగలు వేయు; స.క్రి. 1. మోసంతోరాబట్టు; 2. వ్యంగ్యంగా నిర్వహించు.

**పింగడించు** అ.క్రి. కోపాయుక్తమగు; ఒప్పు. పాంచాలి. 2.6.

**పింగలి** వి. వెనకటిభాగం, వెనకటిప్రదేశం. కు. సం. 11.17; విశే. వెనకటిది, వెనుకటివాడు. నిర్వ. రా. 6.146, భార. శల్య. 1.392; క్రి. విశే. ద్రు. అనంతరం, పిమ్మట. పండి. చ. 4.293వ.

క. పిత్తల్, పిత్తిల్, పింతిల్, హత్తల్, హిత్తిల్ (లు). పెరడు; తు. హిత్లు. పిత్తులు. తోట, కలువ, పెడంగు వెనకపక్క, పచ్చణ్డ్, పిచ్చాటి, పిచ్చాడి. పెరటిభాగం; త. పింకలి; తొ. ఇడ్క్. బాలఅలస్యం; గోం. పయె. తరువాత, పెరెక, పెరొక, పెర్క. ప్రెయ్క్. వెనుక, తరువాత, పెహకె. వెనుక, పెర్కె, తరువాత, వెనుక; నా. పిర్తున్, వెనుకవైపు. పిమ్మట.

**పింగళి** వి. పంజు.

సం. పింగల-. పసుపుపచ్చని, ఎరుపుబూడిద.

<సం. పింగల- (అర్థవిపరి.).

**పింగళించు** రూ.చూ. పింగటించు. స.క్రి. మోసంతోరాబట్టు; అ.క్రి. అతిశయపు మాటలాడు.

**పింగాణి** రూ.చూ. పింగాడి. వి. 1. (గిన్నె మొ.) పాత్ర. వరాహ. 4.156; 2. మట్టితో చేసిన పాత్ర. వైజ. 3.74. 3. ఒకరకం తెల్లచీనామట్టి. మల్లు. 4.18; 4. గాజుపాత్ర ఆం. భా. 2.208.

**పింగాణిచిప్ప** వి. పింగాణితో తయారైన చిప్ప. **పింగాణిమస్తకం** వి. తలుపురెక్కను గాడి తీసి పింగాణి పలకను అంచులో బిగించి గట్టిగా ఉండేటట్లు చేసిన మస్తకం.

పింగాణి రూ. పింగాణీ, పింగాణి. వి. ఒకరకం లోహపాత్ర. వరాహ. 4.112.

ఉ. పింగాన్. పండ్లరసం ; పార. పింగాన్. పండ్లరసం. ఫింజాన్. చీనామట్టిపాత్ర ;

క. పింగాణి ; త. పింగాణ్.

< ఉ. పింగాన్.

పింగావిపూస చూ. పింగాణి. వి. మరనాతెలో కంకి పోగు బయటకు రావటానికి తెల్లం చేసి ఓగించిన గాజుపూస.

పింగ వి. 1. ముగగురి, కర్ణం. చంద్రరే. 2.90. కవిచౌ. క. 121. నెల్లూరిశాసనాలు. ఉదయగిరి. 47 ; 2. ధనం.

సం. పింగ-. ఎరుపు బూడిదరంగు కలిసిన వర్ణం.

< సం. పింగ-.

పిచపిచ వి. పిట్టకల ధ్వనికి అనుకరణం. వేంక. పంచ. 4.504.

పిచమానేవడ్లు వి.బ.వ. నెల్లూరు. కడపజిల్లాల్లో పండించే మంచిరకం వడ్లు.

పిచాడి వి. గుర్రం వెనక కాళ్ళు కట్టేతాడు.

సం. పశ్చార్ధ-. వెనుకసగం ; ప్రా. పచ్ఛద్ధ ; కు. పిఛాడీ ; హిం. పఛాడీ ; పం. పఛవాడా ; గు. పఛవాడుం, పఛాడుం ; మరా. పిచాడీ. వెనుకభాగాలు ;

క. పిచాడి. వెనుకభాగం, గుర్రం వెనుక కాళ్ళు.

< మరా. పిచాడీ.

పిచికపొట్ట రూ.చూ. పిచ్చికపొట్ల. వి. పొట్లకాయలో ఒకరకం.

పిచికపన్నం రూ.చూ. పిచ్చికనన్నం. వి. వడ్లలో ఒకరకం.

పిచికెపొట్ల రూ.చూ. పిచ్చికపొట్ల. వి. పొట్లకాయలో ఒకరకం.

పిచోడిలు రూ. పసాడీలు. పిసోడీలు. వి.బ.వ. మూడునెలల్లో పండే వన్నటి తెలికరకం ధాన్యం.

పిచ్చ[1] రూ.చూ. పిచ్చి[1]. వి. అల్పం : తక్కువది. పాండు. 4.147.

పిచ్చకవ్వ వి. పేడకుడు. నె. గా. రాహర్. 4. శి.శ. 1211. పిచ్చకుంచము వి. కొలత తగ్గేకుంచం. పిచ్చకుంట్లవాడు వి. వృద్ధుడు. పిచ్చగొర్దలి వి. వెడల్పు పదును గల చిన్నగొడ్డలి. పిచ్చటిలు అ.క్రి. వడకు. కంపించు. పిచ్చపాటిది విశే. చిన్నది, తక్కువది. పిచ్చపెసలు వి.బ.వ. ఒకదినుసు పెసలు, చిన్నపెసలు. పిచ్చలపీట వి. పిచ్చలాడటానికి ఉపయోగించే గుంతల పీట, ఓమనగుంటల పీట.

పిచ్చ[2] వి. 1. వృషణం, ముష్కం. చంద్రికా. 2.70 : 2. చింతగింజ ; 3. చెరకుగడకు అక్కడక్కడ ఏర్పడేగొడ్డు. పర్వం.

తు. పిచ్చి. జంతువుల వృషణాలు.

పిచ్చ[3]. రూ.చూ. పిచ్చి[2]. వి. ఉన్మాదం, వెర్రి. ఆం. భా. 1 136.

పిచ్చగాల్పు రూ. పెచ్చగాల్పు. వి. పాత్రలు చిల్లిపోయే ఒట్లు కాలిన కాల్పు. పిచ్చవట్టు వి. 1. లుబ్ధత్వం ; 2. మూర్ఖప్పట్టు. తు. పిచ్చి. దనదేవత ; త. పిచినాఱి. పిచినేఱి. లోభి. పిచిని. లోభి. లోభత్వం, పిచుకు (పిచుక-). లోభత్వంగా ఉండు, పిచుక్కు. లోభత్వం, పిచుక్కర్. నీచబుద్ధిగలవారు. పిచుసిచుత్తవన్. లోభి ; మ. పిసుక్కు, లోభత్వం, పిసుక్కన్. లోభి ; పర్జి. పితెయి. లోభి. పిచ్చమట్లు వి బ.వ. వ్యవసాయానికి అనువుపడని భూములు. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 758. క్రీ.శ. 1678. పిచ్చాపాటి వి. కాలక్షేపానికి మాట్లాడే మాటలు.

పిచ్చరు రూ.చూ. పిచ్చెరు. వి. గన్‌పిచ్చరు. నల్లరాతిని పగలగొట్టడానికి పనికివచ్చే పెద్దసమ్మెట.

పిచ్చలము విశే. అతిశయించిన. అధికమైన. రసమంజరి. 1.8.20.

పిచ్చలించు అ.క్రి. 1. ఆనందించు. కు.సం. 8.18 ; 2. అతిశయించు. కు. సం. 11.201 ; 3. తత్తరపడు, ఆకులపాటు చెందు. భార. విరా. 1.13 ; 4. విజృంభించు. భార. భీష్మ. 1.258 ; 5. భయపడు, భీతిల్లు. భాస్క. రా. యు. 2149 ; 6. అంకురించు. పుట్టు, కలుగు. భాగ. 10. స్కం. పూ. 492 ; స.క్రి. 1. ప్రశంసించు. కు. సం. 7.130 ; 2. అతిశయింపచేయు.

పిచ్చలించు చూ. పిచ్చలము.

పిచ్చాపాటి చూ. పిచ్చ[3].

పిచ్చి[1] రూ.పిచ్చ[1]. విశే.1. హీనమైన, నీచమైన. రామాభ్యు. 7.279 ; 2. ప్రయోజనం లేని ; 3. అడవి సంబంధమైన.

క. పిచు. పొట్టి, చిన్నతనం. పిచ్చె. పొట్టి, బరువు లేక కొలతల్లో లోపం ; త. పిచ్చు ; మ. పిచ్చ. పిచ్చన్. పొట్టి. చిన్న, పక్వానికిరాని.

పిచ్చిగుంటలవారు వి.బ.వ. రైతుల గోత్రాల్ని మాత్రం వల్లిస్తూ భిక్షమెత్తుకొనే కులం వారు. పిచ్చులవ వి. ఉలవల్లో ఒకరకం. < పిచ్చి[1] + ఉలవ.

పిచ్చి[2] రూ. పిచ్చ[3]. వి. ఉన్మాదం, పిచ్చి. హర. వి. 1.

క. పచ్చు, పుచ్చు, పెచ్చు. పిచ్చితనం, పెచ్చ-. పిచ్చివాడు ; కొడ. పిత్త. చపలత్వం ; త. పిచ్చు. పైత్యం. పిచ్చితనం. పిచ్చన్. పిచ్చివాడు. పిచ్చి. పిచ్చిది ; పిత్తు. పిత్తమ్, పిత్తి. పైత్యం. పిచ్చితనం ; తు. పిత్తు. పైత్యం, చపలత్వం. పిత్త. పైత్యం ఎక్కువైన ; మ. పిచ్చ. పిచ్చితనం పిచ్చన్. పిచ్చివాడు ; కో. పుచ్. పిచ్చితనం ; తొ. పుచ్. కోపం.

పిచ్చితమ్మ వి. ఎర్రని పూలుపూసే ఒకరకం తీగ (Canavalia obtusifolia). పిచ్చిదంగ వి. ఒకరకం కలుపు మొక్క. పిచ్చిదొండ వి. బాటిచెట్లకు అల్లుకొనే ఒకరకం తీగె. పిచ్చిపెట్టు వి. ఉమ్మెత్త. పిచ్చిమిరప వి. మెట్టనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క (Croton sparsiflorus). పిచ్చివాడు విశే. ఉన్మాదుడు, పిచ్చిపట్టినవాడు. పిచ్చెత్తు అ.క్రి. వెర్రెత్తు. < పిచ్చి[2] + ఎత్తు[2].

పిచ్చిక రూ. పిచ్చుక. వి. ఒకజాతిపిట్ట, చటకం. భార. శాంతి. 5.224.

పిచ్చికకుంటు రూ.చూ. పిచ్చుకకుంటు. వి. అసూరుడు ; విశే. కాళ్ళులేనివాడు. పిచ్చికగోర్లు రూ.చూ. పిచ్చుకగోళ్లు. వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.129. పిచ్చికతంబ వి.

ఒకరకం జిగురును, పీచునిచ్చే బెరడు కలిగిన ఒకరకం తీగ. **పిచ్చికపొట్ల** రూ. పిచికపొట్ట, పిచికెపొట్ల. వి. పొట్ల కాయలో ఒకరకం. **పిచ్చికబీర** రూ.చూ. పిచ్చుకబీఱ. వి. మూడునుంచి నాలుగడుగుల ఎత్తు పెరిగే చిన్న ఆకులకల చిన్న మొక్క (Ehretia buxifolia). **పిచ్చికబూరి** రూ.చూ. పిచ్చుకబీఱ. వి. మూడు నుంచి నాలుగడుగుల ఎత్తు పెరిగే చిన్న ఆకులకల చిన్న మొక్క (Ehretia buxifolia). **పిచ్చికమీను** వి ఒకరకం చేప. **పిచ్చికలు** రూ. పిచ్చికలు, పిచ్చుకలు, పిసికలు, వి.బ.వ. 1. పొన్న కాయలాగా గుండ్రంగా ఉండే ఒకరకం చిచ్చుబుడ్లు; 2. దబ్బులు. **పిచ్చికసన్నం** రూ. పిచికసన్నం. వి. వడ్లలో ఒకరకం. కిచిడిసాంబా కావచ్చు **పిచ్చికుంటు** రూ.చూ. పిచ్చుకకుంటు. వి. అనూరుడు. విణ. కాళ్ళులేనివాడు.

**పిచ్చికారి** వి. గోడలు తడపడానికి వాడే వెదురు సాధనం.

హిం. పిచ్‌కారీ. తడపటానికి ఉపయోగించే సాధన విశేషం.

<హిం. పిచ్‌కారీ.

**పిచ్చికిలు** రూ.చూ. పిచ్చికలు. వి.బ వ. పొన్నకాయలాగా గుండ్రంగా ఉండే ఒకరకం చిచ్చుబుడ్లు.

**పిచ్చికుంటు** చూ. పిచ్చిక.

**పిచ్చికెమొల** వి. గొర్రు చెక్కకు క్రరుదిగించే ఇనపకొండి.

**పిచ్చిలిపోవు** చూ. పిచ్చిలు.

**పిచ్చిలు** రూ. పిచ్చిల్లు. అ.క్రి. చిప్పిల్లు (నీటిబొట్టు మొ. వాటి) లోపలి నుంచి పైకి వచ్చు. పండి.చ. 2.123 ప.

**పిచ్చిలిపోవు** అ.క్రి. చిప్పిలు. రం.రా.యు. 294 పు. 22 పం.

**పిచ్చిల్లు** రూ.చూ. పిచ్చిలు. అ.క్రి. లోపలినుంచి పైకి వచ్చు.

**పిచ్చు**[1] వి. 1. పిత్తకోశం, చేదుకట్టు; 2. విషం.

సం. పిత్త-. పిత్తకోశం: ప్రా.పా. పిత్త-. చేదుకట్టు; ఆ. పిత్-, పిత్తకోశం, ధైర్యం, గాలితిత్తి.

<ప్రా. పిత్త-.

**పిచ్చు**[2] రూ.చూ. పిచ్చె[3]. వి. చింతగింజ. ఆం.శా. 2.47; విణ. తక్కువ.

**పిచ్చు**[3] వి. వైక్యదు.

**పిచ్చు**[4] వి. కొవ్వు.

**పిచ్చుక** రూ.చూ. పిచ్చిక. వి. ఒకజాతిపిట్ట.చటకం.హర 2.18.

**పిచ్చుకకాలు** వి. పర్పాటం, వృక్షవిశేషం. ఆం.శా. 2.65. **పిచ్చుకకుంటు** రూ. పిచ్చికకుంటు, పిచ్చికుంటు, పిచ్చుకుంటు, పిచ్చుగుంటు. విణ. పిచ్చికలా కుంటుతూ నడిచేవాడు. శార. కర్ణ. 1.32; వి. అనూరుడు. కాశీ. 1.126. **పిచ్చుకగడ్డి** రూ. పిచ్చుగడ్డి. వి. మెట్టనేలల్లో ఉప్పుగా పెరిగే కలుపుమొక్క (Eleasine Aegyptiaca, Mollugo pentaphylla). **పిచ్చుకగూడు** వి. 1. పిచ్చుకలుండే గూడు; 2. పిల్లలు ఇనుకలో కట్టుకునే గూడు. **పిచ్చుకగోట్లు** రూ. పిచ్చికగోట్లు. వి. బ. వ. ధాన్యవిశేషం. హంస. 4.128. **పిచ్చుకబియ్యము** వి. తృణ విశేషం. ప్రబంధ. 200. **పిచ్చుకబీఱ** రూ. పిచ్చికబీర, పిచ్చికబూరి. వి. ఒకవిధమైన బీర. కాశ. 8.69 (Ehretia buxifolia). **పిచ్చుకలు** రూ.చూ. పిచ్చికలు. వి బ.వ. పొన్నకాయలాగా గుండ్రంగా ఉండే చిన్నరకం చిచ్చుబుడ్లు. **పిచ్చుకపరపము** వి. మాటిమాటికి చేసేపని. **పిచ్చుకుంటు** రూ. చూ. పిచ్చుకకుంటు; వి. 1. అనూరుడు, సూర్యుని సారథి. శృం.నై. 8.13; 2. గొల్లల్ని యాచించి జీవించే ఒకజాతివారు. రామలిం. శ. 28; విణ. పంగువు. కుంటివాడు. వరాహ. 7.97. **పిచ్చుగుంటివాండ్రు** విణ.బ.వ. కమ్మవార్ని అడుక్కొని జీవించేవారు, బిచ్చమెత్తే వారు. **పిచ్చుగుంటు** రూ.చూ. పిచ్చుకకుంటు. వి. 1. అనూరుడు. సూర్యుని సారథి; 2. గొల్లల్ని యాచించి జీవించే ఒకజాతివారు; 3. కమ్మ వార్ని యాచించి జీవించే ఒక జాతివారు; విణ. పంగువు. కుంటివాడు. **పిచ్చుగడ్డి** రూ.చూ. పిచ్చుకగడ్డి. వి. మెట్ట నేలల్లో ఉప్పుగా పెరిగే కలుపు మొక్క (Mollugo pentaphylla).

**పిచ్చుకుంటు** చూ. పిచ్చుక.

**పిచ్చుగుంటివాండ్రు** చూ. పిచ్చుక.

**పిచ్చుగుంటు** చూ. పిచ్చుక.

**పిచ్చుగడ్డి** చూ. పిచ్చుక.

**పిచ్చులవ** చూ. పిచ్చి[1].

**పిచ్చె**[1] వి. బట్టిలో పేర్చడానికై నరికిన మూరెడు కొయ్య ముక్క.

**పిచ్చె**[2] వి. లక్డిలో పదోవంతు.

**పిచ్చె**[3] రూ. పిచ్చు[2]. వి. చింతగింజ. ఆం.శా. 2.47.

**పిచ్చెత్తు** చూ. పిచ్చి[2].

**పిచ్చెర్** రూ.చూ. పిచ్చెరు. వి. పెదల్పుగా పదునుగా ఉండే ఉక్కుముక్క.

**పిచ్చెర** రూ.చూ. పిచ్చెరు. వి. పెదల్పుగా పదునుగా ఉండే ఉక్కుముక్క.

**పిచ్చెరు** రూ. పచ్చర్, పిచ్చరు, పిచ్చెర్, పిచ్చెర, పిచ్చెల్. వి. పెదల్పుగా పదునుగా ఉండే ఉక్కుముక్క.

ఇం. *Pitch.* తోయు, విసురు.

**పిచ్చెల్** రూ.చూ. పిచ్చెరు. వి. పెదల్పుగా పదునుగా ఉండే ఉక్కుముక్క.

**పిచ్చేను** వి. తినటానికి పనికి వచ్చే పళ్ళకాసే. కొండలమీద పెండలదే చెట్టు (Prunus persica).

**పిఛాడికాడు** వి. పావుచెక్కను గూటానికి దిగించే వెనకతాడు.

సం. పశ్చార్ధ. వెనుకసగం; ప్రా. పచ్ఛాద్ : కుమా. పిఛాడి; హిం. పఛాడీ; పం. పఛవడా; మరా. పిచాడీ. వెనుకభాగాలు;

క. పిచాడీ. వెనుకభాగం, గుర్రం వెనుకకాళ్ళు.

<మరా. పిదాడి + త్రాడు.

**పించ** రూ.చూ. పించము[2]. వి. బలం.

**పించమసవు** చూ. పించము[2].

**పించమణచు** చూ. పించము[2].

**పించము**[1] వి. నెమలిపురి. హర. 5.87.

సం. పిచ్ఛ-. నెమలిపురి; ప్రా. పిచ్ఛ-, పింఛ-. తోకకుచ్చు; పా. పిచ్ఛ-; బెం. పెంచా. తోకభాగం;

ఒ. పిఛ. తోకపుచ్చు.

<ప్రా. పింఛ-.

పించములుసేయు(-చేయు) స.క్రి. నెమలిపింఛం విప్పేట్లు విప్పు. ప్రబంధ. 788. పించముసేయు(-చేయు) స.క్రి. నెమలిపింఛం విప్పినట్లు విప్పు.

**పించము**[2] రూ. పించ, పీఁచము. విశే. 1. మదించిన, బలవత్తరమైన. వి.ప. 2.45; 2. కలత నొందిన; 3. కుదించిన; వి. మదం, గర్వం.

పించమడఁచు స.క్రి. హింసించు. <పించము[2]+అడఁచు. పించమణఁచు స.క్రి. చంపు, ఉద్రేకమణచు. <పించము[1]+అణఁచు.

**పించియము** రూ. పించెము. వి. 1. నెమలిపురి. పాండు. 1.218; 2. నెమలిపురికన్ను.

సం. పిచ్ఛ-, పిచ్ఛికా, పింఛ-, పింఛికా. నెమలిపురి: ప్రా. పింఛ-, పిచ్ఛ-, పింఛిఅ; పా. పిచ్ఛ; ఒ. పిఛ. తోకకుచ్చు.

<ప్రా. పించిఅ.

**పించు** వి. బోకి, ఎముక.

పించుమవ్విగొను (-కొను) స.క్రి. సంహరించు. పించుసేయు (-చేయు) స.క్రి. చిన్నాభిన్నంచేయు.

**పించెగొడుగు** చూ. పించెము.

**పించెము** రూ.చూ. పించియము. వి. నెమలిపురి. ఉ.రా. 1.19.

పించెగొడుగు వి. నెమలిపురితో తయారు చేయబడిన గొడుగు. శృం.నై. 5.37.

**పింఛను** వి. చిరకాలం పనిచేసినందుకు ఉద్యోగవిరమణానంతరం ఇచ్చే సొమ్ము.

ఇం. *Pension*. ఉపకార వేతనం, భరణం.

<ఇం. Pension.

**పింజ**[1] రూ. పింజె[1], పెంజ. వి. 1. పుంఖం, అల్లెతాటికి కూర్చే బాణమూలం. భార.కర్ణ. 1.175; 2. దూదేకులవాని విల్లు; 3. బాణం; 4. ఒకరకం పత్తిచెట్టు. (Gassypicem herbacecem).

సం. పింజా, దూది.

<సం. పింజా.

పింజవ్రేలు(-వ్రేలు) వి. పింజలవ్రేవి. పండి.చ. 2.134 ప. పింజవ్రేవి(-వ్రేవి) వి. దూదేకు విల్లు. దూదిని చిమ్మేట్లు నీటిని చిమ్మేగొట్టం. జైమిని. 2.69. పింజపింజగలుచు(-కలుచు) అ.క్రి. ఒకదానివెనుక ఒకటి పోవు. కళా. 8.180. పింజబు వి. జంటెం వడికే పద్ధతి. పింజబుగొను(-కొను) అ.క్రి. పుంఖాను పుంఖముగు, ఎడతెగకుండు. భాస్క.రా.యు. 836. పింజించు[1] స.క్రి. చిమ్ము. పండి.చ. 2.134. భాగ. 3 స్కం; అ.క్రి. చిమ్మబడు, నిక్షిప్తమగు. పండి.చ. 2.134. <పింజ[1]+-ఇంచు[3].

**పింజ**[2] వి. శ్రీకృష్ణుని శిరోభూషణం.

సం. పింఛ-. (నెమలి) పుచ్ఛం.

<సం. పింఛ-.

పింజకొన వి. పింఛంయొక్క కొన (చివర).

**పింజ**[3] రూ.చూ. పింజె[2] వి. 1. ధోవతి గోచీ అంచును చిక్కగా ముడిచి దోపుకున్న పంచెకట్టు; 2. పట్టిపాత్ర అంచులోపల కొంచెం కిందుగా కుతికదగ్గర చేరినట్లుండే భాగం.

పింజకంటం రూ. పింజికంటం. వి. వెడల్పుగా, బొద్దుగా అంచు పెట్టిన పాత్రల కుత్తిక భాగం. పింజంచు రూ.చూ. పింజెంచు. వి. లోపల వెడల్పుగా బొద్దులాగా ఉండేఅంచు.

**పింజర** రూ.చూ. పింజెర. వి. 1. దూది ఏకే కొయ్య పనిముట్టు; 2. చేతి అద్దకానికి వాడే రంగుతొట్టిలో అమర్చిన బద్దల తడిక; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**పింజరం** రూ.చూ. పింజెర. వి. 1. దూది ఏకే కొయ్య పనిముట్టు; 2. చేతి అద్దకానికి వాడేరంగు తొట్టిలో అమర్చిన బద్దల తడిక; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**పింజరీపీకు** చూ. పింజర. అ.క్రి. ఎడతెగని వాదంచేయు.

**పింజలి** వి. ఒకానొక భాష.

సం. పింజల-. అస్తవ్యస్తమైన.

<సం. పింజల-.

**పింజారి** రూ. పింజేరి, పెంజారి. వి. దూదేకులవాడు. వేంక. 66, ఆం.భా. 2.235, హంస. 3.29.

సం. పింజా, దూది; హిం. పింజారీ. దూదేకేవాడు; ఉ. పంజారా; మరా. పింజారీ-. దూదేకేవాడు.

త. పంచారి. పించాన్. సాయబుల్లో దూదేకేవాడు.

<మరా. పింజారీ.

**పింజారీవెధవ** చూ. పింజారి. వి. పింజారీజాతికి చెందిన మనిషి వంటి మనిషి.

**పింజి** చూ. పింజ[1]. వి. విధానం, రూపం, పద్ధతి.

**పింజికంటం** రూ.చూ. పింజకంటం. వి. వెడల్పుగా, బొద్దుగా అంచుపెట్టిన పాత్రల కృత్తిక భాగం.

**పింజించు**[1] చూ. పింజ[1].

**పింజించు**[2] చూ. పింజె[2].

**పింజియ** రూ.చూ. పింజె[2]. వి. వస్త్రం కుచ్చె. వాల్మీకి. 3.135.

**పింజిర** రూ.చూ. పింజెర. వి. 1. దూదిఏకే కొయ్యపనిముట్టు; 2. చేతి అద్దకానికివాడే రంగుతొట్టిలో అమర్చిన బద్దల తడిక; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**పింజు** స.క్రి. 1. దూది విదిలించు; 2. చేతితో ఉన్ని పిసికి విడదీయు.

క. పిజ్జు, హీచు. ఈచు. దూదిని విదిలించు; త. పియ్ (-ప్. -న్-). చిరిగిన, ముక్కలుగా చీలు, వదులగు, విడదీయు. (-ప్ప-, -త్-). చింపు, చిన్నముక్కలుగా చింపు, విదిలించు; మ. పిచ్చుక, పిచ్చుక. బలంగాలాగు, ముక్కలుగా చీల్చు, విదిలించడానికి ఊలు సిద్ధం చేయు.

పింజుకొను స.క్రి. పెద్దచేసికొను. పింజుడుజేయు(-చేయు) స.క్రి. చేత్తో ఉన్ని పిసికి విడదీయు. పింజుడువ్ని వి. ఒకరకం ఉన్ని. <పింజుడు+ఉన్ని.

**పింజె**[1] రూ.చూ. పింజ[1]. వి. ఏకేటప్పుడు విచ్చుకొని అవతల పడ్డ దూది.

**పింజె**[2] రూ. పింజ[3], పింజియ. వి. 1. మడతపెట్టి వెనక దోపు గానే ధోవతికొంగు, కచ్చభేదం. క్రీడా. 42 ; 2. వస్త్రం కుచ్చె, మడత. మను. 3.71.

సం. పింజికా. నూలుచుట్ట ; ప్రా. పింజిఅ.

<ప్రా. పింజిఅ.

**పింజించు**[2] స.క్రి. పింజెలుపోయు, కుచ్చిళ్ళుపోయు. కవిక. 6.190 <పింజె[2] +-ఇంచు[3]. **పింజెకట్టు** స.క్రి. కుచ్చెళ్ళుపోయు. నీలా. 1.60. **పింజెంచు** రూ. పింజంచు. వి. లోపల వెడల్పుగా బొద్దులాగా ఉండే అంచు. <పింజె[2] + అంచు[3]. **పింజెవట్టు** అ.క్రి. కుచ్చెళ్ళుపోయు. క్రీడా. 43.

**పింజెన్** రూ.చూ. పింజెర. వి. 1. దూదిఏకే కొయ్య పనిముట్టు ; 2. చేతి అద్దకానికివాడే రంగు తొట్టిలో అమర్చిన బద్దల తడిక ; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**పింజెవజేయు(-చేయు)** చూ. పింజెర. స.క్రి. ఉన్ని పింజె పింజెలుగా విచ్చుకొనేట్లు వేరుచేయు.

**పింజెర** రూ. పింజర, పింజరం, పింజిర, పింజెన్, పింజెరం, పింజెరి, పెంజెన్, పెంజెర[1]. వి. 1. దూదిఏకే కొయ్య పనిముట్టు ; 2. చేతి అద్దకానికి వాడే రంగుతొట్టిలో అమర్చిన బద్దల తడిక ; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గంపైన అమర్చే యంత్రం.

**పింజెరఅడ్డ** రూ. పింజెరడ్డ. వి. దాబీలో అడ్డంగా బిగించిన కొయ్యదిండు. **పింజెరకర్ర** వి. పేటుదారాలకు ఆధారంగా దాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద. **పింజెరకోల** వి. పేటుదారాలకు ఆధారంగా దాబీచట్రంలో అమర్చిన సన్న బద్ద. **పింజెరగడ్డ** వి. దాబీ అడ్డంగా బిగించిన కొయ్య దిండు. **పింజెరసుత్రాలు** వి.బ.వ. దాబీకోలలను లేపే కర్రలు. **పింజెరజాలి** రూ. పెంజెరజాలి. వి. పేటుదారాల చివరకట్టిన పరివారం. **పింజెరడిజైనంచు (-అంచు**[3]**)** వి. ఆకులు, పువ్వులు, బొమ్మలు మొ.వి డిజైనులో పడేట్లు నేసిన అంచు. **పింజెరడ్డ** రూ.చూ. పింజెరఅడ్డ. వి. దాబీలో అడ్డంగా బిగించిన కొయ్యదిండు. **పింజెరతాడు** వి. 1. కమాను వేలాడ తీసినతాడు ; 2. నేతలో డిజైన్లు పడటానికి, దాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం. **పింజెరనేత** వి. మగ్గానికి దాబీ అమర్చి బట్ట అంచున డిజైన్లు పడేట్లు నేసిననేత. **పింజెరబద్ద** వి. పేటుదారాలకు ఆధారంగా దాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద. **పింజెరవాళ్ళు** విశే.బ.వ. దూదిఏకే సాయెబులు. **పింజెర పింగర్** వి. దాబీమగ్గం పేటు దారాల్ని కింది అంచుల్లోకి వేలాడ దియ్యటానికి అమర్చిన సాధనం. **పింజెర మూత్రం** రూ. పింజెర సూత్రం. వి. నేతలో డిజైన్లు పడ డానికి దాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం (డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు). **పింజెరసూత్రం** రూ.చూ. పింజెర మూత్రం. వి. నేతలో డిజైన్లు పడటానికి దాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి, అంచు పడుగులోకి వేలాడదీసిన దారం (డిజైనుకు అవసరమైనన్ని దారాలు కడతారు).

**పింజెరం** రూ.చూ. పింజెర. వి. 1. దూదిఏకే కొయ్యపనిముట్టు ; 2. చేతి అద్దానికి వాడే రంగుతొట్టిలో అమర్చిన బద్దల తడిక ; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం.

**పింజెరి** రూ.చూ. పింజెర. వి. 1. దూది ఏకే కొయ్య పనిముట్టు ; 2. చేతి అద్దకానికి వాడే రంగుతొట్టిలో అమర్చిన బద్దలతడిక ; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి, మరమగ్గం పైన అమర్చే యంత్రం.

**పింజేరి** రూ.చూ. పింజారి. వి. బలహీనుడు.

**పిటక** వి. నూనె పోసి పెట్టుకోడానికి వాడే మట్టిపాత్ర.

సం. పిటక-. చిన్నపెట్టె, బుట్ట.

<సం. పిటక- (అర్థవిపరి.).

**పిటపిట** వి. (పంట మొ.వాటి) తీక్ష్ణతని తెల్పే అనుకరణశబ్దం. బహుళా. 3.62.

**పిటికబద్ద** వి. తాడు కట్టిన పింటిబద్ద.

సం. పిటక-. చిన్నగంప, బుట్ట.

**పిటిలు** రూ.చూ. పిటిల్లు. వి. పిడుగులు పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**పిటిల్లు** రూ. పిటిలు. వి. పిడుగులు పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. హర. 2.21.

**పిటిషన్** రూ. పెటిషను. వి దరఖాస్తు, విజ్ఞప్తి.

ఇం. *Petition*. లిఖితపూర్వక విజ్ఞాపనం.

<ఇం. Petition.

**పిటిషనరు** రూ. పెటిషనరు. వి. విజ్ఞప్తిదారుడు.

ఇం. *Petitioner*. విజ్ఞప్తిదారుడు.

<ఇం. Petitioner.

**పిటుకు** విశే. గట్టిదైన.

**పిటుకుల్లకర్ర** రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేత పడుగు దీరు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె.

**పిటుకోలకర్ర** రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగు దీరు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె.

**పిటుకోలచెక్రం** రూ.చూ. పెడకోలచెక్రం. వి. పెడకోలను మోసే కొయ్యచక్రం.

**పిట్కోలకర్ర** రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేత పడుగు దీరు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె.

**పిట్ట**[1] వి. 1 పక్షి, విహంగం. పల్నా.వ. 4 ; 2. మరమగ్గం నాడెను ఒక సొరుగు నుంచి మరొక సొరుగులోకి నెట్టడానికి, సొరుగులో నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య గిలక.

గోం. పిత్తే, పిట్టి, పిటె ; కొలా. పిట్టె. చిన్నపక్షి, పక్షిపిల్ల, పిట్టె. పక్షి ;

సం. పిత్సత్. పిట్ట.

**పిట్టకత** రూ. పిట్టికత. వి. చిన్నకథ. **పిట్టకమ్ము** వి. నేతలో పోగు తెగినప్పుడు వచ్చిన చిన్న వెలితి. **పిట్టకారి** వి. తెలుపు నలుపు రంగులో (అంటే పిట్ట రంగులో) ఉండే

కారినేల. పిట్టకార్లు రూ.చూ. పిట్టకాలు. వి.బవ. మెట్టనేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క (Mollugo pentaphylla). పిట్టకాలు రూ. పిట్టకాళ్లు, పిట్టకాల్లు. వి. మెట్టనేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క (Eleusine aegyptiaca Mollugo pentaphylla). పిట్టకాల్లు రూ.చూ. పిట్టకాలు. వి. మెట్టనేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క (Mollugo pentaphylla). పిట్టకాసు వి. ఒకరకం చేప. పిట్టకైనా తెలియనీయకుండు స.క్రి. ఎవ్వరికీ తెలియనీయకుండు, రహస్యంగా ఉంచు. పిట్టగంట వి. మెట్టనేలల్లో తుప్పగా పెరిగే కలుపుమొక్క (Eleusine aegyptiacal Mollugo pentaphylla). పిట్టగంటె వి. సజ్జధాన్యంలో ఒకరకం. పిట్టగాయమందు వి. 'మందు' - రాళ్ళను పగలగొట్టడానికి వాడే పేలుడు ద్రవ్యం. పిట్టగూడు వి. పక్షిగృహం. పిట్టగోడ రూ. పెట్టగోడ, పెట్టగోడ. వి. 1. మిద్దెపై చుట్టూ కట్టే మూరెడెత్తు గోడ; 2. కొంతమార్గాల్లో మలుపుల్లో పక్కరాళ్ళతో పేర్చిన చిన్నగోడ; 3. వంటింటిలో పొయ్యి కనబడకుండా పెట్టిన పొట్టిగోడ; 4. ఇంటి చుట్టు కట్టుగోడ. పిట్టపూత వి. తెల్లగాదచెట్టు, చిన్న పూలు పూసే ఒకరకం చెట్టు (Diospyros sylvatica). పిట్టజువ్వి వి. ఒకమాదిరి గట్టిగాఉండే కలపనిచ్చే చెట్టు (Ficus tsiela). పిట్టకామెర వి. ఒకరకం కలుపుమొక్క. పిట్టతుండు వి. తోట సేద్యంలో, దుక్కిలో ఏర్పడిన గడ్డలను నలుగగొట్టే చిన్న కొయ్యతునక. పిట్టదొర వి. పక్షిరాజు, గరుడుడు. బహుళా. 3.3. పిట్టపిల్ల వి. దుర్బలుడు. పిట్టపిసినిక వి. 3 నుంచి 4 అడుగుల ఎత్తు పెరిగే చిన్న ఆకులుకల చిన్నమొక్క (Ehretia buxifolia). పిట్టపోటు వి. వెదురు బొంగులు మొ. కొయ్యలకున్న రంధ్రాలు. పిట్టబారురోగం వి. నడుం చచ్చుపడిపోయే జబ్బు. పిట్టమఱ్ఱి వి. కల్జువ్విచెట్టు, ఊడలు కలిగిన ఒకరకం చెట్టు (Ficus tomentosa). పిట్టమానిసి వి. సన్నివాడు, పొట్టివాడు. < పిట్ట + మానిసి. పిట్టమేకు వి. బండిచక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. పిట్టమేత వి. చాలాకొంచెం భోజనం తినటం. పిట్టరొమ్ము వి. చిన్న వక్షఃస్థలం. పిట్టసజ్జ వి. సజ్జధాన్యంలో ఒకరకం.

పిట్ట² వి. మంటిగడ్డ, బెడ్డ. భార.అను. 4.90.

పో.చూ. సం. భిత్తి-. తునక, భాగం, గోడ.

పిట్రాతి వి. ఎర్రకంకరరాయి. < పిట్ట² + రాతి.

పిట్టపించము చూ. పించము². విశ. కలత పొందినది. తపతి 4.39.

పిట్టపిడుగు వి. పెద్దపిడుగు. భార.ద్రోణ. 5.377; క్రి.విశ. అనివార్యంగా, తప్పక. కవిక. 3.110, చంద్రాంగ. 4.27.

క. పిట్టుపిడుగు.

పిట్టముదు చూ. పిట్టు¹.

పిట్టికత రూ.చూ. పిట్టకత. వి. చిన్నకల్పితకథ.

పిట్టు¹ వి. 1. వాసెనమీద వండి చేసిన పిండి, పిండి. కాశీ. 7.185; 2. రసం తీసుకొన్న తర్వాత మిగిలిన మడ్డి; 3. సెనగపిండిలో ఉప్పుకారం వేసి తిరుగబోతతో ఉడికించిన పదార్థం; 4. తీపి గలిపి పొడిగా చేసిన పరిపిండి; 5. పిండిలో బెల్లం కలిపి ఆవిరికి ఉడికించిన తినుబండారం; 6. సొరచేప మొదలగువాటిని ఉడకబెట్టి పొడిపొడిగా చేసి తిరుగబోత వేసిన కూర.

సం. పిష్ట-. పిండి; ప్రా. పిట్ఠ-. బియ్యం మొదలగు వాటి పిండి; అ.మా.పా. పిట్ఠ-. పిండి;

క. పిట్టు, పిట్టు, హిట్టు; తు. ఇట్టు; త. పిట్టు; మ. పిట్టు, పిట్టు.

< ప్రా. పిట్ఠ-.

పిట్టముదు వి. పిట్టు రూపంలో ఉన్న నైవేద్యం. ద.హం.శా. 4.1288. పిట్టుగట్టు(-కట్టు) అ.క్రి. 1. ఇబ్బందిఅగు; 2. మలబద్ధకమగు; 3. గట్టిపడు. పిట్టుపిట్టుగా క్రి.విశ.ద్రు. జారుగాగాక. పిట్టోల్పకము వి. ముడిబియ్యం, చేరుడు బియ్యం.

పిట్టు² వి. 1. మెత్తగా ఉండే పసుపురంగు కలపనిచ్చే చిన్న చెట్టు (Solanum Verbascifolium); 2. ఆవు, తలుపులు గాలికి పడకుండా దర్వాజాపైకమ్మికి బిగించిన కొయ్యముక్క; 3. ఏతికోలను పంతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు.

పిట్టుకొట్టు వి. గొర్రు, గుంటక మొ. వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టుమేకు. పిట్టుకోలకర్ర రూ.చూ. పెట్టుకోల కర్ర. వి. అచ్చుకట్టే జంత్రం చివరి పల్లలకు తాడుతో కాలికి వేసి బిగించిన కర్ర. పిట్టుకోలుకర్ర రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగుబద్దు పెట్టటానికి మలకర్రకు అవతల అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పిట్టుచీల వి. దిండులో దూర్చిన నొగలు ఊడిరాకుండా వెనక వైపు కొట్టిన మేకు. పిట్టుపేడు వి. ఏతికోలను పంతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు.

పిట్టం చూ. పిట్టు. వి. గట్టిఉండ.

పిట్టోల్పకము చూ. పిట్టు¹.

పిట్రుకూజా వి. పీపాలాగా సాపుగా రెండడుగుల ఎత్తుతో ఉండే కూజా.

ఇం. *Fitter*. తగినది, సరిపోయినది.

< ఇం. Fitter + కూజా.

పిట్రాతి చూ. పిట్ట².

పిఠా వి. తియ్యని భక్ష్య విశేషం.

సం. పిష్ట-. పిండి; ప్రా. పిట్ఠ-. నువ్వులు మొ.వాటి పిండి, పిండి.

< ప్రా. పిట్ఠ-.

పిఠాభోగం వి. భోగాలలో ఒకరకం, ఒకరకం పిండివంట. పిఠాలువాడీలు వి.బ.వ. భక్ష్యవిశేషం. ద.హం.శా. సంపు. 6. శా.సం. 695. క్రీ.శ. 1519.

పిడక రూ.చూ. పిడుక. వి. 1. గోడ మొదలైన వాటికి చరిచి ఎండబెట్టిన పేడముద్ద. ఆం.భా. 2.258; 2. పెరిమిడి, భస్మం.

పిడకదొమ్మ రూ. పిడికెదొమ్మ. వి. పశువులకు వచ్చే ఒకరకం వ్యాధి. పిడకవిప్ప వి. కాలుతున్న పిడక. పిడకమగ్గులు వి.బ.వ. దొగ్గుకలిపి ఎండబెట్టి ఆముకాల్పులో వంట చెరుకుగా వాడే పలచని పేడముద్దలు. పిడకపచ్చ

వి. కాల్చు ఎక్కువై కుండలపై ఏర్పడే తెల్లని మచ్చ. **పిడకమొసలి** రూ.చూ. పిడుకమొసలి. వి. చిన్న మొసలి. హంస. 4.186. **పిడకలు** రూ. పిడికిలు. వి.బ.వ. పేడ పొట్టు కలిపిఎండబెట్టి ఆముకాల్పులో వంట చెరకుగా వాడే పల్చని పేడ ముద్దలు. **పిడకవంటలు** వి.బ.వ. పొట్టుకలిపి ఎండ బెట్టి ఆముకాల్పులో వంట చెరకుగా వాడే పలచని పేడ ముద్దలు. **పిడక్కచ్చిక** వి. పిడకలు కాల్చగా వచ్చిన నుసి.

**పిడకలకఱ్ఱ** రూ.చూ. పెడకోలగఱ్ఱ. వి. నేతపడుగు బిఱ్ఱు పెట్టటానికి మలగఱ్ఱకు అవతల అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె.

**పిడక్కచ్చిక** చూ. పిడక.

**పిడచ** రూ.చూ. పిడుచ. వి. 1. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; 2. నేతనేసేటప్పుడు. బట్ట ముందు భాగం బిరుసెక్కటానికి గంజి, కొన్నిచోట్ల అంబలిపూసే గుడ్డ; 3. గొడ్డ, మట్టి ఉండ; 4. పిడికిలిలో ఇమిడే అన్నం ముద్ద; 5. పన్ను ఊడిన పశువు గడ్డి నమల లేక బయట ఉమిసే గడ్డి ముద్ద.

**పిడచగట్టు(-కట్టు)** అ.క్రి. 1. గొంతుఆరి మాట్లాడ లేక పోవు; 2. వెంట్రుకలు అట్టగట్టుకొని పోవు; 3. దట్టం పడు, గట్టిపడు, ముద్దకట్టు. **పిడచగుడ్డ** వి. పడుగు తడప టానికి గంజిలో ముంచినగుడ్డ. **పిడచచీర** వి. ఒకరకం చీర. **పిడచబట్ట** వి. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ.

**పిడత**[1] రూ.చూ. పిడుత. వి. 1. చాలా చిన్న కుండ. సాంబ. స్థా. 65; 2. తిమ్మిడి, ఆడబందు తిరగటానికి వీలుగా కమ్ములకు బిగించిన ఇనపదిమ్మ.

**పిడతరాయి** రూ. పిడతఱ్ఱాయి, పిడతఱ్ఱాయి. వి. పిడతలను నర్సేరాయి. **పిడతఱ్ఱాయి** రూ.చూ. పిడతరాయి. వి. పిడతలను నర్సేరాయి. **పిడతఱ్ఱాయి** రూ.చూ. పిడత రాయి. వి. పిడతలను నర్సేరాయి.

**పిడత**[2] వి. గట్టిగా ఉండే పసుపుపచ్చని కలపనిచ్చే చెట్టు (Garcinia spicata).

**పిడపట్టు** రూ.చూ. పెడపట్టు. వి. పాత్రకు ముఖం ఏర్పరచే టపుడు లోపలి అంచుకు వాట బట్టవేసి వంపు వచ్చేటట్లు చేయడం.

**పిడప**[1] రూ.చూ. పిడుచ. వి. 1. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; 2. గొంగడి నేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గుడ్డ; 3. నేతనేసే టప్పుడు. బట్ట ముందుభాగం బిరుసెక్కటానికి గంజి కొన్ని చోట్ల అంబలి పూసే గుడ్డ; 4. కుండల్ని నర్సేటపుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట.

**పిడపగుడ్డ** రూ. పిడ్పగుడ్డ. వి. కుండల్ని నర్సేటపుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. **పిడపబండ** రూ. పిడ్పబండ. వి. నర్సేటపుడు నలపను తడిచేసుకోటానికి తడిగుడ్డపెట్టుకొనే రాయి.

**పిడప**[2] రూ. పిడసల, పిడసలి. వి. ఒరలు, తొట్లు మొ.వి చేయడానికి మూరెడు నిలువులో జానెడు బెత్తెడు మందంతో గుండ్రంగా చేసిన మట్టి ముద్ద.

**పిడసగొమ్ము** వి. లావుగా, పొట్టిగా, లోడిగా ఉండే కొమ్ము (లు).

**పిడసల** రూ.చూ. పిడస[2]. వి. తిమ్మిడి, ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములకు బిగించిన ఇనపదిమ్మ.

**పిడసలదర్వాజా** వి. చాలా పిడసలతో తలుపులు బిగించడానికి వీలుపడే దర్వాజా.

**పిడసలి** రూ.చూ. పిడస[2]. వి. తిమ్మిడి, ఆడబందు తిరగడానికి వీలుగా కమ్ములకు బిగించిన ఇనపదిమ్మ.

**పిడాట** చూ. పిడి[1].

**పిడాటు** చూ. పిడి[1].

**పిడాత** చూ. పిడి[1].

**పిడారి** చూ. పిడి[1].

**పిడారుబద్ద** రూ.చూ. పిరాటుబద్ద. వి. పంగలుగా ఉన్న ఒసికఱ్ఱలపై పొడుగ్గా వేసిన కఱ్ఱ.

**పిడి**[1] రూ.చూ. పిడికిలి. వి. 1. పిడికిటితో పట్టుకొనే కత్తి మొదలైన వాటి భాగం. కు.నం. 3.51; 2. పిడికిలి, ముష్టి. రం.రా.బాల: ఆం.భా. 2.141; 3. విల్లు మధ్య భాగం, లస్తకం. హరి.ఉ. 6.163; 4. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువు కొయ్యకు బిగించిన పిడి; 5. రాట్నం ఇరుసుతిప్పేపిడి; 6. దబ్బారాట్నం ఇరుసు తిప్పే పిడి; 7. పడుగుమువ్వేకుంచె పట్టుకోటానికి బిగించిన కొయ్య; 8. మరమగ్గంలో ఒక సొరుగులో నుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో లాక్కను గుంజేది; 9. నేతమోకును చుట్టే వక్కచక్రం తిప్పటానికి చేతి గూటానికి బిగించిన పల్ల; 10. కాముటాపీ మొదలైన వాటిని పట్టుకోడానికి వీలుగా అమర్చిన కొయ్యముక్క; 11. గరిత, తలుపులు మొదలైన వాటిని లాగి తెరవడానికి ఉపయోగపడే పరికరం; 12. దున్నేటప్పుడు పట్టుకో టానికి మేడి చివర బిగించిన అడ్డ పల్ల; 13. రెండు లడిలనూలు; 14. పెట్టెలో ఉండే నూలుకట్ట; 15 నాలుగుతులాల బరువు తూగే పట్టు; 16. తమలపాకుల చిన్నకట్ట.

**పిడాట** రూ.చూ. పిడ్తేటు. వి. క్కొఱ, వరి మొ. పైర్లకట్టలను చేత్తో పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి. **పిడాటు** రూ.చూ. పిడ్తేటు. వి. క్కొఱ, వరి మొ. పైర్ల కట్టలను చేత్తో పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి. **పిడాత** రూ.చూ. పిడివాత. క్రి.విశే. అకస్మాత్తుగా. **పిడారి** వి. రెండునాగలబండి. నాగలను వెనక వైపున బంధించిన కఱ్ఱ. **పిడికట్ట** వి. కళ్ళంలో ఊడ్చటానికి ఉపయో గించే కంది మండల చీపురు. **పిడికట్టు** వి. వింటి మధ్య భాగం, లస్తకం. **పిడికట్టె** వి. 1. చేత్తో పట్టుకొని లాగటానికి వీలుగా చేదంతెకు వేసినకఱ్ఱ; 2. దున్నేటప్పుడు పట్టుకో టానికి మేడిచివర బిగించిన అడ్డపల్ల. **పిడికఱ్ఱ** వి. 1. దూది ఏకేటప్పుడు కమానునరం కొట్టే బడిత; 2. రంగు అద్దిన నూలులడిలు గుంజకు తగిలించి పిండేకఱ్ఱ. **పిడికూజా** వి. కమండలం లాగా చేసిన నీళ్ళకూజా. **పిడికొట్టు** వి. 1. చేత్తో గడ్డికట్టలు పట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి; 2. బట్టీపట్టు. **పిడికోల** వి. నాగేటిమేడి, మేడికఱ్ఱ.

**పిడిగంట** వి. **1.** నిడుపుపిడున్న గంట. పాండు. 2.22; **2.** తల వెంట్రుకల్ని అరటి మొగ్గ ఆకారంలో వేసే ముడి. **పిడిగుద్దు** రూ. పిడిగ్రుద్దు. వి. ముష్టి ఘాతం, పిడికిలిపోటు. **పిడిగుద్దులు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. **పిడిగొట్టు(-కొట్టు¹)** స.క్రి. పశువులు మొదలగు వాటిని పిచ్చులుగొట్టు, ఎద్దు పట్టు. **పిడిగోడ** వి. మిద్దెలు, డావలకు అంచున కట్టే పొట్టి గోడ. **పిడిగ్రుద్దు** రూ.చూ. పిడిగుద్దు. వి. పిడికిటిపోటు, గుద్దు. **పిడిగ్రుద్దులాట** వి. **1.** ముష్టియుద్ధం. ఉ.హరి. 4.267; **2.** బాలక్రీడావిశేషం. విష్ణుపు. 7.202. **పిడిచిల్ల (-చీల)** వి. దున్నేటప్పుడు పట్టుకోటానికి మేడిచివర బిగించిన అడ్డపుల్ల. **పిడిచీల** వి. ఏడికోల పటకలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. **పిడిచుట్టు** వి. **1.** లుంగీకట్టు; **2.** బాలెంతలు నడుముకు బిగింపుకై కట్టుకొనే దట్టీ. **పిడిజీల(-చీల)** వి. బండిచక్రం ఊడకుండా ఇరుసుకు వేసిన మేకు. **పిడితరుగు** వి. పండిన వరి చేను కోయటానికి ముందుగా. మంచి ముహూర్తంలో, మూడు పిడికిళ్ళ పైరు కోయటం. **పిడిపలక** వి. చేతిమగ్గం పలకకు మధ్య ఎత్తుగా ఉన్న భాగం. **పిడిపట్టు** వి. వింటి నడుమ భాగం, లస్తకం. రం.రా.బాల. 66 వ. 10 పం. **పిడిపిప్పొరాకు** వి. వెగట జిగురు, గాడిదెగడపర. **పిడిబొంద** వి. కుంచెపిడికి చేసిన చిల్లి. **పిడిమూర** వి. పిడికిటికి మోచేతికి మధ్యలో ఉండే కొలత, ముడవ బడిన వేళ్ళుగల మూర, రత్ని. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 743. క్రి.శ. 1577. **పిడియము** రూ. పిడెము¹. వి. కటారి, బాకు. పి.శకు. 1.103. **పిడివాటు** వి. **1.** పనకట్టల్ని చేతికొద్ది ఎత్తి గింజల్ని రాలగొట్టటం; **2.** ఒదంబడిక. **పిడివాత** రూ. పిడాత. క్రి.విశే. అకస్మాత్తుగా. **పిడివాదము** వి. మూర్ఖపుపట్టు, మొండివాదం. **పిడివాలు** వి. సన్నని తోలుముక్కలతో తయారుచేసిన గూడు చెప్పు. శుక. 3.140. **పిడివెలితిమూర** వి. చిటికెన బాచిన పిడిమూర, అరత్ని. **పిడివేయు** బట్టీపట్టు. **పిడిగావతెగులు (-బాలతెగులు)** వి. మిరపతెగులు, కాయలకు సన్నటి బెజ్జాలు పడి రాలిపోయే తెగులు. **పిడిగావపిప్పి(-బాలపిప్పి)** వి. కంది తెగులు, కాయకు బెజ్జాలుపడి గింజలు డొల్లలయిపోతాయి, (ఒకరకం రెక్కపురుగువల్ల ఇలాకావచ్చు) (Plume moth, Exutasets atomosa). **పిడిపంపు** వి. చుట్టింటి చట్రం లోని వాసాలమధ్యఉన్న నందు. **పిడిపావ** వి. కొయ్యలకు రత్నాలకు రంధ్రాలుచేసే సాధనం, బరమా. జైమినిభా. 5.64. **పిడిసూత్రం** రూ. పిడిసూత్రం. వి. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టినదారం. **పిడిసూత్రం** రూ.చూ. పిడిసూత్రం. వి. మరమగ్గంలో, నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం. **పిడెము¹** రూ.చూ. పిడియము. వి. కటారి, బాకు. చంద్రాంగ. 2.90. **పిడ్దేట** రూ.చూ. పిడ్దేటు. వి. క్రొత్త, వరి మొ. పైర్ల కట్టలను చేత్తోపట్టుకొని బల్లకేసి కొట్టి గింజలురాల్చే పద్ధతి. **పిడ్దేటు** రూ. పిడాట, పిడాటు, పిడ్దేట. వి. క్రొత్త, వరి మొ. పైర్ల కట్టల్ని చేత్తోపట్టుకొని బల్లకేసి కొట్టి గింజలు రాల్చే పద్ధతి.

**పిడి²** వి. **1.** ఆడేనుగు. కు.సం. 5.17; **2.** ఆడ మృగం. ఉ.హరి. 4.29; విశే. ఆడజాతిది. ఆడది. మను. 2.7.

క. పిడి. ఆడఏనుగు; త. పిటి. ఆడఏనుగు, పిడి; మ. పిటి. ఆడఏనుగు, ఆడపందులు, ఒంటెలు; కో. పిడయప. న్. ఆడలేడి.

**పిడియేనిక(-ఏనిక)** రూ.చూ. పిడియేనుఁగు. వి. ఆడే నుగు. హరి.పూ. 8.24. **పిడియేనుఁగు(-ఏనుఁగు)** రూ. పిడియేనిక. వి. కరిణి, హస్తి. నిర్వ.రా. 7.47. **పిడివేయు** అ.క్రి. పసుల కరెలో చేయిపెట్టి తిప్పు.

**పిడి³** వి. వాద్య విశేషం. మొల్ల.యు. 3.26.

**పిడిక** రూ.చూ. పిడుక. వి. పేడ, పొట్టుకలిపి ఎండబెట్టి ఆముకాల్పులో వంటచెరకుగా వాడే పలచని పేడముద్ద.

**పిడిక¹** రూ.చూ. పిడుక. వి. పొట్టుకలిపి ముద్దలుగాచేసి పల చగా చరిచి ఎండిన పిడప వంటచెరకుగా ఉపయోగించే పేడ.

**పిడిక²** రూ.చూ. పిరిక¹. వి. **1.** బెండు, పడుబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకుబిళ్ళ; **2.** అనుసు, తాపీ పిడిమీది రేకుచుట్ట.

**పిడికటకర్ర** చూ. పిడికిలి.

**పిడికటికట్టు** చూ. పిడికిలి.

**పిడికటిపోటు** చూ. పిడికిలి.

**పిడికిలి** రూ. పిడి¹, పిడె². వి.బా. ముడుపబడ్డ వేళ్లున్న అర చేయి. ముష్టి. భార. ఆది. 6.295, భార. శాంతి. 4.398.

క. పిడి. ముట్టడించు, పట్టు, గ్రహించు, ముట్టడి, పిడి కెడు తీసుకోవటం, పిడితె. ముట్టడి, పిడిపు. ముట్టడించ బడు, పిడియిసు, పిడిసు. ముట్టడించేట్టు చేయు, పిడిపు. ముట్టడించడం; కొడ. పుడి-. (-తె-చ్-). పట్టు పట్టు కొను, పుడి. చేతినిండా; తు. పిడిత, పిడిత్త, పిడ్త. వివేకం, తీర్పు. హిడి. పట్టు, చేతినిండా తీసుకొను, పుడి. పిడి, కత్తిపిడి, పుడ, పుడు. పట్టుకోడం, గ్రహించడం; త. పిటిత్తమ్. వచ్చినదాంట్లో కొంతదాచడం, పొదుపు, పిటిత్తు. చేతినిండా, పిటిప్పు. గ్రహించు, పట్టుకొను, పిడి; మ. పిటిక్క. ముట్టడించు, పట్టుకోడం, అర్థంచేసు కోడం, పిటిచ్చు, మొదలుపెట్టడం, పిటిత్తమ్. గ్రహించు. పిడి, జ్ఞానం, పిటిప్పిక్క. ముట్టడించేట్టుచేయు, గ్రహించు, పిటిప్పు. అంటుకొను, పరిమాణం, పిటి. గ్రహించు, పట్టుకోడం, చేతినిండా, పిడి; కో. పిడ్బ-. చెయ్యి గట్టిగా పట్టుకోడం, పిడ్క. చేతినిండాఉన్న అన్నం మొ., పిచ్. అన్నంముద్ద; తొ. ఇడ్య-. (ఇడ్త్-). ముట్టడించు, గట్టిగా పట్టుబడు; గోం. పిడానా. పట్టుకోడం, లాక్కోడం; పర్జి. పిడ్క. కౌగలించుకొను; కొలా. పిడియ. గుత్తి, చిన్న కట్ట.

**పిడికటకర్ర** వి. ఊనిముగ్గు, గీతముగ్గు, వేళ్ళ సందుల నుంచి ముగ్గుపిండి వదులుతూ గీసిన సమాంతర రేఖలు. **పిడికటికట్టు** వి. వింటిమధ్య భాగం, లస్తకం. ఆం.భా. 2.211. **పిడికటిపోటు** వి. దోర్మధ్యం. **పిడికిలిగూటం** రూ. పిడికిలుగూటం. వి. ఉన్ని ఏకేటప్పుడు, సరంకొట్టే కొయ్య పనిముట్టు. **పిడికిలించు** అ.క్రి. గుప్పిలిపట్టు. భార.ఉద్యో. 2.181; స.క్రి. పిడికటపట్టు. భోజ. 7.148. త. పిడిత్తపిడి.

<పిడికిలి + -ఇంచు[3]. **పిడికిలింత** వి. నమస్కార విశేషం. భార. ఉద్యో. 2.181. **పిడికెడు** వి. గుప్పెడు. భీమ. 6.15. <పిడికిలి + -ఎడు.

**పిడికిలు** రూ.చూ. పిడకలు. వి.బ.వ. పేడ, పొట్టుకలిపి ఎండబెట్టి ఆముకాల్వులో వంటచెరకుగా వాడే పలచని ముద్దలు.

**పిడికిలుగూటం** రూ.చూ. పిడికిలిగూటం. వి. ఉన్ని ఏకేటప్పుడు, నరంకొట్టే కొయ్యపనిముట్టు.

**పిడికె** రూ.చూ. పిడుక. వి.బ.వ. పేడ, పొట్టుకలిపి ఎండబెట్టి ఆముకాల్వులో వంటచెరకుగా వాడే పలచని ముద్దలు.

**పిడికెబొమ్మ** రూ.చూ. పిడకబొమ్మ. వి. పశువులకు వచ్చే ఒకరకం వ్యాధి.

**పిడికెడు** చూ. పిడికిలి.

**పిడిగోలుకర్ర** రూ.చూ. పెడకోలగర్ర. వి. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల, అల్లుచేసేటప్పుడు కట్టిన పంగరకట్టె.

**పిడిస** రూ.చూ. పిడుచ. వి. ముద్ద, కబళం.

**పిడిసి** రూ.చూ. పిడుచ. వి. 1. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; 2. గొంగడి నేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గుడ్డ; 3. నేతనేసేటప్పుడు బట్ట ముందు భాగం బిరుసెక్కటానికి గంజి - కొన్నిచోట్ల అంబలి పూసే గుడ్డ.

**పిడిపె**[1] వి. ఒకనొక జాతి పావురం. శ్రీనాథుని చాటువు.

**పిడిపె**[2] రూ.చూ. పిడుచ. వి. 1. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; 2. గొంగడి నేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గుడ్డ: 3. నేతనేసేటప్పుడు - బట్ట ముందు భాగం బిరుసెక్కటానికి గంజి - కొన్నిచోట్ల అంబలి పూసే గుడ్డ.

**పిడీతరుపిడీ** అవ్య. తరతరాలుగా, సంతానుగతం.

సం. పీఠికా. ఆసనం, స్థానం, పదవి; హిం. పీఢీ. వంశం, తరం; మరా. పిఢీ. తరం, వంశం.

<మరా. పిఢీ.

**పిడుక** రూ. పిడక, పిడిక, పిడికి[1], పిడికె, పిడ్క. వి. 1. వెలిమిడి, భక్ష్యం. భాస్క.రా.యు. 300; 2. గోడ మొదలైన వాటికి చరిచి ఎండబెట్టిన పేడముద్ద. ఆము. 3.35, క్రీడా. పీఠి. 77.

క. పిట్కె, పిక్కె. గొర్రెలు, మేకలు, లేళ్ళు, ఎలుకలు మొ. వాటి పేడ; త. పిఴుక్కై. మేక, గొర్రె, ఎలుక మొ. వాటి పేడ; పిఴుక్క. ఎలుకలు, పాములు మొ. వాటి మలం.

పో.చూ.సం. పిష్టక-. భక్ష్యం, నువ్వుపొడి.

**పిడుకమొనలి** రూ. పిడకమొనలి. వి. చిన్నమొనలి.

**పిడుగు** రూ. పిడువ, పిడ్గు. వి. అశని, మేఘాల రాపిడితో భూమ్మీద పడే తేజఃఖండం. భార. ఆది. 6.113; విశే. అతిబాధాకరమైన, మిక్కిలి బాధించేది. శుకస. 3.20.

క. పిడుగు. పిడుగు; త. పిటుకు; మ. పిణర్.

**పిడుగుకైదువు** వి. వజ్రాయుధం. వసు. 5.36. **పిడుగుతునక** రూ.చూ. పిడుగుతున్క. విశే. అశనిఖండంలాంటి వాడు, మిక్కిలి సమర్థుడు. రామలిం. శ. 13. **పిడుగుతున్క** రూ. పిడుగుతునక. విశే. అశనిఖండంలాంటివాడు, మిక్కిలి సమర్థుడు. రామాభ్యు. 7.180. **పిడుగుమొత్తిపరాయి** వి.బొ. 1. పిడుగుచే అదుముపడినరాయి; 2. జవాబుచెప్పనివాడు, మూర్ఖుడు, స్తబ్ధుడు. **పిడుగుసుడి** వి. నడినెత్తిమీద (కొమ్ముల మధ్య) ఉండే సుడి.

**పిడుగుడు** వి. మందుల్లో ఉపయోగపడే ఒకరకంచెట్టు (clerodendron infortunatum).

**పిడుచ** చూ. పిడుచు.

**పిడుచగట్టు** చూ. పిడుచు.

**పిడుచగొను** చూ. పిడుచు.

**పిడుచపాత్ర** చూ. పిడుచు.

**పిడుచు** స.క్రి. 1. పసరు మొ. పిండు. శు.సం. 8.101, పి.శకు. 1.135; 2. ముద్దలా అదిమి బిగపడుచు. హరి. పూ. 5.189.

క. పిళి. బయటికి వచ్చేట్టుపిండు, ఎండిపోవు; తు. పుర్బుని. పిండు (నిమ్మకాయలాగ), పురెబుని, పురెచుని; త. పిఴి (పిఴిన్త్-). పిండు, కారు (తలనుండి నూనె): మ. పిఴియుక. పిండు; కో. పిశ్ప్. పిండు; కుఇ. పిడిస్పా (పిడిహ్త్-). పిండు; మాల్తో. పిల్స్; బ్రా. (పిన్చ్). పిండు, గట్టిగా నొక్కు, సందేశం.

<మూ.ద్రా. *పిఴ్.

**పిడుచ** రూ. పిడచ, పిడస[1], పిడిస, పిడిసి, పిడెసె[2], పిడ్స, పిడ్సె. వి. ముద్ద, కబళం. భార. విరా. 2.134. **పిడుచగట్టు(-కట్టు)** అ.క్రి. ముద్దకట్టు. దశా. 2.136. **పిడుచగొను(-కొను)** స.క్రి. కబళించు, మింగు. భార. విరా. 2.134. **పిడుచపాత్ర** వి. అలుకుచుట్ట. **పిడుచుకర్ర** వి. రంగు అద్దిన నూలు లడీలు గుంజకు తగిలించి పిండేకర్ర. **పిడుపు** వి. పొడిపొడిగా వండినకూర. **పిడుపుకర్ర** వి. రంగు అద్దిన నూలు లడీలు గుంజకు తగిలించి పిండేకర్ర. **పిడుపుబాన** వి. చాకళ్ల ఉబ్బలో బట్టలుడకబెట్టడానికి వాడే పెద్ద మట్టి పాత్ర.

**పిడుఁజు** రూ.చూ. పిడుఁదు. వి. పశువుల దేహంలోచేరి రక్తం పీల్చే క్రిమి విశేషం, గోమారి.

**పిడుత** రూ. పిడత[1], పిడ్త. వి. చాలా చిన్నకుంట. వేంక. పంచ. 1.591.

త. పిడియల్.

**పిడుఁదు** రూ.చూ. పిడుఁదు. వి. పశువుల దేహంలో చేరి రక్తం పీల్చే క్రిమి విశేషం, గోమారి. శుకస. 3.398.

**పిడుపు** చూ. పిడుచు.

**పిడుపుకర్ర** చూ. పిడుచు.

**పిడుపుబాన** చూ. పిడుచు.

**పిడువరించు** చూ. పిడువ.

**పిడువ** రూ.చూ. పిడుగు. అ.క్రి. అతిశయించు, మిక్కుటమగు; వి. అశని.

**పిడువరించు** అ.క్రి. 1. అతిశయించు, మిక్కుటమగు. శు.సం. 6.137; 2. పిడుగువలె ఘోషింపచేయు.

**పిడె**[1] రూ.చూ. పిడెము[2]. వి. వెదురుపొద, గుంపుగా మొలిచి ఉండే పొదలు.

**పిడె²** రూ.చూ. పిడికిలి. వి. 1. పత్తిరాట్నం తిప్పటానికి కుడివైపు నిలువకొయ్యకు బిగించిన పిడి; 2. రాట్నం ఇరుసు తిప్పేపిడి; 3. దబ్బారాట్నం ఇరుసు తిప్పేపిడి; 4. పడుగుమప్పే కుంచె పట్టుకోటానికి బిగించిన కొయ్య; 5. మరమగ్గంలో ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నాడెను నెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజేది; 6. నేత మోకును చుట్టే పళ్ళ చక్రం తిప్పటానికి చేతిగూటానికి బిగించిన పల్ల; 7. రెండులడీల సూలు; 8. పెట్టెలో ఉండే సూలు కట్ట; 9. నాలుగుతులాల బరువు తూగే పట్టు.

**పిడెము¹** చూ. పిడి¹.

**పిడెము²** రూ. పిడె¹. వి. వెదురుపొద, గుంపుగా మొలిచి ఉండే పొదలు.

**పిడేరపుగువ్వ** వి. ఒకరకం పావురం.

**పిడేరుబద్ద** వి. రెండు నొగల బండి నొగలను వెనకవైపు బిగించి పట్టిన కఱ్ఱ, పిరాడి.

**పిడేలు** రూ. ఫిడీలు, ఫిడేలు. వి. వాయులీనం, సంగీత వాద్య విశేషం.

ఇం. *fiddle*. వాయులీనం.

< ఇం. fiddle

**పిడేలుబెజ్జం** వి. జాలు, పిట్టగోడలోని డిక్కైనుకంత. **పిడేలుబొక్క** వి. జాలు, పిట్టగోడలోని డిక్కైనుకంత.

**పిడేటి** చూ. పిడి¹.

**పిడేటు** చూ. పిడి¹.

**పిడ్క** రూ.చూ. పిడక. వి. గోడ మొ.వాటి పై చరిచి పంట పెట్టే పేడ ముద్ద. దా.మం. 1.131.

**పిడ్గు** రూ.చూ. పిడుగు. వి. అశని, మేఘాల రాపిడితో భూమ్మీద పడిన తేజఃఖండం. పో.చ. 2; విశే. అతి బాధకం, మిక్కిలి బాధించేది.

**పిడ్త** రూ.చూ. పిడత. వి. గిన్నెలాగ ఉండే చిన్న మట్టిపాత్ర.

**పిడ్వ** రూ.చూ. పిడువ. వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట.

**పిడ్వఎసల** వి. కుండల్ని నర్పేటపుడు కుమ్మరి కుడిచేతి వైపు పెట్టుకొనే నీళ్ళపాత్ర. **పిడ్వకోరి** వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోడానికి వాడే తడిబట్ట. **పిడ్వగుడ్డ** రూ.చూ. పిడవగుడ్డ. వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. **పిడ్వపాత** వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోటానికి వాడే తడిబట్ట. **పిడ్వపేలిక** వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోడానికి వాడే తడిబట్ట. **పిడ్వబట్ట** రూ. పిడ్వ బట్టి. వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోడానికి వాడే తడిబట్ట. **పిడ్వబట్టి** రూ.చూ. పిడ్వబట్ట. వి. కుండల్ని నర్పేటపుడు నలపను తడుపుకోడానికి వాడే తడిబట్ట. **పిడ్వబండ** రూ.చూ. పిడవబండ. వి. నర్పేటపుడు నలపను తడిచేసుకోడానికి తడిగుడ్డపెట్టుకొనేరాయి. **పిడ్వరాతి** వి. నర్పేటపుడు నలపను తడిచేసుకోడానికి తడిగుడ్డ పెట్టిన రాయి.

**పిడ్పె** రూ.చూ. పిడుచ. వి. 1. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ; 2. గొంగడి నేతలో పడుగు తడపటానికి అంబలిలో ముంచిన గుడ్డ; 3. నేతనేసేటప్పుడు బట్ట ముందు భాగం బిరుసెక్కటానికి గంజి కొన్నిచోట్ల అంబలి పూసే గుడ్డ.

**పిఱ్జ** రూ.చూ. పిఱ్ఱు. వి. పశువుల దేహంలో చేరి రక్తం పీల్చే క్రిమివిశేషం, గోమారి. ఆం.భా. 2.88.

**పిఱ్ఱు** రూ. పిఱ్జ, పిడుదు, పిఱ్జ. వి. పశువుల దేహంలో చేరి రక్తంపీల్చే క్రిమివిశేషం, గోమారి. ప్రభు. 117. పు. 15 పం.

**పింట** రూ.చూ. పెంట¹. వి. ఎరువు మొ. వాటి కుప్ప.

**పిండలి** వి. ముద్ద. భార.విరా. 2.124.

సం. పిండ-. ముద్ద; ప్రా. పిండలఇయ-. ముద్దగా చేయబడిన.

**పిండలివండు** వి. ముద్దగా నున్న బురద, చిక్కని బురద. భార.విరా. 3.156. **పిండలివండులగు** అ.క్రి. ముద్ద కట్టిన బురదకలదగు. చిత్ర. భా. 2.53.

**పిండాకుడు** రూ.చూ. పిండాకూడు. వి. శ్రాద్ధకర్మల్లో పెట్టే అన్నం ముద్ద.

**పిండాకుండ** వి. చిన్నకర్మరోజున పిండం వండటానికి వాడే మట్టిపాత్ర.

సం. పిండ-. పితృదేవతలకు పెట్టే అన్నం మొదలైన వాటి ముద్ద.

< సం. పిండ- + కుండ.

**పిండాకూటికుండ** చూ. పిండాకూడు.

**పిండాకూడు** రూ. పిండాకుడు. వి. శ్రాద్ధకర్మల్లో పెట్టే అన్నం ముద్ద.

సం. పిండ-. పితృదేవతలకు పెట్టే అన్నం మొదలైన వాటి ముద్ద.

< సం. పిండ- + కూడు.

**పిండాకూటికుండ** రూ. పిండాకూడుకుండ. వి. చిన్నకర్మ రోజున పిండం వండటానికి వాడే మట్టిపాత్ర. **పిండాకూడు కుండ** రూ.చూ. పిండాకూటికుండ. వి. చిన్నకర్మరోజున పిండం వండటానికి వాడే మట్టిపాత్ర.

**పిండారి** వి. 1. ఒకజాతివాడు. కృష్ణ.శ. 3.25. (ఈ జాతి వాడు పూర్వం బందిపోటు దొంగతనాలు చేసే వారని వాడుక); 2. మొరకు.

హిం. పిండారీ. వ్యవసాయం చేస్తూ అవసరమైనప్పుడు బందిపోటు దొంగతనాలు చేసే ఒకజాతి; ఉ. పిండార్మ ఒకజాతి వ్యక్తి.

< ఉ. పిండారీ.

**పిండి¹** వి. 1. బియ్యం మొ.వాటి పొడి. భార.అశ్వ. 4.235; 2. నువ్వులు మొ.వాటి నాడించి, చమురు తీయగా మిగిలిన పిండి; 3. ఆవకాయలో నూనె కలిసిఉండే మెత్తని పదార్థం.

త. పిండి. పొడి, భోజనం, బియ్యం మొదలైన వాటి పొడి; గోం. పిండ్, పిండీ. గోధుంపిండి, పిండీ. బియ్యం మొదలైన వాటి పిండి.

**పిండికుండి** వి. మూరెడు వెడల్పుతో లోతుతక్కువగా కదె మంచుతో ఉండే మట్టిపాత్ర. **పిండికూడు** వి. సంకటి, చిక్కటి అంబలి. భార.అరణ్య. 6.249. **పిండికూర** వి.

ఒకజాతి కూరాకు. జైమినిభా. 4.96. **పిండిగోధుమ** వి. పిండికి ఉపయోగించే తెల్లటి పొట్టిగింజరకం. **పిండిజల్లెడ** వి. పిండి జల్లించడానికి పనికి వచ్చే చాలా సన్న కన్నాలున్న చిన్న జల్లెడ. **పిండిదీపారాధన** వి. తిరుమల వేంకటేశ్వరునికి మొక్కుబడి తీర్చటానికి శనివారం, పచ్చిబియ్యపు పిండి ముద్దలో దీపం వెలిగించి ఆరాధన చేయటం. **పిండిపించు** రూ. పిండిపిండు. విశ. మిక్కిలి నలగగొట్టబడిన. కు.సం. 11.20. **పిండిపిడుగు** వి. రాగి, జొన్నపిండి ఎసట్లో పోసిన తర్వాత తెడ్డుతో కలికేటప్పుడయ్యే ధ్వని. **పిండిపిండము** విశ. నిస్సారమైన. కాశీ. 7.79. **పిండిపిండు** రూ.చూ. పిండిపించు. విశ. మిక్కిలి నలగగొట్టబడిన, నిస్సారమైన. భార.శల్య. 1.122. **పిండిపోడ** వి. చిమిడిన అన్నం ముద్ద. **పిండిపోడలు** వి.బ.వ. భక్ష్యవిశేషం. **పిండిబొప్పి** వి. మూరెడు వెడల్పుతో లోతుతక్కువగా కడెమంచుతో ఉండే మట్టిపాత్ర. **పిండిమండికి** వి. మూరెడు వెడల్పుతో లోతు తక్కువగా కడెమంచుతో ఉండే మట్టిపాత్ర. **పిండిమర్యము** రూ.చూ. పిండిమిరియము. వి. ఒకరకం పులుసు. **పిండిమిరియము** రూ. పిండిమర్యము. వి. పులుసు వెయ్యకుండా పప్పుతోను మిరియంతోను పల్చగా వండిన వంటకం. **పిండిముగ్గు** వి. బియ్యపుపిండి కలిపిన ద్రవ్యంలో వేసే రకపుముగ్గు. **పిండియిడు(-ఇడు)** స.క్రి. దేహాన్ని పిండిగా నలగ్గొట్టి ముద్ద చేయు. మను. 4.90. **పిండిరాయి** వి. తెల్లరాయి, ముగ్గు వేసుకోడానికి పనికి వచ్చే తెల్లని మెత్తటిరాయి **పిండిరాతు** వి. తెల్లరాయి, ముగ్గు వేసుకోడానికి పనికి వచ్చే తెల్లని మెత్తటిరాయి. **పిండిలించు** విశ. మిగుల నలగ్గొట్టబడిన, పొడిపొడి చేయబడిన, నుగ్గునూచమైన. కు.సం. 11.20. **పిండివడియము** వి. పిండితో చేసిన వడియం. విక్ర. 2.238. **పిండివంట** రూ. పిండి వంటకము. వి. పిండిలో చేసిన భక్ష్యవిశేషం. భార. ఆది. 6.291. **పిండివంటకము** రూ.చూ. పిండివంట. వి. పిండితో చేసిన భక్ష్యవిశేషం. శృం.నై. 6.120. **పిండివిరేచి** వి. రంగులు లేకుండా సున్నం మాత్రమే పూసినట్టి అరివేణి కుండ. **పిండెరువు** వి. ఎరువుగా ఉపయోగించే వేరుసెనగ పిండి మొ.వి. **పిండ్రాయి** వి. బొంతరాయి, మెతుకురాయి, మెత్తగాఉండి ఇసకరాలుతూ ఉండేరాయి. <పిండి[1]+రాయి. **పిండ్లు**[1] వి.బ.వ. పిండితో చేసిన ఫలహారాలు.

**పిండి**[2] వి. కొండజువ్వి చెట్టు (Ficus g:bbosa).

**పిండికొండ**[1] వి. తెల్లని పూలుపూసే మొక్క (Aerva Javanica). **పిండికొండ**[2] వి. బంజరుల్లోనూ అడవుల్లోనూ పెరిగేమొక్క (Justicia tranquebariensis). **పిండిచిత్త** వి. వరితెగులు, ఆకులుమీద పిండిపోసినట్టు తెల్లటి మచ్చ ఏర్పడే తెగులు. **పిండిదుంప** వి. నాలుగైదు నెలల్లో ఒదువకు వచ్చేదుంప (Ipomaea batata<). **పిండిదొండ** వి. ఒకరకం దొండ. హంస. 4.10. **పిండిపరిమి** వి. గట్టిగా ఉండే ముళ్ళుకలిగిన ఎర్రని కలపనిచ్చే ఒకరకం చెట్టు (zizyphusrugosa). **పిండిబంత** వి. ఒకానొక చెట్టు. **పిండిబంతదుబ్బు** వి. ఒకానొకచెట్టు. **పిండిబెండ** వి. నల్లరేగడి నేలల్లో ఎక్కువగాపెరిగే కలుపుమొక్క (Abutilon species). **పిండిబొద్దికూర** వి. ఒకరకం కూరాకు. **పిండిమారేడు** వి. లేతపసుపురంగు కలప. మెరిసే ఆకులు కలిగిన ఒకరకం చెట్టు (Gelonium multiflorum).

**పిండు**[1] స.క్రి. 1. రసాదులువెలికి వచ్చేట్లుపిండు. వరాహ. 10.59; 2. పాలుపితుకు. వేంక. పంచ. 4.455; 3. అవులు మొదలైనవి పాలిచ్చు. వేణు. శ. 17.

క. పిణ్డు, హిణ్డు. పిండు, గట్టిగాగిల్లు; తు. పిణ్డొ. పిండబడినవి, హిణ్డొ. పిండగామిగిలింది. ఫురజ్బుని. పిండు, ఫుణ్డుని. పిండు (తడిబట్టలాగ). రసంకోసం నొక్కు; కొలా. పిన్డ్, పీన్డ్. పిండు, మెలిపేయు.

<మూ. ద్రా. *పిళ్-న్ట్-/*పిళ్-న్ప్-.

**పిండు**[2] వి. సమూహం, గుంపు. భార. ఆది. 5.210.

సం. పిండ-. ముద్ద, రాశి; ప్రా. పిండ-. రాసి, సమూహం, గుంపు;

క. పిండు, హిండు. సమూహం; తు. ఫుండు. గుంపు; త. పింటుమ్.

<సం. పిండ-.

**పిండుగట్టు (-కట్టు)** అ.క్రి. గుమిగూడు, సంఘీభవించు. భార.భీష్మ. 3.190. **పిండుగొను(-కొను)** అ.క్రి. గుమిగూడు, సంఘీభవించు. కు.సం. 1.88. **పిండురము** వి. సమూహం, గుంపు. కళా. 6.247.

**పిండెరువు** చూ. పిండి[1].

**పిండ్రము** విశ. అధికమైన, మిక్కుటమైన. వరాహ. 5.93.

**పిండ్రాయి** చూ. పిండి[1].

**పిండ్లు** చూ. పిండి[1].

**పితకలాటకం** రూ. చూ. పితలాటకము. వి. 1. లోపిలికి, వెలిపిలికి వెనుక ముందాడటం; 2. మోసం; 3. తంట; 4. వెంట తగలటం.

**పితవకంది** చూ. పిదప. వి. కందుల్లో ఒకరకం.

**పితర** రూ.చూ. పితరుడు. వి. 1. తండ్రి, జనకుడు. మార్క. 3.177; 2. పితృదేవత.

**పితరదొర** వి. పితృపతి, యముడు. నీలా. 1.22.

**పితరుడు** రూ. పితర, పెతరుడు. వి. 1. పితృదేవతలు, వంశంలోపుట్టి చనిపోయినవాళ్ళు. భార. అరణ్య. 4.203; 2. తండ్రి, జనకుడు. రాఘవ. 1.46, విజ్ఞా. ప్రా. 2.66.

సం. పితృ-. తండ్రి; ప్రా. పిఅర, పిఅ, పిఇఇ, పిఇఉ; గొ. పిదా; అమా. పిత. తండ్రి; పా. పితర్; క. పిత, పితర. తండ్రి; త. పితర.

<సం. పితృ-.

**పితరులచుక్క** వి. పితృదేవతాకమైన నక్షత్రం; మఘా నక్షత్రం. **పితరులతేడు** వి. పితృదేవతలరాజు, పితృపతి. అచ్చ. రా. కిష్కిం. 104.

**పితరులచుక్క** చూ. పితరుడు.

**పితరులతేడు** చూ. పితరుడు.

**పితలాటకము** రూ. పితకలాటకం, పితలాటము. వి. 1. వంచన, మోసం; 2. లోభత్వం; 3. వెనుక ముందాడటం;

4. వెంటతగలటం ; 5. తంటా.

క. పిత్తలాట. గారడి, అబద్ధం, మోసం ; త. పిత్తలాట్టమ్. మోసం, దగా ; మ. పిత్తలాట్టమ్. అబద్ధం, గారడి ; కో. పితల. టమ్. మాటనిలబెట్టుకోలేక పోవడం ; చూ. తు. పికలాట.

**పితలాటము** రూ. చూ. పితలాటకము. వి. **1.** మోసం, వంచన ; **2.** లోభత్వం.

**పితాళ్లు** చూ. పితరుడు. వి.బ.వ. పితృదేవతలు, మృతిచెందిన పితృపక్షం వారు. పండి. చ. 1.83. రం. రా. అయోధ్యా. 141ప. 6పం.

**పితుకు** రూ.చూ. పిదుకు. స.క్రి. **1.** పిండు. హరి. పూ. 1.131 ; **2.** ఇచ్చు. స్రవింపచేయు. కాశీ. 4.301 ; **3.** కొంచెం కొంచెంగా ఇచ్చు ; వి. గేదె, ఆవు మొ. వాటి చన్ను.

**పితుకుడుపప్పు** రూ. పితుకుపప్పు. వి. ఆనపగింజలు పచ్చిపి నానబెట్టి, తొక్క పితికి వేసి ఎండబెట్టిన పప్పు ;
**పితుకుపప్పు** రూ.చూ. పితుకుడుపప్పు. వి. ఆనపగింజలు పచ్చివి నానబెట్టి, తొక్క పితికివేసి ఎండబెట్టినపప్పు.

**పితూరి** రూ. పితూరీ, ఫితూరి, ఫితూరీ. వి. **1.** రాజద్రోహం. కలహం, కుట్ర ; **2.** దాడి, గొడవ.

హిం. ఉ. ఫితూర్. జగడానికి సంబంధించిన, చెడ్డ, ఫితూర్. జగడం ; పార. ఫుతూర్. క్షీణించటం ; అర. ఫుతూర్. బలహీనం.

< ఉ. ఫితూరీ.

**పితూరీ** రూ.చూ. పితూరి. వి. **1.** కుట్ర ; **2.** దాడి.

**పిత్తకోళ్లు** వి.బ.వ. ఎడ్లబండి వెనుకనుంచి పట్టుకొని ఎక్కటానికి బిగించిన కొయ్యలు.

**పిత్తడి** చూ. ఇత్తడి. రూ. పిత్తళి. వి. ఇత్తడి. ద్వి. పరమ. వి. 4.323ప.

క. పిత్తల, హితలె, హిత్తలి, హిత్తాళె. ఇత్తడి ; తు. పిత్తలె ; త. పిత్తళై ; మ. పిత్తళ, పిచ్చళ ; కూ. పితలో ; కువి. పిత్తడ ; కొలా. పితొల్ ;

సం. పిత్తల-, పీతల-, పీతలోహ-. ఇత్తడి ; ప్రా. పిత్తల-. ధాతువిశేషం ; అప. పిత్తల-.

**పిత్తడికాసు** వి. మత్స్యవిశేషం. ప్రబంధ. 165.

**పిత్తపరిగలు** వి.బ.వ. చేపగాఉండే చిన్నచేపలు.

సం. పిత్త-. పిచ్చ, రోగవిశేషం.

< సం. పిత్త- + పరిగ + -లు.

**పిత్తర** వి. చిన్నగోలి.

**పిత్తళిఆద్యావరాలు** చూ. పిత్తడి. వి. ఇత్తడిపాత్ర. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 904. క్రీ.శ. 1291.

క. అత్తణిగె. పాత్ర.

**పిత్తళి** రూ.చూ. పిత్తడి. వి. ఇత్తడి.

**పిత్తు** వి. అపానవాయువు. కవిరా. 150 ; అ.క్రి. అపానవాయువు విడుచు. చంద్రరే. 2.77.

క. పూసు. అపానవాయువు. (<*హ-<*పి-) : తు. పూపుని. అపానవాయువు విడుచు, పూసి. అపానవాయువు ; గోం. పిత్తానా. గాలివిడుచు, పిత్త ; కూ. పిత (పితి-). పీత- ; కువి. పిత్నా (పిత్తయని). పిత్- (పిత్య-పిత్-) ; మాల్తో. పితె, పిత్.

< మూ. ద్రా. *పిత్-/*పిత్త-.

**పిత్తుకొను** అ.క్రి. **1.** అపానవాయువు విడుచు ; **2.** అసమర్థతను వెల్లడించు ; **3.** రహస్యంగా చెప్పు.

**పిదప** వి. ఔ. అవ్య. **1.** వెనుక. కొలప్రకారంత కానరం. 8 వ శతాబ్ది ; **2.** లోభి : విశే. **1.** తక్కువ, నీచమైన. పండి. ప. 2.101ప ; **2.** వెనకటిది. భార. ఉద్యో. 3.412.

క. పిన్, పిమ్, హిమ్. వెనకఉండు, తరువాత, పిన్తు, పిన్దు, పిన్దె. వెనకఉన్నది, వెనుక, ముందు, పిఱ్ఱు. వెనకఉండు, తరువాత, పెఱ. వెనుకవైపు, పెఱగు. వెనకవైపు, వెనకఉన్నది ; కొడ. పిత్తియె. తరువాతది ; తు. పిర. వెనుక, తరువాత, పిరవు. వెనుక, పిరవు. వెనక ; త. పిన్. వెనుక, తరువాత కాలంలో, తరువాత, పిన్పు. తరువాతి కాలం లేక స్థలం పిమ్మట, పిన్నుమ్, పిన్నార్, పిన్నె. తరువాత, పిన్నై. తరువాత కాలంలో, పిమ్మట, పిన్ఱు (పిన్ఱి-). వెనుక వెళ్ళు. వెనుతిరుగు, తరువాత, పిన్తె, పిత్తై. తరువాత రోజు, తరువాత, పిఱుక్కు. వెనుక, పిఱకు. తరువాత, వెనకవైపు. పుఱమ్. వెనుక ; కో. పిన్ద్-. (పిన్ద్మ్-). వెనుకనడుచు, పిబల్. తరువాత, వెనుక, పిబ. ర (పిబ. త్.). వెనక, వెనకవైపు, పితలి, పితె-. ల్. వెనుక, పిగ. ర (పిగ.త్). వెనక, వెనకవైపు, పితిత, పితె. ల్. వెనుక, పిగ. ర (పిగత్-, పిగ. ట్). వెనుక స్థలం ; తొ. పిన్. తరువాత, చిన్న. పుద. ల్. వెనక. తరువాత ; కూ. ప్రాటు. పిదప ; కువి. పిసా. తరువాత. పిస్తా. తరువాత. పిదప ; మాల్తో. పిసి. కింద, పిస్తి. కిందది.

< మూ. ద్రా. *పిన్.

**పిదపకాలము** వి. వినాశకాలం.

**పిదపిద** వి. అనుకుగా ఉండటాన్ని సూచించే అనుకరణం. కృ.శత. 2.144 ; విశే. **1.** మృదువు, మెత్తని. పండి. చ. 1.61 ప.; **2.** (దీనికి కర్మధారయంలో నిగాగమం వస్తుంది) అనుకు, పల్చని.

**పిదపిదవ** విశే. అనుకు, పల్చనిది. భాగ. 10 పూ. 756 ; వి. **1.** అనుకుదనం, పల్చదనం ; **2.** మార్దవం, మెత్తన ; **3.** భయం.

**పిదుకు** రూ. పితుకు. స.క్రి. **1.** (పాలు) పిండు. భార. ద్రోణ. 2.211 ; **2.** పాలుఇచ్చు (పశువులు). జైమినిభా. 6.9.

క. పిదుకు. పిండు, పండులాగ నొక్కు, సురుగు ; త. పితుఙ్కు (పితుఙ్క్-) ముందుకు తోయు, ముందుకు వచ్చు. తెలియచేయు, పితుక్కు (పితుక్క్-). బయటికి వచ్చేట్టు నొక్కు. చీము పండిన బయటికి వచ్చేట్టు పిండు, బుడగలాగ ఊడు, బయటికి పిండు, పితుక్కకు. ముందుకు తోయు, వదిలించు, పితక్కు (పితక్క్-). బయటికి వచ్చేట్టు పిండబడు, నులుమబడు ; మ. పిచుఙ్కుక. పిండబడు, బయటికి నొక్కబడు, పితుక్కుక, పితఞ్ఞుక, ఫుతుక్కుక, నొక్కు, బొబ్బనుంచి చీము పిండు ; తె. పిఛిక్స్

(పిథిక్స్య-). పిండబడు, పిఖిక్- (పిఖిక్య-). పిండు; గోం. పిమ్యా.కానా. మలవిసర్జనలో బాధపడు, పర్జి. పిద్. పిండు, పాలు పితుకు; కొలా. పిచ్క్-. సొక్కు; కురు. పెదెఖ్నా (పెద్ఖస్-), పెద్ఖఅనా. గిచ్చు పిండు; మాల్తో. పెథ్గె. (పెద్దపండు) పగులు, పెథ్గ్రె. (పండు) పగులు. చూ. త. పిచ్చె.

<మూ.ద్రా. *పిట్- యుక్క్-/ *పిట్- యుక్కు.

**పిన** రూ.చూ. పిన్న. విణ. చిన్న. వేంక. పంచ. 1.480.

**పినగుమ్మడు**[1] వి. ఒకజాతి గుమ్మడి. **పినగుమ్మడు**[2] వి. బేకుచెట్టు. **పినతండ్రి** వి. 1. తండ్రి తమ్ముడు. దశా. 3.96; 2. తల్లిచెల్లి భర్త. **పినతల్లి** వి. 1. తల్లిచెల్లెలు. ఉ.రా. 4.107; 2. తండ్రి తమ్ముని భార్య. **పినవాఁడు** రూ. పిన్ననాఁడు. వి. బాల్యదశ. చిన్ననాడు. ముకుంద. 3.307. **పినపిచ్చి** వి. వృక్ష విశేషం, ఒకానొక చెట్టు. పి.శకు. 2.14. **పినపిన** విణ. మిక్కిలి చిన్న. వేంక. పంచ. 1.481. **పినపెద్ద** రూ.చూ. పిన్నపెద్ద. వి. కుమ్మరి కుల పెద్ద.

**పినాంన్సు** వి. ధనాదాయం.

ఇం. *finance*. ధనాదాయం.

<ఇం. finance.

**పిని** రూ.చూ. పెన. వి. పురి, తాడు పేనడంలో తిప్పే మెలిక.

**పినిచుట్టి** వి. సర్వేటవుడు కుమ్మరి కూర్చోడానికి గడ్డితో గుండ్రంగా చుట్టినచుట్ట. **పినిపీట** వి. కుండల్ని సర్వేటప్పుడు కుమ్మరి కూర్చోడానికి కింద గడ్డెపెట్టి చేసిన మట్టిపీట. **పినిపెట్టు** స.క్రి. పేను, పెనయు.

**పినుఁగు** రూ. పిలుఁగు. విణ. 1. దుర్బలుడు, శక్తిహీనుడు. బసవ. 6.201 పు. 889 పం.; 2. అల్పుడు, నీచుడు. శివత. సా. 256; 3. అవివేకి, బుద్ధిహీనుడు. కేయూ. 3.278; 4. దుష్టుడు, క్రూరుడు. వేంక.పంచ. 2.12; 5. లోభి, పిసినిగొట్టు. ఆము. 6.78; వి. బోయవాడు, లుబ్ధకుడు. శుక. 1.165.

సం. పిలు-. పరమాణువు.

<సం. పీలు-.

**పినెట్టు** చూ. పిని.

**పింద** రూ.చూ. పిందియ. వి. పచ్చికాయ; విణ. పందని.

**పిందియ** రూ. పింద, పిందె. వి. లేతకాయ. కాశీ. 4.114.

క. పిఞ్జు, హీచు, ఈచు. పువ్వునుంచి అప్పుడే కొత్తగా ఏర్పడ్డకాయ; త. పిఞ్చు. లేతకాయ; మ. పిఞ్చు. అప్పుడే ఏర్పడ్డ లేతకాయ.

**పిందె** రూ.చూ. పిందియ. వి. 1. చాలా లేతకాయ. హరిశ్చ. 1.212; 2. జంబాలకారి, తన్ను తాను ఎక్కువ చేసుకొని మాట్లాడేవాడు.

**పిందెలపేటు** వి. మామిడి పిందెలపేటు.

**పిన్న** రూ. పిన, షన్న. విణ. 1. చిన్న. కు.సం. 9.97; భార. ద్రోణ. 4; 2. అల్పుడు, తక్కువవాడు. సీలా. 2.40; 3. తేలికైన, చులకని; 4. నూనెనిచ్చే గింజల్ని కాసే ఎర్రని కలపకల ఒకరకం చెట్టు (Bashia long'folia).

త. పిన్. చిన్నతమ్ముడు, పిన్నర్. చిన్నతమ్ముడు, పిన్నవనె. చిన్నతమ్ముడు, చిన్నకొడుకు, పిన్నన్. చిన్న తమ్ముడు, పిన్నై; ఉ. పిని, పిన్ని. కొంచెం, చిన్న. తేలిక, పిజ్యజ్ఞు. చిన్న. కొంచెం, పన్ని. చిన్న; కొ. పి.న్. చిన్న (కొడుకు), రెండవ (భార్య); కొం పిన. చిన్న, కొంచెం.

**పిన్నకక్కెర** వి. పక్షివిశేషం. **పిన్నగోరంట** రూ.చూ. పిన్నగోరఁట. వి. పొదవైన, తెల్లని పూలుపూసే కొండల మీద పెరిగే ఒకరకం మొక్క (Barleria longiflora). **పిన్నగోరఁట** రూ. పిన్నగోరంట. వి. ఒకజాతి గోరంట. **పిన్నగ్రద్ద** వి. చింద, పక్షివిశేషం. **పిన్నచెఱకు** వి. హలిని. **పిన్నజమ్మి** వి. నేలజమ్మి, శమీరం. **పిన్నఁజేయు(-చేయు)** స.క్రి. లాఘవపర్చు, చిన్నబుచ్చు, అవమానపర్చు. భాగ. 10 పూ. 1.762. **పిన్నటవవ్వు** రూ. పిన్నటినవ్వు, పిన్న నవ్వు. వి. మందహాసం, చిరునవ్వు. కు.సం. 8.101. **పిన్నటవాఁడు** రూ.చూ. పిన్ననాఁడు. వి. చిన్నతనం, బాల్యం. జైమినిభా. 1.59. **పిన్నటినవ్వు** రూ.చూ. పిన్నట నవ్వు. వి. మందహాసం, చిరునవ్వు. భార. ద్రోణ. 4.72. **పిన్నటివాఁడు** రూ.చూ. పిన్ననాఁడు. వి. బాల్యం, చిన్న తనం. ఇందు. 1.119. **పిన్నంయు** వి. భూషా విశేషం. ద.హిం.గా.సంపు. 4. గా.సం. 1844. త. పిన్నంతండు. **పిన్నతఁడు** వి. చిన్నవాడు. జైమినిభా. 8.143. <పిన్న + అతఁడు. **పిన్నతనము** వి. 1. లఘుప్రవర్తనం, తప్పుపని. నీచకృత్యం. వేంక. పంచ. 4.511; 2. హైన్యం. కొరత, న్యూనత. విప్ర. 4.27; 3. బాల్యం, పసితనం. ఉ.రా. 2.150. **పిన్నతుమికి** వి. కాకిఋమికి. **పిన్నది** విణ. చిన్నది, చిన్నవయసుది. భార. ఆరణ్య. 7.318. <పిన్న + అది. **పిన్నదూలగోవెల** వి. దూలగోవెల, కండూర. **పిన్ననవ్వు** రూ.చూ. పిన్నటనవ్వు. వి. చిరునవ్వు, మందహాసం. భార. ఉద్యో. 3.52. **పిన్ననాఁడు** రూ. పిననాఁడు, పిన్నట నాఁడు, పిన్నటినాఁడు. వి. చిన్నతనం, బాల్యం. భార. కర్ణ. 3.75, విక్ర. 1.27. **పిన్నపిల్లి** వి. విషాదిక, రంజని. **పిన్నమదురు** వి. ఏనుగు నొసటి బుడిపి, వాతకుంభం. **పిన్నవెల్లి** వి. ఆకు పచ్చతో కూడిన పసుపురంగుగల, దుర్వాసనకల పూలు పూసే చిన్నచెట్టు, క్షుద్రాగ్ని మంథం. **పిన్నవేరేయు** వి. కాకి నేరేడు. **పిన్నపని** వి. 1. తేలికపని, చులకనైన పని. చంద్రాంగ. 4.162; 2. అగౌరవం పని, లఘుచేష్ట. సురా. 138. **పిన్నపాప** వి. 1. బాలిక. శృం.నై. 2.66; 2. బాలుడు. ఉ.రా. 1.80. **పిన్నపాపఁడు** వి. బాలకుడు. భార. ద్రోణ. 2.149, ద్వి.పరమ. వి. 3.627. **పిన్నపాఁవర** వి. ఒకజాతి పావర, గోతుంబ. ఆం.భా. 2.71. **పిన్నపాల** వి. దూదిపాల, అందమైన ఒకరకం చెట్టు, మనుపాల. ఆం.భా. 2.68 (oxystelma esculentum). **పిన్న పెద్ద** రూ. పినపెద్ద. వి. కుమ్మరి కులపెద్ద. **పిన్నప్పుడు** వి. చిన్నప్పుడు. ఇందు. 2.133. < పిన్న + అప్పుడు. **పిన్నబిడ్డాటలు** వి.బ.వ. బాలక్రీడలు. భాగ. 10పూ. 1212. <పిన్న + బిడ్డ + ఆట + -లు. **పిన్నబూరబారి** వి. పిన్న బూరను ఊదేవాడు. ద.హిం.గా. సంపు. 5. గా.సం. 80.

పిన్నబూరుగ రూ.చూ. పిన్నబూరుగు. వి. సముద్రంలో ఉపయోగించే పడవల్ని తయారుచేసే కలపనూ, మందుల్లో ఉపయోగించే ఒకరకం జిగురునూ, దూదినిఇచ్చే ఒక రకం చెట్టు (Bombax malabaricum). పిన్నబూరుగు రూ. పిన్నబూరుగ. వి. శాల్మలి (Bombax malabaricum). పిన్నమ రూ. పిన్నమ్మ. వి. 1. పినతల్లి, తల్లిచెల్లెలు, మాతృష్వస. విజయ. 2.108; 2. తండ్రితమ్ముని భార్య. త. పిన్నవళ్. చిన్నచెల్లెలు. పిన్ని. చిన్నచెల్లెలు, తల్లి చిన్నచెల్లెలు, పిన్నె. చిన్న చెల్లెలు. పిన్నమ్మ రూ.చూ. పిన్నమ. వి. 1. పినతల్లి, తల్లిచెల్లెలు, మాతృష్వస; 2. తండ్రితమ్ముని భార్య. <పిన్న+అమ్మ. పిన్నములక వి. కొండల మీదా, రోడ్లపక్కనా పెరిగే ఒకరకం మొక్క (Solanum xanthocarpum). పిన్నముల్లంగి వి. క్షుద్రమూలకం. పిన్నమెఱుంగలు వి.బ.వ. ముతకవర్గలో ఒకరకం. పిన్నయిప్ప (-ఇప్ప) వి. మధూకం (Bassia longifolia). పిన్నయేలకి (-ఏలకి) వి. పత్రల. పిన్నయ్య వి. తండ్రితమ్ముడు. త. పిన్నర్. చిన్నతమ్ముడు. పిన్నవన్. చిన్నతమ్ముడు, చిన్నకొడుకు, పిన్నన్, పిన్నె. <పిన్న+అయ్య. పిన్నతికము వి. చిన్నతనం, బాల్యం. ఆం. భా. 2.117. పిన్నవరగోగు వి. చిన్నపూలు పూసే తెల్లనికలప కలిగిన ఒకరకం చిన్నచెట్టు. కమలవల్లభ (Salvadora persica). పిన్నవాఁడు విశే. చిన్నవాడు. భాస. విరా. 2.152. పిన్నాటలు వి.బ.వ. పిల్లాటలు. <పిన్న+ఆట+-లు.

పిన్నలి వి. 1. వరి, మెలి. ద్వి. వరమ. వి. 4.321పు. 14పం.; 2. ఆభరణ విశేషం. ద.హిం.గా. సంపు. 4. గా.సం. 675.

పిన్నాటలు చూ. పిన్న.

పిన్ని వి. 1. పినతల్లి, తల్లిచెల్లెలు; 2. పినతండ్రిభార్య.
తు. పిని, పిన్ని. చిన్న; త. పిన్ని. చెల్లెలు, తల్లి చెల్లెలు, తరువాతిది, పిన్నె. తమ్ముడు, చెల్లెలు.

పిన్నీ వి. మట్కీలపై మూతగా వేసే మట్టిమూకుడు.
ఇం. *Pin*. ఒకదాన్ని పట్టి ఉంచేది.

పిన్నీసు వి. ఒకరకం సూది బొత్తాం.
ఇం. *Pin*. గుండుసూది, ఆల్పి. వాడిఐన కొనకల సన్నని ఇనప పదార్థం, మేకు.
పిన్నీసుచిక్కుడు వి. చల్లటి వాతావరణంలో పెరిగే పొట్టికాయరకం, గింజ చిన్నదిగా ఉండేరకం చిక్కుడు.

పిమ్ని వి. 1. మరాసు మీద పడుగుతోడేటప్పుడు, అనులు పడేట్టు పోగును ఇరపటానికి ఒకకొయ్య పట్టెకు బిగించిన రేకుముక్క; 2. పేటుదారానికి చివరకట్టిన పురిదారంలో అంచుపోగు దూర్చేసందు; 3. గుండుసూది.
ఇం.*Pin* . గుండుసూది.
<ఇం. Pin.
పిమ్నిబద్ద వి. మరాసు కట్టుబడిలో పడుగు పోగులు దూర్చే బెజ్జాలు గల రేకుముక్కలు, ఉంగరాలు బిగించిన కొయ్యపట్టె.

పిన్నె వి. సూలుపోగుల తెక్క.
పిన్నెరు విశే. పిన్నెసూలుకల.

పిపీలికామార్గములు వి.బ.వ. అగాధ్యకాలు, క్షణికాలు. పండి. చ. 2.5.418పు.
సం. పిపీలికామార్గ-. చీమలదారి.
<సం. పిపీలికామార్గ- (అర్థవిపరి.).

పిప్పి రూ. పిప్పరి, పుప్పి, ప్రుప్పి. వి. 1. రసంపిండివేయగా మిగిలిన చెరకు, ఆకు మొదలైనది. కు. సం. 1.30; 2. తరక, కాల్చిన సున్నాన్ని జల్లించగా వచ్చిన తుక్కు; 3. కళ్ళంలో గింజలు రాల్చిన తర్వాత మిగిలేకంకి; 4. తొలుపుడు పురుగులవల్ల ఏర్పడేతెగులు.
క. హిప్పి, హిప్పె. రసంపిండగా మిగిలినపదార్థం; తు. పుప్పి, పుప్పు. నాశనం, చెడినస్థితి.
పిప్పికంకి వి. కళ్ళంలో గింజలు రాలినకంకి. పిప్పికాయ వి. బాగానమలలేక పశువు ఉమ్మివేసే గడ్డిచుట్ట. పిప్పి కొమ్ము వి. కొమ్ముపుచ్చి పోవటం. పిప్పిగడ్డి వి. కళ్ళంలో మెదిగిన గడ్డి. గింజలురాలినగడ్డి. పిప్పిగింజ వి. గగ్గులలో రాలినగింజలు. పిప్పిచలియడుగు(-అడుగు²) స.క్రి. దొరకని చోట వ్యర్థంగా వెదకు. తాళ్ల సం. 6.50. పిప్పిచేయు స.క్రి. రసంపిల్చి చెత్తనుమిగుల్చు. పిప్పింట రూ. పిప్పెటి. వి. ఏటా లేచిపెరిగే మెత్తటి ఆకులకలుపు మొక్క (Acalypha India). పిప్పింత్రేకు వి. ఒకటి రెండడుగుల ఎత్తు పెరిగే మొండికలుపు మొక్క, దీన్ని ఆకు కూర దినుసుగాను, చర్మవ్యాధుల చికిత్సలోను ఉపయోగిస్తారు (Acalypha India). పిప్పితెగులు రూ. పిప్పిదెగులు. వి. వరి, జొన్న మొ. వాటి తెగులు, దొలుపుడు పురుగు (Chilo Sp.) పడటంవల్ల దంటులోపలి దెండు పుచ్చి ఎర్రబడుతుంది. పిప్పిదెగులు (-తెగులు) రూ.చూ. పిప్పితెగులు. వి. వరి, జొన్న మొ. వాటి తెగులు. పిప్పి పేడుసు వి. మెదిగిన కంకులకుప్ప. పిప్పిపన్ను వి. పురుగు పట్టిన పన్ను. పిప్పిరాశి వి. గగ్గిగింజల కుప్ప. పిప్పిరేగడి వి. నిస్సారమైన రేగడినేల.

పిప్పింటతీగ వి. బండి మురుడుడు తీగ. (Calycopteris flouribunda).

పిప్పిరి రూ.చూ. పిప్పి. వి. సారం తీసేయగా మిగిలిన చెరకు, ఆకు మొ.వి. జైమిని భా. 5.157.
పిప్పిరిచేయు స.క్రి. పిప్పిచేయు. జైమినిభా. 6.157.

పిప్పెటి రూ.చూ. పిప్పింట. వి. కలుపుమొక్క.

పిబ్రవరి రూ.చూ. ఫిబ్రవరి. ఆంగ్లసంవత్సరంలో రెండో నెల.

పింపిణి రూ.చూ. పింపిణీ. వి. తలపై పెట్టుకొనేనగ.

పింపిణీ రూ. పింపిణి. వి. స్త్రీ వేణివిశేషం, ఆరవారి ఒకరకం జడ. సత్య. సా. 3.104.

పింపిరి వి. తుప్పు.

పింపిళులు రూ. పింపిళ్లు. వి.బ.వ. పెదవి మీదుగా ఒకవిధమైన ధ్వనిని కలిగించి నర్తించే బాలక్రీడా విశేషం. కా. 6.202.
పింపిళులుగూయు (-కూయు) రూ.చూ. పింపిళ్లుగూయు. అ.క్రి. 1. పెదవులతో తూతూ అని ధ్వనిచేస్తూ చలించు;

2. పింపిళ్లాట ఆడు ; 3. నర్తించు ; 4. వంగిఆడు.

పింపిల్లాడు చూ. పింపిళ్లు.

పింపిళ్లు రూ.చూ. పింపిళులు. వి.బ.వ. పెదవి మీదగా ఒకరకం ధ్వనిచేస్తూ నృత్యంచేసే బాలక్రీడా విశేషం. హంస. 5.155.

పింపిళ్లాడు అ.క్రి. 1. నాట్యంచేస్తూ నమస్కరించు. హంస. 4.203 ; 2. పింపిళ్ళాట ఆడు. పింపిళ్లగూయు (-కూయు) రూ. పింపిళులుగూయు. అ.క్రి. 1. పెదవులతో తూతూ అని ధ్వనిచేస్తూ చలించు. నృసింహ. 2.67 ; 2. పింపిళ్ళాట ఆడు. వరాహ. 4.155 ; 3. నర్తించు. చిందులు తొక్కు, ఎగిరిపడు. వసు. 4.23 ; 4. వంగిఆడు. పాండురం. 5.75.

పింపిసలాడు చూ. పింపిసలు.

పింపిసలు చూ. పింపిళులు. వి.బ.వ. చెల్లాచెదరు. నిర్వ. రా. 4.57.

పింపిసలాడు అ.క్రి. 1. నర్తించు. చిందులుతొక్కు. రసిక. 6.119 ; 2. బాలికలు పెదవిమీదగా ఒకరకమైన ధ్వని చేస్తూ నృత్యంచేయు. రుక్మి. ప. 1.56. <పింపిసలు + ఆడు.

పిమ్మట[1] వి.శే. వెనక, అనంతరం. కు. సం. 10.152. వేంక. పంచ. 1.7 ; అవ్య.ద్రు. 1. పరోక్షంలో, చాటున. భార. అను. 4.384 ; 2. మునుపు. పూర్వకాలం. వసు. 4.67.

క. పితమ్; త. పిన్పు. మ. పిన్ ; గోం. పయె. తర్వాత. పెరెక, పెరొక, పెర్క్, పఱెయ్క్, పర్కె, పరేక్. వెనక, ప్ఱెక్, ప్ఱెయెక్. వెనక, తర్వాత. పెహకె. వెనక, పెర్కె. తర్వాత, వెనక.

పిమ్మటిప్రేలు వి. బొటనవేలి తర్వాతివేలు, చూపుడు వేలు. వేంక. పంచ. 1.7.

పిమ్మట[2] రూ. పిమ్మటము. వి. 1. బాధ. దుఃఖం. విజయ. 3.3 ; 2. భయం. పద్మ 9.231 ; 3. శోకం.

పిమ్మటగొను (-కొను) అ.క్రి. బాధపడు. ఆము. 4.35.

పిమ్మటము రూ.చూ. పిమ్మట[2]. వి. మూర్ఛావస్థ, మనోవ్యథ.

పిమ్మటిగొను (-కొను) చూ. పిమ్మట[2]. అ.క్రి. భీతిగొను. వర. రా. అయోధ్య. 1.13.

పిమ్మటినొందు (-పొందు) చూ. పిమ్మట[2]. అ.క్రి. కుంచించుకొనిపోవు. పాండు. 2.190.

పిమ్మటిప్రేలు చూ. పిమ్మట[1].

పియర్ వి. బేరిపలం లాంటి ఒకజాతిపండు.

ఇం. *Pear*. బేరిఫలం లాంటి ఒకజాతిపండు.

<ఇం. Pear.

పియ్య రూ.చూ. పీయి. వి. మలం.

పియ్యతికలబంద[1] వి. అందం కోసం పెంచబడే మొక్క (Agave americana).

పియ్యతికలబంద[2] వి. అందం కోసం పెంచబడే మొక్క (Agave vivipara).

పియ్యతిపాణకు వి. చెడువాసనకల పూలుపూసే, నిరుపయోగకరమైన కలపనిచ్చే చెట్టు (Sterculia foetida).

పియ్యతుమ్మ వి. తెల్లని ముళ్ళుకలిగిన ఒకరకం తుమ్మచెట్టు (Acacia eburnea).

పియ్యాగరు వి. పసుగేరి, తెల్లనిపూలూ, పచ్చని పళ్ళూ ఉండే ఒకరకం చిన్న చెట్టు (Cordia monoica).

పియ్యి రూ.చూ. పీయి. వి. మలం. నె.గా. సంపు. 3. ఉదయగిరి. 47.

పిర వి. రూపాయిలో రెండువందలయాభైఆరోవంతు, కానిలో నాల్గోభాగం.

పిరకా రూ.చూ. ఫిర్కా. వి. తాలుకాలోని కొంత భాగం.

పిరకాసి రూ.చూ. పికాసి. వి. ఒకవైపు సూదిలాగా, రెండోవైపు వెడల్పుగా, పలుగులున్న పనిముట్టు, చేలల్లో గడ్డిదుబ్బులు కొట్టటానికి, గట్లుపొయ్యటానికి ఉపయోగించే పనిముట్టు.

పిరకాసు రూ.చూ. పికాసి. వి. ఒకవైపు సూదిలాగ, రెండోవైపు వెడల్పుగా పలుగులుండి చేలల్లో గడ్డి దుబ్బులు కొట్టడానికి గట్లు పోయటానికి ఉపయోగించే పనిముట్టు.

పిరగుంత రూ.చూ. పిర్రగుంట. వి. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనే చోటు.

పిరంగి రూ.చూ. ఫిరంగీ. వి. 1. లోపల మందుగుండు వేసి దట్టించి కాల్చే పెద్ద లోహం గ్రోవి. కృష్ణరా. 3.71, కళా. 8.75, కుక్కు. 2.140, హంస. 5 59; 2. ఖడ్గం, పెద్ద కత్తి. ఆం.భా. 2.214.

పిరంగిగుండు వి. తూటుగుండు, పడిగల్లు.

పిరంగికా పూ.చూ. ఫిరంగీ. వి. లోపల మందుగుండును వేసి దట్టించి కాల్చే పెద్ద లోహపు గ్రోవి. రాజవా. 2.78.

పిరంగీ రూ.చూ. ఫిరంగీ. వి. 1. లోపల మందుగుండు వేసి దట్టించి కాల్చే లోహంగ్రోవి. రంగా.చ. 2.38 ; 2. ఖడ్గం, పెద్దకత్తి.

పిరజాదా రూ.చూ. పీరుజాదా. వి. ధర్మగురుసుతుడు.

పిరట్ట రూ.చూ. పిర్రపట్ట. వి. 1. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గం ముందు వేసుకొన్న గోనెగుడ్డ; 2. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనే చోటు.

పిరపట్టె రూ.చూ. పిర్రపట్ట. వి. 1. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనే చోటు ; 2. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ.

పిరవడు చూ. పిరము.

పిరపీట రూ. పిరపేట. వి. మగ్గంముందు, నేతపనివాడు కూర్చొనే చోటు.

పిరపేట రూ.చూ. పిరపీట. వి. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనే చోటు.

పిరము విశే. 1. ప్రియమైన, ఇష్టమైన. చంద్రాంగ. 2.66 ; 2. హెచ్చువెలకల.

సం. ప్రియ-. ఇష్టమైన; ప్రా. పియ-; పా. పియ ; క. పిరియ. ఇష్టమైన; త. పిరియం.

<సం. ప్రియ-.

పిరపడు అ.క్రి. ఇష్టపడు, ప్రియపడు. ప్రబంధ. 194. <పిరము+పడు.

పిరపీల రూ.చూ. పిర్రచీల. వి. ఏకికోల పదతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు.

**పిరాకాసి** రూ.చూ. పికాసి. వి. ఒకవైపు సూదిగాను, రెండో వైపు వెడల్పుగాను పలుగులుండి చేలల్లో గడ్డిదుబ్బులు కొట్టడానికీ, గట్లు పొయ్యటానికీ ఉపయోగించే పనిముట్టు.

**పిరాటదబ్బ** రూ.చూ. పిరాటుబద్ద. వి. నొగలను వెనకవైపున బంధించిన కఱ్ఱ.

**పిరాటుబద్ద** రూ. పిరాదుబద్ద, పిరాటదబ్బ, పిరిటిబద్ద. వి. పంగలగా ఉన్న ఒనికఱ్ఱలపై పొడుగ్గా వేసిన కఱ్ఱ.

**పిరాట్టిదేవి** వి. స్త్రీ దేవత. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 1052. క్రీ.శ. 1350.

**పిరాదకట్టె** వి. నొగలను వెనక వైపున బంధించిన కఱ్ఱ.

**పిరాది** రూ. పిరాది[1]. వి. పిరాటుబద్ద, బండిచట్రానికి వెనక వైపు బిగించే బద్ద.

**పిరాది[1]** రూ.చూ. పిరాడి. వి. రెండు నొగలబండి నొగలను వెనకవైపున బంధించిన కఱ్ఱ.

**పిరాదికట్టె** వి. ఒకరకం నొగల బండి పరానికి ముందున్న పట్టె.

**పిరాది[2]** రూ.చూ. ఫిర్యాదు. వి. 1. విన్నపం; 2. దోషారోపణ చేయడం.

**పిరాయించు** స.క్రి. 1. మార్చు; 2. తిరిగి ఇచ్చు.

హిం.ఉ. ఫిర్(నా). తిప్పటం.

< ఉ. ఫిరా(నా) + -ఇంచు[3].

**పిరాయింపు** వి. మార్చడం, మార్పు.

**పిరాయింపు** చూ. పిరాయించు.

**పిరారిబద్ద** వి. రాకబద్ద, పంగగా ఉన్న ఒనికఱ్ఱల మీద పొడుగ్గా పరచిన కఱ్ఱ.

**పిరి** రూ.చూ. పురి. వి. 1. పెంటి, గడ్డిపురి. విజ్ఞా.ప్రా. 104; 2. మెలి. సమీర. 3.111; 3. గోనెలు మొదలైనవి కట్టే తాడు.

**పిరిగొను(-కొను)** అ.క్రి. 1. మెలిగొను, పెనగొను. చిక్కుపడు. కు.సం. 1.35; 2. సాంద్రమగు, దట్టమగు, అతిశయించు. కార.పిరా. 2.59; 3. గుంపుకూడు, సంఘీభవించు. భాగ. 10. ఉ. 1059. తు. పిరిపుని. (తాడులాగ) మెలిపెట్టు, పిరిపావుని. తిరుగు, మెలి, పిరికె. మెలి, చుట్టలు చుట్టలుగా చుట్టుకొను; మ. పిరియుక. మెలిపడు, వంకరచేయు, పిరిక్క. మెలివేయు, పిరిళ్. మెలి, వంకర, పిరిచ్చల్. మెలి, పిరియన్. మెలిపడు, పురియుక. మెలి, చుట్టలు చుట్టుకొను; బ్రా. పిర్ఘింగ్. మెలిపెట్టు (తాడులాగ). **పిరిచిట్టి** వి. ధాన్యపుకొలత, ¼ పోలు. **పిరిచుట్టు** వి. స్త్రీ పరుపులు కట్టుకొనే నడికట్టు. హరి.ఉ. 10.243. **పిరిచుట్టుచుట్టుకొను** అ.క్రి. ఒక చుట్టు చుట్టుకొను. కళా. 4.98. **పిరితీయు** అ.క్రి. వెనుదీయు. వర.రా.యు.పు. 253. పం. 18. **పిరిపీకుచేయు** అ.క్రి. వెనుదీయు. కళా. 3.177. **పిరివెంటి** వి. మెలిపెట్టి పేనిన గడ్డితాడు. బసవ. 3.529.

**పిరికం** రూ.చూ. పిరిక[1]. వి. అచ్చుకట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చుపడుస్తో బిగుపెట్టే కొయ్యచెక్క.

**పిరిక[1]** రూ. పిడిక[2], పిరికం, పిర్క, పిర్కె. వి. 1. చెండు. వరంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకు బిళ్ళ; 2. అనుసు. రాపిపిడిమీటి రేకుపట్ట; 3. ఉన్ని వడికేటప్పుడు కదులుతిప్పే దోకకి ఆధారంగా పెట్టిన మట్టు.

**పిరికవకట్టె** రూ. పిరికనికట్టె, పిరికోనికట్టె, పిర్కనికట్టె. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పే కఱ్ఱ. **పిరికని కట్టె** రూ.చూ. పిరికనకట్టె. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పే కఱ్ఱ. **పిరికోవికట్టె** రూ.చూ. పిరికనకట్టె. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పే కఱ్ఱ.

**పిరిక[2]** చూ. పిలికి. వి. జిడ్డు, మెత్తని నేల.

**పిరికిరాయి** వి. 1. అటక నిర్మించడానికి గోడలో పాతినరాయి; 2. సరిగా కాలక సున్నం దాగా ఇవ్వని రాయి.

**పిరికోవికట్టె** చూ. పిరిక[1].

**పిరిటిబద్ద** రూ.చూ. పిరాటుబద్ద. వి. పంగలగా ఉన్న ఒని కఱ్ఱలపై పొడుగ్గా వేసిన కఱ్ఱ.

**పిరిదేవర** వి. ఉత్సవ విగ్రహం. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1084.

క. పెఱ. వ్యాపించు, కనపరచు; తు. పిర; త. పిఱకు; మ. పిఱాకు; కువు. పిసా.

< మూ.ద్రా. *పిల్ + దేవర.

**పిరింది** చూ. పిమ్మట[1]. అవ్య. వెనక, తర్వాత.

**పిరిపట్టె** రూ.చూ. పిరపట్టె. వి. 1. నేతపనివాడు కూర్చో టానికి, మగ్గం ముందు వేసుకొన్న గోనెగుడ్డ; 2. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనే చోటు.

**పిరియాది** రూ.చూ. ఫిర్యాదు. వి. మొర.

**పిరియాదు** రూ.చూ. ఫిర్యాదు. వి. మొర.

**పిరు** రూ.చూ. పిఱు. విశ. వృత్తిలో కొన్ని క్రియలు అను ప్రయుక్తాలైనప్పుడు 'పిరుదు' శబ్దానికి అంత్యవర్ణం లోపించగా మిగిలేరూపం, వెనుక ఉన్న, పశ్చాద్భాగానికి చెందిన.

**పిరుచను** రూ.చూ. పిఱుసను. అ.క్రి. వెనుదీయు. భయపడు. **పిరుతివియు** రూ.చూ. పిఱుతివియు. అ.క్రి. వెనుదీయు. **పిరుతిపుచు** రూ.చూ. పిఱుతిపుచు. అ.క్రి. వెనుదీయు. **పిరుతీయు** రూ.చూ. పిఱుదీయు. అ.క్రి. వెనుదీయు. **పిరుపడు** రూ.చూ. పిఱుపడు. అ.క్రి. వెనుదీయు, భయపడు. **పిరుపీకు** రూ.చూ. పిర్వీకు. వి. పీకులాట. రచ్చ, జండూటం. **పిరుపోపు** రూ.చూ. పిఱుపోవు. అ.క్రి. వెనుదీయు, భయపడు. **పిరుఓకు** రూ.చూ. పిర్వీకు. వి. పీకులాట, రచ్చ, జంజాటం. **పిరుపీకు** రూ.చూ. పిర్వీకు. వి. 1. బాధ, కష్టం. ప్రభా. 5.155; 2. పీకులాట, పెనుగులాట. కళా. 1.72. **పిరుపీకులాడు** అ.క్రి. పెనుగులాడు. ఆము. 6.17. < పిరుపీకు + -లు + ఆడు. **పిరుపీకులుపెట్టు(-పెట్టు)** స.క్రి. బాధపెట్టు, కష్టపెట్టు. హంస. 5.208. **పిరుపీకులుచేయు(-చేయు)** స.క్రి. 1. బాధించు, పీడించు. వేంక. పంచ. 3.124; 2. పెనగిలాగు, పట్టిలాగు. వేంక. పంచ. 4.850. **పిరుపీకుచేయు(-చేయు)** స.క్రి. 1. పెనగిలాగు, పట్టిలాగు. ఓ. పరమ. వి. 5.54;

2. బాధించు, పీడించు. కుప.చ. 4.83. **పిరుపెట్టు(-పెట్టు)** రూ.చూ. పిఱువెట్టు. స.క్రి. అనాదరించు. **పిర్వీఁకు** రూ. పిరుపీఁకు, పిరుబీకు, పిరుపీఁకు. వి. 1. బాధ, కష్టం. పాండు. 4.146 ; 2. పీకులాట, పెనుగులాట. **పిర్వీఁకులఁబెట్టు(-పెట్టు)** స.క్రి. బాధించు, భయపెట్టు. పాండు. 4.146.

**పిరుదు** రూ.చూ. పిఱుఁదు. 1. వి. వెనుకభాగం, వెనుకటి భాగం ; 2. పిర్ర.

**పిరుదుకొను** స.క్రి. వెంబడించు.

**పిరుందికడ** చూ. పిరుందు.

**పిరుందు** రూ.చూ. పిఱుఁదు. వి. వెనుకభాగం, వెనుకటిభాగం.

**పిరుందికడ** క్రి.విశే. తరువాత.

**పిరుసు** రూ.చూ. పిఱుసు, వి. పరుషభావం ; విశే. పరుషమైన.

**పిర్కా** రూ.చూ. ఫిర్కా. వి. తాలూకాలోని కొంతభాగం.

**పిర్కి** రూ.చూ. పిరికి[1]. వి. 1. వెంటు, వడంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకుబిళ్ళ ; 2. అనును, తాపి పిడిమీద రేకుచుట్ట ; 3. ఉన్ని వడికేటప్పుడు కదురు తిప్పే దోకకు ఆధారంగా పెట్టినమట్టు.

**పిర్కినకట్టె** రూ.చూ. పిరికినకట్టె. వి. దోనెకు నేతబట్ట చుట్టటానికి దోనెతిప్పేకర్ర.

**పిర్కి** రూ.చూ. పిరికి[1]. వి. 1. వెండు, వడంబం గుండును మోసే దారాన్ని పట్టుకొనిఉండే రేకుబిళ్ళ ; 2. అనును, తాపిపిడిమీది రేకుచుట్ట ; 3. ఉన్నివడికేటప్పుడు కదురు తిప్పే దోకకు ఆధారంగా పెట్టిన మట్టు.

**పిర్ర** రూ.చూ. పిఱ్ఱ. వి. 1. గుదం, ముడ్డి ; 2. పిరుదు. నితంబం ; 3. పణత దిగువ వంపు తిరిగిన వెలుపలివైపు.

**పిర్రకట్టె** రూ. పిర్రెకట్టె. వి. ఒకరకం రెండు నాగలబండి. **పిర్రగుంట** రూ. పిరగుంత, పిర్రగుంత. వి. మగ్గం ముందు నేతపనివాడు కూర్చునేచోటు. **పిర్రగుంత** రూ.చూ. పిర్రగుంట. వి. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనే చోటు. **పిర్రచీల** రూ. పిరసీల, పిర్రజిల్ల, పిర్రసిల్ల. వి. ఎడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. **పిర్రజిల్ల** రూ.చూ. పిర్రచీల. వి. ఎడికోల పణతలో దూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు. **పిర్రంటు(-అంటు)** వి. ఒకరకం కలుపుమొక్క. **పిర్రతాడు** వి. గూడనడుముకు అటూ ఇటూ కట్టినతాడు. **పిర్రపట్ట** రూ. పరపట్టె, పిరట్ట పిరపట్టె, పిరిపట్ట, పిర్రపట్టి, పిర్రపట్టు, పిర్రపట్టె, పిర్రెపట్టె. వి. 1. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ : 2. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనే చోటు. **పిర్రపట్టి** రూ.చూ. పిర్రపట్ట. వి. 1. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనే చోటు : 2. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ. **పిర్రపట్టు** రూ.చూ. పిర్రపట్ట. వి. 1. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ : 2. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనేచోటు. **పిర్రపట్టె** రూ.చూ. పిర్రపట్ట : వి. 1. మగ్గంముందు నేతపనివాడు కూర్చొనే చోటు : 2 నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ. **పిర్రపట్టిగోనె** వి. నేతపనివాడు కూర్చోటానికి మగ్గంముందు వేసుకొనే గోనెగుడ్డ. **పిర్రపిల్ల** రూ.చూ. పిర్రచీల. వి. ఎడికోల పణతలోదూర్చి ఊడకుండా చివరకొట్టే కొయ్యమేకు.

**పిర్రిగంటు** చూ. పిర్ర. వి. పణత దిగువ వంపు తిరిగిన వెలుపలి వైపు.

**పిర్రెకట్టె** రూ.చూ. పిర్రకట్టె. వి. ఒకరకం రెండునాగల బండి.

**పిర్రెపట్టె** రూ.చూ పిర్రపట్ట. వి. 1. నేతపనివాడు కూర్చోటానికి, మగ్గంముందు వేసుకొన్న గోనెగుడ్డ ; 2. మగ్గం ముందు నేతపనివాడు కూర్చొనేచోటు.

**పిర్వీఁకు** చూ. పిరు.

**పిర్వీఁకులఁబెట్టు** చూ. పిరు.

**పిఱికి** వి. తలుపుకు వేసే కర్రతాళం.

**పిఱికి** విశే. భయశీలుడు, పంద. కు.సం. 4.16, భార. ద్రోణ. 1.174.

క. పిఱికె. పిరికిపంద, అధైర్యపరుడు ; త. పిఱుఙ్ (-వ్-, -న్ద్-). కంపించు, పిఱుఙ్చ్చి, పిఱుఙ్వు. వణుకు, కంపించు. పిఱుక్కమ్. భయం, భక్తితోకూడిన భయం, పిఱుప్పు. భయం, జాగ్రత్త.

పో.చూ.సం. భీరుక-. పిరికివాడు.

**పిఱికికంద** వి. అధైర్యం. భీరుత్వం. కాశీ. 2.86. **పిఱికితనము** వి. భీరుత్వం. భార. ఉద్యో. 3.57. **పిఱికిపంద** విశే. పిరికివాడు. **పిఱికిమందుపోయు** అ.క్రి. ఆపీఇవీ చెప్పి భయపడేట్లుచేయు. **పిఱికిమెకము** వి. జింక, హరిణం. **పిఱికివాఁడు** విశే. భీరుడు, భయశీలుడు. భార.స్త్రీ. 1.25.

**పిఱు** రూ. పిరు. విశే. వృత్తిలో కొన్ని క్రియలు అనుప్రయుక్తాలైనప్పుడు 'పిఱుదు' శబ్దానికి అంత్యవర్ణం లోపించగా మిగిలే రూపం, వెనుకఉన్న.

**పిఱుచను** రూ.చూ. పిఱునను. అ.క్రి. 1. వెనుతీయు, జంకు ; 2. వెనక్కిపోవు. **పిఱుతివియు** రూ. పిరుతివియు. పిఱుదివియు. అ.క్రి. వెనుదీయు, జంకు. భార. భీష్మ. 3.91. త. పిఱుందిరుప్పు. **పిఱుతిపుచు** రూ. పిరుతిపుచు. అ.క్రి. వెనుదీయు, జంకు. భాగ. 10. ఉ. 794. **పిఱుదివియు (-తివియు)** రూ.చూ. పిఱుతివియు. అ.క్రి. వెనుదీయు, జంకు. **పిఱుదీయు(-తీయు)** రూ. పిరుతీయు. అ.క్రి. వెనుతీయు, జంకు. మను. 3.31. **పిఱుదెస** వి. పశ్చాద్భాగం, వెనకపక్క. చెన్నబసవ. 4.19. **పిఱువడు(-పడు)** రూ. పిరువడు. అ.క్రి. వెనుతీయు. జైమినిభా. 8.156. **పిఱువెట్టు(-పెట్టు)** రూ. పిరువెట్టు. స.క్రి. వెనకపెట్టు, అలక్ష్యం చేయు. చులకనచేయు. భార. శాంతి. 4.62. **పిఱువోవు (-పోవు)** రూ. పిరువోవు. అ.క్రి. వెనుతీయు, వెనక్కిపోవు. హరి.పూ. 6.162. **పిఱువను(-చను)** రూ. పిరుచను, పిఱుచను. అ.క్రి. 1. వెనుతీయు, జంకు. భార. ఆది. 4.202 ; 2. వెనక్కిపోవు. భార. కర్ణ. 3.295. **పిఱువిక్కు(-చిక్కు)** అ.క్రి. వెనకబడు, పిరుదన (వెనక) చిక్కు. కు.సం. 8.94.

**పిఱుఁదిచ్చు** చూ. పిఱుఁదు.

**పిఱుఁదు** రూ. పిరుదు, పిరుందు. వి.బొ. 1. వెనుక, తర్వాత.

భార. ఆది. 1.53 ; 2. నితంబం, కటిప్రదేశానికి వెనకటి భాగం, వెనకటి భాగం. భార. ఆది. 6.9.

క. పిఱె. పిరుదు, పెఱ. వెనకవైపు, పెఱగు. వెనకవైపు, తర్వాత ; త. పిన్ఱు (పిన్ఱి-). వెనకపడు, వెనుతిరుగు, తర్వాత, పిన్ఱై, పిఱ్ఱై. తర్వాత, పిఱక్కు. వెనుక, పిఱకు. వెనుక, తర్వాత, పిఱ్ఱి. వెనకవెళ్ళేది; మ. పిఱకు. వెనకవైపు. తర్వాత, పిఱ్ఱ. మరునాడు, పుఱమ్. వెనుక ; తొ. పెయ్. కటిప్రదేశం, నడుం ; కొం. పితమున్ని. పిరుదు ; కుఇ. ప్డాఱు. వెనక ; పిరుదు ; కొలా. పిర్ర. పిరుదు, గుదం ; నా. పిర్ర, పిరుదు.

పిఱుఁదిచ్చు అ.క్రి. వెన్నిచ్చు, వెనక్కుమరలు. రంగా. చ. 2.168. < పిఱుఁదు + ఇచ్చు. పిఱుఁదుకొను స.క్రి. వెంబడించు, తఱుము. ఉ.హరి. 3.24. పిఱుఁదెక్కు అ.క్రి. వెనకపడు, వెనకదిక్కు. కు.సం. 8.95. < పిఱుఁదు + ఎక్కు.

పిఱుఁదెక్కు చూ. పిఱుఁదు.

పిఱుసు రూ. పిరుసు. విశ. పరుషమయిన, కఠినమైన, తీక్ష్ణమైన. ఉ.హరి. 2.126.

పిఱ్ఱ చూ. పిఱుఁదు. రూ. పిర్ర. వి. 1. గుదం, ముడ్డి. వేంక. అం. మాన. 40 ; 2. పిరుదు, నితంబం. సాంబ. మాన. 19.

కొత. పిరప్. వెనక ; తు. పిర. వెనక ; త. పిఱ్ఱి. వెనక వెళ్ళేది ; నా. పిర్ర. పిరుదు.

పిలక[1] వి. 1. తలమీది జుట్టు కుచ్చు, జుట్టుముడి ; 2. కొప్పు, ఇంటికప్పుపై మొనదేలిన భాగం ; 3. అర్బిలో నాభిరాయిని బిగించే ప్రదేశం.

కొం. పిల్క, పిలిక. పండితోక, వేలాడే జుట్టు చివర్లు ; కువి. పిల్క. (మగవారికి) చెవిదగ్గర వేలాడే వెంట్రుకలు.

పిలకచెవి వి. ఒకరకం రాట్నంబొమ్మకు బిగించిన కొయ్య.

పిలకలు వి.బ.వ. 1. చిన్నపాత్రలు పెట్టుకోవటానికి పీలుగా పొయ్యికి చిలక ముక్కల్లాగా పెట్టిన లోగుబ్బలు : 2. కొన్నిచోట్ల రాట్నం కట్టుబడిలో బొమ్మకుమారుగా బిగించిన రెండు కొయ్యముక్కలు.

పిలక[2] రూ. పిలుక[2], పిల్ల[2]. వి. 1. కందపిలక, అప్పుడే మొలకెత్తుతున్న అరటి మొ. చెట్ల మొక్క : 2. పొగచెట్టు ఆకుకు కాడకు మధ్య వేసే చిగురు.

త. పిళ్. బిడ్డయొక్క మృదువైన అందం, పిళ్. గర్భంలోని పిండం, లేత జొన్న కంకులు, మృదుత్వం ; కొం. పిల. బిడ్డ ; పెంగో. పిల్క. చెట్టు యొక్క లేత మొలక.

చూ. ప్రా. పిల్ల-. చిన్నపక్షి, పెల్ల-, పెల్లగ-. బిడ్డ. లేతది.

పిలంగి వి. నల్లపురుడుదుచెట్టు, లేత ఎరుపురంగు గట్టి కలపకల ఒకరకం చెట్టు (Phyllanthus reticulatus).

పిలపిల వి. మూగటంలోను రావటం పోవటం మొదలైన క్రియల్లోను చెవులు రిక్కించటంలోను అయ్యే ధ్వనికి అనుకరణం. ద్వి.నల. 3.279.

పిలపిలమనివచ్చు అ.క్రి. గుంపులు గుంపులుగా వచ్చు. ధ్వన్యనుకరణం. శుక. 1.412.

పిలంపిలాయమానము వి. నిర్లక్ష్యం.

పిలికె రూ.చూ. పీలిక. వి. 1. నూలు లెక్క, లడిలో దెబ్బయ్యో పంతు నూలు ; 2. 736 పోగుల నూలు ; 3. 7360 పోగుల నూలు.

పిలిచిపీటవైచు చూ. పిలుచు.

పిలిపించు చూ. పిలుచు.

పిలిపించుకొను చూ. పిలుచు.

పిలిపిలి చూ. పిల. విశ. చిన్నచిన్న. ద్వి.పరమ.వి. 5.378.

పిలియమంకెవ వి. పీచునిచ్చే చెట్టు (Ureno sinuta).

పిలిస్తేపలుకు చూ. పిలుచు.

పిలు రూ.చూ. పిల్లు. వి. తృణం, గడ్డి వేంక.పంచ. 1.204.

పిలుక[1] రూ. పిల్క. వి. పశు పక్ష్యాదుల పిల్ల. రామాభ్యు. 2.71.

పిలుకవాటు విశ. పిల్లల్ని పెట్టేది, ఈనేది. ఆము. 4.85.

పిలుక[2] రూ.చూ. పిలక[2]. వి. అరటి మొ. చెట్ల చిన్న మొలక.

పిలుకు రూ. పిల్కు. వి గర్వం, మదం. ఇందు. 3.12 ; వి.బ.వ. పరుషవాక్కులు.

పిలుకుమారు రూ.చూ. పిల్కుమారు. అ.క్రి. చచ్చు, నాశనమొందు. యయా. 3.131. పిలుకుమార్చు రూ. పిలుకుమాఱుచు, పిలుకుమాలుచు, పిలుకుమాల్చు, పిల్కుమార్చు, పిల్కుమాఱుచు. స.క్రి. చంపు, నాశనంచేయు. భార.ద్రోణ. 1.341. పిలుకుమార్పు రూ. పిలుకుమాఱుపు, పిల్కుమార్పు, పిల్కుమాఱుపు. వి. హింస, చంపటం. అం.రా. 2.224. పిలుకుమాఱు రూ.చూ. పిల్కుమారు. అ.క్రి. చచ్చు, నాశనమొందు. భార.కర్ణ. 1.5. పిలుకుమాఱుచు రూ.చూ. పిలుకుమార్చు. స.క్రి. చంపు, నాశనంచేయు. పిలుకుమాఱుపు రూ.చూ. పిలుకుమార్పు. వి. హింస, చంపటం. పిలుకుమాలు రూ.చూ. పిల్కుమారు. అ.క్రి. చచ్చు, నాశనమొందు. భాగ.అశ్వ. 4.78. పిలుకుమాలుచు రూ.చూ. పిలుకుమార్చు. స.క్రి. చంపు, నాశనంచేయు. పిలుకుమాల్చు రూ.చూ. పిలుకుమార్చు. స.క్రి. చంపు, నాశనంచేయు.

పిలుఁగు రూ.చూ. పిసుఁగు. విశ. లుబ్ధుడు, పిసినిగొట్టు వేంక.పంచ. 1.217.

పిలుచు రూ. పిల్చు. స.క్రి. 1. ఆహ్వానించు, రమ్మను. భార.ఆది. 2.180 ; 2. పేర్కొను. రం.రా.ఉ. 29 వ. 9 పం.

తు. బుళ్పుని. అరచు, ఆశ్చర్యంతెలిపేటట్టు బిగ్గరగా కేకవేయు, బుళ్పు. ఏడ్చు : త. పిళిఱు(పిళిఱి). బాకా ఊది చాటించు లేక ప్రకటించు, (ఏనుగులాగ) ఘీంకరించు, (పిళియల్). పెద్దధ్వని, పిళిఱ్ఱు (పిళిఱ్ఱి-). గర్జనధ్వని చేయు, విళ్, విళ్ళు (విళ్.విళ్-). చెప్పు, తెలియజేయు, విళమ్బు. మాట్లాడు, విళర్. పిలుచు, విళి. చెప్పు, పిలిప్పు. పిలవటం, శబ్దం ; మ. విళిక్క. పిలుచు, ఆహ్వానించు. విళి. పిలుపు, ఏడుపు ; తొ. పిళ్య (పిళ్చ్-). గెలుపొందినపుడు గట్టిగా అరచు ; కుఇ. ప్ఱి. బాధతో ఏడ్చు, అరచు, ప్ఱిఇన్బ, ప్ఱిప్ఱిఇన్బ. బాధతో

మాన. 42.

**పుచ్చడిక** రూ.చూ. పుచ్ఛడిక. వి. సిగ్గు.

**పుచ్ఛడిక** రూ. పుచ్ఛటిక, పుచ్చడిక. వి. 1. సిగ్గు. వరాహ. 3.92 ; 2. స్త్రీ. బహుళా. 4.36 ; విణ. సిగ్గరి, లజ్జాళువు.

**పుచ్ఛడికతనము** వి. లజ్జ, సిగ్గు. మను. 2.9.

**పుచ్చికొను** చూ. పుచ్చు[2].

**పుచ్చికోలు** చూ. పుచ్చు[2].

**పుచ్చిపట్టు** చూ. పుచ్చు[1].

**పుచ్చిపోవు** చూ. పుచ్చు[1].

**పుచ్చియ** రూ. పుచ్చె. వి. 1. పుర్రె, పునుక. గౌ. హరి. ఉ. 1015 ; 2. (కొబ్బరి మొ. వాటి) పెంకె.

**పుచ్చివైచు** చూ. పుచ్చు[3].

**పుచ్చు[1]** రూ. ప్రుచ్చు. అ.క్రి. 1. పుప్పిపట్టు, చెడిపోవు. కు.సం. 8.158 ; 2. మిక్కిలి పండు, పరిపాకానికివచ్చు ; వి. 1. ఆముదం పుర్తి. చంద్రరే. 1.65 ; 2. పుచ్చటం. పుప్పి ; 3. విదేశంనుంచి దిగుమతి అయిన ఒకరకం ఎరుపు రంగు.

క. పుళు, పుఱు. క్రిమి, సాధారణ కీటకం, పాము, పుఱు. పురుగులు క్రిములుతిన్న పదార్థం, పుఱుచిల్. చెడిపోయినది, కుళ్ళినది, పుఱుకు. పురుగులు తిన్నది, పాడైనది, కంతి, పుర్ప్పు. నశించినది, దుర్మార్గం, కొడ. పుళు. పురుగు, పుజ్జ్- (పుజ్జి-). (మాంసం) కొద్దిగా కుళ్ళిపోవు, (పండు) కొంచెం చిముపట్టు ; తు. పురి. పురుగు, తవటి పురుగు, చిమ్మట, చర్మంమీద ఉండేది. పుర. పురు. నత్త, పురిగళ్లు. పురుగులు తిన్న వస్తువు, పురుగులు తిన్న. పురుక్కని. కుళ్లు, నశించు, పుర్‌జ్జుని, పురుజ్జుని, పులియు, కుళ్లు, నశించు, పుర్‌జ్జెలు. పులిసిన, నశించిన. పుర్‌జ్జటు. పులియబెట్టటం, నశించు, పుప్పి, పుప్పు. నశించు, కుళ్ళుతనం ; త. పుఱు. పురుగు, క్రిమి, (-ప్ప్-. -త్త్-). పురుగుల్ని పెంచు. పనికిమాలిన (పురుగులు తిన్నదానివలె) పుఱుప్పు. పురుగుల్ని పెంచటం ; మ. పుఴు, పురుగు, గొంగళిపురుగు, క్రిమి, పురుగుపిల్ల, చిమ్మట, తవటి పురుగు, పుఴుక్క. పురుగులచేత తినివేయబడ్డది, కుళ్ళబెట్టు, పుచ్చిపోవు ; కో. పు. పురుగు, క్రిమి ; తొ. పుఫ్. పురుగు, పేగుల్లోని పురుగు. ఉ. శరీరం. మెదడు, చర్మం మొ. వానిలో ఉండే పురుగు, గోం. పుడీ. పురుగు, క్రిమి, పుడీతానా. పురుగుల్ని పెంచు (గాయంలో) ; కొం. పిడి (బహు. పిడ్క). నత్త ; కుఇ. ప్రిడ, ప్లిడ. (బహు. ప్లిక), పిడు (బహు. పిడ్క). రెక్కలు లేని క్రిములు, పురుగు, క్రిమి ; కువి. ప్రియూలి (బహు. ప్రిక.). గొంగళిపురుగు, ప్లిగులి. క్రిమి ; పర్జి. పుడుత్ (బహు. పుడ్తిల్.) ; కొలా. ప్ర్‌రె. పురుగు ; నా. ప్ర్‌రె. పురుగు ; గ. పుడుత్. క్రిమి ; కురు. పొఖో. పురుగు ; గొంగళిపురుగు, పేడపురుగు లార్వా, పొచ్చ్‌నా. పుచ్చ్‌యస్. పురుగుల్ని వర్ధించు (దెబ్బ. కుళ్ళిన వెన్న మొ.), కుళ్ళిన ; పులిసిన ; మాల్తో. ప్రొచు. పురుగు, గొంగళిపురుగు, పొగ్గొ. కుమ్మరి పురుగు ; బ్రా. ఫూ. క్రిమి, పురుగు.

చూ.సం. పిలు-, పుల్ద-, పుల్లక. పురుగు, పులక. ఒకరకం క్రిమి ; పం. పుళవ. క్రిమి, పురుగు ; హిం. పిల్లూ. పురుగు, పూల్. మాంసంలో ఉన్న క్రిములు.

< మూ.ద్రా. *పుఴ్-/ *పుద్.

**పుచ్చిపట్టు** అవ్య. తప్పనిసరిగా. **పుచ్చిపోవు** అ.క్రి. అధికమగు. ఉదా. అంగట్లో వంకాయలు (ఎక్కువగా ఉండటం వల్ల) పుచ్చిపోయాయి. **పుచ్చుతెగులు** వి. కంది, వంగ, మామిడి మొ. వాటికి పురుగులుపడి కాయ పుచ్చిపోయే తెగులు. దంటు పుచ్చిపోయే తెగులు. **పుచ్చురంగు** వి. పుర్తి చెక్కతో తయారుచేసిన ఎరుపురంగు. **పుప్పు** వి. పశువుల గొరిజలు ముక్కలై పురుగులుపడే వ్యాధి. హరి.పూ. 6.45.

**పుచ్చు[2]** స.క్రి. 1. పోవజేయు, పంపు. భార. ఆది. 2.197 ; 2. ఇచ్చు. కు.సం. 4.96 ; 3. పోగొట్టు, పాపు. కు.సం. 5.130 ; 4. విడుచు, త్యజించు. కు.సం. 11.59 ; 5. (తలుపు మొ.) తెరచు. భార. ద్రోణ. 2.270 ; 6. పుచ్చుకొను, గ్రహించు. భార. శాంతి. 3.431 ; 7. చెదరించు, కదపు. భాస్క.రా.బాల. 224 ; 8. ఇది కొన్ని సకర్మక క్రియల క్త్వార్థక రూపాలకు అనుప్రయుక్త మవుతుంది.

కుఇ. పిహ్ప (పిహ్త్-). విడుదలచేయు, వదులు, వదులుచేయు, పాప పరిహారంచేయు, క్షమించు, విడుదల, వదలటం, పాప పరిహారం ; కువి. పిస్సలి. విడిచిపెట్టు, పిహనై. విడుదల, వదలటం.

**పుచ్చికొను** రూ. పుచ్చుకొను. స.క్రి. 1. స్వీకరించు, తీసికొను. భార. ఆది. 5.50 ; 2. అపహరించు, దొంగిలించు. భార. అను. 5.6 ; 3. లాగు, ఆకర్షించు ; 4. ఆరగించు. (తిను, తాగు) ; 5. స్వాధీన పరుచుకొను, వశం చేసుకొను ; 6. కొను, విలుచు. **పుచ్చికోలు** రూ.చూ. పుచ్చుకోలు. వి. పుచ్చుకోవటం. **పుచ్చుకొను** రూ.చూ. పుచ్చికొను. స.క్రి. 1. స్వీకరించు, తీసుకొను. నిర్వ.రా. 8.62 ; 2. ధరించు, పట్టుకొను. భార. విరా. 4.108 ; 3. స్వాధీన పరుచుకొను, వశంచేసుకొను. భార. విరా. 4.163 ; 4. ఆరగించు (తిను, తాగు). భార. అను. 4.237. శివరా. 3.12 ; 5. అపహరించు, దొంగిలించు. భార. అను. 5.6 ; 6. లాగు, ఆకర్షించు. కళా. 7.79 ; 7. కొను, విలుచు ; 8. తాగు. **పుచ్చుకోలు** రూ. పుచ్చికోలు. వి. పుచ్చుకోవటం. **పుత్తెంచు** స.క్రి. (స్వార్థంలో) పుచ్చు, పంపు. పోవచేయు. భార. ఆది. 2.180, దశా 4.1186. < పుచ్చు + తెంచు. పెంగొ. పిహ్-. (పిస్త్-). వదలు, విడిచిపెట్టు ; మంద. పిహ్-(త్-). వదలు ; కువి. పిహ్-(పిస్త్-). వదలు.

**పుచ్చు[3]** స.క్రి. పెరకు, పెల్లగించు. భార. ఆది. 4.267 ; 2. తీసివేయు. భార. ఆది. 7.256 ; 3. ఎడలించు, తొలగించు. కు.సం. 2.28 ; 4. తుంచు. కు.సం. 5.139 ; 5. ఊడ్చు, తుడుచు. కు.సం. 9.64 ; 6. (అస్త్రాదులు) ప్రయోగించు, ఏయు. ఉ.హరి. 1.40 ; 7. పైకితీయు, తీయు. ఉ.హరి. 2.148 ; 8. చెరచు, పాడుచేయు. శుక. 1.70.

త. పుయ్ (-వ్-.-న్త్-). పుయ్త్-. లాగు, బయటకు లాగిపడు. చింపు, కనపడకుండాపోవు. పెరుకు. గుంజుకొను. (-ప్ప్-, -త్త్-). పెరుకు, బయటకుతోయు, పీకి

వేయు, విడిచిపెట్టు. వేరుచేయు. పుయక్కు. విడిచిపెళ్ళటం, వేరుచేయటం. పూయ్ (-ప్ప్-. -త్త్-). పెరుకు, బయటికి తోయు. పీకివేయు; గోం. పుచ్‌కానా. వదులగు (బూటు, ఉంగరం, గిన్నెమూత మొ.వి). పుచ్క-; పర్జి. పుచ్ప్-. పీకివేయు, తీసుకొను, పుయ్క. బయటకు తోయు; పీకు; కొలా. పుస్- (పుస్త్-). లాగు, బయటకు తోయు. తీసుకొను. (బట్టలు) తీసుకొనివచ్చు; నా. పుస్. పీకు. తీసుకొను, తొలగించు; గ. (ఒల్లా.) పుస్కిర్-. తొలగించు, లాగివేయు (బట్టలు). పుచ్ప్-. బయటకుతోయు, తొలగించు; కుఱు. పుదుగ్-. (పుద్గ్-). పుదఃగ్నా (వద్గస్). పీకు (ఈకలు) పీకుతూ ఒలవటం (పక్షిని): మాల్తొ. పుచె, పుచ్-. తీసివేయు, బట్టలు వేసుకోకపోవు. పుచ్గె. వదులగు.

<మూ. ద్రా. *పచ్- *<పడ్-చ్-.

పచ్చివైచు స.క్రి. 1. తీసివైచు, ఎదలించు. భార. ద్రోణ. 3.209; 2. పూర్తిగా తొలగించు, మిక్కిలి పోగొట్టు. కా. 3.90.

పచ్చె రూ.చూ. పచ్చియ. వి. 1. తలుపురె. ఆం. భా. 2.183; 2. తాడి, కొబ్బరి మొ. వాటిలేతకాయ; 3. ఎద్దుకొమ్ముల కొనకు అలంకారంగా వేసే తొడుగు; 4. కమ్మల సీలలు, డిప్పు; 5. పేకవారం కంతెఅపుర్చే నాడెకొన.

పచ్చెకట్టుతాడు వి. కాడిని పోలుగర్రకు కలిపికట్టేతాడు. పచ్చెగోలు వి. తలుపురెక్కలమీద గుండ్రంగా లోతుగా తీసినగాడి. పచ్చెపూయు అ.క్రి. పొగరెక్కు, ఉలతిరుగు.

పంచ వి. మందబయలు.

సం. పుంజ-. రాశి, పోగు.

<సం. పుంజ-.

పంజ వి. మెట్టభూమి, వర్షాధారంతో పండే భూమి.

క. పుణజి. ఒకరకమైన ధాన్యం పండే మెట్టభూమి; తు. పుఞ్ఞ-. కణ్ణ. మంచిధాన్యం పొలం; త. పునమ్. మెట్టసాగుకు పనికివచ్చేనేల, మెట్టపంట, పుఞ్జై. మెట్టభూమి; మ. పుంజై, పునమ్. అడవి. పోడువ్యవసాయం. పున-. క్కణ్టుమ్. కొండమీద కొంతభాగం. పుఞ్ఞ. మెట్టపంట, పుఞ్ఞ-క్కణ్ణమ్. సాగులోఉన్న భూమి, మూడుపంటలు పండేభూమి.

పంజధాన్యము వి. మెట్టనేలలో పండే ధాన్యం. పంజవేల వి. మెట్టపొలం.

పంజకట్టు చూ. పంజము.

పంజము రూ. పంజెం. వి. 1. అరవై పోగులనూలు, ముప్పై ఎనికల నూలు. హంస. 2.22; 2. నులకమంచం యొక్క కాళ్ళకట్టుతాడు; 3. నలబైగూళ్ళ ఉన్నిదారం; 4. లడిలో డెబ్బై లేక నూరో పంతునూలు; 5. అరవైకొలుకుల దారం.

క. పుంజ. అరవైపోగులనూలు;

సం. పుంజ-. రాశి, పోగు.

పంజకట్టు వి. నూలుచెక్క. పంజాలకర్ర వి. అడుబయట దాపిన పడుగులో సరిగుంజవైపు ఎక్కించిన పడుగేరేకర్ర. పంజాలదండ వి. స్త్రీలు మెడలో వేసుకొనే ఒకరకం నగ. క్రీడా. 93. పంజాలదండపెట్టు అ.క్రి. మెడకు రెండువైపులా పెనవేసుకొని వేలాడు. పాండు. 3.62. పంజాలుతెంచుకొనివరుగెత్తు అ.క్రి. మెడలోని హారాలు తగిలి గుండెకిబ్బంది కలుగుతుందని వాటిని తెంచివేసి పరిగెత్తు. పంజాలుతెంపుకువరిగెత్తు అ.క్రి. బెదరిపోయి తప్పించుకొనిపోవు.

పంజాలకర్ర చూ. పంజము.

పంజాలదండ చూ. పంజము.

పంజాలదండపెట్టు చూ. పంజము.

పంజాలుతెంచుకొనివరుగెత్తు చూ. పంజము.

పంజాలుతెంపుకువరిగెత్తు చూ. పంజము.

పంజి[1] వి. సమృద్ధి, పెంపు. దశా. 8.145; విశే. సమృద్ధిగల, సంపన్నం.

సం. పుంజ-, పుంజికా. గుట్ట, పరిమాణం; ప్రా. పుంజ-, పుంజయ; పుంజిఅ. రాశీభూతం; అ. మా. పుంజ-. రాశి; పా. పుంజ-. గుంపు, రాశి; కు. పూంజీ. నిల్వ, ఆస్తి; నే. పుంజీ, పుంజ. గుట్ట, నిధి; బెం పుంజీ. గుట్ట. పెట్టుబడి; హిం. పూంజీ. గుట్ట. రాశి.

<ప్రా. పుంజిఅ.

పంజికొను రూ. పంజుకొను. అ.క్రి. గుబురుకొను, పంజీభవించు. కవిక. 5.110. పంజెడు వి. లావుపాటి.
<పంజి[1] + -ఎడు.

పంజి[2] రూ.చూ. పంజె. వి. వర్షాధారంతో పండేనేల.

పంజి వి. నాలుగు.

సం. పుంజ-. రాశి, పోగు.

<సం. పుంజ-.

పంజు వి. 1. మగకోడి. చంద్రాంగ. 5.115; 2. పక్షుల్లో మగది. ఆం. భా. 2.92; 3. మగవాడు.

క. పుఞ్జు; తు. పూఞ్జె; మ. పూవన్. కోడిపుంజు, మొక్కల్లో మగది; కో. బు. జ్ఞ. కోడిపుంజు.

పంజుదాలుపు (-తాలుపు) వి. కుమారస్వామి. భీమ. 2.28. పంజులపేరువిత్తు వి. ఒకరకం కోడిపుంజు.

పంజుకొను రూ.చూ. పంజికొను. అ.క్రి. 1. తేరుకొను; 2. అరుపుతెచ్చుకొను; 3. కూర్చుకొను.

పంజులూరు చూ. పంగనూరు. వి. అవ్యక్తుడు, వెర్రిమనిషి.

పంజులూరుపెధవ వి. వెర్రిపెధవ, పనికిమాలినవాడు.

పంజె రూ. పంజి[2]. వి. వర్షాధారంతో పండేభూమి, మెట్టభూమి.

క. పుణజి. ఒకరకం ధాన్యం పండే మట్టితోకూడిన మెట్టనేల; త. పుఞ్జై. మెట్టభూమి; మ. పుఞ్జ.

<త. పుఞ్జై.

పంజెడు చూ. పంజి[1].

పంజెం రూ.చూ. పంజము. వి. 1. లడిలో డెబ్బయ్యోపంతు నూలు; 2. లడిలో నూరోపంతు నూలు; 3. అరవై కొలుకుల దారం; 4. అరవైపోగుల పట్టుదారం; 5. నలబైగూళ్ళ ఉన్నిదారం; 6. అరవైగూళ్ళ ఉన్నిదారం.

పటం రూ. పాటం. వి. పాత్రఅంచుకు కింది భాగంలో వెడల్పుగా ఉండే గుండ్రని మధ్యభాగం.

సం. పుట-. దొన్నె, దొప్పవలె ఉండేపాత్ర.

<సం. పుట-.

పటంకీయు స.క్రి. కోలు పట్టినతరవాత మందంగా ఉండే మట్టిని దబ్బతో పలచగా చదునుగా వచ్చేటట్లుచేయు. పటంపట్టు రూ. పటంపట్టు, పొటంపట్టు. అ.క్రి. సారెమీద వాట తయారవుతున్నప్పుడు వాటలోపల ఒకచేయి పెట్టి మధ్యభాగం లావుగా వచ్చేటట్లు చేయటం. పటంమూకుడు వి. చిప్పబుడ్లు మొ. వాటి తయారీకి ముందు పటం పెట్టటానికి వాడే మూకుడు.

పటక రూ.చూ. పట్ట[1]. వి. 1. పట్టుకన్నరూపం; 2. అందం.

పటకలేవె చూ. పట్ట. వి. పట్టల్లో పెట్టేలేవె.

పటగోరంచు రూ.చూ. పటగ్గోరంచు. వి. ఒకరకం చిన్నగోరంచు.

పటగ్గోరంచు రూ. పటగోరంచు. వి. ఒకరకం చిన్నగోరంచు.

పటచెండు రూ.చూ. పట్టచెండు. వి. చెండు, గుడ్డలు మొ. వాటితో తయారుచేసిన ఎగరవేసి ఆడే బంతి, దానితో ఆడేఆట. హంస. 3.146.

క. పుటచెణ్డు, ఎగిరేబంతితో ఆడేఆట.

పటటిలగర వి. మాగాణినేలలో పెరిగే కలుపుమొక్క.

సం. పుట-. దొప్ప, దొన్నె.

పటపట వి. 1. అదరటంలో అయ్యే అనుకరణం. గౌ. హరి. పూ. 1152పం; 2. సంకోచం. ప్రబంధ. 62; విశ. సుందరమైన. అష్టమ. క. 3.167పు. 8పం.

పటపటన విశ. 1. అధికమైన. కాశీ. 6.227. ఆము. 1.78; 2 ప్రస్ఫుటమైన, వృద్ధిపొందిన. పాండు. 2.35.

సం. స్ఫుట-. స్పష్టమయిన.

పటపటనగు అ.క్రి. 1. స్ఫుటమగు, స్పష్టమగు. పి. శకు. 4.54; 2. అధికమగు. మను. 3.28; 3. నున్ననగు, నిగనిగలాడు. ఆము. 4.85.

<పటపటన + అగు.

పటము[1] విశ. అధికమైన, హెచ్చైన. పాండు. 2.13; వి. 1. అశ్వగతి విశేషం. చంద్రాంగ. 2.18; 2. మల్లవిద్యా విశేషం. అం.రా. 2.207.

క. పుఠ. అశ్వగతి విశేషం; త. పుడైప్పు. అధికం, హెచ్చైంది;

సం. ప్లుత-. అశ్వగతి విశేషం; ప్రా. పుఅ.

పటముగులుకు (-కులుకు) అ.క్రి. పట మెగయు, పై కెగయు. రాజవా. 2.43. పటముబ్బు అ.క్రి. పైకి ఉబ్బు. వసు. 2.40. పటమెగయు అ.క్రి. 1. మీదికెగయు, పైకెగయు. భాగ. 10 ఉ. 688; 2. దూకు, లంఘించు. <పటము[1] + -లు + ఎగయు. పటముకెత్తు స.క్రి. మీది కెత్తు, పైకెత్తు. వేంక.పంచ. 1.62. <పటము[1] + -లు + ఎత్తు[1]. పటమెగయు అ.క్రి. 1. మీదికెగయు, పైకెగురు. సారంగ. 3.46; 2. దూకు, లంఘించు. రామాభ్యు. 6.84. < పటము[1] + ఎగయు.

పటము[2] వి. జలనిర్గమమార్గము. తూము. అం.రా. 2.154.

సం. స్ఫుట-. వికసించు, ప్రకటితమగు; ప్రా. ఫుట్ట-, ఫుడ-.

<ప్రా. పుట్ట-.

పటమెక్కు అ.క్రి. 1. వేడెక్కు. శార్ఙ్గ.సం. 11.40; 2. మెరుగెక్కు.

సం. పుట-. దొపర పాకానికై మన్నులోనగువాటిచే రెండు దొప్పలు చేసి ఒకటి కింద మరొకటి మీద పెట్టి కూర్చి చేసిన పాత్ర విశేషం.

<సం. పుట- + -ము + ఎక్కు.

పటమెగయు చూ. పటము[1].

పటాకు రూ.చూ. పొట్టాకు. వి. పైరు పొట్టపై నిటారుగా మొలిచిన ఆకు.

పటాణి రూ. పట్టాని, పటానీ. విశ. 1. ఒకరకమయిన దిశైను కలిగిన; 2. గుండ్రని; వి. ఒకరకమయిన పప్పు దినుసు.

పటాణీగడి చూ. పటాణి. వి. పాతిక అంగుళం వెడల్పున నమచతురంగా నేసిన గడి.

పటాపటుకలు చూ. పట్టు[1], పటుక. వి.బ.వ. పట్టినదాది.

పటానీ రూ.చూ. పటాణి. విశ. ఒకరకం దిశైను కలిగిన.

పటానీఅంచు వి. అంచు నేతకు వేరే దారాలు కలిపి నేసిన ఒకరకం అంచు. పటానీచీర వి. అంచుల మధ్య రంగు పోగులు నాలుగు కొలుకులు నల్ల పోగులు నాలుగు కొలుకులు పెట్టి నేసిన చీర. పటానీవల్లె రూ. పటానొల్లె. వి. కపిల వన్నెలు కలిపి నేసిన చిన్న చీర. పటానొల్లె రూ.చూ. పటానీవల్లె. వి. కపిల వన్నెలు కలిపి నేసిన చిన్న చీర.

పటానొల్లె చూ. పటానీ.

పటికి రూ.చూ. పట్టి[1]. వి. పిటకం, చిన్నగంప. సారంగ. 1.116.

పటికిపొత్తెర వి. తాటాకులో కంబాకారంగా కట్టిన పొట్లం.

పటికూరి చూ. పట్టి[1]. వి. పేములతో పెద్ద గంపలాగా అల్లి మీద తోలు కప్పి కట్టబడిన ఏరు దాటే సాధన విశేషం. ద.హిం.గా.సంపు. 10.గా.సం. 565. క్రీ.శ. 1343.

పటికె రూ.చూ. పట్టి[1]. వి. కూర్పార పొయ్యటానికి ఉపయో గించే వెదురుబద్దల బుట్ట.

పటిక్కు రూ.చూ. పటుక్కు. వి. తెగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

పటిమాడలు చూ. పట్టి[1]. వి.బ.వ. పట్టి భూమిపై చెల్లించ వలసిన ద్రవ్యం రూపమైన పన్ను. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 499. క్రీ.శ. 1233.

పటుక రూ.చూ. పట్టు[1]. వి. 1. పట్టుక; 2. గర్వం.

పటుక్కు రూ. పటిక్కు. వి. తెగటంలో అయ్యే ధ్వని అనుకరణం. ఆము. 4.3.

పటుక్కున అవ్య.క్రియా. హఠాత్తుగా.

పటికె రూ.చూ. పట్టి[1]. వి. కూర్పార పొయ్యటానికి ఉపయో గించే వెదురుబద్దల బుట్ట.

పట్క రూ.చూ. పట్టి[1]. వి. 1. దొన్నె ఆకారంగా తాటాకుతో కట్టింది; 2. అంచుతన్న గంప; 3. చిన్నగంప.

పట్టి వి. 1. వల్మీకం, చీమలపుట్ట, చెదలపుట్ట. భార.ఆది. 1.152, ముంజేరు గానసం. క్రీ.శ. 709; 2. చిన్న పొద.

వి.హం.గా.సంప. 5. గా.సం. 10. శ్రీ.ర. 1102 ; 3. జన్మస్థానం, నెలవు. వరాహ. 9.187 ; 4. సమూహం ; 5. పనాది, గోడ బలంకోసం లోతునుండి కట్టటానికై తవ్విన పల్లం.

క. పుత్తు, పుత్త, హుత్త, హుత్తు, ఉత్త. తెల్లచీమల పుట్ట ; కొడ. పుత్తి పుత్త ; తు. పుణ్చు, పుత్త. పాముల పుట్ట. త. పుఱ్ఱు, పుఱ్ఱుమ్. తెల్లచీమలపుట్ట ; మ. పుఱ్ఱు. ఎలుకలు, తెల్లచీమలు నేలను తొలిచి ఏర్పరచిన పుట్ట ; తొ. పిత్-కుస్వర్య్. తెల్లచీమల పెద్దపుట్ట (కుస్య్-గుంట), పిత్-మొణ్. (మొణ్-. భూమి) ; గోం. పిట్టీ, పుట్టీ. తెల్లచీమలపుట్ట ; కొం. పుత్‌హి. చీమలపుట్ట ; కుఇ. పుసి. తెల్లచీమలపుట్ట ; కువి. పూచి. చీమలపుట్ట. ఫూన్జ. చీమలగూడు (నేలలో) ; పర్జి. పుత్కల్ (బహు. పుత్కచిల్), పుర్కల్, పుత్త, పుట్టు. చీమలపుట్టలో గూడు ; కొలా. పుట్టు. తెల్లచీమలపుట్ట ; నా. పుట్ట ; గ(ఒల్లా). పుట్కల్. తెల్లచీమల పుట్ట ; కురు. పుత్తా. చీమలపుట్ట, పుత్‌బెలో. తెల్లచీమలరాణి (బెలో. పుట్ట) ; మాల్తొ. పుతె. చీమలపుట్ట.

చూ. సం. (పిపీలిక-) పుట-. చీమలపుట్ట. పుత్తికా. తెల్లచీమ.

పో. చూ. క. పుట్టు ; తు. పుంచ ; త. పుఱ్ఱు, పుఱ్ఱుమ్ ; మ. పుఱ్ఱు ; కువి. పూచి, పూంజ ; పర్జి. పుట్కల్ ; కొలా. పుట్టు.

<మూ.ద్రా. *పుట్-.

పుట్టకరవ వి. లోదొడ్డు ఉండే హుజలు లేని మట్టిపాత్ర. పుట్టకలవ వి. ఒకరకం కంచె మొక్క. పుట్టకాపు వి. ఎలుగ్గొడ్డు. పుట్టకాలివాడు విశే. పుట్టలా దుర్మాంసం పెరిగిన కాలున్నవాడు. బోదకాలువాడు. ఆం.రా. 2.122. పుట్టకాలు వి.వా. పుట్టలా దుర్మాంసం పెరిగిన కాలు, బోదకాలు. చంద్రరే. 1.51. పుట్టకీటు వి. పుట్టగోడ పుట్టకూడిమేకము వి. ఎలుగుబంటి. పుట్టకూడు వి.వా. 1. పుట్టలో దొరికే ఆహారం (చీమ గుడ్లు మొ.వి). మను. 4.37 ; 2. చీమ గుడ్లతో కలిసిన పుట్ట మట్టి ముద్ద. పుట్టకూడుదిండి (-తిండి) వి. ఎలుగుబంటి. పుట్టకూడు మెక్కుమేకము వి. ఎలుగుబంటి. పుట్టకూడుమేపరి వి. ఎలుగ్గొడ్డు. అచ్చ.రా.కిష్కిం. 86. పుట్టకొక్కు వి. పుట్టగొడుగు. దార.గాంధి. 5.433. పుట్టకోట వి. కోటకు బలం కోసం దాని బైట వేసిన మట్టి తిన్నె. పుట్టకోవలు వి.బ.వ. పుట్టమీది కిరాలు. పుట్టక్రోవి వి. పుట్ట కలుగు. వైజ. 3.121. పుట్టగర్ద వి. 1. పుట్టమట్టి. పేడతో కలిపి నేల అలకటానికి మేలయిన మట్టి ; 2. ఇటిక బట్టీ మధ్యలో పొయ్యిల మధ్య కట్టిన మూరెత్తు దిమ్మ. పుట్టగీటు వి. పునాది వైశాల్యాన్ని గుర్తిస్తూ ఎర్రమట్టితో గీసిన పెదల్పాటి గీత. పుట్టగొడుగు వి. పుట్టకొక్కు. కుక్కగొడుగు. గొడుగు ఆకారంలో పుట్టలో మొలిచే మొలక. పుట్టగోచి రూ. పుట్టగోసి. వి. గుహ్యాంగాన్ని కప్పటాని కుపయోగించే వస్త్రఖండం. వైజ. 3 248. క. పుటగోసి. పుట్టగోపి రూ.చూ. పుట్టగోచి. వి. పుట్టగోచి. ఎవరో పెట్టింది.

పుట్టచమ్మ రూ. పుట్టచెమ్మ. పుట్టతమ్మ. వి. వర్మికకంటి, వృక్ష విశేషం. ఆం.రా. 2.72 (Canavalia gladiata). పుట్టచిలుక వి. పక్షి విశేషం. పుట్టచూలు వి.వా. వాల్మీకముని. పుట్టచెండు రూ. పటచెండు. వి. (వస్త్రం మొ.వాటితో చేయబడిన) ఎగరగొట్టి ఆడే బంతి. రామాభ్యు. 8.51. పుట్టచెమ్మ రూ.చూ. పుట్టచమ్మ. వి. కాయ పొడవు తక్కువ వెడల్పెక్కువగా ఉండి ముఖ్యంగా కూర దినుసుగా ఉపయోగించే రకం చెమ్మ (Canavalia gladiata). పుట్టచేర్పు వి. 1. పాము. హ.న. 4.43 ; 2. పుట్టగొడుగు. పుట్టజిల్లేడు వి. వస్త్రరంగంలో ఉపయోగించే కలప కలిగి పచ్చని పూలు పూసే చెట్టు (Wrightia tomentosa). పుట్టజున్ను వి. పుట్టలో పట్టే తేనెపట్టు. కాశ. 3.68. పుట్టతమ్మ రూ.చూ. పుట్టచమ్మ. వి. మందులో ఉపయోగపడే ఒకజాతి తుంబతీగ. కంటి (Canavalia gladiata). పుట్టతామర వి. బూడిద రంగుతో కూడిన ఎరుపురంగు మెత్తని కలపనిచ్చే చెట్టు (Macaranga indica). పుట్టతీగె వి. ఆకుపచ్చతో కూడిన పసుపురంగు పూలుపూసే తీగ (Macrua arenaria). పుట్టతేనియ రూ. పుట్టతేనె. వి. పుట్టలోపట్టిన తేనెపట్టులోని తేనె. కాశ. 3.68. పుట్టతేనె రూ.చూ. పుట్టతేనియ. వి. పుట్టలో పట్టిన తేనెపట్టులోని తేనె. పుట్టతేలు వి. ఒకజాతి పెద్దతేలు. గ. పొట్టి. తేలు. పుట్టదిట్ట వి. ఎలుగుబంటి. పుట్టదిండి(-తిండి) వి. పుట్టలో లభించే చీమ గుడ్లు మొదలైన ఆహారం. పుట్టపాల వి. తెల్లని పూలుపూసే ఒకరకం చెట్టు. దీని కొమ్మల్ని కాగడాల కుపయోగిస్తారు (Ixora parviflora). పుట్టపుట్టువు రూ. పుట్ట(బుట్టువు. వి. వల్మీకనందనుడు, వాల్మీకి. విక్ర. 1.9. పుట్టపురుగు వి. పాము. వేంక. పంచ. 3.355 పుట్టపెట్టెవట్టు వి. ఎలుగు బంటి. పుట్టపెద్ద వి. పాము. అచ్చ.రా.అరణ్య. 21. పుట్ట బంగారము వి. 1. పుట్టలో పాలుపోసినప్పుడు తడిపి చెవులకి రాసుకునే పుట్టమన్ను ; 2. మొలక బంగారు, పుట్టల్లో పురుగులవల్ల కలిగే బంగారం. పుట్టబంగారు వి. కుమ్మరి వాడే మన్ను. పుట్టమట్టి వి. చెదలుమన్ను, పేడతో కలిపి నేలను అలకటానికి మేలైనమట్టి. పుట్టమవెయుగల్బి వి. ఎలుగుబంటి. పుట్టమన్ను వి. 1. పుట్టమట్టి, పేడతో కలిపి నేల అలకటానికి మేలైనమట్టి ; 2. ఇటుక రాతిఇండ్లు కట్టటానికి ఉపయోగించే పెల్లసరంగుగల మెత్తటి మట్టి ; 3. తలుపులు అమర్చటానికుపయోగించే మట్టి. పుట్టమాద రూ. పుట్టమోద. వి. కంట్లో కొయ్యకండ పెరగటం. పుట్టముంగి వి. ఒకజాతి ముంగిస. పుట్టమోద రూ.చూ. పుట్టమాద. వి. కంట్లో కొయ్యకండ పెరగటం. పుట్ట(బుట్టువు రూ.చూ. పుట్ట పుట్టువు. వి. వల్మీక నందనుడు, వాల్మీకి. అచ్చ. రా. బాల. 9, హ.న. 1.17. పుట్టరేపిల్లు రూ. పుట్రేపిల్లు. వి.బ.వ. చెద్దకు ప్రేరేపించటాలు పుట్టలమ్మ(-అమ్మ) రూ. పుట్టాలమ్మ. వి. ఒకానొక గ్రామదేవత, గవదబిళ్ళలు మొగం వాపు అనే రోగాల అధిదేవత. తిక. 3.49. పుట్టలమ్మటీర వి. తెలుపులో పొడనవేలెడు పెడల్పు ఎడంలో రెండేసి కొలుకులు ఎర్ర పోగులు పడేట్టు నేసినచీర. పుట్టలెక్కు అ.క్రి. పెల్లాపెదరై పరుగెత్తు. వరాహ. 8.37. <పుట+-

లు+ఎక్కు. పుట్రేపణ వి. చెడు చేయటానికి ప్రోత్సహించటం. పుట్రేపిల్ల యా.చూ. పుట్టరేపిల్ల. వి.బ.వ. చెడ్డకు ప్రేరేపించటాలు.

**పుట్టగతులు** చూ. పుట్టు¹.

**పుట్టదిరిగ** వి. తెల్లని పూలుపూసే తీగ (Jasminum pubescens).

**పుట్టవిమ్మ** చూ. పట్ట. వి. గడియారం.

**పుట్టము** వి. వస్త్రం, బట్ట. భార. ఆది. 3.134. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1038.

సం. పుట-, పుట్టికా-. వస్త్రం ; ప్రా. పుట్ట-.

కొడ. పొడెయ ; త. పుడైవై, పుడవై, బట్ట, ఉడుపు, చీర, పుట్టమ్. బట్ట ; మ. పుట, పుడవ. 8 లేక 10 మూరలు ఉన్న స్త్రీలబట్ట (చీర) పైబట్ట ; కో. పొడ్వ. చీర.

పో.చూ. త. పుట్టమ్, పుడవై ; మ. పుడవ.

మూ.ద్రా. పుడ్-అ, పుట్-అ.

**పుట్టలు** చూ. పుట్టి².

**పుట్టాలమ్మ** యా.చూ. పుట్టలమ్మ. వి. గవదల గంగమ్మ వంటిది.

**పుట్టి¹** యా. పట్టిక, పుటిక, పుటికె, పుటిక, పుట్క. పుట్టిక. వి. 1. వెదురుతో గంపలా అల్లి మీద తోలుకప్పి కుట్టి ఏరు దాటటాని కుపయోగించే సాధన విశేషం. కు.సం. 10.200 ; 2. బుట్ట. హంస. 4.182, ఐందు. 2.52.

క. పుట్టి, బుట్టి, బుట్టె, బుట్ట, గంప. పుట. ఆకులతో తయారుచేసిన గంప, గిన్నె మొ. వి ; తు. పుట్టి. గుండ్రటి చిన్నబుట్ట, పుటికె. చిన్నబుట్ట, పుడయి, పుడాయి, బుట్టి, గంప ; త. పుట్టిల్. అమ్ములపొది, కత్తి మొ. వాటి ఒర, బుట్ట, ఈక మొ. వి పోయేటట్లు వినరు ; మ. పుట్టిల్. ఆధారంగాఉన్న దళసరి చాప. శరీరాన్ని కప్పేది ; కుఇ. పుటి. పెద్దగంప.

<క. పుటికె.

పుట్టిముంచు స.క్రి. చెరుచు, ధ్వంసంచేయు. రామాభ్యు. 8.55, కకుత్స్థ. 3.114. పుట్టిమునక వి. నష్టం, చెరుపు. పుట్టిమును(గు అ.క్రి. చెడు, ధ్వంసమగు. మను. 1.41. పుట్టివా(డు విఐ. పుట్టినడిపేవాడు, నావికుడు. ఆము. 5.49.

**పుట్టి²** యా.చూ. పుట్టు². వి. 1. ధాన్యమాన విశేషం. ద.హిం. శా. సం. 661. క్రీ.శ. 1297 ; 2. భూమానవిశేషం ; 3. తులామాన విశేషం, ఇరవై మణుగుల ఎత్తు ; 4. నలభై కుంచల లేదా కుంచాల కొలత.

పుట్టలు యా. చూ. పుట్లు. వి.బ.వ. 1. భూమికొలత. దాడినేనిపల్లి శాసనం. 8 వ శతాబ్ది ; 2. ధాన్యమాన విశేషం. పుట్టికుంచాలు వి.బ.వ. పుట్టి ఒక్కటికి ఒక కుంచెడు ధాన్యం. నెల్లూరు శాసనాలు. నెల్లూరు 7. క్రీ.శ. 1638. పుట్టివహింపి వి. పుట్టి భూమిపై రొక్కం రూపంగా చెల్లించవలసిన పన్ను. ద.హిం.శా. సంపు.శా.సం. 509. క్రీ శ. 1314. పుట్టిముత్తుమువర్లపట్టు వి. ఒక పుట్టి మూడుతూములు విత్తనపు పదు చల్లటానికి సరిపడే భూమి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1016. క్రీ.శ. 1087. పుట్టిసెలగ వి. 21. తూముల కొలత. పుట్టెడు విఐ. ఒక పుట్టి పరిమాణంగల. ముఖలింగం శాసనం క్రీ.శ. 1084. పుట్లు రూ. పుట్టలు, పుట్ను. వి.బ.వ. భూమికొలతలు విప్పర్ల శాసనం. క్రీ.శ. 633.63. పుట్ను రూ.చూ. పుట్లు వి.బ.వ. భూమి కొలతలు. మాచర్ల శాసనం. క్రీ.శ. 641.

**పుట్టిక** రూ. చూ. పుట్టి¹. వి. గంప, పిటకం. పాల. 2.40.

**పుట్టించు** చూ. పుట్టు¹.

**పుట్టినయిల్లు** చూ. పుట్టు¹.

**పుట్టినిలు** చూ. పుట్టు¹.

**పుట్టినిల్లు** చూ. పుట్టు¹.

**పుట్టిపుణ్యమెఱు(గని** చూ. పుట్టు¹.

**పుట్టింపుతలుపు** చూ. పుట్టు¹.

**పుట్టిల్లు** చూ. పుట్టు¹.

**పుట్టు¹** రూ. పుటక, పుటుక, పుట్టుక, పుట్టుగ, పుట్టుగు, పుట్టుప, పుట్టువు. అ.క్రి. 1. జన్మించు, జననమొందు. భార. ఆది. 1.144 ; 2. కలుగు, సంభవించు. భార. సభా. 2.205. 3. గోచరమగు, కనబడు. నిర్వ.రా. 6.117 ; 4. ఏర్పడు; భార. ఉద్యో. 1 60 ; 5. దొరుకు, లభించు. హరి.పూ. 6.5 ; 6 మొలుచు, అంకురించు. కాశీ. 5.127 ; వి. 1. పుట్టుక, జన్మం. భార. విరా. 1.27 ; 2. గ్రహాదుల ఉదయం. వసు. 4.55 ; 3. మొలక, అంకురం. ద్వి. పరమ. వి. 3.153.

క. పుట్టు, హుట్టు, ఉట్టు. పుట్టు, అభివృద్ధిపొందు ఉన్నతస్థితికి వచ్చు, పుట్టుక, మూలం, కుటుంబం, పుట్టిసు. హుట్టిసు. పుట్టేటట్లుచేయు, సృజించు : కొడ పుట్-(పుట్టి-). జన్మించు, (విత్తనాలు) మొలకలు ; తు. పుట్టుని. పుట్టు, వెలుగులోకివచ్చు, ఉత్పత్తిచేయు, పుట్టావుని. ఉత్పత్తిచేయు, మూలం తెలుసుకొను, పుట్టుక కలిగించు ; కో. ఉట్ (ఉచ్-). పుట్టు (మొక్క. జుత్తు), మొలకలు, ఉట్. శరీరం యొక్క అందం (ఒంటిరంగు మెరుపు) ఒక విషయంలోని నిజం, పుట్టటం, మొలకెత్తటం. పుట్. పెరుగు ; తొ. పుట్-, (పుట్య్-). పెరుగు (గడ్డి, చెట్టు, జుత్తు), ఉట్-, (ఉట్య్-). పుట్టు (పాటలలో), ఉట్. సృష్టి, జననం, ఆకృతి, అందం ; గోం. పుట్టానా. పుట్టు, కలుగు, కనుగొనబడు, కలుసుకొను ; పుట్. పుట్టు, ఓడ్డ మొక్క. కలుగు ; కొం. పుట్-. జన్మించు, ఉత్పత్తిఅగు. కలిగిఉండు ; పర్జి. కొలా. నా. పుట్-. పుట్టు ; గ. పుట్-ఏర్-.

<మూ.ద్రా. *పుట్-.

పుట్టగతులు వి.బ.వ. తిరిగి పుట్టటానికి అవకాశాలు. జీవితాన్ని గౌరవంగా గడిపే అవకాశాలు. పుట్టించు స.క్రి. 1. కలిగించు. ఒదవించు. భార. ఆది. 1.227 ; 2. కను, జనింపచేయు. భార. ఆది. 4.235 ; 3. ప్రసంగానికి తెచ్చు. భార. ఉద్యో. 4.252 ; 4. సృజించు, నిర్మించు. కాశీ. 3.44 ; 5. కల్పించు, కల్పనచేయు. విక్ర. 1.20. పుట్టినయిల్లు రూ. పుట్టినిలు, పుట్టినిల్లు, పుట్టిల్లు, పుట్నిల్లు వి. 1. నెలవు, స్థానం. భార. భీష్మ. 1.65 ; 2. ఆడవారి జన్మవంశం. వరాహ. 6.3 ; 3. జన్మగృహం. జనకగృహం.

సు.శ. 25. పుట్టినిలు రూ.చూ. పుట్టినయిల్లు. వి. జనక గృహం. పుట్టినిల్లు రూ.చూ. పుట్టినయిల్లు. వి. జనకగృహం. హరి. పూ. 1.170. పుట్టిపుణ్యమెఱుఁగని అవ్య. ఏనాడూ ఏసౌఖ్యమూ అనుభవింపని. పుట్టింపుతలుపు రూ.చూ. పొట్టింపుతలుపు. వి. మధ్యభాగం ఉబ్బెత్తుగా చేసి చట్రంలో బిగించిన చెక్కతలుపు. పుట్టిల్లు రూ.చూ. పుట్టినయిల్లు. వి. జనకగృహం. ఆము. 4.11. పుట్టుకలగర వి. నారుమడిలో మొదటిసారి పెట్టే తడి. పుట్టుకలుపు వి. పైరుపొట్టపెట్టినప్పుడు తీసేకలుపు. పుట్టుగొత్త వి. సరిగొత్త. పుట్టుగట్టు రూ. పుట్టుగుగట్టు, పుట్టువగట్టు. వి. ఉదయపర్వతం. యయా. 3.141. పుట్టుగతులులేకుండపోవు అ. క్రి. చాలాపాపం చుట్టుకొను. పుట్టుగది వి. పాపులను అటమొదట్లో ఉంచే గది. పుట్టుగొంగడి వి. బీరప్పపండుగకు బీరప్ప, కామరతి, అక్కమాంకాళి బయన్నల-లింగాలు బీర్ల వాళ్ళకు తెలియకుండా ఏట్లో ముంచటానికి దాచి పట్టుకు వెళ్ళటానికి ఉపయోగించే గొంగడి. పుట్టుగొడ్డు విశే. పుట్టుకనుంచి గొడ్డుతనం కల. పుట్టుగొబ్రాలు వి. బౌ. పట్టిగొబ్రాలు. ద్వి. పార. చ. 3.165పం. పుట్టుగ్రుడ్డి విశే. పుట్టుకనుంచి గుడ్డివాడు. వసు. 3.134. పుట్టుగ్రుడ్డు విశే. గుడ్డుగా పుట్టినది. పక్షి. వేంక. పంచ. 4.161. పుట్టుఁగల్లరి విశే. పుట్టిందిమొదలుకొని అబద్ధాలాడేవాడు. భార. అరణ్య. 5.405. పుట్టుఁగవచము వి. పుట్టుకతోనేకలిగిన కవచం. భార. ఆది. 5.26. పుట్టుచెయువు రూ. పుట్టుచెయ్వు. వి. పుట్టినప్పుడు చేసే సంస్కారం. జాతకర్మం. పుట్టుచెయ్వు రూ.చూ. పుట్టుచెయువు. వి. పుట్టినప్పుడు చేసే సంస్కారం. జాతకర్మం. పుట్టుచేటు అవ్య. పుట్టినప్పటినుంచి. పుట్టుచోటు వి. జన్మభూమి. పుట్టుఁజీకు (-ఓకు) విశే. పుట్టుగుడ్డివాడు. భార. ఆది. 4.288. పుట్టుధోతి వి. చిన్నవాళ్ళుకట్టుకొనే పంచె. పుట్టుపంచె వి. 1. చిన్నవాళ్ళు కట్టుకొనే పంచె; 2. చిన్నవాళ్ళు, ఆడపిల్లలు కట్టుకొనేచీర. పుట్టుపాప వి. 1. పుట్టినప్పటినుంచి భర్తృసౌఖ్యం తెలియక పసిపాపలా ఉండేది. అనాథ. క్రీడా. 1.29; 2. పుట్టుకతోనే శ్వేత రోగం ఉన్నవాడు. పుట్టుపుమఁగు వి. లోమశమృగమదం. పుట్టుపోరపేరిక అవ్య. నామరూపాలు లేకుండా. పుట్టుబడి వి. పుట్టుక. ఉత్పత్తి. పుట్టుబొల్లి వి. పుట్టుకతో వచ్చే ఒక రకం చర్మవ్యాధి. పుట్టుభోగి రూ. పుట్టుభోగి. వి. పుట్టుకతో భోగాలనుభవించేవాడు. యయా. 4.137. పుట్టుభోగి రూ. చూ. పుట్టుభోగి. వి. పుట్టింది మొదలు భోగాలనుభవించే వాడు. చంద్రభాను. 3.23. పుట్టుమచ్చ వి. పుట్టినప్పటి నుంచి దేహంలో ఉండే నల్లనిమచ్చ. పుట్టుమూఁగ వి. పుట్టుకనుంచి మూగైనవాడు, మూగైనది. భాను. 1.3. పుట్టుమొండి వి. పుట్టుక మొదలు మొండివాడు. పుట్టుఁబొరవు కావరాకుండ క్రి. విశే. ప్రద. నిశ్శేషంగా. కు. సం. 12.32. పుట్టువడుగు వి. 1. విష్ణువు. పాంచ. దేవ. 4; 2. పుట్టినప్పటినుంచి బ్రహ్మచారిగా ఉండేవాడు. ఆజన్మ బ్రహ్మచారి. పుట్టువెఱ్ఱి విశే. పుట్టినప్పటినుంచి వెర్రిఅయిన వాడు, వెర్రిది. పుట్టుమడి వి. ముడ్డిమీద గుండ్రంగా ఉండే సుడి. పుట్టొల్లె వి. కన్నెపిల్లలు మొదటిసారి కట్టుకొనే చీర. <పుట్టు[1]+వల్లె. పుట్నిల్లు రూ.చూ. పుట్టినయిల్లు. వి. బౌ. పుట్టిల్లు. భాగ. 8.154.

పుట్టు[2] రూ. పుట్టి[2], పుట్టి. వి 1. భూమికొలతలో ఒక ప్రమాణం. బుడమనారాయణపాడు శాసనం. క్రీ.శ. 650; 2. ధాన్యమాన విశేషం.

క. పుట్టి; తు. పుట్టి; త. పుట్టి. కొలపరిమాణం, 8 నుంచి 11½ ఎకరాల భూపరిమాణం, ఇరవైమణుగులు.

పుట్టు[3] వి. పచ్చిబియ్యంతో చేసిన వంటకం.

పొట్టు[4] వి. తెల్లనిపళ్ళుకాసి కంచెల్లో పెరిగే చెట్టు (Azima-tetracantha).

పుట్టుక రూ.చూ. పుట్టు[1]. వి. 1. జన్మం. ఆము. 1.19; 2. గర్భం.

పుట్టుకచల్వజోతి వి. హిమాంశువు.

పుట్టుగ రూ.చూ. పుట్టు[1]. వి. 1. జన్మ; 2. జన్మసంబంధం.

పుట్టుగు రూ.చూ. పుట్టు[1]. వి. 1. జన్మ. కవిక. 5.120; 2. జన్మసంబంధం.

పుట్టుగుగట్టు రూ.చూ. పుట్టుగట్టు. వి. ఉదయపర్వతం. యయా. 5 151.

పుట్టువ రూ.చూ. పుట్టు[1]. వి. జన్మం. ఆం. భా. 1.100.

పుట్టువు రూ.చూ. పుట్టు[1]. వి. 1. జన్మం. భార. ఆది. 5.129. 2. జన్మ సంబంధం. కువ. చ. 3.33; 3. ఉదయం.

పుట్టువుకట్టు వి. భవబంధం, సంసారమనే బంధం. అచ్చ. రా. యు. 64. పుట్టువుగట్టు రూ. చూ. పుట్టుగట్టు. వి. ఉదయపర్వతం.

పుట్టి రూ.చూ. పుట్టు[2]. వి. ధాన్యపుకొలత. 20తూములు.

పుట్టియ చూ. పుట్టి[2].

పుట్టెము వి. గుబురు. జొంపం. ద్వి. పరమ. వి. 4.2780.

పుట్టేపుతలుపు రూ.చూ. పొట్టింపుతలుపు. వి. బిళ్ళైన్తలుపు. మధ్య భాగం ఉబ్బెత్తుగా చేసి చట్రంలో బిగించిన చెక్కతలుపు.

పుట్లారె చూ. పుట్టు[1].

పుట్నాలబాన చూ. పుట్నాలు.

పుట్నాలు వి.బ.వ. కందులు అధికంగా వేచగా వచ్చిన బారుగులు.

పుట్నాలబాన వి. బటాణీలు, సెనగపప్పు వేయించేబాన.

పుట్నిల్లు చూ. పుట్టు[1].

పుడేవణ చూ. పుట్ట.

పుడేపిల్ల చూ. పుట్ట.

పుడోలు వి. కొలతకు వాడే రెండడుగుల పొడుగు ఉన్నచెక్క పనిముట్టు.

పుట్లు చూ. పుట్టి[2].

పుట్ను చూ. పుట్టి[2].

పుటమువేయు స.క్రి. సంశవచేయు.

సం. పుట-. ఔషధ పాకానికై మన్ను మొ. వాటిచే రెండుకొప్పులుచేసి ఒకటికింద ఇంకోటిపైన పెట్టి కూర్చి చేసిన పాత్రవిశేషం.

సం. పుట-+-ము+వేయు.

పుటక రూ.చూ. పుటుక. వి. 1. కట్టెపుల్ల; 2. అర్ధం; 3. గడ్డి మొ. వాటిపల్ల; 4. పెంకుకోతకు వాడే మొనగం

సాధనం.

**పుడకలువిఱుచు** అ.క్రి. మనసువిప్పు. శుక. 1.532.

**పుడంగాసురుడు** వి. అధికుల్లో పుటికుడనుకునేవాడు.

**పుడంగి** వి. అధికుడనుకునేవాడు.

**పుడక¹** వి. కుంప, ఇటుకను కాల్చే కట్టడం.

**పుడక²** వి. మడిలోనికి నీరుపారించే చిన్నబోదె.

**పుడకీసు** రూ. పురతకీసు, పురతకేసు, బురతకీసు. వి. పోర్తుగాలు దేశభాష, పోర్తుగాలు దేశసంబంధి. ఆనంద. పీఠి. 81.

మ. పొర్తుక. పరమటి ఇండియా దీవులనుంచి తెచ్చిన జీడిమామిడి;

హిం. పుర్తగీస్. బురతకీసు; భారతీయ సంసర్గంచే కలిగిన మిశ్రజాతి; మరా. పూర్తకీశ. బురతకీసు; అర. బుర్తూకాన్. తీయనినారింజ; పో. పోర్తుగీజ; ఫ్రెం. పొర్త్యుగె; ఇటా. పొర్తొఘీస; డచ్చి. పొర్తగీస.

<పో. పోర్తుగీజ.

**పుడమి** వి. 1. భూమి. భార. ఆది. 741; 2. రాజ్యం. భార. సభా. 2.214; 3. నేల. భార. అరణ్య. 3.39.

సం. పృథివి. పృథ్వీ. భూమి; ప్రా. పుఢమి-. పుఢవి, పుఢవి, పుహఈ, పుహఈ, పుహావి; జై. శౌ. పుఢవి; అశో. పఢవి; అమా. పుహఈ, పుహవి; పై. పుధువి, పృథుమీ; పా. పఢవి. పఠవి. పుథువి; అప. పుహఇ. పుహవి;

క. పొడవి; తు. పొడవి, పుర్తి. భూమి. ప్రపంచం; త. పుడవి; ఒల్లా. పత్తి.

<ప్రా. పుడమి-.

**పుడమికానుపు** రూ. పుడమికాన్పు. వి. 1. భూజం. వృక్షం. అచ్చ.రా.బాల. 141; 2. భూపుత్రి, సీత. అచ్చ.రా.బాల. 197. **పుడమికాన్పు** రూ.చూ. పుడమి కానుపు. వి. 1. భూపుత్రి, సీత. అచ్చ.రా.బాల. 198; 2. భూజం, వృక్షం. **పుడమికావరి** వి. రాజు. అచ్చ.రా. యు. 91. **పుడమిచెలి** వి. పట్ట. **పుడమికాలువు** రూ.చూ. పుడమిదాలువు. వి. 1 శేషుడు; 2. భూధరం, గట్టు; 3. భూభృత్తు. రాజు. **పుడమికాల్పు** రూ.చూ. పుడమి దాలువు. వి. 1. భూధరం, గట్టు. చంపూరా. 7.3; 2. శేషుడు. దశా. 5.115; 3. భూభృత్తు, రాజు. **పుడమితేరెక్కువాడు** విశ. శివుడు. **పుడమిదయ్యము** వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. అచ్చ.రా.బాల. 204, నీలా. 1.62. **పుడమిదాలువు(-కాలువు)** రూ. పుడమికాలువు. పుడమికాల్పు, పుడమిదాల్పు. వి. 1. శేషుడు. రామాభ్యు. 387; 2. రాజు. అచ్చ.రా.బాల. 40; 3. భూధరం, గట్టు. **పుడమిదాల్పు** రూ.చూ. పుడమిదాలువు. వి. 1. రాజు; 2. భూధరం, గట్టు; 3. శేషుడు. **పుడమిదొర** వి. భూపతి, రాజు. చెన్నబసవ. 3.424. **పుడమిపంటు** వి. విష్ణువు. **పుడమిపట్టి** వి. 1. భూపుత్రి, సీతాదేవి. ఉ.రా. 8.94; 2. భూపుత్రుడు, అంగారకుడు; 3. నరకాసురుడు. **పుడమిపుట్టు** రూ.చూ. పుడమి పుట్టుగు. వి. 1. సీత; 2. చెట్టు. **పుడమిపుట్టుగు** రూ. పుడమిపుట్టు. వి. 1. సీత. రామాభ్యు. 5.244; 2. చెట్టు. **పుడమిపు(డు** వి. రాజు. కు.సం. 11.43. పో.చూ. సం. పృథివీప-. రాజు, భూపతి. **పుడమిబొట్టియ** వి. సీతాదేవి. అచ్చ.రా.యు. 587. **పుడమిమగ(డు** వి. భూనాథుడు, రాజు. చెన్న బసవ. 4.74. **పుడమిముద్దియకోక** వి. సముద్రం. వ్య. భూదేవి అందమైన కోక. **పుడమిమొలనూలు** వి. సముద్రం. వ్య. భూదేవి రశన. **పుడమిమోపరి** వి. పుడమిదాల్పు, శేషుడు. సమీర. 3.98. **పుడమిరా** వి. విష్ణువు. **పుడమిఱే(డు** వి. భూపతి, రాజు. భార.శల్య. 2.5. **పుడమివేలుపు** రూ.చూ. పుడమివేల్పు. వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. **పుడమివేల్పు** రూ. పుడమివేలుపు. వి. భూదేవుడు, బ్రాహ్మణుడు. పరమ. 2.136. **పుడమీశు(డు** వి. రాజు. బసవ. 3.2 పం. పో.చూ. సం. పృథివీశ-. భూపతి, ఈశ-. ప్రభువు. <పుడమి + సం. ఈశ-. (మిశ్రస.). **పుడమీశ్వరుడు** వి. రాజు. పో.చూ. సం. పృథివీశ్వర-. భూపతి, ఈశ్వర-. ప్రభువు. <పుడమి + సం. ఈశ్వర-. (మిశ్రస.).

**పుడా** వి. పొట్లం.

సం. పుట-, పూల. పొట్లం; ప్రా. పుడ-. పుల-; కా. పుల; కు. పులో; బెం. పులా; ఒ. పుళా; హిం. పం. పులా; గు పుళో, మరా. పుడా.

<మరా. పుడా.

**పుడికరించు** చూ. పడుకు².

**పుడికపుచ్చుకొను** చూ. పడుకు¹.

**పుడికిలించు** చూ. పడుకు².

**పుడికిలింత** చూ. పడుకు².

**పుడికిలి** చూ. పడుకు². రూ. పడికిలి. వి. 1. అయిదు వేళ్ళతో బిసుకోవటం. బోజ. 3.90; 2. బాలక్రీడా విశేషం. హంస. 5.155.

**పుడికిళ్లు** రూ. పడికిళ్లు, పుడుకులు². వి.బ.వ. ఒకరకం ఆట.

**పుడికపైచు** చూ. పడుకు².

**పుడిగ** రూ.చూ. పడుకు¹. వి. దానం. ఈవి. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 565. క్రీ.శ. 1891.

**పుడిగమూలపీఠాలు** వి.బ.వ. బుడిగలపై విధించిన సుంకం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 565. క్రీ.శ. 1313.

**పుడిగె** రూ.చూ. పడుకు¹. వి. స్వల్పమైన బిచ్చం.

**పుడివలి** రూ.చూ. పుడిసిలి. వి. వేళ్ళు వంచి దొప్పలా పెట్టిన అరచెయ్యి.

**పుడిసిలి** రూ. పుడిసలి. వి.ఔ. వేళ్ళు వంచి దొప్పలా పెట్టిన అరచెయ్యి. చులుకం. భార.ఆశ్వ. 1.84.

**పుడిసిలించు** స.క్రి. పుడిసిటపట్టు. భార.అరణ్య. 2,104. <పుడిసిలి + -ఇంచు³. **పుడిసిలింత** వి. పుడిసిట పట్టటం. **పుడిపెడు** రూ. పుడిసెడు. వి. పుడిసిలి పట్టేటంత. హర. 6.129.

**పుడిపెడు** చూ. పుడిసిలి.

**పుడి** వి. చిన్న పొట్లం.

సం. పుటికా. కట్ట, పొట్లం; ప్రా. పుడియా; మరా. పుడి.

<మరా. పుడి.

**పుడక** రూ. పుడక. వి. 1. సమిధ, కట్టిపుల్ల. కు.సం. 7.49, నిర్వ.రా. 6.110 ; 2. పుల్లలా ఉండి పట్టుగాని తిప్పటానికి ఉపయోగించే రాట్నం యొక్క అవయవ విశేషం. కళ. 2.421; 3 తృణకాండం, సన్ననిపుల్ల. ఆం.భా. 2.76.

**పుడకబావిలి** వి. స్త్రీ. కర్ణభూషావిశేషం. **పుడకవిఱుచు** అ.క్రి. కొండేలు చెప్పి మనసు విరుచు. ద్వి.పరమ. వి. 3.260. ప. 5 పం.

**పుడుకు¹** రూ. పడిగ, పడిగె, పుడుగ, పుణుకు, పుక్కు. స.క్రి 1. పట్టుకొను. కు.సం. 9.86 , 2. వాత్సల్యం చేతగాని మోహంచేతగాని చేతి మునివేళ్ళతో పట్టుకొను. రం.రా. 24 ప. 9 పం.; 3. ఇచ్చు, దానంచేయు. హరి. ఉ. 9.40; 4. నిమురు, తడవు. గౌ.హరి.ఉ. 1847 పం. ; వి. 1. కానుక, బహుమానం. అచ్చ.రా. అయోధ్యా. 17 ; 2. ఈవి, దానం. ఆం.భా. 2.172.

క. పుడుకు, పుడుఙ్కు, పుడకు. చేతితో వెతుకు, రేకు తాకు, వెదకు, చీకటిలో తడుముతూ వెదకు ; తు. పుడపుడ. పట్టుకోటం, గ్రహించటం ; కువి. బ్రూచ్-, బ్రూచలి(బ్రూక్-). హఠాత్తుగా లాగుకొను ; కొలా. పుడ్క్-(పుడుక్-). తాకు ; నా. పుడ్క్, (పుడుక్). తాకు.చూ.పర్జి. పిడ్క్-. కౌగలించు.

< మూ. ద. ద్రా. *పుడ్- ఉక్క్-/ *పుడ్-ఉక్క్-.

**పుడికిపుచ్చుకొను** రూ. పుడికి పుచ్చుకొను. స.క్రి. హత్తిగా గ్రహించు. విజయ. 2.164. **పుడుకుకొనిపోవు** స.క్రి. వెడికి తీసుకొని పోవు. పండి.చ. 1.2. 479 ప.

**పుడుకు²** స.క్రి. 1. చిదుము, తుంచు. కాశీ. 7.232 ; 2. పినుకు. భాగ. 10 పూ. 1998 ; 3. కొంచెంగా గ్రహించు. విక్ర. 2.170 ; 4. (సన్నిపాతరోగి) వస్త్రాదుల్ని వేళ్ళ కొనలతో పీకు. (ఈ అర్థం ఆత్మనే పదరూపంతోనే ఉంటుంది).

క. పిడగ, పిడగు, పిడుగు. బాధ, వ్యాధి. ఆపద ; త. పిటుఙ్కు-(పిటుఙ్గ్-). బయటకుత్రోయు, పైకిపీకు, బలవంతంగా లాగుకొను, బాధపెట్టు, కోపం తెప్పించు, పిటుఙ్కల్. బయటకు లాగు, బలవంతంగా లాక్కోటం ; మ. పిటుఙ్ఙుక. బయటకితోయు, బలవంతంగా లాక్కొను, కోపంతెప్పించు, పిటరుక. పైకిలాగబడు, పిటర్త్తుక. వేళ్ళతో పీకు, దొబ్బచిదుము ; కుఇ. ప్రుస్గ(ప్రుస్గి-), దెంపదెబ్బతిను, బద్దలగు, పీకబడు, ప్సుప్క్(<ప్సుక్-ప్-, ప్సుక్-). దెంపదెబ్బకొట్టు, పీకు, బద్దలగు ; కువి. ప్రుకుఇన్ బ, దెంపదెబ్బతిను, బద్దలగు, ప్రకుఇస్సు. దెంపదెబ్బకొట్టు, బద్దలగు.

**పుడికరించు** రూ. పుడికిరించు, పుడికరించు, పుడికిరించు. స.క్రి. 1. కొంచెంగాఇచ్చు. ఇచ్చు ; 2. (సన్నిపాత దోషాదుల్లో) వేళ్ళకొనలతో (వస్త్రాదుల్ని) పీకుకొను. **పుడికిరించు** రూ.చూ పుడికరించు. స.క్రి. 1. కొంచెంగా ఇచ్చు ; సన్నిపాత దోషంచే గ్రహించు. **పుడికిరింత** రూ. పుడికరింత. వి. 1. పుడికరించటం, కొంచెం ఇవ్వటం. ఆం.భా. 2.172 : 2. సన్నిపాత దోషంచే గ్రహించటం.

**పుడికివైచు** స.క్రి. తుంచు. కు.సం. 6.3. **పుడుకు(గల్లు** (-కల్లు²) వి. చింతామణి, ఈవులరాయి. అచ్చ.రా.బాల. 8. **పుడుకు(జెట్టు**(-చెట్టు) వి. కల్పవృక్షం. రామాభ్యు. 213. **పుడుకు(బొదుకు**(-తొదుకు) వి. కామధేనువు. రామాభ్యు. 197. **పుడుకుబావి** వి. అమృత కలశం. విష్ణు. 8.47. **పుడుకుభ్రూమ** వి. కల్పవృక్షం. అచ్చ.రా. బాల. 2. **పుడుకు(జవి**(-పవి) వి. కామధేనువు. యయా. 2.35.

**పుడుగ** రూ.చూ. పుడుకు¹. వి. ఈవి.

**పుడు(కులు** రూ. పుణు(కులు. వి.బ.వ. భక్ష్యవిశేషం. కాశీ. 7.185.

**పుడ్డింగు** వి. భక్ష్యవిశేషం.

ఇం. *Pudding*. భక్ష్యవిశేషం.

< ఇం. Pudding.

**పుడ్లులు** వి.బ.వ. పట్లు. ద.హిం.గా.సంపు. 5. గా. సం. 125. క్రీ.శ. 1296.

**పుడ్వు** స.క్రి. పేర్చు, ఒకదానిపై ఒకటి క్రమంలో నిలుపు.

**పుణక** రూ.చూ. పొణక. వి. ధాన్యం నిలవచేసే పెద్ద బుట్ట.

**పుణత** రూ.చూ. పుంత. వి. ఒక పొలంలో నుంచి మరొక పొలంలోకి పారే పిల్ల కాలువ.

**పుణపు** వి. పునర్వసు, ఏడోనక్షత్రం. తిప్పలూరు శాసనం క్రీ.శ. 625-650.

సం. పునర్వసు-. ఏడోనక్షత్రం ; ప్రా. పుణవ్వసు.

< సం. పునర్వసు.

**పుణికము** వి. యజ్ఞోపవీతం. ద.హిం.గా.సంపు. 6. గా.సం. 1064. క్రీ.శ. 1283.

సం. పుణ్యాక. మతపరమైన క్రియ.

< సం. పుణ్యక-.

**పుణికరించు** చూ. పుణుకు¹.

**పుణికి** రూ.చూ. పునుక. వి. 1. పాత్రం ; 2. కపాలం.

**పుణికిపుచ్చుకొను** చూ. పుణుకు¹.

**పుణికిరించు** చూ. పుణుకు¹.

**పుణికిరింత** చూ. పుణుకు¹.

**పుణికిరింతలు** చూ. పుణుకు¹.

**పుణికిలి** చూ. పుణుకు¹.

**పుణికిళ్లు** చూ. పుణుకు¹.

**పుణుకు¹** రూ.చూ. పుడుకు¹. స.క్రి. 1. ఇచ్చు, దానంచేయు. దశకు. 5.17 ; 2. నీళ్ళను గుప్పిళ్ళతో పట్టి వదులుతూ, చేపలు పట్టు. యయా. 5.125 ; 3. తడవు. పద్మ. 3.81 ; 4. వాత్సల్యాదులతో మునివేళ్ళతో పట్టుకొను ; వి. మత్స్య గ్రహణ సాధనం. హంస. 4.184.

**పుణికరించు** రూ.చూ. పుడికరించు. స.క్రి. 1. కొంచెంగా ఇచ్చు ; 2. (సన్నిపాత దోషాదుల్లో) వేళ్ళకొనలతో వస్త్రాదుల్ని) పీకుకొను. **పుణికిపుచ్చుకొను** రూ.చూ. పుడికి పుచ్చుకొను. స.క్రి. హత్తిగా గ్రహించు. బహుళా. 1.120. **పుణికిరించు** రూ.చూ. పుడికరించు. స.క్రి. 1. కొంచెంగా ఇచ్చు ; 2. (సన్నిపాత దోషంవల్ల బట్టలు మొ.వాటిని వేళ్ళ కొసలతో) గ్రహించు. **పుణికిరింత** రూ.చూ.

పుడికిరింత. వి. 1. కొంచెంగా ఇవ్వటం ; 2. ఈవి, దానం. పుడికిరింతలు వి.బ.వ. 1. నన్నిపాత రోగికి కలిగే దుర్లక్షణం ; 2. వేళ్ళతో తడుముకోవటం. పుడికిలి రూ.చూ. పుడికిలి. వి. 1. (అయిదు వేళ్ళతో) తీసుకోవటం. కవిక. 3.222 ; 2. బాలక్రీడా విశేషం. పుడికిళ్లు రూ.చూ. పుడికిళ్లు. వి.బ.వ. ఒకరకం ఆట.

పుణుకు² వి. పెసలతో చేసిన ఒకరకం పిండివంట.

పుణుకులు¹ చూ. పుణుకు¹. స.క్రి. 1. వాత్సల్యంతోగాని మోహంతోగాని చేతి మునివేళ్ళతో పట్టుకొను ; 2. పట్టు, పిసుకు ; 3. నిమురు, తడవు ; 4. చిదుము, తుంచు ; 5. సన్నిపాత రోగి వస్త్రాదుల్ని వేళ్ళ కొనలతో పీక్కొను ; 6. కొంచెంగా గ్రహించు ; 7. ఇచ్చు, దానంచేయు ; వి.బ.వ. 1. ఈవులు, దానాలు ; 2. కానుకలు, బహుమానాలు.

పుణుకులు² రూ.చూ. పుడికిళ్లు. వి.బ.వ. ఒకరకం ఆట.

పుణు(కులు రూ.చూ. పుడు(కులు. వి.బ.వ. ఒకరకం భక్ష్య విశేషం.

పుణు(గుకాపు వి. విష్ణువ ? శాకు.నం. 14.153.

పుణుజు రూ.చూ. పుణుదు. వి. జంతువుల రక్తాన్ని పీల్చి జీవించే చిన్న పురుగు.

పుణుదు రూ. పుణుజు. వి. జంతువుల రక్తాన్ని పీల్చి జీవించే చిన్న పురుగు.

పుణ్కు రూ.చూ. పుడుకు¹. స.క్రి. 1. పట్టుకొను : 2. వాత్సల్యంచేత లేదా మోహంచేత మునివేళ్ళతో పట్టుకొను ; 3. ఇచ్చు, దానంచేయు ; 4. నిమురు ; వి. 1. కానుక ; 2. ఈవి, దానం.

పుంట రూ.చూ. పు(ట¹. వి. సంధ్య. ఆం.భా. 1.94.

పుంటి రూ. పుండి, పొంటి². వి. గోగుకూర (Hibiscus cannabinus).

క. పుళి (-ళ్-). పుల్లగాఉండు లేక పుల్లగా మారు, పుళ్లి ; తు. పుణికె, పునికె. చింతపండు, బులె. పులియ పెట్టటం, బులెకలి. పుల్లనికల్లు ; కొం. పుల, పుల్లని దారు, ఉడికించిన చింతపండు నీరు ; కువి. పుల్ల. పుల్లని, పుల్లమార్ను. చింతచెట్టు.

క. పుణ్టి + తె. కూర.

పుంటికూర రూ. పుండికూర, పుండికూర. వి. గోంగూర.

పుంటిజమము వి. తాళ్ళు పేనటానికివాడే గోగునార.

పుంటినొవ్వులు చూ. పుండు¹.

పుంటె రూ.చూ. పు(ట¹. వి. సంధ్య.

పుంట్లు వి.బ.వ. ఒకరకం నూనెగింజలు, నువ్వులతో కలిపి నూనె తీస్తారు, గింజలు. పిట్టు పశువులకు దాణాగా వేస్తారు.

పుండలించు అ.క్రి. అభూతకల్పనచేయు, లేని మాట కల్పించు.

పుండాకు చూ. పుండి.

పుండాకోరు రూ.చూ. పుండాఖోర్. వి. 1. వంచకుడు ; 2. అప్రయోజకుడు ; 3. దాడీలుచెప్పేవాడు.

పుండాఖోర్ రూ. పుండాకోరు. వి. నమ్మకం కలిగించలేనివాడు, పోకిరి.

హిం.ఉ. ఫండా. తాడు, వల, ఫండాకోర్. వల కలవాడు.

< ఉ. ఫండాఖోర్.

పుండి రూ.చూ. పుంటి. వి. ఏడునుంచి పన్నెండడుగుల ఎత్తు పెరిగే ఆకుకూర చెట్టు, గోలుగు (Hibiscus cannabinus).

పుండాకు రూ.చూ. పుండి ఆకు. వి. గోగాకు. పుండిఆకు రూ. పుండాకు, పుండ్యాకు. వి. గోంగూర. పుండికూర రూ.చూ. పుంటికూర. వి. ఏడు నుంచి పన్నెండడుగుల ఎత్తు పెరిగే ఆకుకూర చెట్టు. పుండ్యాకు రూ.చూ. పుండి ఆకు. వి. గోంగూర.

పుండు¹ వి.బా. 1. కురుపు. కు.సం. 11.147 ; 2. మర్మం, గుట్టు. సిం.నార. 33.

క. పుణ్. గాయం, కంతి, పుండు, బొబ్బ ; తు. పుడి. పుండు, కంతి, పూణ్ణొలు. పుండునుంచి వచ్చిన చీము ; త. పుణ్. గాయం, కంతి, గాయం మచ్చ ; మ. పుణ్. గాయం, కంతి, పుండు ; కో. పుణ్. పుండు, మానుతున్న గాయం ; కొలా. పున్ (బహు. పున్దల్). గాయం. చీముతో ఉన్న పుండు ; నా. పున్ (బహు. పున్కుళ్). బొబ్బ, గాయం ; మాల్తొ. పును. పుండు, గాయం.

పుంటినొవ్వులు వి.బ.వ. గాయంవల్ల కలిగిన బాధలు. శాకు.నం. 12.42. పుండుచేయు స.క్రి. కురుపుగా చేయు, పుండుపట్టు అ.క్రి. దుర్బుద్ధి కలుగు. పుండుమాగురుగా(గ( జేయు (-చేయు) అ.క్రి. 1. బాగాకొట్టు. కు.సం. 11.150 ; 2. పుండుమాగకొట్టు. పుండువంటిచలి వి. ఎముకలు కొరికే చలి, ఎక్కువచలి. పుంబ్రాయి వి. గబ్బురాయి, అసహ్యంగా వికృతంగా ఉండే రాయి.

పుండు² వి. ఏడికోలగా రెండు కర్రముక్కలు అతికిన బోటు.

పుండ్యాకు చూ. పుండి.

పుంబ్రాయి చూ. పుండు¹.

పుణ్ణమి రూ. పుణ్ణమ, పున్నమ, పూణ్ణమ. వి. పౌర్ణమి. వెలదుర్తి శాసనం. క్రీ.శ. 625-658.

సం. పూర్ణమాస, పూర్ణమాసి. పౌర్ణమిరోజు ; ప్రా. పుణ్ణమాసి, పుణ్ణిమా, పుణ్ణిమాసి, పుణ్ణిమాసిణి. పౌర్ణమి పర్వదినం ; పా. పుణ్ణమా, పుణ్ణమాసి ; అ.మా. పుణ్ణిమా ; అవ. పుణ్ణవి ;

క. పుణ్ణమె, పుణ్ణివె, హుణ్ణమె, హుణ్ణవె, హుణ్ణిమె, హుణ్ణుమె, హుణ్ణువె, హుణ్మె, హెణ్ణువె ; కువి. పున్ని ; ఒరాయన్. పునై. పున్నమి, పున్నమినాడు పుట్టిన బాలుని పేరు. పున్యా. పున్నమినాడు పుట్టిన బాలికకు పెట్టే పేరు.

< ప్రా. పుణ్ణిమా.

పుణ్ణమ రూ.చూ. పుణ్ణమి. వి. పూర్ణిమ. పన్నమూరు శాసనం. క్రీ.శ. 1028.

పుణ్యావాచన వి. మంగళార్థం చేసే శుభకర్మ. శాకు.నం. 9.220.

సం. పుణ్యాహవాచన-. దైవాది కర్మ ప్రారంభంలో మంగళార్థం చేసే శుభకర్మ.

<నం. పుణ్యాహవాచన-.

**పుటపుట** వి. తహతహను దారను తెంపటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

**పుటపుటమను** అ.క్రి. 1. నొచ్చు, బాధపొందు. పాండు. 2.64; 2. తహతహపడు, తపించు. విష్ణు. 6.165. **పుటపుటవోవు (-పోవు)** అ.క్రి. 1. నొచ్చు, బాధనొందు. ఉ.హరి. 6.104; 2. తహతహపడు, తపించు. భాగ. 2 ఆ. వి.క. 4.221.

**పుటము** విశే. ప్రథమ, మొదటి. నన్నూరు శాసనం. క్రీ.శ. 1088.

సం. ప్రథమ-. మొదటి; ప్రా. పఢమ-, పఢమిల్ల, పఢుమ-, పథమ-, పుఢమ-, పుఢమ-, పుఢుమ-; పా. పఠమ-.

<సం. ప్రథమ-.

**పుటిక** చూ. పటిక. వి. బిచ్చం. అచ్చ. రా. యు. 598.

**పుటికి** వి. వృక్షవిశేషం (Grewia axiatica).

**పుటుకుపుటుకులు** చూ. పటుకు. వి.బ.వ. తెగిన దారపు ముక్కలు.

**పుత్త** వి. పృష్ఠం.

సం. పృష్ఠ-. వెనుకభాగం; ప్రా. పట్ఠ-, పిట్ఠ-, పుట్ఠ-. వెనుకభాగం; నే. పుట్ఠా. పిరుదు; హిం. పీఠ్. పిరుదు; మరా. పుట్ఠా, పుఠా. జంతువు వెనుకభాగం.

<ప్రా. పుట్ఠ-.

**పుత్తడ** వి. నూలుకండె.

సం. పుత్తల-. విగ్రహం, వస్త్రదంతకాష్ఠ మృదాదులచే చేయబడ్డబొమ్మ.

**పుత్తడి**[1] రూ. పుత్తళి. వి. బంగారం. పల్నా. ప.29. సీలా. 1.61.

సం. పీతలోహ-. పచ్చనిలోహం; ప్రా. పిత్తలా. ధాతువిశేషం;

క. పుత్తలికె, పుత్తళి; తు. పుత్తళి.

<ప్రా. పిత్తలా.

**పుత్తడికాపు** వి. మత్స్యవిశేషం. హంస. 4.187. **పుత్తడిచూపులమగువ** వి. లక్ష్మి. **పుత్తడిపొలదిండి** వి. హిరణ్యాక్షుడు. చంద్రాంగ. 3.101. **పుత్తడిబొమ్మ** వి. 1. బంగారుబొమ్మ. ప్ర. శకు. 4.142; 2. బంగారుబొమ్మలాంటి స్త్రీ.

**పుత్తడి**[2] వి. వస్త్ర దంత కాష్ఠాదులతో చేయబడిన బొమ్మ. పాంచాలిక. నృసింహ 2.88, బసవ. 183.

సం. పుత్తల-. బొమ్మ, కనుపాప, పుత్తి, పుత్తలికా. బొమ్మ; ప్రా. పుత్తలియా, పుత్తలీ. సాలభంజిక; అ.మా. పుత్తలియ; నే. పుతలి. బొమ్మ, పుత్లొ.. ప్రతిబింబం; అ. పుతలీ. బొమ్మ, కనుపాప; హిం. పూత్లా, పూత్లీ. బొమ్మ; గు. పుత్లుం. చిన్నప్రతిబింబం, పుత్లీ. బొమ్మ, కనుబొమ్మ;

క. పుత్తలికె, పుత్తళి, పుత్తళిగె, పుత్లి; కుఇ. పుతుల.

<ప్రా. పుత్తలి.

**పుత్తరంజి** వి. పుత్రజీవి.

సం. పుత్ర-. కుమారుడు; ప్రా. పుత్త-; సం. రంజ్. సంతోషించు.

**పుత్తరవత్తి** రూ.చూ. పుత్రసత్తి. వి. పిల్లలు లేనివాళ్ళు కట్టుకోటానికి నేసిన ఒకరకం నేతచీర.

**పుత్తరవత్తిగడిచీర** రూ.చూ. పుత్రసత్తిగడిచీర. వి. పిల్లలులేని వాళ్ళు కట్టుకోటానికి నేసిన ఒకరకం గడిచీర.

**పుత్తరవిత్త** రూ.చూ. పుత్రసత్తి. వి. పిల్లలులేనివాళ్ళు కట్టుకోటానికి నేసిన ఒకరకం నేతచీర.

**పుత్తరవిత్తగడిచీర** రూ.చూ. పుత్రసత్తిగడిచీర. వి. పిల్లలు లేనివాళ్ళు కట్టుకోటానికి నేసిన ఒకరకం గడిచీర.

**పుత్తళి** రూ.చూ. పుత్తడి[1]. వి. బంగారం. ద్వి. సార. చ. 1.186పం.

**పుత్తెంచు** చూ. పుచ్చు[2].

**పుత్తెము** రూ. చూ. పొత్తెము[1]. వి. 1. తాడిపండు మొ. వాటిలో తొడిమ దగ్గర ఉండే కండగల భాగం; 2. ముఖ్య స్థానం.

**పుత్యాము** వి. ఏమీ ఎరగనట్లు నటించేది.

**పుత్రపత్తి** రూ. పత్తరసత్తి, పుత్తరసిత్త. వి. పిల్లలులేనివాళ్ళు కట్టుకోవటానికి నేసిన ఒకరకం గడిచీర.

సం. పుత్ర-. కుమారుడు; సం. శక్తి. సత్తువ; ప్రా. పా. సత్తి. శక్తి, సామర్థ్యం.

<సం. పుత్ర-+ప్రా. సత్తి.

**పుత్రిపత్తిగడి** వి. ఒకరకం నేతగడి. **పుత్రపత్తిగడిచీర** రూ. పత్తరసత్తిగడిచీర, పత్తరసిత్తగడిచీర. వి. పిల్లలులేని వాళ్ళు కట్టుకోవటానికి నేసిన ఒకరకం నేతచీర.

**పుదియ** విశే. అభినవం, కొత్తదయిన.

త. పుతియ. కొత్త, పుతుమై. కొత్తదనం; మ. పుతుమ. కొత్తదనం.

<త. పుతియ.

**పుదియబొట్టు** వి. కొత్తబొట్టు, అప్పుడే పెట్టిన బొట్టు. భాస్క. రా. అరణ్య 2.82.

**పుదీన** రూ.చూ. పుదీనా. వి. సువాసన కలమొక్క, ఈగి ఎంగిలికూర (Mentha arvensis).

**పుదీనా** రూ. పుదీన, పూదీన, పొదీనా. వి. సువాసన కల మొక్క, ఈగి ఎంగిలి కూర (Mentha arvensis).

హిం. ఉ. పుదీనా, పోదీనా. సుగంధ ద్రవ్యంగా ఉపయోగపడే పైర; పార. పోదీనా.

<ఉ. పుదీనా.

**పునక** రూ. చూ. పొంక. వి. 1. బల్ల, బండిమీద వరకు పెట్టుకోటానికి పెట్టినకొట్టి; 2. సుమారుపట్టీవరకు ధాన్యం నిలవ చేసుకోటానికి ఉపయోగించే పేము అల్లినగాదె.

**పువగము** వి. తెలుపలేక లేతపసుపురంగు పూలుపూసేచిన్న చెట్టు (Linocira malabarica).

**పువర** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె.

**పువరము** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పువరు** రూ. పునర పునరము, పునరుము, పునర్వాసెం, పునర్సి, పునర్సు. పునారు, పున్నర, పున్నరి, పున్నరుము. వి. 1.

పునర్వసు నక్షత్రం. E. I. 27.42. క్రీ.శ. 600-700 ; **2.** ఆషాఢ మాసంలో వచ్చేకార్తె.

నం. పునర్వసు-. ఇరవైఏడు నక్షత్రాల్లో ఏడోది.

<నం. పునర్వసు-.

**పునరుసు** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పునర్వసుమొలకొలుకులు** వి.బ.వ. వరిధాన్యంలో ఒకరకం.

నం. పునర్వసు-. 27 నక్షత్రాల్లో ఒకటి.

<నం. పునర్వసు- + మొలకొలుకులు (మిశ్రస.).

**పునర్వాసెం** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పునర్సి** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పునర్సు** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పునహాకమ్మి** రూ.చూ. పునాకమ్మి. వి. పట్టిలు పట్టిలుగా నేసిన ఒకరకం కమ్మి.

**పునా** వి. ఎనిమిది పోగుల దారం.

నం. పునః. మరల, తిరిగి.

**పునాకమ్మి** రూ. పునహాకమ్మి, పన్హాకమ్మి, హునాకమ్మి. వి. పట్టిలు పట్టిలుగా నేసిన ఒకరకం కమ్మి.

**పునాచ్చోడి** చూ. పునాన.

**పునాది** రూ. పునియాది, పున్యాది, బునాతం, బునాది, బునేది, బున్యాది. వి. **1** బలంకోసం గోడకు అడుగున భూమిలో లోతుగా తవ్విపెట్టిన గోడ; **2.** బలంకోసం లోతునుంచి గోడ కట్టటానికి భూమిలో తవ్విన పల్లం; **3.** ఆధారం, మూలకారణం.

హిం. ఉ. పార. బునియాద్. మూలం, ఆధారం సృష్టి, ప్రారంభం.

<ఉ. బునియాద్.

**పునాదికట్టు** వి. పునాదిగోడ, పునాదిలో కట్టినగోడ. **పునాదిగాడి** వి. పునాదిగుంత. పునాదికై తవ్వినగుంట. **పునాదిగాయ** రూ.చూ. పునాదిగొయ్య. వి. గునాదిగుంత, పునాదికై తవ్వినగుంట. **పునాదిగొయ్య** రూ.చూ. పునాది గొయ్య. వి. గునాదిగుంత. పునాదికై తవ్వినగుంట. **పునాది గొయ్య** రూ. పునాదిగాయ, పునాదిగొయ్య. వి. పునాదిగుంట. పునాదికి తవ్వినగుంట. **పునాదిగోడ** రూ. బునాదిగోడ. వి. గునాదిగోడ. పునాదిలో కట్టినగోడ. **పునాదిరాయి** వి. కరగ్రాలాయి. పునాదుల్లో వేసేరాయి.

**పునారు** రూ.చూ. పునరు. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె.

**పునాస** వి. **1.** జూన్‌నెలలో (పునర్వసుకార్తెలో) చల్లేవంట; **2.** మామిడిలో ఒకరకం.

నం. పునర్వసు-. ఇరవైయేడు నక్షత్రాల్లో ఏడోది; ప్రా. పుణవ్వసు; అ. మా. పునావసు.

<నం. పునర్వసు-.

**పునాచ్చోడి** రూ.చూ. పునాసచోడి. వి. చోడిధాన్యంలో ఒకరకం. **పునాసగంటె** వి. సజ్జల్లో ఒకరకం. **పునాసదామ** రూ. పునానగామ. వి. దామల్లో ఒకరకం ధాన్యం. **పునాస చోడి** రూ. పునాచ్చోడి. వి. చోడిధాన్యంలో ఒకరకం. **పునాసజొన్న** వి. ఎర్రనేలల్లో జూన్‌నెలలో వేసేజొన్నలో ఒకరకం. **పునాసమువ్వలు** వి.బ.వ. నువ్వుల్లో ఒకరకం. **పునాసపంట** వి. తొలకరిలో వేసేపైరు, ముఖ్యంగా మొక్క జొన్న పత్తి, కంది, పెసర, మినుము మొ. నవి. **పునాస పత్తి** వి. రెండోకాపులో పండించే తెల్లపత్తి. **పునాసమంద** వి. వేసవికాలంలో పొలానికి తోలించేమంద. **పునాసలు** వి.బ.వ. **1.** సూర్యుడు పునర్వసు నక్షత్రంలో ఉన్నప్పుడు చల్లిన రాగులు మొదలైన ధాన్యం. ఆము. 4.133 ; **2.** తేలిక రకం వరి. **పునాసగామ** రూ.చూ. పునాసదామ. వి. దామలలో ఒకరకం ధాన్యం.

**పునాసాటికదాలు** చూ. పునాస. వి.బ.వ. ధాన్యవిశేషం.

**పునికి** వి. ఆటబొమ్మలు, పెట్టెలు మొ. సామాన్ల తయారీకి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Gyrocarpus Jacqlini).

**పునియాది** రూ.చూ. పునాది. వి. **1.** బలంకోసం గోడకు అడుగున భూమిలో లోతుగాతవ్వి పెట్టినగోడ; **2.** బలంకోసం లోతునుంచి గోడ కట్టటానికి భూమిలో తవ్విన పల్లం; **3.** ఆధారం, మూలకారణం.

**పునిసి** వి. తెలుపులేక లేతపసుపు రంగు పూలుపూసేచిన్న చెట్టు (Linocicra malabarica).

**పునిస్త్రీ** వి. మగడు కలిగిన హైందవస్త్రీ.

నం. పుణ్యస్త్రీ. ముత్తైదువ.

<నం. పుణ్యస్త్రీ.

**పునీల్లకుండ** చూ. పల్ల.

**పునుక** రూ. పుడిక, పున్క. వి. కపాలం. తలపుర్రె. భార. శల్య. 2.163 ; 2. చిప్పఎముక. దశా. 1.153 ; 3. పుల్లపారు అరవిగడ్డ.

కువి. పొన్క. పుర్రె.

చూ. నా. పుర్ని. పుర్రె.

**పునుకకంచమువాఁడు** విశే. కపాలం కంచంగాగలవాడు, శివుడు. **పునుకకంచమువానివిల్లు** వి. మేరుపర్వతం. **పునుక చట్టులదటి** వి. కపాలం కంచంగా కలవాడు. **పునుకకాలువ** రూ.చూ. పునుకతాల్పు. వి. కపాలధారి, శివుడు. **పునుక తాల్పు** రూ. పునుకతాలుపు. వి. కపాలధారి, శివుడు. అచ్చ రా. యు. 116. **పునుకదారి** వి. శివుడు.

**పునుకు** రూ.చూ. పునుగు². అ.క్రి. ఒగ్గు, దిగబడు, కుంగిపోవు.

**పునుగు¹** వి. కానుగుచెట్టు. మందుల్లో ఉపయోగపడే నూనె నిచ్చే గింజలుకాసే ఒకరకం చెట్టు.

**పునుగు²** రూ. పునుకు, పునుఁగు², పుర్కు. అ.క్రి. **1.** త్వరపడు. ద్వి. పరమ. వి. 6.458పు. 20పం ; **2.** వెనుదీయు, సంకోచించు. ద్వి. పరమ. వి. 6.473పు. 9పం ; **3.** డిగ్గు, దిగబడు, కుంగిపోవు ; వి. పక్షవాతం.

క. పుజ్‌గు. వెనుతీయు, వెనుకకువెళ్ళు, పోగొట్టుకొను.

<మూ. ద్రా. *పిన్-.

**పునుఁగు¹** రూ. పున్గు. వి. గంధమార్జాలం వల్ల కలిగే ఒకరకం అయిన సుగంధ ద్రవ్యం. భీమ. 1.118.

క. పుణు. పుణు, పుణుగు, పుణుగు, పునగు. పునుగు, పుల, పునుగు ; కొడ. పు-బెక్క. పునుగుపిల్లి ; తు. పుణుజ్జు, పుణుగు, పునుగు. పునుగు ; త. పుఴుకు, పునుకు, పునుగు, పునుగుపిల్లి ; మ. పుఴుకు, పుఴు.

**పునుఁగుచట్టము** వి. పునుగుపిల్లి శరీరంలోని పునుగుండే కోశం. పిల్లిగర్ధ. ఉ. రా. 7.388. **పునుఁగుఁదావులు** (-తావులు) వి.బ.వ. పునుగువాసన ఉన్న కాలిదాన్య విశేషం. ఆము. 1.82. **పునుఁగుపిల్లి** రూ. పున్గుపిల్లి. వి. పునుగిచ్చే పిల్లి. ఉ. రా. 7.388. **పునుఁగుబెంద** వి. కస్తూరిబెండ, ఒకరకం సువాసన కలబెండ. **పునుఁగురాజనములు** వి.బ.వ. పునుగువాసన ఉన్న ఒకరకం అయిన కాలిదాన్య విశేషం. హంస. 4.128.

**పునుఁగు²** రూ.చూ. పునుగు². అ.క్రి. 1. త్వరపడు; 2. వెనుకీయు, సంకోచించు.

**పునెము** రూ.చూ. పున్నెము. వి. సుకృతం. శుక. 1.74.

**పునేదానం** వి. పునాదితీసినప్పుడు పనివాళ్ళకు ఇచ్చే బహుమానం, అలాంటి ఆహారం.

<పునాది + ఈనాం.

**పున్క** రూ.చూ. పునుక. వి. 1. తలపుర్రె, కపాలం. విక్ర. 1.7 ; 2. చిప్పఎముక, ఎముక. కాన్క. శ. 36.

**పున్కవిచ్చు** చూ. పున్కు.

**పున్కు** రూ.చూ. పునుగు2. అ.క్రి. ఒగ్గు, దిగబడు, కుంగిపోవు.

**పున్కవిచ్చు** స.క్రి. గుంపెనేయు, కుంగనిచ్చు.

**పున్గు** రూ.చూ. పునుఁగు¹. వి. ఒకరకం సుగంధ ద్రవ్యం. ద్వి. నల. 1.779పం. క్రీడా. 46.

**పున్గుపిల్లి** రూ.చూ. పునుఁగుపిల్లి. వి. పునుగిచ్చేపిల్లి. ఆం. రా. 2.84.

**పుంత** రూ. పుంత. వి. 1. ఉపరథ్య, పశ్వాదుల రాకపోకల్తో ఏర్పడిన ఊరిముందరి దారి. ద. హిం. గా. సంపు. 5. గా. సం. 151. క్రీ.శ. 1318 ; 2. మార్గం ; 3. ఒక పొలంనుంచి మరొకపొలంలోకి పారేపిల్లకాలవ.

క. పాటె. దారి, రోడ్డు ; త. పుత్తై. రంధ్రం, ప్రవేశం, అడవిదారి, కాలిబాట, ఇరుకుదారి, (-ప్పు-,-త్తు-). రంధ్రంచేయు. జక్లైర. పుటల్. గొట్టం, మురికికాలువ. పూట్. రంధ్రం, పూటై. దొడ్డి గుమ్మం, కొండదారి, మార్గం ; మ. పుట. గోడలో ఉన్నకాకి ; కో. పుల్. వందు, పగులు ఇక్కమధ్యనందు ; తొ. పిల్. గోడలో అమర్చిన తూము.

**పుందికూర** రూ.చూ. పుంటికూర. వి. పీచునిచ్చే ఒకరకం చెట్టు (Hibiscus cannabinus).

**పున్న** రూ.చూ. పిన్న. విశే. చిన్న.

**పున్నతేలు** వి. చిన్నతేలు.

**పుంనం** వి. పుణ్యం. E.I. సంపు. 32.1. (R.E.IX).

సం. పుణ్య-. శుభాదృష్టం.

<సం. పుణ్య-.

**పున్నమ** రూ.చూ. పున్నమి. వి. పౌర్ణమాసి, శుక్లపక్షంలోని చివరి రోజు, పంచపర్వాల్లో ఒకటి. కు.సం. 3.18, కొరవిగానసం. క్రీ.శ. 892–922.

**పున్నర** రూ.చూ. పునరు. వి. అపారమాసంలో వచ్చే కార్తె.

**పున్నరి** రూ.చూ. పునరు. వి. అపారమాసంలో వచ్చే కార్తె.

**పున్నరుపు** రూ.చూ. పునరు. వి. అపారమాసంలో వచ్చే కార్తె.

**పున్నవంకాయ** వి. పెద్దకాయరకం, తెల్లవంకాయ కావచ్చు.

**పున్నియము** రూ.చూ. పున్నెము. వి. సుకృతం. కాశీ. 2.45.

**పున్నీరు** చూ. పల్ల¹.

**పున్నీళ్ళకుండ** చూ. పల్ల¹.

**పున్నెమంతుడు** వి. భర్తపేరు చెప్పటానికి బదులుగా స్త్రీలు వాడే మాట.

సం. పుణ్యవంత-. పుణ్యంగల, శుభప్రదమైన ; ప్రా. పుణ్ణవంత-. అదృష్టంగల, శుభప్రదమైన ; పా. పుణ్ణవత్. గొప్పతనంకల, శుభప్రదమైన.

<ప్రా. పుణ్ణమంత-.

**పున్నెము** రూ. పునెము, పున్నియము. వి. సుకృతం. బసవ. 35 ప.

సం. పుణ్య-. సుకృతం ; ప్రా. పుణ్ణ-, పున్న-. శుభకర్మ, సుకృతం, పవిత్రం ; గా. పుణం, పుణ్ణం. ; అ.మా. పుణ్ణం, పున్నం. ; జై.పా.మా. పుణ్ణం. ; అప. పుణ్ణం ;

మ. పుణ్ణియం. ; కువి. పునమి.

<ప్రా. పుణ్ణ-.

**పున్యాదానందుత్త** వి. దానునాడు మోటోళ్ళు తీసుకొని పోయే నీళ్ళ దుత్త.

సం. పుణ్యాదాన-. పుణ్యం తీసుకొనేటటు వంటిది.

<సం. పుణ్యాదాన- + -ము + దుత్త.

**పున్యాది** రూ.చూ. పునాది. వి. 1. బలంకోసం గోడకి అడుగున భూమిలో లోతుగా తవ్విపెట్టిన గోడ ; 2. బలంకోసం లోతునుంచి గోడకట్టటానికి భూమిలో తవ్విన వల్లం ; 3. ఆధారం, మూలకారణం.

**పున్నాకమ్మి** రూ.చూ. పునాకమ్మి. వి. పట్టెలు వట్టెలుగా నేసిన ఒకరకం కమ్మి.

**పుప్పడి** రూ.చూ. బొప్పాయి. వి. మెక్సికోదేశం నుండి వచ్చిన ఒకరకం పళ్ళచెట్టు (Carica papaya).

**పుప్పము** వి. పువ్వు. ఆం.నా.సం.స్థా. 7.

సం. పుష్ప-. పువ్వు ; ప్రా. పుప్ఫ-. ; పా. పుప్ఫ-. ; హిం. పుఫ్, ఫూప్, ఫూఁసుప్.

<ప్రా. పుప్ప-.

**పుప్పి** రూ.చూ. పిప్పి. వి. పురుగుపట్టి చెడిపోవటం. ప్రబంధ. 605 ; విశే. పుచ్చిన. చంద్రరే. 3.40, రామలిం. శ. 10.

**పుప్పిపన్ను** వి. చెడిపోయిన పన్ను. **పుప్పిపురుగు** వి. నుసిపురుగు, కర్రతొలిచి నుసిరాల్చే పురుగు.

**పుప్పించు** చూ. పుత్తెంచు. స.క్రి. 1. పుచ్చు, తొలగించు, తీసివేయు. బసవ. 7.907 పం. ; 2. తీయించు, తొలగింపచేయు. షోడ. 3 ఆ.

**పుప్పు** చూ. పుచ్చు¹.

**పుప్పె** చూ. పుప్పి. వి. మరనాడెమొన అరిగిపోకుండా ఓగించిన జనపపొన్ను.

**పుప్పాడి¹** రూ.చూ. బొప్పాయి. వి. మెక్సికోదేశం నుంచి వచ్చిన ఒకరకం పండ్ల చెట్టు (Carica papaya).

**పుప్పాడి²** చూ. పు.

రాధం చేసినవాళ్లు క్షమించండని విజేతల్ని దేవతల్ని ప్రార్థించటానికి సూచకంగా గడ్డి నోట్లో ఉంచుకొను. ప్రబంధ. 788.

**పూరి**[2] వి. మృగాల చనుదాలు. జైమినిభా. 4.89.

**పూరి**[3] వి. ఒకానొక రాగం. చెన్నబసవ. 2.236.

**పూరించు** స.క్రి. ఊదు. భార. భీష్మ. 1.148.

సం. పూర్. నిండు.

<సం. పూర్ + -ఇంచు[3].

**పూరిపెట్టు** స.క్రి. పూడ్చు. నింపు. పూడునట్లు చేయు.

**పూరీ** వి భక్ష్య విశేషం. హంస. 1.105.

సం. పూరికా. భక్ష్య విశేషం; హిం. పూరీ. తిన టానికి తయారుచేయబడిన ఒకవిధమైన రొట్టె; ఉ. పూరీ. భక్ష్య విశేషం;

క. త. పూరి.

<హిం. పూరీ.

**పూరీపుడకా** చూ. పూరి[1].

**పూరుదొండ** వి. దొండకాయలో ఒకరకం.

**పూరుపొన్న** వి. ఒకానొక చెట్టు.

**పూరులుగలుచు** చూ. పూరి[1].

**పూరెదు** రూ. పూరేదు, పూరేలు. వి.పా. పక్షి విశేషం. హరి. పూ. 6.5.

క. బుర్లి, బురలి, బురులి. కౌజువంటి పిట్ట పరిపు పిట్ట; త. పూటై. కౌజులాంటి పిట్ట, అడవి కోడిపుంజు, పూడాన్, అడవికోడి; కో. మొణ.మ్యదిల్. కౌజులాంటి పిట్ట.

**పూరేదు** రూ.చూ. పూరెదు. వి. పక్షి విశేషం. యయా. 1.113.

**పూరేలు** రూ.చూ. పూరెదు. వి. కముజుజాతి చిన్న అడవిపక్షి.

**పూర్ణంకాయ** వి. గుత్తివంకాయ.

సం. పూర్ణ-. నిండినది.

<పూర్ణ + -ము + కాయ.

**పూర్ణబుగిడి** వి. పూర్తిగా మొగ్గ మాదిరిగా నేసిన డిజైను.

సం. పూర్ణ-. నిండినది.

<సం. పూర్ణ- + బుగిడి (మిశ్రన.).

**పూర్ణము** రూ.చూ. పూర్నము. వి. 1. బెల్లంతో ఉడికించి రుబ్బిన పెనగపప్పు; 2. బూరె.

**పూర్తికుట్టు** వి. ఒకరకం కుప్పదం నేత.

సం. పూర్తి-. పూర్ణం, నింపటం.

<సం. పూర్తి- + కుట్టు (మిశ్రన.).

**పూర్ణపుకుండలు** వి.బ.వ. దేవాలయాలమీద అమ్మవారి గుళ్ళ మీద పెట్టే కుండలు.

సం. పూర్ణ-. నిండైన.

**పూర్నము** రూ. పూర్ణము. వి. కుడుములు మొ. పిండివంటల్లో పెట్టే బెల్లంవేసి నూరిన పప్పుముద్ద మొదలైనవి.

సం. పూరణ-. కుడుములు మొ. పిండివంటల్లో బెల్లం వేసి పెట్టే నూరిన పప్పు మొ.నవి.

<సం. పూరణ-.

**పూర్వంముంత** వి. ఇంటికి అలంకారంగా ముందు పెట్టే మట్టి ముంత.

సం. పూర్వ-. ముందు, అగ్రభాగం.

<సం. పూర్వ + -ము + ముంత.

**పూర్వసాల** వి. పుష్యమాసంలో వచ్చే కార్తె.

సం. పూర్వాషాఢ-. పుష్యమాసంలో వచ్చే కార్తె.

<సం. పూర్వాషాఢ-.

**పూర్వసువాసివి** వి. విధవ, మగడు పోయిన స్త్రీ.

సం. పూర్వసువాసిని. (విధంతువు కాక) ముందు సువాసన (కల పువ్వులు) కలది.

<సం. పూర్వ సువాసినీ (అర్థవిపరి.).

**పూర్వాదుత్తము** వి. పూర్వదత్తం. ద.హిం.గా.సంపు. 237, శ్రీ.శ. 1195.

సం. పూర్వదత్త-. ముందుగా ఇవ్వబడిన.

<సం. పూర్వదత్త-.

**పూలి**[1] వి. ఒకానొక చిన్నచెట్టు. హంస. 4.10 (Crinum pratense).

క. పూలి, దారి పక్కన మొలిచే చిన్నచెట్టు; త. పూల్, పూలా, ఒకరకం చెట్టు.

**పూలి**[2] వి. 3½ రూపాయలు విలువచేసే నక్షత్రాకారంలో ఉండే నాణె విశేషం.

**పూలీలు** వి.బ.వ. చూ. పూలి[2]. ఒకరకం నాణేలు.

**పూవ** రూ.చూ. పుబ్బ. వి. శ్రావణమాసంలో వచ్చే కార్తె.

**పూవంచు** చూ. పూవు.

**పూవరసి** చూ. పూవు.

**పూవారం** చూ. పూవు.

**పూవు** చూ. పూవు. రూ. పువు, పువ్వు, పూ. వి. 1. విరి. పుష్పం. భార.సభా. 1.182; 2. సొగసు, అందం, ఆం.భా. 3.48; 3. కంటిలో పువ్వు, నేత్రరోగ విశేషం; 4. కాల్చిన కాకరవత్తి మొ. వాటినుంచి పుష్పాకృతిగా పడే నిప్పురవ్వ.

క. పూ (పూత్-). వికసించే పువ్వు, పువ్వు, పూవు, పువ్వు: కొడ. పు, పు.వి; తు. పూ. పువ్వు, కంట్లో పువ్వు; త. పూ. పువ్వు, (-ప్ప-, -త్త-). పువ్వు; మ. పూ, పూవు. పువ్వు, రజస్వల అవటం, వికసించు; కో. పు. పువ్వు; తొ. పు.ఫ్; గోం. పుస్గార్; కొం. పూజ్; కుఇ. పూజా (బహు. పూస్గ): కువి. పూయూ (బహు. పూస్గ), పూస్గ; పర్జి. పూ (బహు. పూల్). పువ్వు: కొలా. పువ్, పూత; నా. పూత; గ. పూ (బహు. పూల్), పువ్వు; కురు. పూప్, పూప్పు; మాల్తొ. పుప్పు.

చూ. సం. పుష్ప-. పువ్వు; ప్రా. పుప్ప-.

<మూ.ద్రా. *పూ.

**పూవంచు** రూ.చూ. పువ్వంచు. వి. పువ్వు ఆకారంలో డిజైను నేసిన అంచు. <పూవు + అంచు[3]. **పూవరసి** వి. గంగరావిచెట్టు. **పూవారం** రూ.చూ. పువార్వము. వి. కంటి మీద సూగుసూగుగా పట్టిన పూత. **పూవుగట్టు** వి. పుష్ప పర్వతం. రామాభ్యు. 8.144. **పూవుటెత్తు** (-ఎత్తు[1]) వి. ఒకరకం పూలదండ. ఆము. 5.91. **పూవుతోంటవిబంధము**

వి. పుష్పవాటి నిబంధం. ద.హిం.గా.సంపు. 6, గా. సం. 987, క్రీ.శ. 1220. **పూవుసవ్దావియుంబోలె** అవ్య.క్రి. అవినాభావంగా ఉండేటట్లు. మను. 6.67. **పూవుమందొడిమయుఁజూపు** అ.క్రి. పూవుల్ని తుంచి తొడిమల్ని వేరు చేయు. ఉ.హరి. 4.210. **పూవుఁదీఁగ (-తీఁగ)** దూ. పూవుఁటీవ. వి. పూలుండే తీగ. మను. 2.22. **పూవుఁదీవ (-తీవ)** రూ.చూ. పూవుఁదీఁగ. వి. పూలుండే తీగ. **పూవుఁదూపులజోదు (-తూపులజోదు)** వి. మన్మథుడు. శృం.నై. 1.79. **పూవుఁదేనియ(-తేనియ)** దూ. పూవుఁదేనె. వి. మకరందం. నీలా. 1.4. **పూవుఁదేనె (-తేనె)** రూ.చూ. పూవుఁదేనియ. వి. మకరందం. **పూవుఁదేరు (-తేరు)** వి. పూలతో కట్టిన రథం. కు.సం. 4.83. **పూవుపెండి** వి. తల్లిబెండి, వాసాలకు పైనా కిందా బద్దలు వేసి బిగించిన పెండె. **పూవుపేటు** దూ. పూపేటు. వి. పుష్పమాదిరి నేత తికైను. **పూవుఁబోణి** రూ.చూ. పూఁబోఁడి. వి. స్త్రీ. **పూవుఁబోఁడి** రూ.చూ. పూఁబోఁడి. వి. పువ్వులా మనోజ్ఞంగా ఉన్న స్త్రీ. క్రీడా. 169. **పూవుఱా** వి. పుష్పాకారంగా ఉండే రాయి, లింగపీఠం, పానవట్టం. బసవ. 7.378. **పూవులలోపెట్టినట్లు** అవ్య. అత్యాదరంతో, ఇప్పినది ఇచ్చినట్టు. **పూవులలోఁబెట్టిపూజించు** స.క్రి. అత్యాదరంతో గౌరవించు. **పూవులుకుఱుము** అ.క్రి. పూలు వెంట్రుకల్లో ముడుచు. పారి. 2.52.

**పూరెట్టి** వి. తేరగావచ్చిన ఇతరుల సొత్తు.

**పూస** రూ.చూ. పోఁచ. వి. 1. వేలు మొ.వాటి కీలు, శరీరంలో చిన్న బుడిపిలా ఉండే ఎముక. ఆము. 6.80 ; 2. ముద్ద. అహల్యా. 3.54 ; 3. (గాజు, లోహాలు, తులసి, రుద్రాక్షలు మొ.వాటి) చిన్నపూస, గుళిక. అచ్చ.రా.యు. 508 ; 4. సచ్ఛిద్రమణి, మణి. ఆం.భా. 2.278 ; 5. చెరకు, జొన్న, నజ్జ మొ. మొక్కల దంటుకు అక్కడక్కడ ఏర్పడే ఆకుకు తేక హద్దు ; 6. కారపుపూస ; 7. కొయ్య అనుగొట్టం చివర అమర్చిన గాజుపూస ; 8. మరాను ఒగ్గుల పట్టెకు బిగించిన చిన్న చుట్టు ; 9. అచ్చుకర్రమీద పడివారంతో వేసిన మెలికలు : 10. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్య గిలక ; 11. చేరుకర్రల బిగింపుకు దారాలకు వేసే లోహపుచుట్టు ; 12. మరనాడెలో కండె పోగు బయటికి రావటానికి బెజ్జంచేసి బిగించిన గాజుపూస ; 13. పేటు దారానికి చివర కట్టిన పరివారంలో అంచు పోగు దూర్చే నందు.

కువి. ఫూస ; కొలా. ఫు.స. కంఠహారం ; నా. ఫూస. పూస ;

సం. భూషా. నగ ; ప్రా. భూసా ; పా. భూసా.

**పూసకజ్జము** వి. మనోహరం, భక్ష్యవిశేషం. **పూసకట్టు** అ.క్రి. 1. చిన్నచిన్న పూసలుగా ఏర్పడు ; 2. నేతలో పోగులు ముద్దగా ఏర్పడు. **పూసకామంచి** వి. తృణవిశేషం. **పూసగురుగింజ** వి. పూలగురిగింజ. **పూసగూర్చు (-కూర్చు)** స.క్రి. అచ్చుకట్టేటప్పుడు పైఅచ్చుకర్ర పడిలోకి కిందిఅచ్చు కర్ర పడివారం లంకె పడేట్టు దూర్చు. **పూసగ్రుచ్చినగతి** అవ్య. క్రి. వరుసగా. భార. అను. 3.79. **పూసగ్రుచ్చినట్లు చెప్పు** స.క్రి. వివరంగా చెప్పు. **పూసగ్రుచ్చినతెరంగువన్** అవ్య. క్రి. వరుసక్రమంగా. కాశీ. 5.175. **పూసగ్రుచ్చినరీతిన్** అవ్య. క్రి. వరుసగా. విజయ. 2.79. **పూసగ్రుచ్చు** స. క్రి. జతచేయు. భాగ. సం. 13.46. **పూసటెమ్ముక (-ఎమ్ముక)** రూ.చూ. పూసయెమ్ముకము. వి. వెన్నెముక. **పూసటెమ్ముకము (-ఎమ్ముకము)** దూ. చూ. పూసయెమ్ముకము. వి. వెన్నెముక. **పూసదిద్దు** స.క్రి. అచ్చు కట్టిన తరువాత అచ్చు కర్రమీద పడివారంతో వేసిన మెలికలను దువ్వెనకొమ్ముతో దువ్వు. **పూసద్రాడు (-త్రాడు)** వి. కాలికి ముడికల త్రాడు. హరి. పూ. 5.209. **పూసవామ** వి. కంఠాభరణ విశేషం వేంక. పంచ. 4.416. **పూసపురి** వి. పూసకామంచిగడ్డి, ఒకరకం కలుపుమొక్క. **పూసపోసు** వి. ఒంటిపైగల నగ. **పూసబొట్టు** వి. మణులతో ఏర్పరచిన బొట్టు, పాపటబొట్టు. చేర్చుక్క. శుక. 2.145. **పూసముడ్డి** వి. జబ్బుచేసి బలహీనంగా ఉన్న చిన్నపిల్లవాడి స్థితి. **పూసయెముక (-ఎముక)** దూ.చూ. పూసయెమ్ముకము. వి. వెన్నెముక. **పూసయెముకము** రూ.చూ. పూస యెమ్ముకము. వి. వెన్నెముక. **పూసయెమ్ముకము (-ఎమ్ముకము)** దూ. పూసటెమ్ముక. పూసటెమ్ముకము, పూసయెముక, పూసయెముకము. వి. వెన్నెముక. కాశీ. 6.41. **పూసలకట్టె** వి. 1. అనుపోసే గొట్టం ; 2. పట్టుదారం పడుగు అను మీదికి లోడటానికి పోగు ఎక్కించే కొయ్యగొట్టం. **పూసలగురివెంద** వి. పూసలవలె ఉండే గింజలుకల గురివెంద. **పూసలపేరు** వి. పూసలదండ. **పూసలలోదారము** వి. అన్యోన్యంగా, కలసి మెలసి ఉండటం. పారి. 1.98. **పూసలవడి** వి జనపవడి. **పూసలవాఁడు** విశే. 1. రత్నాలను సానపట్టేవాడు, మణికారుడు. ఆం. భా. 2.289 ; 2. పూసలమ్మేవాడు.

**పూవికొవితిరుసు** చూ. పూయు.

**పూవికొమ** చూ. పూయు.

**పూవిగొండి** చూ. పూయు.

**పూవిగొండితనము** చూ. పూయు.

**పూవితొడికట్టు** చూ. పూయు.

**పూవివతంగేరువలె** చూ. పూచు[1].

**పూమకొవితిరుసు** చూ. పూయు.

**పూమకొమ** చూ. పూయు.

**పూమరుచేయు** చూ. పూయు.

**పెకంటోళ్లు** రూ. చూ. పెక్కంటోళ్లు. వి.బ.వ. కుమ్మర్లను యాచించివారి వంశ చరిత్రను ఆచారాదులను చెప్పే వాళ్ళు.

**పెకరోడు** దూ. చూ. పెక్కరోడు. వి. సంవత్సరానికో మూడేళ్ళకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశ చరిత్రను ఆచారవ్యవహారాలను గోత్రాలపేర్లు చెప్పేవాడు.

**పెకలించు** చూ. పెకలు.

**పెకలు** రూ.చూ. పెగలు. అ.క్రి. 1. పెల్లగిల్లు, ఉత్పాటిత

మగు. పల్నా. 109 ; 2. కదలు, కదలిపోవు. వరాహ. 10.42 ; 3. ప్రయాణమగు, బయలుదేరు. జైమినిభా. 2.10 ; 4. పగులు, బద్దలగు. పి. శకు. 3.140 ; 5. రాలు, ఊడిపోవు. వసు. 2.11 ; 6. వదులు, విడిపోవు.

పెకలించు రూ. పెక్కలించు, పెగలించు. స.క్రి. పెల్లగించు, ఉత్పాటించు, ఊడబెరుకు. పండిత. 4.51ప. పెకలుచు రూ. పెకల్చు, పెగలుచు, పెగల్చు. స.క్రి. పెల్లగించు, ఊడబెరుకు. రామాభ్యు. 8.92. పెకల్చు రూ. చూ. పెకలుచు. స.క్రి. పెల్లగించు, ఊడబెరుకు. శుక. 3.531.

పెకల్చు చూ. పెకలు.

పెకాయించు (-ఇంచు[3]) చూ. పెకలు. స.క్రి. పారవేయు.

పెక్కణము రూ.చూ. ప్రెక్కణము. వి. 1. అభినయంతో చేసిన నృత్యం. ఉ. హరి. 4.216 ; 2. మల్లరంగం.

పెక్కణి వి. నాట్యవిశేషం. వాల్మీ. 3.41.

సం. ప్రేక్షణికా. నాటకాలు మొ. వి. చూడటంలో ఆసక్తిగల స్త్రీ ; ప్రా. పేక్ఖణీ.

<ప్రా. పేక్ఖణి.

పెక్కండోళ్లు రూ. పెకండోళ్లు, పెక్కండోళ్లు. వి.బ.వ. కుమ్మర్లను యాచించి వారివంశ చరిత్రను ఆచారాదుల్ని చెప్పేవాళ్ళు.

పెక్కంద్రు చూ. పెక్కు.

పెక్కంద్రురు చూ. పెక్కు.

పెక్కరోడు రూ. పెకరోడు. వి. సంవత్సరానికో మూడేళ్ళకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశచరిత్రను ఆచారవ్యవహారాల్ని, గోత్రాలపేర్లూ చెప్పేవాడు.

పెక్కర్లోడు రూ. పెక్కెర్లోడు. వి. సంవత్సరానికో మూడేండ్లకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశ చరిత్రను, ఆచారవ్యవహారాలను, గోత్రాలపేర్లూ చెప్పేవాడు.

పెక్కలి వి. ఒకానొక చెట్టు.

పెక్కలించు రూ.చూ. పెకలించు. స.క్రి. పెల్లగించు, పెరుకు. అప్ప. 4.383.

పెక్కండోళ్లు రూ.చూ. పెక్కండోళ్ళు. వి.బ.వ. కుమ్మర్లను యాచించి వారి వంశ చరిత్రను ఆచారాదులను చెప్పేవాళ్ళు.

పెక్కు సర్వ. అమహదర్థకమైనప్పుడు, రూ. పెక్కటిన్, పెక్కటికి, పెక్కంటికి, పెక్కటన్, పెక్కంటన్, పెక్కటియందు, పెక్కంటియందు మొ. వి. బహు. పెక్కురు, పెక్కంద్రు, పెక్కంద్రురు, పెక్కురకు, పెక్కంద్రకు, పెక్కంద్రురకు మొ. వి. ఎల్లశబ్దంలాగా ఇది మహన్మహత్యమహదర్థక విశేష్యాలకు విశేషణంగా వాటికి ముందుగాని వెనకగాని ప్రయోగించబడుతుంది. 1. బహ్వర్థకం, అనేకాలు, అనేకులు. భార. ఆది. 2.131 ; 2. మాటలు అధ్యాహార్యం. భార. ఆది. 7.242 ; 3. రూపాలు అధ్యాహార్యం. భార. శల్య. 1.36 ; 4. అధికం. రామలిం. శ. 36 ; 5. దృఢం, గట్టిది. గంధ. 146.

క. హెచ్చు. గొప్పతనం. వైశాల్యం, విస్తారం ; తు. పెర్గుడె, పండికొక్కు, పెర్మె. గర్వం, అహంకారం ; కొ. పెమ్. చిన్నకొండ ; గోం పటోల్. గొప్ప, పెర్మ. పూజారి, పెర్మా. గ్రామపూజారి ; కుఇ. పేరెతి. పెద్దఎలుక ; నా. పర్. పెద్దది, పెద్దవాడు, పెరుక్-/పెర్క్-. జీవించు ; గ. బెజ్జిడ్. చాల, ఎక్కువ, బెజ్జురుల్. చాల ; మాల్తో. బెడొ. పెద్ద.

పెక్కంద్రు రూ. పెక్కంద్రురు. సర్వ. బ.వ. చాలామంది. (పెక్కుశబ్దానికి మహన్మహత్యర్థకరూపం). భార. ఆది. 5.278. పెక్కంద్రురు రూ.చూ. పెక్కంద్రు. సర్వ. బ.వ. ఎక్కువమంది, చాలామంది. భార. ఆది. 8.25. పెక్కునోళ్ళవాడు విశే. మాటనిలకడ లేనివాడు. భోజ. 5. పెక్కురు సర్వ.బ.వ. పెక్కుమంది. సీలా. 2.

పెక్కులొక్కు వి. పిల్లిపిట్ట ధ్వనికి అనుకరణం. ప్రబంధ. 78.

పెక్కువ వి. 1. వర్ధనం భార. అరణ్య. 3.26 ; 2. ప్రేమ. కు. సం. 4.118 ; 3. ఆధిక్యం. అతిశయం. భార. కర్ణ. 1.62 ; 4. ఎత్తు. కాశీ. 3.6 ; 5. సమూహం. యయా. 4.13 ; విశే. 1. పెద్దది. విక్ర. 3.39 ; 2. ఎత్తైంది. శరా. 2.86.

పెక్కర్లోడు రూ. చూ. పెక్కర్లోడు. వి. సంవత్సరానికో మూడేళ్ళకో ఒకసారి వచ్చి కుమ్మర్లను యాచిస్తూ వారి వంశచరిత్రను ఆచారవ్యవహారాలను గోత్రాలపేర్లు చెప్పేవాడు.

పెగడ రూ.చూ. పెగ్గడ. వి. మంత్రి, ప్రధానుడు.

పెగలించు చూ. పెగలు.

పెగలు రూ. పెకలు. అ.క్రి. 1. వదలు, విడిపోవు. క్రీడా. 226 ; 2. రాలు, ఊడిపోవు. భాగ. 6.61 ; 3 కదలు. కదలిపోవు. శుక. 2.12 ; 4. పెల్లగిల్లు, ఉత్పాటితమగు ; 5. పగులు, బద్దలగు ; 6. ప్రయాణమగు, బయలుదేరు.

మ. పిక్కుక. ముక్కలుగా అగు.

పో.చూ. పీకు.

<*పెడ్-అల్. <*పిడ్-అల్, *పిడ్-.

పెగలించు రూ.చూ. పెకలించు. స.క్రి. పెల్లగించు, ఊడబెరుకు. పెగలుచు రూ.చూ. పెకలుచు. స.క్రి. పెల్లగించు, ఊడబెరుకు. పెగల్చు రూ.చూ. పెకలుచు. స.క్రి. పెల్లగించు, ఊడబెరుకు. చంపూరా. 8.61.

పెగల్చు చూ. పెగలు.

పెగ్గడ రూ. పెగడ. పెగ్గెడ, ప్రగడ, ప్రగ్గడ, ప్రగ్గెడ, ప్రెగడ, ప్రెగ్గడ, ప్రెవడ. వి. 1. మంత్రి. ద.హిం గా. సంపు. 6. గా.సం. 250. క్రీ.శ. 742-798 ; 2. ఊరిపెత్తందారు.

క. పెర్గ్గడె, పెగ్గడె, హెగ్గడె. యజమానుడు, ప్రధానుడు.

<క. పెగ్గడె.

పెగ్గడపాడి వి. మంత్రిధార్యం. ద.హిం.గా. సంపు. 6. గా.సం. 995. క్రీ.శ. 1209.

పెగ్గి రూ.చూ. పగ్గె. వి. పొగరు.

పెగ్గు వి. 1. మేకు, సీల ; 2. రాటిగొలుసు బద్దకు బిగించిన కొయ్యముక్క ; 2. మత్తుకలిగించే పానీయ పరిమాణ విశేషం.

ఇం. *Peg*. మేకు, పానీయం.

< ఇం. Peg.

**పెగ్గుమ్మడి** రూ.చూ. పెద్దగుమ్మడి. వి. పెద్దపెద్ద ఆకులు కలిగి లావుగా ఉండే ఒక తీగ.

**పెగ్గుమ్ముడు** రూ.చూ. పెద్దగుమ్ముడు. వి. శ్రీపర్ణి.

**పెగ్గురు** రూ. బెగ్గురము, బెగ్గురు. వి. సారసపక్షి. సిం.ద్వా. 1.219.

సం. పుష్కర-. బెగ్గురుపిట్ట; ప్రా. పొక్ఖర-.

< ప్రా. పొక్ఖర-.

**పెగ్గె** రూ.చూ. పగ్గె. వి. 1. పొగరు; 2. ప్రతిజ్ఞ, బడాయి.

**పెంక** రూ.చూ. పెంకు. వి. 1. ఉన్నినూలు వడికేటప్పుడు కదురు పెట్టే కుండపెంకు; 2. ఉన్ని వడికేటప్పుడు కదురుతిప్పే దోనికి ఆధారంగా పెట్టిన మట్టు; 3. రొట్టెలు, దోసెలు మొ. వి కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

**పెంకటిగాజు** వి. కుండపెంకు, మట్టితో చేసిన దావి పెంక. **పెంకటిల్లు** రూ.చూ. పెంకుటియిల్లు. వి. పెంకు కప్పున్న ఇల్లు. **పెంకపురుగు** రూ. పెంకాపుగ్గు. వి. మొలక పైకి వచ్చి రాకముందే తినే పురుగు.

**పెంకచ్చు** చూ. పెంకు.

**పెంకాపుగ్గు** రూ.చూ. పెంకపురుగు. వి. మొలకపైకి వచ్చి రాకముందే తినే పురుగు.

**పెంకాము** చూ. పెంకు.

**పెంకాయపూత** వి. ఒకరకం సన్న పద్దు.

< పెను + కాయ + పూత.

**పెంకి[1]** రూ.చూ. పెంకు. వి. 1. ఒకానొక తీగ; 2. మిక్కిలి ఎరుపు; 3. ఇంటికప్పుకు ఉపయోగించే ఓడుబిళ్ళ.

**పెంకిటిల్లు** రూ.చూ. పెంకుటియిల్లు. వి. పెంకు కప్పున్న ఇల్లు.

**పెంకి[2]** రూ.చూ. పెంకె[1]. వి. 1. మొండికట్టె: 2. మూర్ఖుడు.

**పెంకితనము** రూ.చూ. పెంకెతనము. వి. చెప్పిన మాట వినకపోవటం. **పెంకివాడు** విశే. 1. ఏకాగ్రుడు: 2. ధీరుడు, ధైర్యశాలి; 3. దుష్టుడు.

**పెంకియ** రూ.చూ. పెంకె[1]. విశే. 1. మొండికట్టె; 2. మూర్ఖుడు.

**పెంకిల్లు** చూ. పెంకు.

**పెంకు** రూ. పెంక. పెంకి[1], పెంకె[2]. వి. 1. కుండ మొ. వాటి ముక్క. ఆం.భా. 2.133; 2. ఇంటికప్పు కుపయోగించే ఓడుబిళ్ళ; 3. తలపెంకు; 4. చితికిన అద్దం మొ. వాటి పెంకు; 5. కొబ్బరి మొ. వాటి పెంకు; 6. ముష్టి చిప్ప.

క. హెణ్చు, హుణ్చు. అణ్చు. ఇటిక; కొడ. ఆణ్చు. ఇటిక; మాల్తొ. పడ్క. ఇంటికప్పు.

**పెంకచ్చు** వి. పెంకుకర్ర, పెంకుచేసే కొయ్యదిమ్మ. < పెంకు + అచ్చు[1]. **పెంకాము** వి. పెంకుబట్టీ, పెంకును కాల్చే బట్టీ. < పెంకు + ఆము. **పెంకిల్లు** రూ.చూ. పెంక్కుటి యిల్లు. వి. పెంకుటిల్లు, పెంకుకప్పున్న ఇల్లు. < పెంకు + ఇల్లు. **పెంకుకర్ర** వి. పెంకచ్చు, పెంకు చేసే కొయ్యదిమ్మ. **పెంకుగట్టు(-కట్టు)** అ.క్రి. ముదిరి గట్టిపడు. **పెంకుగోడ** వి. నాటు పెంకులతో అడుసుతో కట్టినగోడ. **పెంకుటిల్లు(-ఇల్లు)** రూ.చూ. పెంక్కుటియిల్లు. వి. కవేలిల్లు, పెంకిల్లు, పెంకులిల్లు, పెంకు కప్పున్న ఇల్లు. **పెంకుతీయు** స.క్రి. 1. మాడుపగలగొట్టు: 2. అవమాన పరచు; 3. దృష్టిదోషానికి శాంతిచేయు; 4. పూర్తిగా నష్టపెట్టు; 5. ఇస్తానని మాట ఇచ్చి తప్పు. **పెంకుపేళ** వి. పెంకు పరుపు, పెంకుపోత, పెంకు కప్పు తయారీ. **పెంకుపరుపు** వి. పెంకునేత, పెంకు కప్పు తయారీ. **పెంకుపురుగు** రూ. పెంకెపురుగు. వి. బియ్యం, చిట్టు మొ. వాటికి పట్టే పెంకు రంగుతో ఉండే ఒకరకం పురుగు. **పెంకుపోత** వి. పెంకు నేత, పెంకుకప్పు తయారీ. **పెంకుబట్టీ** వి. చిన్నాము, పెంకాము, పెంకునుకాల్చేబట్టీ. **పెంకుమన్ను** వి. గూనలు, పెంకులు మొ. వాటి తయారీకి వాడే మన్ను. **పెంకురంగు** వి. ఒకరకం ఎరుపురంగు. **పెంకులిల్లు** వి. పెంకుటిల్లు, పెంకు కప్పున్న ఇల్లు. < పెంకు + -లు + ఇల్లు. **పెంకులు బొంకులు** వి.బ.వ. పెంకులు వగైరా. **పెంక్కుటియిల్లు** రూ. పెంకటిల్లు, పెంకిటిల్లు, పెంకిల్లు, పెంకుటిల్లు. వి. ధర్మ సత్ర నిర్వహణకొరకు పెంకుతో నేసిన పైకప్పుగల ఇల్లు. నెల్లూరుశాసనాలు. గూడూరుశాసనం 83. క్రీ.శ. 1791. < పెంకు + ఇల్లు.

**పెంకె[1]** రూ. పెంకి[2], పెంకియ. విశే. 1. మొండికట్టె. కుక. 3.21; 2. మూర్ఖుడు.

క. పెఙ్గ, పెగ్గ. అవివేకి, తెలివి తక్కువవాడు; తు. పెఙ్గె. పెఙ్జె. అవివేకి, పనికిమాలినవాడు.

**పెంకెజెల్ల** వి. సంగనాచి. **పెంకెతనము** రూ. పెంకితనము. వి. మూర్ఖత, మొండిపట్టు. **పెంకెతీగె** వి. అడవుల్లో పెరిగే ఒకరకం పెద్దతీగ (Gouania leptostachya). **పెంకెజెవలి** వి. పచ్చని పెద్ద పూలు గుత్తులుగా పూసే ఒక రకం అడవి తీగ (Hugonia mystax).

**పెంకె[2]** రూ.చూ. పెంకు. వి. 1. కుండ మొ. వాటి ముక్క; 2. ఇంటి కప్పు కుపయోగించే ఓడుబిళ్ళ; 3. తలపెంకు; 4. చితికిన అద్దం మొ. వాటి పెంకు; 5. ముష్టి చిప్ప.

**పెంకెపురుగు** రూ.చూ. పెంకుపురుగు. వి. బియ్యం, చిట్టు మొ. వాటికి పట్టే ఒకజాతి పురుగు.

**పెంక్కుటియిల్లు** చూ. పెంకు.

**పెచ్చ** రూ.చూ. పెచ్చు[1]. వి. ఉంట. కట్టుబడిలో పనికిరాని చిన్న రాతి ముక్క.

**పెచ్చుగాల్వు** రూ.చూ. పిచ్చుగాల్వు. వి. పాత్రలు చిట్లి పోయేటట్లు కాల్చిన కాల్వు.

**పెచ్చుగిలు** చూ. పెచ్చు[1].

**పెచ్చుగిల్లు** చూ. పెచ్చు[1].

**పెచ్చారి** చూ. పెచ్చు[1].

**పెచ్చిక** చూ. పెచ్చు[2].

**పెచ్చికవేయు** చూ. పెచ్చు[2].

**పెచ్చివ్వు** చూ. పెచ్చు[2].

**పెచ్చు[1]** చూ. పెరుగు. రూ. పెచ్చ, పెచ్చె. విశే. 1. మిక్కిలి. కు. సం. 12.106; 2. విశాలం. రాజవా. 3.66; 3. అధికం. ఆం. భా. 3.24; వి. 1. ఆధిక్యం, అతిశయం. భీమ. 2.139; 2. అధికప్రసంగం, తూలు మాటలు.

వాక్య. 3.31; 3. విధం, రీతి. ఉ.రా. 2.61; 4. లక్కరని బట్టి నాడేలుమార్చు మొ. వాటిలో అధికంగా ఇచ్చేధనం; 5. కాపిర. కట్టుబడిలో పొదుచుకొని వచ్చిన రాతిముక్క; 6. వేకి వల్ల ఏర్పడే నాలుక పూత; క్రి. విశ. అధికంగా, మిక్కిలిగా.

క. పెర్చు, పెచ్చు, హెచ్చు, ఎచ్చు. లావుగాఅగు, పరిమాణం లేక సంఖ్య, పెరగటం, గర్వం పొందటం, ఉబ్బు; తు. హెచ్చు. ఎక్కువ. ఎత్తు, పైవాడు, హెచ్చి, హెచ్చిగె, హెచ్చెలు. పెరుగు, పైకిపోవ, ఎక్కువ.

పెచ్చుగిలు రూ.చూ. పెచ్చుగిల్లు. అ.క్రి. అతిశయించు. చెలరేగు. శ్రీ. రం. మా. 4.973. పెచ్చుగిల్లు రూ. పెచ్చుగిలు. అ.క్రి. అతిశయించు, చెలరేగు. సిం. ద్వా. 5.132. పెచ్చారి వి. అవివేకం. ఉ. హరి. 3.10. క. పెచ్చు. పిచ్చి. <పెచ్చు[1]. +-అరి. పెచ్చుపెరుఁగు అ.క్రి. 1. విజృంభించు, చెలరేగు. భార. ఉద్యో. 3.164; 2. మిక్కిలి అతిశయించు. పెంపెక్కు. పాండు. 1.111. పెచ్చురేఁగు అ.క్రి. చెలరేగు. విజృంభించు. సిం. ద్వా. 10.83. పెచ్చులెచ్చు అ.క్రి. మిక్కిలి అధికమగు. భీమ. 2.116. <పెచ్చు[1]+-లు+ఎచ్చు.

పెచ్చు[2] వి. 1. ఫలాదుల మీద తోలు; 2. పుండుమీదపొర.

ప. పొచిద్. కాయ, పండు మొ. వాటిపై తొక్క, పొట్టు, పెంకు, పాము పొర.

పెచ్చిక రూ. బెచ్చిక. వి. 1. దెబ్బతగిలి దేహంలో గాని గార నేలలో గాని లేచిన బీక్కపారు పలుకు; 2. వాటల తయారీకి సారెపలక మీద వేసేమట్టిముద్ద. పెచ్చికవేయు అ.క్రి. వాటల తయారీకి సారె పలకమీద మట్టిముద్దల్ని వేయు. పెచ్చివ్వ వి. మూతపెట్టిన చిన్న మట్టిపాత్ర. పెచ్చులూడు అ.క్రి. మట్టిపాకం లోపం వల్లగాని కాల్పు లోపంవల్లగాని ఆము కాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవ.

పెచ్చె రూ.చూ. పెచ్చు[1]. వి. 1. బడిలో పెత్తనం చేసే విద్యార్థి; 2. ఉంట, కట్టుబడిలో పనికిరాని చిన్నరాతి ముక్క.

పెచ్చెట్టి చూ. పెద్ద.

పెచ్చొర్ద చూ. పెద్ద.

పెచ్చోతి చూ. పెద్ద.

పెజ్జటి చూ. పెద్ద.

పెజ్జొవ్వ చూ. పెద్ద.

పెంచము రూ.చూ. పెంచెము. వి. పింఛం.

పెంచి రూ.చూ. పెంచుక. వి. పగిలిన కుండ మొ. వాటిముక్క, పెంకు. ఆం. భా. 2.133.

పెంచిక రూ.చూ. పెంచుక. వి. 1. కుండ మొ. వాటి ముక్క. హరి. పూ. 5.218; 2. తలపెంకు. ఆం. భా. 2.133; 3. ఇంటికి కప్పేటందు బిళ్ళ; 4. చితికిన అద్దం మొ. వాటి పెంకు; 5. కొబ్బరి మొ. వాటి పెంకు; 6. ముష్టిచిప్ప.

పెంచివిసుకు చూ. పెంచు[1].

పెంచు[1] చూ. పెఱుఁగు[1]. రూ. పెసుచు. స.క్రి. 1. (ఆహారాదులతో) పోషించు, సాకు, సంరక్షించు, కాపాడు. భార. ఆది. 2.202; 2. ఉదికించు, స్థూలంచేయు. భార. ద్రోణ. 1.200; 3. అర్చు, అర్చివేయు. కేయూ. 3.217; 4. వృద్ధి పొందించు, వర్ధిల్లచేయు. విక్ర. 4.188; 5. చంపు, నాశంచేయు. వసు. 1.28; 6. పేను, పెనవేయు; అ.క్రి. మించు, అతిశయించు. కాశీ. 1.51.

పెంచివిసుకు స.క్రి. సాకి సంతరించు. కాశీ. 4.18. పెంచుకొను స.క్రి. 1. దత్తపుత్రునిగా స్వీకరించు, దత్తుచేసికొను. హరి. పూ. 3.106; 2. పెంచు. వృద్ధిపొందించు.

పెంచు[2] రూ.చూ. పెంచుక. వి. 1 కుండ మొ. వాటిపెంకు. శాక్ల. సం. 5.56; 2. కరోటిభేదం. ఆం. భా. 2.133; 3. రొట్టెలు, దోసెలు మొ. వి. కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

పెంచులబేరి వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

పెంచుక రూ. పెంచి, పెంచిక, పెంచు[2]. వి. 1. కుండ మొ. వాటి ముక్క. బసవ. 7.858; 2. కరోటిభేదం.

క. అంచు. హంచు, హెంచు. పెంకు; కొడ. అంచి.

పెంచెము రూ. పెంచము. వి. పింఛం. శాక్ల. సం. 13.130.

సం. పిచ్ఛ-, పింఛ-. తోక, తోకకుచ్చు; ప్రా. పిచ్ఛ-, పింఛ; బెం. పెఁచా. చేప మొ. వాటితోక ముక్క; ఒ. పిఛ; గు. పీఛ్, పీఛుఁ. పింఛ.

<ప్రా. పింఛ-.

పెంజ రూ.చూ. పింజ[1]. విశ. 1. తేలికైన. శాక్ల. సం. 18.278; 2. తుచ్ఛమయిన.

పెంజారి రూ.చూ. పింజారి. వి. 1. దూదేకులవాడు; 2. తుచ్ఛుడు; 3. తుచ్ఛత్రీ.

పెంజర రూ.చూ. పెంజెర[2]. వి. ఒకజాతిపాము.

పెంజరాయి వి. చుంచుబంతి, గోడకన్నా ఎక్కువ వెడల్పుగా ఉండి ఎండా వానలనుంచి దాన్ని కాపాడుతూ ఆద్యాదనంగా రెండువైపులా ముందుగా పొడుచుకొని వచ్చినరాయి.

పెంజమంచు వి. చుంచుబంతి, గోడకన్నా ఎక్కువ వెడల్పుగా ఉండి ఎండా వానల నుంచి దాన్ని కాపాడుతూ ఆద్యాదనంగా రెండువైపులా ముందుకు పొడుచుకొని వచ్చినరాయి.

పెంజిలువప్రోలు చూ. పెన్.

పెంజీకటి చూ. పెన్.

పెంజెవ్ రూ. చూ. పింజెర. వి. 1. దూదిఏకే కొయ్యవని ముట్టు; 2. చేతి అద్దకానికి వాడేరంగు తొట్టిలో అమర్చిన బద్దల తడిక; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం.

పెంజెర[1] రూ.చూ. పింజెర. వి. 1. దూదిని ఏకేపనిముట్టు; 2. చేతిఅద్దకానికి వాడేరంగు తొట్టెలో అమర్చిన బద్దల తడిక; 3. నేతలో డిజైన్లు నెయ్యటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం.

పెంజెరజాలి రూ.చూ. పింజెరజాలి. వి. పేటదారాల చివర కట్టిన పరిదారం. పెంజెరపొద వి. కొండలమీద పెరిగే ఒకరకం మొక్క (Symplocos monantha).

పెంజెర[2] రూ. పెంజర. వి. ఒకరకం కొండచిలువ. సిం. ద్వా. 8.100.

సం. పింజర-. సర్పభేదం. ఎరుపు మించిన పసుపు

వర్ణం కలది.

<సం. పింజర-.

పెంజెఱుపు చూ. పెస.

పెటకం చూ. పెట్టు. వి. 1. విరోధం; 2. తంటా; 3. తమాషాచేసి పంపటం; అవరోధం; 5. పితలాటకం.

పెటకలకర్ర రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లుచేసేటప్పుడు కట్టిన వంకర కట్టె.

పెటకాయ్య వి. గర్విష్ఠి.

పెటకాఁడు రూ.చూ. పెటకాఁడు. వి. ఎవడిమాటా విననివాడు, గర్విష్ఠి.

పెటకాఁడు యా. పెటకాఁడు. వి. అసాధ్యుడు.

పెటకోల యా. పెటాకోల, పెటాల, పెట్టుకోల. వి. చెటాలున మోగించి పొలంలో పిట్టల్ని తోలేమోకు.

పెటపెట వి. 1. పళ్ళుకొరకటం, పేలటం, విరగటం, పెట్లటం, చినుకులు పడటం, ఉరమటం, మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. రం. రా. బాల. 66. పు. 10పం; 2. ఎండ తీవ్రంగా కాయటంలో అయ్యే అనుకరణం. రాజవా. 5.93.

క. పెటల్, పెట్లు. పేలటం, పగలటం మొ. వాటి వల్ల కలిగే ధ్వనికి అనుకరణం. పెట్టల్ (లు). చిన్నపిల్లలు ఆడుకొనే టపాకి.

పెటపెటమను అ.క్రి. పెటపెట అనేధ్వని కలదగు. ద్వి. భాగ. 7స్కం. <పెటపెట+అను. పెటపెటలాడు అ.క్రి. పెటపెట అనే ధ్వని కలదగు. అచ్చ.రా.బాల. 176.< పెటపెట+-లు+ఆడు.

పెటాకు వి. 1. పెళ్ళి పదానికి వ్యతిరేకార్థంగా వాడే జంట పదం: పెళ్ళి పెటాకులు; 2. వ్యర్థం, భంగం.

పెటాకులువేయు అ.క్రి. మట్టిలోపం వల్లగాని, కాల్పు లోపం వల్లగాని, ఆము కాల్పులో కుండలు పేళ్ళ పేళ్ళుగా పగిలిపోవు.

పెటాకోల రూ.చూ. పెటకోల. వి. చెటాలున మోగించి పొలంలో పిట్టల్ని తోలే మోకు.

పెటార రూ.చూ. పెటారి. వి. పెట్టె.

పెటారి రూ. పెటార. వి. పేటిక, పెట్టె. ముకుంద. 3.206.

క. పెటారి, పెటారిగె. పేటిక, పెట్టె;
మరా. పెటారా. పేటిక, పెట్టె.

పెటాల రూ.చూ. పెటకోల. వి. చెటాలున మోగించి పొలంలో పిట్టలను తోలే మోకు.

పెటాల్‌మోకు రూ. పెటేల్‌మోకు. వి. చెటాలున మోగించి పిట్టల్ని తోలే మోకు.

పెటిలించు చూ. పెటిలు.

పెటిలివడు చూ. పెటిలు.

పెటిలు రూ.చూ. పెటులు. అ.క్రి. పెట్లు. చప్పుడయ్యేటట్లు పగులు; వి. పగిలినప్పుడయ్యే ధ్వనికి అనుకరణం.

పెటిలించు రూ. పెట్లించు. స.క్రి. పెటులచేయు, ధ్వని కలిగేటట్లు పగుల్చు. ఆము. 4.86. పెటిలివడు అ.క్రి. కాకచే వేగు, తపించు. విజయ. 3.19.

పెటిల్లు రూ.చూ. పెటులు. వి. పగిలినప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. కువ.చ. 3.27; అ.క్రి. చప్పుడయ్యేటట్లు పగులు.

పెటిషనరు రూ.చూ. పిటిషనరు. వి. విజ్ఞప్తిదారుడు.

పెటిషను రూ.చూ. పిటిషన్. వి. విజ్ఞప్తి.

పెటుకు వి. విరవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 6.118; విణ. పెళుసైన, విరసమైన.

క. పెట్టు. గర్వం, ధైర్యం, అధికారంతో నడుచుకొను, పెడసు. గట్టితనం, వంగకుండా ఉండు, దురుసుతనం, కష్టం; తుళు. పెడ. కష్టం, బాధపెట్టే. ఓర్పు నశించు.

పెటుకులకర్ర రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె.

పెటుకోలకర్ర రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె.

పెటుపావడ వి. ఉత్సవాలకు ముందు పట్టుకొనే వస్త్ర విశేషం.

పెటులు రూ.చూ. పెడులు. అ.క్రి. 1. (వేడి, ఒగుడు మొ. వాటితో) చిట్లు, పగులు, బద్దలగు. భీమ. 4.61; 2. ధ్వనించు, శబ్దించు. గౌ. హరి. 2146; 3. వేడిచేత ఉబుకు, పేలు; వి. తుపాకిలాంటి అగ్ని ప్రసరణాయుధ విశేషం. మను. 5.44.

పెటులుగ్రోవి(-క్రోవి) రూ.చూ. పెట్లుగ్రోవి. వి. తుపాకిలాంటి ఒక యుద్ధ సాధనం.

పెటేల్‌మోకు రూ.చూ. పెటాల్‌మోకు. వి. చెటాలున మోగించి పిట్టలను తోలే మోకు.

పెట్టి[1] వి. 1. పశుపక్షుల్లో ఆడది. కాశీ. 6.297; 2. పక్షి. సారంగ. 2.68; 3. ఆడకోడి. ఆం.రా. 2.92; విణ. పశుపక్షుల్లో స్త్రీ జాతిది.

త. పెట్టై. పశుపక్షుల్లో ఆడది. స్త్రీ, బాలిక, పెట్టైయన్. స్త్రీ పురుష స్వభావ చేష్టలుకల జంతువ లేక వృక్షం, ఆడంగి మనిషి. పెడై. పక్షుల్లో ఆడది; మ. పెట్ట. పక్షుల్లో ఆడది, గాడిద, ఒంటెల్లో ఆడది, పిట. పక్షుల్లో ఆడది. లేళ్ళలో ఆడది, పెట. కోడిపెట్ట; కొలా. పెట్ట. పక్షుల్లో ఆడది; బ్రా. పట్టీ. ఆడది.

పెట్టకుక్క వి. ఆడకుక్క. శుక. 2.33. పెట్టపోరి వి. కోడిపెట్ట. పెట్టబీరము వి. ఆడదాని పరాక్రమం. ఉ.హరి. 4.161. పెట్టమారి వి. ఆడకోడి పోలికఉండే కోడిపుంజు. ఆం.రా. 2.92. పెట్టమారిమగడు వి. భార్యా విధేయుడు. పెట్టమార్పుకోడి వి. అటు పుంజు, ఇటు పెట్టకాని పేడికోడి.

పెట్టి[2] వి. లోష్టం, పెల్ల, బెడ్డ. ఆం.రా. 2.230.

పెట్టికాల్పు వి. నల్లకాల్పులో పాత్రలు కొంత తెల్లగా కాలిన కాల్పు.

పెట్టివికోట చూ. పెట్టు[2].

పెట్టికవ్వ వి. సారెమొల బిగింపుకు సారెపలక కింది భాగంలో ఏర్పరచిన అంగుళం దళసరితో బరిబి కప్పులాగ గుండ్రంగా ఉబ్బుగా తీర్చిన భాగం.

పెట్టిగోడ రూ. చూ. పిట్టగోడ. వి. 1. మిద్దెపై చుట్టూ కట్టే మూరెడెత్తుగోడ; 2. కొండ మార్గాల్లో మలుపుల్లో

పక్క రాళ్ళతో పేర్చిన చిన్నగోడ; 3. వంటఇంట్లో పొయ్యి కనపడకుండా పెట్టిన పొట్టిగోడ; 4. ఇంటిచుట్టూ కట్టే గోడ.

పెట్టించు చూ. పెట్టు[2].

పెట్టితే పెండ్లి చూ. పెట్టు[2].

పెట్టినచెట్టు చూ. పెట్టు[2].

పెట్టిన దినములు చూ. పెట్టు[2].

పెట్టినదే భిక్షము చూ. పెట్టు[2].

పెట్టివంద వి. చౌకంగా ఉండే నంద.

పెట్టిన పీటనయుండు చూ. పెట్టు[2].

పెట్టింది చట్టం చూ. పెట్టు[2].

పెట్టిపలకలు చూ. పెట్టు[2].

పెట్టిపుట్టు చూ. పెట్టు[2].

పెట్టిపొయ్యి రూ.చూ. పొట్టుపొయ్యి. వి. పొట్టుపోసి రగిలించి వంటచేసే పొయ్యి.

పెట్టిపోతలు చూ. పెట్టు[2].

పెట్టిపోయు చూ. పెట్టు[2].

పెట్టిపోవు చూ. పెట్టు[2].

పెట్టిబండి రూ.చూ. పెట్టెబండి. వి. బాగుగ గట్టిగా పెట్టెవలె నిర్మించిన సవారి బండి.

పెట్టు[1] వి. 1. దెబ్బ, కొట్టు. కు.సం. 10.172; 2. ఆవృత్తి, తరి. భార. విరా. 3.182; 3. ఆరె, సారెచక్రం; స.క్రి. ప్రహరించు, కొట్టు, చరుచు. జైమినిభా. 4.77.

క. పెట్టు. కొట్టు (చెయ్యి, సుత్తి మొ. వాటితో) కొట్టటం, దెబ్బ, బాధ; తు. పెట్టు. దెబ్బ, చెంపదెబ్బ; కో. పెట్. కొట్టటం, పెట్ ఇడ్. కొట్టు; కొలా. పెట్ట్. దెబ్బ.

చూ.ప్రా. పిట్ట్-. కొట్టు; హిం. పీటా.

పెట్టుకోల రూ.చూ. పెటకోల. వి. చెటాలున మోగించి పొలంలో పిట్టలనుతోలే మోకు. పెట్టుగూడ వి. ఒకరకం గూడవాప (పశువు హఠాత్తుగా దీనివల్ల మరణిస్తుందట). పెట్టుపడు(-పడు) అ.క్రి. దెబ్బతిను. పెట్టుమారి వి. దెబ్బలు తినే స్వభావం కలవాడు, దెబ్బలుతినే స్వభావం కలది, కొట్లమారి. పెట్లాగు వి. మల్లబంధ విశేషం. < పెట్టు[1] + -లాగు.

పెట్టు[2] స.క్రి. 1. ఇచ్చు. కొరవి శాసనం. క్రీ.శ. 892-922; 2. దిగవిడుచు, విడుచు. భార. ఆది. 1.102; 3. ఉంచు. భార. ఆది. 2.4; 4. చేయు, కావించు. భార. ఆది. 5.166; 5. (పన్ను, ఋణం మొ. వి) చెల్లించు. భార. సభా. 2.106; 6. కట్టు, నిర్మించు. భార. ఉద్యో. 1.297; 7. (ఆహారం, జీతం, బహుమానం మొ. వాటిని) ఇచ్చు, ఒసగు. భార. ఉద్యో. 3.222; 8. అమర్చు, తీర్చు. భార. స్త్రీ. 2.20; 9. జీతమిచ్చు. విజ్ఞా. 2.34; 10. మోయు. మార్క. 5.134; 11. (దారి) నిర్దేశించు, చూపు. భాస్క.రా.యు. 258; 12. వర్తించు. శృం.నై. 6.122; 13. నెలకొల్పు, నిల్పు. భీమ. 5.152; 14. ఒప్పగించు. కాశీ. 4.13; 15. నిర్ణయించు. వరాహ. 3.27; 16. పల్కు, ఉచ్చరించు. మను. 3.102; 17. కంటపత్తి పెట్టుకొను, మిక్కిలి శ్రద్ధ వహించు. మను. 5.7; 18. అలదు. రాయ.ఆము. 1.40; 19. మూల్యం (వెల)గా ఇచ్చు. ఆము. 6.62; 20. (నారు మొ. వాటిని) గుచ్చు, నాటు. కాశ. 4.122; 21. కల్పించు, పన్ను. కళా. 2.81; 22. చెవిపెట్టకుండు. సారంగ. 2.60; 23. బహుమానమిచ్చు. హంస. 4.134; 24. కొన్ని సకర్మకధాతువుల క్త్వార్థక రూపాల కనుప్రయుక్తమై "అత్యంతం, పూర్తిగా" అనే అర్థాలనిస్తుంది; 25. పెట్టుబడి పెట్టు; వి. 1. మాడు. భార.ద్రోణ. 1.69; 2. ఏకకాలం. భార. ద్రోణ. 5.98; 3. దానం. ఈవి. వైజ. 2.34; 4. దూరం.

క. పొట్టు. తోయు, లోపలపెట్టు, దూర్చు, పెట్టు. సుత్తితోకొట్టు, లోపలికి తోయు.

మూ.ద్రా. *పెట్-/ *పెట్-.

పెట్టపికోట వి. కట్టనిదుర్గం, రక్షకం. భార.ఉద్యో. 1.297. పెట్టించు స.క్రి. 1. (ఆహారాదులు) ఇప్పించు. భార.ఆది. 5.178; 2. విడిపించు. భార.విరా. 1.74; 3. కట్టించు, నిర్మింపచేయు. ఉ.హరి. 292; 4. వ్రాలు చేయించు. పరమ. 5.350; 5. నెలకొల్పు, స్థాపించు. చిత్రభా. 1.47; 6. ఉంచేట్లు చేయు. ఇందు. 6.62; 7. నాటించు, పాతు. దశా. 4.1054. < పెట్టు[2] + -ఇంచు[3]. పెట్టితేపెండ్లి వి. ఇచ్చినంత వరకే మంచి మాట్లాడతారు అనటాన్ని సూచించే మాట. పెట్టినచెట్టు వి. తనస్వాధీనంలోనిది. భాస్క.రా. కిష్కిం. 487. పెట్టిన దినములు వి.బ.వ. దానధర్మాల కార్యాల ద్వారా సంపాదించుకొన్న పుణ్యం ఉన్న రోజులు. సు.శ. 85. పెట్టినదేభిక్షము వి. దీనికి మూలకారణం అతడే అనటం. పెట్టినపీటనయుండు అ.క్రి. ఎక్కడ పెడితే అక్కడే ఉండు, కదలకుండా ఉండు. ఉ. హరి. 5.157. పెట్టిందిచట్టం వి. చెప్పినట్లే సాగుతుంది అనటాన్ని సూచించే మాట. పెట్టిపలకలు వి.బ.వ. పురముగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు. పెట్టిపుట్టు అ.క్రి. సుఖంగా జరగటానికి తగిన పుణ్యం చేసుకొను. పెట్టిపోతలు రూ. పెట్టుపోతలు, పెట్టుపోతలు. వి.బ.వ. అన్నపానాదులిచ్చి చేసే పోషణం, ఆదరణం. నిరంకు. 2.128. పెట్టిపోయు అ.క్రి. అన్నపానాదులిచ్చి పోషణ చేయు. రామలిం.శ. 77. పెట్టిపోవు అ.క్రి. పవలిపోవు. పెట్టుకుల్లుకర్ర రూ.చూ. పెట్టుకోలకర్ర. వి. నేతపడుగు చిద్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె. పెట్టుకొనియుండు(-ఉండు) స.క్రి. వేశ్యను ఉంచుకొను. పెట్టుకొను స.క్రి. 1. ఉంచుకొను. భార.ఆది. 2.84; 2. తాల్చు, ధరించు. భార.అరణ్య. 2.298; 3. వహించు. పెట్టుకోక వి. దాపుడుచీర. పెట్టుకోలకర్ర రూ. పిటుకుల్లకర్ర, పిటుకోలకర్ర, పిట్కోలకర్ర, పిట్టుకోలకర్ర, పిట్టుకోలుకర్ర, పెటకలకర్ర, పెటుకుల్లకర్ర, పెటుకోలకర్ర, పెట్టుకుల్లుకర్ర, పెట్టుగోలకర్ర. వి. నేతపడుగు చిద్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెట్టుకోలగుది వి.

పెడకోలకు తగిలించే మలగ్ర. పెట్టుకోలు వి. పెట్టుకోవటం. భార.శాంతి. 3.22. పెట్టుక్రోవి వి. 1. అదురు పేటుగొట్టం; 2. తుపాకిలాంటి ఒక యుద్ధ సాధనం. పెట్టుగోలక్ర(-కోలకఱ్ఱ) రూ.చూ. పెట్టుకోలక్ర. వి. నేతపడుగు బిగువుపెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరక్ర. పెట్టుజుట్టము(-చుట్టము) వి. దానం ఇచ్చే చుట్టం. పెట్టుజెట్టు(-చెట్టు) వి. కల్పవృక్షం. తాళ్ల.సం. 18.97. పెట్టుడు వి. దానం, ఈవి. పెట్టుపోతలు రూ.చూ. పెట్టిపోతలు. వి.బ.వ. 1. పోషణం. శుక. 2.208; 2. చీరసారెలు, నగనాణేలు. పెట్టుబడి వి. 1. సేద్యగాండ్రకు జీతం కాక ఏటేటా ఇచ్చే అదనపు ధాన్యం; 2. నలుగురికి వస్తువులను పంచటం; 3. దేనికైనా వ్యాపారానికి మొదట పెట్టిన ధనం. పెట్టుమందు వి. వశ్యౌషధం. రుక్మాం.వ. 7.237. పెట్టువోతలు (-పోతలు) రూ.చూ. పెట్టిపోతలు. వి.బ.వ. పెట్టుపోతలు. పెట్టుశాపన వి. ఎడతెగని తిట్లు. సం. శాపన-. తిట్టు. పెట్టేచేయి వి. దానమివ్వటానికి అలవాటయిన చేయి.

పెట్టు² స.క్రి. 1. ఇడు, వైచు, వేయు వలె ఇది సందర్భాన్ని బట్టి పెక్కర్థాలిస్తుంది. భార.ఆది. 4.17; 2. పొందించు, పర్చు. సుఖపెట్టు, భయపెట్టు. భార.విరా. 2.226; 3. ఆరోపించు, మోపు.భార.ఉద్యో. 1.40; 4. పక్షులు గుడ్లని పొదిగి పిల్లల్నిచేయు. భార.శాంతి. 3.245; 5. ధరింపచేయు. శృం.నై. 2.141; 6. ఆభరణాదులు ధరించు. భీమ. 1.40; 7. (పశుపక్ష్యాదులు) ప్రసవించు. వేంక.పంచ. 1.545; 8. కలిగించు. మను. 1.18; అ.క్రి. 1. కలుగు, పొడము, ఏర్పడు. ఉ.హరి. 6.96; 2. సరిపోల్చు, సాటివచ్చు. భోజ. 7.12; 3. కొన్ని సకర్మక క్రియల క్త్వార్థకాల కనుప్రయుక్తమై ఆయా పనులు పరహితార్థం చేయటాన్ని తెలుపుతుంది. 'సాయపడు, తోడ్పడు' అనే అర్థాల్నిస్తుంది; 4. కొన్ని క్రియా రూపాల కనుప్రయుక్తమై ప్రేరణార్థకంగా ఉంటుంది.

క. పెఱ్, పెఱు(పెత్-). పొందు, కను, ధరించు, మోయు: కొడ. పెర్. (పెరువ్-, పెత్-). (బిడ్డను) మోయు; తు. పెదృని, పెద్దుని. మోయు(బిడ్డను)కను; త. పెఱు(పెఱువ్-, పెఱ్-). పొందు, కను, మోయు, ధరించు, పట్టించు, పెఱుతి. పొందు, లాభం, పెఱుత్తు(పెఱుత్తి-). పొందేటట్లుచేయు, పెఱ్. సంపాదించటం; మ. పెఱుక. ధరించు, తీసుకొనివచ్చు, పొందు: కో. పెర్ప్-(పెర్డ్-). పట్టు, పట్టటానికి సిద్ధంగా ఉన్న: తొ. పెఱ్ప్. (పాటలలో) పట్టటం, పె.ర్ప్-(పె.ద్-). పట్టబోయే; కొలా. పెట్-(పెత్-). బిడ్డను మోయు (జంతువులు): పర్జి. పెద్-(పెత్-). పొందు: నా. పెట్. పట్టుకను ఇచ్చు, కను.

మూ.ద.ద్రా. పూ.మ.ద్రా. *పెట్-.

పెట్టుపొయ్యి రూ.చూ. పొట్టుపొయ్యి. వి. పొట్టుపోసి రగిలించి వంట చేసే పొయ్యి.

పెట్టె రూ. పేటి². వి. 1. పల్లకి మధ్యపెట్టె. జైమిని భా. 3.61; 2. సొమ్ములు మొ. వాటిని ఉంచుకోవటం కోసం కొయ్య, ఇనుం, దంతం మొ. వాటితో చేసిన పేటిక; 3. బండిపరం మీద అమర్చిన పెట్టె; 4. పాముగాని రోకటిబండ పురుగుగాని చుట్టుకొని ఉండే చుట్ట; 5. సున్నం, గులక మొ. వాటి కొలతకు వాడే సాధనం; 6. మరమగ్గం చట్రంలో పానుపు పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కల గూడు; 7. రైలు డబ్బా.

క. పెట్టి-, పెట్టె (ప్రయాణంలో తీసుకెళ్ళే) బట్టల పెట్టె, పెట్టిగె, పెట్టియ. పెట్టె, బుట్ట; కొడ. పొట్టి, పెట్టె; తు. పెట్టిగె, పెట్టె, పెద్దపెట్టె; త. పెట్టి, పెట్టె, బుట్ట, పెట్టకమ్. పెద్దపెట్టె, పెట్టె, పొట్టి. పెట్టె; మ. పెట్టి. ప్రయాణపు పెట్టె, బట్టలపెట్టె, పెట్టకమ్. పెట్టె, పెద్దపెట్టె; తొ. పొట్య్. పెట్టె, పర్జి. పెటెయ. పెట్టె.

చూ.సం. పేటక-, పేటికా. పెట్టె. ప్రా. పేడా, పేడిఅ; హిం. పేటీ.

పెట్టెగాది వి. నల్చదరంగా కట్టిన రాతి కట్టడం. పెట్టెగుమ్మడి వి. పెరళ్ళలో, తోటల్లోను పండించే తీగపైరు, కాయ గుండ్రంగా నొక్కులు నొక్కులుగా ఉంటుంది. లోపలి కండ ముదురు పసుపు లేత ఎరుపు రంగులో ఉంటుంది. కాయ లేతఆకు కూర దినుసులుగా ఉపయోగిస్తారు (Cucurbita maxima). పెట్టెచెక్క వి. దేవదారు, కొండ నేలల్లో పెరిగే పెద్దచెట్టు. పెట్టెచెర్ఖా వి. పెట్టె మాదిరిగా అమర్చిన రాట్నం. పెట్టెనూలు వి. మిల్లులో యంత్రాలమీద తయారయిన నూలు. పెట్టెబండి రూ. పెట్టిబండి. వి. గూడుండే చోట పెట్టె అమర్చిన బండి. పెట్టెమొద్దు వి. బండి ఇరుసుమీద వేసే అడ్డమొద్దు. పెట్టెలోసొమ్ము వి. కొంగు బంగారం వంటిది. పెట్టెవెట్టు (-పెట్టు) అ.క్రి. పెట్టెలా (పాము మొ.వి) చుట్టుకొను. పాండు. 4.250. పెట్టెసంతావం వి. పసుప్పచ్చగా ఉండే పట్టు. పెట్టెసొమ్ము వి. కొంగుబంగారం వంటిది. పెట్టెసొర వి. కాయ గుండ్రంగా ఉండే రకం. పెట్టెబేడా వి. పెట్టె మొ. ప్రయాణపు సామాను.

పెట్టెగోడ రూ.చూ. పిట్టగోడ. వి. 1. మిద్దెపై చుట్టూ కట్టే మూరెడెత్తు గోడ; 2. కొండ మార్గాల్లో మలుపుల్లో పక్క రాళ్ళతో పేర్చిన చిన్నగోడ; 3. వంటఇంట్లో పొయ్యి కనబడకుండా పెట్టిన పొట్టిగోడ; 4. ఇంటి చుట్టూ కట్టే గోడ; 5. జాతిబట్టీ మళలపై ఉండే గోడ.

పెట్టేచేయి చూ. పెట్టు².

పెట్టేబేడా చూ. పెట్టె.

పెట్రకొరికికట్టు చూ. పెడ. స.క్రి. పెడరెక్కలు విరిచికట్టు.

పెట్రోలు వి. మోటారు కార్లు, విమానాలు మొ.వాటిలో వాడే శుద్ధిచేసిన తైల విశేషం.

ఇం. *Petrol*. ఖనిజతైలం.

<ఇం. Petrol.

పెట్లకంబము చూ. పెట్లు.

పెట్లగాలు చూ. పెట్లు.

పెట్లగొయ్య చూ. పెట్లు.

పెట్లదిమ్మ చూ. పెట్లు.

పెట్లదిమ్మె చూ. పెట్లు.
పెట్లదుమ్ము చూ. పెట్లు.
పెట్లమందు చూ. పెట్లు.
పెట్లమారి చూ. పెట్లు[1].
పెట్లాఁగు చూ. పెట్లు[1].
పెట్లించు చూ. పెట్లు.
పెట్లిపోవు చూ. పెట్లు.

పెట్లు రూ.చూ. పెటులు. అ.క్రి. 1. (వేడిమి, బిగువు మొ. వాటివల్ల) బద్దలగు, చీలు, చిట్లు, పగులు. పార్వ. 3.53; 2. కాని ధ్వనిపూర్వకంగా పగులు. చంద్రాంగ. 2.34; 3. చర్మం గీతలు గీతలుగా చిట్లు; వి. 1. తుపాకిలాంటి అగ్ని ప్రసరణాయుధ విశేషం; 2. పేలే ఉప్పు.

పెట్లకంబము వి. అదురువేటుగొట్టం. పెట్లగాలు(-కాలు[1]) అ.క్రి. మట్టిపాకం లోపంవల్లగాని కాల్పు లోపంవల్లగాని ఆము కాల్పులో కుండలు పేళ్ళుపేళ్ళుగా పగిలిపోవు. పెట్లగొయ్య (-కొయ్య) వి. పంటచేలో పిట్టల్ని తోలటానికి మందు పెట్టి పేల్చే కొయ్యయంత్రం. పెట్లదిమ్మ రూ. పెట్లదిమ్మె. వి. 1. అదురువేటుదిమ్మ; 2. ఉత్సవ సమయాల్లో ఊరేగింపు వేడుకల్లో కాల్చే బాణాసంచుల్లో ఒకటి (ఒకడుగు పొడుగు, రెండడుగుల దగ్గర కలిగి ఫిరంగిలా ఉంటుంది. దాని మధ్యగొట్టంలో మందు నిలిపి దాన్ని ఒక గట్టి గడమీద అమర్చి ఉంచుతారు): 3. చేలలో పక్షుల్ని తోలటానికి సర్పాకారంగా చేసి పెట్టుకొనే చేరు. పెట్లదిమ్మె రూ.చూ. పెట్లదిమ్మ. వి. 1. అదురు వేటుదిమ్మ. పంటచేలో పిట్టల్ని తోలటానికి మందు పెట్టి పేల్చే కొయ్య యంత్రం; 2. ఉత్సవ సమయాల్లో ఊరేగింపువేడుకల్లో కాల్చే బాణాసంచుల్లో ఒకటి (ఒకడుగు పొడుగు, రెండడుగుల దగ్గర కలిగి ఫిరంగిలా ఉంటుంది. దాని మధ్య గొట్టంలో మందు నింపి దాన్ని ఒక గట్టి గడ మీద అమర్చి ఉంచుతారు): 3. చేలలో పక్షుల్ని తోలటానికి సర్పాకారంగా చేసి పెట్టుకునే చేరు. పెట్లదుమ్ము వి. నల్లమందు దట్టించి పేల్చే సాధన విశేషం. పెట్లమందు వి. రాళ్ళను పగలగొట్టటానికి వాడే పేలుడు ద్రవ్యం. పెట్లించు రూ.చూ. పెటిలించు. స.క్రి. చిట్లించు. < పెట్లు + -ఇంచు[3]. పెట్లిపోవు రూ. బెట్లిపోవు. అ.క్రి. మట్టి పాకంలో ఇసకగాని మసిగాని తక్కువైనా సరిగా పిసకకపోయినా కాల్పులో కాక చాలకపోయినా ఒత్తిడి తగిలినా కుండల దగ్గరి ఎక్కువైనా ఆము కాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు. పెట్లుగ్రోవి (-క్రోవి) రూ. పెటులుగ్రోవి. వి. 1. అదురువేటుగొట్టం. హరిశ్చ. 2.6; 2. తుపాకిలాంటి యుద్ధసాధనం. కృష్ణరా. 3.29. పెట్లుప్పు వి. పేలి బద్దలయ్యే ఒక దినుసు ఉప్పు. < పెట్లు + ఉప్పు.

పెఠిలు రూ.చూ. పెఠిల్లు. వి. 1. కొట్టటంలో అయ్యే ధ్వనికనుకరణం; 2. పిడుగు పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

పెఠిల్లు రూ. పెఠిలు. వి. 1. పిడుగు పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. కళా. 4.86; 2. కొట్టటంలో అయ్యే ధ్వనికనుకరణం. దశా. 2.32.

పెడ విశే. 1. వెనకభాగాన ఉన్న. భార.శల్య. 1.337; 2. పెద్ద. పల్నా.వు. 77; 3. విపరీతమైన. ఉ.రా. 7.123; వి. 1. భాగం; 2. అరటిపళ్ళ గెలలో ఒక పెడ; 3. దిక్కు; 4. చిన్నవరికయ్య; 5. పాత్ర వెలుపలి లేక లోపలి అంచు కిందిభాగం.

క. పెడ. వెనకగాని తర్వాతగాని ఉండటం, వెనక, వెనకవైపు. పెడదలె, పెడన్దలె. తల వెనకవైపు. పెడము. ముఖం వెనకకు తిప్పు. పెడలు. ఇంటి వెనక భాగం, పెరడు. పొడకు. మెడ వెనక, కోట వెనక భాగం; తు. పెధ్ఝా. వెనకపక్క, పుడె. అంచు; త. పిటక్, పిటరి, పిటర్-తలై, పుటలి. మెడ వెనక, పిటఝుక్. ఆయుధం వెనకవైపు, పుట్టు (బుట్టలాగ), పుఱై, పుటం. పక్క, వైపు; మ. పిటరి, పిరటి. మెడ వెనక; కో. పెడ్తల్. మెడ వెనక, పుట. పక్క; పర్జి. పిడ్తెల్. వెనకవైపు.

పెడకచ్చ వి. వెనకపక్కకి దోపుకునే కొంగు. పెడకట్టు రూ. పెడగట్టు. వి. (చేతులు) వెనక్కి విరిచికట్టు; అ.క్రి. పాత్రకు ముఖం ఏర్పరచేటప్పుడు లోపలి అంచుకు వాటబట్ట వేసి వంప వచ్చేటట్లుచేయు. పెడకట్టె వి. 1. మూర్ఖుడు; 2. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెడకట్టెమాట వి. కట్టెవిరుపుమాట. కు.సం. 11.158. పెడకంటి రూ. పెడగంటి. వి. కాపువారి జాతివిశేషం. పం.న. 4.177. పెడకంటిరెడ్డి వి. ఒకతెగరెడ్డి. పెడకంటివాండ్రు విశే.బ.వ. ఒకతెగవారు. పెడకంత వి. తప్పుతోవ. పెడకలకట్టె రూ.చూ. పెడకోలకట్టె. వి. నేత పడుగు బిర్రు పెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెడకలకర్ర రూ.చూ. పెడకోలగర్ర. వి. నేత పడుగు బిర్రు పెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెడకలగుడి రూ.చూ. పెడకోలగుడి. వి. పెడకోలను తగిలించే మలగ్ర. పెడకాల రూ.చూ. పెడకోల. వి. 1. అచ్చు కట్టే జంత్రం చివరి పల్లకు దారుతో కొలికేసి బిగించిన కర్ర, పిట్టకోలకర్ర; 2. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగ్రకు అవతల, అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెడకాలకర్ర రూ.చూ. పెడకోలగర్ర. వి. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. పెడకాల చక్రం రూ.చూ. పెడకోలచక్రం. వి. పెడకోలను మోసే కొయ్య చక్రం. పెడకాలు రూ.చూ. పెడగాలు. వి. రెండు మోకాళ్ళు ఒక పార్శ్వానికి తెచ్చుకొనే కాలు. పెడకాలుకట్టె రూ. పెడకోలకట్టె. వి. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగ్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె. పెడకేక వి. పెద్దగా వేసిన అరపు. పెడకేలు రూ. పెడఁగేలు. వి. వెనక్కి విప్పిన చేయి. పండి.చ. 3.582 ప. పెడకారము వి. అత్యధికం, మిక్కిలి. శాళ్ల.సం. 5.127. పెడకొయ్య వి. మిడిగూటానికి వేసిన నేతమోకు

పడుచు అర్థంకాకుండా తగిలించటానికి పాతినగూటం. **పెరకోర** రూ.చూ. పెరకోల. వి. 1. పిట్టుకోలకర్ర; 2. ఊడికట్టె. **పెరకోరిక** వి. కూడనికోరిక. **పెరకోల** రూ. పెరగాల, పెరకోర, పెరకోలు. వి. 1. పిట్టుకోలకర్ర, అచ్చుకట్టే జంత్రం చివరిపల్లలకు దారుతో కొలికివేసి బిగించిన కర్ర; 2. ఊడికట్టె. **పెరకోలకట్టె** రూ. పడిగాల కట్టె, పెరకలకట్టె, పెరకాలుకట్టె. వి. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. **పెరకోలకర్ర** రూ.చూ. పెరకోలగర్ర. వి. నేతపడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. **పెరకోలగర్ర** రూ. పిరకల కర్ర, పిడిగోలుకర్ర, పెరకలకర్ర, పెరకాలకర్ర, పెరకోల కర్ర. వి. నేత పడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె. **పెరకోల గుతి** రూ.చూ. పెరకోలగుది. వి. పెరకోలకు తగిలించే మలగర్ర. **పెరకోలగుది** రూ. పెరకలగుది, పెరకోలగుతి. వి. పెరకోలకు తగిలించే మలగర్ర. **పెరకోలచెక్రం** రూ. పిటుకోలచెక్రం, పెరకాలచెక్రం. వి. పెరకోలను మోసే కొయ్యచక్రం. **పెరకోలు** రూ.చూ. పెరకోల. వి. 1. అచ్చుకట్టే జంత్రం చివరి పల్లకు దారుతో కొలికివేసి బిగించిన కర్ర. పిట్టుకోల కర్ర; 2. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లు చేసేటప్పుడు కట్టిన వంకర కట్టె. **పెరగట్టు** రూ.చూ. పెరకట్టు. అ.క్రి. పాత్రకు ముఖం ఏర్పరచేటప్పుడు లోపలి అంచుకు వాటబట్ట వేసి వంపు వచ్చేటట్లు చేయు. **పెరగట్టె** వి. మిడిగూటానికి వేసిన నేతమోకు పడుగుకు అడ్డురాకుండా తగిలించటానికి పాతిన గూటం. **పెరగండి** రూ.చూ. పెరకండి. వి. ఒక తెగకు చెందిన కాపుజాతి. **పెరగంటె** వి. నజ్జలలో ఒకరకం. **పెరగంతలుదీయు(-తీయు)** అ.క్రి. దొడ్డి మార్గంలో వెళ్ళు. శార్ఙ్గ.నం. 9.94. **పెరగాలు** రూ. పెరకాలు. వి. రెండు మోకాళ్ళను ఒక పార్శ్వానికి తెచ్చుకొనే వాలు. **పెరఁగేలు(-కేలు)** రూ.చూ. పెరకేలు. వి. వెనక్కి తిప్పిన చెయ్యి. దశకు. 8.24. **పెరచాలు** వి. కొంగ్ర పక్కచాలు. **పెరచీరు** అ.క్రి. పాత్రకు ముఖం ఏర్పరచేటప్పుడు లోపలి అంచుకు వాట పాతవేసి వంపు వచ్చేటట్లు చేయు. **పెరచీల** వి. బండి చక్రం ఊడకుండా ఇరుసుకు వేసినమేకు. **పెరచెవి** వి. చెవి వెనకభాగం. **పెరచెవిఁబెట్టు(-పెట్టు)** స.క్రి. శ్రద్ధతో వినకుండు. నల. 6.38. **పెరచెవులఁబెట్టు** స.క్రి. శ్రద్ధతో వినకుండు. భార.విరా. 2.120. <పెరచెవి+-లు+-అ[7]+పెట్టు. **పెరచెవులమంత్రము** వి. శ్రద్ధగా వినని మంత్రం. శార్ఙ్గ.సం. 8.57. **పెరచేయి** రూ. పరచెయి. వి. 1. వెనక్కి తిప్పిన చేయి; 2. చేతికి వెనకభాగం, మీదిచేయి. **పెరంచు** వి. పాత్రకు పక్కన రెండుగా చీల్చి ఉండే అంచు. <పెర+అంచు[3]. **పెరతలిగండఁడు** రూ.చూ. పెరతలగండఁడు. వి. ఒరులమాట వినక మూర్ఖుడైన వాడు. శార్ఙ్గ.నం. 5.199. **పెరతల** వి. తల వెనక భాగం, అవటువు. పంచ.చ. 4.315 ప. **పెరతలగండఁడు** రూ. పెరతలిగండడు. వి. ఒరుల మాట వినక మూర్ఖుడైన వాడు. రాజ.చ. 3.148. **పెరతలఁబట్టు(-పట్టు)** అ.క్రి. వ్యత్యస్తమగు. నిరంకు. 2.89. **పెరతలఁబడిపకమ్మలు** వి.బ.వ. పీక్కుపోయిన కళ్ళు. పంచ.చ. 5.315 ప. **పెరతాడు** వి. పెరకోలకు తగిలించే మలగర్ర. **పెరదబ్బ** వి. రెండునాగలబండి నాగలను వెనకవైపున బంధించిన కర్ర. **పెరదసి** వి. అచ్చు పడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. **పెరదారి** వి. తప్పుతోవ. **పెరదారిపట్టు** అ.క్రి. తప్పుదారి పట్టు. **పెరద్రము** రూ.చూ. పెరార్థము. వి. మూర్ఖత్వం. **పెరపెల** వి. తిర్పరి. **పెరపొడ్క** స.క్రి. పాత్రకు ముఖం ఏర్పరచేటప్పుడు లోపలి అంచుకు వాటపాతవేసి వంపు వచ్చేటట్లుచేయు. **పెరపట్టు** రూ. పిరపట్టు. స.క్రి. పాత్రకు ముఖం ఏర్పరచేటప్పుడు లోపలి అంచుకు వాటబట్ట వేసి వంపు వచ్చేటట్లు చేయు. **పెరపాయి** రూ.చూ. పెరపొయ్యి. వి. ఒక పొయ్యికి కట్టెలు పెట్టి మంట వేస్తే పక్కనున్న రెండో పొయ్యికి కూడ మంట వ్యాపించటానికి వీలుగా చేసిన పొయ్యి. **పెరపొయ్యి** రూ. పెరపాయి. వి. ఒక పొయ్యికి కట్టెలు పెట్టి మంటవేస్తే పక్కనున్న రెండో పొయ్యికి కూడ మంట వ్యాపించటానికి వీలుగా చేసిన పొయ్యి. **పెరబద్ద** వి. అచ్చులో దూర్చిన కర్ర. **పెరబొబ్బ** వి. 1. యుద్ధంలో ఉత్సాహంతో చేసే ధ్వని; 2. పెద్దరుప; 3. విపరీతధ్వని. **పెరబొబ్బలిడు** అ.క్రి. పెద్దగా అరచు. పల్నా. 99.100 పం. **పెరమర** వి. వెనకటి దిక్కు. హరి.పూ. 9.98 **పెరమరలించు** అ.క్రి. వెనక్కి తిరుగు. సిం.ద్వా. 10.56; స.క్రి. వెనక్కి తిప్పు. శార్ఙ్గ.నం. 15.119. **పెరమరలు** రూ. పెరమర్లు. అ.క్రి. పక్కకిగాని వెనక్కిగాని తిరుగు. శృం.నై. 6.116; వి. పక్కకుగాని వెనక్కిగాని తిరగటం. **పెరమర్లు** రూ.చూ. పెరమరలు. వి. వెనక్కి తిరగటం. కాశీ.శ. 2; అ.క్రి. పక్కకిగాని వెనక్కిగాని మరలు (తిరుగు). చంద్రాంగ. 2. **పెరమఱించు** స.క్రి. పెరమరేటట్లు చేయు. పంచ.చ. 5.438. 39 ప. **పెరమఱు** అ.క్రి. మరలు, వృత్తిలో వర్ణలోప వికారాలు, వెనక్కి తిరుగు, వెనక మొగమగు, పక్కకు తిరుగు. నిర్వ.రా. 3.27. **పెరమల్లి** చూ. పెరమల్లె. వి. నన్నటి కొమ్మలు గల కంపమొక్క. **పెరమల్లియ** రూ.చూ. పెరమల్లె. వి. వనమల్లికా విశేషం. **పెరమల్లె** రూ. పెరమల్లియ. వి. వనమల్లికా విశేషం. హంస. 4.11. **పెరము** వి. పక్కకి తిరిగిన మొకం, మారు మొకం. శృం.నై. 6.122. క. పెడము, పెడలు. తల వెనకభాగం; కొడ. పడమణ్డె. తల వెనకభాగం, పడనెట్టి. మెడ వెనకభాగం; మ. పిటలి. మెడ వెనకభాగం. **పెరముకం** వి. పాత్రలకు కుతికలో పెదంచుకు పైనున్న భాగం. **పెరముపెట్టు(-పెట్టు)** అ.క్రి. కోపాదులవలన మొగం పక్కకి తిప్పుకొను. వరాహ. 8.13. **పెరమొగమగు** అ.క్రి. మారుమొగం పెట్టుకొను. వి.శకు. 4.84. <పెరమొగము+అగు. **పెరమొగము** రూ. పెరమోము. వి. వెనక్కి తిరిగిన మొగం, మారుమొగం. మను. 3.28. **పెరమోము** రూ.చూ. పెరమొగము. వి. వెనక్కి

తిరిగిన మొగం, మాడుమొగం. పెడమోమువడు(-పడు) అ.క్రి. మారు మొగంపెట్టు. నృసింహ. 2.16. పెడ(బాపు (-పాపు) స.క్రి. 1. తొలగించు. నిర్వ. రా. 9.78 ; 2. వేరుపరచు. భార. అను. 1.130 ; 3. వియోగం కలిగించు. శృం. నై. 7.121 ; 4. 'పెడ(బాయు'కు ప్రేరణార్థక రూపం, ఎడబాయు. భోజ. 4.200 ; 5. పోగొట్టు. శాకు. సం. 6.85. పెడ(బాయు (-పాయు) రూ. పెడవాయు. స.క్రి. ఎడబాయు. కు. సం. 8.8. పెడయూకుల(బెట్టు (-పెట్టు) స.క్రి. విడిచిపెట్టు. కు. సం. 11.55. పెడయుక్తులు(-ఉక్తులు) వి.బ.వ. కుయుక్తులు. పెడరెక్కలుకట్టు అ.క్రి. చేతులు వెనక్కి విరిచికట్టు. పెడరే(చు స.క్రి. మిక్కిలి ప్రోత్సహించు. పురికొల్పు. శాకు. సం. 5.153. పెడర్థము రూ. చూ. పెడార్థము. వి. విపరీతార్థం. పెడలుమగ్గం వి. ఒకరకం మరమగ్గం. పెడవట్టు (-పట్టు) వి. కలుపుమొక్క, పనికిమాలిన మొక్క. పంచ. చ. 5.313వ. పెడవాకిలి వి. దొడ్డివాకిలి. క్రీడా. పు. 23. పెడవార వి. వెనకటితి. శుక. 3.137. పెడవారవవైచు అ.క్రి. పేరుపెట్టు. శుక. 8.137. పెడవా(పెట్టు (-పెట్టు) స.క్రి. బహిష్కరించు. శాకు. సం. 5.119. పెడవాయు (-పాయు) రూ.చూ. పెడ(బాయు. స.క్రి. విడుచు. పరిత్యజించు. కాశీ. 2.16. పెడవావి వి. విరుద్ధ బాంధవ్యం, తగని చుట్టరికం. ఉ.రా. 4.214. పెడవిసరు వి. పక్కకు విసరటం. మను. 5.115. పెడపీ(క వి. పెద్దగా నిక్కి ఉండటం. ఉ. హరి. 4.44. పెడపెట్టు (-పెట్టు) అ.క్రి. పరాఙ్ముఖమగు. అష్టమ. క. 5.262. ప. 12పం. పెడసరకట్టె విణ. 1. మూర్ఖుడు ; 2. మూర్ఖురాలు. పెడసరపుకట్టె వి. మొండివాడు. పెడసరపు మనిషి వి. ఎవరిమాటా వినని వాడు. పెడసరము వి. మౌర్ఖ్యం, మొరకుదనం; విణ. మొరకు, మూర్ఖుడు. పెడసావ వి. కంసాలి సాధన విశేషం. ఆం. భా. 2.299. పెడాకులు వి.బ.వ. శ్రాద్ధం. < పెడ + ఆకు + -లు. పెడార్థము రూ. పెడ(ద్రము, పెడర్థము. వి. 1. పెడసరంగా ఉండటం ; 2. వేరే అర్థం. సం. అర్థ-. అర్థం. < పెడ + సం. అర్థ + -ము.

పెడక రూ.చూ. పెడకము. వి 1. కత్తి యొక్క పృష్ఠభాగం ; 2. ఆకుయొక్క పృష్ఠభాగం; 3. కప్పుగల పంచ, పంచ చివరి భాగం ; 4. సన్‌షేడు, ఎండ, జల్లు తగలకుండా రక్షణగా కిటికీల మీదికి దించిన పలక.

పెడకము రూ. పెడక, పెణక, పెనక. వి. పృష్ఠభాగం. కు. సం. 11.155.

పెడమ వి. అందంగా ఉండే పూలుపూసే కొండలమీద పెరిగే ఒకరకం చిన్నచెట్టు (Bauhinia variegata).

పెడరు రూ.చూ. పేరడు. వి. పెరడు, ఇంటి వెనకభాగం. ద్రాక్షారామం శాసనం. క్రీ.శ. 1082.

పెడటిక వి. ఓషధి విశేషం.

పెడలు రూ.చూ. పేరడు. వి. దే. గృహపృష్ఠభూమి, పెరడు. ద. హిం. గా. సంపు. 5. గా. సం. 124. క్రీ.శ. 1228.

పెడాకులు చూ. పెడ.

పెడార్థము చూ. పెడ.

పెడిచి రూ.చూ. పెళుచు. వి. తేలికగా విరిగే స్వభావం.

పెడిమమ్ము వి. నల్లమందు దట్టించి పేల్చే సాధనం.

పెడిపె వి. ఒకానొకపక్షి. హంస. 3.12.

పెడీలు వి. చెటాలున మోగించి పొలంలో పిట్టలను తోలే మోకు.

పెడుచరు వి. బాలుడు. ఆం. భా. 2.118.

పెడుచు వి. కంచు పసను.

పెడుముగొను స.క్రి. భోజనంచేయు.

పెడులు రూ. పెటిలు, పెటిల్లు, పెటులు, పెట్లు. అ.క్రి. బద్దలగు. చీలు. భార. ఆది. 8 259.

క. పెటల్, పెట్లు, పెట్టులు. పగలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం, తుపాకీశబ్దం ; త. వెటి. + పగులు. చీలు, శబ్దం, ఉరుము, వెటిల్. పెద్దధ్వనితో పగలటం; మ. వెటి. పగులు. చీలు, వెటిక్క. కూల్చు ; గోం. పిడ్. మండు. (చీమలుతిన్న మట్టిగోడ, దూది) నాశనమగు ; పర్జి. పిడ్. (పిట్ట్-). పెద్దధ్వనితో పగులు.

మూ. ద. ద్రా. & మూ. మ. ద్రా. *పెట్-/*వెట్-, పిట్-.

పెడుమ రూ.చూ. పెళుచు. వి. అతిసులభంగా విరిగే స్వభావం.

పెడేల్న అవ్య. కొట్టటంలో అయ్యేశబ్దం.

పెడ్డ రూ.చూ. బెడ్డ. వి. మట్టిపెల్ల.

క. పెడ్డె, పెడ్డు, పెట్టె, హెట్టె, హెణ్టె. మట్టిబెడ్డ, పెల్ల ; తు. హెట్టె, ఎట్టె. మట్టిపెల్ల.

పెణం రూ.చూ. పెనము. వి. రొట్టెలు, దోసెలు మొ.వి కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

పెణక రూ.చూ. పెడకము. వి. 1. ఆకు, కత్తి మొ. వాటి వెనక భాగం. ఆం. భా. 2.241; 2. ఇంటికప్పు యొక్క ఏటవాలుగా ఉండే పార్శ్వం.

పెణత రూ. పెడత. వి. కణతలాంటిది, తలమీద భాగం.

పెణతూరకొట్టు స.క్రి. పెడతల ఊరేటట్లు కొట్టు. < పెణత + ఊరు + -అ[7] + కొట్టు.

పెణతూరగొట్టు చూ. పెణత.

పెడిత రూ.చూ. పెణత. వి. కణతలాంటిది, తలమీదిభాగం.

పెంట[1] రూ. పింత, పెంథ[1], పేంత, పే(త. వి. 1. (ఎరువు మొ. వాటి) కుప్ప. భార. విరా. 3.168 ; 2. పూర్వం పశువులమంద ఉండేతావు. గోవులుమేసే గాదంపట్టు. ఆం. భా. 2.261 ; 3. (దూళి మొ. వాటితో ఉన్న) చెత్త. తుక్కు ; 4. చీదర, దారి ; 5. కల్లుఅమ్మేచోటు.

సం. పేట-. ముద్ద ; ప్రా. పేడ-, పేడయ-. సమూహం ; కా. పేర్. పిండిముద్ద ; కుమా. ప్యాడా-. పాలకోవ; బెం. పేడా. పిండిముద్ద ; ఒ. పేడా. పాలకోవ ; బి. పేడా ; హిం. పేడ్. ముద్ద : పేడా. పిండి ముద్ద ; పం. పేడా. ముద్ద ; సిం. పేడొ. మట్టిముద్ద :

క. పేల్. దొడ్డి, దొడ్డికెళ్ళు ; త. పేల్ (పేల్వ-, పేన్ట్). పేళ్. (పేళ్వ- పేట్ప్-). దొడ్డికెళ్ళు. మల విసర్జనచేయు ; గోం. పెంణా. ముద్ది ; కొలా. పెండ. ఆవుపేడ ; నా. పెంఠ. ఆవు మొ. వాటి పేడ.

<ప్రా. పేఠ-.

పెంటకర్ధ వి. కల్లులాగే ఒప్పుడు గ్లానులాగ పొడుగ్గా ఉండే మట్టిపాత్ర. పెంటకుప్ప వి. ఎరువుగా నిలవ చేసిన పేడ మొ. వాటికుప్ప. పెంటగట్టు (-కట్టు) అ.క్రి. పెంటకోనం మందకట్టు. పెంటగర్త వి. ఎరువునిలవ చేసిన పేడ మొ. వాటికుప్ప. పెంటగాడిద వి. వ్యర్థుడు, ఉపయోగం లేనివాడు. పెంటగుంత వి. పెంట ఎరువుగా నిలవచేసే గుంట. పెంటగుమ్మి వి. పెంటఎరువుగా నిలవ చేసే గుంట. పెంటడిపార్యమి వి. దీపావళి అమావాస్య మరునటి రోజున చేసుకొనే పండుగ. పెంటదిబ్బ వి. పశువులమలం ఒకచోట ఎత్తుగా వేసిన కుప్ప. పెంటవట్టు వి. పశువులు నిలిచి పేడవేసే చోటు, దొడ్డి. మను. 4.37. పెంటపురుగు వి. ఉట్టపురుగు. పెంటపావక వి. ఎరువ బండిజల్ల. పెంటపారక వి. ఎరువ ఊడ్చే చీపురు. పెంట పొలము వి. పశువులు మేసేగడ్డి పొలం. ద. హిం. గా. సంపు. 10. గా.సం. 192. క్రి.శ. 1096. పెంటపోగు వి. ఎరువుగా నిలవచేసిన పేడ మొ. వాటి కుప్ప. పెంటబట్టు(-పట్టు) వి. పసులదొడ్డి. పెంటబండి వి. అమతం, గంత్రీరథం, పెంట తోలే బండి. పెంటబిర్రు వి. కట్టు మట్టు బలం. పెంటబొంద వి. పెంట ఎరువుగా నిలవచేసే గుంట. పెంటపెట్టుకొను (-పెట్టుకొను) స.క్రి. తగవు పెట్టుకొను. కాశ్మ.సం. 15.269. పెంటపామెర వి. పొలంలో తోలిన ఎడువల కుప్ప వరుస. పెంటారు వి. ఒకరకం కలుపు మొక్క.

పెంట[2] రూ. పేట[1]. వి. 1. నెలవు, స్థానం. కు.సం. 3.105; 2. గాబా నగరం. పేట. ద.హిం. గా. సంపు. 10. గా.సం. 3.62. క్రి.శ. 1184.

క. పేటె. వస్తువిక్రయగాల. సంతజరిగే ఊరు, అంగడి పీథి; తు. పేంటె. బజారువాడ; త. పెట్టై; మ. పేట్ట. మదురువాడ, గాబానగం; ఒరయాస్. పేర్, పేఠ్. బజారు, సంత;

సం. పింఠా. వితజనులుండే చోటు, ప్రవిష్ఠ-; ప్రా. పఇఠు-, పవిట్ఠ-. మార్గం, దారి; పా. పవిట్ఠ, దే.ప్రా. పఇట్ఠ-.

పెంటారు చూ. పెంట[1].

పెంటి వి. పశు పక్ష్యాదుల్లో ఆడది. భార. ఆది. 5.53.

క. పెణ్, పెణ్ణు, పెణ్ణ. ఆడది, స్త్రీ; కొడ. పొణ్ణ. భార్య, ఆడది; తు. పొణ్ణు. బాలిక, ఆడది, పనిమనిషి, పొణ్ణ. ఆడది, ఆడతనం, వధువు; త. పెణ్. స్త్రీ, బాలిక, వధువు, పశువులు, మొక్కలలో ఆడది, పెణ్ణు. స్త్రీ, భార్య, పిణై. జంతువుల్లో ఆడది, పిణవల్. కుక్క, పంది, లేడి మొ. వాటిలో ఆడది; మ. పెణ్. స్త్రీ, బాలిక, ఆడమనిషి, వధువ, పెణ్ణ. బాలిక, స్త్రీ; కో. పెణ్. స్త్రీ, ఎణ్, పె. స్త్రీ. పె-బి-చ్. ఆడపిల్లి; కొలా. పెణ్ణ. ఆడది.

చూ.సం. పండ-, పండక-. ఆడంగివాడు.

<మూ.ద్రా. *పెణ్.

పెంటికచ్చు వి. ఆడవాసం, మరవాసంలో తగిలించే రంధ్రం గల వాసం. పెంటికరము వి. ఆడుతరగ, చిన్న కెరటం. ప్రబంధ. 109. పెంటిజింక వి. ఆడుదుప్పి. పెంటితనము వి. స్త్రీత్వం, దైన్యం. భార. భీష్మ. 1.192; 2. నపుంసకత్వం. పెంటితాడి రూ.చూ. పెంటితాడు. వి. కాయలుకాసే తాడిచెట్టు (Borassus flabellifer). పెంటితాడు రూ. పెంటితాడి. వి. కాయలుకాసే తాడిచెట్టు (Borassus flabellifer). పెంటిదోవి రూ.చూ. పెంటిదోనె. వి. దోనె మలుపు తరవాతఉన్న భాగం. పెంటిదోనె రూ. పెంటిదోని. వి. దోనె (మోటబావి నీళ్ళుపొయ్యే దారి) మలుపు తరవాత ఉన్న భాగం, దోనె సన్నగిల్లే భాగం. పెంటివార వి. ఆడ తాటినార (పెళుసుగా ఉంటుంది). పెంటివడు అ.క్రి. కవగూడు. ప్రభు. 3. గతి. 20 వ. 14 పం. పెంటిపోతులు వి.బ.వ. పశు పక్ష్యాదుల కవ. ఆం.భా. 2.100. పెంటిబడితె వి. ఆడవాసం, మరవానంలో తగిలించే రంధ్రంగల వాసం. పెంటిముడి వి. ఊడిపోయే ముడి. పెంటివానం రూ. పెంటువానం. వి. మరవానంలో తగిలించే రంధ్రంగల వాసం. పెంటివెదురు వి. నడనపు వెదురు, వివిధ ప్రయోజనాల కుపయోగపడే పొడవైన గడలనిచ్చే ఒకరకంచెట్టు (Bambusa arundinacea).

పెంటిక రూ.చూ. పెంట్రిక. వి. మేకలు మొ. జంతువులు చిన్న ఉండలు ఉండలుగా వేసే పేడ. కా. శ. 15.

పెంటికె రూ.చూ. పెంట్రిక. వి. గొర్రెలు, మేకలు మొ. వి వేసిన పెంట ఉండ.

పెంటియ వి. చిన్న పరిమడి. నె.శా. కనిగిరి శాసనం. 24. క్రి.శ 1268.

పెంటు వి. ఆడవానంలోని చిల్లిగల భాగం.

పెంటువాసం రూ.చూ. పెంటివానం. వి. మరవానంలో తగిలించే రంధ్రంగల వానం.

పెంటుంటి చూ. పెంటి. వి. అడవి గోగుచెట్టు. ఒకరకం కలుపు మొక్క (Hibiscus species).

పెట్టెము రూ.చూ. పెణ్ణలు. వి. భార్య. ద్రాక్షారామం శాసనం. 1073.

పెంటేకు వి. చెన్నంగి, లేకుజాతికి చెందిన చెట్టు.

పెంట్రిక రూ. పెంటిక, పెంటికె, పెంట్రుక, పెంట్రిక. వి. మేకలు మొ. జంతువులు చిన్న ఉండలు ఉండలుగా వేసే పేడ. బసవ. 2.417.

గోం. పేన్ద, పెన్దా. అవపేడ.

పెంట్రుక రూ.చూ. పెంట్రిక. వి. గొర్రెలు, మేకలు మొ. వి వేసిన పెంట ఉండ.

పెంఠ[1] రూ.చూ. పెంట[1]. వి. పశువిష్ఠ. గోమయాది, పేడ. క్రి.శ. భార. అను. 3.16.

పెంఠకుప్ప రూ. పేఁడకుప్ప. వి. పశువుల మలం ఒక చోట ఎత్తుగావేసిన కుప్ప. పెంఠగుల్ల వి. పేడఎత్తే తట్ట. పెంఠతట్ట వి. పేడఎత్తే తట్ట. పెంఠదిబ్బ రూ. పేఁడదిబ్బ. వి. పేడను కుప్పగా వేయటం. పెంఠబొంద వి. పేడ నిలవ చేసే గొయ్యి. పెంఠపిబ్బి వి. పేడఎత్తే తట్ట.

పెంఠ[2] రూ.చూ. పెండియ. వి. 1. కప్పు నిలవటానికి ఆధారంగా వాసాలమీద బిగించిన లేక అల్లిన సన్నటిబద్ద; 2. కొయ్యస్తంభపు పీటలకు పక్కన అతికిన నగిషీపని.

చేసిన కొయ్యముక్క.

పెండబల్ల వి. 1. కోడి పిటల బండిని తోలే మనిషి కూర్చోటానికి వీలుగా గోసి నొగదగ్గర వేసిన చెక్క; 2. పాడి బల్లను బిగించటానికి బింకమీద వేసే పట్టి.

పెణ్ణము రూ.చూ. పెణ్ణెలు. వి. భార్య. ముఖలింగం శాసనం. ప్రీ.శ. 1081.

పెండరము రూ.చూ. పెండెము[1]. వి. గండపెండేరం.

పెండలము రూ. పెండ్లము[1]. వి. ఒకజాతి దూరదుంప. ద.హిం.గా. సంపు. 7. గా.సం. 784. ప్రీ.శ. 1218 (Discorea alata).

పెండారము రూ. పెండెము[1]. వి. గండపెండేరం. కాశీ. 3.241.

క. పెణ్డాయ. కాలికి పెట్టుకొనే చిన్న నగ.

పెండారిమూక వి. దండులో ఉండే అల్లరి జనం.

పెండి రూ.చూ. పెండియ. వి. 1. కప్పు నిలవటానికి ఆధారంగా వాసాలమీద బిగించిన రేకు అల్లిన సన్నటిబద్ద; 2. సారెచక్రంలో మట్టిని మెత్తటానికి పెట్టిన సన్నటిబద్ద; 3. చుట్టూ చెట్లు మొలిచిన దడి.

పెండివ్రు స.క్రి. పెండెకట్టు, వాసాలమీద అడ్డంగా పల్లలతో కట్టు.< పెండి+విరుచు. పెండిబద్ద రూ.చూ. పెండెబద్ద. వి. పేటిక, పెండెకట్టులో వాడే చీల్చిన వెదురు.

పెండితీగె వి. తెల్లని పూలుపూసే ఒకరకంతీగ (Symphorema involucratum).

పెండియ రూ. పంటి[3], పరిటి[1], పెండ[3], పెండి, పెండె, పెండెం[2], పెండ్లి[3]. వి. 1. ఇంటివాసాలు, మొ. వాటికి అడ్డంగా వేసే కట్టెకొయ్య, వెదురుబద్ద, మొ. వి. అచ్చ రా.సుం. 9; 2. పొగాకు, మొ. వాటి నగ (కంట్లం మూట) లో సగం.

ప్రా. పేండ-. ఖండం, తునక.

<ప్రా. పేండ-.

పెండియము[1] రూ.చూ. పెండెము[1]. వి. 1. అందె, పాదాంగదం, శూరులు బిరుదుగా కాలికి ధరించే అందె, పెండేరం. రం.రా.యు. 1945.

పెండియము[2] రూ. పెండెము[2]. వి. పశువులదొడ్డి, మొ. వాటికి కంప మున్నగు వాటితో ఏర్పరచిన తలుపు, పలుగాడి. చిత్రభా. 3.48.

సం. పేండ-, పిండ-. సమూహం, సంఘాతం, పిండకమ్; ప్రా. పిండయం, పెండయం, గడ్డిమోపు.

పెండిలి రూ.చూ. పెండ్లి[1]. వి. వివాహం, పరిణయం. భార.ఆది. 8.144.

పెండిలికొడుకు రూ.చూ. పెండ్లికొడుకు. వి. 1. వివాహదీక్షితుడు, వరుడు. వసు. 5.57; 2. అల్లుడు. పెండిలిచేయు స.క్రి. 1. పెండ్లాడచేయు. ఉ.హరి. 4; 2. పెండ్లాడు. భాగ. 10 పూ. పెండిలితిన్నియ వి. పెళ్ళి అరుగు, వివాహంలో దంపతులు కూర్చుండే వేదిక. జైమి. 6.40. పెండిలిదొర రూ. పెండ్లిదొర. వి. వివాహమహోత్సవాన్ని నడిపే నాయకుడు, పెళ్ళిపెద్ద. విక్ర. 4.127. పెండిలిపాట వి. 1. పెళ్ళి సమయంలో పాడే మంగళహారతి. హర. 4.11; 2. పెళ్ళి సమయంలో పాడే పాట. పెండిలిపెద్ద రూ. పెండ్లిపెద్ద. వి. పెళ్ళి కుదిర్చే వాడు లేదా నిర్వహించేవాడు. హర. 4.64. పెండిలియగు (-అగు) రూ.చూ. పెండ్లియగు. స.క్రి. వివాహమగు. భార.ఆది. 8.144. పెండిలియాడు(-ఆడు) రూ. పెండ్లాడు, పెండ్లియాడు. స.క్రి. వివాహమగు. విష్ణుపు. 5.28. పెండిలిసేయు(-చేయు) రూ.చూ. పెండ్లిసేయు. స.క్రి. 1. పెళ్ళి చేయు. ఉ.హరి. 4.19; 2. పెళ్ళాడు.

పెండె రూ.చూ. పెండియ. వి. 1. ఇంటి వాసాలు, మొ.వాటికి అడ్డంగా వేసి కట్టే కొయ్య, వెదురుబద్ద, మొ. వి. పండి.చ. 1.43; 2. పొగాకు, మొ. వాటియొక్క నగ (కంట్లం మూట)లో సగం; 3. మోటబొక్కెన పలిగానికి వేసిన అడ్డు చువ్వ; 4. సారె చక్రంలో మట్టిని మెత్తడానికి పెట్టిన సన్నటి బద్ద; 5. పడుగు దువ్వే కుంచె పక్కభాగం; 6. ముద్దబెల్లం; 7. గడ్డివాము వేయటానికి ముందు నేలమీద కర్రలతో కట్టిన చట్రం.

పెండెకట్టు వి. 1. రెండు వాసాలు కలిపి కట్టిన కట్టు; 2. సారె తయారీలో కర్ర చక్రానికి కట్టిన బద్దల కట్టు; 3. కంచె దండె బిగింపుకు వేసిన కట్టు. పెండెకట్లు వి.బ.వ. పెండెంల్లాగా పట్టెల్లాగా తీర్చిన విభూతి రేఖలు. హంస. 1. పెండెకత్తు వి. చెరుగుడు, మొ. ఆటల్లో ఉండే యజమాని. పెండెబద్ద రూ. పెండిబద్ద. వి. పెండెకట్టులో వాడటానికి చీల్చిన వెదురు దబ్బ. పెండెబద్ర వి. గెలవాసం, ఒకదాని కొకటి తగిలించిన వాసాలజంట. పెండెముడుపులు వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. పెండెమెల్ల వి. పెండెకు వాడే చువ్వ. పెండెమేకు వి. పెండె బద్దలకు కొట్టే సన్నటి మేకు. పెండెమోపు వి. పెండె వానం కలిసినది. పెండెవాసం వి. నిలువవాసంమీద పెండె కట్టి బిగించిన అడ్డవానం.

పెండెం[1] వి. రొట్టెలు, దోసెలు, మొ.వి కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

పెండెం[2] రూ.చూ. పెండియ. వి. 1. కప్పు నిలవటానికి ఆధారంగా వాసాలమీద బిగించిన రేకు అల్లిన సన్నటి బద్ద; 2. పొలం చుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం.

పెండెము[1] రూ. పెండరము, పెండారము, పెండియము[1], పెండెరము, పెండేరము. వి. అందె, పాదాంగదం, శూరులు బిరుదుగా కాలికి ధరించే అందె, గండపెండేరం. భాస్క.రా.యు. 1938.

క. పెణ్డెయ, పెణ్డెహ. గౌరవానికి కాలికి తొడిగే అందె. మరా. పేణ్డేం, నెక్లెను, ఉంగరం.

పెండెము[2] రూ.చూ. పెండియము[2]. వి. పశువులదొడ్డి మొ.వాటికి కంప మున్నగు వాటితో ఏర్పరచిన తలుప, పలుగాడి.

పెండెరము రూ.చూ. పెండెము[1]. వి. శూరులు బిరుదుగా కాలికి ధరించే అందె, గండపెండేరం, అందె, పాదాంగదం. ప్రభా. 3.86.

పెండేరము రూ.చూ. పెండెము[1]. వి. శూరులు బిరుదుగా కాలికి ధరించే అందె, గండపెండేరం, అందె, పాదాంగదం.

పల్నా. ప. 17.

పెంద్ర రూ.చూ. పంద్ర. వి. నల్ల ఈక అని వ్యవహరించబడే పొదగా పెరిగే చెట్టు.

పెంద్రిక రూ.చూ. పెంట్రిక. వి. గొర్రెలు, మేకలు మొ.వి వేసిన పెంట ఉండ.

పెండ్లగు చూ. పెండ్లి[1].

పెణ్డిబు చూ. పెండ్లి[1].

పెండ్లము[1] రూ.చూ. పెండలము. వి. పెండలం, కూరగా ఉపయోగపడే ఒకరకం దుంప. హంస. 4.131.

పెండ్లము[2] చూ. పెండ్లి[1].

పెండ్లాడు చూ. పెండ్లి[1].

పెణ్డాము చూ. పెండ్లి[1].

పెండ్లాము చూ. పెండ్లి[1].

పెండ్లి[1] రూ. పెండిలి, పెళ్ళి. వి. వివాహం, పరిణయం. భార.ఆది. 1.131.

కొం. పెడిక-. పెళ్ళి చేసుకొను : పర్జి. ప్కెన్డుల్. దంపతులు : కొలా. పెన్డిలి, పెన్డిలిగ్, పెన్డిలిక్.

పెండ్లగు రూ.చూ. పెండ్లియగు. స.క్రి. వివాహమాడు, పెండ్లాడు. ఆము. 6.109 ; అ.క్రి. 1. గాస్తిఅగు ; 2. వివాహమగు. <పెండ్లి+అగు. పెణ్డిబు రూ. పెణ్డెము, పెణ్డెము. పెండ్లము[2], పెణ్డాము, పెండ్లాము, పెణ్డెము. వి. భార్య. కోనికపల్లి శాసనం. క్రీ.శ. 925-50. క. పెణ్డతి, పెణ్డతి. భార్య : కొడ. పొణ్ణ్. భార్య. స్త్రీ. పొమ్మక్క. స్త్రీలు, భార్యలు ; త. పెణ్డు. స్త్రీ. భార్య ; కో. పెడ్. భార్య. పెండ్లము[2] రూ.చూ. పెణ్డిబు. వి. భార్య. నిర్వ.రా. 6.64. పెండ్లాడు రూ.చూ. పెండిలియాడు. స.క్రి. వివాహమగు, పెళ్ళిచేసుకొను. ఐంచు. 2.74. <పెండ్లి[1]+ఆడు. పెణ్డాము రూ.చూ. పెణ్డిబు. వి. భార్య. ముఖలింగం శాసనం. క్రీ.శ. 1058. పెండ్లాము రూ.చూ. పెణ్డిబు. వి. భార్య. ద్రాక్షారామం శాసనం. క్రీ.శ. 1081. నిర్వ.రా. 6.64. పెండ్లిఆయము వి. పెళ్ళి పన్ను. ద.హిం శా.సంపు. 4. శా.సం. 939. క్రీ.శ. 1184. పెండ్లికిపోవువట్లుకవ(బడు అ.క్రి. ఆనందంతో కానవచ్చు. కా. 4.187. పెండ్లికుండలు వి.బ.వ. పూజెలు పెట్టి పెళ్ళిలో ఉపయోగించే కుండలు, ఐరేనికుండలు. పెండ్లికూ(తురు వి. 1. వధువు. ఆము. 6.125 ; 2. కోడలు. విజయ. 3.155. పెండ్లికొడుకు రూ. పెండిలికొడుకు. వి. 1. అల్లుడు. భీమ. 1.45 : 2. వివాహదీక్షితుడు, వరుడు. ఆము. 6.123. పెండ్లిగుమ్మడి వి. వివాహాది శుభకార్యాల్లో మంగళార్థంగా ద్వారానికి వేలకట్టే గుమ్మడి, బూడిదగుమ్మడి. పెండ్లిచవికె వి. కళ్యాణమంటపం. భాను. 4.56. పెండ్లిచేయు రూ.చూ. పెండ్లిసేయు. అ.క్రి. 1. గాస్తిచేయు ; 2. వివాహంచేయు. పెండ్లితెల వి. పెళ్ళిపన్ను. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 135. క్రీ.శ. 1077. పెండ్లిదొర రూ.చూ. పెండిలిదొర. వి. వివాహ మహోత్సవాన్ని నడిపే నాయకుడు, పెళ్ళి పెద్ద. రాజవా. 5.58 పెండ్లినడ రూ. పెండ్లినడక, పెళ్ళినడక. వి. పెళ్ళిలో ఊరేగినప్పుడు నడిచే నడకలా నెమ్మదిగా ఠీవిగా నడిచే నడక, మందగమనం. శుక. 2.15. పెండ్లినడక రూ.చూ. పెండ్లినడ. వి. పెళ్ళిలో ఊరేగినప్పుడు నడిచే నడకలా నెమ్మదిగా ఠీవిగా నడిచే నడక, మందగమనం. భాను. 1 ఆ. పెండ్లినడుపు వి. వివాహవర్తనం, స్త్రీ పురుషుల కూర్పు. విజయ. 1.18. పెండ్లిపోములు వి.బ.వ. పెళ్ళి జరిగించుకోటానికి ఇచ్చే కట్నం. పెండ్లిపాలకి వి. వధూవరులు ఊరేగే పల్లకి. పెండ్లిపీట వి. వివాహంలో వధూవరులు కూర్చునే పీట. యయా. 4.88. పెండ్లిపెటాకులు రూ. పెండ్లిపెడాకులు. వి.బ.వ. ఇది జంట పదం, పెండ్లి పేరంటం. పెండ్లిపెడాకులు రూ.చూ. పెండ్లి పెటాకులు. వి.బ.వ. ఇదిజంట పదం, పెండ్లి పేరంటం. పెండ్లిపెండ్లము వి. ధర్మపత్ని. పెండ్లిపెద్ద రూ.చూ. పెండిలి పెద్ద. వి. వివాహమహోత్సవాన్ని నడిపేనాయకుడు, నాయకురాలు. మను. 5.56. పెండ్లిపేరంటము వి. శుభకార్యం. ప్రభు. 10.83. పెండ్లిబచ్చలి వి. బచ్చలిలో ఒకరకం. పెండ్లిమేడ వి. కళ్యాణ మండపం. పెండ్లియగు (-అగు) రూ. పెండిలియగు. పెండ్లగు, పెళ్ళి అగు. స.క్రి. 1. వివాహమాడు, పెండ్లాడు. భార. ఆది. 3.16 ; అ.క్రి. 1. గాస్తిఅగు ; 2. వివాహమగు. పెండ్లియరు(గు (-అరు(గు) వి. పెళ్ళిలో వధూవరులు కూర్చోటానికి వేసిన అరుగు, వివాహ వేదిక. పల్నా. 3.178. పెండ్లియాడు (-ఆడు) రూ.చూ. పెండిలియాడు. స.క్రి. వివాహమగు, పెళ్ళిచేసికొను. పెండ్లియాక వి. పెండ్లిపన్ను. ద. హిం. శా. సంపు. 5, శా. సం. 212. పెండ్లిలేనివాడు విణ. అకృతోద్వాహుడు, అవివాహితుడు. పెండ్లివీడియము వి. వివాహనిశ్చయ సూచకంగా ఇచ్చే తాంబూలం. చంద్రాంగ. 4.154. పెండ్లివ్రయము వి. దేవుడి కళ్యాణాని కయ్యేఖర్చు 1.1 AS 19.58. క్రీ.శ. 1280. సం. వ్యయ-. ఖర్చు. <పెండ్లి[1] + సం. వ్యయ-. పెండ్లిశుల్కము వి. పెళ్ళిపన్ను. ద. హిం. శా. సంపు. 4.803. సం. శుల్క-. పన్ను. <పెండ్లి[1] + సం. శుల్క-. పెండ్లిసేయు (-చేయు) రూ. పెండిలిసేయు, పెండ్లిచేయు. అ.క్రి. వివాహంచేయు. భార. అను. 1.107. పెణ్డెము రూ.చూ. పెణ్డిబు. వి. భార్య.

పెండ్లి[2] రూ.చూ. పెండియ. వి. గుండు, సాదెమెండ్లకు చుట్టే పలచని వెదురుబద్ద.

పెణ్డెము చూ. పెండ్లి[1].

పెణ్ణు వి. స్త్రీ. ఆడది.

క. హెణ్, హెణ్ణు, పెణ్, పెణ్ణు, పెణ్ణ. ఆడది, స్త్రీ ; తు. పెణ్ణు. బాలిక, ఆడది, పనిమనిషి ; త. పెణ్, పెణ్ణు, పెణ్. స్త్రీ. కూతురు, బాలిక, భార్య, వధువు, పశువులు, మొక్కలలో ఆడది; మ. పెణ్. ఆడది, ఆడపిల్ల, వధువు, ఆడపనిమనిషి.

<త. పెణ్.

పెణ్ణాన వి. స్త్రీవాంఛ. కాశ. 3.185.

త. పెణ్ణాసై. స్త్రీ ప్రేమ.

<త. పెణ్ణాసై.

పెతరు(డు రూ.చూ. పితరు(డు. వి. 1. పితృదేవత. నార పంచ. 5 9 ; 2. తండ్రి.

పెతరులచుక్క వి. పితృ దేవతాకమైన మఘానక్షత్రం. పెతరులపురమి వి. శ్మశానం, పితృవనం. అచ్చ. రా. యు. 8.23. పెతరులఱే(డు వి. యముడు. సాంబ. దేవ. 12. పెతరులసామి వి. పితృదేవతలకు ప్రభువు, యముడు. ఆం. నా. సం. దేవ. 19.

పెతరులచుక్క చూ. పెతరు(డు.

పెతరులపురమి చూ. పెతరు(డు.

పెతరులఱే(డు చూ. పెతరు(డు.

పెతరులసామి చూ. పెతరు(డు.

పెత్తం(డ్రి చూ. పెద్ద.

పెత్తవగా(డు చూ. పెద్ద.

పెత్తవము చూ. పెద్ద.

పెత్తనాలు చూ. పెద్ద.

పెత్తల్లి చూ. పెద్ద.

పెత్తారుకొయ్య చూ. పెద్ద.

పెత్తాశమావ చూ. పెద్ద.

పెత్తొక్క చూ. పెద్ద.

పెద రూ.చూ. పెద్ద. వి. వృత్తిలోనే ప్రయోగం, పెదపెద. 1. పెరిపైనది, గొప్పది. దాక్షారామం శాసనం. క్రీ. శ. 1084 ; 2. తారం, ఉచ్చం (కంఠస్వరం, మొ.వి). ర జ.చ. 3.112.

పెదకల్ప్రదోరియా వి. అంగీగుడ్డలో ఒకరకం నేత. పెదకుంచి రూ.చూ. పెద్దకుంచె. వి. గంజిపెట్టిన పడుగును ఆరుబైటదాపి దువ్వే పనిముట్టు. పెదకొర రూ.చూ. పెద్దకొ్ర. వి. లావుగింజరకం కొ్ర. పెదగంగయుదకము వి. అలభ్యం. పెదతండ్రి రూ. పెత్తండ్రి. పెద్దతండ్రి. వి. 1. తండ్రి. అన్న. ద్వి. పరమ. వి. 5.396 ; 2. పెత్తల్లి పెనిమిటి. పెదతల్లి రూ. పెత్తల్లి, పెద్దతల్లి. వి. 1. తల్లి కంటె పెద్దదైన సవతల్లి. విష్ణుపు. 2.16 ; 2. తల్లిఅక్క ; 3. పెత్తండ్రిభార్య. పెదకారుకొయ్య రూ.చూ. పెద్దకారు కొయ్య. వి. మగ్గంమీద నేతబద్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య. పెదమవ్వ వి. పెద్దజాతి నువ్వు. హంస. 4.127. పెదపిచ్చి వి. వృక్షవిశేషం. పి. శకు. 2.14. పెదపూశం రూ.చూ.పెద్దవుపేల. వి. ఆషాఢ మాసంలో వచ్చే కార్తె. పెదబయ్యంఠ రూ. చూ. పెద్దబయాహుంఠా. వి. గంజాం జిల్లాలో పండించే ఒకమంచిరకం వడ్లు. పెదమల్లి రూ.చూ. పెదమల్లె¹. వి. సువాసనగల తెల్లనిపూలుపూచే ఎర్రని పళ్ళుకాచే చెట్టు (Randia malabarica). పెదమల్లె¹ రూ. పెదమల్లి, పెదలి, పెద్దల్లి. వి. సువాసనగల తెల్లనిపూలు పూచే ఎర్రనిపళ్ళు కాచే చెట్టు (Randia malabarica). పెదమల్లె² వి. మెరిసే ఆకులు కలిగి తెల్లని పూలుపూచే మొక్క (Jasminum rigidum). పెదముట్టు వి. గొప్ప ముట్టడి. కు. సం. 12.178. పెదరవలు వి.బ.వ. పెద్దరవ్వలు. తిరుమల తిరుపతి దేవస్థానం శాసనాలు. సంపు. 11. శా. సం. 60. క్రీ.శ. 1513. పెదరాయి రూ.చూ. పెద్దరాయి. వి. దానలు, రాగులు మొ. పెద్దపాత్రలను దట్టటానికి కుదం కొట్టటానికి వాడే పెద్దరాయి. పెదరాపూరుకాశా వి. ఇచ్చిన ద్రవ్యం తిరిగి ఇవ్వక పోవటం. పెదరియాకుచింత (-ఆకుచింత) వి. దాశికట్నం పక్కన పెరిగిన పెద్దచింత చెట్టు. E. I. సంపు. 11.24. పెదాయి చూ. పెదమల్లె¹. వి. సువాసనకల తెల్లని పూలుపూసే ఎర్రని పళ్ళుకాసే చెట్టు (Randia malabarica).

పెదలి రూ.చూ. పెదమల్లె¹. వి. సువాసనకల తెల్లని పూలు పూసే ఎర్రని పళ్ళు కాసేచెట్టు.

పెదల్లి రూ.చూ. పెదమల్లె¹. వి. సువాసనకల తెల్లనిపూలుపూసే ఎర్రని పళ్ళు కాసేచెట్టు (Randia malabarica).

పెదవి వి. ఓష్ఠం, వాతెర. హర. 5.40.

తు. బిచ్చ. పెదవి : గోం. పిర్పి. పెదవి ; కొలా. పెదనె. పెదవి, పెద్దేల్. పెదవులు.

పెదవిగొంపు వి. దంతక్షతం, పంటినొక్కు. వేంక. ఆం. మాన. 77. పెదవిగంటు వి. పల్లంటు. సాంబ. మాన. 51. పెదవివిఱుచు అ.క్రి. నిరాశను సూచించు. శశా. 6.180. పెదవులవుడుకఱుచు అ.క్రి. కోపావేశం చేత కిందిపెదవి కొరికికొను. తాళ్ల. సం. 11.3.82. <పెదవి +-లు + అవుడు కఱచు. పెదవులువాకు అ.క్రి. ఆశపడు. పెదవులు(దరుప(-తరుపు) స.క్రి. ధీటని తెలియచేయు. పెదవెత్తు అ.క్రి. పలుకు, మాటాడు. తాళ్ల. సం. 5.262. <పెదవి+ఎత్తు¹. పెదాలుపుక్కిటపెట్టు. అ.క్రి. మిన్నకుండు. తాళ్ల. సం. 10.167. <పెదవి+-లు+పుక్కిలి+-అ⁷+పెట్టు.

పెదవులవుడుకఱచు చూ. పెదవి.

పెదవులువాకు చూ. పెదవి.

పెదవులు(దరుపు చూ. పెదవి.

పెదవెత్తు చూ. పెదవి.

పెదాయి చూ. పెద.

పెదాలుపుక్కిటపెట్టు చూ. పెదవి.

పెదిలిపోవు రూ.చూ. ప్రిడిలిపోవు. అ.క్రి. పగులు, బద్దలగు, చీలిపోవు.

పెద్ద రూ. పెద. విశ. 1. (గౌరవాదులలో) అధికుడు, గొప్పవాడు, గొప్పది, శ్రేష్ఠం. మైలవరం శాసనం. క్రీ.శ. 8 వ శతాబ్ది ; 2. (పరిమాణంలో) అధికం, ఎక్కువైన. భార. అర. 1.116; 3. దీర్ఘం, (కాలం) చిరం .భార.ఆది. 4.65 ; 4. పూజ్యుడు, పూజింపదగినవాడు. హరి.ఉ. 7.91 ; 5. (వయోధికుడు) జ్యేష్ఠుడు, జేష్ఠురాలు. ఉ.హరి, 2.200 ; 6. వృద్ధుడు, వృద్ధురాలు, ముసలి. శృం.నై. 1.107 ; 7. ముఖ్యుడు, ప్రధానుడు. కాశీ. 2.38 ; 8. ఉచ్చం, తారం (కంఠ స్వరాది). కాశీ. 5.167 ; 9. తెలిసినవాడు, తెలిసినది, విజ్ఞుడు, విజ్ఞురాలు. విక్ర. 1.12. 10. వయసు గడచిన వాడు. శశా. 4.15 ; క్రి.విశ. అత్యంతం, మిక్కిలి. భార. ఆది. 8.19 ; వి. 1. ఘనకార్యం, గొప్పపని. భార. ఆరణ్య. 3.170 ; 2. గొప్పతనం, ఘనత. కు.సం. 2.141 ; 3. వంశంలోని మూలపురుషుడు. రం.రా. అయోధ్యా. 86 ప. 2 పం ; 4. యజమానుడు. విజయ.

2.187 ; 5. విపులం, పృథువు. ఆం.రా. 3.16 ; 6. కత్తి పిక్క మొ. వాటిని చేయటానికి పనికివచ్చే ఒకరకం చెట్టు (Ailanthus cskalsa). వి.బ.వ. పితరులు, పితృదేవతలు. ఇందు. 6.117.

క. పెర్, పేర్. (అచ్చులముందు) ఆధిక్యం, గొప్పతనం, దైర్ఘ్యం, అధికం, పొడవు, గొప్ప, పెద్ద, ఆధిక్యం, పెద్దతనం, గొప్పతనం; కొడ. పెరి-, పెరిమ్-. పెద్ద, పెర్వి. పెద్దవారు; తు. పెరి, పెరియ. అధికం. గొప్ప, ఎత్తు, అధికుడు, హెద్ద. గొప్ప, అధికం, వైశాల్యం, ముఖ్యమైన, ఉత్తమమైనవారు; త. పెరు, పెరుమ్, పేర్. గొప్ప, పెరుతు. గొప్పదైన పెద్ద, విశాలమైన, పెరియ. విశాలమైన, గొప్ప, పెద్దవారు, ముఖ్యమైన, పెరియార్, పెరియోర్. వృద్ధులు, గొప్పవారు, ఋషులు, రాజులు, పెరియోన్. గొప్పవారు. దేవుడు; మ. పెరు, పేర్. గొప్ప, విశాలమైన, ముఖ్యమైన, పెరియ. అధికమైన, గొప్ప, పెరిప్పమ్-, గొప్పతనం. రెట్టించిన, తగినంత; కో. పె. పెద్ద; తొ. పె. పెద్ద; గోం. బిరీయా. పెద్ద, అధికం, బెరహ, పెరహ. గొప్ప; కొం. పెర్, పెరి. పెద్ద, అధికం, (కవల్లో) పెద్ద; పర్జి. బెర్తె. పెద్ద; కొలా. పెద్ద. పురుషుడు, పెర, పెర్. పెద్ద; నా. పెద్ద. మనిషి, పురుషుడు; గ. (ఒ) పెర్సోన్స్, బెరిత్. పెద్ద.

<మూ.ద్రా. *పేర్ + -ద.

పెచ్చెట్టి రూ.చూ. పెద్దసెట్టి. వి. కుమ్మరివాళ్ళ కుల పెద్ద. పెచ్చొర్ద రూ.చూ. పెద్దనర్ద. వి. దావులకింద తోటల్లో వేసే రకం నజ. పెచ్చోడి రూ.చూ. పెద్దచోడి. వి. చోడి. చోళ్ళలో ఒకరకం. పెజ్జటి వి. గొప్పయతి. చెన్నబసవ. 2.243. పెజ్జొన్న రూ.చూ. పెద్దజొన్న. వి. పెద్దగింజ రకం జొన్న, ఆరునెల్లపంట, అన్నానికి పేలాలకి మంచిది. పెత్తండ్రి రూ.చూ పెదతండ్రి. వి. 1. తండ్రి అన్న ; 2. పెత్తల్లి భర్త. పెత్తనగాడు విశే. అధికారి. పెత్తనము వి. 1. గౌరవం. వేమ. శ. 88 ; 2. వార్ధక్యం, ముసలితనం; 3. అధికారం; 4. పెళ్ళి పెద్దలు పిల్లనిమ్మని అడగటానికి వెళ్ళటం. పెత్తవాలు వి.బ.వ. పనికిమాలిన సుద్దులు. పెత్తల్లి రూ.చూ. పెదతల్లి. వి. 1. తల్లి అక్క ; 2. పెత్తండ్రి భార్య. పెత్తాడుకొయ్య రూ.చూ. పెద్దగాడుకొయ్య. వి. మగ్గంమీద. నేత చిద్రు పెట్టటానికి మోటుకట్టే కొయ్య. పెత్తాళమావ రూ. పెద్దర్ల అమావాస. వి. చనిపోయిన పెద్దలను తలచుకొనే అమావాస్య. పెత్తొక్కు రూ.చూ. పెద్దతొక్కు. వి. కామెరకి ఆధారంగా మోటదోనె పక్కగా బావివైపు చొచ్చుకు వచ్చిన రాయి. పెద్దఅడ్డపీట వి. అను పీటల్లో మొదటిది. పెద్దఅను వి. పట్టునూలు పడుగుపోసే పెద్దరకం అను. పెద్దఇప్ప వి. ఒకరకం ఇప్పచెట్టు (Bassia latifolia). పెద్దఇల్లింద వి. పెద్దపెద్ద ఆకులు, ముళ్ళుకలిగిన ఒకచెట్టు (Diospyros chloroxylon). పెద్దఈత వి. ఆకులు చాపలు అల్లటానికి, పళ్ళు తినటానికి పనికివచ్చే, కల్లునిచ్చే ఒకచెట్టు (Phoenix syvestris). పెద్దఉదక వి. ఒకరకం నారింజ చెట్టు (Citrus aurantium). పెద్దఉలివి వి. పెద్దపెద్ద ఆకులు ముళ్ళు కలిగిన ఒకచెట్టు (Diosphyros chloroxylon). పెద్దఉలిమిడి రూ.చూ. పెద్దఉలిమేడి. వి. నదీతీరాల్లో పెంచబడే ఒకచెట్టు (Crataeva religiosa). పెద్దఉలిమెర రూ.చూ. పెద్దఉలిమేడి. వి. నదీతీరాల్లో పెంచబడే ఒకచెట్టు (Diospyros chloroxylon). పెద్దఉలిమేడి రూ. పెద్దఉలిమిడి, పెద్దఉలిమెర (Diospyros chloroxylon). పెద్దఉసిరిక వి. తినేపళ్ళు కాసే ఒకచెట్టు. గృహోపకరణాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Phyllanthus emblica). పెద్దఎరసన్నం రూ. పెద్దర సన్నం. వి. సొంతదాన. పెద్దఎర వి. ముయ్యెర విడిచిన తరవాత పదిరోజులకు దసలి పురుగు విడిచే కూనం. పెద్దకక్కెర వి. కర్కరేటువు. పక్షివిశేషం. పెద్దకచ్చి వి. అచ్చుతుక్కోటానికి పేకదారం వెయ్యకుండా వదలినకచ్చి. పెద్దకడుపు పేల్పు వి. వినాయకుడు, లంబోదరుడు. పెద్దకండె వి. నేతలో నిలువుకు వాడటానికి చుట్టిన దసలి దారం. పెద్దకత్తి వి. తేమ ప్రదేశాల్లో పెరిగే లేత పసుపురంగు మెత్తని కలప కలిగిన చెట్టు (Oroxylum indicum). పెద్దకత్తి పెరుమాళ్లు వి. పెద్దలకు పెద్ద. పెద్దకదురు వి. 1. రాట్నం బొమ్మలకు గాని దొడ్డి నిలువులకు గాని బిగించే మందపు కడ్డీ ; 2. దసలి దారం వడికే రాట్నం చెవులకు బిగించిన ఇనప పుల్ల ; 3. ఒకరకం కదురు. పెద్దకంది వి. గింజ పెద్దదిగా ఉండే ఒకరకం కంది (Cajanus indicus). పెద్దకప్ప వి. మండూకవిశేషం. పెద్దకమల వి. కమలా పండులో ఒకరకం. పెద్దకంబ వి. మెత్తని కలప కలిగి సువాసనగల పూలుపూసే ఒకరకం చెట్టు (Anthocephalus cadamba). పెద్దకమ్మి వి. కమ్మి నేత చీరలో చివర వేసిన పెద్దపట్టె. పెద్దకయలుచీర వి. ఒకరకం పెద్దగడి చీర. పెద్దకరింగ రూ.చూ. పెద్దకారింగువ. వి. పెద్దపెద్ద ఆకులు పూలుకలిగి పచ్చని జిగురునిచ్చే వస్త్రంగానికి పనికివచ్చే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Gardenia latifolia). పెద్దకలబంద వి. ఒకరకం కలబంద (Agave vivipara). పెద్దకలమెవర వి. నూగుకల రెమ్మలు కలిగిన ఒకరకం చిన్నచెట్టు (Casearia cynadensis). పెద్దకలివె వి. ఇంధనంగాను దువ్వెనలు గరిటెలు మొదలైన ఉపకరణాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే ముళ్లు కలిగిన ఒకరకం చెట్టు (Carissa carandas). పెద్దకలింగ వి. అందంగా ఉండే ఒకరకం చెట్టు (Dillenia indica). పెద్దకసింత రూ. పెద్దకసింద. వి. పచ్చనిపూలు పూసే ఒకరకం చిన్నమొక్క (Cassia occidentalis). పెద్దకసింద రూ.చూ. పెద్దకసింత. వి. పచ్చని పూలుపూసే చిన్నమొక్క (Cass'a occidentali<). పెద్దకాకచి వి. కాకాదని, వృక్షవిశేషం. పెద్దకాకర వి. మహాకార వేల్లం. కాకరలో ఒకరకం. పెద్దకామ్రే రూ.చూ. పెద్దకాన్రేగు. వి. ఒకరకం కాన్రేగు చెట్టు (Flacourtia ramontchi) పెద్దకాన్రేసు రూ. పెద్దకాన్రు. వి. ఒకరకం పెద్ద కాన్రేగు చెట్టు. (Flacoatia ramontchi). పెద్దకాపు రూ.చూ. పెద్దకాంపు. నెల్లూరుశాసనాలు. దర్శి శాసనం. క్రీ.శ. 1542; 2. కాపులలో పెద్ద. పెద్దకాపుమాన్యం వి. ఊరిపెద్దకిచ్చిన

మాన్యం. పెద్దకామపార వి. చెవాల, పొడుగాటి కాడగల ఒకరకం పార. పెద్దకాంపు రూ. పెద్దకాపు. వి. 1. గ్రామాధి కారి. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 758. క్రీ.శ. 1522; 2. కాపులలో పెద్ద. పెద్దకారింగువ రూ. పెద్ద కలింగ. వి. పెద్దపెద్ద ఆకులూ పూలు కలిగి పచ్చని జిగురు నిచ్చే వస్త్రంగానికి పనికి వచ్చే కలపనిచ్చే చెట్టు (Gardenia latifolia). పెద్దకాలవ రూ. పెద్దకాల్వ. వి. ఏటి నుంచి తీసిన కాలవ, దీన్నుంచి పంటకాలువలు తీస్తారు. పెద్దకాల్వ రూ.చూ. పెద్దకాలవ. వి. ఏటినుంచి తీసిన కాలవ. పెద్దకుక్క వి. తోడేలు. పెద్దకుంచి రూ.చూ. పెద్దకుంచె. వి. గంజిపెట్టిన పడుగును ఆరబయటదాపి దువ్వే పనిముట్టు. పెద్దకుంచె రూ. పెదకుంచి, పెద్దకుంచి, వి. గంజి పెట్టిన పడుగును ఆరబయటదాపి దువ్వే పనిముట్టు. పెద్దకుంజి వి. మెత్తని కలప కలిగిన ఒక చెట్టు (Kydia calycina). పెద్దకుమ్మరి వి. కుమ్మరి కుల పెద్ద. పెద్దకుమ్మి వి. సామగ్రి తయారీకని వచ్చే మంచిరకం కలపనిచ్చే ఒకరకం చెట్టు (Gmelina arborea). పెద్దకులము వి. కరజాతి, చండాలకులం. పెద్దకులస్థుడు వి. కుమ్మరి కులపెద్ద. సం. కులస్థ.. కులంలో ఉన్నవాడు. పెద్దకుసుమ వి. పద్దలో ఒకరకం. పెద్దకూకటిమూగ వి. ఒకజాతి భరద్వాజం, మూండిలవం. పెద్దకొంకుడు వి. పెద్దరకం కాయలుకాసే రకం కొంకుడు చెట్టు (Alsophi a gigantea). పెద్దకొంగ వి. బలాకం, కొంగల్లో ఒకరకం. పెద్దకొరవలి వి. జొన్న, మొ. పైర్లు కోసే పెద్ద సైజు కొడవలి. పెద్దకొణామణి వి. పక్షలో ఒకరకం. పెద్దకొండకంది వి. ఒకరకం కంది మొక్క (Cadanus indicus). పెద్దకొండపేయు(-చేయు) స.క్రి. చాలా గొప్పగా చేయు. బసవ. 7.185. పెద్దకొండి వి. అంకెన తగిలించే ఇనపకొంకి, ఇడిగొత్తి కొయ్య మీద ఉంటుంది. పెద్దకొత్త వి. రెండుకానులు. పెద్దకొమ్మె వి. నడిమికొమిరి, పెన్నుగాడిని మోపే కొమర. పెద్దకొయ్య వి. చిటికెపేట అడ్డపేట బిగించిన పొడుగు పట్టె. పెద్దకొర్ర రూ. పెదకొర. వి. లావుగింజరకం కొర్ర. పెద్దకోటుచీర రూ.చూ. పెద్దకోట్టుచీర. వి. నిలువురెండుగీరలు ఒక చోట, నాలుగుగీరలు మరొక చోట వచ్చేట్టు నేసిన చీర. పెద్దకోర గుమ్మి వి. పట్టువారం చుట్టే పనిముట్టు. పెద్దకోట్టుచీర రూ. పెద్దకోటుచీర. వి. నిలువులో రెండుగీరలు ఒకచోట, నాలుగు గీరలు మరొకచోట వచ్చేట్టు నేసిన చీర. పెద్దగఁజూచు స.క్రి. ఆదరించు. జైమినిభా. 1.57. <పెద్ద+అగు+ఆ+చూచు. పెద్దగదువ వి. దొంతి పేర్పులో అడుగున పెట్టే మట్టిపాత్ర. పెద్దగడ్డి వి. కొర్ర మాదిరి ఎన్ను ఈనే గడ్డి మొక్క, పశువులమేతకు ప్రశస్తం (Setaria glauca). పెద్దగద్యము వి. వెలికర, మెట భూమి. HAS 13.26. క్రీ.శ. 1311. పెద్దగంటె వి. గంటె ధాన్యంలో ఒకరకం. పెద్దగడి వి. తడిక బిక్కలో ఇనప షల్లలమధ్య పెద్ద సందు. పెద్దగటిక వి. గండాలి, ఒకరకం గరిక (గడ్డిజాతిమొక్క). పెద్దగలిగెచ్చ రూ. పెద్దగిలిగిచ్చ. వి. పచ్చని పూలుపూసే మొక్క. పెద్దగర్నెగుద్ద వి. ఒకరకం పొక్కగుద్ద. పెద్దగవుజువారు విశ.బ.వ. పెద్ద. దాగా ఊదే వారు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 422. క్రీ.శ. 1191. పెద్దగాజులపట్టీ వి. పట్టుదారం చుట్టే రాలక దగ్గర పెట్టిన రింగులపట్టె. పెద్దగి వి. గృహాది నిర్మాణాలకు వ్యవసాయాది పరికరాలకు మొ. వాటికి పనికివచ్చే గట్టి కలపనిచ్చే చెట్టు (Pterocarpus marsupium). పెద్దగిలిగిచ్చ రూ.చూ. పెద్దగలిగెచ్చ. వి. పచ్చని పూలు పూసే ఒకరకం మొక్క (Corota aria laburnifolia). పెద్దగుండవ్వ వి. బానలు, కాగులు, మొ. వాటిని తట్టటానికి వాడే పెద్దరాయి. పెద్దగుముడు వి. సామగ్రి తయారీకి పనికి వచ్చే మంచిరకం కలపనిచ్చే ఒకరకం చెట్టు (Gmelina arborea). పెద్దగుమ్మడి రూ. పెగ్గుమ్మడి, పెద్దగుమ్మడు[2]. వి. పెద్దపెద్ద ఆకులు కలిగి లావుగా ఉండే ఒక తీగ (Vitis glauca). పెద్దగుమ్మడు[1] వి. ఒకరకం తీగ (Vitis pallida). పెద్దగుమ్మడు[2] రూ.చూ. పెద్ద గుమ్మడి వి. పెద్దపెద్ద ఆకులు కలిగి లావుగా ఉండే ఒక తీగ (Vitis glauca). పెద్దగుమ్మి వి. పట్టుదారం చుట్టే పనిముట్టు. పెద్దగుమ్ముడు రూ. పెగ్గుమ్ముడు. వి. శ్రీపర్ణి. పెద్దగుమ్ముడుటేకు వి. సామగ్రి తయారీకి పనికి వచ్చే మంచిరకం కలపనిచ్చే ఒకరకం చెట్టు. పెద్దగురిగింజ వి. పెద్దగింజలు కాసే గురివిందతీగ (Ademanthera pavonia). పెద్దగూవ వి. ధాన్యం నిల్వచేయటానికి వాడే పెద్ద తొట్టి. పెద్దగేసరి(-కేసరి) వి. నాలుగైదు నెలల్లో పండే ఒకరకం వడ్లు. పెద్దగొర్దలి వి. మొద్దులు, మొ. వాటిని నరకటానికి ఉపయోగించే పెద్దసైజు గొడ్డలి. పెద్దగొర్రు వి. నాలుగు మొదలు ఆరు వరకూ చెక్కలు (కర్రు బిగించే కొయ్యలు) ఉన్న పెద్ద గొర్రు. పెద్దగోకర రూ.చూ. పెద్దగోగర. వి. గోగరలో ఒకరకం. పెద్దగోగట రూ.చూ. పెద్దగోగర. వి. గోగరలో ఒకరకం. పెద్దగోగర రూ. పెద్దగోకర, పెద్దగోగట, పెద్దగోగడి. వి. గోగరలో ఒకరకం. పెద్దగోగడి రూ.చూ. పెద్దగోగర. వి. గోగరలో ఒకరకం (Chsyopogon species). పెద్దగోరంచు వి. పెరెనిమిది పోగులు దారంతో గీరపడేట్లు నేసిన ఒకరకం బట్ట అంచు. పెద్దగోరంట రూ. పెద్దగోరంట. వి. తోటల్లో పెంచబడే ఒకరకం చెట్టు (Barleria cristata). పెద్ద గోరంట రూ.చూ. పెద్దగోరంట. వి. కురంటకం. పెద్దంకుడు వి. తెల్లనిపూలుపూసే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Holarrhena antidysenterica). పెద్దచామ రూ. పెద్దగామ. వి. చాములలో ఒకరకం ధాన్యం. పెద్దచామంతి వి. బెరడు నుంచి పీచునిచ్చే, ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Helicteres isora). పెద్దచిక్కుడు వి. చిక్కుడుకాయల్లో ఒకరకం. పెద్దచిట్టి వి. ధాన్యపు కొలత, సేరులో ఎనిమిదో పంతు. పెద్దచింత వి. దంతిచెట్టు, పొడవైన ముళ్ళు కలిగి లేత ఎరుపు రంగు కలపనిచ్చే చెట్టు (Gymnosporia montana). పెద్దచిలకదుద్దుగ వి. అడవుల్లో పెరిగే ఒకరకం పెద్ద చెట్టు (Saccopetalum tomentosum). పెద్దచిలుకదుద్దుగ వి. మంచిరకం కలపనిచ్చే ఒకరకం చెట్టు (Miliusa velutina). పెద్ద

చీర వి. కలరాలాంటి వ్యాధి, నెత్తురు పారుకోటం (నోటి వెంబడి జిగొల్లు, మూత్రంలో రక్తం వచ్చే ప్రమాదకరమైన జబ్బు). పెద్దచీని వి. చీనీ పండులో ఒకరకం. పెద్దచీపురు వి. గంజాంనుంచి గోదావరివరకు దక్కను, కర్నూలు, బళ్ళారి మొదలైన చోట్ల పెరిగే ఒకరకం చెట్టు (Grewia excelsa). పెద్దచుక్క వి. శుక్రుడనే పేరుగల నక్షత్రం, పొద్దుపొడవక ముందు తూర్పున కొన్ని నెల్లు, పొద్దుకూకిన తరవాత పడమట కొన్ని నెలలు ప్రకాశవంతంగా ఆకాశంలో కనిపించే నక్షత్రం. పెద్దచెట్ట వి. కలరాలాంటి వ్యాధి (నెత్తురు పారుకోటం, నోటి వెంబడి సొల్లు, మూత్రంలో రక్తం పడే ప్రమాదకరమైన వ్యాధి). పెద్దచెట్టి వి. కూలికి మగ్గాలు నేయించే చెట్టి బృందానికి పెద్ద. పెద్దచేఁతరాపి వి. మహోదురసి. వృక్షవిశేషం. పెద్దచేమంతి వి. మహాసహ. పూలమొక్క. పెద్దచేమంతి అంచు వి. పెద్దచేమంతి పువ్వు నమూనాలు పడేటట్టు నేసిన ఒకరకం అంచు. పెద్దచేయు రూ.చూ. పెద్దసేయు. అ.క్రి. 1. గౌరవించు; 2. స్తుతించు. పొగడు; 3. ఉన్నదానికంటె ఎక్కువచేయు. పెద్దచోడి రూ. పెచ్చోడి. వి. చోడిధాన్యంలో ఒకరకం. పెద్దజనుము వి. చోరేలు నెయ్యటానికి రాత్రివేళ గొర్రెలమంద చెదరకుండా కప్పే వలలు అల్లటానికి వాడతారు. పెద్దజల్లిమేకము వి. నృమరం, జంతు విశేషం. పెద్దజావ[1] వి. వెర్రికరకచెట్టు (Bredelia retusa.) పెద్దజావ[2] వి. అడవుల్లోని పచ్చిక బీళ్ళలో పెరిగేమొక్క (Grewia asiatica). పెద్దజావ[3] వి. ఒకరకం చెట్టు. క. జాని-గిద. చిన్నచెట్టు. తడ-జాణ (Tiliaefolia). కరి-జాణ. (Orbiculata). పెద్దజువ్వి వి. సాధారణంగా ఊరు ఉండే గట్టి కలపనిచ్చే ఒకరకం చెట్టు (Ficus tsiela). పెద్దజెముదు వి. కంచెల్లో పెంచబడే చిన్నచెట్టు (Euphorbia antiquorum). పెద్దజేమ వి. జామలో ఒకరకం కాయ. పెద్దజేయు (-చేయు) అ.క్రి. దీపం ఆర్పివేయు. పెద్దజొన్న రూ. పెజ్జొన్న. వి. పెద్దగింజరకం, ఆరునెల్లపంట, అన్నానికి పేలాలకు మంచిది. పెద్దంచుదాక వి. అంచుపెద్దగా పెట్టి చేసిన మట్టిపాత్ర. పెద్దటమాట రూ. చూ. పెద్దటమోట. వి. టమోటాకాయల్లో ఒకరకం. పెద్దటమోటి రూ. పెద్దటమాట. వి. టమోటాకాయల్లో ఒకరకం. పెద్దటుకు వి. మీదటుకు. చిట్టటుకు. పైన వేసిన విశాలమైన అటక. < పెద్ద + అటుకు. పెద్దటేఁకు వి. మంచిరకం కలపనిచ్చే ఒకరకం చెట్టు (Tectona grandis). పెద్దడొలక రూ. పెద్దడొల్క. వి. పట్టుదారం చుట్టే పనిముట్టు డొలకల్లో పెద్దరకం. పెద్దడొల్క రూ.చూ. పెద్దడొలక. వి. పట్టుదారం చుట్టే పనిముట్టు. డొలకల్లో పెద్దరకం. పెద్దడోరియా వి. అంగీగుడ్డలో ఒకరకం నేత. పెద్దంటింత రూ. పెద్దంత్రింత. వి. కొండల్లోనూ అడవుల్లోనూ పెరిగే ఒకరకం చెట్టు (Desmodium gangeticum). పెద్దంత్రింత రూ. చూ. పెద్దంటింత. వి. కొండల్లోనూ, అడవుల్లోనూ పెరిగే ఒకరకం చెట్టు (Desmodium gangeticum). పెద్దతడక రూ. పెద్దతడక. వి. పెద్దపెద్ద ఆకులు కల ఒకరకం చెట్టు (Grewia abutilifolia). పెద్దతంత్రి రూ. చూ. పెదతంత్రి. వి. 1. తండ్రిఅన్న; 2. పెత్తల్లి పెనిమిటి. పెద్దతనము వి. 1. గొప్పతనం. గౌరవం. శృం. నై. 8.79; 2. వయోధిక్యం. కాశీ. 2.65; 3. పృథులత్వం, లావు. ఇందు. 2.185; 4. ముసలితనం, వార్ధక్యం. పెద్దతరక రూ.చూ. పెద్దతడక. వి. పెద్దపెద్దఆకులు కల ఒకరకం చెట్టు (Grewia abutilifolia). పెద్దతల వి. 1. పెద్దగాతుండి కార్యాన్ని నడిపించే వాడు. కళా. 6.152; 2. నాయకుడు, యజమానుడు. పెద్దతలకాయ వి. 1. పెద్దవాడు; 2. ప్రముఖుడు. పెద్దతలవాఁడు విశే. అర్ధతలవాడు. పెద్దతల్లి రూ.చూ. పెదతల్లి. వి. 1. తల్లికంటె పెద్దదైన సవతితల్లి. విష్ణుపు. 2.83; 2. తల్లిఅక్క; 3. పెత్తండ్రి భార్య. పెద్దతాడుకొయ్య రూ. పెత్తాడుకొయ్య. పెదతాడుకొయ్య. వి. మగ్గం మీద నేతబట్ట చుట్టటానికి మోడు కట్టే కొయ్య. పెద్దతుంగ వి. పెద్దజాతి తుంగ, తృణవిశేషం. హంస. 5.44. పెద్దతుమ్మి వి. మహాద్రోణం, వృక్షవిశేషం. పెద్దతురాయి వి. ఒకరకం తురాయిచెట్టు (Poinciana regia). పెద్దతురుమెలి వి. తెల్లనిపూలు పూసే గట్టిగాఉండే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Ehretia laevis). పెద్దతొక్కు రూ. పెత్తొక్కు. వి. కామిరెకి ఆధారంగా మోటదోనె పక్కగా దానివైపు పొడుచుకు వచ్చినరాయి (ఇటువంటివి రెండుంటాయి). పెద్దతొలువేలుపు వి. రాక్షసుడు. పెద్దతోక వి. దున్నటానికి ముందు పొలంలో చిన్నచెట్లను కొట్టే సాధనం. పెద్దదసు అ.క్రి. 1. గొప్పదగు; 2. అతిశయిల్లు; 3 రజస్వలఅగు. < పెద్ద + అది + అగు. పెద్దదంతె వి. పెద్దచింతచెట్టు, పొడవైన ముళ్ళుకలిగి లేత ఎరుపురంగు కలపనిచ్చేచెట్టు (Gymnosporia montana). పెద్దదర్వాజా రూ. పెద్దర్వాజా. వి. సింహద్వారం. ఇంటిలోని మొట్టమొదటి ద్వారం. పెద్దదవనము వి. మహాదమనం, సువాసనకల ఆకులు కల మొక్క. పెద్దది విశే. 1. ముసలది; 2. వయస్సు పరిమాణం మొ. వాటిలో పెద్దైనది. < పెద్ద + అది. పెద్దదిరిసనము వి. గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు. పెద్దదుబిరము వి. గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Albizzia lebbek). పెద్దదుప్పి వి. రామం, పెద్దఆకారం కలదుప్పి. పెద్దదుంప రాష్ట్రకము వి. అంచులు ఎర్రగా ఉండే, లేతఆకు పచ్చపూలు పూసే, మందుల్లో ఉపయోగపడే, ఒకరకం దుంపనిచ్చేతీగ (Alpinia galanga) పెద్దదూలగుండ రూ.చూ. పెద్దదూలగొండి[3]. వి. ఒకరకం తీగ (Mucuna monosperma). పెద్దదూలగొండి[1] వి. దురదపెట్టే ఆకులుకలిగిన ఒకరకం తీగ (Mucuna atropurpurea). పెద్దదూలగొండి[2] వి. బంజరుల్లోనూ కంచెల్లోనూ పెరిగే ఒకరకం మొక్క (Tragia involucrata). పెద్దదూలగొండి[3] రూ. పెద్దదూలగుండ. వి. ఒకరకం తీగ (Mucuna monosperma). పెద్దదూలగోవెల వి. మహాశృగుప్త, వృక్ష

విశేషం. పెద్దదోనె రూ. పెద్దోని. వి. మోట బొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు. దోనెమొదలు. పెద్దబోవ వి. రాజకర్కటి, దోసలో ఒకరకం. ఆం. బా. 2.71. పెద్దధోతి రూ. పెద్దోతి. వి. పన్నెండు మూరల పొడుగు నేసినపంచె. పెద్దన రూ. పెద్దన్న. వి. 1. సోదరులందరిలోకి పెద్దవాడు. భార. అను. 4.133 ; 2. అన్న. భీమ. 1.2. పెద్దనక్క వి. వరడు, గృడివం. పెద్దనక్కెర రూ.చూ. పెద్దనక్కెరు. వి. ఉపయోగకరమైన కలపనిచ్చే ఒకచెట్టు (Cordi· obliqua). పెద్దనక్కెరు రూ. పెద్దనక్కెర. వి. ఉపయోగకరమైన కలపనిచ్చే ఒకరకం చెట్టు (Cordia obliqua). పెద్దనర్వ రూ.చూ. పెద్దనారువ. వి. సన్నని కొమ్మలు కలిగి పచ్చని పూలుపూసే ఒకరకం మొక్క (Premna corymbosa). పెద్దనల్లకూర వి. సుమారు ఇరవైయైదు అడుగుల ఎత్తు పెరిగే లేతఆకు పచ్చపూలు పూసే ఒకరకం చెట్టు (Premna latifo'ia). పెద్దనల్లి చీమ వి. గండ్రచీమ. పెద్దనవలి రూ. చూ. పెద్దనెవిలి. వి. ఇంధనంగా ఉపయోగపడే ఒకరకం చెట్టు (Holoptelea integrifolia). పెద్దనవు రూ. చూ. పెద్దనవ్వు. వి. పెద్దనవ్వు. పెద్దనవ్వు రూ. పెద్దనవు. వి. ఎక్కువనవ్వు. పెద్దనారువ రూ. పెద్దనర్వ. వి. సన్ననికొమ్మలు కలిగి పచ్చనిపూలు పూసే ఒకరకం మొక్క. పెద్దనిదుర రూ.చూ. పెద్దనిద్ర. వి. చావు. విష్ణుపు. 4.250. పెద్దనిదురపోవు (-పోవు) రూ. చూ. పెద్దనిద్దురపోవు. అ.క్రి. చచ్చు. మరణించు. పెద్దనిద్దుర రూ.చూ. పెద్దనిద్ర. వి. చావు. భాగ. 6.428. పెద్దనిద్దురపోవు (-పోవు) రూ. పెద్దనిదుర, పోవు, పెద్దనిద్రపోవు. అ.క్రి. చచ్చు. మరణించు. వేంక. అం. మాన. 54. పెద్దనిద్ర రూ. పెద్దనిదుర· పెద్దనిద్దుర. వి. దీర్ఘనిద్ర, చావు. కాశీ. 2.58. పెద్దనిద్రకంటి వి. అంటింత, ముట్టుకున్నప్పుడు ఆకులు ముడుచుకు పోయే మొక్క. పెద్దనిద్రపోవు(-పోవు) రూ.చూ. పెద్దనిద్దురపోవు. అ.క్రి. చచ్చు. మరణించు. పెద్దనిమ్మ వి. పెద్దరకం కాయలు కాసే నిమ్మచెట్టు. పెద్దనీలి వి. కరునీలి, ఎరుపుతో కూడిన వసుపురంగు పూలుపూసే మొక్క, అజలోమి. పెద్దనువ్వు వి. మహాతిలం, పెద్దగింజలున్న నువ్వు. పెద్దనెల వి. జ్యేష్ఠమాసం. పెద్దనెల్లకూర వి. లేత ఆకుపచ్చరంగు పూలుపూసే, సుమారు 25 అడుగుల ఎత్తు పెరిగేచెట్టు (Premna latifolia). పెద్దనెల్లి వి. లేత ఆకుపచ్చరంగు పూలుపూసే, సుమారు 25 అడుగుల ఎత్తు పెరిగే చెట్టు (Premna latifolia). పెద్దనెవిలి రూ. పెద్దనవలి. వి. ఇంధనంగా ఉపయోగపడే ఒకరకంచెట్టు (Holoptelea integrifolia). పెద్దనేపాలము రూ. పెద్ద నేపాళము. వి. మందుల్లో ఉపయోగపడే నూనె నిచ్చే గింజలుకాసే చిన్నచెట్టు (Jatropha curcas). పెద్ద నేపాళము రూ.చూ. పెద్దనేపాలము. వి. మందుల్లో ఉపయోగపడే నూనెనిచ్చే గింజలుకాసే చిన్నచెట్టు (Jatropha curcas). పెద్దనేరెడు రూ.చూ. పెద్దనేరేడు. వి. మహాజంబువు, నేరేడుచెట్టు. పెద్దనేరేడు రూ. పెద్దనేరెడు. వి. గృహాది నిర్మాణాలకి వ్యవసాయ పరికరాల తయారీకి పనికి వచ్చే కలపనిచ్చే చెట్టు, మహాజంబువు (Eugenia jambolana). పెద్దనేలు వి. చేతి బొటనవేలు. <పెద్ద+అన్న+వ్రేలు. పెద్దన్న రూ.చూ. పెద్దన. వి. 1. సోదరులందరిలోకి పెద్దవాడు ; 2. అన్న. పెద్దపచ్చరి వి. ఎఱ్ఱపచరు, లేత నీలం రంగుగాని ఎరుపు రంగుగాని ఉన్న పూలుపూసే గట్టి కలప కలిగిన అందమైన పెద్దచెట్టు (Dalberg'a lancealaria). పెద్దపచ్చెరు వి. గృహాది నిర్మాణాలకు, వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు, తెల్లచిందుగ చెట్టు (Albizzia procera). పెద్ద పట్టికోరు వి. ఒకపట్టిగా నేసిన పెద్ద అంచు. పెద్దపట్టిజాడి వి. పెద్దపెద్ద పట్టెలు పడేట్టు నేసిన గొంగడి. పెద్దపంటె వి. నవారు నేతకు వాడే పురినూలు చుట్టుకోటానికి వాడే కొయ్య పనిముట్టు. పెద్దపండగ రూ.చూ. పెద్దపండుగ. వి. 1. భాద్రపదశుద్ధ చవితి ; 2. మకర సంక్రాంతి. పెద్ద పండుగ రూ. పెద్దపండగ. వి. 1. భాద్రపద శుద్ధచవితి ; 2. మకర సంక్రాంతి. పెద్దపత్తి వి. పత్తిలో ఒకరకం. పెద్దపని వి. కట్టుబడిపని. పెద్దపల్లెరు రూ. చూ. పెద్ద పల్లేరు. వి. మహా ఫలంకష, ఒకరకం కలుపుమొక్క· పెద్దపల్లేరు రూ. పెద్దపల్లెరు. వి. ఇసకనేలల్లో ఎక్కువగా మొలిచే పాకుడు కలుపుమొక్క (చిన్న పల్లేరు కంటె ఆకులు పెద్దవి కాయలకు వాడియైన ముళ్ళుంటాయి), ఏనుగు పల్లేరు (Pedalium murex). పెద్దపవరు వి. గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Albizzia procera). పెద్దపసారిలు వి.బ.వ. వడ్లలో ఒకరకం. పెద్దపసేల రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢ మాసంలోవచ్చే కార్తె. పెద్దపాచి వి. శైవాలం, నాచు. వేంక. అం. 76. పెద్ద పాపర వి. ఇంద్రవారుణి, వృక్షవిశేషం. ఆం.బా. 2.71. పెద్దపాయగిల్లాకు వి. బోలుగాఉండే కొమ్మలు, పలచని ఆకులుగల ఒకరకం చెట్టు (Leea robusta). పెద్దపాయలాకు వి. చెమ్మనేలల్లో ఏటాతేచి పెరిగే కలుపు (Portulaca oberacea). పెద్దపార వి. పొలాల గట్లు గనిమెలు చెక్కే పెద్దసెలగపార. పెద్దపాల వి. తెల్ల పాలచెట్టు, చెక్కడపు పనికి ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Wrightia tomentosa). పెద్దపిచ్చిక వి. బూడిద రంగు కొమ్మలుకలిగి తెల్లని పూలుపూసే ఒకరకం చిన్న చెట్టు (Ehretia laevis). పెద్దపిట్ట వి. గుడ్లగూబ. పెద్ద పిండికొండ వి. ఒకరకం మొక్క (Aerva javanica). పెద్దపిల్లిపిచర రూ. పెద్దపిల్లిపీచర. వి. ఒకరకం మొక్క (Asparagus roltleri). పెద్దపిల్లిపీచర రూ.చూ. పెద్ద పిల్లిపిచర. వి. ఒకరకం మొక్క (Asparagus roltleri). పెద్దపీట వి. అనుపీటల్లో మొదటిది. పెద్దపుగ వి. ఆషాఢ మాసంలో వచ్చే కార్తె. పెద్దపుచ్చ వి. పుచ్చకాయల్లో ఒకరకం· పెద్దపుట్టి వి. ధాన్యపు కొలత, 576 మానికలు, పెద్దపురికారు వి. పట్టుదారంపడికే పెద్దరాట్నం ఇరుసునూ కొలకను కలిపే గట్టిదారం. పెద్దపులి వి. బెబ్బులి, వ్యాఘ్రం. దశా. 4.40. పెద్దపులిమేర రూ. పెద్దపుల్మెర. వి. బూడిద రంగు కొమ్మలు కలిగి తెల్లని పూలుపూసే ఒకరకం చిన్న చెట్టు (Ehretia laevis). పెద్దపులుగు వి. పెద్దజాతి

గుర్లగూబ. సిం.ద్వా. 1.231. పెద్దపుల్మెర రూ.చూ. పెద్ద పులిమేర. వి. బూడిదరంగు కొమ్మలు కలిగి తెల్లని పూలు పూసే ఒకరకం చిన్నచెట్టు (Ehretia laevis). పెద్దపువు వి. భూషణ విశేషం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 431. క్రీ.శ. 1194. పెద్దపునల రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపునరి రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపునిరి రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపుసెల రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపుసేల రూ. పెదపూశం, పెద్దపసేల, పెద్దపునల, పెద్దపునరి, పెద్దపునిరి, పెద్దపుసెల, పెద్దపుసేరి, పెద్దపూశం, పెద్దపూసెం, పెద్దపూసెల, పెద్దపూసేరి. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపుసేరి రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపుస్తకము వి. పాత అచ్చు భారత రామాయణాది కావ్యం, ఇది పూర్వం పెద్ద ఆకారంలో అచ్చు వేయబడటం వల్ల పెద్దపుస్తకాలు అనబడేది. పెద్దపుస్తకం వట్టించు స.క్రి. విద్యార్థికి రామాయణాదుల్ని చదవటం నేర్పించటం ప్రారంభించు. పెద్దపూశం రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపూసెం రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపూసెల రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చే కార్తె. పెద్దపూసేరి రూ.చూ. పెద్దపుసేల. వి. ఆషాఢమాసంలో వచ్చేకార్తె. పెద్దపెన్నేరు వి. మహాశ్వగంధ వృక్షవిశేషం. పెద్దపెసలు వి.బ.వ. పెసల్లో ఒకరకం. పెద్దపేరీగలు వి.బ.వ. కొండల్లోఉండే పెట్టు తేనెటీగలు. < పెద్ద + పేరు + ఈగ + -లు. పెద్దపొట్ట వి. ఆకులు విడిబడి కంకివెళ్ళే ముందున్నదశ, ఈనటానికి సిద్ధమైన ఎన్ను. పెద్దపొట్ల వి. పొట్లకాయల్లో ఒకరకం. పెద్దపొయ్యి వి. ఆము గోడ మధ్యభాగంలో వంట పెట్టటానికి గుండ్రంగా ఏర్పరచిన సందు. పెద్దపొల వి. 1. మనుష్య మాంసం. మను. 4.37 ; 2. (పూజ్యమైన జంతువు మాంసం) గోమాంసం. పెద్దపోతరి వి. తెల్లగాఉండే నిరుపయోగమైన మెత్తని కలప గల ఒకరకం చెట్టు (Kydia calycina). పెద్దబట్ట వి. పొడుగు వెడల్పు ఎక్కువగాఉన్న బట్ట. పెద్దబట్టవ వి. సామగ్రి తయారీకి అలంకరణలకి పనికివచ్చే అందమైన గట్టి కలపనిచ్చే చెట్టు (Cordia macleodii). పెద్దబట్టి వి. జాతిబట్టి, సున్నంకాల్చే గుండ్రటి బట్టి. పెద్దబండి వి. 1. సామానుల బండి ; 2. రెండెద్దులబండి. పెద్దబయాహుండా రూ. పెదబయంత, పెద్దబయ్యాఉండా. వి. గంజాం జిల్లాలో పండించే ఎన్ను ముద్దగాఉండే మంచిరకం వడ్లు. పెద్దబయ్యాఉండా రూ.చూ. పెద్దబయాహుండా. వి. గంజాంజిల్లాలో పండించే మంచిరకం వడ్లు. పెద్దబాతు వి. బాతుల్లో ఒకరకం. పెద్దబావ వి. ధాన్యం నిల్వకు ఉపయోగించే పెద్ద కాగు. పెద్దబిక్కి వి. వెర్రిబిక్కి చెట్టు, చిన్నచిన్న సామానులు తయారు చేయటానికి పనికివచ్చే కలపనూ మందుల్లో ఉపయోగపడే ఒకరకం జిగురును ఇచ్చే చెట్టు (Gardenia latifolia). పెద్దబీబీవడ్లు వి.బ.వ. వడ్లలో ఒకరకం. పెద్దబీర రూ.చూ. పెద్దబీఱ. వి. బీరకాయల్లో ఒకరకం. పెద్దబీఱ రూ. పెద్దబీర. వి. రాజకోశాతకి, బీరకాయల్లో ఒకరకం. పెద్దబుగిడి వి. పెద్ద మొగ్గ ఆకారంలో నేసిన డిజైను. పెద్దబురద వి. బురదమల్లో ఒకరకం. పెద్దబెండ[1] వి. ఒకరకం బెండచెట్టు (Abutilon asiaticum). పెద్దబెండ[2] వి. కొండల్లో పెరిగే ఒకరకం మొక్క (Abutilon indicum). పెద్దబెండ[3] వి. రోడ్ల పక్కనా, బంజరు భూముల్లోనూ పెరిగి పీచు నిచ్చే ఒకరకం మొక్క (Urena lobata). పెద్దబొకు రూ. పెద్దబొటుకు, పెద్దబొతుక. వి. కలపనిచ్చే ఒకరకం చిన్న చెట్టు (Cordia obliqua). పెద్దబొటుకు రూ.చూ. పెద్దబొకు. వి. కలపనిచ్చే ఒకరకం చిన్నచెట్టు (Ccrdia obliqua). పెద్దబొతుక రూ.చూ. పెద్దబొకు. వి. కలపనిచ్చే ఒకరకం చిన్న చెట్టు (Cordia obliqua). పెద్దబొత్తంచు వి. బాగా వెడల్పుగా నేసిన అంచు. < పెద్ద + బొత్తు + అంచు[3]. పెద్దబొత్తంచుచాపు వి. అంచులు వెడల్పుగా నేసిన రెండు పంచెలు. పెద్దబొప్పర వి. బొప్పరలో ఒకరకం. పెద్దబోదతరము రూ. పెద్దబోద సరము. వి. మహా ముండిని. పెద్దబోదసరము రూ.చూ. పెద్దబోదతరము. వి. మహాముండిని. పెద్దమగలింగము రూ. పెద్దమొగలింగము. వి. ఉలిమెర, లేతపసుపు రంగు కలపనిచ్చే ఒకరకం చిన్నచెట్టు (Crataeva religiosa). పెద్దమగ్గ వి. తెల్లనిపూలుపూసే చిన్న చెట్టు (Raudia candolleara). పెద్దమగ్గం వి. జరపైమూరల పొడుగు తలపాగలు నేసే మగ్గం. పెద్దమడుపు వి. పచ్చని పూలు పూసే ఒకరకం తీగ (Entada scandens). పెద్దమనిషగు అ.క్రి. రజస్వల అగు. < పెద్ద + మనిషి + అగు. పెద్దమనిషి వి. మర్యాదస్థుడు. పెద్దమనుష్యుడు వి. పూజ్యుడు, మర్యాదస్థుడు. సం. మనుష్య-. మనిషి. పెద్దమందు వి. కత్తిపిడులు మొ. వాటి తయారీకి ఉపయోగపడే తెల్లని మెత్తని కలపనిచ్చే చెట్టు (Ailanthus excelsa). పెద్దమఱి వి. ఊడలుండే దళసరి ఆకులు కలిగిన పెద్ద చెట్టు (Ficus beongalensis). < పెద్ద + మఱ్ఱి. పెద్దమల్లె వి. తెల్లని పూలుపూసే ఒకరకం మొక్క (Jasminum rigidum). పెద్దమాంసము వి. గోమాంసం. శివరా. 4.15. సం. మాంస-. మాంసం. పెద్దమాపేను వి. మహాజ్యోతిష్మతి. పెద్దమాసంవడ్లు వి.బ.వ. వడ్లలో ఒకరకం. పెద్దమిటిపొద్దు వి. మధ్యాహ్నం. పెద్దమినుము వి. మినుముల్లో ఒకరకం. పెద్దముత్తవపులగము వి. అతిబల. పెద్దములగ వి. మహావార్తాకి, వృక్షవిశేషం. పెద్దములు గోరంట వి. బంజరు నేలల్లోనూ బాటలపక్కనా పెరిగి తెల్లనిపూలుపూసే ముళ్ళు కల మొక్క (Barleria buxifolia). పెద్దముల్లంగి వి. మహా ములకం, వృక్షవిశేషం. పెద్దమూతి వి. గూన చివరి వెడల్పాటి భాగం. పెద్దమెకము వి. పెద్దపులి. సిం.ద్వా. 1.39. పెద్దమైపాశి వి. వడ్లలో ఒకరకం. పెద్దమొగలింగము రూ.చూ. పెద్దమగలింగము. వి. ఉలిమెర, లేతపసుపు రంగు కలపనిచ్చే ఒకరకం చిన్న చెట్టు (Crataeva religiosa). పెద్దమొరలి వి. తినటానికి పనికివచ్చే

గింజలు కాసే చెట్టు (Buchanania angustifo'ia) పెద్దమొల వి. గొంత్రు భాగం, అంకెన తగిలించే జనపకొండి (ఇదిగొర్రె గొయ్యమీద ఉంటుంది). పెద్దమొలకొలుకులు వి.బ.వ. వడ్లలో ఒకరకం. పెద్దమొసలి వి. పెద్దజాతి మొసలి. హంస. 4.186. పెద్దంబళ్ళపొద్దు వి. దాదాపు పన్నెండు గంటల సమయం. <పెద్ద+అంబలి+-లు+-అ''+ప్రొద్దు. పెద్దమ్మ వి. 1. తల్లుల్లో గొప్పతల్లి, జగజ్జనని. భాగ. 10 పూ. 1742; 2. జ్యేష్ఠాదేవి; 3. పెత్తల్లి; 4. దౌర్భాగ్యం. <పెద్ద+అమ్మ. పెద్దమ్మకు పసుపుకుంకుమకిచ్చినభూమి వి. పనికిమాలిన క్షేత్రం. పెద్దమ్మవారు వి.బ.వ. స్ఫోటకం. పెద్దమ్రంగ వి. సువాసన కల తెల్లనిపూలుపూసే చిన్న చెట్టు (Randia uiginosa). పెద్దమ్రాను వి. మహానింబం. ఆం.భా. 2.49. పెద్దయల(-అల) వి. కల్లోలం, పోతకరదు. పెద్దయాడెము రూ. పెద్దాడెము. వి. కొరమద్దిచెట్టు. మంచిరకం కలపనిచ్చే ముళ్ళు కలిగిన ఒకరకం చెట్టు (Bridelia retusa). పెద్దయిప్ప(-ఇప్ప) రూ. పెద్దిప్ప. వి. సారాతీయటాని కుపయోగించే పూలు కలిగి శ్రేష్ఠమైన కలపనిచ్చే చెట్టు (Bassia latifolia). పెద్దయిల్లింద(-ఇల్లింద) వి. తెల్ల ఉలిమెర, ఇంధనంగా ఉపయోగించే కలపనిచ్చే చెట్టు (Diospyros chloroxylon). పెద్దయీత(-ఈత) వి. స్వర్ణపారేవతం, ఒకరకం నారింజ. పెద్దయేలకి(-ఏలకి) వి. బృహదేల. పెద్దయ్య వి. పెదతండ్రి. <పెద్ద+అయ్య. పెద్దరసన్నం రూ.చూ. పెద్ద ఎరసన్నం. వి. పొంతదాన. పెద్దరాగి వి. రాగుల్లో ఒకరకం. పెద్దరాటం రూ. పెద్ద రాట్నం. వి. పట్టుదారం వడికే ఒకరకం రాట్నం. పెద్దరాట్నం రూ.చూ. పెదరాటం. వి. పట్టుదారం వడికే ఒకరకం రాట్నం. పెద్దరాయి రూ. పెదరాయి. వి. దొడ్డు రాయి, పెద్దసైజురాయి. పెద్దరికము రూ.చూ. పెద్దఱికము. వి. పెత్తనం. పెద్దరికము రూ.చూ. పెద్దఱికము. వి. గొప్పతనం. శాశ్వ.నం. 14.69. పెద్దరిపేటి వి. పెళ్ళికి వాడే రంగులు పూసిన అరివేణి కుండలు. పెద్దరూక వి. రెండున్నరడా. పెద్దరెల్లు వి. ఇళ్ళకప్పులకు ఉపయోగించే ఒకరకం గడ్డి (Phragmites Karka). పెద్దరోగము వి. 1. కుష్ఠురోగం; 2. కలరా. పెద్దరౌతు వి. దొడ్డురాయి, పెద్దసైజు రాయి. పెద్దర్కము రూ.చూ. పెద్దఱికము. వి. పెత్తనం. పెద్దర్లఅమావాస రూ.చూ. పెత్తరమాస. వి. వి. మహాలయ అమావాస్య. పెద్దర్వాజా రూ.చూ. పెద్ద దర్వాజా. వి. సింహద్వారం, ఇంటిలోని మొట్టమొదటి ద్వారం. పెద్దఱికము రూ. పెద్దరికము, పెద్దరికెము, పెర్కెద్దము. వి. 1. ఘనత, గొప్పతనం. భార.విరా. 5.357; 2. గౌరవం. హరి.ఉ. 5.128; 3. వివేకం. ఉ.హరి. 1.96. పెద్దలగుటిగి వి. పెద్దల పండగరోజున ఇంటిలో దేవర మూల పెట్టి పూజ చేయటానికి వాడే మట్టిపాత్ర. పెద్దలచంద(-అలచంద) వి. అలచందలో ఒకరకం. పెద్దలపండుగ వి. 1. దసరా వెళ్ళిన తొమ్మిది రోజులకు వైశ్యులు, వైష్ణవులు చేసుకొనే పండుగ; 2. మహాలయామావాస్య. పెద్దలాకి వి. 1. నేత పడుగులో పైపోగులకు, కిందిపోగులకు మధ్య దూర్చిన వెదురు బద్ద; 2. మగ్గానికి తగిలించిన పడుగులో దంతె దగ్గరనించి చివరి వరకుదూర్చిన వెదురుబద్ద. పెద్దల్లి వి. నీలంరంగు పూలుపూసే పెద్ద చెట్టు (Memecylon edule). పెద్దవంకలు వి.బ.వ. పరిభేదం. సాంబ. మాన. 52. పెద్దవంకాయ వి.వంకాయల్లో ఒకరకం. పెద్దవంకెలు వి.బ.వ. నాలుగు నెల్ల పంట, వడ్లు బియ్యం కూడా ఎర్రగా ముతగ్గా ఉంటాయి. పెద్దవయసు వి. ముసలితనం, వార్ధక్యం. పెద్దవరం వి. మాగాణి నేల చుట్టూ ఎత్తుగా వేసిన మట్టి కట్ట. పెద్దవరగువెంకి రూ. పెద్దవరజువెంకి. వి. తెల్లని మెత్తని కలపనిచ్చే చెట్టు. (Salvadora persica). పెద్దవరగోకి రూ. పెద్దవరగోగు వి. తెల్లని మెత్తనికలపనిచ్చే చెట్టు (Salvadora persica). పెద్దవరగోసు రూ.చూ. పెద్దవరగోకి (Salvadora persica). పెద్దవరగోగు వి. బృహత్పీలువు, ఒక రకంగోగు వెలక్క. పెద్దవరజువెంకి రూ.చూ. పెద్దవరగు వెంకి. వి. తెల్లని మెత్తని కలపనిచ్చే చెట్టు (Salvadora persica). పెద్దవరి వి. వడ్లలో ఒకరకం. పెద్దవరుస వి. 1. పెద్దవయను; 2. యోగ్యత. పెద్దవల్లె వి. కన్నెపిల్లలు కట్టుకొనే ఒకరకం చీర. పెద్దవాక వి. గంటలు మొ. వాటి తయారీకి, ఇంధనంగానూ ఉపయోగపడే కలపనిచ్చే చెట్టు (Carissa Ealandas). పెద్దవాకిలి వి. గోపురద్వారం, ముఖద్వారం. పెద్దవార రూ.చూ. పెద్దోర. వి. ధాన్యం నిల్వచేయటానికి మూతి వెడల్పుగా నాల్గు వలయాలు కలిపి చేసిన నిలువెత్తుమట్టిపాత్ర. పెద్దవాఁడు విశ. 1. ఘనుడు, గొప్పవాడు, పూజ్యుడు. కు. సం. 2.6; 2. వయోధికుడు, జ్యేష్ఠుడు. ఉ.రా. 5.259; 3. వృద్ధుడు, ముసలివాడు. శుక. 2.519. పెద్దవారం వి. బుధవారం. పెద్దవివ్నపము వి. చెవుడు. బాధిర్యం. పెద్దవివ్నపము వాఁడు విశ. పెద్దచెవిటివాడు, బధిరుడు. పెద్దవిప్ప రూ. చూ. పెద్దయిప్ప. వి. సారాతీయటానికుపయోగించే పూలు కలిగి శ్రేష్ఠమైన కలపనిచ్చే చెట్టు (Bassia latifolia). పెద్దవిరి వి. మహానీలి. పెద్దవీధి వి. రాజమార్గం, రాచబాట. పెద్దవెట్టు (-పెట్టు) అ.క్రి. గౌరవించు. భార. శాంతి. 5.393. పెద్దవెలిగండ్లు వి.బ.వ. పెద్దవెలికల బూములు. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 747. క్రీ.శ. 1150. పెద్దవేగి రూ. పెద్దవేగిస. వి. రైలు పట్టాలకింద వేయటానికి (గృహాది నిర్మాణాలకు ఉపయోగ పడే) గట్టికలప నిచ్చే చెట్టు (Pterocarpus marsupium). పెద్దవేగిస రూ.చూ. పెద్దవేగి. వి. రైలు పట్టాల కింద వేయటానికి, గృహాది నిర్మాణాలకు ఉపయోగపడే, గట్టికలపనిచ్చే చెట్టు. (Pterocarpus marsupium). పెద్దవేము వి. మహానింబం. పెద్దవేరుసెనగ వి. వేరుసెనగ కాయల్లో ఒకరకం. పెద్దవేలుపు వి. సురజ్యేష్ఠుడు, బ్రహ్మ. పెద్దవ్రేలు వి. బొటనవేలు, అంగుష్ఠం. ఆం. భా. 2.189. పెద్దశామ రూ.చూ. పెద్దసామ. వి. సామలలో ఒకరకం ధాన్యం. పెద్దసజ్జ వి. సజ్జల్లో ఒకరకం. పెద్దసంటి వి. ఆములో నిప్పు రాజేసేదానికి పెట్టిన సందు. పెద్దసావ

వి. సౌఖ్యం, శరాహ్వయం. పెద్దవర్ద రూ. పెద్వొర్ద, పెద్ద సొర్ద. వి. దావులకింద తోటల్లో పెంచబడే గింజలావుగా ఉండే సజ్జ. పెద్దనందు వి. నరిచేసేటప్పుడు పదుగులో రెండు అనులమధ్య చేసిన పెద్దపెరిక. పెద్దపవ్నం వి. వడ్లలో ఒకరకం. పెద్దనంబావులు వి.బ.వ. ఒకరకం ధాన్యం. పెద్దనరుకు వి. కలరాలాంటి వ్యాధి. నెత్తురుపారు కోపటం, నోటివెంబడి సొల్లు, మూత్రంలో రక్తంపడే ప్రమాదకరమైన వ్యాధి. పెద్దపావర వి. ఎరుప లేక లేతనీలిరంగు పూలుపూసే గట్టికలపనిచ్చే అందమైనచెట్టు (Dolbergia lanceolaria) పెద్దపారి వి. మూడు మూరలు కైవారం ఉన్నసారె. పెద్దసుత్తి వి. పోతసుత్తె, పెద్దసైజు సుత్తె. పెద్దపెట్టి రూ. పెచ్చెట్టి. వి. 1. వర్తక సంఘాధికారి. పెద్దకోమటి. ద. హిం శా. సంపు. 10. శా.సం. 753. క్రీ. శ. 1522; 2. కుమ్మరివాళ్ళ కులపెద్ద. పెద్దపేయు (-చేయు) రూ. పెద్దచేయు. స.క్రి. 1. గౌరవించు, గొప్ప చేయు. భార. అను 4.410 ; 2. స్తుతించు, పొగడు. మను. 6.69 ; 3. ఉన్నదానికంటె ఎక్కువచేయు. సారంగ. 2.114. పెద్దసొర్ద రూ.చూ. పెద్దసర్ద. వి. దావులకింద తోటలో వేసే రకం. పెద్దసొపుప వి. కలరాలాంటివ్యాధి. (నెత్తురుపారు కోటం, నోటివెంబడి సొల్లు, మూత్రంలో రక్తంపడే ప్రమాదకరమైన వ్యాధి). పెద్దాకుచెట్టు వి. ఒకానొకచెట్టు. <పెద్ద+ఆకు+చెట్టు. పెద్దాచివ్నాలేకుందు అ.క్రి. అంతరువెరిగి ప్రవర్తించకుండు. <పెద్ద+ఉన్+చిన్న+ఉన్+లేక+ఉండు. పెద్దాట్రగడ్డ వి. వడ్లలో ఒకరకం. <పెద్ద+అట్రగడ్డ. పెద్దాణెము రూ.చూ. పెద్దయాణెము. వి. కొరమద్దిచెట్టు, మంచిరకం కలపనిచ్చే ముళ్ళు కలిగిన ఒకరకం చెట్టు (Bridelia retusa). పెద్దాందేలు రూ.చూ. పెద్దాముదాలు. వి. ఆముదపు గింజలలో ఒకరకం. పెద్దామదాలు రూ. చూ. పెద్దాముదాలు. వి.బ.వ. ఆముదపు గింజలలో ఒకరకం పెద్దాముదాలు రూ. పెద్దాందేలు, పెద్దామదాలు. వి.బ.వ. ఆముదం గింజలలో ఒకరకం.<పెద్ద+ఆముదము+-లు. పెద్దాయన విశే. 1. అన్నిరంగాలలోను నాయకుడు అయిన వారికి వాడేపదం; 2. వయసులో పెద్దవాడు. <పెద్ద+అయన. పెద్దారి రూ. పెద్దారె[1]. వి. కాంచనంచెట్టు. చిన్నచిన్న పనిముట్ల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు (Bauhinia-purpurea). పెద్దారికె రూ. పెద్దారుగ. వి. అరికె ధాన్యంలో ఒకరకం. <పెద్ద+అరికె. పెద్దారుగ రూ.చూ. పెద్దారికె. వి. వరకం, సస్యవిశేషం. <పెద్ద+అరుగ. పెద్దారె[1] రూ.చూ. పెద్దారి. వి. కాంచనంచెట్టు, చిన్నచిన్న పనిముట్ల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు. (Bauhinia purpurea). పెద్దారె[2] వి. గట్టికలపనిచ్చే ఒకరకం చెట్టు (Bauhinia variegata). పెద్దిచ్చె వి. నాగటి మోకు మొదటికొన మెలితిప్పి వేసినముడి (దీన్ని మేడికి తగిలిస్తారు). పెద్దింటమ్మ వి. ఒకానొక గ్రామ దేవత. <పెద్ద+ఇల్లు+-ఇ[13]+అమ్మ. పెద్దింటివాఁడు విశే. 1. గొప్పింటికి చెందినవాడు; 2. మాదిగవాడు.<పెద్ద+ఇల్లు+-ఇ[13]+వాఁడు. పెద్దిల్లు వి. 1. పూజ్యగృహం: 2. వివాహగృహం; 3. పూజాగృహం. <పెద్ద+ఇల్లు. పెద్దీడుముంత వి. పెళ్ళి మొ. శుభకార్యాల్లో వంటపొయ్యిల దగ్గర పసుపు కుంకుమ రాసి పూజచేసి పెట్టిన నీటికడవ. <పెద్ద + ఈడు + ముంత. పెద్దీత వి. ముప్పై నలభై అడుగుల ఎత్తు పెరిగే వృక్ష విశేషం.(P. Sylvestris). <పెద్ద + ఈత. పెద్దులవ వి. ఉలవలలో ఒకరకం. <పెద్ద+ఉలవ. పెద్దూదర వి. ఊదరలో ఒకరకం కలుపుమొక్క <పెద్ద + ఊదర. పెద్దూదలు వి బ.వ. ఒకరకం ధాన్యం. <పెద్ద+ఊదలు. పెద్దూబ వి. ఉప్పు గడ్డి. <పె+ఊర్దబ. పెద్దేగి రూ. పెద్దేగె. వి, ఏగిచెట్టు జాతికి చెందిన ఒకచెట్టు. < పెద్ద + ఏగి. పెద్దేగి రూ.చూ. పెద్దేగి వి. జాతికి చెందిన ఒకచెట్టు. పెద్దేటికొంగ వి. గూడకొంగ. <పెద్ద + ఏఱు+-ఇ[13] + కొంగ. పెద్దోడ రూ. పెద్దవాడ. వి. ధాన్యం నిల్వచేయటానికి మూతి వెడల్పుగా నాలుగు వలయాలు కలిపిచేసిన నిలువెత్తు మట్టిపాత్ర. పెద్దోవి రూ.చూ. పెద్దదోనె. వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు. పెద్ద్రక్. వి.బ.వ. పెద్దలు. అహదనకర గానసం. క్రీ.శ. 847. పెద్దోతి రూ.చూ. పెద్దధోతి. వి. పన్నెండు మూరల పొడుగు నేసినపంచె.

పెద్దలు చూ. పెద్ద. వి.బ.వ. 1. వృద్ధులు. భార. ఉద్యో. 2.250; 2. మృతిపొందిన పితృవర్గంవారు, పూర్వులు. నె.గా. దర్శి 52. శ. 1619.

పెద్దాకుచెట్టు చూ. పెద్ద.

పెద్దాచివ్నాలేకుందు చూ. పెద్ద.

పెద్దాట్రగడ్డ చూ. పెద్ద.

పెద్దాణెము చూ. పెద్ద.

పెద్దాందేలు చూ. పెద్ద.

పెద్దాపురంపట్టు వి. పెద్దాపురంలో బట్టల నేతకు వాడే పట్టు.

పెద్దాపురంసిలుకు వి. పెద్దాపురంలో బట్టల నేతకు వాడే పట్టు. ఇం. *Silk* ఒకరకం పట్టు. <పెద్దాపురం+ఇం. Siik.

పెద్దామదాలు చూ. పెద్ద.

పెద్దాముదాలు చూ. పెద్ద.

పెద్దాయన చూ. పెద్ద.

పెద్దారి చూ. పెద్ద.

పెద్దారికె చూ. పెద్ద.

పెద్దారుగ చూ. పెద్ద.

పెద్దారె[1] చూ. పెద్ద.

పెద్దారె[2] చూ. పెద్ద.

పెద్దాపురి వి. పెద్దాపురంలో చేయబడిన చక్కెర.

పెద్ది[1] వి. 1. పెద్దమ్మ, అమ్మ అక్క ; 2. పెద్దతండ్రిభార్య. క. పెద్ది. గొప్పవాడు, పెద్దవాడు, పెద్ద, జ్యేష్ఠుడు ముందువాడు; గోం. పేడి. అమ్మకి అక్క, తండ్రి అన్న గారి భార్య, పేపి. తండ్రికి అన్న : కుఇ. (పేన్డ. తండ్రికి అన్న, ముత్తాత, పెరొ. తండ్రికి పెద్దవదిన, అవ్వ : కొలా. పెరామా. అమ్మకి సోదరి, పెరెన్డా. తండ్రి అన్న ; నా. పేప. అమ్మకి అక్క.

-పెద్ది[2] వి. గౌరవవంతమైన బ్రాహ్మణ నామాంత్య బిరుద

పదం. ద.హిం.గా.సంపు. 10, గా.సం. 281, క్రీ.శ. 1284.

పెద్దిచ్చె చూ. పెద్ద.

పెద్దింటమ్మ చూ. పెద్ద.

పెద్దింటివాఁడు చూ. పెద్ద.

పెద్దిల్లు చూ. పెద్ద.

పెద్దీదుముంత చూ. పెద్ద.

పెద్దీత చూ. పెద్ద.

పెద్దులవ చూ. పెద్ద.

పెద్దూదర చూ. పెద్ద.

పెద్దూదలు చూ. పెద్ద.

పెద్దూబ చూ. పెద్ద.

పెద్దేగి చూ. పెద్ద.

పెద్దేగె చూ. పెద్ద.

పెద్దేటిగొంగ చూ. పెద్ద.

పెద్దోర చూ. పెద్ద.

పెద్దోవి చూ. పెద్ద.

పెద్రోళ్ చూ. పెద్ద.

పెద్దోతి చూ. పెద్ద.

పెన్ రూ.చూ. పెను. విశ.ద్రు. **1.** పెద్ద. భార.ఉద్యో. **3**.145 ; **2.** దట్టమయిన. భార.ద్రోణ. 2.239 ; **3.** గొప్ప. మను. 5.80.

పెంజిలువ్రోలు(-చిలువప్రోలు) వి. భోగవతి, పాతాళ లోక ప్రధాన నగరం. అచ్చ.రా.బాల. 81. పెంజీకటి (-చీకటి) వి. గాఢాంధకారం, కారుచీకటి. భాగ. 8.75. పెంజెఱువు(-చెఱువు) వి. పెద్దచెరువు. E.I.VI. 36 పెండర (-దర³) వి. పెద్ద కొయ్యత్రాసు. కాటా. విక్ర. 1.119 ; విశ. మిక్కిలి సమానం. పెందరాళే చూ. పెందలకడ. అవ్య. వేగంగా. పెందలకడ రూ. పెందలకాడ, పెంద లాడ, పెందలాడి, క్రి.విశ.ద్రు. పొద్దుపోక మునుపు. ఆము. 1.18. పెందలకాడ రూ.చూ. పెందలకడ. క్రి.విశ. ద్రు. ప్రొద్దుక్రుంకకముందు. పెందలాడ రూ.చూ. పెందల కడ. క్రి.విశ.ద్రు. పొద్దుపోక ముందు. పెందలాడి రూ.చూ. పెందలకడ. క్రి.విశ.ద్రు. ప్రొద్దు ఉండగనే. పెందళ్కు (-తళ్కు) వి. పెద్ద మెరుపు. పెందారి(-దారి) వి. రాచబాట. పెందిరువడి(-తిరువడి) రూ.చూ. పెద్దిరువడి. వి. మహాభక్తుడు, గరుత్మంతుడు. పెద్దిరువడి(-తిరువడి) రూ. పెందిరువడి. వి. గరుత్మంతుడు. ఆము. 4.10. త. పెరియ. పెద్దవాడైన, తిరు. శ్రీ, పూజ్యమైన, అడి. పాదం కలవాడు, పెద్ద పూజ్య పాదుడు అని గరుత్మంతునికి పేరు. < పెన్ + త. తిరువడి. పెందుఱుము(-తుఱుము) వి. పెద్ద కొప్పు. రసిక. 3.155. పెందూళి వి. దట్టమైన దుమ్ము. భార.ద్రోణ. 2 239. సం. ధూళి-. దుమ్ము. < పెను + సం. ధూళి-. పెందెర(-తెర) వి. **1.** పెద్దతెర, పెద్దజవనిక. శృం.నై. 6.108 ; **2.** గొప్పఅల, మహా తరంగం. మను. 5.80. పెందెరువు(-తెరువు) వి. రాజ మార్గం, పెద్దబాట. భార.ఉద్యో. 3.145. E.I. సంపు. 5. గా.సం. 10. క్రి శ. 1102. పెందెవులు(-తెవులు) వి. పెద్దరోగం. పెందొర(-తొర) వి. పెద్దతొర, ఊరుమూలం, ఊరు పూర్వభాగం. దశా. 2.269. పెంద్రోవ(-త్రోవ) వి. **1.** రాజమార్గం, రచ్చ. శృం.నై. 4.123 ; **2.** మోక్ష మార్గం, ముక్తిపథం. భాగ. 10 పూ. 955. పెన్నరవులుఁగు (-వరపులుగు) వి. కురం, పక్షివిశేషం. పెన్నాటకము(-నాట కము) వి. **1.** అతిశయం, ప్రాచుర్యం. కాశీ. 7.185 ; **2.** గొప్ప నర్తనం ; **3.** మహా నాటకం. పెన్నాటకముసేయు స.క్రి. విస్తరించి చెప్పు, అతిశయించు. భీమ. 1.88. సం. నాటక-. రూపకభేదం. < పెన్ + సం. నాటక- + -ము + చేయు. పెన్నిక్క వి. **1.** గొప్ప స్థానం. వైజ. 1.104 ; **2.** ఉనికి, నివాసం. < పెన్ + ఇక్క. పెన్నిట్ట (-విట్ట) వి. పెద్ద ప్రవాహం. భార.విరా. 5.402. పెన్నిదుర(-విదుర) రూ.చూ. పెన్నిద్దుర. వి. **1.** పెద్ద నిద్ర, దావు ; **2.** గాఢనిద్ర. పెన్నిద్దుర(-విద్దుర) రూ. పెన్నిదుర. వి. **1.** పెద్దనిద్ర, దావు కను. 4.40. పెన్నిధానము వి. గొప్ప నిధి. శృం.నై. 2.75. సం. నిధాన-. నిధి. < పెన్ + సం. నిధాన- + -ము. పెన్నిధి వి. **1.** పెద్ద నిక్షేపం, గొప్ప పాతర, విక్ర. 1.192 ; **2.** భొక్కసం. సం. నిధి-. నిక్షేపం, పాతర. భొక్కసం. < పెన్ + సం. నిధి-. పెన్నీరు(-వీరు) రూ. పెనునీరు. వి.బా. **1.** ఎక్కువనీరు. రామాభ్యు. 6.125 ; **2.** సముద్రం. పెన్నుద్ది వి. పెద్ద ప్రతిస్పర్థి, పోటీచేసేవారి నాయకుడు. బసవ. 3 906. < పెన్ + ఉద్ది. పెన్నెఱుల వాఁడు(-వెఱులవాఁడు) విశ. పెద్ద వెంట్రుకల వాడు. ఆం.భా. 2.119. పెన్నెఱులు(-వెఱులు) వి.బ.వ. పెద్ద వెంట్రుకలు. శృం.నై. 6.44. పెన్పులుగ(-పులుఁగు) వి. గరుత్మంతుడు. పాండు. 4.294. పెన్మంగ వి. వృక్షవిశేషం. హంస. 4.9. పెంబోతు రూ. బంబోతు. వి. మిక్కిలి బలిసిన వాడు, బలిష్ఠుడు. ఆము. 6.24.

పెన రూ. పిని. వి. **1.** (పాము) చుట్ట, బంధం. భాస్క.రా. యు. 627 ; **2.** మెలి, మెలిక. పాండు. 1.126 ; **3.** గుద్దులాట, నియుద్ధం. ఆం.భా. 2.222 ; **4.** రెండు పశువుల్ని చేర్చి కట్టే కట్టు, లంకె.

క. పెణె. కలుపు, రెండు వేర్వేరు వస్తువుల్ని కలిపి కట్టు, మెలి ; తుళు. పెతలి. తాడుపేను.

పెనగడి రూ.చూ. పెనగాడి. వి. పొలంచుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం. పెనగాడి రూ. పెనగడి. వి. పొలంచుట్టూ వేసిన కంచెకు కొయ్యలతో అమర్చిన ద్వారం. పెనగిట్ట రూ. పెనగెట్టె. వి. కొనలు ఒక దాని కొకటి ఎక్కిన గిట్ట. పెనగెట్టె రూ.చూ. పెనగిట్ట. వి. కొనలు ఒకదాని కొకటి ఎక్కిన గిట్ట. పెనపడు(-పడు) అ.క్రి. పని చిక్కులలో పడు. పెనపెట్టు(-పెట్టు) స.క్రి. పిరిపెట్టు, మెలివేయు. క్రీడా. 1.223. పెనవేయు స.క్రి. **1.** మెలిపెట్టు ; **2.** పశువుల్ని ఒకదానితో ఒకటి చేర్చి బంధించు, లంకెవేయు. పెనవైచు స.క్రి. మెలిపెట్టు, శుక. 2.259.

పెనంరాయి చూ. పెనము.

పెనంరేకల్లు చూ. పెనము.

పెనక రూ.చూ. పెరకము. వి. **1.** కప్పుగల పంచ, పంచ చివరి భాగం ; **2.** పూరింటి చూరు ; **3.** వెంకెల సమూహం.

**పెనక పెనకం** వి. అరక కట్టడంలో ఒకరకం మోకు పన్నకం. **పెనక్కత్తి** వి. కంప మండలు నరికే మొద్దుకత్తి

**పెనక్కత్తి** చూ. పెనక.

**పెనఁకువ** చూ. పెనఁగు.

**పెనఁకువలుగొను** చూ. పెనఁగు.

**పెనఁకువ వితములు** చూ. పెనఁగు.

**పెనఁగప్పు** చూ. పెనఁగు.

**పెనఁగఁబడు** చూ. పెనఁగు.

**పెనఁగాడు** చూ. పెనఁగు.

**పెనఁగియాడు** చూ. పెనఁగు.

**పెనఁగు** అ.క్రి. **1**. కూడు, కలయు. భార. ఆది. 4.21 ; **2**. (స్త్రీ పురుషులు) కలియు, సంభోగించు. భార. ఆది. 5.49 ; **3**. పోరు. యుద్ధంచేయు. భార. ఆది. 5.164 ; **4**. పెనగొను, మెలిగొను, చిక్కుపడు. కు.సం. 3.26 ; **5**. ప్రబలు, అతిశయించు. కు.సం. 6.66 ; **6**. గుంజులాడు, లాగులాడు. కు.సం. 9.51 ; **7**. (లాంగిక) పెంకితనంచేయు. భార. విరా. 1.95 ; **8**. ఎదురాడు, మారాడు. రుక్మాం.చ. 5.161 ; **9**. అలంకొను, వ్యాపించు. విష్ణుపు. 8.115 ; **10**. శ్రమపడు, ప్రయాసపడు. ఆము. 6.28 ; **11**. అంటు, పట్టు, నాటు. పాండు. 5.217 ; **12**. ఆస్థపడు. దశా. 2.296 ; స.క్రి. **1**. (రతిలో) కూడు, కలియు. భార. ఆది. 5.53 ; **2**. చుట్టుకొను. భార. ఆది. 5.220 ; **3**. ప్రార్థించు. కు.సం. 10.171 ; **4**. తలపడు. శాకు. హరి. ఉ. 3.110 ; వి. పెనకువ, పెనగులాట. కు.సం. 6.18.

క. పెణగు, హెణగు, పెణసు. దెబ్బలాడు, యుద్ధం ; త. పిణఙ్కు. (పిణఙ్కి-). దగ్గరగా చేర్చబడు, ఒకదానితో ఒకటి నులుపు, వివాదంలో ఉండు, పిణక్కు (పిణక్కి-). తొందరచేయు, మెలిపెట్టు, పిణఙ్కుక. చిక్కులోపడు, దెబ్బలాడు. పిణక్కుక. చిక్కులోపడు, వివాదంలోపడు, పిణక్కమ్, పిణక్కు. మెలి, ఒకదానితో ఒకటి కలసిఉండు, తగవు ; మ. పిణయుక. చిక్కులోపడు, ఒకరిని బాగుచేయటానికి బాధపడు, పిణచ్చల్. తగవు, పిణెక్క. కలిపికట్టు, బంధం, వలలో తగిలించు, పిణఙ్ఙుక, చిక్కులోపడు, తగవు, యుద్ధం, పిణక్కుక. చిక్కుకొను. వాదంలోఉండు, పిణక్కమ్, పిణక్కు. లస్థిమితం, తగవు, యుద్ధం ; కో. పి.ణ్-. (పి.ణొ-). చిక్కుపడు (తాడు, మల్లుల కాళ్ళు), పిణొ.-. (పి.ణొ). మెలిపడు (తాడు) చిక్కు ; గోం. పిఅఙ్గ్. మెలిపెట్టు ; కువి. పితలి. తాడు మెలిపెట్టు ; బ్రా. పిన్నింగ్. మెలిపడు, పిడిన్గ్. చుట్టుకొను, మెలితిరుగు.

మూ. ద. ద్రా. & మూ. మ. ద్రా. *పిణ్-అఙ్క్/ *పిణ్-అక్క్-.

**పెనఁకువ** రూ. పెన్కువ. వి. **1**. (స్త్రీ పురుషుల) కలయిక, కూటమి. భార. విరా. 2.233 ; **2**. యుద్ధం, పోరు. భార. ఉద్యో. 3.19 ; **3**. సమ్మేళనం, కూడిక. భార. శాంతి. 4.332 ; **4**. వివాదం, తగువు, వ్యవహారం, వ్యాజ్యం. విజ్ఞా. 3.31 ; **5**. మెలిగొనటం, చుట్టుకోవటం, అల్లిక, మెలి, మెలిక. వసు. 1.127 ; **6**. ఆసక్తి, శ్రద్ధ. యయా. 1.93 ; **7**. పెనగులాట, లాగులాట, నియుద్ధం. అచ్చ.రా. కిష్కిం. 40 ; **8**. బాలక్రీడా విశేషం. ఇందు. 2.18. **పెనఁకువలుగొను(-కొను)** అ.క్రి. మెలిపడు, చిక్కుపడు. భాగ. 8.396. **పెనఁకువ వితములు** వి.బ.వ. బాలక్రీడా విశేషం. ఇందు. 2.18. **పెనఁగప్పు** అ.క్రి. పెనగొను, దట్టమగు. కు.సం. 5.148. <పెనఁగు+కప్పు[1]. **పెనఁగఁబడు(-పడు)** అ.క్రి. **1**. మెలిగొను, పెనవేసికొను. జైమినిభా. 5.31; **2**. అలముకొనబడు, దట్టంగా కప్పబడు. మను. 4.79. <పెనఁగు+-అ[7]+పడు. **పెనఁగాడు** అ.క్రి. పెనగులాడు. భార. ద్రోణ. 4.238. <పెనఁగు+ఆడు. **పెనఁగియాడు(-ఆడు)** అ.క్రి. పెనగులాడు. **పెనఁగులాట** వి. **1**. గుద్దులాట, నియుద్ధం. ప్రబంధ. 186 ; **2**. మెలికొనటం, అల్లుకొనటం. < పెనఁగు + -లు + ఆట. **పెనఁగులాటములు** వి.బ.వ. **1**. మెలికొనటం, అల్లుకొనటం. రాఘవ. 2.6 ; **2**. గుద్దులాట, నియుద్ధం. **పెనఁగులాడు** అ.క్రి. **1**. మల్లాడు, పోరు, గుంజు. పల్నా. 2.285 ; **2**. మెలిగొను, చిక్కుపడు. జాహ్నవి. 1.146. <పెనఁగు+-లు+ఆడు. **పెనఁగువడు(-పడు)** అ.క్రి. చేరు, కలియు. నిర్వ.రా. 10.77. **పెనఁగొను** రూ. పెన్గొను. స.క్రి. **1**. చుట్టుకొను, ఆవరించు. భార. విరా. 2.139; **2**. (రతియందు) కలియు, కూడు. ఉ.రా. 5.29 ; అ.క్రి. **1**. మెలిగొను, పిరిగొను, అల్లుకొను. భార. ఉద్యో. 2.97 ; **2**. ఒండొంటితో కలియు. భార. ద్రోణ. 2.312 ; **3**. దట్టమగు, అతిశయించు. సానంద. 4.36. <పెనఁగు+కొను. **పెనఁగొల్పు** స.క్రి. పెనగొనేటట్లు చేయు. సిం.ద్వా. 2.19. **పెనఁచు** స.క్రి. **1**. పెనవేయు, మెలిపెట్టు. భార. ఆది. 2.69 ; **2**. మెలివేసి పట్టుకొను. కు.సం. 12.70 ; **3**. కూర్చు, చేర్చు, కలుపు. శృం.నై. 6.120 ; **4**. గట్టిగాకట్టు, బంధించు. శివరా. 2.70 ; **5**. నిర్మించు. గౌ. హరి. ఉ. 1506. **పెన్కువ** రూ.చూ. పెనఁకువ. వి. **1**. (స్త్రీ పురుషుల) కలయిక, కూటమి. చంద్రాంగ. 6.151 ; **2**. యుద్ధం, పోరు ; **3**. సమ్మేళనం, కూడిక ; **4**. ఆసక్తి, శ్రద్ధ ; **5**. మెలిగొనటం, చుట్టుకొనటం, అల్లిక, మెలి, మెలిక ; **6**. వివాదం, తగవు, వ్యవహారం, వ్యాజ్యం ; **7**. పెనగులాట, లాగులాట, నియుద్ధం. **పెన్గొను** రూ.చూ. పెనఁగొను. స.క్రి. **1**. చుట్టుకొను, ఆవరించు ; **2**. (రతియందు) కలియు. కూడు ; అ.క్రి. **1**. మెలిగొను, పిరిగొను, అల్లుకొను ; **2**. ఒండొంటితో కలియు ; **3**. దట్టమగు, అతిశయించు.

**పెనఁగొను** చూ. పెనఁగు.

**పెనఁగొల్పు** చూ. పెనఁగు.

**పెనఁచు** చూ. పెనఁగు.

**పెనంవాక** చూ. పెనము.

**పెనపరి** చూ. పెనఁగు. వి. వివాదశీలుడు, జగడగొండి, వివాదశీలురాలు. జైమినిభా. 2.111.

**పెనపు** చూ. పెనయు.

**పెనపులఁబెట్టు** చూ. పెనయు.

**పెనము** రూ. పెణం, పెనుము, పెనెం, పెన్నెం, పేనం, పేనాం. వి. **1**. దోసెలు మొ. వాటిని కాల్చే ఇనపరేకు,

స్వేదని. కు.సం. 6.155 ; **2.** చెరకురసం మొ. వాటిని కాచటానికి ఉపయోగించే పెద్ద ఇనపపాత్ర. ఉ.రా. 3.323 ; **3.** మట్టిపాత్ర ; **4.** కుండలమీద మూతగా వాడే గుండ్రని సల్లరాయి.

సం. పణ-. విపణి, బజారు, పందెం, జూదమాట.

<సం. పణ-.

పెనంరాయి వి. రొట్టె పెనాలు నర్సటానికి వాడే రాయి. పెనంరేకల్లు వి. వేపడుకు వాడే మట్టిపాత్ర. పెనంవాక వి. కంచం ఆకారంలో కూరలు వేపకోవటానికి వాడే చిన్న మట్టి పాత్ర పెనాల్రాయి రూ.చూ. పెనాల్రాయి. వి. రొట్టె పెనాలు నర్పడానికి వాడే రాయి. పెనాల్రాయి రూ. పెనాల్రాయ. వి. రొట్టె పెనాలు నర్సటానికి వాడే రాయి.

పెనయు చూ. పెనఁగు. అ.క్రి. కలియు, కూడు, పెనగు. ఉ.హరిశ్చ. 3.104.

క. పెణె హెణె. ఒకదానితో ఒకటి నులువు, మెలిపెట్టు, కలుపు. పిణిల్. జుట్టు అల్లిక ; త. పిణై (-వ్ -, -న్త్-). మెలిపడు, కలియు, తొందరచేయు. కట్టు, పిణౌ(-ప్పు-, -త్త్-). కట్టు, కలుపు. పిణిప్పు. చేర్చి కట్టు, కట్టు, స్నేహం ; మ. పిణయుక. మెలిపెట్టబడు, పిణెక్క. రెండిని కలిపికట్టు ; తో. పిణ్-(పిణా-). మెలిపెట్టబడు, పిణ్థ్. మెలిపడు ; తొ. పిన్-(పిన్య్-). (జుట్టు)జడలు కట్టు, బుట్ట అల్లు ; కువి. పెత్-. రాడు పేను ; బ్రా. పిన్న్. మెలిపడు.

మూ.ద.ద్రా. *పిణ్-అ, *పిణ్- అఙ్-.

మూ.ద్రా. *పిణ్-.

పెనపు స.క్రి. **1.** కలుపు, కూర్చు, చేర్చు ; **2.** పెనచు ; వి. **1.** వివాదం, తగవు ; **2.** భేదం. పెనపులబెట్టు(-పెట్టు) స.క్రి. వివాదాలు పెట్టు. తాళ్ల.సం. 15.7. <పెనపు + -లు + -అ[1] + పెట్టు. పెనసుకుపోవు అ.క్రి. చాలా స్నేహంగా ఉండు.

పెనసలు రూ. పెన్సలు, పెన్సిలు. వి. సీసం ముల్లు కల రాసే పనిముట్టు.

ఇం. *Pencil.* సీసపు ముల్లుతో చేసిన రాతపనిముట్టు.

<ఇం. Pencil.

పెనసుకుపోవు చూ. పెనయు.

పెనాల్రాయి చూ. పెనము.

పెనాల్రాయి చూ. పెనము.

పెనిమిటి రూ. పెన్మిటి, పెనిమిటి. వి. మగడు. భర్త. కాశీ. 2.72. భాగ. 4.230.

మూ.ద్రా. *పెణ్. స్త్రీ.

పెను చూ. పెరుఁగు[1]. రూ. పెన్. విశే. **1.** పెద్దది, గొప్పది. భార.ఆది. 5.243 ; **2.** ఎక్కువ. నిర్వ.రా. 1.41.

పెనుకర వి. తృణవిశేషం. హంస. 5.45. పెనుకూళ్ల మారి వి. ప్రతిపోట భుజించేవాడు. పల్నా. 4.4. పెనుకొను అ.క్రి. అల్లుకొను. పెనుగువ్వ వి. ఒకజాతి అడవి పావురం. హంస. 3.13. పెనుఁగొమ్మ(-కొమ్మ) వి. చెట్టు మొదటికొమ్మ. పెనుచెవిఁబెట్టు(-పెట్టు) స.క్రి. చెడచెవిని పెట్టు, వినకపోవు పెనుతిండి వి. అబూతి, ఎక్కువ తినటం. పెనునీరు రూ.చూ. పెన్నీరు. వి.వా. **1.** సముద్రం. ఉ.రా. 1.80 ; **2.** ఎక్కువ నీరు. పెనుపంజు వి. కరదీపిక. వేంక. అం. 72. పెనుబోగి వి. **1.** శివుడు ; **2.** శిష్యుడు. పెనుమసనము వి. శ్మశానం. కాశీ. 6.124. పెను మినుకులు వి.బ.వ. వేదాలు. అం.నా.సం.దేవ. 41. అచ్చ. రా.బాల. 65. పెన్ముమాను వి. నింబం. అం.రా. 2.49. పెనుఁబాము(-పాము) వి. **1.** కొండచిలువ. భార.ఆది. 2.88 ; **2.** ఆదిశేషుడు. ద్వి. పరమ. వి. 2.114. పెనువాములు వి.బ.వ. అధికం. తాళ్ల.సం. 11.11. పెనువెల్లి వి. ప్రళయకాలంలో ఏకార్ణవం. భార. అరణ్య. 4.229. పెనుఁద్రేలు వి. బొటనవేలు. భార.ఆది. 5.243.

పెనుచు రూ.చూ. పెంచు[1]. స.క్రి. **1.** పెరగజేయు, వర్ధిల్ల జేయు, పెంచు. కు.సం. 6.30 ; **2.** ఉబ్బించు. భార.విరా. 3.79 ; **3.** సాకు. అం.రా. 3.123 ; అ.క్రి. అతిశయించు. దశా. 1.136.

పెనుపడు చూ. పెనుపు.

పెనుపరి చూ. పెనుపు.

పెనుపారు చూ. పెనుపు.

పెనుపు రూ.చూ. పెంపు. వి. **1.** వృద్ధి, అతిశయం. భార. అరణ్య. 1.213 ; **2.** మహత్త్వం, గొప్పతనం. భార. ఉద్యో. 4.222 ; **3.** పొడుగు, ఉన్నతి. భార.శల్య. 1.121 ; **4.** పెంచటం, వృద్ధిపొందించటం. భార.శాంతి. 2.189 , **5.** గర్వోక్తి. దశకు. 4.26 ; **6.** వైభవం. హరి. పూ. 3.135 ; **7.** ఒప్పిదం, అందం. ఆము. 5.30 ; **8.** సామ్యం, పోలిక. కళా. 6.224 ; విశే. **1** పెద్దది, పరిమాణాతిశయం కలది. పండి.చ. 4.259 ; **2.** బహుళం. అధిక సంఖ్యాకం. నృసింహ. 1.60 ; **3.** అధికం. గొప్పది. హరి.పూ. 2.42.

పెనుపడు అ.క్రి. అతిశయిల్లు, వర్ధిల్లు. భాస్క.రా. అరణ్య. 2. <పెనుపు + పడు. పెనుపరి రూ. పెంపరి. విశే. **1.** అధికుడు, గొప్పవాడు. భార.ఉద్యో. 3.214 ; **2.** వృద్ధి పొందించేవాడు. <పెనుపు + -అరి. పెనుపారు రూ. పెంపారు. అ.క్రి. అతిశయించు, అధికమగు. భార. విరా. 5.225. <పెనుపు + ఆరు[1]. పెనుపొందు రూ.చూ. పెంపొందు. అ.క్రి. వృద్ధిపొందు. పండి.చ. 3.543. <పెనుపు + ఒందు. పెనుపూట వి. ఒకరకం పన్నం. <పెనుపు + పూట.

పెనుపొందు చూ. పెనుపు.

పెనుపూట చూ. పెనుపు.

పెనము రూ.చూ. పెనము. వి. రొట్టె, దోసెలు మొ. వాటిని కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

పెనెం రూ.చూ. పెనము. వి. **1.** దోసెలు మొ. వాటిని కాల్చే ఇనపరేకు, స్వేదని ; **2.** చెరకురసం మొ. వాటిని కాచటానికి ఉపయోగించే పెద్ద ఇనపపాత్ర ; **3.** మట్టి పాత్ర ; **4.** కుండల మీద మూతగా వాడే గుండ్రని నల్లరాయి.

పెన్కువ చూ. పెనఁగు.

పెన్గొమ చూ. పెనఁగు.

పెన్చు చూ. పెరుఁగు¹. రూ.చూ. పెంచు¹. స.క్రి. 1. వర్ధిల్లచేయు (ఆహారాదుల్తో) పోషించు. భార.ఆది. 5.144; 2. ఉబికించు, ఉబ్బించు. భార.విరా. 3.79; 3. రక్షించు, సాకు. వసు. 4.43; అ.క్రి. పెరుగు, అతిశయించు, మించు. ఇందు. 5.75.

పెందగడియ వి. ఆకాశబాణం. కు.సం. 11.51.

పెందర చూ. పెన్.

పెందరాళె చూ. పెన్.

పెందలకడ చూ. పెన్.

పెందలకాడ చూ. పెన్.

పెందలాడ చూ. పెన్.

పెందలాడి చూ. పెన్.

పెందళ్ళ చూ. పెన్.

పెందారి చూ. పెన్.

పెందిరువడి చూ. పెన్.

పెందుఱుము చూ. పెన్.

పెందూళి చూ. పెన్.

పెందెర చూ. పెన్.

పెందెరువు చూ. పెన్.

పెందెవలు చూ. పెన్.

పెందొర చూ. పెన్.

పెంద్రపానిక రూ.చూ. పేందసానిక. వి. కింద గద్దెపెట్టి వెదల్పు అంచుతో గుంతగా చేసినట్టి మూకుడు.

పెంద్రోవ చూ. పెన్.

పెన్న చూ. పెను. వి. ఒకానొక నది, పినాకిని. భార.సభా. 1.71.

క. పెన్నె. నదీవిశేషం; త. పెణ్ణై, పెణ్ణాయ; మ. పెణ్ణాఱు;

సం. పినాకినీ. నదీవిశేషం; ప్రా. బిన్నా, వేణ్ణా. <ప్రా. బిన్నా.

పెన్నా వి. కప్పుగవాక్షుల మీద మూతగా వాడే బోకి.

పెన్ను వి. కలం, లేఖన సాధనం.

ఇం. *Pen*. కలం

<ఇం. Pen.

పెన్నె వి. నేలలో వేళ్ళను బట్టి పెరిగే పసుపుకొమ్ము.

పెన్నెం రూ.చూ. పెనము. వి. రొట్టె, దోసెలు మొ. వాటిని కాల్చటానికి వాడే గుండ్రని మట్టిపాత్ర.

పెన్నెరు రూ.చూ. పెన్నేరు. వి. ఒకరకం మొక్క, అశ్వగంధి. ఆం. భా. 2.63 (Withania somnifera).

పెన్నేరు రూ. పెన్నెరు. వి. అశ్వగంధి. హంస. 4.10. (Withania somnifera).

పెన్మిటి రూ.చూ. పెనిమిటి. వి. మగడు, భర్త. కళా. 8.140.

పెన్షన్ రూ.చూ. పించను. వి. ఉపకారవేతనం.

పెన్సలు రూ.చూ. పెనసలు. వి. సీసం ముల్లుకల రాసే సాధన విశేషం.

పెన్సిలు రూ.చూ. పెనసలు. వి. రాయటానికి వాడే సీసం పుల్ల.

పెప్పెపె మెమ్మెమె యను అ.క్రి. వచ్చీరానిమాటలాడు, ఏమీ చెప్పలేకపోవు.

పెబ్బ వి. పెద్ద.

పెంపకంవచ్చు చూ. పెంపు.

పెంపగు చూ. పెంపు.

పెంపరలాడు చూ. పెంపఱు. స.క్రి. చంపు.

పెంపరి చూ. పెంపు.

పెంపఱు చూ. పెంపు.

పెంపారు చూ. పెంపు.

పెంపారుచు చూ. పెంపు.

పెంపార్చు చూ. పెంపు.

పెంపు చూ. పెరుఁగు¹. రూ. పెనుపు, పొంపు¹. వి. 1. ఔద్ధత్యం. భార.ఆది. 2.229; 2. మహత్త్వం భార. ఆది. 3.116; 3. ఉత్సాహం, పూనిక. భార. ఆది. 4.42; 4. పోషణ. భార. ఆది. 5.102; 5. అతిశయం, హెచ్చు. భార. ఆది. 7.50; 6. గొప్పతనం. భార. అరణ్య. 1.46; 7. ఎత్తు, ఔన్నత్యం. కు. సం. 3.5; 8. గౌరవం, ఆదరం, మన్నన. భార. విరా. 1.110; 9. ప్రాశస్త్యం. శ్రేష్ఠత. హరి. పూ. 7.41; 10. ఒప్పిదం, మనోజ్ఞత. ప్రభా. 1.138; 11. విధం, రీతి. మార్క. వసు. 4.28; 12. నాశం. హ. స. 2.30; 13. కోసిన బోటనే కింద వేసిన పంటగడ్డి కట్ట; విశే. పెంపబడింది, పోషింపబడిన. యయా. 2.17.

పెంపకంవచ్చు అ.క్రి. దత్తుగా వచ్చు. పెంపగు అ.క్రి. 1. అతిశయించు, ఘనతకెక్కు. పాండు. 1.113; 2. వర్ధిల్లు, అభివృద్ధినొందు. శివధ. 5అ. <పెంపు+అగు. పెంపరి రూ.చూ. పెనుపరి. వి. అధికుడు, గొప్పవాడు. కృష్ణరా. 3 5. <పెంపు+-అరి. పెంపఱు అ.క్రి. 1. పెంపుచెడు, తక్కువపడు, కృశుడు. కు. సం. 11.20; 2. నశించు. పారి. 1.101. <పెంపు+-అఱు. పెంపారు రూ.చూ. పెనుపారు. అ.క్రి. అభివృద్ధినొందు, అతిశయించు. భార. ఉద్యో. 3.96. <పెంపు¹+అరు¹. పెంపారుచు రూ. పెంపార్చు. స.క్రి. వర్ధిల్లచేయు, అతిశయింపచేయు. విక్ర. 1.133. <పెంపు+ఆరుచు. పెంపార్చు రూ. చూ. పెంపారుచు. స. క్రి. వర్ధిల్లచేయు. అతిశయింపచేయు. పెంపుడు రూ. చూ. పొంపుడు. విశే. పెంచబడిన, పోషింపబడిన. ధనాభి. 2.61. పెంపుడుగువ్వ వి. సాకుడు పులుగు. పెంపుడుచిలుక వి. పంజరంలో ఉంచి పెంచే చిలుక. పెంపుడుఁబెయ్య (-పెయ్య) రూ. చూ. పెంపుడుఁబేయ. వి. (ఇతరులచే) పెంచబడ్డదూడ. పెంపుడుఁబేయ (-పేయ) రూ. పెంపుడుఁబెయ్య. వి. (ఇతరులచేత) పెంచబడ్డ దూడ. ద్వి. పరమ. వి. 5.48. పెంపుమీఱు అ. క్రి. అతిశయించు, ఘనతకెక్కు. భార. ఉద్యో. 4.54. పెంపెసఁగు రూ. పొంపెసఁగు. అ.క్రి. అతిశయించు, ఘనతకెక్కు. భార. విరా. 1.304. <పెంపు+ఎసఁగు. పెంపెసలారు అ.క్రి. అతిశయించు, ఘనతకెక్కు. భార. విరా. 1.192. <పెంపు+ఎసలారు. పెంపెసలార్చు స.క్రి. అతిశయింపచేయు, ఘనతకెక్కించు.

వైజ. 1.3. < పెంపు + ఎసలార్చు. పెంపేపారు అ.క్రి. అతిశయించు, ఘనతకెక్కు. హరి. ఉ. 3.88. పెంపొందు రూ. పెనుపొందు అ.క్రి. అతిశయించు. వృద్ధిచెందు. భార. ఆది. 7.42. < పెంపు + ఒందు.

పెంపెసగు చూ. పెంపు.

పెంపెసలారు చూ. పెంపు.

పెంపెసలార్చు చూ. పెంపు.

పెంపేపారు చూ. పెంపు.

పెంపొందు చూ. పెంపు.

పెంబోతు చూ. పెన్.

పెమ్మె రూ.చూ. పెరిమె. వి. దంభవచనం, బడాయిమాట. ద్వి. భాగ. 10.

పెయ రూ.చూ. పేయ. వి. తెలుపుదనం ఎక్కువకలిగిన పెరుగు.

పెయదుకంనేరు వి. పచ్చనిపూలుపూసే మొక్క (Cassia-sophera).

పెయదూడ రూ.చూ. పెయ్యదూడ. వి. ఆవుదూడ.

పెయబట్ట రూ.చూ. పయ్యెబట్ట. వి. పసెరంగు మీద మరే రంగుదైనా మచ్చ.

పెడ్వంగి వి. వర్షేటప్పుడు కట్టుకొన్న బట్టలమీద నీళ్ళు పడకుండా కుమ్మరి చుట్టుకొనే పాతబట్ట.

పెయ్య రూ.చూ. పేయ. వి. 1. ఆవు, గోవు. భార. అను. 2.427 ; 2. లేగ, దూడ. హరి. పూ. 5.206 : 3. పాలు విడిచిన ఆవుదూడ. తరపి. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 659 ; 4. తెలివిలేనివాడు ; 5. హీనుడు ; విఙ. (ఆవుదూడల్లోనూ, గేదెదూడల్లోనూ) స్త్రీజాతిది.

పెయ్యకాడు వి. కన్నె. పెయ్యదుడ్డె రూ. చూ. పెయ్య దూడ. వి. ఆవుదూడ. పెయ్యదూడ రూ. పయదూడ, పెయదూడె, పెయ్యదుడ్డె. వి. ఆవుదూడ. పెయ్యవాకుడు వి. మొహం మీద పెంట్రుకలు పైకెత్తి పెట్టినట్టు మొలచి ముందుకువంగక పోవటం. పెయ్యపచ్చడం వి. జనపనులకతో వలమాదిరి అల్లి కన్ను కన్నుకూ కుచ్చులు కట్టి పండగల్లో ఎద్దుపీపు మీద కప్పేది. పెయ్యమ్మ వి. 1. పనికిమాలినవాడు, అప్రయోజకుడు ; 2. అప్రయోజకురాలు.

పెయ్యపతీగ వి. తేనె వాసనకల తెల్లనిపూలు పూసే ఒకరకం తీగ (Combretum decandrum).

పెయ్యరేసు వి. ఒకరకం తీగ (Grewia orientalis).

పెయ్యరొట్ట[1] రూ. పెయ్యరొడ్డ[1]. వి. ముళ్ళుండే డోదికలచెట్టు, కొండవెల్లుచెట్టు (Mallotus repandus).

పెయ్యరొట్ట[2] రూ. పెయ్యరొడ్డ[2]. వి. ఒకరకం తీగ. (Grewia orientalis).

పెయ్యరొడ్డ[1] రూ.చూ. పెయ్యరొట్ట[1]. వి. ముళ్ళుండే డోదికం చెట్టు, కొండవెల్లుచెట్టు (Mallotus repandus).

పెయ్యరొడ్డ[2] రూ.చూ. పెయ్యరొట్ట[2]. వి. ఒకరకం తీగ (Grewia orientalis).

పెయ్యవేప వి. కత్తిపిడులు మొ. వాటి తయారీకి ఉపయోగపడే తెల్లని మెత్తని కలపనిచ్చే చెట్టు (Ailanthus excelsa).

పెర్ విఙ. పెద్ద. దొంగలసాని శాసనం. క్రి.శ. 991.

క. పెర్, పేర్, గొప్పతనం, పెద్దతనం ; తు. పెరి, పెరియ. పెద్దదైన, గొప్పదైన ; త. పెరు, పెరుమ్, పేర్ ; కొం. పెర్, పెరి. పెద్ద ; నా. పెరు. ఎక్కువ ; బ్రా. పిరిగ్. పెద్ద.

< మూ.ద్రా. *పెర్.

పెర[1] వి. తేనెపట్టు, మధుకోశం. రం. రా. యు. 284. పు. 2 పం.

తు. పెర్మె. పెద్దతేనెటీగ, పెరియనెయి. తేనె ; త. పిరచమ్. తేనె, తేనెపట్టు, తేనెటీగ, కుమ్మరి పురుగు, పెరున్తేన్. తేనెటీగలచేత పోగుచేయబడ్డ తేనె, పెద్ద తేనెటీగ ; తొ. పెస్టొ. న్. తేనెటీగ ; కొలా. పెర. ఒకరకం తేనెటీగ, పెరతట్టు. తేనెపట్టు, పెరాపాత్తె. తేనెటీగ.

పెరతేనియ రూ. పెరతేనె. వి. పట్టుతేనె, మధువిశేషం. కాశ. 3.51. పెరతేనె రూ.చూ. పెరతేనియ. వి. పట్టుతేనె, మధువిశేషం. ప్రబంధ. 112. పెరయీగ(-ఈగ) వి. ఒకానొక జాతి తేనెటీగ. (పెర నిర్మించే తేనెటీగ). భార. ద్రోణ. 1.288. పెరయీగల పగిదివి(-ఈగల పగిదివి) అవ్య. ప్రదు. అధికంగా. హంస. 3.29.

పెర[2] వి. 1. భూమికొలత ; 2. కానిలో నాలుగోవంతు; దాదాపు 1¼ సెంటు.

పెరక రూ. పెరకవ. వి. పెంకు, పెంచు.

క. హెంజ్చు, హంజ్చు, అంజ్చు. పెంకు ; కొడ. అంజ్చు, హంజ్చు ; మాల్తొ. పద్క. ఇంటికప్పు.

పెరకవ రూ.చూ. పెరక. వి. తొక్కుడు. గోడ కట్టేటప్పుడు మనుమందు పెంచుకోటానికి పీలుగా ముందుకు పొడుచుకొని వచ్చేటట్లు పేర్చిన పెచ్చురాయి.

పెరగబట్టు చూ. పెరుగు[1].

పెరజు వి. సర్ప విశేషం. సిం.ద్వా. 8.98.

పెరటిగుమ్మం చూ. పెరడు.

పెరటిచెట్టు చూ. పెరడు.

పెరటిచెట్టుమందు చూ. పెరడు.

పెరటివట్టు చూ. పెరడు.

పెరద రూ.చూ. పేరడు. వి. 1. దొడ్డి, ఇంటివెనక స్థలం ; 2. చేను.

పెరడు రూ.చూ. పేరడు. వి.దా. 1. ఇంటి వెనకదొడ్డి. పి.శకు. 4.4 ; 2. చేను.

పెరటిగుమ్మం రూ. పెరడుగుమ్మం. వి. దొడ్డివాకిలి. ఇంటి వెనుకనున్న ద్వారం. పెరటిచెట్టు వి. 1. ఇంటివెనక దొడ్డిలోని చెట్టు ; 2. అతి చనువువల్ల గౌరవంలేదు అనటానికి ఉపయోగించే పలుకుబడి. పెరటిచెట్టుమందు వి. పనికిరానిది అనటంలోని పలుకుబడి. దుర్గ్యా.చ. 4.20. పెరటివట్టు వి. పెరటిస్థలం. ద.హిం.గా. సంపు. 5. గా.సం. 145. క్రి.శ. 1835. పెరడుగుమ్మం రూ.చూ. పెరటిగుమ్మం. వి. దొడ్డివాకిలి, ఇంటి వెనుకనున్న ద్వారం.

పెరయు అ.క్రి. కలియు, అంటు, వ్యాపించు. హర. 7.170.

క. పెఱ్, పెఱు. పొందు, లాభం ; తు. పేతు. ప్రసవం, పరిటి పడక, పెడికెక్క. పుట్టుక ; క. పెఱు. పొందు

కలిగియుండు; మ. పెఱుక. కలిగియుండు; తొ. పె.ర్, పె.ర్ఫ్. పెఱ్ఫ్. కోరవట్టుప; పర్జి. పెద్.

పెరరేఁచు రూ.చూ. ప్రేరేఁచు. స.క్రి. ప్రేరించు, పురికొల్పు. జైమినిభా. 6.215.

పెరరేఁపు స.క్రి. ప్రేరించు, పురికొల్పు.

పెరరేపకుఁడు వి. ప్రేరేపించేవాడు. శాశ్వ.నం. 5.228.

సం. ప్రేరేపక-. ప్రేరేపించేవాడు, రెచ్చగొట్టేవాడు.

<సం. ప్రేరేపక-.

పెరరేఁపన వి. ప్రేరేపన. శాశ్వ.సం. 6.190.

పెరరేఁపు చూ. పెరరేఁచు.

పెరలాడు రూ.చూ. పొర్లాడు. అ.క్రి. పొరలాడు. యయా. 2.35.

పెరవణి రూ.చూ. పేరణము[1]. వి. నృత్యవిశేషం. ప్రబు. 2.13.

పెరవలిమానురోలు వి. ఎవరైనా ఉపయోగించుకునేది. పెరవలి గ్రామనామం.

పెరసు వి. 1. పొలం; 2. మాంసం.

క. పిఱి, పిఱు. మాంసం, కండ.

పెరికమచ్చ వి. గౌరవర్ణపు మచ్చ.

పెరిమ వి. ప్రేమ, అనురాగం. హర. 7.189.

సం. ప్రేమన్. అనురాగం; ప్రా. పిమ్మం, పెమ్మం. పేమం; జైమహా. పిమ్మ, పెమ్మ; గు. పెమ్మా; అ.మా. పిమ్మ, పెమ్మ, పేమ; పా. పేమం; అప. పెమ్మ.

<సం. ప్రేమన్.

పెరిమిటి రూ.చూ. పెనిమిటి. వి. పెనిమిటి.

పెరిమె రూ. పెర్మె. వి. 1. గొప్పతనం, ఘనత. శేయా. 3.147; 2. ప్రసిద్ధి, ఖ్యాతి. కాశీ. 6.116; 3. ప్రాశస్త్యం, శ్రేష్ఠత్వం. కాశీ. 7.185.

క. పెర్మె, హెమ్మె. పెరుగుదల, గొప్పతనం, గౌరవం; తు. పెర్మె; త. పెరుమై. గొప్పతనం, పెద్దగా ఉండటం. ఉదాత్తత, పెమ్మాన్. దేవుడు, గొప్పవాడు.

<క. పెర్మె.

పెరియ విశే. పెద్ద. పెద్దమల్లియపూడి శాసనం. క్రి.శ. 945-46.

కొడ. పెరియ. పెద్ద, గొప్ప; త. పెఱియ. పెద్ద, గొప్ప, పెఱియర్, పెఱియోర్. పెద్దవారు, గొప్పవారు; మ. పెఱియ.

పెరియతిరువడి చూ. తిరువడి. వి. గరుడుడు. త. పెరియ-తిరు-వ్-అడి. గరుడ. <త. పెరియ-తిరు-వ్-అడి. పెరియపిరాట్టి వి. లక్ష్మి: త. పెరియపిరాట్టి. విష్ణువు పట్టపురాణియైన లక్ష్మి. <త. పెరియపిరాట్టి.

పెరిషించు స.క్రి. నశింపచేయు.

ఇం. *Perish*. నశింపచేయు.

<ఇం. Perish + -ఇంచు[3].

పెరిస్తు రూ.చూ. పెహరిస్తు. వి. జాబితా, పట్టీ.

పెరుకు రూ.చూ. పెఱుకు[1]. స.క్రి. 1. ఇగ్గు, ఉజ్జు, ఈను, ఊర్చు; 2. గుంజు, చేదు, లాగు, పైకిలాగు.

పెరుకూర చూ. పెరుగు.

పెరుగు రూ.చూ. పెరుఁగు[2]. వి. దధి.

పెరుకూర వి. తోటకూర రకాల్లో ఎక్కువ కూర దినుసుగా ఉపయోగించే రకం. పెరుగుతోటకూర రూ.చూ. పెరుఁగు తోఁటకూర. వి. తోటకూర రకాల్లో ఎక్కువ కూర దినుసుగా ఉపయోగించే రకం (A. Gamgeticus). పెరుగుతోటకూర రూ.చూ. పెరుఁగు తోఁటకూర. వి. తోట కూర రకాల్లో ఎక్కువ కూర దినుసుగా ఉపయోగించే రకం.

పెరుఁగాకు చూ. పెరుఁగు[2].

పెరుఁగు[1] రూ. పెరువు[1], పెర్గు[1], పెర్వు[1]. పెఱుఁగు[1]. అ.క్రి. 1. (వయఃప్రమాణాదుల్లో) ఎదుగు, వర్ధిల్లు, పెంపొందు. భార. ఆది. 3.12; 2. ఉప్పొంగు, ఉత్సహించు. భార. ఆది. 6.148; 3. పూను, ఉద్యమించు. భార.ఆది. 6.203; 4. కలుగు, పట్టు. భార. ఉద్యో. 2.197; 5. తెగు, చిన్న మగు. పారి. 4.37; 6. బండిమీద దొప్పపేర్పు; విశే. 1. ఏళ్ళు చెల్లినవాడు, ఏళ్ళు చెల్లిన; 2. వృద్ధిపొందిన.

క. పెర్చు. పెచ్చు, హెచ్చు, ఎచ్చు. లావుగా అగు, పెరుగు, వాచు, గర్వంగా అగు, పెర్చిసు, పెచ్చిసు. పెరిగేటట్లు చేయు, రెట్టింపు చేయు; కొడ. పెరి-. (పెరిప్-, పెరిత్-). పెరుగు (పశుపులు, ధనం); తు. పెర్చుని, పేర్చుని, హెచ్చుగు, ఎగయు, పైకెత్తు, పెర్గుని. పెరుగు, హెచ్చుగు, హెచ్చుని, హెచ్చావుని. పెరుగు, హెచ్చుగు, అభివృద్ధి, విశాలమగు; త. పెరు (-ప్ప్-, త్-). మందంగా పెరుగు, పెద్ద, లావు, రెట్టింపగు, పెరుకు (పెరుకి-). సంఖ్యలు పెరుగు, రెట్టింపగు, నిండు, పొర్లు, వాచు, పెరుక్కు, (పెరుక్కి-). పెరిగేటట్లుచేయు, వాచే టట్లు చేయు; మ. పెరుకుక. పెద్దగా పెరుగు, రెట్టింపగు, పెరుక్కుక. రెట్టింపగు, ఎక్కువగా పెరుగు, మందంగా పెరుగు, హెచ్చుగు, పెరుక్క. హెచ్చవటం, నదిలో నీరు పొర్లటం; కో. ఎచ్. సంఖ్యలో పెరుగు; తొ. పెక్స్-, (పెక్స్య్-). లావుగా అగు; గోం. పిర్రానా. ముందుకు తోయు, పెరుగు, పిరిన. పెరుగు (మొక్కలు), పెర్సానా. పెంచు, వ్యాపించు; కొం. పిర్. పెరుగు, పిర్ప్. పెరిగే టట్లు చేయు; కుఇ. బెరిబెరిఇన్బ. వాచు. ఆకారంలో పెరుగుదల; కువి. పద. అయియలి పద్దఅనై, ప్లినై. పెరుగు; కొలా. పెర్గ్-. (పెరెక్-). పెరుగు, పెర్ప్- (పెరెప్-). పైకెత్తు, పెర్గిప్- (పెర్గిప్-). పెరిగేటట్లు చేయు; నా. పెర్గ్. పైకి పెరుగు, పెర్ప్. పైకెత్తు; కుర. పర్దనా. సంఖ్యలో పెరుగు, వయసు, అభివృద్ధి; బ్రా. పిరిన్గ్. వాచు (శరీరం, అవయవాలు).

మూ.ద.ద్రా. & మూ.మ.ద్రా. *పెరుక్-.

<మూ.ద్రా. *పేర్-/ *పెర్-వ్-.

పెరగబట్టు(-వట్టు) స.క్రి. సాకెక్కర చేసిన తర్వాత కోలులో నుంచి వాటకు కావలసిన ఆహారాన్ని పైకిలేపు. పెరుఁగుడు వి. వృద్ధి. ఆం.భా. 2.190. పెరుఁగుదల(-తల[4]) వి. వృద్ధిపొందటం.

పెరుఁగు[2] రూ.చూ. పెరువు[2]. వి. దధి. చేమిరి వేయగా తోడు కొన్న పాలు. కాశీ. 4.115.

పెరుఁగాకు వి. పెరుగు తోటకూర. <పెరుఁగు2 + ఆకు. పెరుఁగుతోఁటకూర రూ. పెరుగుతోటకూర, పెరుగు దోట

కూర, పెఱుకు తోటకూర. వి. పెరుగులా మృదువైన తోటకూర. ఆం.భా. 2.73. పెరుగువడ వి. ఆమవడ, పెరుగులో నానవేసిన వడ. పెరుగుసంద్రము వి. పెరుగు కడలి.

పెరుమాకోయిల వి. ఒకానొక పుణ్య క్షేత్రం, కాంచీపురం. కాశీ. 5.288.

త. పెరుమాళ్-కొవిల్. విష్ణువు కోవెల, చిన్న కాంచీపురం, పెరుమాకోయిల్. (వ్యవహారం).

<త. పెరుమాకోయిల్.

పెరుమాళ్లడుగుబుగ్గ చూ. పెరుమాళ్లు.

పెరుమాళ్లు వి.బ.వ. దేవుడు, విష్ణువు. ద.హిం.గా. సంపు. 4.710, పరమ. 2.178.

త. పెరుమాళ్. చేరరాజుల బిరుదు, ఉన్నత వ్యక్తి. విష్ణువు, దేవుడు; మ. పెరుమాళ్.

<త. పెరుమాళ్.

పెరుమాళ్లడుగు బుగ్గ వి. ఆకాశగంగ, విష్ణుపాదం నుంచి పట్టిన ఏరు. సాంబ. దేవ. 16. < పెరుమాళ్లు + అడుగు[1] + బుగ్గ. పెరుమాళ్లమాడు వి. ఆపబొద్దు. త. మాటు. ఎద్దు.

పెరుంపల్లి వి. మోక్షమార్గం. విశాఖపట్నం శాసనం. క్రీ.శ. 1090.91.

త. పెరు-వళి. మోక్షపథం; మ. పెరు-వళి.

పెరుంబడి వి. విపణి మార్గం. ద.హిం.గా. సంపు. 10. గా.నం. 651. క్రీ.శ. 1091.

క. పెర్పట్టి. పెరుగువారి, విపణి మార్గం.

పెరుంబొత్తు వి. నుపరు, నున్నన, చదును.

పెరువు[1] రూ.చూ. పెరుగు[1]. విశే. 1. ఏళ్లు చెల్లినవాడు, వృద్ధుడు, వృద్ధురాలు. కాశీ. 2.163; 2. పెరిగిన, వృద్ధి పొందిన. రాజవా. 2.46. అ.క్రి. ఎదుగు, వర్ధిల్లు.

పెరువు[2] రూ. పెరుగు, పెరుగు[2]. పెర్గు[2]. పెర్వు[2]. వి. దధి. హరి.పూ. 5.203. ద.హిం.గా. సంపు. 6. గా.నం. 235. క్రీ.శ. 1080.

క. పెప్పు. తోడు వాడే పదార్థం; కొడ. పెరె. మీగడ; తు. పెర్పు. తోడువాడే పదార్థం; త. పెరుకు. తోడుపెట్టినపాలు, పిరై. పాలు తోడుపెట్టటానికి ఉపయోగించే పులిసిన మజ్జిగ; మ. పిరియుక. పేరబెట్టు (పాల లాగ) పిరివ్పల్. పాలు పేరబెట్టు, గడ్డకట్టిన పాలు, పిరన్నుక. తోడుపెట్టు; కో. పెప్. తోడుపెట్టిన పాలు, పెవ్-(పెవ్ద్-). (నెయ్యి) పేరుకొను, పెళ్-(పెళ్య్-). (ద్రవాలు) గట్టిగాచేయు; కొ. పెప్. పాలలో తోడువాడే పుల్లని మజ్జిగ; పర్జి. పడుబ్, పరుప్. మీగడ; కొలా. పెరెగ్ (పెర్గ్-. పెర్గుత్-). చిలకటానికి సిద్ధంగాఉన్న పాలు; నా. పెరగ్, పెర్గ్. పెరుగు.

పెరువు కలప వి. పెరుగుకుండ. ద.హిం.గా. సంపు. 6. గా.నం. 709. క్రీ.శ. 1416. పెరువు పట్టువ వి. పెద్ద పెరుగు కుండ. ద.హిం.గా. సంపు. 6. గా.నం. 785. క్రీ.శ. 1218.

పెరునుంకము వి. వ్యవసాయానికై పొలాలకి నీరుపంచే వాడికిచ్చే జీతం. ద.హిం.గా. సంపు. 10. గా.నం. 119. క్రీ.శ. 1069.

పెరెముడు వి. మహా నైవేద్యం. ద.హిం.గా. సంపు. 5. గా.నం. 65.

పెర్క రూ.చూ. పెఱ్క. వి. ఈపక్క ఆపక్క ధాన్యాదులు పోసి ఎద్దు, గుర్రం మొ. వాటిమీద వేసి మోయించే గోనె మూట. బసవ. 4.114.

పెర్కు[1] రూ.చూ. పెఱుకు[1]. స.క్రి. 1. ఊడబీకు, ఊడతీయు. (ఖడ్గాదులు) దూయు, పైకిలాగు, రం.రా. సుందర. 262. పు. 18 పం; 2. (వృక్షశైలాదుల్ని) పెల్లగించు, ఉన్మూలించు; 3. పీకు, లాగు; అ.క్రి. పెల్లగిలు, ఉన్మూలితమగు.

పెర్కు[2] రూ.చూ. పెఱుకు[2]. స.క్రి. 1. మోయు, వహించు; 2. మోయించు, మోయించి తెచ్చు.

పెర్గు[1] రూ.చూ. పెరుగు[1]. అ.క్రి. 1. వయఃప్రమాణాదుల్లో ఎదుగు, వర్ధిల్లు, పెంపొందు. వి.క్ర. 7.50; 2. ఉప్పొంగు, ఉత్సాహించు; 3. పూను, ఉద్యమించు; 4. కలుగు, పట్టు. 5. తెగు, ఛిన్నమగు; విశే. 1. ఏళ్ళు చెల్లినవాడు, ఏళ్ళు చెల్లినది; 2. వృద్ధిపొందినది.

పెర్గు[2] రూ.చూ. పెరువు[2]. వి. పెరుగు. దధి. అప్ప. 4.230.

పెర్గెడ రూ.చూ. పెగ్గడ. వి. మంత్రి. ద.హిం.గా. సంపు. 9. గా.నం. 8.

పెర్మడి వి. గౌరవనీయుడు. ద.హిం.గా. సంపు. 4. గా.నం. 1048.

త. పెరుమానడి.

<త. పెర్మానడి.

పెర్మానడిగలు వి.బ.వ. పెద్దవారు. ద.హిం.గా. సంపు. 4. గా.నం. 1029. క్రీ.శ. 1100.

త. పెర్మానడికళ్. పెద్దలైనవారు.

<త. పెర్మానడికళ్.

పెర్వు[1] రూ.చూ. పెరుగు[1]. అ.క్రి. ఎదుగు, వర్ధిల్లు; విశే. 1. వృద్ధుడు, వృద్ధురాలు; 2. పెరిగినది, వృద్ధిపొందినది.

పెర్వు[2]. రూ.చూ. పెరువు[2]. వి. దధి, పెరుగు. హరి. పూ. 5.158.

పెఱ రూ. పఱ[1]. విశే. 1. అన్యం. ఇతరం. భార. ఆది. 2.69; 2. పగవాడు. శత్రువు. మను. 5.82.

క. పెఱ. బయటిప్రదేశం. రెండోపక్క; త. పిఱ. ఇతరవస్తువులు.

సం. పర-. శత్రువు.

పెఱగాయ (-కాయ) వి. పనికిమాలినవాడు, అప్రయోజకుడు, పెఱగాయమద్దులు (-కాయమద్దులు) వి.బ.వ. పనికిమాలిన మాటలు, వ్యర్థవచనాలు. శగా. 3.78. పెఱత్రోవ వి. అన్యమార్గం, పెడత్రోవ. అపమార్గం. కుక. 1.434. పెఱత్రోవంబోవు (-పోవు) అ.క్రి. వ్యభిచరించు, పెడదారులు పెఱపోక వి. అన్యప్రవర్తన. దుష్ప్రవర్తన. కశా. 6.143. తొక్కు. కుక. 1.54. పెఱమగఁడు వి. రంకుమగడు, జారుడు. చంద్రాంగ. 5.63. పెఱవాఁడు విశే. అన్యుడు, పరాయి వాడు, లాతివాడు. భార. ఉద్యో. 4.150. పెఱ పద్ది వి. అన్యవచనం, అపవాదు, నింద. కశా. 6.152.

పెఱక[1] రూ.చూ. పెఱ్క. వి. ఈపక్క ఆపక్క ధాన్యాదులు

పోసి ఎద్దు, గుఱ్ఱం మొ. వాటిమీద వేసి మోయించే గోనెమూట. కు. సం. 2.73.

పెటికపెట్టి వి. వర్తకుడు. బసవ. 2.40. పెటికాటము వి. ఎద్లు మొ. వాటితో ధాన్యాదులు మోయించుకొనిపోయి చేసే వ్యాపారం.

**పెటిక[2]** వి. ఒకకులం.

**పెటికాటము** చూ. పెటిక.

**పెటికించు** చూ. పెఱుకు[1].

**పెటికిపేటాడు** చూ. పెఱుకు[1].

**పెఱుక** రూ. చూ. పెఱ్క. వి. ఈపక్కనూ ఆపక్కనూ ధాన్యాదులు ఎద్దు, గుఱ్ఱం మొ. జంతువుల మీదవేసి మోయించే గోనెమూట. ద. హిం. గ్రా. సంపు. 10. గ్రా. సం. 804. క్రీ.శ. 1167.

**పెఱుకు[1]**. రూ. పెరుకు, పెర్క[1]. స.క్రి. 1. పీకు, లాగు. కొరవిగానసం. క్రీ.శ. 892–922; 2. పెల్లగించు, ఉన్మూలించు (వృక్షశైలాదుల్ని) భార. ఆది. 2.10; 3. ఊడపీకు, ఊడతీయు (ఖడ్గాదులు) దూయు పైకిలాగు. కు.సం. 4.95; అ.క్రి. పెల్లగిల్లు, ఉన్మూలితమగు భార. శాంతి. 3.86.

క. పఱి. బద్దలు చేయు, పడగొట్టు (చెట్టునుంచిపండు). చింపు; కొడ. పరి-. (పరిప్-, పరిచ్-). పీకు; తు. పొర్పుని. పీకు, బయటికిలాగు (వేళ్ళు, గడ్డి మొ. వి). పర్పావుని. బయటికి లాగబడు, పొర్పుని. పీకు, వేళ్ళు లాగు; త. పఱి (-ప్ప-,-త్-). పీకు, మెలితిప్పిలాగు, బలవంతంగా. లాగుకొను, నాశనంచేయు (-వ్-,న్త్-). వదులుచేయు, కత్తిరించు (వేళ్ళు) పీకు. పిఱిట్. వెళ్ళగొట్టు, కీలు తప్పించు; మ. పఱి. పీకటం, చించటం, పఱియుక. వదులుచేయు, చింపు. పఱిక్క. పీకు, మొక్కలు, పళ్ళు, కూర్పు, బయటికిలాగు, దొంగిలించు; కో. ప(యి-. (పర్ప-) రెండుచివర్లూ లాగి విడగొట్టు, బయటికిలాగు (జుట్టు). పెర్త్. కీలుతప్పించు (బలవంతంగా); తొ. పఱ్య-. (పఱ్ప-). బలంగాలాగు, బద్దలు చేయు; గోం. పిఱుజ్. లాగు. పేస్. వెళ్ళగొట్టు; గ. పయ్. కలుపుతీయు, పయ్క. బయటికిలాగు, పీకు.

పెటికించు స.క్రి. 1. మోయించు. భార. ఆది. 5.39; 2. పెల్లగింపచేయు. కు. సం. 4.11; 3. ఊడదీయించు, పీకించు. ఉ. హరి. 1.53. <పెఱుకు[1] + -ఇంచు[3]. పెటికిపేటాడు అ.క్రి. పెల్లగించు, నుగ్గునూచంచేయు. భాస్క. రా. కిష్కిం. 762.

**పెఱుకుతోఁటకూర** రూ.చూ. పెరుఁగుతోఁటకూర. వి. పెరుగు తోటకూర. ఆం. భా. 2.73.

**పెఱుకు[2]** రూ. పెర్క[2], పెఱుఁగు[2]. స.క్రి. 1. మోయు, వహించు. భార. సభా. 1.267; 2. మోయించు, మోయించితెచ్చు. చంద్రాంగ. 2.41.

క. పేఱು. పైకి ఎత్తి పైనపెట్టు, కుప్పఎత్తు, ఎద్దమీద వేసే బరువు; కొడ. పొ.ర్-. (పొ.రి-). జంతువుమీద బరువువేసి ఎగుమతిచేయు; తు. పేరుని, పేరావుని. బరువుఎత్తు, దాద్యత, పేరాటు. సరుకు ఎక్కించు, ఓడమీద ఎక్కించు, పెరికె. బరువు, ఎద్దమీద వేసేబరువు; త. పిఱుక్కు (పిఱుక్కి-). కుప్పవేయు, కుప్పఎత్తు. పెఱ్ఱుమ్. ఎద్దు, కుప్ప, గేదె; మ. పేఱుక. మోపుఎత్తు (ఎద్దమీద) కుప్పఎత్తు; తొ. పిఱ్-. (పిట్-). మోయు; కువి. పేడ్హలి. ఎత్తు, పెర్హనై. ఎత్తు, పెంచు.

మూ. ద. ద్రా. & మూ. మ. ద్రా. *పేఱ్.

**పెఱుగాడము** వి. గూడుబండి, పెట్టెబండి.

**పెఱుఁగు[1]** రూ.చూ. పెరుఁగు[1]. అ.క్రి. ఎదుగు. భార. సభా. 1.268.

**పెఱుఁగు[2]** రూ.చూ. పెఱుకు[2]. స.క్రి. మోయించు.

**పెఱ్క** రూ. పెర్క, పెటిక[1], పెఱుక. వి. ఎద్దు మొ.వాటి మీద మోయించుకొని తెచ్చేగోనెమూట. ద.హిం.గ్రా. సంపు. 6. గ్రా. సం. 637. క్రీ.శ. 1069.

క. పేఱు. మోవు. (ఎద్దమీద వేసేబరువు); తు. పెరికె. ఎద్దమీద వేసేబరువు; త. పెఱ్ఱు. కుప్ప; మ. పేఱు. బరువు, మోపు (ఎద్దమీద వేసేబరువు); కో. పె.ర్న్. ఎద్దమేదవేసేమోపు.

**పెలఁగు** అ.క్రి. తొలగు. కు. సం. 12.63.

**పెలా** దూ. పీలి[2]. వి. కప్పు.

హిం. ప్యాలా. కప్పు, ఉపాకీలో మందుపెట్టే పల్లం; ఉ. పార. ప్యాలా;

క. పేలె; త. పేలం.

<ఉ. ప్యాలా.

**పెలికలుపోవు** అ.క్రి. మట్టిపాకం లోపం వల్లగాని కాల్పులోపం వల్లగాని ఆముకాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

**పెలిక** వి. జలజంతు విశేషం. హంస. 4.186.

**పెలుకుఱు** రూ.చూ. పెల్కుఱు. అ.క్రి. 1. (భయాదులతో) విహ్వలించు, భయపడు. కు. సం. 10.9; 2. దిగులుపడు, బెంగపెట్టుకొను.

క. పెళఱు. భయపడు, వణకు.

**పెలుచ** రూ. పెలుచు, పెల్చ. వి. 1. ఆగ్రహం. కినుక. భార. ఆది. 1.84; 2. అతిశయం, ఆధిక్యం. భార. ఆది. 5.179; 3. ఆటోపం, ఔద్ధత్యం. భార. ద్రోణ. 4.65; 4. క్రౌర్యం. దయలేమి. మార్క. 1.214; 5. విధం. హరి. ఉ. 6.218; 6. పట్టుదల, అభినివేశం; క్రి. విశే. ద్రు. 1. బిగ్గరగా, ఉచ్చైస్స్వరంతో. భార. ద్రోణ. 5.322; 2. శీఘ్రంగా. అవిలంబంగా. భార. శల్య. 1.9; 3. నిష్ఠురంగా. మార్క. 5.28; 4. అధికంగా, మిక్కిలి. ఉ. హరి. 2.24; 5. గట్టిగా, దృఢంగా. భాగ. 3.449; 6. బలత్కారంగా. పారి. 2.30; విశే. 1. అధికం, పెద్దది. భార.శాంతి 3.388; 2. కఠినమైన, గట్టిది. హరి. ఉ. 5.161; 3. (దీనికి కర్మధారయ సమాసంలో తరచుగా నిగాగమం అవుతుంది) క్రూరం. యయా. 3.7.

క. హెరాళ. గొప్పతనం, వైశాల్యం, విస్తారం; తు. పెర్మె. గర్వం, హెమ్మ, విస్తారమైన, చాల. హెమ్మె. గర్వం, అహంకారం; తొ. పెమ్. చిన్న కొండ; గోం. పడోల్. గొప్ప; కుఇ. పేరెడి. విశాలమైన ఎలుక (పెద్ద

ఎలుక); నా. ఫర్. పెద్ద, పెద్దవాడు. పెరుక్-/పెర్క్- జీవించు; గ. బెజ్జిడ్. చాల, ఎక్కువ. బెజ్జుర్తల్. చాల, బెర్‌బెరెట్. పెద్ద నది; మాల్తొ. బెడొ. పెద్ద.

పెలుచన రూ.చూ. పెల్చన. వి. 1. అతిశయం, ఆధిక్యం. భార.ఆది. 6.291; 2. ఆగ్రహం, కినుక. హరి.పూ. 1.178; 3. ఉద్ధతి, ఆటోపం; క్రి.విశే.ద్రు. 1. మిక్కిలి. అధికంగా. భార.సభా. 2.70; 2. గట్టిగా, దృఢంగా; 3. శీఘ్రంగా, వెంటనే; 4. బిగ్గరగా, ఉచ్చైస్స్వరంతో; విశే. అధికం.

పెలుచు రూ.చూ. పెలుచ. వి. దయలేమి, క్రౌర్యం. తాళ్ల.సం. 14.127.

పెలుచుదనము(-తనము) వి. దయలేమి. తాళ్ల.సం. 15.241.

పెల్కుఱు రూ. పెలుకుఱు. అ.క్రి. 1. (భయాదులతో) విహ్వలించు, భయపడు. భార.ఆది. 8.11; 2. బిగులుపడు, బెంగపెట్టుకొను. భాగ. 8.11.

క. పెళగు. భయం, జాగ్రత్త, పెళక్. పణకు, భయపడు, భయం. పెళఉసు. భయపెట్టు, బెదరించు, పెళ్పిసు, బెళ్పిసు. వణుకు; తు. పెర్చి. సిగ్గుపడటం, అకస్మాత్తుగా బయలుదేరు. పెర్చుని. సిగ్గుపడు, బయలుదేరు, అకస్మాత్తుగా పక్కకు తొలగు; త. పెట్కణి (-ప్పి-, -ంత్-). భయపడు.

పెల్చ రూ.చూ. పెలుచ. వి. 1. పట్టుదల. అభినివేశం. కు.సం. 1.89; 2. ఆగ్రహం, కినుక; 3. అతిశయం, ఆధిక్యం; 4. విధం; 5. క్రౌర్యం, దయలేమి; 6. ఆటోపం, ఔద్ధత్యం; క్రి.విశే.ద్రు. 1. శీఘ్రంగా, అవిలంబంగా. భీమ. 2.123; 2. అధికంగా, మిక్కిలి. విప్ర. 3.15; 3. బిగ్గరగా, ఉచ్చైస్స్వరంతో; 4. నిష్ఠురంగా; 5. గట్టిగా, దృఢంగా; 6. బలాత్కారంగా; విశే. 1. అధికమైన, పెద్దదైన; 2. కఠినమైన, గట్టి; 3. క్రూరం.

పెల్చన రూ. పెలుచన. క్రి.విశే.ద్రు. 1. శీఘ్రంగా, చెచ్చెర, వెంటనే. భార.ఆది. 5.49; 2. గట్టిగా, దృఢంగా. భార.ఆది. 6.300; 3. బిగ్గరగా, ఉచ్చైస్స్వరంతో. విప్ర. 3.7; 4. మిక్కిలి, అధికంగా; వి. 1. ఉద్ధతి, ఆటోపం. భార.శాంతి. 3.391; 2. ఆగ్రహం, కినుక. మార్క. 6.114; 3. అతిశయం, ఆధిక్యం.

పెల్ల రూ. పిల్ల[3], పెల్లిక, పెళ్ల, బెళ్ల. వి. 1. మట్టిగడ్డ, బెత్తిక. భాస్క.రా.యు. 1018; 2. ఇటికముక్క.

త. పెల్లి. స్తంభం చివరకు కట్టిన కొక్కెం.

పెల్లకట్టుబడి వి. ఇటికతో కట్టిన కట్టడం. పెల్లగించు స.క్రి. 1. కలతనొందించు, క్షోభపెట్టు. భార. మౌసల. 101; 2. ఉన్మూలించు, పెకలించు. రం.రా.ఉ. 35 వ. 24పం.; 3. కదల్చు, ఊచు. హర. 6.45; 4. ఊడదీయు, పీకు. ఆము. 4.22; 5. పెల్లలు లేచేట్లు తవ్వు. కాశీ. 4.122. పెల్లగిలించు స.క్రి. పెల్లగించు. కవిక. 3.101. పెల్లగిలు రూ.చూ. పెల్లగిల్లు. అ.క్రి. 1. నశించు, చెడు. కు.సం. 11.148; 2. పారిపోవు, పలాయితమగు. భార. కర్ణ. 2.352; 3. (వృక్ష పర్వతాదులు) పెకలు, ఉన్మూలితమగు. హరి.పూ. 5.243; 4. ఊడు, ఊడిపోవు. భీమ. 3.211; 5. వినపడు, బయల్పడు. కుత్స. 5.101; 6. చలించు, కలగు, క్షోభించు; 7. బీటెత్తు, పగులు. పెల్లగిల్లు రూ. పెల్లగిలు. అ.క్రి. 1. చలించు, కలగు. క్షోభించు. కు.సం. 11.64; 2. పారిపోవు, పలాయితమగు. భార.ద్రోణ. 1.313; 3. నశించు, చెడు. హరి.ఉ. 3.8; 4. పెకలు, ఉన్మూలితమగు. కాశీ. 5.130; 5. వేరెత్తు, పగులు. ఉ.రా. 3.85; 6. ఊడు, ఊడిపోవు; 7. (వృక్ష పర్వతాదులు) పెకలు, ఉన్మూలితమగు. పెల్లగుమురు వి. పలచని ఆకులుకలిగి ఎర్రని తినేపళ్ళు కాసే చిన్న చెట్టు (Antidesma diandrum). పెల్లవేయు స.క్రి. పైరు నాటటానికి ముందు కయ్య చదరం చేయు.

పెల్లాపు చూ. పెల్లు.

పెల్లిక రూ.చూ. పెల్ల. వి. 1. పొడిగా ఉండే మట్టి బెత్తిక; 2. కట్టుబడిలో పనికిరాని చిన్న రాతి ముక్క.

పెల్లిదము చూ. పెల్లు.

పెల్లు వి. 1. అతిశయం, ఆధిక్యం. భార.ఆది. 2.39; 2. గుంపు, సమూహం. కు.సం. 1.80; 3. ఆస్పదం. నెలవు. బసవ. 2.137; 4. విధం, రీతి. భార.విరా. 4.171; 5. ఉరటు, ఉద్ధతి. భాస్క.రా.యు. 1549; 6. ఉద్రేకం. వసు. 2.146; విశే. 1. అధికం, బహుళం. భార. భీష్మ. 1.28; 2. ఉప్పొంగినది, ప్రహృష్టం. జైమినిభా. 1.7; క్రి.విశే. మిక్కుటంగా, అత్యంతం. భార.భీష్మ. 7.270.

క. పెర్, పేర్. వైశాల్యం, పొడవు, గొప్పతనం; కొడ. పెరి-, పెరిమ్. పెద్ద; తు. పెరి, పెరియ. పెద్ద, గొప్ప, ఎత్తు, పైవాడు; త. పెరు, పెరుమ్, పేర్. గొప్ప; మ. పెరు, పేర్. గొప్ప, పెద్ద, ముఖ్యమైన; కో. పె-. పెద్ద; తొ. పె-. పెద్ద; గొం. పెర్, పెరి. పెద్ద, వైశాల్యం; పర్జి. పెరు. ఎక్కువ; కొలా. పెర, పెర్. పెద్ద.

పెల్లారు అ.క్రి. అతిశయించు. శివలీలా. 1.125. <పెల్లు+ఆరు[1]. పెల్లిదము చూ. పెలుచ. విశే. అధికం, బహుళం. నిర్వ.రా. 3.23; వి. అతిశయం. భార.విరా. 1.88. పెల్లుగొను అ.క్రి. అతిశయిల్లు, విస్తరిల్లు. జైమినిభా. 2.24. పెల్లువ క్రి.విశే.ద్రు. అత్యంతం, మిక్కిలి. కు.సం. 6.106. పెల్లుమీఱు అ.క్రి. అతిశయించు, అగ్గలమగు. అచ్చ.రా.అరణ్య. 69. పెల్లురేగు అ.క్రి. అతిశయించు. తాళ్ల.సం. 9.52. పెల్లెత్తు అ.క్రి. అతిశయించు. హరి.ఉ. 4.204. <పెల్లు+ఎత్తు[1]. పెల్లెసగు అ.క్రి. అధికమగు. పరమ. 7.134. <పెల్లు+ఎసగు.

పెల్లెత్తు చూ. పెల్లు.

పెల్లెసగు చూ. పెల్లు.

పెళుక్కు రూ. పెటుక్కు. వి. విరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. చెన్నబసవ. 4.128.

పెళపెళ వి. విరగటం, ఉరమటం, అరపటం, వానపడటం మొ. వాటిల్లో అయ్యే ధ్వనికి అనుకరణం. భీమ. 4.130.

పెళపెళమను(-అను) రూ. పెళపెళయను. అ.క్రి. పెళపెళమని ధ్వనిచేయు. భీమ. 4.130. పెళపెళయను (-అను) రూ.చూ. పెళపెళమను. అ.క్రి. పెళపెళమని ధ్వనిచేయు. ఆము. 4.66. పెళపెళవిఱుగు అ.క్రి. పెద్ద ధ్వనితో విరుగు. పెళపెళారు వి. పిడుగులు పడటంలో అయ్యే ధ్వన్యనుకరణం. శుక. 1.187. <పెళపెళ+ ఆరు.

పెళపెళారు చూ. పెళపెళ.

పెళారు వి. అవ్యక్త ధ్వనికనుకరణం. దశా. 4.232, 155 ప.

పెళుక్కు రూ.చూ. పెళుక్కు. వి. విరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

పెళుచు రూ. పెడిచి, పెళుసు, పెఱను. విశ. 1. మూర్ఖుడు, పెంకి. పాండు. 4.166; 2. విరసం, పరుషం; 3. అతిసులభంగా విరిగేది.

సం. పరుష-. కఠినమయిన.

పెళుసు రూ.చూ. పెళుచు. వి. 1. సులభంగా విరిగే స్వభావం; 2. స్వల్పానికే విరాగంచెందే వ్యక్తి.

పెళ్ల రూ.చూ. పెల్ల. వి. 1. చిన్నమట్టిఉండ; 2. పారతో గరిశతో లేవదీసిన పెడల్పుభాగం; 3. ముక్క; 4. ఐటుకపెళ్ళ.

పెళ్లమ్రాను వి. దున్నిన తరవాత మెరక పల్లాలు లేకుండా చదును చేయటంకోసం ఉపయోగించే పలక, పాపటం.

పెళ్లాపెళ్లి వి. స్వరస్థాయీభేదం. బసవ. 3.936.

పెళ్ళి రూ.చూ. పెండ్లి[1]. వి. వివాహం.

పెళ్ళిఅగు రూ.చూ. పెండ్లియగు. అ.క్రి. 1. గాస్తి అగు; 2. వివాహమగు. పెళ్ళిగోరంచు వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర. పెళ్ళిచీర వి. పెళ్ళికూతురు కట్టుకొనే చీర. పెళ్ళినడక రూ.చూ. పెండ్లినడక. వి. మెల్లని నడక. పెళ్ళివర్ధా వి. ఆరు గజాల పొడుగు, రెండున్నర గజం పెడల్పు వచ్చేట్టు నేసిన ఒకరకం జంపఖానా. పెళ్ళి బొత్తంచుకోక వి. పెళ్ళికూతురు కట్టుకొనే ఒకరకం చీర. పెళ్ళిపెటాకులూ రూ. పెళ్ళిపెడాకులూ. అవ్య. పెళ్ళి మొదలైనవి. పెళ్ళిపెడాకులూ రూ.చూ. పెళ్ళిపెటాకులూ. అవ్య. పెళ్ళి మొదలైనవి.

పెళ్ళిపెటాకులూ చూ. పెళ్ళి.

పెళ్ళిపెడాకులూ చూ. పెళ్ళి.

పెళ్లు[1] వి. 1. విరగటం, విరవటం, కేకవేయటం, దాటటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం, ఆధ్వని. హరి.పూ. 6.83; 2. ఉద్రిక్తస్థితి.

పెళ్లుమను(-అను) అ.క్రి. విరగటంలో ధ్వనికి అనుకరణం చేయు.

పెళ్లు[2] రూ.చూ. పేరడు. వి. భూమి. దొడ్డి. గా.హరి.ఉ. 1896.

పెళ్లు[3] వి. కంచెకు, ఇళ్ళ గోడలకు అడవిప్రదేశాల్లో ఉండేవారు ఉపయోగించుకొనే చీకిపోకుండా గట్టిగాఉండే ఒకజాతి మొక్క. వేంక.పంచ. 1.586.

పెళ్లెము వి. మద్యం చేయటానికి అనేక వస్తువులు చేర్చి చేసిన పిండి, మేదకం. ఆం.భా. 2.303.

పెషకశ రూ.చూ. పేషకష. వి. కప్పం.

పెషకష రూ.చూ. పేషకష. వి. కప్పం.

పెషకషి రూ.చూ. పేషకష. వి. కప్పం.

పెషకస్తు రూ.చూ. పేషకష. వి. కప్పం.

పెషవే రూ.చూ. పేషవా. వి. మహారాష్ట్ర ప్రధానమంత్రి యొక్క ఉపాధి.

పెషుకష రూ.చూ. పేషకష. వి. కప్పం.

పెష్కబ్జి వి. ఒకవిధమైన కత్తి.

ఉ.పార. పెష్కబ్ జ్.

<ఉ. పెష్కబ్జ్.

పెష్కసు రూ.చూ. పేషకష. వి. పన్ను.

పెష్కారు రూ.చూ. పేష్కారు. వి. ఒక రెవిన్యూ అధికారి.

పెసంగి రూ.చూ. పిసింగి. వి. వృక్షవిశేషం.

పెసర రూ. పెసరు. వి. ముద్గ సస్యం. భీమ. 3.57.

క. పెసఱ్. పెసలు; త. పయఱు. పెసలు; మ. పయఱ్(ఉ). లెగూమినస్ జాతి మొక్కలు; గోం. పెసెల్ (బహు. పయరుల్). పయల్; కొలా. పెసాల్, పెసల్; నా. పెసల్.

పెసరకాయరంగు వి. ఒకరకం పచ్చరంగు. పెసరగింజ వి. ముద్గసస్యబీజం. కాశీ. 6.296. పెసరగింజంచు వి. పెసరగింజ మాదిరి చాలా చిన్నగా పాత్రలకు పెట్టే అంచు. పెసరఘాత వి. అలంకార సామగ్రి తయారీకి పనికివచ్చే కలపనిచ్చే చెట్టు (Diospyros tomentosa). పెసరపప్పు రూ. పెసరుబప్పు, పెసర్పప్పు. వి. 1. ముద్గ సూపం. శృం.నై. 6.120; 2. పెసలు విసరగా ఏర్పడిన బద్దలు. పెసలపాప్పికచీర వి. ఒకరకం గడిచీర. పెసర బద్దలచీర వి. పడుగులో రెండు కొలుకుల దారం ఒక రంగు, రెండు కొలుకుల దారం మరొక రంగు పెట్టి నేసిన చీర. పెసరబేడచీర వి. పడుగులో రెండు కొలుకుల దారం ఒక రంగు, రెండు కొలుకుల దారం మరొక రంగు పెట్టి నేసిన చీర. పెసరబేడలకోక వి. పడుగులో రెండు కొలుకుల దారం ఒక రంగు, రెండు కొలుకుల దారం మరొక రంగు పెట్టి నేసిన చీర. పెసరరంగు రూ. పెసరు రంగు, పెస్రరంగు. వి. పెసరగింజల మాదిరి నలుపువన్నె. పెస్రరంగు రూ.చూ. పెసరరంగు. వి. పెసరగింజల మాదిరి నలుపువన్నె.

పెసరు రూ.చూ. పెసర. వి. ముద్గసస్యం. కాశీ. 2.33. ద.హిం.గా.సంపు. 4. గా.సం. 1884.

పెసరుగాయ (-కాయ) వి. పెసరకాయ. రాజవా. 2.65. పెసరుబప్పు(-పప్పు) రూ.చూ. పెసరపప్పు. వి. 1. ముద్గ సూపం. హర. 6.55; 2. పెసలు విసరగా ఏర్పడ్డ బద్దలు. పెసరురంగు రూ.చూ. పెసరరంగు. వి. పెసర గింజల మాదిరి నలుపువన్నె. పెసరురంగుచీర వి. పచ్చి పెసరగింజలరంగు చీర. పెసర్పప్పు రూ.చూ. పెసరపప్పు. వి. 1. ముద్గసూపం. క్రీడా. 1.66; 2. పెసలు విసరగా ఏర్పడిన బద్దలు.

పెసర్పప్పు చూ. పెసరు.

పెస్రరంగు చూ. పెసర.

పెనలు చూ. పెనర. వి.బ.వ. పెనరగింజలు, ముద్గధాన్యం. భామం. 1.139.

పెనవము వి. ప్రసవం, బిడ్డకాన్పు.

సం. ప్రసవ-. బిడ్డను కనటం; ప్రా. పా. సిం. పసవ-.

<ప్రా. పసవ-.

పెసిలికాయకంఠం వి. పెసరగింజ మాదిరి పాత్రల కంఠభాగం దగ్గర పెట్టే అంచు.

పెహరిస్తు రూ. పెరిస్తు, పెహారిస్తు, పెహొరిస్తు, పేరిస్తు, పైరిస్తు. వి. జాబితా, పట్టీ.

హిం. పెహరిస్త్. జాబితా; ఉ. పార. పిహరిస్త్. విషయసూచిక, దివాలా ఎత్తినవారు రాసి ఇచ్చే అప్పుల వాళ్ళ జాబితా;

క. పెరిస్తూ. జాబితా, కేటలాగు, నియమం, పరిశోధన; త. పెరస్తు, పెరిస్తు.

<ఉ. పిహరిస్త్.

పెహరీగోడ రూ.చూ. పారిగోడ. వి. ఇంటి ఆవరణ చుట్టూ కట్టిన గోడ.

పెహారిస్తు రూ.చూ. పెహరిస్తు. వి. జాబితా, పట్టీ.

పెహొరిస్తు రూ.చూ. పెహరిస్తు. వి. జాబితా, పట్టీ.

పేక[1] వి. చీట్లకట్ట, ఆటలో ఉపయోగించే రంగుచీట్లకట్ట.

ఇం. *Pack*. కట్ట, కట్టకట్టు, గుంపు, చీట్లపేకకట్ట.

<ఇం. Pack.

పేకాట వి. చీట్లాట. <పేక[1] + ఆట.

పేక[2] రూ. పాక[2], ప్రేక. వి. 1. వస్త్రాలు, నవారు మొ.వాటి నేతలో అడ్డనూలు. రం.రా.నుం. 601 పు. 19 పం.; 2. లాదులలో అడ్డంగా పేర్చిన తారసరాయి; 3. మూలలుగా పేర్చిన ఇటిక పేర్పు; 4. ఎదురుమూల; 5. మూలగా అతికే అతుకు.

పేకఉండ రూ. పేకుండ. వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం ఉండ. పేకకట్టె రూ. పాకట్టె, పేకట్టె, పేక్కట్టె. వి. గొంగడి నేతలో అడ్డానికివాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. పేకగొట్టం రూ. పాకగొట్టం, పేగ్గొట్టం. వి. గొంగడి నేసేటప్పుడు మగ్గానికి బిగించిన ఉన్ని పడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురుగొట్టం. పేకబాలు వి. నిలువ దున్నిన తరవాత అడ్డంగా దున్నిన బాలు. పేకచిట్టె వి. నేతలో అడ్డానికి వాడే నూలుచుట్ట. పేకట్టె రూ.చూ. పేకకట్టె. వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. పేకట్టెబరుగు వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. పేకదోడి వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. పేకనూలు వి. నేతలో అడ్డానికివాడే నూలు. పేకపట్టు వి. నేతలో అడ్డానికివాడేపట్టు. పేకపేటుపేక వి. ఒకరకం డిజైను నేత. పేకబెత్తం వి. పడుగుడువ్వే కుంచెకు వెన్ను, పక్క భాగాలు అల్లటానికి వాడిన పేముపల్ల. పేకరేషం వి. నేతలో అడ్డానికి వాడే పట్టు. హిం. రేషమ్. పట్టు. <పేక+హిం. రేషమ్. పేకలతొగడు రూ. పేకల్తొగరు. వి. ఒకరకం ఎరుపురంగు. పేకల్తొగరు రూ.చూ. పేకలతొగరు. వి. ఒకరకం ఎరుపురంగు. పేకనిలుకు వి. వరి ఎక్కువలేని పట్టు. పేకపీడు వి. నేతలో అడ్డానికివాడే నూలుచుట్ట. పేకుండ రూ.చూ. పేకఉండ. వి. గొంగడి నేతలో అడ్డానికివాడే ఉన్ని దారంఉండ. పేక్కట్టె రూ.చూ. పేకకట్టె. వి. గొంగడి నేతలో అడ్డానికి వాడే ఉన్నిదారం చుట్టిన కర్ర. పేగ్గొట్టం రూ.చూ. పేకగొట్టం. వి. గొంగడి నేసేటప్పుడు మగ్గానికి బిగించిన ఉన్నిపడుగులో పేకదారం వెయ్యటానికి దూర్చే వెదురు గొట్టం.

పేకాట చూ. పేక[1].

పేకుండ చూ. పేక[2].

పేక్కట్టె చూ. పేక[2].

పేగానప చూ. పేగు.

పేగు రూ.చూ. ప్రేగు. వి. 1. ఆంత్రం; 2. సారెపై పాటలకు సునుపు పట్టటానికి అంచు ఏర్పరచటానికి వాడే తడిబట్ట; విశే. దగ్గర సంబంధం కలవాడు.

పేగానప(-ఆనప) వి. ఆనపకాయల్లో ఒకరకం. పేగు ఎండగట్టు స.క్రి. అన్నతినకుండా మాడ్చు. పేగుజారు అ.క్రి. బుద్దదిగు. పేగుతట్టు స.క్రి. పేగుపడటంవలన కలిగే బాధ తొలగించటానికి కడుపు రుద్దు. పేగుపట్టు స.క్రి. కుడిచేత్తో అడ్డం వేలువేసి ముఖమేర్పరచటానికి కుండ నాలుగు పక్కల సాపుగా రావటానికి బట్టతోపట్టు. పేగుపడు అ.క్రి. బాధపడు. పేగుబండ వి. నర్సేటప్పుడు సలపను తడిచేను కోటానికి తడిగుడ్డ పెట్టుకొనే రాయి. పేగులలోవితీట వి. తెలియరాని బాధ. కరా. 7.19. పేగులుతెంచేవి విశే.బ.వ. చాలాకష్టమైనవి. పేగువేయు అ.క్రి. కుడిచేత్తో అడ్డం వేలు వేసి ముఖమేర్పరచటానికి కుండ నాల్గు పక్కల సాపుగా రావటానికి బట్టతోపట్టు. పేగెక్కు అ.క్రి. బాధకలుగు.

<పేగు+ఎక్కు.

పేగుపు రూ.చూ. ప్రేగు. వి. 1. ఆంత్రం; 2. దగ్గర సంబంధం కల వ్యక్తి.

పేగెక్కు చూ. పేగు.

పేగ్గొట్టం చూ. పేక[2].

పేచి రూ. పేచీ. వి. 1. చిక్కు, బాధ; 2. బాధ్యత.

హిం.ఉ.పార. పేచ్. ధూర్తత్వం;

క. పేచ, కష్టం; కొడ. పె.చ్-అ-ద్. కష్టపడు; తు. పెచాడుని. కష్టించు.

<ఉ. పేచ్.

పేచిక వి. ఒకానొక చెట్టు, జారగడ్డి.

పేచీ రూ.చూ. పేచి. వి. చిక్కు, బాధ.

పేచీపెట్టు అ.క్రి. తగువుపెట్టు.

పేచీకోరు విశే. పేచీలు పెట్టేవాడు, తంటాలమారి.

హిం.ఉ. పెచ్ ఖోర్. ధూర్తుడు.

<ఉ. పేచ్‌ఖోర్.

పేజి వి. పుట.

ఇం. *Page*. పుట.

<ఇం. Page.

పేట్ రూ.చూ. పేటు[3]. వి. 1. పరుస; 2. పెరల్పు; 3. అంచు; 4. ఒకవిధమైన అంచు.

పేటి రూ.చూ. పేటు³. వి. 1. వరుస; 2. వెరల్పు; 3. అంచు; 4. ఒకవిధమైన అంచు.

పేటంచు చూ. పేటు³.

పేటంచుచాపు చూ. పేటు³.

పేటవ చూ. పేటు². వి. బాధ, చిక్కు.

పేటవపెట్టు అ.క్రి. 1. చిక్కు, కలిగించు, బాధకలిగించు. వరాహ. 11.75; 2. ప్రయత్నించు. కళా. 6.85.

పేటవంద చూ. పేటు². వి. నంద మధ్యభాగంలో ఉండే ఒరల జంట.

పేటా వి. ఒకరకం తలపాగ.

పేటాడు చూ. పేటు².

పేటావవ చూ. పేటు². వి. పేచి, చిక్కుపై చిక్కు.

పేటి¹ రూ. పేటీ¹. వి. నడికట్టు, సారసనం. ఆం.భా. 2.204. క. పెటి. వస్త్రం అంచుల్లోని అలంకారంపని; త. పెట్టు.

పేటి² రూ.చూ. పేటు³. వి. 1. ఏదైనా ఒక నమూనాలో నేసిన నేత; 2. పట్టునేత డిజైనులో వచ్చిన పోగు.

పేటిలు చూ. పేటు¹.

పేటీ¹ రూ.చూ. పేటి¹. వి. నడికట్టు, సారసనం.

పేటీ² రూ.చూ. పెట్టె. వి. 1. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గంపైన అమర్చే యంత్రం; 2. మరమగ్గం చట్రంలో పానుప పట్టెకు ఒకవైపు బిగించిన చెక్కలగూడు.

పేటీకోల వి. పేటు దారాలకు ఆధారంగా దాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద. పేటీచీర వి. దాబీమగ్గంమీద డిజైన్లు పడేట్టు నేసిన చీర. పేటీబొమ్మ వి. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క.

పేటు¹ రూ. బేటు వి. బీటిక, బెత్తిక, పేళు. ఆము. 5.62.

పేటిలు అ.క్రి. పగులు, బీటలువారు. భార్గవపురాణం. 3.195. పేటులెత్తు అ.క్రి. 1. చిట్లు, బీటలువారు. మను. 5.71; 2. తొలగు, స్థానభ్రంశం పొందు; 3. తగ్గు, క్షీణించు; 4. అతిశయించు. పేటెత్తు రూ. పేరెత్తు. అ.క్రి. 1. తొలగు, స్థానభ్రంశం పొందు. భాస్క. రా. యు. 720; 2. అతిశయించు. సు. శ. 78; 3. చిట్లు, బీటలువారు. రం. రా. బాల. 80వ. 4పం: 4. తగ్గు, క్షీణించు. మను. 2.38; 5. ఛేదించు. కవిక. 2.44. <పేటు¹+ఎత్తు¹. పేట్రేగు అ.క్రి. 1. చెలరేగు, విజృంభించు; 2. కోపంతో అధికంగా కేకలువేయు. <పేటు¹ + రేగు. పేట్లెగయు అ.క్రి. పగులు. శాకు. సం. 8.239. <పేటు¹+-లు+ఎగయు.

పేటు² వి. 1. వేటకుపయోగించే ఒకానొక సాధనం. పి. శకు. 1.116; 2. కుతంత్రం, మాయోపాయం.

పేటాడు స.క్రి. ఖండించు, తెంచు. భార. త్రి. 2.9; అ.క్రి. 1. అతిశయించు. ద్వి. పరమ. వి. 5.360; 2. పెనగులాడు. రాజవా. 2.65, కాశ. 2.24; 3. ఛేదించు. <పేటు² + ఆడు.

పేటు³. రూ. పేట్, పేట, పేటి², ప్లేటు¹. వి. 1. సరిగె మొ. వాటితో నేసిన పట్టె; 2. పట్టునేత డిజైనులో వచ్చినపోగు. హిం. పేటా. వస్తుమధ్యభాగం, విశదమైన చెక్క; త. పెట్టు. నేతడిజైను, పట్టె. <హిం. పేటా.

పేటంచు రూ. పేఠంచు, ప్లేటంచు. వి. సరిగ మొ. వాటితో నేసిన పట్టెగల వస్త్రపుటంచు. పేటంచుచాపు వి. అంచులో డిజైన్లు పడేట్టు నేసిన రెండుపంచెలు. పేటుకట్టెలు వి.బ.వ. అంచులో డిజైన్లు నేసేటప్పుడు పైనుంచి పేటుదారాలు వేలాడటానికి చిన్నపన్నె అమర్చిన చట్రం. పేటుకర్ర వి. పేటువడికి కింద వేలాడ గట్టిన బరువు. పేటుకమ్మి రూ. ప్లేటుకమ్మి. వి. 1. పేటువడికి వేలాడ గట్టిన బరువు; 2. డిజైన్లు నేసిన కమ్మి. పేటుకర్ర వి. 1. పేటువడికి కింద వేలాడగట్టిన కర్ర; 2. పేటుదారాలకు ఆధారంగా దాబీ చట్రంలో అమర్చిన సన్నబద్ద. పేటుకర్రసూత్రం వి. పేటుకర్రకట్టిన దారం. పేటుకొయ్య వి. అంచులో డిజైన్లునెయ్యటానికి పోగులు సందులో దూర్చినకర్ర. పేటుగిలక వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం. పేటుగుంత వి. పేటు తూకాలు నేలకు తగలకుండా వేలాడ టానికి తీసిన చిన్న గొయ్యి. పేటుగొలుసు వి. చీర అంచులో గొలుసు ఆకారంలో నేసిన డిజైను. పేటుచీర రూ. ప్లేటుచీర. వి. అంచులో డిజైన్లు పడేట్టు నేసిన చీర. పేటుతాడు వి. 1. నేతలో డిజైన్లు పడటానికి దాబీ అడనుంచి రెండు పాయలుగా విడదీసి అంచుపడుగులోకి వేలాడదీసిన దారం; 2. దాబీఅడనుంచి వేలాడే పేటుదారాలు బిరుగా ఉండటానికి కట్టినతాడు. పేటుతిత్తి వి. అంచుపడుగులో అతికిన పేటు పోగులు బిరుగా ఉండటానికి మగ్గానికిపైన దంతెంమీద నించి వేలాడదీసి చివర కట్టిన బరువు. పేటుదడి వి. 1. ఒకరకం డిజైన్లు నేసేమగ్గంలో అచ్చు దగ్గర అమర్చిన పనిముట్టు; 2. దాబీకిపైన బిగించిన ఇనప ఊచల చట్రం. పేటుదారం వి. నేతలో డిజైన్లు పడ టానికి దాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడదీసిన దారం. పేటుదిండు వి. దాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగూడు. పేటునేత వి. బట్టమీద రకరకాల డిజైన్లు పడేట్టు నేసిననేత. పేటుపడుగు వి. అంచులో డిజైన్లు నెయ్యటానికి వాడే నిలువుదారం. పేటుపని వి. బట్టమీద రకరకాల నమూనాలు పడేట్టు నేసిననేత. పేటుపందిరం వి. దాబీపైన బిగించిన ఊచల చట్రం. పేటుపన్నె వి. రెండుపాయలుగా విడదీసిన చిన్న పన్నె. పేటుపలక వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు అనితొక్కగా లేచిన పడుగుపోగులను నిలిపి ఉంచటానికి పడుగులో గాని అడ్డచేటలో గాని దూర్చే కొయ్యచెక్క. పేటుపుల్ల వి. నేతనేసేటప్పుడు అని మూసిన తరువాత వడి కిందికి దిగటానికి కట్టేపుల్ల. పేటుపూస వి. పేటు దారానికి చివర కట్టేపూస. పేటుపెట్టె వి. నేతలో డిజైన్లు రావటానికి మరమగ్గం పైన అమర్చే యంత్రం. పేటుపోగులు వి.బ.వ. అంచుల్లో డిజైన్లు నెయ్యటానికి పెట్టిన నిలువుదారాలు. పేటుబండి వి. బరువు కట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగిలక. పేటుబుటాచీర వి. రెండంచులకూ మధ్య భాగంలో బుటాలు పడేట్టు నేసిన చీర.

పేటుమగ్గం వి. డిజైన్లు నెయ్యటానికి అమర్చిన మగ్గం. పేటుమూట వి. పడుగులో అతికిన పేటు పోగులు బిర్రుగా ఉండటానికి మగ్గానికి పైన దండెం మీద నుంచి వేలాడ దీసి చివర కట్టిన బరువు. పేటుమోకు వి. డిజైన్లు నేసే మగ్గం బిగింపుకు కట్టినమోకు. పేటులాకి వి. పేటుదారాలకు ఆధారంగా, దాబీచట్రంలో అమర్చిన సన్నబద్ద. పేటువడి వి. పేటుదారానికి చివర కట్టినదారం. పేటుబిల వి. పేటువడికి వేలాడగట్టిన బరువు. పేటుసూత్రం వి. నేతలో డిజైన్లు పడటానికి దాబీ అడనుంచి రెండుపాయలుగా విడదీసి అంచు పడుగులోకి వేలాడ దీసిన దారం. పేటెంచు రూ.చూ. పేటంచు. వి. చిలకలు, పువ్వులు, ఆకులు మొ. డిజైన్లు పరేట్టు నేసినఅంచు. పేటెత్తుకోల వి. అంచులో డిజైన్లు నెయ్యటానికి పోగుల సందులో దూర్చిన కర్ర. <పేటు[3]+ఎత్తుకోల. పేటేరు స.క్రి. నేసేడిజైనుకు బట్టనేతలో పడుగు పోగులు విడదీయు. పేటేరుకమ్మికాగరు వి. ఒకరకం ఎరుపురంగు. పేట్లతుకు అ.క్రి. పట్టులో డిజైన్లు నెయ్యటానికి అవసర మయే పోగులు అతుకు. <పేటు[3]+-లు+అతుకు.

పేటు[4] వి. 1. పర్వతశిఖరం. ఆం.భా. 2.30 ; 2. కొండ చివర ముందుకు నెట్టుకొని వచ్చినరాయి ; 3. పర్వతాగ్రంలో కోట గోడవంటి ఆకారం ; 4. మట్టిరాళ్ళలో రేకులు రేకులుగా కనిపించే సన్నని పల్చని రాతిపలక ; 5. ప్రహరీగోడమీద ఆకు మట్టి రాయి మొదలైన వాటితో రక్షణ కోసం గోడకంటే వెడల్పుగా పెట్టిన రాయి.

పేటు[5] క్రి.విశే. నిండుగా.

పేటెంచు చూ. పేటు[3].

పేటెత్తు చూ. పేటు[1].

పేటెత్తుకోల చూ. పేటు[3].

పేటేరు చూ. పేటు[3].

పేటేరుకమ్మికాగరు చూ. పేటు[3].

పేట్నీచీర చూ. పేటు[3]. వి. నిలువ పసుపు రంగులోను పేక ఎరుపు రంగులోను జరవైనెంబరు జమిలి నూలు పెట్టి నేసిన చీర.

పేట్రేఁగు చూ. పేటు[1].

పేట్లతుకు చూ. పేటు[3].

పేట్లిగయు చూ. పేటు[1].

పేడి రూ. పేడియ, పేడె. వి. నపుంసకుడు. షండుడు. భార. విరా. 2.14 ; విశే. గర్వం మీసం లేనివాడు.

క. ఎడి, హేడి. పిరికివాడు. హెడె. కోడిపెట్ట. బేడ-, పోతు. పిరికి వాడు ; తు. హేడి, హేడె, ఏడి. పిరికి వాడు ; త. పేటన్. నపుంసకుడు. పేడై. పెట్ట ;

సం. షండ-. నపుంసకుడు.

పేడితనము వి. నపుంసక లక్షణం. భార.విరా. 1.87.

పేడిమొగము వి. మీసం, గర్వం లేని మొహం.

పేడిగొ రూ.చూ. పేడి. విశే. గర్వం, మీసం లేనివాడు.

పేడు రూ. పేండు. వి. 1. దార్వాదుల సన్న చెక్క. ఆం.భా. 2.38 ; 2. పన్నెకట్టుబడిలో దండెలమధ్య దువ్వెన పళ్ళ మాదిరిగా వరసగా కట్టిన కలప, జొన్న, గలుగు, వెదురు, కొండచీపురు మొ. వాటి పుల్ల.

పేడుతివ్వ వి. కొండలమీద పెరిగే ఒక తీగ (Elematis gouriana). పేడులువాఱు(-పాఱు[3]) అ.క్రి. 1. పగులు. ఉద్భటా. 1.111 ; 2. నశించు. పేడెత్తు రూ.చూ. పేటెత్తు. అ.క్రి. 1. తొలగు, స్వస్థానం నుంచి చలించు. మను. 4, అచ్చ.రా.యు. 111 ; 2. పోవు, నశించు. కాశీ. 1.125 ; 3. బీటలువారు, పగులు. పార్వ. 4.157 ; 4. అభిప్రాయభేదం కలుగు ; స.క్రి. విడు, వదలు. <పేడు+ఎత్తు[1]. పేళ్ళదుగ్గు వి. ఆము పడుగులోకి వాడే చెక్కపేడు సుని.

పేడె రూ.చూ. పేడి. విశే. గర్వం, మీసం లేనివాడు.

పేడెమూతి వి. గర్వం, మీసం లేని ముఖం.

పేడెత్తు చూ. పేడు.

పేణిక వి. కత్తి వెనక భాగం. ఆం.భా. 2.214.

పేణి వి. భక్ష్య విశేషం. హంస. 1.105.

సం. ఫేనికా. పక్వాన్న భేదం, భక్ష్య విశేషం, కాజా ; ప్రా. ఫేణియా. భక్ష్య విశేషం ; హి. ఫిణీ ; నే. ఫిని ; అ.బెం. ఫేని ; ఒ. పేణీ ; పం. ఫేణీ ;

క. పేణీ.

<ప్రా. ఫేణియా.

పేంటసుంకము చూ. పేఁట[1]. వి. అంగళ్ళలో అమ్మే వస్తువులపై విధించబడే సుంకం. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 702. క్రి.శ. 1440.

పేంటు వి. కాలి కింది భాగం వరకు ఉండే లాగు.

ఇం. *Pants*. ట్రౌజరు, ఒకరకం లాగు.

<ఇం. Pants.

పేండ రూ.చూ. పెంట[1]. వి. పశువుల మలం.

పేండు రూ.చూ. పేడు. వి. చూరుకు ఆధారంగా గోడలో నాటిన కర్ర.

పేఁట[1] రూ.చూ. పెంట[2]. వి. 1. నగరం, పట్టణం. కవిజనా. 3.17 ; 2. శాఖానగరం, పట్టణానికంటి ఉండే చిన్న ఊరు. బ్రహ్మో. 4.131 ; 3. విపణి ప్రదేశం, అంగడి వీధి. ఆం.భా. 2.12 ; 4. పోగు. పొంబ. నానా. 89 ; 5. పల్లె ; 6. చోటు ; 7. పేర్పులో వరస.

పేఁటవయివిదొరవలె అవ్య. ద్రు. ఒక పేటపై అధికారం గల దొరవలె. ఉ.హరి. 4.46. పేఁటవేయు స.క్రి. కుండల్ని ఒకదాని మీద ఒకటి దొంతిగా పేర్చు.

పేఁట[2] చూ. పేఁడు.

పేఁడ రూ.చూ. పెంట[1]. వి. గోమహిషాదుల విష్ఠ, గోమయం. భీమ. 3.102.

పేఁడకడి వి. పేడముద్ద. పేఁడకుప్ప రూ.చూ. పెంట కుప్ప. వి. పశువుల మలం ఒక చోట ఎత్తుగా వేసిన కుప్ప. పేఁడగువ్వ వి. పారావత విశేషం. పేఁడగెత్తాం వి. ఎరువుగా వేసే పేడ. పేఁడతుంగ వి. తుంగలో ఒకరకం. పేఁడదిబ్బ రూ.చూ. పెండదిబ్బ. వి. పేడను కుప్పగా వేయటం. పేఁడపిడ్లు రూ.చూ. పేస్నీళ్లు. వి.బ.వ. కలయంపి. పేఁడ పిడ్లచల్లు అ.క్రి. అవమానించు. పేఁడపల్లిక వి. పశువుల పేడఎత్తే తట్ట. పేఁడపట్టగొర్కు వి. పేడ కడిపై రేచే

భార.విరా. 5.401. <పొలుపు[1]+ఒందు.

పొలుపు[2] రూ. పొల్పు[2]. వి. 1. మర్యాద. పంచ.చ. 2.118 పు.; 2. విధం, రీతి. భార.భీష్మ. 3.241.

క. పొలబు, పొలమ్బు. విధం, రీతి, పరిస్థితులు.

పొలుపు[3] రూ.చూ. పలుపు. వి. 1. పశువు, గుర్రాలు మొ. వాటి మెడకు కట్టే తాడు, తలుగు; 2. గానుగ దూలాన్ని కాడితో కలిపి కట్టే లావుపాటి తాడు.

పొలుపెసలారు చూ. పొలువు[1].

పొలుపొదవు చూ. పొలువు[1].

పొలుపొందు చూ. పొలుపు[1].

పొలుమేర రూ.చూ. పొలమేర. వి. సరిహద్దు.

పొలుమెరివిక వి. ఒకరకం మొక్క (Cadaba indica).

పొలువ చూ. పొలు.విశే. 1. దుష్టుడు, చెడ్డవాడు. భార.శాంతి. 3.439; 2. దీనుడు, దుస్థితిలో ఉన్నవాడు. భార.అను. 5.107.

పొలువతనము వి. చెడ్డతనం, దుర్జనత్వం. భార. స్త్రీ. 2.55.

పొలుసు రూ.చూ. పొలను[1]. వి. 1. చేపలు మొ. వాటి పై పొర; 2. నీచువాసన.

పొలెన్ను రూ.చూ. పొలైన్ను. వి. వరితెగులు.

పొలోటు చూ. పొలి[1].

పొల్క రూ.చూ. పొలుక. వి. పుర్రాంజలి, ఒకజాతి అడవి కోడి.

పొల్చు రూ.చూ. పొలుచు[1]. అ.క్రి. 1. ఒప్పు. భార.ఆది. 7.271; 2. బయలుదేరు, వెడలు. కు.సం. 4.87; 3. కనపడు, గోచరించు; 4. (గాలి) వీచు, వినురు; 5. (సూర్యుడు మొ. వి). ఉదయించు; 6. కలుగు, పుట్టు; 7. (దేవతాదులు) ప్రత్యక్షమగు; 8. స్థిరమగు; 9. బయల్పడు.

పొల్చేట చూ. పొలి[1].

పొల్తి రూ.చూ. పొలఁతి. వి. స్త్రీ, ఆడది. భార.సభా. 2.214.

పొల్తుక రూ.చూ. పొలఁతుక. వి. స్త్రీ, ఆడది. కు.సం. 8.66.

పొల్పగు చూ. పొల్పు[1].

పొల్పడరు చూ. పొల్పు[1].

పొల్పమరు చూ. పొల్పు[1].

పొల్పఱు చూ. పొల్పు[1].

పొల్పలరు చూ. పొల్పు[1].

పొల్పారు చూ. పొల్పు[1].

పొల్పు[1] రూ. పొలవు. పొలుపు[1]. విశే. 1. నియతం, న్యాయం. భార.ఆది. 4.137; 2. (సోటి) అందమైనది, సుందరమైనది. భార.అరణ్య. 1.44; 3. అధికం, ఎక్కుడు: వి. 1. ఒప్పు (అందం, సొగ, కాంతి మొ. వి). భార. అరణ్య. 4.142; 2. వికాసం. భార.ఉద్యో. 2.110; 3. స్థైర్యం, ప్రతాపం; 4. వృద్ధి, పెంపు; 5. పరిమళం, సువాసన; 6. పట్టు, విషయం; 7. ఉల్లాసం, ఆహ్లాదం; 8. రూపు, ఆకృతి; 9. జాడ.

క. పొలబు. అందం; త. పొలివు. ముఖం యొక్క కాంతి, అందం, సొగ, బంగారం. పొలమ్, పొలన్. బంగారం, అందం, నగ.

పొల్పగు అ.క్రి. ప్రకాశించు, ఒప్పు. కు.సం. 9.152. <పొల్పు[1]+అగు. పొల్పడరు అ.క్రి. ఒప్పు. కు.సం. 3.24. <పొల్పు[1]+అడరు. పొల్పమరు. అ.క్రి. ఒప్పు, ప్రకాశించు. హరి. 7.120. <పొల్పు[1]+అమరు. పొల్పఱు రూ.చూ. పొలుపఱు. అ.క్రి. 1. చెన్నుదొరగు, ఏపుచెడు. రామాభ్యు. 5.53; 2. క్షీణించు, తగ్గు; 3. నశించు. పోవు. <పొల్పు[1]+అఱు[1]. పొల్పలరు అ.క్రి. ఒప్పారు, పొల్పారు. రాఘవ. 3.100. <పొల్పు[1]+అలరు. పొల్పారు రూ.చూ. పొలుపారు. అ.క్రి. 1. అతిశయించు. భార.శాంతి. 2.418; 2. ప్రకాశించు, ఒప్పు. శృం.నై. 6.54. <పొల్పు[1]+ఆరు[1]. పొల్పుమీఱు రూ.చూ. పొలుపుమీఱు. అ.క్రి. 1. ఒప్పు, పొలార్చు. కళా. 3.17; 2. అతిశయించు. పొల్పెసఁగు అ.క్రి. ఒప్పు, ప్రకాశించు. భార. కర్ణ. 2.125. <పొల్పు[1]+ఎసఁగు. పొల్పెసలారు రూ. పొలుపెసలారు. అ.క్రి. ఒప్పు, శోభించు, ప్రకాశించు. శృం.నై. 3.166. <పొల్పు[1]+ఎసలారు. పొల్పొందు రూ.చూ. పొలుపొందు. అ.క్రి. ఒప్పు, శోభిల్లు. పల్నా వు. 33. <పొల్పు[1]+ఒందు.

పొల్పు[2] రూ.చూ. పొలుపు[2]. వి. 1. విధం, రీతి; 2. మర్యాద.

పొల్పెసఁగు చూ. పొల్పు[1].

పొల్పెసలారు చూ. పొల్పు[1].

పొల్పొందు చూ. పొల్పు[1].

పొల్మరు రూ.చూ. పొలమేర. వి. ఊరి సరిహద్దు.

పొల్మారు రూ.చూ. పొలమేర. వి. ఊరి సరిహద్దు.

పొల్మెర రూ.చూ. పొలమేర. వి. ఊరి సరిహద్దు.

పొల్ల[1] రూ. పల్లు[3], పొలు, పొల్లు. వి. 1. గింజ పట్టని ధాన్యం, తప్పు. కు.సం. 11.46; 2. కళ్ళంలో మెదిగిన గడ్డి పరకలు; 3. అనాథ బాలిక; విశే. పనికిమాలిన. భార.అను. 4.386.

క. పొల్ల. తప్పు; త. పుల్;

సం. పలాల-. గింజలేని వరిపోచ మొ. వి.

పొల్లకట్ట రూ.చూ. పొల్లుకట్టు. వి. కళ్ళం ఊడ్పుటానికి ఉపయోగించే కంది మండల చీపురు. పొల్లకట్టు వి. పొల్లుధాన్యం. ఆము. 4.13. పొల్లతనము రూ. పొల్లఁదనము, పొల్లుఁదనము. వి. 1. న్యూనత, లాఘవం. భార. కర్ణ. 1.133, 2. పిరికితనం. భార. అరణ్య. 6.62. పొల్లఁదనము(-తనము) రూ.చూ. పొల్లతనము. వి. 1. న్యూనత, లాఘవం; 2. పిరికితనం. పొల్లపుచ్చు స.క్రి. తగ్గించు, క్షీణింపచేయు. పొల్లవడు(-వడు) అ.క్రి. క్షీణించు. పొల్లపుచ్చు(-పుచ్చు) స.క్రి. పొల్లపోవచేయు. పొల్లవోవు(పోవు-) అ.క్రి. 1. వమ్మగు, వ్యర్థమగు. భార. ద్రోణ. 5.402; 2. చెడిపోవు, నష్టమగు. ఉ.హరి. 2.26. పొల్లసేయు(-చేయు) రూ. పొల్లుచేయు. స.క్రి. 1. అలక్ష్యం చేయు, నిరాకరించు. నిర్వ.రా. 8.93; 2. వ్యర్థంచేయు, వమ్ముచేయు. పద్మ. 9.51.

పొల్ల¹ రూ.చూ. పొట్ల. వి. తోటల్లోను పెరళ్ళలోను కాయల కోసం పెంచే తీగెమొక్క (Trichosanthus Anguina).

పొల్లావు చూ. పొల్లు.

పొల్లాయి చూ. పొల్లు.

పొల్లి రూ. పోలి². వి. చిన్నపిల్ల.

పొల్లిపసరము వి. వ్యవసాయానికి ఉపయోగించని పశువు. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 753. క్రీ.శ. 1522.

పొల్లికట్టదంచు చూ. పొల్లు.

పొల్లు రూ.చూ. పొల్ల¹. వి. 1. నిరర్థక శబ్దం, హల్లుమాట. పండి.ఎ. 1 6ప. 2. గింజలేని ధాన్యం, తప్ప. భాగ. 10 పూ. 551; 3. అచ్చులేని హల్లు. అప్ప. 2 36; 4. కళ్ళంలో మెదిగిన గడ్డిపరకలు; 5. అస్థిరమైన మనస్సు; 6. పెమురుగడ చివర గొరపలిని కట్టిన సాధనం; 7. మధ్యలో నీళ్ళుపోని గచ్చును గట్టిపరచటానికి ఓలుగా మట్టితో కట్టే కట్ట; విశ. 1. న్యూనత, తక్కువ. భార. భీష్మ. 2.161; 2. వ్యర్థం, నిష్ప్రయోజనం. భార. ద్రోణ. 3.199; 3. అసత్యం. అబద్ధం. భార. శల్య. 2.56; 4. చెడినది, పాడైనది. కవిక. 5.17; 5. నిస్సారం. సారం లేనిది. దశ. 9 60; 6. ఉన్నట్టుండి మనస్సురేగు; స.క్రి. పొల్లుగా పలుకు. పేలు. శుక. 4.74.

క. పొళ్ళు, పొళ్ళు. శూన్యమైన, ఖాళీమైన. పనికి మాలిన, పొళ్ళుమాతు. ఖాళీ, విఫలమైన మాట; కొడ. పొళ్ళునెల్లి. గింజలు లేని ధాన్యపు వెన్ను, పొళ్ళు. ఖాళీ, తక్కువ. బరువు; తు. పొళ్ళు, పొల్లు, పొళ్ళు. గుంజు తీసివేసిన (పండు). ఖాళీ. పిటికి; త. పొల్లు. గడ్డి మొక్కలమీద ఉండే పొట్టులాంటి పదార్థం లేక ధాన్యం పొల్లు; మ. పొళ్ళు. ఖాళీ, శూన్యం, పొళ్ళుకాయి. అకాలంలో వచ్చిన పండు లేక ధాన్యం; తొ. పిళ్. పొల్లు; గోం. పొల్లుతు. పొల్లు, పొల్లేతె. పొల్లుకోవన్న; కుఇ. పొల్లు. (బహు. పొల్క). పొల్లు. తప్పు, కువి. పొయా. పొల్లు, తప్పు; పర్జి. పొల్. తప్పు, పొల్క. శూన్యం, శూన్యమైన; నా. పొల్లే. పొల్లు; మాల్తో. పొల్సొ. శూన్యం.

చూ.సం. పులాక-. ముడుచుకొన్న ధాన్యం. పులాస-. శుష్కధాన్యం; ప్రా. ప్రలాగ-, పులాయ-. పా. పులక-; సం. పల్లు. నీరసం, బలహీనం; ప్రా. పొల్ల-. శూన్యం. పట్టిక.

పొల్లావు వి. కల్ల, అసత్యం. ప్రబంధ. 626. < పొల్లు + ఆవు². పొల్లాయి వి. కళ్ళంలో చెల్లించే ఒకరకం పన్ను. సం. ఆయ-. పన్ను, రాబడి. < పొల్లు + సం. ఆయ-. పొల్లికట్టదంచు అ.క్రి. వ్యర్థ ప్రయత్నం చేయు. పొల్లుకట్ట రూ.చూ. పొల్లుకట్టు. వి. కళ్ళాలలో ధాన్యాన్ని తూర్పార బోసిన తరవాత కట్టగా ఏర్పడిన పొట్టు. పొల్లకట్టలు వి.బ.వ. పిచ్చి వెల్లువ నీళ్ళు పొర్లి పైకివచ్చి తీర గ్రామాలకు దెబ్బ తగలకుండా ఉండటానికి నదికి ఇరుప్రక్కలా పోసిన పెద్దకట్టలు. పొల్లుకట్టు రూ. పొల్లకట్ట, పొల్లుకట్ట, పొల్లుగట్ట. వి. తూర్పార పోసేటప్పుడు పొలుదాసి దగ్గర పడే పొట్టు, గింజలు కలిసిన భాగం. పొల్లుకూతలు వి.బ.వ. వ్యర్థ వాక్యాలు. పొల్లుగట్ట రూ.చూ. పొల్లుకట్టు. వి. తూర్పార పోసేటప్పుడు మేలు రాసి దగ్గర పడే పొట్టు. గింజలు కలిసిన భాగం. పొల్లుగాడు వి. లెక్కకు రానివాడు. పొల్లుగుడ్డు వి. పిల్ల పిగలటానికి అవసరమైన జీవకణాలు లేని కోడిగుడ్డు. పొల్లుదనము (-తనము) చూ. పొల్లతనము వి. 1. అపౌరుషం; 2. న్యూనత. పొల్లుపొయ్యి వి. పొట్టులోపలికి కూర్చి మంట పెట్టే గుంటని పొయ్యి. పొల్లుపోవు అ.క్రి. పదుగులో పై పోగులకు కింద పోగులకు మధ్య అని చెడిపోవు. పొల్లుబాకీలు వి.బ.వ. వసూలుకాని బాకీలు. పొల్లుమాట వి. వ్యర్థ వాక్కు. పొల్లులు వి.బ.వ. వ్యర్థమైన మాటలు. పొల్లువడు (-పడు) అ.క్రి. 1. తగ్గు, క్షీణించు; 2. వ్యర్థమగు. పొల్లువోవు(-పోవు) రూ. పొల్వోవు. అ.క్రి 1. వ్యర్థమగు, నిష్ఫలమగు. భార. ద్రోణ. 3.199; 2. నిస్సారమగు, శక్తిహీనమగు. పారి. 5.12; 3. తగ్గు, క్షీణించు. విష్ణుపు. 1.149. పొల్లుసేయు(-చేయు) రూ.చూ. పొల్లచేయు. స.క్రి. 1. తక్కువపరుచు. మార్క. పీఠి. 89; 2. వ్యర్థంచేయు. పార్వ. 4.70. పొల్లెన్ను రూ. పొలెన్ను. వి. పరితెగులు, కంకిగాడ తొలిచే పురుగువల్ల తాలుగింజలు పడిన ఎన్ను. పొల్వోవు(-పోవు) రూ.చూ. పొల్లుపోవు. అ.క్రి. చెడిపోవు. చంపూరా. 2.35.

పొల్లెన్ను చూ. పొల్లు.

పొల్వాటం చూ. పొలి¹.

పొల్వోవు చూ. పొల్లు.

పొల్సు రూ.చూ. పొలుసు¹. వి. 1. చేప పొలుసువల్ల వచ్చే దుర్గంధం. చేపకంపు; 2. చేపమీది పొలుసు; 3. మాంస దుర్గంధం; 4. మాంసం.

పొళవు వి. ఓడాదండం.

పొళ్ల రూ.చూ. పొట్ల. వి. ఒకానొక తీగ, పటోలిక, పొట్ల. ఆం.భా. 2.60 (Trichosanthes Anguina).

పొళ్లకాయ రూ.చూ. పొట్లకాయ. వి. పాములాగా పొడుగ్గా ఉండే కాయ విశేషం.

పొళ్లపొళ్లగ బొడిపించు(-పొడిపించు) చూ. పొడి¹. స.క్రి. సలగ తన్ను. ఆము. 4.256.

పొళ్లులు వి బ.వ. బాలికా క్రీడావిశేషం. హంస. 5.155.

పొవ రూ.చూ. పొగ. వి. పొగ, ధూమం. పి.శకు. 3.35.

పొవర రూ.చూ. పొగర. వి. పొగర, పకరం.

పొవరు రూ.చూ. పొగడు. స.క్రి. స్తుతించు; వి. స్తుతి.

పొవయు చూ. పొవ. రూ.చూ. పొగయు. అ.క్రి. 1. కుసులు, లోలోపల తపించు. భార. సభా. 1.254; 2. పొగ చిమ్ము. పొగకలదగు. కకుత్స్థ. 5.37.

పొవరు రూ.చూ. పొగరు. వి. అతిశయం, పెంపు. శుక. 2.438.

పొవ్వు రూ.చూ. పొవ్వు. వి. బట్టీలలో నిప్పు పెట్టటానికి తెరిచి ఉంచిన రంధ్రం.

పొవులు రూ.చూ. పొగులు. అ.క్రి. పరితపించు, బాధపడు. భాస్క.రా.యు. 2640.

పొవ్వాకు రూ.చూ. పొగాకు. వి. పదిహేనో శతాబ్దంలో పోర్చుగీసువారు మనదేశంలో ప్రవేశపెట్టిన పత్రకపు పైరు. (Nicotiana tabacum).

పొవ్వ రూ. పొవ. వి. 1. బట్టీలలో నిప్పు పెట్టటానికి తెరిచి ఉంచిన రంధ్రం ; 2. కట్టెలు పెట్టి వంటచేయటానికి కుమ్మరి తయారుచేసే పొయ్యి.

పొవ్వలగమల వి. మొగం కైవారం వెడల్పుగా ఉండే మట్టి పాత్ర. పొవ్వలబట్టీ వి. చాలా పొయ్యిలున్న గుండ్రటి బట్టీ. పొవ్వలమన్ను వి. వడ్లపొట్టు మని కలిపి మురగబెట్టిన మట్టి.

పొసక వి. పొట్టకల మనుష్యుడు, బుండిలుడు. లంద. ఆం.రా. 2.120.

పొసఁగించు చూ. పొసఁగు.

పొసఁగింపు చూ. పొసఁగు.

పొసఁగు రూ. పసఁగు. అ.క్రి. 1. సఖ్యపడు, పొత్తుగాఉండు. భార.ఉద్యో. 2.31 ; 2. కుదురు, నెరవేరు, సిద్ధించు. భార.ఉద్యో. 3.287 ; 3. తగు, యుక్తమగు. భార. ఉద్యో. 4.62 ; 4. చెల్లు, సాగు. భార.ద్రోణ. 1.362 ; 5. కలుగు, పుట్టు. భార.శాంతి. 2.303 ; 6. కూడు, కవియు. హరి.ఉ. 6.70 ; 7. సాధకమగు, సఫలమగు. రం. రా.అయోధ్యా. 111వ. 3 పం. ; 8. ఒప్పు, వెలయు. శృం. నై. 8.70 ; 9. సంగతమగు, సరిపడు. కాశీ. 5.97 ; 10. శక్యమగు, సాధ్యమగు. విక్ర. 6.24 ; 11. ప్రియమగు, ఇష్టమగు. ఆము. 4.102 ; 12. చాలు, సమర్థమగు. వసు. 3.149 ; 13. సంభవించు, తటస్థించు. ప్రభా. 1.128 ; 14. ప్రకాశించు, శోభించు. జాహ్న. 1.97 ; 15. లభించు, దొరకు. కళా. 2.20 ; 16. నడచు, ప్రవర్తించు. హంస. 1.144 ; 17. విశదమగు.

క. పొసయిసు, పొసవిసు. కలియు, దగ్గరగావచ్చు, అతికించు, తగిలించు ; త. పొరుజ్ఞు (పొరుజ్ఞ్-). కలసిఉండు, అంగీకరించు . తె. పొచ్ (పొచ్-). కలిసి ఉండు (దుస్తులు), తగియుండు, పసై.

మూ.ద్రా. *పొచ్-, *పొచ్-చ్-, *పొచ్-/*పొక్-.

పొసఁగించు స.క్రి. 1. గ్రహించు, పట్టుకొను. ఇందు. 3.99 ; 2. పొసగచేయు, సమకూర్చు. హంస. 3.227 ; 3. చక్కగాపెట్టు, తాల్చు. శుక. 2.32. <పొసఁగు + -ఇంచు³. పొసఁగింపు వి. ఒంటింపు, అనుకూల్యం. పొసఁగుడు వి. పొసగటం, అనుకూల్యం. ప్రాప్తి. పొసఁగుడుకాఁడు వి. బేరం పొసగచేసే మనిషి.

పొసవరి క్రి.విశే.ద్రు. 1. మిక్కిలి, అత్యంతం. బసవ. 6.219 ; 2. విస్తృతంగా, విశాలంగా. పండి.చ. 3.200 వ.

పొసపొస క్రి.విశే.ద్రు. త్వరితంగా. ధ్వన్యను.

పొసపారు విశే. పసతో పోరాడేవాడు. శివ.సా. 4.81.

క. పొసెపొల్. మిక్కిలి పోరాడేవాడు.

పొసరాకు (-ఆకు) వి. దగ్గు తగ్గటానికిగాను వాసన చూడబడే ఒకరకం ఆకు.

పొసుకు వి. రోకళ్ళు మొ.వాటి తయారీకి పనికివచ్చే కలప నిచ్చే ఒకరకం లక్కవంటి పదార్థాన్నిచ్చే చెట్టు (Schleichera trijuga).

పొసురుపచ్చ రూ.చూ. పసరుపచ్చ. వి. ఆకుపచ్చరంగు.

పొసురుజొన్న రూ.చూ. పసరుజొన్న. వి. అన్నిటికంటె తొలినాటి శ్రేష్ఠమైన పచ్చజొన్న.

పొస్తకము రూ. పొస్తుకము. వి. పుస్తకం.

సం. పుస్తక-. గ్రంథం ; ప్రా. పుత్థ-, పుత్థయ . పొత్థ-, పొత్థయ-. పుస్తకం. పొత్థియ. గ్రంథం ; పా. పొత్థక- ; అ.మా. పుత్థయ-, పుల్థయ-, పొత్థ-, పొత్థగ-, పొత్థయ- ; అప. పొత్థా ;

క. పొత్తిగె, పొస్తక, పొస్తగ, పొస్తుక, పొత్తగె, పొత్తిగె ; మ. పొత్థకం ; కువి. పుస్తకొమి.

<సం. పుస్తక-.

పొస్తుకము రూ.చూ. పొస్తకము. వి. పుస్తకం.

పో రూ. పొ. అ.క్రి. 1. అవ్యయంగా ఉపయోగపడుతూ 'కదా' అనేదాని అర్థాన్నిస్తూ నిశ్చయాశ్చర్యాదుల్ని తెల్పుతుంది. భార.ద్రోణ. 2.65 ; 2. 'చూడు' అనేదాని అర్థమిస్తుంది. ఉ.హరి. 4.287 ; 3. 'కాక' అనేదాని అర్థమిస్తుంది. హర. 2.62 ; 4. ఆక్షేపణ నిరసనాదుల్ని తెలుపుతుంది. మను. 2.64.

పోక¹ చూ. పోవు¹.

పోక² వి. సిమెంటు గూనుల తయారీకి వాడే అచ్చు.

పోకడ చూ. పోవు¹.

పోకడగండి చూ. పోవు¹.

పోకడపెట్టు చూ. పోవు¹.

పోకడవెట్టు చూ. పోవు¹.

పోకర రూ.చూ. పోగర. వి. సుమారు నాలుగునుంచి ఎనిమిది అంగుళాలవరకు పొడవుండే ఇనప పనిముట్టు.

పోకలబోవు చూ. పోవు¹.

పోకలాఁడి చూ. పోవు¹.

పోకలాఁడు చూ. పోవు¹.

పోకలు చూ. పోవు¹.

పోకాడు చూ. పోవు¹.

పోకారుచు చూ. పోవు¹.

పోకార్చు చూ. పోవు¹.

పోకాలు చూ. పోవు¹.

పోకాలు చూ. పోవు¹.

పోకిరి రూ. పోకిరీ. విశే. దుశ్శీలుడు, దుర్మార్గ ప్రవర్తనం ఉన్నవాడు. పానంద. 4.10.

క. పొక, పొకరి. అతి దుర్మార్గుడు, దుష్టుడు ; తు. పొకె, పొకరి, పొకురి. పోకిరియైన, వ్యభిచారి, పొక. పోకిరి. వ్యభిచరించినవాడు ; త. పొక్కిరి, పొక్కిలి. దుర్మార్గుడు. దుష్టుడు ; మ. పొక్కిరి. మంచి ప్రవర్తన లేని, పోకిరియైనవాడు ; కో.పో. ప్రక్రియ్. చెడ్డవాడు ; పర్జి. పొకుబ్. దుడాకా ఖర్చు చేసేవాడు.

పోకిరీఁడు విశే. దుశ్శీలుడు, చెడ్డ నడవడిక కలవాడు. పానంద. 5.14. పోకిర్లమారి వి. దుర్మార్గ ప్రవర్తన కలవాడు, దుష్టశీలుడు. హంస. 5.113. పోకిర్లు వి.బ.వ.. 1. చేష్ట, ప్రవర్తనం. ఆష్టమ. క. 1.34 వ ; 2. దుశ్చేష్ట, చెడ్డ నడవడి. మృత్యు. 2.62. <పోకిరి + -లు.

పోకిరీ రూ.చూ. పోకిరి. విశే. 1. అల్లరి చిల్లరి ; 2. వ్యభిచారి.

పోకిరీఁడు చూ. పోకిరి.
పోకిళ్లమారి చూ. పోకిరి.
పోకిళ్లు చూ. పోకిరి.
పోకు¹ రూ. చూ. పోక¹. వి. 1. మాయాప్రవర్తనం, కపటచేష్ట. దార. శాంతి. 6.301; 2. చరిత్ర, వృత్తం. హరి. 4.72; 3. చేష్ట, ప్రవర్తనం. కావ్యా. చూ. 1.123; 4. నష్టి; 5. దొంగతనం.
పోకులఁబోవు అ.క్రి. 1. మాయలుపన్ను, పోకడపోవు. ఉ.హరి. 1.168. < పోకు¹ + -లు + -అ⁷ + పోవు.
పోకు² వి. పచ్చిక, పచ్చగడ్డి. హరి.పూ. 69.
త. పైక్కోల్. గడ్డిపరక.
పోక్తా రూ.చూ. పొక్తు. వి. 1. బుద్ధిమంతుడు; 2. నిపుణుడు.
పోక్పుపల్లలు వి.బ.వ. జాకార్డు దారిదారాలను ఆడించే పల్లలు.
పోగగు చూ. పోగు¹.
పోగంత చూ. పోవు¹.
పోగర రూ. పోకర, పోగరు, పోగారు. వి. నగిషీ చెక్కటం కోసం స్వర్ణకారులుపయోగించే సాధన విశేషం.
త. పోకర్ వేలై. నగిషీపని.
పోగరు రూ.చూ. పోగర. వి. సుమారు నాలుగునుంచి ఎనిమిది అంగుళాల వరకు పొడవుండే ఇనప పనిముట్టు.
పోగారు రూ.చూ. పోగర. వి. 1. రాళ్ళమీద గీతలు గీయటానికి వాడే పెడల్పాటి సాధనం; 2. మగగురి.
పోగాలమువచ్చు చూ. పోవు¹.
పోగిన వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146.
పోగు¹ రూ.చూ. ప్రోవు. వి. 1. రాశి, కుప్ప; 2. పెంటకుప్ప; 3. పాత్రల తయారీకి ఒకచోట పోసిన పాకం, మట్టిదిబ్బ.
పోగగు అ.క్రి. దాపురించు. < పోగు¹ + అగు. పోగుపడుఁదగుల్పడు(-తగుల్పడు) అ.క్రి. చెవినిపడు. ప్రబా. 5.76. పోగుపడు అ.క్రి. సందడించు. పోగుపెట్టు అ.క్రి. పాకం చేసిన మట్టిని ఒకచోట రాశిగా వేయు. పోగులు పోయు స.క్రి. బాగుగా సంపాదించు. పోగులువేయు స.క్రి. గొర్రె, పొట్టేలు మొ. వేటలను కోసి కుప్పలు పెట్టు. పోగువేయు స.క్రి. పాకంచేసిన మట్టిని ఒకచోట రాశిగా వేయు. పోగాట వి. చేర్పటం. < పోగు¹ + ఆట.
పోగు² చూ. పోగరు. స.క్రి. పోగరతో రాచు.
క.త పొక్కు. పోగొట్టు.
పోగాట చూ. పోగు¹.
పోఁక చూ. పోవు¹. వి. సంధ్యాకాలం. కు.సం. 8.89.
పోఁకకోట చూ. పోఁక. వి. పోకకోట. ద.హిం.శా. సంపు. 4. క్రీ.శ. 1021.
పోఁకపెయిక చూ. పోఁక. వి. ఎద్దు మొ. వాటిమీద వేసి మోయించి తెచ్చే పోకల గోనెమూట. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 935. క్రీ.శ. 1191.
పోఁకబండి బయలుంగవ్ను వావాధాన్యాలు చూ. పోఁక. వి.బ.వ. వివిధాలైన తలమోపు ధాన్యాలు. నె.శా. దర్శి శాసనం. 35. క్రీ.శ. 1310.
పోఁకమోపు చూ. పోఁక. వి. పోకచెక్కల భారం, తలకట్టు.
పోఁక వి. 1. క్రముక ఫలం, పోకపండు పోకచెక్క. ద్రాక్షారామం శాసనం. క్రీ.శ. 1084; 2. క్రముక వృక్షం, పోకచెట్టు. భీమ. 1.96 (Areca catechu); 3. (పోకకాయలా ఉండే) శిశ్నాగ్రం; 4. బొండం ఒల్చిన పూగ ఫలం; 5. చన్ను, స్తనం, చనుమొన, చూచుకం; వి.బ.వ. ముద్దుకోర్కెలు.
పో.చూ.త. పాక్కు, పాక్కమ్. పాకు; మ. పాక్కు; తు. పాకుట్టి. వక్క కాయల్ని కత్తిరించటానికి వాడే కత్తి; క. పాక్కు. పోకకాయ, పోకచెట్టు, పాకు. పోకకాయ. పాక్కు-వెట్టి. పోకకాయ ముక్కలు చెయ్యటానికి వాడే పేలుడు సామాను; మ. పాక్కు. పచ్చిపోకకాయ. పాక్కు-వెట్టి. వక్కల కత్తి.
చూ.సం. పూగ-. పోక; ప్రా. పూగ-.
పోఁకకుఁబుట్టిఁదగు (-పుట్టిఁదగు) అ.క్రి. ధాన్యం అతి చౌకగా లభించు. జైమినిభా. 6.9. పోఁకగండి వి. క్రముక ఫలసారం, కాచు, కవిరి. పోఁకగంజియుండ(-ఉండ) వి. కవిరి ఉండ. పోఁకగెల వి. గోలకం. పోఁకచెక్క వి. పూగ ఖండం, పోకముక్క. పోఁకంత వి. కొంచెం. భీమ. 2.124. < పోఁక + -అంత. పోఁకందుకొను(-అందుకొను) అ.క్రి. ఆహ్వానమందుకొను. శాకు.సం. 13.103. పోఁకపట్ట వి. ఖపరం. పోఁకపట్టనార వి. పోకచెట్టునుంచి తీసిన నార. పోఁకపండు వి. క్రముక వృక్షఫలం. కళా. 1.26. పోఁకపూవు వి. అంచులో పోకపువ్వు ఆకారంలో నేసిన డిజైను. పోఁకపేరు వి. భక్ష్యవిశేషం. చమ. 3.87. పోఁకపాడి వి. తాంబూలం. పోఁకపాత్రము వి. పోకచెట్టు బొందె అట్టతో కట్టిన పాత్రం. పోఁకపాత్రి వి. క్రముక పర్ణపు పట్ట. ద్వి. పరమ. వి. 7.510 ప. పోఁకబగరు వి. ఒకరకం కలుపుమొక్క. పోఁకబద్ద వి. పన్నె కట్టుబడిలో ఊనెపల్లల వరసకు చివర ఒగించిన వెడల్పుబద్ద. పోఁకబద్దలు వి.బ.వ. మోటబొక్కెన పలిగానికి వేసిన ఇనప చువ్వలు. పోఁకబంతి వి. ఒకరకం నీలంరంగు. పోఁకబంతిపువ్వు వి. ఒకజాతి బంతిపువ్వు. పోఁకమాను వి. రొంపిమాను, లొల్ల, చదునుపట్టె. పోఁకమామిడి వి. ఒకరకం మామిడి. పోఁకముంగిరుమాలు వి. పోకరంగు గళ్ళు పడేట్టు నేసిన ఒకరకం తలపాగ. పోఁకముడి వి. చీర చెంగు కొలిచుట్టులో వేసుకొనే ముడి. శివ. ఇందు. 6.5. హంస. 3.219. పోఁకరంగు వి. 1. నల్ల పోకచెక్క రంగు; 2. గంజి వంకాయ రంగు. పోఁకరంగురుమాలు వి. పోకరంగు పెట్టి నేసిన తలపాగ. పోఁకవక్క రూ.చూ. పోఁకవ్రక్క. వి. గొంటువక్క. విప్ర. 5.19. పోఁకవెట్టు(-పెట్టు) స.క్రి. బహుమానమిచ్చు. శాకు. సం. 16.2.38. పోఁకవ్రక్క రూ. పోఁకవక్క. వి. పూగ ఖండం, పోకచెక్క. వేం. పంచ. 1.433. పోఁకవెక్క (-చెక్క) రూ.చూ. పాకచెక్క. వి. నేత నేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్కలు. పోఁకుండ వి. పోకకాయలా గుండ్రంగా చేసే తియ్యటి భక్ష్యవిశేషం. పోఁకొత్తు వి. పూగ దళని. ఆం.భా. 2.167. < పోఁక + ఒత్తు.
పోఁకు వి. మంచు కడిసిన గడ్డి. హరి.పూ. 6.10.
పోఁకుండ చూ. పోఁక.

**పోఁగొత్తు** చూ. పోఁక.

**పోఁగటుకు** చూ. పోఁగు.

**పోఁగు** రూ. పోఁపు², ప్రోఁగు. వి. **1.** కర్ణభూషావిశేషం, చెవులకు కుట్టే సన్నని లోహపు తీగ. హర. 5.56; **2.** తంతువు, దారం. కాశీ. 2.97; **3.** పోఁగుతాడు, వేటాడే చోట చుట్టూ పరిచే తాడులాంటిది, జంతువుల్ని పట్టటానికి పనికివచ్చే ఉచ్చు, వాగుర, ఉచ్చు; **4.** (ముక్కుకి పెట్టుకొనే) బంగారం మొదలైన వాటితో చేసిన కాడ; **5.** నారలోని ఒక ఈనె; **6.** జంధెం; విశ. యజ్ఞోపవీతంకల. తాళ్ల.సం. 7.137.

క. పొట్. పగలగొట్టు, పగులు, భాగాలుగా విడిపడు, పగులు, ముక్క, పొటల్. చెట్టులో ఏర్పడ్డ ఖాళీ, పొయు. పగలగొట్టటం, పొటె. చెట్టులో రంధ్రం, ఖాళీ ప్రదేశం, పొట్టె, పొట్టురె, పొట్రె. చెట్టులో రంధ్రం, చెట్టుయొక్క ఖాళీ ప్రదేశం; త. పొట్(-వ్-, -న్ట్-). పగిలి ఉండు, పగులు, ఖాళీ, కలతకపోవు, నాశనంచేయు, ముక్క, పొయ్యి. పగులు, ఓటి. పొట్-వాయ్. తెరిచిననోరు, పొఝు. రంధ్రం, ద్వారం, పగులు; కో. బొ.ట్. చెట్టు బోదెలో ఉన్న ఖాళీ ప్రదేశం, లోపల కంటా వెళ్ళే రంధ్రం; పర్జి. పొడ్. పగలగొట్టు, ఓటి.

**పోఁగతుకు** వి. పడుగుపోగు, ఒక్కపోగు కలిపి వడి పెట్టటం: అ.క్రి. పోగును అతుకు. <పోఁగు+అతుకు. **పోఁగుచట్ట** రూ.చూ. ప్రోఁగుచుట్ట. వి. వేట కుపయోగించే సాధన విశేషం. సానంద. 5.54. **పోఁగుతీయు** అ.క్రి. రాట్నంమీదగాని చేతి కదురుమీద గాని ఏకునుంచి దారం తీయు. **పోఁగుదండు** అ.క్రి. గొంగడి నేసేటప్పుడు చేముతో కొట్టిన పేకపోగు నేతలో కలిసిపోవు. **పోఁగుదిగఁబోయు** అ.క్రి. పన్నె ఈనెల మధ్య సందులో పోగుదూర్చు. <పోఁగు+దిగు+-అ[7]+పోయు. **పోఁగుఁద్రాడు (-త్రాడు)** వి. **1.** వేటాడేచోట చుట్టూ ఏర్పడే తాడు. యయా. 1.111; **2.** జంధెం. **పోఁగుపడులు** అ.క్రి. పేకదారం పోగులు దూరదూరంగా పడు. **పోఁగుపల్ల** వి. చేతి నాడెగాడెలో అడ్డంగా బిగించిన పల్ల. **పోఁగుపోఁగుపొందు** అ.క్రి. కలిసి మెలసి ఉండు. తాళ్ల.సం. 17.369. **పోఁగుపోఁత** వి. పోగుపోయటం. **పోఁగుపోయు** అ.క్రి. **1.** నంతన కోసం తిన్నగా పోగుపారించి కుట్టు, రఫ్ఫుతీయు: **2.** పచ్చి నూలుతో మంగళసూత్రాన్ని పేని సిద్ధం చేయు: **3.** రాట్నం కదురుకు గుచ్చిన జొన్నదంటు వల్లకు దారపు పోగు చుట్టు. **పోఁగులగొంగడి** వి. ఏదైనా ఒకరకం రంగు ఉన్నిలో మరొకరంగు ఉన్ని కలిపేట్టు గీరలు గీరలుగా నేసిన గొంగడి. **పోఁగులువెరుపు** అ.క్రి. నరిచేసేటప్పుడు నూలు పోగులు చిక్కులు లేకుండా సాఫుగా పరచు. **పోఁగువాటించు(-పాటించు)** రూ.చూ. ప్రోఁగువాటించు. అ.క్రి. పోగువారు. ఉ.రా. 7.407. **పోఁగువాఱు(-పాఱు)** రూ.చూ. ప్రోఁగువాఱు. అ.క్రి. పోగులావ్యాపించు. కకుత్స్థ. 4.72. **పోఁగువిప్పు** అ.క్రి. పడుగేసే కర్రల మీద పోగులు విడదీయు. **పోఁగువేయు** అ.క్రి. నాగబెద్దులపై వారిని సర్దుతూ దారం పూన్చు. **పోఁగూదు** అ.క్రి. నాడె పూసలో నుంచి పేకదారం పోగునోటితో బయటికి పీల్చు. <పోఁగు+ఊఁదు. **పోఁగూపట్రా** యా.చూ. పోఁగూపాట్రా. వి. నూలు, పోగు వగైరా. **పోఁగూపాట్రా** యా. పోఁగూపట్రా. వి. నూలు, పోగు వగైరా. <పోఁగు+-ఉస్+పాట్ర+-ఉస్. **పోఁగెత్తు** అ.క్రి. ప్రస్తావించు. <పోఁగు+ఎత్తు[1]. **పోఁగేరు** వి. పడుగేసు కర్రలమీద పోగు పోగు విడదీసి నెరుపు. <పోఁగు+ఏరు.

**పోఁగూదు** చూ. పోఁగు.

**పోఁగూపట్రా** చూ. పోఁగు.

**పోఁగూపాట్రా** చూ. పోఁగు.

**పోఁగెత్తు** చూ. పోఁగు.

**పోఁగేరు** చూ. పోఁగు.

**పోఁగొట్టు** చూ. పోవు[1].

**పోచాయించు** స.క్రి. అందించు.

హిం. పోంఛ్‌నా. శుద్ధిచేయు.

<పోంఛ్(నా)+-ఇంచు[3].

**పోచికోలు** చూ. పోఁచ. విశ. వ్యర్థమైన.

**పోచికోలురాయుడు** వి. లేనిపోని తంటాలు చెప్తూ కాలం వెళ్ళబుచ్చే వాడు.

**పోచిపోతఅయ్యలు** చూ. పోఁచ. వి.బ.వ. కబుర్ల రాయుళ్ళు.

**పోచిట్లు** రూ. ప్రోచిట్లు. వి.బ.వ. శకునం చూడటానికి జరుగు పోరుగు జళ్ళమీద నీళ్ళతో చల్లే అక్షతలు. రుక్మాం.చ. 3.223.

సం. ప్రోక్ష్-. చల్లు.

<సం. ప్రోక్ష్-.

**పోచీ** రూ.చూ. పొంచి. వి. మణికట్టుకు వేసుకొనే ఒకవిధమైన నగ.

**పోచెమ్మ(-అమ్మ)** వి. ఒక గ్రామదేవత.

**పోచు** రూ.చూ. పోసు. వి. తిరగమూత.

**పోజు** రూ.చూ. పోజు. వి. ఆంగిక విన్యాసం.

**పోఁచ** రూ. పోన[2], పూన, పోన. వి. **1.** (గడ్డిపరకలా సన్నగా ఉండే) దారం, పోగు. క్రీడా. 56; **2.** పరక. ఆము. 5.106; **3.** జీలకర్ర మొ. వాటి పరక, పాయ; **4.** గడ్డిపరక; **5.** పడుకు కట్టకు కట్టిన నార.

త. పైక్కోల్. గడ్డిపరక.

**పోఁచవాఁడు** విశ. దుష్టుడు.

**పోఁచి** రూ. పోఁచీ. వి. మణికట్టు మీది చోటు.

**పోఁచీ** రూ.చూ. పోఁచి. వి. **1.** మణిబంధ ప్రదేశం, మణికట్టు మీది చోటు; **2.** స్త్రీహస్తాభరణ విశేషం.

**పోఁచు**[1] అ.క్రి. తలపోయు, తలచు. పండి.గ. 1.82 వ.

**పోఁచు**[2] రూ.చూ. పోఁజు. స.క్రి. **1.** చీరు, చీల్చు; **2.** పత్తి, నార మొదలైన వాటిని నలుసులేకుండ బాగుచేయు.

**పోఁజు** రూ. పొంజు[1], పోఁచు[2], ప్రోజు[2], ప్రోఁజు. స.క్రి. **1.** చీరు, చీల్చు. భార.విరా. 5.35; **2.** ప్రత్తి, నార మొ. వాటిని నలుసు లేకుండ బాగుచేయు. ద్వి.పరమ. వి. 4.267.

క. పొజ్, పొఝు. చీల్చు, రెండుభాగాలుగా చేయు.

భాగం, ముక్క; త. పొళ్. పగిలి ఉండు, వేరగు, వేరు చేయు, పగులు; పర్జి. పో.ళ్. వేరుచేయు, చీల్చు.

< మూ.ద్రా. *పోళ్.

పోట విశే. పెద్ద.

పోటకత్తి వి. అడవిని నరికే పెద్దకత్తి. పరమ. 1.127. త. పొయుకత్తి. అడవిని నరికే కత్తి. పోటకంపలు రూ. పోటికంపలు. వి.బ.వ. పెద్దవిగా ఉండే కందులు. పోట కొర్ర రూ. పోటుకొర. వి. కొర్ర ధాన్యంలో ఒకరకం. పోటనగళము వి. 1. కక్కిన కనవు; 2. రెల్లుచేప; 3. పాముల్లో భేదం. సం. గళ-. కంఠం. పోటముంజి వి. పట్టి గోచి, పెద్దగోచి.

పోటకము రూ.చూ. పాటకము. వి. దేహమంతా బొబ్బలులేచే రోగ విశేషం. స్ఫోటకం. ఉం.రా. 2.130.

పోటకుఁడు వి. సేవకుడు.

త. పొట్ కన్. అసత్యవాది. మోసగాడు.

పోటపబంతి చూ. పోటు[1].

పోటరి చూ. పోటు[1].

పోటరితనము చూ. పోటు[1].

పోటరిమూట చూ. పోటు[1].

పోటఱ్ఱు చూ. పోటు[1].

పోటాకు చూ. పోటు[1].

పోటాడు చూ. పోటు[1].

పోటాపోటీ చూ. పోటి. పోటు[1]. వి. యాలం పాడేవాళ్ళు.

పోటార్చు చూ. పోటు[1].

పోటి రూ. పోటీ, పోటు[3]. వి. 1. స్పర్ధ, ద్వేషం. భీమ. 2.88; 2. పోటుకంబం. ఊతకొయ్య; 3. వ్యవసాయదార్లు పరస్పరం తమ కామలతో ఇతరుల పనికి తోడ్పడటం; 4. గిరాకీలేని వస్తువును గిరాకీగల సరుకుతో జోడించి అమ్మటం; విశే. మారు, ప్రతి, ఈడు, సదృశమైన. కాశీ. 6.304.

క. పొటి. పోటీ, శత్రుత్వం; తు. పొటి, పొటాపొటి. శత్రుత్వం; త. పొట్టి, పొటి. ఒకరితో సమానం కావాలనే కోరిక, ఎగతాళి.

పోటికట్ట వి. బట్టిగోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ. పోటికంపలు రూ.చూ. పోట కందులు. వి.బ.వ. పెద్దవిగా ఉండే కందులు. పోటిగర వి. పందిరి కాలిగుంజ. పోటిగాఁడు (-కాఁడు) వి. 1. సముడు, మిత్రుడు. ఆం.రా. 3.49; 2. పోటీకలవాడు. పోటిగుఱ్ఱము రూ. పోటిగుఱ్ఱము. వి. పందెంగుర్రం. శాకుం. 7.49. పోటిగుఱ్ఱము రూ.చూ. పోటిగుఱము. వి. పందెం గుర్రం. పోటిచేయు అ.క్రి. పంతగించు. పోటిదొర వి. స్పర్ధగల ప్రభువు. శాకు.నం. 17.287. పోటిపుట్టు అ.క్రి. స్పర్ధ ఏర్పడు. భీమ. 2.88.

పోటిపార్లు రూ.చూ. పొట్టిదారలు. వి.బ.వ. పడ్లలో ఒకరకం.

పోటీ రూ.చూ. పోటి. వి. 1. కట్టుబడి సమయంలో దర్వాజాలు మొదలైనవి కదలకుండా నిలపటానికి రెండుకర్రలను పై వైపున కట్టి కింద వంగటించి నిలిపిన వాల్కాలికవ పిర్పాలు; 2. నిర్మాణంలో రాకూడని తప్పు.

పోటీకర్ర వి. పరంజాను నిలిపే పొడుగాటి కర్ర. పోటీగుంజ వి. మోటబావి ఉద్దిమీద కామిరె (నిలుపుగుంజ) కు పోటీ పెట్టిన ఏటవాలు కొయ్య. పోటీగోడ వి. బట్టీగోడలు పక్కకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ. పోటీరాయి వి. రాతితో కట్టిన ఆర్చీకి మధ్య భాగంలో బలం కోసం దిగించిన పెద్దరాయి.

పోటీసార్లు రూ.చూ. పొట్టిదారలు. వి.బ.వ. వడ్లలో ఒకరకం.

పోటు[1] చూ. పొడుచు[1]. వి. 1. దెబ్బ, హతి. పెలిగల్లు కానసం. క్రీ.శ. 825; 2. పోరు, కయ్యం. కు.సం. 4.75; 3. (ఈటె, కొమ్ము, పిడికిలి మొ. వాని) పొడుపు, కుమ్ము. నిర్వ.రా. 4.48; 4. శౌర్యం, మగటిమి. భార. విరా. 5.255; 5. (రోగాదుల్లో) బాధ, నలుపు. వేమ. 1.60.

పోటపబంతి వి. పట్టెందు. వసు. 2.156. పోటరి వి. శూరుడు. కు.సం. 4.62. < పోటు[1] +- అరి. త. పొట్టరి. రక్షకుడు. పోటరితనము వి. శూరత్వం, శౌర్యం. భార. శల్య. 2.129. పోటరిమూట వి. మహాశూరుడు. కు.సం. 4.62. పోటఱ్ఱు వి. అంగుళం వెడల్పు రంధ్రం ఏర్పడి ఉండుండి నెత్తురు కారుతూ ఱ్ఱుమీద ఉండే పుండు. <పోటు[1]+అఱ్ఱు. పోటాకు వి. పరి మొ. వి. పెమ్మ తీయటానికి ముందు తీసే చివరి నిట్రమైన ఆకు.<పోటు[1] +ఆకు. పోటాడు స.క్రి. కలహించు.<పోటు[1]+ఆడు. పోటార్చు స.క్రి. పోట్లాడించు, కలహింపచేయు. దశకు. 11.115.<పోటు[1]+-అర్చు. పోటుకడవ వి. పందెం వేసు కొని ఎత్తుకొనే పెద్దసైజు సిక్కడవ. పోటుకన్ను వి. నొప్పి పుట్టే కన్ను. పండి.చ. 4.108. పోటుకాఁడు వి. శూరుడు. అచ్చ.రా.యు. 213. పోటుకాఁడితనము వి. శూరత్వం. ఉ. హరిశ్చ. 4.96. పోటుగంటి వి. పొడవటంవల్ల కలిగిన గాయం. క్షతి. కశా. 1.31. పోటుగంటు వి. శౌర్యంకల వ్యక్తి. శృం.నై. 3.20. పోటుగంప వి. పెద్దగంప. పోటుగుంజ వి. వేటకుపయోగించే సాధన విశేషం. శుకస. 1.165. పోటుగొంగ వి. వీరుడు, పోటుమానిసి. కు.సం. 4.70. పోటుగొను(-కొను) స.క్రి. పొడుచు. భాస్క.రా.యు. 720. పోటుగోల వి. పోటి. పోటుఁగలుపు (-కలుపు[1]) వి. తొల్లిక మొ. వాటితో పొడిచి తీసే కలుపు. పోటుఁగూఁతలు(-కూఁతలు) వి.బ.వ. శౌర్యోక్తులు, బీరాలు, బెదిరింపు మాటలు, తర్జనాలు. రాజ.వ. 3.80. పోటుఁగూఁతలుపెట్టు స.క్రి. బెదిరింపు మాటలాడు. శుక. 2.532. పోటుఁగోల[1](-కోల) వి. మృగాదుల్ని పొడవటంకోసం మొన సన్నగా చేసిన కర్ర, ఒకానొక వేటసాధనం. కాశీ. 3.76. పోటుదొర వి. వీరుడు, శూరుడు. రాఘవ. 4.202. పోటుపడు అ.క్రి. కుమ్ములాడు. పోటుబంటు వి. యుద్ధవీరుడు, శూరుడు. కు.సం. 10.167. పోటుబంటుఁజేయు (-చేయు) అ.క్రి. యుద్ధవీరునిచేయు. వి.ప. 2.51. పోటుమగఁడు వి. యుద్ధవీరుడు శూరుడు. భార. విరా. 5.89. పోటుమగలు వి.బ.వ. 1. వీరులు, భటులు. కు.సం. 4.75; 2. శౌర్య సంపన్నులు పాండు. 1.116. పోటుమాటలు వి.బ.వ. శౌర్యోక్తులు, బీరాలు. భార. విరా. 5.255. పోటుమాపిపి విశే. శూరుడు. భార. ఉద్యో. 1.253. పోటుమెట్టు

వి. యుద్ధసాధనం, ఆయుధం. భాగ. 8.345. పోటుమూ(కలు వి.బ.వ. వీరుల సమూహం. పల్నా వు. 82. పోటులాడు రూ. పోట్లాడు. అ.క్రి. 1. యుద్ధంచేయు, పోరు. భార. భీష్మ. 1.42; 2. జగడమాడు. <పోటు[1] + -లు + ఆడు. పోటువాలు వి. పొడవటానికి ఉపయోగించే ఆయుధం. చెన్నబసవ. 3.38. పోటెక్కించు స.క్రి. ఎదిర్చి పైకి వచ్చు, పొడుచు. భార. ద్రోణ. 3.88. <పోటు[1] + ఎక్కించు. పోటెండ వి. తీక్షణమైన మధ్యాహ్నపుటెండ. <పోటు[1] + ఎండ. పోటొగ్గు అ.క్రి. యుద్ధసన్నాహం చేయు, యుద్ధానికి సిద్ధమగు. హరి పూ. 4.80. <పోటు[1] + ఒగ్గు. పోటొడ్డు అ.క్రి. యుద్ధసన్నాహంచేయు. యుద్ధానికి సిద్ధమగు. భార. ఉద్యో. 1.57. <పోటు[1] + ఒడ్డు[1]. పోట్లగిత్త వి. పొడిచేఎద్దు. పోట్లమారి వి. చీటికి మాటికి కయ్యానికి కాలుదువ్వే ఎద్దు, పొడిచే ఎద్దు. పోట్లాట వి. పోట్లాడటం, యుద్ధం. ఆం. భా. 2.222. <పోటు[1] + -లు + ఆట. పోట్లాడు రూ. చూ. పోటులాడు. అ. క్రి. 1. యుద్ధం చేయు, పోరు. భార. భీష్మ. 3.24; 2. జగడమాడు. పోట్లావు (-ఆవు) వి. పొడిచేస్వభావం ఉన్న ఆవు.

పోటు[2] చూ. పొడుము[2]. వి. (నదీ సముద్రాదుల) ఉల్బణత, పొంగు. మను. 3.186.

పోటు(గమ్ము (-క్రమ్ము) అ. క్రి. నదిలో ప్రవాహం ఎక్కువై ఒడ్డుకొరయు. పోటుపాటు వి. ఆటుపోటు. కాశ్మీ. నం. 6.56. పోటుపారుచు అ.క్రి. ఉల్బణత పొందు, పొంగు. కాశ. 5.60. పోటుంబాటుగను అ.క్రి. అధికమగు మను. 3.186.

పోటు[3] రూ.చూ. పోటి. వి. 1. ఆధారం; 2. గోడకట్టేటప్పుడు కొన్నిరాళ్ళు లోపలకు కొన్ని బయటికి ఉండేటట్టు పేర్చి చివరలు వదిలివేయటం; 3. నిర్మాణంలో రాకూడనితప్పు.

పోటుగొయ్య(-కొయ్య) వి. మోటబావి ఉద్దిమీద కామిరెకు పోటిపెట్టిన ఏటవాలుకొయ్య, రెండుకామిరెలకూ రెండుంటాయి. పోటు(గంబము (-కంబము) వి. ఊతగా నిల్పిన స్తంభాదికం. చంద్రాంగ. 1.12. పోటు(గోల[2] (-కోల) వి. ఊతకర్ర. పోటుచిమ్ము వి. మోటబావి ఉద్దిమీద కామిరెకు పోటిపెట్టిన ఏటవాలు కొయ్య, రెండుకామిరెలకూ రెండుంటాయి. పోటుబల్ల వి. మరమగ్గం సొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్య. పోటుమడెం వి. నిడె వెనక కొన. పోటువడి వి. అచ్చుకట్టేటప్పుడు రెండు అచ్చుకర్రల పడివాదాలకు వేసిన లంకె. పోటుసుడి రూ. పోడుసుడి. వి. ముందరి జబ్బ మడత (చంక) కింద ఉండేది.

పోటుకంది చూ. పోటకందులు. వి. కందుల్లో ఒకరకం.

పోటుకొర రూ.చూ. పోటకొ(ర. వి. కొ(రధాన్యంలో ఒకరకం.

పోటెక్కించు చూ. పోటు[1].

పోటెండ చూ. పోటు[1].

పోటొగ్గు చూ. పోటు[1].

పోటొడ్డు చూ. పోటు[1].

పోట్లగిత్త చూ. పోటు[1].

పోట్లమారి చూ. పోటు[1].

పోట్లాట చూ. పోటు[1].

పోట్లాడు చూ. పోటు[1].

పోట్లావు చూ. పోటు[1].

పోడకము రూ.చూ. పాటకము. వి. స్ఫోటకం.

పోడియము రూ. చూ. పోడెము. వి. అశ్వాదుల ద్రుతగతి విశేషం.

పోడు వి. 1. గుల్మాదులవల్ల ఏర్పడే చిట్టడవి. అడవి. పండి. చ. 1.44; 2. తుప్పలు మొదలైనవి పెరిగిఉన్న అడవి నేల, అడవికొట్టి సాగుచేసే పొలం, బీటిపాడు; 3. ఇటిక మొదలైనవి అడ్డంగా పేర్చిన పేర్పు; 4. కష్టం; 5. బలవంతం.

సం. స్ఫోట-. పగులు, బీట; ప్రా. పోడి. భూమిని తవ్వటం, నాగలి నేలదున్నటం, బావి, చెరువు మొ. వాటిని తవ్వటం.

త. పోటు-. విత్తులునాటు.

పోడుకాలు వి. అడవికొట్టి సాగుచేసే పొలం. పోడుకొ(ర వి. కొ(రధాన్యంలో ఒకరకం. పోడుకత్తి వి. కంప మండలు నరికే మొద్దుకత్తి. పోడుగొట్టు (-కొట్టు[1]) అ.క్రి. అడవి నేలపై ఉండేతుప్పలు మొదలైన వాటిని నరుకు. ఆం. రా. 3.106. పోడుగోలు రూ. బాడుగోలు. వి. పనికిమాలినవాడు. పోడుదుక్కి వి. అడవిసాగు. పోడుసుడి రూ.చూ. పోటుసుడి. వి. ముందరి జబ్బ మడతకింద ఉండేది.

పోడెము రూ. పోడియము, పోరెము. వి. అశ్వాదుల ద్రుతగతి విశేషం. నిర్వ. రా. 3.9.

సం. స్ఫోటిత-. చీల్చబడ్డది, బద్దలైనది; ప్రా. పోడిఅ-. దూకేది, ఎగిరేది.

<ప్రా. పోడిఅ-.

పోణి రూ. చూ. పో(డి. విశ. 1. చక్కనిది, మనోజ్ఞం, మనోజ్ఞురాలు. శృం. నై. 2.49; 2. ఇదికన్, కాన్, కాగన్ అనే పదాలతో కలిసి క్రియా విశేషణార్థాల నిస్తుంది. వి. ఒప్పు, చక్కన, అందం.

పోణిమి రూ.చూ. పో(డిమి. వి. 1. ఆదరం, గౌరవం. మొల్ల. 2.80; 2. ఒప్పు, చక్కన, అందం. రాఘవ. 2.6; 3. సుఖం, సౌఖ్యం. రుక్మా. చ. 5.57; 4. అవధానం, ఎచ్చరిక. ఆం. భా. 1.189; 5. లక్షణం, చిహ్నం, ధర్మం. ఉత్త. 1.202.

పోండి రూ.చూ. పో(డి. విశ. నిండుగా, పూర్ణంగా, అంతటను. కు. సం. 6.157.

పో(డి రూ. పోణి, పోండి. విశ. 1. ఇది కన్, కాన్, కాగన్ అనే పదాలతో కలసి క్రియావిశేషణార్థాలనిస్తుంది. భార. ఆది. 6.306; 2. చక్కనిది. మనోజ్ఞం. మనోజ్ఞురాలు. భార. విరా. 1.312; వి. ఒప్పు, చక్కన, అందం. భార. స్త్రీ. 2.91.

త. పొలివు. ముఖ వికాసం, అందం, నిండుదనం.

పో(డిమి రూ. పోణిమి. వి. 1. పెంపు, అతిశయం. భార. సభా. 1.254; 2. సుఖం, సౌఖ్యం. బసవ. 3.370; పం;

3. ఒప్పు. అందం. భార. విరా. 1.238 ; 4. సంపద. ఐశ్వర్యం. భార. ఉద్యో. 3.191 ; 5. గౌరవం, మర్యాద, మానం. భార. ఉద్యో. 4.85 ; 6. పరాక్రమం, శౌర్యం. భార. భీష్మ. 3.326 ; 7. శక్తి. సామర్థ్యం. భార. కర్ణ. 2.357 ; 8. శుభం, మేలు. భార. ఆశ్రమ. 2.5 ; 9. విలాసం. భార. ఆశ్రమ. 2.97 ; 10. విధం, రీతి. కాశీ. 3.99 ; 11. రూపు. ఆకారం. భాగ. 8.388 ; 12. అవధానం. ఏకాగ్రత. ద్వి. పరమ. వి. 2 98 ; 13. చేష్ట. పని. నడవడి. ప్రవర్తన. అష్టమ. క. 1.84వ ; 14. శోభ, కాంతి. నీలా. 3.44 ; 15. లక్షణం, ధర్మం. శుక. 2.422.

క. పొణిమె. అందం ; త. పొన్మై.

పోఁడిమిగాను (-గాను) అ.క్రి. అతిశయించు. మిక్కుటమగు. పాండు. 5 204. పోఁడిమిచెడు రూ.చూ. పోఁడిమిసెడు. అ.క్రి. 1. భగ్నమగు. విరుగు. హరి ఉ. 4.167 ; 2. రూపుమాయు. నశించు ; 3. నిర్వీర్యమగు. నిస్సత్త్వమగు. బలహీనమగు. ఓడిపోవు. పోఁడిమిమాన్పు స.క్రి. ఉక్కడచు, రూపరచేయు. ఆము. 2.88. పోఁడిమిమాలు అ.క్రి. 1. రూపుమాయు, నశించు. భార.కర్ణ. 1.63 ; 2. పౌరుషం తొలగు. ఉ. హరి. 1.177. పోఁడిమిసెడు (-చెడు) రూ. పోఁడిమిచెడు. అ.క్రి. 1. నిర్వీర్యమగు. నిస్సత్త్వమగు. బలహీనమగు. ఓడిపోవు. భార. కర్ణ. 2.375 ; 2. రూపుమాయు. నశించు. భార. శాంతి. 1.63 ; 3. భగ్నమగు. విరుగు. పోఁడిమిసేయు (-చేయు) స.క్రి. 1. పరాక్రమించు. భార. ఆశ్రమ. 2.5.

పోతరకత్తె పోతరము.

పోతరము రూ. పోత్రము. పోనరము. వి. 1. ప్రభావం. వరాహ. 1.140 ; 2. పొగరు, మదం, గర్వం. ప్రభా. 1.72.

త. పొతర, అధికంగా, పొతరవు. పొగత్తు, ప్రశంస.

పోతరకత్తె విశే. క్రొవ్వినది, మదించినది. చెన్న బసవ. 2.24. పోతరమెత్తు అ.క్రి. మదించు. గర్వించు. తపతీ. 4.16. <పోతరము+ఎత్తు[1]. పోతరించు రూ. పోనరించు. అ.క్రి. మదించు, గర్వించు. మను. 4.22. <పోతరము+-ఇంచు[3]. పోతరీఁడు (-ఈఁడు) వి. మదించినవాడు, గర్వి. వరాహ. 2.130.

పోతరమెత్తు చూ. పోతరము.

పోతరి చూ. పోతరము. వి. తెల్లగా మెత్తగా ఉండే కలప కలిగిన ఒకరకం చెట్టు.

పోతరించు చూ. పోతరము.

పోతరీఁడు చూ. పోతరము.

పోతారం పొగాకు వి. పోతపరం గ్రామ నామం. ఈ గ్రామానికి చెందిన కోలగా ఉండే పొగాకు.

-పోతి[1] చూ. పోతు[1]. ప్రత్య. స్త్రీ నామాంతాల్లో చేర్చే శబ్ద రూపం. I.A. VIII. 77-78.

పోతి[2] వి. 1. మరణించినట్టిది ; 2. శవం.

పోతు[1] వి. 1. మహిషం. దున్నపోతు. భార.ఆది. 6.268 ; 2. కొన్ని జాతి వాచకాల కనుప్రయుక్తమైనప్పుడు పురుష వాచకమై నిందార్థం తెలుపుతుంది. పండి.చ. 1.48 పు. ; 3. ఆబోతు, వృషభం. ఉ.హరి. 3.74 ; 4. పశు పక్ష్యాదుల్లో మగది. కాశీ. 6.297 ; 5. మరవానంలో మొన చెక్కిన భాగం ; విణ. పశు పక్షి వృక్షాదుల్లో మగది. వి.క. 3.59.

క. పొత, హొత, హోతు, హూన్తు. మగమేక, మేకపోతు ; కొడ. పోతు. మేక ; త. పొత్తు. జంతువుల్లో మగది (పశువులు, పులి. లేడి కొన్ని నీటి జంతువులు, మొసలి మొ.వి) ; మ. పొత్తు. దున్నపోతు ; కొం. పొత్. పక్షుల్లో మగది ; కొలా. పొత్. కోడిపుంజు ; నా. పొత్. కోడిపుంజు.

<మూ.ద్రా. *పోత్.

పోతుకచ్చు వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వాసం. పోతుకంచురాయి వి. పసుప్పచ్చగా ఉండే క్వార్ట్జ్ రాయి. పోతుకంది వి. ఒకరకం కందిచెట్టు (Cojanus indicus). పోతుకరడు వి. మగ తరంగం, పెద్దఅల, కల్లోలం. పోతుకర్ర వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వాసం. పోతుకాఁడు వి. ఒక పక్షి. పోతుకాలు రూ.చూ. పోతుకోలు. వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ కిందివైపు గీచే గీత. పోతుకుర్ర వి. ప్రాయంలో ఉన్న దున్న. పోతుకోలు రూ. పోతుకాలు, పోతుగారి, పోతుగాలు. వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ కిందవైపు గీచే గీత. పోతుగట్టు వి. ఎత్తుగా మట్టి పోసి నిర్మింపబడ్డ గట్టు. నె.శా. ఒంగోలు శాసనం. 71. క్రీ.శ. 1499. పోతుగడ్డ వి. పిరభూమి. పోతుగంటరాజనములు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128. పోతుగవెం వి. మాగాణి పొలం చుట్టూ ఎత్తుగా వేసిన మట్టి కట్ట. పోతుగాడి వి. వస్లు మేలురాని చేసిన తర్వాత కింద నేలమట్టంలో రాని చుట్టూ తీసిన లోతు గాడి. పోతుగారి రూ.చూ. పోతుకోలు. వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ కిందివైపు గీసే గీత. పోతుగాలు రూ.చూ. పోతుకోలు. వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ కిందివైపు గీసే గీత. పోతుగుజ్జుమగలాఁడు విణ. యముడు. ఆం.భా. 1.50. పోతుగిటికి వి. పల్చగా వెడల్పుగా ఉన్న గిట్ట. పోతుగోంగూర వి. పక్కకొమ్మలు లేకుండా ఒకే కాడగా పెరిగే రకం. పోతుచామంతి వి. పెద్ద ఆకులుండే చామంతి మొక్క (Grewia abutilifolia). పోతుటీఁగకు విలువరాని అవ్య. పురుషుడు దూర పీలులేని. శుక. 1.316. పోతుటీఁగకుఁ దొలియంగరాని అవ్య. పురుషుడు ప్రవేశింప వీలుకాని. ద్విప.కల్యా. పు. 135. పోతుటీఁగకుఁజొలయరాక అవ్య. పురుషుడు ప్రవేశింపలేక. హంస. 5.273. పోతుటివెసళ్ళములు వి.బ.వ. బాల క్రీడా విశేషం. హంస. 3.148. పోతుఁడు వి. 1. మగ శిశువు ; 2. ఋత్విజుడు. పోతుతాడి రూ.చూ. పోతుతాడు. వి. మగ తాడిచెట్టు (Borassus flabellifer). పోతుతాడు రూ. పోతుతాడి. వి. మగ తాడిచెట్టు (Borassus flabellifer). పోతుదుడ్డె రూ. పోద్దుడ్డె. వి. పాలు విడవని లేతదున్న. పోతుదూడ రూ. పోద్దూడ. వి. పాలు విడవని లేతదున్న. పోతుదోనె రూ.చూ. పోతుదోనె. వి. తోట

బొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు. పోతుదోనె చూ. పోతుదోని. పోర్దోని. వి. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు. పోతునార వి. పుగ లాటిచెట్టు నుంచి తీసిన నార. పోతువబ్బారి వి. ఎర్రపచరుచెట్టు, గట్టిగా ఉండే కలప, తెల్లని బెరడు కలిగిన అందమైన ఒకరకం చెట్టు (Dalbergia lanceolaria). పోతుపిల్ల వి. లేత మేక పోతు. పోతుబడికె వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వానం. పోతుబద్ద వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వానం. పోతుబలిసిపోవు అ.క్రి. నత్రవ ఎక్కువై పైరు ఎక్కువగా ఆకు బలిసిపోవు. పోతుబొక్కెర రూ.చూ. పోతుబొక్కుడు. వి. తెల్లని పూలు పూసే గట్టి కలపనిచ్చే చిన్నచెట్టు (Ehretia laevis). పోతుబొక్కుడు రూ. పోతుబొక్కెర. వి. తెల్లని పూలు పూసే చిన్న చెట్టు (Ehretia laevis). పోతుమబ్బు వి. వాన కురవని పెద్ద నల్లమబ్బు. పోతుమావికము వి. వృక్షం, మగరాయి. వేంక. పంచ. 1 65. పోతుముడి వి. గట్టిముడి. పోతురాజు వి. 1. ఒకానొక క్షుద్ర పురుష దేవత. దా.సుం. 1.121; 2. గ్రామదేవతకు ముందు ఊరేగుతూ ముందు నైవేద్యం తినుకొనేవాడు; 3. పీరి కొట్టె దగ్గర పాతిన గూటం. పోతురాసి వి. తూర్పార పొయ్యక ముందు పొట్టుతో కలిసి ఉన్న ధాన్యపు రాసి. పోతురేడు వి. యముడు, మహిష వాహనుడు. చంద్రాంగ. 1.20. పోతులంకె వి. మర వానంలో తగిలించే మొన చెక్కిన వానం. పోతులయ్య (-అయ్య) వి. ఒక గ్రామదేవత. పోతులరాజు వి. పోతురాజు లాగ ఉండే కుక్కకు పెట్టబడిన పేరు. పోతువప్ప వి. అందమైన పూలు పూసే ఎర్రని ఒకరకం తీగ (Hiptage madoblota). పోతువరం వి. మాగాణి పొలం చుట్టూ ఎత్తుగా వేసిన మట్టికట్ట. పోతువానం రూ. పోతువాసాం. వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వానం. పోతు వాసాం రూ.చూ. పోతువానం. వి. మరవానంలో తగిలించే మొన చెక్కిన వానం. పోతువెదురు వి. ఒకరకం వెదురు (Dendrocalamus strictus). పోద్దుడె రూ.చూ. పోతుదుడ్డె. వి. పాలు విడవని లేతదున్న. పోద్దూడ రూ.చూ. పోతుదూడ. వి. పాలు విడవని లేతదున్న. పోర్దోని రూ.చూ. పోతుదోనె. వి. మోట బొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు.

-పోతు[2] అవ. తాచ్ఛీల్యార్థంలో వచ్చే ఒకానొక ప్రత్యయం.

పోత్రము రూ.చూ. పోతరము. వి. పొగరు.

పోథీ వి. పుస్తకం.

హిం. పోథీ. పుస్తకం.

<హిం. పోథీ.

పోది రూ.చూ. ప్రోది. వి. రక్షించటం. శాక్త.నం. 14.223.

పోదిచొప్ప వి. చొప్పకాడ.

పోదిద్దు చూ. పోవు[1].

పోను వి. లేత. సుకుమారం.

పోపొబ్బు చూ. పోవు[1].

పోప్పద్దె చూ. పోతు[1].

పోద్దూడ చూ. పోతు[1].

పోర్దోవి చూ. పోతు[1].

పోపరచు చూ. పోవు[1].

పోవాటు చూ. పోవు[1].

పోవాడు చూ. పోవు[1].

పోవాడుకొను చూ. పోవు[1].

పోవిచ్చు చూ. పోవు[1].

పోవిడు చూ. పోవు[1].

పోవొత్తు చూ. పోవు[1].

పోవోము చూ. పోవు[1].

పోత వి. 1. (నీళ్ళు మొ. వాటిని) పోయటం, విడవటం. కు.నం. 9.51; 2. పాత్రలు విగ్రహాలు మొ. వాటిని చేయ టం కోసం లోహాలను కరగించి పోయటం. వేంక. పంచ. 3.230; 3. మశూచిద్వారా పొక్కులు పైకి రావటం; 4. బట్టీలోని సున్నపురాళ్ళ వరస.

ఇ. పోవల్. నీళ్ళు పోయటం; త. పోఅప్ప్. ప్రవ హించటం, వర్షం కురవటం, పోఅరి. గొప్పతనం, పెద్దది; మ. పోఅ. పొయ్యటం, కురవటం, నది సము ద్రంలో కలిసేచోటు, పోఅచ్చుల్. పొయ్యటం, కారటం, పోఅప్పు. పొంగి ప్రవహించటం, ఎక్కువ పరిమాణంలో ఇవ్వటం.

పోత అచ్చు వి. కసుగు, కడువు, అచ్చు. పోత అచ రేవి వి. జాలుపెట్టి బొమ్మలు గీసిన అరివేణి కుండలు. పోత కరవ వి. జాతర్లలో దున్నపోతును నరకటానికి ముందు దాని తలమీద నీళ్ళు పోయటానికి వాడే మట్టిపాత్ర. పోతటిక్కి వి. గోదాంలో ధాన్యం పోయటానికి దర్వాజా మీద అమర్చిన చిన్న కిటికీ. పోతదోవి వి. అజారుమీద నుంచి బూకర దోని మీదికి పెట్టిన దోనె. పోతనీరు వి. 1. స్నానార్థం చెరువు మొ. వాటినుంచి విడిగా కుండ లతో తెచ్చిపెట్టే నీరు. విజ్ఞా. ఆదా. 50; 2. కుండలు మొ. వాటితో మొక్కలకు పోసే నీరు. పోతపాలు వి. పాలిండ్లు కుడిచి తాగే స్తన్యం కాక శిశువులకి పోసే ఇతర మైన పాలు. పోతపోయు స.క్రి. విగ్రహాలు మొ. వాటిని చేయటానికి అచ్చుల్లో లోహాదుల్ని కరిగించి పోయు. ప్రబా. 2.39. పోతపోసిన విగ్రహము వి. దిద్ది తీర్చి నట్లున్నదనటం. పోతబుడ్డి వి. మూతి చిన్నగా ఉండే మట్టిపాత్ర. పోతమట్టి వి. 1. అంతర్గత శిలల క్షైదిల్యం వల్ల ఉష్ణదేశాల్లో ఏర్పడే ఎరుపు డాలు మట్టి; 2. ఎర్ర మట్టి అడుసు. పోతమెట్టు వి. కాంక్రీటుతో కట్టిన మెట్టు. పోతముత్తె వి. పెద్దసైజు ముత్తె. పోతాబాకీచేయు స.క్రి. అయిష్టంగా చేయు.

పోతాబాకీచేయు చూ. పోత.

పోముడుచు చూ. పోవు[1].

పోదేర్పు చూ. పోవు[1].

పోదోలు చూ. పోవు[1].

పోద్రోలు చూ. పోవు[1].

పోవకం వి. దున్నటానికి ముందు మోకును పలుత చుట్టూ తిప్పి కాడికి కట్టటం.

పోవకంకాడు వి. కాడిని పోలుగర్రకు కలిపి కట్టేతాడు.

పోవరు చూ. పోవు[1].
పోవరి చూ. పోవు[1].
పోపిట్ట చూ. పోవు[1].
పోపిడి చూ. పోవు[1]. పోబడి. వి. విధం.
పోపు[1] వి. కనవు. గడ్డి. చెన్నబసవ. 4.161.
పోపు[2] వి. క్రైస్తవ మత గురువు.
ఇం. *Pope*. రోములో ఉండే క్రైస్తవ మతాధిపతి.
< ఇం. Pope.
పోపు[3] యా.చూ. పొగపు. వి. తిరుగమాత.
పోపులుపెట్టి పోరుమాన్పు స.క్రి. తగాదా పరిష్కరించక తియ్యని మాటలతో తప్పించుకొను.
పోబడి చూ. పోవు[1].
పోబెట్టు చూ. పోవు[1].
పోబెరుగు చూ. పోవు[1].
పోమతుకు చూ. పోము.
పోము చూ. పోఁగు. వి. 1. ఒంటిపోచ దారం; 2. తాయెత్తు.
పోమతుకు అ.క్రి. పడుగుపోగు బద్దెపోగు కలిపి వడి పెట్టటం. < పోము + అతుకు. పోముపట్టు అ.క్రి. పడుగులో తెగిన పోగులు తీసి అతకటం. పోము మళ్ళించు అ.క్రి. నేతలో ఒకవైపు ఎక్కువ మరొకవైపు తక్కువ వచ్చినప్పుడు నేత హెచ్చినవైపు నాడె పోకుండా తగ్గినవైపే రెండోసారి నాడె వేస్తూ నేయు. పోములతుకు అ.క్రి. అల్లు చేసేటప్పుడు పడుగులో తెగిపోయిన పోగులు అతకు. < పోము + -లు + అతుకు. పోములకుట్టు అ.క్రి. అల్లు చేసేటప్పుడు పడుగులో తెగిపోయిన పోగులు అతుకు. పోములుగట్టు(-కట్టు) అ.క్రి. తెగిపోయిన పోగులు అతుకు. పోమువందు వి. నేతలో రెండు పోగులమధ్య వచ్చిన పెలిక.
పోమెత్తుట చూ. పోవు[1].
పోఁబుచ్చు చూ. పోవు[1].
పోఁబెట్టు చూ. పోవు[1].
పోయికాలం చూ. పోవు[1].
పోయినది పూతతీగె చూ. పోవు[1].
పోయినపిల్లకు గట్టుపెట్టు చూ. పోవు[1].
పోయినపోకగా చూ. పోవు[1].
పోయినపోకగాఁబోవు చూ. పోవు[1].
పోయిపోలేక చూ. పోవు[1].
పోయివచ్చు చూ. పోవు[1].
పోయు స.క్రి. 1. తాగటంకోసం యిచ్చు (కలవలి పాలు మొ.వి) పట్టు, నోటవైచు. భార. ఆది. 5.216; 2. ద్రవపదార్థాల్ని పాత్రాదుల్లో ఉంచు. భీమవరం శాసనం. క్రీ.శ. 1073; 3. (ఎత్తుగా గాని, పరువుగా గాని) వైచు, ఉంచు. కు.సం. 4.92; 4. విత్తు, చల్లు. భార. విరా. 2.52; 5. జలాదికం విడుచు. భార. స్త్రీ. 2.176; 6. (వంకివారిలో దాడాదుల్ని) వంచించు, తగుల్చు, కూర్చు. భాస్క.రా. కిష్కిం. 183; 7. (కరగిన లోహాదుల్తో పాత్ర ప్రతిమాదుల్ని) చేయు, నిర్మించు. పరమ. 6.14; 8. అనుగొట్టంలోకి పోగు తీసుకొని అమకొయ్యలకు చుట్టి వచ్చేటట్టు చేయు; అ.క్రి. 1. కలుగు. పట్టు. కువ.చ. 4.126; 2. కలదగు.
క. పొయ్. పోయు. వేయు. పొయ్యటం. పుయ్. పోయు. వేయు. పొవల్. నీళ్ళు పొయ్యటం; త. పొళి (-వ్-, -న్త్-). ముందు పోయు. కురియు (వర్షంలా) స్వేచ్ఛగా ఇచ్చు, ప్రవహించు, విస్తారం (ధనంలా) పొళివు. ప్రవహించటం, వర్షం కురవటం, విస్తారం, పొళిల్. గొప్పతనం, పెద్దది; మ. పొళి. పోయటం, కురియు. సముద్రంలో నది కలిసే ద్వారం. పొళియుక. కిందపోయు. ప్రవహించు, రాలు (పళ్ళు, ఆకులు మొ.వి) కురియు. పొళిక్క. కింద కురియు. పడేట్టుచేయు. పొళిచ్చల్. పొయ్యటం. కారటం, పొళిప్పు. పొంగిపొర్లటం. ఎక్కువ కొలత ఇవ్వటం; కో. పొడ్వ్-. (పొడ్డ్-). సంఖ్యలో పెరుగుదల; కుఇ. పొప్క. ఒలకబోయు. చెల్లా చెదరగు; కువి. పొఈఁ-. (పొజ్జ్-, పొఁయ్య్-). (వాన) పడు, పొఈఁడ్- వర్షం పడేట్టుచేయు; మాల్తొ. పొయ్-. (పొస్-). వర్షం కురియు.
< మూ. ద్రా. *పొఁళ్-/ *పొళ్-.
పోయేకాలము చూ. పోవు[1].
పోరచి విశే. 1. నిస్సారం. భార. ఆది. 5.129; 2. వ్యర్థం. నిష్ప్రయోజనం. భాగ. 9.626; 3. అలక్ష్యం. రామాభ్యు. 1.148; 4. విపరీతం. విజయ. 2.36.
పోరట చూ. పోరచి. యా. పోరటి. వి. కాసుక. రామలిం. శ. 77.
పోరటి యా చూ. పోరట. వి. ఒకరు ఇంకొకరికి పంపిన తినుబండారం.
పోరఁడు యా.చూ. పోరె. వి. పిల్లవాడు, బాలుడు.
పోరంపోసు యా.చూ. పరంబోకు. వి. గవర్నమెంటువారి ఆధీనంలో ఉన్నభూమి.
పోరంబోకు యా.చూ. పరంబోకు. వి. 1. సాగుబడికి రానినేల; 2. ప్రభుత్వాధీనంలో ఉన్నభూమి; 3. పనికిమాలినవాడు.
పోరాకుందు చూ. పోవు[1].
పోరాట చూ. పోరు.
పోరాటమాడు చూ. పోరు.
పోరాటము చూ. పోరు.
పోరాడు చూ. పోరు.
పోరావి చూ. పోవు[1].
పోరావిచట్టము చూ. పోవు[1].
పోరామి చూ. పోవు[1].
పోరామిమొనర్చు చూ. పోవు[1].
పోరాములుపేయు చూ. పోవు[1].
పోరి యా.చూ. పోరె. వి. 1. పిల్ల; 2. దాసిపిల్ల; 3. తలిదండ్రులు లేనిపిల్ల.
పోరికెత్తు చూ. పోరు.
పోరించు చూ. పోరు.
పోరియు చూ. పోరు.
పోరితమాడు చూ. పోరు.
పోరితము చూ. పోరు.
పోరిబొక్కలాడు చూ. పోరు.

**పోరిమి** చూ. పోరు.

**పోరు** వి. జా. **1**. యుద్ధం, కలహం. భార. ఆది. 3.108 ; **2**. అవ్యవస్థతో శిశువులు ఎడతెగకుండ చేసే రోదనం, అల్లరి. చెన్నబసవ. 3.170 ; **3**. బాధ ; **4**. బలవంతం ; **5**. పత్తిరాట్నం మధ్యరూళ్ళకు మిట్టమీదిగా ఉండేకట్టె ; **6**. ఆములో వెంకులు పేర్చే కోడు ; స.క్రి. **1**. ఎదిరించు, మార్కొను. కు. సం. 10.151 ; **2**. (బాధను) కలిగించు. సింహ. శ. 33 ; అ.క్రి. **1**. యుద్ధంచేయు, కలహించు, జగడమాడు. నిర్వ. రా. 5.70 ; **2**. (క్షుద్బాధ మొ. వాటివల్ల శిశువులు) మిక్కిలి రోదనం చేయు, ఏడ్చు. వేంక. పంచ. 4.447 ;

క. పోర్, పోరు (>పెంర్, పెంరు). యుద్ధంచేయు, మల్లయుద్ధంచేయు, పోరాడు, దెబ్బలాట, యుద్ధం, కుస్తీ. పొర్కె, పోర్త. యుద్ధం, జగడం, పోర్కళి. మల్లుడు, మల్లయుద్ధం, యుద్ధం ; కొడ. పొళ్- (పొప్ప్-, పొత్-), దెబ్బలాడు, యుద్ధంచేయు ; తు. పొరియుని. మల్లయుద్ధం చేయు, దెబ్బలాడు. పొర్దు, యుద్ధం, పోట్లాడు ; త. పొరు (-ప్-, -త్-). యుద్ధంచేయు, యుద్ధంలో మునిగిఉండు, పోటీచేయు, సమానత్వం, ఆటంకం, యుద్ధం, పొరుత్తు. (పొరుత్తి-). పరికొల్పు (యుద్ధానికి) సమానం చేయు. సమానత్వం, పోరిక, పోర్. యుద్ధం, దెబ్బలాట, శత్రుత్వం, పోర్-అటు, యుద్ధంచేయు, పెనుగులాడు, పోర్- అట్టమ్. యుద్ధంచేయుటం, పెనుగులాట, పోటీ ; మ. పొరుక, పొరుతుక, యుద్ధంచేయు, పోటీచేయు, పోటీ కెక్కు, పొరుక్కుక. పోటీకెక్కు, పందు, పోర్. యుద్ధం, శత్రుత్వంవెరపు, పోర్. అటుక. యుద్ధంచేయు, కలహించు, పోర్. అట్టమ్. యుద్ధం ; కో. పొ. ర్, పొ. ర్ఆ. ట్, పొ.ర్. అ. ట్క్. యుద్ధం, పొర్. అ.డ్-. యుద్ధంచేయు ; తొ. పి. ర్ దెబ్బలాట, యుద్ధం ; కుఇ. (పొహ్ప)(/పొహ్త్). నిందించు, యుద్ధం, యుద్ధం ప్రకటించు, తిట్టు, పోరు, దెబ్బలాడు, వివాదం ; గ. (ఒల్లా). పొరుప్-. (పొరుత్-). కోపంగా ఉండు, పోర్. తిట్టు, నిందించు.

<మూ. ద్రా. *పోర్.

**పోరాట** రూ. పోరాటము. వి. **1**. యుద్ధం, సమరం. భార. ఉద్యో. 3.7 ; **2**. కలహం. జగడం. కాశ. 4.50 ; **3**. వాదాదుల్లో పోరాటం, పెనుగులాడటం. క. హొరాట, పోరు, జగడం ; త. పొరాట్టమ్. **పోరాటమాడు** అ.క్రి. పోట్లాడు. నిరంకు. 1. <పోరాటము+ఆడు. **పోరాటము** రూ.చూ. పోరాట. వి. **1**. యుద్ధం, సమరం ; **2**. కలహం, జగడం, **3**. (వాదాదుల్లో) పోరటం, పెనగులాడటం. **పోరాడు** అ.క్రి. **1**. యుద్ధంచేయు. భార. ఆది. 5.170 ; **2**. (వాదాదుల్లో) పోరు పెనగులాడు. భార. ఉద్యో. 3.242 ; **3**. కలహించు, జగడమాడు. కళా. 4.2. <పోరు+ఆడు. **పోరికెత్తు** అ.క్రి. దండెత్తు. భార. స్త్రీ. 2.138. <పోరు+- ఇ[13]+-కున్+ఎత్తు[1]. **పోరించు** స.క్రి. పోరచేయు, జగడమాడించు. హరి. పూ. 8.71. <పోరు+-ఇంచు[3]. **పోరిడు** అ.క్రి. **1**. పోరుపెట్టు. ద్వి. పరమ. వి. 5.377 ; **2**. కలహపెట్టు, కలహంకల్పించు. దశా. 2.62. <పోరు+ఇడు. **పోరికమాడు** అ.క్రి. వాదాదుల్లో పోరాడు, పెనగులాడు. నిర్వ. రా. 8.135. <పోరికము+ఆడు. **పోరికము** వి. **1**. యుద్ధం, సమరం, భార. ఉద్యో. 3.262 ; **2**. స్పర్ధ, పోటు. భార. శాంతి. 5.241 ; **3**. కలహం, జగడం. భార. అను. 5.291. **పోరిబొక్కలాడు** అ.క్రి. ఎక్కువ కష్టపెట్టు. **పోరిమి** వి. **1**. యుద్ధపాటవం. రామలిం. శ. 77 ; **2**. దార్ఢ్యం. **పోరుకట్టు** వి. కలహం. మొల్ల. అయోధ్యా. 12. **పోరుకాడించు** స.క్రి. దోసిటిలో సీకు పోసికొని తట్టు. కళా. 6.194. **పోరుకాడు** అ.క్రి. తీవ్రంగా ప్రయత్నించు. **పోరుకొవితిసు** స.క్రి. వేదించు. **పోరుదిండి** (-తిండి) వి. కలహాశనుడు, నారదుడు. ఉ. రా. 5.198. **పోరుపెట్టు** రూ.చూ. పోరువెట్టు. అ.క్రి. **1**. (భక్ష్యాదులకోసం) పిల్లలు పెంకితనం చేయు. దశా. 9.191 ; **2**. (బాధతోకాని, ఆకలితోకాని) విడ్డమాన కుండా గట్టిగా ఏడ్చు ; **3**. యుద్ధం కల్పించు, దెబ్బలాట పెట్టు. **పోరుమాన్పు** స.క్రి. ఏదోచిన్న పనితో వారిపోరును తప్పించుకొను. శుక. 2.98. **పోరువెట్టు** (-పెట్టు) యా. పోరుపెట్టు. అ.క్రి. **1**. దెబ్బలాట పెట్టు. కకుత్స. 2.120 ; **2**. (బాధతోకాని ఆకలితోకాని) విడ్డమానకుండా గట్టిగా ఏడ్చు. బ్రహ్మో. **2.81** ; **3**. (భక్ష్యాదులకోసం) పిల్లలు పెంకెతనం చేయు. **పోరుసుళ్ళు** వి.బ.వ. వీపుమీదగాని పొట్టమీదగాని నాలుగు వైపులా ఉంటే నాలుగు సుళ్ళు. **పోరొడ్డు** అ.క్రి. యుద్ధంకోసం వ్యూహంగా ఏర్పరచు, బారులుగా నిల్పు. కవిక. 2.178. <పోరు+ఒడ్డు[2]. **పోరోగిరపుదంట** వి. కలహాశనుడు, నారదుడు. <పోరు+ఒగిరపుదంట. **పోరోగిరపువిరాబారి** వి. కలహాశనుడైనముని, నారదుడు. అచ్చ. రా. బాల. 6. **పోరోగిరపుదిండి**(-తిండి) వి. కలహాశనుడు, నారదుడు. **పోర్మొఖరామ** వి. ఒక బిరుదు. రామేశ్వరశాసనం. క్రి. శ. 625.50.

**పోరుబందముగది** వి. మూడుపొగులకొక పొగునిలువుకు పేకకు జమిలిగా పెట్టి నేసిన గది.

పొరుబందర్. గుజరాతులోని ఒకగ్రామం.

**పోరుంబాక** రూ.చూ. పరంబోకు. వి. ప్రభుత్వం వారి అధీనంలో ఉన్న భూమి.

**పోరువ** రూ. పోర్వ. వి. **1**. పొర. పాండు. 4.294 ; **2**. సెల్లా, అంచుకమ్ములు లేని తెల్లని వస్త్రం. శశా. 3.13 ; **3**. ప్రచ్ఛదపటభేదం, ఒకవిధమైన పరుపు దుప్పటి. ఆం. భా. 2.156.

త. పోర్ (-ప్ప్-, -త్త్-). ధరించు, చుట్టూ చుట్టుకొను, కప్పు, చుట్టు, మూసేది. పోర్వై. కప్పేది, చుట్టేది, పైబట్ట, కంబళి ; మ. పొరుక్కక. చుట్టు, పైన కప్పుకొనే వస్త్రం ; కుఇ. పొర్ప(పొర్త్-). శరీరం చుట్టూ చుట్టుకొను, పైబట్ట ధరించు.

**పోరువెత్తు** స.క్రి. పొరఊడు. పాండు. 4.294. <పోరువ+ఎత్తు[1].

**పోరువెత్తు** చూ. పోరువ.

**పోరె** రూ. పోరడు, పోరి, పోఱడు, పోల్లడు. వి. **1**. డింభకం, పిల్ల. శ్రీరం. మా. 1.63 ; **2**. బాలుడు.

క. పోర. బాలుడు, బాలిక. యువకుడు లేదా అనుభవం లేనివాడు; తు. పోర, పోరె. కుర్రవాడు; మ. పోఱ. అవివేకి, తిండిపోతు.

పోరాడు చూ. పోరు.

పోరోగిరపుదంట చూ. పోరు.

పోరోగిరపువిరాబారి చూ. పోరు.

పోరోగిరపుఁదిండి చూ. పోరు.

పోర్మిళరామ చూ. పోరు.

పోర్వ రూ.చూ. పోరువ. వి. అంచులేని తెల్లనిబట్ట.

పోర్షను వి. భాగం, పంతు.
 ఇం. *Portion*. భాగం.
 < ఇం. Portion.

పోఱఁడు రూ.చూ. పోరె. వి. పడుచువాడు, బాలుడు.

పోఱి చూ. పోరడు. విణ. పడుచుది. బాలిక.
 పోఱిగాఁడు వి. పోరడు.

పోలక¹ రూ.చూ. పోలంక. వి. ఒకరకం గువ్వ పిట్ట.

పోలక² వి. ఒకానొక గ్రామదేవత, పోలకమ్మ.
 పో.చూ.సం. పాలికా. ఒకరకమైన రొట్టె.
 పోలకమ్మ వి. ఒకానొక గ్రామదేవత. < పోలక² + అమ్మ.

పోలంక రూ. పోలక¹. వి. పక్షివిశేషం.

పోలంపు వి. గోపిసల.

పోలఁడు వి. దూదలపోలడు, టీకరంగా ఉండే ఒకజాతి పెద్ద పక్షి.
 పో.చూ.సం. పాలా. అగర్త.

పోలపుటికె రూ.చూ. పూలపుటికె. వి. నల్లనేలల్లో ఎక్కువగా పెరిగే ఒకరకం కలుపు మొక్క.

పోలము వి. మృగాలు దాక్కొని ఉండే ప్రదేశం, పొద, వేంక. పంచ. 2.194.

పోలమ్మ వి. ఒక గ్రామదేవత.
 సం. పాలి. రొట్టె.
 < సం. పోలి + అమ్మ.

పోలావిగంట వి. ఏనుగు మెడకు కట్టే గంటలు. చంద్రాంగ. 1.32, ప్రబంధ. 58.
 హిం. పొలార్. ఉక్కు.

పోలాలబొంతులు వి.బ.వ. పోలాల పండుగకి చిన్న పిల్లలకు ఇచ్చే చిన్న మట్టి బొమ్మలు.

పోలాలపండుగ వి. కనుమ పండుగ, ఈ పండుగ నాడు కట్టెలు మొ. వాటిని పోగుచేసి కాలుస్తారు.
 సం. పాల-. రాశి, పోగు.

పోలాలమావాస్య వి. 1. పోలేరమావాస్య; 2. మహాలయామావాస్య.

పోలి¹ చూ. పోలు. రూ. పాలి¹. వి. పరుపు, ఇటుక లారవ రాళ్ళను వాటి మందం మీద పరుకోబెట్టడం.

పోలి² రూ.చూ. పొల్లి. వి. 1. ఆడుది, స్త్రీ; 2. చెడ్డతోవ తొక్కిన వాడు.

పోలిగాడు రూ. పోలుగాడు. వి. విదూషకుడు.

పోలిగాఁడు చూ. పోలఁడు వి. దూదలపోలడు, టీకరంగా ఉండే ఒకజాతి పెద్ద పక్షి.

పోలిపాట వి. కుప్ప నూర్పిడి సమయంలో పశువుల్ని తోలుతూ పాడే ఏలపదం, పొలి పొలి అనే అనుపల్లవితో పాడే పాట.

పోలిపట్టి వి. పసుపు గుడ్డ చుట్టి పూలదండ కట్టి జాతర్లలో డబ్బు వసూలు కోసం ఊరంతా తిప్పటానికి వాడే మట్టి హుండీ.

పోలిటిక్కెటి వి. నిండు టిక్కెట్టు.
 ఇం. *Full ticket*. నిండు టిక్కెట్టు.
 < ఇం. Full ticket.

పోలిక చూ. పోలు¹.

పోలికచేయు చూ. పోలు¹.

పోలికి చూ. పోలు¹.

పోలించు చూ. పోలు¹.

పోలీసు వి. సంరక్షక భటుడు.
 ఇం. *Police*. రక్షకభటుడు.
 < ఇం. Police.
 పోలీసురెడ్డిమాన్యం వి. గ్రామంలోని తగాదాలను విచారించే వ్యక్తికిచ్చిన మాన్యం.

పోలు¹ అ.క్రి. 1. శక్యమగు. సాధ్యమగు. భార.ఆది. 1.129; 2. తగు, యుక్తమగు. భార. ఆది. 4.174; 3. పొసగు, సమానమగు. భార.ఆది. 8.4; 4. సంగతమగు, పొసగు. కు.సం. 5.97; 5. ఒప్పు, శోభిల్లు. కు.సం. 7.127; 6. ఇష్టమగు, సమ్మతమగు. భార. ఉద్యో. 3.38; 7. కలుగు, సిద్ధించు. భార. శాంతి. 6.465; 8. అనుకూలమగు. లాభకరమగు. రం.రా.బాల. 77 పు. 19 పం.; 9. తుమున్నంతాలకు యూతార్థక క్రియలకు అనుప్రయుక్తమై వితర్కాన్ని తెల్పుతూ కాబోలు అనే అర్థం ఇస్తుంది. భాగ. 10 ఉ. 887; స.క్రి. పోలు. సరిపోలు. భార.ఆది. 7.3; 1. అవ్య. ద్రు. న్యాయంగా, యథావిధిగా. భార.ఆది. 3.174; 2. చక్కగా, బాగా, పూర్ణంగా, భార ఆది. 6 267; వి. సమత్వం. కు.సం. 6166.
 క. పోల్, హోల్, ఓలు, పోలు. పోలియుండు, పోల్. అంగీకరించు, పోలి ఉండు, తగియుండు. పోల్. పోలిక, సమానత్వం, వలె, లా, పోల్కె, పోల్తె. పోలిక, పోలిసు. పోలి ఉండేటట్లుచేయు, పోల్చు; కొడ. పో.లె. వలె; త. పోల్ (పోల్వ-, పోన్ఱ-). పోలు. వలె. పోలి ఉండు, సమానం. తగిన, పోల్వు దగినది, పోలి. సమానమైన మనిషి లేక వస్తువు. పోలిక వలె. పోలియై. పోలిక; మ. పోలుక. పోలి ఉండు, పోలె. పోల. పోలే. వలె; కువి. పోలినై. పోల్చు.
 మూ.ద్రా. *పోల్-.
 పోలిక రూ.చూ. పోల్కి. వి. సామ్యం, సాదృశ్యం. విధం, రీతి. భార. భీష్మ. 2.137. పోలికచేయు అ.క్రి. నకలుతీయు. పోలికి రూ.చూ పోల్కి. వి. సామ్యం, సాదృశ్యం, విధం, రీతి. నిర్వ.రా. 8.80. పోలించు స.క్రి. 1. ఉపమానంగా చేయు, సాటిగా చెప్పు. భార.స్త్రీ. 2.146; 2. బాగా ఆలోచించు, విమర్శించు. గౌ. హరి. పూ. 806; 3. పరిగణించు, ఎంచు. భర్తృ. 1.14.

<పోలు[1] + -ఇంచు[3]. పోలుచు రూ.చూ. పోల్చు. స.క్రి. సాటిగా తెచ్చు. ఉపమించు. భార.సౌప్తి. 1.158. పోలు పొందు వి. 1. వస్తుతత్త్వం, యథార్థం. కవనాథ 2.99 ప. 22. పం.; 2. వివేకం, ఆలోచన, సందర్భశుద్ధి; 3. సంగతి, వృత్తాంతం. పోలుపొందులేవి విఅ. ఒకరీతి, ఒకపద్ధతిలేని. పోలుబోయు (-పోయు) అ.క్రి. పెళ్ళిపందిరిలో పిండిముగ్గులు తీర్చి బియ్యం వరసగా పేర్చు. పోలుముంతలు వి.బ.వ. పెళ్ళిలో నాగవల్లి సాంగెనికి వాడే మట్టి పాత్రలు. పోలుంబోలములు వి.బ.వ. ఉచితానుచితాలు, మంచిచెడ్డలు. పాండు. 5.297. పోలిక రూ. పోలిక, పోలిక. వి. సామ్యం, సాదృశ్యం. విధం, రీతి. నిర్వ. రా. 1.55. పోల్చు రూ. పోలుచు. స.క్రి. 1. సాటిగాతెచ్చు, ఉపమించు. భార. ఆది. 7.3; 2. ఊహించు.

పోలు[2]. వి. 1. ఏతంలో ఒకభాగం. మనిషితొక్కే లేక లాగే ఏటవాలు కొయ్య; 2. బండిదొలువుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య.

ఇం. *Pole*. స్తంభం.

<ఇం. Pole.

పోలుకఱ్ఱ రూ.చూ. పోలుగఱ్ఱ. వి. బండి దొలువుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య. పోలుకఱ్ఱ రూ.చూ. పోలుగఱ్ఱ. వి. నొగకఱ్ఱ, కూబరం, బండినొగమీద కొట్టిన ఇవతలఅవతల అమర్చిన కొయ్య. పోలుగరచీల వి. బండి వరాన్ని దొలువుకు పోలుగఱ్ఱకు కలిపే మేకు. పోలుగర బండి రూ. చూ. పోలుగఱ్ఱబండి వి. ఒంటినొగబండి. పోలుగఱ్ఱ రూ. చూ. పోలుగఱ్ఱ. వి. బండి దొలువుకు అమర్చిన పొడుగాటి పలకల కొయ్య. పోలుగఱ్ఱబండి రూ. పోలుగరబండి. వి. ఒంటినొగబండి. పోలుగఱ్ఱ రూ. పోలుకఱ్ఱ, పోలుకఱ్ఱ, పోలగఱ్ఱ. వి. నొగకఱ్ఱ. కూబరం, బండినొగమీది తొట్టి కివలావల అమర్చిన కొయ్య. పోలుతాడు రూ. పోల్తాడు. వి. కాడిని పోలుగఱ్ఱకు కలిపికట్టే తాడు. పోలుపైకెత్తు అ.క్రి. 1. రెండెడ్లబండికి వెనుక బరువెక్కువై కాడిపైకి లేచిపోవు; 2. ఎవరైన జబ్బుపడి బలహీనమగు; 3. నష్టపడు. పోల్తాడు రూ.చూ. పోలు తాడు. వి. కాడిని పోలుగఱ్ఱకు కలిపికట్టే తాడు.

పోలు[3] వి. పాత్రలు తీర్చటానికి సారెపలకమీద లింగాకారంగా పెట్టిన మట్టిముద్ద.

సం. పోలి. పిష్టకభేదం.

పోలుపెట్టు అ.క్రి. సారెపలకమీది మట్టిని కుండరూపం రావటానికి మీదికి పొడవుగా లోపల బోలుగా వచ్చేటట్లు చేయు.

పోలు[4] వి. రెండుసార్లు ఏకినదూది.

పోలుగ రూ. పోలువ. వి. పక్షివిశేషం. హంస. 3.12.

పోలుగాడు రూ.చూ. పోలిగాడు. వి. విదూషకుడు.

పోలుగు వి. పట్టెడలోని తాడు.

పోలువ రూ.చూ. పోలుగ. వి. పక్షివిశేషం.

పోలె[1] అవ్య. ద్రు. 1. సాదృశ్యవాచకం. (వలె అనే అర్థమిస్తుంది). ధర్మవరరామసనం. క్రీ.శ. 850; 2. ఉత్ప్రేక్షావాచకం. మను. 6.108; 3. ఇవార్థకం (ఇది ప్రథమా విభక్తులకు అవ్యయాలకు తరువాత వస్తుంది).

క. త. పోల్. పోలిఉండు.

పోలె[2] రూ. పోళి, పోళి, పోళె. వి. భక్ష్యవిశేషం. బసవ. 3.427 పం.

క. పోళిగె, మోళిగె; తు. పోళె; త. పోళి; మ. పోళి.

పోలెవాఁడు విఅ. దుష్టుడు, దుర్మార్గుడు. హంస. 5.113.

పోలేరమ్మ చూ. పోలేరు.

పోలేరమ్మకమ్మి చూ. పోలేరు.

పోలేరమ్మగడిచీర చూ. పోలేరు.

పోలేరు రూ.చూ. పోలేలు. వి. పోలకమ్మ.

పోలేరమ్మ వి. పోలకమ్మ. <పోలేరు + అమ్మ. పోలేరమ్మకమ్మి రూ. పోల్రెమ్మకమ్మి. వి. పోలేరమ్మచీర కమ్మిలో మధ్య మధ్య అందానికి పెట్టిన రంగుపోగులు. పోలేరమ్మగడిచీర వి. ఒకఅంచు 30 కొలుకులు నలుపు, ఒకఅంచు 20 కొలుకులు ఎరుపు రంగుల్లో పెట్టి చిగురంచు తెలుపు వదిలి ముప్పయ్యేసి కొలుకుల కమ్ములకు చెరొక రంగూపెట్టి ఎరుపుకళ్ళు తీర్చినేసిన తెల్లచీర.

పోలేలు రూ. పోలేరు. వి. పోలేరమ్మ అనే గ్రామదేవత. <పోలు[1]. + ఏలు.

పోల్కి చూ. పోలు[1].

పోల్చు చూ. పోలు[1].

పోల్తాడు చూ. పోలు[2].

పోల్తి చూ. పోలు[1]. వి. పోలిక.

పోల్పు చూ. పోలు[1]. వి. కట్టే పద్ధతి.

పోల్రెమ్మకమ్మి రూ.చూ. పోలేరమ్మ కమ్మి. వి. పోలేరమ్మ చీర కమ్మిలో మధ్య మధ్య అందానికి పెట్టినరంగు పోగులు.

పోల్లడు రూ.చూ. పోరె. వి. అనాథబాలుడు.

పోకమి రూ. పోకిమి. వి. అనురాగం, ప్రేమ. తాళ్ల. సం. 7.20.

పోళి రూ.చూ. పోలె[2]. వి. బొబ్బట్లు.

పోకిమి రూ. చూ. పోకమి. వి. అనురాగం. తాళ్ల. సం. 15.99.

పోళి రూ.చూ. పోలె[2]. వి. బొబ్బట్టు.

పోళె రూ.చూ. పోలె[2]. వి. బొబ్బట్టు.

పోళెము రూ.చూ. పోడెము. విఅ. వేగవంతం, వడికలది. పి. శకు. 4.165.

పోవచ్చు చూ. పోవు[1].

పోవడి చూ. పోవు[1].

పోవడ్లు వి.బ.వ. తెలికి వేవురలో జాతిభేదం.

పోవనరుచు చూ. పోవు[1].

పోవవాడు చూ. పోవు[1].

పోవవిచ్చు చూ. పోవు[1].

పోవఁద్రోలు చూ. పోవు[1].

పోవిడుచు చూ. పోవు[1].

పోవు[1] అ.క్రి. 1. వెళ్ళు. భార. ఆది. 1.47; 2. తీరు, అడగు. భార. ఆది. 2.64; 3. సిద్ధమగు, ఉన్ముఖమగు. భార. ఆది. 2.159; 4. కదచు, గతించు, అతిక్రమించు.

భార. ఆది. 3.112 ; 5. చచ్చు. మరణించు. భార. ఆది. 5.144 ; 6. అరిగిపోవు. ఖంకపోవు. భార. ఆది. 5.228 ; 7. యత్నించు. ఆరంభించు. కు.సం. 6.21 ; 8. రమించు, సంభోగించు. నె. గా. ఒంగోలు. 7.1236 ; 9. అగు, ఏర్పడు. పండి. చ. 4.273వ. ; 10. అనుకరించు. ద. హిం.గా. సంపు. 10. గా. సం. 563. క్రి. శ. 1312 ; 11. ఇదిపెక్కు ధాతువుల క్త్వార్థాలకను ప్రయుక్తమై ఆ క్రియలయొక్క పరిపూర్తిని తెలుపుతుంది. భార. విరా. 5.61 ; 12. వర్తించు. ఉండు. భార. ఉద్యో. 2.186 ; 13. పారిపోవు, తప్పించుకొనిపోవు. మరలిపోవు. తిరిగిపోవు. భార. ఉద్యో. 4.222 ; 14. (యుద్ధం మొ. వి). జరుగు, సాగు. భార. భీష్మ. 3.335 ; 15. చొచ్చు, ప్రవేశించు. భార. ద్రోణ. 2.235 ; 16. వ్యయమగు. అయిపోవు. భార. అను. 5.116 ; 17. విరమించు. ఊరకుండు. భార. అశ్వ. 1.106 ; 18. దొంగిలింపబడు. అపహృతమగు. భీమ. 4.100 ; 19. తీరు. నెరవేరు. సిద్ధించు. భోజ. 6.9 ; 20. ప్రసరించు. వ్యాపించు. విష్ణుపు. 1.1156 ; 21. తనివోవు, తృప్తినొందు. ఆము. 5.74 ; 22. చెల్లు. మూరు. పాండు. 3.16 ; 23. (గణిత) వ్యవకలితమగు, తీసివేయబడు ; 24. ఇటుకొన్నివట్ల అర్థవిశేషం లేని కొన్ని పదాలతో కలిసి శబ్దపల్లవమౌతుంది (నిద్దురపోవు. ఉబ్బరపోవు). స.క్రి. 1. పొందు. మార్క. 5.134 ; 2. రతియందు కూడు. వేంక. పంచ. 1.588.

క. పో, పోగు, పోగు. వెళ్ళు. దూరంగా వెళ్ళు. వెళ్ళించు ; తు. పోపిని. వెళ్ళు, దూరంగా వెళ్ళు. కనబడకుండా పోవు. వెళ్ళిపోవు. బయలుదేరు ; త. పో, (పో -న్త్-). వెళ్ళు, ముందుకు జరుగు, దూరంగా వెళ్ళు. పోవి (-ప్ప్-, -త్త్-). వెళ్ళేట్టుచేయు. దారిచూపు. పోక్క. వెళ్ళటం. పోక్కు (పోక్క్-). వెళ్ళేట్టుచేయు. పంపు. పూర్తిచేయు ; మ. పోక. వెళ్ళు. దూరంగా వెళ్ళు. చేయగలుగు, పోగొట్టుకొను. పోక్కు. వెళ్ళటం, దారి, మార్గం, తప్పించుకోవటం, పోక్కుక. వెళ్ళేట్టుచేయు, తొలగించు ; కో. పొ.క్- (పొ.క్య్- ). వెచ్చించు (కాలం) ; కొ. పి.క్స్- (పి-). వెళ్ళు.

మూ.ద్రా. *పో-, *పో-క్-. < *పాక్అ-.

< మూ.ద్రా. *పక్-అ-.

పోక[1] రూ. పోకు[1]. వి. 1. గమనం. పోవటం. భార. ఆది. 1.114 ; 2. మరలిపోవటం, నివర్తనం. భార. విరా. 4.61 ; 3. శృంగారచేష్ట, విలాసం. భార. ఉద్యో. 1.173 ; 4. గతి, మార్గం, విధం. భార. ఉద్యో. 4.83 ; 5. నాశం, క్షయం. భార. భీష్మ. 1.15 ; 6. ఇది కొన్ని ధాతువుల క్త్వార్థం కను ప్రయుక్తమై ఆయా క్రియల సంపూర్ణతను తెలుపుతుంది. భార. భీష్మ. 2.160 ; 7. ప్రవర్తన, నడవడి. పె. శకు. 1.50 ; 8. (పోయినవిధం) పోలిక. జార. ఉ.రా. 4.318 ; 9. సంధి మొదలైన షడ్గుణాల్లో ఒకటి. యానం. అం.రా. 2.189. క. పో, పోగు, పోగుహ. వెళ్ళటం. ప్రయాణించటం, ముందుకు పోవటం ; తు. పోకు. వెళ్ళిపోవటం ; త. పోక్కై. ప్రయాణం. వెళ్ళిపోవటం ; మ. పోక. వెళ్ళు, వెళ్ళిపోవు. ముందుకుపోవు. పోకల్, పోక్కు. వెళ్ళటం, దారి. మార్గం, తప్పించుకోవటం. పోకరు వి. 1. మరణం, చావు. భార. ద్రోణ. 2.257 ; 2. నీతి, మర్యాద. భార. శాంతి. 3.505 ; 3. చేష్ట, ప్రవర్తన, నడత. కా. 6.244 ; 4. గమనం. కృ. శ. 2.58 ; 5. నాశం, భంగం. కవిక. 5.128 ; 6. గృహప్రవేశం. పోకరగండి వి. ఎద్దలో విత్తనపు కోరె. పోకరపెట్టు రూ. పోకరపెట్టు. స.క్రి. 1. విడచు, త్యజించు. శృం.నై. 7.42 ; 2. విక్రయించు. అమ్ము. హరిశ్చ. 4.77 ; 3. వ్యయించు, హెచ్చించు. పంచ. 5.120 ; 4. పోగొట్టుకొను, నాశంచేసికొను, పాపికొను. పోకరపెట్టు (-పెట్టు) రూ.చూ. పోకరపెట్టు. స.క్రి. 1. పోగొట్టుకొను, నాశంచేసికొను, పాపికొను. కాశీ. 5.48 ; 2. విక్రయించు. అమ్ము. హరిశ్చ. 5.74 ; 3. వ్యయించు. హెచ్చించు ; 4. విడుచు. త్యజించు. పోకలబోవు (-పోవు) అ.క్రి. వేషాలుపోవు. పోకలాడి వి. మాయలాడి, కపటిని. శుక. 2.38. < పోక + -లు + -ఆడి. పోకలాడు వి. మాయలాడు, కపట ప్రవర్తన కలవాడు. కాశీ. 6.72. < పోక + -లు + -ఆడు. పోకలు వి.బ.వ. ఎగరేస్తే ఆకాశానికి పోయే మందు బుడ్లు. < పోక + -లు. పోకారు రూ. పోకారు. అ.క్రి. 1. నశించు, చెడు. పారి. 2.58 ; 2. పోవు. పారిపోవు. ద్వి. హరిశ్చ. 4. 1897 పం. పోకారుచు రూ.చూ. పోకార్చు. స.క్రి. 1. అడచు, అపనయించు. శివరా. 3.22 ; 2. చంపు. చంపకొను ; 3. పోగొట్టు, పోగొట్టుకొను ; 4. నాశంపొందించు, దగ్ధంచేయు. చెరచు ; 5. పాపు, పాపుకొను ; 6. పాడుపరుచు, శూన్యంగాఉంచు ; 7. వ్యయపర్చు, వెచ్చించు ; 8. విక్రయించు, అమ్ము. పోకార్చు రూ. పోకారుచు. పోకారుచు. స.క్రి. 1. విక్రయించు, అమ్ము. బసవ. 4.910 పం. ; 2. చంపు, చంపుకొను. భార. స్త్రీ. 1.13 ; 3. అడచు, అపనయించు. శివరా. 3.22 ; 4. పాడుపర్చు, శూన్యంగాఉంచు. వరాహ. 3.67 ; 5. వ్యయపర్చు, వెచ్చించు. వేంక.పంచ. 3.296 ; 6. పాపు, పాపుకొను. చెన్నబసవ. 1.152 ; 7. నాశంపొందించు. దగ్ధంచేయు. చెరచు ; 8. పోగొట్టు పోగొట్టుకొను. పోకాఱు రూ.చూ. పోకారు. అ.క్రి. 1. చచ్చు ; 2. నశించు. పోకాలు రూ.చూ. పోకాలు. అ.క్రి. పోవు (ఇవి అనిష్టకోపముగాపదాల్లో ప్రయోగింపబడుతుంది). మను. 5.17. పోదంత వి. చనిపోయే కాలం. పోగాలమువచ్చు (-కాలమువచ్చు) అ.క్రి. వినాశకాలం దాపరించు. పోగొట్టు (-కొట్టు[1]) స.క్రి. 1. కోల్పోవు. పల్నా.వ. 75 ; 2. వగలగొట్టు. పాడుచేయు. జైమినిభా. 4.37 ; 3. నాశనంచేయు, నష్టపర్చు ; 4. గతింపచేయు, దాటిపోచేయు. దాటబెట్టు. పోదిద్దు అ.క్రి. పోగొట్టు. రాధికా. 1.125. పోదొబ్బు స.క్రి. పోగొట్టు. శార్ఙ్గ.సం 5.255. పోపరచు రూ. పోవనరచు. స.క్రి. 1. తరిమివేయు, వెడలగొట్టు. భార.విరా. 3.90 ; 2. సంహరించు.

లయింపచేయు; 3. విడుచు, త్యజించు. <పోవు[1]+-అ[7]+నడచు. పోవాట వి. అపకీర్తి, అప్రతిష్ఠ. కేయూ. 3.225. పోవాడు రూ. పోవనాడు. స.క్రి. 1. త్యజించు. వదలు. రాఘ.రా.యు. 1557; 2. దూరు, నిందించు. రం.రా.అయోధ్యా. 139 పు. 19 పం.; 3. పోగొట్టు, నష్టపర్చు. పోగొట్టుకొను, కోల్పోవు. విక్ర. 7.92; 4. తిరస్కరించు, తృణీకరించు, నిరసించు. విష్ణుపు. 6.332. <పోవు[1]+-అ[7]+ఆడు. పోవాడుకొను స.క్రి. పోగొట్టుకొను. వర.రా.కిష్కిం.వు. 415. 4 పం. పోవిచ్చు స.క్రి. 1. పోవనియ్యకొను, పోవిడుచు. నిర్వ.రా. 5.9; 2. దీని ప్రార్థనార్థకైకవచన బహువచన రూపాలైన పోనిమ్ము, పోనీ, పోనిండు అనేవి ఉపేక్షను అంగీకారాన్ని తెలుపుతుంది. ఆము. 5.59. <పోవు[1]+-అ[7]+ఇచ్చు. పోవిడు స.క్రి. 1. విడుచు, త్యజించు. రంగా.చ. 2.173; 2. పోగొట్టుకొను, కోల్పోవు. చంపూరా. 2.30. <పోవు[1]+-అ[7]+ఇడు. పోవొత్తు స.క్రి. త్యజించు, విడుచు. విష్ణుపు. 5.152. <పోవు[1]+-అ[7]+ఒత్తు. పోవోము స.క్రి. పోగొట్టుకొను, కోల్పోవు. చంపూరా. 5.57. పోఁదుడుచు స.క్రి. తుడిచివేయు, పోగొట్టు. కా. 6.128. <పోవు[1]+-అ[7]+తుడుచు. పోఁదేర్చు స.క్రి. పోగొట్టు, అపనయించు. కళాపూ. 5.110. <పోవు[1]+-అ[7]+తేర్చు. పోఁదోలు రూ. పోఁద్రోలు, పోవఁద్రోలు. స.క్రి. పంపించివేయు. కు.సం. 8.115. <పోవు[1]+-అ[7]+తోలు[1]. పోఁద్రోలు రూ.చూ. పోఁదోలు. స.క్రి. పంపించివేయు. పోవడు అ.క్రి. 1. పోవు, చెడిపోవు. భార.శాంతి. 3.249; 2. డిల్లపోవు, సత్త్వహీనుడగు. భార.అరణ్య. 6.190. <పోవు[1]+పడు. పోవరి వి. దారిదొంగ. <పోవు[1]+-అరి. పోపిట్ట వి. పక్షి విశేషం. <పోవు[1]+పిట్ట. పోబడి వి. పోయినజాడ, ఆచూకీ. పరమ. 3.283. <పోవు[1]+-బడి. త. పాపటి. జాడ. పోబెట్టు (-పెట్టు) వి. అనురాగంవల్ల పుట్టిన ధ్వని, ప్రణాదం. పోబెరుగు (-పెరుగు) అ.క్రి. మితిమీరి పెరుగు. పోమొత్తుట వి. పనులు ఎగవేయటం. కాశీ. 2.22. <పోవు[1]+మొత్తు+-ట. పోఁబుచ్చు స.క్రి. విడుచు, త్యజించు. బసవ. 4.913. <పోవు[1]+-అ[7]+-పుచ్చు. పోఁబెట్టు స.క్రి. విడుచు, త్యజించు. రాఘ.రా.యు. 1032. <పోవు[1]+-అ[7]+పెట్టు. పోయికాలం రూ.చూ. పోయేకాలము. వి. చేటుకాలం, పోయేకాలం. పోయివది పూతకొగ వి. వనచంద్రలత (Flagellaria indica). పోయిన నీళ్లకు గట్టువెట్టు (-పెట్టు) అ.క్రి. అయిపోయిన విషయాన్ని గురించి ఆలోచించు. పోయినపోకగా క్రి.విశే.రూ. అదే పోకగా. ఉ.హరి. 1.82. పోయినపోకగాఁబోవు అ.క్రి. అదే పోకపోవు, తిరిగి రాకుండ పోవు. పారి. 6.37 పోయిపోలేక అవ్య. పోవలెనని ఉన్నా పోవటానికి శక్తి చాలక. మను. 4.42. పోయివచ్చు అ.క్రి. పోవు, వెళ్ళు. భార.శాంతి. 6.611. పోయేకాలము రూ. పోయికాలం. వి. 1. వినాశకాలం; 2. గడచిపోతున్నకాలం. పోరాకుండు అ.క్రి. పోవలసిన చోటికి పోకుండా రావలసిన చోటికి రాకుండా ఉండు. (దీన్ని సామాన్యంగా వచ్చుట పోవుట జంటగా ఉపయోగించటం అలవాటు). మను. 3.138. పోరాని విశే. 1. పోవవీలుకాని. ఆము. 4.264; 2. ఆప్తుడు. పోరానిచుట్టము వి. (వచ్చిన వెంటనే వెళ్ళకూడని చుట్టం) ఆప్తబంధువు, దగ్గరచుట్టం. భార.ఉద్యో. 3.329. పోరామి వి. 1. (పోవచ్చు యొక్క వ్యతిరేకభావార్థకం) పోవశక్యంగాని, పోగూడమి. భార.శాంతి. 5.163; 2. చిక్కు, బాధ. హరి.పూ. 3.216; 3. చెలిమి, స్నేహం. కాశీ. 2.74; 4. భక్తి, ఆదరం. భాగ. 10 ఉ. 1168; విశే. ఆప్తం, ప్రియం.విక్ర. 7.145. పోరామియొనర్చు(-ఒనర్చు) స.క్రి. పోరుపెట్టు. కుక. 2.568. పోరాములుసేయు(-చేయు) అ.క్రి. రాకపోకలతో సంబంధం పెట్టుకొను. కాశీ. 2.74. పోవచ్చు అ.క్రి. 1. పోవశక్యమగు. భాగ. 10 పూ. 1340; 2. పోదగు. పోవడి వి. వాలకం. పోవనడచు రూ.చూ. పోనడచు. స.క్రి. 1. సంహరించు, లయింపచేయు. ఆము. 1.4; 2. విడచు, త్యజించు. పాండు. 5.50; 3. తరిమివేయు, వెడలగొట్టు. <పోవు[1]+-అ[7]+నడచు. పోవవాడు రూ.చూ. పోనాడు. స.క్రి. దూరు, నిందించు. వేంక.పంచ. 2.126. <పోవు[1]+-అ[7]+ఆడు. పోవవిచ్చు స.క్రి. పోవనియ్యకొను, పోవిడుచు. భార. భీష్మ. 3.171. <పోవు[1]+-అ[7]+ఇచ్చు. పోవఁద్రోలు రూ.చూ. పోఁదోలు. స.క్రి. పంపించివేయు. <పోవు[1]+-అ[7]+త్రోలు. పోవిడుచు స.క్రి. పరిత్యజించు, విడుచు, విడిచిపెట్టు. నిర్వ.రా. 6.20. <పోవు[1]+-అ[7]+విడుచు. పోవుదెంచు(-తెంచు) అ.క్రి. పోవు, గతించు. భార.ఆది. 2.193. పోవువాఁడు విశే. గంత, వాటదారి. పోవైచు స.క్రి. పడవేయు. పారవైచు. భార. సౌప్తి. 1.214. <పోవు[1]+-అ[7]+వైచు.

పోవు[2] రూ.చూ. పోఁగు. వి. 1. నారలోని ఒక ఈనె; 2. ఒంటిపోచదారం.

పోవెలు వి.బ.వ. భక్ష్య విశేషం. కాశీ. 7.186.

పోషాకు వి. పోషణ.

హిం. పోషక్. పోషణకలిగించేది, ఆహారాన్నిచ్చే సహాయం చేసేవాడు, రక్షించే వాడు, పరిపాలించే వాడు.

<హిం. పోషక్.

పోష్టాఫీసు రూ. పోస్టాఫీసు. వి. తపాలా కార్యాలయం.

ఇం. *Post-Office*. తపాలాపని జరిగే గృహం.

<ఇం. Post-Office.

పోష్టు రూ.చూ. పోస్టు[3]. వి. ఉద్యోగం.

పోస రూ.చూ. పోఁచ. వి. గడ్డి పరక.

పోసకపోవు అ.క్రి. పొచిపట్టు.

పోసనము వి. 1. క్షీరం, పాలు. భాగ. 10 పూ. 1381; 2. పైపూత, పైమెరుగు. పాండు. 3.43; 3. కాంతి, ప్రకాశం. యయా. 4.13.

సం. స్పర్శనా; ప్రా. పోసణా. స్పర్శక్రియ, పుపణం. స్పర్శనం.

<ప్రా. పోసణా.

పోవపోవ అ.క్రి. మదించు. గర్వించు. శాశ్వ.సం. 14.270.

పోవబోవ చూ. పోఁచ. వి. గడ్డి పరకలు.

పోవముదాగు అ.క్రి. తీర్థంలాగ భక్తితో ఆపోశనం పట్టు. శాశ్వ.సం. 12.90.

పోవరము రూ.చూ. పొగరము. వి. మదం. గర్వం. వేంక. పంచ. 1.718.

పోవరించు రూ.చూ. పొగరించు. అ.క్రి. మదించు, గొవ్వు. బలియు, వష్టమగు. శాశ్వ.సం. 8.160.

పోవరించు చూ. పోవరము.

పోవటెక్క వి. మత్స్యవిశేషం, ఒకరకం చేప.

పోకావి వి. 1.ఎరుకలసాని ; 2. ఒక నాగరికమైన స్త్రీ.

పోవికాలు రూ. పోసికోలు. వి. 1. పోషణ ; 2. వరనవ మాట ; 3. వ్యర్థప్రసంగం.

పోటికోలు రూ.చూ. పోసికాలు. వి. 1. వ్యర్థ ప్రసంగం ; 2. వరనవ మాట.

పోమ రూ. పోచు. వి. తిరుగమాత.

పోమకోరు వి. నమ్మరాని మాటలు.

పోమకోలు వి. వరిగడ్డి కాల్చిన బూడిదతో మేలురాని చుట్టూ కిందవైపు గీసేగీత.

పోమకోలుమాటలు వి.బ.వ. నమ్మరాని మాటలు.

పోపగోలు చూ. పోసుకోలు. వి. అరుగ్కాని తినేవారు.

పోమదు వి. పొయ్యటం.

పోమారు వి. పాపోసు, ముచ్చె.

పోపెట్టి వి. కోమటివారి పేరు.

పోస్ట్ రూ. పోస్టు[1]. వి. గుంజ, స్తంభం.

ఇం. *Post*[1]. స్తంభం, గుండ్రంగా పొడుగ్గా ఉండే గుంజ.

<ఇం. Post[1].

పోస్టరు వి. బహిరంగ స్థలంలో ప్రదర్శించే ప్రకటన పత్రం.

ఇం. *Poster*. ప్రకటన పత్రం అతికించేవాడు, బహిరంగ స్థలంలో ప్రదర్శించే ప్రకటన పత్రం.

<ఇం. Poster.

పోస్టాఫీసు రూ.చూ. పోస్టాఫీసు. వి. తపాలా పని జరిగే గృహం.

పోస్టు[1] రూ.చూ. పోస్ట్. వి. 1. స్తంభం, గుంజ ; 2. మూన కట్టులోని నిలువ కర్ర.

పోస్టు[2] వి. టపా అంచె.

ఇం. *Post*[2]. ఉత్తరాల బట్వాడా.

<ఇం. Post[2].

పోస్టు[3] రూ. పోస్టు. వి. ఉద్యోగం, పదవి.

ఇం. *Post*[3].ఉద్యోగం, సైనికస్థానం.

<ఇం. Post[3].

పోస్టుకార్డు వి. తపాలాద్వారా బట్వాడా చేయబడే కార్డు.

ఇం. *Post-Card*. తపాలాద్వారా పంపబడే కార్డు.

<ఇం. Post-Card.

పోస్టుపోనగు అ.క్రి. వాయిదాపడు.

ఇం. *Postpone*. వాయిదావేయు.

<ఇం. Postpone + అగు.

పోస్టుపోన్‌చేయు స.క్రి. వాయిదావేయు.

ఇం. *Postpone*. వాయిదావేయు.

<ఇం. Postpone + చేయు.

పోస్టుమాస్టర్ వి. తపాలా కార్యాలయాధికారి.

ఇం. *Post-master*. తపాలా కార్యాలయాధికారి.

<ఇం. Post-master.

పోస్టుమేన్ వి. తపాలా బంట్రోతు.

ఇం. *Post-man*. ఉత్తరాల్ని అందించే లేదా తీసుకొనే వ్యక్తి.

<ఇం. Post-man.

పోస్తకాయ రూ. పోస్తుకాయ. వి. గనగన కాయపై పెరదు.

హిం. పోస్త. పెరదు.

పోస్తు వి. గనగసా కాయ.

పోస్తు వి. గసగసాకాయ.

హిం. పోస్త. పెరదు, డొల్పట. చర్మం. గనగసా చెట్టు ; ఉ. పోస్త. నల్లమందు. పెరదు ; పార. పోస్త. చెట్టు పెరదు, గనగసా చెట్టు. గనగసాకాయలతో తయారు చేయబడి క్రమక్రమంగా విషం మాదిరిగా పని చేసేందుకు ఉపయోగించే కషాయం. చర్మం.

<ఉ. పోస్త.

పోస్తుకాయ రూ.చూ. పోస్తకాయ. వి. గనగనకాయపై పెరదు.

పోహణ వి. 1. నేర్పు, కౌశలం. రాధికా. 3.114 ; 2. పందర్భం. కూర్పు. శేమ. 1.161 ; 3. వ్యవహార నందర్భం. కార్యస్థితి. భరద్వాజ చరిత్రము 4.67 ; 4. వర్ణనం, పొగడ్త, ప్రసన్నరాఘవ శతకం.

సం. ప్రవాహణ-. నిపుణంగా వహించటం ; ప్రా. పఉహణ-, పవహణ-. మోసేది, వహించేది ;

క. పోణిసు. పవణిసు. జతచేయు. కలుపు, దండగా గుచ్చు. దారం ఎక్కించు (సూదిలో). పవణిగె. కలపటం, కట్టబడి ఉండు.

పోహణించు స.క్రి. 1. కూర్చు. గుంపించు. ప్రబోధ. 1.27 ; 2. పొగడు, స్తుతించు. ద్వి.భార. విరా. 4.95 వ.

<పోహణ + -ఇంచు[3].

పోహణించు చూ. పోహణ.

పౌచీ రూ.చూ. పౌంచి. వి. మణికట్టుకు వేసుకొనే ఒక విధమైన నగ.

పౌజీ రూ.చూ. పౌంచి. వి. మణికట్టుకు వేసుకునే ఒకవిధమైన నగ.

పౌజు రూ.చూ. పౌఁజు. వి 1. సేన. పటాలం. పల్నా. ప. 114 ; 2. సమూహం. ఆం.నా.సం. మూన. 76 ; 3. పంక్తి. ఆం.బా. 2.35.

పౌంచి రూ. పాంచీ, పాంజీ, పాముజి, పాహ్చా, పాల్జీ, పావంజీ, పోచీ, పౌచీ, పౌజీ, పౌంజీ. వి. మణికట్టుకు ధరించబడే ఆభరణ విశేషం.

హిం.ఉ. పహుంచీ. మణికట్టుపై ధరించబడే ఆభరణ విశేషం.

<ఉ. పహుంచీ.

పౌంజీ రూ.చూ. పౌంచి. వి. మణికట్టుకు వేసుకునే ఒకవిధమైన

నగ.

**పౌంజు** రూ.చూ. పౌఁజు. వి. సేన.

**పౌంజెపు** రూ.తూ. పాంజేబు. వి. కాళ్ళకు వేసుకొనే గజ్జె గొలుసు.

**పౌఁజు** రూ. పవుఁజు, పవుజు, పౌజు, పౌంజు, ఫవుజు, ఫౌజ్, ఫౌజి, ఫౌజు, ఫౌంజు. వి. 1. పంక్తి, వరస, రం. రా. అరణ్య. 153 పు. 14 పం.; 2. సేన, దండు, పల్నా. వు.87, విక్ర. 8.57; 3. సమూహం. అచ్చ.రా.బాల. 20.

సం. పుంజ-. సమూహం; హిం.ఉ. పార. ఫౌజ్. సేన.

<ఉ. ఫౌజ్.

**పౌఁజుతీరు** అ.క్రి. బారుతీరు. **పౌఁజుతీరుచు** స.క్రి. సేనల్ని బారుగా తీర్చు, వ్యూహంగా పన్ను. ఆము. 6.122. **పౌఁజులకమ్మ** రూ. పవుఁజులకమ్మ. వి. పంజులకమ్మ, రత్న తాటంకం, స్త్రీకర్ణభూషా విశేషం. యయా. 4.90. త. పాంచుకమ్మల్. **పౌఁజులుతీరు** రూ. పవుజులు తీరు, పవుఁజులు తీరు. అ.క్రి. పంక్తులుగా ఏర్పడు, బారులుకట్టు. యయా. 4.155. **పౌఁజులుతీరుచు** రూ.చూ. పౌఁజులుతీర్చు. స.క్రి. సేనల్ని బారుగాతీర్చు, వ్యూహంగా పన్ను. **పౌఁజులు తీర్చు** రూ. పవుఁజులు తీరుచు, పవుఁజులు తీర్చు, పౌఁజులు తీరుచు. స.క్రి. సేనల్ని బారుగా తీర్చు, వ్యూహంగా పన్ను. రామాభ్యు. 3.274. **పౌఁజులుసేయు** (-చేయు) రూ. పవుఁజులు సేయు. స.క్రి. పౌజులు తీర్చు, పంక్తులుగా ఏర్పర్చు. జైమినిభా. 3.98. **పౌఁజువెట్టు** (-పెట్టు) అ.క్రి. సేనని నడిపించు. మను. 5.44.

**పౌడ** రూ.చూ. పావడా. వి. పావడ.

**పౌడరు** రూ. పవుడరు. వి. 1. పొడి, పిండి; 2. ముఖానికి రాసుకొనే పరిమళ ద్రవ్యం.

ఇం. *Powder*. పొడి, దుమ్ము.

<ఇం. Powder.

**పౌడర్‌దిమ్మె** వి. రాతికి మెరుగు పెట్టటానికి వాడే 4 అంగుళాల చదరపు కొయ్యదిమ్మ. **పౌడర్రాయి** వి. ముగ్గు వేసుకోవటానికి పనికివచ్చే తెల్లని మెత్తని రాయి.

**పౌడర్‌దిమ్మె** చూ. పౌడరు.

**పౌడర్రాయి** చూ. పౌడరు.

**పౌండేషను** వి. నిర్మాణపు నమూనా ప్రకారం గోడల బలంకోసం భూమిలో మొట్టమొదట తవ్వే గుంట.

ఇం. *Foundation*. పునాది.

<ఇం. Foundation.

**పౌను** రూ. పవును. వి. ఒక తూనిక, పదహారు ఔన్సుల బరువు, నలభై తులాలు.

ఇం. *Pound*. ఒక తూనిక.

<ఇం. Pound.

**పౌనుజాడి** వి. చిన్నరకం జాడి.

**పౌందారు** రూ.చూ. ఫౌజుదారు. వి. సేనానాయకుడు.

**పౌరుషము** వి. 1. పరాక్రమం; 2. రోషం.

సం. పౌరుష-. పురుష సంబంధమైనది.

<సం. పౌరుష- (అర్థవిపరి.).

**పౌరుషాలు పలుకు** అ.క్రి. గొప్పవాడినని డంబాలు పలుకు.

**పౌరుషాలు పలుకు** చూ. పౌరుషము.

**పౌర్ణమాస్య** వి. పౌర్ణమి. ద.హిం.గా. సంపు. 6. గా.సం. 176. క్రీ.శ. 1151.

సం. పూర్ణమాస్-, పౌర్ణమాస-. పున్నమి.

<సం. పౌర్ణమాస-.

**పౌలు** రూ.చూ. పగులు. ఆ.క్రి. చీటవారు. వి. పొలంలో వర్ష వాన నీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా అడ్డువేసిన కట్ట.

**పౌల్ట్రి** వి. వ్యాపారికంగా అధిక సంఖ్యలో పెంచబడే కోళ్ళు.

ఇం. *Poultry*. కోళ్ళు, బాతులు మొదలైన పెంపుడు పక్షులు.

<ఇం. Poultry.

**ప్యాదా** రూ.చూ. పేదా. వి. బంట్రోతు.

**ప్యారిగోడ** రూ.చూ. పారిగోడ. వి. ఇంటి ఆవరణచుట్టూ కట్టిన గోడ.

**ప్యూను** వి. బంట్రోతు, జవాను.

ఇం. *Peon*. బంట్రోతు.

<ఇం. Peon.

**ప్యూర్** రూ.చూ. ప్యూరు. విశే. శుద్ధమైన, కల్తీలేని.

**ప్యూరిటను** వి. ఇంగ్లిషు ప్రొటెస్టెంటు మతానుయాయులలో ఒక పక్షానికి చెందినవారు.

ఇం. *Puriton*. ఇంగ్లిషు ప్రొటెస్టెంటు మతానుయాయులలో ఒకపక్షానికి చెందినవారు.

<ఇం. Puriton.

**ప్యూరు** రూ. ప్యూర్. విశే. 1. శుద్ధమైన, కల్తీలేని.

ఇం. *Pure*. శుద్ధమైన.

<ఇం. Pure.

**ప్రక్క**[1] రూ.చూ. పక్కము. వి. 1. పార్శ్వం. తాళ. వరా. 1.145; 2. పక్షం; 3. బరిపెంక.

**ప్రక్కగోఁచి** వి. ఓరగచ్చ, వారగోచి. **ప్రక్కతాళము వేయు** అ.క్రి. తాళంవేయు. **ప్రక్కలుపోడుచు** స.క్రి. ప్రోత్సహించు. శుక. 2.479. **ప్రక్కలెగయువట్టురోజు** అ.క్రి. ఆయాసపడు. కళా. 4.153. **ప్రక్కలోకుంపటి** వి. సదా బాధించే విషయం.

**ప్రక్క**[2] రూ.చూ. పక్కయ[1]. వి. పిచులం, పక్కెచెట్టు.

**ప్రక్కి** రూ.చూ. పక్కయ[1]. వి. పిచులం.

**ప్రెక్క** రూ.చూ. పక్కయ[1]. వి. పిచులం.

**ప్రగడ** రూ.చూ. పెగ్గడ. వి. ప్రధాని, మంత్రి.

**ప్రగ్గ** రూ.చూ. ప్రంగ. వి. ఎడంగా సాగిన కొమ్మ.

**ప్రగ్గడ** రూ.చూ. పెగ్గడ. వి. సచివుడు, మంత్రి.

**ప్రగ్గడకత్తె** వి. పనికత్తె.

**ప్రగ్గము** రూ.చూ. పగ్గము. వి. పగ్గానికి మొదటి రూపం, తాడు. ఆము. 5.122.

**ప్రగ్గిడ** రూ.చూ. పెగ్గడ. వి. సచివుడు.

**ప్రంగ** రూ. పంగ[1], పంగలం, పంగు[2], ప్రగ్గ. వి. (ఎడంగా సాగిన) వృక్షాదుల కొమ్మ, పలవ. భాగ. 10 పూ. 91.

క. పంగ. ఎడంగా సాచటం, చెట్టుయొక్క చీలిన

గొమ్మ. పంగర. ఎరమయిన, విలక్షణమైన, విశిపశిన; తు. పంగర.

ప్రంగుడు వి. నేత్రరోగ విశేషం. పండి.చ. 4.278.

ప్రణాళిక వి. పథకం.
సం. ప్రణాళికా-. నీరు మొ. వి. ప్రవహించే దారి.
< సం. ప్రణాళికా (అర్థవిపరి.).

ప్రమిదె వి. నూనె పోసి దీపం పెట్టటానికి వాడే చిన్న మట్టి పళ్ళెం.

ప్రండి వి. కన్యాశుల్కం.

ప్రథమము విశ. ఆద్యం, మొదటిది. లక్ష్మీశ్వరం శిలాశాసనం.
సం. ప్రథమ-. మొదటి; ప్రా. పఢమ-, పథమ-, పడుమ-, పుఢమ-, పుఢుమ-.
< సం. ప్రథమ-.

ప్రతాపము వి. గర్వం.
సం. ప్రతాప-. మిక్కిలి వేడిమి, ధైర్యం, శక్తి, తాపం; ప్రా. పయావ-; ప. పతాప. శౌర్యం.
< సం. ప్రతాప- (అర్థవిపరి.).

ప్రతి వి. 1. నిదర్శనం. పండి.చ. 1.52 పు. 14 పం: 2. సంపుటం; 3. పునాదికై తవ్విన పొడుగాటి గుంట.
సం. ప్రతి. విరుద్ధంగా, వెనుక.
< సం. ప్రతి (అర్థవిపరి.).

ప్రతిచేయు రూ. ప్రతిసేయు. అ.క్రి. స.క్రి. సాటిచేయు, పోల్చు. విక్ర. 4.17. ప్రతిపెట్టుకొను స.క్రి. ఎదుటఉంచు, సమానంగాఉంచు. శార్ఙ్గ.సం. 7.280. ప్రతిపోల్చు స.క్రి. సరిపోల్చు. రం. రా. బాల. 19పు 2పం. ప్రతిమాటలు వి.బ.వ. జవాబులు. బసవ. 7.192. ప్రతియొసర్చ(గరాని (-ఒసర్చ(గరాని) అవ్య. ప్రతి పెట్టరాని. రుక్మా.చ. 1.90. ప్రతిరవలు వి.బ.వ. అలంకం. నె.గా. పొదిలి గా. 1. ప్రతిలేక అవ్య. మారులేక. ప్రతివచ్చు అ.క్రి. సమానమగు. శృం. నై. 7.93. ప్రతిపెట్ట(గరాని (-పెట్ట(గరాని) విశ. ప్రతిమానం, అసమానం. రుక్మా. చ. 1.86. ప్రతిపెట్టు (-పెట్టు) స.క్రి. ఎదుట ఉంచు, సమానంగా ఉంచు. శృం.నై. 6.45. ప్రతిసేయు (-చేయు) రూ.చూ.ప్రతిచేయు. అ.క్రి. స.క్రి. సాటిచేయు, పోల్చు. వసు. 1.84.

ప్రతిన వి. 1. ప్రతిజ్ఞ, శపథం. కు.సం. 2.89, భార.ద్రోణ. 2.316; 2. ప్రతిజ్ఞావాక్యం. భార.విరా. 4.205; 3. పట్టుదల, దృఢదీక్ష. కాశీ. 6.86; 4. నియమం, నిష్ఠ. వైజ. 2.26; 5. సామ్యం. ముకుంద. 2.99.
సం. ప్రతిజ్ఞా. శపథం; ప్రా. పా. పఇణ్ణా, పఇన్నా, పడిణ్ణా, పడియా; గా. పఇణ్ణా, పదణ్ణా; జై.మహా. పఇణ్ణా; అ.మా. పఇణ్ణా, పఇన్నా, పడియా, పతిణ్ణా, పడియా.
< సం. ప్రతిజ్ఞా.

ప్రతినపట్టు రూ.చూ. ప్రతినపట్టు. అ.క్రి. ప్రతిజ్ఞచేయు. పారి. 2.2. ప్రతినవచ్చు అ.క్రి. ప్రతిజ్ఞతీరు. పారి. 5.49. ప్రతినవట్టు (-వట్టు) రూ. ప్రతినపట్టు. అ.క్రి. ప్రతిజ్ఞచేయు. కు.సం. 9 29.

ప్రతిపాదించు స.క్రి. 1. సూచించు; 2. (ఒల్లు మొ.వాటిని) ప్రవేశపెట్టు.
సం. ప్రతిపద్. ఇచ్చు, బహూకరించు, సిద్ధాంతీకరించు, వెనక్కితీసుకొను.
< సం. ప్రతిపద్ + -ఇంచు[1].

ప్రతిపాలనసేయు స.క్రి. ప్రతిజ్ఞచేయు. బసవ. 6.168.
సం. ప్రతిపాలన-. రక్షించటం, ఉంచటం.
< సం. ప్రతిపాలన- + చేయు.

ప్రతిమె వి. ప్రతిమ, విగ్రహం. భాగ. 6.
సం. ప్రతిమా. విగ్రహం.
< సం. ప్రతిమా.

ప్రత్తి[1] రూ. పత్తి. వి. 1. విత్తులతో ఉండే దూది, కార్పాసం. దశా. 4.935, 939; 2. పత్తిచేను. భీమ. 3.57.
క. పర్తి, పత్తి, పత్తి. మెత్తలో ఉన్న పత్తి, సాధారణ పత్తి; కోల. పరతి. నూలుబట్ట; తు. పర్తి, పత్తి; త. పరుత్తి. భారతదేశంలోని పత్తిచెట్టు (Gossypium herbaceum) పత్తి; మ. పరుత్తి, పత్తి; కుఇ. పర్తి; కువి. పత్తి.

ప్రత్తికాల్చినవడువున అవ్య.క్రు. దూదిని ఏకినట్లు. ఉ.హరి. 3.71. ప్రత్తిబొద్దు వి. కొన్ని మోపులు చేర్చి కట్టిన దూది. ద.హిం.గా.సంపు 10. గా.సం. 881. క్రి.శ. 1261. ప్రత్తివిడుచు స.క్రి. పత్తి రాట్నంతో గింజలు వేరు చేయు.

ప్రత్తి[2] వి. కొండగోగు, నార నిచ్చే ఒకరకం మొక్క (Cochlospermum gossypium).

ప్రత్యర్థము వి. విరోధం, అర్థం. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 309. క్రి.శ. 1246.
సం. ప్రత్యర్థ-. విరోధం, శత్రుత్వం.
< సం. ప్రత్యర్థ- (అర్థవిపరి.).

ప్రధానంచీర రూ.చూ. ప్రధానపుచీర. వి. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.

ప్రధానపుచీర రూ. చూ. పధానపుసీరె, ప్రధానం చీర. ప్రధానంచీర. వి. తాంబూలం పుచ్చుకొనేటప్పుడు మగ పెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.
సం. ప్రదాన-. ఇవ్వటం.
< సం. ప్రదాన- + చీర.

ప్రధాని వి. ముఖ్యమంత్రి, ప్రధానమంత్రి. ద్రాక్షారామం శాసనం. క్రి.శ. 1055.
సం. ప్రధాన-. ముఖ్యవ్యక్తి.
< సం. ప్రధాన-.

ప్రన్న విశ. 1. మనోజ్ఞం, చక్కనిది; 2. కోమలం, మృదువు; 3. సాంద్రం, మనోజ్ఞం.

ప్రన్నన వి. సొంపు, అందం. భాస్క.రా.యు. 1211; విశ. మనోజ్ఞమైన. సిం.ద్వా. 11.58. ప్రన్నని విశ. 1. మనోజ్ఞమయిన. భార. స్త్రీ. 2.17; 2. మృదువైన. శృం.నై. 5.29; 3. సాంద్రమయిన. పాండు. 5.131. ప్రన్న(దనము (-తనము) వి. 1. కోమలత్వం, మార్దవం. భార.శాంతి.

2.348 ; 2. సౌందర్యం, చక్కదనం. భార. అను. 5.100.

ప్రపోజలు రూ. ప్రొపోజలు. వి. ప్రతిపాదన.
ఇం. *Proposal*. ప్రతిపాదన.
<ఇం. Proposal.
ప్రపోజలుపెట్టు స.క్రి. ఒకవిషయాన్ని ప్రతిపాదించు.

ప్రప్ప రూ.చూ. పప్పు. వి. తునక. ఆం. భా. 79.

ప్రభ వి. కాంతి, ప్రకాశం.
సం. ప్రభా. కాంతి ; ప్రా. పభా, పహా ; అ.మా. : పా. పభా ; కా. ప్రవ. కాంతి కిరణాలు ; అ. పువా. సూర్యోదయం, ఉదయకాలం.
<సం. ప్రభా.

ప్రబలంజేయు చూ. ప్రబలు.

ప్రబలించు చూ. ప్రబలు.

ప్రబలు రూ. ప్రవలు. అ.క్రి. 1. (సంతోషాదులతో) అతిశయిల్లు, ఉప్పొంగు. భార. శల్య. 2.298 ; 2. వర్తిల్లు, ఉండు. హరి. పూ. 2.78 ; 3. పెరుగు, వర్ధిల్లు. కాశీ. 5.7.
సం. ప్రబల-, బలమైన ; ప్రా. పబల-, పబ్బల-, పవల- ; పా. పబల- ; సిం. పబల-, బలం.
<సం. ప్రబల-.
ప్రబలంజేయు స.క్రి. దీపింపచేయు. భార. ద్రోణ. 5.385. <ప్రబలు+-అ[7]+చేయు. ప్రబలించు స.క్రి. వృద్ధిపొందించు. <ప్రబలు +-ఇంచు[3].

ప్రబ్బ రూ.చూ. ప్రబ్బలి. వి. ఒకజాతి చిన్నచెట్టు, వేతసం. అచ్చ. రా. సుం. 25 (Calamus Rotang).

ప్రబ్బము వి. పబ్బం, ఉత్సవం. పండి. చ. 2.115.
సం. పర్వన్. పుణ్యదివసం ; ప్రా. పవ్వ- ; జై. శౌ. అమా. పర్వ ; పా. పబ్బ.
<సం. పర్వన్.

ప్రబ్బలి రూ. ప్రబ్బ, ప్రబ్బిలి, ప్రెబ్బ, ప్రెబ్బలి. వి. ఒకజాతి చిన్నచెట్టు. వేతసం. బసవ. 7.54. (Calamus Rotang).
త. పిరమ్బు (పిరప్పు-). పేము, వంగేపేము (Calamus Vimanalis) ; మ. పెరమ్బు, పురమ్బు, పునమ్బు. పేము.

ప్రబ్బికొను చూ. ప్రబ్బు[1].

ప్రబ్బికోలు చూ. ప్రబ్బు[2].

ప్రబ్బిలి రూ.చూ. ప్రబ్బలి. వి. తట్టలు అల్లటానికి ఉపయోగించే ఒకరకం తీగ (Calamus Rotang).

ప్రబ్బు[1] అ.క్రి. 1. పెరుగు, వర్ధిల్లు, అతిశయించు, అధికమగు. భార. విరా. 1.162 ; 2. వ్యాపించు, పర్వు. భార. కర్ణ. 3.319 ; 3. నిల్చు. నిల్చియుండు, వర్తిల్లు, ఉండు. భాగ. 10పూ. 123 ; 4. సందిల్లు, కూడు. ఉ.రా. 7.391 ; స.క్రి. కలియు, కూడు. ఉ.రా. 5.208.
క. హరి, హరిబ. మొత్తం, సమూహం ; త. పరారై. చెట్టుయొక్క పెద్దబోదె, పరి. గొప్పతనం, ఎత్తు, ఉన్నతి, పరియన్. గొప్పవ్యక్తి, గొప్పప్రాముఖ్యత కలిగిఉన్నాడు, పరుకై. లావుగాఉండు, పార్. లావు, పరిమాణం, పారి (-ప్పు-,-త్తు-). లావుగాఉండు, పెద్దది ; కువి. పడఅ-. పైకిపెరుగు, పెద్దదిగా ఉండు, పడికి-. పెరిగేటట్లు చేయు, పడ్డఅసై. పెరుగు ; కురు. పర్నా. సంఖ్యలోపెరుగు, పరిమాణంలో పెరుగుదల, వయస్సులో పెరుగు, అభివృద్ధి చెందు ; మాల్తొ. పద్‌రె. పెరుగు.
ప్రబ్బికొను రూ. ప్రబ్బుకొను. అ.క్రి. 1. సంధిల్లు, కదియు. భాగ. 8.554 ; 2. పడు, ప్రసరించు. భాగ. 9.806 ; 3. (స్వార్థంలో) వ్యాపించు. భార. 10పూ.769.
ప్రబ్బుకొను. రూ.చూ. ప్రబ్బికొను. అ.క్రి. అధికమగు. రాధా. 1.128.

ప్రబ్బు[2] స.క్రి. నిందించు. భార. సభా. 2.49 ; వి. నింద. కాశీ. 5.163.
క. పళి. తిట్టు, నిందించు, దూషించు, పళివు. తిట్టు. నింద, తప్పు ; కొడ. పళి (పళివ్-, పళిఞ్-), పళె, (పళెప్-, పళన్డ్-). చెడుగా మాట్లాడు, పళమె. పనికిరానిమాటలు ; త. పళి (-ప్పు-, త్తు-.). నిందించు, దూషించు, ఎగతాళి, నింద, పళిచ్చై. తిరస్కారం, పళిప్పు. తిరస్కారం, నింద, దోషం ; మ. పళి. తప్పు, దొంగ ఆరోపణ, పళిక్క. తిట్టు, నిందించు ; కురు. పళగ్నా (పడ్గ్యయస్). ఒకరిగురించి మాట్లాడు, పుకారు.
<మూ. ద్రా. *పళ్-ప్-.
ప్రబ్బికోలు వి. నిందించటం. భార. సభా. 2.49.

ప్రభ వి. శైవుల పండుగల్లో ఊరేగించబడే కర్రకు రెండు వైపులా తెరదాప ఉండే వాహన విశేషం.
సం. ప్రభా. కిరణం, ప్రకాశం.
<సం. ప్రభా (అర్థవివరి.).
ప్రభఅకు వి. అంచులో నేసే ఒకరకం డిజైను,
ప్రభార్చి వి. మధ్యభాగం గుమ్మటం లాగా ఉండి పైచివర మొనదేలి ఉండే ఆర్చి. <ప్రభ + ఆర్చి.

ప్రభాతపదములు వి.బ.వ. తెల్లవారగానే పాడే పాటలు, మేలుకొలుపులు. పండి. చ. 1. 3.518.
సం. ప్రభాతపద-. ఉదయానికి సంబంధించిన పాట.
సం. ప్రభాతపద-+-ము+-లు.

ప్రభార్చి చూ. ప్రభ.

ప్రభావతిఅంచు వి. బాకుమొన మాదిరి లాహిరీలు వచ్చేట్టు నేసిన అంచు.
సం. ప్రభావతి. కాంతికలది.
<సం. ప్రభావతీ+అంచు.

ప్రభావతిపేటు వి. అంచులో నేసే ఒకరకం డిజైను.
సం. ప్రభావతి. కాంతికలది.
<సం. ప్రభావతీ+పేటు.

ప్రభావము వి. పలుకుబడి.
సం. ప్రభావ- పట్టుక, సామర్థ్యం, శక్తి.
<సం. ప్రభావ- (అర్థవివరి.).

ప్రభావళి వి. మూలమూర్తికి గాని ఉత్సవ మూర్తికిగాని శిరము చుట్టూఉండే ప్రకాశవంతమైన వలయాకార భూషణం. T.T. DES. III 76. క్రి. శ. 1515.
సం. ప్రభావలి-. కాంతిసమూహం.
<సం. ప్రభావళి- (అర్థవివరి.).

ప్రమాదము వి. 1. అపాయం; 2. ఆకస్మిక దుర్ఘటన; 3. ఆపద.
సం. ప్రమాద-. పరాకు.
<సం. ప్రమాద- (అర్థవిపరి.).
ప్రమాదపడు (-పడు) అ. క్రి. మోసపుచ్చు. సం. ప్రమాద-. పరాకు; పొరపాటు. <సం. ప్రమాద-+ పడు.

ప్రమాదపడు చూ. ప్రమాదము.

ప్రమిద రూ. పమిద, పమిది, పమిదె, పమిందె, పమ్మిద, పమ్మిది, పెమిదె, ప్రమిది, ప్రమిదు, ప్రమిదె, ప్రమ్మిత, ప్రమ్మిద, ప్రెమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్నమట్టి మొ. పాత్ర. ద్వి. పరమ. వి. 1.93.
ప్రమిదగూడు వి. దీపం పెట్టుకొనే గూడు.

ప్రమిది రూ. చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్నపళ్ళెం.

ప్రమిదు రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్నపళ్ళెం.

ప్రమిదె రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తి పెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న పళ్ళెం.

ప్రమీలంచు వి. అష్టభుజి మాదిరి గడిపెట్టి మధ్య చుక్క పచ్చేట్టు నేసిన అంచు.
సం. ప్రమీలా. అరములయాళ దేశం రాణి.
<సం. ప్రమీలా + అంచు.

ప్రమేయము వి. జోక్యం.
సం. ప్రమేయ-. కొలవదగిన.
<సం. ప్రమేయ- (అర్థవిపరి.).

ప్రమోషను వి. ఉద్యోగంలో స్థాయి పెరగటం.
ఇం. *Promotion.* ప్రాముఖ్యంలో కాని పదవిలో కాని ఉన్నత స్థితి నందుకోవటం.
<ఇం. Promotion.

ప్రమ్మిత రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న పళ్ళెం.

ప్రమ్మిద రూ.చూ. ప్రమిద. వి. దీపపాత్రం, మల్లకం, శరావ విశేషం. పరమ. 1.94.

ప్రమ్ము స. క్రి. పరివేష్టించు, చుట్టువారుకొను. శివ.సా. 323.

ప్రయి రూ.చూ. ప్రై. వి. నింద, దూరు. భార. మౌసల. 170.
ప్రయిమాట అ.క్రి. నిందల్ని లక్ష్యపెట్టకుండు. భార. శాంతి. 3.399. ప్రయిపెట్టు(-పెట్టు) అ.క్రి. నిందమోపు. భార. ఉద్యో. 3.195.

ప్రయివేటు రూ. ప్రైవేటు. వి. ఇంటివద్దకాని వేరేచోట కాని పాఠం చెప్పటం; విశే. 1. సొంతమైన; 2. ప్రభుత్వ పరం కాని.
ఇం. *Private.* సొంతమైన, రహస్యమైన.
<ఇం. Private.

ప్రయోజనము వి. 1. మంచికార్యం. శృం.నై. 2.8; 2. అవసరం.
సం. ప్రయోజన-. ఉపయోగం.
<సం. ప్రయోజన- (అర్థవిపరి.).

ప్రయోజకుఁడు వి. కార్యం నెరవేర్చే వాడు. నేర్పరి.
సం. ప్రయోజక-. ప్రయోగించేవాడు.
<సం. ప్రయోజక- (అర్థవిపరి.).

ప్రయ్యఁబడు చూ. ప్రయ్య.

ప్రయ్యి చూ. ప్రయ్య.

ప్రయ్యిడు చూ. ప్రయ్య.

ప్రయ్య అ.క్రి. నిందనొందు, దూరుపొందు.
ప్రయ్యఁబడు అ.క్రి. నిందనొందు, దూరునొందు. భార. ఆది. 6.253. <ప్రయ్య+-అ[7]+పడు. ప్రయ్యి రూ.చూ. ప్రై. వి. నింద, దూరు. కాశీ. 5.163. ప్రయ్యిడు రూ. ప్రైయిడు. స.క్రి. నిందించు, నిందమోపు. <ప్రయ్య+ఇడు.

ప్రలు రూ.చూ. ప్రాలు[2]. వి. ప్రాలు, బియ్యం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 29.

ప్రల్ల వి. అర్థంలేని మాట. పండి.చ. 2.101.
సం. ప్రలాప-. అర్థంలేని మాట, సంభాషణ; ప్రా. పలావ-.; పా. పలాప-.; గు. పలావ. ఏడుపు.
<ప్రా. పలావ-.
ప్రల్లదీఁడు వి. తలకొట్టమారి, ప్రల్లదుఁడు. ప్రల్లఁదనము (-తనము) వి. 1. వదరుబోతుతనం, వాచాలత్వం. భాస్క. శ. 69; 2. పొగరుబోతుతనం.

ప్రల్లదకాఁడు చూ. ప్రల్లదము.

ప్రల్లదమాడు చూ. ప్రల్లదము.

ప్రల్లదము రూ. పల్లదము. వి. 1. అప్రియ వచనం, పరుష వచనం, దుర్భాషణం. భార.సభా. 2.69; 2. పారుష్యం, పరుసదనం. భార.ఉద్యో. 2.44; 3. ధార్ష్ట్యం, దౌష్ట్యం, పొగరుబోతుతనం. భార.అను. 5.107; 4. దుష్కార్యం, చెడ్డపని. భార.అరణ్య. 6.245; 5. వ్యర్థభాషణం. అం.రా.శే. 48; విశే. గర్వంతో కూడిన. శగా. 4.186.
ప్రల్లదకాఁడు విశే. ప్రల్లదుఁడు. శల్హా. 3 ఆ. ప్రల్లదమాడు స.క్రి. దూషించు. పారి. 3.37. <ప్రల్లదము+ ఆడు. ప్రల్లదీఁడు విశే. దుష్టుడు, దుండగీడు. విక్ర. 1.129.

ప్రల్లదీఁడు చూ. ప్రల్లదము.

ప్రల్లదుఁడు చూ. ప్రల్లదము. విశే. 1. దుష్టుడు, దుర్మార్గుడు. భార.ఆది. 1.125; 2. దుండగీడు, ఆగడాలు చేసేవాడు. బసవ. 3.67.

ప్రల్లదురాలు చూ. ప్రల్లదము. విశే. దుష్టురాలు. నిర్వ.రా. 5.121.

ప్రవిష్టము వి. అనుభవం. నె.గా. ఒంగోలు శాసనం. 17. క్రీ.శ. 1227.
సం. ప్రవిష్ట-. ప్రవేశించిన.
<సం. ప్రవిష్ట- (అర్థవిపరి.).

ప్రవేశము వి. సమర్పణ. ద.హిం.గా.సంపు. 5. గా.సం. 1224. క్రీ.శ. 1356.
సం. ప్రవేశ-. చొచ్చుటం, చొప్పించటం.

<నం. ప్రవేశ- (అర్థవిపరి.).

ప్రవలు రూ.చూ. ప్రబలు. అ.క్రి. వృద్ధిపొందు, వర్ధిల్లు. అచలా. 1.44.

ప్రవ్వ వి. కుంత, ఘటం. భాగ. 6.205.
క. పరవి. కుంత.

ప్రశాస్త్రి వి. ప్రధాన దండాధికారి.
నం. ప్రశాస్తృ-. అధికంగా దండించేవాడు.
<నం. ప్రశాస్తృ+ఙీప్ (అర్థవిపరి.).

ప్రసాదకూడు వి. అన్నప్రసాదం. ద.హిం.శా. నంపు. 5. శా.సం. 1193. క్రీ.శ. 1331.
నం. ప్రసాద-. దేవతాదులకు పెట్టే నైవేద్యం, అనుగ్రహం.
<నం. ప్రసాద+కూడు (మిశ్రన.).

ప్రసాదవ వి. అనుగ్రహపూర్వకంగా ఇచ్చేది. E.I. VII. 25
నం. ప్రసాదన-. శుద్ధిచేయటం, ఊరడించటం, నంతోషపెట్టటం.
<నం. ప్రసాదన- (అర్థవిపరి.).

ప్రసాదమన్నవలు వి. ప్రసాద నిబంధం. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 1214. క్రీ.శ. 1309.
నం. ప్రసాద-. దయ.
<నం. ప్రసాద-+మన్నన+-లు (మిశ్రన.).

ప్రసిమిసి వి. ప్రస్తావన.

ప్రస్తము రూ.చూ. ప్రస్తుతము. వి. గర్భాదానం, ప్రస్తుతం.

ప్రస్తావనవచ్చు అ.క్రి. నంభాషణలో ప్రసక్తి వచ్చు.
నం. ప్రస్తావనా. ఉపోద్ఘాతం, స్తోత్రం, ఆరంభం.
<నం. ప్రస్తావనా+వచ్చు.

ప్రస్తుతము రూ. ప్రస్తము. వి. 1. నిషేక ముహూర్తం. పాండు. 4.149 ; 2. ఇప్పుడు, వర్తమానకాలం.
నం. ప్రస్తుత-. బాగా పొగడబడింది.
<నం. ప్రస్తుతం (అర్థవిపరి.).

ప్రహరి రూ. పారి[2]. వి. ప్రాకారం, చుట్టుగోడ. పారి. 4.76.
ప్రహరిచరించు అ.క్రి. ఊరు, కోట మొ. వాటి కావదలకై చుట్టి వచ్చు. ప్రదక్షిణం చేయు. భీమ. 1.108. ప్రహరిచుట్టు అ.క్రి. అలంగం తిరుగు, ప్రదక్షిణంచేయు. వసు. 4.68. ప్రహరిదిరుగు(-తిరుగు) అ.క్రి. అలంగం తిరుగు, ప్రదక్షిణం చేయు. కాశీ. 1.116.

ప్రహరిగోడ రూ.చూ. పారిగోడ. వి. ఆవరణ చుట్టూ ఉన్న గోడ.

ప్రహరుషము వి. అధిక నంతోషం. నకలకలానిదానము. 3.183.
నం. ప్రహర్ష-. అధిక నంతోషం.
<నం. ప్రహర్ష-.

ప్రహిరిగోడ రూ.చూ. పారిగోడ. వి. ఇంటి ఆవరణచుట్టూ కట్టిన గోడ.

ప్రా[1] రూ.చూ. ప్రాఁత. విశ. పాతదయిన. వృత్తిలో ప్రాఁత శబ్దంలో తొలి అచ్చుమీది వర్ణం లోపించగా మిగిలిన రూపం అని వ్యాకర్తలు. ప్రా-. ప్రాచీనమైనదని భాషా శాస్త్ర వేత్తలు. ఉ.రా. 2.292.

ప్రాఁగబ్బము(-కబ్బము) వి. వేదం. పాంచాలీ. 3.37 ప్రాజంగము వి. శివుడు. అహల్యా. 1.3. ప్రాజేజే వి. రాక్షసుడు. అచ్చ.రా. సుం. 119. ప్రాఁజదువు(-చదువు) రూ. ప్రాఁతచదువు. వి. వేదం. భోజ. 4.220. ప్రాఁజదువులపెట్టె (-చదువులపెట్టె) వి. సూర్యుడు. ప్రాఁజౌకు వి. పాత కుర్యాయి. ప్రాదయ్యము వి. రాక్షసుడు. అచ్చ రా.యు. 376. ప్రామడుగు రూ. ప్రానుడువు. వి. వేదం. లక్ష్మివి. 8.10 ; అహల్యా. 1.8. ప్రాముడువు రూ.చూ. ప్రానుడుగు. వి. వేదం. ప్రామానికము వి. కెంపు. సారంగ. 1.112. ప్రామినుకు రూ. ప్రాఁతమినుకు, ప్రాఁతమినుక్కు, ప్రామిస్కు. వి. వేదం. వరాహ. 1.9. ప్రామినుకుటంచు(-అంచు[3]) వి. వేదాంతం. రామాభ్యు. 3.54. ప్రామిస్కు రూ.చూ. ప్రామినుకు. వి. వేదం. ప్రామిస్కులు వి.బ.వ. వేదాలు. యయా. 1.16. ప్రాఁబడు(-వడు) రూ.చూ. ప్రాఁతవడు. అ.క్రి. 1. మాయు, నశించు, పోవు. క్రీడా. 40 ; 2. అలవడు. చంద్రాంగ. 4.239. ప్రాఁబలుకు(-పలుకు) రూ.చూ. ప్రాఁబల్కు. వి. వేదం, ఆం.నా.నం.దేవ. 41. ప్రాఁబలుకు టెంకి వి. సూర్యుడు. ఆం.భా. 1.81. ప్రాఁబలుకులటెంకి వి. సూర్యుడు. ఆం.భా. 1.81. ప్రాఁబల్కు(-పల్కు) రూ. ప్రాఁబలుకు. వి. వేదం. అచ్చ.భా. 1.6. అచ్చ.రా.యు. 161. ప్రాఁబల్కుముచ్చు వి. సోమకుడు. నీలా. 1.41. ప్రాఁబల్కుసొమ్ముపెట్టె వి. సూర్యుడు. ప్రాఁబసిఁడి(-పసిఁడి) వి. చిరకాలంనాటి బంగారం. పాండు. 4.211. ప్రాఁబాఁపఁడు(-పాఁపఁడు) వి. ముసలి బ్రాహ్మణుడు. ప్రాయేఱు (-ఏఱు) వి. నముద్రం. నిర్వ.రా. 1.39. ప్రావిరి వి. వాడి నలిగిన పువ్వు. పాండు. 1.119. ప్రావేలుపు రూ.చూ. ప్రావేల్పు. వి. రాక్షసుడు, పూర్వదేవత. ప్రావేల్పు రూ. ప్రాఁతవేలుపు, ప్రాఁతవేల్పు. ప్రావేలుపు. వి. పూర్వ దేవత, రాక్షసుడు. భీమ. 4.91.

ప్రా[2] వి. ప్రాస. పద్యపాద ద్వితీయాక్షరం. సిం.ద్వా. 4.191.
నం. ప్రాస-. విసరటం, గ్రహస్థితి. ఇముడ్చటం.
<నం. ప్రాస-.
ప్రావడి వి. ప్రాసవడి. కవిజనా. సంజ్ఞా. 62.

ప్రాకి రూ.చూ. పాకి. వి. దూలం ఉంచకుండా కట్టిన ఇల్లు, శాల.

ప్రాకెన రూ. పాకాన్నము, పాకెన, పాకెన్న, పాగెస, ప్రాకెన్న, వి. 1. పెళ్ళిలో మూడోరోజు. ఇందు. 6.65 ; 2. పెళ్ళిలో మూడోనాటి బువ్వ ; 3. వడుగు.
నం. పాకాన్న-. వండిన అన్నం.
<నం. పాకాన్న-.

ప్రాకెన్న రూ.చూ. ప్రాకెన. వి. 1. వడుగు ; 2. పెళ్ళిలో మూడోరోజు ; 3. పెళ్ళిలో మూడోనాటి బువ్వ.

ప్రాఁకు రూ. పాకు[1], పాఁకు. అ.క్రి. 1. ఎక్కు, పైకిపోవు. కు.నం. 2.70. భార. విరా. 3.27 ; 2. వ్యాపించు. భార. విరా. 2.191 ; 3. ఉన్నత స్థానం పొందు, అభివృద్ధి పొందు. భార. శాంతి. 6.237 ; 4. ప్రసరించు. ఉ.హరి. 3.138 ; 5. రొమ్ముతో జరుగు, జరుగు. శృం.నై. 6.111 ; 6. చుట్టుకొను, ఆచరించు. కాశీ. 1.129 ; 7.

(తీగ మొ.వి) అల్లుకొను. విప్ర. 2.27; వి. 1. (పాకు) పళ్ళకు పట్టిన పాచి, మురికి. పంచ.చ. 4.307; 2. తీగె పాకటానికి పక్కను నిలబెట్టేకర్ర, ఉపఘ్నం. భార.విరా. 2.350; 3. పాకు, ధార, నిలవై ఉండటంతో కలిగే పచ్చని మురికినీరు. భార. అరణ్య. 7.28; 4. పోషణం. వేమ. 3.32; 5. పాచితీగ, నీటిలో బయలు దేరిన పచ్చనితీగ, శైవాలం.

క. పరె. వ్యాపించు, పెంచు (తీగలు, వేళ్ళువ్యాపించు), పరచుకొను; కొడ. పర (పరప్-, పరన్ద్-). పాకు; తు. పరపుని. తీగపాకు, చేతులమీద కాళ్ళమీద పాకు, వ్యాపించు (తీగలాగ); త. పర (-ప్ప-, -న్త-). వ్యాపించు; మ. పరత్తుక. వ్యాపించు, పరిచేయు, దాటించు; గోం. పర్క్. పెరుకు. కుఇ. ప్రప్వ (ప్రప్త-). పైకి వ్యాపించు, పరవ్వు. చీకట్లో చేతులతో తడుము, గుడ్డిగా వెతుకు; కువి. ప్రాక్. చీకట్లో చేతులతో తడుము, గుడ్డిగా వెతుకు;

ద్రా.చూ. పరచు.

ప్రాఁకుడు రూ. పాకుడు, పాకుర, పాకురు, పాఁకుడు. వి. 1. పాకటం; 2. పాచి. ప్రాఁకుడుగాయ్య(-కాయ్య) వి. ఆలంబనం. ప్రాఁకుడెంచు(-తెంచు²) అ.క్రి. పైకివచ్చు. వ్యాపించు. వేంక. పంచ. 4.228. ప్రాఁకులాడు రూ. పాఁకులాడు. అ.క్రి. పొర్లాడు, దొర్లు. దశ. 7.207; స.క్రి. ఆశ్రయించు. ప్రాఁకువెట్టు(-పెట్టు) స.క్రి. సహాయమగు. పాండు. 4.250. ప్రాఁకొను అ.క్రి. పాచిపట్టు, నీరు నిలవై ఉండటంతో పచ్చని మురికి కలదగు. సుమతి. 10.

ప్రాఁగము చూ. ప్రాఁకు.

ప్రాజెక్టు రూ. ప్రోజెక్టు. వి. పథకం, ప్రణాళిక.

ఇం. *Project*. పథకం, పథకంవేయు.

<ఇం. Project.

ప్రాంచీలు వి.బ.వ. ఫ్రెంచి జాతియులు.

పో. ఫ్రంసెశ్-. ఫరానువ్యక్తి; స్పా. ఫ్రాంచేస్-. ఫ్రెంచి వ్యక్తి. ఫ్రె. ఫ్రాసె; మల. పరంచిరియన్సు.

<పో. ఫ్రంసెశ్.

ప్రాఁచి రూ. పాచి, పాఁచి. పాకి, పాసి¹, పాసు³, పాసెటు. విశే. 1. పాతది. పంచ.చ. 1.60; 2. అపరిశుద్ధం; 3. పర్యుషితం, నిలవఉన్నది; వి. 1. వారిపర్ణి. చిన్నఆకులున్న ఒకజాతి నాచు. పంచ.చ. 2.138 వ.; 2. నీరు నిలవ ఉండటంచేత కలిగే పచ్చని మురికి. ఆము. 1.58.

కొలా. పాస్-. చెడిపోయిన పదార్థం, పులిసిపోవు (ఆహారం).

ద్రా.చూ. త. పాచ్. పనికిరాకుండాపోవు.

ప్రాఁచితీగ రూ.చూ. పాచితీగె. వి. వారిపర్ణి, నాచుతీగ. ప్రాఁచివడు అ.క్రి. అపరిశుద్ధమగు. విజ్ఞా.ఆచా. 50. ప్రాఁచివని రూ. పాచిపని, పాఁచివని. వి. ముందురోజు ఉపయోగించిన పాత్రలు శుద్ధిచేయటం. ఉ.రా. 5.282. ప్రాఁచిపురుగు రూ.చూ. ప్రాఁచిపురువు. వి. క్షుద్రజలచరం. ప్రాఁచిపురువు రూ. ప్రాఁచిపురుగు. వి. క్షుద్ర జల జంతు విశేషం. హంస. 4.186. ప్రాఁచిముడుఁగు (-ముఁడు) వి. వాడిపోయిన పూవు. పాండు. 3.22.

ప్రాచితము రూ. పాచితము. వి. ప్రాయశ్చిత్తం. పాప పరిహారార్థం చేసే కర్మ. జైమినిభా. 7.133.

సం. ప్రాయశ్చిత్త-. పాప పరిహార క్రియ; ప్రా. పచ్ఛిత్త-; మ. ప్రచ్ఛిత్తం, ప్రాచ్ఛిత్తం.

<సం. ప్రాయశ్చిత్త-.

ప్రాచీనవిత్తు విశే. కుజనుడు. హంస. 5.118.

సం. ప్రాచీన-. పాతదైన.

<సం. ప్రాచీన-+విత్తు (మిశ్రన.).

ప్రాణగొర్దము విశే. ప్రాణ హింసకం, ప్రాణాన్ని పోగొట్టు కొనేది. కు.సం. 4.65.

సం. ప్రాణ-. ఊపిరి, జీవితం, బలం.

<సం. ప్రాణ-+గొర్దము. (మిశ్రన.).

ప్రాణంపోయేటప్పుడు పీక్కుపోయు అ.క్రి. అవసరానికిసాయపడు.

సం. ప్రాణ-. ఊపిరి, జీవితం.

ప్రాణంబట్టు(-పట్టు) అ.క్రి. లావుఅగు.

సం. ప్రాణ-. ఊపిరి.

ప్రాణాచారము వి. 1. అభీష్టసిద్ధికి చేసే దీన ప్రయత్నం; 2. విడువక ఒకరిని అతిదీనంగా అర్థించటం.

సం. ప్రాణాచార-. ప్రాణ సంబంధి ప్రవర్తన.

<సం. ప్రాణాచార- (అర్థవిపరి.).

ప్రాతాని వి. ప్రధాని, మంత్రి. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1185.

సం. ప్రధాన-. ముఖ్యుడు.

<సం. ప్రధాన-.

ప్రాతు రూ.చూ. పాఁతు. వి. 1. భూమి మొ.వాటిలో దిగిన పర్వతం మొ.వాటి మూలం; 2. ద్రవ్య ధాన్యాది నిక్షేపం; 3. మూలాధారం; 4. గింజలు మొ.వాటిని పాతటానికి గడ్డపలుగుతో తవ్విన లోతైన గుంట; 5. కుద్యలో నీళ్ళు పోసి గచ్చును గట్టిపరచటానికి వీలుగా మట్టితో కట్టిన కట్ట; స.క్రి. పాతిపెట్టు, పూడ్చు.

ప్రాథేయపడు స.క్రి. వేడుకొను.

సం. ప్రాథేయ-. దారి ఉంచబడినది.

<సం. ప్రాథేయ-+పడు (అర్థవిపరి.).

ప్రాఁత రూ. పాత, పాఁత, ప్రా¹-. విశే. 1. ప్రాచీనం, పూర్వపుది. బసవ. 5.467; 2. భృత్యుడు, సేవకుడు. భార.విరా. 1.285; 3. పూర్వపరిచితుడు, పరిచితుడు. ఉ.హరి. 4.93; 4. జీర్ణం, చిరిగింది. శృం.నై. 8.148; 5. పూర్వకాలంది, చిరకాలంనుండి ఉన్నది. హర. 2.13; వి. 1. జీర్ణవస్త్రం, గుడ్డపేలిక. భాస్క.రా.బాల. 593; 2. వస్త్రం.

క. పళ, పళె, పాత, పురాతనం, పళతు. పాతది, పెంసిపోయిన లేక నశించినది. పళసు. తీసివేసిన లేక పాతబడిన, నశించు, పాడగు. పళెయమ్. ముసలివాడు; కొడ. పళె. పాత, పాత పద్ధతి (మనిషియొక్క). పళె.డి. పాత వస్తువు. పళఞ్-జొల్లి. పాత పలుకుబడి, పత్తో. పురాతనం, సంవత్సరాలు గడచిన, పూర్వకాలం; తు. పర, పరతు. పాత, తీసివేసిన, పర్కు. పర్కట్టు,

పర్కబె. పర్కట్టి. జీర్ణమైన. పరజ్గుని. చెడిపోయిన. నశించు. పరజ్గెలు. పరజ్గు. చెడిపోయిన. నశించు. నశించిన. చెడు ; త. పఴ. పాత. పఴచు. కాలం జరిగే కొద్దీ పాడైన లేక పాతబడిన, పఴమ్. వృద్ధుడు, పఴమై. పఴ్మై. పాతదనం. పురాతనమైనది. పాత పలుకుబడి. పురాతన చరిత్ర. పూర్వకాలం, పఴైతు, పఴైయతు. పాతబడింది. పఴైయ. పాత. పఴైయర్. పురాతనమైనవి. పఴ్ణు, పఴ్ణై. పూర్వకాలం ; మ. పఴ. పాత. పఴమ. పాతదనం, వృద్ధాప్యం, పాతకాలం. చరిత్ర, పఴయ. పురాతనం. పాతబడిన, పఴవన్. మునలివాడు, ప్రాచీనుడు, పఴక్కమ్. పాతదనం, ఆలస్యం, పాత అలవాటు. అనుభవం, పఴ్ణు. పూర్వకాలం ; కో. పయ్- (అచ్చులముందు). ప. (హల్లులముందు). పాత. పఴ్య్. పాతబడినది. పాతకాలంది ; తొ. ప.వ్, ప- (హల్లుల ముందు). పాత ; కుఇ. ప్డాఢి. పాత ; కువి. ప్రా.ఇ. పాత ; కుఱు. పచ్చా. పాత. ముందుది. గతించిన. పగ్బా. పాత. చచ్చిన. పచ్గి. పాత. ఏళ్ళు గడిచిన, పురాతనం. పాతకాలంది, పచ్చ్నా. పాతవగు. పెద్దగు ; మాల్తో. పవె. పాత. పాతబడు. పఘ్గె. మునలిదైన. పచొ. పాత (జంతువల్లో).

<మూ.ద్రా. *పఴ్-.

ప్రాఁతకాపు విణ. చిరకాలవాసి. హరి.పూ. 6.25. ప్రాఁతగిలు రూ.చూ. పాఁతగిలు. అ.క్రి. పాతదిఅగు. ప్రాఁతగిల్లు రూ.చూ. పాఁతగిలు. వి. గుర్త పేలిక ; అ.క్రి. పాతదిఅగు. ప్రాఁతచదువు రూ.చూ. ప్రాఁజదువు. వి. వేదం. రుక్మాం.చ. 1.125. ప్రాఁతపలుకు రూ. ప్రాఁత పల్కు. వి. వేదం. సాంబ.మాన. 2. ప్రాఁతపల్కు రూ.చూ. ప్రాఁతపలుకు. వి. వేదం. అచ్చ.రా.బాల. 89. ప్రాఁతమగవాఁడు విణ. పురాణపురుషుడు. శివుడు. అచ్చ.రా. బాల. 13. ప్రాఁతమాట వి. వేదం. హ.న. 1.7. ప్రాఁతమినుకు రూ.చూ. ప్రామినుకు. వి. వేదం. వరాహ. 10.5. ప్రాఁతమిన్కు రూ.చూ. ప్రామినుకు. వి. వేదం. ప్రాఁతటీకము వి. దాస్యం, సేవ. ద్వి.పరమ.వి. 3.212. ప్రాఁతవడు (-వడు) రూ. ప్రాఁబడు. అ.క్రి. పాతగిల్లు, మాయు, తుప్పుపట్టు. నిర్వ.రా. 1.6. ప్రాఁతవేలుపు రూ.చూ. ప్రావేల్పు. వి. రాక్షసుడు, పూర్వదేవుడు. ప్రాఁతవేల్పు రూ.చూ. ప్రావేల్పు. వి. పూర్వదేవత, రాక్షసుడు. అచ్చ.రా.అరణ్య. 1

ప్రాఁతు రూ.చూ. పాఁతు. స.క్రి. భూమిలో పాతిపెట్టు. బసవ. 5.462.

ప్రావడు చూ. ప్రాప.

ప్రాపు వి. 1. ఆధారం. కానిసపల్లి శాసనం. క్రీ.శ. 925-950 ; 2. అండ, ఆశ్రయం. భార.ఆది. 6.221 ; 3. దిక్కు, రక్షణ, ఏడుగడ. హరి.ఉ. 1.145 ; 4. అవలంబం, అండ. కాశీ. 4.150 ; 5. స్థానం, నెలవు. విష్ణుపు. 131 ; 6. సాహాయ్యం, తోడ్పాటు. రామవ. 3.116 ; 7. సమీపం, దగ్గర. ఆం.భా. 3.21 ; విణ. తోడు, సహాయం. భార.ద్రోణ. 1.346.

సం. ప్రాప-. సమీపించటం, పొందటం ; పా. పావ.

<సం. ప్రాప-.

ప్రాపడు అ.క్రి. ఆశ్రయం కలిగిఉండు. హరి.ఉ. 7.175. <ప్రాపు + పడు. ప్రాపుగొను(-కొను) స.క్రి. అండ గొను, ఆశ్రయించు, అవలంబించు.

ప్రామిడి చూ. ప్రాము. వి. 1. అజ్ఞానం. బసవ. 4.503 ; 2. క్రౌర్యం. భల్లా. 3 ఆ ; విణ. 1. క్రూరుడు. వరాహ. 7.51 ; 2. పరుషం. సురా. 59.

ప్రామిసరీనోటు వి. వాగ్దానం తెలిపే లేదా గర్భితమైన గట్టి పత్రం.

ఇం. *Promissory note.* వాగ్దానం తెలిపే పత్రం.

<ఇం. Promissory note.

ప్రాము రూ.పాము[1], పేము[2]. స.క్రి. 1. (నేల మొ.వాటిని పైకాలు మొ. వాటితో) రాచు, నలగజేయు. మార్క. 1.39 ; 2. పీడించు. హరి. ఉ.4.54 ; 3. రుద్దు, పులుము. హర. 5.10 ; 4. నులుము, నలుపు. భాగ. 1.192 ; 5. పూయు ; 6. గోడెం తయారీలో కాలికలు పెట్టి సున్నగా రావటానికి చేతులతో రుద్దు.

త. పరంబు ; చూ. కువి. ప్రాక్. అరచేతితో కాచు ; మండ. ప్రేమ్ప. పూయు, రాయు.

ప్రాముకొను స.క్రి. పూనుకొను. కాశీ. 7.36. ప్రాముడు వి. మర్దనం, పులుముడు, రుద్దుడు. ఆం.భా. 2.160.

ప్రాయదూడ చూ. పెయ్యదూడ. వి. పెయ్య.

ప్రాయము వి. 1. యౌవనం. ప్రబోధ. 2.75 ; 2. ఒడ్డును ముట్టటం.

సం. ప్రాయ-. ముందుకు పోవటం. జీవితంనుంచి ఎద దాటు, వయస్సు.

<సం. ప్రాయ- (అర్థవిపరి.).

ప్రాయి¹ వి. 1. పౌరుషం, శౌర్యం. జైమినిభా. 7.150 ; 2. శక్తి, సామర్థ్యం ; 3. గుణసంపద ; 4. సౌమంగల్యం, ఐదోతనం.

ప్రాయిఁడి విణ. 1. భాగ్యహీనుడు, దరిద్రుడు, దీనుడు. పండి.చ. 1.114 ; 2. పౌరుషహీనుడు, పౌరుషం లేనివాడు. హరి.ఉ. 9.70. <ప్రాయి[1] + -ఇడి. ప్రాలు[1] వి.బ.వ. 1. శక్తి, సామర్థ్యం. కు.సం. 8.168 ; 2. గుణసంపద. బసవ. 1.147 ; 3. సౌమంగల్యం. శృం.నై. 2.138 ; 4. భాగ్యం. ప్రాలుమాలిక రూ. పాలుమాలిక, పాల్మాలిక. వి. 1. ఒకానొక కావ్యదోషం. ప్రబంధ. పీఠి. 16 ; 2. సోమరితనం, బద్ధకం. ప్రాలుమాలు రూ.చూ. ప్రాల్మాలు. అ.క్రి. 1. కక్కుర్తిపడు, ఆశపడు ; 2. సోమరిఅగు, బద్ధకించు ; 3. అలయు, శ్రమనొందు. ప్రాల్గలవాఁడు వి. భాగ్యవంతుడు. భీమ. 4.77. ప్రాల్మాలు రూ. పాలుమాలు, పాల్మాలు, ప్రాలుమాలు. అ.క్రి. 1. కక్కుర్తిపడు, ఆశపడు. మను. 1.9 ; 2. సోమరగు, బద్ధకించు. ఆము. 2.61 ; 3. అలయు, శ్రమనొందు. జంద. 3.96.

ప్రాయి[2] వి. 1. బియ్యం ; 2. తలంబ్రాలు ; 3. అకులు, వృదు

కాలు; **4.** అక్షతలు; **5.** ధాన్యం (జీలకర ప్రాలు, జొన్న ప్రాలు, నివ్వరిప్రాలు మొ.వి).

ప్రాలు[2] రూ. ప్రలు. వి.బ.వ. **1.** బియ్యం. ద్రాక్షారామ శాసనం. క్రీ.శ. 1084; **2.** తలంబ్రాలు. భార. విరా. 5.398; **3.** అటుకులు. ప్రబంధ. 224; **4.** అక్షతలు. ఆం.భా. 2.258; **5.** ధాన్యం. గోం. పదెక్. ఊకతో ఉన్న ధాన్యం, కుట్క మొ.వి. పెరెక్ ఊకతోఉన్న ధాన్యం. పరెక్. బియ్యం (ధాన్యంలో); కొం. పెర (బహు. పెర్క్). ఊకతో ఉన్న ధాన్యం; కుఇ. ప్రాశ. బియ్యం, ఊకతోఉన్న ధాన్యం; పర్జి. పెరుక్ (బహు. పెర్కల్). ఊకతోఉన్న ధాన్యం. ప్రాలుగలవా(డు వి. లోపల గింజ ఉన్నప్పుడు, భాగ్యం ఉన్నప్పుడు (శ్లేషలో రెండింటికీ ఉదాహరణ). కు.సం. 8.168.

ప్రారబ్ధం రూ. ప్రాలుద్ధం. వి. దుష్కర్మ ఫలం, చెడ్డ ఫలితం.

సం. ప్రారబ్ధ-. పూర్వజన్మ ఫలం.

<నం. ప్రారబ్ధ- (అర్థవిపరి.).

ప్రాఁగోడ రూ.చూ. పారిగోడ. వి. ఇంటి ఆవరణ చుట్టూ కట్టిన గోడ.

ప్రాలు[1] చూ. ప్రాయి[1].

ప్రాలు[2] చూ. ప్రాయి[2].

ప్రాలుగలవా(డు చూ. ప్రాయి[2].

ప్రాలుద్ధం రూ.చూ. ప్రారబ్ధం. వి. ప్రారబ్ధం.

ప్రాలుద్ధం పెంకులవడం వి. ప్రారబ్ధం చెడ్డది కావటం.

ప్రాలుమాలిక చూ. ప్రాయి[1].

ప్రాలుమాలు చూ. ప్రాయి[1].

ప్రాల్గలవా(డు చూ. ప్రాయి[1].

ప్రాల్మాలు చూ. ప్రాయి[1].

ప్రావ[1] వి. పద్ధతి, తోవ. పైజ. 2.112; విశ. ఒప్పైనది. చక్కనిది. యయా. 1.2.

ప్రావ[2] వి. **1.** కవనంలో విపరీతార్థ సూచకమైన ఒకానొక వాక్యదోషం. కవిజనా. దోష. 21: **2.** దోషం. ప్రబంధ. పీఠి. 16.

ప్రావు రూ.చూ. పర్వు. అ.క్రి. వ్యాపించు.

ప్రాస రూ. ప్రాసము. వి. ప్రాస నియమంకల పద్యాల్లో ప్రతిపాదంలోని రెండో అక్షరాన్ని ప్రాస అంటారు. కవి జనా. సంజ్ఞా. 62.

సం. ప్రాస-. ప్రక్షేపించటం, చెల్లాచెదరు చేయటం, ఆయుధ విశేషం, గ్రహస్థితి.

<నం. ప్రాస- (అర్థవిపరి.).

ప్రాసంగు వి. సస్య విశేషం. భీమ. 2.54.

ప్రాసంగు(బ్రాలు(-ప్రాలు[2]) వి.బ.వ. మంచి బియ్యం. బసవ. 5.143.

ప్రాసము రూ.చూ. ప్రాస. వి. ప్రాస నియమంకల పద్యాల్లో ప్రతిపాదంలోని రెండో అక్షరాన్ని ప్రాస అంటారు.

ప్రాసిక్యూటరు వి. న్యాయస్థానంలో ప్రభుత్వం తరఫున అభియోగం నడిపేవాడు.

ఇం. *Prosecutor.* న్యాయస్థానంలో అభియోగం నడిపేవాడు.

<ఇం. Prosecutor.

ప్రాసించు స.క్రి. భక్షించు, తిను. ద్వి. పరమ. వి. 2.71.

సం. ప్రాశ్. తిను, భక్షించు.

<నం. ప్రాశ్ + -ఇంచు[3].

ప్రిజన్ వి. ఖైదు, కారాగారం.

ఇం. *Prison.* నేరస్థుల్ని ఉంచే భవనం లేదా వాన స్థానం, ఖైదు.

<ఇం. Prison.

ప్రింటింగు వి. కాగితం మొ. వాటిమీద ముద్రాక్షరాలు అచ్చు వేయటం.

ఇం. *Printing.* కాగితం మొ. వాటిమీద ముద్రాక్షరాలు అచ్చువేయటం.

<ఇం. Printing.

ప్రితివి రూ.చూ. ప్రిథివి. వి. భూమి. ముదివేడు శాసనం. క్రీ.శ. 825.

ప్రిత్తివి రూ.చూ. ప్రిథివి. వి. భూమి. విప్పర్ల శాసనం. క్రీ.శ. 10వ శతాబ్దం.

ప్రిథిమి రూ.చూ. ప్రిథివి. వి. భూమి. అహదనకర శాసనం. క్రీ.శ. 847.

ప్రిథివి రూ. ప్రితివి, ప్రిత్తివి, ప్రిథిమి, ప్రిఠివి. వి. భూమి. రామేశ్వర శాసనం. క్రీ.శ. 625–650.

సం. పృథివి, పృథ్వీ. భూమి; ప్రా. పహవి, పహుఈ, పహువి, పుఢవి, పుహవి, పుహ్వీ.

<నం. పృథివీ.

ప్రిదిలపడుచు చూ. ప్రిదులు.

ప్రిదిలిపోవు చూ. ప్రిదులు.

ప్రిదులఁబోవు చూ. ప్రిదులు.

ప్రిదులు అ.క్రి. **1.** ఊడు, విడిపోవు. కు.సం. 5.57; **2.** తొలగు, తప్పుకొనిపోవు. బసవ. 525 వ.; **3.** సడలు. భార.ద్రోణ. 2.274; **4.** పోవు. మార్క. 7.240; **5.** పడు, ఊడిపడు, పతితమగు. హరి. పూ. 3.5; **6.** జారు, గళితమగు. రం. రా. అరణ్య. 179. వ. 7 పం.; **7.** తగ్గు, క్షీణించు. విక్ర. 4.98; **8.** (మాట) వెలువడు. భాగ. 3.77; **9.** విరియు. మను. 3.23; **10.** వెనుదీయు, సంకోచించు. చెన్న బసవ. 3.147.

క. హిరి. భాగాలుగా విడదీయు, పగులగొట్టు, ముక్కలు విడదీయు, పారుచేయు, బయటికిలాగు; కొడ. పిరి-(పిరివ్-, పిరిఞ్జ్-) (సమావేశం) చెదరు, (మనిషి) స్వంత స్థలానికి తిరిగి వచ్చు. (పిరిప్-, పిరిచ్-). వేరే దారిలో తిప్పు (పశువులు), పంపివేయు, చెదిరేటట్లుచేయు; త. పిరి(-న్-, -న్త్-) (పిఱి). వేరుచేయబడు, మెలివిడు, వదులగు, అనంగీకారం, విడిచిపెట్టు (-ప్ప్-, -త్త్-). వేరు చేయు, విడదీయు, మెలివిప్పు, పంచు, పిరివల్. భాగం, విభాగం, పిరివ్పు. వేరుభాగం, విడివడు, పిరివు, పిరివు. విభాగం, వేరుచేయటం, అనంగీకారం, శాపి; మ. పిరిక్క. వేరుచేయు, పంపివేయు, విడాకులు, పిరిచ్చల్. వేరుచేయుటం, పంపటం, పిరియుక. విడిపడు. వేరుచేయు, విడిపోవు; కో. పిర్య-(పిర్చ్-). ఒకభాగం నుంచి ఒక

భాగం వేరుచేయు, నాశనం చేయు (కట్టడం). పిర్చ్. వేరుచేయు (మనిషిని) పిర్చ్జ్. తననితాను వేరు చేసుకొను. పిర్చ్వ్. ఒక స్థలం నుంచి వేరైన ఇంకో స్థలం; కొ. పిర్క్-(పిర్చ్-). నాశనం చేయబడిన, (పిర్చ్-). నాశనం చేయు; గోం. పిడానా. మందు (దూది, చీమలు తిన్న మట్టిగోడ, బొబ్బ); కుఇ. ప్రివ (ప్రిత్-). పగిలిన, విడిపడిన, పొదగబడు; కొలా. పిర్స్. జారు, భాగం; బ్రా. పిర్ష్, పిర్షిన్గ్. పగులు, చీలు, చించు, అతిక్రమించు.

<మూ.ద్రా. *పిర్-.

ప్రిదిలవఱచు స.క్రి. పోగొట్టు. అచ్చ.రా.బాల. 69.

ప్రిదిలిపోవు రూ. పెదిలిపోవు. అ.క్రి. 1. తొలగిపోవు, తప్పిపోవు. భాస్క.రా.అరణ్య. 2.52; 2. బద్దలగు.

ప్రిదులఁబోవు అ.క్రి. తొలగిపోవు, తప్పుకొనిపోవు. దశకు. 3.75. <ప్రిదులు+-అ[7]+పోవు.

ప్రిధివి రూ.చూ. ప్రిథివి. వి. భూమి. అహదనకర శాసనం. క్రీ.శ. 847.

ప్రిన్సిపాల్ రూ.చూ. ప్రిన్సిపాలు. వి. కళాశాలల, విశ్వ విద్యాలయాల ప్రధానాధికారి.

ప్రిన్సిపాలు రూ. ప్రిన్సిపాల్, ప్రిన్సేపాల్, ప్రిన్సైపాల్. వి. కళాశాలల, విశ్వవిద్యాలయాల ప్రధానాధికారి.

ఇం. *Principal*. ముఖ్యమైన, కళాశాలల లేదా విశ్వ విద్యాలయాల ప్రధానాధికారి.

<ఇం. Principal.

ప్రిన్సిపుల్ వి. నియమం, సూత్రం.

ఇం. *Principle*. ప్రవర్తన నియమావళి.

<ఇం. Principle.

ప్రిన్సేపాల్ రూ.చూ. ప్రిన్సిపాలు. వి. కళాశాలల విశ్వ విద్యాలయాల ప్రధానాధికారి.

ప్రిన్సైపాల్ రూ.చూ. ప్రిన్సిపాలు. వి. కళాశాలల, విశ్వ విద్యాలయాల ప్రధానాధికారి.

ప్రియ వి. కాసీలో నాల్గోవంతు.

సం. ప్రియ-. ఇష్టమయిన, అధికమూల్యమైన.

<సం. ప్రియ- (అర్థవివరి.).

ప్రివ్యూ వి. ప్రజలకి విడుదల చేయటానికి ముందే చలన చిత్రం మొ. వాటిని చూడటం లేదా పరీక్షించటం.

ఇం. *Pre-view*. ప్రజలకి ప్రదర్శించటానికి ముందే చూడటం.

<ఇం. Pre-view.

ప్రుంగుడు రూ.చూ. పుంగుడు. వి. శ్విత్రం, తెల్లకుష్ఠం, బొల్లి.

ప్రుచ్చు రూ.చూ. పుచ్చు[1]. అ.క్రి. పప్పిపట్టు, పురుగులు పట్టు. భాగ. 7.12.

ప్రుప్పి రూ.చూ. పిప్పి. వి. 1. రత్నదోష విశేషం. రత్న 28; 2. పచ్చడం. ప్రువ్వఁదిట్టు స.క్రి. 1. పుచ్చునట్లు తిట్టు, చెడతిట్టు. భార.శల్య. 2.385; 2. అధికంగా తిట్టు. భాగ. 3.381. <ప్రుచ్చు+-అ[7]+తిట్టు. ప్రువ్వు రూ. పురుగు, పురువు[1]. పర్గు, పర్వు. వి. 1. పురుగు, కీటకం. భార.శాంతి. 3.182; 2. పాము.

ప్రుప్పి చూ. ప్రుచ్చు.

ప్రువ్వఁదిట్టు చూ. ప్రుచ్చు.

ప్రువ్వు చూ. ప్రుచ్చు.

ప్రూవుల్రపోక చూ. ప్రుచ్చు. వి. పురుగుల సమూహం. పండి.చ. 4.20.

ప్రెక్కణము రూ. పెక్కణము. వి. 1. అభినయంతో కూడిన నృత్యం. భార.విరా. 1.240; 2. మల్లరంగం. భార.విరా. 2.14.

సం. ప్రేక్షణ-. జనన సంబంధి అయిన నాటకాది ప్రదర్శనం; ప్రా. పేక్ఖ-. నిరీక్షణం, పేక్ఖణగ-, పేక్ఖణయ-. ఆట, రూపకం; శౌ. పేక్ఖణ-, అ.మా అప. పేక్ఖణ-. ఆట, క్రీడ; మా. పేక్కణ-; పా. పేక్ఖణ-. చూడటం, దృశ్యం, చూపు.

క. పెక్కణ, పెగ్గణ. ప్రదర్శనం, ప్రదర్శనశాల.

<ప్రా. పేక్ఖణయ-.

ప్రెగడ రూ.చూ. పెగ్గడ. వి. 1 మంత్రి, అమాత్యుడు. భార.ఉద్యో. 2.95; 2. ప్రధాన పురుషుడు.

ప్రెగ్గడ రూ.చూ. పెగ్గడ. వి. 1. అమాత్యుడు, మంత్రి. భార.ఉద్యో. 2.24; 2. ప్రధాన పురుషుడు.

ప్రెగ్గడసాని వి. మంత్రి భార్య. ఆం.భా. 2.107.

ప్రెంకరము రూ.చూ. ప్రేంకనము. వి. ప్రియంగు.

ప్రెంకణము రూ.చూ. ప్రేంకనము. వి. ప్రియంగు.

ప్రెతాణంచీర చూ. ప్రథానపుచీర. వి. తాంబూలాలు పుచ్చుకొనేటప్పుడు మగపెళ్ళివారు పెళ్ళికూతురికి పెట్టే చీర.

ప్రెబ్బ రూ.చూ. ప్రబ్బలి. వి. సహస్రవేధి.

ప్రెబ్బలి రూ.చూ. ప్రబ్బలి. వి. సహస్రవేధి.

ప్రెబ్బొత్తి విశే. పెద్ద గుంపుగా ఉన్నది. బసవ. 5.131 పు. 28 పం.

<పేరు[1]+బొత్తి.

ప్రెమిద రూ.చూ. ప్రమిద. వి. నూనెపోసి వత్తిపెట్టి దీపం పెట్టటానికి వాడే చిన్న పళ్ళెం.

ప్రెవడ రూ.చూ. పెగ్గడ. వి. 1. అమాత్యుడు, మంత్రి; 2. ప్రధాన పురుషుడు.

ప్రెసిడెంటు వి. అధ్యక్షుడు.

ఇం. *President*. అధ్యక్షుడు, అగ్రాసనాధిపతి.

<ఇం. President.

ప్రెసిడెన్సీ వి. రాజ్యభాగం.

ఇం. *Presidency*. అధ్యక్షపదవి, రాజ్యభాగం, పరగణా అధ్యక్షత.

<ఇం. Presidency.

ప్రెస్టేజి వి. పరువు, ప్రతిష్ఠ.

ఇం. *Prestige*. పరువు, ప్రతిష్ఠ, గౌరవం.

<ఇం. Prestige.

ప్రెస్సు వి. ముద్రణాలయం.

ఇం. *Press*. అచ్చు యంత్రం, ముద్రణం.

ప్రేక రూ.చూ. పేక[2]. వి. నేతలో అడ్డనూలు. కు.సం. 11.125.

ప్రేగు రూ.చూ. ప్రేవు. వి. పేగు, అంత్రం. కువ.చ. 3.99.

గా.సంవ. 10. గా.సం. 556. క్రీ.శ. 1858.

బంగారువు రూ.చూ. బంగారు. వి. 1. బంగారం, పసిడి. కవిక. 3.22 ; 2. బంగారంతో చేసిన ఆభరణం ; విశే. 1. అపురూపమైన ; 2. మిక్కిలి ప్రేమపాత్రమైన.

బంగాలామామిడి చూ. బంగాళా². వి. మామిడిలో ఒకరకం.

బంగాళ వి. ఎనిమిది షరుషరాగాల్లో ఒకటి. హంస. 5·128.

సం. వంగలా. ఒకానొక రాగం ; ప్రా. బంగాల-.

<ప్రా. బంగాల-.

బంగాళంచు చూ. బంగాళము.

బంగాళము వి. వంగదేశం. ద్వి. పరమ. వి. 4.272.

సం. వంగల-. వంగదేశం ; ప్రా. బంగాల-.

<ప్రా. బంగాల-.

బంగాళంచు వి. రెండువైపులా బెత్తెడేసి వెడల్పున రంగు పోగులు పడేట్టు నేసిన అంచు.

బంగాళా¹ రూ.చూ. బంగలా. వి. 1. బాటసారులు లేదా పెద్ద పెద్ద ఉద్యోగస్థులు దిగేందుకు కట్టిన పెద్ద భవనం ; 2. పెద్దఇల్లు.

బంగాళాపెంకు రూ.చూ. బంగళాపెంకు. వి. యంత్రంతో తయారుచేసే పెద్ద పెంకు.

బంగాళా² రూ. బంగళా². విశే. బెంగాలు సంబంధమైన.

ఇం. *Bengal.* బెంగాలు రాష్ట్రం.

<ఇం. Bengal.

బంగాళాదుంప రూ. బంగళాదుంప. వి. నీటి వసరున్న నల్ల నేలల్లో సాగుచేసి పెంచే దుంప పైరు (Solanum tuberosum). బంగాళాఫురి వి. నారతో పేనిన తాడు.

బంగాళాఖాతము రూ.చూ. బంగళాఖాతము. వి. భారతదేశానికి తూర్పున ఉన్న సముద్రం.

బంగాళీ వి. 1. వంగభాష ; 2. ఒకరకం అరటి, కొమ్మరటి.

బెం. బంగలి. బెంగాల్ రాష్ట్రం.

<బెం. బంగలి.

బంగాళీపెంకు రూ.చూ. బంగళాపెంకు. వి. యంత్రంతో తయారుచేసే పెద్దపెంకు.

బెం. బంగలి. వంగదేశం.

<బెం. బంగలి + పెంకు.

బంగి¹ రూ.చూ. బంగు. వి. గంజాయి, మత్తు కలిగించే పదార్థ విశేషం. పాంబ. మాన. 34.

బంగిముచ్చు వి. బంగి తాగేవాడు.

బంగి² రూ. బంగీ. వి. టపాలో వచ్చే వస్తువులకట్ట.

మరా. బంగీ. కట్ట.

<మరా. బంగీ.

బంగివివల్లి రూ. బంగిరిపల్లి, బంగిరిబిల్లి, బింగినిపల్లి. వి. ఒక రకం మామిడి.

బంగిరివల్లి రూ.చూ. బంగినిపల్లి. వి. ఒకరకం మామిడి.

బంగిరిబిల్లి రూ.చూ. బంగినిపల్లి. వి. నూజివీడు ప్రాంతంలో పండే మామిడి.

బంగీ రూ.చూ. బంగి². వి. 1. తపాలుకట్ట ; 2. తపాలు జాబులు వేసే కొలువంచి.

బంగీచిప్ప వి. చిచ్చుగాళ్ళువాడే చిన్న మట్టిపాత్ర.

మరా. బంగీ. కట్ట.

<మరా. బంగీ + చిప్ప.

బంగు రూ. బంగి¹, భంగి, భంగు. వి. గంజాయి, కలంబం. ఆం.భా. 2.804.

సం. భంగా, భంగీ. మత్తు కలిగించే వనస్పతి విశేషం ; ప్రా. భంగా, భంగీ. అమా. భంగీ ; పా. భంగం ;

క. భంగి, బంగి ; తు. బంగి, బంగు ; త. బంగి.

<ప్రా. భంగా.

బంగేకుజార వి. కొబ్బరిచిప్పకు మట్టిగొట్టంపెట్టి చేసిన హుక్కా. బంగేకుబుర్ర వి. బంగి పీల్చటానికి వాడే మట్టి గొట్టం.

బంగురు అ.క్రి. పాకు.

బంగేకుజార చూ. బంగు.

బంగేకుబుర్ర చూ. బంగు.

బంగ్ల రూ.చూ. బంగలా. వి. 1. అంతస్తుగల ఇల్లు ; 2. బెంగుళూరి పెంకులు కప్పిన ఇల్లు.

బంగ్లా రూ.చూ. బంగలా. వి. గృహవిశేషం.

బంగ్లీకాహునర్ వి. శివాజీ నేతతో వచ్చిన భవనం నమూనా.

హిం.ఉ. బంగ్లా. భవనం ; -కా. యొక్క. హునర్. కౌశలం, కళ.

<ఉ. బంగ్లేకా హునర్.

బచకాని రూ.చూ. బచ్కానా. విశే. చిన్న.

బచఖానా రూ.చూ. బచ్కానా. విశే. చిన్న.

బచవికాడు వి. మెత్తనివాడు, చేసినట్లిల్లా ఊరకుండే వాడు. శయా. 3.225.

బచాయించు స.క్రి. రక్షించు.

హిం. బచా(నా). రక్షించటం.

<హిం. బచా(నా) + -ఇంచు³.

బచావు వి. రక్షణ.

హిం. బచావ్. రక్షణం ; గు. బచావ. రక్షణం ; మరా. బచావ్. రక్షణం.

<మరా. బచావ్.

బచావు వి. రక్షణ.

హిం. బచావ్. రక్షణ, క్షేమం, విముక్తి, ప్రావకం ; ఉ. బచౌ-వ్, బచావ్. రక్షణ, ప్రాపకం, సంరక్షణ, తప్పించుకొని పారిపోవటం, విముక్తి.

<ఉ. బచావ్.

బచ్కానా రూ. బచకాని. బచఖానా, బచ్చుకాడా, బచ్చుకానా, బచ్చుఖానా. విశే. చిన్న.

హిం.ఉ. బచ్కానా. చిన్నపిల్లలవంటి, చిన్నపిల్లలకు తగిన ;

త. పచ్చుకానా, పస్కానా.

<హిం. బచ్కానా.

బచ్చ రూ.చూ. పచ్చ. వి. ఆకుపచ్చని రంగుగల జాతిరాయి.

బచ్చుకాడా రూ.చూ. బచ్కానా. విశే. చిన్న.

బచ్చుకావా రూ.చూ. బచ్కానా. విశే. చిన్న.

బచ్చుగాడుపచ్చ చూ. బచ్చలి¹.

బచ్చుఖానా రూ.చూ. బచ్కానా. విశే. చిన్న.

బచ్చట్టి చూ. బద్ది.

బచ్చపంయురంగు చూ. బచ్చల[1].

బచ్చవ రూ.చూ. బచ్చెన. వి. మోసం.

బచ్చవకవిత రూ.చూ. బచ్చెన కవిత. వి. పైపైమెరుగుల కవిత్వం, సారంలేని కవిత్వం. బచ్చవబంధాలు వి.బ.వ. మోసపు బంధాలు. శాశ్ల. నం. 11.65. బచ్చవరూపులు రూ.చూ. బచ్చెనరూపులు. వి.బ.వ. పైపై మెరుగులు.

బచ్చల[1] రూ.చూ. బచ్చలి[1]. వి. తెలుగుదేశంలో విస్తారంగా ఉపయోగించే కూరాకు మొక్క (Portulaca oleracea).

బచ్చకాయవన్నె వి. వయిలెట్ రంగుకంటె ఒక వన్నె తక్కువ ఉండే రంగు. బచ్చపంయురంగు రూ. బచ్చల పండు రంగు. వి. వయిలెట్ రంగు కంటె ఒకవన్నె తక్కువ ఉండేరంగు. బచ్చలతీగకద్దీ వి. బచ్చలతీగ ఆకులు వరుసగా వరేట్టు నేసిన డిజైను. బచ్చలపంయురంగు రూ. చూ. బచ్చపండురంగు. వి. వయిలెట్‌రంగు కంటె ఒకవన్నె తక్కువ ఉండేరంగు. బచ్చలవంక్లచీర వి. నాలుగుపోగులు నలుపు దొప్పున వరుగు అతిక నేసిన చీర.

బచ్చల[2] రూ. బచ్చలి[2], బచ్చెల. వి. ఇంటిలో స్నానం చేసే చోటు.

క. బచ్చల్, బచ్చలు. కాలవ, తూము లేక స్నానాల దొడ్డినుంచి గోడగుండా పోయే చిన్నమురికి కాలవ.

<క. బచ్చల్.

బచ్చలదొడ్డి చూ. బచ్చు[2]. వి. 1. స్నానాలదొడ్డి, పెరడు; 2. విశాలంగా ఉన్న ఇంటి వెనక స్థలం. బచ్చలిల్లు వి. స్నానంచేసే గది. <బచ్చల[2]+ఇల్లు.

బచ్చలి[1] రూ. బచ్చల[1]. వి. కలంది. దా. మం. 1.127. (Basella indica).

క. బసళె, బసలె, బచ్చలి, బచ్చలె, బచ్చలెబళ్ళి, బచ్చలి; తు. బసలె. బచ్చలి; త. పచలై. బచ్చలి. కొన్ని ఇతరమొక్కలు (Spinacia oleracea). పచిర, పయిర. తీగబచ్చలి, పచలై, పచలై, పయలై, వయలై. బచ్చలి; మ. పచళ, పశళ. బచ్చలి (Basella). వశళ, వయఱ. బచ్చలి (Portulaca oleracea).

<క. బచ్చలి.

బచ్చలికూర వి. బచ్చలి. బచ్చలిమండ వి. ఒకరకంతీగ (Ceropegia tuberosa).

బచ్చలి[2] రూ.చూ. బచ్చల[2]. వి. స్నానాలగది.

బచ్చలితూము వి. నీళ్ళ గది దగ్గర పెట్టిన విశాలమైన తూము.

బచ్చలిల్లు చూ. బచ్చల[2].

బచ్చా వి. పిల్లవాడు, కుర్రవాడు. ఠద్ర. శ. 61, విశ్వే. శ. 65.

హిం. బచ్చా. శిశువు, కుర్రవాడు; మరా. బచ్చా. శిశువు; ఉ. బచ్చా. బాలకుడు, శిశువు, కొడుకు, అజ్ఞానుడు, కుమారుడు; పార. బచ్చా. శిశువు, బాలకుడు, పుత్రుడు, నౌకరు కొడుకు. బచ్చహ్. పుత్రుడు, నౌకరు, బాలకుడు.

<ఉ. బచ్చా.

బచ్చి వి. గ్రా. సజ్జ, మొ. పైర్ల ఆకులు తినే మిడత.

బచ్చికోళ్లు చూ. బచ్చెన. వి.బ.వ. ఒకజాతికోళ్ళు. ప్రబంధ. 605.

బచ్చు[1] వి. 1. వైశ్యుడు, కోమటి. ద. హిం. గా. సంపు. 4. క్రీ.శ. 1035; 2. వ్యాపారస్థుడు, షరాబు. చిట్టివలన శాసనం. క్రీ.శ. 1080; 3. కోశాధికారి, ధనాధ్యక్షుడు. బసవ. 2.462పం.

సం. వైశ్య-. కోమటి; ప్రా. వఇస-. వఇస్స-, వేస. వేస్స; అ.మా. వేసియ-, వేస్స-; పా. వేస్స-; అ. బేహ్. వ్యాపారం.

<ప్రా. వఇస్స-.

బచ్చుచేతివారగల్లు వి. కంసాలి చేతిలోని గీటురాయి. శాశ్ల. నం. 5.235. బచ్చుబేరాలు వి.బ.వ. కోమటిబేరాలు. బచ్చుమడువారు విణ.బ.వ. కోమట్లు, వైశ్యులు. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 528. క్రీ.శ. 1319. బచ్చువాడు విణ. వైశ్యుడు, కోమటి. శుక. 1.420.

బచ్చు[2] వి. 1. కాలువ లేక చిన్నతూము; 2. పశువుల ఉచ్చ ఎత్తిపోసే గుంట.

క. బచ్చు. ఉంచు, బచ్చల్, బచ్చలు. కాలువ లేక స్నానాల దొడ్డినుంచి గోడలో పోయే చిన్నతూము.

<క. బచ్చు.

బచ్చుగది వి. స్నానంచేసేగది.

బచ్చెన రూ. బచ్చన. వి. 1. వంచన, మోసం, కపటం. భార. శాంతి. 4.51; 2. పూత, లేపనం. భీమ. 4.127; 3. రంగు, వర్ణం. పాండు. 2.41; 4. గుర్తు, చిహ్నం. ఆం. భా. 1.80; విణ. మోసగించేది, వంచకం. శ్రీరం. మా. 2.99, ప్రబంధ. 725.

సం. ప్రచ్ఛన్న-. దాగిన; ప్రా. పచ్ఛణ్ణ- గుప్తం, రహస్యం; పా. పచ్ఛన్న;

క. బచ్చణె.

<ప్రా. పచ్ఛణ్ణ-.

బచ్చెనకవిత రూ. బచ్చనకవిత. వి. పైపై మెరుగుల కవిత్వం, సారం లేని కవిత్వం. శాశ్ల. నం. 7.260. బచ్చెనకుండలు వి.బ.వ. పెళ్ళి సమయంలో ఉపయోగించే పెద్దబానలు. బచ్చెనకోల వి. పూరీలు చేసేకర్ర. బచ్చెన నొత్తు స.క్రి. అద్దొత్తు. <బచ్చెన +-ను. +ఒత్తు. బచ్చెనవమ్ము అ.క్రి. రంగువేయు. శుక. 2.97. బచ్చెనపెట్టె వి. బచ్చెన చేసిన పెట్టె. బచ్చెనబొమ్మ వి. పూతపూసిన బొమ్మ. బచ్చెనరూపులు రూ. బచ్చనరూపులు. వి.బ.వ. పైపైమెరుగులు. శాశ్ల. నం. 5.24. బచ్చెనరూపుప్రోకులు వి.బ.వ. పైపై వేషాలు. భార. శాంతి. 4.51. బచ్చెనలెట్టు అ.క్రి. రంగుచేయు. <బచ్చెన+-లు- పెట్టు. బచ్చెనవాటిన రూపు వి. మోసం విడిచిన రూపు, సత్యస్వరూపం. బచ్చెన పెట్టు (-పెట్టు) స. క్రి. సిద్ధంచేయు. బసవ. 7.150. బచ్చెనవాటు వి. కత్తెరమధ్య లోని నిలువుకమ్మి.

బచ్చెవాట చూ. బచ్చెన.

బచ్చెవ్వ వి. అందేవ, కొరగానివాడు.

బచ్చెల రూ.చూ. బచ్చల[2]. వి. స్నానాలగది.

బచ్చేకాన వి. పిల్లల ఆటబొమ్మ.
హిం. ఉ. బచ్‌కానా. పిల్లవారికి తగిన, బాల్యమైన.
< ఉ. బచ్‌కానా.

బజగరగు దూ. బజగరుగు. విణ. నిలకడలేని.
హిం. ఉ. పార. బజా. ఉచితమయిన.
< ఉ. బజా + కరఁగు.

బజగరుగు రూ.చూ. బజగరగు. విణ. నిలకడలేని.
బజగరుగుడి విణ. నిలకడ లేని ఆడది.

బజగెడి రూ. బజగేడి. వి. 1. దుష్టురాలు. సారంగ. 3.214; 2. దుష్టుడు; విణ. దుష్టమయిన.

బజగేడి రూ.చూ. బజగెడి. వి. 1. దుష్టురాలు. హంస. 5.113; 2. దుష్టుడు; 3. రంగుపూసిన పాంచాలిక; విణ. దుష్టమయిన.

బజనకరవ రూ.చూ. భజనకరవ. వి. భజన్లకి, బుర్రకథలకి ఘటవాద్యంగా వాయించటానికి వాడేకుండ.

బజనిక రూ.చూ. బదనిక. వి. పెద్దపెద్ద చెట్లమీద అల్లుకొని పరాన్న భుక్కుగా పెరిగే మొక్క (Loranthus Longiflorus).

బజనికి రూ.చూ. బదనిక. వి. పెద్దపెద్ద చెట్లమీద అల్లుకొని పరాన్న భుక్కుగా పెరిగే మొక్క (Loranthus Longiflorus).

బజంత్రి రూ. బజంత్రీ. వి. 1. మేళం; 2. మేళగాడు.
హిం. ఉ. బజానా. వాయించు, మోగించు; మరా. వాజంత్రీ. వాద్యగాడు.
క. బజన్తరి, బజన్త్రి. వాద్యవిశేషం, వాద్యగాడు.
< మరా. వాజంత్రీ.

బజంత్రీ రూ.చూ. బజంత్రి. వి. మేళం; 2. మేళగాడు.

బజానా రూ.చూ. బయానా. వి. సంచకరువు, ముందుగా ఇవ్వబడ్డ ధనం.

బజాయించు స.క్రి. 1. బాజావాయించు, మోగించు. రంగా. చ. 2.208; 2. తన్ను.
ఒ. బజాబా; హిం. బజాఅనా. వాద్యాన్ని వాయించటం; గు. బజావ్‌వుఁ, వజాడవుఁ. వాద్యాని మోగించటం; మరా. బజావ(ణే). వాద్యాన్ని వాయించటం; ఉ. బజానా. బాజాను వాయించు; పార. వజావియ.
< హిం. బజా(నా) + -ఇంచు[3].

బజారి రూ. బజాలి, బాజాలి. వి. 1. రచ్చలాడి, ప్రేలరి. సారంగ. 3.58; 2. వ్యభిచారిణి. బహుళా. 5.179; 3. దుష్టుడు, చెడ్డవాడు. హంస. 5.113; 4. ధూర్తస్త్రీ. ఆం.రా. 2.117.
సం. జారిణీ; హిం. బజారీ, బాజారూ. బజారు సంబంధమైన, సాధారణమైన; ఉ. బాజారీ. బజారు సంబంధమైన క్షుద్రుడు, వేశ్య; పార. బజారీ. బజారు సంబంధమైన, వర్తకంచేసేవాడు.
< ఉ. బాజారీ.
బజారించు దూ. బజాళించు. అ.క్రి. వ్యభిచరించు. బజార + -ఇంచు[3].

బజారపుఁబలుకులు చూ. బజారము.

బజారము దూ. బజాళము. వి. 1. ప్రలాపం, ప్రల్లదం. ఆం.రా. 1.116; 2. వ్యభిచారం.
హిం.ఉ.పార. బాజార్. అంగడి, మార్కెట్టు.
< ఉ. బాజార్ (అర్థవిపరి.).
బజారపుఁబలుకులు వి.బ.వ. స్వైరాలాపాలు, స్వైరాలాపాలు. బహుళా. 3.58.

బజారించు చూ. బజార.

బజారు రూ.చూ. బాజారు. వి. 1. అంగడివీథి; 2. విశాలమైన బాట; 3. ఆములో కుండలు కట్టేటప్పుడు ఏ వరసకు ఆ వరస కన్పించేటట్లు గాలి పోవటానికి ఉంచే సందులు.
బజారుకుండ వి. దావనారు వాడే కుండ. బజారుకెక్కు అ.క్రి. వీథికెక్కు. బజారుధర వి. బజారు వెల. బజారుమాట దూ. బజాఋమాట. వి. వీథుల్లో చెప్పుకొనే మాట. బజారు సేసికొను (-చేసికొను) స.క్రి. బజారులో సరుకులు కొనుక్కొను.

బజాళము రూ.చూ. బజారము. వి. 1. వ్యభిచారం; 2. ప్రలాపం.

బజాళి రూ.చూ. బజార. వి. వ్యభిచారిణి.
బజాళించు రూ.చూ. బజారించు. అ.క్రి. వ్యభిచరించు.

బజాఋ రూ.చూ. బాజారు. వి. అంగడివీథి, విపణి.
బజాఋమాట వి. వీథుల్లో చెప్పుకొనే మాట, కోహళం.

బజీతు రూ.చూ. వజీతి. వి. 1. కష్టం, దుఃఖం. పార్వ. 8.38; 2. సిగ్గు విడిచిన మనిషి; విణ. 1. భంగం చెందిన, అవమానం పొందిన. శుక. 2.127; 2. పరువు ప్రతిష్ఠ లేని.
హిం. ఫజీహత్. దుర్దశ, దుర్గతి; మరా. ఫజీత్. లజ్జితం, అప్రతిష్ఠ; ఉ. ఫజీహత్. నింద, అపమానం; అర. ఫజీహత్. నింద, అవమానం, అపయశం.
< ఉ. ఫజీహత్.
బజీతుసేయు (-చేయు) స.క్రి. పరాభవించు, అవమానించు. ఆము. 5.51.

బజ్జడి వి. 1. పాదన్యాస విశేషం. పల్నా. 2; 2. అశ్వగతి భేదం.
సం. భంజలీ-. అశ్వగతి భేదం.
< సం. భంజలి.

బజ్జీ వి. 1. అనుకుగా చేసిన వ్యంజన విశేషం, పచ్చడి. పాంచాలి. 4.59; 2. పిండివంట.
సం. భర్జిత-. వేయించిన; ప్రా. భజ్జి-, భజ్జిఅ-. వేయించిన; అ.మా. భజ్జ. వేయించు; పా. భజ్జతి; నే. భాజి. వేయించిన వంకాయ; అ. భాజీ. వేపుడు; బెం.ఒ. భాజీ. వేయించిన పదార్థం; హిం. భాజీ; గు.మరా. భాజీ;
క.తు.మ. బజ్జి; త. పచ్చి.
< ప్రా. భజ్జిఅ.
బజ్జీబువ్వ వి. మజ్జిగన్నం.

బంచెరాయి చూ. బానిస. వి. ప్రభుత్వం అధీనంలో ఉన్న బీడు నేల.

బంజకుమ్మరవాళ్ళు విణ.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ.

బంజర రూ.చూ. బంజరు. వి. 1. ప్రభుత్వం అధీనంలో ఉన్న భూమి ; 2. పోరంబోకు నేల.

బంజరి రూ.చూ. బంజరు. వి. 1. ప్రభుత్వం అధీనంలో ఉన్న భూమి ; 2. పోరంబోకు నేల.

బంజరు రూ. బంజర, బంజరి. వి. 1. వ్యవసాయం చెయ్యకుండా ఉంచబడ్డ బీడు ; 2. గోస్థలం.

హిం.ఉ. బంజర్. ఊసరక్షేత్రం, ఏమీ పండని నేల ; త. పంచర్.

<హిం. బంజర్.

బంజరుచెట్టు రూ.చూ. బందేరుచెట్టు. వి. ఒకరకం చెట్టు (Nyctanthes arfortirstis). బంజరుభూమి వి. సాగు చేయని నేల.

బంజారా రూ. బంజారి. వి. ఒక జాతి ప్రజలు, లంబాడీలు.

హిం. బంజారా, బనజారా. కోమటి, వర్తకుడు, ఎద్ల మీద అన్నం మొ.వి పెట్టుకొని వస్తువుల నమ్మే జాతి.

<హిం. బంజారా.

బంజారి రూ.చూ. బంజారా. వి. ఒకజాతి ప్రజ, లంబాడీలు.

బంజేరు చూ. బంజరు. వి. దళసరి బూడిదరంగు బెరడుఉండి మెట్టనేలల్లోను రోడ్ల పక్కను పెరిగే చెట్టు.

బట్ వి. పన్నె దండెల మధ్య బిగించే ఈనపుల్లలు చీల్చి సాపు చేసే రేకు కత్తి.

ఇం. *Butt.* పనిముట్టు లేదా ఆయుధం యొక్క అంచు లేదా చివర.

బటకాయించు స.క్రి. 1. మోసగించు ; 2. పొగరుబోతుతనం చూపు.

హిం. భటక్‌నా. తిరుగు, అటూ ఇటూ తిరుగు, భటకానా. తప్పుదారి చూపించు.

<హిం. భట్‌కా(నా)+-ఇంచు[3].

బటగాళ్ళు రూ.చూ. బట్టగాళ్ళు. వి.బ.వ. ఒకరకం పప్పు దినుసు (Piscum sativum).

బటమరులు వి.బ.వ. ముక్కు పుటాలు.

బటవర్తిఇనాం రూ. భటవృత్తిఇనాం. వి. ఊరి నౌకర్ల కిచ్చిన పారితోషికం.

బటాకబయలు రూ. చూ. బట్టబయలు. వి. గౌ. బట్టబయలు. విశే. బట్టబయలైన.

బటాచోరు వి. పెద్దదొంగ.

హిం. బడాచోర్. పెద్దదొంగ.

<హిం. బడాచోర్.

బటాణి రూ.చూ. బటానీ. వి. కాయధాన్య విశేషం.

బటాణికంకర వి. గుండ్రటి రాతి ముక్క.

బటావబయలు రూ.చూ. బట్టబయలు. విశే. ప్రకటితం, బట్ట బయలు. సారంగ. 3.16.

బటావి[1] విశే. దుష్టుడు, చెడ్డవాడు. చెన్నబసవ. 2.24.

బటావి[2] రూ.చూ. బటానీ. వి. కాయధాన్య విశేషం.

బటానీ రూ. బటాణి, బటాని[2], బఠాని. వి. కాయధాన్య విశేషం.

హిం. బటాన, బటానా, వాటాణా ; మరా. వాటాణా ; క. బటాణి.

<హిం. బటాన.

బటానీపెసగ వి. పెసగలలో ఒకరకం.

బటాబయలు రూ.చూ. బట్టబయలు. విశే. ప్రకటింపబడిన. సారంగ. 2.113 ; వి.గౌ. చెట్లు మొ.వి లేని బయలు.

బటాబూరము వి. ఆడంబరం. ఉ.హరి. 3.41.

హిం. బడా. పెద్ద.

బటాయి వి. 1. ఆసామికి పొలంచేసే రైతు పండిన పంటలో ఇవ్వటానికి నిర్ణయించుకొన్న భాగం ; 2. ఈఏర్పాటునుబట్టి చేసే సేద్యం ; 3. కొన్నిచోట్ల పాలికి చేసేవాడు.

హిం. బాంట్, బాంటా. భాగం, వాటా.

బటారము రూ. పటారము. వి. ఆడంబరం. తపతి. 2.23.

సం. పటు-. దృఢమయిన ; హిం. బటోర్. మనుష్యులు గుమికూడటం, వస్తువుల కుప్ప.

బటాసాలు వి.బ.వ. సిందుపేషణాలు, భక్ష్య విశేషం.

బటు వి. బ్రహ్మచారి వస్త్రం.

సం. బటు-, వటు-. బ్రహ్మచారి ; ప్రా. బడు-.

<సం. బటు- (అర్థవిపరి.).

బటుక వి. బ్రహ్మచారి వస్త్రం.

సం. వటుక-, బటుక-. బాలుడు, బ్రహ్మచారి ; పా. బడుఅ. చిన్నవాడు, బాలుడు.

<సం. బటుక-(అర్థవిపరి.).

బటుది వి. పానపాత్ర, తాగేగిన్నె. సాంబ. మాన. 25.

బటుంబద్ద వి. 1. పన్నె కట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదల్పు బద్ద ; 2. దోనెముందర నేసినగుడ్డ ముడుచుకుపోకుండా అడ్డంగా పైపైన బిర్రుపెట్టే ఒక రకం చేరుబద్ద.

బటువడిదము చూ. బటువు[1].

బటువా రూ. బట్టువా, బట్వా. వి. వక్క, ఆకు మొదలైనవి వేసుకొనే చిన్న గుడ్డసంచి.

హిం. బటువా. పర్సు, విడినంచులుండే చిన్నసంచి, కూజా, వంట పాత్ర ; ఉ. బటూఅ, బట్వా. పర్సు, వక్కాకు వేసుకునేందు కుపయోగించే చిన్నసంచి, హిందువులు ఆహారం పెట్టుకునే కంచుపాత్ర.

<ఉ. బట్వా.

బటువాడా రూ.చూ. బట్వాడా. వి. 1. కూలి, ఉత్తరాలు మొ.వి పంచిపెట్టటం ; 2. అందచేయటం.

బటువాయిసంచి వి. 1. వక్కాకు సంచి ; 2. డబ్బుల సంచి.

హిం. బటువా. సంచి.

<హిం. బటువా+సంచి.

బటువారు చూ. బటువు[1].

బటువాల్రాయ(డు చూ. బటువు[1].

బటువు[1] వి. 1. ఉపధాన విశేషం, గుండ్రని తలగడ. వరాహ. 4.145 ; 2. దిట్టతనం, ప్రౌఢత. మను. 5.101 ; 3. గుండ్రన, వర్తులత్వం. అష్టమ.క. 3.169, 4 పం ; 4. అందం. ద్వి. పరమ. వి. 4.171 ; 5. అంగుళీయక విశేషం, గుండ్రని ఉంగరం. ఆం.భా. 2.150 ; 6. మోటగట్టి పీళ్ళు తోడే బొక్కెన ; విశే. 1. వర్తులం, గుండ్రని. సారంగ.

2.208; 2. అందమైన, మనోజ్ఞమైన. రాజవా. 2.48.

క. బటు, బటువు, బటుహు. వర్తులం, వలయం;

సం. వృత్త, వర్తుల-. గుండ్రని; ప్రా. వట్ట, వట్టుల. గోళాకారం

<క. బటువ.

బటువడిదము వి. చక్రాయుధం. <బటువు¹+అడిదము. బటువారు అ.క్రి. ఒప్పారు, అందంగా ఏర్పడు. పీఠి. 12. <బటువు¹+అరు. బటువాల్రాయఁడు వి. ఇంద్రుడు. అం.రా. 1.26. బటువుకత్తి రూ. బటువుఁగత్తి. వి. చక్రం. అం.రా. 1.52. బటువుకైదువు రూ. బటువుఁగైదువు. వి. చక్రం. దశా. 2.257. బటువుకైదువుజోదు రూ. బటువుఁగైదువజోదు. వి. చక్రాయుధుడు, విష్ణువు. సాంబ. దేవ. 4. బటువుగువ్వ వి. చక్రవాకం, బటువపుల్గు. సాంబ. తిర్య. 78. బటువుఁగత్తి(-కత్తి) రూ.చూ. బటువుకత్తి. వి. చక్రం. బటువుఁగైదువు(-కైదువు) రూ.చూ. బటువకైదువు. వి. చక్రాయుధం. బటువుఁగైదువుజోదు రూ.చూ. బటువకైదువ జోదు. వి. చక్రాయుధుడు, విష్ణువు. బటువుకాయ వి. 1. మగ్గంమీద నేత పడుగును బిర్రుపెట్టే లావపాటి కాయ; 2. మరమగ్గం నిలువ పట్టెను పేరువ పలకకు బిగించి సన్న పల్లతో వడిపెట్టిన దారం. బటువు పుల్గు వి. చక్రవాక పక్షి. ప్రబంధ. 148. బటువుపళ్ళ వి. దోనెగాడితో బద్దె చువ్వ బిగించటానికి అమర్చిన గొయ్యపల్ల. బటువుబిల్ల రూ. బటువ బిళ్ళ. వి. బిల్ల తలగడ. ఆము. 1. బటువుబిళ్ళ రూ.చూ. బటువబిల్ల. వి. బిల్లతలగడ. బటువువాలు వి. చక్రాయుధం. సాంబ. దేవ. 14. బటువువాలుకాల్పు వి. చక్రధరుడు, విష్ణువు. అచ్చ.రా.యు. 500.

బటువు² విశే. 1. గొప్పదైన, పెద్దదైన, అధికమైన. కవిక. 6.154; 2. దృఢమైన, బలమైన; వి. బట్టీగోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన గోడ.

సం. పటు-. బలమైన.

<సం. పటు-.

బటేదారు వి. కౌలుకు సేద్యం చేసే రైతు.

హిం. బాఁటా. పంచటం; పార. -దార్. కలవాడు.

బట్ట¹ వి. 1. వస్త్రం. ఆము. 6.78; 2. వస్త్రఖండం, గుడ్డ. అం.రా. 2.157; 3. పశువుల దేహంమీద ఉన్న తెలుపు మొదలైన చార; 4. మైల అయిన రోక స్త్రీల బహిష్టుతో మైల అయిన గుడ్డ; 5. ఒకరంగులో ఇంకొకరంగు మచ్చ; 6. మఖరోగ విశేషం; 7. స్థలనం.

సం. పట-, పట్ట-. గుడ్డ, పట్టుగుడ్డ; ప్రా. పట్ట-. గుడ్డ, తలపాగా; పా. పట్ట-. పట్టుగుడ్డ, గుడ్డ; హిం. పట్. గుడ్డ, తలగుడ్డ;

క. బట్టె; తు. బట్టె

<ప్రా. పట్ట-.

బట్టఎగురవేయు అ.క్రి. దివాలా తీయు. బట్టకరప రూ. బట్టకరమి. వి. దూది కదంబం. హంస. 4.11. బట్టకరమి రూ.చూ. బట్టకరప. వి. దూది కదంబం. బట్టకవికి రూ.చూ. బట్టగనుప. వి. బట్టగెనుపు, ద్రొటుగ. ఒక అడవిచెట్టు. (Mitragyna Parvifolia or stephegyne Parvifolia). బట్టగణుపు రూ.చూ. బట్టగనుప. వి. బట్టగెనుపు. ద్రొటుగ అనికూడ పిలవబడే ఒక అడవిచెట్టు (Stephegyne Parvifolia). బట్టగవం రూ.చూ. బట్టగనుప. వి. బట్ట గెనుపు, ద్రొటుగ ఒక అడవిచెట్టు (Mitragyna Parvifolia). బట్టగమపు రూ. బట్టకనికి, బట్టగణుపు, బట్టగనం, బట్టగనెం. వి. బట్టగెనుపు, ద్రొటుగ అనికూడా పిలవబడే ఒక అడవిచెట్టు (The Kain, Mitragyna Parvifolia or stephegyne Parvifolia, Man). బట్టగవెం రూ.చూ. బట్టగనుప. వి. బట్టగెనుపు, ద్రొటుగ అనికూడ పిలవబడే ఒక అడవిచెట్టు. బట్టగాళ్ళు రూ. బటగాళ్ళు. వి.బ.వ. ఒకరకం పప్పుదినుసు (Pisum Sativum). బట్టగు అ.క్రి. చెరగుమాయు, రజస్వల అగు. <బట్ట¹+అగు. బట్టగుత్తు విశే. సిగ్గుమాలినవాడు. గౌ. ద్వి. హరి. 2 భా. బట్టగెనుపుచెట్టు వి. అడవిలో పెరిగే ఒకచెట్టు. బట్టగొర్రె వి. కొంతభాగం ఒకరంగు, మరికొంత భాగం మరొకరంగు, నలుపూ తెలుపూగాని, నలుపూ ఎరుపూగాని ఉండే గొర్రె. బట్టచవుడు వి. తెల్లమట్టి అక్కడక్కడ కలిసిన చవుడు. బట్టచిప్ప వి. రెండంచుల్తో లోతుగాఉండే మట్టి చిప్ప. బట్టంచు వి. పాత్రల మూతికి వెడల్పుగా పెట్టే అంచు. <బట్ట¹+అంచు². బట్టతడుపు వి. బట్ట తడిసేటంత వాన. బట్టతడుపువాన వి. కొద్ది చినుకులు. బట్టపట్టు అ.క్రి. కుడిచేత్తో అర్ధం వేలువేసి ముఖమేర్పరచటానికి కుండ నాలుగు పక్కల సాఫుగా రావటానికి బట్టతో పట్టటం. బట్టపాత వి. కుండల్ని సర్దేటప్పుడు సలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట. బట్టపిడచ వి. పడుగు తడపటానికి గంజిలో ముంచిన గుడ్డ. బట్టపువ్వు వి. వృక్షవిశేషం. బట్టముచ్చేరు విశే. బట్టలపై అత్యాసక్తి కలవాడు. బట్టమేఁక వి. పక్షివిశేషం. బట్టలపెట్టె వి. బట్టలు వేసుకొనే పెట్టె. బట్టలుపెట్టు అ.క్రి. బట్టలు కానుకగా పెట్టు. బట్టవిదిలించు అ.క్రి. దివాలాతీయు. బట్టావు వి. పెద్ద మచ్చలు గల ఆవు. <బట్ట¹+ఆవు. బట్టలం వి. గుడ్డలకంటుకునే సన్నటి ముళ్ళుగల కాయల కలుపు మొక్క. <బట్ట¹+-లు+అలం. బట్లాకు వి. గుడ్డలకంటుకొనే సన్నటి ముళ్ళుగల కాయల కలుపు మొక్క. <బట్ట+-లు+ఆకు.

బట్ట² విశే. 1. వెంట్రుకలులేని; 2 ఆదరణలేని, ఆచ్ఛాదన లేని.

క. బట్టుతలె. బట్టతల; మ. పెట్ట. బోడితనం; కొలా. పెట్టియర్. బట్టతల.

బట్టగట్టు(-కట్టు) అ.క్రి. 1. జుట్టు లేనట్టిది. పాండు. 2.64; 2. అట్టకట్టు, బట్టలా తల ఏర్పడు. ప్రబంధ. 755. బట్టతల వి. జుట్టులేని తల. శృం.నై. 7.63. బట్టతలకుమోఁకాళ్ళకుముడిపెట్టు స.క్రి. అసంబద్ధ కార్యాన్ని చేయబోవు. బట్టతలవాఁడు విశే. ఖర్వాటుడు. మల్లభూ. పీఠి. 84.

బట్టకబయలు రూ.చూ. బట్టబయలు. వి.దే. బహిరంగం. బసవ. 1.22.

బట్టబయటవిదు చూ. బట్టబయలు.

బట్టబయటిధవము చూ. బట్టబయలు.

బట్టబయటిభోగాలు చూ. బట్టబయలు.

బట్టబయటియాత చూ. బట్టబయలు.

బట్టబయలగు చూ. బట్టబయలు.

బట్టబయలు చూ. బట్ట[2]. రూ. బటాకబయలు, బటానబయలు, బటాబయలు, బట్టకబయలు, బట్టబైలు, బట్టాబయలు, బట్టి బయలు. వి.ఔ. చెట్లు మొదలైనవి లేనట్టి బయలు. పి కకు. 2.112 ; విణ. ప్రకటితమైన. సారంగ. 2.80.

బట్టబయటవిడు స.క్రి. బయలుపరుచు. <బట్ట బయలు + -అ[7] + ఇడు. బట్టబయటిధనము వి. బహిరంగంగా ఉన్న ధనం. తాళ్ల.సం. 5.235. బట్టబయటిభోగాలు వి.బ.వ. బహిరంగంగా ఉన్న అనుభవాలు. బట్టబయటి యాత వి. వ్యర్థవిషయం. తాళ్ల.సం. 12.75. బట్టబయలగు అ.క్రి. ప్రకటితమగు. తాళ్ల.సం. 5.187. <బట్ట బయలు + అగు. బట్టబయలుగావించు(-కావించు) స.క్రి. బహిరంగం గావించు. శుక. 3.236. బట్టబయలుతగుళ్లు వి.బ.వ. బహిరంగపు సంబంధాలు. తాళ్ల.సం. 6.185. బట్టబయలుపందిలిపెట్టు స.క్రి. బహిరంగంగా పందిరి వేయు, దగ్గరున్నదాన్ని చేజిక్కించుకొను. బట్టబయలుసేయు (-చేయు) స.క్రి. బహిరంగం గావించు. తాళ్ల.సం. 16.227.

బట్టబైలు రూ.చూ. బట్టబయలు. విణ. ప్రకటింపబడిన.

బట్టాబయలు రూ. చూ. బట్టబయలు. వి.ఔ. చెట్లు మొదలైనవి లేనట్టి బయలు ; విణ. ప్రకటితమైన.

బట్టావు చూ. బట్ట[1].

బట్టి[1] వి. బహుమానం. కకుత్స్థ. 2.109.

బట్టి[2] రూ. బట్టీ[2]. వి. 1. చిలక. ఘటికా. 1.153 ; 2. వాగ్ధోరణి ; 3. అదేపనిగా చదవటం.

బట్టికాఁడు వి. 1. చిలక. ఆం.భా. 2.89 ; 2. గోరువంక, శారిక. హంస. 5.143.

బట్టి[3] రూ. బట్టియ[2], బట్టీ[1], బట్టె[2], బడ్డి[2]. వి. 1. మందులు వండటానికి ఓమం మొదలైన వాటి నుంచి ద్రవం తీయటానికి వాడే పొయ్యి ; 2. ఆవం, కుండల ఆము.

సం. భ్రాష్ట్ర-, భ్రాష్ట్రీ-. పెనం ; ప్రా. భట్ఠ-, భట్ఠీ ; అ.మా. భట్ఠ. పెనం ;

క. బట్టి, బట్టీ ; తు. బట్టి ; ఒర. భట్ఠా, భఠీ.

<ప్రా. భట్ఠీ.

బట్టికచ్చు వి. బట్టిగోత.

బట్టి[4] రూ.చూ. బట్టె[1]. వి. బోదె.

బట్టివకోల రూ.చూ. బట్టినగోల. వి. ఎద్లమీద గోనెలు ఎత్తివేసే కర్ర, ఎత్తినగోల.

బట్టివగోల రూ. బట్టినకోల. వి. ఎద్లమీద గోనెలు ఎత్తివేసే కర్ర, ఎత్తనగోల. ఆం.భా. 2.263.

బట్టిప్రోలురుమాలు రూ.చూ. భట్టిప్రోలు రుమాలు. వి. ఒకరకం తలపాగ.

బట్టీబయలు రూ.చూ. బట్టబయలు. వి.ఔ. బహిరంగం.

బట్టియ[1] రూ.చూ. బట్టె[1]. వి. కాలవ.

బట్టియ[2] రూ.చూ. బట్టి[3]. వి. సున్నం మొదలైనవి తయారు చేయటానికి కట్టిన కట్టడం.

బట్టీ[1] రూ.చూ. బట్టి[3]. వి. 1. మందులు మొదలైనవి వండటానికి ఓమం మొదలైన వాటి నుంచి ద్రవం తీయటానికి ఉపయోగించే పొయ్యి, ఆవం ; 2. సున్నం కాల్చే కట్టడం ; 3. పెంకును కాల్చే కట్టడం ; 4. రంగు నీళ్ళు కాచే జనపదబ్బా.

బట్టీకాగు వి. సారాయి బట్టీలో వాడే అడుగు మందంగా ఉండే పెద్ద మట్టి పాత్ర. బట్టీకొట్టు వి. పొయ్యి మీద నూలు ఉడకబెట్టటం. బట్టీపిలి వి. బొగ్గు మాదిరి నల్లరంగు. బట్టీపరుపు వి. కింద పొవ్వుల వరస, పైన రాతి వరస వచ్చేటట్లు ఇటుక పేర్చటం. బట్టీసున్నం వి. సున్నపురాతిని కాల్చి దబ్బాలకెత్తిన సున్నం.

బట్టీ[2] రూ.చూ. బట్టి[2]. వి. బట్టీ పట్టటం, అదే పనిగా చదవటం.

బట్టీ[3] రూ.చూ. బట్టె[1]. వి. స్నానాల నీళ్ళు పోయే త్రోవ. మార్గం.

బట్టు వి. స్తోత్రాలు చేసే ఒకానొక జాతివాడు. రం.రా. యు. 351 వ. 22 పం.

సం. భట్ట-. స్తోత్రంచేసే ఒకజాతివాడు ; ప్రా. భట్ట-. స్తుతిపాఠకుడు, స్తుతిపాఠకకాలి, వేదవిదుడు ; అ.మా. భట్ట-. పట్టపు పేరు, అధీరక, భట్టో. పూజార్హుడు ; కు. బార్ ; సిం. భటు ; నే.అ.బెం. భాట్ ; ఒ. భాటు ; హిం.గు.మరా. భాట్ ; పం. భట్ట్ ;

క. బలు, బట్టు ; త. పట్టన్. అర్చకుడు ; మ. పట్టన్. అర్చకుడు.

<ప్రా. భట్ట-.

బట్టుఇనాం వి. భట్రాజుల కిచ్చిన బహుమతి. బట్టుగూడు చూ. బట్టి[3]. వి. వంట ఇంట్లో పొగ బయటికి పోవటానికి పైకప్పు వరకు పెట్టే మట్టి గొట్టం. బట్టుమాన్యం రూ. భట్టుమాన్యం. వి. పొగడినందుకు భట్రాజుల కిచ్చేది. బట్టువాఁడు విణ. స్తోత్రాలు చేసే ఒకానొక జాతివాడు. శుక. 4.111, వేమ. 3.153. బట్టువావంచి వి. కోలి.

బట్టువా రూ.చూ. బటువా. వి. వక్క, ఆకు మొదలైనవి వేసుకొనే చిన్న గుడ్డ సంచి.

బట్టువాడా రూ.చూ. బట్వాడా. వి. పంచటం.

బట్టె[1] రూ. బట్టి[4], బట్టియ[1], బట్టీ[3]. వి. కాలవ, నీళ్ళుపోయే త్రోవ.

క. బట్టె. త్రోవ, దాట ; మ. వట్టి. త్రోవ, దాట ; సం. వాట ; మరా. వాట. త్రోవ, దాట.

<క. బట్టె.

బట్టె[2] రూ.చూ. బట్టి[3]. వి. సున్నం మొదలైనవి తయారు చేయటానికి కట్టిన కట్టడం.

బట్న వి. 1. పన్నెకట్టుబడిలో ఈనెలు బిగించటానికి వాడే దారం పరిపెట్టే కదురు ; 2. కదురువల్ల బిగించిన చివరి కొయ్యదిండు.

హిం. బటన్. అనేక దారాల్ని కలిపిచేసే ఉంత.

బట్ల రూ.చూ. బట్లె. వి. దద్దెం, ఒకరకమైన మూకుడు.

బట్లరింగ్లీషు చూ. బట్లరు.

బట్లరు రూ. బొట్లేరు. వి. వంటవాడు.

ఇం. *Butler*. వంటవాడు.

< ఇం. Butler.

బట్లరింగ్లీషు వి. అరకొరల ఇంగ్లీషు. ఇం. *Butler*. వంటవాడు, *English*. ఆంగ్లభాష. < ఇం. *Butler* + ఇం. English.

బట్లలం చూ. బట్ట[1].

బట్లాకు చూ. బట్ట[1].

బట్లి రూ. బట్ల. వి. శరావ విశేషం, ఒకరకమైన మూకుడు, ఆముదం వండి ఓసి మరల కాచే మట్టిపాత్ర. ఆం. భా. 2.248.

బట్వా రూ.చూ. బటువా. వి. వక్క, ఆకు. మొదలైనవి వేసుకునే చిన్న గుడ్డసంచి.

బట్వాడా రూ. పట్వాడా, బటువాడా, బట్టువాడా. వి. పంచటం.

హిం. *బట్వాడా*. పార్టిషన్, విభాగం, భాగం, సంకేతం; ఉ. *బట్వాడా*. ఒకభాగం, పంటను భాగాలుగా వేయటం, భూమిని భాగాలుగా చేయటం;

త. *పట్టువాడా*. పంపకం, జీతాలుపంచటం.

< ఉ. బట్వాడా.

బటాని రూ.చూ. బటానీ. వి. బఠానిగింజ.

బడ[1] వి. బక్కచిక్కిన.

ఒ. *భడ, భడభడ*. పగిలేటప్పటి ధ్వని, ఉడికేటప్పటి ధ్వని.

బడరోకలి వి. చిన్నరోకలి.

బడ[2] రూ.చూ. బడా. విశే. పెద్దది. క్రి. విశే. అత్యంతం, మిక్కిలి.

బడగొంద (-కొంద) వి. కొండలా ఆకారం కలిగి నీళ్ళు కలిగిన మేఘం. బడజంకీ విశే. మిక్కిలిగొప్పది, మిగుల పెద్దదైనది. రం. రా. అరణ్య. 190ప. 27పం.

బడక వి. నడవ పక్కనున్న అరుగు.

హిం. *భడక్*. మెరుపు, ప్రకాశం.

బడకరము విశే. శ్రేష్ఠమయినది. భాగ. సం. 7.84.

హిం. *బడా*. పెద్ద. *బఢకర్*. శ్రేష్ఠమైనది.

బడకా రూ. బడగా. వి. బకాయి.

ఒ. *బడక్*. భయం, గౌరవ, మోనం.

బడగ రూ. బడవ, బడవడు, బడుప. విశే. 1. అవివేకుడు, తుచ్ఛుడు. బసవ. 4.235; 2. మోటైనవాడు.

క. *బడగ*, సేవకుడు, బుద్ధిహీనుడు;

సం. *వటుక-*, మూఢుడు, బ్రహ్మచారి.

< క. బడగ.

బడగలు రూ. బడగులు వి.బ.వ. నీలగిరి ప్రాంతంలో నివసించే ఒకజాతి జనం.

క. *బడ, బడగ, బడగల్, బడగు*. ఉత్తరదిక్కు, ఉత్తరదిక్కులో, *బడగణమ్*. ఉత్తరదిక్కువైపు మనిషి, ఉత్తరాదివాడు; త. *వట*. ఉత్తరపు, *వటవల్*. ఉత్తర దేశస్థులు; మ. *వటక్కన్*. ఉత్తరపు.

< క. బడగల్.

బడగా రూ. చూ. బడకా. వి. బకాయి.

బడగు రూ.చూ. బడుగు. వి. శవం. విశే. కృశం, కృశించినది, క్షీణించింది.

బడగులు రూ.చూ. బడగలు. వి.బ.వ. నీలగిరి ప్రాంతంలో ఉండే ఒకజాతి జనులు.

బడతిచేయు స.క్రి. ఉన్నదానికంటె ఉన్నతోద్యోగంలో నియమించు.

హిం. *బఢ్తీ*. అధికం, వృద్ధి, వాపు, పెరుగుదల, అధికరించటం, హెచ్చు, అతిశయం, పెంపు, ఔన్నత్యం, ఎత్తు, అపరిమితమైన.

< హిం. బఢ్తీ.

బడవ వి. 1. జడుం, ఆపద. ఆం.భా. 1.150; 2. తెలివి లేనివాడు.

క. *బడ, బడవు, బడపు*. నిస్సారత, బలహీనత, సన్నం; కొత. *బడ*. బలంలేని, సన్నమైన; త. *వట*. తక్కువగు, ఎండిపోవు; మ. *వటు*. సన్నని, బలహీనమైన.

< క. బడ.

బడబడ వి. 1. రాళ్ళు, పడగళ్ళు మొదలైనవి తొందరగా పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. గౌ. హరి. పూ. 2148పం.; 2. మింగటం మొదలైనవాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. పద్మ. 7.242; 3. ఎక్కువగా మాటలాడటంలో అయ్యేధ్వనికి అనుకరణం, 4. ఇనపతగడు మొదలైన వాటిని కొట్టినప్పుడు అయ్యేధ్వనికి అనుకరణం; 5. నీళ్ళు మొదలైనవి కారటంలో అయ్యేధ్వనికి అనుకరణం.

క. *బడబడ, వటవట*; పడరేటప్పుడు అయ్యే ధ్వనికి అనుకరణం, పేలటం, పనికిమాలిన మాటలు మాట్లాడటం; తు. *బడబడ*. పేలటం, పదరటం, ఢంకా ధ్వని; కో. *బ(డ్‌బ(డ్*. అతివిరేచనాల వల్ల స్వచ్ఛం చేయబడేటప్పుడు అయ్యేశబ్దం, చెట్టు పడేటప్పుడు వచ్చే ధ్వని; కుఇ. *బడ్‌బ్(డ్‌నా*. గట్టిగా మాట్లాడు, శబ్దంతో మాట్లాడటం, *బడజ్గ్‌బడ్(జ్గ్‌నా, బెరెజ్గ్‌బెరె(జ్‌నా*. విరామంలేకుండా మాట్లాడటం, గట్టిగా కలిసి మాట్లాడటం; మాల్తో. *బడ్‌బడ్‌రె*. పేలటం.

బడాకీ విశే. మిక్కిలి విస్తృతమైన. నవనాథ. 3.149ప. రం. రా. అరణ్య. 190ప. 27పం.

బడుడు వి. 1. దరిద్రుడు. కు. సం. 7.39; 2. దేవుడు. శివుడు; 3. పాములవాడు.

క. *బడ*; తు. *బళ్*. దేవుడు, శివుడు.

బడలజేయు చూ. బడలు.

బడలిక చూ. బడలు.

బడలికలువాయు చూ. బడలు.

బడలించు చూ. బడలు.

బడలు అ.క్రి. 1. శ్రమపడు, అలయు. వరాహ. 11.96; 2. నొచ్చు. బాధపొందు. శుక. ద. 2.45; వి. శ్రమ. అలసట.

క. *బడల్, బడలు*. అలసటపొందు, ఆయాసపడు, ఆపదపొందు, *బడలికె, బడల్కె*. నీరసం, ఆయాసం, దుఃఖం, *బడలువికె*. ఆయాసం; తు. *బళ్ళికె*. అలసట, ఆయాసం; త. *వటలిక్కై*. అలసట, ఆయాసం; కుఇ.

వహ. అలసిపోవు; కువి. వ్వహ. అలసిపోవు. వహ. మూ.ద.ద్రా. & మూ.మ.ద్రా. *వట్- *వచ్-. < క. బడలు.

బడలఁజేయు (-చేయు) స.క్రి. 1. ఖేదపెట్టు, వ్యాకుల పెట్టు; 2. నొప్పించు, బాధపెట్టు; 3. శ్రమపెట్టు, అలయించు. < బడలు + -అ[7] + చేయు. బడలిక వి. అలయిక, శ్రమ, శ్రమ చిహ్నం. పారి. 1.61. క. బడలికె, బళలికె, బళల్కె. అయానం. < క. బడలికె. బడలికలువాయు (-పాయు) అ.క్రి. శ్రమ తీర్చుకొను, సేద తీర్చుకొను. బడలించు స.క్రి. 1. ఖేదపెట్టు, వ్యాకుల పెట్టు. ఉ.రా. 1.312; 2. నొప్పించు, బాధపెట్టు. ఉ.రా. 4.66; 3. శ్రమపెట్టు, అలయించు. ఉ.రా. 7.68. < బడలు + -ఇంచు[3]. బడలుచు రూ.చూ. బడల్చు. స.క్రి. పడగొట్టు. బడలువడు రూ.చూ. బడలుపడు. వి. 1. అలయు, శ్రమనొందు. కాశీ. 6.33; 2. చెడు, నశించు, చచ్చు. భాగ. 10.418; 3. దావచుట్టగాపడు; 4. నొచ్చు, బాధనొందు; 5. పడు, కూలు; 6. నలగు; 7. చీకాకుపడు, ఖేదనొందు. బడలువఱచు రూ.చూ. బడలుపఱుచు. స.క్రి. 1. నొప్పించు. హర. 3.9; 2. అలయు, శ్రమనొందు. వరాహ. 5.117; 3. చీకాకు పరచు. బడలువఱుచు రూ.చూ. బడలువఱుచు. స.క్రి. 1. నొప్పించు. భార.ద్రోణ. 5.370; 2. చీకాకుపరచు. భార.కర్ణ. 8.178; 3. అలయు, శ్రమనొందు. బడలువడు (-వడు) రూ. బడలువడు, బడల్పడు, బడల్వడు. అ.క్రి. 1. నొచ్చు, బాధపడు. భార.ఆది. 6.72; 2. చీకాకుపడు. ఖేదపడు. భార.అరణ్య. 3.367; 3. అలయు, శ్రమ నొందు. కు.సం. 5.11; 4. పడు, కూలు. నిర్వ.రా. 6.121; 5. దావచుట్టగపడు. భార.భీష్మ. 2.98; 6. నలగు. భాస్క.రా.యు. 1843; 7. చెడు, నశించు, చచ్చు. బడలువఱచు (-వఱచు) రూ.చూ. బడలువఱుచు. స.క్రి. 1. ఖండించు, విరుచు; 2. చంపు; 3. శ్రమ నొందు; 4. నొప్పించు; 5. చీకాకుపరచు. బడలువఱుచు (-వఱుచు) రూ. బడలువఱచు, బడలుపఱుచు, బడలు వఱచు. స.క్రి. 1. విరుచు, ఖండించు. భార.ద్రోణ. 1.303; 2. చంపు. భార.ద్రోణ. 1.384; 3. చీకాకు పరచు. భార.ద్రోణ. 5.217; 4. నొప్పించు. భార.కర్ణ. 1.74; 5. అలయు, శ్రమనొందు. బడలువాపు (-పాపు) స.క్రి. చంపు, సంహరించు. వేంక.పంచ. 2.194. బడల్చు రూ. బడలుచు. స.క్రి. పడగొట్టు. రాజవా. 2.27. బడల్పడు రూ.చూ. బడలువడు. అ.క్రి. 1. చెడు, నశించు. భార.అరణ్య. 3.367; 2. చీకాకుపడు, ఖేదపడు. నిర్వ.రా. 3.29; 3. పడు, కూలు. భార.ఉద్యో. 3.67; 4. చచ్చు. భార.ద్రోణ. 2.43; 5. దావచుట్టగపడు. ఆం.భా. 3.104; 6. నొచ్చు, బాధనొందు; 7. అలయు, శ్రమనొందు; 8. నలుగు. బడల్వడు (-వడు) రూ.చూ. బడలువడు. వి. 1. నొచ్చు, బాధనొందు. కు.సం. 11.143; 2. అలయు, శ్రమనొందు; 3. చీకాకుపడు, ఖేదపడు; 4. పడు, కూలు; 5. నలగు; 6. దావచుట్టగా పడు; 7. చెడు, నశించు.

బడల్చు చూ. బడలు.

బడల్పడు చూ. బడలు.

బడల్వడు చూ. బడలు.

బడవ రూ.చూ. బడగ. విశ. అవినీతుడు, తుచ్ఛుడు.

బడవవడు (-వడు) అ.క్రి. దాసుడగు, భృత్యుడగు. బడవ వాటు (-పాటు) వి. దాస్యం. ప్రబంధ. 755.

బడవఁడు రూ. చూ. బడగ. విశ. అవినీతుడు, తుచ్ఛుడు. శుకస. 4.67.

బడవా విశ. తార్పుడి, తార్పువాడు. వేణు.శ. 52.

సం. వడబా. వ్యభిచారిణి; బెం. భేడుయా; హిం. భడవా; మరా. భడవా. నిందించేటప్పు డుపయోగించే శబ్దం. భడుఆ. వేశ్యకు తార్పువాడు;

క. బడవా.

< మరా. భడవా.

బడవాతనము వి. తార్పుటం. వేణు.శ. 41.

బడా రూ. బడ[2]. విశ. గొప్పది. భార్గవ పురాణం. 6.114;

హిం. బడా; మరా. బడా. పెద్ద, గొప్ప; ఉ. బడా. పెద్ద, గొప్ప.

< హిం. బడా.

బడావగలఁజూచు (-చూచు) స.క్రి. పగలబడిచూచు, విరగబడిచూచు. శశి. 1.516. బడావగలు వి. మిట్ట మధ్యాహ్నం. శశి. 2.369.

బడావ క్రి.విశ. వెంటనే.

హిం. బడా. పెద్ద.

బడాయి రూ.చూ. బడాయీ. వి. 1. లేనిగొప్పతనం, డాబు; 2. గర్వం.

బడాయికోరు రూ.చూ. బడాయిఖోరు. వి. డాంబికుడు. బడాయిఖోరు రూ. బడాయికోరు. వి. అతిశయంగా మాట్లాడేవారు. హిం.ఉ. బడాఈ. గొప్పతనం; ఉ. బడాఈఖోర్. గొప్పతనం చెప్పుకొనేవాడు. < ఉ. బడాఈఖోర్.

బడాయించు స.క్రి. 1. పరికొల్పు, ఉత్సాహపరచు. ప్రబంధ. 788; 2. అభివృద్ధిచేయు; 3. దిమ్మెనతో కొట్టు; అ.క్రి. అభివృద్ధిఅగు.

హిం. బఢానా. తీవ్రంచేయు, నడుపు, వృద్ధిపరచు; ఉ. బఢానా. తీవ్రమయ్యేటట్లుచేయు.

< హిం. బఢా(నా) + -ఇంచు[3].

బడాయీ రూ. బడాయి. వి. గొప్పతనం, గర్వం. రా.చ.

హిం.మరా. బడాఈ. గొప్పతనం, శ్రేష్ఠత, ప్రశంస; ఉ. బడాఈ. గొప్పతనం, ప్రశంస.

< హిం. బడాఈ.

బడాలు చూ. పడ[3]. వి.బ.వ. వడలు, రక్త విశేషం. ఠ.హిం. గా.సంపు. 6, గా.సం. 695, క్రీ.శ. 1441.

బడాలవ క్రి.విశ. చప్పుడుచేస్తూ. ధ్వన్యను.

బఢావుచేయు వి. ఉన్న ఉద్యోగం కంటె ఉన్నతోద్యోగంలో నియమించు.

క. బణంబె, బణబె, బణవె, బణిపె, బళొవె; తు. బణబె.

<క. బణిపె.

బడియ రూ. బడి², బడిక, బడికి, బడికె, బడిద, బడిగ, బడిగి, బడిసి, బడిసె, బడె², బత్తె. వి. 1. చిన్న దుడ్డుకర్ర. కు.సం. 2.84 ; 2. శవయానం.

క. బడి, బడె, బొడి, బొడె. బాదు, కొట్టు, దెబ్బలు కొట్టు, కొట్టటం, దెబ్బ, లావుపాటి పొట్టికర్ర, దుడ్డుకర్ర, బడికె. కొట్టటం, బడిగె. కర్ర, దుడ్డుకర్ర, సుత్తి, కొయ్య నమ్మెట, బడిసు. కొట్టుచేయు, బడుకతన. కొట్టటం మొ.వి, బాయ్‌బడి. మాట్లాడకుండాచేయు. నెమ్మదిగా ఉండేట్లుచేయు ; కొడ. బడి- (బడిప్-, బడిచ్-). సుత్తి కొట్టు, పొడిచేయు, బ.య్‌బడి. గట్టిగా అరుచు ; తు. బడిపుని, బడియుని. కొట్టు, బాదు, దెబ్బలు కొట్టు, బడు. కర్ర, దుడ్డు ; త. వటి. సన్నటి బెత్తం లేక కర్ర ; మ. వటి. కర్ర, కొయ్య, దెబ్బ, బాణం, వట్టికక్క. కొట్టు. వటిప్పిక్క. కొరిచేటప్పుడు కూము తల కోయు ; కొం. బడ్గ. కర్ర ; కువి. బుడ్గ. కర్ర, బడ్గ. ఊతకర్ర ; పర్జి. బడియ. కర్ర ; కొలా. బడియ. ఊతగా నడిచే కర్ర ;

చూ. మరా. బడ్గా.

<క. బడి.

బడియబద్ర వి. చిన్నచిన్న మొద్దులు.

బడియు స.క్రి. (దృష్టిదోష పరిహారానికై) దిగతీయు, దిగదుడుచు. పండి.చ. 5.859.

క. బఱి, బొఱి. దుమ్ముని ఒకచోటికి ఊడుచు, చేత్తో ఊడుచు, చేత్తో గీకు, ఖరద, నిమ్మ మొ.వాటిని పట్టించు, పూయు, బళచు, బఱచు, బఱిసు, బొఱిసు, బఱు. ధరించు, పూయు, బఱుగారె. గోడకి అతికించబడిన కల్లం, బొఱియువికె. పూయటం ; త. వఱి (-ప్పి-, -త్తి-). ఊడుచు, గుజ్జుని దగ్గరగాచేయు, లేపనంలా చేత్తో మర్దన చేయు, గంధంపూయు, క్షౌరంచేయు. వఱియల్. ఊడిచిన తర్వాత ఒకచోట పోగుపెట్టింది ; మ. వఱిక్క. ఊడిచి వేయు, గోకు, క్షౌరంచేయు, మెరుగుపెట్టు ; కొ. వాద్య్- (వాచ్ప్-). వేలితో గోకు, వాడ్త్ ఉద్. అమితంగాపూయు (ఉద్-, పూయు).

<క. బడిసు.

బడిమి వి. 1. చక్రాకార భ్రమణం. ద్వి.సార.చ. 3.148, 452 ; 2. దూతబలి. ఆం.భా. 2.171 ; 3. బడియటం. బడిమిపోయు స.క్రి. చుట్టూరాపోయు. తాళ్ల. సం. 12.351

బడిలి వి. తూటు, బెజ్జం, రంధ్రం.

బడిశ రూ.చూ. బడియ. వి. చేపలుపట్టే గాలం.

బడిశి రూ.చూ. బడియ. వి. చేపలు పట్టే గాలం, బడిశం.

బడిసి రూ.చూ. బడియ. వి. టక్క.

బడిసివాటు విశే. దిగతీసివేసింది, దిగదుడుపైంది. కాశీ. 7.151 ; వి దిగతీసివేయటం. బడిసివైచు స.క్రి. దిగదుడుచు.

బడిసె రూ.చూ. బడియ. వి. 1. చిన్నదుడ్డు కర్ర ; 2. చేపల్నిపట్టే గాలం.

బడుగు రూ. బడగు, బడుప. విశే. 1. శక్తిహీనుడు, అసమర్థుడు. భార.ఉద్యో. 3.135 ; 2. అల్పుడు. హరి. ఉ. 8.43 ; 3. కృశం. కృశించింది, క్షీణించింది. శశా. 8.172 ; వి. శవం.

క. బడ, బడవు. పేదతనం, అక్కువతనం, అల్పత్వం. సన్నని, పేద, బడవ. పేద, బలహీనుడు, బడక. సన్నని, అల్పమైన, దుర్బలుడు, బడకలు. బలహీనంగా ఉండటం, అల్పం, బడతన. అల్పమైన, పేదతనం, బడహ. అల్పత్వం, సన్నని, నాజూకు ; కొడ. బడ పేద, బడవె. పేదవాడు, బడవతి. పేదది ; తు. బడ. పేద, నిరుపేద, సన్నని, అల్పం, బడవె, బడువె. పేదవాడు, దరిద్రుడు, బడె. అల్పం, సన్నం ; త. వటి. (-వ్-, -న్త్-). క్షీణించు, ఎండిపోవు (నదిలో నీళ్ళు) వటివల్. తగ్గటం ; మ. వటు. అల్పం, పేద, వటియుక. ఎండబెట్టు ; కో. వడ్వ్. పేదతనం, వడ్వ్న్. పేదవాడు, బడ్వ. మెయ్‌ఙ్, బడ్వ్నమెయ్‌ఙ్, వడ్వ్న మెయ్‌ఙ్. దరిద్రుడి కొడుకు (నిందలో).

బడుగుదేవర వి. బడుగు జాతివారి దేవుడు. పండి.చ. 5.291. బడుగుపని వి. వడ్రంగి పని.

బడుద్దాయి వి. 1. పనికిరానివాడు, చేతకానివాడు ; 2. బద్ధకస్థుడు.

హిం. బడా. పెద్ద, దాఈ. దాది, దాసి.

బడువ రూ.చూ. బడగ. వి. 1. ఒకచెట్టు ; 2. ఆకుపూత లేక ఎండిన చెట్టు.

బడుమము విశే. రూపం కోల్పోయినవి. కు.సం. 11.19.

బడువ రూ.చూ. బాడవ. వి. పల్లపు నేల.

బడుపు రూ.చూ. బడుగు. వి. 1. కృశం, కృశించింది, క్షీణించింది ; 2. శవం.

బడుసు వి. ముడి.

క. బడి. సామీప్యం, పక్క, సాన్నిహిత్యం.

బడె¹ వి. చెక్క కప్పుగల చిన్న కట్టడం.

క. బడిగె, బడె. సన్నని కర్ర.

బడెలపబ్బు వి. ఒనికర్రలపై వేసిన నర్నాలకు పారు పట్టెకు కట్టేతాడు.

బడె² రూ.చూ. బడియ. వి. 1. చిన్నదుడ్డుకర్ర. భోజ. 4.45 ; 2. దొంగగొడ్డు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య.

బడెకుంచె వి. నరిచేసేటప్పుడు పదుగు మీద కుంచె ఎత్తి ఎత్తి వెయ్యటం.

బడె³ రూ. బడే. విశే. పెద్ద.

హిం.ఉ. బడా. పెద్దదయిన.

<హిం. బడా.

బడెగంటె వి. పెద్దగంట. బడెగంట్లు వి బ.వ. పెద్ద కలుగులు. పాండు. 5.128. బడెపన్నం వి. వడ్లలో ఒక రకం.

బడెమి రూ.చూ. బడెము. వి. మొదటిసారి నరిచేసే పదుగు. బడెమిచేయు స.క్రి. గంజిపెట్టిన పదుగును మొదటిసారి

కుంచెతో మువ్వు.

బరెము రూ. బరెమి. వి. 1. మొదటిసారి గంజితో తడిపిన పడుగు ; 2. రెండోసారి కుంచెతో దువ్విన పడుగు.

బరే రూ.చూ. బరె³. విశే. పెద్ద.

బరేవారడి రూ.చూ. బడివారడి. వి. 1. తలపన్ను. వ్యక్తి గతంగా ప్రతివ్యక్తికి విధించే పన్ను ; 2. రెండింటికి కల భేదం.

బల్ల రూ.చూ. బల్లి¹. వి. 1. గడమంచె, గడమంచె ; 2. మగానుమీద పడుగు తోడేటప్పుడు దబ్బాలకు ఉన్న దారం బగ్గుల పట్టు వరకూ సాపుగా పోవటానికి నిలువు గుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్య (లు) ; 3. నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలు ; 4. మరమగ్గంలో పన్నె, పలక మొ. నవి బిగించిన నాలుగు పట్టెల చట్రం.

బల్లి¹ రూ. బల్ల. వి. 1. గడమంచె, గడవంచి ; 2. మగాను మీద పడుగు తోడేటప్పుడు దబ్బాలకు ఉన్న దారం బగ్గుల పట్టె వరకూ సాపుగా పోవటానికి నిలువ గుంజల మీద అడ్డంగా బిగించిన కొయ్య (లు) ; 3. నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువురాటకు అడ్డంగా మంచె మాదిరిగా బిగించిన కర్రలు ; 4. మరమగ్గంలో పన్నె, పలక మొ.వి బిగించిన నాలుగు పట్టెల చట్రం ; 5. చెక్క కప్పుగల చిన్న కట్టడం. ధాన్యం నిలవ చేసే చెక్క కూర్పు గల నిర్మాణం ; 6. గాదెకు చెదలు పట్ట కుండా అడుగున వేసిన రాళ్ళ మీద నిలువుగా అడ్డంగా కర్రలు పరిచి కట్టిన కట్టటం ; 7. చెక్కకూర్పుగల దుకాణపు పట్టె ; 8. పైరు రక్షణకు పంటచేలో గుంజలు పాతిపైన తడికవేసి కట్టిన అరుగు ; 9. ఎత్తుగా ఉన్న దావిగోడ ; 10. చెక్కతో తయారు చేయబడ్డ కిళ్ళ మొదలైన వాటని అమ్మే కొట్టు.

ఓ. భాతీ. వెదురు కర్రలతోను చెక్కలతోను నిర్మించిన ఎత్తైన నిర్మాణం, వస్తువుల్ని దాచుకొనే అరుగు.

<ఓ. దాకి.

బల్లికాపు వి. ముందు జాగ్రత్త. బల్లిగుజ్జ వి. మరమగ్గం చట్రం నిలిపే మగ్గం పందిరికి ఆధారంగా నేత బయలులో పాతిన నిలువ కొయ్య. బల్లిదండెలు వి.బ.వ. నేత బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువ రాటకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్రలు. బల్లిమగ్గం వి. ఒకరకం మగ్గం. బల్లిరాట వి. పందిరి మగ్గం చట్రం నిలిపే మగ్గం పందిరికి ఆధారంగా నేత బయలులో పాతిన నిలువకొయ్య.

బల్లి² రూ.చూ. బట్టీ². వి. 1. ఇటుకను మాత్రమే కాల్చే కట్టడం ; 2. సున్నం కాలతకు వాడే బట్టీ.

బల్లు¹ వి. 1. మగగురి (ముఖ్యంగా ఏనుగు మేత్రం) ; 2. మోకు ; 3. మోట బొక్కెన లాగే మోకు.

గ. బడు. తీగ.

బల్లు² వి. వ్యర్థమైన లేక నిరుపయోగమైన మనిషి.

క. బడ్డు. నిష్ఫలత్వం ; తు. బరడు. ప్రయోజనం లేని ; త. వఱటన్. నన్నని మనిషి ; మ. వఱు. టాళి, ఎండిన.

<క. బడ్డు.

బల్లు³ వి. లావుగా ఉండే వ్యక్తి.

బల్లుఖండ వి. ఆభరణవిశేషం. ద.హిం.శా.సంపు. 5. శా.సం. 1172. క్రీ.శ. 1298.

బలుగరుత్తుగింగ వి. తెల్ల నీలంరంగు పూలుపూసే ఒకరకం తీగ (Dalbergia volutilis).

బల్తాసు రూ.చూ. బొత్తాము. వి. 1. ఒకవిధమైన ఆకారంకల వస్తువు ; 2. గుండీ ; 3. అర్ధ చంద్రాకారపు వస్తువు.

బల్లె రూ.చూ. బడియ. వి. కంది, పెసర, ఉలవ మొ. పైరు కుప్పలు కొట్టి గింజలు రాల్చటానికి ఉపయోగించే దుడ్డు కర్ర.

బల్లు రూ.చూ. బదులు. వి. 1. అప్పు ; 2. మారు.

బళాగి చూ. బడగ. వి. 1. అడ్డాల పట్ట ; 2. రాశి.

క. బళగు. నీచుడు, పేదవాడు, విలువలేని వాడు.

బళారు రూ.చూ. బనారు. వి. 1. వెతల్పు ఉండే గుడ్డ ; 2. ఉన్నితో తయారు చేయబడ్డ బట్ట ; 3. మట్టితో చేసినది ; 4. వస్త్రవిశేషం, ఒకరకం ఉన్ని బట్ట.

బళివికొంటు స.క్రి. ధాన్యం కట్టల్ని నూర్చు, కొట్టు.

క. బళాంచె, బళాచె, బళావె, బళివె, బళెచె. గడ్డికుప్ప, వామి ; తు. బళాచె. కుప్ప, వామి.

<క. బళివె + కొట్టు¹.

బంటరి చూ. బంటు.

బంటుతీకము చూ. బంటు.

బంటా వి. గుమ్మి, గుంపు.

హిం. బాంటా. భాగం, పంచుకోవటం.

<హిం. బాంటా.

-బంటి ప్రత్య. నీరు మొదలైన వాటి పరిమితిని తెలిపే ప్రత్యయం. దఘ్నార్థకం. నిర్వ.రా. 3.63.

బంటివారు అ.క్రి. లోతగు.

బంటు వి. 1. దండనాయకుడు. సేనాని. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 140. క్రీ.శ. 1143 ; 2. భృత్యుడు, పరిచారకుడు. కు.సం. 6.17 ; 3. శూరుడు, పరాక్రమ శాలి. భార.భీష్మ. 1.99 ; 4. భక్తుడు. పారి. 1.49 ; 5. యోధుడు, జోదు. యయా. 1.30 ; 6. శిష్యుడు. యయా. 3.130.

సం. భట-, వంఠ-, సేవకుడు ; ప్రా. వంఠ. భృత్యుడు, దాసుడు, భట ; అ.మా. భడ.

క. బటు, బంట, బంటు ; తు. బంటు, బంటె ;

<సం. భట-.

బంటరి వి. శూరుడు. శుక. 1.77. <బంటు + -అరి. బంటుతీకము వి. దాస్యం. సిం.ద్వా. 2.178. బంటుగూటము వి. ఎద్దును విప్పి అదే ఎత్తులో నిండుబండి నిలపటానికి ముందు నొగకింద పోటే పెట్టే కొయ్య. బంటుచేయు స.క్రి. సేవకునిగా చేయు. పాండు. 4.304. బంటుజీవు(డు వి. దాసుడు, సేవకుడు. బంటుతనము వి. పరాక్రమం. భార. విరా. 1.223. బంటుపంతము వి. సేవకుని పట్టుదల.

బంటుపడి వి. బంటుపై విధింపబడే పన్ను లేక బంటు చెల్లించే పన్ను. నె.గా. కందుకూరు శాసనం. 18. క్రీ.శ. 1408. బంటుబంటగు అ.క్రి. వక్రమగు, లోబడు. <బంటు+బంటు+అగు. బంటుబద్ద వి. 1. అల్లకంలో పైనగాని కిందగాని వేసిన ఒక్క బద్ద; 2. ఇంటి కప్పు వేయటంలో వాడే పలచని చెక్క. బంటుమెకము వి. పంది. బంటురువ్వ వి. లంకె వాసాల మీద వేసే వెదురు వాసం. బంటువాఁడు విశే. సేవకుడు, బంటు. విప్ర. 5.61.

బంట్రవతు రూ.చూ. బంట్రౌతు. వి. సేవకుడు.

బంట్రవుతు రూ.చూ. బంట్రౌతు. వి. సేవకుడు, నౌకరు.

బంట్రోతు రూ.చూ. బంట్రౌతు. వి. సేవకుడు.

బంట్రౌతు రూ. బంట్రవతు, బంట్రవుతు, బంట్రోతు. వి. సేవకుడు, నౌకరు. కవిరా. శ. 181, కువ.చ. 2 109.

సం. రాజపుత్ర-. రాకుమారుడు; ప్రా. పఁటుగ-, పంతు, రాయఉత్త, రాఉత్త. రాజకుమారుడు; ఒ. బాంటు-, ఉఉత. సేవకుడు; హిం.ఉ. బంట్రౌత్. నౌకరు; గు. వాంటోరాఉత్. సేవకుడు; మరా. వాంటా-రాఊత. పంపకం చేసే వారు, వాంటా. భాగం, రాఊత. యోధుడు.

<ఉ. బంట్రౌత్.

బంట్రౌతుతనము వి. శూరత్వం. ఇందు. 4 53.

బండ¹ వి. 1. పల్లపునేల, దాపు. ద.హిం గా. సంపు. 5. గా.సం. 1151. క్రీ.శ. 1305; 2. విశాలమైన శిల, దాప రాయి, రాయి. ద.హిం.గా. సంపు. 6. గా.సం. 242. క్రీ.శ. 1427; 3. పెట్టకోళలి, పెన్నులేని కోళలి; 4. నర్సే టప్పుడు వాటలో పెల మోపుగా పట్టుకొనే గుండ్రని రాయి; 5. గంజి, అంబలి మొ. వాటిలో పదును తగపటానికి పరిచిన రాయి; 6. కోడుగోలరు; విశే. 1. బుద్ధిహీనుడు, మందుడు, చదువులేని వాడు. పండి.చ. 2.137; 2. మొద్దు కిరినది.

క. బణ్డె. రాయి, దాపరాయి.

బండకప్పు వి. వాసాలమీద రాళ్ళు పరిచి సున్నంతో అతికి వేసిన కప్పు. బండకర్ర వి. చేలోని చెట్లను వేళ్ళతో కూడా పెళ్ళగించే పని ముట్టు. బండకురమ వి. దీర్ఘ వ్యాధిగా నిలిచిపోయే కురుపు. బండకెత్తు అ.క్రి. మొండి కెత్తు, ఆకతాయి అగు. <బండ¹+-కన్+ఎత్తు¹. బండకొమ్ము వి. లావుగా ఉండే కొమ్ము. బండకొయ రూ.చూ. బండకొయ్య. వి. 1. కోడెను వేసినప్పుడు ఎడికోల కొన అరిగిపోకుండా అడుకు వేసిన కొయ్య ముక్క; 2. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి కట్టే బందం. 3. దొంగ గొడ్డు మెడకు వేలాడగట్టే బరువుకొయ్య. బండకొయ్య రూ. బండకొయ, బండగొయ్య. వి. 1. కోడెరు వేసినప్పుడు ఎడికోల కొన అరిగిపోకుండా అడుకు వేసిన కొయ్య ముక్క; 2. దొంగ గొడ్డు పరుగెత్తకుండా కాలికి కట్టే బందం; 3. దొంగ గొడ్డు మెడకు వేలాడగట్టే బరువు కొయ్య. బండకోపుమతి వి. మోకాలి వెనకభాగంలో ఉండేది. బండగు¹ అ.క్రి. విస్ఫారమగు. <బండ¹+అగు. బండగొయ్య(-కొయ్య) రూ.చూ. బండకొయ్య. వి. 1. మోటబొక్కెన పైన మోకు తగిలించే ఇనపరింగు; 2. దొంగగొడ్డు పరుగెత్తకుండా కాలికి కట్టే బందం; 3. దొంగగొడ్డు మెడకు వేలాడ గట్టే బరువుకొయ్య. బండచంక వి. పైభాగం చిన్నదిగా ఉండి, దన్ను పొడుగ్గా ఉండే పొదుగు. బండచాకిరి వి. అరవచాకిరి. బండచింత వి. ఒక జాతి చింతచెట్టు. హంస. 4.11. బండఁడు¹ విశే. బుద్ధి హీనుడు, మందుడు. పండి.చ. 2.101. బండతనము వి. మొండితనం. ఉ.హరి. 1 86. బండతల వి. బట్టతల, జుట్టులేని తల. కు.సం. 8.185. బండపని వి. మోటుపని. బండపరుపు వి. వాసాలమీద రాళ్ళు పరిచి సున్నంతో అతికి వేసిన కప్పు. బండపాకర రూ.చూ. బండపాకుడు. వి. పెసర రంగులో ముదురు పన్నె. బండపాకుడు రూ. బండపాకర. వి. పెసర రంగులో ముదురు పన్నె. బండబాఱు(-పాఱు) అ.క్రి. మొద్దుబారు. బండబొగ్గు వి. భూగర్భం నుంచి తవ్వి తీసిన బొగ్గు. బండమద్ది వి. ఒకరకం మద్ది చెట్టు (Morinda tinctoria). బండరాయి రూ. బండురాయి. వి. పెద్ద రాయి. బండరొమ్ములు వి.బ.వ. మగవాని రొమ్ములాగ ఉన్న స్త్రీ రొమ్ములు. బండవాఁడు¹ విశే. 1. అడుక్కునే వాళ్ళల్లో ఒకరకం, రాయి ఎత్తుకొని వచ్చి అడుక్కునే వాడు; 2. కఠినుడు. బండవెవసాయము వి. మోటు వ్యవసాయం. సం. వ్యవసాయ-. పని. <బండ¹+సం. వ్యవసాయ-. బండసంసారము వి. పాడు సంసారం. బండార్చి వి. పైభాగం బల్లపరుపుగా ఉండే అర్చి. <బండ¹+అర్చి.

బండ² రూ. బండు. వి. ఘోరకృత్యాలు చేసి ఓప్పుమెత్తే ఒక నీచ జాతి. విజ్ఞా. 2.116; విశే. ఆకతాయి. జైమినిభా. 8 ఆ.

క. బణ్డు. సిగ్గులేని తనం, పోకిరితనం. బణ్డ. సిగ్గులేని, అగౌరవమైన, పోకిరి. బణ్డగ, బణ్డతన, బణ్డుతన. సిగ్గులేనితనం, చెడునడత; కొడ. బణ్డె. సిగ్గులేనివాడు, బణ్డతి. సిగ్గులేనిది, బణ్డతన. సిగ్గులేని తనం; తు. భణ్డు. అనర్థత, బందతనం, భండ, అనర్థం, భణ్డె. పోకిరివాడు; త. వణ్డు. తక్కువ. హీనమైన ప్రవర్తన. వణ్డన్. దుష్టుడు. వణ్డత్తనమ్. దుష్టత్వం, వణ్డై. అనర్థమైనది; కో. వన్. స్త్రీ విచ్చలవిడి ప్రవర్తన. వన్ మొగ్. లంజకొడుకు. బఙ్గోవ్. పోకిరితనం, కామాతురత, పెంపుడు జంతువులు: తో. పాడ్ మొక్స్. లంజకొడుకు;

సం. షండ-. పోకిరివాడు; ప్రా. షండ-. నటజాతి, సిగ్గులేనివాడు; చూ. మరా. భండ్. బహిరంగ అవమానం.

<క. బణ్డ.

బండసుఁడు వి. ఆకతాయి. జైమినిభా. 8.212. బండమంచ వి. ఒకానొక తిట్టు. బండఁడు² విశే. ఆకతాయి. బండతిట్లు వి.బ.వ. బండబూతులు, బండజాతివాళ్ళు తిట్టుకొనే తిట్లు. ఆము. 6.20. బండబూతులు రూ. బండు బూతులు. వి.బ.వ. పచ్చిబూతులు, బండవాళ్ళు తిట్టుకొనే బూతులు. బండమపిషి వి. 1. మొరటు పట్టుదల గల

మనిషి ; **2.** సిగ్గులేనివాడు. బదంవాడు[1] విశే. పీనుగు.
బండాట రూ.చూ. బండాటము. వి. ఆకతాయితనం.
బండాటము రూ. బండాట. వి. ఆకతాయితనం. కవిక. **4.95.** < బండ[2] + ఆట + -ము. **బండెర** వి. బందజాతి ఆవది. పండి.చ. 2.115.

బందసు[2] చూ. బందు.

బందసు[3] వి. బోను, పక్షుల్ని జంతువుల్ని పట్టటానికి వాడే సాధనం. చంద్రభా. 2.21.

బందగి వి. **1.** డేగ, వేటగాడు పశు పక్ష్యాదుల్ని పట్టుకోవటానికై పెంచిన మృగం పక్షి మొ.వి. కు. సం. **4.23** ; **2.** వేటగాళ్ళు మృగాలు మొ.వాటిని పట్టుకోవటానికి ఉపయోగించే కపటయంత్ర విశేషం. వరాహ. **4.71.**

బందము వి. వస్తువు. దినుసు. విజ్ఞా. 2.78.

సం. భాండ-. పాత్ర, పేటిక, పరికరం, సాధనం, వస్తువు, వాణిజ్యవస్తువు ; ప్రా. భండ-, భడగ-. పాత్ర ; అ.మా. భండ- ; పా. భండ-. వాణిజ్యపు దినుసు, వస్తువు, సాధనం ;

క. బండ. పెట్టుబడి, ఆస్తి, దినుసులు ; తు. బండ. పెట్టుబడి, ఆస్తి, దినుసులు.

< ప్రా. భండ-.

బందరము రూ.చూ. బండారము. వి. కోశాగారం.
బందరి రూ.చూ. భండారు. వి. కోశాధికారి. పండి.చ. **5.381.**
బందరు రూ.చూ. బండారము. వి. **1.** బండారం, కోశాగారం. పండి.చ. **5.382** ; **2.** కోశాధికారి.

బందరుకవిలె వి. ఖజానా లెక్కల పుస్తకం. బసవ. **5.137.**

బందరుయు చూ. బండారము. వి. కోశాధ్యక్షుడు.
బందరువు రూ.చూ. బండారము. వి. **1.** కోశాగారం, ధన గృహం, బొక్కసం. పండి.చ. **3.269** ; **2.** కోశం, బొక్కసం. పండి.చ. **1.3.**
బందవలము రూ.చూ. బండాలము. వి. **1.** నంచి మొదలు, మూలధనం. ఆము. **4** ; **2.** సామర్థ్యం.
బందవాలము రూ.చూ. బండాలము. వి. మూలధనం.
బండాట చూ. బండ[2].
బండాటము చూ. బండ[2].
బండారపుటిల్లు చూ. బండారము.
బండారము రూ. బందరము, బందరు. బందరువు. బండారు[2], బండారువు, భండారువు. వి. **1.** కోశాగారం, బొక్కసం. తార సరా. 1.47 ; **2.** కోశాధిపతి, భాండాగారాధిపతి. ద.హిం.శా.సంపు. 6. శా.సం. 181, క్రీ.శ. 1160 ; **3.** ధనం. బసవ. **3.11** ; **4.** రహస్యం, లోగుట్టు ; **5.** మూలధనం ; **6.** సామర్థ్యం ; **7.** పట్టమట్టి ; **8.** గ్రామ దేవతల ప్రసాదంగా ఇచ్చే కుంకుమ.

క. బండార ; తు. బండార ; మ. పండారం ; ఒర. భండార్. జమీందారుగారి ఉగ్రాణం.

బండారపుటిల్లు వి. కోశగృహం, ధనాగారం. ఉ. హరి. 2.171. < బండారము + ఇల్లు. **బండారముబయటపడు** అ క్రి. గుట్టు వెల్లడి అగు.

బండారి[1] రూ.చూ. భండారు. వి. కోశాధ్యక్షుడు. బసవ. 2.618.
బండారి[2] రూ.చూ. బండారు[3]. వి. సాగర తీరారణ్యాల్లో పెరిగే చాలా పెద్దచెట్టు.
బండారిలు చూ. బండారు[2].
బండారిల్లు చూ. బండారు[2].
బండారు[1] రూ. బండారు[1], బండరి[2]. వి. **1.** పసుపు, హరిద్ర, రాతిమీద రాని పూసుకొనే పసుపు. కాశీ. 7.230 ; **2.** వృక్ష విశేషం, ఒకజాతి చెట్టు. రాజవా. 2.70 ; **3.** గ్రామ దేవతలకు పెట్టిన కుంకుమ.

బండారుకంచుడు వి. బండారు పోసి పెట్టిన మూకుడు. బండారుపిచ్చిక రూ.చూ. బండారుపిచ్చుక. వి. పీతముండం, పచ్చతల పిచ్చుక. బండారుపిచ్చుక రూ. బండారుపిచ్చిక. వి. పచ్చని తల కలిగిన పిచ్చుక. బండారుమూకట రూ.చూ. బండారుమూకుడు. వి. బండారు పోసి పెట్టిన మూకుడు. బండారుమూకుడి రూ.చూ. బండారుమూకుడు. వి. (బండారు చిప్పలో) బండారు పెట్టుకొనే మూకుడు. బండారుమూకుడు రూ. బండారుమూకట, బండారుమూకుడి. వి. బండారు చిప్ప. బండారు పెట్టుకొనే మూకుడు. బండారురోగం వి. ఆకులు ఎండిపోయే తెగులు. బండారుసిప్ప (-చిప్ప) వి. జాతర్లలో గడాదార్లకు బొట్టు పెట్టటానికి కుమ్మరి సెట్టి పట్టుకొనే బండారు ఉంచిన మూకుడు.

బండారు[2] రూ.చూ. బండారము. వి. ధనం.

బండారిలు రూ. బండారిల్లు. వి. కోశాగారం. ఆము. 4.238. బండారిల్లు రూ. చూ. బండారిలు. వి. కోశాగారం.

బండారు[3] రూ. బండారి[2]. వి. గృహాది నిర్మాణాలకు వ్యవసాయ పరికరాల తయారీకి ఉపయోగించే కలప నిచ్చే ఒకరకం చెట్టు (Adina cordifolia).

బండారుకర్ర వి. గట్టిగా ఉండే ఒక చెట్టు కలప (Adina cordifolia).

బండారు[4] వి. దూదిప్పచెట్టు (Hymenoclictyon excelsum).
బండారుయు వి. బ్రెల కాపరి.
బండారువారు విశే.బ.వ. దేవుని ఉగ్రణాధికారులు. ద.హిం. శా.సంపు. 5, శా.సం. 1214, క్రీ.శ. 1309.
బండారువు రూ.చూ. బండారము. వి. బొక్కసం. కు.సం. 10.32.
బండార్చి చూ. బండ[1].
బండాలము రూ. బందవలము, బందవాలము, బండాళము. వి. **1.** సంచి మొదలు, మూలధనం. ఆం.భా. **2.367** ; **2.** సామర్థ్యం ; **3.** రహస్యం.

సం. భాండవాల-. మూలధనం ; ప్రా. భండవాల- ; మరా. భాండవల. పెట్టుబడి ధనం.

క. బండవల, బండవాల, బండవాలు, బండవాళ, బండవాళు. మూలధనం ;

< ప్రా. భండవాల-.

బండాళము రూ. చూ. బండాలము. వి. **1.** సొమ్ము ;

2. మూలధనం.

బండి వి. 1. శకటం. ద. హిం. గా. నంపు. 5. గా. నం. 116 క్రీ.శ. 1248 ; 2. రథం. కు. హరి. 2 31 ; 3. ఇరవై బస్తాలు ; 4. రైలు మొ. ప్రయాణసాధనం ; 5. మోటబావి గిలక ; 6. గుమ్మటంలాంటి పనిముట్టు ; 7. గంటానికి బిగించిన కీలు దారపుబండి ; 8. దబ్బారాట్నం చక్రం బిగింపుకు వేసే కొయ్య బిళ్ళ.

క. బంటి. బండి, రథం, చక్రం ; తు. బండి, ఘండి. బండి ; త. వణ్టి. బండి. పెద్దబండి, రథం, వణ్టి. బండి మీద మోసుకెళ్ళే సరుకు, వణ్టిల్. బండి, రథం, చక్రం ; మ. వణ్టి, వణ్టిల్. రథం, చక్రం ; కో. వణ్డ్య. బండి ; తొ. పాడ్య. ఎడ్లబండి ; కొలా. బణ్టి. సరుకులు మోసే ఎడ్లబండి ;

చూ. సం. ఘంటి-. బండి ; ప్రా. ఘంటి, ఘండిఅ ; మరా. బండి.

బండిఅకు రూ. బంఢేకు. వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద. బండికట్టు వి. బండిచక్రం చుట్టూ బిగించిన ఇనపకట్టు ; అ. క్రి. బండిని ప్రయాణానికి సిద్ధంచేయు. బండికట్టుతీగ వి. తోలుక్రలకుపయోపడే ఒకరకంతీగ (Combretum ovalifolium). బండికడ్డీలు వి.బ.వ. వంకర టింకరగా ఉండి గుంజలుగ పాతటానికి అక్కరకు వచ్చే కర్రలు. బండికంత వి. వామిదొడ్డిలోకి బండి పోవటానికి ఏర్పరిచిన తోవ. బండికమ్మి వి. బండిచక్రం. శుక. 2.113 ; 2. రథచక్రనాభి. బండికంటి నడిమిరంధ్రం. ఆం. భా. 2.202 ; 3. దాయమేకు. బండికర్ర వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. బండికలు రూ. బండికల్లు. వి. బండిచక్రం, రథచక్రం. కాశీ. 1.77. బండికల్లు రూ.చూ. బండికలు. వి. బండిచక్రం, రథచక్రం. బండికల్లుచూపాయి వి. గంధ్రనిరూపాయి. బండికుచ్చు వి. మరమగ్గంలో ఒకపొరుగులోంచి మరొక పొరుగులోకి నాడెను పెట్టటానికి చేత్తో లాగ్గను గుంజే పిడి. బండికుండ వి. పెదకోలను మోసే కొయ్యచక్రం. బండికుంతలకర్ర రూ. బండికుంట్లుకర్ర. వి. నేతపడుగు బిర్రు పెట్టటానికి మలగర్రకు అవతల అల్లుచేసేటప్పుడు కట్టినవంకర కట్టె. బండికుంట్లుకర్ర రూ. చూ. బండికుంతలకర్ర. వి. నేత పడుగు బిర్రుపెట్టటానికి మలగర్రకు అవతల అల్లుచేసేటప్పుడు కట్టిన వంకరకట్టె. బండికుంపటి వి. ఒకచోటినుంచి ఒకచోటికి తీసుకొని పోవటానికి వీలైన ఒకవిధమైన కుంపటి, బంగల. ఆం. భా. 2.241. బండికుంబము రూ. బండికుంభము. వి. ధర్మరాజుల తిరునాళ్ళలో బకాసుర వధనాడు, బండిని అలంకరించి భీముడు బండితోలుకుంటూ రాగా ఇంటింటా అన్నం ముక్కెరలో పోస్తారు. సాయంకాలం కాగానే ఆలయమైదానంలో బకాసురుడు వచ్చి భీమునితో కలియబడి వధించబడే ఈ ఉత్సవాన్ని బండికుంబ మంటారు. బండికుంభము రూ.చూ. బండికుంబము. వి. ధర్మరాజుల తిరునాళ్ళలో బకాసుర వధనాడు బండిని అలంకరించి భీముడు బండితోలుకొంటూ రాగా ఇంటింటా అన్నం ముక్కెరలో పోస్తారు. సాయంకాలం కాగానే ఆలయ మైదానంలో బకాసురుడు వచ్చి భీమునితో కలియబడి వధించబడే ఈ ఉత్సవాన్ని బండికుంబం అంటారు. బండిగజెం రూ. బండిగెజెం. వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. బండిగాపు వి. పెదకోలను మోసే కొయ్య చక్రం. బండిగిల్లు అ. క్రి. 1. కడగండ్లపడు, కష్టాలనుభవించు ; 2. బండికలకిందగు, బోల్తాపడు. బండిగురిగింజ రూ.చూ. బండిగుర్వెంద. వి. బండిగుర్వెందపూస. ఉ.రా. 6.26, హంస. 4.10. బండి గురింగ రూ. చూ. బండిగురువెంద[1]. వి. గృహాది నిర్మాణాలకుపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Adenanthera pavonina). బండిగురివెంద[1] రూ. చూ. బండి గురువెంద[1]. వి. గృహ నిర్మాణాలకుపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Adenanthera pavonina). బండిగురివెంద[2] రూ.చూ. బండిగుర్వెంద. వి. మాధవి, ఒకజాతి గురివెంద. బండిగురుగింజ రూ.చూ. బండిగురువెంద[1]. వి. గృహాది నిర్మాణాలకుపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Adenanthera pavonina). బండిగురువెంద[1] రూ. బండిగురింగ, బండిగురివెంద[1], బండిగురుగింజ. వి. గృహాది నిర్మాణాలకుపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Adenanthera pavonina). బండిగురువెంద[2] రూ.చూ. బండిగుర్వెంద. వి. మాధవి, ఒకజాతిగురివెంద. ఆం. భా. 2.52. బండిగుర్వెంద రూ. బండిగురిగింజ, బండిగురివెంద[2], బండిగురువెంద[2]. వి. మాధవి, ఒకజాతి గురివెంద. ప్రభు. 2.18ప. 8పం. (Dalbergia volubilis). బండిగూటం వి. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగకింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం. బండిగెజెం రూ.చూ. బండిగజెం. వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. బండిగోము వి. పెదకోలను మోసేకొయ్య చక్రం. బండిచిప్ప వి. రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య దోర్లించి కట్టినచిప్ప. బండిచువ్వ వి. రాటితిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. బండిచెక్రం వి. 1. బదువకట్టిన అంచుపేటు దారాలు తగిలించే కొయ్యగిలక ; 2. పెదకోలను మోసేకొయ్య చక్రం. నం. చక్ర-. చక్రం. బండిచెయుసు వి. బండికి దొప్ప వేసి బిగించే తాడు. బండిచబ్బ వి. రాటికిపైనా కిందా కట్టిన వెదురుబద్ద. బండిదారం వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు కర్రలకు కట్టేపరిదారం. బండిదుత్త వి. ప్రయాణంలో ఎడ్లకు దానా పెట్టటానికి ఉలవలు ఉడకబెట్టి బండికి కట్టుకొని తీసుకొని పోవటానికి వాడే మట్టిపాత్ర. బండిదొడ్డి వి. బళ్ళునిలిపేచోటు. బండినాగేలి వి. బండిపోలుగర్రకు కాడి కట్టేవైపు అడుగున వేసిన కొయ్యముక్క. బండిపంటి వి. గుమ్మటం లాంటి పనిముట్టు. బండిపులి వి. ఒకజాతి పులి. చంద్రాంగ. 2.42. బండిపల్ల వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద ; 2. రాటిఆకులను కలిపే నిలువ పల్ల. బండిపేరిపిట్ట వి. బటువగువ్వ. చక్రవాకం. బండిబాటు వి. రథసారథి. శాల్య. నం. 5.298. బండిబరువు వి. ఆపనం. బండిబరువు మోసేది. ఎద్దు. బండిబాట వి. ఘంటాపథం. రాజమార్గం. ఆం. భా. 2.9. బండిబాటచేయు న.క్రి. అష్ట

చేకుండా చేయు. శాశ్వ. సం. 5.287. బండిబారు వి. రథసైన్యం. కకుత్స. 5.164. బండిబిల్ల వి. మట్టిపాత్రలకు పూజలు వేయటానికి వాడే చక్రాకారపు చిన్న కర్రచ్చు. బండిబుర్ర వి. 1. ప్రయాణంలో ఎద్దుకు దానా పెట్టటానికి ఉడికించిన ఉలవల్ని పోసుకొని బండికి కట్టుకొని పోయే మట్టిపాత్ర ; 2. చక్రంయొక్క ఆకులు చేరేచోటు. కుంద. బండిబోయుడు వి. సారథి, రథచోదకుడు. బండిబోరెం వి. బండ్లమీద ధాన్యం తోలటానికి గాని ఎరువు తోలటానికి గాని వాడే జనపనార పట్టా. బండిమీదపోవు అ.క్రి. తొందరపడు. పాండు. 4.167. బండిముద్ద వి. రాటి తిరగటానికి రాటినూలానికి ఆధారంగా ఉన్న కొయ్యమొద్దు. బండిమురుగుడు రూ. చూ. బండి మురుదుడు. వి. ఒకరకం తీగ (Calycopteris floribunda). బండిమురుదుడు రూ. బండి మురుగుడు. వి. ఒకరకం తీగ (Calycopteris floribunda). బండి మూలపడు అ.క్రి. శక్తి ఉడిగిపోవు. బండిమొగ్గరము వి. శకటవ్యూహం. బండిమొద్దు వి. రాటి తిరగటానికి, రాటి నూలానికి ఆధారంగా ఉన్న కొయ్య మొద్దు. బండి రక్కసుడు వి. శకటాసురుడు. బండిరిక్క వి. రోహిణీ నక్షత్రం. బండిరేఫ వి. శకటరేఫ, ఱకారం. బండిరేవు వి. నదిలో బళ్ళు మొ. వాటిని దాటేరేవు. బండిరొట్టి వి. ఒకరకమైన పశుగ్రాసం. బండిలాకి వి. రాటిపైనా కిందా కట్టిన వెదురుబద్ద. బండివంకి వి. బండిదారి. నె.శా. కావలి. 39. క్రీ.శ. 1207. బండివాడు విశే. బండితోలే వాడు. బండిసున్న వి. 1. బండిచక్రం అంత సున్న, పెద్ద సున్న ; 2. ఏమీ తెలియకపోవటం, సంపూర్ణాజ్ఞానం. బండిసూల వి. రాటి తిరగటానికి ఆధారంగా ఉన్న ఇరుసు. బండెంఠ వి. బండిచక్రం. బండ్రేకు రూ.చూ. బండిఆకు. వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురు బద్ద. బండ్రేటి వి. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. బండ్రేటితాడు వి. కాడిని పోలుగర్రకు కలిపి కట్టే తాడు. బండ్లకల్లులు వి.బ.వ. బాలక్రీడా విశేషం. హంస. 3.146.

బండు రూ.చూ. బంద². వి. 1. అవమానం, పరిహాసం. కాశీ. 7.70 ; 2. ఆకతాయితనం ; 3. ఆకతాయిమాట ; 4. రోత ; 5. బురద. విశే. అసభ్యమైన.

బండగు² అ.క్రి. 1. పటాపంచలగు. శాశ్వ.సం. 8.164 ; 2. బద్దలగు. శాశ్వ.సం. 11.3. బా. 24 ; < బండు + అగు. బండుగరుసు(-కరుసు) స.క్రి. ఒకరి తప్పుల్ని ఎత్తి చూపి తిట్టు. బండుతిట్టు వి. మోటు తిట్టు. బండుబాగోతము వి. 1. పచ్చిబూతు కూతలు ; 2. అధికమైన హల్లా. బండుబూతులు రూ.చూ. బందబూతులు. వి.బ.వ. పచ్చి బూతులు, బందవాళ్ళు తిట్టుకొనే బూతులు. బండుసేయు (-చేయు) అ.క్రి. 1. అల్లరిచేయు. కాశీ. 7.70 ; 2. బద్దు చేయు, ఆరడిచేయు. శాశ్వ.సం. 3.446 ; 3. పాడుచేయు.

బండుంఠ చూ. బండి.

బండురాయి రూ.చూ. బందరాయి. వి. పెద్దసైజురాయి.

బండెక చూ. బంద².

బండ్రేకు చూ. బండి.

బండ్రేటి చూ. బండి.

బండ్రేటితాడు చూ. బండి.

బండ్లకల్లులు చూ. బండి.

బణ్ణము వి. కొత్త ఇత్తడి పాత్రల సమూహం.

బణ్ణసరము రూ.చూ. బన్నసరము. వి. 1. హారం, హార విశేషం. ద్వి.పరమ. వి. 4.274 ; 2. పలువిధాలైన మణులుగుచ్చినహారం.

బతము వి. వ్రతం. కా. 3.51.

సం. వ్రత-. మతపరమైన విధి ; ప్రా. వత-, వద-, వయ-. నియమం ; అప. వయ- ; పా. వత-, వత్త-. క. బత, వ్రత ; త. విరతమ్.

< ప్రా. వత-.

బతాయి వి. వంటఇంట్లో ఉపయోగించే దారుగిన్నె, బత్తేవియా దేశానికి చెందిన పాత్రకావచ్చు.

బతావనీ వి. 1. పట్వారీ లెక్కలలో సరిచూచుకోవటం ; 2. కొలకుండల హెచ్చు తగ్గులను సరిచూచుకోవటం.

బతాసాకురుబూజా చూ. బత్తాను. వి. నీరింకిన వాగుల్లో సాగు చేసి పండించే తీగపైరు (Citrullus vulgaris).

హిం.మరా. బతాసా, పంచదారతో చేసే ఒకరకం మిఠాయి ;

క. బత్తాసు.

బతికించు చూ. బతుకు¹.

బతికేకంప చూ. బతుకు. వి. కంచె మొక్కగా వాడే మొగలి మొ. వి.

బతిపి వి. ఒకరకం పట్టుబట్ట. కవిక. 3.195.

బతిమలాడు చూ. బతిమాలు. స.క్రి. బతిమాలు.

బతిమాలిక చూ. బతిమాలు.

బతిమాలించు చూ. బతిమాలు.

బతిమాలించుకొను చూ. బతిమాలు.

బతిమాలు రూ. బ్రతిమాలు. స.క్రి. అనునయ పూర్వకంగా గాని దైన్యంతో గాని అడుగు, ప్రార్థించు. లాలనచేయు. దార.ఉద్యో. 2.216.

బతిమాలిక వి. బతిమాలటం. బతిమాలించు స.క్రి. ప్రే. బతిమాలేట్లు చేయు. < బతిమాలు + -ఇంచు³. బతిమాలించుకొను స.క్రి. ఇతర్లు తనని బతిమాలేటట్లు చేసుకొను. బతిమాలుకొను స.క్రి. దైన్యంతో వేడుకొను. బతిమాలుచు రూ. బతిమాల్చు. స.క్రి. బతిమాలచేయు. రామాభ్యు. 8.230. బతిమాల్చు రూ.చూ. బతిమాలు. స.క్రి. బతిమాల చేయు.

బతిమాల్చు చూ. బతిమాలు.

బతిమి రూ.చూ. బ్రదిమి. వి. బతుకు.

బతిమిపట్టు స.క్రి. బతిమాలు. శాశ్వ.సం. 16.2 69.

బతుకు¹ రూ.చూ. బ్రదుకు. అ.క్రి. జీవించు.

బతికించు రూ.చూ. బ్రదికించు. స.క్రి. జీవింపచేయు, బ్రతికేటట్లుచేయు. నీలా. 1.22, విజయ. 2.144. < బతుకు¹ + -ఇంచు³.

బతుకు² వి. సర్కారు జిల్లాల్లోని చెమ్మగాలి తగిలే పర్వత ప్రాంతాల్లో పెరిగే చిన్న చెట్టు (Heattleaved laige

sebestens).

బత్త వి. కలపనిచ్చే ఒకరకం చెట్టు (Baningtonia acutangula).

బత్తకరవ రూ. బత్తగనప. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Stephegyne parvifolia).

బత్తగనప రూ.చూ. బత్తకరవ. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు. (Stephegyne parvifolia).

బత్తడి రూ.చూ. బత్తడిక. వి. అమ్ములపొది.

బత్తడిక రూ. బత్తడి, బత్తళి, బత్తళిక. వి. అమ్ములపొది. నృసింహ. 2.74.

బత్తము¹ రూ.చూ. బత్తా. వి. ప్రతిదినం రాబడిగా వచ్చే భత్యం. రుక్మా.చ. 3.62.

బత్తము² రూ.చూ. బొత్తాము. వి. బొత్తాను, గుండీ.

బత్తల వి. నగ్నం.

క. బత్తలె, బెత్తలె. దిసమొల.

<క. బత్తలె.

బత్తళి రూ.చూ. బత్తడిక. వి. అమ్ములపొది.

బత్తళిక రూ.చూ. బత్తడిక. వి. అమ్ముల పొది. కవి. సంజీ. 1.46.

బత్తా రూ. బత్తము¹, బత్తియము, బత్తెము¹, బత్యము¹, భత్తా, భత్తెము. వి. 1. ప్రతిదినం రాబడిగా వచ్చే ధాన్యాది భోజన రసవర్గం. నె.గా. పొదిలిశాసనాలు. 18. క్రీ.శ. 1369 ; 2. ఉద్యోగులకు తిండికి ప్రతిదినం ఇచ్చే అలవెన్సు.

సం. భృతక-. రోజుకూలివాడు. భృత్యా. కూలివాడికి ఇచ్చే సొమ్ము. భక్త. అన్నం ; ప్రా. భత్త-. భోజనం, అన్నం ; అ.మా. భత్త-. జీవితం, బహుమతి ; పా. బతక-. కూలివాడు ; హిం. భత్తా. వేతనం, ప్రయాణపు ఖర్చు మొ. వి ; మరా. భత్తా. నిర్ణీత వేతనానికంటె ఎక్కువ పనికి ఇచ్చే డబ్బు.

<ప్రా. భత్త-.

బత్తాము రూ.చూ. బొత్తాము. వి. గుండీ.

బత్తాయి వి. 1. బటావియా దేశంనుంచి వచ్చిన ఒకజాతి నారింజ సాత్కుడి ; 2. గజనిమ్మపండు ; 3. చీని (Citrus sinensis).

బత్తాయినారింజ వి. బటావియా ద్వీపంనుంచి వచ్చిన ఒకరకం పండు.

బత్తాసంఅరటి రూ. బత్తీసుఅరటి. వి. కూరకు పండ్లకు గూడా ఉపయోగించే రకం.

బత్తాసు రూ.చూ. బొత్తాము. వి. 1. ఒకవిధమైన ఆకారంకల వస్తువు ; 2. స్టడ్ ; 3. గుండీ ; 4. అర్ధచంద్రాకారపు వస్తువు ; 5. పిండి చక్కెరలో కలిపి పాగుచేసి బిళ్ళలుగా చేసిన తినుబండారం.

బత్తి¹ రూ.చూ. వత్తి. వి. పేలుడు మందును ముట్టించే తాడు.

బత్తిదాక వి. అగరువత్తులు ముట్టించి పెట్టటానికి ఉపయోగపడే చిన్న మట్టిదిమ్మ.

బత్తి² రూ.చూ. బత్తీ². వి. పన్నె పల్లలు చీల్చే కత్తిని పదును పెట్టే సున్నపురాయి.

బత్తి³ వి. భక్తి, విరాళి. పండి.చ. 4.49, 50.

సం. భక్తి-. విరాళి, భక్తి ; ప్రా. భత్తి. సేవ, వినయం, ఆదరం ; శౌ. జై.మహా. అ.మా. మా. పా. అప. భత్తి.

<ప్రా. భత్తి.

బత్తిపోవు అ.క్రి. పనికిరాకుండాపోవు. బత్తిపేయు అ.క్రి. భక్తి కలిగిఉండు.

బత్తియము రూ.చూ. బత్తా. వి. భత్యం, కయిజీతం.

బత్తీ¹ రూ.చూ. వత్తి. వి. దీపంవత్తి.

బత్తీ² రూ. బత్తి². వి. పన్నె పుల్లలు చీల్చే కత్తిని పదునుపెట్టే సున్నపురాయి.

బత్తీస రూ. బత్తీసు. విశే. ముప్పైరెండు. పండి.చ. 4.149 పం. ; వి. ఒకరకం అరటి.

హిం. బత్తీస్. ముప్పైరెండు ; మరా. బత్తీస్. ముప్పై రెండు.

<మరా. బత్తీస్.

బత్తీసాదిరాగములు చూ. బత్తీసు.

బత్తీసు రూ.చూ. బత్తీస. వి. ముప్పైరెండు.

బత్తీసాదిరాగములు వి.బ.వ. ముప్పైరెండు రాగాలు. సం. ఆది. మొదలైన, రాగ-. స్వరం. <బత్తీసు + సం. ఆది + సం. రాగ- + -ము + -లు. బత్తీసుఅరటి రూ.చూ బత్తాసంఅరటి. వి. కూరకు, పండ్లకు కూడా ఉపయోగించే అరటి. బత్తీసుపురములు వి.బ.వ. ముప్పై రెండు ఊళ్ళు. బత్తీస్‌పేటు వి. మెడలో వేసుకొనే ఒకరకం హారంలో బిళ్ళ మాదిరి డిజైను.

బత్తీస్‌పేటు చూ. బత్తీసు.

బత్తుఁడు వి. 1. భక్తుడు. పండి.చ. 5.290 ; 2. చేతిపనులు చేసి జీవించే జాతుల్లో అయిదుజాతులవాళ్ళు తమ పేరుకు ఉపనామంగా పెట్టుకొనే పేరు. ద.హిం.శా.సంపు. 4.951 ; 3. గ్రామకారుడు. నె.శా. దర్శి. 61. క్రీ.శ. 1729 ; 4. కంసాలివారి పట్టపు పేరు.

సం. భక్త-. భక్తుడు ; ప్రా. భత్త- ; శౌ. జై.మహా. అ.మా. మా. పా. అప. భత్త.

<ప్రా. భత్త-.

బత్తులఇనాం వి. వడ్ల బత్తుల కిచ్చిన మాన్యం.

బత్తులఇనాం చూ. బత్తుఁడు.

బత్తె రూ.చూ. వత్తి. వి. పేలుడు మందును ముట్టించే తాడు.

బత్తెవమెట్టు వి. ఇంటికి వెలపల గోడకు అతికి కట్టిన మెట్టు.

బత్తెము¹ రూ.చూ. బత్తా. వి. ప్రతిదినం రాబడిగా వచ్చే భత్యం.

బత్తెముతీరిపోవు అ.క్రి. చనిపోవు. బత్తెలముంత వి. ధాన్యపు కొలత, 3 సేర్లు.

బత్తెము² రూ.చూ. బత్యము². వి. ఒక పెద్ద మానును తొలిచి పడవగా చేసినది.

బత్తేరి రూ. పతేరి, బత్రి. వి. ముట్టడి దిబ్బ, ఫిరంగులు పెట్టి కాల్చటానికి ఎత్తుగా వేసిన దిబ్బ.

పో. బతేరియా; స్పా. బాతేరియా; తమి. బత్తెరిమ్.

<పో. బతేరియా.

బత్తేలముంత చూ. బత్తెము[1].

బత్యము[1] రూ.చూ. బత్తా. వి. దిన వెచ్చం.

బత్యము[2] రూ.చూ. బత్తెము[2]. వి. ఒక పెద్ద మానుకు తొలిచి పడవగా చేసినది.

బత్రి రూ.చూ. బత్తేరి. వి. ముట్టడి దిబ్బ. ఫిరంగులు పెట్టి కాల్చటానికి ఎత్తుగా వేసిన దిబ్బ.

బదట్టు వి. మరకం.

బదన్ వి. శరీరం.

హిం.ఉ.పార. బదన్. శరీరం.

<ఉ. బదన్.

బదనా రూ.చూ. బదునా. వి. కాళ్ళు చేతులు కడుక్కోవటానికి మసీదుల్లో వాడే చిన్న మట్టిబుడ్డి.

బదనామి రూ. బదనాము, బదనాయము. వి. అవమానం, చెడ్డపేరు, అపఖ్యాతి.

హిం. బద్‌నామీ. చెడుపేరు; మరా. బద్‌నామీ. లోకనింద, అపకీర్తి; ఉ. బద్‌నామీ. అపఖ్యాతి, చెడ్డపేరు; పార. బద్‌నామీ. అపఖ్యాతి, చెడ్డపేరు; అర. బద్‌నామీ. అపఖ్యాతి, చెడ్డపేరు;

క. బదనామి; త. పల్లామి, పత్తునామి.

<ఉ. బద్‌నామీ.

బదనాము రూ.చూ. బదనామి. వి. 1. దారుణ; 2. కష్టం; 3. చెడ్డపేరు; 4. అపఖ్యాతి, కళంకం.

బదనాయము రూ.చూ. బదనామి. వి. 1. దారుణ; 2. సంబంధం; 3. తప్పు; 4. కష్టం; 5. చెడ్డపేరు.

బదనిక రూ. బజనిక, బజనికి, బడినిక, బవనిక, వదనిక. వి. 1. వేరొక చెట్టుమీద మొలిచిన తీగ. తిప్పతీగ. ఆం.రా. 2.54; 2. ఆకుపచ్చలో కలిసిన పసుపుపచ్చ పూలు పూసే ఒకరకం మొక్క (Lorantus scurrula); 3. పల్చని ఆకులు కలిగి పసుపుపచ్చ పూలు పూసి పళ్ళు కాసే ఒకరకం మొక్క (Viscum monoicum).

బదందాక చూ. బాదము. వి. అంచు సన్నగా పెద్దగా ఉండే పెద్ద మట్టిపాత్ర.

బదమస్తు వి. మదోన్మత్తత. విశ్వే.శ.

ఉ. బద్‌మస్త్. సారా తాగటంవల్ల కలిగే వివశత, మదోన్మత్తత; పార. బద్‌మస్త్. మత్తు కలిగిన.

<ఉ. బద్‌మస్త్.

బదర వి. వగులు.

హిం.ఉ.పార. బదర్. బయలు, బయటి ప్రదేశం.

<ఉ. బదర్.

బదరికము వి. పెట్టె. జైమినిభా. 8.56.

సం. బదరికా. రేగు, పత్తి.

బదలా రూ. బదలాయి. వి. బదులు, జవాబు.

హిం. ఉ. బద్‌లా. బదులు, సమానమైనది.

<ఉ. బద్‌లా.

బదలాబదలీచేయు స.క్రి. వినిమయం చేయు.

ఉ. బద్‌లా-, బద్‌లీ. మార్పుచేయటం, వినిమయం చేయటం.

<ఉ. బద్‌లాబద్‌లీ+చేయు.

బదలాయి రూ.చూ. బదలా. వి. రైతులు పరస్పర సహకారంతో చేసే సేద్యం.

బదలాయించు స.క్రి. 1. (ఉద్యోగుల్ని) ఒక చోటనుంచి మరో చోటికి మార్చు, మార్పుచేయు; 2. ఒకదానికి బదులు ఇంకొకటిచ్చు.

హిం. ఉ. బద్‌లానా. మార్చటం.

<ఉ. బద్‌లా (నా)+-ఇంచు[3].

బదలాయింపు వి. 1. మార్పు; 2. బదిలీ.

బదలాయింపు చూ. బదలాయించు.

బదలి రూ.చూ. బదిలీ. వి. ప్రత్యామ్నాయం.

బదలీ రూ.చూ. బదిలీ. వి. ప్రత్యామ్నాయం.

బదాబదలగు అ.క్రి. 1. సంబంధం లేకుండా విడిపోవు; 2. చెల్లాచెదరగు.

సం. వదావద-. ఎక్కువగా మాటలాడే.

<సం. వదావద-+-లు+అగు.

బదాలు చూ. బదాబదలు. వి. పెద్దచినుకులు.

బదిగుడుదారం వి. అచ్చువడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని పెంబడి దూర్చినదారం.

బదిని రూ.చూ. బదునా. వి. కాళ్ళు చేతులు కడుక్కోటానికి మసీదుల్లో వాడే చిన్నమట్టిబుడ్డి.

బదిలి రూ.చూ. బదిలీ. వి. 1. ఉద్యోగుల్ని ఒకచోటినుంచి ఇంకో చోటికి మార్చటం; 2. ప్రత్యామ్నాయం.

బదిలీ రూ. బదలి, బదలీ, బదిలి. వి. 1. ప్రత్యామ్నాయం; 2. ఉద్యోగుల్ని ఒకచోటినుంచి ఇంకోచోటికి మార్చటం.

హిం. ఉ. బద్‌లీ. మార్పు. వినిమయం, ప్రత్యామ్నాయం, ప్రత్యామ్నాయంగా ఏర్పడ్డవాడు;

క. బదిలి. వినిమయం, సహాయం, ప్రత్యామ్నాయంగా ఉంచబడ్డవాడు; త. పతల్, పతిల్, పతిలి.

<ఉ. బద్‌లీ.

బదిలీదారు వి. ప్రత్యామ్నాయంగా నియోగింపబడ్డ ఉద్యోగి.

హిం. ఉ. బద్‌లీదార్. బదిలీచేయబడ్డవాడు.

<ఉ. బద్‌లీదార్.

బదుకు రూ.చూ. బ్రదుకు. అ.క్రి. బతుకు, జీవించు.

బదుగు రూ. బొదుగు. వి. రెండుపొలాలమధ్య ఉండేగట్టు, గనుము.

క. బద, బదు, బదువు, బదుహు. పొలాల్లోవేసిన గట్టు; పో. చూ. తు. బరబు. వరిహద్దు, ఎల్ల; పో. చూ. త. వరంపు. పరిహద్దు, పొలంగట్టు; మ. బరంపు. హద్దు.

<క. బదువు.

బదునా రూ. బదనా, బదిని. వి. కాళ్ళుచేతులు కడుక్కోవటానికి మసీదుల్లో వాడే చిన్నమట్టిబుడ్డి.

బదులిచ్చు చూ. బదులు.

బదులు రూ. బద్లు. వి. 1. మారు. కవి. ర. 3.107; 2. ప్రతి. ఆం. భా. 2.302; 3. అప్పు, చేబదులు, ఎరువు

తీసుకోవటం. అడిదం రామకవి చాటువు; 4. మార్పు.

హిం. బదల్. పరివర్తనం, మార్పు; మరా. బదల(జే(). మార్పు. పరివర్తనం; ఉ. బదల్. ప్రతీకారం, మార్పుగా ఇచ్చేవస్తువు, తుల్యం; పార. బదల్. మార్పు. ఒకదానిమారుగా ఇంకొకటి ఇవ్వటం, ప్రతీకారం; అర. బదల్. మార్పు, ప్రతీకారం.

<ఉ. బదల్.

బదులిచ్చు స.క్రి. అప్పిచ్చు. <బదులు + ఇచ్చు. బదులుకుంచె వి. సరిచేసేటప్పుడు పడుగు ఆరుబదునులో ఉండగా సందుసందుకూ రెండేసి సార్లు నిదానంగా కుంచెతో దువ్వటం. బదులుచెప్పు అ.క్రి. జవాబిచ్చు. బదులుదాపులు వి.బ.వ. ఆము పేర్పులో పచ్చికుండల వరుసల మధ్య దాపుగా పెట్టే ఓటికుండలు. బదులుమాట వి. జవాబు.

బద్ద రూ.చూ. బ్రద్ద[1]. వి. 1. విల్లులో ఉండే వెదురు బద్ద. శివరా. 3.90; 2. విల్లు, ధనుస్సు. ద్వి. పరమ. వి. 3.241; 3. చీల, పగులు; 4. వెదురు మొదలైనవాని చీలిక, పాయ; 5. కాయయొక్క ఖండం; 6. కావడిబద్ద; 7. దాబిగోలునుకు అడ్డంగా బిగించిన సన్నబద్ద; 8. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద; 9. పేటు దారాలకు ఆధారంగా దాబిచట్రంలో అమర్చిన సన్నబద్ద; 10. ఉన్ని ఏకటానికి నరం కట్టిన వెదురుబద్ద; 11. ఉన్నిపడుగులో అనిపోగుల్లో దూర్చిన వెదురుబద్ద; 12. పంటికామ చుట్టూ వంచి కట్టిన వెదురుబద్ద; 13. పంటి ఆకుల బిగింపుకు వేసే నిలువబద్ద; 14. తొవరరాటిచుట్టూ బిగించిన పొడుగుబద్ద; 15. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండువక్కలా వేసి కట్టిన వెదురుబద్ద; 16. పన్నెకట్టుబడిలో ఊనెల బిగింపుకోసం అడ్డంగా కట్టిన వెదురు బెత్తం; 17. రాటికిపైనా కిందా కట్టిన వెదురు బద్ద; 18. గూనపెంకును సున్నబరచటానికి కుమ్మర్లు వాడే పల్చని కొయ్యముక్క; 19. వాటతయారీలో సమ దళసరిని మన్ను తేపటానికి ఉపయోగించే వంకరగా ఉండే పల్చని వెదురుకొయ్య; 20. కాటిమొదలైన వాటిని నిలువుకు చీల్చిన పొడవు కంబం; 21. మినుము, పెసలు మొదలైన వాటిపప్పు, బేడ; 22. పలకపాటు; విశే. బద్దవంటిది, పల్చని, సన్నని. గా. హరి. ఉ. 1039.

బద్దకట్టువాగలి వి. మాగాణి నేలలు దున్నేనాగలి. బద్దకిటికీ వి. చిన్నకిటికీ. బద్దకూజా వి. అంచుకొన వంచి ఉండేకూజా. బద్దకొమ్ము వి. వెడల్పుగా ఉండే కొమ్ము. బద్దగడ్డి వి. ఒకరకం కలుపుమొక్క. బద్దగు అ.క్రి. అప్రతిష్ఠ పాలగు. <బద్ద + అగు. బద్దంచు వి. వెడల్పుగా బద్దలాగ సాఫీగా మట్టి పాత్రలకు పెట్టిన ఒకేఅంచు. <బద్ద + అంచు[3]. బద్దంచుకడవ వి. బద్దలాగ అంచుపెట్టిన మట్టిపాత్ర. బద్దంచుకుండ వి. రెండువేళ్ళ వెడల్పుతో బద్ద లాగ అంచు తీర్చిన మట్టికుండ. బద్దటిక వి. బద్దమాదిరి అంచుఉండే చిన్న మట్టిపాత్ర. <బద్ద + అటిక. బద్దదువ్వు అ.క్రి. పడుగేరే కర్ర దగ్గర లాకబద్దకు బిడివేసి పోగులు దువ్వు. బద్దపట్టు అ.క్రి. సారెమీది వాటను వెదురుబద్దతో పూర్తిఆకారం వచ్చేటట్లు చేయు. బద్దపరి రూ.చూ. బ్రద్దపరి. వి. పేముతో అల్లినకేడం. బద్దపరికి వి. పల్చని బిళ్ళ. ఆం. భా. 3.32. బద్దపేటు వి. మెడలో వేసుకొనే ఒకరకం హారంలో బిళ్ళమాదిరి డిజైను. బద్దబుడ్డి వి. బద్దపాటుగా చిన్న మూతి ఉండే మట్టిపాత్ర. బద్దమూపంచేయు స.క్రి. కొలత పాపులు సరిగ ఉన్నవో లేవో చూచు. బద్దలకాడి వి. నాగలి, బండి మోట మొ. వాటన్నిటికీ పనికివచ్చే కాడి. బద్దలజల్లెడ వి. దాబికి పైన బిగించిన ఇనప ఊచల చట్రం. బద్దలదాబీ వి. ఒకరకం దాబీ. బద్దలవారు రూ.చూ. బ్రద్దలవారు. విశే. వేత్రధరులు. కళా. 2.70. బద్దలించు స.క్రి. బద్దలుగా చీల్చు. <బద్ద + -లు + -ఇంచు[3]. బద్దలుకొట్టు స.క్రి. ముక్కలుచేయు, పగలగొట్టు. బద్దలేరు అ.క్రి. పడుగు చేసేటప్పుడులాకలమీదిపోగులు సర్దు. <బద్ద + -లు + ఏరు. బద్దేయు అ.క్రి. వెదురు బద్దతో సారెమీది వాటను నునుపు పట్టు. <బద్ద + వేయు.

బద్దకము వి. 1. ప్రొలుమాలిక; 2. మాంద్యం.

సం. బద్ధక-. కట్టబడిన.

<సం. బద్ధక- + -ము.

బద్దకించు అ.క్రి. ప్రొలుమాలు, మాంద్యం పొందు <బద్దకము + -ఇంచు[3].

బద్దకించు చూ. బద్దకము.

బద్దకుడు వి. సోమరి.

సం. బద్ధక-. కట్టబడ్డవాడు.

<సం. బద్ధక + -డు.

బద్దర రూ.చూ. బ్రద్ద[1]. వి. బద్ద.

బద్దాటు చూ. బద్దె.

బద్దారం చూ. బద్దె.

బద్ది రూ.చూ. బద్దె. వి. 1. అచ్చుకుక్కవటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; 2. మరమగ్గం నిలువ పట్టెకు పేరువ పలకకు బిగించి సన్న పల్లతో పడి పెట్టిన దారం; 3. పేక పోగులు వెయ్యకుండా కొంత వదిలి తరవాత పట్టెమాదిరిగా నేసింది; 4. రంగు నీళ్ళ అండాలో ఉరక బెట్టటానికి నూలులడీలు తగిలించిన ఇనప ఊచ; 5. కుండల్ని సర్దేటప్పుడు నలపను తడుపుకోవటానికి వాడే తడిబట్ట; 6. గోలీల ఆటలో ఆటగాడికి స్థావరమైన చిన్న గుంట; 7. స్త్రీ యోని; 8. లోతుగా ఉండే మూకుడు.

బచ్చట్టి రూ. బద్దిచట్టి. వి. మూతి వెడల్పుగా ఉన్న చిన్న మట్టి తొట్టి. <బద్ది + చట్టి. బద్దికొల్చు స.క్రి. గోలీల ఆటలో నిర్ణయమైన బద్దిలో గోలిని పడవేయు. బద్దిచట్టి రూ.చూ. బచ్చట్టి. వి. మూతి వెడల్పుగా ఉన్న చిన్న మట్టి తొట్టి. బద్దితాడు వి. ఒకరకమైన తాడు. కాళ్ల.సం. 9.178. బద్దిదారం రూ.చూ. బద్దెదారం. వి. 1. అచ్చు కట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు అచ్చుకర్ర బిగించిన తాడు; 2. అచ్చు పడుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అనివెంబడి దూర్చిన దారం; 3. నేత పడుగులో చివరిపాయకు కట్టినదారం. బద్దిరాయి వి. సర్దేటప్పుడు నలపను తడిచేసుకోవటానికి తడిగుడ్డ పెట్టుకొనేరాయి.

బద్దినుంగు వి. నేతచీరకు ముందువైపు వదిలినబద్దె.
బద్దిమవ్వ(-చువ్వ) రూ.చూ. బద్దెచువ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం.

బద్దించు స.క్రి. 1. సరిగా ఉన్నదా లేదా అని కొల్చిందే తిరిగి కొల్చు, లెక్క సరిగా ఉందా లేదా అని మరొకసారి పరీక్షించు; 2. మరొకసారి పరీక్షించు; 3. గాఢిగ తిట్టు.

సం. బద్ధ-. కట్టబడినది, ఆటంక పరచబడినది, నిర్మిత మైనది.

<సం. బద్ధ-+-ఇంచు[3].

బద్దింపు వి. నాణెం వారీగా లెక్క కట్టటం.

బద్దిన్పు చూ. బద్దించు. వి. గట్టి కాపలా.
బద్దింపు చూ. బద్దించు.
బద్దియ రూ.చూ. బద్దె. వి. 1. దశ, బట్టకొన; 2. అపరకర్మ చేసేటప్పుడు వేసుకొనే గుడ్డముక్క; 3. కొలతబద్ద, టేపు, నాడా.
బద్దిరింపు రూ.చూ. బద్రింపు. వి. కొంత పైకి కట్టబడిన గోడ వెడల్పు తగ్గించటానికి వదిలే గాడి.
బద్దీకాహునర్ వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

హిం. బద్దీ. దారు, దారం, కా. ముక్క; హిం.ఉ. హునర్. కళ, నైపుణ్యం.

<ఉ. బద్దీకాహునర్.

బద్దు[1] యా. బద్దుర. వి. అబద్ధం, అసత్యం, బొంకు. నార. పంచ. 1.546.

సం. అబద్ధ-. కట్టబడని; ప్రా. అబద్ధ-;

త. వయుతు. అబద్ధం, బొంకు, వయుమ్బు. తప్పు, హాని, దుష్ట;

<సం. అబద్ధ-.

బద్దుకొను స.క్రి. అబద్ధంగా చెప్పు, కల్పించి చెప్పు. బహుళా. 5.97. బద్దుచెరు అ.క్రి. పూర్తిగ దిగజారిపోవు. బద్దులపట్టిక వి. బొంకులాడి, అబద్ధాలకోరు. రాజవా. 2.59.

బద్దు[2] వి. నిర్బంధం.

సం. బద్ధ-. కట్టబడింది; ప్రా. బద్ధ-.

<ప్రా. బద్ధ-.

బద్దుర రూ.చూ. బద్దు[1]. వి. అసత్యవచనం, బొంకు.
బద్దులు వి.బ.వ. నూనెకు వాడే చిన్న మట్టి పాత్రలు.
బద్దె రూ. బద్ది, బద్దియ. వి. 1. దశ, బట్టకొన, అంచు. పండి.చ. 5.344; 2. అపరకర్మ సమయంలో జందెంలాగ వేసుకొనే గుడ్డ ముక్క; 3. అచ్చుకుక్కటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ; 4. మరమగ్గం నిలువ పట్టెను మేడవ పలకకు బిగించి సన్నపల్లలో వడిపెట్టిన దారం; 5. పేకపోగులు వెయ్యకుండా కొంత వదిలి తరవాత పట్టెమాదిరిగా నేసింది; 6. రంగునీళ్ళ అండాలో ఉదక పెట్టటానికి మూలు ఒడీలు తగిలించిన ఇనప ఊచ; 7. గుంటక గుజ్జులో దిగవేసిన ఇనప పలుగు; 8. కడీ ఊచ; 9. ముగ్గులో గీసిన గీత.

సం. వర్ధ్ర-. తోలు, వర్ధ్రీ. తోలువారు, వర్ధ్రికా; ప్రా. బద్ధ-. చర్మరజ్జువు, వద్ధిఅ; పై. వార్ధ్ర, వార్ధ్ర. తోలుపట్ట; హిం. బద్దీ. దారం, బెల్టు, కట్టు, దారాలతో తీగలతో చేసిన అలంకరణం, కత్తి పదునుపెట్టే తోలు; ఉ. బద్ధహి. బెల్టు, నడుము వరకూ వేలాడుతూ ఉండే ఒక కంఠాభరణం, నడికట్టు, ఒకజత బంధనాలు.

<ప్రా. బద్ధ-.

బద్దాటు రూ.చూ. బద్దెవాటు. వి. అచ్చుతీసిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేకపోగులు వేసి బద్దె నెయ్యటం. బద్దారం రూ.చూ. బద్దెదారం. వి. 1. అచ్చు కట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు అచ్చు కర్ర బిగించిన తాడు; 2. అచ్చు వరుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం; 3. నేత పడుగులో చివరి పాయకు కట్టిన దారం. బద్దెకంచుడు వి. ఊరగాయ తొక్కు పెట్టటానికి వాడే కంచుడు. బద్దెకుచ్చులలాకి రూ.చూ. బద్దెగుచ్చులలాకి. వి. దోనెగాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద. బద్దెకోయు అ.క్రి. అచ్చులో బద్దె పోగులుగాని బెంతుపోగులు గాని వరసగా కోయు. బద్దెగట్టుచువ్వ రూ. బద్దెగట్టుసువ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెగట్టుసువ్వ (-చువ్వ) రూ.చూ. బద్దెగట్టుచువ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెగుచ్చుకర్ర వి. అచ్చుతీసిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన కర్ర. బద్దెగుచ్చుపుల్ల వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగం దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెగుచ్చులలాకి రూ. బద్దెకుచ్చులలాకి. వి. దోనె గాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద. బద్దెగుచ్చులాకి వి. దోనె గాడిలో బిగించే పొడుగాటి వెదురుబద్ద. బద్దెగుచ్చువ్వ వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. <బద్దెగుచ్చు+చువ్వ. బద్దెచివ్వతొక్కు రూ. బద్దెసివతొక్కు. అ.క్రి. అచ్చు బద్దెలో అని వెంబడి కర్ర ఎక్కించు. బద్దెచువ్వ రూ. బద్దిసువ్వ, బద్దెసువ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటి భాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెచెరగు రూ. బద్దెసెరుగు. వి. అచ్చుకుక్కటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ. బద్దెతట్టు అ.క్రి. 1. నేత మొదలు పెట్టేటప్పుడు రెండు మూడు వేళ్ళ వెడల్పున బద్దె నేయు; 2. బద్దెను చేత్తో తట్టు. బద్దెదారం రూ. బద్దారం, బద్దిదారం. వి. 1. అచ్చు కట్టేటప్పుడు జంత్రం కొయ్యలకు అచ్చు కర్ర బిగించిన తాడు; 2. అచ్చు వరుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం; 3. నేత పడుగులో చివరి పాయకు కట్టిన దారం. బద్దెనేత వి. ఒక బట్ట నేసిన తరవాత రెండో బట్ట నెయ్యటానికి బెత్తెడు వెడల్పున మొదట నేసే నేత. బద్దెపోగు వి. 1. పడుగు పోగుకు అతికే అచ్చుపోగు; 2. అచ్చు వరుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. బద్దెబడు (-పడు) అ.క్రి. పని ముగియ వచ్చు. బద్దెమండికి వి. జాతరలో దున్నపోతుకు బలి

ఇచ్చినప్పుడు రక్తం పట్టటానికి వాడే మూకుడు. బద్దెలదారు వి. అచ్చు వరుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. బద్దెవాట రూ.చూ. బద్దెవాటు. వి. అచ్చుతికిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేక పోగులు వేసి బద్దె నెయ్యటం. బద్దెవాటు రూ. బద్దాటు, బద్దెవాట, బద్దేటు, బద్దోట, బద్దోటు. వి. అచ్చుతికిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేకపోగులు వేసి బద్దెతో నెయ్యటం. బద్దెవాటుకఱ్ఱ రూ. బద్దోటుకఱ్ఱ. వి. అచ్చుతికిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్న బెత్తం. బద్దెవాటుచివ్వ రూ. బద్దేటుసివ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెవారుచేయు అ.క్రి. నేత మొదలుపెట్టు. బద్దెసివ తొక్కు రూ.చూ. బద్దెచివ్వతొక్కు. అ.క్రి. అచ్చు బద్దెలో అని వెంబడి కఱ్ఱ ఎక్కించు. బద్దెసువ్వ రూ.చూ. బద్దెచువ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దెపెరుగు రూ.చూ. బద్దెచెరగు. వి. అచ్చుతుక్కోవటానికి సుమారు బెత్తెడు వెడల్పు నేసి చివర జేనెడు పొడుగు దారాలు వదిలిన గుడ్డ. బద్దేటు రూ.చూ. బద్దెవాటు. వి. అచ్చుతికిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేక పోగులు వేసి బద్దె నెయ్యటం. బద్దేటుసివ రూ.చూ. బద్దెవాటుచివ్వ. వి. మగ్గానికి అమర్చే పడుగు మొదటిభాగంలో దూర్చిన పొడుగాటి బెత్తం. బద్దోట రూ.చూ. బద్దెవాటు. వి. అచ్చుతికిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేక పోగులు వేసి బద్దె నెయ్యటం. బద్దోటు రూ.చూ. బద్దెవాటు. వి. అచ్చుతికిన పడుగు పోగులు ఊడకుండా నాడెతో పేక పోగులు వేసి బద్దె నెయ్యటం. బద్దోటుకఱ్ఱ రూ.చూ. బద్దెవాటుకఱ్ఱ. వి. అచ్చుతికిన తరవాత బద్దెలో పోగులు చెదరకుండా దూర్చిన సన్న బెత్తం. బద్దోరిదారం రూ. బద్దోలిదారం, బద్దోళిదారం, బరిదొడ్డిదారం. వి. అచ్చు వరుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. బద్దోలిదారం రూ.చూ. బద్దోరిదారం. వి. అచ్చు వరుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. బద్దోళిదారం రూ.చూ. బద్దోరిదారం. వి. అచ్చు వరుల్లో దూర్చిన బద్దె పోగుల్లో అని వెంబడి దూర్చిన దారం.

బద్దేటు చూ. బద్దె.

బద్దేటుసివ చూ. బద్దె.

బద్దేయు చూ. బద్ద.

బద్దోట చూ. బద్దె.

బద్దోటు చూ. బద్దె.

బద్దోటుకఱ్ఱ చూ. బద్దె.

బద్దోరిదారం చూ. బద్దె.

బద్దోలిదారం చూ. బద్దె.

బద్దోళిదారం చూ. బద్దె.

బద్ధుఁడు వి. పరవశుడు. విష్ణుపు. 7.188.

నం. బద్ధ-. కట్టబడ్డవాడు; ప్రా. బద్ధ-.

<నం. బద్ధ- (అర్థవిపరి.).

బద్మాష్ వి. 1. గొప్పమోనగాడు; 2. క్రూరుడు, చెడ్డపని చేసే వ్యక్తి.

హిం.ఉ.పార. బద్‌మాష్. చెడ్డవాడు.

<ఉ. బద్‌మాష్.

బద్‌మాషీ వి. చెడ్డతనం.

హిం.ఉ. బద్‌మాషీ. చెడ్డతనం, క్రౌర్యం;

క. బద్‌మాష్; త. పత్మాష్.

<ఉ. బద్‌మాషీ.

బద్ర వి. పన్నెండు. ఉ.హరి. 3.121.

నం. భద్రా. ద్వాదశి, పన్నెండో తిథి, శుభప్రదమైన తిథి; హిం. బారహ్. పన్నెండు.

<నం. భద్రా.

బద్రము వి. 1. పదిలం, జాగ్రత్త; 2. రెండు మూడులున్న కుండ.

నం. భద్ర-. మంగళం.

<నం. భద్ర-+-ము.

బద్రికంకర వి. పెద్ద రాతిముక్క.

హిం.ఉ. బదర్. బయటికి చెందిన.

బద్రిగాడు వి. ఒకానొక తిట్టు.

నం. భద్ర-. శివుడు (దిగంబరుడు).

<నం. భద్ర-+-గాఁడు.

బద్రింపు రూ. పత్తిరింపు, పత్రింపు, బద్దిరింపు, భద్రింపు. వి. పునాది గోడపైన గోడ కట్టినప్పుడు రెండుపక్కలా మిగిలిన భాగాలు.

నం. భద్ర-. మంగళం.

బవద వి. కారు పసుపు మొక్క (Gingiber cassumunar).

బవాతు రూ. బనాతు, బనాద్. వి. వస్త్ర విశేషం, ఒకరకం ఉన్ని బట్ట. హంస. 5.356.

నం. వర్ణవత్-. రంగుకల; ప్రా. వణ్ణమంత-. ప్రశస్తమైన వర్ణం గలవి; హిం. బనాత్. ఒకవిధమైన ఉన్ని వస్త్రం; మరా. బనాత్. వస్త్ర విశేషం; ఉ. బనాత్. ఉన్ని బట్ట; త. పనాత్తు, పన్నాత్తు.

<ఉ. బనాత్.

బవాతువచ్చడము వి. జమిలి దుప్పటి.

బవాద్ రూ.చూ. బనాతు. వి. 1. వెడల్పు ఉండే గుడ్డ; 2. ఉలెనుతో తయారుచేయ బడ్డ; 3. మట్టితో చేసినది.

బవాయించు స.క్రి. 1. కల్పించు, తయారుచేయు; 2. ఆరోపించు; 3. దబాయించు, బుకాయించు.

హిం. బనానా. నిర్మించటం, కట్టు, రూపు దిద్దటం, తయారు చేయటం, సిద్ధంచేయటం, నిలబెట్టటం, అలంకరించటం, నిర్వర్తించటం, ఆకార మేర్పరచటం; ఉ. బనానా. పుట్టించటం, తయారుచేయటం, కట్టు, నర్దుకోవటం, లాగటం, సరిదిద్దటం, కనుగోవటం, వెక్కిరించటం, ధరించటం, నిర్వర్తించటం, సృష్టించటం, నిర్మించటం, బాగా చేయటం, అలంకరించటం.

<ఉ. బనా(నా)+-ఇంచు[3].

బవారస్ రూ. బెనారస్. వి. 1. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు నేసిన భాగం; 2. ఒకరకం కృత్రి

ముఖ పట్టు.

ఇం. *Banaras*. కాశీ, వారణాశి.

< ఇం. Banaras.

బనారస్‌అంచు వి. ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. బనారస్‌కమ్మి వి. ఒకరకం డిజైను కమ్మి. బనారస్‌పేటి రూ.చూ. బనారస్‌పేటు. వి. ఒకరకం డిజైను కమ్మి. బనారస్‌పేటు రూ. బనారస్‌పేటి, బనార్స్‌పేటు. వి. అంచు డిజైనులో ఏటవాలు వరసల్లో నేత కనబడేట్టు నేసిన భాగం. బనారస్‌బేలుకమ్మి వి. ఒకరకం డిజైనులో నేసిన కమ్మి. బనారస్‌బోర్డరు వి. ఏటవాలు వరసల్లో డిజైను కనబడేట్టు నేసిన అంచు. ఇం. *boarder*. అంచు. < బనారస్ + ఇం. boarder.

బనార్స్‌పేటు రూ.చూ. బనారస్‌పేటు. వి. ఒకరకం డిజైను కమ్మి.

బపికి వి. పక్కచెట్టు, సాగేగుణంగల తెల్లని కలపనిచ్చే ఒకరకం చెట్టు (streblus asper).

బనియను రూ. బనియా, బనీలు, బన్ని. వి. శరీరాన్ని అంటు కొనిఉండే ఒక మోస్తరు చొక్కా.

ఇం. *Banian*. చొక్కాలోపల వేసుకునే వస్త్రం.

< ఇం. Banian.

బనియా రూ.చూ. బనియను. చేతులు లేకుండా కుట్టిన వ్యాపారుల చొక్కా.

బమకుల వి. ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Dichrostachys cinerea).

బనీలు రూ.చూ. బనియను. వి. శరీరాన్ని అంటిపెట్టుకొనిఉండే ఒకరకం చొక్కా.

బంక వి. దక్కను, కర్ణాటకలలో పెరిగే ఒకరకం మొక్క (Grewia villosa).

బంకలగొబ్బి వి. సిరిరంగు పూలుపూసే ఒకరకం మొక్క (Barleria mysorensis).

బంతి[1] వి. 1. కందుకం, చెండు. శృం.నై. 3.95 ; 2. పుష్ప వృక్ష విశేషం. భీమ. 5.123. (Tagetes Patula) ; 3. వేటగాళ్ళు దొంగలు ఉపయోగించే ఒకది విశేషం. సుదంతా. 3.166 ; 4. మరమగ్గంలో ఒక పొరుగులోనుంచి మరొక పొరుగులోకి చేర్తో తాళ్ళను గుంజే పిడి ; 5. మట్టి పాత్రల కింద కుదురుగా పెట్టే గుడ్డచుట్ట.

త. పన్తు. ఆటలో ఉపయోగించే బంతి, దారంలాగ చుట్టటం ; మ. పన్తు. కొయ్యబంతి, దారంబంతి.

బంతికడ్డి వి. బంతి కట్టటానికి ఉపయోగించే తాడు. బంతిగుండు వి. బంతికి కట్టే కంకిగుండు. బంతిగూటం వి. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగకింద ఎత్తుగా పెట్టిన కొయ్య. బంతిచక్రం వి. మరాము ఒగ్గుల పట్టెను ఆడించటానికి వీలుగా అమర్చిన పళ్ళచక్రం. బంతిచెట్టు వి. ఒకరకం పూలమొక్క. బంతితాడు వి. 1. మరమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చుకట్టిన దారం ; 2. బంతి కట్టటానికి ఉపయోగించే తాడు. బంతిపువ్వంచు వి. బంతిపువ్వు ఆకారంలో డిజైను పడేట్టు నేసిన అంచు. బంతిరొద్ద వి. ఒకరకం కలుపమొక్క. బంతులాట వి. బంతితో ఆడటం. < బంతి[1] + -లు + ఆట. బంతులాడు అ.క్రి. బంతులతో ఆడు. < బంతి[1] + -లు + ఆడు.

బంతి[2] రూ. బంతు, బింతి. వి. 1. వరుస, పంక్తి. భార. ఆది. 2.18 ; 2. పంక్తిలో పెట్టే భోజనం. హర. 2.129 ; 3. అనేకులు భోజనం చేయటానికి ఏర్పడిన వరస. హర. 2.130 ; 4. లంకె కళ్ళంలో పదును తొక్కించటానికి పక్కపక్కగా కట్టిన ఎద్ల వరస ; 5. రాగి, సజ్జ, వరి మొ. వాటిని నూర్చేటప్పుడు వరస ఏర్పడటానికి ఎద్లమెడలకు కట్టే పలుపులుగల మోకు.

సం. పంక్తి-, పంక్తి, పంక్తికా. వరస ; ప్రా. పంతి. శ్రేణి, పంక్తి ; గా. జై. మహా. అ. మా. పా. అప. పంతి ; క. పంతి, పంతె, పన్తి, హంతి ; తు. పంతె ; త. పంతి ; మ. పంతి ; ఒర. వాంతి.

< ప్రా. పంతి.

బంతికట్టు రూ.చూ. బంతిఁగట్టు. స.క్రి. పశువుల్ని ఒకదానితో ఒకటి తాడుతో కట్టు. కాశీ. 3.36 ; వి. కుప్పనూర్చేటప్పుడు ఎద్లవరసకు కట్టే పలుప. బంతికట్టుపలుపు వి. కుప్పనూర్చేటప్పుడు ఎద్లవరసకు కట్టే పలుప. బంతికుడుపు వి. అనేకులు చేరి భుజించటం. బంతికూడు వి. పంక్తి భోజనం. చంద్రాంగ. 3.45. బంతిగట్టు(-కట్టు) రూ.చూ. బంతిఁగట్టు. అ.క్రి. కట్టలుకట్టు. బంతిగుడుచు(-కుడుచు) స.క్రి. సహపంక్తి భోజనంచేయు. ఉ.హరి. 2.54. బంతిఁగట్టు(-కట్టు) రూ. బంతికట్టు, బంతిగట్టు. స.క్రి. పశువుల్ని ఒకదానితో ఒకటి తాడుతోకట్టు. భాగ. సం. 10.201. బంతిచాప వి. భోజనానికి ఎక్కువమంది కూర్చుండటానికి మూరెడు వెడల్పున పొడుగ్గాఉండే చాప. బంతితట్టు వి. విందుల్లో భోజనానికి వచ్చినవాళ్ళు కూర్చోవటానికి నేసిన నారపట్టా. బంతిదూగులాట(-తూగులాట) వి. బాలక్రీడ. బంతిపగ్గం వి. కళ్ళంమధ్య మేటికి కట్టిన ఎద్దును లాగేతాడు. బంతిపలుపు రూ. బంతిపొలుపు. వి. బంతికట్టటానికి ఉపయోగించే తాడు. బంతిపాటు వి. లంకె కళ్ళంలో పదుగు తొక్కించటానికి పక్కపక్కగా కట్టిన ఎద్లవరస. బంతిపెట్టు స.క్రి. వరసపెట్టు. భాగ. సం. 14.134. బంతిపొలుపు రూ.చూ. బంతిపలుపు. వి. బంతి కట్టటానికి ఉపయోగించే తాడు. బంతిమోకు వి. బంతి కట్టటానికి ఉపయోగించే తాడు. బంతిలోపక్షపాతము వి. తగనిపని, ఎక్కువ తక్కువలు చూపించటం. బంతిసాగించు స.క్రి. వరస తీర్చి భోజనం పెట్టు. కాశీ. 7.184. బంతులుగట్టు(-కట్టు) స.క్రి. చతుష్పాద జంతువుల్ని ఒకదానితో ఒకటి పలుపుతో కట్టు. పండి.చ. 5.374 ప ; వి. కుప్ప నూర్చేటప్పుడు ఎద్ల వరసకు కట్టే పలుప. బంతులుసాగు అ.క్రి. 1. పరంపరగా వ్యాపించు. పండి చ. 5.359 ప ; 2. భోజనానికి బంతులుగా కూర్చుండు. జైమినిభా. 8.201. బంతివసుదులు వి.బ.వ. బంతిలో భోజనానికి కూర్చున్నప్పుడు ఒకరిమీద ఒకరు విసురుకొనే ముద్దలు. భాగ. 10 పూ. 496.

బంతు రూ.చూ. బంతి[2]. వి. లంకె కళ్ళంలో పదుగు తొక్కించటానికి పక్కపక్కగా కట్టిన ఎద్లవరస.

బంతులాట చూ. బంతి[1].

బంతులాడు చూ. బంతి[1].
బంతులుగట్టు చూ. బంతి[2].
బంతులుపాగు చూ. బంతి[2].
బంతెవగుండులు చూ. బంతి[2].
బంద[1] రూ. బందా[1], బందాయి. వి. 1. బద్ధుడు, లొంగిన వాడు. శివరా. 4.83 ; 2. తాకట్టు.
హిం. మరా. ఉ. పార. *బందా*. దానిన.
<ఉ. బందా.
బంద[2] రూ. వి. 1. చిన్నగుంట ; 2. బురద ; 3. అనహ్యం.
ఒ. *బంధ*. ఒకచోట (నిలవ) ఉంచబడింది.
<ఒ. బంధ.
బంద[3] వి. 1. తమలపాకుల చిన్నకట్టలు కలిపికట్టిన పెద్దకట్ట.
నం. *బృంద*-. సమూహం ; ప్రా. *వంద*-.
<నం. బృంద-.
బంద[4] వి. రెండు పరుదులు.
హిం. ఉ. పార. *బంద్*. పదిదస్తాల కాగితాలు.
<ఉ. బంద్.
బంద[5] రూ. బందం[2], బందా[2]. వి. సుమారు ఒకటి రెండెకరాల భూమికి మాత్రం నీరు సరఫరా చేసే చిన్నచెరువు.
ఒ. *బంధ*. చెరువు.
<ఒ. బంధ.
బంద[6] రూ.చూ. బొంద[3]. వి. లేతపొట్టితాటిమాను.
బందం[1] వి. 1. పొలంలో పారేవాన నీళ్ళకు మట్టికొట్టుకు పోకుండా అడ్డుగా పోసినకట్ట ; 2. దొంగగొడ్డుకు ఒకవైపున రెండుకాళ్ళకు కలిపికట్టే కట్టు.
నం. *బంధ*-. కట్టు ; ప్రా. *బంధ*-.
<ప్రా. బంధ-+-ము.
బందం[2] రూ.చూ, బంద[5]. వి. సుమారు ఒకటి రెండెకరాల భూమికి మాత్రం నీరు సరఫరా చేసే చిన్నచెరువు.
బందకము వి. తాకట్టు.
నం. *బంధక*-. బంధించేది.
<నం. బంధక-+-ము.
బందకిట్టెలు వి.బ.వ. వడ్లలో ఒకరకం.
బందగావి రూ. బందగాను. వి. బిరుదునామం.
హిం. *బందగీ*, *బందగాని*. సేవ, ఆరాధన ; మరా. *బందగాన్*. దాసి. సేవ; ఉ. *బందగీ*, *బందగాని*. సేవ, మంత్రివర్గం; పార. *బందగా*, *బందగాని*. ఆరాధన, మంత్రివర్గం.
<ఉ. బందగానీ.
బందగామ రూ.చూ. బందగాని. వి. బిరుదునామం.
బందంజేయు చూ. బందము.
బందడము రూ. బందలము. బందకము. వి. తతముబరాండం, దొంతికుండ. ఆం. భా. 2.246.
బందడి వి. రాళ్ళవరసల మధ్య ఉన్న స్థలం.
బందవ వి. 1. బిగట, నిర్బంధం, మానిబంక ; 2. బురద.
నం. *బంధన*-. కట్టటం ; ప్రా. *బంధణ*- ;
క. *బందనె*, *బంజెనె*.
<ప్రా. బంధణ-.

బందవగొమ (-గొను) అ.క్రి. బిగట కలదగు. మను. 3.28.
బందపట్టి చూ. బందము.
బందపీట చూ. బందము.
బందపుకర్ర చూ. బందము.
బందబ్బద్ద చూ. బందము.
బందబ్బద్దీ చూ. బందము.
బందము రూ. బందాము. వి. 1. పశువులకు రెండుకాళ్ళుచేర్చి కట్టేతాడు. కేయూ. 1.29 ; 2. చెట్టెక్కేవాడు కాలికి తగిలించుకొనే తాడు. మను. 3.84 ; 3. దూలంపై గుజ్జుల బిగువుకోసం లంకెగా ఒనర్చిన పట్టె ; 4. వరిచేని వంపు.
నం. *బంధ*-. కట్టు ; ప్రా. *బంధ*- ;
మ. *పంతమ్*. కట్టటం, కొయ్యకు చివర గుడ్డపీలికలు కట్టి ఏర్పరచిన దివిటీ.
<ప్రా. బంధ-.
బందంజేయు స.క్రి. తాడుమొదలైన వాటితో గట్టిగా కట్టు. <బందము+చేయు. బందపట్టి వి. ద్వారబంధపు కింది పట్టె. బందపీట వి. తొట్టికర్రలు దూర్చేకొయ్యపీట, బందపుకర్ర వి. కొమ్మర్లమీద పరిచేకమ్మీ. బందబ్బద్ద (-బద్ద) వి. మొగరప్పటకు దూలానికి మధ్య వేసే చెక్క. బందబ్బద్దీ (-బద్దీ) వి. పంచదించడానికి గుర్రపుకొయ్యల మీద వేసిన అడ్డవానం. బందమ్రాడు వి. పెరుగు మొ.వి. చిలికినప్పుడు కవ్వం తిప్పడానికి ఉపయోగించే తాడు. పి. శకు. 2.99. బందంవట్టి వి. కొమ్మర్లమీదపరిచే కమ్మీ.
బందంపట్టె చూ. బందము.
బందర్ రూ.చూ. బందరు. వి. మచిలీపట్టణం.
బందర[1] రూ. చూ. బందరు. వి. 1. ఆంధ్రదేశంలో సముద్ర తటానగల ఒకపట్టణం, మచిలీపట్టణం; 2. ఒక రకమైన కత్తి.
బందర[2] రూ. బందార, బందారి, బందిర, బందిరి[3], బందురు, బందెరు. వి. చిన్నచెట్టు. దీనిఆకును పూరిళ్ళమీద కప్పటానికిఉపయోగిస్తారు (Bastard cedur of palgha Bridal couch plant, Dodena viscosa.)
బందరాకు వి. ఆము కాల్చటానికి వాడే బందారిచెట్టు ఆకు.
బందరాకు చూ. బందర[2].
బందరంచుకుండ చూ. బందరు.
బందరము చూ. బందరు. వి. అని, పాలు లేదా నీళ్ళు కాచటానికి వాడే పాత్ర విశేషం.
బంద్రాలు[1] వి.బ.వ. అన్నం వండటానికి ఆరబెట్టటానికి వాడే మట్టి పాత్రలు.
బందరు రూ. బందర్, బందర[1]. వి. ఆంధ్రదేశంలో సముద్ర తటాన ఉన్న ఒక పట్టణం, మచిలీపట్టణం. రంగా. చ. 2.74 ; 2. ఒకరకమైన కత్తి. ఖడ్గ. 27వ.
హిం. మరా. ఉ. *బందర్*. ఓడరేవు ; పార. *బందర్*. ఒకపట్టణం, ఓడరేవు; అర. *బందర్*. ఓడరేవు.
<ఉ. బందర్.
బందరంచుకుండ వి. అంచునున్నగా ఉండే మట్టిపాత్ర.

<బందరు+అంచుకుండ. బందరుకంప రూ. బందేరి కంప. వి. అము కాల్చుకువాడే బందారు చెట్లకంప. బందరుచీర వి. నాలుగు కొలుకులు ఒకరంగు, రెండు కొలుకులు నిండోలి రంగు చొప్పున వరసగా నిలువు పోగులు అతికినేసిన చీర. బందరుపిచ్చోడు మతిస్థిమితం లేనివాడు. బందరుపెసలు వి.బ.వ. పెసలలో ఒకరకం. బందరుపాటమొంకలు వి.బ.వ. వడ్లలో ఒకరకం. బందరు బరాపీ వి. నెల్లూరు నెరజాణవంటి గడుసరి అనే అర్థం ఇచ్చే పదం. బందరుమిఠాయి వి. బందరులో తయారయ్యే మిఠాయి, మిఠాయితయారీకి బందరు ప్రసిద్ధం. బందరులడ్డు వి. బందరులో తయారయ్యే పెద్దసైజు లడ్డు.

బందర్లు చూ. బందరు. రూ.చూ. బంద్రాలు². వి.బ.వ. వడ్లలో ఒకరకం.

బందల చూ. బంద². వి. సంగటి ముద్దలు చేయటానికి వాడే గుండ్రని మూకుడు లాంటి మట్టిపాత్ర.

బందలరాయి వి. బందల వటికలను నర్సేరాయి.

బందలవటిక చూ. బందలము.

బందలపుకుండ చూ. బందలము.

బందలము రూ.చూ. బందరము. వి. దొంతికుండ, నీళ్ళకువాడే మట్టిపాత్ర.

బందలవటిక వి. నీళ్ళకువాడే పెద్దమట్టిపాత్ర. బందలపు కుండ వి. సుమారు రెండు సొలిగల బియ్యం ఉడికే మట్టి పాత్ర. బందలాల్రాయి వి. బందల పటికలను సర్సేరాయి.

బందలాల్రాయి చూ. బందలము.

గందళము రూ.చూ. బందరము. వి. దొంతికుండ.

బందా¹ రూ.చూ. బంద¹. వి. 1. సేవకుడు. గులాం. మను. 2.73 ; 2. చెరలో పెట్టబడినవాడు.

బందా² రూ.చూ. బంద⁵. వి. సుమారు ఒకటి రెండెకరాల భూమికి మాత్రం నీరు సరఫరాచేసే చిన్న చెరువు.

బందా³ వి. రొఖ్ఖం.

బందా⁴ వి. పన్నెకట్టే జంత్రం బొమ్మకు దారుతో వేసిన ముడి.

మరా. బంద్. తీగముక్క, బంధించే సాధనం; హి. బంద్. దారు; పార. బంద్. దారు, గొలుసు, గ్రంథాలు, పది దస్తాల కాగితం, రీములో సగం.

<హి. బంద్.

బందాకోరు విశే. పరవర్తి. కువ.చ. 4.184.

హి. బందాఖోర్. దానినలు కలవాడు.

<హి. బందాఖోర్.

బందాకోరుగా(జేయు(-చేయు) న.క్రి. బందీగాచేయు, బందీకుని చేయు. హంవ. 2.38.

బందాటము వి. అభినివేశం, పట్టుదల. కవిక. 4.95.

బందాము రూ.చూ. బందము. వి. దూలంపై గుజ్జుల బిగువు నిమిత్తం లంకెగా ఒనర్చిన పట్టె.

బందాయి రూ.చూ. బంద¹. విశే. పరవర్తి, లోబడినవాడు. ద్వి. పరమ. వి. 4.272.

బందారి రూ.చూ. బందరి². వి. చిన్నచెట్టు, దీని ఆకును పూరిళ్ళమీద కప్పటానికి ఉపయోగిస్తారు (Bastard cedar of palghat bridal couch plant, Dodena viscosa).

బందారి రూ.చూ. బందర². వి. పూరిళ్ళమీద కప్పటానికి ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు (Bastard cedar of palghat, bridal couch plant, Dodena viscosa).

బందారు¹ రూ.చూ. బందారు¹. వి. 1. వృక్షవిశేషం. కుక. 2.342 ; 2. హరిద్ర, పసుపు పసుపుచెట్టు. ఆం.భా. 2.249 ; 3. పసుప్పచ్చటి పూలు దళసరి బూడిదరంగు బెరడు ఉండి మెట్ట నేలల్లోను రోడ్లపక్కను పెరిగేచెట్టు (Adina cordifoliay ; 4. సాగర తీరారణ్యాల్లో పెరిగే పెద్దచెట్టు (The Karum limber tree).

బందారు² వి. బాలక్రీడ.

బందారుబనవన్న వి. బాలక్రీడా విశేషం. హంవ. 3.46.

బంది రూ. బందియ, బందె. వి. 1. నిర్బంధం, చెరసాల. బసవ. 2.396 ; 2. బందిపోటు. భార. రాంతి. 2.89 ; 3. ఇబ్బంది, కష్టం. రాధి. 2.221 ; 4. చెరపడ్డది ; 5. చెర. విశే. నిర్బంధింపబడినవాడు, నిర్బంధంలో ఉన్నవాడు; రాధి. 6.221.

సం. బంధిన్. బంధించబడ్డవాడు ; ప్రా. బంధి ;

క. బంది ; తు. బంది. చెర, నిర్బంధం ; మ. పంత ; కుఇ. బంద. దాకట్టు.

<ప్రా. బందీ.

బందికట్టు స.క్రి. బందిపోటుచేయు. దశకు. 6.95. బందికత్తె రూ. బందెకత్తె. విశే. దోపుడుకత్తె. బందిపోటు చేసే స్త్రీ. రాధి. 3.109. బందికాడు అ.క్రి. నరాలు బిగించుకొనటంవల్ల చిన్నచిన్న అడుగులతో కష్టంమీద నడచు. <బంది+-కుస్+అడు. బందికా(డు రూ. చూ. బందెకా(డు. వి. 1. బందిపోటుదొంగ. ద.హిం.గా. సంపు. 5. గా.నం. 616 ; 2. చెరపడ్డవాడు. బందిచీర రూ.చూ. బందెచీర. వి. అంచురంగు పేకకు కలవకుండా నేసిన ఒకరకం చీర. బందివట్టు వి. 1. బందిపోటు ; 2. దొంగిలించటం. బందిపోటు వి. నిర్బంధపరచి కొట్టటం, చౌర్యం, దొంగతనం. ఆం.భా. 2.292. బందిలదొడ్డి రూ.చూ. బందెలదొడ్డి. వి. దొంగమేత మేసే గొడ్లను తోలే చోటు. బందివట్టు (-పట్టు¹) అ.క్రి. 1. బందిపోటుచేయు. కు.సం. 7.36 ; 2. నిర్బంధంచేయు. చంద్రాంగ. 6.151. బందివాటు వి. నిర్బంధం. గౌ.హరి. 1095. బందిపెట్టు(-పెట్టు) అ.క్రి. బందిపోటుచేయు, నిర్బంధించి దోచుకొను. బసవ. 2.382.

బందికాప రూ.చూ. బందీకానా. వి. చెరసాల.

బందికాపా రూ.చూ. బందీకానా. వి. చెరసాల.

బందికి రూ. పందికి. వి. కొండల్లో, వాగుల పక్కనా సుమారైన ఎత్తుకు పెరిగేచెట్టు (Kydia calycina).

బందిఖావ రూ.చూ. బందీకానా, వి. చెరసాల.

బందిఖావా రూ.చూ. బందీకానా. వి. చెరసాల.

బందిగము వి. చెరసాల. విష్ణుపు. 7.312.

సం. బంధక-. చెర ; ప్రా. బంధగ- ;

క. బందిగ, బద్దిగ ; కుఇ. బొంది. ఖైదు.

<ప్రా. బంధగ-.

బందిగీఁడు విశే. చెరసాలలో ఉంచబడినవాడు. రంగా.చ. 2.39. <బందిగము + ఈఁడు.

**బందిగీ** వి. సలాం, భక్తి. రంగా.చ. 2.39.

హిం. *బందగీ.* సలాం, వందనం, సేవ; మరా. *బందగీ.* ప్రణామం; ఉ. *బందగీ.* ప్రణామం, సలాం, పూజ; పార. *బందగీ.* సేవ, భక్తి.

<ఉ. బందగీ.

**బందిగీఁడు** చూ. బందిగము.

**బందించు** అ.క్రి. గట్టిగాకట్టు.

సం. *బంధ్.* కట్టు.

<సం. బంధ్ + -ఇంచు[2].

**బందిబలగం** వి. సంక్రాంతి నోముకు ఉపయోగపడే మట్టిపాత్రలు.

**బందియ** రూ.చూ. బంది. వి. 1. చెర; 2. ఇబ్బంది.

**బందిర** రూ.చూ. బందర[2]. వి. పూరికప్పుమీద కప్పటానికి ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు (Bastard cedar of palghat, bridal cowch plant, Dodena viscosa).

**బందిరి[1]** వి. బందిలిదొడ్డిలో పశువులను వేసినందుకు చెల్లించే రుసుం.

హిం.ఉ.పార. *బందీ.* బంధించబడింది.

**బందిరి[2]** రూ.చూ. బండారు[1]. వి. పసుప్పచ్చటిపూలు, దళసరి బూడిదరంగు బెరడు ఉండి మెట్టనేలల్లోను రోడ్లపక్కనా పెరిగే చెట్టు (Adina cordifolia).

**బందిరి[3]** రూ.చూ. బందర[2]. వి. పూరికప్పుమీద కప్పటానికి ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు (Bastard cedar of Palghat, Bridal cowch plant, Dodena viscosa).

**బందివాను** వి. జైలరు.

హిం. *బందీవాన్.* జైలరు, జైలు సూపరింటెండెంటు.

<హిం. బందీవాన్.

**బందిస్** రూ. బందీస్. వి. కట్టే పద్ధతి.

హిం.ఉ.పార. *బందిష్.* కట్టటం, కట్టు, కుట్ర.

<ఉ. బందిష్.

**బందీఖానా** రూ. బందిఖాన, బందిఖానా, బందిఖాన, బందిఖానా, బందీఖాన, బందీఖానా, బందెఖానా, బందెఖానా, బందేఖాన, బందేఖానా. వి. జైలు.

హిం.ఉ. *బందీఖానా.* జైలు, చెరసాల; మరా. *బందీఖానా;*

త. పంతికానా, పంతేకానా.

<ఉ. బందీఖానా.

**బందీఖావ** రూ.చూ. బందీఖానా. వి. చెరసాల.

**బందీఖావా** రూ.చూ. బందీఖానా. వి. చెరసాల.

**బందీరుమాలు** వి. అంచులు పెట్టి నేసిన తలపాగ.

**బందీస్** రూ.చూ. బందిస్. వి. కట్టే పద్ధతి.

**బందు[1]** రూ. బొంది[2], బొందు[2]. వి. గద్ద, డేగవపక్షి, రాబందు. అచ్చ.రా.యు. 135.

క. పద్దు, పద్దు. గద్ద, ఒకరకం గద్ద, రాబందు; కొర. పద్ది. రాబందు, గద్ద; త. పరున్తు. మామూలు గద్ద; మ. పరున్తు, పరన్తు. గద్ద (Accipiter Nisus); కో. పడ్. గద్ద; కొ. పధ్. రాబందు, ఒకరకం గద్ద.

**బందు[2]** రూ. బొంది[3], బొందు[3]. వి. 1. ఆవరణం, ఆచ్ఛాదనం. విష్ణుమా. 4; 2. చుట్టుకోవటం, అల్లుకోవటం. ఉ.రా. 9.24; 3. పెట్టె మొ.వాటి మూలల్ని బిగించే ఇనుము మొ.వాటి తగడు; 4. నిరోధం, కట్టివేత, మూసివేత; 5. గోపనం; 6. ముడి; 7. తలుపు రెక్కలను పిడిసలమీద తిరిగేటట్లు చేసే ఇనపబద్దీ; 8. తలుపు రెక్కలను కరిపించటానికి వాడే రెండువైపులా పదునున్న మేకు; 9. పెట్టెలో ఉండే నూలుకట్ట; 10. వైప.

సం. *బంధ-.* బంధం, కట్టు; ప్రా. *బంధ-.* బంధనం, సంయమనం; హిం. *బంద్.* బంధనం, కాగితంముక్క పొడవైనముక్క; ఉ. *బంద్.* మూసివేత, ఆటంకం; పార. *బంద్.* ఆటంకం, కారాగారం;

క. *బందు.* కట్టు, గొలుసు, సంకెల, చెర; తు. *బందు.* ఆపటం, నిషేధం; కుఇ. *బొంది.* ఖైదు; గ. *బందు.* చెరువు.

<ప్రా. బంధ-.

**బందుకట్టు** వి. 1. సన్నాహం. చంపూరా. 3.72; 2. జాతి కట్టుబాటు; స.క్రి. 1. సిద్ధంచేయు. శర. 4.49; 2. చేయు. ప్రబంధ. 656. **బందుకట్టుకొను** స.క్రి. వశపరచుకొను. కువ.చ. 39. **బందుచేయు** స.క్రి. 1. మూసివేయు; 2. ఆపుచేయు. **బందుపెట్టు** అ.క్రి. మాగకొను. **బందుముక్క** వి. కిటికీ తలుపు చెక్కకు బిగించే కొయ్యముక్క.

**బందు[3]** రూ. బందుగు, బందుగుఁడు, బందువు, బందువుఁడు. వి. బంధువు. కు.సం. 10.164.

సం. *బంధు-.; బాంధవ-.* చుట్టం; ప్రా. *బంధవ-, బంధు-;* పా. *బంధవ-;* మూ. పై. *పంధవ;*

క. *బందు;* తు. *బందు, బందె, బంధు;* మ. *బెంధు.*

<ప్రా. బంధు-.

**బందుకా** రూ.చూ. బందూకు. వి. తుపాకి.

**బందుకు** రూ.చూ. బందూకు. వి. తుపాకి. పద్మ.యు. 129.

**బందుగు** రూ.చూ. బందు[3]. వి. బంధువు, చుట్టం. కృం.నై. 3.13.

**బందుగుఁడు** రూ.చూ. బందు[3]. వి. చుట్టం. వీలా. 1.91.

**బందుబత్తు** రూ.చూ. బందుబస్తు. వి. కట్టుదిట్టం.

**బందుబస్తు** రూ. బందుబత్తు, బందొబస్తు, బందోబస్తు, బందోబస్తి, బందోబస్తు. వి. ఏర్పాటు, కట్టుదిట్టం. మృత్యు. 2.63.

హిం. *బందోబస్త్.* కట్టుదిట్టం, సిస్తు; మరా. *బందోబస్త్.* క్రమం, వ్యవస్థ; ఉ. *బందోబస్త్.* వ్యవస్థ సిస్తు; పార. *బంద్‌బస్త్.* వ్యవస్థ.

<ఉ. బందోబస్త్.

**బందుపు** రూ.చూ. బందర[2]. వి. పూరికప్పుమీద కప్పటానికి

ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు (Bastard cedar of Palghat, Bridal couch plant, Dodena viscosa).

బందువు రూ.చూ. బందు³. వి. చుట్టం.

బందువ(డు రూ.చూ. బందు³. వి. చుట్టం.

బందూకు రూ. బందుకా, బందుకు. వి. తుపాకి. భద్ర.శ. 58.

హిం. బందూక్. తుపాకి ; మరా. బందూఖ్. తుపాకి ; త. బందూక్. కఱిమ్ని, తుపాకి ; పార. బందూక్. తుపాకి ; అర. బందూక్. తుపాకి ; తుర్కి. బందూక్. తుపాకి.

< హిం. బందూక్.

బందె రూ.చూ. బంది. వి. 1. పశువుల దండుగ, చెరలో పడిన పశువును విడిపించుకోవటాని కిచ్చే సొమ్ము. విజ్ఞా. 2.4 ; 2. ఇబ్బంది, కష్టం. గొ.హరి.ఉ. 450 పం. ; 3. పశువుల చెర, బందెదొడ్డి. మను. 3.129 ; 4. నిర్బంధం. విష్ణువు. 2.103 ; 5. చెరలో పడిన పశువు ; 6. గ్రామ సమష్టి కార్యక్లో పాల్గోనివారికి ఊరి పెద్దలు వేసే అప రాధం ; 7. చేతికి తగిలించుకొనే ఆభరణం.

బందెకత్తె రూ.చూ. బందికత్తె. విణ. చెరలో వేసేది, దోపుడుకత్తె. భాగ. 6.445. బందెకా(డు రూ. బందికా(డు. వి. 1. బందికారి, బందిపోటు దొంగ. పారి. 2.59 ; 2. చెరలో వేసేవాడు ; 3. ప్రియుడు. బందెగొను (-కొను) స.క్రి. 1. కష్టపెట్టు, ఇబ్బందిపెట్టు, చెరపెట్టు. కవిక. 4.92 ; 2. నిరోధించు. కవిక. 4.92. బందెచీర రూ. బందిచీర. వి. అంచు రంగు పేకకు కలవకుండా నేసిన ఒకరకం చీర. బందెంచు వి. బట్ట చివర వేసే ఒక రంగు పెట్టి నేసిన అంచు. < బందె + అంచు³. బందెంచుచీర వి. అంచు రంగు పేకకు కలవకుండా నేసిన ఒకరకం చీర. బందెదీరు(-తీరు) అ.క్రి. ముక్తి కలుగు. శాళ్ల.నం 8.285. బందెదొడ్డి వి. బందె, పశువుల చెర. రాజవా. 3.142. బందెనేత వి. అంచులు ఒక రంగు, మధ్యభాగం మరొక రంగు పెట్టి నేసిన ఒకరకం నేత. బందెపసరము వి. బందెలో పడిన పశువు. శాళ్ల.సం. 11.3 భా. 86. బందె మూల్యము వి. బందెల దొడ్డి. బందెలజవాం వి. ఊరి కావలివాడి కిచ్చిన బహుమతి. బందెలదొడ్డి రూ. బందిల దొడ్డి, బందేలదొడ్డు. వి. పశువుల చెర. రాజవా. 3.142. బందెలపడు అ.క్రి. బందెలదొడ్డిలో పడు. మను. 3.129. బందెలపోతు విణ. నిర్బంధం కలిగించేవాడు, కష్టపెట్టేవాడు. గౌ. హరి. ఉ. 728. బందెలమారి వి. 1. చెడ్డవాడు, దుష్టుడు. హంస. 5.117 ; 2. బందెలపోతు. చంద్రరే. 2.132. బందెలువట్టు రూ. బందెలుపట్టు. స.క్రి. నిర్బంధించు. భాగ. 6.107. బందెలుమేయు స.క్రి. బందెల దొడ్డిలో గడ్డి తిను. శాళ్ల.నం. 8.19. బందెలువట్టు (-పట్టు¹) రూ.చూ. బందెలుపట్టు. స.క్రి. 1. కొల్లగొట్టు. విష్ణుపు. 2.124 ; 2. నిర్బంధపరచు. బందెలువేయు స.క్రి. బందెలదొడ్డిలో వేయు. బందెలుపెట్టు స.క్రి. నిర్బంధపెట్టు. భాగ. 6.107. బందెవట్టు(-పట్టు¹) స.క్రి. 1. నిర్బంధపరచు. భాస్క.రా.అయోధ్యా. 233 ; 2. కొల్లగొట్టు. బందెవేయు స.క్రి. ఇతరుల ఆవరణలోకి వెళ్ళిన పశువులపై అపరాధ రుసుం వేయు.

బందెకానా రూ.చూ. బందీకానా. వి. చెరసాల.

బందెఖానా రూ.చూ. బందీకానా. వి. చెరసాల.

బందెన వి. 1. తెల్లవావిలి. ఆం.భా. 2.51 ; 2. పసువ్వచ్చటి పూలుదగ్గరి బూడిదరంగు బెరడు ఉండి మెట్టనేలల్లోను రోడ్లపక్కను పెరిగే చెట్టు (Adina cordifolia).

బందెరు రూ.చూ. బందర³. వి. పూరిళ్ళ మీద కప్పటానికి ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు (Bastard cedar of palghat, Bridal cowch plant, Dodena viscosa).

బందెలు వి. బందెలపై ఆయం. నె.గా. గూడూరు శాసనం. 110. క్రీ.శ. 1614.

బందే వి. నమస్కారం. బెం. బందే. నమస్కరిస్తున్నాను.

సం. వందే. నమస్కరిస్తున్నాను, వందన-. నమస్కారం ; బెం. బందే.

< బెం. బందే.

బందేఖాన రూ.చూ. బందీకానా. వి. కారాగారం, ఖైదు.

బందేఖానా రూ.చూ. బందీకానా. వి. కారాగృహం.

బందేడు రూ. బందోడి. వి. చిన్న చెట్టు, దీని ఆకును పూరిళ్ళ మీద కప్పటానికి ఉపయోగిస్తారు (Bastard cedar of palghat, Bridal cowch plant, Dodena viscosa).

బందేడుచెట్టు రూ. బంజరుచెట్టు. వి. ఒకరకం చెట్టు (Nyctanthes arbortiistis).

బందేరికంప రూ.చూ. బందరుకంప. వి. ఆము కాల్చటానికి వాడే బందారి చెట్టు కొమ్మలు.

బందేలదొడ్డు రూ.చూ. బందెలదొడ్డి. వి. దొంగపశువులను లోపలి అపరాధం వసూలు చేసే దొడ్డి.

బందొబస్తు రూ.చూ. బందుబస్తు. వి. కట్టుదిట్టం.

బందోడి రూ.చూ. బందేడు. వి. పూరిళ్ళ మీద కప్పటానికి ఉపయోగపడే ఆకు కలిగిన ఒకవిధమైన చెట్టు.

బందోబస్తు రూ.చూ. బందుబస్తు. వి. 1. జాగ్రత్త ; 2. రక్షణ ; 3. కట్టుదిట్టం.

బందోబస్తి రూ.చూ. బందుబస్తు. వి. కట్టుదిట్టం.

బందోబస్తు రూ.చూ. బందుబస్తు. వి. 1. ఏర్పాటు, కట్టుదిట్టం ; 2. పొలం సరిహద్దులు ప్రభుత్వం వారు సర్వే చేసి నిర్ణయించటం.

బందోబస్తుచేయు స.క్రి. 1. కట్టుదిట్టం చేయు ; 2. ముందు జాగ్రత్త తీసుకొను. బందోబస్తుబండ వి. పొలానికి హద్దులు నిర్ణయించి గవర్నమెంటువారు గుర్తుగా పాతిన రాయి.

బంద్రాలు¹ చూ. బందరము.

బంద్రాలు² రూ. బందర్లు. వి.బ.వ. వడ్లలో ఒకరకం.

బన్నంచు వి. 1. పగడాలహారం మాదిరి డిజైనులో నేసిన అంచు ; 2. దొడ్డద్దాపి రుమాలురంగు అంచు.

సం. వర్ణ-. రంగు ; ప్రా. బణ్ణ-.

< ప్రా. బణ్ణ- + అంచు³.

బన్నవడు చూ. బన్నము.

బన్నపర్చు చూ. బన్నము.
బన్నపఱుచు చూ. బన్నము.
బన్నము వి. 1. నిందావాక్యం, దూషణం. కు.సం. 2.84; 2. అవమానం, పరాభవం. భార.ఉద్యో. 3.188; 3. ఆపద, కీడు. భార.అను. 1.50; 4. అపజయం, ఓటమి. ఉ.రా. 2.60; 5. చెరటం, నాశం. నీలా. 2.41; 6. విఘ్నం. చంద్రరే. 3.68.

సం. భగ్న-. విరిగినది, పగిలినది, నశించినది; ప్రా. భన్న-;

క. బన్న; తు. బంగ, బజ్జ.

<ప్రా. భన్న-.

బన్నపడు రూ.చూ. బన్నముపడు. అ.క్రి. అవమానం పొందు, భంగం పొందు. భార. మౌసల. 188. <బన్నము+పడు. బన్నపర్చు రూ. బన్నపఱుచు. స.క్రి. భంగం పొందించు, అవమానపరచు. పండి.చ. 3.16. బన్నపఱుచు రూ.చూ. బన్నపర్చు. స.క్రి. భంగం పొందించు. అవమానపరచు. బన్నముపడు రూ.చూ. బన్నముపడు. అ.క్రి. భంగం పొందు, అవమానం పొందు. బన్నములాడు స.క్రి. నిందించు. కు.సం. 2.84. <బన్నము+-లు+ఆడు. బన్నముపడు(-పడు) రూ. బన్నపడు, బన్నముపడు. అ.క్రి. భంగంపొందు, అవమానం పొందు. భార.ఆది. 3.147.

బన్నరి రూ.చూ. బన్ననరము. వి. హారవిశేషం. కు.సం. 3.36.

బన్నసరము రూ. బణ్ణసరము, బన్నరి, బన్ననరి. వి. 1. పలువిధాలైన మణులు గుచ్చిన హారం. కు.సం. 3-19; 2. హారవిశేషం.

సం. వర్ణసర-. రంగు రంగులహారం; ప్రా. వణ్ణసర-;

క. బణ్ణసర. పగడాలు బంగారు గుండ్లు కలిపి కూర్చిన దండ; తు. బణ్ణసర. పగడాలదండ.

<ప్రా. వణ్ణసర-.

బన్ననరి రూ.చూ. బన్ననరము. వి. హారవిశేషం. యయా. 5.100.

బనీను రూ.చూ. బనియను. వి. శరీరాన్ని అంటిపెట్టుకొనిఉండే ఒకరకం చొక్కా.

బప్కా వి. ఇంట్లో నీళ్ళు కాచుకొనే బాయిలర్.

బప్పం వి. పాయిల జాతికి చెందిన కూరాకుమొక్క.

బబ్బర[1] వి. వృక్షపలాదులపై ఉండే తొక్క, పెచ్చు. పి.శకు. 3.41.

బబ్బర[2] రూ.చూ. బొబ్బర[1]. వి. కాయధాన్య విశేషం, అలసందలు.

బబ్బరించు రూ. బొబ్బరించు. అ.క్రి. 1. అదరిపడు, దద్దరిల్లు, ద్వి.భార.విరా. 3.53; 2. అరచు. దశా. 7.207.

బబ్బరింత రూ.చూ. బొబ్బరింత. వి. గర్జన.

బబ్బరింత చూ. బబ్బరించు.

బబ్బిలి వి. త్రవ్వలిచెట్టు. E.I. సంపు. 5. గా.సం. 100. క్రీ.శ. 1102.

సం. బర్బర-. దారంగి, వృక్షవిశేషం: ప్రా. బబ్బుల-; మరా. బాభళీ, బాభూళ;

క. బబ్బులి, బబ్బుళి. వృక్షవిశేషం.

<ప్రా. బబ్బుల-.

బబ్బురు వి. వస్త్రగాలితం చేయగా మిగిలిన పొల్లుపొట్టు.

బబ్బెర రూ.చూ. బొబ్బర[1]. వి. నాలుగైదు నెలల్లో పండే ఒకరకం పప్పుదినుసు (Polichos catyang).

బబ్బెరకచ్చు వి. దర్వాజా నిలువు పట్టెకు రంగులు వేయటానికై తీసిన గాడి.

బభ్రాజమానము రూ.చూ. భభ్రాజమానము. వి. తెలివితక్కువతనం; విశే. వెర్రిది, తెలివితక్కువది.

బమ రూ. బమ్మె. బ్రమ. వి. భ్రాంతి, భ్రమ. ప్రబంధ 186.

సం. భ్రమ-. భ్రాంతి, మోహం; ప్రా. భమ-.

<ప్రా. భమ-.

బమపుర్వు వి. తుమ్మెద.

బమి వి. భ్రమణం.

సం. భ్రమి-. తిరిగేది, తిరుగుడు; ప్రా. భమి.

<ప్రా. భమి.

బమిపుర్వు వి. తుమ్మెద, భ్రమణం. సాంబ. తిర్య. 79.

బమెర రూ.చూ. బమ్మర. వి. భ్రమ, భ్రాంతి.

బంపె వి. గశ్ని, శపం. కశ్ని.

బంపు వి. పళ్ళపాచి, పాకుడు. చంద్రాంగ. 1.61.

క. బంపు, బొంపు, బొంబలు; త. పయుక్కు. పయుంపు; మ. పయుప్పు.

<క. బంపు.

బంబ విశే. పెద్దది, స్థూలం. ప్రభు. 3 ఆ.

క. బంబ. పంప. గొట్టం, అగ్నిమాపక యంత్రం.

బంబాసె రూ.చూ. బొంబాను. వి. రోలులాంటి ఫిరంగి.

బంబాసు రూ.చూ. బొంబాను. వి. రోలులాంటి ఫిరంగి.

బంబు వి. వెదురు బొంగు.

ఇం. *Bamboo.* వెదురు.

<ఇం. Bamboo.

బంబోతు రూ.చూ. పెంబోతు. విశే. ఎద్దులా బలిసిన మేనున్నవాడు. ఆం.భా. 2.120; వి. బలిసిన ఎద్దు.

బమ్మ రూ.చూ. బొమ్మడు. వి. 1. హిరణ్యగర్భుడు, బ్రహ్మదేవుడు. కవి.ర. 1.62; 2. బ్రాహ్మణుడు; 3. వేదం.

బమ్మకట్టు వి. 1. బ్రహ్మసంబంధం. అచ్చ.రా.సుందర. 178; 2. బ్రహ్మాస్త్రబంధం. బమ్మకొలము వి. బ్రాహ్మణకులం. అచ్చ.రా.సుందర. 60. బమ్మజెముడు వి. కంచెల్లో పెంచబడే ఒకరకం ముళ్ళమొక్క (Euphorbia antiquorum). బమ్మతండ్రి వి. విష్ణువు. బమ్మదండి వి. బ్రహ్మదండి. బమ్మదేవరతండ్రి వి. విష్ణువు. బమ్మదొండ రూ. బెమ్మదొండ, బ్రహ్మదొండ. వి. దొంతలో ఒకరకం కలుపమొక్క (Echinops ehcinatus). బమ్మబమ్మలగు అ.క్రి. ఆందోళనపడు. బమ్మమేడి రూ.చూ. బొమ్మమేడి. వి. బ్రహ్మమేడి. బమ్మయమ్ము (-అమ్ము[1]) వి. బ్రహ్మాస్త్రం. అచ్చ.రా. సుందర. 60. బమ్మరక్కసి వి. పారుటసుర.

**బమ్మరాకాసి** వి. బ్రహ్మరాక్షసి. రసిక. 3.174.

**బమ్మచారి** రూ. బమ్మాచారి, బమ్మాసారి, బొమ్మసారి, బొమ్మాచారి, బ్రమ్మాచారి. వి. వటుడు, బ్రహ్మచారి. వైజ. 4.11.

సం. *బ్రహ్మచారిన్.* వటువు, బ్రహ్మచారి; ప్రా. *బంభచారి, బంభయారి*; జై.మహా. *బంభియారి*; అ.మా. *బంభచారి, బంభచేర, బంభయారి.*

<నం. బ్రహ్మచారిన్.

**బమ్మఁడు** రూ.చూ. బొమ్మఁడు. వి. బ్రాహ్మణుడు. వైజ. 4.33.

**బమ్మర** రూ. బమెర, బమ్మరి, బమ్మెర, బవిరి[2], బొమ్మర, బొమ్మలు, బొమ్మెర, బ్రమరి[2]. వి. భ్రాంతి. శాల్ల.నం. 10.35.

సం. *భ్రమ-, భ్రామర-.* మూర్ఛరోగం, బ్రహ్మచారి; ప్రా. *భమ-.* భ్రమణం, *భమణ-.* భ్రమణం; అ.మా. *భమ*; పా. *భమర.*

**బమ్మరపడు** అ.క్రి. దిగ్భ్రమచెందు. ద్వి.భాగ. 1.10. **బమ్మరపోవు(-పోవు)** అ.క్రి. దిగ్భ్రమచెందు. రం.రా.యు. 328. 14 పం. **బమ్మరించు** అ.క్రి. 1. చాంచల్యంపొందు. భార. విరా. 2.301; 2. భ్రమించు, దిద్దిర తిరుగు. భోజ. 5.64. <బమ్మర + -ఇంచు[3]. **బమ్మరిలు** రూ.చూ. బమ్మరిలు. అ.క్రి. దిగ్భ్రమచెందు. **బమ్మరిల్లు** రూ. బమ్మరిలు. అ.క్రి. 1. దిగ్భ్రమచెందు. భార. ఆది. 7.45; 2. భ్రమించు, దిద్దిరతిరుగు. విక్ర. 4.50.

**బమ్మరి** రూ.చూ. బమ్మర. వి. భ్రమ.

**బమ్మరించు** చూ. బమ్మర.

**బమ్మరిలు** చూ. బమ్మర.

**బమ్మరిల్లు** చూ. బమ్మర.

**బమ్మాచారి** రూ.చూ. బమ్మచారి. వి. బ్రహ్మచారి, వటుడు. సాంబ. మాన. 7.

**బమ్మాసారి** రూ.చూ. బమ్మచారి. వి. బ్రహ్మచారి, వటువు.

**బమ్మె** రూ.చూ. బమ. వి. మోహం.

**బమ్మెత** రూ. బమ్మెత్త, భ్రమత. వి. 1. మోహం; 2. మోహపెట్టటం.

సం. *భ్రమత్వ-.* మోహం.

<నం. భ్రమత్వ-.

**బమ్మెతకత్తె** వి. మోహపెట్టేది, భ్రమ కలిగించేది. పండి. చ. 2.343.

**బమ్మెత్త** రూ.చూ. బమ్మెత. వి. బమ్మెర, మోహం.

**బమ్మెర** రూ.చూ. బమ్మర. వి. 1. భ్రాంతి. అం.భా. 1.103; 2. మోసం, వంచన.

**బమ్మెరగొను(-గొను)** అ.క్రి. భ్రమపెట్టు, మోసపుచ్చు. **బమ్మెరగొల్పు(-గొల్పు)** అ.క్రి. భ్రమపెట్టు, మోసపుచ్చు. పార్వ. 4.163. **బమ్మెరపోక** వి. బమ్మెరపోవటం, భయంతో దిగ్భ్రమ చెందటం. వేంక. పంచ. 2.176. **బమ్మెరపోవు** అ.క్రి. భయవిస్మయాదులతో మూఢమగు. భార. ఉద్యో. 4.22.

**బయకము** చూ. బయలు. రూ. బయంక. వి. గానం. పండి.చ. 5.435.

**బయకాఁడు** వి. 1. గానవిద్యోపాధ్యాయుడు. శృం.నై. 7.146; 2. ఇంద్రజాలాలు రెండింటిలో నేర్పున్నవాడు. కువ.చ. 1.125; 3. గాయకుడు, పాటపాడేవాడు. ఉ.రా. 4.223; 4. స్వరాదుల్ని ప్రకటించేవాడు, వైణికుడు. సాంబ. మాన. 10; 5. రోగం మేరం వెనుక శబ్దాల్ని చేసేవాడు.

**బయకారము** చూ. బయలు.

**బయకారి** చూ. బయలు.

**బయకారించు** చూ. బయలు.

**బయఁకలు** రూ. బయికలు, బయ్యకలు, బయ్యంకలు, బయ్యఁకలు, బైకలు. వి.బ.వ. వేవిళ్ళు, గర్భిణీలక్షణం. సిం.ద్వా. 3.31.

సం. *భైక్షక-.* భిక్షాన్నం; ప్రా. *భయక్ఖ-, బేక్ఖ-;*

క. *బయకె, బయ్కె.* ఆశ, వాంఛ, కోరిక; కొడ. *బయకె*; త. *పైక, వయం, వయప్పు, వయా*; మ. *వియాక్క, వ్యాక్క.* గర్భవతి కోరికలు.

<ప్రా. భయక్ఖ-.

**బయజారిలు** చూ. బాజారు. వి.బ.వ. ఉప్పువర్తకులు. నె.గా. C.P.4. క్రీ.శ. 1746.

**బయటికంపలవారు** చూ. బయలు.

**బయటకుపోవు** చూ. బయలు.

**బయటచేరు** చూ. బయలు.

**బయటపడు** చూ. బయలు.

**బయటఁబెట్టు** చూ. బయలు.

**బయటి కమ్మరి** చూ. బయలు.

**బయటికి పొక్కు** చూ. బయలు.

**బయటికిపోవు** చూ. బయలు.

**బయటికిఁ బెట్టు** చూ. బయలు.

**బయటి దర్వాజా** చూ. బయలు.

**బయటి వరపాల** చూ. బయలు.

**బయటివాకిలి** చూ. బయలు.

**బయంద** రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం.

**బయలిడీపములు** చూ. బయలు.

**బయలీక** చూ. బయలు.

**బయలీదించు** చూ. బయలు.

**బయలు** రూ. బయిలు, బాయలు, బాయిలు, బైలు. విణ. 1. స్వచ్ఛం. అడ్డంకి లేనటం. క్రీ.శ. 848; 2. శూన్యం, వట్టిది. భార. భీష్మ. 2.82; 3. వెలుపలివాడు, వెలుపలిది. రం.రా. 59 ప. 20 పం; వి.ఔ. 1. శూన్యప్రదేశం, వట్టిచోటు, ఆవరణాది శూన్యమైన ప్రదేశం. భార. ఆది. 3.42; 2. ఊరు, మందిరం మొదలైనవాటి బహిఃప్రదేశం, వెలుపలిచోటు. భార.శల్య. 1.41; 3. అవకాశం, సందు. భాస్క. రా. అరణ్య. 2.15; 4. ఆకాశం. భీమ. 1.93; క్రి.విణ. శూన్యంగా. దశకు. 6.157.

క. *బయల్, బయిల్, బయలు.* సుస్పష్టత, ప్రసిద్ధి,

బయల్(లు), బయిల్(లు), బయలు. ఖాళీస్థలం, పొలం, సమప్రదేశం; కొఁడ. బె.లి. ధాన్యం పొలం: తు. బయిలు, బైలు. బహిరంగమైన, బయిలు, బైలు. ఒకరకం పల్లపు పంటభూమి; త. వయల్, వయక్కల్. ధాన్యం పొలం, వ్యవసాయ భూమి, ఖాళీస్థలం, సమప్రదేశం, వయలై. ఖాళీస్థలం, సమప్రదేశం, వయఱ్-కరై, వయఱ్-కాడు. ధాన్యం పొలం, సారవంతమైన భూమి; మ. వయల్, వైల్. ధాన్యం పొలం; కో. బగ.ల్. సుస్పష్టత (ఎత్తు ప్రదేశంనుంచి చూసే దృశ్యం) విశాలంగా తెరచిన (తలుపు); గోం. వాఁడ్, వాఁడర్. పొలం, వావలె. పొలంలోకి, వావులె. పొలంలో; బెడా. పొలం, వేడాలె. పొలంలో; కొలా. వె.గడ్. (వె.గట్-). భూమి, వేగడ్. సాగు ఎత్తివేసిన భూమి; పర్జి. వాయ. ధాన్యం పొలం; పో.చూ. సం. బహిస్. బయలు, వెలుపల; ప్రా. బహి.

<కి. బయలు.

బయకారము వి. 1. గానం. పెద్దన దాటువు; 2. యౌవనంలో బయల్పడే శృంగారచేష్ట. శాశ్వ.సం. 17.534. <బయలు+-కారము$^{3}$. బయకారి విఙ. 1. సంగీతం పాడేవాడు (విలాసవంతుడనే భావం). శృం.నై. 7.146; 2. విలాసవతి. <బయకారము+-ఇ$^{9}$. బయకారించు అ.క్రి. శృంగారచేష్టలు ప్రకటించు. శాశ్వ.సం. 17.553. <బయకారము+-ఇంచు$^{3}$. బయటకంసలవారు విఙ.బ.వ. పొరుగూరునుంచి వచ్చిన కంసాలులు. బయటకుపోవు అ.క్రి. మల విసర్జనకు వెళ్ళు. బయటచేరు రూ.చూ. బైటచేరు. అ.క్రి. ముట్టగు. బయటపడు అ.క్రి. 1. గుప్తంగా ఉండవలసినది బయటికి తెలిసిపోవు; 2. ముట్టగు. బయటఁబెట్టు స.క్రి. రహస్యాన్ని బహిర్గతం చేయు. నిరంకు. 4.34. < బయలు + -అ$^{7}$ + పెట్టు. బయటికమ్మరి వి. గ్రామ గ్రామానికి కొలిమి పనిముట్లతో పోతూ ఊరు బయట గాని గ్రామ చావిడి దగ్గరగాని తాత్కాలికంగా కొలిమి ఏర్పరచుకొని ఆ ఊరి కమ్మరి పని చేసి ముగించి వేరొక గ్రామానికి పోయే ఇనప పనివాడు. < బయలు + -ఇ$^{3}$ + కమ్మరి. బయటికిపొక్కు అ.క్రి. ఇతరులకు తెలియు. బయటికిపోవు అ.క్రి. అధికాచమానానికి పోవు. బయటికిఁబెట్టు(-పెట్టు) అ.క్రి. ఊరకే విరేచనాలగు. బయటిదర్వాజా వి. ఇంటిలోని మొట్టమొదటి ద్వారం. <బయలు+-ఇ$^{3}$+దర్వాజా. బయటిపడసాల వి. బయటి పంచ. <బయలు+-ఇ$^{3}$+పడసాల. బయటివాకిలి వి. ఇంటిలోని మొట్టమొదటి ద్వారం. <బయలు+-ఇ$^{3}$+వాకిలి. బయలిదీపములు వి.బ.వ. ఆకాశ్వతాలు. పండి.చ. 5.418 వ. <బయలు+-ఇ$^{3}$+దీపము+-లు. బయలీత వి. వ్యర్థమైన ఆశ. శాశ్వ.సం. 13.149. <బయలు+ఈత. బయలీదించు స.క్రి. 1. నడిమంత్రాన వదలిపెట్టు. ప్రభు. 7.55; 2. వట్టి ఆశ కలిగించు. <బయలు+ఈదించు. బయలుకట్టి రూ.చూ. బయలుకట్టె. వి. నరి గుంజల పైపైపున అడ్డంగా కట్టిన కట్టె. బయలుకట్టె రూ. బయలుకట్టి. వి. నరి గుంజల పైపైపున అడ్డంగా కట్టిన కట్టె.

బయలుచిమ్ము స.క్రి. బయటికి నడచు. శాశ్వ.సం. 15.43. బయలుదామర (-తామర) వి. మెట్టతామర. గౌ.హరి.పూ. 899 పం. బయలుదేఱు (-తేఱు) రూ.చూ. బయల్దేఱు. అ.క్రి. 1. గృహాదుల్నుండి వెలువడు. దశా. 2.51; 2. పుట్టు. బయలుద్రొక్కు (-త్రొక్కు) అ.క్రి. ప్రకటమగు, వెల్లడిఅగు. పి.శకు. 3.21. బయలువెత్తినదివ్వె వి. 1. పరోపకారార్థమైనది; 2. ఆకాశాని కెత్తిన దీపం. బయలుపడు రూ.చూ. బయల్పడు. అ.క్రి. 1. ప్రకటమగు, వెల్లడగు. భార.విరా. 1.40; 2. కనబడు.వసు. 6.78; 3. నిర్గమించు, వెలువడు. ఉ.రా. 2.61. బయలుపందిలి వెట్టు (-పెట్టు) అ.క్రి. అసాధ్యానికి ఉంకించు. శాశ్వ.సం. 5.71. బయలుపర్చు రూ.చూ. బయలుపఱుచు. స.క్రి. ప్రకాశంచేయు. బయలుపఱచు రూ.చూ. బయలుపఱుచు. స.క్రి. ప్రకటించు. బయలుపఱుచు రూ.చూ. బయలుపఱచు. స.క్రి. బయలుపడచేయు, ప్రకటనచేయు. హర. 5.30. బయలుపూన్చు స.క్రి. ప్రకటించు, వెల్లడిచేయు. చంద్రాంగ. 5.62. బయలుపొలము వి. వర్షాధారంతో పండే నేల. బయలుపోవు రూ.చూ. బయలువోవు. అ.క్రి. బయల్పడు. బయలుమాటలు వి.బ.వ. వ్యర్థాలాపాలు. బయలుముట్టు అ.క్రి. బయల్పడు, భాస్క.శ. 45. బయలుమెఱయు అ.క్రి. బయల్పడు, వెల్లడగు. భార.విరా. 5.368. బయలుమెఱఁగు అ.క్రి. బయటికి మోసంకలదగు. శాశ్వ.సం. 7.2.67. బయలువన్నివయురులు వి.బ.వ. చుట్టూ చుట్టుకొన్న ఉరులు. శాశ్వ.సం. 6.203. బయలువఱుచు (-పఱుచు) రూ. బయలుపర్చు. బయలుపఱచు. బయలుపఱుచు, బయల్పఱచు, బయల్పఱుచు. స.క్రి. బయల్పడచేయు. విక్ర. 1.127. బయలువాకు అ.క్రి. వ్యర్థ ప్రయత్నంచేయు. శాశ్వ.సం. 6.200. బయలువెడలించు స.క్రి. బయటికి వెడలచేయు, నిర్గమింపచేయు. <బయలు వెడలు+-ఇంచు$^{3}$. బయలువెడలు రూ.చూ. బయల్వెడలు. అ.క్రి. 1. బయలుదేరు, నిర్గమించు; 2. సమర్తాడు. బయలువోవు (-పోవు) రూ. బయలుపోవు, బయల్వోవు. అ.క్రి. బయలుపడు, వ్యక్తమగు. నవనాథ. 3.142 ప. 15 పం. బయలెక్కు అ.క్రి. ప్రకటమగు, వెల్లడిఅగు. కకుత్స. 2.28. <బయలు + ఎక్కు. బయలేఱు వి. ఆకాశగంగ. ద్వి.పరమ.వి. 1.31 ప. <బయలు+ఏఱు. బయలైపోవు అ.క్రి. బహిర్గతమగు. శాశ్వ.సం. 11.44. < బయలు + ఐ + పోవు. బయల్దేఱు (-తేఱు) రూ. బయలుదేఱు. అ.క్రి. 1. గృహాదుల్నుండి వెలువడు. ఉ.రా. 1.50; 2. పుట్టు. బయల్నాగెల వి. బయలు నేలల్లో దున్నే నాగలి. <బయలు+నాగెల. బయల్పడు రూ. బయలుపడు. అ.క్రి. 1. ప్రకటమగు, వెల్లడిఅగు. భార.ఆది. 4.44; 2. తెలియు, వ్యక్తమగు. కు.సం. 3.15; 3. నిర్గమించు, వెలువడు. <బయలు+పడు. బయల్పఱచు రూ.చూ. బయలుపఱుచు. స.క్రి. ప్రకాశం చేయు. <బయలు+పఱచు. బయల్పఱుచు రూ.చూ. బయలుపఱుచు. స.క్రి. బయలుపడచేయు, ప్రకటనచేయు. ఉ.రా. 3.96. <బయలు+పఱుచు. బయల్వట్టు అ.క్రి.

స్థానం విడిచిపోవు. పారిపోవు. ఉ.రా. 1.285. <బయలు + పట్టు. బయల్వెడలు రూ. బయలువెడలు. అ.క్రి. బయలుదేరు, నిర్గమించు. వాల్మీ. 2.65. <బయలు + వెడలు. బయల్‌పోవు రూ.చూ. బయలుపోవు. అ.క్రి. 1. బయలుపడు, వ్యక్తమగు ; 2. వెలుపలికిపోవు. <బయలు + పోవు.

బయలెక్కు చూ. బయలు.

బయలేలు చూ. బయలు.

బయలైపోవు చూ. బయలు.

బయల్దేలు చూ. బయలు.

బయల్నాగెల చూ. బయలు.

బయల్పడు చూ. బయలు.

బయల్పఱచు చూ. బయలు.

బయల్పఱుచు చూ. బయలు.

బయల్పట్టు చూ. బయలు.

బయల్వెడలు చూ. బయలు.

బయల్వోవు చూ. బయలు.

బయసుమాలు రూ.చూ. బయిసిమాలు. అ.క్రి. ప్రాలుమాలు.

బయాఉంటా రూ. చూ. బయాహుండా. వి. బియ్యంతెల్లగా ముతగ్గా ఉండేరకం.

బయాకొండ రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండేరకం.

బయానా రూ. బజానా. వి. సంచకరువు.

బెం. బయానా ; హిం. బయానా. ముందుగా ఇవ్వబడ్డధనం ; ఉ. అర. బైఆన.

<ఉ. బైఆన.

బయావారి విశ. వివరమైన.

హిం. బయాన్. కథనం, లెక్క, వివరం, సంజాయిషీ, వాఙ్మూలం ; ఉ. పార. బయావారి. వివరాలతో, విశదంగా.

<ఉ. బయావారి.

బయాహుండా రూ. బయుండ, బయాఉండా, బయాకొండ, బయ్యఉండ, బయ్యండ, బయ్యాఉండా, బయ్యాండ, బైగొండ. వి. బియ్యంతెల్లగా ముతగ్గా ఉండే రకం.

బయికలు రూ.చూ. బయఁకలు. వి.బ.వ. వేవిళ్ళు.

బయిజ రూ.చూ. బైజు. వి. ప్రలాపం, అర్థంలేనిమాట.

బయిఠాయించు అ.క్రి. కదలక కూర్చొను.

హిం. బైఠ్‌నా. కూర్చుండటం, బైఠానా. కూర్చొబెట్టటం.

<హిం. బైఠా(నా) + -ఇంచు[3].

బయిదాలము రూ.చూ. బైదాలము. వి. కోపం, కినుక.

బయిరవాసము రూ.చూ. బైరవాసము. వి. అంగవస్త్రం.

బయిరాగి రూ.చూ. బైరాగి. వి. శూద్రసన్యాసి.

బయిరి రూ.చూ. బైరి[1]. వి. శ్యేనభేదం, ఒకజాతిడేగ.

బయిరూపము మి. వి. పైకికనిపించే రూపం. రాఘ. సం. 14.128.

సం. బహిస్. బయలు ; సం. రూప-. ఆకారం.

<సం. బహిస్ + సం. రూప- + ము.

బయిలగు చూ. బయిలు.

బయిలు రూ.చూ. బయలు. వి. బొ. 1. ఊరు, మందిరం మొ.న వాటి బహిఃప్రదేశం, వెలుపలిచోటు ; 2. శూన్యప్రదేశం, వట్టిచోటు, ఆవరణాది శూన్యమైన ప్రదేశం ; 3. ఆకాశం ; 4. అవకాశం, సందు ; విశ. 1. శూన్యం, వట్టిది ; బహిర్భూతుడు, వెలుపలివాడు, బహిర్భూతం ; 3. ప్రకటం, వెల్లడైంది ; క్రి. విశ. శూన్యంగా.

బయిలగు రూ. చూ. బైలగు. అ.క్రి. బయటపడు. <బయిలు + అగు.

బయిసణ రూ. చూ. బైసణ. వి. పిడె సొరకాయయొక్క బంధనం.

బయిసి రూ. బగిసి[2], బవిసి, బైసి. వి. 1. అనుగ్రహం, దయ. బసవ. 5.310 ; 2. భాగ్యం. నార. పంచ. 1.83 ; 3. గౌరవం, గొప్పతనం. ద్వి. సార. చ. 2.38 ; 4. మేర, హద్దు ; 5. శోభ. సొంపు ; 6. సత్తువ ; 7. సిగ్గు.

సం. భవిష్య-. కాబోయేది, ఆసన్నమైనది.

బయిసిమాలించు స.క్రి. గౌరవం చెరచు. వైజ. వి. 2.84. <బయిసిమాలు + -ఇంచు[3]. బయిసిమాలు రూ. బయసుమాలు. అ.క్రి. 1. శోభతరుగు, సొంపుచెడు. కాశీ. 2.85 ; 2. మర్యాద తప్పు. పరమ. 4.110 ; 3. మేరమీరు, హద్దుమీరు. శశా. 2.96.

బయిసికిలు రూ. బైసికిలు, ప్రయాణసాధనం.

ఇం. *Bicycle*. రెండుచక్రాలుండే ప్రయాణసాధనం సైకిలు.

<ఇం. Bicycle.

బయిసుక రూ.చూ. బైసుక. వి. 1. నియమం, ఏర్పాటు ; 2. ప్రతిజ్ఞ ; 3. నెలవు, స్థిరనివాసం.

బయేరుసామి వి. వానకోసం ఆరాధించే ఒకగ్రామ దేవత.

బయ్యఉండ రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం.

బయ్యకపల్ల వి. పక్షివిశేషం. హంస. 3.12.

బయ్యకలు రూ.చూ. బయఁకలు. వి.బ.వ. వేవిళ్ళు.

బయ్యంక రూ.చూ. బయకము. వి. నాట్యవిశేషం.

బయ్యంకలు రూ.చూ. బయఁకలు. వి.బ.వ. వేవిళ్ళు.

బయ్యఁకలు రూ.చూ. బయఁకలు. వి.బ.వ. వేవిళ్ళు, దౌహృదం. ఆం. భా. 2.109.

బయ్యండ రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం.

బయ్యఁడు వి. మందుడు, సోమరి ; 2. సీమడు.

బయ్యవ వి. బైరవుడు. (ఇది తిమ్మన, తిప్పయలాంటిది).

బయ్యవబోకతేజలు వి.బ.వ. కుక్కలు. కకుత్స్థ. 4.78.

బయ్యము వి. భయం.

సం. భయ-. భయం, వెరపు, జడుపు ; ప్రా. పా. భయ- ; వం. భౌ. భయం, అపాయం.

<సం. భయ-.

బయ్యా[1] వి. పిచ్చివాడు.

హిం. ఉ. బైజ్. పిచ్చివాడు.

<ఉ. బైజ్.

బయ్యా[2] వి. సోదరుడు.
హిం.ఉ. భాఈ. సోదరుడు.
<ఉ. భాఈ.

బయ్యాఉండా రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం.

బయ్యాండ రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం.

బరఅయిపోవు అ.క్రి. కాల్వల్లో కొన్ని కుండల అంచులు విరిగి పోవు.

బరం రూ.చూ. బరమా. వి. రాతికి రంధ్రాలు తొలచే యాంత్రిక సాధనం.
సం. బల-. శక్తి ; హిం. బర్.

బరక[1] విశే. బిరుసు, గరుకైన ; వి. 1. పనికిరాని పొలం ; 2. నూక.
కొండ. బర్క్. కరకుతనం, ముతక.

బరక[2] వి. నవారుమగ్గం అచ్చులో తంతిఊచలకు మధ్య వేసిన వెదురు.
బరకనేల వి. 1. చవిటినేల ; 2. గరుప కలిసిన ఎర్ర నేల ; 3. వర్షాధారంతో పండేనేల.

బరకట విశే. అసత్యం, పొల్లు. వేంక. మా. 5.38. దశా. 7.289.

బరకటం రూ.చూ. బర్కటం. వి. వెంపలి మాదిరిగాను అంతకంటె సన్నంగాను ఉండే కలుపుమొక్క.

బరకము వి. 1. ఒకరకం గోనె, ఎక్కువ గోనెలు కలిపికుట్టిన ఒక విధమైన ఆస్తరణం. ఆం. భా. 2.266 ; 2. దూది బరువు.
సం. భారక-. బరువు ; ప్రా. భారగ-, భారయ-.
<సం. భారక-.

బరకమ్మి వి. అంచనాకు తక్కువ.

బరకాస్తుచేయు రూ.చూ. బరఖాస్తుచేయు. అ.క్రి. కరగచేయు.

బరకి వి. ఒకరకం చిన్నచెట్టు (Alchornea mollis).

బరకిలాఫు రూ. చూ. బర్‌కిలాఫ్. అవ్య. వ్యతిరేకంగా.

బరకు రూ.చూ. బరుకు. స.క్రి. ఉలవ, కంది మొ. చెట్లు పెరుకు.

బరకుంకుమలు రూ. బొరకుంకుమలు. వి.బ.వ. బరంపురం ఒకటో నెంబరుకు చెందిన ధాన్యవిశేషం.

బరఖాస్తుచేయు రూ. బరకాస్తుచేయు. అ.క్రి. పదవినుంచి తొలగించు.
హిం. బర్‌ఖాస్త్. విడుదలచేయబడ్డ, డిస్మిసుచేయబడ్డ, డిసాల్వుచేయు ; ఉ.పార. బర్‌ఖాస్త్. ఆఫీసునుండి తోసి వేయటం, తిరిగి పిలవటం, వెళ్ళిపోవటం, న్యాయస్థానాన్ని ఉల్లంఘించటం ;
క. బరఖాస్తు. లేచిన, అసెంబ్లీ వాయిదా వేయటం ; త. పర్‌క్కాస్త్.
<ఉ. బర్‌ఖాస్త్+చేయు.

బరగడ వి. ధాన్యంరాశి మొదలైన వాటిమీద వేసే మట్టి ముద్ర.

బరగడము వి. వృక్షవిశేషం, ఎర్రని పూలుపూసే ఒకరకం మొక్క (Indigofera glandulosa).
హిం. బర్‌గద్. మర్రిచెట్టు, వటవృక్షం.
<హిం. బర్‌గద్.

బరగు వి. ఉపశాఖ, చిన్నకొమ్మ, రెమ్మ. ఆం.భా. 2.37.

బరంకి రూ.చూ. బరివెంక. వి. ఏనుగు దంతాలకు కర్ర వస్తువులకు మెరుగు పెట్టటానికి ఉపయోగించే ఆకులు కలిగిన ఒకరకం చెట్టు (Streblus asper).

బరటా రూ.చూ. బలటా. వి. అడుసు, మట్టితో కట్టిన పిట్టగోడ.

బరటు రూ.చూ. బఱటు. స.క్రి. 1. గోకు; 2. సైగగా గోకు.

బరడ వి. 1. దవ్వ ; 2. సెనగపిండి, ఉల్లిపాయతో కలిపి చేసే కూర.

బరడు రూ. చూ. బఱడు. వి. 1. గరుకైన పట్టు మొ. వి ; 2. పెసరపొట్టు ; 3. చర్మం ; 4. చింత వెలగ మొ. వాటి డొలక.

బరణి[1] రూ.చూ. బరిణె. వి. కాటుక మొ.వి ఉంచే డబ్బి, కరాటం. మను. 1.78.
బరణితెఱ వి. బరణికప్పు, డబ్బిమూత. వాల్మీ. 2.74.

బరణి[2] రూ. బరన, బరని, బరిని, బరెన, బర్ని. భరణి. వి. వైశాఖమాసంలో వచ్చే కార్తె.
సం. భరణి. ఒకానొక నక్షత్రం, ఇరవైఏడు నక్షత్రాల్లో రెండో నక్షత్రం ; ప్రా.పా. భరణి.
<ప్రా. భరణి.
బరణిచుక్క రూ.చూ. బరిణెచుక్క. వి. భరణి నక్షత్రం. సం. భరణి. ఒకానొక నక్షత్రం ; ప్రా. భరణి. <ప్రా. భరణి+చుక్క.

బరతపిట్ట చూ. బరతము.

బరతము రూ. బరితము. వి. పక్షివిశేషం. హంస. 3.12.
సం. భరత-. పక్షివిశేషం.
<సం. భరత-+-ము.
బరతపిట్ట వి. ఒకానొక పక్షి.

బరతరపు రూ.చూ. బర్తరఫ్. వి. ఉద్యోగం నుంచి తొలగించటం.
బరతరపుచేయు స.క్రి. ఉద్యోగం నుంచి తీసివేయు.

బరతరఫి రూ.చూ. బరతరఫీ. వి. తొలగించటం.

బరతరఫీ రూ. బరతరఫి. వి. తొలగించటం.
హిం. బర్‌తరఫ్. తొలగింపు ; ఉ. బర్‌తరఫ్. పదచ్యుతి, తీసివేయటం, తొలగింపు ; పార. బర్‌తరఫ్. పృథక్కరణం ; అర. బర్‌తరఫ్. పదచ్యుతి, ఉద్యోగం పోవటం.
<ఉ. బర్‌తరఫ్.

బరతరఫు రూ.చూ. బర్తరఫ్. వి. ఉద్యోగంనుంచి తీసి వేయటం.

బరతుక వి. లాభం.
హిం. బరత్. వ్రతం.
<హిం. బరత్.

బరతుపిట్ట వి. పక్షివిశేషం. హంస. 3.12.

బరత్రఫ్ రూ.చూ. బర్తరఫ్. వి. ఉద్యోగం నుంచి తీసి

చేయటం.

బరదస్తు వి. బలాత్కారంగా దండుగ పనులు చేయటం.

హిం.ఉ. బర్దాష్త్. సహనం; మరా. బర్దాస్త్. వ్యవస్థ, ఆదర సత్కారం; పార. బర్దాష్త్. రక్షణ కోసం పరిగెత్తటం; అర. బర్దాష్త్. శిక్షను తప్పించటానికి పరిగెత్తటం, రక్షణకోసం పరిగెత్తటం.

<ఉ. బర్దాష్త్.

బరవ రూ.చూ. బరణి. వి. వైశాఖమాసంలో వచ్చే కార్తె.

బరవశి రూ.చూ. వారణాసి. వి. కాశి.ద.హిం.శా.సంపు. 10. శా.సం. 633. క్రీ.శ. 8వ శతాబ్ది.

బరవసి రూ.చూ. వారణాసి. వి. కాశి.ద.హిం.శా. సంపు. 10. శా.సం. 616. క్రీ.శ. 8వ శతాబ్ది.

బరవాశి రూ.చూ. వారణాసి. వి. కాశి. కపిలేశ్వరపుర శాసనం. క్రీ.శ. 740.

బరవి రూ.చూ. బరణి. వి. వైశాఖమాసంలో వచ్చే కార్తె.

బరవిసుబత్తు వి. సూచన ప్రకారం, పేర్కొనబడిన విధం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 759.27. క్రీ.శ. 1668.

ఉ. బర్నిస్బత్, బర్. కాని, పైన, నిస్బత్. సంబంధం; పార. బర్. పైన, సమీపంలో, నిస్బత్. ఎవరైనా ఒకర్ని పేర్కొను, బర్నిస్బత్. సూచన ప్రకారం.

<ఉ. బర్నిస్బత్.

బరంతి రూ. బరంతు, భరంతి, భరంతు. వి. పునాదిగోడల మధ్య ఉన్న మట్టితో నింపవలసిన గుంట.

సం. భరన్తి. నింపుతున్నవి.

బరంతు రూ.చూ. బరంతి. వి. పునాదిగోడల మధ్య ఉన్న మట్టితో నింపవలసిన గుంట.

బరందు వి. బ్రాంది.

ఇం. *Brandy*. ఒకరకం మద్యం.

<ఇం. Brandy.

బరవట రూ. బరపటం. వి. తృణ ధాన్యవిశేషం. కాశ. 3.151.

బరవటం రూ.చూ. బరవట. వి. ఒకరకం కలుపుమొక్క.

బరబసు వి. సున్నదనం.

హిం. బర్బస్. జబర్దస్తీ.

బరమజెముడు వి. ముళ్ళు కలిగిన ఒకరకం మొక్క (Euphorbia tortilis).

సం. బ్రహ్మన్. విధాత.

బరమా వి. బరం, బర్మ, బర్మా, బురమ, బురమా, బురుమ బురుమా. వి. తొరపణం, పిడిసాన, కండాణం (వడ్రంగి మొ. వారు కొయ్యలు మొ. వాటికి రాళ్ళవనివాళ్ళు రత్నాలకు బెజ్జంవేసే సాధనం).

సం. భ్రమర-. తిరగటం; స్పా. బర్రెనో, బెర్రీమా.

బరంపురంపట్టు వి. ఒకరకం పట్టు. బరంపురం అనే నగరం ఒరిస్సా రాష్ట్రంలో ఉంది. ఆనగరంలో లభించే పట్టును బరంపురం పట్టు అంటారు.

బరరాతి వి. ఒకరకం రాతి.

సం. బల-. శక్తి; హిం. బర్.

బరవంకలు వి.బ.వ. పక్కచెట్టు, పిచులం, E.I. సంపు. 5. శా. సం. 9. క్రీ.శ. 1480.

బరవసము వి. 1. ధైర్యం. కు.సం. 5.57; 2. అభినివేశం, పట్టుదల. భార.ఉద్యో. 1.151; 3. ఉత్సాహం. భాస్క. రా. కిష్కి. 4.14; 4. విస్మృతి, పరవశం.

సం. భారవశ-. బరువుకు లోబడినది; హిం. భరోసా-. నమ్మకం, విశ్వాసం;

క. బరవస. అభినివేశం.

<సం. భారవశ-.

బరహా వి. 1. అక్షరాలు; 2. లిపి; 3. లేఖనం.

క. బరహ.

బరాకు చూ. బరుకు. వి. చెక్కవలసిన రాళ్ళగుట్ట.

బరాటంగాలి వి. ఎర్రదుమ్ముతో బలంగా వీచేగాలి.

సం. వరాటికా. గుడ్డిగవ్వ; హిం. బరాటు.

బరాటి వి. 1. గుమ్మటంలాంటి పనిముట్టు; 2. అడ్డంగా అమర్చిన రాటి.

ఒ. భరాండి. దంచటానికి ఉపయోగించే గుంట.

బరాటిజొన్న వి. జొన్నలలో ఒకరకం.

బరాతము వి. 1. తానీయవలసిన దాన్ని మరొకని వద్దనుంచి తీసుకోవలసిందని వారితో చెప్పటం. ఈవిధంగా లిఖిత పూర్వకంగా ఆజ్ఞ ఇవ్వటం. వేఱు. 65; 2. బహుమతి. పారితోషికం; 3. హుండీ; 4. బత్తెము; 5. అనుమతి; 6. తగాదా; 7. అప్పు ఇచ్చేదాకా ఒకమనిషిని ఋణస్థుడి వద్ద పెట్టటం.

హిం. బరాత్. పెండ్లిజనాలు; ఉ.అర. బరాత్. వారంటు, తనఖా, ఉత్తరం, కమీషను, హవలతు, డ్రాఫ్టు; క. బరాత; త. పరాతమ్, పిరాత్తమ్.

<ఉ. బరాత్.

బరాతముచెప్పు స.క్రి. తన బాధ్యతను ఇతరులకప్పగించు, తనకు బదులుగా బాకీ తీర్చటానికి ఇతరులకు ఆ బాధ్యతను అప్పగించు.

బరాబరి రూ. బరాబరిక, బరాబరీ, బరోబరి. వి. 1. హెచ్చరిక. పల్నా. వ. 15; 2. హెచ్చరిక చేసేవ్యక్తి; 3. సమానం; విశ. 1. సంపూర్ణం. గంధ. 122; 2. సరి అయిన; 3. లక్ష్యంలేని.

హిం. బరాబర్. సమానం, తుల్యం, సమతలం; మరా. బరాబర్-బరోబర. సమానం, సదృశం; ఉ. బరాబర్. సమానశీలం, సమానం, సమతలం, కుశలం; పార. బర్-అ-బర్. సమం, సదృశం, స్పర్ధ, బర్-అ-బర్. సమత్వం, సాదృశ్యం.

<ఉ. బరాబర్.

బరాబరిచేయు స.క్రి. 1. విచ్ఛిన్నంచేయు. పల్నా.వ. 46; 2. రాజులు మొదలైనవారు నడిచేటప్పుడు కంచుకులు ముందుండి చుట్టూ మూగిన వారిని తొలగించు. పారి. 2.89.

బరాబరిక రూ.చూ. బరాబరి. వి. హెచ్చరిక. చంద్రాంగ. 3.42.

బరాబరీ రూ.చూ. బరాబరి. వి. 1. హెచ్చరిక; 2. హెచ్చరిక చేసే వ్యక్తి; విశ. 1. సంపూర్ణమైన; 2. సమానమయిన.

బరావర్జు రూ. బరావస్తు, బరావర్దు. వి. 1. జీతాలు మొ. వాటి బిల్లు ; 2. లెక్కకట్టించటం.

హిం. బరామర్ద్. వ్యయభాగపట్టిక ; ఉ. బరావర్ద్. అంచనావేయటం, వ్యయభాగపట్టిక ; పార. బర్-అవర్ద్. అంచనా, లెక్కకట్టటం ; అర. బరావుర్ద్. లెక్కకట్టటం.

< ఉ. బరావర్ద్.

బరావర్తు రూ.చూ. బరావర్జు. వి. ఉజ్జాయింపు, మదింపు.

బరావర్దు యా.చూ. బరావర్జు. వి. ఉజ్జాయింపు, మదింపు.

బరావు వి. పరానికి నాటుకీ మధ్య ఉన్న దూలం.

ఒ. బరావ్ర. లోటును భర్తీచేయటం, బరాండి. దంచటానికి ఉపయోగించే దూలం.

బరావుచెక్క వి. దూలానికి కప్పుకీ మధ్య బిగించే చెక్క.

బరి[1] విశ. 1. దిగంబరమైన, అనావృతమైన, కపదాదులులేని భార. కర్ణ. 3.335 ; 2. కేవలం, వట్టిది.

క. బఱి, బరి, దిగంబరమైన, ఖాళీ ; తు. బరణ్ణుని. ఎండిపోవు, నన్నమగు ; త. వరల్ (వరళ్వ-, వరణ్ట్-). ఎండిపోవ, ఖాళీ, ఇనకనేల ; మ. వఱు. ఖాళీ, ఎండిన, ఆరిన ;

హిం. బరాబరీ. సమానం, హెచ్చు తగ్గులులేని.

< క. బఱి.

బరికట్టియ రూ. బరికట్టె. వి. 1. బరికమ్మి, అలుగులేని ఈటె. కాశ. 2.62 ; 2. దరిద్రుడు. బరికట్టె రూ.చూ. బరికట్టియ. వి. 1. దరిద్రుడు. ఆం.భా. 3.14 ; 2. బరికమ్మి, అలుగులేని ఈటె. బరికమ్మి రూ.చూ. బరిగమ్మి. వి. 1. కామలేని పార ; 2. అలుగులేని ఈటె. బరికాయ వి. కొంటె, గుణహీనుడు. ఆం.భా. 3.12. బరికాయపోటు రూ.చూ. బరిగాయ పోటు. వి. బాలక్రీడా విశేషం. బరిగమ్మి(-కమ్మి) యా. బరికమ్మి. వి. 1. అలుగులేని ఈటె. బసవ. 3.1121 ; 2. కామలేని పార. బరిగాయపోటు రూ. బరికాయపోటు. వి. బాలక్రీడా విశేషం. హంస. 3.146. బరిగాళ్లు(-కాళ్లు) వి.బ.వ. ఆభరణాలులేని కాళ్ళు. నిరంకు. 4 67. బరిజోగి వి. వట్టిజోగి, పాములవాడు. జైమినిభా. 7.82. బరివంద వి. నంద మధ్యభాగంలో తిన్నగా మూడు కాలికలతో రెండు అడుగుల ఎత్తుతో తయారుచేసిన భాగం. బరిపిరికిట్ను పీకు స.క్రి. కోయనక్కరలేక చేతులతోనే పెరుకు. బరిబత్తల వి. దిసమొల. బరిమేను వి. బట్టలులేని శరీరం. భార. కర్ణ. 3.335.

బరి[2] రూ. బఱి వి. 1. పార్శ్వం, పక్క. కు.సం. 11.173 ; 2. హద్దు, మేర, నియమం. కేయూ. 1.36 ; 3. తోత్రం, ఏనుగునుతోలే సాధనవిశేషం. ఆం.భా. 219 ; 4. వేష్టనం, చుట్టు వారటం ; 5. పశువుల బోర ఎముక.

క. బరి, బరకి, బడి. పార్శ్వం, పక్క, అంచు, బది. దగ్గరతనం ; కొడ. బరి. పార్శ్వం (శరీరానికి, నదికి మొ. వి) ; తు. బరి, బది. పార్శ్వం, అంచు ; కో. పయిర్. శరీరంలోని దేహభాగాల పార్శ్వాలు, పక్కలు.

< క. బరి.

బరికాడు వి. తోత్రంతో ఏనుగు పక్కల్ని పొడిచేవాడు, మావటివాడు. నిర్వ.రా. 7.55. బరికొను రూ.చూ. బరిగొను. స.క్రి. పరివేష్టించు, చుట్టుకొను. ఆం.భా. 3.117. బరిగీయు అ.క్రి. కయ్యానికి సిద్ధపడు. బరిగొను(-కొను) రూ. బరికొను. స.క్రి. చుట్టుకొను. వసు. 3.156. బరిగోల(-కోల) వి. 1. తోత్రం, ఏనుగుల్ని తోలటానికి పక్కల్ని పొడిచే అర్ధచంద్రాకారమైన అలుగున్న వేణుదండం. భార. భీష్మ. 2.73 ; 2. కాటికాపరి వాని చేతికర్ర. మార్క. 1.259 ; 3. బాణం. వరాహ. 3.98. బరితప్పు అ.క్రి. హద్దుమీరు. ఆం.భా. 3.25. బరితెగించు స.క్రి. లెక్కచేయకపోవు. బరితెగు రూ.చూ. బరిదెగు. అ.క్రి. పూర్తిగా తెగించు, సిగ్గువిడుచు. బరితోలు వి. పార్శ్వపు చర్మం. బరిదెగు(-తెగు) రూ. బరితెగు. అ.క్రి. హద్దుమీరు, విశృంఖలమగు. ఆం.భా. 3.25. బరిపోటు వి. మల్లబంధ విశేషం, ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. మల్లుప. 3.69, ఆం.భా. 2.209. బరివాగె వి. పక్క, పార్శ్వం. బరివిడుచు స.క్రి. మృగాల్ని పట్టుకోటానికి పురికొల్పు, ఉసికొల్పు. హరిశ్చ 2.20. బరిపెడలు అ.క్రి. యుద్ధానికి బయలుదేరు, తెగించి దండెత్తు. కు.సం. 9.91. బరిపోవవిడుచు స.క్రి. స్వేచ్ఛగా వదలు. క్రీడా. 55 వ. < బరి[2] + పోవ + -అ[7] + విడుచు. బరిశూల మి.వి. పక్కనొప్పి.

బరి[3] వి. 1. శత్రువు. కాశీ. 6.294 ; 2. దొంగ, చోరుడు. మను. 5.82.

బరి[4] రూ. బిరి. వి. గీత, దార, రేఖ, పట్టె. హరి.ఉ. 8.5.

క. బరె, బరి. రాయు, గీయు, బరె. రాయటం, గీతలు, దారలు ; కొడ. బరె. దార ; తు. బరె. చేతిమీద వాతలు పెట్టు ; త. వరై. గీత ; మ. వర. గీత, దార.

< క. బరె.

బరి[5] రూ.చూ. బడి[3]. వి. పాతగాల.

బరిక యా.చూ. బరికె. వి. 1. ఎండిపోయిన తాటిమట్ట ; 2. చిన్న రెమ్మ ; 3. రువ్వ ; 4. బెత్తం.

బరికి రూ.చూ. బరికె. వి. 1. చువ్వ, సన్నని నిడుపైన రివ్వ ; 2. గరుకుగల ఎండిన తాటిమట్ట ; విశ. చింపిరి.

బరికె రూ. పటికి[1], బరిక, బరికి, బరిగ[3]. విశ. చింపిరి. మార్క.5.141 ; వి. 1. చువ్వ, సన్నని నిడుపైన రివ్వ. పి.శకు. 3.201 ; 2. గరుకు గల ఎండిన తాటిమట్ట.

బరిగ[1] రూ. బరిగి[2], బరిగె[1], బరుగు[2], బలిగి, బలిగె. వి. చూరుకట్టుకు వాడే మెలిపెట్టిన ఆకు.

బరిగగొంగడి రూ. బరిగ్గొంగడి. వి. దారలు దారలుగా నేసిన గొంగడి. బరిగ్గొంగడి రూ.చూ. బరిగగొంగడి. వి. దారలు దారలుగా నేసిన గొంగడి. బరిగ్గొరె రూ.చూ. బరిగెగొర్రె. వి. ఉవరి దారలవంటి దారలు గల గొర్రె.

బరిగ[2] వి. ధాన్యం, నిలవజేసే పెద్ద బుట్ట.

బరిగ[3] రూ.చూ. బరికె. వి. బెత్తం.

బరిగి[1] విశ. ఏమీలేని, శూన్యమైన.

క. బఱె, బఱి, బఱు, బఱు, బఱుపు, బఱుదు, బరదు, బద్దు, బఱుప. శూన్యమైన, ఖాళీమైన ; కొడ. బరి. కేవలం, ఊరికే ; తు. బజి. ఖాళీ, కేవలం,

పనికిరాని: త. వఱల్, వఱతు, వఱుమై. శూన్యం, వఱమ్, వఱన్. ఎండిపోవు, పిల్చటం, మెట్టనేల; మ. వఱు. ఖాళీ; కో. వెరుక్. దారుకాచే చిన్న మాంసం ముక్క; తొ. పెఱియి. పనికిరాని; గోం. వెరొన్డ్. ఒక మనిషి; కొం. వరి. కేవలం, ఏమీలేని; కుఇ. వరి. కేవలం; కువి. వరి. ఖాళీ, గవ్వారి, వ్వరరికేఅలి. ఖాళీచేయు, వ్వరైయిఅఇయతి. ఖాళీఅగు, వరానికినై. ఖాళీచేయు; పర్జి. వరి. ఖాళీ; గ. ఒల్లా. వయ్కె. ఖాళీ; బ్రా. బీర. అప్పుడే. సాధారణంగా. బీరఘా. స్వచ్ఛం. సాధారణం.

బరిగిరౌతు వి. జీనువెయ్యని గుర్రం ఎక్కేరౌతు. ఆం.భా. 2.203.

బరిగి[2] రూ.చూ. బరిగ[1]. వి. చూరుకట్టుకు వాడే మెలిపెట్టిన ఆకు.

బరిగిగొర్రె రూ.చూ. బరిగెగొర్రె. వి. ఉదత దారల వంటి దారలు గల గొర్రె.

బరిగె[1] రూ.చూ. బరిగ[1]. వి. చూరు కట్టుకు వాడే మెలిపెట్టిన ఆకు.

బరిగెగొర్రె రూ. బరిగిగొర్రె, బరిగ్గొర్రె, బర్గిగొర్రె. వి. ఉదత దారల వంటి దారలు గల గొర్రె.

బరిగె[2] రూ. బరుగ[1], బురగ, బురుగు[3]. వి. 1. ధాన్యవిశేషం. హంస. 4.127; 2. ఒకరకం గడ్డి (Bombax Malabaricam).

క. బరగు, బరగల్. ఒకరకం ధాన్యం; త. వరకు. మామూలు జొన్నలు; మ. వరకు.

< క. బరగు.

బరిగెపిషాణం వి. ఒకరకం వడ్లు. బరిగెలు వి.బ.వ. ఒక రకం ఆహార ధాన్యం (Panicum Miliaceum).

బరిగ్గివ్రె వి. నీరింకిన వాగుల్లో సాగుచేసి పండించే తీగపైరు.

బరిగ్గొంగడి చూ. బరిగ[1].

బరిగ్గొర్రె చూ. బరిగ[1].

బరింక రూ.చూ. బరివెంక. వి. ఏనుగుదంతాలకూ, కర్రవస్తువులకూ మెరుగు పెట్టటానికి ఉపయోగించే ఆకులు కలిగిన ఒకరకం చెట్టు (Streblus asper).

బరిచి రూ.చూ. బరిచీ. వి. ఈటె, కుంతం. ఆం. భా. 2.217.

బరిచీ రూ. బరిచి, బరిజీ, బరికీ. బరిస, బరిపె, బర్చి. వి. ఈటె, కుంతం, బల్లెం. ద్వి. సారంగ. 2. భా. 1.

హిం. బర్చా, బర్చీ. బల్లెం; మరా. బర్చా. ఈటె, బల్లెం; ఉ. బర్చీ. బల్లెం; పార. బర్చా. ఈటె, బల్లెం, బర్చీ. చిన్నబల్లెం.

< ఉ. బర్చీ.

బరిజీ రూ.చూ. బరిచీ. వి. ఈటె, బల్లెం.

బరిడె రూ. బరిడె. వి. బరిణె.

బరిడెగవ్వ రూ. బరిణెగవ్వ. వి. భక్ష్యవిశేషం. హంస. 1.105.

బరిడెవురుస రూ.చూ. బరిణెపురుగు. వి. బొద్దిక.

బరిణ రూ. చూ. బరిణె. వి. కాటుక మొ.వి ఉంచుకొనే చిన్న డబ్బి. కాశీ. 4.105.

బరిణి రూ. చూ. బరిణె. వి. పునాది గోడల మధ్యనున్న మట్టితో నింపవలసిన గుంట.

బరిణిక రూ.చూ. బరివెంక. వి. ఏనుగు దంతాలకు, కర్రవస్తువులకూ మెరుగు పెట్టటానికి ఉపయోగించే ఆకులు కలిగిన ఒకరకం చెట్టు (Streblus asper).

బరిణివురుస రూ.చూ. బరిణెపురుగు. వి. బొద్దింక.

బరిణియ రూ.చూ. బరిణె. వి. కాటుక మొదలైనవి. ఉంచుకొనే కరాటం, చిన్నడబ్బి.

బరిణీపురుగు రూ.చూ. బరిణెపురుగు. వి. బొద్దింక.

బరిణె రూ. బరణి[1]. బరిడె. బరిణ, బరిణి, బరిణియ, బర్ని[2], బర్నీ, భరిణ. వి. 1. కాటుక మొదలైనవి ఉంచుకొనే డబ్బి. పి. శకు. 1.96; 2. రాతిస్తంభం బొద్దుకింద తుండిని నిలిపేచోటుకు గుర్తుగా మలిచిన గుండ్రని గుంట.

సం. భరణీ. వహించేది; ప్రా. భరణీ; అమా. భరణీ;

క. బరణి. చిన్నపెట్టి. చైనాజాడీ; కొడ. బరణి. (నెయ్యి, పచ్చళ్ళు దాచటానికి) సన్నని మూతిగల పెద్ద మట్టికుండ; తు. బరణి, బరణె. పింగాణీజాడీ; త. పరణి. నగలపెట్టి, చిన్నపెట్టి, ఒకరకం జాడీ; మ. పరణి. పాత్ర. జాడీ; చూ. సింహ. బరణియ. కుండ.

< ప్రా. భరణి.

బరిణెగవ్వ రూ.చూ. బరిడెగవ్వ. వి. భక్ష్యవిశేషం,

బరిణెపురుగు రూ. బరిడెపురుగు, బరిణివురుగు, బరిణీపురుగు. వి. బొద్దిక, బొద్దింక.

బరిణెచుక్క రూ. బరణిచుక్క. వి. భరణి నక్షత్రం.

సం. భరణీ. ఒకానొక నక్షత్రం; ప్రా. భరణీ.

< ప్రా. భరణి + చుక్క.

బరితము రూ.చూ. బరతము. వి. బరతుపిట్ట. యయా. 5.11.

బరిస్టొడిదారం రూ. చూ. బద్దోరిదారం. వి. అమ్ముపదుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అనిపెంటి దూర్చిన దారం.

బరివి రూ.చూ. బరణి[2]. వి. వైశాఖమాసంలో వచ్చేకార్తె.

బరివిక రూ.చూ. బరివెంక. వి. ఏనుగుదంతాలకూ, కర్రవస్తువులకూ మెరుగు పెట్టటానికి ఉపయోగించే ఆకులు కలిగిన ఒకరకం చెట్టు (Streblus asper).

బరివికూజా చూ. బరిణె. వి. కుంకుమ బరిణ ఆకారంలో చేసినకూజా.

బరియా వి. దాందసుడు.

హిం. బరియా. బలవంతుడు.

< హిం. బరియా.

బరియు అ.క్రి. వ్యాపించు, పర్వు. కు. సం. 9.64.

బరిల్లకోయలు వి. ఉప్పునేలల్లో పెరిగే ఒకరకం మొక్క (Salicornia braclwita).

బరివెంక రూ. బరంకి, బరింక, బరిణిక, బరినిక, బర్జింక, బజ్జెంక. వి. పిచులం, పక్కిచెట్టు. కాశ. 3.69. (Streblus asper)

బరిశీ రూ.చూ. బరిచీ. వి. ఈటె. బల్లెం. పద్మ.యు. 17.

బరిస రూ.చూ. బరిచీ. వి. పరిఘం. ఆం. భా. 2.217.

బరిపె రూ.చూ. బరిచీ. వి. గేటుకడ్డీలపైన ఉండే మొనదేలిన

ఇనప బిళ్ళ.

బరిపెపార చూ. బరిచీ. వి. మొక్కలు నరికేపార.

బరీగుండు చూ. బారి². వి. పెద్దసైజురాయి.

బరీదు¹. వి. 1. మహమ్మదీయుల్లో ఒకతెగ. కా. పీఠి. 33 2. ఆతెగవాడు.

ఉ. బరీద్. చీట్లుతీసుకొని పోయేవాడు, దూత ; పార. బరీద్. వార్తాహరుడు, పన్నెండు మైళ్ళదూరం ; అర. బరీద్. పత్రవాహకుడు.

<ఉ. బరీద్.

బరీదు² వి. తూకం సరిపడటం కోసం వేసేరాయి, పడికట్టు రాయి. బహుళా. 5.96.

బరుకలిగొట్టు వి. సువాసనగల ఎర్రని పూలుపూసే ఒకరకం చెట్టు (Haterophragma Roabenghii).

బరుకు రూ. బరకు, బఱుకు. స.క్రి. 1. గోళ్ళతోగీరు, గీకు. భార. ఆరణ్య. 2.28 ; 2. కోలుతేచేటట్లు గీరు ; 3. ఇష్టం వచ్చినట్లు ఆకులు కోయు ; 4. చిక్కిర బిక్కిరగా వ్రాయు : 5. గిలుకు.

క. బెరళ్లు, బెరటు, బెట్లు. తప్పలేక గోళ్ళతోగీరు, బెగరు. గోళ్ళతోగోకు, బరె. బరి. గీయు, రాయు ; తు. బరిపుని. గీచు, గీయు, గోకు, బరెపిని. గీయు ; త. వఱట్లు (వఱణ్డి-). గోకు (వేలిగోళ్ళతో), వఱుకు (వఱుకి-). గోకు, గీరు, వరై. రాయు, చెక్కు, వరి. గీత ; మ. వరెక్క. గీతలుగీయు, రాయు,వరియుక. గీతలు గీయు ; కుఇ. వెర్క (వెర్కి-). దురదపెట్టే భాగాన్ని గోకటం ; కువి. బక్దలి. గోళ్ళతో గీరు, బరుకు ; పర్జి. వర్ప్. గోకు, గీరు.

<క. బరె.

మూ. ద. ద్రా. & మూ. మ. ద్రా. *వర్.

బరుగ¹ రూ.చూ. బరిగె². వి. ఒకరకం ధాన్యం.

బరుగ² రూ. బురగ². వి. చూరుకట్టుకు వాడే మెలిబెట్టినఆకు.

బరుగ³ వి. తోటల్లో పెంచబడే అందమైన పూలుపూసే ఒక రకం మొక్క (Bombax malabaricum).

బరుగు¹ వి. 1. ఏకుతయారు చేయటానికి ఉపయోగించే పుల్ల ; 2. నేసిన గొంగడి బిగింపుకోసం ఉన్ని మగ్గం దోనుగ గాడిలో పండ్లకు బిగించేది.

బరుగు² రూ.చూ. బరిగ¹. వి. చూరుకట్టుకు వాడే మెలిబెట్టిన ఆకు.

బరుజు వి. గస్తై. కోట.

హిం. ఉ. బుర్జ్. బురుజు.

బరుడు చూ. బట్టె. వి. బర్రెలపైపేరుకొన్న బురద.

బరుబోకి చూ. బరి¹. వి. పట్టిబెంకు. శాల్ల.సం. 11.3-4.

బరులు చూ. బరి¹. వి.బ.వ. వస్త్ర విశేషం.

బరువడి అవ్య.(దు. మరల. భోజ. 3.253.

బరువసా రూ.చూ భరవసా. వి. విశ్వాసం, అండ.

బరువు రూ. బలువు². వి. 1. భారం, తూకం. భార.ఉద్యో. 4.192 ; 2. శక్తి. భార.శల్య. 1.134 ; 3. సరకు నింపిన సంచి మొ.వి. ఆము. 6.77 ; విశే. 1. అవశ్యం. శృం.నై. 4.100 ; 2. సహింపరానిది. భాగ. 10 పూ. 79 ; 3. అధికం. శుక. 1.463.

సం. భర-, భార-. బరువు ; ప్రా. భర-, భార- ; అ.మా. భర- ; పా. భర- ; అప. భరు-.

<ప్రా. భర-.

బరువుదించుకొను అ.క్రి. 1. మృతిని పొందు ; 2. ప్రస వించు ; 3. గర్భస్రావం చేయించుకొను ; 4. భారాన్ని కింద ఉంచు. బరువుపడు అ.క్రి. బరువెక్కు. బరువుబద్ద వి. మరమగ్గం బొమ్మకు నిలువు పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. బరువులుదించుకొనుట వి. పీనుగును మోసినవాళ్ళ తరువాత చేసుకొనే ఒక తతంగం. బరువునంచ రూ.చూ. బరువునంచి. వి. పడుగులో అతికిన పేకపోగులు బిర్రుగా ఉండటానికి మగ్గానికి పైన దండెం మీదనుంచి వేలాడదీసి చివర కట్టిన బరువు. బరువునంచి రూ. బరువునంచ. వి. పడుగులో అతికిన పేకపోగులు బిర్రుగా ఉండటానికి మగ్గానికి పైన దండెం మీదనుంచి వేలాడదీసి చివర కట్టిన బరువు.

బరుసర్జసరము చూ. బరుసు.

బరుసు రూ.చూ. బిఱుసు. విశే. 1. బిరుసైన. నవనాథ. 3.146 ; 2. గరుకైన. చంద్రరే. 3.51.

బరుసర్జవరము వి. ఒకజాతి అర్జసరం (వృక్ష విశేషం. అంబష్ఠ).

బరె రూ.చూ. బఱ్ఱె. వి. గేదె.

బరెవ రూ.చూ. బరణి². వి. వైశాఖమాసంలో వచ్చే కార్తె.

బరేటుకట్టె చూ. బరాటి. వి. వంగలగాఉన్న ఒనికర్రలపై హెడ్డుగ్గా వేసిన కర్ర.

బరోబరి రూ.చూ. బరాబరి. వి. 1. హెచ్చరిక. పద్మ.యు. 21 ; 1. హెచ్చరిక చేసే వ్యక్తి.

బర్‌ఖిలాఫ్ రూ. బరఖిలాఫు. అవ్య. వ్యతిరేకంగా.

హిం. బర్‌ఖిలాఫ్. వ్యతిరేకంగా ; ఉ. బర్-ఖిలాఫ్.

<ఉ. బర్-ఖిలాఫ్.

బర్కటం రూ. బరకటం. వి. వెంపలి మాదిరిగాను ఆంతకంటె సన్నగాను ఉండే కలుపుమొక్క.

బర్గిగొర్రె రూ.చూ. బరిగెగొర్రె. వి. ఉదక దారలవంటి దారలుగల గొర్రె.

బర్చీ రూ.చూ. బరిచీ. వి. ఈటె.

బర్జెకెంపు వి. బాగా ఎర్రటి కెంపు రంగు.

బర్తంపట్టు రూ.చూ.భరతంపట్టు. స.క్రి. సాధించు.

బర్తరపు రూ.చూ. బర్తరఫు. వి. ఉద్యోగంనుంచి తొలగించటం.

బర్తరఫ్ రూ.చూ. బర్తరఫు. స.క్రి. ఉద్యోగంనుంచి తొల గించు.

బర్తరఫు రూ. బరతరపు, బరతరఫు, బరత్‌రఫ్, బర్తరపు. బర్తరఫ్, భర్తరపు, భర్తరుపు. వి. ఉద్యోగం నుంచి తొలగించటం.

హిం. బర్‌తరఫ్. వేరుగా, డిస్మిస్‌చేయబడ్డ : ఉ. బర్తరఫ్. వేరైన, విడిపడిన ;

క. బరతరఫ్, పర్‌తరప్పు, పర్‌తిరిప్పు : త. పర్తరప్పు.

<ఉ. బర్తరఫ్.

బర్తి రూ.చూ. భర్తి, భర్తీ. వి. పునాది గోడల మధ్యనున్న మట్టితో నింపవలసిన గుంట.

బర్తిబండి వి. సామానుల బండి.

బర్నె[1] రూ.చూ. బరణి[2]. వి. వైశాఖమానంలో వచ్చే కార్తె.

బర్నె[2] రూ.చూ. బరిణె. వి. రంగుల జాడీ (కొన్ని రంగుల ద్రావకాలు జాడీల్లో పోసి అమ్ముతారు).

బర్నీ రూ.చూ. బరిణె. వి. ఊరగాయలు పెట్టుకోవటానికి వాడే పాత్ర.

బర్నెకవ్వ వి. రాటిపై బద్దలను బిగించి వాటిమధ్య దోర్లించి కట్టిన కొయ్య బరిణె మూత.

బర్ఫీ వి. పంచదార గోధుమపిండితో తయారు చేయబడే తినుబండారం.

హిం.ఉ. బర్ఫ్. ఒకరకం తీపి పదార్థం.

<ఉ. బర్ఫ్.

బర్బూరము వి. వ్యవసాయాది పరికరాల తయారీకి ఉపయోగించే కలప నిచ్చే ఒకరకం చెట్టు (Acacia arabica).

బర్మ రూ.చూ. బరమా. వి. తొలిచిన సన్నటి రంధ్రం.

బర్మా రూ.చూ. బరమా. వి. తొరపణం, పిడిసాన, కందాణం.

బర్మాపురుగు వి. ఆకు తోటల్లో వేసే ఆవిసె చెట్ల కాండం తొలిచే కుమ్మరి పురుగు. బర్మాపులి (-ఉలి) వి. రాతికి బెజ్జాలు కొట్టటానికి వాడే ఉలి.

బ్రర రూ.చూ. పట్టు[2]. వి. పొరలు పొరలుగా ఇసుక ఇతర విధాల మట్టితో కలిసిఉండే నేల.

బ్రరంకి[1] వి. పొదగా పెరిగే చెట్టు (Dioecia aspera).

బ్రరంకి[2] వి. ఒకరకం మొక్క. దాపనబూరి (Euretia buxifolia).

బ్రరి రూ.చూ. బఱ్ఱె. వి. గేదె.

బ్రరికొమ్ము వి. పంగలకర్ర మాదిరి కొసలు క్రమంగా దూరమైన కొమ్ము. బ్రరిగొడ్డు వి. గేదె.

బ్రరు వి. వెనుగాడినుంచి వాసాలమీదకు వేసే చెక్క కప్పు.

బ్రరె[1] రూ.చూ. బఱ్ఱె. వి. గేదె.

బ్రరె[2] వి. 1. సన్నటి తీగల అల్లికగల మంచ; 2. చుట్టుగుడిసె కొప్పు దగ్గర జుత్తు కిందుగా వేసిన పెంటి కట్టు.

బ్రరెమద్దుగు వి. దుద్దుగు జాతికి చెందిన ఒక చెట్టు. బ్రరెవంత వి. ఒకరకం కలుపు మొక్క. బ్రరెబచ్చల రూ.చూ. బ్రరెబచ్చలి. వి. బచ్చలి కూరలో ఒకరకం. బ్రరెబచ్చలి రూ. బ్రరెబచ్చల. వి. ఒకరకం బచ్చలి (Vitis setosa). బ్రరేకుపొగాకు వి. పొగాకులో ఒకరకం.

బ్రరేకుపొగాకు చూ. బ్రరె[2].

బర్లలం వి. గుత్తుల కంటుకొనే సన్నటి ముళ్ళుగల కాయల కలుపుమొక్క.

బర్లు రూ.చూ. బఱ్ఱులు. వి.బ.వ. 1. గేదెలు; 2. నెరెడి వావు.

బర్పు విణ. వ్రదంగి పత్తి రాట్నం కోలకు చుట్టూ గాట్లు పెట్టి గరుకుగా చేసేది.

బఱటు రూ. బరటు. స.క్రి. 1. సైగగా గోకు, గోకు. భార.ఉద్యో. 3.394; 2. గోకు. భోజరా. 6.388.

క. బెరట్టు, బరటు, బెట్టు. తప్ప లేక గోళ్ళతోగీరు, గోకు; త. వఱట్టు (వఱన్డి). గోకు, గీరు (వేళ్ళ గోళ్ళతో).

<క. బెరటు.

బఱదు రూ. బరదు, బెరదు, బొరదు. వి. 1. గరుకు. కు.సం. 6.37; 2. బొబ్బర, చెట్లపై పట్ట. అప్ప. 2.431; 3. చెట్టు పట్టమీది గరకు భాగం, త్వగవయవం. ఆం.భా. 2.37.

బఱబఱ వి. ఊర్పులంలో అయ్యే ధ్వనికి అనుకరణం.

బఱి రూ.చూ. బరి[2]. వి. హద్దు, మేర.

బఱిపోవు(-పోవు) అ.క్రి. హద్దు మీరు. క్రీడా. 168.

బఱుకు రూ.చూ. బరుకు. స.క్రి. గోకు.

బఱ్ఱ వి. బెత్తం, బరిక.

బఱ్ఱెంక రూ.చూ. బరివెంక. వి. సన్నని ఆకుల గల ఒక చెట్టు.

బఱ్ఱియ రూ.చూ. బఱ్ఱె. వి. 1. మహిషం; 2. మహిషి.

బఱ్ఱులు చూ. బఱ్ఱె. రూ. బర్లు. వి.బ.వ. గేదెలు.

బఱ్ఱె రూ. బరె, బ్రరి, బ్రరె[1], బఱ్ఱియ. వి. ఎనుము, మహిషి. గేదె. సీలా. 2.41.

గో. పద్దా, పడపెయ్య. పడ్డ, పెడ్డ, పడపియ, ఆడదూడ, పడపిల. గేదెదూడ, పుడ. దూడ; కొలా. బ్రరెగేదె; గ(బల్లా). బెరె, బెడె. ఆడదూడ (రూపం అనిశ్చయం).

చూ.ప్రా. పెడ్డ-. గేదె, పెడ్డా (అడది).

బఱ్ఱెకుక్క వి. చిన్న బ్రరె. బఱ్ఱెముక వి. పక్క ఎముక. <బఱ్ఱె+ఎముక.

బఱ్ఱెంక రూ.చూ. బరివెంక. వి. పక్కెచెట్టు.

బల్ రూ.చూ. బలు. క్రి.విణ. 1. భయంకరమైన. భార. ద్రోణ. 2.144; 2. పెక్కు, అనేకమైన. భార. కర్ణ. 3.295; 3. మిక్కిలి. భార. సౌప్తి. 1.189; 4. శ్రేష్ఠమైన; 5. విస్తారమైన; 6, తీవ్రమైన; విణ. 1. తీక్ష్ణమైన, వాడి అయిన. భార.శల్య. 1.240; 2. బలిష్ఠమైన, బలంకల. భార.సౌప్తి. 1.185; 3. పెద్ద, గొప్ప, పెను. భార, స్త్రీ. 2.119; 4. దీర్ఘమైన, పొడవైన.

బల్‌దారలమెకము వి. పులి. బల్తలమెకము వి. ఏనుగు. బల్దూరము వి. చాల ఎక్కువదూరం. బల్మక్కువ వి. అధికమైన ప్రేమ.

బల రూ.చూ. బల్ల[1]. వి. 1. జనపబోసి, అంచు, టెర; 2. గుంటకగుజ్జు మూతి చుట్టూ వేసిన జనపకట్టు; 3. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్ద.

బలకండి రూ. బల్కండి. వి. వంటఇంట్లో పొగపోవటానికి కప్పుపైవరకు పెట్టే మట్టి గొట్టం. బల్కండి రూ.చూ. బలకండి. వి. వంట ఇంట్లో పొగ పోవటానికి కప్పు పైవరకు పెట్టే మట్టి గొట్టం.

బలకరము రూ. బలకరము. వి. కావలి, రక్షణం. రామాభ్యు. 5.51; విణ. దృఢం, బలవత్తరం. రాజవా. 2.81.

సం. బలకర-. శక్తిని కలిగించేది.

<సం. బలకర- (అర్థవిపరి.).

బలకరించు అ.క్రి. వ్యాపించు. <బలకరము+-ఇంచు³.

బలకరించు చూ. బలకరము.

బలకాయించు అ.క్రి. అతిశయించు.

హిం. బల్ కానా. రక్షించటం, ప్రేరేపించటం, ప్రోత్సహించటం.

<హిం. బల్కా(నా)+-ఇంచు³.

బలకొట్టు అ.క్రి. ఆ(అని)శ్రుతి పట్టు.

సం. బల-. శక్తి, బలిమి.

<సం. బల-+కొట్టు.

బలకొను మి. అ.క్రి. అతిశయించు. భాగ. 3.967.

సం, బల-. శక్తి.

<సం. బల-+కొను.

బలగరము రూ.చూ. బల(గము. వి. బలగం, మంది.

బలగీటు వి. సారెపై కుండ పెట్టేటప్పుడు పాతలో కింది భాగంలో వేసే గీత.

సం. బల-. శక్తి, బలిమి.

<సం. బల-+గీటు (మిశ్రన.).

బలగుత్తి వి. ఒకరకం వస్త్రు.

సం. బల-. శక్తి, సత్తువ.

<సం. బల-+గుత్తి (మిశ్రన.).

బలంగము రూ చూ. బల(గము. వి. 1. సమూహం, పరంపర. రాఘవ. 2.6 ; 2. బంధువర్గం ; 3. పరిజనం, సేవకులు ; 4. సైన్యం.

బల(గము రూ. బలగరము, బలంగము, బల్గము. వి. 1. పరిజనం, సేవకులు. భార.విరా. 2.190 ; 2. సైన్యం. భార.ఉద్యో. 4.266 ; 3. బంధువర్గం. హరి.ఉ. 2.173 ; 4. సమూహం, పరంపర. రాఘవ. 2.6.

క. బళగ. సమూహం, బంధువర్గం, కుటుంబం, గుంపు ; తు. బళగ. పరిమాణం, కుప్ప, పోగు, రాశి ; త. వలజ్కమ్. పెద్ద కుటుంబం.

<క. బలగ.

బలజి రూ.చూ. బలజె. వి. బంజరు నేలల్లో పొదగా పెరిగే ముళ్ళ కంచె మొక్క.

బలజె రూ. బలజి. వి. బంజరు నేలల్లో పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క.

బలింజె రూ.చూ. బలిజ. వి. శూద్రజాతి విశేషం. దశా. 4.1375.

బలంజెకార్యము చూ. బలిజ. వి. బలిజె కులవృత్తి. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 375. క్రీ.శ. 1444. బలంజెధర్మము చూ. బలిజ. వి. బలింజ కులాచారం. ద.హిం.శా. సంపు. 4. శా.సం. 1375. క్రీ.శ. 1366.

బలటా రూ. బరటా, బల్టా. వి. అడుసు, మట్టిలో కట్టిన పిట్టగోడ.

బలపంరంగు చూ. బలపము.

బలపంరాయి చూ. బలపము.

బలపట్టెసూటం వి. ఉన్ని మగ్గం కాడు బిగింపకు అడ్డదారి పక్కన నేలలో పాతిన గూటం.

సం. బల-. శక్తి.

బలపడు చూ. బలము.

బలపపుపల్ల చూ. బలపము.

బలపపురాయి చూ. బలపము.

బలపము రూ. బల్పము, బళపము, బళాపము. వి. 1. కఠిని, పలక మీద రాసే సాధన విశేషం, పలకపుల్ల. పండి.చ. 4.1199 ; 2. చోరసాధన విశేషం. వేంక. పంచ. 3.199.

క. బళా(ప, బళప. తెల్లని సున్నపురాయి (Lapis Allaris). తు. బళపు, బలపు. సున్నపురాయి, బలపపురాయి ; త. పలప్పమ్, వలప్పమ్. కొయ్యపలకమీద రాయటాని కుపయోగపడే ఒకరకం మెత్తనిరాయి ; మ. వలప్పమ్. ఒకరకం సుద్దముక్క.

బలపంరంగు వి. ముదురు బూడిద వన్నె. బలపంరాయి రూ.చూ. బలపపురాయి. వి. కఠినశిలల ఉపరితలాన్ని అరగదీసి మెరుగుపెట్టటానికి వాడే 'సానరాయి' లేక ఒరిపిడిరాయి. బలపపుపల్ల వి. బలపం, పలకపల్ల. బలపపురాయి రూ. బలపంరాయి. వి. కఠినశిలల ఉపరితలాన్ని అరగదీసి మెరుగుపెట్టటానికి వాడే సానరాయి లేక ఒరిపిడిరాయి. బలపాలంచు వి. వరసగా కడ్డీ మాదిరిగా నేసిన అంచు. బలపాలంచుకమ్మి వి. ఒకరకం చీరకమ్మి.

బలపర్చు చూ. బలము.

బలపఱచు చూ. బలము.

బలపాలంచు చూ. బలపము.

బలపాలంచుకమ్మి చూ. బలపము.

బలబందు రూ.చూ. బాలాబందు. వి. ఒకవిధమైన రాత, లిపి.

బలబల వి. కొంచెం కొంచెం. ధ్వన్యను.

బలబలవేగు అ.క్రి. తెలతెలవారు.

బలబలావురి చూ. బలబల. వి. ఎవరికి వారే అయిపోవటం.

బలము విశ. అధికమైన, అతిశయించిన ; వి. పెద్దల్పు బెంచి

సం. బల-. బలిమి, సత్తువ, సైన్యం.

<సం. బల- (అర్థవిపరి.).

బలపడు రూ. బలపడు. అ.క్రి. దృఢపడు. బలపర్చు రూ. బలపఱచు. స.క్రి. దృఢపరుచు. బలపఱచు రూ.చూ. బలపర్చు. స.క్రి. దృఢపరుచు. బలముచేయు స.క్రి. 1. అతిశయింపచేయు, అధికంగాచేయు. సారంగ. 3.28 ; 2. ఎరువులువేయు. బలమురు అ.క్రి. లావగు, లావెక్కు. బలముటి వి. శరీరబలం కలవాడు. బలంపీట వి. 1. బరువుమూటలు పెట్టటానికి ఉపయోగించే పొట్టి మొరటు కొయ్యచట్టం ; 2. పెద్దల్పు ఎత్తు కలిగిన బెంచి. బలవడు, (-వడు) రూ.చూ. బలపడు. అ.క్రి. అధికమగు.

బలంపీట చూ. బలము.

బలయిక చూ. బలయు.

బలయు స.క్రి. పరివేష్టించు, చుట్టుకొను, ఆవరించు, కప్పు. భార. సభా. 1.48 ; అ.క్రి. 1. మెండుకొను. కు. సం. 1.81 ; 2. కడగు, పూను. భార. ఉద్యో. 4.30 ; 3. బలవంతుడగు, బలంకలదగు, పుష్టికలదగు. భార. కర్ణ. 1.222 ; 4. కలియు, కూడు. వసు. 5.49.

క. బళసు. గుండ్రంగా వెళ్ళు, చుట్టూతిరుగు, చుట్టు, చుట్టబడు, చుట్టబడటం, బళె. ఉంగరం, కడియం, వంకీ; కొర. బళె. గాజు, ఉంగరం; తు. బళె. కడియం, బళెపుని. చుట్టు, చుట్టుకొను, ముట్టడించు; త. వళై (-వ్-, న్త్-). చుట్టు, చుట్టుకొను, చుట్టూనడుచు, (-ప్ప్-, -త్త్-). చుట్టు, గుండ్రం, గాజు, కంకణం, వళైవల్, వళైప్పు. చుట్టుగోడ, పెరడు, వళైవు. గుండ్రం, చుట్టుకొలత, వళైయమ్. ఉంగరం, గుండ్రం, కడియం, వళావు. (వళావి-). చుట్టుకొను, వళాకమ్. చుట్టటం; మ. వలయుక. చుట్టుకొను, వలెక్క. చుట్టు, ఆవరణం, వళచ్చుల్-. చుట్టటం, వళయల్. చుట్టుకొనిఉన్న, వళప్పు. ఇంటిచుట్టూ, చుట్టూఉన్న, వళ. ఉంగరం, కంకణం, వళైయమ్. కంకణం; కో. వళ్వ్. గుండ్రంగా నడుచు, గుండ్రంగాచేయు, వళ్. గాజు, వళ్ వర్క్. చుట్టుమొత్తం; తొ. పళ్ఫ్- (పళ్త్-). (ఎద్దుల్ని, గేదెల్ని) గుంపులుగా తోలు, పళ్ ఐర్. వధించటానికి తీసుకువెళ్ళే గేదెకోటి వెళ్ళేగేదెలు. పళ్. కవ్వంతల మీది ఉంగరం, పళ్. గుండ్రం, గాజు, పాళ్ఫ్. కవ్వం చిలకటానికి ఉపయోగించే తోలుపట్టా.

పో. చూ. సం. వల్-. వలయ-,

మూ. ద. ద్రా. *వల్-, *వళ్.

< మూ. ద్రా. *పళ్

బలయిక వి. పెంపు, అతిశయం. యయా. 5.138.

బలసికొను స.క్రి. (స్వార్థంలో) పరివేష్టించు, చుట్టుకొను. కా. 8.73; అ.క్రి. అతిశయించు, పెంపొందు. మను. 5.71.

బలరక్కసి వి. నాగజెముడు.

సం. బల-. శక్తి. బలం, రాకసి, రక్కసి; ప్రా. రక్ఖసి.

<సం. బల- + ప్రా. రక్ఖసీ.

బలరచ్చిక వి. బీటినేలల్లోను రోడ్లపక్కనా ఏటాలేచి పెరిగే ముళ్ళ కలుపు మొక్క (Argem ɔne mexicana).

సం. బల-. శక్తి, సత్తువ.

బలరామభోగాలు రూ. బల్రామభోగాలు. వి. విశాఖపట్నం తాలూకాలో పండించే వడ్లలో ముఖ్యమైన రకం.

సం. బలరామ-. హలాయుధుడైన బలరాముడు, భోగ-. భోగం.

<సం. బలరామభోగ- + -ము + -లు.

బలవరు చూ. బలము.

బలవంతము వి. 1. మోసం, కపటం. శ్రీరం. మా. 2.63; 2. చద్మం, మిష. ఆం.నా. సం. మాన. 69; 3. మానభంగం; 4. ఒత్తిడి.

సం. బలవత్. బలంకల, బలవన్తమ్. బలవచ్ఛబ్దం యొక్క ద్వితీయైక వచనం.

<సం. బలవన్తమ్ (అర్థవిపరి.).

బలవా రూ. బల్వా. వి. మీదపడి కొట్టటం.

హిం. ఉ. పార. బల్వా. విప్లవం, విద్రోహం, జగడం.

<ఉ. బల్వా.

బలసె రూ.చూ. బలుసు. వి. బంజరు నేలల్లో పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క (Canthium parviflorum).

బలసికొను చూ. బలయు.

బలా రూ.చూ. బలే. అవ్య. 1. ప్రశంసార్థకం. మను. 4.93; 2. ఆశ్చర్యార్థకం. కుత్స. 1.173.

బలాత్కరించు స.క్రి. 1. ఒత్తు; 2. తరుము; 3. నెట్టుకొను.

సం. బలాత్కృ. బలాత్కారం చేయు, నిర్బంధించు. బలంతో పీడించు.

సం. బలాత్కృ + -ఇంచు[3].

బలామూరు వి. 1. దిగదుడుపు. ప్రబంధ. 7.88; 2. చేటు తొలగుగాక, దెబ్బదూరంగా ఉండుగాక.

హిం. బలా. ఆపద, కష్టం, భూతాదులబాధ, రోగం; మరా. బలా; ఉ. బలాదూర్. ఆపదపోవుగాక, బలా. ఆపద, ప్రేతబాధ, భయానకం; పార. బలామూర్. చేటు తొలగుగాక, దెబ్బదూరంగా ఉండుగాక.

<ఉ. బలాదూర్.

బలాదూరుతిరుగు అ.క్రి. పనీపాటు లేకుండా తిరుగు.

బలార రూ.చూ. బలారా. అవ్య. ఆశ్చర్యార్థకం. శుక. 4.13.

బలారా రూ. బలార. అవ్య. ఆశ్చర్యార్థకం. విజయ. 8.162.

బలారె రూ. బలారే, బళారె, బళారే. అవ్య. 1. ప్రశంసార్థకం. పి. శకు. 3.201; 2. ఆశ్చర్యార్థకం. శశా. 3.75.

బలారే రూ. బలారె. అవ్య. 1. ప్రశంసార్థకం; 2. ఆశ్చర్యార్థకం.

బలావతీమాన్యం వి. గ్రామంలోని బారావతీ వృత్తుల వారికి ఇచ్చిన మాన్యం.

హిం. బారహ్. పన్నెండు.

బలి[1] వి. శాంతికోసం క్షుద్రదేవతలకు సమర్పించే నెత్తురు కూడు.

సం. బలి-. ఉపహారం, కానుక, గుహ్యస్థలంలో మొలక వలే ఉండే మాంసపిండం, భోజనం చేయగా మిగిలిన అన్నాద్యంశం, బలిపశువు.

<సం. బలి- (అర్థవిపరి.).

బలికొమ్మ వి. ఒకరకం తీగ (Opilia amentacea). బలిపిరత వి. పంటకు దిష్టి తగలకుండా ఉండటానికి సున్నపు బొట్లు పెట్టి కర్రకు తగిలించి పొలంలో నిలబెట్టిన కుండ. బలిబడుట (-వడుట) వి. మల్లబంధ విశేషం, ముప్పైరెండు విన్నాణాల్లో ఒకటి. ప్రబంధ. 78. బలిబొచ్చె వి. అంచు కాడికి మూతి కొట్టేసి జాతర్లలో బలి తిరిగేవారు పట్టుకొని తిరిగే మట్టిపాత్ర. బలిబోకి వి. అంచు కాడికి మూతి కొట్టేసి జాతర్లలో బలి తిరిగేవారు పట్టుకొని తిరిగే మట్టి పాత్ర. బలిమేయు అ.క్రి. పట్టు పురుగులు బలిసేటట్లు మేతమేయు.

బలి[2] వి. 1. రాతితో కట్టిన ఆర్చికి మధ్యభాగంలో బలంకోసం బిగించిన పెద్దరాయి; 2. బిగింపు.

సం. బలిన్. బలంకలది.

<సం. బలిన్.

**బలిచెక్క** వి. ఏటి కాల్వలో ఇసుక తవ్వి ఎత్తి మెట్టుకు వేసే సాధనం. **బలిచ్చు** రూ. బలించు. అ.క్రి. తాడు మొ. వాటితో గట్టిగా కట్టు. **బలించు** రూ. బలిచ్చు, బల్గించు. అ.క్రి. తాడు మొ.వాటితో గట్టిగా కట్టు.

**బలిగి** రూ.చూ. బరిగ[1]. వి. చూరు కట్టుకు వాడే మెలిబెట్టిన ఆకు.

**బలిగుడు** వి. చెరుగుడు.

**బలిగె** రూ.చూ. బరిగ[1]. వి. చూరు కట్టుకు వాడే మెలిబెట్టిన ఆకు.

**బలిజ** రూ. బలంజె, బలిజీ, బలిజె, బలింజ, బల్జ, బల్జె. వి. ఒకానొక జాతి. హంస. 3.28.

నం. వణిజ-, వాణిజ్య-. వర్తకం ; ప్రా. వాణిజ్జా, వాణిజ్జ-. వాణిజ్యం, వణి, వణియ-. బేహారి, వైశ్యుడు, వణిజ-, వణిజ్జ-. వ్యాపారం; అ.మా. వణి, వణిఅ, వగిజ-, వగియ-. బేహారి; పా. వణిజ్జా, వాణిజ ; అప. వణిజ్జ ;

క. బణంజిగె, బణిజిగె. వణిజుడు, వణిగ్జాతి ; తు. బణిజిగె ; మ. వాణియన్. వణిజుడు, వానిభల-. వాణిజ్యం ; కువి. బ్లంజివిని.

<ప్రా. వాణిజ్జ-.

**బలిజకుమ్మర్లు** రూ. బల్జికుమ్మర్లు. వి.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ. **బలిజసెట్టి** వి. ఒకానొక జాతి. హంస. 5.50.

**బలిజీ** రూ.చూ. బలిజ. వి. శూద్రజాతి విశేషం. రామలిం.శ. 23.

**బలిజె** రూ.చూ. బలిజ. వి. 1. ఒకానొక శూద్ర జాతికి సంబంధించినవాడు. ప్రబంధ. 78; 2. శూద్ర జాతి విశేషం.

**బలిజెరికము** వి. బలిజె జాతి. **బలిజెవాఁడు** విఙ. శూద్రుల్లో ఒక జాతివాడు. ప్రబంధ. 78, ఆం.నా.సం. మాన. 2. **బలిజెవారు** విఙ. బ.వ. బలీ. శూద్రజాతి విశేషం. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 753, క్రీ.శ. 1600.

**బలింజ** రూ.చూ. బలిజ. వి. ఒకానొక జాతి. ద.హిం.గా. 386. క్రీ.శ. 1567.

**బలితము** విఙ. 1. బలిష్ఠం, మిక్కిలి బలం కలది. భార.ఆది. 6.214 ; 2. గాఢం. భార.విరా. 4.173 ; 3. అధికం. పెద్దది. శృం.నై. 6.141 ; 4. స్థూలం, లావైనది. ఉ.రా. 2.187 ; 5. సాంద్రం, దట్టం. నీలా. 1.20.

నం. బలిష్ఠ-. మిక్కిలి బలం కల ; ప్రా. బలిట్ఠ-.

**బలిపించు** చూ. బలియు.

**బలిమి** చూ. బలియు. రూ. బల్మి. వి. 1. శౌర్యం. పరాక్రమం. భార.ఆది. 1.7 ; 2. బలాత్కారం. భార.ఆది. 5.142 ; 3. బలం, సత్తువ. కు.సం. 2.66 ; 4. అతిశయం, పెంపు. సుదంతా. 4.67 ; 5. ఔదార్యం ; 6. గానుగ రాతిని తగిలించే కొయ్య దూలం.

**బలిమికాఁడు** వి. బలవంతుడు. భార.సభా. 1.136. **బలిమిగొను** అ.క్రి. బలాత్కరించు. **బలిమికోలు** వి. బలాత్కారం. హరి.ఉ. 7.159. **బలిమిచెడు** అ.క్రి. క్షీణించు. బలహీనమగు. ఆము. 4.230. **బలిమిచేయు** స.క్రి. బలాత్కరించు. **బలిమిజాలుములు** వి.బ.వ బలాత్కారం. రాధికా. 1.110.

**బలియించు** చూ. బలియు.

**బలియు** అ.క్రి. 1. వర్ధిల్లు, పెరుగు, లావెక్కు. భాగ. 10.482 ; 2. అతిశయించు, అధికమగు. రామాభ్యు. 6.112 ; 3. నిబిడమగు, దట్టమగు. కళా. 4.89.

క. బలి, బళె. బలంగా ఎదుగు, పూర్తిగా ఎదుగు, రెట్టింపగు, బల్, బలు. బలం ; కొడ. బణ్ణ. శరీరం యొక్క లావు ; తు. బలాపిని. బలం సంపాదించు, ఆరోగ్యం తిరిగి పొందు, బళిపుని. పెరుగు, పెద్దదగు, బళపావుని. పెరిగేటట్లు చేయు, పైకి తెచ్చు, బళ్పు. పెరుగుదల ; త. వలి. గట్టిగా అగు, బలం, శక్తి, వలయ్. బలం, వళమ్, వళన్. అభివృద్ధి, నిండుదనం, వళర్ (-ప్-, -న్త్-). పెరుగు, రెట్టించు ; మ. వల్లుక. బలంగాఉండు, బలం. శక్తివంతమైన ; తొ. పల్శ్-(పల్స్-). బలంగాఅగు ; గోం. వల్లే. ఎక్కువ ; కుఇ. బర. బలం, పలుకుబడి ; మాల్తొ. బల్చునె, బలెహె. పెద్ద, బలె-బలె. పెద్దది ; బ్రా. బలున్. పెద్ద, చిన్నవాడిని ఎదిరించిన పెద్దవాడు.

పో.చూ. సం. బల-. శక్తి. సంస్కృతంలోని బల శబ్దం ద్రావిడ భాషల నుంచి గ్రహించబడినది.

<మూ.ద్రా. *వల్-.

**బలిపించు** స.క్రి. బలపరచు. **బలియించు** స.క్రి. 1. బలపరచు, దృఢంగా చేయు, పుష్టి కలిగించు. ఉ.హరి. 4.19 ; 2. కూర్చు. హర. 2.121 ; 3. బంధించు నిశ్చలంగా చేయు. వసు. 3.106 ; 4. వృద్ధిచేయు, హెచ్చుచేయు. నీలా. 1.52. < బలియు + -ఇంచు[3]. **బలిసినవాఁడు** విఙ. 1. బలంగలవాడు ; 2. పొగరెక్కిన వాడు ; 3. ధనంగలవాడు.

**బలియుఁడు** వి. 1. బలవంతుడు, దేహబలం కలవాడు. భార.ఆది. 2.281 ; 2. శూరుడు. భార.ఉద్యో. 4.313 ; 3. సమర్థుడు. జైమినిభా. 4.183.

నం. బలీయస్. ఇతరులకంటె మిక్కిలి బలంకల.

**బలియ్యతు** వి. ప్రయత్నం.

ఉ. బలియత్. క్లేశం, విపత్తి ; పార. బలియత్. ప్రలోభనం, విచారం, ప్రయత్నం ; అర. బలియత్. దురదృష్టం, విచారం.

<ఉ. బలీయత్.

**బలివారు** స.క్రి. చంపు. జైమినిభా. 7.163.

నం. బలి-. కానుక, దేవతకు పశువుగా అర్పించే జంతువు.

<నం. బలి- + పారు.

**బలివి** వి. ఒకానొక చెట్టు. పి.శకు. 2.14.

**బలిశము** రూ.చూ. బడియ. వి. చేపల్ని పట్టే గాలం.

**బలిసినవాఁడు** చూ. బలియు.

**బలు** రూ. బల్. విఙ. 1. దీర్ఘమైన, పొడవైన. కు.సం. 4.13 ; 2. పెద్ద, గొప్ప, పెను. నిర్వ.రా. 5.84 ; 3. తీక్ష్ణమైన, వాడియైన (కోప సూచకమని భావం).

భార.ఉద్యో. 2.123 ; 4. బలిష్ఠమైన, బలంకల (హల్లు పరమైనప్పుడు దీని ఉత్త్వానికి లోపం వికల్పం). భార. భీష్మ. 1.82 ; క్రి.విశే. 1. మిక్కిలి. నిర్వ.రా. 10.58 ; 2. భయంకరమైన. భార.ద్రోణ. 2.39 ; 3. తీవ్రమైన. భార.ద్రోణ. 5.181 ; 4. పెక్కు, అనేకమైన. భార.కర్ణ. 2.256 ; 5. విస్తారమైన. వేంక.పంచ. 1.493 ; 6. శ్రేష్ఠమైన. శగా. 1.28.

బలుగుత్తి వి. 1. సస్య విశేషం. విష్ణుమా.పూ. 3 ; 2. ధాన్య విశేషం. హంస. 3.128. బలుగూటిదొద్ది వి. ఒకజాతి కూరాకు మొక్క. హంస. 4.132. బలుజీవి వి. దృఢమైన జ్ఞానం. భార.మౌసల. 71. బలుదూరు వి. పెద్ద తిట్టు. శాక్ల.సం. 12.266. బలువంజమెకము రూ.చూ. బలువంజెమెకము. వి. ఏనుగు. బలువంజెమెకము రూ. బలువంజమెకము. వి. ఏనుగు. ఆం.నా.సం. తిర్య. 2. బలుహజ్జమెకము వి. ఏనుగు. అచ్చ.రా.యు. 184.

బలుగు వి. ఉపశాఖ, చిన్నకొమ్మ. ఆం.శా. 2.37.

బలుచు స.క్రి. బలిపెట్టు, చంపు. ద.హిం.గా.సం. 10. గా.సం. 711, క్రీ.శ. 1183.

బలుపాకురాయి చూ. బలుపు.

బలుపారు చూ. బలుపు.

బలుపు చూ. బలియు. రూ. బల్పు. వి. 1. దార్ఢ్యం, బలం. భార.అరణ్య. 1.159 ; 2. ఏపు, విజృంభణం. భార.భీష్మ. 2.405 ; 3. అతిశయం. భార.భీష్మ. 3.38 ; 4. బడాయి, డంబం. భార.కర్ణ. 2.25 ; 5. పుష్టి, పీవరత్వం. ఉ.హరిశ్చ. 2.92 ; 6. గర్వం ; విశే. 1. సహాయం, బాసట. హరి.ఉ. 5.5 ; 2. దృఢం. భాస్క.రా.యు. 1880 ; 3. సాంద్రం, దట్టం. విక్ర. 8.63 ; 4. బలిష్ఠం. మిక్కిలి బలం కలది, బలం కలవాడు. యయా. 1.119.

బలుపాకురాయి వి. వజ్రంగి మొక్క ఆకురాయి. <బలుపు+ఆకురాయి. బలుపారు అ.క్రి. పెంపెసగు, అతిశయించు. భార.శల్య. 1.54. < బలుపు + -ఆరు. బలుపుకొను రూ.చూ. బల్పుకొను. అ.క్రి. అతిశయించు. ద్వి.పరమ.వి. 3.151. బలుపుచూపు అ.క్రి. బలియు, స్థూలత్వం పొందు. భాగ. 7.1.14 బలుపుదించు అ.క్రి. గర్వమణచు. బలుపెక్కు అ.క్రి. అతిశయించు, మెండుకొను. దక్కా.చ. 4.132. <బలుపు+ఎక్కు. బలురక్కసి రూ. బలురక్కెన, బలురిక్కసి, బల్రక్కెన. వి. ఒకజాతి ముళ్ళమొక్క (Agave vivipara). <బలుపు+రక్కసి. బలురక్కెన రూ.చూ. బలురక్కసి. వి. ఒకజాతి ముళ్ళ మొక్క. బలురిక్కసి రూ.చూ. బలురక్కసి. వి. ఒకజాతి ముళ్ళమొక్క. బల్రక్కెన రూ.చూ. బలురక్కసి. వి. ఒకజాతి ముళ్ళమొక్క.

బలుపెక్కు చూ. బలుపు.

బలురక్కసి చూ. బలుపు.

బలురక్కెన చూ. బలుపు.

బలురిక్కసి చూ. బలుపు.

బలువిడి చూ. బలువు[1].

బలువిడిగొను చూ. బలువు[1].

బలువు[1] రూ. బల్వు, బరువు. వి. బలం, శక్తి. భార.విరా. 2.17 ; విశే. 1. అధికం, మిక్కుటం, గాఢం. భార.భీష్మ. 3.449 ; 2. దృఢం, సడలనిది. భాస్క.రా.సుం. 416 ; 3. పెద్ద.

క. బలు.

బలువిడి రూ.చూ. బల్విడి. వి. 1. శౌర్యం, పరాక్రమం. భార.ఆది. 5.39 ; 2. వేగం. బసవ. 3.471 ; 3. విధం, రీతి. నిర్వ.రా. 1.4 ; 4. ఉద్రేకం. భార.విరా. 4.253 ; 5. సత్తువ. ఉ.రా. 3.15 ; 6. బలాత్కారం ; క్రి.విశే.ద్రు. 1. బలవంతంగా. రం.రా.ఉ. 71 పు., 2. మిక్కిలి. విష్ణుపు. 1.95 ; 3. వెంటనే, తత్క్షణమే ; విశే. బలాఢ్యుడు, శూరుడు. ఆం.భా. 3.11. బలువిడిగొను (-కొను) అ.క్రి. అతిశయించు, అధికమగు. కు.సం. 10.171. బలువుంగరం వి. చేదుకర్రల బిగింపుకు దారాలకు వేసే లోహపుచుట్టు. <బలువు[1]+ఉంగరము. బలువుడు విశే. బలవంతుడు, బలియుడు. నీతి. 44. బలువుదారు వి. నేతబట్టమీద చేదుకర్రలకు అడ్డంగా దిగ్రుపెట్టే పొడుగు దారం. బలువుమాలు వి. బరువుగా ఉండే నూలు.

బలువు[2] రూ.చూ. బరువు. వి. భారం.

బలుసాకుతినిబ్రతుకు చూ. బలుసు.

బలుసు రూ. బలస, బల్స, బల్సు, బొలుసు, బొల్సు. వి. ముళ్ళున్న ఒకజాతి చెట్టు, కానమర్దం, గాంగేరుకం (ఇది వర్షాకాలంలో పడుతుంది. పళ్ళు పచ్చగా ఉంటాయి). శవరా. 4.19 (Canthium parviflorum).

బలుసాకుతినిబ్రతుకు అ.క్రి. ఏదోవిధంగా జీవించు. పల్నా.వ. 110. బలుసుకంప రూ. బల్సుకంప, బొల్సుకంప. వి. ఆము కాల్పుకు వాడే బలుసు చెట్టు కంప. బలుసుకూర వి. ఒకరకం ఆకుకూర (Canthium umbellatum). బలుసుగాయవల్ల(-కాయవల్ల) వి. బలుసు కాయరంగు. బలుసుకుట్టె వి. ఆము కాల్పుకు వాడే కుట్టె.

బలె[1] అవ్య.ద్రు. 1. ఇవార్థకం. హర. 3.53 ; 2. ఉత్ప్రేక్షావాచకం. ఆము. 2.15.

బలె[2] వి. పెసర, అలచంద మొ.వాటి ముడురు గింజ.

బలెబందు రూ.చూ. బాలాబందు. వి. ఒకవిధమైన వ్రాత, లిపి.

బలే రూ. బలా, బళా, బళి[1], బళిర, బళిరె, బళిరే, బళి, బళిరె, బళిరే, భళా, భళి, భళీ. అవ్య. 1. నిశ్చయార్థకం. భార.విరా. 4.248 ; 2. ఆశ్చర్యార్థకం. హరి.పూ. 5.230.

సం. భద్ర-. : ప్రా. భల్ల-, భల్లయ-. ఉత్తమం, శ్రేష్ఠం, బలే. విస్మయ విస్తారణార్థాల్ని తెలిపే అవ్యయం ; అ.మా. భద్ర, భల్ల. క్షేమం ; మరా. బలె. మేలుమేలు, సెబాసు.

<ప్రా. భల్ల-/భల్లయ.

బలేకాఇనాం రూ. బల్లేకాఇనాం. వి. చాకలి, మంగలి మొ. వృత్తులవారికిచ్చిన ఇనాం.

బల్కట్ వి. చక్రానికి ఇరుసు దూర్చే రంధ్రానికి లోపలా బయటా వేసిన ఇనపకట్టు.

బల్కండి చూ. బలం.

బల్గము రూ.చూ. బలఁగము. వి. 1. బంధువర్గం. శివ.సా.ఉ. 2.85 ; 2. పరిజనం, సేవకులు ; 3. సమూహం, పరంపర ; 4. సైన్యం.

బల్చుగదురు (-కదురు) వి. ఆము కాల్చుకు వాడే బలునుచెట్టు కంప.

బల్జ రూ.చూ. బలిజ. వి. 1. శూద్రజాతి విశేషం. శ్రీనాథుని చాటువు. 1.180 ; 2. ఒకానొక శూద్రజాతికి సంబంధించిన వాడు.

బల్జికుమ్మర్లు రూ.చూ. బలిజకుమ్మర్లు. వి.బ.వ. కుమ్మర్లలో ఒక తెగ.

బల్జుకట్టె వి. ఆము కాల్చుకు వాడే బలునుచెట్టు కంప.

బల్జె రూ.చూ. బలిజ. వి. 1. ఒకానొక శూద్రజాతి ; 2. ఒక శూద్రజాతికి చెందినవాడు.

బల్టా రూ.చూ. బలటా. వి. అడుసు, మట్టితో కట్టిన పిట్టగోడ.

బల్దకుంత వి. నలభై యాభై శేర్ల కల్లు పట్టే పెద్ద మట్టిపాత్ర.

బల్పము రూ.చూ. బలపము. వి. 1. చోర సాధన విశేషం. చెన్నబసవ. 3.294 ; 2. కఠిని, పలకమీద రాసే సాధన విశేషం, పలకపుల్ల.

బల్పు రూ.చూ. బలుపు. విణ. 1. సాంద్రం, దట్టం. భాస్క.రా.యు. 272 ; 2. సహాయం, బాసట ; 3. దృఢం. దశకు. 9.33 ; 4. బలిష్ఠం, మిక్కిలి బలం కలది. మిక్కిలి బలం కలవాడు ; వి. 1. దార్ఢ్యం, బలం. హరి.ఉ. 8.84 ; 2. బడాయి, డంబం ; 3. ఏపు, విజృంభణం ; 4. అతిశయం ; 5. పుష్టి, పీవరత్వం.

బల్పుకొను రూ. బలుపుకొను. అ.క్రి. అతిశయించు. భాస్క.రా.యు. 730.

బల్మి రూ.చూ. బలిమి. వి. 1. బలం, సత్తువ. భార.ఆది. 6.281 ; 2. ఔదార్యం. నీలా. 1.48 ; 3. బలాత్కారం ; 4. శౌర్యం, పరాక్రమం ; 5. అతిశయం, పెంపు.

బ్రలెక్కన చూ. బలుపు.

బ్రలామభోగాలు రూ.చూ. బలరామభోగాలు. వి.బ.వ. విశాఖ పట్నం తాలూకాలో పండించే వడ్లలో ముఖ్యమైన రకం.

బల్ల[1] రూ. బల, బల్లా, బళ, బళ్ల, బొళ. వి. 1. భూపరిమాణం, మైసూరు ప్రాంతంలో ఎనభై వందల చదరపు గజాల మెట్టభూమి, నూటఇరవైఅయిదు చదరపు గజాల పల్లపుభూమి. E.C. సంపు. 3. మొదటి భాగం. క్రీ.శ. 1633 ; 2. తూము, నాలుగుకుంచాల కొలమానం, ద్రోణం. ఆం.భా. 3.58 ; 3. వారుపలకం, కూర్చోవటానికి కాళ్ళు అమర్చిన ఎత్తు పలక ; 4. రెండు మ్రాను సేర్లు ; 5. నాలుగు బళ్ళారి సేర్లు ; 6. మొగం మీద దూలం కిందుగా పెట్టిన పీట ; 7. కుర్చీ ; 8. కొలత తొట్టికి రెండు వైపులా పెట్టిన పీడి ; 9. రాట్నం నిలువులు బిగించిన అడుగు పీట ; 10. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద ; 11. అనుకొయ్యలకు ఆధారంగా ఉండే అడ్డ పట్టె ; 12. దబ్బారాట్నం చక్రం బిగింపుకు, ఇరుసుకు వేసిన కొయ్య బిళ్ళ ; 13. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య ; 14. ఆరుదలకు వచ్చిన వాటల్ని నర్సే నుత్తి వంటి కొయ్య పరికరం ; 15. గుంటక గొర్రు మొ. వాటి నిర్మాణంలో వేసిన అడ్డపట్టె ; 16. నారుపోసిన భూభాగం ; 17. చక్రానికి ఇరుసును దూర్చే రంధ్రానికి లోపలా బయటా వేసిన ఇనపకట్టు ; 18. బండి చట్రంలోని అడ్డ పట్టె ; 19. వసికొయ్య ; 20. పనివాళ్ళు నిలిచి పని చేయటానికి పనిముట్లను పేర్చటానికి అనువుగా ఉండే పొడుగాటి పీట.

క. బళ్ళ. పరిమాణం కొలత, కొళగ యొక్క నాల్గవ భాగం లేక 4 మానాలు ; తు. బళ్ళ. పేరు. ఒక పేరుకు సమానమైన పరిమాణం, కొలత ; త. వళ్ళమ్. ధాన్యం కొలత, పరిమాణం యొక్క కొలత (2 లేక 4 పడి) చెట్టు, బొదెతో చేసిన పడవ. వల్లమ్. బుట్ట ; మ. వళ్ళమ్. పెద్ద వెదురుబుట్ట, చిన్న కొలత, వల్లమ్. ధాన్యం, గడ్డి మొదలైనవి ఉంచటానికి ఉన్న పెద్ద బుట్ట ; కో. వళ్. ధాన్యం కొలత, వల్. ధాన్యం దాచే గుండ్రని బుట్ట ; తొ. పాళ్. వెదురుబుట్ట.

<క. బళ్ళ.

బల్లకట్టు వి. వెడల్పైన అడుగున్న పడవ. బల్లకడవ వి. మూడు ఉండి పూజలు లేని కడవ. బల్లకూర్పు వి. బల్లల్ని దగ్గరగా చేర్చి మేకులు మొదలైన వాటితో బిగించటం. బల్లకోడు వి. ఆరుదలకు వచ్చిన వాటల్ని నర్సే నుత్తి వంటి కొయ్య పరికరం. బల్లగుద్దిచెప్పు స.క్రి. నొక్కి వక్కాణించు. బల్లచెక్క వి. నేత నేసేటప్పుడు పడుగులో అనిపోగులు తెరవటానికి నేతపనివాడు కాలితో తొక్కే కొయ్యచెక్క. బల్లంచు వి. పాత్రల మూతికి వెడల్పుగా పెట్టే అంచు. <బల్ల[1]+అంచు[3]. బల్లదాక వి. కూరకి వాడే మట్టిపాత్ర. బల్లపరుపు వి. ఏటవాలు. బల్లపర్చురు వి. ఇంటిని చెక్కతో కప్పే పని. బల్లపాటుగా క్రి.విణ.ద్రు. పరవుగా. బల్లవాటం వి. ఇటుకను మామూలుగా కోసే తీరు. బల్లసట్టి(-చట్టి) వి. ఒకే మూతుండే మట్టిపాత్ర. బల్లవరంబీ వి. ఇంట్లో బల్లతో చేసిన అటక.

బల్ల[2] వి. కడుపులోని దుర్మాంసపు బిళ్ళ. నవనాథ. 3.149 ప. 25. పం.

తు. పల్లె. ప్లీహం ; కువి. బల్ల, బెల్ల, బెల ; పర్జి. బెల్ల. ప్లీహం.

బల్లకోల రూ. బల్లగోల. బల్లెకోల. వి. పొడిచే ఆయుధం, బల్లెం. బసవ. 5.718.

సం. భల-. బల్లెం ; ప్రా. భల్ల-, భల్లయ- ; హిం. భాలా.

<ప్రా. భల్ల-+కోల.

బల్లకోలలవాఁడు విణ. బల్లెం పట్టేవాడు. బసవ. 3.510.

బల్లగోల(-కోల) రూ.చూ. బల్లకోల. వి. పొడిచే ఆయుధం, బల్లెం.

బల్లకోలలవారు విణ.బ.వ. ఈటెగాళ్ళు. బసవ. 5.720.

బల్లడదట్టీ రూ. బల్లడదట్టి, బల్లాడదట్టి. వి. మేలైన వస్త్ర విశేషం. బసవ. 3.108 పం.

బల్లడదట్టీ రూ.చూ. బల్లడదట్టి. వి. మేలైన వస్త్రవిశేషం.

బల్లణము వి. వాద్య విశేషం. పండి.చ. 5.373 ప. 19 పం.

బల్లా రూ.చూ. బల్ల[1]. వి. చక్రం కుంట అరగకుండా ఉండ

టానికి ఇరుసును దూర్చే రంధ్రానికి వెలివైపునా లోపల వైపునా వేసిన ఇనప కట్టు.

బల్లారదట్టీ రూ.చూ. బల్లదదట్టి. వి. ఒకరకం కాసె. కా. 6.224.

బల్లావితెట్టులు వి.బ.వ. వస్త్రవిశేషం. ప్రబంధ. 605.

బల్లావిపెట్టెలు వి.బ.వ. ఒకరకం పెట్టెలు. పల్నా.వ. 3.

బల్లారికమ్మి రూ.చూ. బళ్ళారి కమ్మి. వి. ధోవతులకు నేసే ఒకరకం కమ్మి.

బల్లి[1] వి. గృహగోధిక, తరచుగా ఇంటి గోడల మీద పాకే ఒకజాతి సరీసృపం. భార.ఉద్యో. 3.135.

క. పల్లి. చిన్న ఇంటి బల్లి; కొడ. పల్లి. బల్లి; తు. పల్లి. ఇంటి బల్లి; త. పల్లి. గోడబల్లి; మ. పల్లి. ఇంటి బల్లి; కో. ఎ.పజ్. చిన్నగోడ బల్లి; తొ. పష్య. బల్లి.

చూ.సం. పల్లీ, పల్లికా. బల్లి; మరా. పల్లీ, పాల్. బల్లి.

బల్లికొమ్ము వి. ముట్టి మీద ఉండే నుడి. బల్లికోక వి. ఒకరకం చేప. బల్లిగట్టు వి. ఆయుధ విశేషం. పి.శకు. 3.225. బల్లిగడి రూ.చూ. బల్లిగడ్డి. వి. ఒకరకం కలువ మొక్క. బల్లిగడ్డి రూ. బల్లిగడి. వి. ఒకరకం కలువమొక్క. బల్లివంశ వి. బల్లుల పరంపర. చంద్రభా. 3.71. బల్లి పాకుడు వి. తెల్లగా బిళ్ళలాగా ఉండే బూజు. బల్లిమొట్టె వి. ఒకరకం చేప. బల్లియుచౌకపేయు (-చౌకచేయు) స.క్రి. 1. బల్లికూడా తేలికగా చూచు; 2. ప్రతివాడు చులకన చేయు.

బల్లి[2] వి. కంపగా వాడబడే ఒకానొక కలుప మొక్క (Ipomea aquatica).

బల్లి[3] వి. పంటెంగ చెట్టు (Bridelia montana).

బల్లించు రూ.చూ. బలించు. అ.క్రి. తాడు మొదలైన వాటితో గట్టిగా కట్టు.

బల్లిదము విశే. బలిష్ఠం, బలం కలది. భార.విరా. 2.24.

సం. బలిష్ఠ-. మిక్కిలి బలం కల.

బల్లిదుడు చూ. బల్లిదము. వి. 1. పరాక్రమశాలి, శూరుడు. భార. సభా. 1.186; 2. అధికుడు, గొప్పవాడు. భార. ద్రోణ. 2.149; 3. బలవంతుడు. ఆం.భా. 3.11.

క. బల్లిద. శూరుడు.

బల్లియము రూ.చూ. బల్లెము. వి. చెముడాకు వంటి అలుగున్న బాణ విశేషం. పల్నా. 118.

బల్లీ వి. గొయ్యవానం.

హిం. ఉ. బల్లా, బల్లీ. కర్ర, దండం.

<ఉ. బల్లీ.

బల్లు వి. 1. ఎగరటంలో అయ్యేధ్వనికి అనుకరణం. భార. ఆది. 2.72; 2. తెల్లవారటంలో అయ్యే అనుకరణం. రాజవా. 1.78; 3. రాలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. చంద్రరే. 3.147. ధ్వన్యను.

బల్లెం చూ. బల్లెము. వి. బావిపక్కన గిలకవేయటానికి వీలుగా కట్టిన గోడ.

బల్లెకోల రూ.చూ. బల్లకోల. వి. పొడిచే ఆయుధ విశేషం, బల్లెం. శుక. 3.320.

బల్లెపాకు చూ. బల్లెము.

బల్లెమంచు చూ. బల్లెము.

బల్లెము రూ. బల్లియము. వి. 1. బల్లెం. భార. ద్రోణ. 2.112; 2. చెముడాకు లాంటి అలుగున్న బాణవిశేషం. అచ్చ. రా. యు. 364.

సం. భల్ల-, భల్లీ. బరిసె; ప్రా. భల్లయ-, భల్ల-, భల్లి, భల్లీ; అ.మా. భల్ల-, భల్లయ-; అప. భల్ల-.

క. బల్య, బల్లె, బల్లెయ, బల్లెవ, బల్లెహ; త. పల్లె; మ. వల్లయ.

<ప్రా. భల్లయ-.

బల్లెపాకు వి. పైరుపొట్టపై బల్లెంలాగా మొలిచిన ఆకు. <బల్లెము + ఆకు. బల్లెమంచు వి. పైన నాలుగుగీరలు వగానికి కింద రెండుగీరలు తరవాత రెండువరసల్లో జంట గీరలు పడేట్టు నేసిన అంచు. <బల్లెము + అంచు[3]. బల్లెము దూరని పాటిదట్టము వి. మిక్కిలిచిక్కనిది.

బల్వకాజవాం రూ.చూ. బలోతాజనాం. వి. బాకలి, మంగలి మొ. వృత్తులవారి కిచ్చిన ఇనాం.

బల్వా రూ.చూ. బలవా. వి. మీదబడికొట్టటం.

బల్విడి రూ. బలువిడి. వి. 1. శౌర్యం, పరాక్రమం. కు. సం. 10.149; 2. బలాత్కారం. నిర్వ. రా. 1.41; 3. వేగం. భార. భీష్మ. 2.250; 4. విధం, రీతి. క్రి. విశే. 1. శీఘ్రంగా, వెంటనే. భార. స్త్రీ. 2.175; 2. బలాత్కారంగా. పల్నా. ష. 93; 3. అత్యంతం, మిక్కిలి; విశే. (స్వార్థంలో) బలాఢ్యుడు, శూరుడు. ఆం. భా. 3.11.

బల్వు రూ.చూ. బలువు[1]. వి. బలం, శక్తి; విశే. 1. అధికం, మిక్కుటం, గాఢం. భార. శల్య. 1.241; 2. దృఢం, సడలనిది.

బల్సు రూ.చూ. బలుసు. వి. బంజరు నేలల్లో పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క (Canthium parviflorum).

బల్సు రూ.చూ. బలుసు. వి. ముళ్ళున్న ఒకజాతిచిన్నచెట్టు (Canthium parviflorum).

బల్సుకంప రూ.చూ. బలుసుకంప. వి. ఆము కాల్చుకు వాడే బలుసు చెట్టుకంప.

బళ రూ.చూ. బల్ల[1]. వి. ఇనపటోపి అంచు, ఓర.

బళకరము రూ.చూ. బలకరము. వి. 1. కావలి, రక్షణ; విశే. 1. బలవత్తరమైన; 2. బలం కలిగించే.

బళవము రూ.చూ. బలవము. వి. వలకపుల్ల.

బళా రూ.చూ. బలే. అవ్య. ప్రశంసార్థకం. రామాభ్యు 1. వైజ. 4.86.

బళాబళ అవ్య. ప్రశంసార్థకం. దశా. 6.119.

బళాయి వి. బలవంతుడు. కాశీ. 7.254.

క. బళాయి. బలవంతుడు;

సం. బలవాన్.

<క. బళాయి.

బళారె రూ.చూ. బలారె. అవ్య. 1. ప్రశంసార్థకం. రామాభ్యు. 6.55; 2. ఆశ్చర్యార్థకం.

బళారే రూ.చూ. బలారె. అవ్య. ప్రశంసార్థకం.

బళి[1] రూ.చూ. బలే. అవ్య. 1. ప్రశంసార్థకం. కా.

1.148 ; 2. సంతోషాన్ని తెలిపే అనుకరణం. విప్ర. 3.54.

బళి² రూ.చూ. బళె. వి. 1. లడిలో పదోవంతు నూలు ; 2. లడిలో డెబ్బయ్యో వంతునూలు ; 3. పయిలెటు, సిరా రంగులు కలిసిన రంగు.

బళిర రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం. దశ. 1.43.

బళిరయ్య అవ్య. ప్రశంసార్థకం. <బళిర+అయ్య.

బళిరా రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం. అము. 1.42.

బళిరొ రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం. రామాభ్యు. 1.47.

బళిరే రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం. రామాభ్యు. 7.108.

బళివేల వి. బలి అవసరం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 98. క్రీ. శ. 1088.

సం. బలి-. పూజార్థమైన కానుక, పూజ.

<సం. బలి-+సం. వేలా.

బళీ రూ.చూ. బళే. అవ్య. మెచ్చుకోలును తెలిపేది, ప్రశంసార్థకం. వరాహ. 5.34.

బళిరొ రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం. చంద్రాంగ. 1.127.

బళీరే రూ.చూ. బళే. అవ్య. ప్రశంసార్థకం.

బళుకు అవ్య. సారెసారెకు. ధ్వన్యను.

బళుకు బళుకు అవ్య. నిలకడలేకుండ.

బళుకున రూ. బళుక్కున. అవ్య. 1. సారెకు సారెకు ; 2. దోకులో అయ్యే అనుకరణం.

బళుక్కున రూ.చూ బళుకున. అవ్య. 1. సారెకు సారెకు ; 2. దోకులో అయ్యే అనుకరణం.

బళువు రూ.చూ. బలువు¹. వి. అధికారగర్వం, ప్రాభవం. పార్వ. 1.62.

బళె రూ. బళి². వి. 1. లడిలో పదోవంతు నూలు. 2. లడిలో డెబ్బయ్యో వంతునూలు ; 3. పయిలెటు సిరా రంగులు కలిసిన రంగు.

బళ్ల రూ.చూ. బల్ల¹. వి. కుంచం.

బళ్లారి వి. కర్ణాటక రాష్ట్రంలోని ఒకానొక పట్టణం. ఇది పలు పంటలకు ప్రసిద్ధి.

బళ్లారికంది వి. కందులలో ఒకరకం. బళ్లారికమ్మి రూ. బల్లారికమ్మి. వి. ధోవతులకు నేసే ఒకరకం కమ్మి. బళ్లారి కాయ వి. మిరపకాయల్లో ఒకరకం. బళ్లారిమావె వి. కుసుమల నూనె.

బళ్ళున అవ్య. ద్రు. తెల్లవారటంలో అయ్యే అనుకరణం.

బవంచి రూ. బవంచీ. వి. వెలుతురు కోసం మిద్దె కప్పులో పెట్టిన రంధ్రం.

బవంచీ రూ.చూ. బవంచి. వి. ఇంటిలోకి వెలుతురు రావటానికి లేక ఇంటిలోని పొగ బయటికి పోవటానికి ఇంటికప్పులో అమర్చిన మట్టిపాత్ర.

బవటికాయ వి. ఒకరకం కలుపుమొక్క.

బవనం వి. వడ్లలో ఒకరకం.

బవని రూ. బవనీ, బవిని. వి. యాత్రల్లో ఒకజాతివారుచేసే నృత్యం. క్రీడా. 129.

సం. భ్రమణ-. తిరగటం ; ప్రా. భమణ-. భ్రమించటం, చుట్టుతిరగటం ; అ.మా. భమణ- ; అప. భవణ-. భ్రమించటం ;

క. బవణి, బవగె, బవళి. చుట్టుతిరగటం.

<ప్రా. భమణ-.

బవనీ(డు రూ.చూ. బవిసీ(డు. విణ. 1. యాత్రల్లో నుద్దులు పాడుతూ ఆడే ఒక జాతివాడు. క్రీడా. 1.30 ; 2. ఇతరుల్ని స్తోత్రాలు చేస్తూ జీవించే జాతుల్లో ఒక తెగవాడు.

బవనిక రూ.చూ. బదనిక. వి. వేరొక చెట్టుమీద మొలిచిన తీగ. ఆం.భా. 2.54.

బవనీ రూ.చూ. బవని. వి. యాత్రల్లో ఒకజాతివారు చేసే నృత్యం.

బవనీ(డు చూ. బవని.

బవంతి¹ రూ.చూ. భవంతి. విణ. చిత్రవర్ణాలున్న రాతపని కలది. సారంగ. 3.138 ; వి. 1. చతుశ్శాల. అష్టమ. క. 3.178 వ. 16 పం ; 2. పలురంగులతో చేసే రాతపని. అష్టమ. క. 5.246 వ. 20 పం ; 3. చిత్రవర్ణంగల చీర. శశా. 3.23 ; 4. చిత్రవర్ణ విశేషం. ఆం.భా. 2.154 ; 5. గృహాంతర్భాగంలో ఉండే కప్పులేని ఇల్లు.

బవంతి² రూ.చూ. బావంచి. వి. 1. కారుగచ్చు ; 2. కోడ్ల పక్కను బంజరు బయళ్ళలోను పెరిగే నీలిపూల పొట్టి కలుపు మొక్క.

బవరమిచ్చు చూ. బవరము.

బవరము వి. యుద్ధం. భార.విరా. 1.268.

క. బవర. యుద్ధం, బవరిగ. యోధుడు ;

సం ప్రహార-. దెబ్బ ; ప్రా. పహార-. కొట్టటం, చంపటం.

బవరమిచ్చు అ.క్రి. యుద్ధం చేయు. <బవరము+ఇచ్చు.

బవరి రూ. బవిరి¹, బపిరె, బ్రవి, బైరి². విణ. 1. ఇంటి చుట్టుగోడ, ప్రహరి. వేంక. పంచ. 3.201 ; 2. వర్తుల, గుండ్రం. ద్వి. పరమ. వి. 3.166 ; 3. సాంద్రం. ప్రబంధ. 78.

బవరిగడ్డము రూ.చూ. బవిరిగడ్డము. వి. గుండ్రని గడ్డం. బవరిచుట్టు రూ.చూ. బవిరిచుట్టు. అ.క్రి. గుండ్రంగా తిరుగు. ద్వి. పరమ. వి. 4.280.

బవసనము వి. ప్రయాస.

సం. భవ-. జన్మ, బతుకు, సంసారం, వశ-. స్వాధీనం ; ప్రా. భవ-, వస-. ఆయత్తం, స్వాధీనం.

<ప్రా. భవసన-.

బహానిగిన్నె చూ. భగోణి. రూ.చూ. బగవాని గిన్నె. వి. గంజి పోసుకొనే ఒకరకం ఇత్తడిపాత్ర.

బవిని రూ.చూ. బవని. వి. 1. ఇతరుల్ని స్తోత్రం చేసి జీవించే జాతుల్లో ఒకజాతి వాడు ; 2. యాత్రలో ఒకజాతి వారు చేసే నృత్యం ; 3. జాతరలో బవనీల నృత్యం.

బవినీ(డు రూ. బవనీ(డు. వి. 1. ఇతరుల్ని స్తోత్రం

చేసి జీవించే జాతుల్లో ఒక తెగవాడు. కాశీ. 7.230; 2. యాత్రలో సుద్దులు పాడుతూ ఆడే ఒకజాతి వాడు. ఆం.భా. 2.287.

బవిసీఁడు చూ. బవిసి.

బవిరి[1] రూ.చూ. బవరి. వి. చెవికి పెట్టుకొనే గుండ్రని నగ. కళా. 7.66.

బవిరిగడ్డము రూ. బవరిగడ్డము. వి. 1. నెరసిన గడ్డం. రాజవా. 2.113; 2. గుండ్రనిగడ్డం. విజయ. 2.164. బవిరిచుట్టు రూ. బవరిచుట్టు. అ.క్రి. ప్రదక్షిణం చేయు, చుట్టి వచ్చు. బసవ. 2.139. బవిరిటాకులు(-ఆకులు) వి.బ.వ. సానపెట్టి అంచులు తీర్చిన మణులు. విజయ. 2.133. బవిరితిరుగు అ.క్రి. వలయాకారంగా చుట్టు. భాగ. 8.896. బవిరితీర్చు స.క్రి. ఆవరింపచేయు, వ్యాపింప చేయు. ఘటికా. 2.213. బవిరిదిద్దు స.క్రి. వర్తులం కావించు, గుండ్రనితనాన్ని కలిగించు. రామాభ్యు. 2.110.

బవిరి[2] రూ.చూ. బమ్మర. వి. భ్రాంతి.

బవిరె రూ.చూ. బవరి. వి. కర్ణభూషణ విశేషం. యయా. 4.90.

బవిళి వి. మూర్ఛ. ఆం.భా. 2.223.

సం. భ్రామరికా, భ్రామరీ. అపస్మారకరోగం, మూర్ఛరోగం; ప్రా. భమరియా, భమరీ. పిత్తకోపం వల్ల కలిగే రోగవిశేషం.

<ప్రా. భమరీ.

బవిసనము రూ.చూ. బవిసినము. వి. వీణ సొరకాయ యొక్క బంధనం.

బవిసి రూ.చూ. బయిసి. వి. 1. నియతి, భాగ్యం. ఆం.భా. 1.99; 2. గౌరవం.

బవిసిన రూ.చూ. బవిసినము. వి. సొరకాయ యొక్క బంధనం.

బవిసినము రూ. బవిసనము, బవిసిన, బవిసెన. వి. వీణ దండెకు సొరకాయకు వేసే కట్టు. ఆం.భా. 1.126.

బవిసెన రూ.చూ. బవిసినము. వి. వీణ సొరకాయ యొక్క బంధనం.

బవు వి. అధికం.

సం. బహు. అనేకం.

<సం. బహు-.

బవుంతి రూ.చూ. భవంతి. వి. 1. పెద్ద పెంకుటిల్లు; 2. ఇంటిముందరి హాలులో గాలి వెలుతురులకై కొంచెం ఎత్తుగా కట్టినది; 3. గృహాంతర్భాగంలో ఉండే కప్పులేని చోటు.

బవ్రి రూ.చూ. బవరి. విణ. గుండ్రనిది. కళా. 4.170.

బశ్తీ రూ.చూ. బస్తీ. వి. వాసయోగ్యం, పట్టణం.

బస వి. 1. సంకేతం. ఆం.భా. 1.103; 2. వాసస్థానం, ఉనికిపట్టు; 3. తాత్కాలికమైన విడిది.

సం. వాస-. నివాసం; ప్రా. వాస-.

<ప్రా. వాస-.

బసచేయు అ.క్రి. నివాసం చేయు.

బసంగి రూ. బసెంగ. వి. గోదావరి జిల్లాలో పండించే వడ్లలో ఒకరకం.

సం. వసంత-. వసంతర్తువు; హిం. బసంతీ. వసంతర్తు సంబంధమైన.

బసక్కుండం వి. పిల్లలు డబ్బు దాచిపెట్టటానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టి బుడ్డి.

సం. కుంభ-. కుండ.

బసది వి. జైన దేవాలయం లేక మఠం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 35.

సం. వసతి. నివసిస్తున్నది; ప్రా. వసఇ; పా. వసతి.

<సం. వసతి.

బసంతి రూ. బసంది. వి. పలావుకు ఉపయోగించే 'బాస్మతి' అనే సన్నగింజ రకం ధాన్యం.

బసంది రూ.చూ. బసంతి. వి. పలావుకు ఉపయోగించే 'బాస్మతి' అనే సన్నగింజ రకం ధాన్యం.

బసవఁడు వి. 1. వీరశైవ మతప్రవర్తకుడైన ఒకానొక భక్తుడు. పండి. చ. 1.208; 2. శివుని వాహనమైన ఎద్దు. హర. 3.32.

సం. వృషభ-. ఎద్దు, పురుషుడు; ప్రా. వసభ-, వసహ-; జై.మహా. వసభ-, వసహ-; జై.శౌ. వసహ-; శౌ. వుసహ-; అ.మా. వసభ-, వసహ-; పా. వసభ-, ఉసభ-; అప. వసహ-, వసహో;

క. బసవ; తు. బసవ, బసవె; త. ఇడపమ్; మ. ఇడవం.

<ప్రా. వసభ-.

బసవరాలు(-ఆలు) వి. బసివి. శివుని సేవకు బాల్యం లోనే సమర్పించబడిన స్త్రీ. బసవెద్దు వి. అచ్చుబొద్దు, అచ్చువేసి స్వేచ్ఛగా తిరగటానికి విడిచిన ఎద్దు. కుక. 1.141. <బసవ(ఁడు)+ఎద్దు.

బసవన చూ. బసవఁడు. రూ. బసవన్న. వి. వృషభం, ఎద్దు. పండి.చ. 5.545.

బసవపాదు వి. మందుల్లో ఉపయోగపడే ఒకరకం చెట్టు (Clerodendron infortunatum).

బసవన్న రూ.చూ. బసవన. వి. వృషభం, ఎద్దు. పల్నా.వు. 7.

బసవన్నాట వి. బాలక్రీడా విశేషం. <బసవన్న+ఆట.

బసవన్నాట చూ. బసవన్న.

బసవయ్య పద్నం చూ. బసవఁడు. వి. మొవ్వ అనే ఊళ్ళో బసవయ్య మొదట విత్తనం కట్టిన వడ్లు.

బసవరాలు చూ. బసవఁడు.

బసవి రూ.చూ. బసివి. వి. 1. శివుని సేవకు బాల్యంలోనే సమర్పించ బడిన స్త్రీ; 2. స్వైరిణి; 3. ఒకపిట్టు.

బసవెద్దు చూ. బసవఁడు.

బసాత్ వి. పరిచేగుడ్డ.

హిం. బసాత్. చదరంగపు బల్ల; ఉ. అర. బిసాత్. పరవ, తివాసీగుడ్డ, నేలమీద పరిచేగుడ్డ, బిసాతి-. షత్‌రంజ్. చదరంగపు బల్ల.

బసాణము రూ. భసాణము; వి. పన్ను. ద.హిం.సా. సంపు. 10. శా.సం. 788.

ఒ. బసాణము.

**బసీ** రూ. వెనల, వెనలె. వి. వెడల్పు మూతిగల చిన్న మట్టి పాత్ర.

పో. బసియ, బాసి. భోజనపాత్ర ; స్పా. బాసియ. పళ్ళెం, సానిక ;

పో.చూ.నం. భోజన-. తిండి, ఆహారం.

< పో. బాసి.

**బసీకలు** వి.బ.వ. మల్లసాధన విశేషం. మల్లు. 3.69.

**బసివి** రూ. బసవి. వి. 1. పశుపతికి పరిచర్య చేయటానికి బాల్యం లోనే సమర్పించబడ్డ స్త్రీ (ఈమె అవివాహితగానే ఉండాలి. ఇది కన్నడదేశ సంప్రదాయం). శివరా. 6.44, 45 ; 2. ఒకానొక తిట్టు. అహల్యా. 3.44 ; 3. స్వైరిణి. కృష్ణా. 8.

క. బసవి, బసివి. శివుని సేవకుగాను సమర్పించబడ్డ స్త్రీ ; త. వచవి ;

సం. పశుప. శివుడు.

< క. బసివి.

**బసుకు** స.క్రి. పొడుచు, గుచ్చు. రంగా.చ. 3.223 ; వి. కొయ్య లోని పెళుసుగా ఉండే భాగం.

క. బసె, బసి. మొనగల, మొన ; త. వై. పదును, మొన.

< క. బసె.

**బసుమము** వి. భస్మం, బూడి. బసవ. 7.219.

సం. భస్మన్. బూడిద ; ప్రా. భసమ-, భసుమ-, భస్స-. జై.మహా. భాస-, భాసమ- ; శౌ. భస్స- ; అ.మా. భాస- ; పా. భస్మ- ;

క. బసుమ ; తు. బిస్మ.

< ప్రా. భసుమ-.

**బసెంగ** రూ.చూ. బసంగి. వి. గోదావరి జిల్లాలో పండించే వడ్లలో ఒకరకం.

**బస్తచింపి** వి. నరిచేసేటప్పుడు పాత్రలకింద మెత్తగా పెట్టు కొనే చింపిరి గుడ్డలతో చేసిన చిన్నదిండు.

**బస్తా** వి. గోనెసంచి, మూట.

హిం.ఉ. బస్తా. కట్టబడినది, సంచి ; పార. బస్తహ్. సంచి.

< ఉ. బస్తా.

**బస్తాబంది** వి. ధాన్యం మొ. వాటిని సంచుల్లో నింపటం. పట్టుబడి.

**బస్తీ** రూ. బశ్తి. వి. పట్టణం, వానయోగ్యం.

ఒ. బస్తి. వానయోగ్యం, గృహసముదాయం ; హిం.ఉ. బస్తీ. ఎక్కువ మంది నివసించేచోటు, పట్టణం.

< ఉ. బస్తీ.

**బహత్తరి** విణ. 1. గొప్ప. పెద్ద. డార్పనూరు గానసం. క్రీ.శ. 1060 ; 2. డెబ్బయిరెండు, మహత్తరం, అధికం. పండి.చ. 5.382.

సం. ద్విసప్తతి-. డెబ్బైరెండు ; ప్రా. బహత్తరి- ; క. బహత్తర, బహత్తరి.

< ప్రా. బహత్తరి.

**బహత్తరి నియోగములు** వి.బ.వ. డెబ్బైరెండు నియోగాలు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 645. క్రీ.శ. 1060.

**బహదరీ** రూ.చూ. బహదరు. వి. 1. ఘనత ; 2. శౌర్యం.

**బహదరు** రూ. బహదరీ, బహదురి, బహదురు, బహదూరు, బహద్దరు, బహాదురు, బహుదురు, బహుదూరు, బాదరి. వి. 1. యోధుడు, శూరుడు. ద.హిం.శా. సంపు. 7. శా.సం. 710. క్రీ.శ. 1774 ; 2. ఘనసూచకమైన ఒకబిరుదు.

హిం. బహాదుర్. సాహసి, శూరుడు, పరాక్రమ వంతుడు. మరా. బహాదుర్. బహాదూర్. పెద్దమను ష్యుడు, ఒక బిరుదు ; ఉ. బహాదుర్. శూరుడు, వీరుడు ; పార. బహాదుర్. ధైర్యంగల, పరాక్రమంగల ; శూరుడు.

< ఉ. బహాదుర్.

**బహదషా** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బహదురి** రూ.చూ. బహదరు. వి. యోధుడు, శూరుడు, ఒక విధమైన బిరుదు శబ్దం. నె.శా. సంపు. 1. శా.సం. 89. క్రీ.శ. 1409 (?).

**బహదురు** రూ.చూ. బహదరు. వి. 1. యోధుడు, శూరుడు ; 2. ఘనసూచకమైన ఒక బిరుదు.

**బహదూరు** రూ.చూ. బహదరు. వి. 1. యోధుడు, శూరుడు ; 2. ఘనసూచకమైన ఒక బిరుదు.

**బహద్దరు** రూ.చూ. బహదరు. వి. యోధుడు, శూరుడు ; ఒక విధమైన బిరుదు శబ్దం.

**బహద్దు** వి. హద్దు పూర్తిగా. విశ్వే.శ.

ఉ. బాహద్. హద్దు పూర్తిగా.

< ఉ. బహద్.

**బహద్దూరు పాప్పిశీచీర** చూ. బహదరు. వి. ఒకరకం గడిచీర.

**బహల్‌చేయు** అ.క్రి. స్థిరపరచు.

హిం. బహాల్. సంతోషంగా ఉండే, స్థిరపడ్డ, సుఖ సంతోషాలతో ఉండే, ఉద్యోగంలోకి తిరిగి తీసుకోబడ్డ ; ఉ. బహాల్. ఆనందం, సంతోషం, ఉద్యోగంలో తిరిగి చేరటం, ప్రస్తుత స్థితిలో కొనసాగటం, పూర్వపు స్థితికి చేరు కోవటం ;

క. బహాలు.

**బహాదురు** రూ.చూ. బహదరు. వి. యోధుడు, శూరుడు. ఒక విధమైన బిరుదు శబ్దం.

**బహానా** వి. నెపం, వంక.

హిం.ఉ. బహానా. మిష, వ్యాజం, నటన ; మరా. బహాణా. ఉద్దేశం, నిమిత్తం ; పార. బహానహ్. ఉద్దేశం ; అర. బహానహ్. వ్యాజం, మిష, నటన.

< ఉ. బహానా.

**బహాలుచేయు** స.క్రి. ఉద్యోగంలో తిరిగి చేర్చుకొను.

హిం. ఉ. పార. బహాల్. పూర్వంలా ఉండటం. ఉద్యోగంలో తిరిగి చేర్చుకొను.

< ఉ. బహాల్ + చేయు.

**బహి** వి. వెలుపల, వెలి. శివరా. 4.13.

సం. బహిస్. బయట.

< సం. బహిస్.

**బహిమొపర్చు(-ఒపర్చు)** స.క్రి. బహిరెట్టు, వెలి

వేయు. భాగ. 10.9.78. బహిష్పడు(-పడు) అ.క్రి. వెలివేయబడు, కులంనుంచి బహిష్కరింపబడు. ఆము. 6.69. బహిష్పెట్టు(-పెట్టు) స.క్రి. వెలివేయు, కులం నుంచి బహిష్కరించు. భార. శాంతి. 1.322.

బహిరి వి. బిరుదు వాచకం.

హిం. బహర్. ఉదారస్వభావుడు ; మరా. బహరి ; పార. బహర్.

<మరా. బహిరి.

బహిర్భూమికిపోవు అ.క్రి. మల విసర్జన చేయటానికి వెళ్ళు.

సం. బహిర్భూమి-. బయటి ప్రదేశం.

బహుకరము వి. లొట్టియ, బంతి.

సం. బహుకర-. అనేక సాహాయ్యాల్ని చేసేది.

<సం. బహుకర- + -ము (అర్థవిపరి.).

బహుదరు రూ.చూ. బహదరు. వి. 1. యోధుడు, శూరుడు ; 2. ఘన సూచకమైన ఒకానొక బిరుదు.

బహుదూరు రూ.చూ. బహదరు. వి. బిరుదు నామం.

బహుబాగా క్రి.విశ. మిక్కిలి నైపుణ్యంగా.

బహుమానం వి. కానుక, బహుమతి.

సం. బహుమానం. గౌరవం (అర్థవిపరి.).

బాకా రూ.చూ. బాంకా. వి. కాహళం, ఊదే వాద్య విశేషం.

బాకాపట్టు అ.క్రి. 1. బాకా ఊదు ; 2. తైరుకొట్టు.

బాకీ రూ. బాకి, బాక్కి. విశ. 1. విస్తృతం, విశాలం, వెడద. భాగ. 9.207 ; 2. పెద్దదయిన ; వి. అప్పు, ఋణం.

హిం.మరా.ఉ.పార. బాకీ. శేషం, మిగిలింది, ఇంకా ఇవ్వవలసింది ;

క. బాకి, మిగిలినది, శేషం, అప్పు ; త. పాక్కి ; మ. బాక్కి.

<ఉ. బాకీ.

బాకిపేటిమెకము రూ. బాకినోరుమెకము. వి. పంచాస్యం; సింహం. బాకిపేయ రూ. బాకినోరు. వి. పెద్దనోరు.

బాకిపేరుమెకము రూ.చూ. బాకిపేటిమెకము. వి. సింహం.

బాకీ రూ.చూ. బాకి. వి. అప్పు. రంగా.చ. 2.171 ; విశ. మిగిలిన.

బాకిపేరు రూ.చూ. బాకినోరు. వి. వికారపునోరు.

బాకీపడు అ.క్రి. అచ్చు, అప్పుపడు, ఋణపడు.

బాకీదారు రూ. బాకీదారు(డు. వి. అప్పు తీసుకొన్నవాడు.

ఉ. బాకీదార్. మిగిలినదికలవ్యక్తి ; పార. బాకీదార్.

<ఉ. బాకీదార్.

బాకీదారు(డు రూ.చూ. బాకీదారు. వి. అప్పు తీసుకొన్నవాడు.

బాకు రూ.చూ. బా(కు. వి. కత్తి.

బాకురుబాకురు వి. బాతుల అరుపులో అయ్యే ధ్వనికి అనుకరణం.

బాక్కి రూ.చూ. బాకీ. వి. అప్పు ; విశ. మిగిలిన, ఇంకా కట్టవలసిన.

బాగడు చూ. బాగు.

బాగరము చూ. బాగు. వి. మంచి కట్టడం, కట్టునుంచి కట్టడ కట్ట మేర్పడ్డట్లు బాగునుంచి బాగర మేర్పడి ఉండవచ్చు.

బాగర్ఇనాం వి. సేనాపతి ఇచ్చిన ఇనాం.

హిం. బాగీ. తిరుగుబాటుదారుడు, విద్రోహి.

బాగములు రూ. బాగలు. వి.బ.వ. పోకచెక్కలు, వక్కలు. విక్ర. 8.96.

సం. భాగ-. అంశం, పాలు ; ప్రా. భాగ- ;

క. బాగా, బాగి, బాగె. వక్కచెట్టు ; త. పాక్కు, బాగాలు.

<ప్రా. బాగ-.

బాగరి చూ. బాగు.

బాగలు రూ.చూ. బాగములు. వి.బ.వ. వక్కలు. శశా. 2.80.

బాగశాలి రూ. బాగాలి. వి. 1. భార్య ; 2. ఒక తిట్టు.

సం. భాగ్యశాలిని. భాగ్యవంతురాలు ; ప్రా. భాగ-. భాగ్యం.

బాగా రూ. బాగ[5], బాగా[4]. అవ్య. సొగసుగా.

బాగాకు వి. ఒకరకం ఆకెరుపు మొక్క.

బాగాత్ రూ.చూ. బాగాయతీ. వి. ఎక్కువగా బావి నీటితో సాగు చేసే నేల.

బాగాయతీ రూ. బగాయతి, బగాయతు, బాగాత్, బాగాయతు, బాగాయిత్, బాగాయితీ. వి. తోటపన్ను.

హిం. బాగ్. తోట ; మరా. బాగాఈత్ ; ఉ. బాగాత్. తోటలను పెంచటానికి తగిన, తోటలో పండిన పండు, తోటలపైన వేసే పన్ను ;

క. బాగాయతి. తోటల భూములకు సంబంధించిన ; త. పాకాయతి.

<ఉ. బాగాత్.

బాగాయతు రూ.చూ. బాగాయతీ. వి. 1. తోటపన్ను ; 2. ఎక్కువగా బావి నీటితో సాగు చేసే నేల.

బాగాయిత్ రూ.చూ. బాగాయతీ. వి. ఎక్కువగా బావి నీటితో సాగు చేసే నేల.

బాగాయితీ రూ.చూ. బాగాయతీ. వి. ఎక్కువగా బావి నీటితో సాగు చేసే నేల.

బాగిలించు అ.క్రి. బయటపడు, వెలువడు. దశా. 8.48.

క. బాకల్, బాగల్, బాగిల్. వాకిలి, ద్వారం ; తు. బాకిలు. ద్వారం, వాకిలి ; త. వాయిల్, వాయల్, వాచల్. ద్వారం, ప్రవేశం.

<క. బాగిల్ + ఇంచు[3].

బాగిలుమాడుమాడము వి. గృహ ద్వారంపైకాని గోపురంపై కాని నిర్మించబడ్డ మేడ లేక శిఖరం. H.A.S. 13 37. క్రీ.శ. 1130.

క. బాగిల్. వాకిలి, ద్వారం.

బాగీ వి. విద్రోహి. విశ్వాస.

హిం. బాగీ. రాజద్రోహి ; మరా. బాగీ. తిరుగుబాటు చేసే స్వభావంగల ; ఉ. బాగీ. విద్రోహి, విరోధి ; పార.అర. బాగీ. దేశద్రోహి, విద్రోహి, విప్లవం చేసే వాడు.

<ఉ. బాగీ.

బాగు వి. 1. విధం, తీరు. భార.ఆది. 6.192 ; 2. ఒప్పిదం, సౌందర్యం. భాగ. 8.266 ; 3. భద్రం, శుభం. సాంబ. మాన. 33 ; 4. ఆరోగ్యం ; 5. క్షేమం ; విశ. 1.

శుభ్రమైన, పరిశుద్ధమైన. భార. విరా. 2.52; 2. చక్కని, సొగసైన. శృం. నై. 7.93; 3. యుక్తమైన, తగిన. కాశీ. 1.79.

సం. భాగ-. అదృష్టం, శుభం, పాలు; ప్రా. భాగ-. ప్రకారం, భంగి, అవకాశం;

త. వాకు-. అందం, కాంతి, సొగసు, వాకన్. అందమైనవాడు, వాకి. అందమైన స్త్రీ.

<ప్రా. బాగ-.

బాగగు అ.క్రి. 1. నెరవేరు. కకుత్స. 5.95; 2. ఒప్పు, రమ్యమగు. సారంగ. 2.9. <బాగు+అగు. బాగరి వి. సుందరుడు, అందగాడు, సుందరి, అందగత్తె. రామాభ్యు. 3.44. <బాగు+-అరి. బాగుటిగులు వి.బ.వ. మంచి చెర్లు. బాగుగా క్రి.విశే.ద్రు. సరిగా. <బాగు+అగు+-ఆ[7]. బాగుచేయు స.క్రి. చక్కబరచు. బాగుదెలియు(-తెలియు) అ.క్రి. విధం తెలియు. బాగుపడు అ.క్రి. భద్రం పొందు, మేలొందు. వేమ. 3.136. బాగులాడి వి. అందకత్తె. సారంగ. 1.88. <బాగు+-లు+-ఆడి. బాగొప్పు అ.క్రి. అందమగు. కాశీ. 3.116. <బాగు+ఒప్పు.

బాగుదార రూ. బాఁకుదారు. వి. చురకత్తి, ఆయుధ విశేషం. చంద్రికా. 2.84.

బాగెము వి. సుకృతం, పుణ్యం. యయా. 1.120.

సం. భాగ్య-. అదృష్టం; ప్రా. బగ్గ-. అదృష్టం, దైవం; పా. బగ్గ, భాగ్య-. అదృష్టం; అ.బెం. భాగ్; ఒ. భాగ; హిం. భాగ్;

క. బగ్గ, బాగ, బాగు; త. పాక్కియమ్; కువి. బాగెమి; బ్రా. బాగెల.

<ప్రా. బగ్గ-.

బాగొప్పు చూ. బాగు.

బాగోతి రూ. భాగవతుఁడు. వి. కృష్ణుడు మొదలైన వారి వేషం వేసుకొని జీవించేవాడు. క్రీడా. పీఠి. 68.

బాఘరా వి. ఒకానొక దినుసు, భోజనపదార్థం. ద.హిం.గా. సంపు. 6. గా.సం. 720.

బాంకా రూ. బాకా, బాంక్కా. బాఁకా. వి. ఊదే వాద్య విశేషం, కాహళం. పద్మయు. 272.

హిం. బాంకా. వక్రమైన, వంకర; ఉ. బాంకా. వక్రమైన;

త. పాంకా, వాంకా.

<హిం. బాంకా.

బాంకి రూ.చూ. బ్యాంకు. వి. ధననిధి, కోశి.

బాంకినోటు రూ. బ్యాంకినోటు. వి. సొమ్ము చెలామణి పత్రం. ఇం. *Bank note*. సొమ్ము చెలామణి పత్రం. <ఇం. Bank note.

బాంక్కా రూ.చూ. బాంకా. వి. ఒకవిధమైన ఊదు వాయిద్యం.

బాంగోలకసము వి. ఒకరకం రవికెల గుడ్డ.

<బాంబుగోల-+కసము.

బాఁకా రూ.చూ. బాంకా. వి. కాహళం, ఊదే వాద్య విశేషం, చర్మవాద్య విశేషం.

బాఁకు రూ. బాకు. వి. కటారి, కత్తి, వంకరకత్తి. కు.సం. 11.37. (?)

హిం. బాఁక్. ఒకవిధమైన కత్తి; మరా. బాంక, బాక. వంకర, వంపు;

క. బాకు.

<హిం. బాఁక్.

బాఁకుదారు రూ.చూ. బాగుదార. వి. చిన్నకత్తి.

బాజరా వి. కొర్రల మాదిరిగా ఉండే ఒకరకం ఆహారధాన్యం.

హిం. బాజ్‌రా. ధాన్య విశేషం.

<హిం. బాజ్‌రా.

బాజరాళ్లు వి.బ.వ. ఆము పొయ్యిలకు పక్కగా పెట్టిన రాళ్ళు.

హిం ఉ. బాజ్. కొన్ని, వేగ.

<ఉ. బాజ్+రాయి+-లు+-లు.

బాజరు వి. మహా విద్వాంసుడు. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 775.

ఉ.పార. బాకిర్. విద్వాంసుడు.

బాజా వి. 1. డోలు, తప్పెట మొదలైన వాద్య విశేషాలు. రంగా.చ. 3.26; 2. పాదాలుండే కంచంలాంటి మట్టి పాత్ర, మహమ్మదీయులు అన్నం తినే మట్టిపాత్ర.

హిం.మరా.ఉ. బాజా. వాద్యం.

<ఉ. బాజా.

బాజాబందు రూ.చూ. బాజుబందు. వి. రెట్ట కంకణం.

బాజారీ రూ.చూ. బాజారు. వి. అంగడి వీథి.

బాజారు రూ. బజారు, బజాలు, బాజారీ, బాజాలు. వి. 1. విపణి వీధిలోని జనం. శ్రీనాథుని చాటువు; 2. అంగడి వీథి. హంస. 1.218; 3. వ్యభిచారం, స్వైరం. బహులా. 3.58; 4. ప్రల్లదం. అం.బా. 1.116; 5. అంగడి.

హిం.ఉ. బాజార్. అనేకమైన దుకాణాలు గలది; బజార్. స్థానం; మరా. బాజార్, బాఝార్. అంగడి వీథి, సంత; ఉ. బాజార్. అంగడివీథి; పార. బాజార్. అంగడివీథి, సంతరోజు, బేరం.

<ఉ. బాజార్.

బాజాఱము చూ. బాజారు. వి. వ్యభిచారం.

బాజాళి రూ.చూ. బజార. వి. 1. జారిణి; 2. స్వైరిణి.

బాజాలు రూ.చూ. బాజారు. వి. అంగడివీథి, విపణి.

బాజిబందు రూ.చూ. బాజుబందు. వి. 1. సందిట కట్టుకునే భూషణం; 2. కేయూరం.

బాజీ వి. మోసం.

హిం.ఉ.పార. బాజీ. మోసం, వంచన.

<ఉ. బాజీ.

బాజీఖోరు వి. మోసగాడు, వంచకుడు. పద్మ.యు. 60.

హిం. బాజీ. పరతు; మరా. బాజీ. విజయం, పేకముక్కలు; ఉ. బాజీఖోర్. వంచకుడు, బాజీ. మోసం; పార. బాజీ. ఆట.

<ఉ. బాజీఖోర్.

బాజీబందు రూ.చూ. బాజుబందు. వి. స్త్రీల సందిటధరించే నగ, రెట్టకడియం.

బాజు[1] రూ. బాదు[2]. వి. 1. శ్రేణి, వరుస. అచ్చ.రా. పీఠి. 26; 2. ఇంటి పక్కలకి అమర్చిన పొడుగైన లావన్న

కర్రలు ; 3. కొన, దూలం చివరి భాగం ; 4. కొయ్యవానం ; 5. ద్వారబంధపు నిలువుకమ్మి ; 6. పొరక, పొంటి, రేకు ; 7. వేపు, పక్క, వంక, వెంట.

మరా. బాజూ. ఒకవైపు, ఒకపక్క, సేనాపక్షం, సాయం చేసేవాడు ; ఉ. బాజూ. మిత్రుడు, ఇరుపక్షాల సైన్యం ; పార. బాజూ. మిత్రుడు, మంచంయొక్క ఒకపక్క.

<ఉ. బాజూ.

బాజుపట్టె వి. ద్వారబంధపు నిలువుకమ్మి. బాజుమొల వి. దాబీ కోలల బిగింపుకోసం అడ్డంగా వేసిన ఇనప ఊచ.

బాజు² వి. ఒకరకం డేగ. హరిశ్చ. 2.22.

హిం. బాజ్. పక్షివిశేషం ; మరా.ఉ. బాజ్. వేటకు ఉపయోగించే పక్షివిశేషం ; పార. బాజ్. శ్యేనం.

<ఉ. బాజ్.

బాజుగస్తు వి. మరల ఇచ్చి వేయబడింది.

ఉ.పార. బాజ్‌గశ్త్. మరల ఇవ్వబడింది.

<ఉ. బాజ్‌గశ్త్.

బాజుబందంచు చూ. బాజుబందు.

బాజుబందు రూ. బాజాబందు, బాజిబందు, బాజీబందు. వి. 1. నందిట కట్టుకొనే భూషణం. కృష్ణార్జు. 3. 2. కేయూరం. యామినీ. 2.95.

హిం. ఉ. బాజూబంద్. అంగదం ; మరా. బాజూబంద్. దండకు కట్టుకొనే భూషణం ;

క. బాజుబందు. అంగదం ; త. పానిపందు.

<ఉ. బాజూబంద్.

బాజుబందంచు వి. బాజుబందు, ఒకరకం దండకడియం ఆకారంలో పంకిలుగా డిజైను పడేట్టు నేసిన అంచు. <బాజుబందు + అంచు.

బాజోటు వి. కనిపించకుండా తప్పుకు పోవటం.

బాట రూ. బాడ, బాట. వి. 1. విశాలమార్గం, బండిదారం. శార. కర్ణ. 2.63 ; 2. దిక్కు, ప్రదేశం. ప్రబంధ. 45.

సం. వర్త్మన్, వాట-, బాహ్యాట-. మార్గం ; ప్రా. వట్టా ; పా. వటుమ- ; హిం. ఘాట్ ;

క. బాడె ; త. పాడె.

<ప్రా. వట్టా.

బాటంచు వి. చెత్తెడుఅంచు. <బాట + అంచు³. బాటదార్లవరమగు అ.క్రి. జనసమ్మర్దంతో నిండిఉండు. కళా. 2.14. బాటబడు (-పడు) అ.క్రి. ఆధారమగు. బాటపారి వి. తోవనడిచేవాడు, పథికుడు. కళా. 2.14. బాట్లు వి.బ.వ. సన్ననున్నపనివారు రుద్దడానికి వాడే. అరుగు అరుగుల మధ్యగా ఉన్న నడిచేదారి.

బాట్లు చూ. బాట.

బాటర్ రూ.చూ. బోర్డరు. వి. స్తంభానికి పైనా దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో దూలానికి అనుకున్న ఉపరితలం.

బాటరంచు దూ.చూ. బాడరంచు. వి. 1. నాలుగైదు రంగు పోగులు వరసగా గీరలు పడేట్టు వేసిన అంచు ; 2. మూడు నాలుగు వేళ్ళ వెడల్పున నేసిన మామూలంచు. <బాటర్ + అంచు³. బాటరుకమ్మి వి. బలపాలంచుకమ్మి, ఒకరకం చీరకమ్మి.

బాటరంచు చూ. బాటర్.

బాటరుకమ్మి చూ. బాటర్.

బాటు వి. తూకపురాయి.

బాట్లాకు రూ.చూ. పొట్లాకు. వి. చిలుకు, తాళం వేయటానికి వీలుగా అమర్చిన పరికరం.

బాడ రూ.చూ. బాట. వి. సింహద్వారానికి ముందు అరుగు మధ్యగాఉన్న నడిచేదారి.

బాడకా రూ.చూ. బాడ్కా. వి. నౌకరు.

బాడకాచాకిరి దూ. బాడుచాకిరి, బాడ్కాచాకిరి. వి. వెట్టిచాకిరి.

బాడతి వి. వేశ్యకొచ్చేరొక్కం.

సం. భార్త-. నౌకర్లకు సంబంధించిన ; భాటక-, భాటకా, భాటీ. జీతం ; ప్రా. బడయ-, భాడియా. భాడీ. జీతం ; హిం. భాడా. అద్దె.

<ప్రా. బాడయ-.

బాడతికాడు వి. విటుడు. కు. సం. 8.185.

బాడబ రూ.చూ. బాడవ. వి. మాగాణి, కాలవ, చెరువు మొ. వాటినీటితో సాగు చేసేనేల.

బాడర్ రూ.చూ. బోర్డరు. వి. స్తంభానికిపైనా దూలానికి కిందా నగిషీగా చేసిన కట్టుబడిపనిలో దూలానికి అనుకున్న ఉపరితలం.

బాడరంచు రూ. బాటరంచు, బార్డంచు. వి. 1. నాలుగైదు రంగు పోగులు పచ్చ తెల్ల మొ.వి వరసగా గీరలు నేసిన అంచు ; 2. మూడు నాలుగు వేళ్ళ వెడల్పున నేసిన పడేట్టు మామూలంచు. ఇం Border. అంచు. < ఇం. Border + అంచు³.

బాడరంచు చూ. బాడర్.

బాడవ రూ. బడువ, బాడప, బాడువ. వి. 1. నీళ్ళు నిలిచే పల్లపు ప్రదేశం. నె. గా. 124. శ్రీ.క. 1582 ; 2. పడవ : 3. ఏటిపక్కన ఉండటం వల్ల ఎప్పుడూ తేమతో ఉండే ఒండ్రునేల.

హిం. బాఢా. విస్తృతమైన బాకీప్రదేశం.

బాడవకొమ్ము వి. పెద్దకొమ్ము. బాడవపొలము వి. వాక పొలం, నీటివాక. బాడవమన్ను వి. చేలమట్టి, పొలంలో తవ్వి కొచ్చిన మట్టి.

బాడవము వి. ఎర్రని పూలుపూసే ఒకచెట్టు.

బాడా దూ.చూ. బాడిగ¹. వి. ఇంటినిగాని, బండినిగాని వాడుకొన్నందుకు నియమితకాలానికి ఇంత అని చెల్లించే డబ్బు.

బాడి దూ.చూ. బాడియ. వి. 1. బురద ; 2. జిగట వచ్చేదాకా కాలితో తొక్కి తయారు చేసిన పాకంగల మట్టి.

బాడిపీట వి. నాటికబల్ల, బండితోలేమనిషి కూర్చోవటానికి నొగమీద అమర్చిన చెక్క. బాడివారం వి. దమ్ములు అయిన తరవాత పశువులకు పరమాన్నం వండిపెట్టిచేసుకునే పండుగ.

బాడిక దూ. బాడిక, బాడికి, బాడికె. వి. అంటరానివాడు.

ఒ. బాడిక. పేద, అశుద్ధం, అంటరానివాడు.

<ఒ. బాడిక.

**బాడిగ[1]** రూ. బాడా, బాడిగె, బాదు[1], బాదుగ, బెడిగ, బేడిక, బేడిగ, బేడిగె. వి. కిరం. గౌ. హరి. ఉ. 1189 ; 2. ఒకరు ఒకని సొత్తును ఉపయోగించుకొనటానికి ఆసొత్తుగల వాడికి ఇచ్చేధబ్బు, అద్దె.

సం. భాటక-, భాటి. పదుపవృత్తివల్ల ఆర్జించింది ; ప్రా. బాడఅ-, భాడగ-, భాడయ-, భాడియా. భాడి ; అమా. భాడయ, భాడి. కిరాయి, అద్దె :

క. బాడగె, బాడిగె ; తు. బాడాయి, బాడిగె ; త. వాటకై ; మ. పాటక ; ద్రా. బాడో, అద్దె. కిరాయి.

<ప్రా. బాడగ-.

**బాడిగ[2]** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్నచెట్టు (Erythrina indica).

**బాడిగె** రూ.చూ. బాడిగ[1]. వి. అద్దె. తాళ్ల. సం. 10.227.

**బాడిత[1]** రూ. చూ. బాడిస[1]. వి. వ(డ్రంగి క(ర్రలు చెక్కే సాధనం. బసవ. 4.1080వ.

**బాడితకోయు** వి. మొనలుసానపట్టి బాడితకు పదును పెట్టటం.

**బాడిత[2]** రూ. బాడిగ[2], బాడితి, బాడితె, బాడిద[2], బాడిదె, బాడిస[2], బాడిసె, బాడ్సె. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్నచెట్టు (Erythrina indica).

**బాడితి** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్నచెట్టు (Erythrina indica).

**బాడితె** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్న చెట్టు (Erythrina indica).

**బాడిద[1]** రూ. బాడిదము, బారిజము, బారిదము. బార్దము. వి. దేవదారువు. శార. విరా. 5.35.

సం. పారిభ(ద-. దేవదారువు.

<సం. పారిభ(ద-.

**బాడిద[2]** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్నచెట్టు (Erythrina indica).

**బాడిద[3]** రూ.చూ. బాడిస[1]. వి. కొయ్య చెక్కటాని కుపయోగించే సాధనం.

**బాడిదము** రూ.చూ. బాడిద[1]. వి. దేవదారువు.

**బాడిదె** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్నచెట్టు (Erythrina indica).

**బాడిదెపుచెట్టు** వి. బలభ(ద్రిక, ఒకానొక అడవి చెట్టు (Erythrina indica).

**బాడియ** రూ. బాడి, బాడె. వి. బురద.

**బాడిస[1]** రూ. బాడిత[1], బాడిద[3]. వి. వ(డ్రంగి కొయ్యచెక్క కొరముట్టు. శార.విరా. 5.35.

సం. బాడాసు-. బాడిత ;

క. బాచి, బాజి ; తు. బాజి ; త. వాచ్చి, చాట్పి ; మ. వాచ్చి, వాసి ; కుఇ. బారాసి ; కువి. పార్సి.

<సం. బాడాసు-.

**బాడిస[2]** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్న చెట్టు (Erythrina indica).

**బాడిసె** రూ.చూ. బాడిత[2]. వి. కంచెల్లో పెంచబడే ఒకరకం చిన్న చెట్టు (Erythrina indica).

**బాడీ** వి. ఆడవాళ్ళు రవిక లోపల తొడుక్కునే వస్త్ర విశేషం.

ఇం. *bodice.* స్త్రీలు నడుము వరకూ ధరించే బిగువైన ఉడుపు, లోరవిక.

<ఇం. bodice.

**బాదు[1]** రూ.చూ. బాడిగ[1]. వి. కుంటెనధనం.

**బాదు[2]** వి. గవుసెన, పరదా, ముసుగు. ఆం.భా. 2.159.

**బాదువెట్టు** (-పెట్టు) స.(కి. ముసుగుపెట్టు. పార్వ. 2.114.

**బాదుకా** రూ.చూ. బాడ్కా. వి. నౌకరు.

**బాదుకాబంటు** వి. మానహీనుడు.

**బాదుగ** రూ.చూ. బాడిగ[1]. వి. అద్దె.

**బాదుగోలు** రూ.చూ. పోదుగోలు. వి. 1. వార్తాహరుడు. హంస. 5.536 ; 2. మానహీనుడు ; 3. పనికిమాలిన వాడు ; 4. జారిణి.

**బాదుచాకిరి** రూ.చూ. బాదకా చాకిరి. వి. వెట్టిపని.

**బాదుదల** వి. ఇది పట్టు ధాతువుతో వ్యవహితంగా, అవ్యవహితంగా అను(ప్రయుక్తమై (ప్రయోగాలలో కన్పిస్తోంది. 1. శూరకృత్యం. భార.కర్ణ. 1.135 ; 2. (ప్రాణాలతో ఉన్న తల. నృసింహ. 2.116 ; 3. సాహసకృత్యం. భాస్క.రా.యు. 444 ; 4. అవమానించటం, తెగడిక. కవిక. 2.11..

త. పాడుదుత్తై.

**బాదుదలగించు** స.(కి. అవమానించు. <బాదుదల+ -ఇంచు[3]. **బాదుదలబట్టు** (-పట్టు) రూ.చూ. బాదుదలపట్టు. స.(కి. జీవ(గాహంగా పట్టు. కవిక. 2.118. **బాదుదలపట్టు** (-పట్టు) రూ. బాటుదలబట్టు. స.(కి. జీవ(గాహంగా పట్టు. భార.కర్ణ. 2.6.

**బాదువ** రూ.చూ. బాదవ. వి. పల్లపునేల. అచ్చ.రా. 3.37.

**బాడె** రూ.చూ. బాడియ. వి. 1. బురద, పంకం ; 2. మేకల పెంట.

**బాడెపుంటు** వి. పొర్లు కట్టిన పంటు.

**బాడ్కా** రూ. బాదకా, బాదుకా. వి. నౌకరు.

**బాడ్కాచాకిరి** రూ.చూ. బాదకాచాకిరి. వి. వెట్టిచాకిరి.

**బాడ్సె** రూ.చూ. బాడిత[2]. వి. ఒకరకం కంచె మొక్క (Erythrina indica).

**బాణ** వి. పరా(క్రమం. అద్దంకి గానసం. (కీ.క. 848.

సం. బాణ-. అమ్ము.

<సం. బాణ- (అర్థవిపరి.).

**బాణం** రూ. బానం. వి. 1. ఉండేలు. అచ్చు పెంకును కోయటానికి కుమ్మర్లు వాడే సాధనం ; 2. కమ్మి నేతలో అందానికి పడుగులో దూర్చిన రంగు దారం.

సం. బాణ-. అమ్ము ; (ప్రా.పా. బాణ- ; నా.అ.బెం. బాన్ ; ఒ. బాణ.

<సం. బాణ-+-ము (అర్థవిపరి.).

**బాణకత్తి** రూ.చూ. బాణాకత్తి. వి. సాము చేసేవాళ్ళు ఉపయోగించే పొడుగాటి క(ర.

**బాణపు(జివ్వ** చూ. బాణము[1].

బాణము¹ వి. 1. ఒకరకం ఫిరంగి. ఆం.భా. 2.218 ; 2. టపాకాయ మొదలైన బాణ సంచా.

హిం. బాన్. ఒకవిధమయిన బాణ సంచా.

< హిం. బాన్.

బాణపు(జివ్వ (-చివ్వ) వి. ఒకవిధమైన బాణాసంచు. కృష్ణరా. 3.29. బాణవిద్దె వి. బాణసంచు, బాణసంచులు కాల్చే విద్య. హంస. 3.29.

బాణము² రూ. బాణా². వి. ఒకవిధమైన వుసుగు.

సం. బాణ-. అమ్ము.

< సం. బాణ- + -ము (అర్థవివరి.).

బాణలి రూ. బాండలి, బాండప, బాండవు, బాండీ, బాండువ, బాండువా, బాండ్లి, బాన్లి. వి. వేపటం మొదలైనవాటి కుపయోగించే లోహ పాత్ర విశేషం, బూరెల మూకుడు. ఆం.భా. 2.243.

క. బాణలి, బాణలె, బాణ్డ్లి, బాళలి, బాళ్ళి. రాయి లేక లోహంతో చేసిన వేపడం చేసే మూకుడు ; త. పాణలి, వాణలి, వాణాయ్. వేపడం చేసే మూకుడు :

సం. భాండ-. కుండ, నిధి ; ప్రా. భండ- ; పా. భండ.

బాణవిద్దె చూ. బాణము¹.

బాణసంచా రూ. బాణసంచు, బాణాసంచి. వి. దీపావళి నాటి రాత్రి కాల్చే మందుగుండు సామగ్రి.

హిం. బాన్‌సంచయ్. బాణాలరాశి, పటాసుల పోగు.

< హిం. బాన్‌సంచయ్.

బాణసంచు రూ.చూ. బాణసంచా. వి. తుపాకి మందుతో చేసి వేడుక కోసం కాల్చే పువత్తులు, చిచ్చుబుడ్లు మొ.వి.

బాణా¹ వి. దండాయుధం. రసిక. 1.31.

త. పాణాత్తడి.

బాణాకట్టె వి. పొడుగాటి కర్ర. బాణాకత్తి వి. ఆయుధ విశేషం, పొడుగాటి కత్తి. భోజనుణా. 3.66. బాణాకర్ర రూ.చూ. బాణాకఱ్ఱ. వి. సాము చేసేవాళ్ళు ఉపయోగించే పొడుగాటి కర్ర. బాణాకఱ్ఱ రూ. బాణకఱ్ఱ, బాణాకర్ర. వి. సాము చేసేవాళ్ళు ఉపయోగించే పొడుగాటి కర్ర. బాణావంకిడి వి. దండాయుధం లాంటి బాగు, బాణాకత్తి. శరాం. 2.17.

బాణా² రూ.చూ. బాణము². వి. అంచు నేతలకు వాడే గరుకు పోగు గల ఒకరకం కృత్రిమపు పట్టు.

బాణాసిల్కు వి. అంచు నేతలకు వాడే గరుకు పోగుగల ఒక కృత్రిమపు పట్టు. ఇం. *Silk*. పట్టు. < బాణా² + ఇం. Silk.

బాణావంచి రూ.చూ. బాణసంచా. వి. దీపావళినాడు కాల్చే మందుగుండు సామగ్రి.

బాండర్ వి. గోడ మూలల్లో చేసే చదును.

ఇం. *Bonder*. కాపివాడు.

< ఇం. Bonder.

బాండలి రూ.చూ. బాణలి. వి. లోతు తక్కువగా ఉండే వెడల్పాటి మట్టిపాత్ర.

బాండప రూ.చూ. బాణలి. వి. కుండ.

బాండవు రూ.చూ. బాణలి. వి. లోతు తక్కువగా ఉండే వెడల్పాటి మట్టిపాత్ర.

బాండీ రూ.చూ. బాణలి. వి. లోతు తక్కువగా ఉండే వెడల్పాటి మట్టిపాత్ర.

బాండు వి. 1. హామీ పత్రం ; 2. సున్నంబట్టీ మధ్య భాగం.

ఇం. *Bond*. ఒడంబడిక పత్రం, హామీపత్రం.

< ఇం. Bond.

బాండుకట్టుబడి వి. తొక్కిడి రాళ్ళు వేసి కట్టే పద్ధతి.

బాండురాయి వి. 1. గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళ మధ్య ఉంచి సందులు తప్పించి పక్కల మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి ; 2. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వంవారు గుర్తుగా పాతిన రాయి.

బాండువ రూ.చూ. బాణలి. వి. కుండ, ఘటం, పొయ్యిమీద ఎసరు పెట్టటానికి గంజి పోసుకోపటానికి వాడే పాత్ర.

బాండువా రూ.చూ. బాణలి. వి. నీళ్ళగూన, నీళ్ళు నిలవచేయటానికి వాడే మట్టిపాత్ర.

బాండ్లి రూ.చూ. బాణలి. వి. ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.

బాఁడు రూ. చూ. బాఁపఁడు. వి. బ్రాహ్మణుడు. క్రీడా. 159.

బాత వి. రెండు ప్రదేశాల మధ్య హద్దుగీత.

బాతలించు రూ.చూ. బాతరించు. అ.క్రి. 1. సంభ్రమించు. తత్తరపడు. పి.శకు. 3.105 ; 2. అరచు, మొరపెట్టు, నవనాథ. 3.156 ; 3. బద్దలగు.

బాతరించు రూ. బాతలించు. అ.క్రి. 1. బద్దలగు. శివరా. 1.61 ; 2. అరచు, మొరపెట్టు ; 3. సంభ్రమించు. తత్తరపడు.

బాతాకాని రూ.చూ. బాతాఖాని. వి. 1. వదరుబోతు ; 2. ఉబుసుపోకకు చెప్పుకొనే కబుర్లు.

బాతాఖాని రూ. బాతాకాని, బాతాఖానీ. వి. 1. వదరుబోతు ; 2. ఉబుసుపోకకు చెప్పుకొనే కబుర్లు.

హిం. ఉ. బాత్. మాట, విషయం, ఖాన్. స్థానం.

< ఉ. బాత్‌ఖాన్.

బాతాఖానీ రూ.చూ. బాతాఖాని. వి. వ్యర్థ సంభాషణ.

బాతాలు వి.బ.వ. బడాయిలు, డంబాలు.

సం. వార్తా. విషయం ; ప్రా. వత్తా, వట్టా ; హిం. బాత్. మాట ; మరా. బాత్. వ్యర్థప్రసంగం.

బాతావినారింజ వి. నారింజ చెట్టు (Citrus cuianticum).

బాతి రూ.చూ. బ్రాఁతి. వి. 1. ప్రీతి, ఇష్టం, ఇంపు. భార. మౌసల. 120 ; 2. శ్రద్ధ, జాగ్రత్త. భాస్క.రా.బాల. 404 ; 3. రీతి, విధం. రం.రా. కిష్కిం.

బాతివ వి. గనిగొయ్యి, కట్టుబడిరాళ్ళను తవ్వి తీయటానికి గవిలాగ తవ్విన గొయ్యి.

బాతిని రూ.చూ. బాతినీ. వి. 1. రహస్యంగా పంపబడే దూత, వేగువాడు ; 2. గుట్టు, రహస్యం.

బాతినీ రూ. బాతిని. వి. రహస్య వర్తమానం.

హిం. బాతినీ. రహస్య సమాచారం; ఉ. బాతినీ. ఆంతరికమైన సమాచారం; పార. బాతినీ. రహస్య వర్తమానం.

<ఉ. బాతినీ.

**బాతు**[1] రూ. బాతువు. వి. జలపక్షి విశేషం, ఆడేలు. ఆము. 1.65.

హిం. బతఖ్, బదక్; గు. బతక్; మరా. బదక్; ఉ. బాతూన్. పక్షివిశేషం; పార. బతక్, బాతూన్. పక్షివిశేషం; అర. బత్; పో. పాతు; స్పా. పాతొ-పాతొ. బాతు, పాతికా. చిన్న బాతు;

క. బాతు, బాతె; తు. బాతు; త. వాత్తు.

<పో. పాతు.

**బాతుకూజా** వి. బాతు ఆకారంలాగ చేసిన కూజా. **బాతుకోడి** వి. బాతు. **బాతుచెట్టు** వి. అంచులో బాతూ, చెట్టూ పడేట్టు నేసిన డిజైను. **బాతుపేటు** వి. చీర అంచులో బాతు నమూనాలు నేసిన డిజైను. **బాతుబేలు** వి. బాతుబొమ్మలు వరసగా పడేట్టు నేసిన డిజైను. **బాతుబోర్డరు** వి. బాతు ఆకారంలో డిజైన్లు నేసిన చీర అంచు. ఇం. *border*. అంచు. <బాతు[1]+ఇం. border. **బాతులంచు** వి. బాతు ఆకారంలో డిజైన్లు నేసిన చీర అంచు. **బాతూకమలంపేటు** వి. అంచులో బాతు, తామరపువ్వు నేసిన డిజైను.

**బాతు**[2] వి. అన్నం. సాంబ. మాన. 22.

హిం. భాత్. అన్నం; మరా. భాత. అన్నం; ఉ. భాత్. అన్నం.

<ఉ. భాత్.

**బాతుదుమాను** వి. ఏతపుమానుకు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య.

**బాతువు** రూ.చూ. బాతు[1]. వి. జలపక్షివిశేషం, ఆడేలు. ఆము. 2.65.

**బాతూకమలంపేటు** చూ. బాతు[1].

**బాద** వి. వేదన, నొప్పి, బాధ. ఆం.శా. 1.150.

సం. బాధా. వేదన; ప్రా. బాధా, బాహా; అ.మా. బాహా; పా. బాధా;

తు. బాద; త. వాతి; మ. వాత.

<సం. బాధా.

**బాదం** రూ. బాదంగి[1], బాదము, బాదాం, బాదాము. వి. 1. ఫలవృక్ష విశేషం. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 753, 754; 2. ఒకరకం లేత నీలంరంగు.

సం. బాదామ-. ఫలవృక్షవిశేషం; హిం. బాదామ్. ఫలవృక్షవిశేషం; ఉ. బాదామ్. వృక్షవిశేషం; పార. బాదామ్. వాతామ ఫలం.

<ఉ. బాదామ్.

**బాదంకమషు** వి. ఒకరకం అంచు (బాదామంచు) పెట్టి నేసిన రవికెలగుడ్డ. **బాదంకాయ** వి. 1. చిటికెనేతలో నేసే లింగాల మంటపం డిజైనులో మధ్య వచ్చిన పెద్ద చదరం. **బాదంకాయలచీర** వి. 1. ఒక రకం నేతచీర; 2. బాదం చెట్టుకాయ. **బాదంకాయలు** వి.బ.వ. 1. నేతలో బాదం కాయల నమూనాలో నేసిన డిజైను; 2. బాదంచెట్టుకాయలు. **బాదంకూజా** వి. బాదంకాయ ఆకారంలో ఉన్న కూజా. **బాదంగూడు** వి. కోడిగుడ్డుగూడు, అండాకారంగా ఉన్న గూడు.

**బాదగడ్డి** రూ.చూ. బోదగడ్డి. వి. ఆముకప్పుకి, ఆముకాల్పుకి పనికివచ్చే ఒకరకం గడ్డి.

**బాదంకిరి** రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పుదగ్గర కొద్ది వెడల్పుగా ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

**బాదంగి**[1] రూ.చూ. బాదం. వి. ఫలవృక్షవిశేషం. హంస. 1.105.

**బాదంగి**[2] రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పు దగ్గర కొద్ది వెడల్పులో ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

**బాదమార్చి** చూ. బాదము.

**బాదము** రూ.చూ. బాదం. వి. ఫలవృక్షవిశేషం.

**బాదమార్చి** వి. నామంకమాను, బాదంకాయ రూపంలో ఉండే ఆర్చి. <బాదము+ఆర్చి.

**బాదర** రూ.చూ. బాదరు. వి. తుపాకిలో జానకి తాడుంచే తావు.

**బాదరబంది** వి. 1. తగులాటం, ఇబ్బంది; 2. జంజాటం.

హిం. బాదర్. ప్రసన్నం, ఆనందించబడ్డది-; ఉ. పార. బందీ. ఖైదీ.

<హిం. బాదర్+ఉ. బందీ.

**బాదరము** రూ.చూ. బాదరు. వి. 1. జానకితాడు; 2. జానకితాడుఉంచే కర్ణాటకపు తుపాకిచెవి.

**బాదరించు**[1] అ.క్రి. ప్రతిఘటించు ఉ. హరి. 5.60.

**బాదరా** వి. తొందర.

హిం. బాదర్, బాద్రా. ప్రసన్నమయిన, ఆనందపడిన, సంతోషపడిన.

<హిం. బాద్రా.

**బాదరి** రూ.చూ. బహదరు. వి. బిరుదునామం.

**బాదరించు**[1] చూ. బాదరము.

**బాదరించు**[2] స.క్రి. సహోదరత్వం నెరపు. ఉ. హరి. 5.20.

సం. భ్రాతృ. సోదరుడు; ప్రా. భాఉ, భాఉఅ, భామర.

<సం. భ్రాతృ.

**బాదరు** రూ. బాదర, బాదరము. వి. తుపాకిలో జానకి తాడుంచే తావు. ఆం. శా. 2.216.

**బాదశహ** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదషహ** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదషహా** రూ.చూ. పాదశా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదసహ** రూ.చూ. పాదశా. వి. నాయకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదాం** రూ.చూ. బాదం. వి. 1. బాదంకాయ రంగు; 2. బాదంకాయ ఆకారం.

**బాదాంగిరి** రూ. పారంగి, బాదంకిరి, బాదంగి², బారంగి², బారంజి, బాలంకిరి, బాలంగి, బాలంగిరి, బాలాంగిరి. వి. కవ్వుదగ్గర కొద్దిపెదల్పు ఉండి కింది రానురాను విశాలంగా ఉండే పెంకుకవ్వు.

హిం. ఉ. పార. బాదామ్. బాదంచెట్టు, దానికాయలు.

**బాదామంచు** చూ. బాదాము.

**బాదామి** వి. 1. తమలపాకుల ఆకారంలో డిజైను నేసిన అంచు; 2. ఒకరకం గోధుమరంగు, బిస్కట్టురంగు.

< ఉ. బాదామీ.

**బాదామికమాన** చూ. బాదం. వి. బాదమార్చి, బాదంకాయ రూపంలో ఉండే ఆర్చి.

**బాదాము** రూ.చూ. బాదం. వి. ఫలవృక్షవిశేషం.

**బాదామంచు** వి. బాదామి రంగులో నేసినఅంచు. < బాదాము + అంచు³.

**బాదాషాహ** యా.చూ. పాదషా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదియా** రూ. పాతియా. వి. గిన్నె.

హిం. ఉ. పార. బాదియా, కంచుతో చేయబడినగిన్నె, గ్లాసు.

< ఉ. బాదియా.

**బాదు**[1] రూ.చూ. బాఁదు. స.క్రి. 1. గుంజను బాగాకూరి నాటు; 2. కొట్టు.

**బాదుకొను** రూ. చూ. బాఁదుకొను. స.క్రి. మొత్తు. **బాదుజోడు** వి. పట్టెడ, గొర్లమెడలకు అందానికి గాని వాటిని కాడిని పూన్చటానికి కట్టేటాడు మేకతోలు.

**బాదు**² రూ.చూ. బాజు¹. వి. 1. దూలంచివరి భాగం; 2. ఆకులరాట్నం ఇరుసు బిగించే నిలువుకొయ్య; 3. మూన కట్టులోని నిలువుకర్ర; 4. ఏతపుమానుకు ఆధారంగా నేలలో పాతిన నిలువుకొయ్య; 5. నిలువుపాలు; 6. గుంజ.

**బాదు**³ రూ.చూ. పాఁదు. వి. 1. భూమి మొ. వాటిలో దిగిన పర్వతం మొ. వాటి మూలం; 2. ద్రవ్యధాన్యాది నిక్షేపం; 3. మూలాధారం; 4. గింజలు మొ. వి పాతటానికి గర్ర పలుగుతో తవ్విన లోతైన గుంట; 5. మధ్యలో నీళ్ళుపోసి గచ్చును గట్టి పరచటానికి వీలుగా మట్టితో కట్టిన కట్ట.

**బాదుగుంజ** వి. నిరెకు ఆధారంగా నేలలో పాతిన నిలువు కొయ్య. **బాదులు** వి.బ.వ. చాటాకు ఇళ్ళకు పందిళ్ళ వేయటానికి భూమిలో నాటే పొడుగాటి గుంజలు.

**బాదుషా** రూ. చూ. పాదషా. వి. శాసకుడు, రాజు, ముస్లిం చక్రవర్తి.

**బాదుషా** రూ.చూ. పాదషా. వి. ప్రభువు, రాజు. మృత్యు. 2ఆ.

**బాల్డీ** రూ.చూ. బాల్డి. వి. బొక్కెన, బాల్టీ.

**బాన** వి. 1. పెద్దకుండ, కడవ. ఆం. భా. 2.246; 2. ఏతం కడవ; 3. నూలు లడీలు రంగు నీళ్ళలో ఉడకబెట్టి రాగి లేక రేకుపాత్ర; 4. పీరెత్తు తలుము మొక్క ఇనప పాత్ర; 5. మోటకట్టి నీళ్ళుతోడే పరికరం.

క. బానె, బాన, బాని. గుండ్రటి మూతిగల పెద్ద మట్టి కుండ; కొడ. ప.ని. కొలత(రెండుసెరి); తు. పాణి వాణె. పెద్దకుండ, బాన, బాణ. నీళ్ళపాత్ర; త. పానై. పెద్దమట్టికుండ, పరిమాణం యొక్క కొలత, పాణా. పెద్ద గుండ్రని కుండ; మ. పాన, పాని. నీళ్ళకుండ; కో. ప.ఞ్య. కొలత (= 8 ఒక్క), తో. పొ.న్య. బరగనుంచి వచ్చిన తొదమాట (నాలుగు ఒక్కల ఇల్లు);

సం. భాజన-. పాత్ర, భాండ-. కుండ; ప్రా. భాణ-, భాయణ-; అ.మా. భాణ-, భాయణ-. కుండ, పాత్ర; మా. భాఅణ; పా. భాణక-. జాడీ, భాజనం. పాత్ర.

**బానఇరుసు** వి. అర్ధచీల, ఏతపుబొక్కెన చెవికట్లగుండా దూర్చే ఇనపచువ్వ. **బానగాని** వి. ఎద్దుకు కాడి మరపటానికి అమర్చిన గానుగ మాదిరి కొయ్యయంత్రం. **బానగిలు** రూ. బానగిల్లు. అ.క్రి. బలాకృతమగు, బలవంతంగా లాగబడినదగు. సిం. ద్వా. 1.20. **బానగిల్లు** రూ.చూ. బానగిలు. అ.క్రి. బలాత్కృతమగు. **బానగుండు** వి. 1. వలిగం, మోటబానపైన ఉన్న ఇనపకట్టు; 2. ఏతంలో నీళ్ళుతోడే పరికరం. **బానంచు** వి. గుండంచు, పాత్రలమూతికి కింద మాదులాగ పెట్టిపైన కడియం చుట్టినట్లు చేసినఅంచు. < బాన + అంచు³. **బానరాయి** వి. పెద్దబానలను నర్సేపెద్ద రాయి. **బానల్రాయి** వి. పెద్దబానలను నర్సేపెద్దరాయి. < బాన + -లు + రాయి.

**బానం** యా.చూ. బాణం. వి. ఉండేలుబద్ద.

**బానరాసి** రూ. చూ. వారణాసి. వి. కాశీ. ద. హిం. గా. సంపు.66. గా. సం. 250. క్రీ.శ. 742–798.

**బానసపుబాఁపఁడు** చూ. బానసము.

**బానసము** వి. 1. వంటసాల. కు. సం. 10.191; 2. వంట. భార. విరా. 1.218.

క. బాణస. వంటసాల, బాణసి, బాణసిగ, నాలిసిగ. వంటవాడు;

సం. మహానస-. వంటఇల్లు; ప్రా. మహాణస-. పాకస్థానం, మహాణసి. వంటవాడు; అశోకప్రా. మహానస-; పాలి. మహానస; అ.మా. మహాణస-, మహానసిఅ; కాశ్రీగిర్నార్, నేపాలీ. భాన్సా, భాన్సా. వంటసాల, భాంజే, భాన్సె. వంటవాడు; మరా. భాణసా, భాణసి. పెళ్ళికూతురి తండ్రి పెళ్ళికొడుక్కి ఇచ్చే మట్టిపాత్రలు.

< క. బాణస.

**బానసపుబాఁపఁడు** వి. వంట బ్రాహ్మణుడు. ఆము. 4.196. **బానసమువాఁడు** విశే. వంటవాడు. భార.ఆది. 7.115. **బానసీఁడు** వి. వంటవాడు, వల్లవుడు. భార.విరా. 1.77.

**బానిసీఁడు** చూ. బానిస. వి. 1. బంటు, సేవకుడు; 2. పాదసేవకుడు.

**బానసీఁడు** చూ. బానసము.

**బానిస** రూ. బానిసె. వి. 1. కూలివాడు, వస్తువుల్ని మోసి తెచ్చేవాడు. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 358. క్రీ.శ. 1258; 2. దాసి. విక్ర. 6.130.

క. బాణసి, బాణసిగ. వంటవాడు.

బానిసత్వము వి. బానిసతనం. బానిసము వి. దాస్యం బానిసతనం. ఆం.శా. 2.288. బానిసవాఁడు విశే. దాసుడు. బానిసీఁడు వి. సేవకుడు, భృత్యుడు. అచ్చ.రా. సుందర.

బానిసీఁడు చూ. బానిస.

బానిసె రూ.చూ. బానిస. వి. గులాం, తొత్తు.

బానెపోగు చూ. బాన. వి. గొంగడి నేతలో పొడుగ్గా ఒక పక్కన వచ్చిన తెల్లదారం.

బాంది[1] వి. రాతికట్ట, వాగులకూ వఱ్రెలకూ అడ్డుగా పోసిన రాతికట్ట.

హిం. బాంధ్. అడ్డుకట్ట.

బాంది[2] రూ.చూ. బ్రాంది. వి. వేడి నిచ్చే మత్తు ద్రవం.

బాంది[3] వి. పనికత్తె.

హిం.ఉ. బాందీ. దాసి.

<ఉ. బాందీ.

బాంద్రకువ్వ వి. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టి కట్ట.

హిం. బాంధ్. అడ్డుకట్ట.

బాంద్‌రాయి వి. హద్దురాయి, పొలానికి హద్దులు నిర్ణయించి గుర్తుగా ప్రభుత్వంవారు పాతిన రాయి.

హిం. బాంధ్. అడ్డుకట్ట.

<హిం. బాంద్ + రాయి.

బాఁతి రూ.చూ. బ్రాఁతి. వి. 1. శ్రద్ధ. భాస్క.రా.బాల. 418; 2. ప్రియం. భాస్క.రా.సుందర. 293; 3. జాగరూకత. వేంక.పంచ. 4.501; 4. ప్రేమ. పెద్దన చాటువు; 5. దుర్లభం; 6. అధికం.

బాఁదు రూ. బాదు[1]. స.క్రి. కొట్టు, తాడించు. భార.విరా. 4.107.

సం. బాధ్. నిరోధించు; ప్రా. బాధ్, భావ్, నిరోధించు, పీడించు, చెరుచు, బాధా, బాహా. పీడ, విరోధం, వినాశం;

తు. బాద. బాధ, హింస; క. వాతి, బాధ.

<ప్రా. బాధ్.

బాఁదుకొను రూ. బాదుకొను. స.క్రి. కొట్టు, తాడించు. శేషధ. 4.

బాన్లి రూ.చూ. బాణలి. వి. 1. బూరెల మూకుడు; 2. మూకుడు.

బాపతు రూ.చూ. బాబతు. వి. 1. విషయం; 2. కిస్తీ; 3. సొమ్ములు; 4. పద్దు; 5. సంబంధం.

బాపత్తు రూ.చూ. బాబతు. వి. 1. విషయం; 2. రీతి; 3. పద్దు; విశే. సంబంధించినది.

బాపదారం వి. లావుదారం. ఆరో నెంబరు నూలు పోగులు మూతేసి కలిపి పురి పెట్టి తివాసీ నేతకు వాడే అచ్చు కఱ్రలకు అల్లే దారం.

హిం.ఉ. బాఫ్‌తా. పట్టుబట్ట.

బాపాక్రం రూ.చూ. బాబాకరము. వి. 1. అంతా తనకే కావాలనే కోరిక; 2. అపేక్ష.

బాపియ్యతు రూ.చూ. బాబతు. విశే. సంబంధించిన.

బాపు రూ. బాపురు, బాపురె, బాపురే. అవ్య. 1. ఆశ్చర్యార్థకం. పండి.చ. 2.164; 2. ప్రశంసార్థకం. బసవ. 5.620; 3. సంతాపార్థకం. భాస్క.రా.అయోధ్యా. 207.

ప్రా. బప్పొ. సుభటుడు, తండ్రి; దే.పా. బప్పొ, మేలు, బాస్. గౌరవసూచక పదం; అప. బప్పికీ; క. బాపురే.

<ప్రా. బప్పొ.

బాపురు రూ.చూ. బాపు. అవ్య. ప్రశంసార్థకం. క్రీడా. 282.

బాపురె రూ.చూ. బాపు. అవ్య. 1. ప్రశంసార్థకం. ఉ.హరి. 5.27; 2. ఆశ్చర్యార్థకం. శృం.నై. 8.16.

బాపురే రూ.చూ. బాపు. అవ్య. 1. ప్రశంసార్థకం. బసవ. 5.621; 2. ఆశ్చర్యార్థకం. బసవ. 5.690.

బాప్తు రూ.చూ. బాబతు. వి. 1. సొమ్ములు; 2. కిస్తీ; 3. విషయం; 4. పద్దు; 5. సంబంధం.

బాప్ప వి. తండ్రికి అక్క, మేనత్త.

ప్రా. బప్ప-తండ్రి.

బాబతు రూ. బాపతు, బాపత్తు, బాపియ్యతు, బాప్తు, బాబత్తు, బాబస్తు. వి. 1. విషయం; 2. రీతి, పద్దు; విశే. సంబంధించిన.

హిం. బాబత్. సంబంధించిన; ఉ. బాబత్, సంబంధమైన; పార. బాబత్. సంబంధించిన; అర. బాబత్. సంబంధించిన.

<ఉ. బాబత్.

బాబకువారి ప్రత్య. కిస్తీ క్రమ ప్రకారం.

ఉ.అర. బాబత్-పా.వారీ. బాబతు క్రమ ప్రకారం.

<ఉ. బాబత్-పా.వారీ.

బాబత్తు రూ.చూ. బాబతు. వి. సంబంధించినది.

బాబయ్య చూ. బాబు[1].

బాబయ్యో చూ. బాబు[1].

బాబస్తు రూ.చూ. బాబతు. వి. 1. సొమ్ములు; 2. కిస్తీ; 3. విషయం; 4. పద్దు; 5. సంబంధం.

బాబా[1] వి. 1. వాహనం. భీమ. 1.4; 2. గుఱ్రం. ఆం.శా. 2.196.

సం. బడబా. గుఱ్రం.

<సం. బడబా.

బాబారౌతు వి. కుబేరుడు.

బాబా[2] వి. తండ్రి.

హిం. బాబా. తండ్రి, తాత, సన్యాసిని, ముసలివార్ని పిలిచేందు కుపయోగించే పదం, ప్రేమతో పిలిచేందు కుపయోగించే మాట; ఉ. బాబా. తండ్రి, పిల్లల్ని ఆదరంగా పిలిచే శబ్దం.

<హిం. బాబా.

బాబాఅంచు వి. వస్త్రం యొక్క ఒకరకం పెద్ద అంచు.

బాబాకరము రూ. బాపాక్రం, బాబాక్రం. వి. 1. దురాశ; 2. అపేక్ష.

హిం.ఉ. బాబా. పిల్లల్ని ప్రేమతో పిలిచే శబ్దం.

బాబాక్రం రూ.చూ. బాబాకరము. వి. 1. దురాశ; 2. అపేక్ష.

**బాబాజీ** రూ. బావాజీ. వి. బైరాగి.
హిం. ఉ. బాబాజీ. సన్యాసి.
<హిం. బాబాజీ.

**బాబిను** వి. 1. మిల్లులో రేషం చుట్టే దారపుబంతి ఆకారంలో ఉండే పెద్దకొయ్యరీలు; 2. బట్టలుకుట్టే మిషనులో దారాన్ని చుట్టే గుండ్రటి ఉపకరణం.
ఇం. *Bobbin*. యంత్రంలో దారాన్ని లేదా నూలును లేదా తీగ మొ. వాటిని చుట్టే చిన్నదయిన గుండ్రటి ఉపకరణం.
<ఇం. Bobbin.

**బాబు**[1] వి. 1. ఇదికొన్ని సందర్భాల్లో వాత్సల్యాన్ని ఆదరాన్ని సూచిస్తుంది. శరా. 2.74; 2. తండ్రి, పినతండ్రి; 3. పూజ్యుడు; 4. గౌరవార్థ బోధకం.
క. బాబు. గౌరవసూచకపదం; హిం. బాబూ. గౌరవ సూచక పదం; గు. బాబూ. ఆదర వాచకం; మరా. బాబూ. ఆదరవాచకం, తండ్రి; ఉ. బాబా. తండ్రి, సర్దారు; పార. బాబా. తండ్రి, తాత. బాబూ. తిరిగే సన్యాసి; అర. బాబా. తండ్రి, తాత.
<మరా. బాబూ.
**బాబయ్య** వి. 1. తండ్రి; 2. పినతండ్రి; 3. పూజ్యుడు. <బాబు[1]+అయ్య. **బాబయ్యో** అవ్య. 1. పీపపైపడిన గుద్దుకి లొంగిపోయి పలికే ధ్వన్యనుకరణం; 2. కష్టసమయంలో ఉచ్చరించే శబ్దం. <బాబు[1] + అయ్య + ఓ[3].

**బాబు**[2] వి. 1. విషయం. ద. హిం. గా. సంపు. 4. గా.సం. 711; 2. పద్దు.
హిం. బాబ్. పరిచ్ఛేదం, అధ్యాయం; మరా. బాబ్. రకం, ప్రత్యేకవిషయం; ఉ. బాబ్. యోగ్యం, తగిన సంబంధం, విషయం, బాపతు; పార. బాబ్. విషయం, ముఖ్యవిషయం; అర. బాబ్. పరిచ్ఛేదం.
<ఉ. బాబ్.

**బాబువారీ** రూ. బాబువారి. ప్రత్య. కిస్తిక్రమ ప్రకారం.
ఉ. అర. బాబ్; పా. -వారి. విభాగించబడ్డ, సరియైన కిస్తీలక్రమప్రకారం చేయబడ్డ.
<ఉ. బాబ్+పా-వారి.

**బాబువారీ** రూ.చూ. బాబువారి. ప్రత్య. కిస్తీ క్రమ ప్రకారం.

**బాబూల్** వి. నల్లతుమ్మ వృక్షం.
హిం. బబూల్. మామిడితోప, ఒకచెట్టు.
<హిం. బబూల్.

**బామగుజ్జు** వి. తరిటిగుజ్జు, నగిషీపని చేసిన గుజ్జు.

**బాము**[1] వి. జన్మం, పుట్టుక. హరి. ఉ. 5.182.
సం. భవ-. పుట్టుకకు సంబంధించిన; ప్రా. భవ-. జన్మం, ఉత్పత్తి; అ. మా. భవ; పా. భవ.
<ప్రా. భవ-.

**బాము**[2] వి. 1. దుఃఖం, గోడు. బాధ. విరా. 2.49; 2. శ్రమ, కష్టం, బాధ. బాన్క. రా. మందర. 326; 3. భంగం, తిరస్కారం. హరి. ఉ. 2.8.
సం. ఛామ-. చలనం, అస్థిరత్వం; ప్రా. ఛామ-. వ్యాకుల పరచటం, తప్పుదోవ పట్టించటం.
<ప్రా. బామ-.

**బాంబరచీర** వి. ఏడుకొలుకులు నలుపు, ఒకకొలికి ఇటాలి చొప్పున రెండు రంగులనూలు పడుగుకు పెట్టినేసినచీర.

**బాంబు** వి. ప్రాణాంతకమైన మందుగుండు విశేషం, పేలుడు గుండు.
ఇం. *Bomb*. బాంబు, విస్ఫోటన ద్రవ్య విశేషం.
<ఇం. Bomb.
**బాంబుగడి** వి. ఒకరకం నేతగడి. **బాంబుగడిచీర** వి. 1. నల్లపడుగులో, రెండువేళ్ళ వెడల్పు పట్టెలు పడేట్టునేసిన గళ్ళచీర; 2. వేలెడు వెడల్పు నేసిన గడిచీర; 3. ఒకరకం పొడుగు గళ్ళచీర. **బాంబుగోల** వి. అంచులోనేసే ఒకరకం నేత. **బాంబుగోలనేత** వి. నిలువు, అడ్డం ఎనిమిదేసి రంగుల పోగులు పెట్టి నేసిన నేత. **బాంబుచీర** వి. 6-1-5-2-2-2-1 కొలుకులు వరసగా ఒకటి విడిచి ఒకటి ఏదో ఒకరంగు తెలుపుచొప్పున వచ్చేట్టు నేసినచీర, డిజైనులో గడికి గడికి మధ్య 12 కొలుకుల ఎడంఉండేటట్టు నేసిన చీర.

**బాఁపఁడు** రూ. బాఁడు, బాఁపన, బాఁపనుఁడు. వి. బ్రాహ్మణుడు. విక్ర. 6.63, క్రీడా. 62.
సం. బ్రాహ్మణ-. విప్రుడు; ప్రా. బంభణ-, బంహణ- బాంహణ-; అశో. బంభణ-; అ.మా. బంభణ-; సూహణ-; అప. బంభణ-, బంహణ-; కార్లి. బాభన-; దౌలి. బాంబణ; గిర్నార్. జై. మహా. బంభణ; గాబరీ. బంహణఅ;
తు. బ్రాణ; మ. పిరమ్మన్, పిరామ్మణర్.
<ప్రా. బంభణ-.

**బాఁపత** రూ. బాఁపఁడు. వి. పారుత, బ్రాహ్మణస్త్రీ. అష్టమ. క. 5.236.

**బాఁపన** రూ.చూ. బాఁపఁడు. వి. 1. బ్రాహ్మణుడు. విక్ర. 4.68; 2. బ్రాహ్మణకులం. గౌ. హరి. ఉ. 1471.
**బాఁపనఇనాం** వి. పురోహితుడికిచ్చిన ఇనాం. **బాఁపనకప్ప** వి. గోదురుకప్ప. బాకురుకప్ప. **బాఁపనకుక్క** వి. తేలువంటి విషంగల చీమ. **బాఁపనకొల** వి. బ్రహ్మహత్య. శాశ్ల. సం. 6.57. **బాఁపనకొలము** వి. బ్రాహ్మణకులం. **బాఁపనక్క** వి. బ్రాహ్మణస్త్రీ. <బాఁపన+అక్క. **బాఁపనగరాసు** వి. ఒకానొక తిట్టు. శుక. 2.475. **బాఁపనగొర్రు** వి. గొర్తికొయ్యలకు కొద్ది ఎడంగా వరసగా ఉండే మూడు చిన్నచుక్కలు. **బాఁపనగొరిలోకోడిపిల్ల** వి. అహింసావాదుల పీటల్లోకి శవాలువస్తే ఉపయోగించే పలుకుబడి. **బాఁపనచీమ** వి. బ్రాహ్మి, చెట్లమీద ఉండే గోరోజన వర్ణంకల ఒకజాతి పెద్దచీమ. **బాఁపనతెలుపు** వి. స్వచ్ఛమైన తెలుపు. **బాఁపనతెల్ల** వి. మంచితెలుపు. **బాఁపనది** రూ. చూ. బాఁపనయది. విశే. బ్రాహ్మణస్త్రీ. < బాఁపన + అది. **బాఁపనపచ్చరాయి** వి. ఎర్రమొరంరాయి. **బాఁపనపడె** రూ.చూ. బాఁపనపెయ్య. వి. అచ్చ తెలుపు లేక పూర్తి ఎదుపు. **బాఁపనపెయ్యె** రూ. బాపనపడె, బాపనపెయ. వి అచ్చతెలుపు లేక పూర్తి

ఎరుపు. బాఁపనపల్లిరాయి వి. బాపనపల్లి నుంచి వచ్చే 'క్వార్ట్జ్' జాతికి చెందిన మిశ్రశిల. బాఁపనపెద్దు వి. కొమ్ములు గిట్టలు కళ్ళు ఎర్రంగా ఉండే తెల్లని ఎద్దు. బాఁపనపసి రూ. బాఁపన పసు, బేపనపసి. వి. తెల్లదనం ఎక్కువగా ఉన్న పసు. బాఁపనపసు రూ.చూ. బాఁపనపసి. వి. తెల్లదనం ఎక్కువగా ఉన్న పసు. బాఁపనపుల్ల వి. అచ్చం పుల్లరంగు. బాఁపనపెయ్య రూ.చూ. బాఁపనపెయ్యె. వి. అచ్చ తెలుపు లేక పూర్తి ఎరుపు. బాఁపనపోటు వి. అనంభవం. రుక్మా.చ. 5.28. బాఁపనబల్లి వి. తెల్లబల్లి. బాఁపనబూరి రూ.చూ. బాఁపనబూరె. వి. ఒకానొక చెట్టు. బాఁపనబూరె రూ. బాఁపనబూరి. వి ఉత్తర సర్కారులు, దక్కను, కర్ణాటకంలో మొలిచే ఒకరకం మొక్క (Ehretia buxifolia). బాఁపనమాన్యం వి. పురోహిత మాన్యం. బాఁపనమొప్పె వి. ఒకానొక తిట్టు. శుక. 2.416. బాఁపనమ్మ వి. బ్రాహ్మణ స్త్రీ. పారుత. శుక. 3.148. <బాఁపన+అమ్మ. బాఁపన యది(-అది) రూ. బాఁపనది. విణ. బ్రాహ్మణస్త్రీ. బాఁప నయ్య వి. బ్రాహ్మణజాతివాడు. హరిశ్చ. 4.229. <బాఁపన+అయ్య. బాఁపనరోగము వి. వరి, రాగి మొ.పైర్ల తెగులు. బాఁపనవాడు విణ. బ్రాహ్మణుడు. బాఁపనసత్రం వి. బ్రాహ్మణ సత్రం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 728. బాఁపనికము వి. బ్రాహ్మణత్వం. బాఁపనెల్ల రూ. బేప నెల్ల. వి. 1. అచ్చతెలుపు; 2. కొంచెం ఎరుపు కలిసిన తెలుపు. <బాపన+వెల్ల. బాఁపతికము వి. బ్రాహ్మణత్వం. ఆం.శా. 2.171.

బాఁపనికము చూ. బాఁపన.

బాఁపనఁడు రూ. బాఁపఁడు. వి. బ్రాహ్మణుడు. ఆం.శా. 2.170.

బాఁపనెల్ల చూ. బాఁపన.

బాఁపతికము చూ. బాఁపన.

బామ్మ వి. నాన్నమ్మ.

ప్రా. బప్ప- తండ్రి; హిం. బాప్.

<ప్రా. బప్ప-+అమ్మ.

బాయ రూ.చూ. బావి. వి. 1. వాపిక, దిగ్గియ, నడబావి; 2. తటాకం, చెరువు; 3. పల్లం; 4. కూపకం, చెలమ.

బాయలు రూ.చూ. బయలు. వి. వెలుపలి ప్రదేశం. శాశ్ల.సం. 9.19.

బాయి[1] వి. 1. చనుబాలు; 2. చన్ను; 3. పాలు.

సం. పయస్. పాలు.

వ్రాయి>వ్రాలు, రేయి>రేలు, వేయి>వేలు మొదలైన శబ్దరూపాల్ని చూచి సామ్యంవల్ల పాలు బహువచనంగా భావించి పశ్చాన్నిర్మాణం (Back formation) వల్ల పాయిశబ్దం కల్పించబడి నాదతవల్ల బాయి ఏర్పడి ఉండవచ్చు.

బాయి[2] రూ.చూ. బావి. వి. నుయ్యి.

బాయిగంగమ్మ రూ.చూ. బావిగంగమ్మ. వి. వానకోసం ఆరాధించే దేవత. బాయిగాజు వి. అడుగు ఎత్తుతో మూడు నాలుగడుగుల కైవారంతో చేసిన మట్టి వలయం. బావి లోపల చుట్టూ గోడకు బదులుగా దించే ఒర. బాయిగూడు వి. బావిలోకి దిగటానికి వీలుగా బావిగోడలో అమర్చిన గూడు. బాయిగోలెం వి. లోపలచుట్టూ ఒరలు అమర్చిన పొయ్యి. బాయిబిళ్ళ వి. చేదబావికి పైన పెట్టే గుండ్రని మట్టి పొయ్యి. బాయిరాయి వి. రెండడుగుల పొడుగు అరంగుళం మందంగల రాతిపలక. బాయివర రూ.చూ. బావియొర. వి. నూతిఒర. బాయొర రూ.చూ. బావియొర. వి. నూతి ఒర.

బాయికావోర రూ.చూ. పాయికానోర. వి. లెట్రిన్ దొడ్లకు ఉపయోగించే చిన్నసైజు పార.

బాయిల రూ.చూ. పాయల. వి. తెలుగుదేశంలో ఉపయోగించే కూరాకుమొక్క.

బాయిలర్‌పొయ్యి రూ. బైలర్‌పొయ్యి. వి. గవర్నమెంటుపొయ్యి. నీళ్ళు కాచటానికి బాయిలర్‌లాగ చేసిన పొయ్యి.

ఇం. *Boiler*. నీళ్ళు మొ. వాటిని మరగబెట్టే పాత్ర.

<ఇం. Boiler+పొయ్యి.

బాయిలి రూ.చూ. పాయల. వి. తెలుగుదేశంలో ఉపయోగించే కూరాకు మొక్క.

బాయిలు రూ.చూ. బయలు. వి. వెలుపలి ప్రదేశం. శాశ్ల. సం. 6.136.

బాయీ వి. పఠాన్ భార్యకుకాక, పరస్త్రీకి పుట్టిన పఠానీస్త్రీల ఇంటిపేరు.

హిం. బాఈ. యజమానురాలు, వేశ్యల బిరుదు, శరీరపు ఎముకల్లో ఒకటి; ఉ. బాఈ. యజమానురాలు, స్త్రీ, నృత్యంచేసే స్త్రీ.

<ఉ. బాఈ.

బాయెంతలం వి. బూడిదరంగు బెరడుగల ఒకరకం చిన్న ముళ్ళ కలుపుచెట్టు (Balsomodendron myrrha).

బాయేగార్దలి వి. నేలను దోకటానికి పనికివచ్చే గోరెవంటి సాధనం.

హిం. బాంహ్. భుజం.

బాయొర చూ. బాయి[2].

బార[1] వి. 1. వ్యామం, అడ్డంగా సాచిన రెండు చేతులతోడి రొమ్ము కొలత. పండి.చ. 5.384. E.I. సంపు. 13. గా.సం. 23. క్రీ.శ. 1434; 2. చేయి. భార. ఉద్యో. 2.282; 3. నూలు వడికేటప్పుడు కదురునుంచి చేతి పొడుగునా ఒకసారి తీసిన దారం.

క. బార. తోలుపట్టి.

బారకట్టు వి. ఇబ్బంది. బారకమ్ము వి. మెల్లకన్ను. బారకఱ్ఱ వి. బారెడు పొడుగుకఱ్ఱ. చంద్రరే. 1.73. బారకాఁడి వి. దున్నటానికి కోడెల మరపటానికి కట్టే కాడి. బారకాఁడిమామ వి. పెద్దగొర్రుకు కట్టే కాడి. బారగుంటక వి. వెదపెట్టిన తరవాత రెండోసారి దాళ్ళుపూడ్చే పెద్దగుంటక. బారచాచు అ.క్రి. చేతులుసాచు. బారచాఁపు[1] వి. అంచులు కమ్ములు లేని వస్త్ర విశేషం. బారచాఁపు[2] స.క్రి. కుడిఎడమలకు చేతులుచాచు. బారతీయు స.క్రి. నూలు వడికేటప్పుడు, కదురునుంచి చేతిపొడుగునా ఒకసారి దారంతీయు. బారపీకు స.క్రి. నూలు వడికేటప్పుడు కదురునుంచి చేతిపొడుగునా ఒకసారి దారంతీయు. బార

పీకుడు వి. ఉన్నిదారం వడికేటప్పుడు ఏకుతో ఒకసారి బారెడు దారం తియ్యటం. బారపోయు స.క్రి. చేయిసాగేంత కొలది నూలువడకు. బారలుచాచు అ.క్రి. చేతులుచాచు. శార్ఙ్గ.సం. 8.118. బారపాచు(-చాచు) అ.క్రి. చేతులుసాచు. పీర. వి. 1.189. బారెడుమడి వి. ఎదరవాలు, గంగడోలు మీది మడి.

బార² రూ.సూ. బారా. వి. పన్నెండు. ప్రబంధ. 216.

బారకట్ట రూ. బారాకట్ట. వి. ఆరుగవ్వలతో ఆరు పావులతో ఆడే ఆట. బారకట్టగాయలచీర వి. ఒకరకం నేత చీర. బారగొర్రు వి. ఆరుగొయ్యల గొర్రు. బారబలావతీలు వి.బ.వ. పన్నెండుమంది గ్రామసేవకులు. బారమేమల ప్రోవ వి. సూర్యుడు. వేంక. ఆం. 11. బారదూపల వేలుపు వి. సూర్యుడు. సాంబ. దేవ. 3. బారసాల వి. నామకరణం, శిశువులకు చేసే సంస్కార విశేషం. సం. బారశాహ-. పన్నెండోరోజు ; ప్రా. పారవాహ-. పా. బారసాహ-. బారాది విశే. 1. అధికమైన. మను. 4.37 ; 2. అనేకమైన. ఆము. 3.15. సం. ఆది-. మొదలైన. <బార² + ఆది.

బార³ చూ. బారకాసు. వి. 1. సైనికులుండే వసారా ఇళ్ళు ; 2. కచేరి.

బార⁴ వి. రేగుచెట్టు, బదరీవృక్షం (Zisyphus jujuba).

క. బారి, బారె, బోరె. రేగుచెట్టు, బదరీవృక్షం ; తు. బొగూరి ;

సం. బదరీ. రేగుచెట్టు.

<క. బారి.

బారం వి. తూకం, బరువు.

సం. భార-. బరువు.

<సం. భార- + -ము.

బారకము వి. బరువు.

సం. భారక-. బరువు ; పా. భారక-.

<సం. భారక- + -ము.

బారకించు అ.క్రి. 1. భారమగు, బరువగు ; 2. బాధతో మొద్దుబారు ; 3. శరీరం బరలి అవయవ చలనం మందగించు. <బారకము + -ఇంచు³. బారకింపు వి. 1. శరీరపు బరువు ; 3. రొంప తగలటం.

బారకాసు రూ. బారకీసు, బ్యారకుసు. వి. సైనికులుండే నివాసాలు.

ఇం. బార్క్సు, బార్యాక్సు, బారుక్సు ; పో. బ్రరాకాష. గుడిసె. గుడారం, డేరా ; స్పా. బారాకాస. పాక, కుటీరం, పందిరి, బ్రరాకా. కుటీరం, బారాకోస. గిడ్డంగి ; ఫ్రెం. బెరెక్. పాక, సంత గుడారం ; డచ్. బరక్. పాక.

<పో. బ్రరాకాష.

బారకించు చూ. బారకము.

బారకింపు చూ. బారకము.

బారకీసు రూ.చూ. బారకాసు. వి. సైనికులుండే ఇళ్ళు.

బారంకివట్టి చూ. బారంగి¹. వి. కరొత్తు, గంట దూలానికి ఆధారంగా గోడల మీద వేసే చిట్టచివరి వాసం.

బారంగి¹ వి. ఒకజాతి మందుచెట్టు. ఆం.భా. 2.45.

సం. భారంగి, భార్గీ, భార్ఙ్గీ.

<సం. భారంగీ.

బారంగి² రూ.సూ. బాదాంగిరి. వి. కప్పు దగ్గర కొద్ది వెడల్పుతో ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

బారంజి రూ.సూ. బాదాంగిరి. వి. కప్పు దగ్గర కొద్ది వెడల్పుతో ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

బారదాకు రూ.చూ. బేరదాకు. వి. ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టా.

బారణాసి రూ. బరసి, బరనసి, బరనాశి, బానరాసి, బారణోసి, బారనాసి, బారాణసి, బారానాసి. వి. కాశి. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 599. క్రీ.శ. 625-650.

సం. వారణసీ, వారాణసీ. కాశి, వరణ, అసి అనే నదుల మధ్య ఉండే పట్టణం.

<సం. వారాణసీ.

బారణోసి రూ.చూ. బారణాసి. వి. కాశి. నె.శా.సంపు. 2 శా.సం. 606, 607. క్రీ.శ. 8వ శతాబ్ది.

బారదీసేవలు వి.బ.వ. ధాన్య విశేషం.

సం. భారతి, సరస్వతి, వాక్కు.

సం. భారతీ + సేన + -లు.

బారవాసి రూ.చూ. బారణాసి. వి. కాశి. బాదినేనిపల్లి శాసనం. క్రీ.శ. 8వ శతాబ్ది. బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934.

బారపట్టి రూ.చూ. బారుపట్టి. వి. 1. బండి చక్రంలో నిలువు పట్టి ; 2. తొక్కుడు పీట, రాట్నం అడ్డపట్టి ; 3. పీట, రాట్నం నిలువులు బిగించిన అడుగు పీట ; 4. మేరువ పలక, మరమగ్గం చట్రంలో నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టి ; 5. స్తంభంమీద అడ్డంగా అమర్చే నిడుపాటిపట్టి.

బారపడ్డ వి. తొక్కుడు పట్టి, రాట్నం అడ్డపట్టి.

సం. భార-. బరువు.

<సం. భార- + -పు + అడ్డ.

బారపుపిల్లలు వి.బ.వ. వేరగాళ్ళు ఊళ్ళకు వచ్చి కొనుక్కొని పోయే కోళ్ళు.

బారమాస్‌మామిడి వి. కొండమామిడి పన్నెండునెల్ల పొడువునా కాసే మామిడి రకం.

హిం. బారామాసి.

బారరట్లు వి.బ.వ. చెంగావి రంగు అద్దకంలో ఉపయోగించే ఒకరకం పనిముట్టు.

బారసి వి. ద్వాదశి, పక్షాల్లో పన్నెండో తిథి. భార.శాంతి. 4.252.

సం. ద్వాదశీ. పన్నెండో తిథి ; ప్రా. బారసి ; జై.మహా.అ.మా.అప. బారసి, బారసీ ;

క. బారసి.

<ప్రా. బారసీ.

బారా రూ. బార². వి. పన్నెండు. నిరంకు. 2.22.

సం. ద్వాదశ-. పన్నెండు ; ప్రా. బారస-, బారహ- ; జై మహా.జై.శౌ. బారస ; అప. బార-,

బారస-, బారహ- ; ఒ.గు. బార ; హిం. బారహ్ ;
క. బార ; గోం. బార ; కుఇ.కువి. బారో ; పర్జి. బార ; ఒరయాన్. బార్హె ; బ్రా. ద్వార్ద.

<ప్రా. బారహ-.

బారాకట్టి రూ.చూ. బారకట్టి. వి. అరు గవ్వలతో ఆరు పావులతో ఆడే ఆట. బారాగాడి వి. ఆరు చెక్కల గొఱ్ఱుకు కట్టే గాడి.

బారాకజు వి. పోరుగాలి ఇల్లు.

ఇం. *Barracks*. సిపాయీల స్థిరనివాన గృహశ్రేణి.

బారాటి చూ. బార[1], రాయి. వి. మెట్టభూమి. విప్ర. 2.18.

బారాణసి రూ.చూ. బారణాసి. వి. కాశీ. విప్పర్ల శాననం. క్రీ.శ. 641.

బారాది చూ. బార[2].

బారావాసి రూ.చూ. బారణాసి. వి. కాశీ. గాలివాండ్లపల్లి శాననం. క్రీ.శ. 825.

బారావలక వి. మరమగ్గం చట్రంలో నిలువ పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె.

బారాబలోతిదార్లు వి.బ.వ. రెడ్లు, కరణాలు, మేదర్లు మొదలైన ఊరి పనివాండ్లు.

ఉ. బారహ్. బులాహత్ - పా. దార్. పన్నెండు పిలువులు కలిగినవారు.

<ఉ. బారహ్. బులాహత్ + పా.-దార్.

బారి[1] రూ. బారీ. వి. 1. ఆపద, కష్టం. భార.ఆది. 6.250 ; 2. నిర్బంధం. కు.సం. 4.10 ; 3. లక్ష్యం, గురి, దృష్టి. హరి.ఉ. 3.138 ; 4. హింస, బాధ. హరి.ఉ. 8 97 ; 5. కాలి గొలుసు, ఏనుగు కాలికి కట్టే గొలుసు. ఆం.భా. 3.61.

సం. పారీ. ఏనుగు కాలి సంకెల ;

క. బారి. ఆధిక్యం, ప్రాముఖ్యం, విలువ.

<సం. పారీ.

బారిగొను (-కొను) స.క్రి. హింసించు, బాధించు. కాశీ. 7.34. బారిగొఱియ రూ. బారిగొఱ్ఱియ, బారిగొఱ్ఱె. వి. బలిఇవ్వటానికి తెచ్చిన గొఱ్ఱె. మొల్ల. యు. 1.88. బారి గొఱ్ఱియ రూ. చూ. బారిగొఱియ. వి. బలిఇవ్వటానికి తెచ్చిన గొఱ్ఱె. 3.309. బారిగొఱ్ఱె రూ.చూ. బారిగొఱియ. వి. బలిఇవ్వటానికి తెచ్చినగొఱ్ఱె. ప్రభు. 1.54. బారిఁబడు (-వడు) అ.క్రి. కష్టపడు. శాశ్ల. సం. 9.206. బారిసమరు స.క్రి. 1. బాధించు, హింసించు. కు. సం. 2.200 ; 2. చంపు, సంహరించు. కు. సం. 11.140 ; 3. పాడుచేయు, ధ్వంసం చేయు. వరాహ. 1.30.

బారి[2] రూ. బాదు[2]. వి. కపిల ఎద్దుకి నిర్బంధంగా ఏర్పరచిన దారి.

సం. ద్వార- దారి ; ప్రా. బార- ; మరా. బారీ. ఇరుకైన దోవ ;

క. బారి. కపిల ఎద్దులు నడిచే ఏటవాలు దారి.

<ప్రా. బార-.

బారిగడ్డ వి. దిగుదారిలో ఎద్దునడిచే రెండుదారుల మధ్యభాగం. బారిగుంట రూ. బారిగుంత, బారుగుంట. వి. పశువులు మోట లాక్కుపోయి ఆగే దారి దిగువ. బారిగుంత రూ. చూ. బారిగుంట. వి. పశువులు మోట లాక్కుపోయి ఆగే బారిదిగువ. బారివాటము రూ. బారు వాటము. వి. కపిలఎద్దులు లాగుతూ దిగుదారిలాగా వాటంగా ఉండేది.

బారి[3] రూ. బాడు[3]. విశే. 1. నిడుపైన. హరి. ఉ. 10.36 ; 2. పృథులమైన, పెద్ద. ప్రభు. 1.86 ; 3. ఉదారమైన. వేఱు. శ. 7 ; 4. ఎక్కువ వెలకల. వేఱు. శ. 65 ; 5. గొప్ప. ఆం.భా. 3.61.

సం. భారిక-. పెద్దది, గొప్పది ; ప్రా. భారిఅ ;

<ప్రా. భారిఅ.

బారిమాను వి. దున్నిన పొలంలో పెళ్ళ నలగటానికి తోలే పెద్దమొద్దు. బారివిల్లు వి. పెద్దవిల్లు. హరి. ఉ. 10.37.

బారిక రూ.చూ. బాడికి. వి. గ్రామనౌకరు, బారికి.

బారికాఁడు వి. తలారి, పల్లె కావలివాడు.

బారికాఁడు చూ. బారిక.

బారికి రూ.చూ. బాడికి. వి. ఊరికావలివాడు.

బారికిఇనాం వి. తలారికిచ్చిన ఇనాం.

బారికె రూ.చూ. బాడికి. వి. దినబత్తెం లేని వెట్టివాడు.

బారిజము రూ.చూ. బాడిద[1]. వి. పారిభద్రం, బాడిదపుచెట్టు.

బారిదము రూ.చూ. బాడిద[1]. వి. పారిభద్రం, బాడిదపుచెట్టు. ఆం. భా. 2.43.

బారిముద్ర వి. దీనారభేదం, ఒకరకం నాణెం. ఆం. భా. 2.274.

బారిముద్రరూక వి. ఒకరకం నాణెం.

బారిష్టరు రూ. బారిస్టరు. వి. ఉన్నతస్థాయి న్యాయవాది.

ఇం. *Barrister*. ఉన్నతస్థాయి న్యాయవాది.

<ఇం. Barrister.

బారిసము వి. వేషం. ఆం. భా. 2.146.

బారిస్టరు రూ.చూ. బారిష్టరు. వి. న్యాయవాదుల్లో ముఖ్యుడు.

బారీ రూ. చూ. బారి[1]. వి. ఏనుగుకాలికి కట్టేగొలుసు చంద్రాంగ. 1.32.

బారు[1] వి. 1. సమూహం, సేనాసమూహం. పల్నా. పు. 7.54 ; 2. పంక్తి, వరస. ఉ. రా. 4.332 ; 3. పేర్పులోని వరస, పేట ; 4. కొక్కుడుపట్టె, పత్తిపట్టేటప్పుడు రాట్నం కదలకుండా తొక్కి పట్టటానికి అమర్చిన పట్టె ; 5. అనుబంగ, అనుటీటలు బిగించిన పొడుగు పట్టె ; 6. సాగు, పడుగేరేటప్పుడు, పరిచేసేటప్పుడు అల్లు చేసేటప్పుడు దాపిన పడుగు ; 7. నేతసాగు, మగ్గానికి అమర్చిన నేతబయలులో దాపిన పడుగునూలు ; 8. తుపాకిమందు ; 9. రాళ్ళను పగలగొట్టడానికి వాడే పేలుడు పదార్థం.

సం. వార-. సమూహం, పర్యాయం, పరిపాటి ; ప్రా. వార- ; పా. వార-. తడవ, లేశం, అవలేశం.

క. వార్. పంక్తి, శ్రేణి, బారి, బారె. లేశం, పర్యాయం.

<ప్రా. వార-.

బారుచేయు స.క్రి. తుపాకిలో మందువేసి కూరు.

బారుదింపు వి. రాతిగనిలోని చచ్చుపొర. బారుదీరు (-తీరు) అ.క్రి. 1. బారుగాఉండు, పంక్తిగా ఏర్పడు. వేంక. పంచ. 4.303 ; 2. (యుద్ధంలో) మొనగా ఏర్పడు. ఇందు. 2.154. బారులుగట్టు (-కట్టు) అ.క్రి. వరుసలుతీరు. బారులు తీర్చు అ.క్రి. వరసలు కట్టు, పంక్తులు తీర్చు. దశా. 1.205. బారులుదీరు (-తీరు) అ.క్రి. 1. బారుగాఉండు, పంక్తిగా ఏర్పడు ; 2. యుద్ధంలో మొనగా ఏర్పడు. బారువెట్టు (-పెట్టు) స.క్రి. యుద్ధానికి సిద్ధపరచు. కువ. చ. 1.104.

బారు[2] రూ.చూ. బారి[2]. వి. మోటలాగే ఎద్దులు ముందుకు వెనకకు నడిచే ఏటవాలు దారి.

బారుగుంట రూ.చూ. బారిగుంట. వి. పశువులు మోట లాక్కునిపోయి ఆగే దారి దిగువ. బారువాటము రూ.చూ. బారివాటము. వి. కపిల ఎద్దులు లాగుతూ దిగుదారి వాటంగా ఉండేది.

బారు[3] రూ.చూ. బారి[3]. విశే. పొడవైన. దీర్ఘమైన. సిం. ద్వా. 1.239 ; వి. 1. పొడవు ; 2. నిడుపదాని కొలత ; 3. ఆర్భాటం ; 4. ఔదార్యం.

బారుకర్ర వి. నూలు లడీలు రంగు నీళ్ళలో ఉడకబెట్టే టప్పుడు లడీలు తిప్పే ఆనపకర్ర. బారుకమ్మి వి. పొడుగైన కమ్మి. బారుకత్తి వి. నాగలినొగ, ఏడికోల. బారుకుంచె వి. పడుగుమీద ఒకవైపునుంచి మరో వైపుకు కుంచె ఆప కుండా దువ్వటం. బారుకుంచెలాగు స.క్రి. పడుగుమీద ఒక వైపునుంచి మరోవైపుకు కుంచె ఆపకుండా దువ్వు. బారు గడియ వి. గడిమాను, తలుపు చెక్కలను మూస్తూ గోడ లోని కంతల్లోకి దూర్చబడే రోకలివంటి పెద్దగడియ. బారుగాడి వి. పొడుగాటిగాడి. బారుచాపు వి. చాలా మూరలున్న రేకు, వస్త్రవిశేషం. బారుదుప్పటి వి. ఒకే బద్దకు కలిపినేసిన రెండు దుప్పట్లు. బారుదూలము వి. 1. నిడుపాటిదూలం. శాను. 3ఆ.; 2. నేత బయలులో గోడల మీద అమర్చిన పొడుగుకొయ్య. బారుదోన వి. పెద్దదోన. బారుపట్టె రూ. బారపట్టె. వి. 1. కొక్కురుపీట, రాట్నం అడ్డపట్టె ; 2. పీట, రాట్నం. నిలువులు బిగించిన అడుగు పీట ; 3. మేటవు పలక, మరమగ్గం చక్రంలో నిలువు పట్టెలకు పైన బిగించిన అడ్డపట్టె ; 4. బండిచక్రంలో నిలువుపట్టె. బారుబరాయి వి. అరంభశూరత్వం. బారుబండ వి. అఖండం రాయి, గోడలుకట్టేటప్పుడు చిన్నవైన ఇటిక లను రాళ్ళను మధ్యఉంచి సందులు తప్పించి పక్కమూ లల్లో బలం కోసం ఉంచే పొడుగాటి పొడుగురాయి. బారుబద్ద వి. పడుగులో ఒకవైపునుంచి మరొక వైపుకు వరసగా ఎక్కించిన అడ్డబద్ద. బారుబారలంకారములు వి.బ.వ. వేషా డంబరాలు. బారుబొంగు వి. ఎంపవెదురు, పొడుగాటి వెదురు బొంగు. బారుమామ వి. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట. బారుమూవ వి. పొడుగాటిమూన. బారుమొద్దు వి. 1. గానిగకట్టె. గానుగ రాతిని తగిలించే కొయ్యదూలం ; 2. రంగులో తడిపిన నూలు లడీలు పిండటానికి నేలలో పాతిన పొడుగురాట. బారురాతి వి. అఖండంరాయి, గోడలు కట్టేటప్పుడు చిన్నవైన ఇటికలను రాళ్ళకు మధ్యఉంచి సందులు తప్పించి పక్క మూలల్లో బలంకోసం ఉంచే పొడుగాటి పెద్దరాయి. బారు వత్తి వి. అంతరాల్లో వత్తిని అసలులో చేర్చని వత్తి. బారు వానం వి. పొడుగాటి బాణం. బారుసార వి. ఒకరకం ఆనప. బార్లాగా క్రి.విశే. వెడల్పుగా.

బారువ రూ.చూ. బారువు. వి. 1. ఇరవై ఒక్క తులాల కొలత. సిం.ద్వా. 7.133 ; 2. ఇరవై మణుగుల కొలత. శాను. 4.76.

బారువు రూ. బారువ, బార్వు. వి. 1. ఇరవై మణుగుల కొలది. భార. అశ్వ. 3.157 ; 2. బారి. పుట్టి. పద్మ. 10.12.

సం. భార-. పరిమాణ విశేషం, రెండువేల పలములు కలది ; ప్రా. భార- ; పా. భార. బండిబరువు ; హిం. భార్. నూరుసేర్ల బరువు.

<ప్రా. భార-.

బారుహ వి. పన్నెండు. భీమ. 1.38.

హిం. బారహ్. పన్నెండు.

<హిం. బారహ్.

బారూదు వి. తుపాకిమందు.

హిం. బారూద్. తుపాకిమందు.

<హిం. బారూద్.

బారెక్సు వి. సైనికులుండేగాల, సైనిక స్థావరం.

ఇం. *Barracks*. సైనికులు నివసించే శపన నము దాయం.

<ఇం. Barracks.

బారెడుపుడి చూ. బార[1].

బార్గిరీ వి. అశ్వం. పద్మ.యు. 7.

హిం. బార్గేర్. అశ్వం, ఒంటె, ఎద్దు ; మరా. బార్గేర్. సారి ; ఉ. బార్గేర్. అశ్వపాలకుడు, అశ్వం, ఒంటె, ఎద్దు ; పార. బార్గేర్. గుర్రం, ఒంటె, సారి.

<ఉ. బార్గేర్.

బార్జము రూ.చూ. బాడిద[1]. వి. బాడిదపుచెట్టు.

బార్డంచు రూ.చూ. బాడరంచు. వి. 1. నాలుగైదు రంగు పోగులు గీరలు పడేట్టు నేసిన అంచు ; 2. మూడు నాలుగు వేళ్ళ వెడల్పున నేసిన మామూలంచు.

బార్డరుకండువా రూ. బార్డరు కాండువా. వి. అంచులుపెట్టి నేసిన కండువా.

ఇం. *Border*. అంచు, కొన.

<ఇం. Border + కండువా.

బార్డరుకాండువా రూ.చూ. బార్డరు కండువా. వి. అంచులు పెట్టి నేసిన కండువా.

బార్హాలచుక్కలు వి.బ.వ. చదరలు, పూర్వోత్తరాభాద్రా నక్ష త్రాలు కావచ్చు.

బార్లాగా చూ. బారు[3].

బార్లేయు రూ.చూ. బోర్లేయు. స.క్రి. గట్టించిన పాత్రల్ని ఇండ్లో విడివిడిగా అంచు నేలమీద అడుగు పైకి ఉండేటట్లు అమర్చు.

బార్వు రూ.చూ. బారువు. వి. ఇరవై మణుగుల కొలది.

బాలకట్టి వి. 1. దండెం, పైనుంచి వేలాడదీసిన పొడుగాటి కర్ర ; 2. నూలు చిలపలు ఆరవేసే వెదురుబొంగు.

సం. బాల-. పిల్ల, చిన్న.

**బాలకి** వి. బాలిక, చిన్నవయసుది, తరుణ వయసున్నది. భార. అరణ్య. 2.93.

సం. బాలికా. అమ్మాయి, చిన్నవయసుపిల్ల ;

క. బాలకి, బాలకె.

<సం. బాలికా.

**బాలగూటం** రూ. బాలుగూటం. వి. తలగూటం, ఉన్ని మగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతిన కొయ్య లేక రాయి, మగ్గంతాడు తగిలించే కొయ్య.

సం. బాల-. చిన్న.

**బాలంకిరి** రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పుదగ్గర కొద్ది వెడల్పుగా ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

**బాలంగి** రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పుదగ్గర కొద్ది వెడల్పుతో ఉండి కిందికి రానురాను విశాలంగాఉండే పెంకుకప్పు.

**బాలంగిరి** రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పుదగ్గర కొంచెం వెడల్పుగా ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

**బాలంచ** వి. సన్నటి కర్రకు ఒకచివర నారనో గడ్డనో కట్టి తయారుచేసి సున్నం కొట్టటానికి వాడే సాధనం.

**బాలనాగమ్మచీర** వి. సిల్కు ఊదారంగుల్లో నేసినచీర, బాలనాగమ్మ సినిమానుబట్టి వచ్చిన పదబంధం.

**బాలనాగమ్మరంగు** వి. ఒకరకం నీలంరంగు, మెజంటా. బాలనాగమ్మ చీరయొక్క రంగు.

**బాలపుస్తకం** వి. పిల్లలకు జడుపు జ్వరం వచ్చినప్పుడు కట్టే తాయెత్తు.

సం. బాల-. పిల్ల, బాలుడు, పుస్తక-. వస్త్రం.

<సం. బాలపుస్తక- + -ము. (అర్థవిపరి.).

**బాలబంద** వి. వేరు లోతుగా పాతుకొన్న ఒకరకం గడ్డి.

సం. బాల-. చిన్న.

**బాలబందు**[1] రూ.చూ. బాలాబందు. వి. దేవనాగర లిపిని పోలిన ఒక లిపి.

**బాలబందు**[2] వి. సంచులు కుట్టేవాడు.

ఉ.పార. బాలాబంద్. ఒకవిధమైన స్వదేశీయమయిన తలపాగా, ఒకవిధమైన కోటు.

**బాలమ్మమచేయు** అ.క్రి. పాపను తొట్టిలో వేసేరోజు బాలింతలు బాలమ్మ అనే దేవతను పూజిస్తూ తంతుచేయు.

**బాలవెట్టిరాగి** వి. నాలుగు నెలల్లో పండే ఒకరకం రాగిపంట.

సం. బాల-. చిన్న.

**బాలసంగడము** వి. మల్లసాధన విశేషం. ఆం.భా. 2.207.

సం. బాల-. చిన్న.

**బాలసంతపువాండ్లు** విశే.బ.వ. విచిత్రమైన కూర్పాసం వంటి అంగీ ధరించి గంటఊపుతూవచ్చి భిక్షం తీసుకొనేవారు.

సం. బాల-. పిన్న, చిన్న.

**బాలసము** వి. బాలిశగుణం, మౌర్ఖ్యం. కు.సం. 8.169.

సం. బాలిశ-. నీచుడు ; ప్రా. బాలిస-.

<ప్రా. బాలిస-.

**బాలా**[1] వి. ఒకవిధమైన కర్ణాభరణం.

హిం. బాలీ. కర్ణాభరణం.

<హిం. బాలీ.

**బాలా**[2] వి. ఒకవిధమైన ఈటె.

హిం. భాలా. కత్తి, ఈటె, వేనుడుబరిచి, చిన్న ఈటె లేదా బెయ్యాటె.

<హిం. భాలా.

**బాలాంగిరి** రూ.చూ. బాదాంగిరి. వి. కొప్పుదగ్గర కొద్ది వెడల్పుగా ఉండి కిందికి రానురాను విశాలంగా ఉండే పెంకు కప్పు.

**బాలాజీ** వి. 1. తిరుపతి వేంకటేశ్వరునికి బైరాగులు వాడే పేరు ; 2. ఒకజాతివారు.

మరా. బాలాజీ. వెంకటేశ్వరుడు.

<మరా. బాలాజీ.

**బాలాబందు** రూ. బలబందు, బలెబందు, బాలబందు1. వి. ఒకవిధమైన వ్రాత, లిపి.

మరా. బాల్‌బంద్. ఉ. బాల్‌బంద్. మరాఠీ లిపిలో మాదిరిగా అడ్డ గీతతో గీయబడిన దేవనాగరి వర్ణాల కంటె కొంత వేరుగా ఉండే భారతీయ భాషకు సంబంధించిన అక్షరమాల.

<మరా. బాల్‌బంద్.

**బాలిత** రూ.చూ. బాల్తి. వి. బొక్కెన, బాల్టీ.

**బాలిది** రూ.చూ. బాల్తి. వి. బొక్కెన.

**బాలింత** రూ.చూ. బాలెంత. వి. నవప్రసూత.

**బాలింతబోలు** రూ.చూ. బాలెంతబోళము. వి. బాలెంతల కిచ్చే ఔషధం. **బాలింతబోళము** రూ.చూ. బాలెంతబోళము. వి. బాలింతల కిచ్చే ఔషధం. **బాలింతరాలు** రూ.చూ. బాలెంతరాలు. వి. నవప్రసూత.

**బాలీసు** వి. 1. ఒరుగు, దిండు. నీలా. 3.86 ; 2. దిండు, తలగడ.

హిం.ఉ.పార. బాలిశ్. ఉపధానం, దిండు.

<ఉ. బాలిశ్.

**బాలుగూటం** రూ.చూ. బాలగూటం. వి. తలగూటం, ఉన్ని మగ్గానికి వేసిన పడుగు బిగింపుకోసం చివర నేలలో పాతిన కొయ్య లేక రాయి, మగ్గంతాడు తగిలించే కొయ్య.

**బాలె** వి. 1. గంజి పోసుకునే ఒకరకం పాత్ర ; 2. బుట్ట, మూతగల చిన్న గంప.

**బాలెంత** రూ. బాలింత. వి. బాలెంతరాలు, నవప్రసూత. భార.అరణ్య. 7.352.

సం. బాలవతీ. పిల్లలు గల స్త్రీ ; మరా. బాళంత-బాళంతీణ్- ;

క. బాణతి, బాణత్తి, బాణన్తి. అప్పుడే పక్క మీదకు చేరిన స్త్రీ, పడుకొన్న స్త్రీ ; తు. బాణన్తి.

<మరా. బాళంత-.

**బాలెంతబోళము** రూ. బాలింతబోలు, బాలింతబోళము. వి. బాలెంతల కిచ్చే ఔషధం. **బాలెంతరాలు** రూ. బాలింతరాలు. వి. నవప్రసూత. హర. 2.93. <బాలెంత + అలు.

**బాలెపట్టచీర** వి. నిలువుకు ఆకుపచ్చ, ఎరుపుగాని నీలం-ఎరుపుగాని అంచు, పేకకు ఏదో ఒక రంగు నూలు పెట్టి నేసిన

చీర.

బాలేపండు వి. అరటిపండు.

సం. బాల-. పిల్లవాడు, బాలా. బాలిక.

<సం. బాల-+పండు.

బాల్కవి రూ.చూ. బాల్కనీ. వి. మిద్దెపైన ముందుకు కట్టిన వసారా.

బాల్కనీ రూ. బాల్కని, బాల్కానా, బాల్కానీ, బాల్గనె. వి. 1. ఇంటి ముందు స్తంభాలమీద వేసిన కప్పు; 2. గోడ మీద నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.

ఉ.పార. బాల-ఖాని. పైగది, పై అంతస్తు.

ఇం. *balcony*. ఇంటి ముందు స్తంభాలమీద వేసిన కప్పు.

<ఇం. balcony.

బాల్కవ్‌దర్వాజా చూ. బాల్కనీ. వి. పైన పక్కనా వెలుతురు కిటికీలున్న దర్వాజా.

బాల్కానా రూ.చూ. బాల్కనీ. వి. 1. ఇంటి ముందు స్తంభాల మీద వేసిన కప్పు; 2. గోడమీద నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.

బాల్కానీ రూ.చూ. బాల్కనీ. వి. 1. ఇంటి ముందు స్తంభాల మీద వేసిన కప్పు; 2. గోడమీద నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.

బాల్గనె రూ.చూ. బాల్కనీ. వి. 1. ఇంటి ముందు స్తంభాల మీద వేసిన కప్పు; 2. గోడమీద నుంచి ముందుకు పొడుచుకొని వచ్చిన కప్పు.

బాల్చా రూ.చూ. బాల్దీ. వి. బొక్కెన.

బాల్చీ రూ.చూ. బాల్దీ. వి. బొక్కెన.

బాల్టీ రూ.చూ. బాల్దీ. వి. బొక్కెన.

బాల్తి రూ.చూ. బాల్దీ. వి. బొక్కెన.

బాల్దారం వి. రెండు పోగులు కలిపి పురిపెట్టిన దారం, పురిదారం, డోరియాతానులు నెయ్యటానికి వాడే దారం.

ఇం. *Ball*. బంతి.

బాల్దీ రూ. బాక్లీ, బాలిత, బాలిది, బాల్చా, బాల్చీ, బాల్టీ, బాల్తి, బాల్ది. వి. బొక్కెన.

పో. బల్దె-. బొక్కెన; స్పా. బాల్దె. బొక్కెన, కొయ్య తొట్టి; గు. బల్దీ. తోలుబొక్కెన.

<పో. బల్దె.

బాల్ది రూ.చూ. బాల్దీ. వి. బొక్కెన.

బాల్బేరింగు రూ. బేల్‌బారింగు. వి. గుళ్ళ బేరింగు, బేరింగు, మరాను ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కు గుళ్ళు అమర్చిన పనిముట్టు.

ఇం. *Ball-bearing*. యంత్రాల్లో గుండ్రంగా ఉండే ఉపకరణం.

<ఇం. Ball-bearing.

బాల్బేరింగుసారె రూ. బాల్‌బేరింగ్ సారె. వి. బాల్‌బేరింగు అమర్చిన సిమెంటుసారె. బాల్బేరింగ్‌సారె రూ.చూ. బాల్బేరింగు సారె. వి. బాల్‌బేరింగ్ అమర్చిన సిమెంటు సారె.

బాల్బేరింగ్‌సారె చూ. బాల్బేరింగు.

బాల్సుచక్రం వి. మరాను సులువుగా తిరగటానికి చిన్న ఉక్కు గుండ్లు అమర్చి బిగించిన చక్రం, పెద్ద పళ్ళ చక్రానికి బిగించిన చక్రం.

సం. చక్ర-; ఇం. *Balls*.

<ఇం. Balls+సం. చక్ర-+-ము.

బాల్సుసారె వి. ఇనపకడ్డీలకు సిమెంటు మెత్తి సులువుగా తిరగటానికి గుండ్లు అమర్చిన సారె.

ఇం. *Balls*. గుళ్ళు.

<ఇం. Balls+సారె.

బాల్సులసారె రూ. బాల్సులుసారె. వి. ఇనప కడ్డీలకు సిమెంటు మెత్తి సులువుగా తిరగటానికి గుండ్లు అమర్చిన సారె.

ఇం. *Balls*. గుళ్ళు.

<ఇం. Balls+-లు+-అ+సారె.

బాల్సులుసారె రూ.చూ. బాల్సులసారె. వి. ఇనప కడ్డీలకు సిమెంటు మెత్తి సులువుగా తిరగటానికి గుండ్లు అమర్చిన సారె.

బాళి[1] వి. 1. ప్రేమ, వాత్సల్యం. వసు. 3.185; 2. కాంక్ష, కోరిక, వలపు, అనురాగం. కువ.చ. 3.114; 3. విధం, రీతి. ప్రబంధ. 2.24; 4. ఆనందం, సంతోషం. ఉ.హరిశ్చ. 3.15; 5. చింత, విచారం. శశా. 3.52; 6. అతిశయించినమోహం. శశా. 3.80; 7. శ్రద్ధ. అన. శశా. 4.8; 8. హానిక. శుక. 3.44.

బాళిగొను(-గొను) స.క్రి. వలచు, అనురాగాన్ని పొందు. దశా. 1.116. బాళిగొలుపు(-గొలుపు) స.క్రి. చింతిల్లచేయు, వెతపెట్టు. విప్ర. 4.77. బాళికారు అ.క్రి. సొమ్మసిల్లు, మూర్ఛిల్లు. సాంబ మాన. 42. బాళివట్టు రూ.చూ. బాళిపట్టు. అ.క్రి. హానికగొను. బాళిపట్టు రూ. బాళివట్టు. అ.క్రి. హానికపూను. కకుత్స. 4.21.

బాళి[2] రూ.చూ. బాళిగి. వి. వెడల్పుగా మూతి ఉండే చిన్న మట్టిపాత్ర.

బాళిక వి. మన్నిక.

క. బాళ్. అధికమయిన, అతిశయించిన.

బాళిగి రూ. బాళి[2], బాళ్ళ. వి. వెడల్పు మూతి ఉండే చిన్న మట్టిపాత్ర.

క. బాఖలిగె, బాళిగె. వేపటానికి ఉపయోగించే పాత్ర.

<క. బాళిగె.

బాళు అ.క్రి. శ్రేయమొందు, మేలొందు. ద్వి. పరమ. వి. 3.154.

క. బాళు. జీవితం.

బాళెలు వి.బ.వ. పప్పు విశేషం.

క. బాళె. యువతి.

బాళేపట్టచీర వి. రెండు రంగుల నూలు నిలువుకు అతి ఒక రంగు నూలు పేకకు పెట్టి నేసిన చీర.

క. బాళె. యువతి.

బాళ్ళ రూ.చూ. బాళిగి. వి. వెడల్పుగా మూతి ఉండే చిన్న

మట్టిపాత్ర.

బావ వి. 1. అక్క మగడు. నె.గా. రాహుర్. 36. క్రీ.శ. 1217; 2. భర్త అన్న. భార.ఉద్యో. 3.195; 3. భార్య అన్న. భాగ. 10.162; 4. కామినితను వలచిన వానికి వావి కల్పించి పిలిచే వరస. దశా. 2.358; 5. తనకన్న పెద్దఅయిన మేనత్త మేనమామల కొడుకు.

సం. భావక-. భావించేవాడు, రసం; ప్రా. భవ్వ-, భాఓ;

క. బావ. సోదరి మగడు; తు. బావె. సోదరి మగడు; పర్జి. పావ. అన్న.

<ప్రా. భాఓ.

బావమరది రూ.చూ. బావమఱఁది. వి. 1. చెల్లెలి భర్త; 2. భార్యయొక్క సోదరుడు. బావమఱఁది రూ. బావమరది. వి. 1. చెల్లెలి భర్త. ద్వి.పరమ.వి. 7.525; 2. భార్యయొక్క సోదరుడు. బావమీదిబరాకం వి. నిష్ప్రయోజనమైనది.

బావంచి రూ. బవంతి², బావంజి, బోంచె, బోవంచి. వి. కారుగచ్చ. అప్ప. 2.430.

సం. వాకుచి, సోమవల్లిక.

<సం. వాకుచీ.

బావంచికర్ర వి. పెంకకు వేసే కర్ర.

బావంజి రూ.చూ. బావంచి. వి. కారుగచ్చ, వాగుజీ, వాకూచి.

బావటాలు వి బ.వ. ఒకరకం వడ్లు.

బావాజీ రూ.చూ. బాబాజీ. వి. 1. బైరాగి, గోసాయి; 2. ఉత్తరదేశంలోని దేవాలయాధికారి.

బావాము రూ.చూ. బాదం. వి. 1. ఫలవృక్ష విశేషం; 2. ఒకరకం లేత నీలంరంగు.

బావి రూ. బాయ, బాయి³, భావి. వి. 1. వాపిక, దిగ్గియ, నడబావి. భార.ఆది. 4.94; 2 తటాకం, చెరువు. కాశీ. 3.28; 3. పల్లం. వాసి.రా. 5 ఆ.; 4. కూపకం, చెలమ. నీలా. 1.157.

సం. వాపి-, వాపికా, వాపీ. నుయ్యి; ప్రా. వావి; పా. వాపి-; హిం. బావడీ;

క. బావి. నుయ్యి; త. అవి, వావి; మ. వాపి. బావి, అవి. చెరువు.

<ప్రా. వావీ.

బావిగంగమ్మ రూ. బాయిగంగమ్మ. వి. వానకోసం ఆరాధించే దేవత. బావియొఱ రూ. బాయివర, బాయొర, బావివర. వి. ఒర పెంకు, నూతి ఒర. బావివర రూ.చూ. బావియొఱ. వి. అడుగు ఎత్తు, మూడు నాలుగడుగుల వైవారంతో చేసిన మట్టి ఒర. బావివోర వి. నూతి ఒర. బావిమూల వి. బావికి ఎదురుగా ఇల్లు కట్టటం అనే తప్పు.

బావిడి రూ.చూ. బావడి. వి. చెరువు.

బావిలి రూ.చూ. బావిలీ. వి. స్త్రీ కర్ణ భూషా విశేషం, ఆడది చెవుల కొనలకు పెట్టుకొనే ఆభరణం. కువ.చ. 5.95.

బావిలీ రూ. బావిలి. వి. స్త్రీ కర్ణ భూషా విశేషం, ఆడవాళ్ళు చెవి కొనలకు పెట్టుకునే అలంకార విశేషం. సమీర. 3.217.

మరా. బావళా. దండం, భుజాదండం; ఉ. బావలీ. ఆభరణ విశేషం; పార. బావలీ. బావల్ దేశంలో తయారు చేయబడింది;

క. బావలి, బావులి. బంగారం, ముత్యాలు, విలువైన రాళ్ళతో కూడిన చెవి ఆభరణం; తు. బావలి, బావొలి. స్త్రీలు చెవి కొనకి ధరించే ఆభరణం; త. పావిలి. ఒకరకం చెవి ఆభరణం.

<ఉ. బావలీ.

బావిలీగొలుసు వి. మగవారు, కొన చెవిని ధరించే భూషా విశేషం.

బావు రూ.చూ. పావు. వి. 1. వరహాలో నాలుగో భాగం; 2. సేరులో నాలుగో భాగం; 3. నాల్గో భాగం.

బావుకొను స.క్రి. 1. వెన్న మొదలైనవి చేతి నిండా ఎత్తి నోట్లో పెట్టుకొను. హరి.పూ. 5.205, 224; 2. అన్నం మొ.వి నోట్లో సర్దుకొను. హరి.పూ. 5.227; 3. అనుభవించు.

బావుటా రూ. బాహుటా. వి. ధ్వజం, జెండా.

ఉ. బావోత. జెండా, కాడి;

త. పావట్టా.

<ఉ. బావోత.

బావుడి రూ. బావిడి. వి. చెరువు.

హిం. బావ్డీ. నీటితొట్టి, బావలీ. దిగుడుబావి. నీచురాలైన స్త్రీ; ఉ. బావాలీ. మనుషులు దిగి నీళ్ళు తెచ్చే బావి, ఉపాయం, కుక్కలకు డేగలకు వేటాడటం నేర్పేందు కుపయోగించే ఎర.

<హిం. బావ్డీ.

బావుదోరు వి. గుర్రపు కళ్ళెం.

బావురు¹ వి. 1. మహామార్జాలం, గండుపిల్లి. ఆం.భా. 2.84; 2. గండుపిల్లి కూత కనుకరణం.

క. బావుగ. మగపిల్లి; కుఇ. బాఒడి, బాఒలి; పర్జి. బావ్కి. అడవిపిల్లి.

బావురుగడ్డము వి. పిల్లిగడ్డం, మేకగడ్డం. బావురుగాఁడు చూ. బావురుఁబిల్లి. వి. బావురుపిల్లి. దశా. 1.152. బావురుమను (-అను) రూ. బావుఱుమను. అ.క్రి. (జన శూన్యం అవటంతో) బావురుమని మారుమోత కలదగు. బావురుఁబిల్లి (-పిల్లి) వి. గండుపిల్లి. కళా. 6.271.

బావురు² వి. 1. శూన్యత; 2. చిన్నబోయిన స్థితి.

క. బావురి. చుట్టు తిరుగు.

బావుఱుమను(-అను) రూ.చూ. బావురుమను. అ.క్రి. (జన శూన్యం అవటంతో) బావురమని మారు మోత కలదగు.

బాగాలి రూ.చూ. బాగగాలి. వి. 1. భార్య; 2. ఒక తిట్టు.

బాషకం రూ.చూ. బాసికము. వి. బాసిగం మాదిరి నేత డిజైను.

బాషిందు వి. నివాసి.

హిం.ఉ. బాషిందా. నివాసి; అర. బాషిందహ్.

<ఉ. బాషిందా.

బాస వి. 1. మాట, పలుకు, హితవచనం. భార.ఆది. 7.228; 2. (ఒకరి అభిప్రాయం ఇంకొకరికి తెలియపర్చే

శబ్దజాలం) ఆంధ్రాది భాష. భార.విరా. 1.7 ; 3. ప్రతిజ్ఞ. శపథం. భార.విరా. 2.299 ; 4. ఒడంబడిక, సమయం. భార.విరా. 3.109 ; 5. నిమిత్తం, కారణం. దశకు. 2.80 ; 6. వ్రతం. భార.అరణ్య. 7.289 ; 7. ప్రమాణం, ఒట్టు. మను. 5.68 ; 8. సరస్వతీదేవి.

సం. భాషా. నుడి, భాష, సరస్వతి ; ప్రా. భాసా ; అ.మా.పా. భాసా ; ఒరయాన్. బాచా ;

కువి. భహ.

<ప్రా. భాసా.

బాసచేయు అ.క్రి. ప్రతిజ్ఞచేయు. బాసతప్పువాఁడు విశే. అబద్ధమాడేవాడు. బాసతల వి. మొద్దుగా పొట్టిగా కొమ్ములున్న తల. బాసపత్రిక వి. రాసుకొన్న ప్రమాణం. బాసపలుకు అ.క్రి. ప్రతిజ్ఞచేయు. బాసజోనవములు వి.బ.వ. తప్పక్రియ భాషణాలు. బాసబెరెలు వి.బ.వ. వడ్లలో ఒకరకం. బాసలుబడికండ్లు వి.బ.వ. నెరవేర్పులేని ప్రమాణాలు. బాసవాలు వి. 1. దేవత. యయా. 1.20 ; 2. ఋషి, జడదారి. అచ్చ.రా.బాల. 111. బాసవాలుదొర రూ.చూ. బాసవాల్దొర. వి. ఇంద్రుడు. చెన్నబసవ. 5.482. బాసవాల్దిట్టలు వి.బ.వ. సురలు, దేవతలు. ఆం.భా. 1.62. బాసవాల్దొర రూ. బాసవాలుదొర. వి. 1. ముని శ్రేష్ఠుడు. వసు. 5.6 ; 2. దేవేంద్రుడు. బాసవెల్లి వి. దేవుడు. క్రీడా. 145. బాసపేయు(-చేయు) అ.క్రి. ప్రమాణం చేయు, ఒట్టుపెట్టుకొను. విజయ. 1.97. బాసాడు అ.క్రి. మాటాడు, భాషించు. ఆము. 1.15. <బాస+ఆడు.

బాసంచు వి. కోసుగా ఉండి పైకి లేచినట్లుండే అంచు, దోసి అంచు.

బాసంచుకుండ వి. దోరకుండ, అంచుకు పింజలు లేకుండా దోసిగా చేసిన మట్టిపాత్ర.

బాసట వి. సహాయం, తోడ్పాటు. భార.విరా. 4.63 ; విశే. సహాయుడు, సహాయం, తోడు. భార.విరా. 5.16.

సం. పార్శ్వస్థ-. పక్కన ఉన్న ; ప్రా. పాసత్థ-. పాసత్థ-. పార్శ్వస్థితం, నికట స్థితం.

<ప్రా. పాసత్థ-.

బాసటము వి. 1. బంధనం, పాగురు. పి.శకు. 3.160 ; 2. విషం ; 3. మెరుగు ; 4. సహాయం.

సం. పాశస్థ-. పాశంలో ఉన్న ; ప్రా. పాసత్థ-.

<ప్రా. పాసత్థ-.

బాసనము వి. వంట పాత్ర.

క. బాసణిగె, మూత, పాత్రపై మూత.

బాసము వి. బంగారం, మణులు మొ.వి ఉంచే సంచి. ఆము. 6.77.

సం. పాశ-. రజ్జువు, బంధం ; ప్రా. పాస-.

<ప్రా. పాస-.

బాసాడు చూ. బాస.

బాసికంపుడి చూ. బాసికము.

బాసికంకట్టు చూ. బాసికము.

బాసికదండ చూ. బాసికము.

బాసికపాటు వి. ఎడమపాదం కుడితొడ దగ్గర కుడి పాదం ఎడమతొడ దగ్గరకు వచ్చేలా కూర్చోవటం.

బాసికపునుడి చూ. బాసికము

బాసికబొమ్మగట్టు చూ. బాసికము.

బాసికము రూ. బాషకం, బాసింగము. వి. 1. వివాహ సమయంలో అర్ధచంద్రాకారంగా గాని మూడు పక్క లేర్పడేటట్లుగాని వధూవరుల నొసట కట్టే ముత్యాలు, పుష్పాలు మొదలైన వానితో చేయబడిన లలామకం, ఎద్దులు మొదలైన వాటి నొసట కట్టే భూషణం. బసవ. 7-152 ; 2. బాసికం మాదిరి డిజైను.

సం. పాశికా. నాగలిమీద ఉంచే చర్మపట్టిక, పాశక-. పాడు, ఉరి, వల ; ప్రా. పాసయ-, పాశియా ; మరా. బాసింగ ;

క. బాసిక, బాసిగ, బాసింగ ; త. వాచికై.

<సం. పాశికా.

బాసికంనుడి రూ.చూ. బాసికపునుడి. వి. నుదుటి మీద ప్రక్క పక్కన ఉండే జంట నుడి. బాసికంకట్టు రూ.చూ. బాసిగంకట్టు. వి. తలకట్టు, దారబంధం, నాగబంధం, పడుగు దువ్వే కుంచెపిడికి వేసిన దారు మెలిక. <బాసికము+కట్టు. బాసికదండ వి. తల ముందు పక్క ఉంచబడిన పూలహారం. బాసికపునుడి రూ. బాసికంనుడి. వి. నుదుటిమీద పక్కపక్కన ఉండే జంట నుడి. బాసిక బొమ్మగట్టు స.క్రి. ఓడించు. ఉ.హరి. 3.117.

బాసిగంకట్టు రూ. బాసికంకట్టు. వి. తలకట్టు, దారబంధం, నాగబంధం, పడుగు దువ్వే కుంచె పిడికి వేసిన దారు మెలిక.

బాసిగప్పేటు రూ.చూ. బాసింగంపేటు. బాసిగం ఆకారంలో అంచులో వరసగా నేసిన డిజైను.

బాసింగమంచు చూ. బాసింగము.

బాసింగము రూ. చూ. బాసికము. వి. 1. కలిక ; 2. ఎద్దు మొగం మీదవేలాడేట్టు కట్టిన ఒక్క.

బాసింగమంచు వి. బాసికం అంచు, బాసికం ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. <బాసింగము+అంచు[3]. బాసింగం పూవు వి. బాసిగం ఆకారంలో డిజైన్లు నేసిన అంచు. బాసింగంపేటు రూ. బాసింగప్పేటు. వి. బాసింగం ఆకారంలో అంచులో వరసగా నేసిన డిజైను. బాసింగాలచీర చూ. బాసింగము. వి. అంచుల మధ్య భాగంలో బాసింగాల ఆకారంలో డిజైన్లు పడేట్టు నేసిన చీర. బాసింగాలపటవలు వి.బ.వ. పెళ్ళికాని అమ్మాయిలు నోము నోముకొనేందుకు వాడే మట్టిపాత్రలు. బాసింగాలపేటు వి. బాసిగం ఆకారంలో అంచులో వరసగా నేసిన డిజైను.

బాసింగంపూవు చూ. బాసింగము.

బాసింగంపేటు చూ. బాసింగము.

బాసింగాలచీర చూ. బాసింగము.

బాసింగాలపటవలు చూ. బాసింగము.

బాసింగాలపేటు చూ. బాసింగము.

బాసిపీట రూ. బాసీపీట. వి. రెక్కిగం వేసి కూర్చోవటం.

బాసిపట్లేసుకాప అ.క్రి. కుండల్ని పర్చేటప్పుడు కమిడిపై కుమ్మరి చతికిలబడి కూర్చునే తీరు.

**బాసిపీట** రూ.చూ బాసిపీట. వి. రెక్తిగం వేసుకొని కూర్చోవటం.

**బాసిపెట్టుకొను** అ.క్రి. రెక్తిగం వేసికొని కూర్చుండు.

**బాసు** వి. నాయకుడు.

ఇం. *Boss*. యజమాని.

<ఇం. Boss.

**బాసుకర్ర** వి. పిడికర్ర, రంగు అద్దిన నూలు లడీలు గుంజకు తగిలించే పిండే గుండ్రటి కర్ర.

**బాసెపుకట్టు** చూ. బాసిగంకట్టు. వి. తలకట్టు, దారబంధం, నాగబంధం, పడుగు దువ్వే కుంచె పిడికి వేసిన తాడు మెలిక.

**బాపేలి** వి. 1. ఒక స్త్రీ ఇంకొక స్త్రీని నిర్దేశించటానికి ఉపయోగించే పదం; 2. భార్య.

హిం. బాఁ. ఆవులు మొ. వాటిని పిలిచే పిలుపు, చెలా, చెలి, శిష్యురాలు, విద్యార్థిని.

**బాస్వాములు** వి.బ.వ. ఒకరకం వడ్లు.

**బాహాటము** విణ. బయలుపడినది, బహిరంగం.

**బాహాదరు** రూ.చూ. బహదరు. వి. బిరుదునామం.

**బాహిరపోవు** చూ. బాహిరము.

**బాహిరము** విణ. దీనికి వృత్తిలో ముపర్ణలోపం. **1**. బహిరంగమైన. భార. విరా. 1.137; **2**. వెలిఅయిన, మానమైన. భార. ఉద్యో. 3.216, 1.137; **3**. మూర్ఛ, సొమ్మ;

సం. బాహ్య-, బాహిర్. బయటి; ప్రా. బహిర-, బాహర-, బాహిరియ; జై.మహా. బాహిరియ; అ.మా. బాహిరిల్ల; పా. బాహిర-.

<ప్రా. బహిర-.

**బాహిరపోవు** అ.క్రి. **1**. బయల్పడు, స్పష్టమగు. భార. విరా. 2.287; **2**. మూర్ఛిల్లు, సొమ్మసిల్లు. భార శల్య. 1.377.

**బాహిరుఁడు** విణ. దూరుడు, వెలైనవాడు. భార. శాంతి. 1.49.

సం. బాహిర్. బయటి.

<సం. బాహిర్.

**బాహుటా** రూ.చూ. బావుటా. వి. జండా.

**బాహుపురి** వి. **1**. కేయూరం, భుజకీర్తి, సందెకడియం. రం.రా. బాల. 65 ప. 15; **2**. ధాన్యవిశేషం.

సం. బాహు-. చేయి, హస్తం.

<సం. బాహు-+పురి.

**బాహుషి** వి. నేర్పు.

హిం.ఉ. బాహోష్. తెలివి, జ్ఞానం.

<ఉ. బాహోష్.

**బికట్‌తాడు** చూ. బిగియు. వి. కాడిని పోలుగర్రకు కట్టేతాడు, బొద్దుమోకు.

**బికారి** విణ. **1**. అప్రయోజకుడు, అసమర్థుడు. భీమ. 5.21; **2**. ధూర్తుడు. హంస. 5.13; **3**. దరిద్రుడు, భిక్షుకుడు. ఆం.భా. 2.176;

సం. వికారిన్, భిక్షాచరిన్. భిక్షుకుడు; ప్రా. భిక్ఖారి, భిక్ఖాయర-. భిక్షుకుడు; అప. భిఖారి; బెం. భికారి, భిఖారి, భికరి; ఒ. భికారి, భిఖారి; హిం. భిఖారి; క. బికారి; తు. బికారి; త. పిక్కారి.

<ప్రా. భిక్ఖారి.

**బికారి** వి. వికారి, వికృత వేషధరుడు.

సం. వికారిన్. వికారం కలది, మార్పొందినది.

<సం. వికారిన్.

**బికాసి** విణ. అవిరక్త భిక్షుకుడు, వైరాగ్యం కలగని భిక్షగాడు. ఆం.భా. 2.176.

సం. భిక్షాశిన్. భిక్షమెత్తుకొని తినేవాడు; ప్రా. భిక్ఖాసి-;

త. పిక్కాసి.

<ప్రా. భిక్ఖాసి.

**బికిరము** రూ.చూ. బిక్కిరము. వి. భిక్షం. మల్ల. వై. 15.

**బికిరాలమారి** వి. భిక్షం ఎత్తే స్వభావంకల వ్యక్తి. ఆం.భా. 2.176.

**బికిరాలమారి** చూ. బికిరము.

**బిక్క** రూ. బిక్కము. విణ. **1**. బెదురుకల. కేయూ. 2.112, **2**. హీనం. కకుత్స. 1.108; **3**. నిస్సారం. శివలీలా. 2; **4**. భిన్నం; **5**. నిరుపేదఅయిన.

సం. భిక్షా. బిచ్చం; ప్రా. భిక్ఖా. బిచ్చమెత్తటం, భిక్ఖు-. బిచ్చగాడు; అ.మా.పా. భిక్ఖా. బిచ్చమెత్తిన అన్నం, బిచ్చమెత్తటం.

<ప్రా. భిక్ఖా.

**బిక్కచచ్చిపోవు** అ.క్రి. ఏమీచేయలేని నిస్పృహతో ఉండు, నిరాశలో ఉండు. **బిక్కమొగమువేయు** రూ. బిక్కుమొగము వేయు. అ.క్రి. తెల్లమొగం వేయు.

**బిక్కట్టు** చూ. బిక్క. వి. చాలా ఇబ్బంది.

**బిక్కము** రూ.చూ. బిక్క. వి. భిక్షం.

**బిక్కలము** వి. రాసిన పత్రాలచివర రాసినవాడి చేవ్రాలు.

**బిక్క**[1] వి. మంచి కలపనిచ్చే పెద్ద ఆకులుకలిగిన ఒకరకం చెట్టు (Gardenia latifolia).

**బిక్క**[2] రూ. బుక్క. వి. **1**. అక్షోటకం, వృక్షవిశేషం; **2**. గార చెట్టు (Gardenia gummifera).

క. బిక్కె, బిట్కె.

<క. బిక్కె.

**బిక్కపండు** వి. జామపండు.

**బిక్కరము** రూ. బికిరము. వి. భిక్షం. వైజ. 4.38.

సం. వికిర-. చెదిరిన తండులాదికం.

<సం. వికిర-.

**బిక్కరించు** స.క్రి. **1**. నిక్కించు, రిక్కించు. ద్వి.నల. 3.279; **2**. చికిలించు. వేం.మా. 1.230.

**బిక్కుబిక్కు** వి. ఏకాకిత్వాదుల్తో మనస్సుకు కలిగే దిగులుకి అనుకరణం.

**బిక్కుబిక్కుమను(-అను)** అ.క్రి. దిగులుపడు, భయం చెందు.

**బిక్కుమొగమువేయు** రూ.చూ. బిక్కమొగమువేయు. అ.క్రి. నిరుత్తరుడగు.

**బిక్కొయ్య** చూ. బిగి.

**బిక్కొయ్యవదు** చూ. బిగి.

**బిగ** రూ.చూ. బిగ్గ. క్రి.విశే. 1. బిగపట్టు, నిరోధించు, చలింపకుండాచేయు, కదలకుండ, దృఢంగా; 2. గట్టిగా పట్టుకొను, బిగ్గరగా.

**బిగం** రూ.చూ. బిగదు. వి. భూమికొలత, 60 కుంటలనేల.

**బిగఁగట్టు** చూ. బిగియు.

**బిగఁగొట్టు** చూ. బిగియు.

**బిగజారు** చూ. బిగియు. రూ. బీజారు. అ.క్రి. మట్టిలోఉండే రాళ్ళను వేరుచేయు.

**బిగడాయించు** రూ. బెగడాయించు. అ.క్రి. 1. చెడిపోవు; 2. బివ్వించు; 3. వెళ్ళిపోవు.

ఉ. *బిగాడ్‌నా*. పాడయిపోవటం; హిం. *బిగడ్‌నా*. చెడిపోవటం; గు. *బిగడవు*. చెడిపోవటం; మరా. *బిగడ్-ణేఁ*. చెడిపోవటం.

< హిం. బిగడ్(నా) + -ఇంచు[3].

**బిగదు** రూ. బిగం, బిగా, బిగెదు, బీగద. వి. భూమి కొలత, 60 కుంటల నేల, ఎకరం.

హిం. *బీఘా*. భూపరిమాణం.

< హిం. బీఘా.

**బిగతొక్కు** చూ. బిగియు.

**బిగఁబట్టు** చూ. బిగియు.

**బిగఁబూను** చూ. బిగియు.

**బిగవఁగట్టు** చూ. బిగియు.

**బిగా** రూ.చూ. బిగదు. వి. భూమి కొలత, 60 కుంటల నేల.

**బిగాదు** వి. బీదు.

హిం. *బిగాడ్*. చెడిపోవటం.

< హిం. బిగాడ్.

**బిగాది** వి. 1. ధూర్తుడు, మోసకాడు. వేంక.పంచ. 1.763; 2. పిగాచి. రసిక. 4.84.

**బిగారి** వి. పనికిరానిది.

హిం. *బిగాడ్, బిగార్, బిగారీ*. పనికిరాని, చెడిపోయిన, విరిగిన, చెడ్డ, పోట్లాట, అనంగీకారం, అపార్థం; ఉ. *బిగ్‌డా*. చెడిన, శిథిలమైన, యుద్ధం, పోట్లాట, అపార్థం.

< హిం. బిగారీ.

**బిగి** విశే. బిగువు, దృఢమైన, కఠినమైన. హర. 7.79; వి. 1. అభినివేశం, పట్టుదల, దురాగ్రహం. కళా. 3.266; 2. బింకం, దార్ఢ్యం, కాఠిన్యం. వసు. 1.113; 3. అచ్చు కట్టేటప్పుడు పడి దారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చు పడులలో బిర్రు పెట్టే కొయ్యచెక్క.

క. *బిగి*. బిగించు, కట్టు, గట్టితనం, గర్వంగా ఉండు; *బిగిత*. బిగించటం, *బిగుహు, బిగువు, బిగిపు, బిగిహు*. నిశ్చలత్వం, గట్టిగా పట్టుకొని లాగు, *బిజ్కు*. గర్వం; తు. *బిగి, బిగు, బిగుత*. బిగువు, గట్టి, కరకు, *బిగట*. బిగువు, *బిజ్క*. గర్వం, ధైర్యం; త. *పికు, పికువు*. గట్టితనం, బిగువు, శక్తి, బలం, గర్వం; కో. *విగ్ర్*. గొడ్డలి పిడి గట్టితనం, తాడు గట్టితనం.

< క. బిగి.

**బిగ్గొయ్య** వి. నేత బయలులో చివర పాతిన కొయ్య. < బిగి + కొయ్య. **బిగ్గొయ్యపడు** అ.క్రి. నేత నేసేటప్పుడు పేక పోగు సరిగా పడక, బట్టకు ఒకవైపున ఎక్కువ, మరొకవైపున తక్కువ రావటం. **బిగిచెక్క** వి. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద. **బిగిచ్చు** రూ.చూ. బిగియించు. స.క్రి. తాడు మొదలైన వాటితో గట్టిగా కట్టు. **బిగితము** విశే. దృఢం. హరి.ఉ. 7.17. **బిగిదారం** వి. 1. రాటె ఆకులు పైవీ కిందవీ కలిపి కట్టిన దారం; 2. మర మగ్గం నిలువ పట్టెకు మేరువ పలకకు బిగించి సన్నపుల్లతో పడిపెట్టిన దారం. **బిగినీసు** వి. గట్టిదనం. ఇం. *-ness*. తనం, స్వభావం. < బిగి + ఇం. -ness. **బిగివట్టు** వి. గట్టిపట్టు. రాధికా. 1.113. **బిగిపుల్ల** వి. మరమగ్గం నిలువ పట్టెకు మేరువ పలక బిగించి తాడు పడి పెట్టే పుల్ల. **బిగిపొట్ట** వి. ఆకుల మరుగున ఉబ్బెత్తుగా ఉన్న కంకి. **బిగిబద్ద** రూ.చూ. బిగువుబద్ద. వి. 1. రెండు గాడి కమ్ములకి నడుమ వేసే బిగువుబద్ద; 2. రెక్కలను పట్టి ఉంచటానికి తలుపు వెనక బిగించిన కొయ్యబద్ద; 3. చూరు చెక్కమీద బిగింపుకోసం వేసే బద్ద. **బిగియార** క్రి.విశే.క్రియ గాఢంగా. పారి. 2.53. **బిగియారు** (-ఆరు[1]) అ.క్రి. బిగువగు, గాఢమగు. తార.శశాం. 4.331. **బిగియెక్కు** (-ఎక్కు) అ.క్రి. దృఢమగు, గట్టిపడు. తార. విరా. 1.245. **బిగులేయు** అ.క్రి. కుంచె కట్టుబడిలో అడ్డ బద్దలు బిగించు. < బిగి + -లు + వేయు. **బిగ్గర్ర** రూ.చూ. బిగుకర్ర. వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య. **బిగ్గాల్పు** వి. ఆములో కుండలు మొ.వి ఎక్కువగా కాలటం. < బిగి + కాల్పు. **బిగ్గొయ్య** రూ.చూ. బిగుగొయ్య. వి. మగ్గంమీద నేత బిర్రు పెట్టటానికి మోకు కట్టే కొయ్య.

**బిగించు** చూ. బిగియు.

**బిగిడి** రూ.చూ. బొగడ[1]. వి. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను.

**బిగింపు** చూ. బిగియు.

**బిగింపుచిల్ల** చూ. బిగియు.

**బిగింపుపిల్ల** చూ. బిగియు.

**బిగియఁబట్టు** చూ. బిగియు.

**బిగియించు** చూ. బిగియు.

**బిగియు** స.క్రి. దృఢంగా కట్టు, బిగించు. కు.సం. 3.91; అ.క్రి. 1. బెట్టుచేయు. తార.ద్రో. 5.386; 2. దృఢమగు. మను. 3.109; 3. క్రిక్కిరియు, గుమిగూడు. రాజవా. 2.63.

క. *బిగి*. బిగించు, కట్టు, నొక్కు, గట్టిగాకట్టు, గర్వంగా ఉండు, గట్టితనం; తు. *బిగియుని*. గట్టిగా ఉండు, *బిగిపుని, బిగుపుని*. కట్టు, త్వరపెట్టు, బిగించు, *బిగిపు, బిగుతె*. త్వరపెట్టటం, బిగించటం; త. *వికు (-ప్పు-, -త్తు-)*. బిగుతుగా ఉండు, బిరుసు, గట్టిపడు, *పికి (-వ్-, -న్త్-)*. గట్టిముడిపడు, *విచి (-వ్-, -న్త్-, -న్త్-, -ప్పు-, -త్తు-)*. కట్టు, గట్టిగాకట్టు, ఉబ్బు; మ. *విఞ్ఞక*. గట్టిగా ఉండు, దట్టమైన; కో. *విగ్వ్- (విగ్త్-)*. (గొడ్డలి పిడి) గట్టిగా బిగించబడు; తొ. *పిక్స్య్- (పిక్స్స్-)*. గట్టిగా అగు, *పిక్స్చ్-*. బిగించు; కుఇ. *విజ*. బాగా ఉబ్బిన,

బిజబిజలవ. బాగా ఉబ్బితుంది.

<మూ.ద.ద్రా. *విక్-ఇ-.

బిగ(గట్టు (-కట్టు) వి. బిగియకట్టినకట్టు. శుక. 1.480 ; స.క్రి. గట్టిగాకట్టు. బిగ(గొట్టు (-కొట్టు[1]) స.క్రి. బిగిసేటట్లు కొట్టు. బిగతొక్కు స.క్రి. కాలికింద తొక్కివేయు. బిగ(బట్టు (-పట్టు[1]) స.క్రి. 1. గట్టిగా పట్టుకొను. కళా. 5.160 ; 2. బిగియపట్టు, నిరోధించు, చలింపకుండాచేయు. వేం.మా. 2.41 ; 3. ఇవ్వవలసిన పైకంలో కొంత నిలువచేయు. బిగ(బూను (-పూను) స.క్రి. గట్టిగా పట్టుకొను. చెన్నబసవ. 4.19. బిగవ(గట్టు (-కట్టు) స.క్రి. తాడు మొదలైనవాటితో గట్టిగా కట్టు. బిగించు రూ.చూ. బిగియించు. స.క్రి. 1. బిగియకట్టు. గట్టిగాకట్టు. శృం.నై. 7.63 ; 2. అదుము, అదిమిపట్టు, గట్టిగా పట్టుకొను. భీమ. 4.68 ; 3. నొప్పించు. జైమినిభా. 7.190 ; 4. (కోపాదులతో) ముడుచు, మూయు. మను. 4.113, ఆము. 4.37 ; 5. గట్టిగావేయు, నొక్కు. శుక. 2.122 ; 6. సవరించు, చక్కజేయు.దశా. 6.43 ; 7. (ఇత మొ.వి) ముడుచు, ముడివేయు. బిగింపు వి. గట్టితనం. బిగింపుచిల్ల రూ. బిగింపుసిల్ల. వి. అచ్చు కట్టేటప్పుడు పడి దారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చు వడులలో బిర్రు పెట్టే కొయ్యచెక్క. బిగింపుసిల్ల రూ.చూ. బిగింపుచిల్ల. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చు వడులలో బిర్రు పెట్టే కొయ్యచెక్క. బిగియ(బట్టు స.క్రి. కష్టంతో వశపరచుకొను. ఆము. 4.251. <బిగియు +-అ[7]+పట్టు[1]. బిగియించు రూ. బిగిచ్చు, బిగించు. స.క్రి. 1. బిగియకట్టు, గట్టిగాకట్టు. కార.విరా. 5.178 ; 2. (ఇత మొ.వాటిని) ముడుచు, ముడివేయు. సిం.ద్వా. 8.108 ; 3. గట్టిగావేయు, నొక్కు ; 4. అదుము, అదిమి పట్టు, గట్టిగా పట్టుకొను ; 5. (కోపాదులతో) ముడుచు, మూయు ; 6. నొప్పించు ; 7. సవరించు, చక్కజేయు. <బిగియు+-ఇంచు[3].

బిగుకడ్డీ చూ. బిగువు.

బిగుకర్ర చూ. బిగువు.

బిగుగుంజ చూ. బిగువు.

బిగుగొయ్య చూ. బిగువు.

బిగుచిట్ట చూ. బిగువు.

బిగుచు చూ. బిగియు. స.క్రి. బిగించు, బిగియచేయు. రం. రా. యు 288వ. 12పం.

బిగుచుట్ట చూ. బిగువు.

బిగుచెక్క చూ. బిగువు.

బిగుతరం చూ. బిగువు.

బిగుతాడు చూ. బిగువు.

బిగుతు చూ. బిగియు. విణ. గుత్తం, వదులుకాని.

బిగుదబ్బ చూ. బిగువు.

బిగుదాడు చూ. బిగువు.

బిగుదారం చూ. బిగువు

బిగువట్టి చూ. బిగువు.

బిగువట్టె చూ. బిగువు.

బిగుబద్ద చూ. బిగువు.

బిగుబిళ్ళ చూ. బిగువు.

బిగుమానము చూ. బిగువు.

బిగురు చూ. బిగి. వి. 1. పొగరు ; 2. మిడిసిపాటు ; అ.క్రి. మిడిసిపడు.

బిగువారు చూ. బిగువు.

బిగువాలు చూ. బిగువు.

బిగువు వి. 1. పెంకుటింటి వాసాల్ని కలుపుతూ వాటిమీద బిగింపుచేసిన వెదురుబద్ద ; 2. కిటికీరెక్కలు ఆరటానికి పీలుగా రెక్కల్ని చట్టాన్ని కలుపుతూ బిగించిన ఇనపబద్దీ ; 3. ఉత్తరాసి మీద పరచిన చెక్క ; 4. గట్టితనం ; 5. గుడిసె తడికను బిగించే అడ్డుకొయ్య ; 6. గడ్డిమోపు ప్రమాణం ; 7. ఐదుమూరల దారం చుట్టు కొలత ; 8. దారెడు తాడుకు సరిపోయే గడ్డి.

క. బిగిపు, బిగిపు, బిగుప్పు, బిగుపు. బిగువు ; తు. బిగు ; త. పికు, పికువు+బిగువు. గట్టితనం.

బిగుకడ్డీ వి. దారికోలల బిగింపుకు వేసిన ఇనపఊచ. బిగుకర్ర రూ. బిగువుకర్ర, బిగ్గర్ర. వి. మగ్గంమీద నేత బిర్రుపెట్టటానికి మోకు కట్టేకొయ్య. బిగుగుంజ వి. మగ్గం మీద నేతబిర్రుపెట్టటానికి మోకుకట్టే కొయ్య. బిగుగొయ్య (-కొయ్య) రూ. బిగ్గొయ్య. వి. మగ్గం మీద నేతబిర్రు పెట్టటానికి మోకు కట్టేకొయ్య. బిగుచిట్ట వి. పంటిఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో బద్ద. బిగుచుట్ట వి. కదురు కడ్డీకి దంటు ఊచ బిర్రుగా పట్టటానికి చుట్టిన దారం. బిగుచెక్క వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగుగా రావటానికి అచ్చు వడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క. బిగుతరం వి. ఎక్కువ గట్టితనం. బిగుతాడు రూ. బిగుదాడు, బిగువుతాడు. వి. 1. రాట్నం ఆకులకు చుట్టిన తాడు ; 2. అచ్చుకట్టే జంత్రం కొయ్యకు కట్టిన దారం ; 3. చేడుకర్రలకు మధ్యన రెంటినీ బిగించే పైతాడు ; 4. తివాసీ మగ్గం దోనెకు టంగుకు వేసి బిగించిన తాడు. బిగుదబ్బ వి. చూరుచెక్క మీద బిగింపుకోసం వేసేబద్ద. బిగుదాడు (-తాడు) రూ.చూ. బిగుతాడు. వి. 1. రాట్నం ఆకులకు చుట్టినతాడు ; 2. అచ్చుకట్టే జంత్రం కొయ్యకు కట్టిన దారం ; 3. చేడుకర్రలకు మధ్యన రెంటినీ బిగించే పైతాడు ; 4. తివాసీమగ్గం దోనెకు టంగుకు వేసి బిగించిన తాడు ; 5. బండికి చొప్పవేసి బిగించే తాడు. బిగుదారం వి. రాట్నం ఆకులకు చుట్టిన తాడు. బిగువట్టి రూ.చూ. బిగుపట్టె. వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపుచేసిన వెదురుబద్ద. బిగువట్టె రూ. బిగుపట్టి, బిగువ పట్టె. వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపుచేసిన వెదురుబద్ద. బిగుబద్ద రూ.చూ. బిగువుబద్ద. వి. 1. కుంచెకట్టుబడిలో పురి బిగింపుకు రెండుపక్కలా వేసి కట్టిన వెదురుబద్ద ; 2. దోనెముంగర నేసిన గుడ్డ. ముడుచుకు పోకుండా అడ్డంగా పైపైన బిర్రుపెట్టే ఒకరకం చేడుబద్ద ; 3. చూరుచెక్కమీద బిగింపుకోసం వేసేబద్ద ; 4. అచ్చుకట్టేటప్పుడు పడిదారాలు ఒకేపొడుగులో రావటానికి అచ్చు వడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క ; 5. మర

మగ్గం చట్రంలో మేరువ పలకకు కిందగా నిలువపట్టెలు బిగించిన మధ్యకర్ర. బిగుబిళ్ళ వి. అచ్చుకట్టేటప్పుడు పడి దారాలు ఒకేపొదుగులో రావటానికి అచ్చుపడుగులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క. బిగుమానము వి. 1. బింకం, బెట్టుసరి. దశా. 7.152; 2. నీళ్ళు పోసి తొక్కిన మట్టి యొక్క బిగువలేక గట్టితనం. బిగువారు అ.క్రి. 1. ఉగ్రమగు, భీకరమగు. భార. ద్రోణ. 2.269; 2. బిగువగు, దృఢమగు. < బిగువు + -ఆరు[1]. బిగువాయి వి. కట్టుతాడు, కట్టెలమోపు కట్టేతాడు. శుక. 3.245. < బిగువు + వాయి. బిగువుకట్టు వి. పంటకు కిందివైపున ఆకుల చివర్లను గాముకు కలిపి వేసినకట్టు. బిగువుకర్ర రూ. చూ. బిగుకర్ర. వి. అచ్చులో పడిదారం కట్టినకర్ర. బిగువుగొను అ.క్రి. బిగువగు. బిగువుతాడు రూ. చూ. బిగుతాడు. వి. 1. ఊతైను నిలబెట్టి కిందిగూటానికి బిగించే తాడు; 2. జడ్డిగపు పిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు. బిగువుసలక వి. జడ్డిగపు పిడత కదలకుండా బిగింపుకు వేసేతాడు. బిగువు(దన్ను) (-తన్ను) అ.క్రి. బిగియు, బిగువగు, బిగిసిఉండు. గంధ. 147. బిగువుపట్టె రూ.చూ. బిగుపట్టె. వి. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపు చేసిన వెదురుబద్ద. బిగువుబద్ద రూ. బిగిబద్ద, బిగుబద్ద. వి. 1. అచ్చుకట్టేటప్పుడు పడిదారాలు ఒకేపొదుగులో రావటానికి అచ్చువడులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క; 2. మరమగ్గం చట్రంలో మేరువ పలకకు కిందగా నిలువ పట్టెలు బిగించిన మధ్యకర్ర; 3. పెంకుటింటి వాసాలను కలుపుతూ వాటిమీద బిగింపు చేసిన వెదురు బద్ద. బిగువులు వి.బ.వ. సన్నదూలాలు, గుజ్జులు, కనపు, చొప్ప మొ. వాటి మోపులు. బిగుపీల వి. ఆసుపేటల బిగింపుకు వేసే కొయ్యపేరు.

బిగుపీల చూ. బిగువు.

బిగెడు రూ.చూ. బిగడు. వి. ఎకరం.

బిగ్గ చూ. బిగియు. రూ. బిగ, బిగ్గన. క్రి. విణ. ద్రు. 1. సడలకుండ. కేయూ. 3.74; 2. గట్టిగా, బిగ్గరగా. పాండు. 4.112.

బిగ్గ(బట్టు (-పట్టు[1]) స.క్రి. దృఢంగా పట్టు, గట్టిగాపట్టు. రాగ. 2.12.

బిగ్గన చూ. బిగియు. రూ.చూ. బిగ్గ. క్రి. విణ. 1. గట్టిగా, దృఢంగా. పీర. వి. 2.284; 2. బిగ్గరగా, ఉచ్చైస్స్వరంతో. మల్ల. 85.

బిగ్గర చూ. బిగియు. క్రి. విణ. 1. సడలకుండ, దృఢంగా. ఉ.రా. 6.90; 2. ఉచ్చైస్స్వరంతో, గట్టిగా.

బిగ్గ్ర చూ. బిగి.

బిగ్గాల్పు చూ. బిగి.

బిగ్గాయ్య చూ. బిగి.

బిగ్గ్రౌతు వి. గోడల కట్టుబడిలో వాడే రాతిముక్క.

హిం. బిగ్‌డీ. పాడవటం, దురవస్థ.

< హిం. బిగ్‌డీ + రౌతు[2].

బిగ్గి[1] వి. తొందర.

సం. వేగ-. వేగం; ప్రా. వేగ-.

< సం. వేగ-.

బిగ్గి[2] చూ. బిగి. వి. గొళ్ళెం తగిలించటానికి వీలుగా దర్వాజా కమ్మిలో బిగించిన ఇనప కొక్కెం.

బిగ్గుపేటు వి. రెండు రంగుల్లో చిన్న బిళ్ళలు పడేట్టు నేసిన డిజైను.

బిగ్గె చూ. బిగియు. క్రి.విణ.ద్రు. దృఢంగా, గట్టిగా. శాళ్ల.నం. 14 175.

బిస్వ చూ. బిగువు. వి. ఒక కొలమానం. తె.శా. క్రి.శ. 1545.

బింకము రూ. బింకెము, బింగము[1]. వి. 1. అతిశయం, పెంపు. కు.సం. 1.86; 2. ధైర్యం. పండి.చ. 2.232; 3. గర్వం. భార. ద్రోణ. 4.179; 4. బిగువు. హర. 5.29; 5. గట్టితనం; విణ. 1. దృఢమైన, గుల్లకాని. కావ్యా.చూ. 3.122; 2. బిగువైన, సడలని. మను. 5.68.

క. బింక. గర్వం; తు. బింక. గర్వం, ధైర్యం.

< క. బింక.

బింకమెక్కు అ.క్రి. నిక్కు, పైకిలేచు. భార. ఉద్యో. 2.110. < బింకము + ఎక్కు.

బింకమెక్కు చూ. బింకము.

బింకి రూ. బింకీ. వి. కల్లులొట్టి.

బింకీ రూ.చూ. బింకి. వి. కల్లులొట్టి.

బింకీముంత వి. కల్లుదుకాణంలో వాడే మట్టిపాత్ర.

బింకెము రూ.చూ. బింకము. వి. 1. గర్వం; 2. బిగువు; 3. గర్వోక్తి; 4. శూరత; 5. నిక్కు.

బింగ వి. 1. సారె మొల దించటానికి గుబ్బరాయి మధ్యలో పెట్టిన రంధ్రం; 2. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

సం. భంగ-. చీలిక రావటం, కోత, ముక్క, విడదీయటం.

< సం. భంగ-.

బింగరాయి వి. 1. సారెమొలను దించటానికి గుబ్బిగద్దలో పొదిగిన రంధ్రంఉన్న రాయి; 2. రాతిపలకల ముఖాలకు మెరుగు పెట్టటానికి వాడే కఠినమైన రాయి.

బింగణ్ణ వి. వానాకాలంలో తిరిగే రెక్కల పురుగు.

సం. భృంగ-. తుమ్మెద; ప్రా. భింగ-;

త. అణ్ణా. అన్న.

< ప్రా. బింగ- + త. అణ్ణా.

బింగన్న వి. ప్రమథగణాల్లో ఒకడు, భృంగిరిటుడు. వరాహ. 11.10.

సం. భృంగి-. ప్రమథగణాల్లో ముఖ్యుడు; ప్రా. భింగి.

< ప్రా. బింగి-.

బింగపురాయి చూ. బింగము[2].

బింగము[1] రూ.చూ. బింకము. విణ. దృఢం, గట్టి. పి.శకు 2.107.

బింగము[2] వి. 1. అభ్రకం; 2. దేవరకుండలు, తిరునాళ్ళ కుండలు మొ.వాటి మెరుపుకోసం వాడే బిగింపురాయి.

సం. భృంగ-. అభ్రకం; ప్రా. భింగ-.

< ప్రా. బింగ-.

బింగపురాయి వి. కుండలకు మెరుగు రావటానికి వాడే ఒక రకపు రాయి.

బింగరము వి. శాక్యాలికోద్రేకం.

సం. భృంగార-. బంగారం; ప్రా. భింగార-. పాత్ర, జారీ, పక్షివిశేషం, స్వర్ణమయ జలపాత్ర.

బింగి రూ.చూ. బుంగ. విశ. 1. కొంచెం ఉబికిన; 2. ముడి పడిన.

బింగిగొర్రె వి. బుంగచెవులుగల గొర్రె. బింగిచెవులు వి.బ.వ. వెనుకకు మరలిపోయిన చెవులు. బింగితెగులు వి. మిరప, పత్తి, వేరుసెనగ మొ. పైర్ల తెగులు (Scirtothrips dorsalis). బింగిపారు స.క్రి. ఐబ్బుపడిన చిగుళ్ళను రాల్చు: వి. ఐబ్బుపడిన చిగుళ్ళను రాల్చటం.

బింగిమేక వి. చెవులు ముడుచుకొనిపోయిన మేక. బింగిరాళ్ళు వి. ఇసుకలో ఉండే నున్నని రాళ్ళు.

బింగివిపల్లి రూ.చూ. బంగినిపల్లి. వి. నూజువీడు ప్రాంతంలో పండే మామిడి.

బింగిరి[1] రూ.చూ. బింగిరీ. వి. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక.

బింగిరితాడు రూ.చూ. బింగిరీతాగు. వి. మగ్గం పికానికి బొమ్మకూ కట్టిన దారం.

బింగిరి[2] వి. యతిమతం.

సం. భృంగిన్. శివ పరిచారకుడు; ప్రా. భింగి; హిం. భృంగి.

బింగిరీ రూ. బింగిరి[1]. వి. మరమగ్గం నాడెను ఒక సొరుగులోనుంచి మరొక సొరుగులోకి నెట్టటానికి సొరుగులోకి వచ్చిన నాడెను నిలపటానికి అమర్చిన కొయ్యగిలక.

బింగిరీతాడు రూ. బింగిరితాడు. వి. మగ్గం పికానికి బొమ్మకూ కట్టిన దారం. బింగిరీదారం వి. మగ్గం పికానికి బొమ్మకూ కట్టిన దారం.

బింగిలివేల వి. వంకరటింకర రాళ్ళుగల నేల.

బింగిసరాయి రూ. బింగిసిరాయి, బింగెనరాయి. వి. సారె మొలను దించటానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం ఉన్న రాయి.

బింగిసిరాయి రూ.చూ. బింగినరాయి. వి. దండెదగ్గర పడుగులో దూర్చిన చువ్వ కిందికి జారకుండా దారంకట్టి దండె అవతలికి వేలాడదీసిన రాయి.

బింగీలు వి.బ.వ. గుంజిళ్ళు.

బింగీలుపెట్టించు స.క్రి. గుంజిళ్ళు పెట్టించు. హంస. 3.144.

బింగురాజు వి. కాకికంటె నల్లగా చిన్నదిగా ఉన్న పక్షి. పక్షి విశేషం.

సం. భృంగ-. తుమ్మెద; రాజన్. రాజు; ప్రా. భింగ-.

<ప్రా. బింగ- + సం. రాజన్.

బింగెవరాయి రూ.చూ. బింగినరాయి. వి. సారె మొలను దించటానికి గుబ్బి గడ్డలో పొదిగిన రంధ్రంఉన్న రాయి.

బిచాణా రూ. బిచ్చానా, బిగాణా. వి. 1. మకాం; 2. పడక.

సం. విస్తరణ-. వ్యాపించటం; పా. విచ్ఛాదన-, బిచ్ఛాఅణ-; బెం. బిచాన; ఒ. బిచాఇన్; హిం. బిఛానా; మరా. బిచానా. పరుపు, పక్క; ఉ. బిఛానా, బిచ్చానా. పడక, తివాసీ;

త. పిచ్చాణా. పరుపు.

<ఉ. బిదానా.

బిచాణా ఎత్తివేయు అ.క్రి. మకాంమార్చు.

బిచువా రూ.చూ. బిఛువా. వి. 1. ఒకవిధమైన కత్తి; 2. ఆభరణ విశేషం.

బిచ్చ[1] రూ.చూ. బిచ్చము. వి. భిక్ష, వేడికోలు.

బిచ్చగా(డు(-కా(డు) వి. భిక్షమెత్తుకొనేవాడు. చెన్న. వి. 2.24.

బిచ్చ[2] రూ. బిచ్చు[2], బెచ్చి, బెచ్చె. వి. 1. రాతిముక్క; 2. రాతిలో ఎత్తుగా ఉన్నభాగం.

బిచ్చవ చూ. బిచ్చు[2]. విశ. దృఢం. ఇందు. 1.17.

బిచ్చపుజోగి చూ. బిచ్చము.

బిచ్చపుబుద్ధి చూ. బిచ్చము.

బిచ్చమాడు చూ. బిచ్చము.

బిచ్చము రూ. బిచ్చ[1]. వి. తిరిపం. హర. 5.16; 2. అత్యల్ప యాచన, అడుక్కోవటం, క్షుద్రం.

సం. భిక్షా; ప్రా. భిక్ఖా, భిచ్ఛా; అ.మా. పా. అప. భిక్ఖా; శాకాలీ, భిచ్ఛది, భిక్షమెత్తు;

క. బిచ్చ; తు. బిచ్చ, బిక్కె; త. పిచ్చై; మ. పిచ్చ.

<ప్రా. బిచ్ఛా.

బిచ్చపుజోగి విశ. భిక్షుకుడు; వి. 1. యాచకుడు; 2. సన్యాసి. బిచ్చపుబుద్ధి వి. నీచబుద్ధి. భద్రగిరి. 5.4, బిచ్చమాడు అ.క్రి. విజయంచేయు. వచ్చు. కాశ. 1.35. <బిచ్చము + ఆడు. బిచ్చములెత్తు స.క్రి. యాచించు. పుచ్చుకొను. < బిచ్చము + -లు + ఎత్తు[1]. బిచ్చమెత్తు స.క్రి. యాచించు, పుచ్చుకొను. మను. 5.18. <బిచ్చము + ఎత్తు[1]. బిచ్చాలపొయ్యి వి. బూడిదనేలపై రాలకుండా అడుగుపెట్టి చేసిన పొయ్యి.

బిచ్చమెత్తు చూ. బిచ్చము.

బిచ్చాలపొయ్యి చూ. బిచ్చము.

బిచ్చి వి. 1. చిన్నపిల్లల మూత్రం; 2. పిల్లల మర్మస్థలం.

బిచ్చివా రూ.చూ. బిఛువా. వి. ఆభరణం, ఒకవిధమైన కత్తి.

బిచ్చు[1] రూ.చూ. బిఛువా. వి. 1. ఆభరణవిశేషం; 2. ఒకవిధమైనకత్తి.

బిచ్చు[2] రూ.చూ. బిచ్చ[2]. వి. 1. మొనదేలిన రాతిముక్క; 2. కంపనరికే చిన్నగొడ్డలి; 3. గోడల కట్టుబడిలో వాడేరాతిముక్క; 4. గోడకట్టేటప్పుడు రాళ్ళమధ్య వచ్చేసందు.

బిచ్చులు రూ. బెచ్చులు. వి.బ.వ. ఆములో కుండలు పేర్చేటప్పుడు కుండకిందా పైనా పెట్టే పగిలిన చిన్న పెంకులు.

బిచ్చ్వ రూ.చూ. బిఛువా. వి. ఆభరణం, ఒకవిధమైన కత్తి.

బిఛువా రూ. బిచువా, బిచ్చివా, బిచ్చు[1]. బిచ్చ్వ. వి. 1. ఆభరణ విశేషం; 2. ఒకవిధమైనకత్తి.

హిం. బిఛుఆ. ఒకవిధమైన కత్తి, పాదాల బొటన వేలుకు వేసుకునే ఆభరణం, నడుముకు వేసుకునే ఒక రకమైన ఆభరణం; మరా. బిఛ్వా. ఒకరకం కత్తి; ఉ. బిచ్ఛూఆ. ఒకరకమైనకత్తి, బొటనవేళ్ళకు వేసుకొనే ఆభరణం, వంగిన అంచుగల చిన్నబాకు;

త. పిచాత్తు, పిసాత్తు.

<ఉ. బిచ్ఛూఆ.

బిచ్వావా రూ.చూ. బిదాణా. వి. పతక.

బిజమాడు అ.క్రి. వచ్చు. కాశ. 1.35.

క. బిజమాడిసు. నడిచేటట్లుచేయు. బిజమాడు. విజయంచేయు.

బిజాపాల్ వి. తలుపులు తయారు చెయ్యటానికి బండిబాగాల తయారీకి శ్రేష్ఠమైన కలపనిచ్చే పెద్దఅడవిచెట్టు.

సం. బీజ-. విత్తనం, సాల-. మద్ది; హిం. బీజ్. విత్తనం, సాల్-. మద్దిచెట్టు.

బిజిలి వి. ఒకరకం కృత్రిమమైన పట్టు.

సం. విద్యుత్. మెరుపు; ప్రా. బిజ్జులిఆ; బెం. హిం. పం. బిజ్‌లి; ఒ. బిజులీ; హిం. ఉ. బిజ్‌లీ. విద్యుత్తు; మరా. బిజిలీ. మెరుపు.

<హిం. బిజ్‌లీ.

బిజుగు స.క్రి. బొంకు. సారంగ. 3.214.

బిటారము చూ. బిత్తరము. వి. ఒకవిధమైన విలాసం. ద్వి. పరమ. వి. 3.170.

సం. విస్తార-. విస్తృతి, విస్తారం; పా. విత్థార-.

బిటారి వి. బిటారంకలది, విలాసవతి. < బిటారము + -ఇ[3]. బిటారించు అ. క్రి. ఒప్పు, శోభించు. ద్వి. పరమ.వి. 2.94. <బిటారము + -ఇంచు[3].

బిటారి చూ. బిటారము.

బిటారించు చూ. బిటారము.

బిడీకి చూ. బిట్టు. వి. దుష్టస్త్రీ. చెడ్డఆడది. వేంక. పంచ. 3.191.

బిడుకు వి. ఎండి నిస్సారమైనది.

క. బిడికు, బిడుకు. పగులు, రెండిటిమధ్య బాకీ.

<క. బిడుకు.

బిట్టకబిట్టు క్రి. విశ. ఆకస్మికంగా. ద్వి. బసవ. 6.499.

క. బిట్టనె. నుడిగుంతం వలె.

బిట్టబిరుగుడు వి. తల బిరుసుతనం. కవిక. 8.110.

క. బిట్టు. కాఠిన్యం.

బిట్టబిట్టు వి. మిక్కిలిబిగువు. భోజ. 4.309.

క. బిట్టు. కాఠిన్యం.

బిట్టబవ్ చూ. బిట్టు.

బిట్టిలు చూ. బిట్టు.

బిట్టు విశ. 1. మిక్కిలి. కు. సం. 3.76; 2. శీఘ్రంగా. వేగంగా. కు.సం. 10.21; 3. గాఢంగా. దృఢంగా. భార. విరా. 2.250; 4. అధికంగా. భార. ఉద్యో. 1.323; 5. తటాలున, అకస్మాత్తుగా. శృం. నై. 1.101; వి. 1. పొగరుతనం, గర్వం. కు. సం. 11.161; 2. ధైర్యం. వేంక. పంచ. 1.621; 3. అతిశయం. అచలా. 1.62.

క. బిట్టుళ. మిక్కిలి పెద్దదైన.

బిట్టబవ్ క్రి. విశ. ద్రు. శీఘ్రంగా. కు. సం. 10.144. బిట్టిలు అ.క్రి. శీఘ్రంగా ఈదు. రాజవా. 5.38. బిట్టువడు రూ.చూ. బిట్టువడు. అ. క్రి. తత్తరపడు, కలవరపడు. బిట్టుపల్ల వి. అచ్చుతికేటప్పుడు అచ్చుకర్రలకు ఆధారంగా నిలబెట్టిన పల్ల. బిట్టుబిట్టు వి. గట్టిగా. బిట్టుబిట్ట క్రి. విశ. తటాలున, ఆకస్మికంగా. భోజ. 5.77. బిట్టువడు (-పడు) రూ. బిట్టుపడు. అ.క్రి. తత్తరపడు, కలవరపడు. రాజవా. 5.33. బిట్టేయు అ.క్రి. అచ్చుతికేటప్పుడు అచ్చును నిలబెట్టిన ఎత్తుపల్లలు, తాడుతో బిగించు. <బిట్టు + వేయు.

బిట్టేయు చూ. బిట్టు.

బిఠాయించు అ.క్రి. అధిష్ఠించు.

హిం. ఉ. బైఠ్‌నా-. కూర్చోవటం; మరా. బైఠణేం. కూర్చుండు.

<హిం. బైఠ్ (నా) + -ఇంచు[3].

బిడ రూ. చూ. బిడ్డ. వి. 1. కూతురు. పార్వ. 4.10; 2. ఆ, ఈ, పె అనుపదాలకు అనుప్రయుక్తమై స్త్రీ అనే అర్థం ఇస్తుంది.

బిడాబడి క్రి. విశ. ద్రు. సత్వరంగా, వడిగా. ప్రబంధ. 788.

బిడాయించు వి. ఒకదానిలో మరొకటి ఉంచటం; స.క్రి. 1. సంచయ మొనరించు; 2. మూతవేయు, అంటించు; అ.క్రి. దుప్పటి కప్పుకొని కాళ్ళు బిర్రదన్ని పడుకొను.

హిం. ఉ. బిఛానా. ఆర్జించు, సంచయంచేయు.

<హిం. బిడా (నా) + - ఇంచు[3].

బిడాయింపు వి. ఒకదాంట్లో మరొకటి ఉంచటం.

బిడాయింపు చూ. బిడాయించు.

బిడారము రూ.చూ. బిడారు. వి. 1. శిబిరం, దండువిడిసేచోటు. వసు. 4.12; 2. వాసస్థానం, ఉనికిపట్టు. చంద్రాంగ. 2.19; 3. విడిది, విడిసేచోటు. లక్ష్మీవి. 5.25.

బిడారించు చూ. బిడారు.

బిడారు రూ. బిడారము. వి. 1. విడిది, విడియుచోటు. కాశ. 1.35; 2. వాన స్థానం, ఉనికిపట్టు. యయా. 2.44; 3. కేళీగృహం. సాంబ. స్థావర. 68; 4. చనుప, వణిక్సమూహం, సార్థం; 5. వ్యాపారానికి సంబంధించిన బళ్ళు.

మరా. బిడార, బిఢార. ఇల్లు, విడిది, ఉగ్రాణం;

క. బిడార, బీడార. మనుషులు నివసించే లేక నడిచే ఇల్లు లేక స్థలం, నివాసస్థానం, ఇల్లు; తు. బుడార. తాత్కాలిక వాసం; త. విటారమ్. ఇల్లు, స్థానం; మ. విటారమ్. ఇల్లు, భార్య.

<మరా. బిడార.

బిడారించు అ.క్రి. విడిదిచేయు. అచలా. 16. <బిడారు + -ఇంచు[3]. బిడారుదయ్యము వి. మార్గమధ్యంలో బిడారు వర్తకుల స్త్రీ మరణించి మారిన దయ్యం.

బిడాలవణము వి. ఒక ఉప్పు.

సం. బిడాల లవణ-. ఒకజాతి ఉప్పు.

<సం. బిడాల లవణ-.

బిడి[1] చూ. బిడుగు. వి. 1. గోడ కట్టేటప్పుడు రాళ్ళ మధ్య

ఉన్న ఖాళీ స్థలం; 2. దంచటానికి పనికివచ్చే రాతి దిమ్మ.

క. బిడ, బిడి. వదులు, వదులుగాఉండు.

<క. బిడి.

**బిడి²** వి. మెలి.

**బిడికర్ర** రూ.చూ. బిడిగర్ర. వి. ఊర్తె తాడు బిర్రుపెట్టే పొడుగు కర్ర. **బిడిగర్ర** రూ. బిడికర్ర, బిడుగర్ర. వి. 1. దింపులో వెళ్ళే బండి వేగాన్ని తగ్గించటంకోసం చక్రాలకు ఆనేటట్టు వెనక పరం కింద అమర్చిన కర్ర; 2. ఊర్తె తాడు బిర్రుపెట్టే పొడుగు కర్ర. **బిడిచీల** వి. గొర్రు, గుంటక మొ.వాటి దిండులో నొగలు దూర్చి వెనకవైపు కొట్టే మేకు. **బిడితాడు** రూ. బిడుతాడు. వి. 1. మరమగ్గం నిలువు పట్టెను మేరువ పలకకు బిగించి నన్న పుల్లతో వడి పెట్టిన దారం; 2. బిడి కర్రకు కట్టిన తాడు. **బిడిపుల్ల** వి. మరమగ్గం నిలువు పట్టెకు మేరువ పలక బిగించి తాడు వడి పెట్టే పుల్ల. **బిడిబద్ద** వి. 1. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద; 2. ఊర్తె తాడు బిర్రుపెట్టే పొడుగు బద్ద; 3. మరమగ్గం నిలువ పట్టెకు మేరువ పలక బిగించి తాడు వడి పెట్టే పుల్ల. **బిడిమోకు** వి. బిడిగర్రకు కట్టిన తాడు. **బిడిలాక** రూ. బిల్లాక. వి. ఊర్తె తాడు బిర్రు పెట్టే పొడుగు బద్ద. **బిడివేయు** వి. 1. ఊర్తె తాడును పొడుగు బద్దతో బిర్రు పెడతారు; 2. మగ్గం మోకు చేతి గూటానికి ముడి వేస్తారు. **బిడెత్తు** అ.క్రి. అచ్చు గుడులు మార్చి హెచ్చు తగ్గులు సరిచేయు.

**బిడియము** రూ. బిడెము. వి. సిగ్గు. కాశీ. 2.144.

క. బిడయ, బిడియ, బిడె, బిడెయ. గౌరవం, గుర్తింపు, సిగ్గు; తు. బిడె; త. విళివు; మ. (విళ్; సం. (విడా. సిగ్గు; ప్రా. విడఅ, విడ్డ, విడ్డా, విడయ, విడియ. లజ్జ; అ.మా. విడ్డా, విడిఅ.

<క. బిడియ.

**బిడికోలు** వి. 1. ఇబ్బంది; 2. మాటగాని నిర్ణయంగాని తప్పినవాడు చెల్లించవలసిన అపరాధం; 3. పరిహారంతో కూడిన ఒప్పందం లేక షరతులు.

**బిడుగర్ర** రూ.చూ. బిడిగర్ర. వి. దింపులో వెళ్ళే బండి వేగాన్ని తగ్గించటంకోసం చక్రాలకు ఆనేటట్టు వెనక పరం కింద అమర్చిన కర్ర.

**బిడుగు** రూ. బిడువు, బెడుగు. విశే. బుద్ధిహీనుడు, తెలివి తక్కువవాడు. వేంక.పంచ. 1.761; వి. 1. రాళ్ళ కుప్పలకు మధ్యనున్న ఖాళీస్థలం, ఆవరణ; 2. అవకాశం, ఖాళీ; 3. బావికి చుట్టు గోడ కట్టుబడి చేయవలసిన గుండ్రటి స్థలం; 4. పొడవు వెడల్పుల లబ్ధం, వైశాల్యం; 5. ఖాళీ జాగా; 6. బావిలో మట్టి పడకుండా చుట్టూ మట్టి ఎత్తిన భాగం.

క. బిడుకు, బిడెకు. వేరవటం, పగులు, బిడవు. ఖాళీ గది, విరామం; త. విడై. విడివడు, వేరగు.

<క. బిడుకు.

**బిడుతాడు** రూ.చూ. బిడితాడు. వి. పరాన్ని నొగలకు బిగించే తాడు

**బిడువు** రూ.చూ. బిడుగు. విశే. అవకాశంఉన్న; వి. 1. విశ్రాంతి; 2. బీడు; 3. ఖాళీ జాగా; 4. బావిలో మట్టి పడకుండా చుట్టూ మట్టి ఎత్తిన భాగం.

**బిడె** రూ.చూ. బిడ్డ. వి. 1. బిడ్డ, శిశువు; 2. సంతానం.

**బిడెత్తు** చూ. బిడి².

**బిడెము** రూ.చూ. బిడియము. వి. సిగ్గు. ఉ.రా. 6.62.

**బిడ్డ** రూ. బిడ, బిడె, బిడ్డె. వి. 1. అపత్యం, సంతానం. కు.సం. 2.4; 2. కొడుకు. నె.గా. నెల్లూరు. 30. క్రీ.శ. 1268; 3. శిశువు. శృం.నై. 1.110; 4. కూతురు. కాశీ. 7.49.

క. బిడె. గౌరవం.

**బిడ్డకుట్టు** వి. ప్రసవ వేదన, బిడ్డను కనేటప్పటి నొప్పులు. కాశ. 3.26. **బిడ్డగలవారు** విశే.బ.వ. సంతానవతులు. కు.సం. 8.137. **బిడ్డఁడు** వి. 1. కొడుకు. బసవ. 1.510 పం.; 2. శిశువు. కాశీ. 4.13. **బిడ్డతరము** వి. వంశపారంపర్యం. ద.హిం.శా.సంపు. 10. శా.సం. 416, క్రీ.శ. 1267. **బిడ్డతల్లి** వి బాలెంతరాలు, నవప్రసూత. **బిడ్డను గిల్లి తొట్లను ఊచు** స.క్రి. బాధను కలిగించి వట్టి ఓదార్పులు ఓదార్చు. **బిడ్డపాపలు** వి.బ.వ. సంతానం. హంస. 1.214. **బిడ్డపాపసందడి** వి. ఇంట్లో పిల్లలు నిండుగా ఉండటం. హంస. 4.78. **బిడ్డపాలవేళ** వి. సేద్యపు పనులు చేసే బిడ్డతల్లులు మధ్యన ఇంటికి పోయి బిడ్డలకు పాలు ఇచ్చి వచ్చే వేళ. **బిడ్డపాలు** వి. పల్లెల్లో శ్రీమంతమైన సంసారం, పేదల చంటి బిడ్డలకు ఉచితంగా పోసే మేలైన పాలు. **బిడ్డపేరుపెట్టు** అ.క్రి. సంతానంగా భావించు. రామాభ్యు. 7 272. **బిడ్డబిడ్డతరము** వి. పిల్లపిల్ల తరం, వంశ పరంపర. నె.గా. ఒంగోలు. 145. భీమ. 5.81. **బిడ్డమెతుకు** వి. పల్లెల్లో శ్రీమంతమైన సంసారం, పేదల చంటిబిడ్డలకు ఉచితంగా పెట్టే వరి అన్నం. **బిడ్డసౌంగ్యము** వి. పురిటి పండుగనాటి శాస్త్రోక్తవిధి.

**బిడ్డి** రూ. బిడ్డీ. వి. చిన్న బిందె, చిన్న కుండ.

త. పిట్టి. చిన్న గంప.

**బిడ్డిపట్టి** వి. పాలు మరగబెట్టుకోవటానికి వాడే చిన్న మట్టిపాత్ర.

**బిడ్డీ** రూ.చూ. బిడ్డి. వి. పెద్ద వెండిచెంబు.

**బిడ్డె** రూ.చూ. బిడ్డ. వి. బిడ్డ, కొడుకు, బిడ్డడు. రామాభ్యు. 2.5.

**బిండ** వి. ఉన్ని కదురుకు దారం చుట్టుకొనే వైపు ఉండే గుండ్రటి కొయ్యబిళ్ళ.

బెం.ఒ. బిండా; బీ. బిరా; హిం. బిరా; మరా. బిండా. కట్ట, చుట్ట.

<మరా. బిండా.

**బితుకు** వి. భయం.

సం. భీతి-. భయం.

<సం. భీతి-.

**బిత్తరపుపాటు** చూ. బిత్తరము.

**బిత్తరపుఁబములు** చూ. బిత్తరము.

**బిత్తరపోవు** చూ. బిత్తరము.

**బిత్తరము** వి. 1. విలాసం, సౌందర్యం. భాగ. 6.378 ; 2. నాట్యవిశేషం. నిరంకు. 2.9 ; 3. తళతళ, కాంతివిశేషం. వసు. 3.154 ; విశ. 1. చంచలమైన. ప్రబోధ. 4.7 ; 2. సరసం, విలాసంకల. అని. 2.27 ; 3. సుందరమైన, చక్కనైన. విజయ. 1.81.

సం. విస్తార-. విస్తారం ; ప్రా. విత్థార-. ప్రపంచం, విస్తారం. ప్రసరించటం ;

క. బిత్తర. విలాసం, బిత్తరి, బిత్తారి. విలాసిని ; మ. విత్థారం. విస్తృతి.

<ప్రా. విత్థార-.

**బిత్తరపుపాటు** వి. సరసత. కువ. చ. 5.5. **బిత్తరపు(జమలు** (-వమలు) వి.బ.వ. పున్నకక్రీడ. నీల. 3.10. **బిత్తరపోవు** అ.క్రి. చలించు. **బిత్తరములాడు** అ.క్రి.వ్యాపించు. విష్ణుపు. 3.10. <బిత్తరము+-లు+ఆడు. **బిత్తరించు** అ.క్రి. 1. అతిశయించు. భీమ. 1.117 ; 2. చలించు, ఊగాడు, అదరు. భీమ. 3.19 ; 3. వ్యాపించు, ప్రసరించు. భీమ. 4.140 ; 4. సరసమాడు. క్రీడా. 37 ; 5. మిలమిల్లు, ప్రకాశించు, తళతళలాడు. ద్వి. పరమ. వి. 5.398 ; 6. తహతహపడు. సీలా. 2.118.

**బిత్తరి**[1] చూ. బిత్తరము. వి. 1. ఆటద్దం. శివరా. 4.58 ; 2. శృంగార చేష్టకల ఆడది, విలాసిని, స్త్రీ. వసు. 6.14 ; 3. మాయ ; విశ. మనోహరమైన. వరాహ. 11.37.

క. బిత్తరి.

<బిత్తరము+-ఇ[3].

**బిత్తరికాడు** వి. విలాసవంతుడు. తాళ్ల. సం. 15.84.

**బిత్తరిజింకదాల్పు** వి. చంద్రుడు, హిమాంశువు.

**బిత్తరి**[2] చూ. బిత్తరము. వి. మల్లబంధవిశేషం. ప్రబంధ. 81.

**బిత్తరించు** చూ. బిత్తరము.

**బిత్తల** రూ.చూ. బిత్తలి. వి. దిసమొల.

**బిత్తలగు** అ.క్రి. దిగంబరమగు. తాళ్ల. సం. 9.67. <బిత్తల+అగు.

**బిత్తలి** రూ. బిత్తల. విశ. దిసమొలవాడు, దిగంబరుడు, దిగంబరి. హంస. 2.62.

**బిత్తెర** వి. చక్కిలాలు మొదలైన భక్ష్యాల్ని వేయించేపాత్రలో నుంచి పైకితీసే సాధన విశేషం. ఆం. భా. 2.244.

**బిదకలు** వి.బ.వ. దుమ్ములు కలిసిన మాంసం.

సం. విదారణ-. చీల్చటం ; హిం. విదక్‌నా. చీలటం, గాయమవటం.

**బిదర** రూ.మా. బోదారి. వి. 1. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు ; 2. దోనెమలుపు తరవాత ఉన్నభాగం ; 3. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె.

**బిదరకుండ** రూ. వెదురుకుండ. వి. మూడు మూతలకుండ, పొలాల్లోకి జింకలు, నక్కలు మొ. జంతువులు రాకుండా భయపెట్టటానికి వికృతాకారంగా సున్నం పూసి బొగ్గుతో చుక్కలు పెట్టి పెట్టే మట్టిపాత్ర.

**బిదియ** వి. విదియ. తిథుల్లో రెండవది. క్రీ.శ. 625-50.

సం. ద్వితీయా. రెండవది, పక్షంలో రెండోరోజు ; ప్రా. బిఇఅ. పక్షంలో రెండోరోజు ;

క. బిదిగె.

<సం. ద్వితీయా.

**బిదురుకట్టె** రూ.చూ. బిదురుకట్టె. వి. ఆము కాలేటప్పుడు ఆముపైన రంధ్రాలు పడకుండా మసిని దట్టించటానికి కాల్పు తరవాత పైకుండల్ని తీయటానికి వాడే వెదురు కట్టె.

**బిదురుకట్టె** చూ. వెదురు. రూ. బిదురుకట్టె. వి. 1. ఆముకాలే టప్పుడు ఆముపైన రంధ్రాలు పడకుండా మసిని దట్టించటానికి కాల్పు తరవాత పైకుండల్ని తీయటానికి వాడే వెదురు కట్టె ; 2. సారెను తిప్పటానికి కుమ్మరి ఉపయోగించే పొడుగు కర్ర.

**బిదురుపీచరు** చూ. వెదురు. వి. సన్ననిఆకులు కలిగిన ఒక రకం చెట్టు (Grearia hisuta).

**బిదుర్లు** చూ. వెదురు. వి.బ.వ. పెండెకట్టులో వాడటానికి చీల్చిన వెదురుబద్దలు.

**బిదువు** వి. విశ్రాంతి.

**బిద్దము**[1] విశ. 1. బద్ధమైన, భిన్నమైన. కాశీ. 6.21.

సం. విద్ధ-. బద్ధమైన ; ప్రా. విద్ధ-. భేదించు ;

క. బిద్ద.

<ప్రా. విద్ధ-.

**బిద్దము**[2] విశ. వేరైన, అన్యమైన. పి. శకు. 4.124.

సం. భిద-. వేరు, భిన్న. వేరయిన ; ప్రా. భిద, భిద-.

<ప్రా. భిద్.

**బిద్దియ** రూ.చూ. బిద్దె. వి. నరకం, దుర్గతి.

**బిద్దు** అ.క్రి. చచ్చు. సారంగ. 1.107.

క. బిరి (బిద్దె-, బిర్ద-, బిద్ద-). పడు, చచ్చు, బిరి (జ)ము, బిరిసు. పడేట్లుచేయు, బిట్టు. పాటు ; కొడ. బు.ళ్-. (బ,ద్-, బద్ద-). పడు. బుడు-. (బుద్దోళ్-). కింద పడుకొను ; బు.క్- (బు.కి-). పడిపోవు (చెట్టు), పోయు ; తు. బూదుని. పడు, చచ్చు ; త. విఝ (-ఎ్-,-న్త్-). విళ్ (-ఎ్-,-న్త్-). పడు, కిందపడు, జబ్బుపడు, నశించు, చచ్చు. విఝ (ప్ప-, త్త-), విళ్ (ప్ప-, త్త-). కిందపడేటట్లుచేయు, కిందవిసురు, చచ్చేటట్లు చేయు, విఝుత్తు (విఝుత్తి-), విళ్ త్తు (విళ్ త్తి-). పడేటట్లు చేయు ; మ. విఝుక. పడు, పడిపోవు, బయటికి వచ్చు, నశించు, విఝక్క. పడేటట్లుచేయు, విళ్ త్తుక. పడేటట్లు చేయు, నీళ్ళుచేయు ; కో. విగ్-. (విడ్త్-). పడు, వి.క్-. (వి.క్క్-). పడనిచ్చు, పడిపోవు ; తొ. విడ్- (విడ్ఫ్-). పడు, (జంతువు) చచ్చు. వి. స్క్- (వి. స్క్క్-). చంపు (జంతువు) ; కుఇ. ప్లీవ (ప్లీత్-). కొండ లేక పర్వతం దిగు, ప్లివ్వు (ప్లివ్త్-). దిగేటట్లుచేయు, కిందికిదెచ్చు ; కువి. ప్లిఆలి. దొర్లిపైనపడు ; బ్రా. బిటింగ్. కిందికివచ్చు, తగ్గు (మంచు) కురియు, విసరు, కిందవిసరు.

<మూ. ద్రా.* పిళ్-, *విళ్- ఎ్-.

**బిద్దె** రూ. బిద్దియ. వి. నరకం, దుర్గతి. ఆం. భా. 1.150.

**బిద్దెము** వి. ఆట.

సం. విద్యా. చదువు, జ్ఞానం ; ప్రా. విజ్జా ; నే.

బిజావా. మాంత్రికుడు.

బిద్దెమువాఁడు విశే. ఆటవల్ల జీవించే ఒకానొక జాతివాడు. హంస. 3.28.

**బిరబిర** క్రి. విశే. త్వరగా. ధ్వన్యను.

**బినామీ** వి. తనపేరు మీద మార్చుకోవటం.
హిం. ఉ. బనామ్. ఇంకోపేరు మీద మార్చుకోవటం.
<ఉ. బనామ్.

**బినామీదారుడు** వి. తనపేరు కలిగినవాడు.
ఉ. పార. బనామిదార్. తనపేరుమీద ఫిరాయించుకొన్నవాడు ;
క. బినామె.
<ఉ. బనామీదార్.

**బినుగు** వి. వేటగాడు. సారంగ. 1.187.

**బింతి** రూ.చూ. బంతి[2]. వి. పంక్తి.

**బిందమగు** చూ. బిందము[2].

**బిందము[1]** వి. 1. సమూహం, గుంపు. కు.సం. 6.104 ; 2. బృందం. నర.సా.సం. 1.30.
సం. బృంద-. సమూహం, గుంపు ; ప్రా. బింద- ; క. బింద.
<ప్రా. బింద-.

**బిందము[2]** వి. 1. ఉపద్రవం, ఆపద. కు.సం. 5.88 ; 2. విరగటం. కు.సం. 8.16 ; 3. భేదం.
సం. భిన్న-. పగలగొట్టబడినది, శిథిలమైనది, భింద్. పగలగొట్టు ; ప్రా. భింద-. భేదించు, విభజించు, భిందణం. ఖండనం, విచ్ఛేదం ; అ.మా. భింద్.
<ప్రా. బింద-.
బిందమగు అ.క్రి. భిన్నమగు, భిన్నం ఏర్పడు. <బిందము[2]+అగు.

**బిందానంపొయ్యి** వి. ఒకే మంటతో రెండు పాత్రలతో ఉడకటానికి వీలుగా చేసిన జంట పొయ్యి.
సం. బిందు-. చుక్క.
<సం. బిందు+అను+పొయ్యి.

**బింది** రూ.చూ. బిందె[1]. వి. నీళ్ళు తెచ్చుకొనే లోహపాత్ర.
బిందికడవ రూ.చూ. బిందెకడవ. వి. నీళ్ళు తెచ్చుకోవటానికి బిందెలాగుండే మట్టిపాత్ర. బిందికుండ రూ.చూ. బిందెకుండ. వి. నీళ్ళు తెచ్చుకోవటానికి బిందెలాగ ఉండే మట్టిపాత్ర. బిందిపాము వి. బల్లివంటి చిన్న పాము.

**బిందిగం** రూ.చూ. బిందె[1]. వి. నీళ్ళు తెచ్చుకొనే లోహపాత్ర.

**బిందిగె** రూ.చూ. బిందె[1]. వి. నీళ్ళ కుపయోగించే తామ్రపాత్ర.

**బిందిచుట్టు** స.క్రి. గుండ్రంగా చుట్టు. అష్టమ.క. 4.945.
సం. బిందు-. చుక్క.

**బిందించు** స.క్రి. 1. (నీళ్ళు) చల్లు, నివేదించు. సిం.ద్వా. 4.234 ; 2. చిలుకు.
సం. బిందు-. చుక్క.
<సం. బిందు+-ఇంచు[3].

**బిందియ** రూ.చూ. బిందె[1]. వి. గొంతు సన్నంగా ఉండే లోహపాత్ర విశేషం. బిందె. యయా. 4.86.

**బిందీ** వి. చేరుచుక్క, లలాటభూషా విశేషం. కృష్ణా. 3.
సం. బిందు-. చుక్క, బొట్టు ; హిం. బిందీ. బిందువు. తిలకం.
<హిం. బిందీ.

**బిందె[1]** రూ. బింది, బిందిగం, బిందిగె, బిందియ, బెందె. వి. గొంతు సన్నగా ఉండే లోహపాత్ర విశేషం. పల్నా.వు. 71.
సం. బిందుక-. బొట్టు, చుక్క ; ప్రా. బిందుఇఅ. బిందుయుక్తం ;
క. బిందిగె ; మ. వింతె.
<ప్రా. బిందుఇఅ.
బిందెకడవ రూ. బిందికడవ. వి. నీళ్ళు తెచ్చుకోవటానికి బిందెలాగా ఉండే మట్టిపాత్ర. బిందెకుండ రూ. బిందికుండ. వి. నీళ్ళు తెచ్చుకోవటానికి బిందెలాగ ఉండే మట్టిపాత్ర. బిందెకూజా వి. బిందె ఆకారంలో ఉండే నీళ్ళ కూజా. బిందెసొర వి. సొరకాయల్లో ఒకరకం.

**బిందె[2]** వి. పాపటి బొట్టు.
హిం. బిందియా, బిందీ. నొసటిమీద ధరించే ఒక ఆభరణం, బొట్టు, తిలకం.
<హిం. బిందీ.

**బిన్నసరాలు** వి.బ.వ. ఆభరణ విశేషం. పల్నా.వు. 72.
సం. భిన్నసర-. (కూడిన) దండ.
<సం. బిన్నసర-+-ము+-లు.

**బిన్నా** అవ్య. తొందరగా.
సం. వినా. లేకుండా ; హిం. బినా. విడిచి, లేకుండా.
<హిం. బినా.

**బిన్నించు** స.క్రి. ఎదిరించు.
సం. భిన్న-. వేరు.
<సం. బిన్న-+-ఇంచు[3].

**బిన్నిరెక్క** చూ. బిన్నీ. వి. గండెవాటురెక్క.

**బిన్నీ** వి. తలుపు చెక్కలను కదిపించటానికి వాడే రెండు వైపులా పదునున్న తీగమేకు.
ఇం. *Pin*. గుండుసూది, మేకు.

**బిబ్బరించు** రూ.చూ. బొబ్బరించు. అ.క్రి. (పులి) కూయు.
బిబ్బరింత రూ.చూ. బొబ్బరింత. వి. పులికూత. బిబ్బరిల్లు అ.క్రి. పులికూత కూయు.

**బిబ్బరింత** చూ. బిబ్బరించు.

**బిబ్బరిల్లు** చూ. బిబ్బరించు.

**బిబ్బిలికాయ** వి. ఆభరణ విశేషం, స్త్రీ కాలి మూడవ వేలి నగ. కళా. 7.66.

**బిబ్బి[1]** రూ. బీబి, బీబీ, బూబు. వి. 1. తురుష్క స్త్రీ. క్రీడా. 33 ; 2. మహమ్మదీయుల అంతఃపురంలో ఉండే కులీన స్త్రీ. వసు. 1.49.
హిం.ఉ. బీబీ. ముస్లిం స్త్రీ.
<ఉ. బీబీ.

**బిబ్బి[2]** వి. తోరణం.

**బిబ్బుకడుపువేల్పు** వి. వినాయకుడు.

**బిమ్మిటి** వి. 1. మిరుమిట్లుగొల్పు. భార.కర్ణ. 18 ; 2.

పారవశ్యం, వివశత. భాస్క.రా.సుందర. 29.

సం. √భ్రమణ-. తిరగటం.

బిమ్మిటిగొను (-కొను) అ.క్రి. వివశత్వం. భార.ద్రోణ. 2.147. బిమ్మిటిపోవు (-పోవు) అ.క్రి. 1. మూర్ఛిల్లు. భాస్క.రా.యు. 1192 ; 2. వివశత్వంపొందు.

బిమ్మిరితెగులు వి. మిరపతెగులు.

బియము రూ. బియ్యము, బీయము. వి. తండులాలు, ఏను మానికల బియ్యం. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 143. క్రీ.శ. 1225.

క. బియ. పొట్టు తీసిన ధాన్యం, ఆహారం ; త. వియమ్. విత్తనం, ధాన్యం ; కొలా. బి.అమ్ (బహు. బిఅల్). ధాన్యం.

పో.చూ. సం. బీజ-. విత్తనం, ప్రా. బీఅ.

బియమువడి వి. దేవునికి నిత్య నివేదనకై వండే అన్నానికిచ్చే బియ్యం పడి. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 257. క్రీ.శ. 1230.

బియ్యంగంజి చూ. బియ్యము.

బియ్యవ అవ్య. తొందరగా. ధ్వన్యను.

బియ్యంవిండుకొను చూ. బియ్యము.

బియ్యపుగంజి చూ. బియ్యము.

బియ్యపుజొన్న చూ. బియ్యము.

బియ్యము రూ.చూ. బియము. వి. వడ్లు దంచి చెరగగా వచ్చిన పదార్థం. రం.రా.ఉ. 174 పు. 8 పం., కాశీ. 5.65.

బియ్యంగంజి రూ.చూ. బియ్యపుగంజి. వి. బియ్యం ఉడకబెట్టి వార్చిన నీళ్ళు. బియ్యంవిండుకొను అ.క్రి. బియ్యం అయిపోవు. బియ్యపుగంజి రూ. బియ్యంగంజి. వి. బియ్యం ఉడకబెట్టి వార్చిన నీళ్ళు. బియ్యపుజొన్న వి. తెల్లజొన్నల్లో ఒకరకం.

బిరంజి రూ. బిరింజి. వి. భక్ష్య విశేషం. ప్రబంధ. 114.

ఉ. బిరింజ్. బియ్యం; పార. బిరింజ్. బియ్యం. బిరింజిపమాలా. ఒకవిధమైన కూర.

< ఉ. బిరింజ్.

బిరడ రూ. బిరడా, బిఱడ, బిఱడు. వి. 1. వీణ మొ. వాటి తంతి చుట్టే తరిమెన కొయ్య. వైజ. 1.118 ; 2. బుడ్డి, సీసా మొ. వాటికి పైనున్న మూత. హంస. 4.191 ; 3. గోడ కట్టుబడిలో మధ్యవేసే చిన్న రాతి ముక్క.

క. బిరడి, బిఱడె (బిరడె). వీణ మొ. సంగీత సాధనాల తంతిచుట్టే తరిమెన కొయ్య, లోహంలేక చెక్క బిరడా.

< క. బిఱడె.

బిరడా రూ.చూ. బిరడ. వి. 1. వీణ మొ. వాటి తంతిచుట్టే తరిమెన కొయ్య ; 2. బుడ్డి, సీసా మొ. వాటికి పైనున్న మూత.

బిరడాబెట్టు(-పెట్టు) అ.క్రి. పూనిన దయ్యాన్ని వదిలించు. బిరబిర రూ.చూ. బిఱబిఱ. వి. తివ్వటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. ఆం.భా. 1.124 ; క్రి.విశే. అతి త్వరితంగా. ప్రబంధ. 81.

బిరా రూ.చూ. బిరాన. క్రి.విశే. త్వరితంగా. ఆం.భా. 3.71.

బిరాన రూ. బిరా, బిరాల, బిజాన, బిజీన. బెరాన. క్రి.విశే. త్వరితంగా. చంద్రాంగ. 2.102.

హిం.ఉ. బిరాన్, బిరానా, బేగానా. వేరైన, పరాయి, తెలియని.

< ఉ. బిరానా.

బిరాల రూ.చూ. బిరాన. వి. తొందరగా, బిరాన.

బిరాలున రూ.చూ. బిరాల్న. క్రి.విశే.ప్ర. శీఘ్రంగా. చెన్నబసవ. 3.72.

బిరాల్న రూ. బిరాలున, బిరీలున. బిజీలున. క్రి.విశే.ప్ర. శీఘ్రంగా. క్రీడా. పీఠి. 53.

బిరి రూ.చూ. బరి$^{4}$. వి. రేఖ. గీత.

బిరిగీయు అ. క్రి. పెద్ద సైజు దానలు, తొట్లు మొ.వి చేయటానికి ముందు రేఖారూపం ఏర్పరచుకొను.

బిరికి వి. 1. కంఠభూషా విశేషం ; 2. మంచాలకు, కుర్చీలకు అందంకోసం పక్కల్ని వేసే చెక్క తయారుచేసే చిన్న చిన్న కర్రముక్కలు.

బిరిగాయలు(-కాయలు) వి.బ.వ. బాలక్రీడావిశేషం. ఇందు. 2.18.

బిరింగా విశే. రంగు రంగులుకల.

హిం. బిరంగ్. రంగురంగుల. రంగులేని, చిత్ర విచిత్రాలుగా చేయబడ్డ.

< హిం. బిరంగ్.

బిరింజి రూ.చూ. బిరంజి. వి. భక్ష్య విశేషం.

బిరింజికాగు వి. ఒంటి అంచు ఉండే పెద్ద మట్టిపాత్ర.

బిరీలున రూ.చూ. బిరాల్న. క్రి.విశే. శీఘ్రంగా. కువ.చ. 3.11.

బిరు రూ.చూ. బిఱ్ఱు. వి. గట్టితనం.

బిరుకట్టె రూ.చూ. బిర్రుకట్టె వి. 1. ఊత్తె తాడు బిర్రుపెట్టే పొడుగు కర్ర ; 2. ఒకరకం తిరుగుడు ; 3. మరమగ్గం నిలువు పట్టెకు మేరువు పలక బిగించి తాడు వడిపెట్టేపల్ల ; 4. ఉన్నిమగ్గం దోనుగ తిప్పటానికి చిల్లిలో దూర్చిన కట్టె ; 5. నవారు నేసేటప్పుడు మగ్గానికి తగిలించిన పడుగు బిగింపుకు చుట్టిన కర్ర. బిరుచిరత వి. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిది. బిరుచెక్క రూ.చూ. బిర్రుచెక్క. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చుపడులలో బిర్రుపెట్టే కొయ్య చెక్క. బిరుతాడు రూ.చూ. బిర్రుతాడు. వి. 1. రాట్నం ఆకులకు చుట్టిన తాడు ; 2. రాటి ఆకులు పైపై కిందిపీ కలిపి కట్టిన దారం ; 3. అడ్డగుమ్మి ఆకులను కలిపి కట్టిన తాడు ; 4. మగ్గం ఉరతకు పైన కట్టిన దారం ; 5. ఒసి కర్రలపై వేసిన సర్నాలకు పారుపట్టెకు కట్టేతాడు. బిరుతిరుగర రూ.చూ. బిరుతిరుగుడు. వి. నేతబట్టమీద చేయబడ్డ అమర్చి బిర్రుపెట్టే ఉంగరం. బిరుతిరుగుడు రూ. బిరుతిరుగర. వి. నేతబట్టమీద చేయబడ్డ అమర్చి బిర్రుపెట్టే ఉంగరం. బిరుదబ్బ వి. 1. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిబద్ద ; 2. పన్నెకట్టుబడిలో కిందిబద్ద ; 3. పన్నెకట్టుబడిలో ఊసెపుల్లల వరసకు చివర బిగించిన

పెరల్పు బద్ద; **4.** అచ్చుతీకేటప్పుడు అచ్చు క్రలకు ఆధారంగా నిలబెట్టిన పల్ల. **బిరుదాపు** వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో పై బద్ద. **బిరువారం** వి. **1.** అచ్చు కట్టేటప్పుడు పడివారాల బిగింపుకు అచ్చుక్రమీది మెలి కల్లో దూర్చిన పురివారం; **2.** నేతబట్టమీద చేతుక్రలను అడ్డంగా బి్రుపెట్టే పొడుగువారం. **బిరుబద్ద** రూ.చూ. బి్రుబద్ద. వి. అచ్చుతీకేటప్పుడు అచ్చుక్రలకు ఆధారంగా నిలబెట్టిన పల్ల. **బిరుబల్ల** వి. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దల్లో కిందిబద్ద. **బిరుబుల్ల(-పుల్ల)** రూ.చూ. బి్రుపుల్ల. వి. ఆసుపీటల బిగింపుకు వేసే కొయ్యపేడు. **బిరుమిట్ట** వి. పంటె ఆకుల బిగింపుకువేసే అడ్డబద్దల్లో కిందిబద్ద. **బిరుసిట్టె** రూ.చూ. బి్రుచిట్టె. వి. **1.** పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద; **2.** పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్దల్లో కిందిది.

**బిరుక్కన** క్రి.విశ.్రదు. శీఘ్రంగా. సుద. 5.159.

**బిరుదపెనలు** వి.బ.వ. ఒకరకం పెనలు.

**బిరుదందె** చూ. బిరుదు.

**బిరుదాయత్తు** చూ. బిరుదు.

**బిరుదావళి** చూ. బిరుదు.

**బిరుదు** విశ. **1.** సమర్థుడు. కు.సం. 10.119; **2.** ధీరుడు. భార. ఉద్యో. 3.35; **3.** శూరుడు. భార. భీష్మ. 2.5; **4.** సమర్థురాలు; వి. **1.** శౌర్యం. భార. విరా. 3.60; **2.** శౌర్యచిహ్నం, సామర్థ్య చిహ్నం. భార. కర్ణ. 3.176; **3.** సామర్థ్యం, శక్తి. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 233, భార.స్త్రీ. 2.98; **4.** వాదం, చర్చ. భాగ. 10 పూ. 1602; **5.** పౌరుషవాక్యం. పరమ. 5.169; **6.** మదం, గొవ్వ.

క. బిరిదు, బిరుద, బిరుదు. కీర్తి, గౌరవచిహ్నం, అత్యాధిక్యం, సాహసం. బిరిద. అత్యాధిక్యతగలవాడు; తు. బిర్దు, బిర్దావలిగె. గౌరవ చిహ్నం, ప్రదర్శన, గౌరవం; త. విరుతు. బిరుదు, పతాకం, విజయచిహ్నం, వంశ పరంపర; మ. విరుతు. ధైర్యం, పోటీలో జయించి తెచ్చిన బహుమతి, జయచిహ్నం; విరుతన్. అన్ని విద్య లలో ఆరితేరిన సైనికుడు.

చూ. సం. బిరుద-, విరుద-, బిరుదు.

**బిరుదందె** వి. గండపెండేరం. భీమ. 5.112.< బిరుదు + అందె. **బిరుదాయత్తు** విశ. బిరుదుగలవాడు. ఆం.భా. 3.26.< బిరుదు + ఆయత్తు. **బిరుదావళి** వి. ఉత్తర ప్రత్యుత్తరాదుల్లోని వక్కణ. సం. ఆవళి-. వరస, పంక్తి. < బిరుదు + సం. ఆవళి-. **బిరుదుకెక్కు** అ.క్రి. ప్రసిద్ధి చెందు, పేరుగాంచు. తాళ్ల. సం. 12.30.< బిరుదు + -కున్ + ఎక్కు. **బిరుదుగద్యము** వి. ఒకరకమైన బంగారు నాణెం, రాజలాంఛన చిహ్నంగల బంగారునాణెం. ద.హిం. శా. సంపు. 4. శా.సం. 944. క్రి.శ. 1144. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 60. క్రి.శ. 1153. **బిరుదుగద్యలు** వి.బ.వ. ఒకవిధమైన బంగారు నాణేలు. దశా. 4.943. **బిరుదుచదురు** వి. అతినేర్పరి. కళా. 1.184. **బిరుదుతనము** వి. సామర్థ్యం. భార. విరా. 1.95. **బిరుదుమాడలు** వి.బ.వ.రాజ లాంఛన చిహ్నంగల నాణేలు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 147. క్రి.శ. 1156. **బిరుదులాడు** విశ. **1.** పౌరుషవాక్యాలుకలవాడు. భీమ. 2.7; **2** ప్రజ్ఞావంతుడు. < బిరుదు + -లు + వాఁడు. **బిరుదుశూరుడు** వి. పేరుబడ్డ శూరుడు. పల్నా. పు. 61. **బిరుదెక్కు** స.క్రి. మదించు. నవనాథ. 1.35పు. 4పం. < బిరుదు + ఎక్కు.

**బిరుదెక్కు** చూ. బిరుదు.

**బిరుసవ** చూ. బిరుసు[1].

**బిరుసు**[1] రూ.చూ. బిఱుసు. విశ. **1.** క్రూరమైన. హర. 7.38; **2.** అధికం. కాశీ. 3.12; **3.** తీక్ష్ణం, వాడిమైన. జైమినిభా. 5.56; **4.** పరుషం, గట్టి, కఠినం, గరుకు. కాశీ. 2.69; **5.** ఉద్ధతమైన. సు. శ. 75; వి. **1.** కాఠిన్యం, పారుష్యం. భాస్క. రా. అరణ్య. 1.151; **2.** పౌరుషం, శౌర్యం. భాగ. 5.10. ఉ. 161; **3.** ఉద్ధతి. ఉడుకు. రాఘవ. 4.209; **4.** గట్టితనం; **5.** పదును ఆరకుండా మెత్తగా ఉన్నప్పుడు పోగులు దువ్వటానికి వాడే చిన్నకుంచె; **6.** బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగా పొడుగ్గా అడుగున రంధ్రం పెట్టి చేసిన మట్టి బుడ్డి.

**బిరుసన** వి. బిరుసుతనం, కాఠిన్యం. నవనాథ. 1.9పు. 2పం. **బిరుసునేల** వి. ఎండితే బిగుసుకు పోయే బంకమట్టి నేల. **బిరుసుబుడ్డి** వి. బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగా పొడుగ్గా అడుగున రంధ్రం పెట్టిచేసిన మట్టిబుడ్డి. **బిరుసులు** వి.బవ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.

**బిరుసు**[2] వి. ఒకవిధమైన బాణసంచు. ప్రబంధ. 77.

క. బిఱసు, బిఱిసు, బిఱుసు. తిప్పేది, తారాజువ్వ పగులుతూ ధ్వని నిచ్చేవి (సీమటపాకాయలు); త. విఱిచు. తారాజువ్వ.

< క. బిఱుసు.

**బిరుసు్రగోవి (-్రకోవి)** వి. చిచ్చుబుడ్డి, ఒకవిధమైన బాణసంచు. కళా. 8.121.

**బిరేంజబాన** వి. ఒంటిఅంచు ఉండే పెద్దమట్టిపాత్ర.

**బిర్ఘు** వి. దావిమట్టు గోడ కట్టుబడి చేయవలసిన గుంత్రటి స్థలం.

**బి్ర** రూ.చూ. బిఱ్ఱు. వి. గట్టితనం.

**బి్రవ** చూ. బిరా. అవ్య. తొందరగా.

**బి్రు** రూ.చూ. బిఱ్ఱు. వి. **1.** నీళ్ళుపోసి తొక్కిన మట్టియొక్క బిగువు లేదా గట్టితనం; **2.** ఆములో కుండలను పేర్చే టప్పుడు కుదురుపైన చుట్టూ దానిపైన బోర్లించే కుండ; **3.** పడుగు బిగింపుకోసం బి్రుకట్టెకు వేసినతాడు; **4.** పట్టె పడుగు సరిచెయ్యటానికి ఊడ్డెను నిలబెట్టి కొడితాన్ని కిందిగూటాన్ని కలిపేతాడు; **5.** గట్టిదనం.

**బి్రుకట్టె** రూ. బిరుకట్టె. వి. **1.** ఊడ్డెతాడు బి్రుపెట్టే పొడుగుకర్ర; **2.** ఒకరకం తిరుగుడు; **3.** మరమగ్గం నిలువు పట్టెకు మేరువు పలక బిగించి తాడువడిపెట్టే పల్ల; **4.** ఉన్నిమగ్గం దోనుగ తిప్పటానికి చిల్లిలో దూర్చినకట్టె; **5.** నవారు నేసేటప్పుడు మగ్గానికి తగిలించిన పడుగు బిగింపుకు చుట్టినకర్ర; 6 కోడిపీటల బంకికి దొంకి పట్టె

నుంచి కాడివరకు ఉన్నబాగ; 7. నిచ్చెన నిలువుకఱ్ఱలు. బిర్రుకట్టెమొల వి. బిర్రుకట్టెచెక్కకు కాడుకట్టిన చివరి బాగం. బిర్రుకాల్పు వి. ఆములో కుండలు మొదలగునవి ఎక్కువగా కాలటం. బిర్రుగతి వి. బిర్రుకట్టెను ఊత్తైఅర్ధ పట్టెకు వడుగేరే కఱ్ఱలకు కలిపి కట్టేతాడు. బిర్రుగూటం వి. ఒకరకం తిరుగుడు. బిర్రుచన్ను వి. బిరుసుచన్ను. బిర్రు చిట్టె రూ. బిరుసిట్టె. వి. 1. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద; 2. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్దలో కింవిది. బిర్రుచిల్ల రూ. బిర్రుసిల్ల. వి. మరమగ్గం నిలువు పట్టెకు మేరుపు పలక బిగించి తాడు వడిపెట్టే పల్ల. బిర్రు చెక్క రూ. బిరుచెక్క. వి. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య. బిర్రుతాడు రూ. బిరుతాడు. వి. 1. వడుగును నరిగుంజకు బిగించి కట్టినతాడు; 2. మర మగ్గం నిలువ పట్టెను మేరువ పలకకు బిగించి నన్నపల్లకో వడి పెట్టిన దారం; 3. నేత బట్టమీద చేదుకఱ్ఱలను అడ్డంగా బిర్రుపెట్టే పొడుగుదారం. బిర్రుపలక వి. జంటక్కడి లొట్టలు దూర్చే పలక. బిర్రుపుల్ల చూ. బిరు బుల్ల. వి. 1 అచ్చుతికేటప్పుడు అచ్చుకఱ్ఱలకు ఆధారంగా నిలబెట్టిన పల్ల; 2. మరమగ్గం నిలువపట్టెకు మేరువ పలక బిగించి తాడు వడిపెట్టే పల్ల. బిర్రుపొట్ట వి. ఆకుల మరు గున ఉబ్బెత్తుగా కనబడే కంక. బిర్రుబద్ద రూ. బిరుబద్ద. వి. పంటెఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద. బిర్రుమన్ను వి. సిమ్మెంటు మాదిరి బిగిబాగా ఇచ్చేమన్ను. బిర్రుపిల్ల (-చిల్ల) రూ.చూ. బిర్రుపిల్ల. వి. మరమగ్గం నిలువుపట్టెకు మేరువుపలక బిగించి తాడు. వడిపెట్టే పుల్ల. బిర్రుపీల (-చీల) వి. పత్తిరాట్నం కోలను నిలువకు బిగించిన పల్ల. బిర్రేయు అ.క్రి. 1. ఆములో కుండలను పేర్చేటప్పుడు కుదుర్లపైన సుట్లు కట్టిపైన కుండల్ని బోర్లించు; 2. కాలితో తొక్కు. <బిర్రు + వేయు.

బిర్రేయు చూ. బిర్రు.

బిర్చిబుర్లు వి.బ.వ. పూలువచ్చే మందుబుడ్డి.
హిం. బిర్చ్. చెట్టు.

బిర్సు రూ.చూ. బిఱుసు. వి. బొంగరం ఆకారంలో మూతి చిన్నదిగా పొడుగ్గా అడుగున రంధ్రం పెట్టి చేసిన మట్టి బుడ్డి.

బిఱడ రూ.చూ. బిరడ. వి. 1. పీప. మొదలైన వాటికంతి చుట్టే తరిమెన కొయ్య; 2. బరణి, సీసా మొదలైనవాటికి పైన ఉండే మూత; 3. గోరకట్టు బడిలో మధ్యవేసే చిన్న రాతిముక్క.

బిఱడు రూ.చూ. బిరడ. వి. 1. బరణి, సీసా మొదలైన వాటికి పైనున్న మూత; 2. పీప మొదలైన వాటి కంతి చుట్టే తరిమెన కొయ్య.

బిఱబిఱ రూ. బిరబిర. వి. తిప్పటం, చుట్టటం, మొదలైన వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. సమీర. 4.13; క్రి. విశే. త్వరగా, శీఘ్రంగా. అచ్చ. రా. యు. 155.

బిఱాన రూ.చూ. బిరాన. విశే. ద్రు. త్వరితంగా.

బిఱ్ఱన రూ.చూ. బిరాన. క్రి. విశే. ద్రు. త్వరితంగా.

బిఱ్ఱలున రూ.చూ. బిరాల్న. క్రి. విశే. ద్రు. త్వరితంగా. శీఘ్రంగా. చంద్రాంగ. 5.63.

బిఱుబిఱ్ఱు వి. రాళ్ళు మొ.వి పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ఆము. 6.74.

బిఱుసగు చూ. బిఱుసు.

బిఱుసు చూ. బరుసు, బిరుసు[1], బిర్సు. వి. 1. కాఠిన్యం. భీమ. 4.107; 2. పరుసవు మాటలు. భాగ. 9 స్కం. 726; 3. బాధ. కాశీ. 2.70; 4. విధం. కళా. 8.81; 5. గర్వం. సుభ. 5.118; విశే. కఠినం. ఉ. రా. 8.109.
క. బిఱుస, బిఱుసు, బిఱుసు, బిఱు. గట్టితనం, నిశ్చలత్వం, గరుకుతనం, మోటుతనం, తీక్ష్ణం, బిఱుబు, బిఱువ్, బిఱుపు. గట్టితనం, నిశ్చలత్వం, గరుకుతనం, బెఱొ. చలివల్ల గట్టిపడటం, గాలి, వాన, దావు మొ. వి; తు. బిర్ గాళి. తుపాను, గాలివాన, బిర్సు. గట్టి, వంగని, మోటు; త. విఱప్పు. గుంపగూడు, సాంద్రత, పెరుగు, బలం, గెలుపు, విఱల్, గెలుపు, బలం, విఱెప్పు. గట్టితనం. తిమ్మిరు, వణకటం; మ. విఱక్క. చలివల్ల గట్టిగాఅగు. విఱన్ను. వంగని, విఱక్కమ్. అనహ్యం, విఱ. వణకు.
బిఱుసగు అ.క్రి. కాఠిన్యంతో ప్రవర్తించు. జైమినిభా. 3.33. <బిఱుసు + అగు. బిఱుసైనవాఁడు విశే. 1. బెట్టు సరిగలవాడు; 2. కఠిన హృదయుడు.

బిఱుసైనవాఁడు చూ. బిఱుసు.

బిఱ్ఱు రూ.చూ. బిఱ్ఱు. వి. బిగువు. భోజ. 4.309.
బిఱ్ఱబిగియు అ.క్రి. 1. మిక్కిలి బెట్టుచేయు. కాశీ. 7.50; 2. మిక్కిలి బిగిసికొను. ఉ.రా. 7.328. బిఱ్ఱబిగిసి కూర్చుండు అ.క్రి. నిటారుగా కూర్చుండు. కళా. 7.29.

బిఱ్ఱవీకాయు చూ. బిఱ్ఱు.

బిఱ్ఱు చూ. బిరుసు[1]. రూ. బిరు, బిర్ర, బిర్రు, బిఱ్ఱు, బీఱు[1]. స.క్రి. వ్యర్థంగా మాట్లాడు. కు.సం. 2.36; వి. 1. ఎండ మొ.వి కాయటంలోని అనుకరణం, భార. ఉద్యో. 4.116; 2. బిరుసుతనం, పౌరుషం. వైజ. 3.76; 3. పరవటంలో అయ్యే అనుకరణం. చంద్రాంగ. 6.92; 4. తడక బరువుగా నిలవటంకోసం తాడుకట్టి ఊడ్చి అనించే కొయ్య. వేమ. 2.418; 5. తిప్పటం మొదలైన వాటిలో అయ్యే అనుకరణం; 6. నిండు; 7. గర్వం; 8. అంక. రాజవా. 2.27; విశే. 1. అధికమైన; 2. బలమైన.
క. బిఱ్. నిశ్చలత్వం మొ.వి; గట్టితనం, తలుపు బిగించు, బిఱ్ఱు. గట్టిగా అగు, గట్టితనం, బిరుసుతనం, బిఱుసు, బిఱు; తు. బిరు. తీవ్రమైన, బలమైన, బిరుసు. బిరుసు, గట్టి; త. వెఱ. గట్టిగా నిలబడు, విఱై. గట్టిపడు (చలివల్ల); మ. విఱక్క. గట్టిగా అగు (చలి వల్ల); కో. వెర్వ్-. (వెర్-). బయట ఉండటంవల్ల తిమ్మిరి అగు; కుడు. బెడ్డ్. గట్టిగా ఉండు లేక అగు. <మూ.ద్రా. వెఱ్-.
బిఱ్ఱవీకాయు స.క్రి. తీవ్రంగా విజృంభించి కాయు. పాండు. 5.212. <బిఱ్ఱు + అను + -ఇ[13] + కాయు. బిఱ్ఱు బిఱ్ఱు క్రి.విశే. ఆకస్మికంగా, తటాల్న.

బిలబిల అవ్య. అకస్మాత్తుగా. ధ్వన్యను.
బిలబిలలాడు అ.క్రి. ముద్దు పలుకులతో ఆడుకొంటూ

కలిసి మెలిసి ఉండు. <బిలబిల+-లు+ఆడు.

**బిలబిలాక్షులు** వి.బ.వ. ఒకజాతి పిట్టలు. శ్రీనాథుని చాటువు.

**బిలముబండ** వి. గనిలో తవ్విన నాపరాయి.

నం. బిల-. గుహ.

<నం. బిల-+-ము+బండ.

**బిలమెట్లు** చూ. బల్ల. వి.బ.వ. బల్ల చెప్పులు.

**బిలహరి** రూ.చూ. బిలాహరి. వి. ఇరవైనాలుగు స్త్రీ రాగాల్లో ఒకటి.

**బిలహారిఅద్దం** వి. గాలి కిటికీని బిగించిన అద్దం.

**బిలాతీ** రూ.చూ. బిళాదీ. వి. ఒంటిమీద ఎక్కడైనా బుడిపె లాగా ఏర్పడే లావాటిగుల్ల.

**బిలాహరి** రూ. బిలహరి, బిల్లరి. వి. ఇరవైనాలుగు స్త్రీ రాగాల్లో ఒకటి. హంస. 5.123.

**బిలికి** వి. పెనవేసుకొన్న కొమ్మలు కలిగి మందుల్లో ఉపయోగ పడే ఒకరకం చెట్టు (Gardenia gummifera).

**బిలింబిచెట్టు** వి. ఒకరకం చెట్టు (Averrhoa bilimbi).

**బిలిబిలి**[1] రూ. బిలుంబి. వి. ఊరగాయకు పనికివచ్చే పుల్లని కాయలచెట్టు, పులుసుకాయచెట్టు (Averrhoa bilimbi).

క. బిలింబి. ఒకరకం చెట్టు; తు. బింబులి; కొంకణి-?- బిలంబి; మ. బ్లిమ్, బ్లింగ్.

**బిలిబిలి**[2] విశే. 1. స్వల్పం, అల్పం. పండి.చ. 1.6; 2. ముద్ద యిన. విక్ర. 1.17. ధ్వన్యను.

**బిలిబిలికాయకంబులు** వి.బ.వ. చిల్లరపనులు, నాలిపనులు. బసవ. 5.131. **బిలిబిలికృతులు** వి.బ.వ. ఎక్కువ చౌక బారుగా వెలువడే కావ్యాదులు. పండి.చ. 1.20.

**బిలుకు**[1] రూ.చూ. బిలుగు[1]. విశే. కపటమైన, మాయమైన.

**బిలుకుమారు** అ.క్రి. మాయమగు, చెడిపోవు. భార.కర్ణ. 1.5. **బిలుకుమార్చు** స.క్రి. చంపు, నాశనంచేయు. భార. శల్య. 9 89.

**బిలుకు**[2] వి. పొలంలోపడ్డ వాననీళ్ళకు మట్టి కొట్టుకుపోకుండా పొలం గట్టుచివర కట్టిన రాతికట్టడం.

**బిలుకురు** రూ. బిల్కురు. అ.క్రి. ఉరుగుడుచు, తికమకలాడు.

**బిలుకురువట్టు(-పట్టు)** స.క్రి. ఊపిరి తిరగనీయక నొక్కి పట్టు.

**బిలుగు**[1] రూ. బిలుకు[1]. విశే. మాయగల, కపటంకల. వేంక. పంచ. 1.217.

**బిలుగు**[2] వి. చవిటి నేలల్లో బాగా పెరిగే పెద్దచెట్టు. ఉష్ణ కాలంలో కొంత ప్రాంతాల్లో పుష్పిస్తుంది (The Indian satin wood tree).

**బిలుమక్తా** రూ.చూ. బిల్ముక్తా. వి. లెక్కపెట్టకుండా ఈయబడిన సొమ్ము.

**బిలుంబి** రూ.చూ. బిలిబిలి[1]. వి. తోటల్లో పెంచబడే ఒకరకం మొక్క.

**బిలువము** వి. బిల్వం, మారేడు. సాంబ. స్థా. 57,77.

నం. బిల్వ-. మారేడు; ప్రా. బిల్ల-; అ.మా. బిల్ల-.; పా. బిల్ల-. బేలువ-, బేళువ-, బెల్ల-;

క. బిల్ల, బెల్ల; తు. బెల్ల, ప్రీతి; పర్జి. విల. <నం. బిల్వ-.

**బిల్కురు** రూ.చూ. బిలుకురు. అ.క్రి. తికమకలాడు.

**బిల్మక్తా** రూ.చూ. బిల్ముక్తా. వి. మొత్తానికి ఇచ్చే గుత్త.

**బిల్మఖ్తా** రూ.చూ. బిల్ముక్తా. వి. లెక్కపెట్టకుండా ఈయబడిన సొమ్ము.

**బిల్ముక్తా** రూ. బిలుమక్తా, బిల్మక్తా, బిల్మఖ్తా. వి. లెక్కపెట్ట కుండ ఈయబడిన సొమ్ము.

హిం. బిల్‌ముక్తా. నిశ్చితం; ఉ. బిల్‌ముక్‌తా. బ+ఇల్+ముక్‌తా; పార. బిల్-ముక్‌తా. గణింప కుండా ఈయబడిన సొమ్ము; అర. బిల్‌ముక్‌తా. లెక్క పెట్టకుండా ఈయబడిన సొమ్ము.

<ఉ. బిల్‌ముక్‌తా.

**బిల్ల**[1] రూ. బిల్లిక, బిళ్ళ[1]. వి. 1. ఖండం, ముక్క. ఉ.హరి. 3.99; 2. గుండ్రనిదిండు. ఆము. 4.58; 3. కర్ణభూష విశేషం. ద్వి. నల. 8.123; 4. బిల్లిక. ఆం.రా. 1.78; 5. పలుచని, గుండ్రని వస్తువు. ఆం భా. 2.163; 6. గాదెమీద మూత వేయటానికి ఉపయోగించే గుండ్రని పలక; 7. మెడ మొదలైనచోట్ల గుండ్రంగా లేచే నెత్తురు గడ్డ; 8. ఆడపిల్లల మొలకు కట్టే ఆభరణ విశేషం; 9. కపిలరాట్నం; 10. రాళ్ళపనిలాడు దిండున కట్టించే చక్రం; 11. చేతి కదురుకు దారం చుట్టుకొనేవైపు ఉండే గుండ్రటి బిళ్ళ; 12. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డ బద్ద; 13. చెలక పంటె ఆకులమధ్య ఉండే కొయ్యచక్రం; 14. గంటానికి బిగించిన రీలు దారపు బండి; 15. దబ్బ రాట్నం చక్రం బిగింపుకు ఇరుసుకువేసే కొయ్యబిళ్ళ; 16. ఊత్తైలాడు బిగింపుకువేసే కొయ్యగిలక; 17. ఊత్తైలాడు బిగింపుకువేసే కొయ్యచెక్క; 18. పన్నె కట్టుబడిలో ఊనె పుల్లల వరసకు చివర బిగించిన వెదుల్పుబద్ద; 19. పన్నె దంతెలమధ్య బిగించే పుల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కాలిచే కొయ్యబిళ్ళ; 20. అచ్చుకట్టేటప్పుడు పడిదారంచుట్టే కొయ్య. 21. అచ్చుకట్టేటప్పుడు పడిదారాలు ఒకేపొడుగులో రావటానికి అచ్చు పడులలో బిగ్రుపెట్టే కొయ్యచెక్క; 22. మగ్గంమీద అచ్చుగుదులు తగిలించే కొయ్యకప్పు; 23. బరువు కట్టిన అంచు పేటువారాలు తగిలించే కొయ్యగిలక; 24. కమ్మిలో నేసినపట్టి; 25. పట్టుదారం పడికే పెద్ద రాట్నం ఇరుసుకు కుడివైపు బిగించిన కొయ్య చక్రం; 26. నార పడికే కదురు పుల్లకు బిగించిన గుండ్రటి బిళ్ళ; 27. ఉన్ని కదురుకు దారం చుట్టుకొనే వైపు ఉండే గుండ్రటి కొయ్యబిళ్ళ; 28. కట్టుబడిలో పనికిరాని చిన్నరాతి ముక్క; 29. ఇటికముక్క; 30. మోటబావి గిలక; 31. నాటుకొన్నచెట్టు ఆకులు, పిలకలు దట్టంగా వేసి గుబురుగా ఉన్న స్థితి; 32. గాబు, ఒడ మొ. వాటి తయారీకి అంగుళం మందంతో మట్టితో చేసిపెట్టే వలయాకార భాగం; విశే. గుండ్రని.

త. పిళ-. పగులు, పగిలినదగు, పిళవు. పగులు, బీట, భాగం, ముక్క; మ. పిళక్క. పగిలినదగు, పగులు, బీటపడు.

**బిల్లకట్టు** అ.క్రి. మెడ మొ. చోట్ల నెత్తురు గడ్డకట్టు. **బిల్లకట్టె** వి. 1. గిలకను బిగించటానికి పీలుగా బావిమీద

వేసిన అడ్డుకొయ్య; 2. గిలక తిరగటానికి వీలుగా దాని మధ్య ఉంచిన కర్ర. బిల్లకదురు రూ.చూ. బిళ్లకదురు. వి. ఒకరకం ఉన్నికదురు. బిల్లకమ్మి రూ.చూ. బిళ్లకమ్మి. వి. బెత్తెడు వెడల్పు పట్టెమాదిరిగా నేసిన కమ్మి. బిల్లకర్ర వి. కొబ్బరి మట్టలు చితక్కొట్టే సాధనం. బిల్లకజ్జలు వి.బ.వ. తమలపాకు నుతెలకు క్రిందను మీదను నంతన చేసి కట్టే కర్రలు. బిల్లగోడు (-కోడు¹) రూ. బిల్లంగోడు. వి. బాలక్రీడా విశేషం. కాశీ. 3.33. బిల్లగోల (-కోల) వి. క్రీడాసాధన విశేషం. శుక. 3 323 బిల్లంగోడు(-కోడు¹) రూ.చూ. బిల్లగోడు. వి. బాలక్రీడా విశేషం. బిల్లచెప్పులు వి.బ.వ. తోలుబిల్లల కుచ్చులమర్చిన చెప్పులు. విష్ణుపు. 7.147. బిల్లచెవి(-చెవి¹) రూ.చూ. బిళ్లచెవి. వి. గిలకకు ఆధారంగా దోర్నప్పట్టిమీద బిగించిన చిన్న కొయ్య. బిల్లంచు రూ.చూ. బిళ్లంచు. వి. 1. నాలుగయిదు కొలుకుల దారం తెలుపు, ఎరుపు వరసగా పెట్టి నేసిన అంచు; 2. మామూలంచు. బిల్లర్ద రూ.చూ. బిళ్లర్ద. వి. ఆకులు వెయ్యటానికి ఇరుసు దూర్చటానికి బండి చక్రం మధ్యనున్న గుండ్రటి కొయ్య. బిల్లకాడు రూ.చూ. బిళ్లకాడు. వి. 1. ఊత్తె బిళ్ళబిగించే కాడు; 2. అచ్చుకట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చుమీది మెలికల్లో దూర్చిన పురిదారం; 3. గిలకకు తగిలించిన అచ్చు. సూత్రం. బిల్లదారం రూ.చూ. బిళ్లదారం. వి. అచ్చు కట్టేటప్పుడు అచ్చుకర్రలకు కట్టేపురిదారం. బిల్లదూలం రూ. చూ. పిల్లదూలం. వి. 1. గుజ్జుదూలం, దూలానికి సమాంతరంగా గుజ్జులమీద వేసే చిన్నదూలం; 2. గిలకను బిగించటానికి వీలుగా దాపిమీద వేసే అడ్డకొయ్య. బిల్లపేర వి బట్టల నేతలో ఒకభేదం. ప్రబంధ. 605. బిల్లపురుగు రూ. చూ. బిళ్లపురుగు. వి. జొన్న, సజ్జ, రాగి మొ. పైర్లనుంచు తినిపొయ్యే గుండ్రటి పచ్చపురుగు. బిల్లపల్లి రూ.చూ. బిళ్లపల్ల. వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు బిళ్ళకు చేర్చి వడిదారం చుట్టే పల్ల. బిల్లపొయ్యి వి. బూడిదనేలపై రాలకుండ అడుగు భాగంలోనే నిలిచేటట్లు చేసిన మట్టిపొయ్యి. బిల్లబిద్యము వి. బాలక్రీడావిశేషం. హంస. 3.146. బిల్లబీటుకట్టు(బడు) (-పడు) అ.క్రి. కూలబడు. సారంగ. 1.96. బిల్లమీటు వి. బిల్లఎగరవేయటం. కళా. 3.266. బిల్లమెట్లు వి.బ.వ. ఒకరకం చెప్పులు. ప్రబంధ. 605. బిల్లరాపి రూ చూ. బిళ్లరాసి. వి. ఊర్పారపట్టి గుండ్రంగా పోసిన మంచి గింజలకుప్ప. బిల్లరాతి వి. చిన్నదైన నరాయి. బిల్లలం రూ. బిల్లులం. వి. బిళ్ళలాంటి ఆకులుగల కలుపుమొక్క. బిల్లలచెప్పులు వి.బ.వ. తోలు బిళ్ళల కుచ్చులమర్చిన చెప్పులు. బిల్లలుం రూ. చూ. బిల్లలం. వి. బిళ్ళల్లాంటి ఆకులు గల కలుపుమొక్క. బిల్లవాలు వి. చక్రాయుధం. ప్రబంధ. 330. బిల్లవిమ్మ రూ.చూ. బిళ్లవిమ్మ. వి. గిలకకు ఆధారంగా దోర్నప్పట్టి మీద బిగించిన చిన్నకొయ్య. బిల్లాకు రూ.చూ. బిడిలాకు. వి. ఊత్తెకాడు బిగ్రపెట్టే పొడుగుబద్ద. బిల్లిల్లు రూ.చూ. బిళ్లిల్లు. వి. పెంకు కప్పుకున్న ఇల్లు. బిల్లోర వి ధాన్యం నిల్వకు గుండ్రటి ఆకారపు మూత గలిగినట్టి బిర. <బిల్ల¹ + బిర.

బిల్ల² వి. చవిటినేలల్లో బాగా పెరిగే పెద్దచెట్టు. ఉష్ణకాలంలో కొంత ప్రాంతాల్లో వ్యాపిస్తుంది (The Indian satin wood tree).

బిల్లాకు చూ. బిల్ల¹.

బిల్లిక రూ.చూ. బిల్ల¹. వి. బింబం. ఆం. భా. 1.78.

బిల్లిల్లు చూ. బిల్ల¹.

బిల్లు¹ రూ. బిళ్లు. వి. వృక్షవిశేషం, సోద్రకం. హంస. 4.11. (Chloroxylon swietenia).

క. బిల్ల. వృక్షవిశేషం, సిద్రకం.

బిల్లుగొడిసె వి. కలపనిచ్చే పెద్దచెట్టు.

బిల్లు.² వి మోటతోలే బానపైభాగం.

ఇం. *Bill*. పిట్టముక్కు.

<ఇం. Bill.

బిల్లు³ వి. రావలసిన సొమ్ముకు రాసే చీటి.

ఇం. *Bill* దాఖలీటి, చిత్తుపట్టం, క్రయపట్టి.

<ఇం. Bill.

బిల్లుకలెక్టరు వి. సుంకరి.

ఇం. *Bill collector*. పన్ను మొ. వి వసూలు చేసే ఉద్యోగి.

<ఇం. Bill collector.

బిల్లుడి రూ.చూ. బిల్లుడు. వి. చవిటి నేలల్లో బాగా పెరిగేపెద్ద చెట్టు.

బిల్లుడు రూ. బిల్లుడి. వి. గృహోపకరణాల తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Chloroxylon suritenia).

బిల్లుమగడ్డి వి. మాగాణిలో ఎక్కువగా పెరిగే కలుపు మొక్క.

బిల్లోర చూ. బిల్ల¹.

బిల్వబిద్దెము చూ. బిళ్ల. వి. బాలక్రీడ.

బిల్హరి రూ.చూ. బిలాహరి. వి. ఇరవైనాలుగు త్రిరాగాల్లో ఒకటి.

బిళపరము చూ బిల్ల¹. వి. బిళ్ళసరం, బంగారుబిళ్ళలతో కూర్చిన మాల. ద. హిం. గా. సంపు. 6. గా. సం. 983. క్రీ.శ. 1342.

బిళాతీ రూ. బిలాతీ. వి. ఒంటిమీద ఎక్కడైనా బుడిపె లాగా ఏర్పడే లావాటి గుల్ల.

హిం. ఉ. విలాయతీ. ఇతరదేశ సంబంధమయిన.

<ఉ. విలాయతీ.

బిడువు వి. మట్టిగుంట తవ్వేటప్పుడు సులభంగా పని అవటానికి మట్టి పైకి చేర్చటానికి వీలయ్యేటట్లు ఏర్పరచుకొన్న లోతు పరిమాణం.

సం. బిల్. తవ్వు, గొయ్యితీయు.

బిళ్ల¹ రూ.చూ. బిల్ల¹. వి. 1. ఖండం, ముక్క. క్రీడా. 68; 2. పల్చని, గుండ్రని వస్తువు. మను. 5.40; 3. గాడె మీద మూత వేయటానికై ఉపయోగించే గుండ్రని పలక. శుక. 3.248; 4. గుండ్రని బిందు; 5. బిళ్ళక; 6. మెడ మొదలైన చోట్ల గుండ్రంగా లేచే నెత్తురు గడ్డ; 7. ఆడపిల్ల మొలకు కట్టే ఆభరణ విశేషం; 8. కపిలదాట్నం;

9. రాళ్ళ పనివాడు దిండున కట్టించేచక్రం ; 10. ఒరలమీద మూతగా ఉపయోగించే చిన్నంచుపెట్టి గుండ్రంగా చేసిన మూత ; 11. స్త్రీలకువచ్చే ఒకరకమైన రోగం ; 12. బావి గిలక ; 13. గాజు, ఓడ మొ.వాటి తయారీకి అంగుళం మందంతో మట్టితో చేసిపెట్టే వలయాకార భాగం ; 14. మందు మాత్ర ; 15. రెవెన్యూ స్టాంపు లేక తపాలా స్టాంపు ; 16. నాటుకొన్న చెట్టు ఆకులు పిలకలు దట్టంగా వేసి గుబురుగా ఉన్న స్థితి ; 17. చేతి కదురుకు దారం చుట్టుకొనేవైపు ఉండే గుండ్రటి బిళ్ళ ; 18. పంటె ఆకుల బిగింపుకు వేసే అడ్డబద్ద ; 19. చెలకపంటె ఆకుల మధ్య ఉండే కొయ్య చక్రం ; 20. గంటానికి బిగించి కీలు దారపు బండి ; 21. రద్నాలాట్నం చక్రం బిగింపుకు ఇరుసుకు వేసే కొయ్యబిళ్ళ ; 22. ఊత్తై తాడు బిగింపుకు వేసే కొయ్య గిలక ; 23. ఊత్తై తాడు బిగింపుకు వేసే కొయ్య చెక్క ; 24. పన్నె కట్టుబడిలో ఊనె పల్లల వరసకు చివర బిగించిన వెదల్పు బద్ద ; 25. పన్నె దండల మధ్య బిగించే పల్లలు ఒకే పొడుగులో తెంపటానికి కాలిచే కొయ్య బిళ్ళ ; 26. అచ్చు కట్టేటప్పుడు వడిదారం చుట్టే కొయ్య ; 27. అచ్చు కట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చు వరులలో బిర్రు పెట్టే కొయ్య చెక్క ; 28. మగ్గంమీద అచ్చు గుదులు తగిలించే కొయ్య కప్పి ; 29. బరువు కట్టిన అంచు పేటు దారాలు తగిలించే కొయ్య గిలక ; 30. కమ్మిలో నేసిన పట్టి ; 31. పట్టుదారం వడికే పెద్ద రాట్నం ఇరుసుకు కుడివైపు బిగించిన కొయ్య చక్రం ; 32. నార వడికే కదురు పల్లకు బిగించిన గుండ్రటి బిళ్ళ ; 33. ఉన్ని కదురుకు దారం చుట్టుకొనేవైపు ఉండే గుండ్రటి కొయ్య బిళ్ళ.

బిళ్లకట్టార్పి వి. మట్టమార్పి మీద అదేవిధంగా కట్టిన మరో ఆర్పి. బిళ్లకట్టు అ.క్రి. నెత్తురు గడ్డకట్టు. బిళ్లకట్టె రూ. బిళ్లకడ్డి. వి. మోటబిళ్ళ ఇరుసు. బిళ్లకడ్డి రూ.చూ. బిళ్లకట్టె. వి. మోట గిలక ఇరుసు. బిళ్లకదురు రూ. బిల్ల కదురు. వి. ఒకరకం ఉన్ని కదురు. బిళ్లకంది వి. ఒకరకం కందులు. బిళ్లకమ్మి రూ. బిల్లకమ్మి. వి. బెత్తెడు వెడల్పు పట్టె మాదిరిగా నేసిన కమ్మి. బిళ్లకుడుములు వి.బ.వ. మోదక విశేషం. బిళ్లకొక్కి వి. గిలకకు ఆధారంగా దోర్నపట్టెమీద బిగించిన చిన్న కొయ్య. బిళ్లకొమ్ము వి. గుండ్రంగా లోపలికి వంపు తిరిగిన కొమ్ము. బిళ్లగన్నేరు వి. ఒకరకం పూలచెట్టు, భేదిగడ్డ అనే మూలిక. బిళ్లగూడు వి. గుండ్రంగా వేసిన గడ్డి కుప్ప. బిళ్లగోచి వి. కుచ్చెలోని పెట్టిన గోచి. బిళ్లంకులు వి.బ.వ. మడతపేడీలు. బిళ్లచిమ్ము రూ. బిల్లసిమ్ము. వి. గిలకకు ఆధారంగా దోర్నపట్టెమీద బిగించిన చిన్న కొయ్య. బిళ్లచెప్పులు వి.బ.వ. తోలు బిళ్ళల కుచ్చులమర్చిన చెప్పులు. రాజవా. 2 44. బిళ్లచెవి రూ. బిల్లజెవు. వి. గిలకకు ఆధారంగా దోర్నపట్టెమీద బిగించిన చిన్న కొయ్య. బిళ్లచ్చు వి. మోట గిలక ఇరుసు. <బిళ్ల[1] + అచ్చు[4]. బిళ్లజోడు వి. కళ్ళజోడు. బిళ్లంచు రూ. బిల్లంచు. వి. 1. నాలుగయిదు కొలుకుల దారం తెలుపు, ఎరుపు వరసగా పెట్టి నేసిన అంచు ; 2. మామూలంచు. బిళ్లంచుకుండ వి. అంచు బిళ్ళగా ఉండే మట్టి పాత్ర. బిళ్ళడ్డ రూ. బిల్లడ్డ. వి. ఆకులు వెయ్యటానికి ఇరుసు దూర్చటానికి బండిచక్రం మధ్య ఉన్న గుండ్రటి కొయ్య. బిళ్లడ్డకట్టు వి. బండి కుండకు కట్టిన ఇనపకట్టు. బిళ్లతాడు రూ. బిల్లతాడు. వి. 1. ఊత్తై బిళ్ళ బిగించే తాడు ; 2. అచ్చు కట్టేటప్పుడు వడిదారాల బిగింపుకు అచ్చు కర్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం ; 3. గిలకను తగిలించిన అచ్చు సూత్రం ; 4 బండికి దొప్ప వేసినప్పుడు బిగించే తాడు. బిళ్లతాపి వి. గచ్చును నున్న బరచటానికి పనికివచ్చే చిన్న తాపి. బిళ్లదారం రూ. బిల్లదారం. వి. అచ్చు కట్టేటప్పుడు అచ్చు కర్రలకు కట్టే పురిదారం. బిళ్లదువ్వ వి. ముక్కామ్మమెకం. బిళ్లదూలము వి. బావిపై నీళ్ళు తోడటానికి వేసే బలమైన అడ్డకర్ర. బిళ్లనిలుపు వి. గిలకకు ఆధారంగా దోర్నపట్టె మీద బిగించిన చిన్నకొయ్య. బిళ్లపరుపు వి. గడ్డి అంతటిని ఒక్కసారిగానే పరచి పేర్చిన పెద్దపరుపు. బిళ్లపీడి వి. పలకలుగా ఉండే పీడి. బిళ్లపురుగు రూ. బిల్లపురుగు. వి. జొన్న, సజ్జ, రాగి మొ. పైర్ల సుంకు తిని పొయ్యే గుండ్రటి పచ్చపురుగు. బిళ్లపల్ల రూ. బిల్లవల్ల. వి. అచ్చు కట్టేటప్పుడు అచ్చు బిళ్ళకు చేర్చి వడిదారం చుట్టే పల్ల. బిళ్లపెంకు వి. ఇంటి కప్పు లోపలిభాగంలో కీపర్లమీద పరచటానికి నల్చదరంగా పల్చగా ఉండే పెంకు. బిళ్లపెండెం వి. అట్లు పోయటానికి ఉపయోగపడే మట్టి పళ్ళెం. బిళ్లపొడుగు వి. వెడల్పుగా గిన్నె మాదిరిగా ఉండే పొడుగు. బిళ్లబాయి వి. భూమట్టంమీద చుట్టూ పళ్ళెం ఉన్న బావి. బిళ్లబిగులు వి.బ.వ. అచ్చు కట్టేటప్పుడు వడిదారాలు ఒకే పొడుగులో రావటానికి అచ్చు వరులలో బిర్రుపెట్టే కొయ్యచెక్క. బిళ్లబిట్టుగా క్రి.విశే. ఉన్న దున్నట్లుగా. బిళ్లబొట్టు వి. వర్తులాకారమైన తిలకం ఉ.హరిశ్చ. 4.16. బిళ్లమండె వి. గుండ్రంగా వేసిన పొగాకు తోరణాల కుప్ప. బిళ్లమీటుగా(జిమ్ము స.క్రి. బిళ్ళను ఎగురవేసినట్లుగా ఎగురవేయు. కళా. 3.278. బిళ్లమోకు వి. మోట బొక్కెన లాగే మోకు. బిళ్లరాసి రూ. బిల్లరాసి. వి. తూర్పారపట్టి గుండ్రంగా పోసిన మంచి గింజల కుప్ప. బిళ్లలమెలతాడు వి. పాయల మెలతాడు. బిళ్లలమోకు వి. బండ్లపై సరుకు కట్టే తాళ్ళు బిగించటానికి గిలకలు కలిగిన మోకు. బిళ్లలు వి.బ.వ. అము కాలిన తర్వాత రేవులకు పెట్టే మూతలు. బిళ్లాకర్రా వి. గోటీబిళ్ళ. బిళ్లార్పి వి. మట్టమార్పిమీద అదేవిధంగా కట్టిన మరో ఆర్పి. <బిళ్ల[1] + ఆర్పి. బిళ్లిరుసు వి. మోట గిలక ఇరుసు. <బిళ్ల[1] + ఇరుసు. బిళ్లిల్లు రూ. బిల్లిల్లు. వి. పెంకు కప్పున్న ఇల్లు. <బిళ్ల[1] + ఇల్లు.

బిళ్ల[2] వి. చవిటినేలల్లో బాగా పెరిగే పెద్ద చెట్టు.

బిళ్లాకర్రా చూ. బిళ్ల[1].

బిళ్లార్పి చూ. బిళ్ల[1].

బిళ్లిరుసు చూ. బిళ్ల[1].

బిళ్లిల్లు చూ. బిళ్ల[1].

బిల్వ రూ.చూ. బిల్వు[1]. వి. వృక్ష విశేషం, పోద్రకం.

బిల్లగడ్డి వి. రెల్లుగడ్డి, పశుగ్రాసంగానూ ఇళ్ళ కప్పులకూ ఉపయోగపడే ఒకరకం గడ్డి (Sacxharum spontaneum).

బిల్లగుత్త వి. ఒక పనిని నిర్ణయించుకొన్న కంట్రాక్టు మొత్తం.
ఇం. *Bill.* పనికి నిర్దేశించిన ధనానికి సంబంధించిన ఖాతా.
< ఇం. Bill. + గుత్త.

బిల్లముక్తా వి. ఒక పనిని నిర్ణయించుకొన్న కంట్రాక్టు మొత్తం.
ఇం. *Bill.* పనికి నిర్దేశించిన ధనానికి సంబంధించిన ఖాతా.
< ఇం.Bi!! + ముక్తా.

బిగాడా రూ.చూ. బిదాడా. వి. మకాం.

బివనాసుమాను రూ.చూ. బిసనాసుమాను. వి. పెద్ద పదునుతో ఒకేసారి పోసే ఒకరకం అను.

బివ వి. 1. యంత్రం, కీలు, మీటు. ప్రబంధ. 181; 2. యంత్రం. శుక. 1.254; 3. ఏతం కింది అరం; 4. వేగం; 5. తెలివి.
బివఎక్కించు అ.క్రి. షరి ఎక్కించు. బివదవ్వ (-తవ్వ) అ.క్రి. బిగి కోలుపోవు. పర.రా.యు. 405 పు. 22 పం. బివపెట్టు అ.క్రి. 1. అంకపెట్టు; 2. బెట్టును గురుత్వాన్ని కలిగించు.

బిసవాసుమాను యా. బిషనాసుమాను, మిషనాసుమాను. వి. పెద్ద పదునులో ఒకేసారిపోసే ఒకరకం అను.
హిం. బిస్‌నీ. లాలసకల.

బివమమ్గం రూ.చూ. మినుమమ్గం. వి. ఒకరకం మగ్గం.

బివబివ వి. 1. గాలి వీచటంలో అయ్యే అనుకరణం. భాగ. 10 ఉ. 1001; 2. వేగంగా నడవటం మొ. వాటిలో అయ్యే అనుకరణం. పాంచాలి. 4.21.
క. విసవిస. వేగంగా నడవటం; త. విసుక్కెన్‌ల్. తొందరగా నడవటంలో అయ్యే అనుకరణం; కో. వెచ్. వేగం, బలం, శక్తి; గోం. విస్తానా, విస్త్. ఒకఊపులో తాగటం, విర్కానా. లాగటం, ఊద్చటం.
బివబివబివ వి. గాలివీచటంలో అయ్యే అనుకరణం. సమీర. 4.44. బివబివలాడు అ.క్రి. కదలు. సారంగ. 1.38.

బివమగ్గం రూ.చూ. మినుమగ్గం. వి. ఒకరకం మగ్గం.

బివరాటం రూ. బినరాటీ, బినుసురాటం. వి. దబ్బాలకు నూలు తోడే రాట్నం.

బివరాటీ రూ చూ. బినరాటం. వి. ఒకరకం రాటీ.

బిహాతు రూ. బిసాదు. వి. 1. బలం, శక్తి; 2. నిర్లక్ష్యం, బలాదూరు.
హిం.ఉ. బిసాత్. సామర్థ్యం.
< ఉ. బిసాత్.

బిహాదు రూ.చూ. బిహాతు. వి. 1. నిర్లక్ష్యం; 2. బలాదూరు.

బిసి[1] విశే. వేడైన.
క. బిసి, బిసు. వేడి; తు. బిసి. వేడి. వెచ్చని (మార్యకిరణాలు).
< క. బిసి.

బిసిపీరు వి. వేడినీరు. ప్రబంధ. 57. బిసిబిసిమాటలు వి.బ.వ. జిలిబిలి మాటలు, ప్రియభాషణాలు. ప్రభా. 5.27.
బిపెక్కించు స.క్రి. ప్రేరేపించు. < బిసి[1] + ఎక్కించు.

బిసి[2] వి. 1. దావిపక్కన గిలక వేయటానికి పీలుగా కట్టిన గోత: 2. మంచి దించేటప్పుడు కంబారు తాడుకు కట్టిన పరలను మోసే గద; 3. గట్టితనం; 4. తడికబద్రు, తడిక ఓగువుగా వేయటానికి తాడు కట్టి లాగించే కొయ్య.
బిసిగుంజ వి. రంగులో తడిపిన నూలు లడీలు పింద టానికి నేలలో పాతిన పొడుగురాట. బిసితలుపు వి. వెదురు బద్దల్తో అల్లిన తలుపు. బిసితాడు యా. బిస్తాడు. వి. కమాను వేలాడదీసిన తాడు. బిసిపల్ల రూ.చూ. బుని పల్ల. వి. చేతి నాడెగాడిలో అడ్డంగా బిగించిన పల్ల. బిసిపోవు అ.క్రి. పట్టుపోవు.

బిసుమరాటం రూ.చూ. బినరాటం. వి. దబ్బాలకు నూలుతోడే రాట్నం.

బిసుమగ్గం రూ.చూ. మినుమగ్గం. వి. ఒకరకం మగ్గం.

బిసురు స.క్రి. ఎక్కువగా తిను.

బిపెక్కించు చూ. బిసి[1].

బిస్కట్‌కలరు వి. ఒకరకం గోధుమరంగు.
ఇం. *Biscuit colour.* గోధుమరంగు.
< ఇం. Biscuit colour.

బిస్కట్టు రూ. బిస్కత్తు. వి. తినే (తీపి) పదార్థం.
ఇం. *Biscuit.* బల్లపరుపుగా పలచగా ఉండే (తీపి) పదార్థం.
< ఇం. Biscuit.

బిస్కట్టురంగు రూ. బిస్కట్‌రంగు, బిస్కత్తురంగు, బిస్కెట్‌రంగు, బిస్కేటురంగు. వి. 1. ఒకరకం గోధుమరంగు; 2. లేత బ్రౌను రంగు; 3. గంధం రంగుకు కాఫీరంగుకు మధ్యరకంగా ఉండే రంగు.
ఇం. *Biscuit.* భక్ష్య విశేషం.
< ఇం. Biscuit + రంగు.

బిస్కట్‌రంగు రూ.చూ. బిస్కట్టురంగు. వి. 1. ఒకరకం గోధుమరంగు; 2. లేత బ్రౌనురంగు; 3. గంధం రంగుకు కాఫీరంగుకు మధ్య రకంగా ఉండే రంగు.

బిస్కత్తు రూ.చూ. బిస్కట్టు. వి. తినే (తీపి) పదార్థం.

బిస్కత్తురంగు రూ.చూ. బిస్కట్టురంగు. వి. 1. ఒకరకం గోధుమరంగు; 2. లేత బ్రౌనురంగు; 3. గంధం రంగుకు కాఫీరంగుకు మధ్యరకంగా ఉండే రంగు.

బిస్కెట్‌రంగు రూ.చూ. బిస్కట్టురంగు. వి. 1. ఒకరకం గోధుమరంగు; 2. లేత బ్రౌనురంగు; 3. గంధం రంగుకు కాఫీ రంగుకు మధ్యరకంగా ఉండే రంగు.

బిస్కేటురంగు రూ.చూ. బిస్కట్టురంగు. వి. 1. ఒకరకం గోధుమ రంగు; 2. లేత బ్రౌనురంగు; 3. గంధం రంగుకు కాఫీ రంగుకు మధ్యరకంగా ఉండే రంగు.

బిస్త వి. 1. దుర్గతి. ఆం.భా. 1.150; 2. నరకం; 3. బిద్దె.
హిం.ఉ. భిశ్త్. స్వర్గం.

బిస్తరు వి. పక్కచుట్ట.
హిం. బిస్తర్. పరుపు.

<హిం. బిస్తర్.
బిస్తాదు రూ.చూ. బిసిరాదు. వి. కమాను వేలాడదీసిన తాడు.
బిస్తి వి. తోలు సంచులతో నీళ్ళు మోసేవాడు.
హిం. భిశ్తీ. నీటిని తిత్తుల్లో నింపుకొని మోసేవాడు.
<హిం. భిశ్తీ.
బిస్మిల్లా వి. భగవంతుని పేరుతో ప్రారంభించటం.
హిం. బిస్మిల్లాహి. ప్రారంభం; ఉ. బిస్మిల్లాహ్. భగవంతుని పేరుతో మహమ్మదీయులు ఈ పదాన్ని ప్రతి పని చేసేముందు ఉపయోగిస్తారు కాబట్టి బిస్మిల్లా-కర్నా అనే మాటకు ప్రారంభించు, మొదలుపెట్టు అనే అర్థాలు ఏర్పడ్డాయి ;
త. పిస్మిల్లాహి.
<ఉ. బిస్మిల్లాహ్.
బిస్పటు వి. బిస్సుమనే ధ్వని. ధ్వన్యను.
బిస్పట్లుపెట్టు అ.క్రి. బిస్సుమని ధ్వని చేసేట్లు విసరు. పరాహ. 1.3.
బిస్పట్లుపెట్టు చూ. బిస్పటు.
బిస్సాటి వి. భిక్షాన్నానికై తిరిగేవాడు. బిచ్చగాడు. కాశీ 2.38.
సం. భిస్సటు-, భిస్సా, భిస్సాటి. అన్నం.
<సం. భిస్సాటి.
బిస్సు వి. 1. గాలి వీచటంలో అయ్యే అనుకరణం. కకుత్స. 2.103 ; 2. వేగంగా పోవటం మొ.న వాటిలోని అనుకరణం. సారంగ. 1.93 ధ్వన్యను.
బిహిదానా వి. ఒకవిధమైన గింజలు.
హిం. బిహీ. ఒకరకమైన పండు, క్విన్స్, బిహిదానా. ఒకవిధమైన పండుగింజలు ; త. పేలానా.
<హిం. బిహిదానా.
బిహ్వ వి. ఒకవిధమైన సంచి.
ఉ. బేహ్వా. పెద్దమనుషులు ప్రయాణం చేసేటప్పుడు దానం చేసేందుకు కావలసిన డబ్బులు వేసుకొని వెంట తీసుకుపోయే సంచి.
<ఉ. బేహ్వా.
బీకము వి. ఊదే వాద్య విశేషం.
హిం. బీకా. వంకరైన.
బీకర రూ.చూ బీఱ. వి. బీర. ఆం.రా. 2.60.
బీకి వి. బలహీనం.
హిం. భీఖ్. భిక్షం.
బీగ రూ. బీగం, బీగా. వి. దాదాపు ఎకరంనేల, ముప్పై లేక అరవై కుంటల ప్రమాణం. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 180. క్రీ.శ. 1152.
హిం. బీఘా. ఎకరంలో $\frac{1}{8}$ వ వంతు వైశాల్యం ఉండే భూమి కొలత.
<హిం. బీఘా.
బీగం రూ.చూ. బీగ. వి. భూమికొలత, 30 కుంటలు.
బీగరు రూ.చూ. బిగరు. వి. భూమి కొలత, 60 కుంటలు.
బీగము వి. తలుపు మొదలైన వాటికి వేసే తాళం. హంస. 2.226, శుక. 1.65.
క. బిగ, బియ్యగ. కప్పుతాళం, తాళం ; కొడ. బిగ. తాళం ; తు. బిగ. తాళం ; త. పీకమ్, వీకమ్. తాళం కప్ప, వలయం ; మ. వికమ్. తాళంకప్ప, కప్పుతాళం.
<క. బీగ.
బీగముచేయి వి. తాళం తిప్పే కీలకం, తాళంచెవి, కుంచిక. ద్వి.పరమ. వి. 4.319. బీగముద్ర వి. (వృత్తిలో ముపర్ణలోపం) కప్పుతాళం. హంస. 1.119. బీగముముద్ర వి. తాళంకప్ప. బీగములేనిపెట్టె వి. 1. రక్షణం లేనిది ; 2. తాళంలేని పెట్టె.
బీగా రూ.చూ. బీగ. వి. భూమిని కొలిచేందుకుపయోగించే ఒక కొలత.
బీగుడు చూ. వియము. వి. వియ్యంకుడు.
బీగురాలు చూ. వియము. వి. వియ్యపురాలు.
బీజపైరావు వి. విత్తనాలు నాటిన భూమి.
హిం. బీజ్. విత్తనం, పైరావా. సాగుబడి, వ్యవసాయం, ఒక దుస్తు, ఒక వస్త్రం, సేద్యం.
<హిం. బీజ్ + పైరావా.
బీజము వి. 1. ఒరుబీజం (బుడ్డ) : 2. ధాన్యం ; 3. వీర్యం.
సం. బీజ-. విత్తనం, ధాతువు, మొలక.
<సం. బీజ-(అర్థవిపరి.).
బీజారించు చూ. బీజారు.
బీజారు రూ.చూ. బిగజారు. అ.క్రి. మట్టిలో ఉండే రాళ్ళను వేరుచేయు.
బీజారించు స.క్రి. మట్టిలోని రాళ్ళను తీసివేయు.
<బీజారు + -ఇంచు[3].
బీజగొట్టు వి. పేచీకోరు. చెన్నబసవ. 4.39.
హిం. బీజ్-. అంకురం, విత్తనం.
<హిం. బీజ్ + -గొట్టు.
బీట వి. విరుగుడుమాను (*Dabergia latifolia*).
క. బీటి, బీటె. విరుగుడుమాను ; తు. బీటి ; త. వీట్టి. బొంబాయి విరుగుడుమాను.
<క. బీటె.
బీటాము చూ. బీడు[2].
బీటిగుంటక చూ. బీడు[2].
బీటిగొడ్రు చూ. బీడు[2].
బీటిగొడలు చూ. బీడు[2].
బీటిచాలు చూ. బీడు[2].
బీటిచేను చూ. బీడు[2].
బీటిదున్నకం చూ. బీడు[2].
బీటివేల చూ. బీడు[2].
బీటిపాపు చూ. బీడు[2].
బీటిపొలం చూ. బీడు[2].
బీటిమట్టి చూ. బీడు[2].
బీటిమడక చూ. బీడు[2].
బీటివడ్లు చూ. బీడు[2].
బీటిసేద్దెం చూ. బీడు[2].
బీటిసేద్యం చూ. బీడు[2].
బీటు వి. కావలా.

ఇం. *Beat*. దెబ్బ. క్రమం తప్పకుండా తిరిగే దారి.

< ఇం. Beat.

**బీటుకానిస్టేబులు** వి. కాపలా తిరిగే పోలీసు అధికారి.

ఇం. *Beat-constable*. బీటు తిరిగే కానిస్టేబులు.

< ఇం. Beat-constable.

**బీటుకాల్వ** చూ. బీడు².

**బీటి** రూ.చూ. బీఁట. వి. పగులు.

**బీటొడ్లు** చూ. బీడు².

**బీఠం** వి. దిక్కైన్న అద్దేటప్పుడు రంగుకొట్టి పెట్టుకొనే పీట.

సం. పీఠ. ఆసనం, కుర్చీ ; త. పీఠమ్. పీట.

< త. పీఠమ్.

**బీడి** వి. పొగ తాగేందుకుపయోగించే పొగాకు చుట్ట.

హిం. బీడీ. తక్కువ రకపు సిగరెట్టు. తమలపాకు ; ఉ. బీడా. సున్నం, వక్క, మసాల పెట్టి చుట్టిన తమలపాకు.

త. పీటి. ఒకరకం సిగరెట్టు.

< ఉ. బీడా.

**బీడు¹** వి. 1. మట్టమైన ఇనుము. హంస. 1.109 ; 2. అల్యూమినియం రజను, సీమవెండి రజను.

క. బీడు. ఇనపరజను ; తు. బీడు. లోహంలోని మష్టు, ఇనుము యొక్క మిశ్రమలోహం.

< క. బీడు.

**బీడుబుడ్డి** వి. కంబం ఆకారంలో ఉండే చిమ్మబుడ్డి.

**బీడు²** వి.ణా. దున్నని భూమి. కంచె. యయా. 1.38 ; విశే. రిక్తం, వట్టిది. ఆం.భా. 3.15.

క. బీడు, బీళ్(ఉ). పనికిరాని, సాగుచెయ్యని భూమి ; త. పీడు. పనికిరాని, సాగుచెయ్యని భూమి ;

హిం. బిహడ్. ఎగుడు దిగుడైన.

**బీడాము** వి. ఆరుబయలులో ఎద్రకాల్పుకు ఏర్పరచే ఆము. < బీడు² + ఆము. **బీడిగుంపిక** వి. విత్తనం వెయ్యక ముందు మొలిచిన గడ్డి మొ. వి. పోవటానికి నేల వదులు కావటానికి మెట్టలో తోలేగుంటక. **బీడిగొర్రు** వి. భూమి దున్నే గొర్రు. నాగలితో దున్నిన తరవాత పెళ్లలు నలగటానికి దీంతో దున్నురారు. **బీడిగొరలు** వి.బ.వ. వడ్లలో ఒకరకం. **బీడిచాలు** వి. మొదటిసారి గుంటకతో దున్నిన చాలు. **బీడిచేను** వి. దున్న వలసిన పొలం. **బీడిదున్నకం** వి. నీళ్ళు పెట్టక ముందు మాగాణిలో దున్నటం. **బీడినేల** వి. దున్నని నేల. **బీడిపారు** వి. అడవి కొట్టి సాగు చేసిన నేల. **బీడిపొలం** వి. దున్నవలసిన చేను. **బీడిమట్టి** వి. బీడు భూమి నుంచి తెచ్చిన మట్టి. **బీడిమడక** వి. 1. మెట్టనేలలు దున్నే నాగలి ; 2. పొలాన్ని మొదటి సారి దున్నటం. **బీడివడ్లు** రూ. బీటొడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు. **బీడిసేద్దెం** రూ.చూ. బీడిసేద్యం. వి. తొలకరి ముందు పొలంలో గుంటకతో దున్నటం. **బీడిసేద్యం** రూ. బీడిసేద్దెం. వి. తొలకరి ముందు పొలంలో గుంటకతో దున్నటం. **బీటుకాల్వ** వి. ఆరు బయలులో కుండల్ని పేర్చి కాల్చిన కాల్వ. **బీటొడ్లు** రూ.చూ. బీడివడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు. **బీడుకాపు** వి. బీడులో ఉండే సేద్యగాడు. ద.హిం.రా. సంపు. 4. రా.సం. 820. **బీడుమాలు** అ.క్రి. పనికిమాలు. **బీడువాఱు(-పాఱు)** అ.క్రి. నిస్సారమగు, ఎండిపోవు. గౌ.హరి.పూ. 972.

**బీఁట** రూ. బీటి. వి. పగులు. భార.విరా. 4.62.

క. బిరి, బిరి, బిడు, బిరె. బీటు, పగులు, సందు ; కొర. బొడి. వేలాడటం ; తు. బెడి. తుపాకి, బెడెబెడె. గిన్నె బద్దలైనప్పుడు వచ్చే ధ్వని ; త. వెటి. పగులు, బద్దలగు, తెరుచుకొను, వికసించు ; మ. వెటి. పగలటం తుపాకి, వేటు.

< క. బిరి.

**బీఁటగిలఁబాఱు** అ.క్రి. బీటలుతీయు, పగులు. కు. సం. 6.138. **బీఁటగిలు** రూ. బీఁటగిల్లు. అ.క్రి. బీటలుతీయు, పగులు. భీమ. 3.211. **బీఁటగిల్లు** రూ.చూ. బీటగిలు. అ.క్రి. బీటతీయు, పగులు. **బీఁటతీయు** అ.క్రి. పగులు. **బీఁటపడు** అ.క్రి. పాడుపడు. **బీఁటబట్టీ** వి. సుమారు 80 పొయ్యిలుండి అయిదారు అంతస్తులుగా పేర్చబడిన లక్ష ఇటికలను కాల్చే పెద్దబట్టీ. **బీఁటలగు** అ.క్రి. పగులు. నీలా. 3.10. < బీఁట + -లు + అగు. **బీఁటలుతీయు** అ.క్రి. పగులు. **బీఁటలుపోవు** అ.క్రి. బీటలువారు, బద్దలగు. భార. భీష్మ. 1.119. **బీఁటలువాఱు(-పాఱు²)** అ.క్రి. బీటగిల్లు ; బద్దలగు. కు. సం. 5.549. **బీఁటలెగయు** అ.క్రి. బీటలువారు, పగులు. శృం. నై. 4.91. < బీఁట + -లు + ఎగయు. **బీఁటవాఱు(-పాఱు²)** అ.క్రి. బీటగిల్లు, బద్దలగు. కు.సం. 5.70. **బీఁటాడు** అ.క్రి. బీటలువారు. < బీఁట + ఆడు. **బీఁటిక** వి. బీట, పగులు. ఆము. 2.54. **బీటిక లెగయు** అ.క్రి. పగులు. భాను. 2.74. < బీటిక + -లు + ఎగయు.

**బీఁటాడు** చూ. బీఁట.

**బీఁటిక** చూ. బీఁట.

**బీఁటికలెగయు** చూ. బీఁట.

**బీతు** వి. వెరపు, భయం. అచ్చ. రా. బాల. 98.

సం. భీతి-. భయం ; ప్రా. భీహి. భయం. భీత-, భీద-. భయపడిన ; అ.మా. భీఇ. బీతి. భీయ. భయపడిన ; పా. భీత- ;

ఉ. భీతి. భయం.

< సం. భీతి-.

**బీతుకుడుచు** అ.క్రి. భయపడు. భాస్క. రా. యు. 323. **బీతుగాను (-కొను)** అ.క్రి. భయపడు. **బీతుగొలుపు (-కొలుపు)** రూ. చూ. బీతుగొల్పు. స.క్రి. భయపెట్టు. **బీతుగొల్పు (-కొల్పు)** రూ. బీతుగొలుపు. స.క్రి. భయపెట్టు. కవిరాజ. 2.82.

**బీద** విశే. 1. దరిద్రుడయిన, పేదయిన. మను. 3.121 ; 2. నిస్సారమైన. విష్ణుపు. 8.366 ; 3. భయపడిన ; వి. సన్యాసి.

సం. భీత-. భయపడిన ; ప్రా. బీద-. భయపడిన ; కొం. బిదుర్. బీద, దౌర్భాగ్యుడు.

< ప్రా. బీద-.

**బీదకమ్మవడు (-వడు)** అ.క్రి. మేనిబలుపుతో సన్న

గిల్లిన కన్నులు కలదగు. వేంక. పంచ. 1.128. పాండు. 5.14. బీదగరచినబూరె (-కరచినబూరె) వి. పేదకు దొరికిన పెన్నిధి అనే అర్థం వచ్చే నుడికారం. శాల్మ. సం. 11.3. బీదతనము వి. 1. పిరికితనం. భార. ద్రోణ. 1.226 ; 2. దారిద్ర్యం, దైన్యం. దశా. 2.362. బీదబలిసిబందికాఁడగు అ. క్రి. దుర్బలుఁడు, బలవంతుడై బందిపోటుదొంగ అగు. బీదబొంగరములు వి.బ.వ. చిన్న బొంగరాలు. పల్నా. పు. 40. బీదతికము వి. 1. పిరికితనం; 2. దారిద్ర్యం. బీదలపెనుబాద వి. గాలి, వాయువు. సాంబ. దేవ. 13. బీదవాక్యములు వి.బ.వ. దీనవాక్యాలు. పల్నా. పు. 40. బీదసాదలు వి.బ.వ. పేదవారు సామాన్యులు అయిన వ్యక్తులు.

బీపు రూ.చూ. పీపు. వి. పీపు.

బీబి రూ.చూ. బిబ్బి[1]. వి. కులస్త్రీ.

బీబీ రూ చూ. బిబ్బి[1]. వి. కులస్త్రీ.

బీమ్ రూ. బీము. వి. మగ్గానికి తగిలించిన పడుగు చివరి భాగం చుట్టటానికి అమర్చిన గుండ్రటి కొయ్య.

ఇం. *Beam*. దూలం.

బీమ్అడ్డ వి. పడుగు నూలు పోసే ఒకరకం మరాను. బీమ్కడ్డి వి. పన్నెకట్టుబడిలో ఈనెపుల్లల వరసకు చివర బిగించిన వెదురుబద్ద. బీమ్కొయ్య వి. గుండ్రటి ఎదురు దోనెను మోసే పంగలకొయ్య. బీమ్చక్రం వి. గుండ్రటి ఎదురు దోనెకు చివర బిగించిన పళ్ళచక్రం. బీమ్ఫ్రేం రూ. చూ. బీమ్ఫ్రేము. వి. నూలు చుట్టిన రాటీలు అమర్చే చట్రం. బీమ్ఫ్రేము రూ. బీమ్ఫ్రేం. వి. నూలుచుట్టిన రాటీలు అమర్చే చట్రం. బీమ్మగ్గం రూ. బీమ్మొగ్గం. వి. 1. ఒకరకం మరమగ్గం 2. గుండ్రటి ఎదురుదోనె అమర్చిన మరమగ్గం బీమ్మొగ్గం రూ.చూ. బీమ్ మగ్గం. వి. 1. ఒకరకం మరమగ్గం; 2. గుండ్రటి ఎదురుదోనె అమర్చిన మరమగ్గం. బీమ్మొద్దు వి. మగ్గం చివర పడుగు నూలు చుట్టే కొయ్యదూలం. బీమ్రాట్నం వి. ఒకరకం పెద్దరాట్నం.

బీమా అ.క్రి. ఏవిధమైన ఆర్థిక నష్టమైనా తిరిగి తీసుకొని పూర్తి చేసే బాధ్యత ;

హిం. బీమా. ఇన్స్యూరెన్సు, అభయం, భరోసా ; ఉ. భీమా. ఇన్స్యూరెన్సు, ఇన్స్యూరెన్సు కిచ్చే వడ్డీ, అందు కిచ్చేగాతం ; పార. బీమ :

క. బిమా ; త. పిమా.

<హిం. బీమా.

బీము రూ.చూ. బీమ్. వి. మగ్గానికి తగిలించిన పడుగు చివరి భాగం చుట్టటానికి అమర్చిన గుండ్రటి కొయ్య.

బీముదంతం వి. మరమగ్గంలో పన్నె బిగించిన కింది కొయ్య. బీములఅడ్డ వి. పడుగునూలు పోసే ఒకరకం మరాను.

బీయము రూ.చూ. బియము. వి. బియ్యం. ద. హిం. గా. సంపు. 4. గా. సం. 1133.

బీర[1] రూ.చూ. బీఱ. వి. అడవుల్లో ఉండే ఒకజాతి మొక్క లుప్ప. దీనిపళ్ళు చింతకాయలంతై ఎర్రగాఉండి తొడిమ చుట్టు పచ్చగా తీయగా ఉంటాయి.

బీరకాయచిక్కు వి. మిక్కిలిచిక్కు. శాల్మ. సం. 9.24. బీరకాయపీచు వి. బీరకాయయొక్క పీచు; విశ. దూరపు సంబంధానికి చెందిన. బీరపువ్వంచు వి. బీరపువ్వు ఆకారంలో డిజైన్లు పడేట్టు నేసినఅంచు. <బీరపువ్వు + అంచు[3]. బీరపువ్వు వి. బీరపాదుయొక్క పువ్వు. బీరపువ్వురంగు రూ.చూ. బీరపూవురంగు. వి. 1. పసుప్పచ్చలో కొంచెం తెలుపు వన్నె ; 2. పసుప్పచ్చ వన్నె ; 3. పసుప్పచ్చలో కొంచెం ఎరుపు వన్నె. బీరపూవురంగు రూ. బీరపువ్వురంగు. వి. 1. పసుప్పచ్చలో కొంచెం తెలుపువన్నె ; 2. పసుప్పచ్చ వన్నె ; 3. పసుప్పచ్చలో కొంచెం ఎరుపు వన్నె. బీరపూపెల్ల రూ.చూ. బీరపూపెల్లా. వి. బీరపువ్వురంగు నూలు పెట్టి నేసిన కండువా. బీరపూపెల్లా రూ. బీరపూపెల్ల. వి. బీరపువ్వురంగు నూలు పెట్టి నేసిన కండువా.

బీర[2] వి. ఇంధనంగా ఉపయోగపడే ఒకరకం చెట్టు(Hemicyclia sepiaria).

బీర[3] వి. గృహోపకరణాల తయారీకి పనికివచ్చే కలపనిచ్చే ఒక రకం చెట్టు (Elaeodendron glaucum).

బీర[4] వి. నానబెట్టి చేరిన బొంతుబద్ద.

బీరగాఁడు చూ. బీరము.

బీరగూడు చూ. బీరువా. వి. బీరువా ఆకారంలో ఉండేగూడు.

బీరగూడుదూతలు చూ. బీరువా. వి.బ.వ. కరవలు, గొల్లలు మొ. కులాలవారు పెళ్ళిలో ఒక సాంగేనికి వాడే మట్టి పాత్రలు.

బీరటాకు (-ఆకు) వి. గొర్ల మెడలకు అందానికిగాని వాటిని కాడికి పూన్చటానికిగాని కట్టే తాడు లేక తోలు.

బీరణము రూ.చూ. బీరనము. వి. ఒకవిధమైన పన్ను. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 119. క్రీ.శ. 1147.

బీరనము రూ. బీరణము. వి. ఒకవిధమైన పన్ను. ద.హిం. గా.సంపు. 4. గా.సం. 665. క్రీ.శ. 1138.

బీరప్పపండుగు వి. ఉన్ని గొంగళ్ళు నేసే కురమలు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

సం. వీర-. శూరుడు.

<సం. వీర- + అప్ప + పండుగు.

బీరము వి. 1. శౌర్యం, పరాక్రమం. భార.ఆది. 6.205 ; 2. గర్వోక్తి. భార.సభా. 2.41 ; 3. ధైర్యం. భార. అరణ్య. 1.309 ; 4. అహంకారం, గర్వం. కు.సం. 10.151 ; 5. బిగువు, కాఠిన్యం. పాండు. 3.72 ; విశ. కఠినం. చంద్రాంగ. 1.98.

సం. వీర్య-, వీర-. ; ప్రా. వీర-. పరాక్రమం, శౌర్యం ; అ.మా.జై.మహా.పా. వీర- ;

క. బీర. పిరుడు ; తు. బీరు ; మ. వీరియం.

<ప్రా. వీర-.

బీరగాఁడు (-కాఁడు) వి. పరాక్రమవంతుడు. కు.సం. 3.33.

బీరయ్యపండుగ వి. ఉన్ని గొంగళ్ళు నేసే కురమలు ముఖ్యంగా చేసుకొనే పండుగ.

సం. వీర-. శూరుడు.

<సం. పీర- + అయ్య + పండుగ.

**బీరాఁజు** స.క్రి. తుడిచి శుభ్రపరచు.

**బీరిజము** వి. అంతఃకోశం. ఆం.భా. 2.136.

సం. వీర్య-. రేతస్సు; ప్రా. విరియ-. వీర్యం, శుక్లం; పా. విరియ-.

<ప్రా. వీరియ-.

**బీరు** వి. ఒకరకమైన సారాయి (బార్లీతో చేయబడుతుంది).

ఇం. *Beer.* మత్తు కలిగించే పానీయ విశేషం.

<ఇం. Beer.

**బీరుపోవు** రూ.చూ. బీఱుపోవు. అ.క్రి. వ్యర్థమగు. కవిక. 4.71.

**బీరువ** రూ.చూ. బీరువా. వి. అంతస్తులుగా అడ్డుబల్లలమర్చిన బీగం పెట్టె.

**బీరువా** రూ. బీరువ. వి. అంతస్తులుగా అడ్డుబల్ల అమర్చిన బీగం పెట్టె. కువ.చ. 5.102.

ఫ్రెం. *Burel.* ముతకబట్ట, బల్ల; ఇం. *Bureau.* అరలున్న రాసుకునే బల్ల.

<ఇం. Bureau.

**బీరువోవు (-పోవు)** రూ.చూ. బీఱుపోవు. అ.క్రి. భయపడకుండు, బీరుత్వం చెందకుండు. కాశ. 2.61.

**బీర్లవాళ్లు** విశే.బ.వ. గొంగళ్ళు నేసే కురుపులకు పండుగలు చేయించేవాళ్ళు.

**బీఱ** రూ. బీర[1]. వి. ఒకానొక, కోశాతకి. ఆము. 2.85 (Luffa acutangula); విశే. పెద్ద.

క. హీరె, హీరి, ఈరె. బీరకాయ (Cucumis acutangula); తు. పీరె. L. Acutangula; త. పీర్, పీరమ్, పీరై, పీర్కు. Luffa acutangula; మ. పీర, పీరమ్, పీరకమ్, పీచ్చకమ్, పీచ్చి. ఒక రకం కాయ; పర్జి. ఓీర. L. Acutangula; కొలా. ఓీరా. అనపకాయ.

**బీఱజరలు** వి.బ.వ. పెద్దజరల మొత్తం. కళా. 3.72.

**బీఱవరము** వి. పెద్దవరం. ఉ.హరి. 2.126.

**బీఱు**[1] రూ.చూ. బీఱ్రు. అ.క్రి. 1. ప్రలాపించు, పేలు. కు.సం. 2.171; 2. రేగు, చెదరు. భోజ. 4.115.

**బీఱువాఱు(-పాఱు[3])** అ.క్రి. 1. బలహీనమగు, నిస్సారమగు. భార.ఉద్యో. 4.284; 2. ప్రలాపించు, పలవరించు. భార.అశ్వ. 1.103; 3. రేగు, చెదరు. గౌ.హరి. ఉ. 1701.

**బీఱు**[2] విశే. 1. అధికమైన; 2. బలమైన.

**బీఱెండ** వి. మెండైనఎండ, తీక్ష్ణమైన ఎండ. భార.ఉద్యో. 4.116. <బీఱు[2] + ఎండ.

**బీఱు**[3] విశే. వ్యర్థమైన.

క. బత్తలె, బెత్తలె. దిగంబరత్వం, లేమితనం; తు. బత్తెలె. దిగంబరం; త. వెఱుమై, వెఱితు. ఖాళీ, లాభం లేకపోవటం, పనికిమాలినతనం, నిర్లక్ష్యం, వెఱ్ఱిమై. వ్యర్థం, గౌరవాలితనం, దిగంబరత్వం; మ. వెఱుప. వ్యర్థమైన; కొ. వెఱ్. ఖాళీ.

**బీఱుపోవు** రూ. బీరుపోవు, బీరువోవు. అ.క్రి. 1. బలహీనమగు, నిస్సత్త్వమగు. భార. భీష్మ. 3.257; 2. పరాఙ్ముఖమగు, విముఖమగు. భార.కర్ణ. 2.238; 3. జంకు, వెనుదీయు. భార.కర్ణ. 2.379; 4. వ్యర్థమగు, వృథాఅగు, విఫలమగు. హం.స.పీఠి. 16. **బీఱువడు(-వడు)** అ.క్రి. 1. వ్యర్థమగు. భార.కర్ణ. 2.69; 2. గింగురుమను. వేంక.పంచ. 1 692.

**బీఱెండ** చూ. బీఱు[2].

**బీలీ** రూ.చూ. పీలీ. వి. 1. నూలు లెక్క, లడిలో తెల్పయ్యే వంతు నూలు; 2. 786 పోగుల నూలు; 3. 7860 పోగుల నూలు.

**బీన** వి. కల్లు గీతలో ఈతచెట్టుకు కట్టే మట్టి కదవ.

**బీనట** వి. కలగాపులగం. నృసింహ. 1.9.

**బీసుగుంటక** వి. పెడబెట్టిన దాళ్ళు పూడ్చిన తరవాత తోలే గుంటక.

**బీస్మెట్టు** రూ.చూ. బేసుమెంటు. వి. భూ మట్టానికి పైన పునాదిగోడ మీదినుంచి గాత్రీల కిందిభాగంవరకు కట్టబడిన గోడ.

**బీహారంచు** వి. అయిదు గొలుకుల రంగుదారం అంచు పడుగులో అతికి నేసిన సాదా అంచు.

హిం. బిహార్. భారతదేశంలోని ఒక రాష్ట్రం.

<హిం. బీహార్ + అంచు[3].

**బుకాయించు** స.క్రి. దబాయించు.

హిం. భూంక్‌నా. వ్యర్థంగా వాగటం (కుక్కలాగా), బౌబౌ అని మొరగటం.

<హిం. భూంక్(నా) + -ఇంచు[3].

**బుకాయింపు** వి. దమాయింపు.

**బుకాయింపు** చూ. బుకాయించు.

**బుకింగు ఆఫీసు** వి. టిక్కెట్లు అమ్మే చోటు.

ఇం. *Booking office.* టిక్కెట్లు అమ్మే చోటు.

<ఇం. Booking office.

**బుకిడి** వి. ఒకరకం కంచె మొక్క. మామిడి మొ. తోపుల్లో ఎక్కువగా పెరుగుతుంది (Clerodendron infortunatum).

**బుకిని** రూ.చూ. బుకినీ. వి. బొగ్గుచూర.

**బుకినీ** రూ. బుకిని, బుక్నీ. వి. పొడి.

బెం. బుకని; ఒ. బుకని. పొడి; హిం. బుక్‌నీ. వస్తువులయొక్క మెత్తని పొడి.

<హిం. బుక్‌నీ.

**బుక్క**[1] రూ.చూ. బుగ్గ[1]. వి.నోటిలోని ఖాళీ ప్రదేశం.

**బుక్క**[2] రూ.చూ. బుక్కాము. వి. గంధపొడి, సుగంధ చూర్ణం, పటవాసకం. అచలా. 2.80.

**బుక్కపిండి** వి. గంధపుపొడి.

**బుక్కరము** వి. పాములాగ ఉండే చేప.

**బుక్కము** వి. మంచి కలపనిచ్చే ఒకరకం చెట్టు.

**బుక్కా** రూ.చూ. బుక్కాము వి. గంధంపొడి, సుగంధ చూర్ణం, పటవాసకం. హంస. 1.81.

**బుక్కాగులాం** వి. ఎరుపు పసుపుపచ్చ కలిసిన వన్నె. హిం.ఉ. గులామ్. దానిమ. < ఉ. బుక్కా + ఉ.

గులామ్. బుక్కాగులాలు వి.బ.వ. శోభన ద్రవ్యాలు. బుక్కాఫకీరు వి. 1. నిరుపేద, దిక్కులేనివాడు; 2. తురకల్లో ఒకజాతి. హిం.ఉ. ఫకీర్. మహమ్మదీయ సన్యాసి. <ఉ. బుక్కా + ఉ. ఫకీర్. బుక్కాభర్గంధ వి. రంగుల పొడి. బుక్కావాఁడు విశ. గంధంపొడి మొ.వి అమ్మేవాడు.

బుక్కాము రూ. బుక్క[2], బుక్కా. వి. గంధంపొడి. మను. 3.84.

ప్రా. ముక్క; కుమా. బుకో; బెం. బుకని; ఒ. బుకని; బి. బుకుఅ; హిం.ఉ. బుకా, బుక్కా. అభ్రక చూర్ణం; పం. పార. బుక్కా; సిం. బుకీ;
క. బుక్క.
<ఉ. బుక్కా.

బుక్కాయి చూ. బుక్కాము. వి. ఒకటిన్నరడుగు ఎత్తు పెరిగే ఎరుపురంగు కాడగల ఒకరకం కలుపు మొక్క.

బుక్కాయితెగులు వి. మిరప తెగులు; ఆకులమీద బుక్కాపొడి చల్లినట్లు మచ్చలేర్పడే తెగులు.

బుక్కి రూ.చూ. బిక్కి[2]. వి. ఔషధాల్లో ఉపయోగపడే జిగురు నిచ్చే ఒకరకం చెట్టు (Gardenia gummifera).

బుక్కు[1] రూ.చూ. బొక్కు[1]. స.క్రి. ఆత్రంగా తిను.

బుక్కు[2] వి. పుస్తకం.
ఇం. *book*. పుస్తకం.
<ఇం. book.

బుక్కేడి వి. తెల్లని పూలుపూసే చిన్నచెట్టు (Ehretia laevis).

బుక్కెడు చూ. బుగ్గ[1]. విశ. నోటినిండుగా (నీరు మొ.వి).
కొం. బుకు. నోటినిండుగా; కువి. బుగ్గ. బుగ్గ; గ. బుగ్గల్. బుగ్గలు; కురు. పొకో. బూరిబుగ్గలు.

బుక్కి రూ.చూ. బుకిసి. వి. బొగ్గుమూర.

బుగడ రూ.చూ. బొగడ[1]. వి. 1. ఆడవాళ్ళు కొనచెవికి ధరించే ఆభరణ విశేషం. హంస. 2.144; 2. బుడిపి. బొప్పి. ఆం.భా. 3.57; 3. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను.

బుగడంచు రూ. బుగిడంచు, బొగిడంచు. వి. మొగ్గమాదిరి డిజైను వరసగా పడేట్టు నేసిన అంచు. <బుగడ + అంచు[3]. బుగడపేటు రూ. బొగడపేటు. వి. మొగ్గమాదిరిగా నేసిన డిజైను.

బుగత రూ.చూ. బూత[1]. వి. 1. భుక్త, భూమిగలవాడు, పొలం సొంతదారు; 2. ఎక్కువ పొలంఉన్న రైతు.

బుగతరాలు వి. యజమానురాలు. < బుగత + ఆలు.

బుగబుగ రూ. భుగభుగ. వి. 1. (నెత్తురు మొ.వి) ఒలకటం, పొరటం మొదలైనవాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. హర. 6.62; 2. పరిమళం. మను. 3.111; 3. పరిమళం వ్యాపించటానికనుకరణం. సారంగ. 2.98; 4. ఐశ్వర్యాదులవల్ల కలిగే మిడిసిపాటు.

బుగిడంచు చూ. బుగిడి.

బుగిడి రూ.చూ. బొగడ[1]. వి. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను.

బుగిడంచు రూ.చూ. బుగడంచు. వి. మొగ్గమాదిరి డిజైను వరసగా పడేట్టు నేసిన అంచు. <బుగిడి + అంచు[3]. బుగిడికటారి వి. పైన మొగ్గకింద లాహిరీ పడేట్టు నేసిన డిజైను. బుగిడికడ్డీ వి. అంచుల్లోనేసిన ఒకరకం డిజైను. బుగిడికడ్డీలు వి.బ.వ. స్త్రీలు చెవులపై ఒకవైపున ధరించే నగలు. బుగిడిగొలుసు వి. చీర అంచులో గొలుసు ఆకారంలోనేసి పక్కన మొగ్గనేసిన ఒకరకం డిజైను. బుగిడిలాయిరీ రూ.చూ. బుగిడిలాహిరీ. వి. లాహిరీ పడేట్టు నేసిన డిజైను. బుగిడిలాహిరీ రూ. బుగిడి లాయిరీ. వి. లాహిరీ పడేట్టు నేసిన డిజైను. బుగిడిసావా వి. శిఖరాకారంలో వరసగా నేసిన పెద్దమొగ్గల డిజైను.

బుగిడి రూ. చూ. బొగడ[1]. అ.క్రి. 1. వ్యాపించు. కాశీ. 6.240; 2. కాయ్య ఎండి తడిసి నిర్వీర్యమగు; వి. మొగ్గ ఆకారంలో నేసిన డిజైను.

బుగులు వి. 1. మండటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. నవనాథ. 2.91; 2. సువాసన; 3. కడుపులో దడ; 4. భయం; 5. చిత్తచాంచల్యం.
క. పొగసు. వ్యాప్తి. బుగుడు. వాపు; త. పొరుము-. (పొర్మి). ఉబ్బు, వాచు; కో. పొఙ్బ (Pongc). వృద్ధిపొందు, పెరుగు, అతిశయించు; కొం. పొగ్-. (-ఇట్-). పొంగిపొరలు. మరగు. పొక్-. (-ట్-). చిందించు, చిప్పిల్లజేయు. పొఙ్(-ట్-). వాచు, ఉబ్బు; కువి. పొఙ్గ్(-ఇట్-). వాచు. ఉబ్బు, బో-(-ర్-). చల్లు, చిందించు, బొఖలి, చల్లు, చిందించు, బొఖనై. చల్లు; నా. భగై. వాచు; పెంగో. (పొగ్-. పొక్టి-). వాచు, బొఙ్-. (-ట్-). చిందించు, చల్లు; మంద. బుక్. పోయు; కురు. పెఖ్పెఖ్రా, పెక్పెకర్రా. వాచు, ఉబ్బు; మాల్తో. పుగ్పె. పుగ్పె. పెఖర్రా.
బుగులుకొను రూ. బుగుల్కొను, భుగులుకొను. అ.క్రి. 1. పరిమళించు. కాశీ. 6.175; 2. చిప్పిల్లు, పైకిలేచు. జైమిని భా. 6.197; 3. వ్యాపించు (స్వార్థంలో). యయా. 4.120; 4. అతిశయించు, విజృంభించు. అచ్చ. రా. యు. 280. బుగులువుచ్చు రూ.చూ. భుగులువుచ్చు. స.క్రి. బయలు పరచు. నవనాథ. 3.151 పు. 1 పం. బుగులుపోవు అ.క్రి. బయలుపడు. బుగులుబుగులు వి. నీళ్ళు మొ. వి పైకెగయటంలోని ధ్వనికి అనుకరణం. భాగ. 8.55. క. బుగిల్ బుగిల్. బుగుల్కొను రూ.చూ. బుగులుకొను. అ.క్రి. 1. వ్యాపించు. ఉ.రా. 6.61; 2. అతిశయించు, విజృంభించు; 3. చిప్పిలు, పైకిలేచు.

బుగుల్కొను చూ. బుగులు.

బుగ్గ[1] చూ. పక్కలి. రూ. బుక్క[1]. వి. చెక్కిలి, దౌడ, చెక్కిలి లోపలి భాగం. హర. 2.115.
క. బుగ్గి. చెక్కిలి; గో. బుకా, పుకా, ఘకా. చెక్కిలి; కొం. బుగలి. చెక్కిలి; కుఇ. బూకలి. బుగ్గలు బలిసి పైకివచ్చిన ముఖం; పర్జి. బుక్క. చెక్కిలి.
బుగ్గచెంపలు వి.బ.వ. ఎత్తుచెక్కిళ్ళు. బుగ్గమలయు అ.క్రి. బుగ్గలుపిండు, బుగ్గలను బాధకలిగేటట్లు నలుపు. కా. 4.42. బుగ్గరించు(-ఇంచు[3]) అ.క్రి. బుగ్గలుబికించు. బసవ. 4.126. బుగ్గలించు(-ఇంచు[3]) అ.క్రి. గాంభ్రించు. పండి.వ.

5.519.

బుగ్గ[2] వి. నంతతధారగా నీరు పైకుబికే పర్వతాల్లోని స్థల విశేషం. కాశీ. 3.224.

క. బుగ్గె. నీరు ఊట, నదిపుట్టిన ప్రదేశం; త. పామ్కై. సహజమైన ధార, లేక కొలను, జలాశయం. పుక్కై. ఊటకొలను; మ. పొయ్క. కొలను, పూలతోట.

బుగ్గ[3] వి. 1. బుద్బుదం. నీటిబుడగ. ద్వి.పరమ.వి. 4.315; 2. స్ఫోటకం. గజ్జి మొ. వాటివల్ల లేచే పెద్ద పొక్కులు; 3. విస్ఫోటం బుడ్డి; 4. ఒకపదంతి ఆకిగా వ్యాపించటం; 5. బొడ్డుగొయ్య బెజ్జంలోదూర్చే దోనె చివరిభాగం; 6. మరనాదె మొన అరిగిపోకుండా బిగించిన ఇనప పొన్ను; 7. ఎదురు దోనెను మోసే కొయ్యగూటం; 8. మగ్గంమీద నేతబట్టచుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమపక్క నేలలో పాతిన కొయ్యగూటం.

క. పుగుళ్, బొక్కె, బొబ్బె. పొక్కు; కొడ. పొక్కళ్; తు. పొక్కె, బొక్కె, బొక్కు. పొక్కు, బొబ్బ; త. పొకుట్టు. బుడగ, పొక్కుళమ్. బొబ్బ, బుడగ, పొక్కు; మ. పొక్కుళ, పొక్కళ. పొక్కు, బుడగ, బొబ్బ, పొకిటు. బుడగ; కో. పొగ్ల్. పొక్కు; తొ. పిగ్. బుడగ; గోం. పొప్పల్. పొక్కు; పర్జి. పొవ(బహు. పొవెల్). పొక్కు; కొలా. బుగ్గ. బుడగ; మాల్టొ. పొక. పొక్కు. బొబ్బ.

బుగ్గఊట వి. ఒకచోట పెద్దగా నీరుబికి వచ్చే ఊట. బుగ్గకాలువ రూ.చూ. బుగ్గకాల్వ. వి. ఊట నీటి కాల్వ. బుగ్గకాల్వ రూ. బుగ్గకాలువ. వి. ఊట నీటి కాల్వ. బుగ్గకొయ్య వి. 1. నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమ పక్క నేలలో పాతిన కొయ్యగూటం; 2. ఎదురు దోనెను మోసే కొయ్యగూటం. బుగ్గలపెనం వి. గుంతలు గుంతలుగా ఉండే మట్టి పాత్ర.

బుగ్గారు చూ. బుగ్గి.

బుగ్గి రూ.చూ. బగ్గి[1]. వి. బూడిద, దుమ్ము. దూతి. నీలా. 3.16, ఆం.భా. 2.220.

కొలా. బుగ్గి. బూడిద; క. బుగ్గి. నేల, భూమి.

బుగ్గారు అ.క్రి. నాశనమగు. <బుగ్గి+-ఆరు[6]. బుగ్గిగలుపు(-కలుపు[1]) స.క్రి. వ్యర్థంచేయు. అచ్చ.రా.సుందర. బుగ్గిదాళ వి. నర్సోబప్పుడు కుండలపై చల్లటానికి బూడిద పోసి పెట్టుకొనే చిన్న మట్టి పాత్ర. బుగ్గిబరికి వి. అద్దుకొనే బూడిద పోసిన చిప్ప. బుగ్గిబూడిద వి. పూర్తి నాశనం. బుగ్గిలోపోయు స.క్రి. ధ్వంసం చేయు. బుగ్గివ్రటం వి. చెరుకు గానుగ పొయ్యికి అడుగున బూడిద కిందికి రాలటానికి పెట్టే మట్టితో చేసిన చట్రం.

బుగ్గు వి. 1. అకస్మాత్తుగా పట్టటంలో అనుకరణం. పండి.చ. 5.386; 2. పరిమళం వ్యాపించటాని కనుకరణం. శృం. నై. 8.108.

బుగ్గేలపెనం చూ. బుగ్గ[3].

బుంగ రూ. బింగి, బుంగి, బొంగ[2]. వి. 1. చిన్న మూతిగల కుండ. వేంక. పంచ. 4.341; 2. నీరు తేవటానికి ఉపయోగించే చిన్న మూతి మట్టి పంటి; 3. చేపలు పట్టి వేసికొనే తిట్టి, బుట్ట; 4. వెదురు పేళ్ళతో అల్లిన చిన్న బుట్ట; 5. చిన్న రంధ్రం; 6. ఇనపరేకుతో చేసిన పెద్ద పాత్ర; విశే. కొంచెం ఉబ్బిన.

నం. భృంగ-, బంగారుగిండి; ప్రా. భింగ- పాత్ర విశేషం, జాడీ.

<ప్రా. బింగ-.

బుంగకరవ వి. నీళ్ళు చేముకోవటానికి మూతి చిన్నదిగా అంచు మొద్దుగా ఉండే మట్టిపాత్ర. బుంగకలికి వి. పాలు పిండుకోవటానికి వాడే మట్టి పాత్ర. నం. కలశ-. కుండ, పాత్ర. బుంగకుండ వి. అంచు ఓర్పి పట్టిన మట్టి పాత్ర. బుంగకొమ్ములు వి.బ.వ. పశువు రెండు కొమ్ములపైన కలిసికొని వలయంగా ఏర్పడిన కొమ్ములు. బుంగతల వి. బుంగకొమ్ములున్న తల. బుంగతొట్టి వి. రెండడుగుల ఎత్తులో మూతి చిన్నదిగా ఉండే తొట్టి. బుంగనామము వి. మధ్యలో ఎడం లేక తీర్చిన నామం. బుంగపడు అ.క్రి. మట్టి మిద్దెలమీద వర్షానికి నందిచ్చు. బుంగపన వి. లోపలి వైపు గుండ్రంగా తిరిగి కొనలు కలిసిన కొమ్ము. బుంగపురుస రూ.చూ. బుంగపురువు. వి. నీచజలజంతు విశేషం. బుంగపురువు రూ. బుంగపురుగు. వి. క్షుద్రజల జంతు విశేషం. హంస. 4.186. బుంగబాన రూ. బుంగిబాన. వి. ధాన్యం దాచటానికి మట్టెల ఆకారంలో ఉండే పెద్ద మట్టి కాగు. బుంగమీసాలు వి.బ.వ. బుగ్గమీసాలు. బుంగమూతి వి. ముడుచుకొని పోయిన మూతి. బుంగరాయి వి. బుంగల్ని తట్టేరాయి. బుంగలరాయి రూ. బుంగ్రలాయి. వి. బుంగల్ని తట్టేరాయి. బుంగ్రలాయి రూ.చూ. బుంగలరాయి. వి. బుంగల్ని తట్టేరాయి. బుంగవాడ రూ. బుంగోడ. వి. ధాన్యం దాచటానికి వాడే మట్టి పాత్ర. బుంగోడ రూ.చూ. బుంగవాడ. వి. ధాన్యం దాచటానికి ఉపయోగించే మట్టి పాత్ర.

బుంగి రూ.చూ. బుంగ. వి. ఇనపరేకుతో చేసిన పెద్ద పాత్ర.

బుంగివంద వి. కోళ్ళగూడు ఆకారంలో మూరెడు వెడల్పు మూతితో కొంచెం సన్నగా నిలువెత్తు ఉండే అడుగు లేని మట్టి పాత్ర. బుంగిబాన రూ.చూ. బుంగబాన. వి. ధాన్యం దాచటానికి మట్టెల ఆకారంలో ఉండే పెద్ద మట్టి కాగు.

బుంగుడుపరచు రూ. బ్రుంగు. స.క్రి. కూలేటట్లు చేయు. పల్నా. 439.

బుంగోడ చూ. బుంగ.

బుచ్చాయి చూ. బుచ్చి.

బుచ్చి రూ. బుజ్జి. విశే. చిన్న, అల్పం.

బుచ్చాయి రూ.చూ. బుజ్జాయి. వి. ఆవుదూడ. బుచ్చిగా(డు వి. చిన్నవాడు. శ్రీ. శృం. 55. బుచ్చిపోవు అ.క్రి. చిన్నపోవు. బుచ్చిపాఱు(-పాఱు[3]) అ.క్రి. చిన్నపోవు.

బుచ్చిరి వి. వెంట్రుకల ముడి.

బుజ రూ.చూ. బుజము. వి. 1. బుజం. చమ. 1.25; 2. వట్రువ తనం. పాండు. 3.182; 3. సున్న.

బుజయిడు(-ఇడు) అ.క్రి. సున్నచుట్టు. బుజవైచు స.క్రి. సున్నచుట్టు, కుండలీకరించు. ఒహూగా. 5.96. బుజలువైచు

స.క్రి. సున్నచుట్టు, కుండలీకరించు. పాండు. 2.11.
బుజగవగర్ద చూ. బుజగము. వి. దాచుకొన్న ధనం.
బుజగము వి. ఇచ్ఛుకం, ఉపలాలనం ; విశ. మిక్కిలి మధుర మయిన.
సం. భుజగ-. విటుడు, పాము.
<సం. భుజగ-.
బుజంకరవ చూ. బుజము.
బుజపము వి. భోగం.
సం. భోజన-. భోగం, సాపాటు.
<సం. భోజన-.
బుజపత్తిరి రూ. బుజపత్రి. వి. వృక్షవిశేషం.
సం. భుజపత్ర-. వృక్షవిశేషం.
<సం. భుజపత్ర-.
బుజపత్రి రూ.చూ. బుజపత్తిరి. వి. వృక్షవిశేషం.
బుజబుజరేకులు వి.బ.వ. ఒక ఆట. బుజబుజ రేకులు బుజ్జా రేకులు అంటూ పాడుతూ ఆనే ఆట. రాధా. 4.124.
బుజము రూ. బుజ. వి. 1. బాహువు. హర. 7.9 ; 2. చేతి మగ్గం పలక వేలాడ దియ్యటానికి ఆధారంగా ఉండే పక్కభాగం ; 3. చేతి మగ్గం పలకకు మధ్యలో ఎత్తుగా ఉన్న భాగం.
సం. భుజ-. బాహువు ; ప్రా. భుయ- ; అ.మా. భయ-, భుయా ; పా. భుజ-. ;
క.తు. బుజ ; పర్జి. బొజొమ్ ; ఒల్లా. బుజ్జ.
<సం. భుజ-.
బుజంకరవ వి. మోయటానికి వీలుగా ఉండే నీళ్ళకరవ. <బుజము + కరవ. బుజముపుట్టువు వి. క్షత్రియుడు. అచ్చ. రా.బాల. 123. బుజముబుజముకలుపు అ.క్రి. కలిసి పనిచేయు. ధర్మజ. 73.15. బుజమువేయు స.క్రి. సిద్ధంచేయు. శాక్ల. సం. 6.145. బుజమెక్కించు అ.క్రి. అతిచనువుతో ఇచ్చు. శాక్ల. సం. 13.169. <బుజము + ఎక్కించు. బుజాలు తడిమిచూచుకొను అ.క్రి. మాటవరసకు ఎవరో ఏదో అంటే తనను గూర్చి అన్నట్లే భావించుకొని కంగారుపడు. బుజాలు మూ(రగు అ.క్రి. ఒడలుపొంగు. సారంగ. 1.39.
బుజమెక్కించు చూ. బుజము.
బుజాలుతడిమిచూచుకొను చూ. బుజము.
బుజాలుమూ(రగు చూ. బుజము.
బుజాగు వి. వానకురిస్తే బురబుర పొంగి దిగబడే చవిటినేల.
బుజూరుకు వి. పుణ్యాత్ముడు. మహాత్ముడు. విశ్వే. శ. 63.
హిం. బుజూర్గ్. వృద్ధుడు, గొప్ప. పూర్వజుడు ; ఉ. బుజూర్గ్. మహాత్ముడు. పుణ్యాత్ముడు ; పార. బుజూర్గ్. మహాత్ముడు. పుణ్యాత్ముడు ; పార. బుజూర్గ్. గొప్పకీర్తి వంతమైన, సాధువు, వయోవృద్ధుడు.
<ఉ. బుజూర్గ్.
బుజ్జగము రూ.చూ. బుజ్జవము. వి. 1. ఉపలాలనం. బుజ్జగింపు. భాస్క. రా. కిష్కిం. 681 ; 2. స్తుతి. కృష్ణ. 1.10.
బుజ్జగించు స.క్రి. 1. ఉపలాలించు. బసవ. 4.197 ; 2. స్తుతించు. పొగడు. కృష్ణ. 1.11. క. బుజ్జిఇసు. బుజ్జగించు. బుజ్జగింత వి. ఉపలాలనం. గౌ. హరి. ఉ. 667. బుజ్జగింపు వి. ఉపలాలనం. ధనాభి. 2.90. బుజ్జగింపుమాట వి. చెల్లింపుమాట.
బుజ్జగించు చూ. బుజ్జగము.
బుజ్జగింత చూ. బుజ్జగము.
బుజ్జగింపు చూ. బుజ్జగము.
బుజ్జగింపుమాట చూ. బుజ్జగము.
బుజ్జవము రూ. బుజ్జగము. వి. ఉపలాలనం. కు. సం. 6.19.
ప్రా. బుజ్జిలియ, బుజ్జాలిఅ. ప్రబోధితం, బుజ్జితి. ప్రబోధం పొందు.
బుజ్జవములెన్ను అ.క్రి. అద్దుమాటలు చెప్పు, తప్పుపెట్టు. కు. సం. 6.19. <బుజ్జవము + -లు + ఎన్ను.
బుజ్జాయి చూ. బుజ్జి.
బుజ్జి రూ.చూ. బుచ్చి. విశ. చిన్న.
బుజ్జాయి రూ. బుద్యాయి. వి. లేగదూడ.
బుజ్జిగ వి. లాజేలు ఆకారం లాగా బద్దపాటుగా గుండ్రంగా చిన్న మూతితో ఉండే మట్టిపాత్ర.
బుటక రూ.చూ. బుటుక్కు. వి. నీటమునిగి పైకి లేవటం.
బుటా రూ. బుట్టా, బూటం. వి. 1. వస్త్రంపై చిత్రితమైన పుష్పం. ద్వి. సార. చ. 1.14వ. 2పం ; 2. నేతలో రెండంచుల మధ్య నేసిన డిజైను.
ఒ. బుట్లా. వస్త్రాలపై వేసేపుష్పం ; హిం. బూటా. వస్త్రాదులపై చిత్రితమైన పుష్పం ; మరా. బుటా.
<మరా. బుటా.
బుటాఊచ రూ. బుట్టాఊస. వి. నేతలో పువ్వుమాదిరి డిజైను నెయ్యటానికి ఒడిమట్టిన ఊచ. బుటాకమ్మి వి. రెండు అంచులకు మధ్యభాగంలో బుటాలు నేసిన కమ్మి. బుటాచీర రూ. బుటాచీరె, బూటాచీర. వి. రెండు అంచులకు మధ్యభాగంలో రకరకాల బుటాలు పడేట్టునేసిన చీర. బుటాచీరె రూ.చూ. బుటాచీర. వి. రెండుఅంచులకు మధ్య భాగంలో రకరకాల బుటాలు పడేట్టు నేసిన చీర. బుటా జుట్టు రూ. బుట్టాజుట్టు. వి. డిజైన్లు నేసే చేతి మగ్గంలో అడ్డబేటునుంచి పడుగులోకి వేలాడే దారాలు. బుటాతీయు రూ. బుట్టాతీయు. అ. క్రి. నేతలో పువ్వులు, ఆకులు, చుక్కలు మొ. డిజైన్లు వచ్చేట్లు రెండలతో పోగులు మలుపు. బుటావేత వి. నేతలో పువ్వులు, ఆకులు, చుక్కలు. మొ. డిజైన్లు వచ్చేట్లు బెండలతో పోగులు మలిపి నేసిన నేత. బుటామగ్గం వి. నేతలో రెండుఅంచులకూ మధ్యభాగంలో బుటాలు పడేట్టు నేసే మగ్గం. బుటాలకమ్మి వి. రెండంచులకు మధ్యభాగంలో బుటాలు నేసినకమ్మి. బుటాలచీర రూ. బుటాలచీరె, బూటాలచీర. వి. బుటాలు పడేటట్లు నేసిన చీర. బుటాలచీరె రూ. చూ. బుటాలచీర. వి. బుటాలు పడేటట్లు నేసినచీర.
బుటుకు రూ.చూ. బుటుక్కు. వి. 1. మునగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం పాండు. 5.286 ; 2. నీటిలో మునిగి పైకిలేవటం.
బుటుక్కు రూ. బుటక, బుటుకు. వి. మునగటంలో అయ్యే ధ్వన్యనుకరణం. పాండు. 5.283.
బుటేదారు చూ. బుటా. వి. నగిషీ పనికలది.

మరా. బుటాదార్. నగిషీపని ; పార. బొతహదార్.

<మరా. బుటాదార్.

బుట్ట రూ. బొట్ట², బొట్టె⁴. బొత్త². వి. 1. పుష్పాదులుంచే కరండం. హర. 7.44 ; 2. పశువుల దాణా పెట్టేతట్ట ; 3. పశువులు మెయ్యటానికి వీలులేకుండా మూతికి వేసే జల్లి బుట్ట ; 4. వెదురు బద్దలతో అల్లిన పెద్దగంప ; 5. ధాన్యం నిలవచేయటానికి మట్టితో చేసిన నిర్మాణం ; 6. పోతపోయ వలసిన సిమ్మెంటు మొదలైన వాటికి ఆకారమిచ్చే వివి ధాగాల కలయిక ; 7. ఉప్పు.

క. ప్రుట్టి, బుట్టి, బుట్టె. గంప ; తు. పుదయి, పుడాయి, బుట్టి. గంప ;

సం. పుట-. పూలబుట్ట, దొన్నె.

బుట్టకొమ్ము వి. లావుగా పొట్టిగా డోకిగా ఉండేకొమ్ము. బుట్టతాడు వి. మగ్గం ఉరతకు పైన కట్టినదారం. బుట్టదాఖలుచేయు స.క్రి. 1. లెక్కచేయకపోవు ; 2. పనికిరాని కాగితాల బుట్టలో పడవేయు. బుట్టమేపు వి. బుట్టలోవేసి పశువులకు పెట్టే గానుగ పిండి, ఉలవలు మొ.వి. బుట్టరి వి. అల్పవ్యక్తి. <బుట్ట¹. +-అరి. బుట్టలు వి.బ.వ. జుంకాలు. చెవికి పెట్టుకొనే ఒకరకం నగలు. బుట్టలో(బెట్టు (-పెట్టు) స.క్రి. 1. లోగట్టుకొను ; 2. నిర్వీర్యునిచేసి స్వాధీనం చేసికొను ; 3. మోసం చేయు. బుట్టలోవేసికొను స.క్రి. వశంచేసికొను.

బుట్టా రూ.చూ. బుటా వి. వస్త్రంపై చిత్రితమైన పుష్పం. నేతలో డిజైను.

బుట్టాఊచ రూ.చూ. బుటాఊచ. వి. నేతలోపువ్వు మాదిరి డిజైను నెయ్యటానికి జరీచుట్టిన ఊచ. బుట్టాజట్టు రూ. చూ. బుటాజట్టు. వి. డిజైన్లు నేసేచేత మగ్గంలో అర్ధబేలు నుంచి పడుగులోకి వేలాడే దారాలు. బుట్టాజాపించు (-చూపించు) అ.క్రి. ఎగవేయు. బుట్టాతీయు రూ.చూ. బుటాతీయు. అ.క్రి. నేతలో పువ్వులు, ఆకులు, చుక్కలు, మొ. డిజైన్లు వచ్చేటట్లు బెండలతో పోగులు మలువు.

బుట్టి రూ. బుట్టిక. వి. 1. పుష్పాదులుంచే కరండం. కాశీ. 4.96 ; 2. పశువులు మెయ్యటానికి వీల్లేకుండా మూతికి వేసే జల్లిబుట్ట ; 3. పదిముంతల పరిమాణంగల ధాన్యం కొలత ; 4. బాగా పెరిగిన తలవెంట్రుకలు ; 5. వెదురు బద్దలతో అల్లిన పెద్దగంప.

క. బుట్టి, బుట్టె. గంప ;

సం. పుటీ. గంప.

<క. బుట్టి.

బుట్టిఎర రూ. బుట్టెర. వి. బుట్ట విడిచిన దసలి పురుగులు మొదటి పది రోజులకు విడిచిన కూనం. బుట్టిఎరుచు అ.క్రి. బుట్టలోఉన్న ఆర దసలి పురుగుల్ని చెట్టుమీదికి పాకించు. బుట్టికుండ వి. నీళ్ళు చేదుకోవటానికి బుట్టిలాగా ఉండే చిన్న మట్టిపాత్ర. బుట్టిగుంజ వి. పెంత బల్లమీద నిలువు గుంజ. బుట్టిపంద వి. మూతి బుంగగా అంచుతో కూడిన వంద పైభాగం. బుట్టిపరుచు అ.క్రి. బుట్టలో ఉన్న దసలి పురుగుల్ని చెట్టు మీదికి పాకించు. బుట్టెర రూ.చూ. బుట్టిఎర. వి. బుట్ట విడిచిన దసలి పురుగులు మొదటి పది రోజులకు విడిచిన కూనం.

బుట్టిక రూ.చూ. బుట్టి. వి. బుట్ట. ద్వి.సార.చ. 2.

బుట్టె వి. మల్ల సాధన విశేషం. హంస. 1.205.

బుట్టెర చూ. బుట్టి.

బుట్టేదారి వి. వస్త్రాదులపై నేసే నగిషీ పని.

మరా. బుటాదారి. నగిషీ కలది ; పార. బొతహదారీ.

<మరా. బుటాదారి.

బుట్రేవు (-రేవు) వి. గుత్తగూబ. ఆం.పదా. 5.36.

బురంఅంచు చూ. బురను⁴.

బురక¹ రూ.చూ. బురుక. వి. తానం, మునక. అభిషేకం.

బురక² చూ. బురుపు. వి. రాతిలో ఎత్తుగాఉన్న భాగం.

బురకాలి చూ. బుర్ర¹. వి. తెలుగులో చిలకదుద్దుగు అని పిలవబడే పెద్దచెట్టు (Fragrant clerry nutmeg).

బురకాపె చూ. బుర్ర¹. వి. ఒకరకం కలుపుమొక్క. కాకి గడ్డిలో నాసిరకం (Solonum nigrum linn).

బురకోడి చూ. బుర్ర¹. వి. సీరుకోడి, జలకుక్కుటం.

బురగ వి. 1. బుగ్గ ; 2. మునక ; 3. సీటిపైన గాలి నిండి ఏర్పడిన ఉబ్బు ; 4 రసపుట్టంలోని కదిలే బిందువు.

సం. బుద్బుద-. బురగ.

బురంకొమ్ము చూ. బురను⁴.

బురజాల చూ. బుర్ర¹. వి. వనకంటక, గుల్మ విశేషం.

బురజాలతుమ్మ రూ.చూ. బుర్రజాలతుమ్మ. వి. పొదలాగ పక్కలకు విస్తరించి పెరిగే తుమ్మ (Aaccia raxburghii).

బురత రూ.చూ. బురుత. వి. గుద్దలి తూము దగ్గర సన్నగా ఉండే భాగం.

బురతదారిమ్మ వి. లేత పసుపు రంగు పూలు పూసే గుండ్రంగా ఉండే పళ్ళు కాసే పీచు నిచ్చే బెరడు కలిగిన మంచి కలపనిచ్చే ఒకరకం చెట్టు (Careya arborea). బురతవాచు వి. నాచులో ఒకరకం. బురతలుతీయు అ.క్రి. పడుగులో మురతలు తీసి సాపుచేయు.

బురతీసు రూ.చూ. పరతీసు. వి. పోర్చుగాలు దేశ సంబంధి. పోర్చుగాలు దేశ భాష. బురతీసు జాతి.

బురదపేడి వి. లేత పసుపురంగు పూలు పూసే, గుండ్రంగా ఉండే పళ్ళు కాసే పీచునిచ్చే బెరడు కలిగిన మంచి కలప నిచ్చే ఒకరకం చెట్టు (Careya arborea).

బురబుర రూ. బురబురి. వి. 1. బొబ్బలు లేవటంలో అయ్యే అనుకరణం. భార.అరణ్య. 2.94 ; 2. కక్కటం. నీటిలో నుండి పైకి లేవటం మొదలైనవాటి ధ్వనికి అనుకరణం. భాగ. 8.701.

క. బుర, బురు, బొర. ఏదైనా పాత్రని నీటిలో ముంచినప్పుడు పైకి వచ్చే ధ్వనికి అనుకరణం. పాత్ర నుంచి నీరు వేగంగా బయటికి వచ్చేటప్పటి ధ్వని. గలగల శబ్దం చేసే డోలుయొక్క ధ్వని. బురక్కనె. బురబుర శబ్దంతో ; తు. బుడుబుడు. చుక్కలుగా పడు ;

చూ.మరా. బుడ్బుడ్ణె. బురగలువచ్చు.

బురబురపట్టు అ.క్రి. వార్త అంతటా పాకు.

బురబురి రూ.చూ. బురబుర. విఐ. కల్లబొల్లి.

బుడబూరిజ వి. లేత పసుపురంగు పూలు పూసే గుండ్రంగా ఉండే పళ్ళు కాసే పీచునిచ్చే బెరడు కలిగిన మంచి కలప నిచ్చే ఒకరకం చెట్టు (Careya arborea).

బుడమ[1] చూ. బుడుత. వి. 1. మెట్టనేలల్లో లేచి పెరిగే ఎక్కుడు తీగ, పసుప్పచ్చటి పూలు పూస్తుంది (Cucumis trigonus) ; 2. దోస జాతికి చెందిన తీగె పైరు (Cucumis pubescanse).

బుడమదోస వి. కాయ నూగునూగుగా చిన్నదిగా ఉండి ఊరగాయగా ఉపయోగించబడే దోస (Cucumis maderas patanus).

బుడమ[2] చూ. బుడుత. రూ. బుడము. వి. 1. దొండ జాతిలో చేరిన కాయ. ఆం.భా. 2.71 ; 2. పల్లగా ఉండే దోస జాతికి చెందిన కాయ ; 3. చెట్టు కింది భాగం.

బుడమ[3] చూ. బుడుత. వి. పసుపుపచ్చగా ఉండే మెత్తని కలప నిచ్చే ఒకరకం చెట్టు (Solaneem verbasci-folium).

బుడమ[4] చూ. బుడుత. రూ. బుడువు. వి. ధాన్య విశేషం. హంస. 4.128.

బుడంఅంచు వి. పాత్రలకు పెట్టే గుండ్రని అంచు. బుడంకొమ్ము రూ. బుడెంకొమ్ము. వి. లావుగా పొట్టిగా బోడిగా ఉండే కొమ్ము. బుడమవడ్లు వి.బ.వ. మెట్టవడ్లలో ధాన్యం ముతగ్గా ఉండే ఒకరకం వడ్లు. బుడంమేకు వి. తలుపు చెక్కలను కలిపించటానికి వాడే రెండువైపులా పదునున్న తీగె మేకు.

బుడమర వి. చిన్న చిన్న ఆకులు కలిగిన ఒకరకం చిన్న చెట్టు (Grewia salvifolia).

బుడమద్రి[1] వి. తెల్లని పూలు పూసే ఒకరకం తీగ (Symphorema involucratum).

బుడమద్రి[2] వి. బొమ్మ మేడిచెట్టు.

బుడము రూ.చూ. బుడమ[2]. వి. 1. చెట్టు మొదలు ; 2. దొండ జాతిలో చేరిన కాయ ; 3. పల్లగ ఉండే దోస జాతికి చెందిన కాయ.

బుడంమేకు చూ. బుడమ[4].

బుడాలున క్రి.విశ.ద్రు. ఒక్కసారిగా. ధ్వన్యను.

బుడి వి. తొట్రుపాటు. ధ్వన్యను.

బుడిబుడి రూ. బుడిబుడిపి. విశ. 1. అస్పష్ట ధ్వని ఉన్న. భార.ఉద్యో. 3.393 ; 2. కృత్రిమం, తెచ్చిపెట్టుకున్న. పండి.చ. 1.58 ; 3. చిన్నిచిన్ని. భాగ. 8.541 ; 4. అల్పం, కొంచెం. మను. 3.28 ; 5. తొట్రుపాటుఉన్న. అచలా. 3.40 ; క్రి.విశ.ద్రు. తొందరగా. అష్టమ.క. 4.207 ప. ; వి. బాలచంద్రుడు. బుడిబుడికన్నీరు వి. కొంచెం కన్నీరు. మను. 3.28. బుడిబుడిక్రాల్పుడు వి. బాలచంద్రుణ్ణి ధరించిన, శివుడు. పాండు. 4.239. బుడిబుడిదీర్ఘములు వి.బ.వ. దొంగ ఏడుపులు. బుడిబుడి నడలు వి.బ.వ. గబగబ నడకలు (ధ్వన్యను.). శుక. 3.302. బుడిబుడి మాటలు వి.బ.వ. ముద్దు మాటలు. భార.ఉద్యో. 3.393. బుడిబుడి మాయలు వి.బ.వ. కృత్రిమం అయిన మోసాలు. బుడిబుడియేడ్పులు (-ఏడ్పులు) వి.బ.వ. దొంగ ఏడ్పులు. శుక. 2.212. బుడిబుడిసంగాతాలు వి.బ.వ. దొంగ స్నేహాలు, మాయతో కూడిన సాంగత్యాలు. తాళ్ల.సం. 8.220. బుడిబుడ్లపోవు రూ. బుడిబుడ్లపోవు, బుడిపుల్లపోవు. అ.క్రి. తొట్రుపడు. బసవ. 5.193. బుడిబుడ్లపోవు(-పోపు) రూ.చూ. బుడిబుడ్లపోవు. అ.క్రి. తొట్రుపడు. బసవ. పు. 5.7 పం. బుడిపడు (-పడు) అ.క్రి. తొట్రుపడు. ఉ.హరి. 6.164. బుడిపుల్లపోవు(-పోవు) రూ.చూ. బుడిబుడ్లపోవు. అ.క్రి. తొట్రుపడు. పండి.చ. 1.10.

బుడికట్ల వి. బాలక్రీడా విశేషం. దశా. 9.109.

బుడికి రూ.చూ. బుడిగె. వి. చాలా చిన్న అమ్మాయి.

బుడిగ రూ.చూ. బుడిగె. వి. 1. కమండలం. ఆం.భా. 2.177 ; 2. బుడ్డి, చిన్నమూతిఉన్న చిన్నకుండ. ఆం.భా. 2.246 ; 3. ఎద్దుమీది ఒకవైపు సిద్దె ; 4. చిన్నదైనది ; 5. తమలపాకుల చిన్నకట్టలు కొన్నిటిని చేర్చి కట్టిన పెద్దకట్ట ; 6. పిల్లలాడుకొనే చిన్న మట్టిపాత్ర.

బుడిగజంగము వి. బుడిగ వాద్యంతో తందాన కథలు చెప్పి జీవించే జంగంవాడు. బుడిగల్రాయి రూ. బుడుగుల్రాయి. వి. బుడిగలను తట్టేరాయి.

బుడిగి రూ.చూ. బుడిగె. వి. 1. వామనుడు. పొట్టివాడు. ఆం.భా. 2.123 ; 2. తమలపాకుల చిన్నకట్టలు కొన్నిటిని చేర్చి కట్టిన పెద్దకట్ట ; 3. చిన్నదయినది ; 4. పిల్లలు ఆడుకొనే మట్టిపాత్ర ; 5. అన్నం వండటానికి వాడే మట్టిపాత్ర.

బుడిగికొమ్ము వి. లావుగా, పొట్టిగా బోడిగా ఉండే కొమ్ము. బుడిగిగుడ్డ వి. పైజామాలకోసం నేసిన బట్ట.

బుడిగె రూ. బుడికి, బుడిగ, బుడిగి. వి. 1. బుడ్డి, చిన్నమూతి ఉన్న కుండ. హంస. 2.76 ; 2. కమండలం ; 3. ఎద్దు మీది ఒకవైపు సిద్దె ; 4. అన్నం వండటానికి వాడే మట్టి పాత్ర.

బుడిగెజంగము వి. బుడిగెలు వాద్యంచేస్తూ భిక్షమెత్తేవారు.

బుడిదీ రూ. బుడుడు. వి. నీటిలోతును కనుగొనటానికి నావికులు వాడే సీసంగుండు.

పో. బొర్డు ; స్పా. బోర్డో.

బుడిదీవేయు అ.క్రి. సీసంముక్క వదిలి లోతు కనుగొను. ఆం.భా. 6.38.

బుడిపి రూ. బుడిపె, బుడుపు, బుడ్పి. వి. 1. దేహంలో ఉబ్బుగా లేచే బొప్పి. కాశీ. 3.177 ; 2. వృక్షాదుల్లో ఏర్పడే గ్రంథి. ముడి. ఆం.భా. 2.74.

బుడిపె రూ.చూ. బుడిపి. వి. 1. నువ్వులు నిప్పుమీద చల్లినప్పుడు అయ్యే బొరుగు ధాన్యం వేడికి పేలి ఉబ్బటం ; 2. రాతిలో ఎత్తుగాఉన్న భాగం.

బుడిబుడిపి రూ.చూ. బుడిబుడి. వి. సంభ్రమం. వసు. 4.65 ; విశ. కొంచెం.

బుడిబుడుక్క రూ.చూ. బుడుబుడుక్క. వి. హుడుక్క.

బుడిమి చూ. బుడుత. వి. గుండ్రటి గుడిసె.

బుడియు అ.క్రి. కార్యం వైకల్యమగు, పని చెడిపోవు.

క. బొడె ; త. పుళై. జల్లించు, కొట్టు, చీల్చు, విరగొట్టు.

బుడుక చూ. బుడుంగు. రూ. బుడక[1]. వి. మునక, స్నానం. ఆం.బా. 2.60.

బుడుకు వి. పణ్యారం, తినుబండారం.

బుడుగు చూ. బుడుత. విశే. 1. నీచుడు. వేంక. పంచ. 1.763; 2. పొట్టి. చంద్రాంగ. 1.70; వి. వానకురిస్తే బురబుర పొంగి దిగబడే చవిటి నేల.

బుడుగ్రాయి రూ.చూ. బుడిగ్రాయి. వి. బుడిగలను కట్టేరాయి.

బుడుంగు వి. మునగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ధ్వన్యను.

బుడుత రూ. బుడత, బుడుతడు. విశే. 1. లేత. వరాహ. 6.89; 2. పొట్టివాడు, వామనుడు. ఆం.బా. 2.123; వి. 1. బాలిక, బిడ్డ. ఆము. 6.109; 2. కొడుకు.

క. పుదుంగ, బాలుడు, చిన్నబిడ్డ. పుడిగి. బాలిక; త. పొడి. చిన్నదైన, చిన్నబిడ్డ, పొడియన్. బాలుడు, గుర్తింపు లేనివాడు; గోం. పుట్టి. పొట్టి; గ. పుట్టి. చిన్నది.

ప్రా. ఫిత్థ. పొట్టి.

బుడుతకాసెలు వి.బ.వ. వస్త్ర విశేషం. హంస. 5.356.

బుడుతడు రూ.చూ. బుడుత. వి. 1. బాలుడు. ఉ.రా. 6.190; 2. బిడ్డ. శుక. 1.97; 3. చిన్నవాడు, బాలుడు. చెన్నబసవ. 3.78.

బుడుదు రూ.చూ. బుడిది. వి. నీటిలోతును కనుక్కోవటానికి నావికులు వాడే సీసపుగుండు.

బుడుపు రూ.చూ. బుడిపి. వి. 1. రాతిలో ఎత్తుగా ఉన్న భాగం; 2. చిన్నమునక; 3. దెబ్బతగిలి ఏర్పడిన బొప్పి.

బుడుబుడుక్క రూ. బుడిబుడుక్క. వి. సన్నమైన నడిమి భాగం కలిగి విరివి అయిన రెండు చివర్లలో తోలుతో కప్పబడిన చిన్న వాద్యం. ఆం.బా. 1.128.

క. బుడబుడికె, బుడుబుడికె. గలగలా శబ్దంచేసే ఒక చిన్న డోలు.

బుడుబుడుక్కలవాడు విశే. సాయిలవాడు, బుడుబుడుక్క అనే వాద్యాన్ని వాయిస్తూ బిచ్చమెత్తి జీవించేవాడు. బుడుబుడుక్కలచేతలు చూ. బుడుబుడుక్కవాడు. వి.బ.వ. నమ్మదగని చేష్టలు. బుడుబుడుక్కవాడు విశే. బుడబుక్కలవాడు భిక్షద్వారా జీవించేవాడు (వీని వాద్యం బుడుబుడుక్క).

బుడుమురు వి. సితకోసం పెంచబడే మెత్తని కలపనిచ్చే ఒక రకం చెట్టు (Trema orientalis).

బుడువు రూ.చూ. బుడమ[4]. వి. బుడమపండు.

బుడుసర వి. కాకమూచి, వృక్షవిశేషం.

బుడుపు వి. 1. పక్క, సన్నం. హరిశ్చం. 4.168; 2. జొన్న మొ. వాటి వేళ్ళతోడి మూలభాగం.

బుడెగ వి. ఒకరకం కలుపు మొక్క.

బుడెంకొమ్ము రూ.చూ. బుడంకొమ్ము. వి. లావుగా పొట్టిగా బోడిగా ఉండే కొమ్ము.

బుడ్డ[1] వి. 1. వృద్ధిచెందిన అండం; 2. నీటిబుగ్గ; 3. రసమట్టంలో కదిలే బిందువు; 4. రాతిలోని గుండ్రంగా ఉండే పెచ్చు.

క. బుడ్డె. పెరగటం లేక ఉబ్బటం, వాచిన అండం; త. పుడ్డా, పుడ్డై. వాచిన అండం, బాగా ఉబ్బిన అండకోశం; పర్జి. బుడ్డ్. జననాంగాలు; కొలా. బుడ్డె. జననాంగాలు (స్త్రీ లేక పురుషుని) అంగాలు.

బుడ్డకట్టె వి. వేరుసెనగ తీగ (Arachis hypogala). బుడ్డకడవ వి. గుండుగా ఉండే చిన్న మట్టిపాత్ర. బుడ్డకంది వి. ఒకరకం కందులు. బుడ్డకల్లు రూ. బుడ్డికల్లు. వి. గీత చెట్టుకు రాత్రి కట్టిన లొట్టెను ఉదయం దించక మధ్యాహ్నం దించి తీసిన కల్లు. బుడ్డకవెల వి. ఒకరకం తురకల గళ్ళ లుంగీ. బుడ్డకాకర రూ. బుడ్డగాకర, బుడ్డగాకర. వి. ఒకరకం తీగ, శక్రవల్లి (Cardiospermum canescens). బుడ్డకాసర వి. ఏటా లేచి పెరిగే సులికాయలుగల ఒకరకం ఎక్కుడు తీగ (Cardiospermium falicacabum). బుడ్డకుసుమ వి. ఒకరకం ముతక వడ్లు. బుడ్డకేతిగాడు వి. తోలుబొమ్మలాటలో అశ్లీలపు హాస్యగాడు. బుడ్డకేరి వి. మెట్ట నేలల్లో లేచి పెరిగే ఒకరకం కలుపు మొక్క. బుడ్డకేసరి వి. కొంచెం తెలికి గింజరకం వడ్లు. బుడ్డకొట్టు అ.క్రి. ఎదపట్టు, పిడిగొట్టు. బుడ్డకొణుజు రూ. బుడ్డకొణుసు. వి. పశువుల దేహాన్ని పట్టి నెత్తురు పీల్చే ఒకజాతి గోమారి. బుడ్డకొణుసు రూ.చూ. బుడ్డకొణుజు. వి. 1. పశువులకు పట్టే గుండ్రటి చిన్న పురుగు; 2. పురుగుజ్జు. బుడ్డకోడిపేటి రూ.చూ. బుడ్డకోడిపేటు. వి. చిన్నకోడి ఆకారంలో నేసిన అంచు డిజైను. బుడ్డకోడిపేటు రూ. బుడ్డకోడిపేటి. వి. చిన్నకోడి ఆకారంలో నేసిన అంచు డిజైను. బుడ్డక్కుళ్ళు వి.బ.వ. ఒకరకం వడ్లు. <బుడ్డ[1]+అక్కుళ్ళు. బుడ్డగంతులువేయు అ.క్రి. పిల్లిగంతులువేయు. బుడ్డగాకర (-గా(కర) రూ.చూ. బుడ్డకాకర. వి. ఒకరకం తీగ, ఆగాకర తీగ. బుడ్డగించు అ.క్రి. (పంది) ముట్టెతో భూమి మొదలైన వాటిని పెల్లగించు. ఆము. 4.21. బుడ్డగింపు వి. (పంది) ముట్టెతో కోరాడటం. ఆం.బా. 2.52. బుడ్డగిరిజొన్న వి. ఒకరకం జొన్నలు. బుడ్డగులకలు వి.బ.వ. ఒకరకం వడ్లు. బుడ్డగ్రుడు(-గ్రుళ్ళు) వి. పొగ, మిరప, వేరుసెనగ మొ. చేలలో తోచే చిన్న సైజు గ్రుడు. బుడ్డగోధుమ వి. పిండికి ఉపయోగించే తెల్లటి పొట్టి గింజ రకం. బుడ్డచిప్పి వి. నారింజ జాతికి చెందిన ఒకరకం చెట్టు (Citrus Aurantium). బుడ్డజాలతుమ్మ రూ. బుడజాలతుమ్మ. వి. పొదలాగా పక్కలకు విస్తరించి పెరిగే తుమ్మ. బుడ్డజొన్న వి. మొక్క పొట్టిగా ఉండే రకం. బుడ్డడు వి. 1. తాత; 2. చిన్న పిల్లవాడు. బుడ్డతడిమి వి. దసరిపురుగులకు ఆహారంగా వేసే ఒకరకం ఆకులు గల చెట్టు. బుడ్డతిమ్మాయిలు వి. పొట్టికంకి, పచ్చగింజ గల రకం జొన్న. బుడ్డతుమ్మ వి. ఇంధనంగానూ పనిముట్ల తయారీకి పనికి వచ్చే కలపనిచ్చే ఒకరకం చెట్టు. హంస. 4.9 (Acacia planifrons). బుడ్డతెగులు వి. పొగ చెట్టుకు బుడిపెలేర్పడే తెగులు. బుడ్డదద్దుగ వి. అడవుల్లో పెరిగే ఒకరకం పెద్ద చెట్టు (Saccopetalum tomentosum). బుడ్డమ

భామ వి. బోగోతంలో హాస్యగాడు. బుడ్డవక్కి వి. మంచి నీటి చిన్న చేప. బుడ్డవంటె వి. పంటెకు బదులు నూలు చుట్టుకొనే రేకు డబ్బా. బుడ్డపిడుగు వి. 1. పశువులకు పట్టే గుండ్రటి చిన్న పురుగు ; 2. మరుగుజ్జు. బుడ్డపిడుఁజు రూ. బుడ్డపిడుఁదు. వి. ఒకజాతి గోమారి. బుడ్డపిడుఁదు రూ.చూ. బుడ్డపిడుఁజు. వి. 1. ఒకజాతి గోమారి ; 2. మరుగుజ్జు. బుడ్డపురుగు వి. వేరుసెనగ, ఉలవ, పెసర మొ. పైర్ల కాయల్లో పడి గింజలు తినే పురుగు. బుడ్డపెదవి వి. దళసరి పెదవి. బుడ్డపొదుగు వి. పెద్ద పొదుగు. బుడ్డపొల్లు వి. వేరుసెనగ కాయల తొక్క (Arachis hypoyala). బుడ్డబీర వి. ఒకరకం బీర. బుడ్డబుచ్చల వి. ఎర్రనేలలో పెరిగే కలుపు మొక్క (Physalis perwviana). బుడ్డబురద వి. ఎర్ర నేలల్లో పెరిగే కలుపు మొక్క (Physalis perwviana). బుడ్డబురదస రూ.చూ. బుడ్డబుడుసర. వి. ఎర్రనేలల్లో పెరిగే కలుపు మొక్క (Physalis perwviana). బుడ్డబురదసల రూ.చూ. బుడ్డబుడుసర. వి. ఎర్రనేలల్లో పెరిగే కలుపు మొక్క (Physalis perwviana). బుడ్డబుడిస రూ.చూ. బుడ్డబుడుసర. వి. ఎర్ర నేలల్లో పెరిగే కలుపు మొక్క (Physalis perwviana). బుడ్డబుడుసర రూ. బుడ్డబుదస, బుడ్డబుదసల, బుడ్డబుడిస, బుడ్డబుడుసల, బుడ్డబూసర, బుడ్డమిసిరి. వి. ఓషధివిశేషం. బుడ్డబుడుసల రూ.చూ. బుడ్డబుడుసర. వి. ఒకరకం కలుపు మొక్క. బుడ్డబూసర రూ.చూ. బుడ్డబుడుసర. వి. కాచర, కాజర, కాసర. బుడ్డబెండ వి. ఆకులు ఏడు మాత్రమే ఉండే బెండ. బుడ్డబెదిరింపులు వి.బ.వ. పనికిమాలిన బెదిరింపులు. బుడ్డమల్లెలు వి. కంకి గుండ్రంగా పొట్టిగా ఉండే జొన్న. బుడ్డమిరప వి. ఒకరకం మిరప. బుడ్డమిసిరి రూ.చూ. బుడ్డబుడుసర. వి. ఓషధి విశేషం. బుడ్డ మొలకొలుకులు వి.బ.వ. ఒకరకం వడ్లు. బుడ్డలలం వి. నేలలో దుంపలుండి పైన ఉల్లికాడలాటి కాడలతో పెరిగే కలుపు మొక్క. <బుడ్డ[1]+లు+అలం. బుడ్డవక్క వి. మత్స్యవిశేషం. బుడ్డవంకెలు వి.బ.వ. ఒకరకం వడ్లు. బుడ్డవాఁడు విశే. అంతవృద్ధికలవాడు. బుడ్డసద్ద వి. మూడు నెలల కాలంలో పండే సజ్జరకం. బుడ్డసంబవులు రూ.చూ. బుడ్డసంబావులు. వి.బ.వ. తేలికరకం ధాన్యం. బుడ్డ సంబావులు రూ. బుడ్డసంబవులు. వి. తేలికరకం ధాన్యం. బుడ్డెర్రజొన్న వి. తక్కువకాలంలో పండే ఎర్రగింజరకం. <బుడ్డ[1]+ఎఱ్ఱజొన్న. బుడ్డోర రూ.చూ. బుడ్డోత. వి. గింజలు నిలవవేయటానికి 3½ కైవారంతో మూతి చిన్నగా గుండుగా ఉండే ఓత. బుడ్డోత రూ. బుడ్డర. వి. గింజలు నిల్వచేయటానికి 3½ కైవారంతో మూతి చిన్నగా బుడ్డగా ఉండే ఓడ. <బుడ్డ[1]+ఓడ.

బుడ్డ[2] వి. సన్నని ఆకులు కల ఒకరకం అడవి మొక్క (Grewia hirsuta).

బుడ్డ[3] వి. ఇలాతికాయ, నేలసెనగ, పల్లికాయ, భూసెనగ, సీమసెనగ (Groundnut, Arachishypogala).

బుడ్డకాయలు వి.బ.వ. వేరుసెనగకాయలు. బుడ్డమానె వి. వేరుసెనగనూనె. బుడ్డలపొట్టు వి. వేరుసెనగ కాయల పొట్టు. బుడ్డలు రూ. బుడ్లు. వి.బ.వ. 1. సెనగ బుడ్డలు, వేరుసెనగకాయలు ; 2. చిన్న మొక్క జొన్న కంకులు ; 3. నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis hypogsea). బుడ్లు రూ.చూ. బుడ్డలు. వి.బ.వ. 1. వేరుసెనగ కాయలు ; 2. చిన్న మొక్క జొన్న కంకులు ; 3. నూనె తీయటానికి ఉపయోగించే ఒకరకం పప్పు దినుసు (Arachis hypogsea).

బుడ్డ[4] వి. పొగాకు తెగులు, గొంగళి పురుగులు చెట్టుకాడ తొలవగా ఏర్పడే రోగం (Gnorimoschema leliopa).

బుడ్డాం చూ. బుడ్డ[1]. రూ. బొడ్డాం. వి. 1. బండి ఎద్దులను విడిచినప్పుడు దించకుండా నొగల కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం ; 2. దొంగ గొడ్డు పరుగెత్తి పోకుండా మోకాళ్ళకు వేలాడ గట్టిన రెండు కొయ్యల పలక.

బుడ్డి రూ. బుడ్డిగ, బుడ్డీ. వి. 1. కమండలం. ఆం.భా. 2.177 ; 2. అల్పముఖ భాండం, చిన్న మూతి ఉన్న చిన్న కుండ. ఆం.భా. 2.246 ; 3. చిన్న మూతి ఉన్న కాచపాత్ర విశేషం, గాజుసీసా ; 4. రాట్నం రెండు చక్రాలనూ వేరు చేసే కొయ్య ; 5. పంటెకు బదులు నూలుచుట్టుకొనే రేకు డబ్బా ; 6. డాబీలో అడ్డంగా బిగించిన కొయ్యగుండు ; 7. ఇనపరేకుతో చేసిన పెద్ద పాత్ర ; 8. బంగాళాపెంకు కప్పు మూలల్లో బోర్లించే మట్టి పాత్ర ; 9. ఆకులు పెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండి చక్రం మధ్య ఉన్న గుండ్రటి కొయ్య ; 10. పత్తి విడిచిన వట్టి గుల్ల ; 11. అయిదుసేర్ల ధాన్యం.

క. బుడ్డి. గాజుసీసా ; త. పుట్టి. ఫ్లాస్కు, సీసా ; కో. పాట్య్. సీసా ; తొ. పుట్య్. సీసా.

బుడ్డికట్టు వి. బండికుండకు కట్టిన ఇనపకట్టు. బుడ్డికల్లు రూ.చూ. బుడ్డకల్లు. వి. గీతచెట్టుకు రాత్రి కట్టిన లొట్టెను ఉదయం దించక మధ్యాహ్నం దించి తీసినకల్లు. బుడ్డిదారం వి. మగ్గానికి దీపం వేలాడతీసే తాడు. బుడ్డిదోస వి. కాయ నూగునూగుగా చిన్నదిగా ఉండే దోస (Cucumis maderaspatanus Roxb). బుడ్డివంద వి. కోళ్ళగూడు ఆకారంలో మూరెడు వెడల్పు మూతితో కొంచెం సన్నగా నిలువెత్తు ఉండే అడుగులేని మట్టిపాత్ర. బుడ్డివలక వి. సారెలోని ఇరుసువంటి భాగం. బుడ్డిపింజెర వి. ఒకరకం డాబీ. బుడ్డిబందు వి. బండికుండకు కట్టిన ఇనపకట్టు. బుడ్డిరాతు వి. మట్టిబుడ్లను కట్టించే చిన్నరాయి. బుడ్లకదురు రూ.చూ. బుడ్డీలకదురు. వి. దబ్బారాట్నం బొమ్మలకుగాని దొడ్డినిలువలకు గాని బిగించే మందపుకడ్డి. బుడ్లరాటం రూ. బుడ్డీలరాటం, బుడ్డీల్రాటం. వి. దబ్బాలకు నూలుతోడే రాట్నం. బుడ్లరాయి వి. మట్టిబుడ్లను కట్టించే చిన్నరాయి.

బుడ్డిగ రూ.చూ. బుడ్డి. వి. కమండలం.

బుడ్డీ రూ.చూ. బుడ్డి. వి. చిన్నమూతిగల కుండ.

బుడ్డీఆరిపోవు అ.క్రి. అస్నిఅయిపోవు. బుడ్డీలకదురు రూ. బుడ్లకదురు. వి. దబ్బారాట్నం బొమ్మలకుగాని దొడ్డినిలువలకుగాని బిగించే మందపు కడ్డీ. బుడ్డీలరాటం రూ.చూ. బుడ్లరాటం. వి. దబ్బాలకు నూలు తోడేరాట్నం. బుడ్డీల్రాటం రూ.చూ. బుడ్లరాటం. వి. దబ్బాలకు నూలు తోడేరాట్నం.

బుద్ధగాకర రూ.చూ. బుద్ధకాకర. వి. అరగాకర.
బుద్దిరజొన్న చూ. బుద్ద[1].
బుద్దార చూ. బుద్ద[1].
బుద్దోర చూ. బుద్ద[1].
బుడ్ప్ర రూ.చూ. బుడిపి. వి. 1. బొడిప, చెట్టులో ముడి ; 2. కమండలం ; 3. బొప్పి ; 4. చెఱుకు మొ. వాటి కణుపు ; 5. ముచ్చిలిగుంట మీది బుడిపి.
బుడ్లకదురు చూ. బుడ్డి.
బుడ్లరాటం చూ. బుడ్డి.
బుడ్లరాయి చూ. బుడ్డి.
బుడ్లు చూ. బుడ్డ[3].
బుంద్రము చూ. బుత్రేవ. వి. గుడ్లగూబ.
బుంద్రిక వి. పిల్లలు డబ్బుదాచిపెట్టటానికి ఉపయోగపడే గుండ్రని చిన్నమట్టిబుడ్డి.
సం. పుండ్రక-, పుండ్ర-. బొట్టు, పువ్వులగురివెంద, బెంగాల్.
బుతాము రూ.చూ. బొత్తాము. వి. గుండి, బటన్.
బుతికిపోవు చూ. బతికిపోవు. అ.క్రి. పనికి రాకుండా పోవు.
బుత్త వి. యోని, ఆడుగురి. సాంబ. మాన. 9.
హిం. బుత్తా. మోసం, వంక.
బుత్తి వి. 1. దేవతాదులకు ఇచ్చే ఆహారం. ప్రబోధ. 3.39 ; 2. భోజనం. చంపూరా. 2.78 ; 3. ఇహలోక సౌఖ్యం. నీలా. 1.16.
సం. భుక్తి-. భోగం, అనుభవించటం, భుజించటం ; ప్రా. భుత్తి. భోజనం, భోగం ; అశో. ప్రా. ప్రా. భూత-; అ.మా. బుత్తి ; పా. బుత్త. తినబడిన ;
క. అన్నం ; తు. బుత్తి. పాథేయం.
<ప్రా. భుత్తి.
బుత్తికుండ వి. పితృపండుగలో అన్నం వండే పాత్ర.
బుదవారము వి. సౌమ్యవారం, పెద్దవారం, వారంలో నాలుగో రోజు.
సం. బుధవార-. వారంలో నాలుగోరోజు.
<సం. బుధవార-.
బుదిరించు రూ. చూ. బుదుగరించు. స. క్రి. పిల్లకాయలను బుజ్జగించు.
బుదుగరించు చూ. బుజ్జగించు. రూ. బుదిరించు. స.క్రి. ఓదార్చు.
బుదుఁడు వి. 1. బుధుడు, సౌమ్యుడు ; 2. పండితుడు ; 3. చదలకావు, దాపనివారు.
సం. బుధ-. పండితుడు, ఒకగ్రహం.
<సం. బుధ-.
బుద్ది వి. 1. బుద్ధి, తెలివి. కు. సం. 6.21 ; 2. భావం, రంగ సముద్రం. మదనపల్లిశా. శ్రీ.క. 9.10క.
సం. బుద్ధి-. తెలివి, జ్ఞానం ; ప్రా. బుద్ధి. మతి. మేధ, మనీష, ప్రజ్ఞ ; పా. బుద్ధి ; ఒ. బుధి. మేధ ; పం. బుద్ధ్ ; ల. బూధ్ ; సిం. బుధి ; మరా. బుధి ;
క. బుద్ధి ; మ. పుత్తి.
<ప్రా. బుద్ధి.

బుద్దినాటు అ.క్రి. అవగతమగు, మనసులగ్నమగు. పాండు. 5.229. బుద్దిమెకము వి. సృగాలం, నక్క. సాంబ. తిర్య. 74. బుద్దులుచెప్పు స. క్రి. సత్ప్రవర్తనమెరిగించు, మంచినడవడిని బోధించు. ఉ. హరిశ్చ. 1.6.
బుద్దులుచెప్పు చూ. బుద్ది.
బుధప్రకాశోదయమగు అ. క్రి. చీకటిగాను, బుధుడెక్కువగా ప్రకాశిస్తే లోకం అల్లకల్లోలమై చీకటైపోతుందనటంపై వచ్చిన పలుకుబడి. కా. 7.19.
సం. బుధప్రకాశోదయ-. బుధగ్రహంయొక్క కాంతి యొక్క ఆవిర్భావం.
<సం. బుధప్రకాశోదయ + -ము + అగు.
బుద్ధావతారము వి. 1. అద్వయవాది, అభిమానుడు ; 2. మూగమొద్దు.
సం. బుద్ధావతార-. విష్ణువుయొక్క దశావతారాల్లో తొమ్మిదో అవతారం.
<సం. బుద్ధావతార- (అర్థవిపరి.).
బునాతం రూ.చూ. పునాది. వి. నిర్మాణపు నమూనా ప్రకారం గోడల బలం కోసం భూమిలో మొట్టమొదట తవ్వేగుంట.
బునాది రూ.చూ. పునాది. వి. 1. బలంకోసం గోడకిఅడుగున భూమిలో లోతుగా తవ్వి పెట్టినగోడ ; 2. బలంకోసం లోతునుండి గోడకట్టటానికి తవ్వినపల్లం ; 3. ఆధారం, మూలకారణం.
బునాదిగుగ్గిళ్ళు వి.బ.వ. పునాదులు తవ్వినప్పుడు ఆధారంగా వండి పంచిపెట్టే గుగ్గిళ్ళు. బునాదిగుంత వి. పునాదికై తవ్విన గుంట. బునాదిగోడ రూ. చూ. పునాదిగోడ. వి. పునాదిగోడ, పునాదిలో కట్టినగోడ. బునాదిరాయి వి. శంకుస్థాపన సమయంలో పూడ్చబడి పూజచేయబడే రాయి.
బునేది రూ.చూ. పునాది. వి. నిర్మాణపు నమూనా ప్రకారం గోడల బలం కోసం భూమిలో మొట్టమొదట తవ్వేగుంట.
బుందజవి వి. ఒకరకం జువ్విచెట్టు (Ficus infectoria).
బుందమద్ది వి. కలపనిచ్చే ఒకరకం చెట్టు (Morinda tinctoria).
బుందు వి. కొంచెం నలుపు పన్నెలో ఉన్న లాకిరంగు.
హిం. బుంద్, బూంద్. బిందువు, ఒకవిధమైన వస్త్రం.
<హిం. బుంద్.
బున్నీపు రూ.చూ. బురునీసు. వి. ఉన్నిశాలువ.
బున్యాది రూ.చూ. పునాది. వి. నిర్మాణపు నమూనా ప్రకారం గోడల బలం కోసం భూమిలో మొట్టమొదట తవ్వేగుంట.
బున్యాదిపాయ వి. పునాదిగుంట.
బుబగర్ధ వి. సారె సులువుగా తిరగటానికి పీలుగా రంధ్రం ఉన్న రాయికి మట్టి, వరి పొట్టు, కలిపి భూమిలో పాతి పెట్టిన మట్టిదిమ్మ, గుబ్బగర్ధ.
బుబ్బలి వి. ఒకరకం చెట్టు.
బుబ్బుదము వి. 1. తర్క విశేషం. ఆం.భా. 2.255 ; 2. నీటిబుగ్గ.
సం. బుద్బుద-. ప్రా.అ.మా. బుబ్బుఅ, బుబ్బుయ ; పా. బుబ్బుల-, బుబ్బుళ-, బుబ్బుళక- ;

క. బుదబుద.

<సం. బుద్బుద-.

బుయ్యి వి. ఆడుగురి. సాంబ.మాన. 19.

హిం. బుయామ్. చీనీ మట్టితో తయారైన పాత్ర విశేషం, జాడీ.

బుయ్యారము వి. చెరసాల, కారాగారం.

బురక[1] వి. 1. పీచురు ; 2. హ్రస్వుడు ; 3. బొడ్డుకొయ్యకు వేసిన బెజ్జం.

బురకడు వి. 1. పసిపాపడు, బిడ్డడు. ఉ.రా. 6.139 ; 2. పొట్టివాడు ; 3. వేటకుక్క.

బురక[2] వి. గుర్రం తలలో ఉంచే తురాయి. దశా. 2.174.

హిం.ఉ. బుర్కా. ముసుగు.

<ఉ. బుర్కా.

బురకట చూ. బురకా. వి. బూటకం, అసత్యం. పొల్లు. ప్రబంధ. 6.26.

బురకదము వి. ఉడుముల్ని వేటాడే కుక్క. అం.భా. 2.290.

బురకలు రూ. బుర్కలు. వి.బ.వ. గింజ సన్నగా, ఎర్రగా, గుండ్రంగా ఉండే ఒకరకం తృణ ధాన్యం.

బురకా రూ. బురఖా, బుఖా, బుర్కా. వి. ముసుగు, ఆచ్ఛాదనం. కవిచౌ. సీ. 27.

హిం. బుర్కా. ముసుగు, ముస్లింస్త్రీలు ధరించే ముసుగు ; మరా. బుర్కా, బుర్ఖా. ముసుగు, ఆచ్ఛాదనం ; ఉ. బుర్కా. ముఖపటం, ముసుగు, శిరస్సు మొదలు కొని కాళ్ళ వరకు గల ఆచ్ఛాదనం ; పార. బుర్కా. స్త్రీల ఆచ్ఛాదనం ; అర. బుర్కా. స్త్రీల ముసుగు :

త. పురుక్కా. వస్త్రం, వాహనాల ఆచ్ఛాదనం.

<ఉ. బుర్కా.

బురకాలు వి. కింది మూత వెడల్పుగా పైమూత పొడవుగా మధ్యభాగంలో పొట్ట లావుగా కూజా మాదిరి ఉండే ఒకరకం వాయిద్యం.

<బుఱ్ఱ + కాలు.

బురఖా రూ.చూ. బురకా. వి. చూడటానికి పీలుగా ఉండి వదులుగా ఉండి ముస్లిమ్ స్త్రీలు ధరించే ఒకరకం ఉడుపు. ముసుగు.

బురగ[1] రూ.చూ. బరిగె[2]. వి. ధాన్యవిశేషం.

బురగ[2] రూ.చూ. బరుగ[3]. వి. చూరుకట్టుకు వాడే మెలి పెట్టిన ఆకు.

బురగ[3] రూ.చూ. బురజ[2]. వి. జిగట వచ్చేదాకా కాలితో తొక్కి తయారు చేసిన పాకం గల మట్టి.

బురగమట్టి వి. చిక్కని పాకంలో ఉన్న అడుసు.

బురగ[4] చూ. బూరుగు. వి. బూరుగుచెట్టు, దూదినిచ్చే కాయలుకాసే చెట్టు (Bombax malabaricum).

బురగాయ రూ.చూ. బుర్రగాయ. వి. దొలిచేడు పురుగుల వల్ల కాయపైర్లలో డొల్లకాయ ఏర్పడే తెగులు.

బురగుంజు రూ.చూ. బుఱ్ఱగుంజు. వి. తాటితేగలపైన నిలిచిన మట్టెను పగలగొట్టగా లోపల ఉండే తెల్లని గుజ్జు.

బురచ్చాలు చూ. బురద.

బురచ్చోడి చూ. బురద.

బురజ[1] వి. చిన్నగజ్జె. కు.సం. 1.98.

హిం.ఉ. బుర్జ్. కోటబురుజు.

బురజ[2] రూ. బురగ[3]. వి. జిగట వచ్చేదాకా కాలితో తొక్కి తయారు చేసిన పాకం గల మట్టి.

బురడా రూ.చూ. బురుడ. వి. బొంకు.

బురతకాలు రూ.చూ. పురతకాలు. విణ. పోర్చుగాలు దేశీయం ; వి. పోర్చుగాలులో తయారయిన ఒకరకం పట్టు గుడ్డ.

బురతకాశి రూ.చూ. పురతకాలు. వి. వస్త్రవిశేషం, పోర్చుగాలు దేశపు పట్టుబట్ట.

బురద రూ. బురుదు, బుర్ద. వి. పంకం. పల్నా.పు. 113.

తు. బుర్దె. మట్టి, రొంపి ; గోం. బుర్ద. మట్టి ; కొం. బుఱ్ఱ. రొంపి, మట్టి, బురద ; గ. బుర్ద్. మట్టి.

బురచ్చాలు రూ.చూ. బురదచాలు. వి. మాగాణికి నీళ్ళు పెట్టి దున్నిన చాలు. బురచ్చోడి రూ.చూ. బురదచోడి. వి. ఒకరకం చోడిధాన్యం. బురదకమ్మి రూ. బుర్దకమ్మి. వి. 1. దర్వాజా చట్రం కింది కమ్మీ ; 2. రెండు గోడల్ని కలుపుతూ వేసిన లావాటి కొయ్య. బురదకలుపు వి. మాగాణిలో తీసే కలుపు. బురదకుంద రూ. బురుదుకుంద, బుర్దకుంద. వి. కుండలు చేసేటప్పుడు చేతికొచ్చిన బురదను వేయటానికి కుమ్మరి సారె పక్కన పెట్టుకొనే నీళ్ళ పాత్ర. బురదకొయ్య వి. 1. బురదకమ్మి ; 2. బురదపాము. బురదగుంట వి. పల్వలం, పడియ. బురదగొర్రు(-గొఱ్ఱు) వి. మాగాణిలో విత్తక ముందు చదునుచెయ్యటానికి విత్తిన తరవాత కలుపు, గడ్డి పోవటానికి తోలే పరికరం. బురదగోతమబద్దపోట్లావు వి. ఇసుకలో పడ్డ బలవంతుడు. బురదగొట్టు(-కొట్టు[1]) అ.క్రి. బురదలో చిక్కుకొను. బురదచాలు రూ. బురదచ్చాలు. వి. మాగాణికి నీళ్ళు పెట్టి దున్నిన చాలు. బురదచోడి రూ. బురచ్చోడి. వి. ఒకరకం చోడి ధాన్యం. బురదటిక(-ఆటిక) రూ. బురదటికె. వి. కుండలు వానేటప్పుడు సారె పక్కన పెట్టుకొనే నీళ్ళ పాత్ర. బురదటికె రూ.చూ. బురదటిక. వి. కుండలు వానేటప్పుడు సారె పక్కన పెట్టుకొనే నీళ్ళ పాత్ర. బురదతుంగ వి. ఒకరకం తుంగ (Cyperus pubisquama). బురదతొట్టి వి. కుండలు వానేటప్పుడు సారె పక్కన పెట్టుకొనే నీళ్ళ పాత్ర. బురదదుక్కి రూ. బురదుక్కి, బుర్దుక్కి. వి. నీళ్ళు పెట్టి దున్నిన మాగాణి పొలం. బురదదోని వి. మోటనీరు పోయే దోనిమాను. బురదనాగలి రూ. బురదనాగేలి. వి. బురదనేలలు దున్నే నాగలి. బురదనాగేలి రూ.చూ. బురదనాగలి. వి. బురద నేలలు దున్నే నాగలి. బురదనువ్వులు రూ. బురదనూలు. వి.బ.వ. ఒకరకం నువ్వులు. బురదనూలు రూ.చూ. బురద నువ్వులు. వి.బ.వ. ఒకరకం నువ్వులు. బురదపాము వి. రొంపిలో తిరిగే పాము, నీటిపాము. బురదపొలం వి. కాలువ, చెరువు, మొ. వాటి నీటితో సాగుచేసే నేల. బురదమట్టి వి. చిక్కని పాకంలో ఉన్న అడుసు. బురద మడక వి. బురదనేలలో దున్నే నాగలి. బురదమడుగులు వి.బ.వ. బొమ్మిడాయి, ఒకరకం చేపలు. బురదమమ్మ వి.

బెట్రువరి రూ.చూ. బెట్టుసరి. వి. తెగనీలగటం, బింకం, తలబిరుసుతనం.

బెట్లించు చూ. పెట్లు. అ.క్రి. దంచు.

బెట్లిపోవు రూ.చూ. పెట్లిపోవు. అ.క్రి. మట్టిపాకంలో ఇసకగాని మసిగాని తక్కువైనా, సరిగా పిసకకపోయినా కాల్పులో కాక చాలకపోయినా, ఒత్తిడి తగిలినా, కుండల దళసరి ఎక్కువైనా ఆము కాల్పులో కుండలు పేళ్ళు పేళ్ళుగా పగిలిపోవు.

బెట్టుగొమ్ము చూ. బెట్టు. వి. బిరుసుచన్ను (దీనినుంచి పాలు బాగా రావు).

బెడ్ వి. పరుపు.

ఇం. *Bed*. పరుపు.

<ఇం. Bed.

బెడ్రాయి వి. 1. దూలానికి ఆధారంగా గోడమీద అడ్డంగా వేసే రాయి; 2. దర్వాజా చట్రపు పైభాగాన గోడలో ఇమిడ్చిన దానరాయికి కిందుగా ఉంచిన రాయి. < బెడ్ + రాయి. బెడ్‌షీటు వి. దుప్పటి.

బెదక వి. ఉత్తగోనె.

బెదగొండ చూ. బెదఁగు.

బెదగొండలు చూ. బెదఁగు.

బెదఁకు రూ. బెడఁకు, బెణుకు, బెనకు, బెళఁకు[1]. అ.క్రి. 1. కదులు. వరాహ. 4.98; 2. తొలగిపోవు; విణ. చలించేది, కదిలేది. విష్ణువు. 3.274; వి. చలనం.

క. బెళపళ. వణకు, కలవరం, బెళ్‌కళ్. భయపడు; త. వెఱ్‌విఱై. (కన్ను మొ. వి) కొట్టుకొను, అదురు, వెఱుక్క, వెళుక్క. భయపడు, సిగ్గుపడు.

బెదఁగారు చూ. బెదఁగు.

బెదఁగు రూ. బెడఁగు, బెళఁగు. వి. 1. సౌందర్యం, చక్కదనం. భార. ఆది. 3.27. బెజవాడ శాసనం. క్రీ.శ. 898-934; 2. విలాసం. భార. అరణ్య. 3.268; 3. అందం, లలితం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 114. క్రీ.శ. 1144; విణ. 1. మనోహరం, మంజులం. భార. ఆది. 5.26; 2. పెద్దది. భార. అరణ్య. 2.251; 3. మోటు, మూర్ఖం. పండి.చ. 3.45.

క. బెడంగు, బెడగు. నవ్యత, సౌందర్యం, సొగసు, చక్కదనం, విలాసం, నున్నితం. మనోహరం. బెడగి. విలాసవతి; తు. బెడంగు, బెడగు. అభిమానం, వలపించు, బెడగె. అందగాడు; బిడుగు. వగలాడి; త. విడుంకు. సౌందర్యం, చక్కదనం, విడుంకన్. అందమైన వ్యక్తి. వెటిప్పు. కాంతి. శోభ. విళంగళ్; మ. వెటిప్పు. సొంపు, సొగసు, శుభ్రత.

పో.చూ.సం. విడుంక-. సొంపు, సౌందర్యం. సొగసు, చక్కదనం.

<మూ.ద.ద్రా. వెట్-వ్-/*వెళ్-వ్-.

బెదగొండ వి. పెద్దకొండ. జాహ్నవీ. 4.96. < బెదఁగు + కొండ. బెదగొండలు రూ. బెదిగొండలు. వి.బ.వ. కొండలు కొండలుగా కమ్ముకొన్న మబ్బులు. < బెదఁగు + కొండ + -లు. బెదఁగారు అ.క్రి. 1. రమ్యమగు, ఒప్పు. విక్ర. 1.78; 2. అతిశయించు. వసు. 2.110. < బెదఁగు + -ఆరు[1]. బెదఁగువడు రూ.చూ. బెదఁగుపడు. అ.క్రి. అందగించు. ఆము. 6.98. బెదఁగువడు(-పడు) రూ. బెదఁగుపడు. అ.క్రి. అందగించు. భాగ. 6.99. బెదఁగొందు అ.క్రి. శోభిల్లు. భార. విరా. 1.211. < బెదఁగు + ఒందు.

బెదఁగొందు చూ. బెదఁగు.

బెదద వి. భక్ష్యవిశేషం. హంస. 1.105.

క. బిళిదు, బెణతు. ఒయ్యం; తు. బుళస్తం.

<క. బెణతు.

బెదఁద వి. 1. ఆపద, ఇడుము. కళుత్స. 2.131; 2. దూరు, నింద. శుక. 3.498; 3. గొడవ. బాప. రసిక. 5.159.

కుఇ. పెడ. కష్టం, ఆపద. ఇబ్బందికరమైన, సహించు, ఓర్చు.

బెదఁదకాఁడు వి. బాధపెట్టేవాడు. హర. 2.128.

బెదవడు చూ. బెదఁద. అ.క్రి. గుంపునుంచి తప్పిపోవు.

బెదబెద వి. అర్భటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. సిం.ద్వా. 3.91.

బెదయు రూ. బెడియు. అ.క్రి. వికలమగు, పటుత్వం తప్పు. నవనాథ. 3.149.

త. వెటి. పగులు (మట్టిపాత్రలు). అసహ్యం, విఱై. ఆటంకపరచు, ఆపు, నిలువు వంగు, కోపగించుకొను. బెదు, తప్పుపట్టు, విరిగిపోవు.

బెదలి రూ.చూ. బెదలిక. వి. కంచె వేయటానికి ఉపయోగించే ఒకరకం చెట్టు (Posoqueria fragrans).

బెదలిక చూ. బెదలి. వి. కంచె వేయటానికి ఉపయోగించే ఒకరకం చెట్టు (Posoqueria fragrans).

బెదవట్టిపోవు చూ. బెదఁద. అ.క్రి. పశువు మరల కట్టకుండ నిలిచిపోవు.

బెదసు విణ. కరకు, కఠినం. నవనాథ. 3.149 వ.

బెదావ క్రి.విణ.ద్రు. త్వరితంగా. ధ్వన్యను. చంపూరా. 8.55.

బెదాబెదలు విణ. చెల్లాచెదరు, మిక్కిలి చెదరిన. రామరా. 2.52.

బెదాలి వి. ముంగకాయ, మంగాకాయ (Griffithia fragrans).

త. పిటుపమ్, పిటుప్పు. పిటా. మంగకాయ.

బెదాలువ క్రి.విణ.ద్రు. త్వరితంగా. ధ్వన్యను. చంద్రాంగ. 2.84.

బెదికించు చూ. బెదఁకు. స.క్రి. బెదిరిపోయేటట్లుచేయు. చంద్రరే. 3.138.

బెదిగ రూ.చూ. బాదిగ[1]. వి. భాగదేయం, పన్ను. ఆం.భా. 2.192.

బెదిగొండలు రూ.చూ. బెదగొండలు. వి.బ.వ. కొండలు కొండలుగా కమ్ముకొన్న మబ్బులు.

బెదిదము చూ. బెడియు. రూ. బేదిదము. విణ. 1. తీక్ష్ణం. వాడైన. భార. విరా. 1.211; 2. భయంకరం. భార. భీష్మ. 2.77; 3. అధికం, హెచ్చైనది. భార. ద్రోణ. 2.60; 4. శీఘ్రం, వడిగలది. మను. 4.115; 5. మిక్కిలి వేడైన. పారి. 4.19; వి. 1. హింసాకృత్యం, క్రౌర్యం. భార.ఉద్యో.

1.307 ; 2. వాడిమి. భార. ఉద్యో. 2.61 ; 3. పరుష వచనం, కఠినోక్తి. భార. ఉద్యో. 3.24 ; 4. తీక్ష్ణత, వేడిమి. హరి.పూ. 1.161.

సం. భీతిద-. భయం కలిగించేది.

బెడిదముగ క్రి. విశ. క్రు. ఘోరంగా. బెడిదుఁడు వి. కఠినుడు, క్రూరుడు. బెడిదురాలు(-అలు) విశ. బెడిదంకలది.

బెడిదుఁడు చూ. బెడిదము.

బెడిదురాలు చూ. బెడిదము.

బెడిబెడి వి. పొదగా పెరిగే మొక్క.

బెడియు రూ.చూ. బెదరు. అ.క్రి. 1. కొంచెం తొలగు, తప్పుకొను. పద్మ. 8.112 ; 2. (కాళ్ళు, చేతులు మొ.వి) కట్టుకొను. హంస. 1.193 ; 3. తొట్రుపడు, తడబడు. ఉ.హరివం. 4.36 ; 4. బెడిసిపోవు ; (కార్యం) చెడు. అం.నా.తే. 9 ; 5. దుసికిలు, తప్పిపోవు ; 6. చీలిపోవు.

బెడిసికొట్టు అ.క్రి. 1. ఉగ్రదేవతలను క్రమ విరుద్ధంగా ఆరాధించటంవల్ల హానికలుగు ; 2. దేవతాదులు ఎదురు తిరుగు ; 3. ఒకరిపై చేసిన ప్రయోగం తిరిగివచ్చి తనకే తగులు.

బెడిసికొట్టు చూ. బెడియు.

బెడుగు రూ.చూ. బిడుగు. వి. 1. బావికి చుట్టు గోడ కట్టుబడి చేయవలసిన గుండ్రటి స్థలం ; 2. రాళ్ళకుప్పలకు మధ్యఉన్న ఖాళీ స్థలం ; విశ. బుద్ధిహీనుడు, తెలివి తక్కువవాడు.

బెడుసు వి. క్రౌర్యం. వాల్మీ. 2.94.

క. బెట్టుసి. మల్లయోధుల ఒకవిధమైన విన్యాసం.

<క. బెట్టుసి.

బెడెం రూ. బేడెం. వి. 1. పిడకలను పణతలో దూర్చే చోట అవసరాన్నిబట్టి ఎలుప నలుపులకు కొట్టే పేడు, కొయ్య చీల, గూటం ; 2. తలుపు రెక్కలను మూస్తూ కలిపి ఉంచటానికి వాడే కొయ్య లేక ఇనపముక్క.

క. బెడె, మేకు, కొయ్యగూటం.

<క. బెడె.

బెడ్డ రూ. పెడ్డ, బెడ్డు. వి. 1. మట్టిపెల్ల. శ్రీనాథుని చాటువు. అం.భా. 2.230 ; 2. కొట్టి చుట్టూ కట్టిన కట్ట ; 3. ఇటికముక్క.

క. పెట్ట, పెట్టె, పెంటె, హెంటె, హెంటె. బెడ్డ ముక్క ; తు. ఎంటె, హెంటె.

బెడ్డచేను వి. బీడు, దున్నిన భూమి. తె.గా.జ.గా. క్రి.శ. 1206. బెడ్డమక్కపాగలి వి. ఎండాకాలం దుక్కికి ఉపయోగించే నాగలి.

బెడ్డు రూ.చూ. బెడ్డ. వి. మట్టిపెల్ల.

బెళకప్ప వి. వినాయకుడు.

క. బెనక, వినాయకుడు ;

సం. వినాయక-.

<క. బెనక+అప్ప.

బెళఁకు రూ.చూ. బెడఁకు. అ.క్రి. తొలగు. వసు. 4.50.

బెళఁగు రూ.చూ. బెడఁగు. వి. 1. విలాసం. కృ.శకు. 2.10 ; 2. సౌందర్యం, చక్కదనం ; 3. విధం, క్రమం ; 4. మెరుగు, కాంతి ; విశ. 1. మనోహరం, మంజులం ; 2 పెద్దది ; 3. మోటు, మూర్ఖం.

బెళుకు రూ.చూ. బెడఁకు. అ.క్రి. చలించు ; వి. చలనం.

బెంటు వి. అనాగరికుడు.

క. బెంటె. పిడక.

బెంటుకు వి. చుట్టు గుడిసె కొప్పుచుట్టూ పేని వేసిన గడ్డిచుట్ట

క. బెంటు, గోళ్ళతో గీరు.

బెండ[1] వి 1. ఎద్దునాలుక చెట్టు, నూగుగల ఒకవిధమైన కూరగాయ చెట్టు. చంద్రరే. 2.100 (Hibiscus esculantus) ; 2. నేతలో పవ్వులు పడేట్టు మలిపే రంగు దారపుచుట్ట.

సం. భిండా, భిండి, భిండితక ; ప్రా. భిండా, భిండి. వనస్పతి విశేషం ; ఉ.మా. దే. భిండి ;

క. బెండె ; త. వెండై, వెండుక్కాయ్ ; మ. వెండక్క.

<ప్రా. భేండా.

బెండకాడ వి. మెట్టలో పెరిగే నూగుగల కలుపుమొక్క (Abutilon species). బెండకాయచక్రం రూ. బెండకాయిపెక్రం. వి. మరాను ఒగ్గుల పట్టెను ఆడించటానికి పీలుగా అమర్చిన పళ్ళచక్రం. బెండకాయచ్చు వి. పాత్రల మీద బెండకాయ మాదిరి డిజైను కొట్టే అచ్చు. <బెండకాయ+అచ్చు[1]. బెండకాయిపెక్రం రూ.చూ. బెండకాయచక్రం. వి. మరాను ఒగ్గుల పట్టెను ఆడించటానికి పీలుగా అమర్చిన పళ్ళ చక్రం. బెండజొన్న వి. గింజ బెండగింజలా ఉండే రకం. బెండవామి వి. దర్వాజా నిలువ పట్టెకు రంగులు వేయటానికి తీసిన గాడి. బెండవాపె వి. పూర్తి తెలుపు. బెండపువులగతిరాకపోయు అ.క్రి. దండిగా ధనాన్ని క్రుమ్మరించు. గొ.హరి.ఉ. 887-889. బెండపువ్వంచు రూ. బెండపూవంచు. వి. బెండపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. <బెండపువ్వు+అంచు[1]. బెండపువ్వు రూ. బెండ పూవు. వి. బెండ మొక్క పుష్పం. బెండపూవంచు రూ.చూ. బెండపువ్వంచు. వి. బెండపువ్వు మాదిరి డిజైను నేసిన అంచు. <బెండపూవు+అంచు[1]. బెండపూవు రూ.చూ. బెండపువ్వు. వి. బెండ మొక్క పుష్పం. బెండపూవుచీర వి. బెండపువ్వు ఆకారం బుటాలు నేసిన చీర. బెండలం వి. మెట్టలో పెరిగే నూగుగల కలుపుమొక్క (Abutilon species). <బెండ+అలం.

బెండ[2] వి. గంగరేనిచెట్టు, గట్టి కలపనిచ్చే ఒకరకం చెట్టు (Thespesia populnea).

బెండ[3] వి. దడి కట్టటానికి పనికివచ్చే ఒకరకం ముళ్ళచెట్టు.

బెండగిలవడు చూ. బెండు.

బెండగిలు చూ. బెండు.

బెండగిల్లు చూ. బెండు.

బెండగు చూ. బెండు.

బెండాబెడగు చూ. బెండు.

బెండాము చూ. బెండు.

బెండు విశ. 1. దుర్బలమైన, పనికిరాని. ధర్మవరం గానకం. క్రి.శ. 897 ; 2. నిస్సారం. భార.ఉద్యో. 1.368 ;

3. తేలికయిన. భార. ద్రోణ. 3.67 ; 4. జీలుగు (Acschynomene indica). ఉ.హరి. 5.219 ; 5. వరంబం గుండును మోసే దారాన్ని పట్టుకొని ఉండే రేకు బిళ్ళ ; 6. నిచ్చెన నిలువు కర్రలు, మెట్లు కదలకుండా గట్టిగా బిగించి కట్టిన తాడుకు పురిబెట్టి పురి వదులివ్వకుండా ఉండటానికి తాడు మెలికలో ఇమిడ్చిన కర్రపల్ల ; 7. అచ్చు మధ్యలో పెట్టిన కొయ్యచెక్క ; 8. తికటి నిలువులను కలిపే అడ్డుకర్ర ; 9. తలుపు రెక్కల చట్రం ; 10. మొగరం మీద దూలం కిందుగా పెట్టిన పీట ; 11. ఇటికల బట్టీ పొయ్యిల మధ్య వచ్చే దిమ్మ ; 12. గుంటక గొర్రు మొ.వాటి నిర్మాణంలో వేసిన అడ్డుపట్టె ; 13. చెరకు, జొన్న మొ.వాటి దంటు లోపలిభాగం ; 14. కండె నూలు చుట్టుకొనే జొన్న దంటు ముక్క ; 15. బయలులో మరమగ్గం చట్రం నిలబెట్టటానికి నిలువు రాటలకు అడ్డంగా మామూలుగా బిగించిన కర్ర ; 16. మగ్గం సొరుగు మీద బిగించిన చెక్క.

క. బెండు. తెల్లని, మెత్తని బెండు, తేలికగా ఉండే నిస్సారమైన (దీని కొన జోపీలు చేయటానికి ఉపయోగిస్తారు) పనికిరాని పదార్థం ; తు. బెండు. జీలుగు, నీటిలో పెరిగే ఒకరకం మొక్క, తేలికయిన, నిస్సారమైన, సన్నమైన. బొండు. జీలుగు ; మ. వెన్ప్-ఎల్ప్. (పాత) ఎముక.

బెండగిలపడు అ.క్రి. నిశ్శక్తుడగు. బెండగిలు రూ. బెండగిల్లు. అ.క్రి. 1. వ్యథనొందు. బాధపడు. శుక. 2.340 ; 2. ఎత్తువడు, బలహీనమగు. ఆం.భా. 3.95 ; 3. పెల్లగిల్లు, ప్రయాణమగు. బెండగిల్లు రూ.చూ. బెండగిలు. అ.క్రి. 1. ఎత్తువడు, బలహీనమగు ; 2. వ్యథనొందు. బాధపడు ; 3. పెల్లగిల్లు, ప్రయాణమగు. బెండగు అ.క్రి. 1. నిస్సారమగు, బలహీనమగు. భార.అశ్వ. 4.39 ; 2. భగ్నపడు, చెడు. విష్ణుపు. 6.268. <బెండు+అగు. బెండాబెరగు విశే. వ్యత్యస్తమైన. ప్రబంధ. 788. బెండాము వి. చూరు చెక్క అంచునున్న వంపులు తీర్చిన భాగం. బెండుకార్నీను వి. స్తంభానికిపైన దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో కోన 'ని' ఆకారంలో ఉండేటట్లు కట్టిన ఉబ్బెత్తు భాగం. బెండుకొను అ.క్రి. బలహీనమగు. నీలా. 2.83. బెండుగూడు వి. సుంద్రంగా ఉండేగూడు. బెండుచేయు స.క్రి. నిస్సారంచేయు. హరి. పూ. 4.155. బెండుదంటు రూ. బెండుదొంట. వి. చప్పగాను పీలగాను ఉన్నజొన్న మొ. వాటిదంటు. బెండుదొంటి రూ.చూ. బెండుదంటు. వి. చప్పగాను పీలగాను ఉన్నజొన్న మొ. వాటిదంటు. బెండువడు రూ. బెండుపడు. అ. క్రి. 1. అధైర్యపడు, దిగులుపడు. భార. ద్రోణ. 3.169 ; 2. నిస్సత్త్వమగు, బలహీనమగు. పె. శకు. 1.113 ; 3. అలయు, శ్రమనొందు ; 4. నిశ్చేష్టమగు ; 5. వ్యర్థమగు, నిష్ఫలమగు ; 6. అల్పమగు, తక్కువగు, ఉడుగు, నశించు ; 7. సారహీనమగు ; 8. ఖేదంపొందు, దుఃఖించు. బెండువఱచు స.క్రి. 1. బలహీనత నొందించు. చిత్రభా. 7.109 ; 2. సంహరించు, చంపు. కృ.శకు. 3.89. బెండుపురుగు వి. వంగచెట్టుకు పట్టే ఒకరకం గొంగళి పురుగు. బెండుబల్ల వి. మరమగ్గానికి అమర్చిన గుండ్రటి ఎదురుదోనె బిగింపుకోసం పళ్ళచక్రం అమర్చిన చక్రం. బెండుబొమ్మ వి. బెండుతోచేసిన బొమ్మ. జీలుగుబొమ్మ. ఆము. 5.63. బెండుమానిసి వి. పిరికివాడు, భీరువు. భార. కర్ణ. 2.46. బెండురాయి వి. వంగిన లేక వంపుగా ఉన్నరాయి. బెండులుమునిగిగుండులుతేలు అ.క్రి. విపరీతం సంభవించు ఉ.హరి. 5.218. బెండువడు రూ.చూ. బెండుపడు. అ.క్రి 1. అలయు, శ్రమనొందు. భార. కర్ణ. 1.15 ; 2. నిస్సత్త్వమగు, బలహీనమగు. భార. ఆరణ్య. 7.86 ; 3. అల్పమగు, తక్కువగు, ఉడుగు, నశించు. నృసింహ. 2.90. 4. నిశ్చేష్టమగు. హరి.పూ. 9.87 ; 5. సారహీనమగు. భీమ. 4.107 ; 6. వ్యర్థమగు, నిష్ఫలమగు. భాగ. 3.686 ; 7. ఖేదంనొందు, దుఃఖించు. పి. శకు. 2.35. బెండువండివారు విశే. బ.వ. బెండులాగా తేలికైనవారు. శక్తిలేనివారు. తాళ్ల. సం. 10.126. బెండుసూల వి. చేతి నాడె గాడిలో అడ్డంగా బిగించిన పల్ల.

బెతుకు రూ.చూ. బెత్తు[2]. వి. ఎండిలేచిన మట్టి. మొ.వాటిపెల్ల.

బెతువు వి. ముఖం విరువు.

క. బెతె. దుఃఖం, విదారం.

సం. వ్యథా. బాధ.

<క. బెతె.

బెతోవికట్టె వి. నేలమీద గచ్చు సరిచేయటానికి వాడే పొడుగాటి బద్ద.

బెత్త రూ.చూ. బెత్తలి. వి. చాచిన తర్జని మొ. నాలుగువేళ్ళు. చతురంగుళి, మూడంగుళాల నిడివి. ఆం. భా. 2.140.

బెత్తము[1] రూ. బెత్తు[1], బెత్తె[1]. వి. నాగబెత్తం. పండి. చ. 5.310.

సం. వేత్ర-, వేత-. కర్ర ; ప్రా. వేత్త-, విత్తి. వేత్తిఅ. ద్వారపాలకుడు ; గా. వేదసొ, వేతనం ; అ.మా. విత్త-, వేత్త- ; పా. వేత్త-. చువ్వ. లత. బెత్తం ; నే. బేత్ ; అ. బేఁత్ ; బెం. బేత్ ; ఒ. బేత ; బి. బేఁతి ; హిం. బేత్, బేఁత్ ; సిం. వేయ ; మరా. వేత్.

క. కొర. తు. బెత్త ; కొవి. బెతి ; కురు. బేదా.

<ప్రా. వేత్త-.

బెత్తము[2] వి. చువ్వలు, తట్టలు అల్లటానికి ఉపయోగించే ఒకరకం తీగ (Calamus Rotang).

బెత్తము[3] వి. ఒకరకం తీగ (Calamus viminalis).

బెత్తలి రూ. బెత్త, బెత్తు[4], బెత్తె[2]. వి. చతురంగుళి, తర్జని మొ. నాలుగు వేళ్ళ అడ్డకొలత. మూడంగుళాల నిడివి. ఉ.రా. 3.123.

బెత్తాయించు స.క్రి. 1. ఆజ్ఞాపించు ; 2. ప్రోత్సాహించు.

హిం. ఉ. బతానా. చెప్పటం.

<ఉ. బతా (నా) + -ఇంచు[3].

బెత్తిక రూ.చూ. బెత్తు[2]. వి. ఎండిలేచిన మట్టిపెల్ల.

బెత్తు[1] రూ.చూ. బెత్తము[1]. వి. 1. నాగబెత్తం. ఘటికా. 2.41 ; 2. ఛడి.

బెత్తులవాఁడు విశే. వేత్రధరుడు. రసిక. 1.80 ; అచ్చ.రా.

యు. 208.

బెత్తు[2] రూ. బెచుకు, బెతుకు, బెత్తిక, బెత్తె[3], బెత్తేవ. వి. 1. ఎండిలేచిన మట్టి. మొ. వాటిపెల్ల. శగా. 5.11 ; 2. నత్త గుల్లపై చిప్ప.

సం. భిత్తి-, భిత్తికా. గోడ ;

ప్రా. భిత్తిగ-, భిత్తియ-. ఖండం. తునక. ముక్క.

<ప్రా. భిత్తియ-.

బెత్తువరి వి. ఒకచేప పేరు. బెత్తులెత్తు అ.క్రి. పెచ్చులుగ ఊడు. <బెత్తు[2]+-లు+ఎత్తు[1].

బెత్తు[3] విశే. సాధారణం. కుచే. 3.55 ; వి. 1. గౌరవం ; 2. బెట్టు.

బెత్తు[4] రూ.చూ. బెత్తలి. వి. మూడుఅంగుళాల నిడివి.

బెత్తుక వి. బెజ్జం.

బెత్తె[1] రూ.చూ. బెత్తము[1]. వి. చీల్చినపుల్ల.

బెత్తె[2] రూ.చూ. బెత్తలి. వి. మూడుఅంగుళాల నిడివి.

బెత్తె[3] రూ.చూ. బెత్తు[2]. వి. రాతిముక్క.

బెత్తేవ రూ.చూ. బెత్తు[2]. వి. రాతిముక్క.

బెదమ రూ. బెజను, బెదును. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు.

బెదమకర్ర రూ. బెదునుకర్ర, బెంతికర్ర, బెంతుకర్ర, బెందుకర్ర. వి. బెంతుదారం అల్లేకర్ర. బెదమతాడు రూ. బెదన్‌తాడు, బెంతితాడు, బెంతుతాడు. వి. నారపట్టా నేసేటప్పుడు, పడుగు కింద పెట్టిన గుర్రం కొయ్యలు రెంటికీ బిగించిన దారం. బెదమదారం రూ. బెదుందారం, బెంతిదారం, బెంతుదారం, బెందుదారం. వి. అచ్చుకొట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పరిదారం. బెదవేరు అ.క్రి. బెంతుదారాలు కర్రకుపైన ఒకటి కిందఒకటి చొప్పున అన్ని వచ్చేట్టు తీసి వేరుచేయు. బెదవ్‌తాడు రూ.చూ. బెదనుతాడు. వి. నారపట్టా నేసేటప్పుడు పడుగుకింద పెట్టిన గుర్రం కొయ్యలు రెంటికీ బిగించిన దారం.

బెదవేరు చూ. బెదను.

బెదవ్‌తాడు చూ. బెదను.

బెదరగొట్టు చూ. బెదరు.

బెదరించు చూ. బెదరు.

బెదరింపు చూ. బెదరు.

బెదరు రూ. బెదురు, బెద్రు. అ.క్రి. 1. భయపడు. భార. ఆది. 2.21 ; 2. జంకు, వెనుదీయు. కు. సం. 11.85 ; వి. 1. అవిశ్వాసం, అపనమ్మిక. ఆము. 4.222; 2. సంకోచం, వెనుతీత. వేమ. 1.1.134 ; 3. భయం, వెరవు. ఉ. హరిశ్చ. 1.2 , 4. అధైర్యం. ఆం. భా. 1.188.

క. బిదఱ్, బెదఱ్(ఉ). కలతచెందు, కలవరపడు భయపడు, జంకు ; తు. బెదరు, బెదరికె. ప్రారంభం. భయం, వెరవు. బెదరుని. భయపడు ; త. వితప్పు. వణకు, కలవరం. వితర్పు. భయం, వితలై. వణకు, వితకు (వితకి-). వణకు, కలత చెందు, వణుకు, కలవరం కదలు, వితిర్ (-వ్-న్ద్-). చలించు, వణకు, వితిర్పు. వణకు, చలించు, కదులు, భయంతో వణకు, భయం. వితుప్పు. వణకు, కంపం, తొందర, తబ్బిబ్బు. వితుమ్బు (వితుమ్బి). వణకు, కంపించు వెతిర్ (-ప్-ట్ట్-). వణకు, వెతిర్పు. భయం, కంగారు, వణకు ; మ. వితుక్కుక. వేగిరపడు, వితుమ్బుక. (పిల్లలవలె) ఏడ్వు ప్రారంభించు : కువి. వ్రెదహ్. ఉలికిపాటు, బెదరు.

<మూ.ద్రా. *వెద్- అఱ్-/-ఇర్.

బెదరగొట్టు అ.క్రి. అదరు, చలించు. రాఘవ. 4.69. <బెదరు+-అ+పొట్టు[2]. బెదరించు స.క్రి. భయపెట్టు. శృం.నై. 2 46.<బెదరు+-ఇంచు[2]. బెదరింపు వి. భయపెట్టటం, అదలించటం. చంద్రాంగ. 2.143. బెదరుగుండె పిక్కబెదురు వి. భయస్థుడు. వేంక. అం. 1.9. బెదరుగొడ్డు వి. పిరికివాడు, భయశీలుడు. బెదరుచూపు స.క్రి. భయపెట్టు. బెదరుతీర్పు అ.క్రి. ధైర్యం కొలుపు. శగా. 7.158. బెదరుపడు అ.క్రి. (స్వార్థంలో) భయపడు, వెరచు. భాను. 3.44. బెదరుపోతు వి. భయశీలుడు, భయశీలురాలు.

బెదుమ రూ.చూ. బెదను. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు.

బెదుమకర్ర రూ. చూ. బెదనుకర్ర. వి. బెంతుదారం అల్లేకర్ర. బెదుందారం రూ.చూ.బెదనుదారం. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చుకర్రమీది మెలికల్లో దూర్చిన పరిదారం.

బెదుందారం చూ. బెదను.

బెదురు రూ.చూ. బెదరు. అ.క్రి. 1. జంకు, వెనుదీయు : 2 భయపడు ; వి. 1. అవిశ్వాసం. అపనమ్మిక ; 2. భయం, వెరపు : 3. సంకోచం, వెనుతీత ; 4. అధైర్యం ; 5. జంతువులను మనుషులను భయపెట్టటానికి పంటకు దిష్టి తగలకుండా ఉండటానికి పొలంలో నిలబెట్టే గడ్డిబొమ్మ.

బెదురుకుండ రూ.చూ. బిదరకుండ. వి. మూడుమూతల కుండ, పొలాల్లోకి జింకలు, నక్కలు మొ. జంతువులు రాకుండా భయపెట్టటానికి వికృతాకారంగా సున్నంపూసి బొగ్గుతో చుక్కలుపెట్టి పెట్టే మట్టిపాత్ర. బెదురు బొమ్మ రూ. బెద్రుబొమ్మ. వి. జంతువులు బెదిరిపోవటానికి పంట పొలంలో నిలబెట్టిన గడ్డిబొమ్మ.

బెద్రు రూ.చూ. బెదరు. వి. జంతువులను మనుషులను భయపెట్టటానికి పంటకు దిష్టి తగలకుండా ఉండటానికి పొలంలో నిలబెట్టే గడ్డిబొమ్మ, దిష్టికుండ.

బెద్రుబొమ్మ రూ.చూ. బెదురుబొమ్మ. వి. జంతువులు. బెదిరిపోవటానికి పంటపొలంలో నిలబెట్టిన గడ్డిబొమ్మ.

బెనకప్ప రూ. బెన్కప్ప. వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య.

క. బెనక. గణపతి ;

సం. వినాయక-.

<క. బెనక+అప్ప.

బెనకయపండుగ వి. భాద్రపదశుద్ధ చవితి, నేతపనివాళ్ళు మగ్గం సామానులన్నీ కడిగి బొట్లుపెట్టి పూజ చేసుకొనే పండుగ, వినాయకచవితి.

క. బెనక. వినాయకుడు ;

సం. వినాయక-.

<క. బెనక + అయ + పండుగ.

**బెనకలచవితి** రూ. బెనగల్చవితి, బెన్కల్చవితి. వి. వినాయక చవితి.

క. బెనక. వినాయకుడు :

సం. వినాయక-. విఘ్నేశ్వరుడు.

<క. బెనక + -ఉ + -అ[11]- + చవితి.

**బెనకల్ పండుగ** చూ. బెనకయ పండుగ. వి. వినాయక చవితి.

**బెనకు** రూ.,చూ. బెదకు. అ.క్రి. దొరలు.

**బెనగల్చవితి** రూ.చూ. బెనకల చవితి. వి. వినాయక చవితి.

**బెనాయి** వి. మట్టి తవ్వటానికి ఉపయోగించే జనపసాధనం.

హిం. బనాఇ, బనాయ్. అత్యంతం, పూర్తిగా.

**బెనారస్** రూ.చూ. బనారస్. వి. 1. అంచు డిజైనులో ఎల వాలు వరసల్లో నేత కనబడేట్టు నేసిన భాగం; 2. ఒకరకం కృత్రిమపు పట్టు.

**బెనాసి** వి. పక్షివిశేషం. హంస. 3.12.

**బెనిషానిమామిడి** వి. ఒకరకం మామిడి.

**బెన్కప్ప** రూ.చూ. బెనకప్ప. వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య.

**బెన్కల్చవితి** రూ.చూ. బెనకలచవితి వి. వినాయక చవితి.

**బెంతచ్చు** చూ. బెంతు.

**బెంతి** రూ. బెంతు, బెండు. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారం చుట్టే కొయ్య.

**బెంతికదురు** రూ. బెంతుకదురు. వి. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులుదూర్చే పుల్ల. **బెంతిక్ర** రూ.చూ. బెదనుక్ర. వి. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల. **బెంతికాడు** రూ. బెదనుకాడు. వి. అచ్చుకట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చుక్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం. **బెంతిదారం** రూ.చూ. బెదనుదారం. వి. 1. అచ్చుకట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చుక్ర మీది మెలికల్లో దూర్చిన పురిదారం; 2. అచ్చుపడుల్లో దూర్చిన బద్దెపోగుల్లో అని వెంబడి దూర్చిన దారం. **బెంతిపడుగు** రూ. బెంతుపడుగు. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు. **బెంతిపాగర** రూ.చూ. బెంతుపాగర. వి. కొత్తగా కట్టిన అచ్చుకు, పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు. **బెంతిపాగడి** రూ.చూ. బెంతుపాగర. వి. కొత్తగా కట్టిన అచ్చుకు, పడుగు అతకటానికి పన్నెగూళ్ళలో దూర్చిన పోగులు. **బెంతిపుల్ల** వి. 1. అచ్చుకట్టేటప్పుడు అచ్చుబిళ్ళకు చేర్చి పడిదారంచుట్టే పుల్ల; 2. అచ్చుకట్టే టప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల. **బెంతిబద్ద** రూ. బెంతుబద్దె. వి. అచ్చుకట్టేటప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులు దూర్చే పుల్ల. **బెంతిమామ** రూ.చూ. బెంతుమాను. వి. 1. అచ్చుకట్టటానికి అచ్చుక్రలు బిగించే కొయ్యపని ముట్టు; 2. అల్లు చేసేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు. **బెంతిముల్లు** వి. అచ్చుకట్టేటప్పుడు అచ్చు బిళ్ళకు చేర్చి పడిదారం చుట్టేపుల్ల.

**బెంతు** రూ.చూ. బెంతి. వి. అచ్చుకట్టేటప్పుడు పడిదారం చుట్టే కొయ్య.

**బెంతచ్చు** వి. అచ్చుకట్టిన మొదటిసారి పన్నె ఈనెల సందుల్లో ఎక్కించే దారాలు అచ్చుక్రలకు కట్టిన పడి దారాల్లో దూర్చటానికి తయారుచేసిన అచ్చు. <బెంతు + అచ్చు[1]. **బెంతుకదురు** రూ.చూ. బెంతికదురు. వి. అచ్చుకట్టే టప్పుడు పన్నెగూళ్ళలోకి పోగులుదూర్చే పుల్ల. **బెంతుక్ర** రూ.చూ. బెదనుక్ర. వి. బెంతుదారంఅల్లే క్ర. **బెంతు కూర్చు** స.క్రి. అచ్చుకట్టిన తరువాత క్రలకు అల్లిన బెంతు దారాలు పన్నెగూళ్ళలోకి దూర్చు. **బెంతుచువ్వ** రూ. బెంతు నువ్వ. వి. అల్లు చేసేటప్పుడు పడుగులో బెంతుపన్నెకు ముందుఎక్కించిన సన్నబెత్తం. **బెంతుకాడు** రూ.చూ. బెదను కాడు. వి. అచ్చు కట్టేటప్పుడు పడిదారాల బిగింపుకు అచ్చు క్రమీది మెలికల్లో దూర్చిన పురిదారం. **బెంతుతీయు** స.క్రి. అచ్చుకట్టిన తరవాత క్రలకు అల్లిన బెంతుదారాలు పన్నె గూళ్ళలో దూర్చు. **బెంతుదారం** రూ.చూ. బెదనుదారం. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నె గూళ్ళలోకి దూర్చిన పోగులు. **బెంతువేయు** రూ. బెండు వేయు. అ.క్రి. పన్నెగూళ్ళలో దూర్చిన బెంతుదారాల కొసలు పన్నెకు ఇవతల జడమాదిరిగా అల్లటం. **బెంతు పడుగు** రూ.చూ. బెంతిపడుగు. వి. కొత్తగా కట్టిన అచ్చుకు అతకటానికి పన్నె గూళ్ళలో దూర్చిన పోగులు. **బెంతు పండ్లు** వి.బ.వ. బెంతుపన్నెలో వరసగా బిగించిన మేకులు. **బెంతుపనె** వి. అల్లు చేసేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు. **బెంతుపాగర** రూ. బెంతిపాగర, బెంతిపాగడి. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతక టానికి పన్నె గూళ్ళలో దూర్చిన పోగులు. **బెంతుబద్దె** రూ.చూ. బెంతిబద్ద. వి. అచ్చు కట్టేటప్పుడు బెంతుక్రలకు దారం అల్లి కొత్తగా తయారుచేసిన బద్దె. **బెంతుమామ** రూ. బెంతిమాను. వి. 1. అచ్చు కట్టటానికి అచ్చుక్రలు బిగించే కొయ్య పనిముట్టు; 2. అల్లు చేసేటప్పుడు పడుగు పోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు. **బెంతువేయు** రూ. బెండువేయు. అ.క్రి. అల్లు చేసేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టుతో దూర్చు. **బెంతుసీలలు** వి.బ.వ. బెంతుపన్నెలో వరసగా బిగించిన మేకులు. **బెంతుసువ్వ(-చువ్వ)** రూ.చూ. బెంతుచువ్వ. వి. అల్లు చేసేటప్పుడు పడుగులో బెంతు పన్నెకు ముందు ఎక్కించిన సన్నబెత్తం. **బెంతేయు** రూ. బెండేయు. స.క్రి. అచ్చుకట్టిన తరవాత క్రలకు అల్లిన బెంతుదారాలు పన్నెగూళ్ళలో దూర్చు.

**బెంతేయు** చూ. బెంతు.

**బెండడి** చూ. బండ[2]. రూ. బెండి. వి. 1. ఇటుకలు, రాళ్ళు మొ.వి కలిపి గోడ కట్టటానికి మధ్యనువేసే పలచని మన్ను, సున్నం మొ.వి. భీమ. 5.100; 2. రొంపి; 3. నడుమ సందు; 4. రంధ్రం; 5. వసతి; 6. గోడ కట్టేటప్పుడు రెండు రాళ్ళ సందు పూడ్చటానికి ఉంచే రాతి ముక్క; 7. కంకర; 8. పునాదిలో నింపే రాయి.

**బెండడికట్టు** వి. భూమట్టం వరకు బెండడిరాయి వేసి

గాం(కిటు చేయకుండా కట్టే పద్ధతి. పెండడిరాయి రూ. బెంటిదురాయి, బెండదురాయి, బెండరాయి, బెండిడిరాయి, బెండిదురాయి, బెండెదురాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

పెండదురాయి రూ.చూ. బెండడిరాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

పెండరాయి రూ.చూ. బెండడిరాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

పెండి రూ.చూ. బెండడి. వి. 1. రాళ్ళ వరసల మధ్య ఉన్న స్థలం; 2. షనాదిగాడిలోని పల్లపుభాగం.

పెండిడిరాయి రూ.చూ. బెండడిరాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

పెండిదురాయి రూ.చూ. బెండడిరాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతి ముక్క.

పెండు రూ.చూ. బెంతి. వి. అల్లు చేసేటప్పుడు పడుగుపోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టు.

పెండుకర్ర రూ.చూ. బెదనుకర్ర. వి. బెంతుదారం అల్లే కర్ర. పెండుదారం రూ.చూ. బెదనుదారం. వి. కొత్తగా కట్టిన అచ్చుకు పడుగు అతకటానికి పన్నెగూళ్ళలోకి దూర్చిన పోగులు. పెండువేయు రూ.చూ. బెంతునేయు. అ.క్రి. పన్నెగూళ్ళలో దూర్చిన బెంతుదారాల కొసలు పన్నెకు ఇవతల ఆడమాదిరిగా అల్లటం. పెండువేయు రూ.చూ. బెంతువేయు అ.క్రి. అల్లు చేసేటప్పుడు పడుగు పోగులు ఎక్కించే ఒకరకం పనిముట్టులో దూర్చు. పెండేయు రూ.చూ. బెంతేయు. స.క్రి. అచ్చుకట్టిన తరవాత కర్రలకు అల్లిన బెంతుదారాలు పన్నెగూళ్ళలో దూర్చు.

పెండె రూ.చూ. బిందె[1]. వి. గొంతు సన్నగా ఉండే లోహ పాత్ర విశేషం.

పెండెదురాయి రూ.చూ. బెండడిరాయి. వి. గోడల కట్టుబడిలో వాడే రాతిముక్క.

పెండేయు చూ. పెండు.

పెప్పురాయి వి. సారె మొలను దించటానికి గుబ్బ గద్దలో పొదిగిన రంధ్రం ఉన్నరాయి.

పెబ్బరపువాన వి. పెద్దవాన.

పెబ్బరిలు రూ. బెబ్బరిల్లు. అ.క్రి. భయపడు. మల్లు. 1.59.

పెబ్బరిల్లు రూ.చూ. బెబ్బరిలు. అ.క్రి. భయపడు.

పెబ్బులి వి. 1. వ్యాఘ్రం, కోల్పులి. నిర్వ.రా. 1.42; 2. శ్రేష్ఠవాచకం. ఉం.భా. 3.15.

మూ.తె. *పేర్(పెద్ద)+పులి.

పెబ్బులుఁగు వి. వత్రంగి పిట్ట.

<మూ.తె. *పేర్ + పులుఁగు.

పెబ్బె అవ్య. లేదు.

హిం.ఉ. బే. లేకపోవటం.

<ఫ. బేబే.

పెంబడి రూ.చూ. వెంబడి. వి. వెంబనే. శాక్ల.సం. 11.19.

పెంబేలు రూ. బేంబేను. వి. 1. బెదరు; 2. కంగారు.

పెంబేలుపడు అ.క్రి. బెదరు. పెంబేలుపెంబేరు వి. గాభరా.

పెమ్మదంద వి. ఏటా లేచి పెరిగే చిన్న ముళ్ళమొక్క (Tricholepsis glaberrima).

పెమ్మదొంద రూ.చూ. బమ్మదొంద. వి. దొంతలో ఒకరకం కలుపు మొక్క (Echinops echinatus).

పెమ్మరము వి. మూర్ఖు.

పెర వి. గెల.

పెరడు రూ.చూ. బఱడు. వి. చింత, వెలగ, ఆనప మొ. వాటి దొలక.

పెరయించు చూ. బెరయు.

పెరయు రూ. బెరెయు, బెలయు. అ.క్రి. 1. కలుగు, ఉండు. భార.ఆది. 8.215; 2. ఏకీభవించు, ఒకటిగా కూడు. దాక్షారామ శాసనం. క్రి.శ. 1061; 3. వ్యాపించు. కు.సం. 2.97; 4. కలియు, కూడుకొను. నిర్వ.రా. 10.79; 5. కలుగు, జనించు. భార.విరా. 2.106; 6. తారసిల్లు. భార.విరా. 4.223; 7. కూడు, గుమిగా చేరు, సంఘీభవించు. భార.ద్రోణ. 1.256; 8. వీచు, వినరు. హరి.పూ. 6.95; 9. సంభవించు, అగు. భాస్క. రా.యు. 531; 10. అధికమగు, అతిశయించు. భాస్క. రా.యు. 859; 11. ఒప్పు. ప్రకాశించు. భీమ. 2.86; 12. అంటు, తగుల్కొను. మను. 2.18; స.క్రి. 1. పొందు. భార.అను. 8.41; 2. సమీపించు, దగ్గరిల్లు. శృం.నై. 2.118; 3. ప్రతిఫలించు, ప్రతిబింబించు. శృం.నై. 5.9; 4. ఆవరించు, కప్పు. భాగ. 11.87; 5. పరివేష్టించు, చుట్టుకొను. ఉ.రా. 8.75; 6. అనుకరించు. దశ. 2.224.

క. పెరసు, బెరిసు. (ఒకదానితో ఒకటి) కలిసిపోవు, కూడు, చేరు, పెరమహో. కలియు, బెరకె, బెరికె. కలయిక, కూడిక, చేరిక, పెరె. కలియు, కూడు, చేరు, సమీపించు; తు. పెరఁవుని, బిరసుని, పెరసుని. కూడు, కలియు, పెరవుని. కలుపు, కూర్చు, బిరకె. బెరకె. మిశ్రమం, కలుపు, కూర్చు, పెరసు. మిశ్రమం; త. విరచు (విర-చి-). గుమిగూడు, కలియు, కూడు, విరఁవు (విరాఁవు). కలిసిపోవు, సమీపించు, కూడు, చేరు, స్నేహంచేయు, కలయిక. విరవల్. కలియు, కలయిక; మ. విరకుక, విరక్కుక. కలియు; కుఱు. బిర్గనా, బిర్గి. మిశ్రమం (Rice burbrewing); మాల్తొ. బిర్గె. కలుపు, కూర్చు, చేర్చు. బిఁర్గె. కలియు, చేరు, కూడు.

మూ.ద్రా. *విర్-అ-, *విర్-అచ్-.

పెరయించు స.క్రి. 1. కూర్చు, కలియచేయు. భార.విరా. 2.240; 2. అంటించుకొను, లగ్నంచేయు. విక్ర. 4.28; 3. పొందించు. అష్టమ.క. 1.24 ప. 26 పం. <బెరయు + -ఇంచు[3].

పెరప రూ.చూ. బెరసు. వి. 1. కత్తి కట్టకుండా పందెం ఆడే మేలుజాతి పౌరుషవంతమైన కోడిపుంజు; 2. పౌరుష వంతుడు; 3. పురుష లక్షణాలు కొరవడినవాడు; విశే. తుప్పు రాలిన.

పెరమ రూ. బెరన, బెఱను. వి. 1. పరుషం, నిష్ఠురం (మాట). భార.శల్య. 2.377; 2. క్రూరుడు, క్రూరురాలు.

అచ్చ.రా.బాల. 96 ; 3. ముదుగైనది. ముతకది. సీలా. 3.47.

కొం. బర్క్. పరుషమైనది. పరుషం ;

సం. పరుష-. కర్కశం.

బెరావ రూ.చూ. బిరా. క్రి.విశే.ప్రయో. త్వరగా, వడిగా.

బెరికె వి. ఒకజాతి అడవిపక్షి (ఇది శుభాన్ని తెలిపే శకునపక్షి). పి.శకు. 1.182.

బెరికి చూ. బెరసు. వి. 1. న్యూనత, కొరత. జైమినిభా. 8.198 ; 2. విలాసం. శుక.చ. 4.132 ; 3. సంకరుడు ; విశే. దుష్టుడైన, దుష్టురాలైన. హంస. 5.117.

బెరికిలిక్కి వి. ఒకరకం లిక్కి. బెరికుమ్మర్లు వి.బ.వ. ఇతర జాతితో కలిసిన కుమ్మర్లు. బెరుకులు వి.బ.వ. ఒక ధాన్యంలో కలిసిన ఇతర జాతి గింజలు.

బెరికేయు అ.క్రి. ఏరు.

బెరికుమ్మర్లు చూ. బెరికి.

బెరుకు చూ. బెరసు. వి. 1. పరుషవచనం. రం.రా.ఉ. 154 పు. 27 పం. ; 2. ప్రయోజనం. విష్ణుపు. 2.62 ; 3. భేదం. విష్ణుపు. 7.102.

బెరుకులు చూ. బెరికి.

బెరెయు రూ.చూ. బెరయు. అ.క్రి. కూడు, మొత్తంచేయు. దాక్షారామ శాసనం. క్రీ.శ. 1055.

బ్రెరు వి. అదురు.

బెఱసు రూ.చూ. బెరసు. విశే. 1. క్రూరురాలు. సమీర. 5.30 ; 2. పరుషం, నిష్ఠురం ; 3. ముదుగైనది, ముతకది; క్రూరమయిన.

బెఱికె చూ. బెరకె. వి. ధాన్యం పోసిన గోనె.

బెఱుకు విశే. పిరికి, భయశీలుడు. ఉ.హరి. 5.227.

సం. భీరుక-. భయశీలి.

< సం. భీరుక-.

బెఱుకవాఁడు విశే. 1. పిరికివాడు, భయశీలుడు. వేమ. 1.58 ; 2. మూర్ఖుడు, అవివేకి. చెన్నబసవ. 2.53.

బెలఁకు అ.క్రి. చలించు. ద్వి.పరమ.వి. 6.452 ; వి. చలనం. కకుత్స్థ. 1.176.

బెలంచి రూ.చూ. బెల్లించి. వి. పక్షి విశేషం.

బెలము వి. రంధ్రం. అం.శా. 1.145.

సం. బిల-, రంధ్రం, గుహ, బైల-, బిల సంబంధి మైన ; ప్రా.పా. బిల-. కన్నం, రంధ్రం.

<ప్రా. బిల-.

బెలయు రూ.చూ. బెరయు. అ.క్రి. 1. వృద్ధిపొందు. నృసింహ. 2.81 ; 2. వ్యాపించు. నృసింహ. 5.127.

బెలుకాంపులు వి.బ.వ. వ్యవసాయదారులు. ద.హిం.శా.సంపు. 10, శా.సం. 422, క్రీ.శ. 1269.

బెలుకు రూ.చూ. బెళుకు. అ.క్రి. (భయాదులతో) చలించు. మల్లభూ. 2.4 ; వి. విలాసచేష్ట. బా.మం. 1.122.

బెలుగు వి. 1. కొయ్యదూలం ; 2. వెనుగాడినుంచి గోడల మీదికి దించిన మూలవద్ది ; 3. చుట్టింటి గోడలమీద వేసే వల్లలచుట్ట.

క. బెలగు. దూలం.

<క. బెలగు.

బెలుగురాయి వి. చుట్టింటి గోడలమీది బెలుగు కింద ఆధారంగా ఉంచిన రాయి.

బెలుగుడి వి. ఒకరకం కంచెమొక్క.

బెలుపురాయి రూ. బెలుమురాయి. వి. బెలుం పాత్రనుంచి వచ్చే చలవరాయి.

బెలుమురాయి రూ.చూ. బెలుపురాయి. వి. బెలుం పాత్రనుంచి వచ్చే చలవరాయి.

బెళ్కు రూ.చూ. బెళుకు. అ.క్రి. 1. తళతళ ప్రకాశించు, ప్రకాశించు ; 2. బెణుకు, స్థానం తప్పు ; 3. భయపడి నట్లు నటించు ; 4. భయాదులతో చలించు, కంపించు ; వి. 1. తళతళ కాంతి ; 2. తళతళ, నైగనిగ్యం ; 3. చాంచల్యం ; 4. మాటలోని చమత్కారం ; 5. తీక్ష్ణత ; విశే. చంచలం, చలించేది ; స.క్రి. తప్పించుకొను.

బెల్ల రూ. బెల్లము. వి. బెల్లం. దాక్షారామ శాసనం. క్రీ.శ. 1084.

క. బెల్ల. బెల్లం ; కొడ. బెల్ల. బెల్లం ; తు. బెల్ల-. బెల్లం ; త. వెల్లం. బెల్లం ; మ. వెల్లం. చెరకురసం ; కొలా. బెల్లి.

మూ.ద.ద్రా. *వెల్ల-.

బెల్లంరంగు చూ. బెల్లము.

బెల్లంగాడ చూ. బెల్లము.

బెల్లంచెరుకు చూ. బెల్లము.

బెల్లంతెవులు చూ. బెల్లము.

బెల్లవేలం చూ. బెల్లము.

బెల్లపుమాటలు చూ. బెల్లము.

బెల్లపురంగు చూ. బెల్లము.

బెల్లపురాయి చూ. బెల్లము.

బెల్లము రూ.చూ. బెల్ల. విశే. తియ్యని. భార.శాంతి. 3.268 ; వి. 1. బెల్లం, చెరుకురసం కాచి చేసిన ఒక ఘనపదార్థ విశేషం. హర. 2.91 ; 2. మగగురి. సాంబ. మాన. 19.

బెల్లంరంగు రూ.చూ. బెల్లపురంగు. వి. 1. నస్యంరంగు కంటె ఒకవాసి తక్కువ ఉండే రంగు ; 2. కొత్తబెల్లం రంగు ; 3. బెల్లపుగడ్డ రంగు. బెల్లంగాడ వి. తినే దుంపల నిచ్చే ఒకరకం తీగ (Ceropeyia juncea). బెల్లంచెరుకు వి. ఒకరకం చెరుకు. బెల్లంతెవులు వి. పేనువల్ల కాడమీద ఎర్రటి బంక ఏర్పడుతుంది. బెల్లవేలం వి. గుండ్రటి ఆకులు గల ఒకరకం పాకుడు కలువమొక్క. <బెల్లము+అలం. బెల్లపుమాటలు వి.బ.వ. ప్రియమైన మాటలు. బెల్లపురంగు రూ. బెల్లంరంగు. వి. 1. నస్యంరంగు కంటె ఒకవాని తక్కువ ఉండే రంగు ; 2. కొత్తబెల్లం రంగు ; 3. బెల్లపు గడ్డ రంగు. బెల్లపురాయి వి. కఠినశిలల ఉపరితలాన్ని అరగదీసి మెరుగుపెట్టటానికి వాడే సానరాయి లేక ఒరిపిడి రాయి. బెల్లంబువ్వ వి. పరమాన్నం. బెల్లంముంగి వి. తెలుపువన్నెల పోగులు పెట్టి నేసిన చిన్నగడి.

బెల్లంబువ్వ చూ. బెల్లము.

బెల్లంముంగి చూ. బెల్లం.

బెల్లి విశే. వంచించేది, మోసపుచ్చేది. కళా. 3.127. ప్రభు. 4.144.

బెల్లిమాటలు వి.బ.వ. సాంత్వన వాక్కులు, ఇచ్చకపు మాటలు. ఇలా. 20.118.

బెల్లించి రూ. బెలంచి. వి. పక్షివిశేషం.

బెల్లించివెల్లాలిసేయు చూ. బెల్లించు.

బెల్లించు స.క్రి. 1. వంచించు, మోసపుచ్చు. ద్వి. పరమ. వి. 4.320; 2. ఉబ్బించు, ముఖస్తుతిచేయు. ఆం. భా. 3.124; 3. లాలించు.

త. వెపుల్.

బెల్లించివెల్లాలిసేయు అ. క్రి. ఉబ్బించి మోసగించు. బెల్లింపు వి. బెల్లించటం, వంచనం. ఇలా. 4. బెల్లింపుమాట వి. ఇష్టమైనమాట.

బెల్లింపు చూ. బెల్లించు.

బెల్లింపుమాట చూ. బెల్లించు.

బెల్మ వి. పొడుగాటి నాముగల ఒకరకం పార.

బెళకువాలుక చూ. బెళఁకు[1]. వి. చలించేనాలుక. శాశ్ల. వం. 10.128.

బెళగు వి. ప్రకాశం. శా. ప. మం. శా. సం. 69. క్రీ.శ. 1878.

క. బెళగు. ప్రకాశం, కాంతి.

<క. బెళగు.

బెళగువ్వ చూ. బెళవ.

బెళఁకు[1] రూ.చూ. బెదఁకు. అ.క్రి. 1. చలించు. ద్వి. పరమ. వి. 2.102; 2. ఒరయు. అష్టమ. క. 1.26పు. 21పం; వి. చలనం. రాజవా. 2.57.

బెళఁకు[2] రూ.చూ. బెళుకు. అ.క్రి. తళతళ ప్రకాశించు, మెరయు.

బెళఁగు రూ.చూ. బెడఁగు. వి. 1. సౌందర్యం, చక్కదనం. పాంచాలీ. 5.27; 2. విలాసం; 3. విధం; 4. మెరుగు, కాంతి; విశే. 1. మనోహరం, మంజులం; 2. పెద్దది; 3. మోటు, మూర్ఖం.

బెళబెళ వి. నడిచేటప్పుడు కలిగే వస్త్రాదుల ధ్వనికి అనుకరణం. ఘటికా 2.5.

బెళవ వి. పక్షివిశేషం, ఒకజాతిపిట్ట. పార్వ. 6.77.

క. బెళవ, బెళువ. అడవిపావురం.

బెళగువ్వ వి. ఒకజాతిపావురం. మను. 4.58.

బెగావ రూ.చూ. బెగాలున. క్రి. విశే. ద్రు. వేగంగా. ప్రబంధ. 7.90.

బెగాలున రూ. బెగాన. క్రి. విశే. ద్రు. వేగంగా. సమీర. 4.14.

బెళిక చూ. పెళ్ల. వి. రాతిముక్క.

బెళికించు చూ. బెళుకు.

బెళుకు రూ. బెలుకు, బెల్కు, బెళఁకు[2], బెళ్కు. వి. 1. తళతళ కాంతి. కళా. 1.212; 2. చాంచల్యం. దశా. 2.26; 3. మాటలోని చమత్కారం. హంస. 2.199; 4. తళతళ, నైగనిగ్యం; 5. తీక్ష్ణత; విశే. 1. చంచలం, చలించేది. యయా. 1.12; అ.క్రి. 1. తళతళ ప్రకాశించు. ప్రబంధ. 2.90; 2. భయాదులతో చలించు, కంపించు. హంస. 1.71; 3. భయపడినట్లు నటించు. శుక. 2.104; 4. బెణుకు, స్థానం తప్పు. కార్తీక. 5.83; స.క్రి. తప్పించుకొను. శుక. 2.98.

క. బెళ్(ఉ). బెళ, బెళ్(ఉ)ప్పు, బెళతిగె, బెళ్పగె, బిళ, బిళు, బిళి, బిళా, బిళపు, బిళుపు. తెలుపు, కాంతి, బెళ, బెళకు, బెళగు. కాంతి, దీపం, బెళఁగు. కాంతి, వెలుగు, ప్రకాశింపజేయు, బెళఁగు. మెరియు, ప్రకాశించు. బెళగిసు. కాంతితో నింపు, ప్రకాశింపజేయు, బెళర్. తెల్లనగు, ప్రకాశించు, బెళర్పు. మెరుపు, ప్రకాశం, బెళ్పి. వెండి, శుక్రగ్రహం, బిళ్పడు. తెల్లనిది, తెలుపురంగు; తు. బెళగు. కాంతి, ప్రకాశం, బెళగుని. ప్రకాశించు, బెళగావుని. ప్రకాశింపజేయు, బిళి. తెలుపు; త. విళంకు. ప్రకాశించు, మెరయు, విళక్కమ్. వెలుగు, విళర్పు. తెలుపు, కాంతి; మ. వెళి, వెళివు. వెలుగు, నైర్మల్యం, వెళిచ్చమ్, వెలుగు, కాంతి, వెళుక్క. ప్రకాశవంతమైన, తెల్లనైన, వెళుప్పు, తెలుపు, కాంతి, కుష్ఠు, విళుప్పిక్క. కాంతివంతమైన, ప్రకాశవంతమైన, తెల్లనైన, వెళువెళ. అధికమైనతెలుపు. వెళ్ల. తెల్లరంగు, తెల్లనిశుభ్రమైన గుడ్డ, విళున్నుక, ప్రకాశించు, కాంతిని ప్రతిబింబింపజేయు, విళక్కుక. ప్రకాశించు, మెరుగు, విళక్కమ్. ప్రకాశం, కాంతి, మెరుగు; కో. వెల్పు. వెలుగు, తెలుపు, కాంతి; తో. పిళై. వెండి, వీనస్; గోం. వెర్పు. వెలుగు; కుఇ. బిల్పినా. ప్రకాశించు, మెరయు, బిల్ బిల్ రాను. వెలుగు, మెరయు, మండు, బిల్పి. దీపం, వెలుగునిచ్చేది, మంట, ప్రకాశం, జ్ఞానం, బెల్ బెల్ రాను. అసాధారణమైన ఒంటి తెలుపు; కువి. వెల్ల. తెలుపు; పర్జి. విల్. తెలుపు, విలి. తెల్లనిది, విల్ద్. వెలుగు; కొలా. వెలంగ్. వెలుగు; కురు. బిల్పు. మెరియు; మాల్తో. (Bibilre). బిల్ బిల్ రె. ప్రకాశించు, బిదై. మెరియు.

<మూ. ద్రా. *వెళ్-.

బెళికించు స.క్రి. చలింపచేయు, కదల్చు. హంస. 5.272. బెళుకుదేరు (-తేఱు) రూ. బెళుకుదేఱు. అ.క్రి. (స్వార్థంలో) తళతళ ప్రకాశించు. పీఠి. 9. బెళుకుదేఱు రూ.చూ బెళుకుదేరు. అ.క్రి. (స్వార్థంలో) తళతళ ప్రకాశించు. బెళుకువేల వి. పలకలు తయారుచేసే రాళ్ళుగలనేల.

బెళ్కు రూ.చూ. బెళుకు. వి. 1. తీక్ష్ణత. ఇందు. 3.12; 2. తళతళకాంతి. హంస. 1.218; 3. తళతళ, నైగనిగ్యం; 4. చాంచల్యం; 5. మాటలోని చమత్కారం; స.క్రి. తప్పించుకొను. అ.క్రి. 1. తళతళప్రకాశించు, ప్రకాశించు. ఇందు. 5.103; 2. భయాదులతో చలించు, కంపించు. దశా. 4.52; 3. బెణుకు, స్థానం తప్పు; 4. భయపడ్డట్లు నటించు.

బెళ్ల రూ.చూ. పెల్ల. వి. 1. మట్టిగడ్డ, బెత్తిక; 2. ఇటిక ముక్క.

బెవరాటి వి. విచ్చలవిడిగా తిరిగే ఆడది.

క. బెవిసు. భ్రమించు, తిరుగు;

సం. భ్రమించు. తిరుగు.

<క. బెవిసు + రాణి.

బెష రూ.చూ. భ్రష్టు. వి. ఉన్నివికే వెదురుబద్ద.

బెషె రూ.చూ. భ్రష్టు. వి. ఉన్నివికే వెదురుబద్ద.

బెనగు రూ.చూ. బెనుకు. అ.క్రి. 1. వీలగు; 2. జారిపోవు.

బెనబెన వి. కోయటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. ధ్వన్యను. హంస. 4.113.

బెసారు రూ. బెసారో. వి. అన్నీకలిపి వండిన కూర.

క. బెస. తయారుచేసిన, బెసె. గట్టిగాకలుపు.

బెసారో రూ.చూ. బెసారు. వి. అన్నీకలిపి వండినకూర.

బెసికిపోవు చూ. బెసుకు.

బెసుకు రూ. బెనగు, బెనుగు. అ.క్రి. 1. (స్వస్థానం నుంచి) పట్టుతప్పు; 2. వికలమగు.

తు. బిసరుని. తప్పు వికలమగు.

బెసికిపోవు అ.క్రి. తప్పిపోవు.

బెనుసు రూ.చూ. బెనుకు. అ.క్రి. 1. వీలగు; 2. జారిపోవు.

బెస్త వి. పల్లకీ మొదలైన వాటిని మోయటంచేత చేపల్ని పట్టటంచేత జీవించే ఒకజాతివారు. బోయ. అము. 4.7.

క. బెసద, బెస్త. చేపల్ని పట్టటంచేత పల్లకీ మొ. వాటిని మోయటంచేత జీవించే ఒకజాతివారు.

బెస్తవేస్తము వి. సమయానికి పనికిరానిది. రాధికా. 4.79.

బెస్తపెగ్గెలు వి.బ.వ. చేయలేని చేతల్ని చేయకలిగినట్లు ఎక్కువగా చెప్పుకొనేవి. బెస్తపెద్దతనము వి. చాలాఇబ్బందినికలగ తేసే పెద్దతనం.

బెహరా వి. రాజుల దగ్గర కుమ్మరి కులస్తులమీద అధికారంతో ఉండేవారు.

బెహరికుడు రూ.చూ. బేహారి. వి. వణిజుడు.

బెహారము రూ.చూ. బేహారము. వి. వాణిజ్యం, క్రయ విక్రయ వ్యాపారం. విజ్ఞా. 2.80.

బెహారి రూ.చూ. బేహారి. వి. క్రయ విక్రయాలు చేసేవాడు, వణిజుడు. H.A.S. 13-14, శా. 6.99.

బే[1] వి. అంబే, గోజాతి అరుపుకు అనుకరణం. భోజ. 6.44. ధ్వన్యను.

బేబేఅను[1] అ.క్రి. బేబేఅనే శబ్దంచేయు. బేబేబ్రాహ్మణులు వి.బ.వ. కన్యాకుబ్జుల్లో ఒకతెగకు చెందిన బ్రాహ్మణులు.

బే[2] ప్రత్య. కాని అనే వ్యతిరేకార్థాన్నిచ్చే ఒకప్రత్యయం.

హిం. బే-. లేక, లేని, అనహ్యాన్ని వ్యక్తం చేసేందు కుపయోగించే సంబోధన సంబంధమైన ధ్వని; ఉ.పార. బే. పర్షియన్ భాషలో లేక లేని అనే వ్యతిరేకార్థాన్నిచ్చే విభక్త్యర్థమైన అవ్యయం;

క. బే. లేకుండా; త. పే.

<ఉ. బే.

బేపరాకుగా అవ్య. గ్రు. అజాగ్రత్తగా. హిం. బే. లేకుండా.<హిం.బే+పరాకు+అగు+-అ[7]. బేబాచెయ్యి విశ. గొప్ప సమర్థత కలవాడు. హిం.ఉ. బే. లేకుండా, బా. దఫా, పర్యాయం.<ఉ. బేబా+చెయ్యి. బేబేఅను[2] అ.క్రి. 1. భంగపరచు; 2. మొండిచెయ్యిచూపు.

బేకు[1] రూ.చూ. బేగు[1]. వి. నాయకుడు, సర్దారు.

బేకు[2] రూ.చూ. బోకు. వి. బోకు, పనికిమాలినవాడు.

బేకు[3] స.క్రి. కొయ్యసాధనాలతో మెల్లగా కొట్టు, అద్దలించు.

ఇం. *Bake*. వండు, వేడిచేసి గట్టిపరచు, వేడియగు.

బేగ్ రూ.చూ. బేగు[1]. వి. 1. మొగలు వంశస్థుల పేర్ల చివర వాడబడే వంశబోధక నామం; 2. సర్దారు.

బేగ రూ. బేగా. క్రి.విశ. శీఘ్రంగా, త్వరగా, వెంటనే.

సం. వేగ-. శీఘ్రం, త్వర.

<సం. వేగ-.

బేగడ వి. కాకిబంగారం, అభ్రకం. విష్ణుపు. 7.147.

బేగడా వి ఒకానొక రాగం. చెన్నబసవ. 2.236.

బేగము రూ. భేగము. వి. రాణి, రాజుభార్య. వేమ. శ. 14.

హిం. బేగమ్. రాణి; మరా. బేగమ్. రాణి, అవివాహితస్త్రీ, బీబి; ఉ. బేగమ్. శ్రీమతి, పత్ని, బీబి; పార. బేగమ్. బేగ్ భార్య.

<ఉ. బేగమ్.

బేగరి రూ.చూ. బేగారి. క్రి.విశ. వేగంగా, శీఘ్రంగా.

బేగరిఇనాం వి. బాటసారుల మూటలుమోసే మాదిగవాడి కిచ్చిన మాన్యం.

బేగా రూ.చూ. బేగ. క్రి.విశ. శీఘ్రంగా, త్వరగా, వెంటనే.

బేగారి రూ. బేగరి. వి. వెట్టి.

హిం.ఉ. బేగార్. కూలీ లేకుండా పనిచేయటం· బేగారీ. కూలీ లేకుండా పనిచేసేవాడు.

<ఉ. బేగార్.

బేగి రూ. వేగి. క్రి.విశ. శీఘ్రంగా.

క. బేగ. త్వరగా, శీఘ్రంగా;

సం. వేగ-. శీఘ్రం; హిం. బేగి. వెంటనే.

<క. బేగ.

బేగిరావు వి. పెద్ద లొట్టిపిట్ట, తపాలు తీసుకెళ్ళే ఒంటె. బేగిరావులు వి.బ.వ. వేగంగా వచ్చేవాళ్ళు.

బేగు[1] రూ. బేకు[1], బేగ్. వి. నాయకుడు, సర్దారు. చంద్ర.శ. 105.

ఉ. బేగ్. నాయకుడు, సర్దారు, అధ్యక్షుడు; పార. బేగ్. నాయకుడు, ప్రభువు; తుర్కీ. బేగ్. నాయకుడు, ప్రభువు.

<ఉ. బేగ్.

బేగు[2] వి. గొంగడి నేసేటప్పుడు పేకపోగు దగ్గర పడటానికి కొట్టే కొయ్యపట్టె.

హిం. బేగ్. వేగం.

<హిం. బేగ్.

బేగోందు అవ్య. అంటించని.

హిం.ఉ.పార. బేగోంద్. గోందువేయని, సీలువేయని, గోంద్. జిగురు.

<ఉ. బే-గోంద్.

బేక్ర రూ.చూ. మేక. వి. 1. మేక; 2. గొర్రె.

బేచక్రాలు వి.బ.వ. బేచిరాకు, సికస్తు. ద.హిం.గా. సంపు. 5. గా.సం. 874. క్రి.శ. 1620.

బేచర్ వి. గవర్నమెంటు స్వాధీనంలోఉన్న భూమి.

బేచలామణి అవ్య. చలామణిలో లేని, వాడుకలోలేని.

హిం.ఉ.పార. బేచలానా. వారుకలో లేనిది.

<ఉ. బేచలానా.

**బేచిరాకు** రూ. బేచిరాకీ. అవ్య. 1. నిర్మానుష్యం, జనశూన్యం; 2. పేరుకు మాత్రం ఉండే; 3. దీపంలేని.

హిం. బేచిరాగ్. దీపంలేని, కాంతిలేని, నిర్జనం; ఉ. బేచిరాగ్. దైన్యం, హైన్యం; పార. బే-చిరాగ్. వెలుగు లేక నిర్జనం;

క. బేచిరాకు. నిర్మానుష్యమైన, కాపురాలు లేని; త. పెచిరాక.

<ఉ. బేచిరాగ్.

**బేచిరాకీ** రూ.చూ. బేచిరాకు. అవ్య 1. నిర్మానుష్యం; 2. పేరుకు మాత్రం ఉండే.

**బేచెరు** వి. రంగునీళ్ళుకాచే పెద్ద ఇనపదబ్బా.

**బేజహర్** అవ్య. అవసరమైన.

హిం. బేజరూర్; ఉ.పార. బే-జరూర్.

<ఉ. బే-జరూర్.

**బేజా** వి. నిరాదారమైంది, పనికిమాలింది.

హిం.ఉ. బేజా. అనుచితం, ఖరాబు, సరిగాకపోవటం.

<ఉ. బేజా.

**బేజాన** వి. చాలా చాగా ఉండటం.

హిం. బేజాన్. నిర్బలమయిన.

<హిం. బేజాన్.

**బేజారు** రూ. బేజిరు. వి. 1. విముఖం, అప్రసన్నం. పద్మ.యు. 28 : 2. సహ్యంకానిది, 3. విసుగు.

ఉ. బేజార్. పరాఙ్ముఖం, విముఖం, అప్రసన్నం: పార. బిజార్, అలిసిపోవు, రోతకలిగిన.

<ఉ. బేజార్.

**బేజారుపెట్టు** అ.క్రి. కంగారుపెట్టు.

**బేజిరు** రూ.చూ. బేజారు. వి. విముఖం. అప్రసన్నం. ద.హిం.గా. సంపు. 4. గా.సం. 711.

**బేజుమాల్** రూ. బేజుమాలు. విణ. సానపెట్టబడిన, చికిలివేయబడిన. అహల్యా. 1.99.

హిం.ఉ. బిజ్‌మాల్. కత్తుల్ని తుడవటం, పార. బిజ్ మాల్. కత్తుల్ని తుడవటం, బిజ్. ప్రకాశవంతమైన కత్తులు, మాల్. తుడవటం.

<ఉ. బీజ్‌మాల్.

**బేజుమాలు** రూ.చూ. బేజుమాల్. విణ. సానపట్టబడిన, చికిలి చేయబడిన, ప్రయోగించటానికి సిద్ధపరచబడిన. సమీర. 2.51.

**బేజుమాలుచేయు** స.క్రి. సానపట్టు. **బేజుమాలుచేయించు** స.క్రి. చికిలి చేయించు. సమీర. 1.125.

**బేజురంగు** వి. చనీళ్ళతో కలిపి నూలుకు వేసే రంగు.

హిం. బేజా. తగని, సరికాని.

**బేజోటుఅగు** అ.క్రి. తప్పిపోవు.

**బేంచి** రూ.చూ. బెంచి. వి. పొడుగాటి పీట.

**బేటము** వి. 1. అనురాగం. కు.సం. 5.74; 2. సంభోగం. పండి.చ. 2.144; 3. ప్రేమ; 4. దయ; 5. ఆనందం; 6. సాంగత్యం; 7. కళ్ళకు గంత, కళ్ళకు ముసుగు.

క. బేటు, బేంటు. మనోవికారం; తు. బేడుని. వేడుకొను; త. వేటుమ్. కోరిక, ఆశ.

<క. బేట.

**బేటంబేటము** వి. అత్యంతానురాగం. కు.సం. 1.176.

**బేటంబేటము** చూ. బేటము.

**బేటరు** వి. పంపు, వాలు.

ఇం. *Batter*. దెబ్బలు కొట్టు.

<ఇం. Batter.

**బేటి** రూ.చూ. భేటీ. వి. కలిసికొనటం. వార్మి. 3.58.

**బేటు** రూ. చూ. పేటు[1]. వి. 1. ఆరును మొ.వి ఎండి నప్పుడు విచ్చే పెల్ల; 2. కొండ మొ. వాటిలోని చీలిక.

**బేటెన్‌తలుపు** వి. కిస్తీలు చెక్కిన చెక్కలను అతికించి తయారు చేసిన తలుపు.

ఇం. *Batten*. చెక్క సందుల్ని కప్పటానికి పెట్టిన కొయ్య పలక.

<ఇం. Batten + తలుపు.

**బేటె** రూ.చూ. బీట[2]. వి. చీలిక.

**బేటెత్తు** అ.క్రి. పదుగు కుంగిన వైపు ఎక్కువ పలక తగులు.

**బేడ[1]** వి. 1. రూపాయలో ఎనిమిదో వంతు, వరక రూపాయ, దీనారం (వరహా)లో 32వ వంతు. ఆం.భా. 2.258; 2. గోర్ల మెడలకు అందానికి లేదా గాడికి పూన్చటానికి కట్టే తాడు లేదా తోలు; 3. 4½ అంగుళాలు.

**బేడ[2]** వి.బ.వ. 1. పొట్టు తీసిన కాయధాన్యాల పప్పు. హర. 2.91; 2. బద్దల్ని పోలిన పడియాలు, పరుగులు మొ. వాటి ముక్కలు. ఆము. 2.97.

క. బేళె. పప్పుబద్ద; కొడ. బె.ళె. పప్పుబద్ద; తు. బేళె. పప్పుబద్ద;

సం. ద్విదలా. ముక్క, బద్ద; ప్రా. బిదల. సెనగలు మొ. వాటి పప్పుబద్దలు.

<క. బేళె.

**బేడలుగాజేయు** స.క్రి. పప్పుగాచేయు. (తలలను) పగల గొట్టటంలో ఉపయోగించే పలుకుబడి. శార్ఙ.సం. 7.116.

**బేర[3]** చూ. దాడిగ[1]. వి. పన్ను. నె.గా. పొదిలిశాసనం. 22. క్రీ.శ. 10వ శతాబ్ది.

**బేరజంగమ** వి. పేటాడి జీవించే వెనుకబడిన తరగతికి చెందిన జంగమజాతి.

క. బేడ. వద్దు, అక్కరలేదు, బేడర. వేటగాడు.

<క. బేర + జంగమ.

**బేరతీగె** వి. అందమైన ఎర్రని పూలుపూచే ఒకరకం తీగ (Tpomaea biloba).

**బేరదికి** వి. కంచెల ఉపయోగపడే తెల్లని పూలుపూచే ఒకరకం ముళ్ళ మొక్క (Randia malabarica).

**బేరప** రూ. బేరనము, బేడిస[1]. వి. మత్స్యవిశేషం, ఎగిరే చేప, పాఠీనం. సిం.ద్వా. 1.240.

క. బేడ. వేటాడేవాడు.

**బేరపతివ్వె** వి. సన్నగా ఉండే ఒకరకం తీగ (Vitis latifolia).

**బేడసము** రూ.చూ. బేడస. వి. మత్స్యవిశేషం, ఎగిరే చేప. పాఠీనం.
**బేడా** వి. గర్భాలయానికి చుట్టూ ఉండే మంటపం. సింహ. శ. 12.
హిం. బేఢా. ఇంటి ముందు కూరగాయల కొరకు ఉన్న స్థలం, ప్రాంగణం; ఉ. బేఢా. ఇంటి ముందు ఉండే స్థలం.
< ఉ. బేఢా.
**బేడాలు** విశే. వికారమైన.
హిం. బేడౌల్. అందవికారమైన.
< హిం. బేడౌల్.
**బేడికి** రూ.చూ. బాడిగ[1]. వి. సిస్తు, బాగదేయం.
**బేడిగ** రూ.చూ. బాడిగ[1]. వి. పన్ను, బాగదేయం. నె శా. 105. ప్రీ.శ. 1570.
**బేడిగె** రూ.చూ. బాడిగ[1]. వి. పన్ను, బాగదేయం. గుత్తికొండ శాసనం 1503.
**బేడింకట్టె** చూ. బేడెం. వి. రెక్కలను పట్టి ఉంచటానికి తలుపు వెనక బిగించిన కొయ్యబద్ద.
**బేడింకమ్మి** చూ. బేడెం. వి. రెక్కపట్టి ఉంచటానికి తలుపు వెనక బిగించిన కొయ్యబద్ద.
**బేడిజము** వి. మాయటక్కు.
**బేడిదము** రూ.చూ. బెడిదము. విశే. భయంకరం. కాశ. 4.188.
**బేడిమూక** వి. అల్లరిమూక.
క. బేడ. వేటగాడు, బేడు. వేటగాండ్ర సమూహం.
< క. బేడ.
**బేడింబద్ద** చూ. బేడెం. వి. రెక్కలను పట్టి ఉంచటానికి తలుపు వెనక బిగించిన కొయ్యబద్ద.
**బేడిస**[1] రూ.చూ. బేడస. వి. మత్స్యవిశేషం, ఎగిరే చేప. పాఠీనం. ప్రబో. 2.71.
**బేడిస**[2] వి. నమస్కారం. హంస. 4.213.
**బేడిసతిరుగుళ్లు** వి.బ.వ. బాలికా క్రీడా విశేషం.
**బేడిసుడి** వి. మోకాళ్ళ దిగువన ఉండే సుడి.
**బేడిసెకదుపుభంగిని** అవ్య.ద్రు. అధికంగా. హంస. 3.29.
**బేడీలు** వి.బ.వ. సంకెళ్ళు.
హిం. బేడీ. కాళ్ళకు వేసే ఇనప సంకెళ్ళు, సంకెళ్ళు, వ్యవసాయానికుపయోగించే వేముబుట్ట; ఉ. బేడీ. నేరస్తులకు నాలుగుకాళ్ళ జంతువులకు కాళ్ళకువేసే ఇనప సంకెళ్ళు; త. పేటి.
క. బేడి. సంకెల.
< ఉ. బేడీ.
**బేడెం** రూ.చూ. బెడెం. వి. 1. తలుపు రెక్కలను మూస్తూ కలిపి ఉంచటానికి వాడే కొయ్య లేక ఇనప ముక్క; 2. ఆను పీటల బిగింపుకు వేసే కొయ్యవేడు.
**బేడెపుబద్ద** వి. రెక్కలను పట్టి ఉంచటానికి తలుపు వెనక బిగించిన కొయ్యబద్ద.
**బేడెపుబద్ద** చూ. బేడెం.
**బేతకీదు** అవ్య. అన్యవ్యస్తంగా.
ఉ.పార. బేతాకీద్. తాకీదులేని.
< ఉ. బే[1] తాకీద్.
**బేతంచర్లబండ** రూ.చూ. బేతంచెర్లబండ. వి. కర్నూలు జిల్లా బేతంచర్ల గ్రామప్రాంతంనుంచి వచ్చే చలవరాయి.
**బేతంచెర్లబండ** రూ. బేతంచర్లబండ. వి. కర్నూలు జిల్లా బేతంచెర్లగ్రామ ప్రాంతం నుంచి వచ్చే చలవరాయి.
**బేతాళం** వి. కొయ్యమీద పూజలు చెయ్యటానికి పనికి వచ్చే ఇనప సాధనం.
సం. బేతాల-, బేతాళుడు.
< సం. బేతాల-.
**బేతాళప్రశ్నలు** వి.బ.వ. అంతుచిక్కని ప్రశ్నలు. అము. 6 65. బేతాళుడు విక్రమార్కుణ్ణి అనేక క్లిష్ట ప్రశ్నలు వేసినట్లుగా పలుకథలు ఉన్నాయి. దాన్నిబట్టి ఈ పద బంధం ఏర్పడింది.
**బేతాహతు** విశే. తాహతు లేనిది.
హిం.ఉ. బేతాకత్. శక్తిలేని.
< ఉ. బేతాకత్.
**బేతీ** వి. వెదల్పాకుల కంచె చెట్టు.
సం. భేదిన్, భేదించేది, చీల్చేది.
< సం. భేదిన్.
**బేత్రి** వి. మూడు (ఇది సొగటాలాట పరిభాష). చమ. 1.102.
సం. త్రి. మూడు.
**బేదఖలు** వి. అధికారచ్యుతం.
హిం. ఉ. బేదఖ్‌ల్. అధికారచ్యుతం; పార. బి-పే-దఖిల్. విరమింపచేయటం, అధికారచ్యుతం.
< ఉ. బేదఖ్‌ల్.
**బేదరియాప్తి** అవ్య. విచారణకిందలేని.
ఉ.పార. బే-ద్‌ర్‌యాఫ్‌త్. విచారణలోలేని.
< ఉ. బే-దర్‌యాఫ్‌త్.
**బేది** వి. పాసనం, విరేచనం.
సం. భేదిన్. పగలగొట్టేది, విరోచనకారి.
సం. భేదిన్.
**బేపనపసి** రూ.చూ. బాపనపసి. వి. తెల్లదనం ఎక్కువగా ఉన్న పసి.
**బేపరవా** రూ. బేపర్వా. విశే. లక్ష్యంలేని.
హిం.ఉ. బేపర్‌వా, బేపర్‌వాహ్. నిర్లక్ష్యమైన, నిశ్చింతమైన.
< ఉ. బేపర్‌వా.
**బేపారు** అవ్య. మబ్బుగా, సంతోషం లేకుండా.
హిం.ఉ. బే. లేకుండా.
**బేపి** రూ.చూ. వేపి. వి. 1. ఆడకుక్క; 2. కుక్క.
**బేపికూన** వి. పునర్వసు నక్షత్రం కావచ్చు.
**బేపర్వా** రూ.చూ. బేపరవా. వి. ఉదాసీనంగా ఉండటం.
**బేబందుగా** క్రి.విశే.ద్రు. భద్రత లేకుండా.
ఉ.పార. బేబంద్. రక్షణలేని, సంకెళ్ళువేయని;
క. బెబంద్. క్రమంలేని, తారుమారుగాఉండే; త. పెపంతు.
< ఉ. బేబంద్ + అగు + -ఆ[7].

బేబందోబస్తుగా క్రి.విశే. కట్టుదిట్టం లేకుండా.
ఉ.పార. బే-బందొబస్త్. స్థిరతలేని, దేశ సంబంధి.
< ఉ. బే-బందోబస్త్+అగు+-అ[7].
బేబాకీ అవ్య. బాకీ లేకుండా.
హిం.ఉ. బే-బాకీ. బాకీ లేకుండా ; పార. బే-బాకీ ; త. పేపాక్కి.
< ఉ. బే-బాకీ.
బేబాకు రూ.చూ. బేబాక్కు వి. బాకీ లేకుండటం. పద్మ.యు. 142.
బేబాక్కు రూ. బేబాకు. వి. బాకీ లేకుండటం. పద్మ.యు. 45.
హిం. బేబాక్. చెల్లింపబడిన ఋణం ; ఉ. బేబాక్. బాకీ చెల్లించినవాడు, ఋణవిముక్తుడు, ఋణాన్ని చెల్లించటం; పార. బీబాక్. పూర్తిగా, మొత్తం.
< ఉ. బేబాక్.
బేమ్ రూ.చూ. బీము. వి. గొంగడి నేసేటప్పుడు పేకపోగు దగ్గరపడటానికి కొట్టే కొయ్యపట్టె.
బేమరమ్మతు అవ్య. ఉపయోగించటానికి వీలులేని స్థితి.
హిం. బేమరమ్మత్. సరిచేయని ; ఉ.పార. బే-అ. మరమ్మత్.
< ఉ. బే-అ.మరమ్మత్.
బేము రూ.చూ. బీము. వి. గొంగడి నేసేటప్పుడు పేకపోగు దగ్గర పడటానికి కొట్టే కొయ్యపట్టె.
బేముపారుకట్టె రూ.చూ. బేముదారుకట్టె. వి. గొంగడి నేసేటప్పుడు బేము ఊతగా పెట్టుకొనే చిన్న మొద్దు. బేముదారుకట్టె రూ. బేముపారుకట్టె బేమ్బురికట్టె. వి. గొంగడి నేసేటప్పుడు బేము ఊతగా పెట్టుకొనే చిన్న మొద్దు.
బేములాహిజా వి. పరిశీలించకుండటం.
హిం. ఉ. పార. బే.ములాహిజ్. తనిఖీ చేయక పోవటం.
< ఉ. బేములాహిజ్.
బేమ్బురికట్టె రూ.చూ. బేముదారుకట్టె. వి. గొంగడి నేసేటప్పుడు బేము ఊతగా పెట్టుకొనే చిన్న మొద్దు.
బేంబేలు రూ.చూ. బెంబేలు. వి. దిగులు, భయం
బేయు రూ.చూ. వేయు. స.క్రి. ఒకదానిపై ఒకటి క్రమంలో నిలుపు.
బేరకత్తియ చూ. బేరము.
బేరకత్తె చూ. బేరము.
బేరగాడు చూ. బేరము.
బేరజము వి. కుత్సితప్రవర్తన, చెడ్డనడవడి. ద్వి.పరమ.వి. 4.302 ; విశే. 1. కుత్సితుడు, కుత్సితురాలు, కుత్సితం. సారంగ. 3.89 ; 2. నేర్పరి, చతురుడు. హంస. 5.216 ; 3. ధూర్తుడు. ఆం.భా. 3.7.
బేరజములు వి.బ.వ. పరుషవచనాలు.
బేరటవారు రూ.చూ. బేరదవారు. వి. బ. వ. చివర కాడికి తగిలించేవారు.
బేరటాకు రూ.చూ. బేరదాకు. వి. ఎడ్లను కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టా.
బేరటాకుజోడు వి. గొడ్ల మెడలకు అందానికిగాని, వాటిని కాడికిపూన్చటానికిగాని కట్టే తాడు లేక తోలు.
బేరద రూ.చూ. బేరడు. వి. 1. ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టా ; 2. బండి కాడికి ఎడ్లను కట్టే తాడు లేక తోలు పరికరం.
బేరదవారు రూ. బేరటవారు. వి.బ.వ. బేరద చివర కాడికి తగిలించే వారు. బేరదాకు రూ. బారదాకు, బేరటాకు. వి. ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలుపట్టా.
బేరదాకు చూ. బేరద.
బేరడి రూ.చూ. బేరడు. వి కట్టే తాడు లేక తోలు.
బేరడు రూ. బేరద, బేరడి, బేరాడు, బేరెడు. వి. 1. ఎద్దుల్ని కాడికి కట్టే నాలుగైదు అంగుళాల వెడల్పుగల తోలువట్టా; 2. బండి కాడికి ఎడ్లను కట్టే తాడు లేక తోలు పరికరం.
బేరడుజోడు వి. గొడ్ల మెడలకు అందానికిగాని, వాటిని కాడికి పూన్చటానికి కట్టే తాడు లేక తోలు.
బేరమరుగు చూ. బేరము.
బేరమాడు చూ. బేరము.
బేరము రూ.చూ. బేహారము. వి. వాణిజ్యం, క్రయ విక్రయ వ్యాపారం. ప్రబోధ. 4.33.
బేరకత్తియ రూ.చూ. బేరకత్తె. వి. బేరమాడే స్త్రీ. బేరకత్తె రూ. బేరకత్తియ. వి. బేరంచేసే స్త్రీ, బేరమాడే స్త్రీ. మొల్ల.అయోధ్యా. 12. బేరగాడు వి. బేరం చేసేవాడు. బేరమరుగు అ.క్రి. వ్యాపారానికై విదేశాల కేగు. శుక. 1.144. < బేరము+అరుగు. బేరమాడు అ.క్రి. వాణిజ్యం చేయు. ద్వి.పరమ.వి. 4.87 ; స.క్రి. కొనేటప్పుడు వస్తువుల్ని కొంత వెలకిమ్మని అడుగు. శుక. 1.60. < బేరము + ఆడు. బేరముపావగించు అ.క్రి. బేరం కుదుర్చు. హంస. 5.360. బేరసారమాడు స.క్రి. బేరం చేయు. హంస. 1.112. < బేరసారము + ఆడు. బేరసారము వి. క్రయ విక్రయ వ్యాపారం. వరాహ. 9.123.
బేరగాల వి. చంద్రగాల, రెడ్డి సంచిక అనుబంధం. క్రీ.శ. 1377.
బేరసారమాడు చూ. బేరము.
బేరసారము చూ. బేరము.
బేరాడు రూ.చూ. బేరడు. వి. కట్టేతాడు లేక తోలు.
బేరాము అవ్య. వ్యవధి లేకుండ. పద్మ. యు. 167.
హిం. బేఆరామ్. విశ్రాంతి రహితంగా; ఉ. బేఆరామ్. విశ్రాంతి లేకుండ.
< ఉ. బేఆరామ్.
బేరి[1] వి. దుందుభి, వాద్యవిశేషం. ద. హిం. గా. సంపు. 5.10. గా. సం. 45 క్రీ.శ. 1280.
సం. భేరి-, భేరీ. వాద్యవిశేషం; ప్రా. భేరి, భేరీ; అ.మా. పా. భేరి;
క. త. బేరి. మ. పేరి.
< ప్రా. భేరి-.
బేరి[2] వి. ఒకరకం పండు. (Pyrus communis).
ఇం. *Berry*. బేరిపండు.

<ఇం. Berry.

**బేరి**[3] వి. **1.** వంతెన; **2.** వరస.

ఇం. *Barrage.* ఆనకట్ట. శత్రుపక్షాన్ని ఎదుర్కోటానికి ఏర్పరచుకొన్న వరస.

<ఇం. Barrage.

**బేరికట్టురేకు** వి. కట్లు వేయటానికి పనికివచ్చే పలచగా సన్నగా ఉండే రేకు బద్ద. **బేరివడ్డు** (-ఒడ్డు) వి. కాలువకు అడ్డంగా వేసిన పెద్దఅడ్డకట్ట.

**బేరి**[4] రూ.చూ. బేహారి. వి. **1.** వైశ్యుడు, బేరగాడు. శుక. 2.563; **2.** వ్యాపారంచేసే ఒక తమిళకులం.

**బేరింగ్** రూ.చూ. బేరింగు. వి. మరాను ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కుగుండ్లు అమర్చిన పనిముట్టు.

**బేరింగు** రూ. బేరింగ్. వి. మరాను ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కు గుండ్లు అమర్చిన పనిముట్టు.

ఇం. *Bearings.* మృదువుగా ఉంచటానికి ఉపయోగపడే యంత్రభాగాలు.

<ఇం. Bearings.

**బేరింగుసారె** రూ. బోరింగులసారె. వి. బాల్‌బేరింగు అమర్చిన సిమెంటుసారె.

**బేరీకట్టు** రూ. బేల్‌కట్టు. వి. **1.** పలచని రేకుతో వేసేకట్టు; **2.** పచ్చిటిక మీద దిమ్మలమధ్య కట్టిన పలచని గోడ.

**బేరీకట్టుగోడ** వి. మిద్దెమీద దిమ్మల మధ్య కట్టిన పలచని గోడ.

**బేరీజు** రూ. బేరీజు వి. **1.** దివాణపు పన్నులమొత్తం; **2.** జాబితా; **3.** అంచనా.

మరా. బేరీజు. మొత్తం, కలుపబడినది; హిం. ఫెహరిస్త్. విషయసూచి. ఉ. ఫెహరిస్త్. బేరీజ్. మొత్తం, ఒక పొలంయొక్క మొత్తం ఆదాయం, ప్రభుత్వం విధించేపన్ను; పార. బరీజ్; త. పేరిమ, పేరిజ్ పేరిజ్. అ. ఫిహరిస్త్.

<ఉ. ఫెహరిస్త్.

**బేరీజువేయు** స.క్రి. తూచి చూచు.

**బేరీకమామిడి** వి. పీచులేని వాటిలో ఒకరకం.

**బేరుజావు** వి. ధ్రువపడనిది. సాక్ష్యంలేనిది.

హిం. ఉ. బే-రుజూ. ఆకర్షణలేక.

ఉ. బే-రుజూ.

**బేరుండము** వి. తన్నుకొని పోయే ఒకజాతి పక్షి.

సం. భేరండ-. ఒకపక్షి.

<సం. భేరండ.

**బేరెడు** రూ.చూ. బేరడు. వి. గొడ్లమెడలకు అందానికిగాని వాటిని కాడికి పూన్చటానికిగాని కట్టేతాడు లేక తోలు.

**బేర్నిపార** వి. పొడుగాటి కామగల ఒకరకం పార.

**బేర్పు** చూ. పేర్పు. రూ.చూ. పేర్పు. వి. అచ్చుపోగులకు రెండు రంగుల పడుగుపోగులు అతకటం.

**బేల్** వి. చుక్కాను వంటి ఆకారం.

ఉ. బేల్. చుక్కాను; పార. బేల్. ఖనిత్రం, కర్ణం చుక్కాను.

<ఉ. బేల్.

**బేల** రూ. బేలు[1]. విణ. **1.** మూఢవ్యక్తి, అవివేకి. భార. ఆది. 4.137; వి. **1.** భీరువు, పిరికి. రం.రా. అయోధ్యా. 103; **2.** బేలతనం. పారి. 1.127; **3.** అమాయకురాలు.

సం. భేల-. పిరికి, అవివేకం, మూఢత; ప్రా. భేల. భీలు. పిరికితనం; అ. మూ. భిల;

క. బెళ్, బెకువె. బుద్ధిహీనత, తడబాటు, పిచ్చి, బెలున. పిరికి, భీరువు.

<ప్రా. బేల-.

**బేలగాఉండు** అ.క్రి. తక్కువ వన్నెలో ఉండు. **బేలగొట్టు** (-కొట్టు[1]) అ.క్రి. మోసగించు. **బేలతనము** వి. **1.** భీరుత్వం, కాతర్యం. భార. కర్ణ. 2.60; **2.** అవివేకం, తెలివితక్కువ. భార. శాంతి. 3.224. **బేలపోవు** అ.క్రి. నిస్సారమగు. శ్రీరం. మూ. 3.14. **బేలరి** వి. వివేకహీనుడు. భాగ. 3.380. <బేల+-అరి.

**బేలడి** చూ. బేలు[4].

**బేలాయఖు** విణ. తగియుండని.

హిం. ఉ. బెలాయక్. తగని.

<ఉ. బేలాయక్.

**బేలికల్ల** వి. ఆముకాల్చటానికి వాడే ఎండినకంప.

క. బెలి. కంచె. కంచెగా ఉపయోగపడే పొదలు.

**బేలు**[1] రూ.చూ. బేల. విణ. వివేకహీనమైన. కు. సం. 9.88; వి. **1.** వివేకవిహీనుడు; **2.** వివేకవిహీనురాలు; **3.** మోసం.

**బేలుచేయు** స.క్రి. **1.** అవివేకిగా చేయు. భాగ. సం. 13.142; **2.** మోసం చేయు. **బేలుదనము** (-తనము) వి. అవివేకం, తెలివితక్కువ. ఉ. హరి. 1.96. **బేలుపడు** రూ.చూ. బేల్పడు. అ.క్రి. **1.** అవివేకిఅగు. హరి. పూ. 8.88; **2.** మోసపోవు. భోజ. 6.55. **బేలుపఱచు** రూ.చూ. బేల్పఱచు. స.క్రి. వంచించు, మోసపుచ్చు. శుక. 2.280. **బేలుపోవు** అ.క్రి. **1.** మోసపోవు. పి. శకు. 3.165; **2.** ఏమరిపోవు. **బేలువెట్టు** (-పెట్టు) స.క్రి. మోసపుచ్చు. భార. శాంతి. 3.66. **బేలువేయు** అ.క్రి. మోసంచేయు. **బేల్పడు** రూ. బేలుపడు. అ.క్రి. మోసపోవు. భార. శాంతి. 3.252. **బేల్పఱచు** రూ. బేలుపఱచు. స.క్రి. వంచించు, మోసపుచ్చు. భోజ. 4.141. **బేల్పాటు** వి. మోసపోవటం. దశకు. 11.55.

**బేలు**[2] వి. కాల్పులో కుండలకు ఒకపక్క తెల్లగా మరొకపక్క కొంచెం ఎర్రగా ఏర్పడే స్థితి.

**బేలు**[3] విణ. మంచిది.

హిం. భోలా. మంచి, అమాయకమయిన.

<హిం. భోలా.

**బేలు**[4] వి. **1.** నలభై కట్టలనూలు; **2.** ఏదైనా ఒక నమూనాలో నేసిన నేత.

ఇం. *Bale.* పత్తిమొ. వాటికట్ట.

<ఇం. Bale.

**బేలడి** వి. డిజైన్లు నేసే చేతిమగ్గంలో అడ్డబేలు నుంచి పడుగులోకి వేలాడే దారాలు. <బేలు[4]+అడి. **బేలుకట్టు** వి. సున్నబ్బట్టీ పగలకుండా చుట్టూవేసిన ఇనపకట్టు.

బేలుకట్టి వి. బెత్తెడు వెడల్పున పల్చగా ఉండే రేకు ముక్కను ఒకవైపు పిడిగా పనికి వచ్చేటట్లు చుట్టచుట్టి తయారుచేసిన పనిముట్టు. బేలుచెక్క వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు పేటు అడపోగులు ఎత్తి పట్టుకొనే కొయ్య పనిముట్టు. బేలుతగిడి వి. గానుగ దూలానికి తగిలించిన పాలంచి సాధనం. బేలుతాడు వి. మూడుపేటలతాడు. బేలుదారాలు రూ. బేల్దారాలు. వి.బ.వ. అంచులో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగుపైన వంతెన మాదిరిగా కట్టిన లావుదారాలు. బేలుపట్టి వి. కట్లు వేయటానికి పనికివచ్చే పలచగా సన్నగా ఉండే రేకుబద్దె. బేలుబద్ద వి. నేసినబట్ట మడత పెట్టటానికి చేతో ఒత్తే ఇనపబద్ద. బేలుబుగిడి రూ. బేల్బుగిడి. వి. ముగ్గలు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. బేలుమగ్గం వి. ఒక రకం చేతిమగ్గం. బేలుమరక వి. చేతిమగ్గంమీద డిజైన్లు నేసేటప్పుడు పేటు అడపోగులు ఎత్తిపట్టుకొనే కొయ్య పని ముట్టు. బేలురేకు రూ. బేల్రేకు[1] వి. 1. మరాసు కట్టుబడిలో చక్రం ఆకుల ఓగింపుకోసం చుట్టిన ఇనపరేకు; 2. నేతనేసే టప్పుడు మరమగ్గం మేరువ పలక సులువుగా ఆడటానికి ఓగించిన ఇనపరేకు; 3. బెత్తెడు వెడల్పున ఉండే రేకు ముక్కను ఒకవైపున పిడిగా పనికివచ్చేటట్లు చుట్టచుట్టి తయారుచేసిన పనిముట్టు. బేల్కట్టు రూ.చూ. బేలుకట్టు. వి. పలచని రేకుతో వేసేకట్టు. బేల్కట్టురేకు వి. బెత్తెడు వెడల్పున పల్చగాఉండే రేకుముక్కను ఒకవైపున పిడిగా పనికివచ్చేటట్లు చుట్టచుట్టి తయారుచేసిన పనిముట్టు. బేల్దారాలు రూ.చూ. బేలుదారాలు. వి.బ.వ. అంచులో డిజైన్లు నెయ్యటానికి చేతిమగ్గం పడుగుపైన వంతెన మాదిరిగా కట్టిన లావు దారాలు. బేల్బుగిడి రూ.చూ. బేలుబుగిడి. వి. ముగ్గలు పడేట్టు నేసిన ఒకరకం డిజైను. బేల్రేకు రూ.చూ. బేలురేకు. వి. 1. పలచటిరేకు; 2. బెత్తెడు వెడల్పున ఉండే రేకుముక్కను ఒకవైపున పిడిగా పనికివచ్చేటట్లు చుట్టచుట్టి తయారుచేసిన పనిముట్టు; 3. పచ్చి కుండలకు పూజలు పెట్టటానికి ఉపయోగించే ఇనపరేకు.

బేలు[5] వి. జామీను.

ఇం. *Bail.* జామీను.

<ఇం. Bail.

బేలుదారి రూ.చూ. బేలుదారు. వి. ఇల్లుకట్టే పనివాడు.

బేలుదారు రూ. బేలుదారి, బేల్దారి, బేల్దారు. వి. ఇల్లుకట్టే పని వాడు.

హిం.ఉ.పార. బేల్‌దార్. మట్టితవ్వే పనిచేసే హిందూ మతస్థుల్లో ఒకతెగవాడు, కామాటివాడు.

<ఉ. బేల్‌దార్.

బేల్కట్టు చూ. బేలు[4].

బేల్కట్టురేకు చూ. బేలు[4].

బేల్దారాలు చూ. బేలు[4].

బేల్దారి రూ.చూ. బేలుదారు. వి. ఇల్లుకట్టే పనివాడు.

బేల్దారు రూ.చూ. బేలుదారు. వి. కాసేవాడు.

బేల్దార్రాతు వి. గోడల కట్టుబడికి పనికివచ్చే రాయి.

బేల్దార్రాతు చూ. బేల్దారు[4].

బేల్బరు చూ. బేలు[1].

బేల్బలచు చూ. బేలు[1].

బేల్బాటు చూ. బేలు[1].

బేల్‌బారింగు రూ.చూ. బాల్బేరింగు. వి. గుళ్ళబేరింగు, బేరింగు. మరాసు ఇరుసు సులువుగా తిరగటానికి ఉక్కుగుళ్ళు అమర్చిన పనిముట్టు.

బేల్బుగిడి చూ. బేలు[4].

బేల్రేకు చూ. బేలు[4].

బేవరము రూ.చూ. బేహారము. వి. బేరం.

బేవర్సు రూ.చూ. బేవారసు. విశ. హక్కుదారు కానివాడు.

బేవారసు రూ. బేవర్సు. విశ. అనాధ, హక్కుదారు కానివాడు.

హిం.ఉ. బేవారిస్. ఉత్తరాధికారి కానివాడు.

<ఉ. బేవారిస్.

బేవు వి. గొంగడి నేసేటప్పుడు పేకపోగుదగ్గర పడటానికి కొట్టే కొయ్యపట్టె.

క. బెవ్వు. వేమువృక్షం.

బేషకు రూ. బేషక్కు. క్రి.విశ. నిస్సందేహంగా.

హి.ఉ. బేషక్. నిస్సందేహంగా.

<ఉ. బేషక్.

బేషక్కు రూ.చూ. బేషకు. క్రి.విశ. నిస్సందేహంగా.

బేషు రూ. బేసు[2], బేసు. విశ. మంచిది, శ్రేష్ఠం.

హిం. బేష్, బేస్. బాహిరరూపం.

<హిం. బేష్.

బేస్మెంటు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికిపైన పునాది గోడ మీదనుంచి కాళ్ళ కింది భాగంవరకు కట్టబడిన గోడ.

బేస్ రూ.చూ. బేసు[1]. వి. ముడినూలుమీద మొట్టమొదట వేసిన రంగు.

బేసరము వి. శ్వేతభేదం, ఒకజాతి డేగ. ఇందు. 2.80.

బేసబబు అవ్య. నిష్కారణంగా.

హిం. బేసబబ్ అకారణం; ఉ. బేసబబ్. అకారణం; పార. బే-బి-సబబ్. అకారణం.

<ఉ. బేసబబ్.

బేసబెల్లితపము చూ. బేసబబు. వి. సంగనాచితనం. శాల్మ.పం. 7.250.

బేసము రూ.చూ. పేసము. వి. 1. చిక్కని పళ్ళరసం, గుజ్జు. భాగ. 8.447; 2. పండులో కండభాగం.

బేసరి రూ. బేసిరి. వి. ఒకటికన్న ఎక్కువ రాళ్ళతో చేసిన ముక్కుపుడక, ఒకరకం ముంగర.

హిం. బేసర్. నాసికాభరణం.

<హిం. బేసర్.

బేసర్లష్టు వి. బొండాయిరవ్వతో చేసిన లష్టు.

హిం. బేసర్. నాసికాభరణం.

<హిం. బేసర్ + లష్టు.

బేసవెల్లి విశ. సంగనాచి వంటిది. శాల్మ.సం. 10.61.

నం. వేష-. వేషం.

బేసి వి. సరిసంఖ్య కానిది. ఉ.హరి. 3.120.

క. బెస, బెసి. సరిసంఖ్య కానిది;

సం. విషమ-. సమంకాని, సరికాని, కష్టమైన; ప్రా.

విసమ-. విషమసంఖ్య ; అ.మా.జై.మహా.పా. విసమ.

<క. బెసి.

బేసికంటి వి. శివుడు. యయా. 1.85. బేసికంటిమామ వి. హిమవంతుడు. సాంబ. స్థా. 55 బేసికంటివేల్పు వి. త్ర్యంబకుడు, శివుడు. చెన్నబసవ. 4.80. బేసికన్నులవేల్పు వి. శివుడు. హర. 5.20. బేసికన్నామి వి. శివుడు. సాంబ. దేవ. 3. బేసికైదువుజోదు వి. విషమశరుడు, పంచబాణుడు, మన్మథుడు. బేసితావసులు వి.బ.వ. సప్తర్షులు. నరస. 5.57.

బేసిక్కుకలర్ వి. చన్నీళ్ళలో కలిపిఅద్దే రంగు.

ఇం. *Basic colour*. మూలమైన రంగు.

<ఇం. Basic colour.

బేసు[1] రూ. బేస్. వి. 1. భూమట్టానికిపైన పునాది గోడమీద నుంచి గార్తీల కింది భాగంవరకు కట్టబడిన గోడ ; 2 ముడి నూలుమీద మొట్టమొదట వేసిన రంగు.

ఇం. *Base*. ఆధారం

<ఇం. Base.

బేసుమట్టం రూ. బేసుమట్రం. వి. భూమట్టానికి పైన పునాది గోడమీద నుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ. బేసుమట్రం రూ.చూ. బేసుమట్టం. వి. భూమట్టానికి పైన పునాది గోడమీదనుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేసు[2] రూ.చూ. బేము. విణ. మంచిది.

బేసుకొను రూ.చూ. వేసికొను. అ.క్రి. కట్టుకొను.

బేసుమింటు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికి పైన పునాది గోడమీదినుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేసుమీటు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికి పైన పునాది గోడనుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేసుమెట్టు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికి పైన పునాదిగోడ మీదినుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేసుమెంటు రూ. బేస్మెట్టు, బేస్మెంటు, బేసుమింటు, బేసుమీటు, బేసుమెట్టు, బేసుమేటు, బేస్మెంటు. వి. భూమట్టానికి పైన పునాదిగోడమీది నుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

ఇం. *Basement*. అడుగుమట్టం.

<ఇం. Basement.

బేసుమెంటుగోడ వి. ప్రత్యేక పునాది నేల మట్టాన వెడల్పులు తగ్గించి పునాది గోడమీద కట్టిన గోడ. బేసుమెంటురాతి వి. బేసుమెంటు కట్టుబడికి వాడే రాయి.

బేసుమెట్‌రాయి చూ. బేసుమెంటు. రూ.చూ. బేస్‌మీటురాయి. వి. బేసుమెంటు కట్టుబడికి వాడే రాయి.

బేసుమేటు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికి పైన పునాది గోడమీది నుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేసులెవలు వి. భూమట్టానికి పైన పునాది గోడమీది నుంచి గార్తీల అడుగు భాగం వరకు కట్టబడిన గోడ.

ఇం. *Base level*. ఆధార మట్టం.

<ఇం. Base level.

బేసెము రూ.చూ. పేసము. వి. చిక్కని పళ్ళరసం, గుజ్జు.

బేస్తవారము వి. బృహస్పతి వారం, గురువారం.

సం. బృహస్పతివార-. గురువారం.

<సం. బృహస్పతివార-.

బేస్తు[1] వి. పేక, జూదం మొ. వాటిలో కొద్ది గెలుపు, బొటాబొటి గెలుపు.

పో. బస్తు. చీట్లాటలోని పరిభాష ; స్పా. బాస్తో. చీట్లాటలోని పరిభాష, కాగితాలలో కళావరు, బాస్తోస్. కళావరు కాగితం.

<పో. బస్తు.

బేస్తుమీదకుదేలు వి. గెలిస్తే ఒకటి తీసుకొని ఓడితే మూడురెట్లు ఇవ్వటం, పేకాటలో ఒకరకం.

బేస్తు[2] వి. భూమట్టానికి పైన పునాది గోడమీది నుంచి గార్తీల అడుగుభాగం వరకు కట్టబడిన గోడ.

ఇం. *Base*. ఆధారం.

బేస్రి రూ.చూ. బేసరి. వి. రాళ్ళు పొదిగిన నాసాభూష.

బేస్‌మీటురాయి రూ. బేసుమెంట్‌రాయి. వి. బేసుమెంటు కట్టుబడికి వాడే రాయి.

బేస్మెంటు రూ.చూ. బేసుమెంటు. వి. భూమట్టానికి పైన పునాది గోడమీదినుంచి గార్తీల కింది భాగం వరకు కట్టబడిన గోడ.

బేహద్దీ వి. చట్ట సమ్మతం కానిపని.

హిం.ఉ. బేహద్. హద్దులేని, అపరిమితమైన.

బేహరము రూ.చూ. బేహారము. వి. వాణిజ్యం. నార.పంచ. 5.13.

బేహరి రూ.చూ. బేహారి. వి. బేహారి, వణిజుడు. భాగ. 10 ఉ. 1227.

బేహారమాడు చూ. బేహారము.

బేహారము రూ. బెహారము, బేరము, బేవరము, బేహరము. వి క్రయవిక్రయ వ్యాపారం. భార.అను. 5.12.

సం. వ్యవహార-. ప్రవర్తన, ఆచారం, వ్యాపారం ; ప్రా. అ.మా. వవహార- ; పం. వ్యహార్, బుహార్ ; సిం.మరా. వహార. ఆచారం.

క. బేర, బేహర, బేహారి, బెవహార. వర్తకం ; తు. బేపార, బేరి, బ్యార ; కుఇ. బేపారి, బేబరి ; కువి. బేబర, బేరూమి.

<సం. వ్యవహార-.

బేహారమాడు స.క్రి. వాణిజ్యంచేయు. భార.శాంతి. 2.225. <బేహారము + ఆడు.

బేహారి రూ. బెహారికుడు, బెహారి, బేరి[4], బేహరి. వి. వణిజుడు భార. శాంతి. 3.480, ద. హిం. గా. సంపు. 7. గా. సం. 734.

సం. వ్యవహారిన్. వ్యాపారి ; ప్రా. వవహారి, వావారి. వ్యాపారి ;

క. బేరి. వర్తకుడు ; మ. యావారి ; కువి. బేరామిగత్తె. వ్యాపారి.

< సం. వ్యవహారిన్.

బేహారికుఁడు వి. కోమటి, వణిజుఁడు. ప్రభు. 1.18 వ. 22 పం.

సం. వ్యావహారిక-. వర్తకుడు.

< సం. వ్యవహారిక-.

బేంకు వి. ధనం, విలువైన వస్తువులు దాచుకొనే సంస్థ.

ఇం. *Bank*. విలువైన వస్తువుల్ని, డబ్బును దాచుకొనే సంస్థ.

< ఇం. Bank.

బేంకుబుడ్డి పిల్లలు డబ్బుదాచిపెట్టటానికి ఉపయోగపడే గుండ్రని చిన్న మట్టి బుడ్డి. ఇం. *Bank*. బాంకు. < ఇం. Bank + బుడ్డి.

బేట్రించుకమ్మి వి. ఒకరకం కమ్మి.

ఇం. *Battery*. విద్యుద్ఘటశ్రేణి.

< ఇం. Battery + అంచు³ + కమ్మి.

బేట్రీఅంచు వి. నేత పడుగులో కింది పొరకు పై పొరకు వేరు వేరు రంగులు పెట్టి నేసిన అంచు.

ఇం. *Battery*. విద్యుద్ఘటశ్రేణి.

< ఇం. Battery + అంచు³

బేవవెల్ల రూ.చూ. బాఁపనెల్ల. వి. 1. అచ్చుతెలుపు; 2. కొంచెం ఎరుపు కలిసిన తెలుపు.

బేరన్ రూ. బేలన్. వి. రంగునీళ్ళుకాచే పెద్ద ఇనపడబ్బా.

ఇం. *Barrel*. పీపా.

< ఇం. Barrel.

బేరన్‌పొగాకు వి. ముడి పొగాకు.

ఇం. *Barren*. నిస్సారమయిన గొడ్డు.

< ఇం. Barren + పొగాకు.

బేలన్ రూ.చూ. బేరన్. వి. రంగునీళ్ళు కాచే ఇనపడబ్బా.

బైకలు రూ.చూ. బయఁకులు. వి.బ.వ. వేవిళ్ళు, గర్భిణీ లక్షణం.

బైకాలు రూ.చూ. బయఁకలు. వి.బ.వ. వేవిళ్ళు.

బైగొండ రూ.చూ. బయాహుండా. వి. బియ్యం తెల్లగా ముతగ్గా ఉండే రకం ధాన్యం.

బైంగమనేత వి. ఎనిమిది పోగులు ఒకరంగు, రెండుపోగులు మరొకరంగు పెట్టి పడుగు, పేక సమంగా నేసిన నేత.

హిం. బైంగన్. వంకాయ.

< హిం. బైంగన్ + నేఁత.

బైజ వి. 1. ప్రలాపం, అర్థంలేనిమాట. విష్ణుపు. 4.321; 2. అజ్ఞానం; 3. పనికిమాలిన పని.

హిం.ఉ. బైజ్. వెర్రితనం, బైజూ. వెర్రివాడు.

< ఉ. బైజ్.

బైజేసూడు వి. బాదంగూడు, అండాకారంగా ఉన్న గూడు.

హిం.ఉ. బాజ్. డేగ.

బైటచేరు రూ. బయటచేరు. అ.క్రి. ముట్టగు.

బైటఁబెట్టు చూ. బైలు.

బైటితుంగ వి. తృణ విశేషం, తుంగలో ఒకరకం. ప్రబంధ. 201.

బైతాలము రూ. బయితాలము. వి. కోపం, కినుక. అం.రా. 1.135.

బైండు వి. పుస్తకానికి అట్ట కట్టటం.

ఇం. *Bind*. పుస్తకానికి అట్టలు కట్టు.

< ఇం. Bind.

బైండుచేయు స.క్రి. పుస్తకాలకి అట్ట కట్టు. < బైండు + చేయు.

బైండ్లఇనాం వి. గ్రామంలో గోతులు తవ్వేవాళ్ళ కిచ్చింది.

ఇం. *Bind*. కట్టు, జతచేయు. కూర్చు.

< ఇం. Bind + -లు + -అ¹¹ + ఉ. ఇనామ్.

బైతు వి. అప్రయోజకుడు.

హిం.ఉ. బైత్. పద్యం, శ్లోకం.

< ఉ. బైత్.

బైదోరు (-రోరు) వి. మాల, మాదిగ, దాసరి కాక మరొక హరిజన జాతి.

బైనాటి చూ. నాఁడు. వి. పంపటోళ్ళు వాయిస్తూ పెద్ద వంకర కొమ్ము ఊది జీవించే కులం.

బైబిలు వి. క్రైస్తవుల పవిత్ర గ్రంథం.

ఇం. *Bible*. క్రైస్తవ మత గ్రంథం.

< ఇం. Bible.

బైబైఅగు అ.క్రి. తెల్లవారబోవు.

ఇం. *Good-bye*. వీడ్కోలు చెప్పేటప్పుడు ఉపయోగించే పదబంధం.

< ఇం. Good-bye + good-bye + అగు.

బైముక్కాయలపట్టు చూ. బైముక్కాయలు.

బైముక్కాయలు (-కాయలు) వి.బ.వ. వేరుసెనగకాయలు.

బైముక్కాయలపొట్టు వి. వేరుసెనగకాయల పొట్టు.

బైరవాసము రూ. బయిరవాసము. వి. ఉత్తరీయం, పైబట్ట కాశీ. 2.442.

సం. బహిర్వాస-. మీది దుస్తులు.

< సం. బహిర్వాస-.

బైరవుఁడు వి. శివగణాధిపులలో ఒకడు; విణ. భయానకరసం కలవాడు. చాటువు.

సం. భైరవ-. బైరవుడు; ప్రా. భఇరవ-, భేరవ-. శివుడు, శివుని అవతారం; జై. మహా. గా. అ.మా. పా. భేరవ-; మా. భేలవ-;

క. బైరవ; మ. వైరవన్, బైరవె.

< సం. భైరవ-.

బైరాగి రూ. బయిరాగి. వి. విరక్తుడు, విరక్తుడైన తీర్థవాసి, సంసారం అంటే ఇష్టం లేనివాడు. బ్రహ్మా. 2.170.

సం. వైరాగిన్. విరక్తుడు; ప్రా. వఇరాగి, విరాగి, వఇరగ్గ-, వఇరాగ-; అ.మా. వఇరగ్గ-; పా. విరాగిన్;

క. తు. బైరాగి; మ. వఇరాగ్గియం.

< ప్రా. వఇరాగి.

బైరి¹ రూ. బయిరి. వి. 1. శ్యేనభేదం, ఒకజాతి డేగ. చంద్రాంగ. 2.77; 2. మొసలి. అం.రా. 3.48.

బైరి² రూ.చూ. బవరి. విణ. గుండ్రని, పట్టెలు తీర్చిన. శశా. 4.170.

బైరిగ వి. పిడిసాన.
బైరివడ్లు రూ. బైరొడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు.
బైరుగుపురుగు వి. మిరప పూత తినే గుండ్రటి పచ్చపురుగు.
బైరూపు రూ.చూ. బౌరూపు వి. వివిధ వేషాలు వేసేవాడు.
బైరొడ్లు రూ.చూ. బైరివడ్లు. వి.బ.వ. ఒకరకం వడ్లు.
బైర్లు వి.బ.వ. చీకట్లు.
బైర్లుకమ్ము అ.క్రి. కళ్ళు తిరుగు.
బైలగు చూ. బైలు.
బైలర్‌పొయ్యి రూ.చూ. బాయిలర్ పొయ్యి. వి. గవర్నమెంటు పొయ్యి, నీళ్ళు కాచటానికి బాయిలర్ లాగ చేసిన పొయ్యి.
బైలు రూ.చూ. బయలు. విశే. 1. దండయాత్ర. F.I. నంపు. 19. క్రీ.శ. 848 ; 2. ప్రకటం, వెల్లడైనది. ఘటికా. 2.34 ; 3. తొలగినది. రాజవా. 3.86 ; వి.బా. 1. వెలుపలి ప్రదేశం. పల్నా.వు. 88 ; 2. ఆకాశం. పి.శకు. 2.177 ; 3. వృక్షలతాది రహిత ప్రదేశం. వాల్మీ. 3.99.
బైటబెట్టు (-పెట్టు) స.క్రి. బయల్పరచు. కాశీ. 4.108. బైలగు రూ. బయలగు. అ.క్రి. బయల్పడు. ఉ.రా. 2.137. <బైలు+అగు. బైలుదేర్పు స.క్రి. వెలిపుచ్చు, వెలివర్చు. ఐందు. 1.3. బైలుదేఱు (-తేఱు) అ.క్రి. ఇల్లు మొ. వాటినుంచి వెలువడు. బైలుపడు అ.క్రి. ప్రకటిత మగు, వెల్లడగు. రసిక. 2.104. బైలువట్టు(-పట్టు[1]) అ.క్రి. బయలుపడు, బైటవ్యాపించు, బైటను పొందు. సమీర. 1.66. బైల్పడు అ.క్రి. బయల్పడు, ప్రకటమగు. ముకుంద. 3.43.
బైల్పడు చూ. బైలు.
బైనట రూ. బయినట. వి. పీట సొరకాయ యొక్క బంధనం.
బైసి రూ.చూ. బయిసి. వి. 1. గొప్పదనం, గౌరవం, ఆధిక్యం. హర. 4.29 ; 2. ఈలువు, పాతివ్రత్యం, స్త్రీల మర్యాద. వేంక.పంచ. 3.285 ; 3. సొంపు, చక్కదనం. వరాహ. 2.45 ; 4. నియతి, భాగ్యం. ఆం.భా. 1.99.
బైసిగొను స.క్రి. చంపు. చంద్రాంగ. 2.91. బైసిగాఁడు వి. గౌరవహీనుడు. శుక. 2.247. బైసిచెడు అ.క్రి. బగిసిమాలు, అవమానపాత్రమగు. జైమిని. 7.82. బైసితీయు అ.క్రి. పరువుతీయు, అవమానించు.
బైసికిలు రూ.చూ. బయిసికిలు. వి. రెండు చక్రాల తొక్కే బండి, సైకిలు, ప్రయాణ సాధనం.
బైసుక రూ. బయిసుక. వి. 1. నియమం. ఉ.హరి. 3.12 ; 2. ప్రతిజ్ఞ. ఉ.హరి. 3.120 ; 3. స్థిరనివాసం. విక్ర. 8.89.
సం. వైశికా. వేశ్యా సంబంధి.
<సం. వైశికా.
బైసుమాలు అ.క్రి. ప్రాలుమాలు.
క. బయ్‌సు, బయిసు. తిట్టించు, తిట్టబడు.
బొంయి రూ.చూ. బొయ్యి. వి కుక్క కూత.
బొక్క[1] రూ. పొక్క[2]. వి. 1. కలుగు, కన్నం, బిలం. భార.గాంధి. 3.222 ; 2. (చెట్టు మొ. వాటి) తొఱ్ఱ. భార.గాంధి. 3.363 ; 3. గోయి, గర్తం. గౌ. హరి. ఉ. 1629 పం. ; 4. మోరి, ఆడుసురి ; 5. కారాగారం, జైలు ; 6. నష్టం, దండుగ ; 7. పిల్ల ; 8. నేల గుర్తు చుట్టే దోనెకు ఒకవైపు చేసిన చిల్లి ; 9. కాడి, పలక మొ. వాటికి చేసిన రంధ్రం ; 10. గుద్దలి రూపం.
క. బొక్కె. చిన్న ఎలుక కన్నం ; తు. బొఱ్ఱు. బావి గుల్ల ; త. పొ (-ప్పు-, -ళ్ళ్-). రంధ్రం చేయు, కన్నం పెట్టు, పొకు (-ప్పు-, -క్క్-). కన్నం పెట్టు, రంధ్రం చేయు, పొక్కణ- చెట్టు తొఱ్ఱ, గుహ, పొక్కు. చెట్టు తొఱ్ఱ, పొక్కె. చిన్న కన్నం, బీట, పగులు, పొతుమ్ము. కన్నం, చెట్టు తొఱ్ఱ, గుహ, పొత్తు. కన్నం, కలుగు, ఎలుక కన్నం, చెట్టు తొఱ్ఱ, చిల్లు, పొతలే, పొత్తై. కన్నం, పొత్తిలమ్. చెట్టుతొఱ్ఱ, పొత్తు, పొన్దర్. పొన్దు. కన్నం, పోణ్.గుహ ; మ. పొత్తు. కన్నం, గుంట, పోతు. కన్నం ; కో. పొక్-వ-యు. బోసినోరువాడు (నోట్లో పళ్ళు లేని వాడు) ; గోం. పొహ్పి. చీలటం ; కుఇ. పొస్పు (పొస్త్-). కన్నంచేయు, కుసిబెజ్జ, పొన్డొ. కన్నం ; కువి. పొధలి. గుల్లచేయు ; పర్జి. బొత్త. కన్నం, పొత్ప, పొప్ప. ఉలి. చీలటం ; కొలా. పొక్క. అగద్ద, బొగ్గ. చిన్నకన్నం ; నా. పొక్క. కన్నం. గుహ, బొగ్గ. కన్నం ;
సం. భూక-. కన్నం ; మరా. బోకె. కన్నంచేయు.
బొక్కదాక వి. సొరాగూన మీద బోర్లించి పెట్టే మట్టి పాత్ర. బొక్కనాడె వి. పడుగు నైపోగులకు, కండిపోగు లకు మధ్యవేసే పేకదారం కండె అమర్చిన చేత్తో విసరే నాడె. బొక్కపెరిడె రూ. చూ. బొక్కబెరడు. వి. ఒకజాతి పాము. బొక్కబద్దలగు అ.క్రి. చాలా ప్రయాస కలుగు. బొక్కబెరడు రూ. బొక్కపెరిడె. వి. సర్పవిశేషం, ఒకజాతి పాము. బొక్కలబల్ల వి. పటానేత కోసం అమర్చిన దొడ్డి చట్రంలో కుచ్చులాళ్ళు దూర్చిన చెక్క. బొక్కలాడు స.క్రి. 1. వేదించు. గౌ. హరి. ఉ. 2034పం. ; 2. ఆతురతతో తిను. ఆము. 1.75. బొక్కలాఁడు వి. సర్పం. గౌ. హరి. ఉ. 2036 ; 2. కన్నగాడు. గౌ. హరి. ఉ. 2086. (రెండర్థాలకు ఒకటే ప్రయోగం).
బొక్క[2] వి. ఎముక.
బొక్కపొడిచేయు అ.క్రి. మనకార్యం సాధించు. బొక్కల కుండ వి. గంగలో కలపటానికి అస్థికల్ని తీసుకొని పోవ టానికి వాడేమట్టిపాత్ర. బొక్కలపటవ వి. గంగలో కలప టానికి అస్థికల్ని తీసుకొనిపోవటానికి ఉపయోగించే మట్టి పాత్ర. బొక్కలుమిగేసుకొను అ.క్రి. చిక్కిపోవు. బొక్కాము గొట్టం వి. ఎముకలనుగొట్టం. బొక్కాముగోవి (-క్రోవి) వి. ఎముక అనుగొట్టం.
బొక్కడ రూ.చూ. పొగడ[2]. వి. సువాసన నిచ్చే చిన్నచిన్న పూలుపూసే ఒకరకం చెట్టు (Clerondedron infortunatum).
బొక్కణ రూ.చూ. బొంకణము. వి. విభూతి పోసుకొనే సంచి. హర. 2.37.
బొక్కణము రూ.చూ. బొంకణము. వి. విభూతి పోసుకొనే సంచి. ద్వి. హరిశ్చ. పూ.1482.
బొక్కవియ రూ.చూ. బొంకణము. వి. గుర్రాలకు దాణాపెట్టే

సంచి. నృసింహ. 2.127.

**బొక్కము** రూ.చూ. బొంకణము. వి. విభూతి పోసుకొనేసంచి.

**బొక్కపపిల్లు** చూ. బొక్కసము.

**బొక్కపపుటిల్లు** చూ. బొక్కసము.

**బొక్కసము** రూ. బొక్కస, బొక్కసా. వి. **1.** మూట. బసవ. 5.64; **2.** ధనం, కోశం. కాశీ. 5.64; **3.** ధనాగారం, బండారం. వాల్మీ. 1.61; **4.** పెట్టె. చంద్రరే. 4.77.

క. బొక్కస. ధనం. డబ్బుసంచి; త. పొక్కసం.

**బొక్కసపిల్లు** రూ.చూ. బొక్కసపుటిల్లు. వి. ధనాగారం. హంస. 2.226. **బొక్కసపుటిల్లు** (-ఇల్లు) రూ. బొక్కస పిల్లు. వి. ధనాగారం. ఉ. రా. 8.14.

**బొక్కాసుగోవి** చూ. బొక్క².

**బొక్క** విశ. **1.** మాంసం లేనిది, గుంటలు పడినది. కు.సం. 6.37; **2.** బోసివాడు, పళ్ళులేనివాడు, లేనిది. చెన్నబసవ. 4.48; **3.** చెడిపోయిన.

క. బొక్క. పళ్ళులేనివాడు.

**బొక్కబోటు** వి. బోరలో ఒకరకం. **బొక్కపడు** అ.క్రి. శిథిలమగు. రంగా. ద. 3.72.

**బొక్కప** రూ. చూ. బొక్కసము. వి. బట్టలు పెట్టేపెట్టె. కరోటం.

**బొక్కసా** రూ.చూ. బొక్కసము. వి. **1.** చిన్నమూట; **2.** బొక్కెన.

**బొక్కు¹** రూ. బుక్కు¹. స.క్రి. ఏదైనా వస్తువుని నోటినిండా వేసుకొని తిను. కాశీ. 7.85, వి. బొక్కటం.

క. ముక్కు. ఆదోవిధంగా తిను, బొక్కు, ముక్కల్, ముక్కళె. నోటినిండా నీరు పోసుకొని పుక్కిలించు, ముక్కళిసు. పుక్కిలించిఉమ్ము, తోసివేయు: తు. ముక్కని. బొక్కు, మింగు, ముక్కెలె. తిండిపోతు, ముక్కలి, ముక్కళి. నోటినిండా ఉన్న ద్రవం, ముక్కలియుని, ముక్కళియుని. పుక్కిలించు; త. ముక్కు (ముక్కి-). నోటినిండా వేసుకొనితిను, బొక్కు, మొక్కు (మొక్కి-). మొక్కతిన్. ఆబగా ఎక్కువెక్కువ తిను; కుఇ. ముక (ముకి-) చేత్తో నోటిలో కుక్కుకొను, ముకల్. నోటినిండా, ముకల్ గివ. పుక్కిలించు, ఉమ్ము.

పో. చూ. మ. మోకుక.

<మూ. ద్రా. *ముక్.

**బొక్కులాడు** స.క్రి. నోటినిండా వేసుకొని తిను. ఆము. 1.75. <బొక్కు¹+-లు+ఆడు.

**బొక్కు²** వి. మెత్తన.

**బొక్కుపిల్ల** వి. గొర్రెపిల్ల.

**బొక్కుడు¹** వి. తెల్లనిపూలుపూసే ఒకరకం చెట్టు (Ehretva acumirata).

**బొక్కుడు²** రూ.చూ. బొగడ². వి. మందుల్లో ఉపయోగపడే ఒకరకం చెట్టు (Cleredendron infortunatum).

**బొక్కెవ¹** వి. నీరుపిప్పల, చెమ్మనేలల్లోనూ పచ్చిక బయళ్ళలోనూ ఏటా మొలిచి పాకుతూ పెరిగే కలుపుమొక్క. ఆం. రా. 2.57.

**బొక్కెవకట్టు** వి. మోటబొక్కెనపైన ఉన్న జనపకట్టు. **బొక్కెవకడెం** వి. మోట బొక్కెనపైన మోకు తగిలించే జనపరింగు. **బొక్కెవకాలు** వి. మోటబొక్కెన వలిగానికి వేసిన అర్ధచువ్వ. **బొక్కెవసుంయి** వి. మోటబొక్కెనపైన ఉన్న జనపకట్టు. **బొక్కెవచెవి** వి. ఏతంతో నీళ్ళుతోడే పాత్ర. **బొక్కెవదండె** వి. ఏతపుబొక్కెన చెవి కట్లగుండా దూర్చే జనపచువ్వ.

**బొక్కెవ²** రూ.చూ. బొంకణము. వి. **1.** ఉలవలు మొదలైన దాణా ఉంచి గుర్రంనోటికి తగిలించే సంచి. ఆం. రా. 2.200; **2.** చేద, నీళ్ళుతోడే సాధనం. ఆం. రా. 2.293.

**బొగడ¹** రూ. బిగిడి, బుగడ, బుగిడి, బుగిడీ, బొగిడి. వి. **1.** ఆడవాళ్ళు చెవికొనకు పెట్టుకొనే నగ, బుగడ. రం. రా. బాల. 75.ప. 6; **2.** చూచుకం, చన్మొన. కా. 1.27; **3.** మంచం కోడు మొదలైన వాటి తలమీద గండపెట్టి మీద ఉండేగుబ్బ. చంద్రాంగ. 6.232; **4.** చెరువుకట్టు మొ. వాటిలోని నీళ్ళుదూరి వచ్చే రంధ్రం; **5.** చేని గనిములో ఏర్పడిన రంధ్రం; **6.** నీటిబుగ్గ; **7.** మొగ్గ ఆకారంలో చేసిన డిజైను.

క. బుగడి, బుగుడి. స్త్రీలు చెవికొనకు పెట్టుకొనే నగ; తు. బుగుడి. స్త్రీలు చెవికొనకు పెట్టుకొనే నగ; త. పొకటి, పొకిటి, పూటి. స్త్రీలు చెవికొనకు పెట్టుకొనేనగ, ఆభరణం.

పో.చూ. మరా. బుగ్డీ. కర్ణాభరణం.

**బొగడకాలుపురాయి** వి. కాలికాలని ఇటిక. **బొగడవచ్చలు** వి.బ.వ. వస్త్రవిశేషాలు. ప్రబంధ. 2.72. **బొగడపేటు** రూ.చూ. బుగడపేటు. వి. మొగ్గమాదిరిగా చేసిన డిజైను. **బొగడసరంఅంచు** వి. ఒకరకం డిజైనులో చేసిన అంచు. **బొగడసరంచీర** రూ. బోడసరంచీర. వి. ఒకరకం అంచు పెట్టి చేసినచీర. **బొగడపరులు** వి.బ.వ. ధాన్యవిశేషం. హంస. 4.128.

**బొగడ²** రూ. బొక్కుడు², బొగడము. వి. మందుల్లో ఉపయోగపడే ఒకరకం చెట్టు (Clerodendron infortunatum).

**బొగడము** రూ.చూ. బొగడ². వి. సొగటాల పాచికలు నడిపే కాయ.

**బొగవాపి** రూ.చూ. భగోణి. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగాఉన్న మట్టిపాత్ర.

**బొగవాపిఅట్క** రూ.చూ. బగోనటిక. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర. **బొగవాపిగిన్నె** రూ.చూ. బగవానిగిన్నె. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర.

**బొగావి** రూ.చూ. భగోణి. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర.

**బొగిడంచు** చూ. బొగిడి.

**బొగిడి** రూ.చూ. బొగడ¹. వి. **1.** మొగ్గ ఆకారంలో చేసిన డిజైను; **2.** మొగ్గ.

**బొగిడంచు** రూ.చూ. బుగడంచు. వి. మొగ్గమాదిరి డిజైను వరసగా పడేట్టు చేసిన అంచు.

**బొగిణి** రూ.చూ. భగోణి వి. వెడల్పయిన గిన్నె.

**బొగుర** చూ. బొగడ¹. వి. మిద్రున ఉన్న పొలం.

బొగుడు అ.క్రి. మెరుగు.
క. బగుళు, బొగళు, బొగుళు, బొళ్పు. మెరుగు. <క. బొగుళు.

బొగోణి రూ.చూ. భగోణి. వి. ఒకరకం ఇత్తడిపాత్ర, కళాయి గిన్నె.

బొగోణి రూ.చూ. భగోణి. వి. నూలుఉండలు నానబెట్టే ఒకరకం ఇత్తడి పాత్ర.

బొగ్గ వి. 1. పొక్కు; 2. స్ఫోటకం మచ్చ.
క. బొగ్గు. వంపు.

బొగ్గవాలబొగడ చూ. బొగ్గ. వి. అంతా శూన్యం.

బొగ్గరము వి. ఉక్కతో కూడిన వేడిమి

బొగ్గాకు చూ. బొగ్గు.

బొగ్గాము చూ. బొగ్గు.

బొగ్గిలి వి. పాకీతుమ్మ, గట్టిగాఉండే ఇంధనంగా ఉపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Acacia latronum).

బొగ్గు వి. మండి చల్లారిన కర్రతునక. భార. ఉద్యో. 2.37; విణ. నల్లనిది. చంద్రాంగ. 4.81.
కువి. బొగూంగ. బొగ్గు; పర్జి. బొగ, బొగుమ్. బొగ్గు; కొలా. బొగ్గ్. బొగ్గు, మండి చల్లారిన కర్రతునక; మాల్తొ. పొసెంగె. పొగమసి; బ్రా. పొఘ్. బొగ్గు.
బొగ్గాకు వి. ఒకరకం కలుపుమొక్క. <బొగ్గు+ఆకు. బొగ్గాము వి. బొగ్గుతోకాల్చే ఇటికబట్టీ. <బొగ్గు+ఆము. బొగ్గుకఱచు అ.క్రి. గడ్డకరచు, చిక్కుల్లోఉండు. బొగ్గువడు అ.క్రి. నల్లనివగు. భీమ. 4.61. బొగ్గుపొయ్యి వి. బొగ్గులు వేసి మంట రాజేయటానికి వీలుగా చేసినట్టి మట్టిపొయ్యి. బొగ్గుబట్టీ వి. బొగ్గుతో కాల్చే ఇటిక బట్టీ. బొగ్గురంగు వి. బొగ్గుమాదిరి నల్లరంగు. బొగ్గురాయి వి. భూగర్భంనుంచి తవ్వి తీసిన బొగ్గు. బొగ్గురేగడ వి. గుల్లగాఉన్న రేగడి. బొగ్గులపాయి రూ.చూ. బొగ్గులపొయ్యి. వి. కుంపటి. బొగ్గులపొయ్యి రూ. బొగ్గులపొయి, బొగ్గులుపొయ్యి. వి. బొగ్గులువేసి మంట రాజేయటానికి వీలుగా చేసినట్టి మట్టి పొయ్యి. బొగ్గులువేయు స.క్రి. బొగ్గులుగాచేయు, పాడుచేయు. భాగ. 9.378. బొగ్గులుపొయ్యి రూ.చూ. బొగ్గులపొయ్యి. వి. బొగ్గులువేసి మంట రాజేయటానికి వీలుగా చేసినట్టి మట్టి పొయ్యి. బొగ్గుల్లో రామచిలక వి. నల్లనిది అని హాస్యంగా అనేమాట. బొగ్గుసూల వి. బొగ్గుతోకాల్చే ఇటికబట్టీ.

బొంకదవ చూ. బొంగు.

బొంకణము రూ. బొక్కణ, బొక్కణము, బొక్కనియ, బొక్కము, బొక్కెన[3]. వి. బొక్కణం, విభూతిసంచి. బసవ. 3.
క.తు. బొక్కణ. గుర్రాలకు దాణా పెట్టేసంచి; త.మ. పొక్కణమ్. గుర్రాలకు దాణాపెట్టే సంచి, ముష్టివాళ్ళ సంచి.

బొంకప్ప చూ. బొంకు.

బొంకరి చూ. బొంకు.

బొంకి వి కరోటిభేదం, పుర్రెపెంకు. అం.భా. 2.133.
క. బొకి; కో. బొ-క్వ-యరత్. మూతిదగ్గర విరిగిన కుండ.

బొంకించు చూ. బొంకు.

బొంకింపు చూ. బొంకు.

బొంకు అ.క్రి. అబద్ధమాడు. భార. ఆది. 3.179; వి. 1. అసత్య వచనం. భార.ఆది. 4.98; 2. కల్లదనం. భార.కర్ణ. 2.88; 3. తప్పు, పొరపాటు. జైమినిభా. 2.80; విణ. అసత్యమైన. భార. ఉద్యో. 4.59.
క. బొంకు. అబద్ధమాడు; తు. బొంకుని. వంచించు; పో.చూ.త. పొయ్, పొక్కమ్. అబద్ధం. మోసం, వంచన. పొచ్చమ్. అబద్ధం, మోసం, పొచ్చె మోసం: మ. పొయ్. అబద్ధం. మోసం; తొ. పిక్. అబద్ధాలు చెప్పు; గోం. బుస్. అబద్ధంచెప్పు;
మరా. బుస్. అబద్ధంచెప్పు.
మూ.ద్రా. *పొయ్-న్క్-/*పొయ్-క్-.
బొంకప్ప వి. మత్స్యవిశేషం. <బొంకు+కప్ప. బొంకరి వి. అసత్యవాది, కల్లరి. భార. కర్ణ. 3.59. <బొంకు+-అరి. బొంకించు స.క్రి. 1. అసత్యమైనట్లుచేయు. కు.సం. 11.60; 2. మోసపుచ్చు, వంచించు. చంద్రాంగ. 4.167; 3. బొంకజేయు, అసత్యమాడేటట్లుచేయు. < బొంకు +-ఇంచు[3]. బొంకింపు వి. మల్లబంధన విశేషం. మల్లు. 3.69. బొంకులపుటికలు వి బ.వ. అబద్ధాలపుట్టలు. పండి.చ. 2.34వ. బొంకులపుట్ట వి. అబద్ధాలకోరు. హంస. 1.37. బొంకులబావ వి. 1. అసత్యమాడేది, బొంకులబుంగ. చెన్నబసవ. 2.25; 2. అసత్యమాడేవాడు. బొంకులబుంగ వి. 1. అబద్ధాలాడేవాడు; 2. అబద్ధాలాడేది. బొంకులాడి వి. కల్లలాడేది, అసత్యాలాడేది. <బొంకు+-లు+-ఆడి. బొంకులాడు వి. కల్లలాడేవాడు, అసత్యాలాడేవాడు. విజ్ఞా. 3.104. <బొంకు+-లు+-ఆడు.

బొంగ[1] వి. 1. తనంతట తానే చేలగట్లలో ఏర్పడి సీత్కారిపోయే బెజ్జం. ఊల; 2. పైరులో మొలిచే కలుపు మొక్క.

బొంగ[2] యా.చూ. బుంగ. వి. చిన్నమూతిగల కుండ.

బొంగకొమ్ము చూ. బుంగ. వి. వంగలకర్రమాదిరి కొనలు క్రమంగా దూరమైన కొమ్ము.

బొంగపాడను చూ. బుంగ. వి. లావుగా ఉండేది, పాలు సరిగా ఇవ్వదు.

బొంగరంసుడి చూ. బొంగరము.

బొంగరంకడ్డీ చూ. బొంగరము.

బొంగరంబాలు చూ. బొంగరము.

బొంగరము రూ.చూ. బొమ్మరము. వి. 1. తాడుచుట్టి బాలుర ఆడే వస్తువు. పల్నా. 39; 2. గుమ్మటంవంటి పనిముట్టు; 3. అడ్డంగా అమర్చిన రాటి. 4. సారెలోని ఇరుసువంటి భాగం.
బొంగరంసుడి వి. కొమ్ముల మధ్యన ఉండేది. బొంగరంకడ్డీ వి. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న ఇరుసు. బొంగరంబాలు వి. వేరుసెనగ వెయ్యటానికి గుండ్రంగావేసిన కొండ్ర. బొంగరంపల్ల వి. రాటికి పైనా కిందా కట్టిన వెదురుబద్ద. బొంగరంమొద్దు వి. రాటి తిరగటానికి ఆధారంగాఉన్న కొయ్య మొద్దు. బొంగరాలు వి బ.వ. పొంగరాలు, భక్ష్యవిశేషం.

బొంగరంపల్ల చూ. బొంగరము.

బొంగరంమొద్దు చూ. బొంగరము.

బొంగరాలు చూ. బొంగరము.

బొంగు రూ. బొంగుడు. వి. కీచకం, లావు కలిగి బోలుగా ఉండే వెదురు, పల్లకీ మొ. వి మోయటానికుపయోగించే వెదురు. హంస. 5.356 (Bambusa arundinacea); 2. పన్నె తయారు చేసే చట్రంలో నిలువ కొయ్యలు బిగించిన వెదురు కర్ర; 3. తివాసీ మగ్గం అమ్ములు, కమానుకు మధ్య ఎక్కించిన పొడుగాటి పైదోనెకు వేలాడదీసే వెదురుకర్ర; 4. పొడవైన వ్యక్తి; 5. మట్టికప్పుగల మిద్దెటింట్ల పైకప్పులో వానకు తడిసి వర్షపు నీటి ఒత్తిడికి పడే రంధ్రం; 6. యోని; 7. టికీలాగ ఉండే రంధ్రం; 8. లోపల గుల్లగా ఉండేది; 9. పాత్ర అంచుకు కింది భాగంలో ఉండే గుండ్రని మధ్య భాగం; 10. వ్యర్థం; 11. మగగురి, కన్నం.

బొంకడవ వి. నీళ్ళు చేదుకోవటానికి మూతి చిన్నదిగా అంచు మొద్దుగా ఉండే మట్టిపాత్ర. <బొంగు+కడవ. బొంగుకట్టె వి. ఆము కాలేటప్పుడు రంధ్రాలు పడకుండా ఆముపైన మసిని దట్టించటానికీ కాల్పు తర్వాత కుండల్ని తీయటానికి వాడే వెదురుకర్ర. బొంగుగొంతు వి. హీన స్వరం. వినీవినబడనిధ్వని. బొంగుగొంతుకవాఁడు విం. సౌమ్యంకాని స్వరంకలవాడు. బొంగుచన్ను రూ. బొంగుర చన్ను. వి. లావుపాటిచన్ను. బొంగుపిమ్మ వి. నేలలో పాతిన పెద్ద కొయ్యమేకు. బొంగుబఱ్ఱె వి. పత్తిలో తుక్కూడూగరా రాలగొట్టే చువ్వ. బొంగుబుజావవేసుకొను అ.క్రి. బట్టా పాతా చుట్టి చంకలో పెట్టుకొను అనటం లాంటిది, అన్నీ తీసుకొను. బొంగురచన్ను రూ.చూ. బొంగుచన్ను. వి. లావుపాటిచన్ను. బొంగురాయి వి. చెక్క మీది నగిషీగా చెక్కిన గుండ్రటి రూపం. బొంగురేపరు వి. ఇంటికప్పు వేయటంలో వాడే పలచని చెక్క. బొంగులాకు వి. ఒకరకం కలుపు మొక్క. బొంగులు వి.బ.వ. కోలగా గుండ్రంగా వచ్చేటట్లు పేయించిన బియ్యం. బొంగువెదురు వి. లావుగా బోలుగా ఉండే వెదురు, కీచకం. రత్న. 36.

బొంగుడు రూ.చూ. బొంగు. వి. వెదురుచెట్టు (Bambusa arundinacea).

బొంగురము రూ.చూ. బొమ్మరము. వి. తాడు చుట్టి ఆడే వస్తువు.

బొంగురు విం. గద్గదతకల.

బొచ్చ[1] రూ.చూ. బొచ్చె[1]. వి. 1. వెడల్పుగా పెద్దగా ముళ్ళు కొడుగుతో ఉన్న మంచి నీటి చేప; 2. పశువుకొమ్ము.

బొచ్చ[2] రూ.చూ. బొచ్చు[1]. వి. చిప్పలతో ఉన్న పీచు.

బొచ్చి రూ.చూ. బొచ్చె[1]. వి. ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర.

బొచ్చిపెంకు వి. దిష్టి తీయటానికి వాడే మట్టిపాత్ర.

బొచ్చు[1] రూ. బొచ్చ[2], బొచ్చె[2]. వి. రోమం, వెంట్రుక. ఆం.భా. 2.146.

క. బొచ్చు. ఊలు, సన్నని వెంట్రుకలు; త. పొచ్చు. జుట్టు.

బొచ్చుఎలవడం వి. గింజకు ముళ్ళుండే రకం. బొచ్చుకత్తెర వి. గొర్రెబొచ్చు కత్తిరించే కత్తెర. బొచ్చుకాకర వి. ఒకరకం కాకర. బొచ్చుకొఱ్ఱ వి. ఒకరకం కొర్ర. బొచ్చుమేకము వి. భల్లూకం, ఎలుగుబంటి. సాంబ. తిర్య. 72. బొచ్చువడ్లు వి.బ.వ. గింజకు ముళ్ళుండే కొన్ని రకాల వడ్లు. బొచ్చుసద్ద వి. సజ్జలో ఒకరకం.

బొచ్చు[2] రూ.చూ. బొచ్చె[1]. వి. మత్స్యవిశేషం.

బొచ్చె[1] రూ. బొచ్చ[1], బొచ్చి, బొచ్చు[2]. వి. 1. తలపుఱ్ఱె. ఆం.భా. 2.133; 2. కుండ మొ. వాటి పెంకు; 3. మత్స్యవిశేషం; 4. ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర, 5. పశువు కొమ్ము.

బొచ్చెమన్ను వి. పెళ్ళలు పెళ్ళలుగా లేచి వచ్చే మన్ను. బొచ్చెలుపోవు అ.క్రి. మట్టిపాకం లోపం వల్లగాని, కాల్పులోపం వల్లగాని ఆముకాల్పులో కుండలు పెళ్ళు పెళ్ళుగా పగిలిపోవు.

బొచ్చె[2] రూ.చూ. బొచ్చు[1]. వి. పడికి చుట్టిన ఉన్ని దారం.

బొజఁగు వి. 1. విటుడు, వేశ్యాపతి. పండి.చ. 2.334; 2. ప్రభువు, అధిపతి. పల్నా. 40.

సం. భుజంగ-. విటుడు, జారుడు; ప్రా. అ.మా. భుఅంగ-;

క. బొజగ, బొజంగ. విటుడు; తు. బుజంగ.

<సం. భుజంగ-.

బొజఁగులాడి వి. స్వైరిణి. రంకులాడి. చెన్నబసవ. 2.24. <బొజఁగు+-లు+-ఆఁడి.

బొజ్జ[1] వి. 1. పొట్ట, కడుపు. శృం.నై. 5.47; 2. రాతిలో ఎత్తుగా ఉన్న భాగం; 3. పాత్రలకు చుట్టూ ఉబ్బెత్తుగా ఉండే మధ్యభాగం; 4. రాట్నం రెండు చక్రాలనూ వేరు చేసే కొయ్య.

క. బొజ్జె. పెద్ద పొట్ట, బొజ్జ, బొజ్జా. బానకడుపు; త. పొచ్చయ్. బానకడుపు, బొజ్జ.

<క. బొజ్జె.

బొజ్జదేవర వి. వినాయకుడు. ఆం.భా. 1.43. బొజ్జప్ప <బొజ్జ[1]+అప్ప. బొజ్జవాఁడు విం. బండలుడు, పెద్ద పొట్టున్నవాడు. ఆం.భా. 2.120.

బొజ్జ[2] వి. ఓన్నె అత్తి, బొడ్డ, అని కూడా పిలుస్తారు (The figtree).

బొజ్జేయు చూ. బొజ్జ[1] వేయు. అ.క్రి. పూడునట్లు చేయు.

బొంజ వి. గూన చివరి వెడల్పాటి భాగం.

బొటకవవేలు రూ.చూ. బొటవ్రేలు. వి. అంగుష్ఠం. పెద్ద వేలు.

బొటవ్రేలికిమువ్వమగు చూ. బొటవ్రేలు.

బొటవ్రేలు రూ.చూ. బొటవ్రేలు. వి.బా. అంగుష్ఠం, పెద్ద వేలు. దశా. 2.324.

బొటవ్రేలికిమువ్వమగు అ.క్రి. సంపద కలుగు.

బొటబొట రూ.చూ. పొటపొట. వి. 1. పొక్కటం, కారటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. కా. 3.271; 2. రాలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 3. కారటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 4. పడటంలో అయ్యే ధ్వనికి అనుకరణం; 5. కురవటంలో అయ్యేదానికి ధ్వనికి అనుకరణం; 6. చెమట పట్టటంలో అయ్యే అనుకరణం.

బొటబొటబొట వి. పొక్కటం, కారటం మొ. వాటిలో

అయ్యే ధ్వనికి అనుకరణం. విప్ర. 3.55.
బొటమంచి వి. గొల్లవాని పరికరాల్లో ఒకటి. హంస. 2.75.
బొటమనవ్రేలు రూ.చూ. బొటవ్రేలు. వి. అంగుష్ఠం, పెద్ద వేలు. సత్య.సాం. 4.197.

క. బట్టు, బొట్టు. వేలు.

బొటవ్రేలు రూ. బొటకనవేలు, బొటనవ్రేలు, బొటమనవ్రేలు, బొట్టనవ్రేలు, బొట్టవ్రేలు. వి.బొ. అంగుష్ఠం, పెద్దవేలు. విక్ర. 4.220.

క. బొట్టు, బట్టు, పెట్టు. వేలు, బొటనవేలు; గోం. బొట్టు. వేలు, పెద్దవేలు, బొటు-. వేలు, బొట్టా. పెద్ద వేలు; కొం. బొటుబస్క. బొటనవేలు; కువి. బొటు వంజు, బొటనవేలు; మండ. బుట్ వెప్పొ. బొటనవేలు.

బొటాబొటి వి. 1. తూచినట్లు సరిగా ఉండటం; 2. చాలీ చాలకుండా ఉండటం.

క. బొట్టు. వేలు.

బొటికె వి. బొట్టుగు చెట్టు (Osyris peltala).
బొటికెకొమ్ము చూ. బొటవ్రేలు. వి. లావుగా, పొట్టిగా, బోడిగా ఉండేకొమ్ము.
బొటిమ రూ.చూ. మొటిమ. వి. యౌవనంలో మొగాన లేచే చిన్నపొక్కు, అవగండం.
బొటుకురు వి. వృక్షవిశేషం, ఒకానొకచెట్టు. ద్వి. సా. చ. 2.657.
బొటెమాకు వి. బొట్టుగుచెట్టు (Osyris peltala).
బొట్ట[1] వి. గానవిశేషం. ఉ. రా. 2.61.
బొట్ట[2] రూ.చూ. బుట్ట. వి. ధాన్యాదులుంచు కోవటానికి వెదురు బద్దలతో అల్లిన పెద్దబుట్ట, పౌణక. ఆం. బా. 2.240.

బొట్టకదవచెట్టు వి. నీపవృక్ష విశేషం (Nouclea cadamba). బొట్టకడిమి వి. సామగ్రి తయారీకి ఉపయోగించే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Stephegyne parvifolia). బొట్టబావి వి. సెలయేటిలోని చెట్ల కొమ్మలతో తీగలతో అల్లినగంప ఉంచిన గుండ్రటి బావి. బొట్టమెట్టు వి. గుండ్రంగా ఉండే మెట్టు. బొట్టలు వి.బ.వ. ఒక భక్ష్యవిశేషం.

బొట్టంచు చూ. బొట్టె[3].
బొట్టడి వి. 1. బెస్తలు సవారి మోసేటప్పుడు నడిచే నడకల్లో ఒకటి. ప్రబంధ. 605; 2. దార్లించే నల్లరాయి.
బొట్టవగోలలు వి.బ.వ. బాలక్రీడా విశేషం. విష్ణుపు. 1.202.
బొట్టవ్రేలు రూ.చూ. బొటవ్రేలు. వి. పెద్దవేలు.
బొట్టపెంజర వి. ఒకరకం పాము.
బొట్టప్పచెప్పు చూ. బొట్టు[1].
బొట్టము వి. కౌపీనం, గోచి. ఆం. బా. 2.157.

సం. పుట-. బట్ట.

బొట్ట్రవేలు రూ.చూ. బొటవ్రేలు. వి. పెద్దవేలు.
బొట్టాట చూ. బొట్టు[1].
బొట్టి[1] రూ.చూ. బొట్టె[1]. వి. స్త్రీ.
బొట్టి[2] చూ. బొటవ్రేలు. వి. బొటనవ్రేలు.

బొట్టిగొర్రె చూ. బొట్టె[2]. వి. ఎలిక చెవులవంటి చిన్న చెవులుగల గొర్రె.

బొట్టియ[1] రూ.చూ. బొట్టె[1]. వి. 1. పుత్రుడు. అచ్చ.రా. బాల. 53; 2. పుత్రిక, కూతురు. అచ్చ.రా. యు. 587.
బొట్టియ[2] రూ.చూ. బొట్టె[2]. వి. 1. కోడికాలి వెనక పక్క ఉండేవాడైన గోరు; 2. అలాంటి ఆకారం ఉన్న బాణాగ్రం, ములికి.

బొట్టియకోల వి. డుబుడక్కవాడు శకునం చెప్పేటప్పుడు చేత్తో పట్టుకొనే చిన్న సన్నకర్ర.

బొట్టియడు రూ.చూ. బొట్టె[1]. వి. పుత్రుడు. అచ్చ. రా.యు. 86.
బొట్టు[1] వి. 1. తిలకం. కు.సం. 5.16; 2 జలాది బిందువు. హరి. పూ. 5.178; 3. లెక్కపెట్టినప్పుడు గుర్తు కోసం పెట్టిన చుక్క. భాస్క. రా. యు. 36; 4. అంకెల్లో శూన్య స్థానం, సున్న, బిందువు. భాస్క. రా. యు. 865; 5. మంగళసూత్రానికి గుచ్చే సువర్ణాభరణం. శ్రీరం. మా. 4.7; 6. చిన్నడబ్బు, అణాలో 4 వ పంతు; 7. సారె మీద వాటకు కదురుతో గాని గోటితోగాని అలంకారంగా పెట్టే పూజలు; విణ. కొద్ది.

క. బొట్టు. (నీరు మొ. వాటి) చుక్క, బిందువు; కొడ. బొట్టి. నుదుటన పెట్టుకొనే తిలకం; తు. బొట్టు. (నీరు మొ. వాటి) చుక్క, బిందువు, నుదుటన ధరించే తిలకం; త. పొట్టు. (నీరు మొ. వాటి) చుక్క, బిందువు. నుదుటన పెట్టుకొనే తిలకం; పర్జి. బొట్-. చుక్క; కొలా. బొట్ల. చుక్క, నీటిచుక్క మొ. వి;

సం. పుండ్ర-. నుదుటిబొట్టు.

బొట్టప్పచెప్పు అ.క్రి. పేరంటానికి పిలుచు. <బొట్టు[1]+ అప్పగెప్పు. బొట్టాట వి. తక్కువగా ఉండేపిచు. <బొట్టు[1]+ అట. బొట్టుగట్టు (-కట్టు) అ.క్రి. పెళ్ళాడు. కృ. శకు. 2.74. బొట్టుదారము వి. బొట్టునుగుచ్చే మంగళసూత్రం. బొట్టుపెట్టె వి. ఆడవాళ్ళు కుంకుమ మొ. వాటిని ఉంచుకొనే చిన్నపెట్టె. బొట్టుబెట్టు (-పెట్టు) అ.క్రి. ఆదరించు. బొట్టుసుడి వి. నొసటిమీద ఉండే ఒంటిసుడి. బొట్టూబోనమూలేకపోవు అ.క్రి. పేరంటాలు బొట్టుపెట్టి పిలవటం గాని భోజనం పెట్టటంగాని లేకపోవు. బొట్టొనర్చు స.క్రి. లేకుండాచేయు, నశింపచేయు. బిల్హ. 1.37. <బొట్టు[1]+ ఒనర్చు. బొట్లకొయ్య వి. పచ్చికుండలకు పూజలుకొట్టటానికి వాడే కొయ్యఅచ్చు. బొట్లచేప వి. ఒకరకం చేప. గోం. బొట్టె, బొట్టె. ఒకరకం చేప; పెంగొ. బొటుమన్. ఒక రకం చేప. బొట్లచ్చు (-అచ్చు[1]) వి. మట్టిపాత్రలపై బొట్లు బొట్లుగా డిజైన్లు కొట్టే అచ్చు. బొట్లబుడ్లు వి.బ.వ. పెద్దసైజు చిచ్చుబుడ్లు. బొట్లబెండ వి. కొండలమీద పెరిగే ఒకమొక్క (Abutilon indicum). బొట్లరోగం వి. మిరప, నువ్వు మొ. వాటి తెగులు. బొట్లు వి.బ.వ. పాత్రలకు అలంకారంగా కచ్చుల సలపతో వేసిన కచ్చులు. బొట్లదబ్బ వి. పచ్చికుండలకు చందమామ ఆకారంలో పూజలు వేసే వెదురుబద్ద.

బొట్టు[2] రూ.చూ. బోటి[2]. వి. 1. రాట్నంమీద జొన్నదంటు ముక్కకు చుట్టిన నూలు; 2. నిండుకండెలో కొంతదారం

ఉపయోగించుకోగా మిగిలింది; 3. చిన్నకంతె; 4. రాట్నం మీద వడికిన నూలు; 5. డేచెక్క జనప కడ్డీని బిగించటానికి పెట్టిన ఒరలచుట్ట; 6. నవారు నేతలో వాడే పేకదారం చుట్ట.

బొట్టుగ రూ. బొట్టువ. వి. తిలకవృక్షం. యయా. 4.19.

బొట్టువ రూ.చూ. బొట్టుగు. వి. తిలకవృక్షం.

బొట్టూబోవమూలేకపోవు చూ. బొట్టు[1].

బొట్టి[1] చూ. బోటి. రూ. బొట్టి[1]. బొట్టియ[1]. బొట్టియ(డు, బొట్టె(డు. వి. 1. కూతురు. పుత్రిక. మృత్యు. 3.12; 2. పుత్రుడు. చెన్నబసవ. 8.33.

క. బొట్టి. స్త్రీ. దాసి.

<క. బొట్టి.

బొట్టిచీర వి. ఒకరకం చీర.

బొట్టి[2] రూ. బొట్టియ[2]. వి. కోడికాలి వెనక పక్కనుండే వాడైన గోరు, అలాంటాకారం ఉన్న బాణాగ్రం, ములికి. పరమ. 8.277.

క. బొట్టు. వేలు, వేలి వెడల్పంత పరిమాణం.

బొట్టికొమ్ము వి. లావుగా, పొట్టిగా, బోడిగా ఉండే కొమ్ము. బొట్టికోల వి. కోడికాలివెనక పక్క ఉండే వాడి గోరులాంటి ములికున్న బాణవిశేషం. కళా. 7.183. బొట్టివన వి. లావుగా పొట్టిగా బోడిగా ఉండేకొమ్ము.

బొట్టి[3] వి. 1. పడుగులో విడదీసిన భాగం; 2. అచ్చులో పన్నెగూళ్ళలో నుంచి దూర్చిన పోగుల పాయ; 3. పడుగునూలులో చివర పాయగా విడదీసిన పోగులు; 4. మరనాడె మొన అరిగిపోకుండా ఓగించిన ఇనపపొన్ను.

బొట్టంచు వి. 1. కొంచెం కేడాలో గుండంచు మాదిరిగా నేసిన అంచు; 2. అంతానీలిరంగు దారం అతికనేసిన అంచు; 3. చివర ఇరవైనాలుగు కొలుకుల దారం రంగుది అతికనేసిన అంచు; 4. మూకంచుకంటె సన్నటిఅంచు; 5. అటూఇటూ ఎరుపు మధ్యపసుపు రంగులు పెట్టినేసిన అంచు; 6. లాహిరీ పెట్టి నేసినఅంచు; 7. మూడువేళ్ళ వెడల్పున నేసినఅంచు; 8. రంగుదారాలు అతికనేసిన ఒకరకం అంచు. <బొట్టి[3] + అంచు[3]. బొట్టికట్టె వి. నేత పడుగుచివర, పాయల తాళ్ళు కట్టిన కర్ర. బొట్టికమ్మి వి. ఒకరకం చీరకమ్మి. బొట్టికాడు వి. నేతపడుగులో చివరి పాయకు కట్టినదారం. బొట్టిదారం వి. నేతపడుగులో చివరి పాయకు కట్టిన దారం. బొట్టిముడి వి. పడుగులో చివరి పాయ పోగులకు వేసిన మెలిక. బొట్టిలకట్టె వి. నేత పడుగు చివర పాయల తాళ్ళు కట్టిన కర్ర.

బొట్టి[4] రూ.చూ. బుట్ట. వి. వెదురుపేళ్ళతోగాని, ఈతపేళ్ళతో గాని అల్లిన పెద్దబుట్ట.

బొట్టి(డు రూ.చూ. బొట్టి[1]. వి. కొడుకు, పుత్రుడు, పిల్లవాడు, బాలుడు. అచ్చ.రా.బాల. 202.

బొట్టువర్చు చూ. బొట్టు[1].

బొట్రాజులు చూ. భట్రాజు. వి.బ.వ. తొగటవారి దగ్గర అడుక్కొనేవాళ్ళు.

బొట్లకొయ్య చూ. బొట్టు[1].

బొట్లచేవ చూ. బొట్టు[1].

బొట్లచుప్ప చూ. బొట్టు[1].

బొట్లబుడ్డు చూ. బొట్టు[1].

బొట్లబెండ చూ. బొట్టు[1].

బొట్లరుముక్కలు వి.బ.వ. వచ్చీరాని ఇంగ్లీషు మాటలు.

ఇం. *butler*. వంటవాడు.

<ఇం. butler + ముక్క + -లు.

బొట్లరోగం చూ. బొట్టు[1].

బొట్లు చూ. బొట్టు[1].

బొట్లుపబ్బ చూ. బొట్టు[1].

బొట్లేరు రూ.చూ. బట్లరు. వి. వంటవాడు.

బొడకచెట్టు వి. కంటకావృతమైన పొదచెట్టు.

బొడగ వి. దొంగగొడ్డుకు మెళ్ళో కట్టే గంట.

బొడగనరంగంటె వి. ఒకరకం సజ్జధాన్యం.

బొడబుడ రూ.చూ. పొటపొట. వి. కక్కటం, కారటం, మొరగటం మొ. వాటిలోని ధ్వనికి అనుకరణం. మను. 4.60. ధ్వన్యను.

బొడబొడ వి. బొడబొడ అనేది ధ్వన్యనుకరణ శబ్దం.

బొడబొడపండ్లు వి.బ.వ. సంక్రాంతినాడు పిల్లల తలపై పోసే రేగిపళ్ళు.

బొడాబొడి చూ. బుడబుడ. విశే. వెల్లకిమైన.

బొడికెలు చూ. బొడిగ. వి.బ.వ. చిన్నపిల్లలు.

బొడిగ వి. 1. బాలుడు. ఆం.భా. 2.118; 2. విత్తులు తక్కువకల చిన్న కంకి (బొత్తె).

హిం. బోడీ. దమ్మిడి. తక్కువ ధనం.

బొడిగరాళ్ళనేల వి. సన్నని రాళ్ళనేల.

బొడిగెరాగం వి. మెడవాపు.

బొడిప రూ.చూ. బొడిపె. వి. చెట్లకుండే బుడిప.

బొడిపి రూ.చూ. బొడిపె. వి. పట్టుకోవటానికి కొన్ని మట్టి పాత్రలకు ఉండే గుబ్బలాంటి భాగం.

బొడిపె రూ. బొడిప, బొడిపి, బొడుపు, బొడును, బొడిపె. వి. దెబ్బతగిలి రక్తం కారకుండా పొంగటం.

హిం. బోడీ, బొడె. కొట్టు, కొట్టించు.

బొడిబొడి వి. దుముకటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. పండి.చ. 4.287.

బొడిమ రూ. బొడిమె. వి. పావకోళ్ళ చిరడ.

బొడిమె రూ.చూ. బొడిమ. వి. పావకోళ్ళ చిరడ.

బొడియ వి. కుతపం, చేతిసిద్దె. ఆం.భా. 2.243.

బొడుకలు వి.బ.వ. పిల్లలు, బాలురు.

క. పొడుగ. బాలుడు, చిన్నబిడ్డ; త. పొడి. చిన్న బిడ్డ, పొటికర్. చిన్న బిడ్డలు.

బొడుపు రూ.చూ. బొడిపె. వి. బొప్పి.

బొడుప రూ.చూ. బొడిపె. వి. బొడుపు.

బొడుపుకొమ్ము వి. లావుగా, పొట్టిగా బోడిగా ఉండే కొమ్ము.

బొద్ద వి. అత్తిచెట్టు (Ficus glomerata).

బొద్దమర్రి వి. బొమ్మమేడిచెట్టు (Ficus hispida).

బొద్దమామిడి వి. కొండలమీద పెరిగే చిన్న చెట్టు (Hemigyrosa canescens).

బొర్దవబావి వి. నడుమ చిన్న నుయ్యి ఉన్న కోనేరు. ప్రబా. 1.121.

బొర్దబ్బాసి వి. ఒకరకం తలపాగ.

బొర్దంబాలు(-పాలు¹) రూ. బొద్దుంబాల్. వి. ఆటలో పొరపాటు.

బొర్దసరము రూ. బోదతరము, బోదసరం, బోదసరము. వి. ఓషధి విశేషం, పైరుల్లో మొలిచే ఒకరకం చిన్న చెట్టు (Sphaeranthus indicus).

బొద్దాం రూ.చూ. బుద్దాం. వి. 1. బండి ఎద్దుల్ని విడిచినప్పుడు దించకుండా నొగల కింద ఎత్తుగా పెట్టిన కొయ్యల పరికరం; 2. దొంగ గొడ్డు పరుగెత్తిపోకుండా మోకాళ్ళకు వేలాడగట్టిన రెండు కొయ్యల పలక.

బొద్దారుకుట్టు చూ. బొద్దు.

బొర్ది విశ. 1. లోతైన. పండి.చ. 1.40; 2. మూర్ఖురాలు, వివేకంలేనిది. ఉ.హరిశ్చ. 4 58.

క. బొడ్డి. చెట్టు మొదలు, కింది భాగం.

బొర్దిగము వి. అవివేకం. బొర్దిగీ(డు విశ. మూర్ఖుడు, అవివేకి. ఉ.హరిశ్చ. 4.12.

బొద్దు రూ. బొడ్డె, బొడ్డెం. వి. 1. నాభి, పొక్కిలి. భార.సభా. 1.145; 2. నాభి నాళం. ఆము. 5.112; 3. గిన్నె, సీసా మొ. వాటి కింది భాగంలో లోపలికి మెరకగా ఉండే ప్రదేశం. శుక. 2.335; 4. నూతి చుట్టూ ఎత్తుగా కట్టిన గోడ; 5. కాయలో మధ్య ఉండే భాగం; 6. రాట్నం రెండు చక్రాల్ని వేరుచేసే కొయ్య; 7. ఊత్తె పట్టెకు బిగించిన కడియాన్నీ పరుగేరే కర్రకు తగిలించిన గొలుసునూ కలిపే ఊచ చివరి బొడిపె; 8. పరుగు దువ్వే కుంచె పట్టుకోవటానికి ఒగించిన కొయ్య; 9. నేసిన బట్ట చుట్టే దోనె కొన; 10. బొద్దుకొయ్యకు చేసిన బెజ్జం; 11. రెండంచులకూ మధ్యభాగంలో నేతపడుగు; 12. పట్టుకోవటానికి కొన్ని మట్టిపాత్రలకు ఉంచే పిడి లాంటి భాగం; 13. మధ్య ప్రదేశం; 14. ఆకులు వెయ్యటానికి, ఇరుసు దూర్చటానికి బండి చక్రం మధ్య ఉన్న గుండ్రని కొయ్య.

క. బొడ్డి, బొడ్డె. చెట్టు మొదలు; పర్జి. బొడ్; కొలా. బొగుర్. బొద్దు; నా. బొగుర్; కురు. బుట్టి.

బొద్దారుకుట్టు వి. కడుపునొప్పి, మూత్రంలో రక్తస్రావం. <బొద్దు+-ఆరుకుట్టు. బొద్దుఊచ వి. మొనలేని బాణం. బొద్దుకట్టు వి. బండి కుండకు కట్టిన ఇనపకట్టు. బొద్దుకు మసిపూసుకుకూర్చొను అ.క్రి. అదేపనిగా కూర్చొని ఉండు. బొద్దుకూజా వి. నీళ్ళు పోయటానికి మూతి కింది భాగంలో బుర్ర పైభాగంలో రంధ్రం ఉండే కూజా. బొద్దుకొంగు వి. బొద్దు దగ్గర చెక్కుకొని కట్టుకొనే బట్టకొన. బొద్దుకొయ్య వి. పట్టుమగ్గం దోనెను ఎడమవైపున మోసే కొయ్యగూటం. బొద్దుకోయు అ.క్రి. పిల్లలు పుట్టినప్పుడు మాయను తొలగించటానికి బొద్దును కోయు. కాశ. 3.27. బొద్దుగంట వి. అలంకార విశేషం, మొలగంటు. సీతా. వి 2.130. బొద్దుగాలి వి. సమానవాయువు. బొద్దుగిన్నె వి. ఒక గిన్నె లోపల ఇమిడే చిన్న గిన్నె. బొద్దుసరిగి వి. 1. చిన్నపిల్లలాడుకోవటానికి బొద్దుపెట్టి గుండ్రంగా ఉన్న బుడ్డి; 2. పిల్లలకు పాలుపట్టే చిన్న పిడతలు. బొద్దుగూటం వి. మగ్గం మీద నేతబట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమపక్కన నేలలో పాతిన కొయ్య గూటం. బొద్దుగొయ్య (-కొయ్య) వి. మగ్గం మీద నేత బట్ట చుట్టే కొయ్యకు ఆధారంగా ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్యగూటం. బొద్దుచవిక రూ.చూ. బొద్దు(జవిక. వి. చుట్టుకొల్లారం నడిమి చావడి. బొద్దుచావడి వి. నడిపచ్చ. బొద్దుచిల్ల రూ. చూ. బొద్దు చీల. వి. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు. బొద్దుచీల రూ. బొద్దుచిల్ల. వి. 1. బండి దొలుపును పోలుగర్రకు కలిపే మేకు; 2. కాడిమధ్య పైవైపు కొట్టే మేకు. బొద్దుచుక్క వి. ధ్రువ నక్షత్రం. బొద్దుజాపివి వి. పాలకుండల మీద పెట్టే మూత. బొద్దు(జవిక(-చవిక) రూ. బొద్దుచవిక. వి. చుట్టూ కొల్లారం నడిమి చావడి. బొద్దుట్ల సట్టి వి. తీపి వస్తువులు చేసుకోవటానికి వాడే మట్టిపాత్ర. బొద్దుంత (-ఉంత) వి. దూది ఏకేటప్పుడు ఏకువిల్లు నరం గుంజే కొయ్య పనిముట్టు. బొద్దుతాడు వి. 1. మోటబొక్కెన లాగే మోకు; 2. గూడ మూతికి ఇటూ అటూ కట్టిన తాడు; 3. నేతబట్టమీద చేదుకర్రల్ని అడ్డంగా బిగించిపెట్టే పొడుగు దారం. బొద్దుతామర రూ. బొద్దుతామెర. వి. నాభినుంచి పుట్టిన తామరపువ్వు. భార. అను. 5.359. బొద్దుతామెర రూ.చూ. బొద్దుతామర. వి. నాభినుంచి పుట్టిన తామర పువ్వు. తాళ్ల.సం. 10.133. బొద్దుతుంగ వి. మాగాణిలో మొలిచే తుంగ. బొద్దునుంచి ఊడిపడు అ.క్రి. సరిగ్గా అవే పోలికలు, గుణాలు కలిగిఉండు. బొద్దువేత వి. నేతలో రెండు అంచులకూ మధ్యభాగం. బొద్దుపాగడ వి. అల్లుచేసే పడుగులో అంచుల మధ్యభాగంలో కలిపేనూలు. బొద్దుపుదక వి. దూదేకులవాళ్ళు ఉపయోగించే ఒకరకం పనిముట్టు. బొద్దుపాయల వి. కూరగా ఉపయోగించే ఒకరకం ఆకు. బొద్దుపాయలాకు వి. చెమ్మనేలల్లో ఏటా లేచి పెరిగే కలుపుమొక్క (Portulaca Oleracea). బొద్దుపావలి వి. చెమ్మనేలల్లో ఏటాలేచి పెరిగే కలుపుమొక్క (Portulaca Oleracea). బొద్దుపుల్ల వి. దూది ఏకేటప్పుడు ఏకు విల్లు నరం గుంజే కొయ్య పనిముట్టు. బొద్దుబర యా.చూ. బొద్దు బరగ. వి. నేసిన గొంగడి బిగింపుకోసం ఉన్నిమగ్గం దోనె గాడిలో పెట్టిన కర్ర. బొద్దుబరగ రూ. బొద్దుబర. వి. నేసిన గొంగడి బిగింపుకోసం ఉన్నిమగ్గం దోనెగాడిలో పెట్టిన కర్ర. బొద్దుబావి వి. లోపలచుట్టూ రాతితో అంచుకట్టిన పెద్ద బావి. బొద్దుమల వి. బండి పరానికి దొలుపుకు బిగించిన చీల. బొద్దుమల్లియ రూ. బొద్దుమల్లె. వి. ఒకజాతిమల్లె, లతా విశేషం, దానిపుష్పం. ప్రభులిం. 2.187 పం. పి.శకు. 3.41. (Jasminum sambac). బొద్దుమల్లె రూ.చూ. బొద్దుమల్లియ. వి. పెద్దరకం మల్లెతీగ (Jasminum sambac). బొద్దుముంత వి. పట్టుకోవటానికి పిడిఉన్నట్టి మట్టిపాత్ర. బొద్దుమూకుడు రూ. బొద్దుమూకుడు. వి. పాల కుండలమీద పెట్టే మట్టిమూత. బొద్దురాతిచవిక వి. బొద్దు రాతి దగ్గర కట్టిన నలుచదరపు మందిరం. బొద్దురాయి రూ.చూ. బొద్దుఱాయి. వి. కలరా, మసూచి మొ. సాంక్రామిక సాంఘిక వ్యాధులు, పశువ్యాధులు సోకకుండ గ్రామ

వాసులు పూజించే నిలువన నాటిన పెద్దరాయి. బొడ్డుఱాయి రూ. బొడ్డురాయి, బొడ్రాయి. వి. కోటగుమ్మం మధ్యలో ఉండే రాయి. బొడ్డులో చెక్కుకొను అ.క్రి. దాచుకొను, డబ్బును చీరలోను ధోవతిలోను నడుమున చెక్కుకోవటంపై వచ్చిన పలుకుబడి. బొడ్డులో మాణిక్యము వి. భాగ్య విశేషం. వైజ. 1.63. బొడ్డువంచు అ.క్రి. ఓపిక కలిగిఉండు. భోజ. 6.142. బొడ్డువాయ వి. ఎద్దులకు అలంకారంగా నడుంచుట్టూ వేసే తోలుపట్టీ. బొడ్డుసుడి వి. బొడ్డుకు సూటిగా వీపుమీద ఉండే సుడి. బొడ్డుసురాయి వి. నీళ్ళుపోయటానికి మూతి కింది భాగంలో బుర్రపై భాగంలో రంధ్రం పెట్టిన కూజా. బొడ్డుసులిగ వి. 1. ఉన్నిపడుగు సరిచేసేటప్పుడు పైపోగులకు కింది పోగులకు మధ్య దూర్చిన కర్ర; 2. నేసిన గొంగడి బిగింపుకోసం ఉన్నిమగ్గం దోనెగాడిలో పెట్టిన కర్ర. బొడ్డుసూత్రము వి. ఎగరటానికిగాను కొలిచి గాలిపటంకింద కట్టబడే దారం. బొడ్డుసూల వి. మూత్ర నిరోధం కలిగే జబ్బు. బొడ్డూదవి విణ. వయసురాని. < బొడ్డు + ఊదని. బొడ్డెమ్మ వి. ఒకదేవత. < బొడ్డు + అమ్మ. బొడ్డెరిక రూ.చూ. బొడ్డెరు. వి. పశురోగ విశేషం. బొడ్డెరు రూ. బొడ్డెరిక, బొడ్డేరు. వి. పశురోగ విశేషం. బొడ్డేరు రూ.చూ. బొడ్డెరు. వి. మూత్ర నిరోధం కలిగే జబ్బు. బొడ్రత్నము వి. నాభిలో ఉండే మణి. భాగ్య విశేషం. వైజ. 1.63. బొడ్రాయి రూ.చూ. బొడ్డుఱాయి. వి. 1. గ్రామంలో జరిగే శుభకార్యాలన్నింటిలో పూజచేసే రాయి; 2. గ్రామం నడిబొడ్డున అరుగువలె అమర్చిన పెద్ద బండ. బొడ్లు వి. చిన్న చిన్న కప్పలు < బొడ్డు + -లు. బొడ్లోపాలు వి. 1. పిల్లలు ఆట నడుమ విరామం కోరేమాట; 2. సహకరించటానికి నిరాకరించటం.

బొడ్డుకీటు రూ.చూ. బొడ్డుకీటు. వి. పునాది గోడమీద బొడ్డేర్పరచి పెట్టేకీటు.

బొడ్డుంబాల్ రూ.చూ. బొడ్డంబాలు. వి. పొరపాటు దిద్దుకోవటం.

బొడ్డూదవి చూ. బొడ్డు.

బొడ్డె రూ.చూ. బొడ్డు. వి. 1. ఊడ్తెపట్టెకు బిగించిన కడియాన్ని పడుగేసే కర్రకూ తగిలించిన గొలుసునూ కలిపే ఊచ చివరి బొడిపె; 2. పంకెనలో ఒకభాగం; 3. ఉన్నిమగ్గం దోనుగ గాడిలో మద్య బిగించటానికి పెట్టిన కొయ్యపల్ల; 4. మరనాడె మొన అరిగిపోకుండా బిగించిన ఇనపపొన్ను; 5. దాబి గొలుసుబద్దకు బిగించిన కొయ్యముక్క; 6. పొలంలో బాలుగా పోసిన ఎరువు కుప్ప; 7. కోసివేసిన వరిగడ్డికుప్ప; 8. ఎద్దుకొమ్ముల కొనన అలంకారంగా వేసే తొడుగు; 9. పెసర, మినుము మొ. పైర్ల తెగులు; 10. పట్టుకోవటానికి కొన్ని మట్టిపాత్రలకు ఉండే పిడిలాంటి భాగం; 11. మట్టిపొయ్యికి పైభాగంలో పాత్రలకు ఆధారంగా తీర్చిన మట్టి ఉబ్బులు.

బొడ్డెరవన్నం రూ.చూ. బొడ్డెరసన్నం. వి. కడవ నీళ్ళు పట్టే మట్టిపాత్ర. బొడ్డెలపింజర వి. ఒకరకం దాబి. బొడ్డెలు వి.బ.వ. కంకులు. బొడ్డెల్లచెక్క వి. బొడ్డబ్బాని పమాలు నేతలో ఒకపొరుగులోనుంచి మరొక పొరుగులోకి నాడెను పెట్టటానికి చేత్తో తాళ్ళను గుంజే పిడి.

బొడ్డెమ్మ చూ. బొడ్డు.

బొడ్డెరసన్నం రూ. బొడ్డెరవన్నం. వి. కడవ నీళ్ళుపట్టే మట్టి పాత్ర.

బొడ్డెరిక చూ. బొడ్డు.

బొడ్డెరు చూ. బొడ్డు.

బొడ్డేం రూ.చూ. బొడ్డు. వి. దొంగ గొడ్డుమెడకు వేలాడగట్టే బరువు కొయ్య.

బొడ్డేరు చూ. బొడ్డు.

బొడ్రత్నము చూ. బొడ్డు.

బొడ్రాయి చూ. బొడ్డు.

బొడ్లు చూ. బొడ్డు.

బొడ్లోపాలు చూ. బొడ్డు.

బొడిగ చూ. బొడిపి. రూ. బొణుగు, బొసుగు. వి. 1. దొంగ ఆవ మెడలో కట్టే పెద్ద ఇనపమువ్వ; 2. వదరుబోతు; 3. వేయించగా పేలాలుగాని గట్టి జొన్నగింజ; 4. కొయ్యగంట; 5. భక్ష్య విశేషం; 6. సరుకుతో ఉన్న చేతిసిద్దె.

బొడిగలు వి.బ.వ. 1. పొట్టువదిలి బద్దలుకాని కాయధాన్యం; 2. బొంతువదలని జొన్నలు మొదలైనవి.

బొడిపె రూ.చూ. బొడిపె. వి. దెబ్బతగిలి రక్తం కారకుండా పొంగటం.

బొణుగు రూ.చూ. బొడిగ. వి. 1. చిప్పలు మొ. ఒకదానికొకటి తగిలేటప్పుడు పుట్టే ధ్వనికి అనుకరణం; 2. దొంగ ఆవ మెడలో కట్టే పెద్ద ఇనపమువ్వ; 3. వదరుబోతు; 4. వేయించగా పేలాలుగాని గట్టి జొన్నగింజ.

బొంత వి. 1. తప్పు చేసేవారి కాళ్ళు చేతులకు తగిల్చే కర్ర యంత్ర విశేషం. రాజవా. 1.31; 2. పాలు గట్టిపడి ఏర్పడుతున్న విత్తనం; 3. జొన్న, సజ్జ మొ. వాటి కంకి పొట్టు; 4. కంకి పొట్టు వదలని గింజలు; 5. గింజలు రాలిన మొక్కజొన్న కంకి; 6. దొంగగొడ్డు పరిగెత్తకుండా కాలికి కట్టే బంధం.

సం. *బంధ-*. కట్టు, ముడి, వంకెల, దారం; ప్రా. *బంద-*.

< ప్రా. బంద-.

బొందకట్ట వి. తూర్పార పోసేటప్పుడు మేలురాసి దగ్గర పడే పొట్టు. బొందకొయ్య వి. బంధనం. బొందకొయ్యసుడి వి. మోకాళ్ళ దిగువన ఉండే సుడి. బొందరాలగొట్టు అ.క్రి. పూర్తిగా పొగరణచు. బొందసుడి వి. పిల్ల గిట్టల దగ్గర ఉండే సుడి. బొందసూత్రం వి. పురమగ్గంలో నాడెను నడపటానికి ఆధారంగా కుచ్చు కట్టిన దారం.

బొందము రూ. బొందలము, బొందాము, బొండ్లము. బొండ్లాము, బొండెము. వి. ఒలవని కొబ్బరికాయ. హర. 6.55.

సం. *వృంత-*. తొడిమ; ప్రా. *బోఁట-*. ఫల విశేషం.

< ప్రా. బోఁట-.

బొందరగాళ్ళు వి.బ.వ. నూనె గింజల చెట్టు పప్పు కర్రాలు.

బొందలము రూ.చూ. బొందము. వి. ఒలవని కొబ్బరికాయ. ఆము. 6.17.

బొందాము రూ.చూ. బొందము. వి. ఒలవని కొబ్బరికాయ.

**బొంది** వి. 1. చెరువ రంధ్రం ; 2. పలక అమర్చటానికి మదుం పైన వేసిన కన్నం.

**బొందిగొయ** వి. మగ్గం మీద నేతబట్ట చుట్టే కొయ్య దోనెకు ఆధారంగా ఎడమ పక్కన నేలలో పాతిన కొయ్య గూటం. **బొందిక** వి. తూము రంధ్రానికి అడ్డంగా వేసిన కొయ్య పలక లేక మొద్దు.

**బొందిగ** వి. 1. ఈనె మొదలు తొడిమ ; 2. గొంతు.
క. బొడ్డి. చెట్టు మొ. వాటి మొదలు.

**బొందిక** చూ. బొంది.

**బొందు** చూ. బొందము. విశే. గుండ్రమైన, వర్తులం ; వి. 1. రాట్నం రెండు చక్రాలనూ వేరుచేసే కొయ్య ; 2. దబ్బ రాట్నం చక్రం మధ్య ఆకుల బిగింపుకు అమర్చిన కొయ్య గుండు.

**బొందుమల్లియ** రూ. బొందుమల్లె. వి. మల్లికా విశేషం, ఒకజాతి మల్లె, గుండుమల్లె. కు.సం. 9.112. **బొందుమల్లె** రూ.చూ. బొందుమల్లియ. వి. మల్లికా విశేషం, ఒకజాతి మల్లె, గుండుమల్లె. ఆము. 2.56.

**బొందుగ** రూ.చూ. బొందుగు[1]. వి. కంఠం. భాగ. 10 పూ. 278.

**బొందుగు[1]** రూ. బొందుగ, బొందువ, బొందువు. వి. కంఠం. భార.శాంతి. 3.499.
కొలా. బొంధుక్. గొంతు.

**బొందుగు[2]** వి. ఎర్రని పూలు పూసే ఒక పెద్దచెట్టు (Hetero-phragma roxburghii).

**బొందువ** రూ.చూ. బొందుగు[1]. వి కంఠనాళం. అచ్చ.రా. యు. 136.

**బొందువు** రూ.చూ. బొందుగు[1]. వి. కంఠం.

**బొందెము** వి. వెదురు మొ. వాటిలో ఏర్పరచిన ఆవరణం, ద్వారానికి ముళ్ళకంపతో అల్లి అమర్చిన తడక, ముళ్ళ కంపతో అల్లి తెట్టుకమర్చిన తడక.

**బొందేం** వి. 1. మోట గట్టి నీళ్ళు తోడే పరికరం ; 2. ఏతంతో నీళ్ళు తోడే పాత్ర.

**బొండ్లము** రూ.చూ. బొండము. వి. వలవని కొబ్బరికాయ. ఆము. 1.54.

**బొండ్లాము** రూ.చూ. బొండము. వి. పెచ్చుతో ఉన్న టెంకాయ.

**బొండ్లెము** రూ.చూ. బొండము. వి. 1 పెచ్చుతో ఉన్న టెంకాయ ; 2. ఆచ్ఛాదన లేనిది.

**బొత్త[1]** రూ.చూ. బొత్తాము. వి. 1. రాగి మొ. పాత్రల కన్నం, చిల్లి ; 2. గుండి.

**బొత్త[2]** రూ.చూ. బుట్ట. వి. రెండు తుకులు లేక నాల్గు తుకులు కలిగి సుమారు 7 అడుగులు ఎత్తుండి మధ్యలో లావుగాను పైభాగం లింగమూతిగాను ఉండే పెద్దబుట్ట. పాణి.

**బొత్త[3]** వి. బొజ్జ.

**బొత్తసుడి** వి. పొట్టమీది సుడి.

**బొత్తంచు** చూ. బొత్తు.

**బొత్తంచుచాపు** చూ. బొత్తు.

**బొత్తంచుచీర** చూ. బొత్తు.

**బొత్తంచులుంగీ** చూ. బొత్తు.

**బొత్తము** రూ.చూ. బొత్తాము. వి. గుండి.

**బొత్తరలు** వి.బ.వ. ఒకరకం కుడుములు. కాశీ. 7.186.

**బొత్తల్** వి. తివాసీ నేతలో వచ్చే ఒకరకం డిజైను.

**బొత్తా** రూ.చూ. బొత్తాము. వి. బొత్తాను, గుండి.

**బొత్తాను** రూ.చూ. బొత్తాము. వి. గుండి.

**బొత్తాము** రూ. బత్తాను, బత్తము[2], బత్తాము, బత్తాసు, బుతాము, బొత్త[1], బొత్తము, బొత్తా, బొత్తాను, బొత్తాయి, బొత్తాసు. వి. 1. బొత్తాను, గుండి ; 2. చక్కెరతో చేసిన బిళ్ళ.
పో. బొత్తాము ; స్పా. బోతోన్ ; ఫ్రెం. బుతో ; ఇం. *Button* ; గు. బుతాన.
<పో. బొత్తాము.

**బొత్తాయి** రూ.చూ. బొత్తాము. వి. గుండి.

**బొత్తాసు** రూ.చూ. బొత్తాము. వి. గుండి.

**బొత్తి** రూ.చూ. బొత్తు. వి. దొంతి, దొంతర.

**బొత్తిగా** క్రి.విశే. పూర్తిగా. మృత్యు. 1.17 వ. 18 పం.
సం. పూర్తి-. సంపూర్ణం.
<సం. పూర్తి-. + అగు + -అ[7].

**బొత్తు** చూ. పొత్తు. రూ. బొత్తి. వి. 1. నూర్చినప్పుడు వచ్చే కంకి పొట్టు ; 2. కంకి పొట్టు వదలని జొన్న, రాగి, సజ్జ కాయధాన్యాలు మొ. వాటి గింజ ; 3. నూగు, బొంత, నరుగు, జొన్న, రాగి మొ. వాటి గింజలను అంటుకొని ఉండే సన్నటి పొట్టు ; 4. 2, 4 మొ. వాటి సరి సంఖ్య ; 5. చాలకాలం ; 6. కాగితాలు, రూపాయినోట్లు వగైరాల వరస ; 7. కూరలు మొ.వాటి కుప్ప.

**బొత్తంచు** వి. 1. చిగురు లేకుండా నేసిన అంచు ; 2. బట్ట చివర రెండువేళ్ళ వెడల్పున ఒకే రంగు పెట్టి నేసిన అంచు ; 3. వేలెడేసి వెడల్పు తొగరురంగు పట్టెలకు రెంటికి మధ్య మామూలు ఎర్రపట్టె వచ్చేట్టు కుప్పటం నేతలో నేసిన అంచు. <బొత్తు + అంచు[3]. **బొత్తంచుచాపు** వి. బొత్తంచు పెట్టి నేసిన రెండు పంచెలు. <బొత్తు + అంచు[3] + చాపు. **బొత్తంచుచీర** వి. చిట్టచివర అంచు పెట్టి నేసిన చీర. < బొత్తు + అంచు[3] + చీర. **బొత్తంచులుంగీ** వి. బొత్తంచు పెట్టి నేసిన లుంగీ. < బొత్తు + అంచు[3] + లుంగీ.

**బొద** వి. బల్బజం, తృణ విశేషం. ఆం.భా. 2.75.
క. బొద్ది. ఒకరకమైన మొక్క.

**బొదయు** రూ.చూ. బోదారి. వి. 1. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు ; 2. దోనె మలుపు తరవాత ఉన్న భాగం ; 3. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె.

**బొదర** రూ.చూ. బోదారి. వి. 1. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు ; 2. దోనెమలుపు తరవాత ఉన్న భాగం ; 3. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె.

**బొది** వి. ఓదలు చేసే చోటు.

**బొదుసు** రూ.చూ. బదుగు. వి. రెండు పొలాల మధ్య హద్దుగా వేసిన మట్టిగట్టు.

**బొద్ద** వి. ఒకరకం చిన్న పళ్ళచెట్టు (Ficus glometra).

**బొద్దకొమ్ము** వి. కొనలు కలిసిన కొమ్ములు.

బొద్దంచు చూ. బొద్దు.

బొద్దటక చూ. బొద్దు.

బొద్ది[1] వి. 1. వృక్షవిశేషం. ద్వి.సార.చ. 2.646 (Macaranga roxburghii).

బొద్ది[2] వి. కొండలమీద పెరిగే ఒకరకం చెట్టు (Macaranga indica).

బొద్దింక రూ.చూ. బొద్దీగ. వి. ఒకజాతి కీటకం, బరిడెపురుగు.

బొద్దితీగ వి. తెల్లని పెద్ద పూలుపూసే ఒకరకం తీగ (Rivea hypocrateviformis).

బొద్దీక రూ.చూ. బొద్దీగ. వి. ఒకజాతి కీటకం, బరిడె పురుగు.

బొద్దీగ చూ. బొద్దు.

బొద్దు వి. 1. శిశువుల చేతి ఆభరణ విశేషం. కా. 6.199; 2. కొన్ని మోపులు చేర్చి కట్టిన పత్తి గడ్డి మొ. వాటి సమూహం. దగా. 4.985; 3. గోడలు మొ. వాటి అంచుల్లో ఏర్పరచే దాని అవయవవిశేషం, టాకు; 4. అంచు పడుగులో చివర అతికిన లావు దారం; 5. కమ్మినేతలో తలచిట్టకు ముందు రెండు కొలుకుల జమిలి దారంతో నేసిన భాగం; 6. పూరింటికి కప్పు వేసే ముందు చూరు కింద వాసాలపై కట్టే కట్ట; 7. దావి చేపట్టుగోడ; 8. ఉబ్బెత్తుగా చేసింది; 9. పెద్ద గడ్డిమోపు; 10. లావు; 11. తమిరె వెయ్యని రాడికి మధ్య పైపైప ఉబ్బుగా చెక్కిన భాగం; 12. తేనె వాసన వేసే పూలు పూసే ఒకరకం తీగ (Cimbretum decandrum).

బొద్దంచు వి. 1. బట్టచివర వెడల్పుగా నేసిన అంచు; 2. 2–4 వేళ్ళ వెడల్పున మామూలుగా నేసిన అంచు; 3. మామిడంచు పక్కన రంగుగీతలు పడేట్టు నేసిన అంచు; 4. లావు దారపు పోగులతో నేసిన అంచు; 5. లావుగా బుంగలకు పెట్టే అంచు. <బొద్దు+అంచు[3]. బొద్దటక వి. అంచు బొద్దుగా ఉండే చిన్న మట్టిపాత్ర. <బొద్దు+అటక. బొద్దీగ రూ. బొద్దింక, బొద్దీక. వి. బరిడె పురుగు, ఒకజాతి కీటకం. <బొద్దు+ఈగ. బొద్దుకంటం వి. పూజలు పెట్టటానికి బొద్దు ఉంచిన పాత్రకంఠం. బొద్దుకమ్మి వి. 1. రెండుమూడు వేళ్ళ వెడల్పు రంగుపట్టె; 2. నాలుగు పోగుల పరిదారం పెట్టి నేసిన కమ్మి. బొద్దుకుండటక వి. అంచు బొద్దుగాఉండే చిన్న మట్టిపాత్ర. బొద్దుకీటు రూ. బొద్దుకీలు. వి. గోడమీద బొద్దు ఏర్పరచి పెట్టే కీలు. బొద్దుగూన వి. ఇంటివెన్నుగాడిమీద పరిచే పెద్ద సైజు పెంకు. బొద్దుచువ్వ వి. నేత చివరికి వచ్చేటప్పుడు పైపోగులకు కింది పోగులకు మధ్య ఎక్కించిన సన్న బెత్తం. బొద్దువరుగు వి. అడ్డంగా అమర్చిన రాటి. బొద్దుపురివగ్గం వి. సాదా పురితో కట్టిన వగ్గం. బొద్దుపోగు వి. మందపుదారం. బొద్దుమళ్ళచీర వి. రెండేసి కొలుకుల ఎర్రపోగులు పడేట్టు నేసిన చిన్న గడి చీర. బొద్దుమూకుడు రూ.చూ. బొద్దుమూకుడు. వి. పాల కుండలమీద పెట్టే మట్టి మూత. బొద్దుపట్టి(-చట్టి) వి. బొద్దు పెట్టి చేసిన మట్టిపాత్ర.

బొద్దుగ వి. వృక్షవిశేషం. ఇందు. 2.60.

బొనగ వి. పడుగు తీసిన తరవాత ధాన్యం మీద ఉన్న చెత్తా చెదారం.

క. బొనగారె. ఒకరకం మొక్క.

బొనము వి. మెరుగు, తళుకు.

బొనగుచేప వి. ఒకరకం చేప.

బొనుగు రూ.చూ. బొణిగ. వి. దొంగ గొడ్డుకు మెళ్ళో కట్టే గంట.

బొనుసురుగంట వి. దొంగ గొడ్డుకు మెళ్ళో కట్టే గంట.

బొనుగడ్డి వి. ఒకరకం కలుపు మొక్క.

క. బొనగారె. ఒకరకం మొక్క.

బొంత వి. 1. కప్పుకోవటానికి పరుచుకోవటానికి దట్టంగా కుట్టిన గంత. బసవ. 4.20; 2. పెద్ద చేప; విశే. 1. పెద్ద; 2. లావుగల.

క. బొంత, బొంతా, బొంతె. కొన్ని బట్టలు కలిపి కుట్టిన గంత.

సం. ప్రోథ-. పాతగుడ్డ.

బొంతకత్తియ రూ. బొంతకత్తె. వి. కుట్టిని, విటసంధాన కర్త్రి. బొంతకత్తె రూ.చూ. బొంతకత్తియ. వి. విటసంధాన కర్త్రి. బొంతకర్రి వి. కొంచెం ఎరుపు నలుపులు కలిసిన రంగు. బొంతకాకర వి. ఒకరకం కాకర. బొంతకాకి వి. కాకోలం, మాలకాకి. బొంతకాంద్రేను వి. కొండల మీద పెరిగే ఒకరకం చిన్న చెట్టు (Flacourtia ramontchi). బొంతకిచిడి వి. కొంచెం ముతక రకం వడ్లు. బొంతకురపు వి. నోటవెంబడి నురుగు, పాకులాడుతూ నడపటం. బొంతకుక్కుళ్ళు(-అక్కుళ్ళు) వి.బ.వ. అక్కుళ్ళలో ఎంపినరకం. బొంతగంగమ్మ వి. చెట్టుకు పేలికలు కట్టి పూజించే దేవత. బొంతగడ్డి వి. చెమ్మ నేలల్లో మొలిచి కొర్రకంకి మాదిరి ఎన్ను ఈనే ఊదరగడ్డి (Echinochloa stagnina). బొంతగంధకము వి. గంధకపు కణిక, పలుకు గంధకం, కడ్డీ గంధకం. బొంతచిప్పర వి. లావాటి కాడలుండే చిప్పర, కలుపుమొక్క. బొంతజెముడు వి. ఒకజాతి జెముడు, ఒకరకం కంచె మొక్క. హంస. 4.10. (Euphorbia antiquorum). బొంతతీగె వి. తేనె వాసన వేసే తెల్లని పూలుపూసే ఒకరకం తీగ (Combretum decandrum). బొంతతెసలు వి. ఉలవ, కంది, పెసర మొ. పైర్ల తెగులు. బొంతపిచ్చె వి. ముక్కు గురగురలాడటం ఆయాసం. బొంతపట్టి వి. కమిచి కట్టు వర్షేటప్పుడు కుమ్మరి కింద పరచుకోవటానికి లేక పాకం మట్టి ఆరకుండా కప్పటానికి వాడే బొంత. బొంతపసుపు వి. ఒకరకం పసుపు. బొంతపురుగు వి. ఆకులు, పూత మొ.వి తినే గొంగళిపురుగు. బొంతపెసలు వి. బ. వ. ఒకరకం పెసలు. బొంతమరపులు వి.బ.వ. ధాన్యభేదం, ఒకవిధమైన ధాన్యం. ప్రబంధ. 112. బొంతమినుము వి. ఒకరకం మినుము. బొంతమొలకొలుకులు వి.బ.వ. ఒకరకం ధాన్యం. బొంతయరటి(-అరటి) రూ. బొంతరటి, బొంతరిటి. వి. పెద్ద కాయలు కాసే అరటిచెట్టు (Musa paradisiaca). బొంతరటి రూ.చూ. బొంతయరటి. వి. పెద్ద కాయలు కాచే ఒకజాతి అరటి. బొంతరలు వి.బ.వ. ఒక దినుసు పింఛివంట. బొంతరాయి రూ.చూ. బొంతజాయి. వి.

సారె మొలను దించటానికి గుబ్బిగడ్డలో పొదిగిన రంధ్రం ఉన్న రాయి. బొంతరిటి రూ.చూ. బొంతయరఁటి. వి. ముఖ్యంగా కూరకు ఉపయోగించే రకం అరటి. బొంత రోమము వి. పశువుల దేహాలపై రేగి ఉండే లావరోమం. బొంతఱాయి రూ. బొంతరాయి. వి. శిలాభేదం, ఒక విధమైన రాయి. బొంతవెంపలి వి. సముద్రతీరంలో ఇసక నేలల్లో మొలిచే ఒకరకం మొక్క. (Tephrosia pupurea). బొంతవేగి వి. కొరమద్దిచెట్టు (Bridelia montana). బొంతవేగిస వి. ముళ్ళు కలిగిన మంచి కలపనిచ్చే ఒకరకం చెట్టు (Bridelia retusa). బొంతాట్రగడ్డ వి. ఒకరకం పర్లు. <బొంత+ఆట్రగడ్డ. బొంతారికె వి. ఒక రకం అరికె. <బొంత+అరికె. బొందరము రూ. బొంద లము, బొందళము. వి. కంచుకం, కవచం. శృం.నై. 7.61. <బొంత+దడము. బొందడి వి. కవచం. యయా. 5.80. బొందడీఁడు వి. కంచుకి (కవచం తొడిగేవాడు). ఆం.భా. 2.183. బొందడిలు వి.బ.వ. ధాన్య విశేషం. ప్రబంధ. 112. బొందలము రూ.చూ. బొందడము. వి. దృఢం. బొందళము రూ.చూ. బొందడము. వి. కంచుకం, కవచం. ఉ.రా. 4.222.

బొంతాట్రగడ్డ చూ. బొంత.

బొంతారికె చూ. బొంత.

బొంతివంక వి. చిన్న రాళ్ళతో నిండిన పిల్లవాగు.

బొంతు[1] వి. 1. జొన్న, మొక్కజొన్న మొ.వాటి కంకిలో గింజ లుండే అర లేక గూడు; 2. నూర్చినప్పుడు వచ్చే కంకి పొట్టు; 3. కంకిపొట్టు వదలని జొన్న, రాగి, సజ్జ, కాయ ధాన్యాలు మొ.వాటి గింజ.

బొంతుకుప్ప వి. కంకిపొట్టు వదలని గింజలకుప్ప. బొంతు రేగు అ.క్రి. గుద్దలుతికినప్పుడు గుడ్డ మోటుదేలు. బొంతూద వి. చెమ్మనేలల్లో మొలిచి కొర్రకంకి మాదిరి ఎన్ను. ఈనె ఊదరగడ్డి (Echinochloa stagnina). <బొంతు+ఊద. బొంతెర్ర వి. దుమ్ము రంగులో ఉండే ఎరుపు. <బొంతు+ఎఱ్ఱ.

బొంతు[2] వి. 1. ఎదిగిన గొఱ్ఱెపిల్ల; 2. పెద్ద చేప.

బొంతూద చూ. బొంతు[1].

బొంతెర్ర చూ. బొంతు[1].

బొంద[1] వి. గుంపు, సమూహం. చంపూ.రా. 8.58.

సం. బృంద-. సమూహం.

<సం. బృంద-.

బొందకోల వి. మల్లసాధన విశేషం. ప్రబంధ. 89.

బొందవక్కి వి. మత్స్యవిశేషం, ఒకజాతి చేప.

బొంద[2] వి. 1. నెరియ, బీట, గర్తం, చిన్నగోయి. పండి.చ. 4.251; 2. నేతగుడ్డ చుట్టే దోనెకు ఒకవైపున చేసిన చిల్లి (చిల్లు); 3. గోరి.

బొంద[3] రూ. బంద[6], బందర, బొందియ, బొందె. వి. 1. అరటి మొ.వాటి ప్రకాండం. దశా. 8.201; 2. బాలకాశం, లేత కాటి. ఆం.భా. 2.77; 3. ఒకవిధమైన కూర.

సం. బంధిత-. కట్టబడినది; ప్రా. బంధిఅ, బద్ధం. సంశ్లిష్టం.

<ప్రా. బంధిఅ.

బొందకళ్ళి వి. కంచెల్లో పెంచబడే ఒకరకం మొక్క (Euphorbia antiquorum). బొందపువ్వు వి. కాడ మొవ్వను పట్టిఉండే నూగుపువ్వు.

బొంద[4] వి. ముఖం.

ప్రా. బోంద-. ముఖం.

<ప్రా. బోంద-.

బొందరము చూ. బొంత.

బొందడి చూ. బొంత.

బొందడీఁడు చూ. బొంత.

బొందడిలు చూ. బొంత.

బొందలము చూ. బొంత

బొందళము చూ. బొంత.

బొంది[1] వి. దేహం, మేను. కు.సం. 11.161.

ప్రా. బోంది. దేహం, మేను; పా. బొంది. దేహం, మేను;

క. బొంది. శరీరం; త. పొంది. దేహం, మేను.

<ప్రా. బోంది-.

బొందితోఁగైలాసము వి. సశరీరముక్తి. పండి.చ. 1. 2.367 వ. బొందితోఁగైలాసముఁజూచు అ.క్రి. అసాధ్యం కోసం ప్రయత్నించు. పాండు. 5.230.

బొంది[2] రూ.చూ. బందు[1]. వి. గద్ద, బోరువపక్షి, రాబందు.

బొందివేట వి. గూళ్ళలో ఉంచి పెంచే కౌజులు మొ. పక్షుల సహాయంతో ఆడే ఆట. యయా. 1.118.

బొంది[3] రూ.చూ. బందు[2]. వి. తలుపు రెక్కలను పిడసలమీద తిరిగేటట్టుచేసే ఇనపబద్దీ.

బొందియ రూ.చూ. బొంద[3]. వి. 1. రంధ్రం; 2. అరటి ఊచ.

బొందిలి రూ.చూ. బొందిలీ. వి. బారకీయుల్లో ఒకజాతి. దా.మం. 1.124.

బొందిలీ రూ. బొందిలి. వి. బారకీయుల్లో ఒకజాతి. కృష్ణరా. 3.25.

బొందిలు వి.బ.వ. కట్ల కడపలను అంచంతా పెట్టే గీతలు.

క. బొంది. కాళ్ళకట్ట.

బొందు[1] వి. 1. దారం. కాశీ. 5.96; 2. పూవుబొత్తు. కళా. 4.82; 3. కష్కస్తన్యం, వెన్ను తీయటానికి యోగ్యంకాని వరి మొ.వి. ఆం.భా. 2.237; 4. చొక్కా ముడివేసే సన్నని నాడా; 5. చేతుకర్రల బిగింపుకు దారాలతో నేసే లోహపుచుట్ట; 6. లడి; 7. లడిలో ఇరవయ్యో వంతు నూలు; 8. లడిలో పదోవంతునూలు; 9. నూలు అద్దకంలో చుక్క కట్టటానికి వాడే నూలు; 10. మంగళసూత్రం తాడు; 11. కంకితీయక ఎండిపోయిన జొన్న; 12. వెన్ను తీయని వరి తాలు; విశే. స్థూలమైన, లావైన. ఆము. 69.

సం. బంధ-. కట్టు, బంధం; ప్రా. బంధ-. బంధ నం; మరా. పంతు, పొంతు.

<ప్రా. బంధ-.

బొందుకట్టునూలు వి. నూలు అద్దకంలో చుక్క కట్టటానికి వాడే నూలు. బొందుకదురు వి. బొందురాట్నం బొమ్మలకు బిగించే మందపుకడ్డీ. బొందుకలువ వి. నారుమడిలో పెరిగిన

చిల్లర మొక్కల్ని పీకివేయటం. బొందుచొప్ప వి. కంకి వెళ్ళని వరి, వరిగె మొ.వాటి గడ్డి. బొందుజంగ వి. బొందు రాట్నానికి గంటం అమర్చే నిలువకొయ్య. బొందుపడుగు వి. రంగుల అద్దకంలో చుక్కకట్టటానికి వాడే పడుగునూలు. బొందువంటి వి. అడ్డంగా అమర్చిన రాటి. బొందుపీట వి. బొందురాట్నం కింది పీట. బొందుపోవు అ.క్రి. వరి మొ.వి వెన్నుతీయటానికి యోగ్యం కాకపోవు. వరి మొ.వి వానలు సరిగా లేక వెన్ను పైకి రాకుండాపోవు. బొందురాట్నం వి. రంగునూలు తోడే రాట్నం. బొందువారు వి. ఒకరకం రంగు.

బొంద[2] రూ.చూ. బండు[1]. వి. 1. గడ్డ; 2. బోరువపక్షి; 3. రాబందు.

బొంద[3] రూ.చూ. బండు[2]. వి. తలుపు రెక్కలను పిడసలమీద తిరిగేటట్లుచేసే ఇనపబద్దీ.

బొందుముడుచు అ.క్రి. సమాప్తిచేయు.

బొందె రూ.చూ. బొంద[3]. వి. 1. అరటిదూట. ఆం.రా. 2.58; 2. పక్క కొమ్మలువేసి మొక్క గుబురుగా పెరిగే స్థితి.

బొప్ప రూ.చూ. బొప్పడు. విశే. మూఢుడు. బసవ. 5పు. 27 పం.; వి. బాలుడు, పిల్లవాడు.

బొప్పటము వి. లేకుండ చేయటం.

బొప్పడు రూ. బొప్ప. వి. బాలుడు, పిల్లవాడు. బసవ. 3.368; విశే. 1. మూఢుడు; 2. పనికిరానివాడు.

క. బొప్ప. తండ్రి.

బొప్పయ రూ.చూ. బొప్పాయి. వి. ఒకరకం పండు.

బొప్పర రూ.చూ. బొప్పాయి. వి. పెరళ్ళలోను తోటల్లోను పెంచే చిన్న పండ్లచెట్టు (Carica papaya)

బొప్పాయ రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగా ఉండే తియ్యని ఎరుపురంగు గుంజు కలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

బొప్పాయి రూ. పపయ, పప్పాయ, పప్పడి, పప్పాడి పొప్పడి, పొప్పడి, పొప్పయ, పొప్పాయి, బప్పెర, బొప్పయ, బొప్పర, బొప్పాయ, బొప్పాన, బొప్పాసి, బొబ్బాయ, బొబ్బాయి, బొబ్బాన. వి. మెత్తగాఉండే తియ్యని ఎరుపు రంగు గుంజు కలిగిన పళ్ళు కాసే ఒకరకం చెట్టు (Carica papaya).

పో. పపైయా (Carica papaya lim, caricaceae). కుటుంబంలోని ఒకే ఒకమొక్క. దక్షిణ అమెరికా ఫలవృక్షం. ఈపదం రీబ్ మాండలికం.

గు. పపయో, బపాయో. కొంకణి, పొప్పాయి; మరా. పపఈ;

క. పప్పాయి. బొప్పాస; మ. పప్పాయం.

<పో. పపైయా.

బొప్పాయితెగులు వి. పసుపు, మొక్కజొన్న మొ. పైర్లతెగులు.

బొప్పావ రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగాఉండే తియ్యని ఎరుపురంగు గుంజుకలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

బొప్పాపి రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగాఉండే తియ్యని ఎరుపురంగు గుంజుకలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

బొప్పి వి. 1. గొల్లవానివద్ద ఉండే ఒకానొక వస్తువు. హంస 2.75; 2. కదుం, దెబ్బ తగలటం వల్ల కలిగే బుడిపి దశా. 1.272; 3. పంటకు వాడే చిన్నమట్టిపాత్ర; 4 గారాబుశిశువు.

క. బుగుడు.వాపు, కదుం; త. పొరుము (పొరిమి-) ఉబ్బు, వాచు; పెంగొ. (పొగ- (ప్రొక్తె-). ఉబ్బు వాచు.

బొప్పికట్టు అ.క్రి. తలపట్టుగట్టు. బొప్పిచిప్ప (-చిప్ప వి. టెంకాయ చిప్పలాగా బోదగా అంచులేకుండా ఉండే మట్టిచిప్ప.

బొబ్బ[1] వి. 1. పిరులపెద్ద అరుపు, సింహనాదం. భార. ఆది. 4.11; 2. పెద్దఅరుపు, కేక. భీష. 4.191.

క. బొబ్బె. పెద్దకేక, అరుపు, బొబ్బరింత, పిరులఅరుపు, బొబ్బిళి. అరుచు; తు. బొబ్బె. ఏడ్పు. కన్నీరుకార్చు.

బొబ్బమెకము వి. సింహం. కడుక్క. 4.100. బొబ్బరించు రూ.చూ. బబ్బరించు. అ.క్రి. అరచు. అచ్చ. రా. యు. 99. బొబ్బరింత రూ. బబ్బరింత. వి. పెద్దఅరుపు. ఆము. 3.20. బొబ్బరింపు వి. పెద్దఅరుపు. బొబ్బరిల్లు అ.క్రి. వాపోవు. ఆం. రా. 3.99. బొబ్బలగొట్టు వి. పేద, ఒకారి. బొబ్బలుపొరుచు (-పొరుచు[2]) అ.క్రి. కేకలువేయు. బసవ. 3.68. బొబ్బపొరుచు (-పొరుచు[2]) అ.క్రి. బొబ్బరించు. హరి. ఉ. 7.211. బొబ్బాటము వి. బొబ్బరింత. నరస. 5.89. <బొబ్బ[1]+-ఆటము. బొబ్బెట్టు అ.క్రి. వాపోవు. బొబ్బరిల్లు. <బొబ్బ[1]+పెట్టు.

బొబ్బ[2] వి. పొక్కు, విస్ఫోటం. ఆము. 2.56.

క. పుగుళ్, బొక్కె, బొబ్బె. పొక్కు; కొడ. పొక్కళ్- పొక్కు; తు. పొక్కె, బొక్కె. బొక్కె. పొక్కు; త. పొకుట్టు. బుగ్గ (నీరు మొ. వి బుగ్గలుగా లేచు. పొంగు), పొక్కు. బొబ్బలెక్కు. పొక్కుళమ్. పొక్కు, బొబ్బ, పుండు, పొక్కుళి (-ప్పు-, ట్ట్-). పొక్కు లెక్కు. బొబ్బలెక్కు; మ. పొక్కుళ్, పొక్కళ్. బొబ్బ, పుండు. బుడగ, పొక్కుళిక్క. బొబ్బలెక్కు. పొకయు. బుడగ; కో. పొగల్. పుండు, పొగ్ల్. వేడివలన బొబ్బ లెక్కు; తొ. పిగ్. బుడగ (చేతి) రాపిడివల్ల బొబ. లెక్కు; గోం. పొప్పల్- పొక్కు; పర్జి. పొవ (బ్బ హవెల్). పొక్కు; కొలా. పొక్కె-. పొక్కు, బుగ్గ- బుడగ; కురు. పొఖ్నా. పొక్కులెక్కు. పొంగు; మాల్తో. పొక. పొక్కు.

బొబ్బట్లు యా.చూ. ఒబ్బట్లు. వి.బ.వ. భక్ష్యవిశేషం. చెన్నబసవ. 4.358, <బొబ్బ[2]+అట్లు. బొబ్బతెగులు వి. పసుపు, పొగాకు మొ. వాటితెగులు.

బొబ్బదాయి చూ. బొబ్బ[1]. వి. ఒకజాతి గచ్చిలం.

బొబ్బర[1] యా. బబ్బర[2], బబ్బెర. వి. సస్యవిశేషం, అలసందె. భీమ. 3.57. (Dolichos catjang).

సం. బర్బర- సస్యవిశేషం, బబ్బుల- బర్బుర-; బర్బూర-. ప్రా. బబ్బర;

క. బబ్బులి, బొబ్బులి, బొబ్బడె. బెరడు, పైతొక్క,

పెంకు.

<ప్రా. బబ్బర-

**బొబ్బర్లు** వి.బ.వ. ధాన్యవిశేషం, అలసందె.

**బొబ్బర**[2] వి. చెట్టుబెరడు, గరుకైన పట్ట పైభాగం.

**బొబ్బరిగంటె** వి. ముతగ్గా తెల్లగా ఉండేరకం.

**బొబ్బలి** వి. బర్బురం, వృక్షవిశేషం. ఆం. భా. 2.64.

**బొబ్బాటము** చూ. బొబ్బ[1].

**బొబ్బాయ** రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగాఉండే తియ్యటి ఎరుపురంగు గుంజు కలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

**బొబ్బాయి** రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగాఉండే తియ్యటి ఎరుపురంగు గుంజు కలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

**బొబ్బాస** రూ.చూ. బొప్పాయి. వి. మెత్తగా ఉండే తియ్యటి ఎరుపురంగు గుంజు కలిగిన పళ్ళుకాసే ఒకరకం చెట్టు (Carica papaya).

**బొబ్బిలంచు** చూ. బొబ్బిలి.

**బొబ్బిలి** వి. విజయనగరం జిల్లాలోని ఒక ముఖ్యపట్టణం.

<ప్రా.తె. పేర్ + పులి.

**బొబ్బిలంచు** వి. రెండు మూడు గీరలు పడేట్టు నేసిన ఒకరకంఅంచు. **బొబ్బిలికాయ** వి. పాదాంగుష్ఠాభరణం. ఇది బొబ్బిలిలో తయారై ఉంటుంది. **బొబ్బిలిగంటి** వి. ముతగ్గా తెల్లగ్గాఉండేరకం. **బొబ్బిలిగిన్నె** వి. కూరలు, పచ్చళ్ళు పెట్టుకోవటానికి వాడే మట్టిగిన్నె. **బొబ్బిలిగేదె** వి. బొబ్బిలి ప్రాంతానికి చెందిన గేదెజాతి. **బొబ్బిలిగోటు** వి. తేనిగొవ్వ; **బొబ్బిలిచెట్టు** వి. జీకుచెట్టు. **బొబ్బిలిదున్న** వి. బొబ్బిలి ప్రాంతపుదున్న. **బొబ్బిలిపోతు** వి. బొబ్బిలి ప్రాంతపు దున్న.

**బొబ్బె** చూ. బొప్పె. వి. వక్షఃస్థలం.

**బొబ్బెట్టు** చూ. బొబ్బ[1].

**బొమ**[1] యా. బొమ్మ[1]. వి. 1. కనుబొమ. కు. సం. 5.30; 2. బొమ ముడి. భాస్క. రా. యు. 1126.

సం. భ్రువ-, భ్రూ. కనుబొమ; ప్రా. భమయా, భువగు, భుమయా, భూమా, భూ, భమహా, భముహా, భౌమావా; అ.మా. భమహా, భముహా, భుముఅ; పా. భముక, భాముభా; అప. భఉహా;

క. పుర్బు. పుబ్బు, హుబ్బు; త. పురువ, పూరువ; మ. పురిగ, పురియ; ఒరయాన్. భావ.

<ప్రా. బొమ్హా.

**బొమగంటువెట్టు(-పెట్టు)** అ.క్రి. బొమముడి ముడుచు. ఉ.హరి. 5.314. **బొమముడి** యా. బొమ్మముడి. వి. భ్రుకుటి, కోపం వచ్చినప్పుడు కలిగే బొమలముడి. భాస్క. రా.యు. 15.26. **బొమముడిపాటు** వి. బొమముడిపడటం. మను. 2.61. **బొమముడిముడుచు** అ.క్రి. కనుబొమలు ముడుచు. కకుత్స. 1.143. **బొమలుగొను(-కొను)** అ.క్రి. బొమముడికూర్చు, కోప సూచకంగా బొమలుముడుచు. ఆము. 4.35. **బొమలుముడుచు** అ.క్రి. కోపాన్ని సూచిస్తూ కనుబొమల్ని ముడివేయు. కా. 5.43.

**బొమ**[2] రూ.చూ. బొమ్మ[2]. వి. సాలభంజిక, పుత్తిక. చెన్న బసవ. 5.210.

**బొమరిలు** రూ.చూ. బొమరిల్లు. వి. బాలికలు బొమ్మల్నుంచి ఆడుకొనే చిన్న ఇల్లు. **బొమరిల్లు** రూ. బొమరిలు, బొమ్మరిలు[1], బొమ్మరిల్లు[1]. వి. బాలికలు బొమ్మల్నుంచి ఆడుకొనే చిన్న ఇల్లు. కు.సం. 3.36. <బొమ[2] + ఇల్లు.

**బొమిక** రూ. చూ. బొమ్మ. వి. ఎముక. ఆము. 6.18.

**బొమికలగోడు** వి. గోడవలె గుడారం చుట్టూ ఏర్పరచిన తెర, మొత్త.

**బొమికము** రూ.చూ. బొమిడిక. వి. 1. శిరస్త్రాణం; 2. కిరీటం.

**బొమికె** రూ.చూ. బొమ్మ. వి. ఎముక.

**బొమిడిక** రూ. బొమికము, బొమిడికము, బొమిడీకము, బొమ్మికము, బొమ్మిడికము, బొమ్మిడీకము. వి. 1. కిరీటం. రం.రా. సుందర. 266 పు. 6 పం.; 2. శిరస్త్రాణం. రం.రా.ఉ. 14 పు. 10 పం.

**బొమిడికము** రూ.చూ. బొమిడిక వి. 1. శిరస్త్రాణం; 2. కిరీటం.

**బొమిడికె** వి. రెండు పాతబట్టలు కలిపి కుట్టినది.

**బొమిడీకము** రూ.చూ. బొమిడిక. వి. 1. శిరస్త్రాణం; 2. కిరీటం.

**బొమ్మ** రూ. బొమిక, బొమికె. వి. ఎముక. సిం.ద్వా. 1.270.

గోం. బొకా, బూలా. ఎముక; పర్జి. బూల. ఎముక; కొలా. బొక్క, ఎముక; నా. బొక్క. ఎముక; పో.చూ.క. యూళె.

**బొంపుకము** చూ. బొమిడికె. వి. రెండు పాతబట్టలు కలిపి కుట్టడం.

**బొంబసు** రూ.చూ. బొంబాసు. వి. రోటి వంటి ఫిరంగి.

**బొంబాయి**[1] వి. 1. కరసనాయిలు కోడే గొట్టం; 2. నీటిని వెలువరించే గొట్టం, కుళాయి; 3. పడవలు నిలిపే పెద్ద తొట్టి కట్టు.

పో. బొంబా. నీటికుళాయి; స్పా. బొంబా-కొళాయి; ఫ్రెం. పాంప్. కుళాయి, బోంబ్. బాంబు; డచ్చి. పొంప్; ఇం. పంప్.

<పో. బొంబా.

**బొంబాయి**[2] వి. గుజరాతు రాష్ట్ర రాజధానీ నగరం.

ఇం. *Bombay*. గుజరాతు రాష్ట్ర రాజధాని.

<ఇం. Bombay.

**బొంబాయికిచడీ** వి. బొంబాయికి ఎగుమతి అయ్యే సన్న ధాన్యం. **బొంబాయిజొన్న** వి. షోలాపూరు నుంచి దిగుమతి అయిన ఒకరకం జొన్న.

**బొంబాస** రూ.చూ. బొంబాసు. వి. రోలు లాంటి ఫిరంగి.

**బొంబాసు** రూ. బంబాన, బంబాను, బొంబసు, బొంబాన. వి. రోలు లాంటి ఫిరంగి.

పో. బొంబా. బాంబు, బొంబాష్; స్పా. బోంబాసి. ఫిరంగి; ఇం. *bomb*.

<పో. బొంబాష్.

**బొంబు** వి. వెదురు బొంగు.

ఇం. *bamboo*. వెదురు.

<ఇం. bamboo.

**బొమ్మ**[1] రూ.భే. బొమ[1]. వి. కనుబొమ. భాగ. 10 ఉ. 265. **బొమ్మజంకెనలు** వి.బ.వ. కనుబొమలతో చేసే బెదిరింపులు. శాకు. నం. 18.522. **బొమ్మముడి** రూ.భే. బొమముడి. వి. కనుబొమ ముడుచుకోవటం. **బొమ్మలజంకించు** స.క్రి. కనుబొమలతో భయపెట్టు. శాకు.నం. 15.15.

**బొమ్మ**[2] రూ. బొమ[2], బొమ్ము. వి. 1. పాంచాలిక, వస్త్ర దంతాదులతో చేయబడిన ఆట వస్తువు. కు.సం. 2.46; 2. బిరుదు. కవిక. 4.113; 3. అవమాన చిహ్నం; 4. రెండు లక్ష్మీల నూలు; 5. రద్దారాట్నానికి గంటం బిగించే నిలువచెక్క; 6. రద్దారాట్నం ఇరుసు తిప్పే పిడి; 7. పన్నెదంతల బిగింపుకు దారాలు కట్టిన జంత్రం నిలువకొయ్య; 8. చేతిమగ్గం పలకనూ గుండునూ కలిపి బిగించిన కొయ్య; 9. మరమగ్గం పొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క; 10. మరమగ్గం బొమ్మకు నిలువపట్టికు ఏటవాలుగా బిగించిన కర్ర; 11. మరమగ్గం పొరుగుకు మొదట బిగించిన చెక్క; 12. పర్లిరుసు నిలపటానికి పైపట్టికి బిగించిన చెక్క; 13. ఒకరకం డిజైను నేతనేసేటప్పుడు అడ్డదేలు దారాలను పైకి ఎత్తటానికి వాడే కొయ్య పనిముట్టు; 14. డాబీకుక్కను గుంజే కొయ్యవల్ల; 15. డాబీకుక్కకు, పట్టికు మధ్య జనపరేకు; 16. డాబీ నలాకని గుంజే కొయ్యపల్ల; 17. గొగ్గడి మగ్గం జంత్రంలో కిందికట్టెను, పైకట్టెను కలిపే నగిపీచెక్క; 18. పత్తి రాట్నం తిప్పటానికి కుడివైపు నిలువ కొయ్యకు బిగించిన పిడి; 19. రాట్నం ఇరుసు తిప్పే పిడి; 20. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య; 21. ఒకరకం లోహపాత్ర; 22. గిలకకు ఆధారంగా దోర్నపట్టి మీద బిగించిన కొయ్య.

క. బొంబె. బొమ్మ; తు. బొంబె. ఆట వస్తువు. బొమ్మ. ప్రతిమ: త. పొమ్మయ్, పొమ్మల్- బొమ్మ; మ. బొమ్మ. వస్త్ర దంతాదులతో చేసే ఆట వస్తువు: కుఐ. బొమ్మ- ప్రతిమ.

**బొమ్మకచ్చిక** వి. ఒకరకం దుంపమొక్క (Costus speciosus). **బొమ్మకట్టు** అ.క్రి. అవమానం చేయు. విక్ర. 1.73, వరాహ. 2.27. **బొమ్మకట్టె** వి. 1. రాట్నం అడ్డపట్టె; 2. మరమగ్గం బొమ్మకు, నిలువ పట్టికు ఏటవాలుగా బిగించిన కర్ర; 3. బండి వరాసకి ముందు వైపు వేసే ఓసికర్ర. **బొమ్మకాల** వి. రాట్నం 'బొమ్మ'లో వడిదారం తిరగటానికి చెక్కిన గాడి. **బొమ్మకొయ్య** వి. 1. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య; 2. రాట్నం ఇరుసు తిప్పే కొయ్యపిడి; 3. మరమగ్గం పొరుగుకు చివర నాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **బొమ్మగట్టు(గ(జాలు** అ.క్రి. మించగలుగు. రాజులు జయించినందుకు సూచనగా బొమ్మలు కట్టటం అనే అలవాటుపై వచ్చిన పలుకుబడి. మను. 5.88. **బొమ్మచీర** వి. పొత్తి. **బొమ్మచెక్క** వి. 1. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువ కొయ్య; 2. మరమగ్గం పొరుగుకు చివరనాడె బయటికి పోకుండా ఆపటానికి బిగించిన కొయ్యచెక్క. **బొమ్మంచు** వి. 1. డాబీ మగ్గం మీద డిజైను నేసిన అంచు; 2. తెల్ల చీరకు పెట్టిన ఎర్రంచు. <బొమ్మ[2]+అంచు[3]. **బొమ్మంచుచీర** వి. ఎర్రంచు తెల్లచీర. **బొమ్మంచుమోవి** వి. ఎఱ్ఱని మోవి. శాకు.నం. 15.117. **బొమ్మంచులు** విశే.బ.వ. 1. అంచుల్లో బొమ్మలు చిత్రించబడ్డవి. ఉ.హరివం. 4.19; 2. ఎర్రనివి. ఉ. రా. 7.44. వి. బ. వ. చిత్రవర్ణ వస్త్ర భేదం. ఆం. భా. 2.164. **బొమ్మంచు వన్నియలు** వి. బ. వ. స్త్రీలు ధరించే ఒకరకం ఎరుపు రంగు చీరలు. ధనా. 3.38. **బొమ్మతల** వి. నిలువ కొమ్ము లున్న తల. **బొమ్మపట్టె** వి. 1. రాట్నం అడ్డపట్టె; 2. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువ కొయ్య; 3. రద్దా రాట్నానికి గంటం బిగించే నిలువచెక్క; 4. మరమగ్గం బొమ్మకు, నిలువపట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **బొమ్మపీట** వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య. **బొమ్మపీఁట** వి. పిల్లలాడుకొనే బొమ్మలుంచే చిన్నపీట. భాగ. 8.275. **బొమ్మపెట్టు** అ.క్రి. పెక్కరించు. **బొమ్మపెండిలి** రూ.భే. బొమ్మపెండ్లి. వి. బొమ్మపెళ్ళిళ్ళు, బాలికాక్రీడా విశేషం. హర. 4.11. **బొమ్మపెండ్లి** రూ. బొమ్మపెండిలి. వి. బొమ్మలపెళ్ళి. బాలికా క్రీడా విశేషం, బొమ్మల్ని పెళ్ళికూతురు, పెళ్ళికొడుకుగా చేసి ఆడుకొనే ఆట. కు.సం. 8.36. **బొమ్మపేటంచు** వి. ఒకరకం డిజైనులో నేసిన అంచు. **బొమ్మపైరు** వి. విత్తులు చల్లిన పదిరోజులకు మొలక లెత్తి బాక్కు పచ్చగా కనబడే పైరు. **బొమ్మప్ప** వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య. <బొమ్మ[2]+అప్ప. **బొమ్మబద్ద** వి. మరమగ్గం బొమ్మకు, నిలువ పట్టెకు ఏటవాలుగా బిగించిన కర్ర. **బొమ్మబల్ల** వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య. **బొమ్మమెట్టు** అ.క్రి. గెలుచు. గౌ.హరి. 2.397 పం. **బొమ్మరాయి** రూ.భే. బొమ్మఱాయి. వి. గులకరాయి. **బొమ్మరిండులు** రూ.భే. బొమ్మరిండ్లు. వి. 1. ఆడపిల్లలు బొమ్మలుంచుకొని ఆడుకొనే ఇల్లు. వాల్మీ. 1.62; 2. బాలికా క్రీడా విశేషం. **బొమ్మరిండ్లగురుగులు** వి.బ.వ. పిల్లలు గుజ్జనగూళ్ళు వండుకొనేందుకు చేసే చిన్నచిన్న మట్టి పాత్రలు. **బొమ్మరిండ్లు** రూ. బొమ్మరిండులు. వి. 1. ఆడపిల్లలు బొమ్మలుంచుకొని ఆడుకొనే ఇల్లు. వరాహ. 6.7; 2. బాలికా క్రీడా విశేషం. **బొమ్మరిలు**[1] రూ.భే. బొమరిల్లు. వి. 1. ఆడపిల్లలు బొమ్మలుంచుకొని ఆడుకొనే చిన్న ఇల్లు. వసు. 3.30; 2. బాలికా క్రీడావిశేషం. హంస. 5.155. **బొమ్మరిల్లు**[1] రూ. బొమరిల్లు. వి. 1. ఆడపిల్లలు బొమ్మ లుంచుకొని ఆడుకొనే ఇల్లు. భాగ. 8.275; 2. బాలికా క్రీడా విశేషం. **బొమ్మఱాయి** రూ. బొమ్మరాయి. వి.బొ. శిలా విశేషం, ఒకరకం శిల. వరాహ. 10.65. **బొమ్మలకట్టె** వి. గొంగడి మగ్గానికి వేసిన జంత్రంలో పైకట్టె. **బొమ్మలకొయ్య** వి. రద్దా రాట్నానికి గంటం బిగించే నిలువచెక్క. **బొమ్మల(గట్టు (-కట్టు)** అ. క్రి. అవమానంచేయు. బొమ్మల

పీట వి. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువుకొయ్య. బొమ్మలపెండెము వి. ఓడింపబడిన వారి బొమ్మల్నికూర్చి చేసిన కాలి అందె. శాశ్ల.నం. 18.436. బొమ్మలపెండ్లి వి. బొమ్మలపెళ్ళి, బాలక్రీడా విశేషం. భాగ. 10పూ. 1688. బొమ్మల(బెట్టు(-పెట్టు) అ.క్రి. అవమానం చేయు. వరాహ.10.65.<బొమ్మ[2]+-లు+-అ[7]+పెట్టు. బొమ్మలాట వి. పాంచాలకేళి, తోలుబొమ్మలతో ఆడే ఆట.<బొమ్మ[2]+-లు+ఆట. బొమ్మలాంతరు వి. ఏబొమ్మా లేకుండా పరచిన ముక్కలుండటం. బొమ్మలించు స.క్రి గెట్టించిన కుండల్ని అడుగు భాగం పైకివచ్చేట్లు ఒకదానిపై ఒకటి పేర్చు.<బొమ్మ[2]+-లు+-ఇంచు[3]. బొమ్మల్లావడు అ.క్రి. బోర్లాపడు. బొమ్మవెట్టు(-పెట్టు) అ.క్రి. అవమానం చేయు, వంకపెట్టు. కువ.చ. 5.45.

బొమ్మ[3] రూ.చూ. బొమ్మ(డు. వి. 1. సృష్టికర్త. కకుత్స. 1.36; 2. బ్రాహ్మణుడు. నీలా. 3.3.

బొమ్మగ్రుడ్డు వి. బ్రహ్మాండం. వేమ. 3.217. బొమ్మచుక్క వి. అభిజిన్నక్షత్రం. బొమ్మజెముడు(-చెముడు) వి. సింహుండం, ఒకజాతి చెముడు. బొమ్మదేవర వి. కపిలగద్దె ముందు బొమ్మచేసి పూజచేసే దేవత. బొమ్మవమ్రి వి. మందుల్లో ఉపయోగపడే ఒకరకం మొక్క (Clerodendron serratum). బొమ్మపావట వి. మెరిసే ఆకులు కలిగిన ఒకమొక్క (Webera corymbosa). బొమ్మమ్రి వి. ఊడలుండని నిరుపయోగమైన కలప కలిగిన ఒకరకం చెట్టు (Ficus cunia). బొమ్మమేడి రూ. బమ్మమేడి. బ్రమ్మమేడి, బ్రహ్మమేడి. వి. ఊడలులేని నిరుపయోగమైన కలప కల ఒకరకం చెట్టు. ఆం.శా. 2.42 (Ficus hispida). బొమ్మరక్కసి రూ.చూ. బొమ్మరాకాసి. వి. బ్రాహ్మణుడై దుష్టకర్మలచే రాక్షసుడైనవాడు. చెన్నబసవ. 4.202. బొమ్మరాకాసి రూ. బొమ్మరక్కసి. వి. బ్రాహ్మణుడై దుష్టకర్మలచే రాక్షసుడైనవాడు. గౌ.హరి. 5.16.
సం. బ్రహ్మరక్షస్; ప్రా. బమ్హరక్ఖ-.<ప్రా. బమ్హరక్ఖ-.
బొమ్మరిక్క వి. కానరాని నక్షత్రం.

బొమ్మచారి రూ.చూ. బమ్మచారి. వి. బ్రహ్మచారి.

బొమ్మదాయి రూ. బొమ్మిదము, బొమ్మిదాయి. వి. నేలని అంటి ఉండే మత్స్యవిశేషం, మద్గురం, ఒకరకం చేప. ఆము. 2.54.

బొమ్మ(డు రూ. బమ్మ, బమ్మ(డు, బొమ్మ[3]. వి. బ్రాహ్మణుడు. పాండు. 3.80.
సం. బ్రహ్మన్. విధాత, ఋత్విక్కు, విప్రుడు; ప్రా. బమ్హ-, బంభ-; పం. పమ్మా-; సిం. బంబ-.
<ప్రా. బమ్హ-.

బొమ్మర రూ.చూ. బమ్మర. వి. భ్రమ.
బొమ్మరపోవు అ.క్రి. భ్రమించు, కలతందగు భాన్క.రా. బాల. 684. బొమ్మరిలు[2] రూ. బొమ్మరిల్లు[2]. అ.క్రి. భ్రమించు, దొరలు. ద్వి.సా.చ. 2.36 వ. 19పం. బొమ్మరిల్లు[2] రూ.చూ. బొమ్మరిలు[2]. అ.క్రి. భ్రమించు, దొర్లు.

బొమ్మరము రూ. బొంగరము, బొంగురము. వి. 1. బొంగరం. కు.సం. 6.15.8; 2. బొంగరాలాట. విష్ణుపు. 7.202; 3. తిరగటం; వి.బ.వ. బొమ్మరములు. బాలక్రీడా విశేషం.
సం. భ్రమరక-; ప్రా. భమ్మర-. పరిభ్రమించటం; పా. భమరికా-. బొంగరం;
క. బొంగర, బొమ్మర; తు. బొగరి, బొమ్మవారి; త.మ. పంపరమ్.
<ప్రా. భమ్మర-.

బొమ్మరిలు[2] చూ. బొమ్మర.

బొమ్మరిల్లు[2] చూ. బొమ్మర.

బొమ్మళ రూ.చూ. బమ్మర. వి. భ్రమ.

బొమ్మసారి రూ.చూ. బమ్మచారి. వి. 1. వటువు, ఎనిమిదేళ్ళ బాలుడు; 2. బొమ్మల తగవు.

బొమ్హచారి రూ.చూ. బమ్మచారి. వి. వటువు. ఆం.శా. 2.176.

బొమ్మికము రూ.చూ. బొమిడిక. వి. శిరస్త్రాణం. భాన్క.రా.యు. 1056.

బొమ్మించు స.క్రి. భ్రమింపచేయు. ముకుంద. 2.208.
సం. భ్రమ్. అటూఇటూ కదులు; ప్రా. భమ్మ-. భ్రమ, భ్రాంతి.
<ప్రా. భమ్మ-. +-ఇంచు[3].
బొమ్మించువా(డు విశ. హింసించేవాడు. ముకుంద. 2.208.

బొమ్మిరపాకు వి. ఎర్రనేలల్లో ఎక్కువగా పెరిగే కలుపుమొక్క.

బొమ్మిదము రూ.చూ. బొమ్మదాయి. వి. బురదలో ఉండే ఒకరకం చేప.

బొమ్మిదాయి రూ.చూ. బొమ్మదాయి. వి. నల్లగా పాములాగా ఉండే చేప.

బొమ్మిడికము రూ.చూ. బొమిడిక. వి. కిరీటం. పద్మ. 10.29.

బొమ్మిడివాడు వి. బొమ్మిడి వాద్య విశేషం. ద.హిం.గా.సంపు. 10. గా.సం. 422. క్రి.శ. 1269.

బొమ్మిడీకము రూ.చూ. బొమిడిక. వి. 1. శిరస్త్రాణం; 2. కిరీటం.

బొమ్ము రూ.చూ. బొమ్మ[2]. వి. 1. రాట్నం పీటకు ఎడమవైపున కదురు బిగించే నిలువకొయ్య; 2. ఒద్దె బండి చక్రానికి అమర్చిన నడిమిచెక్క.

బొమ్మె వి. 1. పందెపు వయస్సు రాని కోడిపుంజు; 2. ఒకరకం చేప.

బొమ్మెర రూ.చూ. బమ్మర. వి. భ్రమ.

బొయారము రూ. బొయేరము, బొయ్యారము. వి. పొరంగం.
హిం. బూ, బోయ్. వాసన.

బొయి రూ.చూ. బొయ్య. వి. కుక్కకూత.

బొయిరోడు వి. బధిరుడు, చెవిటివాడు.
సం. బధిర-. చెవిటి; ప్రా. బహిర-.; నే. బైరో; ఒ. బహిర, బహిరా; హిం. బహిరా, బహ్రా; గు. బహిరో.
<ప్రా. బహిర-+వాడు.

బొయేరము రూ.చూ. బొయారము. వి. నేల పొరంగం.

బొయ్యారము రూ.చూ. బొయారము. వి. 1. పొరంగం; 2. గుంట.

బొయ్య రూ. బొయ్యి. వి. కుక్క కూత, ఋక్కనం. ధ్వన్యను.

బొరకి రూ.చూ. బొఱకి. వి. కన్నం.
బొరకుంకుమలు రూ.చూ. బరకుంకుమలు. వి.బ.వ. బరంపురం 1వ నెంబరు దీనికి చెందిన రకం ధాన్యం.
బొరదరాయి రూ. బుర్ద్రాయి, బొర్ద్రాయి. వి. సారె మొలను దించటానికి గుబ్బిగద్దలో పొదిగిన రంధ్రం ఉన్న రాయి.
బొరడు రూ.చూ. బఱడు. వి. చెట్టు బెరడు.
బొర్ద్రాయి రూ.చూ. బొరదరాయి. వి. సారె మొలను దించటానికి గుబ్బిగద్దలో పొదిగిన రంధ్రం ఉన్న రాయి.
బొరపొంకులు రూ.చూ. పొరాబొంకులు. వి.బ.వ. గంజాం జిల్లాలో పండించే వడ్లలో ఒకరకం.
బొరికి రూ.చూ. బురికి. వి. కుని తిరగటానికి పీలుగా నేలలో తొలిచిన గుంట.
బొరిగ రూ. బురిగి, బొరిగము, బొరిగి, బొరిగె. వి. గడ్డ పెల్లగించే గుద్దలి.
పో. బొరొగ. మట్టిని పెల్లగించే సాధన విశేషం.
<పో. బొరొగ.
బొరిగసువ్వం వి. చివర వెడల్పు పలుగున్న గడ్డపార.
బొరిగము రూ.చూ. బొరిగ. వి. గడ్డి తవ్వే సాధనం. గోకుడు పార.
బొరిగి రూ.చూ. బొరిగ. వి. కర్రకి చివర తవ్వుకోవటానికి ఇనపముక్క ఉండే సాధనం.
బొరిగె రూ.చూ. బొరిగ. వి. 1. లోతుగా ఉన్న రంధ్రం; 2. గడ్డి దోకే ఇనప సాధనం.
బొరియ రూ.చూ. బొఱియ. వి. 1. పర్వత బిలం. అచ్చ.రా. కిష్కిం. 26; 2. కలుగు. అచ్చ.రా.యు. 418: 3. గొయ్యి; 4. లోపల నీరింకిపోయి ఎండిన నారికేళపు బొండెం.
బొరుగులు రూ. బొరువులు. వి.బ.వ. 1. వేపుడులు. వాల్మీ. 2.126; 2. వేపుడు యవలు, ఒకరకం వేపుడు బియ్యం. ఆం.భా. 2.253; 3. మొరమరాలు, మురీలు.
క. పురి. నిప్పుమీద వేచు, కాల్చు. బురుగలు బురలు. వేచిన బియ్యం మొ.వి; తు. పుర్కుని-. సగం కాల్చు. పుర్కాపుని-. నివురు గప్పిన నిప్పులో కాల్చు. పొరియుని-. కాల్చు. వేచు, పొరిపుని-. వేచు; త. పొరి (-వ్-, -న్ట్-). వేచిన ధాన్యం మొ.వి ఎండ బెట్టినవి, కాల్చినవి. పొరియల్-. వేచు, వేచిన ఆహార పదార్థాలు; మ. పొరి. వేచిన, కాల్చిన, పొరియక-. వేచిన, కాల్చిన, పొరిక్క. కాల్చు.\ శేచు; కో. పొయిర్ (poyr). వేచిన ధాన్యం మొ.వి; గోం. పొర్-పొర్ (pōr-pōr aiārā). గింజలు విడివిడిగా ఉండేంత దాగా వేచు; కుఇ. ప్రొంద. వెలుగు, రగులు; కొలా. పొయ్. పొయ్యి, చలి కాచుకొనే నిప్పుగూడు. పొనిర్-. వేచు; నా. పొయ్. పొయ్యి, నిప్పుగూడు; కురు. పొర్చ్. తగినంతగా వేచని ధాన్యం మొ.వి.
బొరుగువడ్లు వి.బ.వ. సన్నరకం వడ్లు.
బొరువులు రూ.చూ. బొరుగులు. వి.బ.వ. 1. వేపుడులు: 2. ఒకరకం వేపుడు బియ్యం.
బొరుసు[1] వి. 1. కంతి, గడువ. వైజ. 3.70; 2. నాణేలు మొ. వాటి పీవ చివ్వు: 3. గరుకుదనం; 4. నాణేనికి బొమ్మలేని పక్క; 5. మినప్పప్పు మొ. వాటిని నురుగు వచ్చేటట్లుగా రుబ్బింది.
బొరుసు[2] వి. వేపుడు చట్టి.
హిం. బొర్సి. నిప్పుంచే పాత్ర.
<హిం. బోర్సీ.
బొరెం వి. వామి కట్టుబడిలో మధ్యభాగం.
హిం. బొరో. ఒకరకమైన ముతక ధాన్యం.
బొర్ర రూ.చూ. బొఱ్ఱ. వి. 1. పాత్రలకు చుట్టూ ఉబ్బెత్తుగా ఉండే మధ్యభాగం: 2. పావుచెక్క తొక్కినప్పుడు అచ్చు కర్రను కిందికి లాగే కర్ర.
బొర్రకుంగ వి. లావాటి కాడలున్న తుంగ (Cyperus species).
బొర్రితెగులు వి. మిరపతెగులు.
బొఱికి చూ. బొఱియ. రూ. బొరకి. వి. బొరియ, బిలం. చంద్రాంగ. 2.74.
బొఱియ రూ. బొరియ, బొఱ్ఱియ, బొఱ్ఱె. వి. 1. గోయి, గర్తం. భాగ. 8.29; 2. ఎండిన కొబ్బరికాయ పై పెచ్చు, కొబ్బరి డొక్క. ఆము. 1.80; 3. కలుగు, కన్నం. అష్టమ.క. 1.45 పు. 5 పం.: 4. బిలం, రంధ్రం. అచ్చ. రా.కిష్కిం. 26; 5. పుట్ట.
క. పొర్-. కన్నం; త. పొత్తై. చెట్టు తొర్ర, కన్నం, పొర్-. చెట్టు తొర్ర; తొ. పిర్. చెట్టు తొర్ర; కొం. బొ్ఱో-. కన్నం.
బొరియకామపు వి. వాల్మీ. అచ్చ.రా.యు. 2. బొరియచూలి వి. వాల్మీకి. అచ్చ.రా.అయోధ్యా. 116.
బొఱ్ఱ చూ. బొజ్జ. రూ. బొర్ర. వి. బొజ్జ, కడుపు. సీలా. 2.66.
బొఱ్ఱజట్టి వి. ఒకజాతి పక్షి. బొఱ్ఱవాఁడు విశే. పొట్ట కలవాడు.
బొఱ్ఱియ రూ.చూ. బొఱియ. వి. 1. గొయ్యి: 2. కన్నం, కలుగు.
బొఱ్ఱె రూ.చూ. బొఱియ. వి. కన్నం. ఆం.భా. 1.145.
బొలవాయి వి. బెహరా చెప్పినట్లు వినేవాడు.
హిం. బోల్. వచనం, వాక్కు, మాట, కథనం.
<హిం. బోల్ + వాయి.
బొలుసు రూ.చూ. బలుసు. వి. ముళ్ళు కలిగి కంచెల కుపయోగ పడే, తెల్లని పూలు పూసే ఒకరకం చెట్టు, గాంగేరుకం. (Canthium parviflorum).
బొల్లఁడు వి. వాహన విశేషం. వాల్మీ. 1.74.
బొల్లాపటి వి. నాట్య బంధన విశేషం. పండి.చ. 5.373.
బొల్లావు చూ. బొల్లి.
బొల్లావుపోట్లాట చూ. బొల్లి.
బొల్లి వి. 1. చర్మవ్యాధి విశేషం. పల్నా. పు. 7; 2. వడుగుకు గంజి పెట్టేటప్పుడు గంజి అంటకుండా అక్కడక్కడ మిగిలిన వడుగుభాగం; 3. మొగం తెల్లగాను ఒళ్ళు వేరే రంగులోనూ ఉన్నఆవు మొ.వి; విశే. తెల్లనిది. భోజ. 4.170.

క. బొల్లి.

బొల్లావు వి. తెల్లమచ్చలున్న ఆవు. <బొల్లి+ఆవు. బొల్లావుపోట్లాట వి. గట్టిపోట్లాట. బొల్లికొమ్ము వి. వెనక్కి వంగిన కొమ్ము. బొల్లికోడి వి. ఒకజాతి నీటిపిట్ట. హంస. 3.12. బొల్లిగద్ద వి. గరుడపక్షి. బొల్లిగుర్రె వి. ముఖం తెల్లగా ఉన్నగుర్రె. బొల్లిచవుడు వి. తెల్లగాఉండి నిస్సారమైన ఉప్పు చవుడు. బొల్లితనము వి. 1. చిన్నతనం, అవమానం. భార. కర్ణ. 1.141 ; 2. శరీరంలోని తెలుపు, శోప. బొల్లితెగులు వి. ఆకుల కొనలు తెల్లబడిపోయే వరి తెగులు. బొల్లినెమ్మొగముపిట్ట వి. గరుత్మంతుడు. ఆం.భా. 1.53. బొల్లిపులుగు వి. గరుత్మంతుడు. సుదంశా. 5.60. బొల్లిపూన రూ. బొల్లిబూన. వి. ఇంద్రవల్లి, పెద్దపాపర. బొల్లిబూన (-పూన) రూ.చూ. బొల్లిపూన. వి. గరువనేలల్లో మొలిచి నేలపై పాకే ఒకరకం కలుషమొక్క. (Citrullus colocynthis). బొల్లిబూసం వి. అర్ధచంద్రిక, చిత్రవర్ణి. బొల్లిముచ్చెలు వి.బ.వ. ఒకరకం మోటువడ్లు. బొల్లిముత్యాలు వి.బ.వ. గుండ్రటి తెల్లటి వడ్లు. బొల్లిమొకముమెకము వి. ఎలుగుబంటి. ప్రబంధ. 186. బొల్లిమోరమెకము వి. ఎలుగుబంటి. బొల్లూత వి. పశురోగ విశేషం. నవనాథ. 1.30పు. 21పం. <బొల్లి+ఊత.

బొల్లు[1] చూ. పొల్లు. అ.క్రి. అసత్యమాడు. సర్వ. సా.సం. 1.9 ; వి. అసత్యం.

సం. వదాల-, బోల్లక-. గొప్పవక్త, దేశ్యమనికొందరు; ప్రా. బోల్లా-. వార్త, బోల్లావియ. కథితం, బోల్లిఅ-. చెప్పబడిన, ఉక్తి, బోల్ల-. చెప్పు, వచించు; అప. బోల్లణఅ-. భాషణీల.

బొల్లుమేఘం వి. తెల్లమబ్బు. బొల్లులమారి వి. అబద్ధాలు చెప్పే వాడు.

బొల్లు[2] రూ.చూ. బోలు. వి. పదుగులో పైపోగులకు కింది పోగులకు మధ్యవెలితి.

బొల్లూత చూ. బొల్లి.

బొల్సు రూ.చూ. బలుసు. వి. బంజరునేలల్లో పొదగా పెరిగే ముళ్ళకంచె మొక్క.

బొల్సుకంప రూ.చూ. బలుసుకంప. వి. ఆము కాల్చుకు వాడే బలుసుచెట్టుకంప.

బొళ రూ.చూ. బల్ల[1]. వి. 1. తూము, నాలుగు కుంచాల కొలమానం, ద్రోణం: 2. దారుఫలకం, కూర్చోవటానికి కాళ్ళు అమర్చిన ఎత్తుపలక; 3. గుంటక గుజ్జుమూతి చుట్టూ వేసిన జనపకట్టు.

బొళుకు యా. బొళుక్కు. వి. కక్కటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం.

బొళుకుబొలుకు వి. కక్కటం మొ. వాటిలో అయ్యేధ్వనికి అనుకరణం. రామాభ్యు. 7.115.

బొళుక్కు యా.చూ. బొళుకు. వి. కక్కటం మొ. వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం.

బొళ్ల చూ. బోలు[1]. వి. పటోలికా, పొట్లకాయ ; విణ. ఉత్తది, బోలు.

బొళ్ళపాయ వి. కల్లుత్రాగే తాటాకు మొ. వాటిపాయ.

బొళ్ళు వి.బ.వ. 1. వదులు వదులుగా ఉండేవి ; 2. లోపల ఖాళీగా ఉండటం.

<బోలు[1]+-లు.

బొవావటిక చూ. బొవాని.

బొవాని రూ.చూ. భగోణి. వి. మూతివెడల్పుగా లోతుతక్కువగా ఉండే మట్టిపాత్ర.

బొవావటిక రూ.చూ. బగోనటిక. వి. మూతివెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర. బొవానిగిన్నె రూ.చూ. బగవాని గిన్నె. వి. మూతివెడల్పుగా లోతు తక్కువగాకి ఉండే మట్టిపాత్ర.

బొసబొస వి. (వెళ్ళటం) రావటం (పైకి) లో అయ్యేధ్వనికి అనుకరణం. ఉ.రా. 4.291.

బొసిక రూ. బొసుకు. వి. టెంకాయ మొ. వాటిపైతోలు.

బొసుక విణ. బలిసినవాడు. జైమినిభా. 8.98.

బొసుకు రూ.చూ. బొసిక. వి. 1. లోపల సారంలేనికాయ; 2. సిగ్గు, లజ్జ.

బోకరించుకొను చూ. బూకరించు. స.క్రి. (వ్యంగ్యంగా) అనుభవించు.

బోకాంచె చూ. బోకు. వి. మట్టి పాత్రలమీద పూజలు, గీతలు వేయటానికి వాడే చిన్నపెంకుముక్క.

బోకి రూ.చూ. బోకు. వి. 1. భుజించేగిన్నె ; 2. కుండపెంకు; 3. వెధవ; 4. ఆటలలో ఓడిపోవటం ; 5. మట్టిపాత్ర: 6. బొచ్చె: 7. గవాక్షిమీద బోర్లించే విశాలమైన మట్టి పాత్ర ; 8. ఉన్నినూలు కూర్చొని వడికేటప్పుడు కుండ పెంకు మీద కుదురు పెట్టి తిప్పేది; 9. నేతనేసేటప్పుడు గొంగడి ముందు భాగం తడపటానికి అంబలి పోసిన ముంత.

బోకిపెంచికలు వి.బ.వ. ఆములో కుండలు పేర్చేటప్పుడు కుండలపైనా కిందా పెట్టే పగిలిన చిన్న పెంకులు.

బోకు రూ. బేకు[2] బోకి, బోకె. విణ. 1. పనికిమాలినవాడు, పోరంబోకు; 2. ప్రయోజన రహితమైనది; 3. ఆములో కుండలు పేర్చేటప్పుడు కుండలపైనా కిందా పెట్టేపగిలిన చిన్నపెంకు.

క. బోక.ప్రిక్షాటనకు ఉపయోగించే చిప్ప, కుండపెంకు.

బోకె రూ.చూ. బోకు. వి. పగిలిన కడవముక్క.

బోక్కెణము చూ. బొక్కెన. రూ. బోక్కాణము. వి. నీళ్ళు పోసే బొక్కెన.

బోక్కాణము రూ.చూ. బోక్కణము. వి. నీళ్ళుపోసే బొక్కెన.

బోగపుచేడియ చూ. బోగము[2].

బోగబందా వి. స్వాధీనపు తనఖా.

హిం. భోగ్‌బందక్. ఒకవిధమైన తనఖా.

<హిం. భోగ్‌బందక్.

బోగమాట చూ. బోగము2.

బోగము[1] వి 1. స్వామివారి నైవేద్యం ; 2. కారుపంట; 3. జొన్న కళ్ళంలో గింజలతో కలిసిఉన్న కంకుల పొట్టు.

సం. భోగ-. తినటం, తిండి, నైవేద్యం, అనుభవం, ఆనందం ; ప్రా. భోఅ-. అనుభవం, ఆనందం, అద్దె, తిండి: పా. భోగ-. ఆనందం, సంపద ; పం. భోఅ.

దూదిపోగు చేసేవాడి వాటా.

<సం. భోగ- + -ము.

**భోగము**[2] వి. 1. క్రయం. యయా. 4.75; 2. వేశ్యాజాతి. పల్నా. 70. వేంక. 36, సాంబ.మాన. 13; 3. సౌఖ్యం హంస. 5.116; 4. భోగముది. ఆం. భా. 2.110; 5. లంజకచ్చే వెల.

సం. భోగ-. అనుభవం, ఆనందం; ప్రా. భోగ-. విషయసేవ, కామచేష్ట, విషయసుఖం; పా. భోగ-; క. బోగ; మ. పోకటం.

<ప్రా. భోగ-.

**భోగపుచేడియ** వి. వేశ్య. **భోగమాట** వి. వేశ్యానృత్యం, భోగందాని ఆట <భోగము2+ఆట. **భోగముది** విణ. వెలయాలు, వేశ్య. శ్రీనాథుని చాటువు. 39. **భోగములేమ** వి. వేశ్య. వేంక. ఆం. 34.

**భోగరతల** వి. చక్కగా వెనక్కు వాలినకొమ్ములున్న తల.

క. బోగాఱ. కమ్మరి.

**భోగరపన్ను** వి. లోహకారులపై విధింపబడే పన్ను. ద.హిం.గా. సంపు. 4 గా.సం. 972.

క. బోగాఱ. కమ్మరి, లోహకారుడు.

<క. భోగాఱ + పన్ను.

**భోగరి** చూ. భోగు.

**భోగవృత్తి** వి. అంగాంగాది భోగాలకు దేవరకిచ్చిన మాన్యం. నె.గా. దర్శి. 10.

సం. భోగవృత్తి-. నైవేద్యానికి ఇవ్వటం.

<సం. భోగవృత్తి-.

**భోగాటము** రూ. భోగాతము. వి. గొప్ప బరాటా.

సం. భోగాఢ-. ఆనందాన్ని కలిగించేది.

<సం. భోగాట-.

**భోగాణి** రూ.చూ. భగోణి. వి. వెడల్పయిన పాత్ర.

**భోగాతము** రూ.చూ. భోగాటము. వి. గొప్ప బరాటా.

**భోగి**[1] వి. సంక్రాంతి పండక్కు ముందు రోజు.

సం. భోగిన్. భోగం కలది. ఆనందం కలది.

<సం. భోగిన్.

**భోగి**[2] వి. భోగంకల వ్యక్తి. యయా. 4.130.

సం. భోగిన్. భోగాసక్తుడు, భోగి; ప్రా. భోగి, భోఇ; పా. భోగి;

క.మ. భోగి.

<ప్రా. భోగి.

**భోగించు** చూ. భోగు.

**భోగియుచు** చూ. భోగు.

**భోగిణి** రూ.చూ. భగోణి. వి. ఒకరకం గిన్నె.

**భోగు** వి. పూనిక, అభినివేశం. ఉ.హరి. 4.66.

సం. భోగ-. అనుభవించటం, ఆనందించటం, కలిగి ఉండటం.

<సం. భోగ-.

**భోగరి** వి. పూనిక ఉన్నవాడు, అభినివేశం ఉన్నవాడు. నవనాథ. 1.30 వ. 11 పం. <భోగు + అరి. **భోగించు** అ.క్రి. కాయ్య ఎండకు ఎండి వానకు తడిసి మెత్తబడిపోవు. **భోగియుచు** అ.క్రి. కాయ్య ఎండకు ఎండి వానకు తడిసి మెత్తబడిపోవు. **భోగుబడి** వి. 1. తేరతిండిగాడు, అనాయాసంగా మరిగిన కూడు తిని బతికేవాడు. ఉ.హరి. 4.160; 2. కుటుంబ బాధ్యతలు పట్టించుకోకుండా ఉండేవాడు. **భోగుబడి. పెద్దతికము** వి. ఎక్కువ ధనాన్ని వెచ్చించి పొందే పెద్దరికం. ఉ.హరి. 4.160. **భోగుబడిసేద్యం** వి. ఆసక్తిలేని వ్యవసాయం. **భోగుమిగులఁగన్** క్రి.విణ.ద్రు. నిర్విశేషంగా, పూర్తిగా. నీలా. 1.65.

**భోగ్గం** రూ.చూ. భోగ్యం. వి. భూకామందుకు ముందుగా డబ్బిచ్చి కౌలుకు చేసే వ్యవసాయం.

**భోఁకి** చూ. భోకు. వి. 1. ఒకవిధమైన తలపుర్రె, కరోటిభేదం. ఆం.భా. 2.133; 2. జలకడుగుదోనె; 3. చెడినపాత్ర, కుత్సితపాత్ర.

**భోఁకె** వి. ఎముక, అస్థి.

**భోచి** చూ. బూచి. రూ. భోసి[2]. వి. సాలెగూడు.

**భోజ** రూ.చూ. భోదె[1]. వి. 1. రాతిస్తంభాలకింద ఆధారంగానూ అలంకారంగానూ పెట్టే మలిచిన రాతిపీట; 2. మొగరం మీద దూలం కిందుగా పెట్టిన పీట; 3. నిలవబెట్టబడిన రాతి ముందుభాగం లేదా వెనుకభాగం.

**భోజలకాడి** వి. నాగలి, గుంటక, గొర్రు మొ. వాటికి కట్టే ఒకరకం కాడి.

**భోజీకుండలు** వి.బ.వ. పెళ్ళికి ఒకరోజు ముందుగా మేళతాళాలతో వెళ్ళి తెచ్చుకొనే మట్టి వంటపాత్రలు.

హిం. భోజీ. తినేవాడు.

<హిం. భోజీ + కుండ + -లు.

**భోజు**[1] రూ.చూ. భోద[1]. వి. 1. సౌకుమార్యం, గోము. ద్వి. సార.చ.1. 3వ. 8పం.; 2. మంచి అభిమానంతో చూడటం.

**భోజుబొగ్గులవటం** వి. భోజు నాశనం కావటం.

**భోజు**[2] రూ.చూ. భోదె[1]. వి. వామికట్టుబడిలో నడిమిభాగం.

**భోజు**[3] వి. కుండ అంచు.

**భోజుపీట** వి. కొయ్యస్తంభాలమీద నిలిపే చెక్కన కొయ్యదిమ్మ.

**భోజెరకొయ్య** వి. దంతెకెదురు తిరగటానికి పాటినకొయ్య.

**భోంచె** రూ.చూ. బావంచి. వి. కారుగచ్చ, సోమవల్లిక.

**భోంచేయు** రూ.చూ. భోచేయు. స.క్రి. భుజించు, తిను.

**భోటి**[1] రూ.చూ. భోఁటి[1]. వి. 1. ఆడుది. శృం.నై. 4.99; 2. చెలికత్తె. విక్ర. 4.

**భోటికత్తియ** రూ.చూ. భోఁటికత్తె. వి. చెలికత్తె. శృం.నై. 3.123. **భోటికత్తె** రూ.చూ. భోఁటికత్తె. వి. చెలికత్తె. కవిరా. 2.19. **భోటిగాఁడు(-కాఁడు)** వి. 1. స్నేహితుడు; 2. సమానుడు. **భోటితనము** వి. పట్టినది తగినట్టు నెరవేర్చటం, నైపుణి. **భోటికాళ్లు** వి.బ.వ. బాలక్రీడా విశేషం.

**భోటి**[2] రూ. బొట్టు[2], భోటు[2]. వి. బట్టీ గోడలు పక్కలకు వాలిపోకుండా పోటీగా కట్టిన చిన్నగోడ.

**భోటు**[1] విణ. 1. ప్రౌఢుడు, ఘనుడు, గొప్పవాడు. ఉ.హరి. 2.171; 2. ధూర్తుడు.

పో.మా.సం. ప్రౌఢ-. ప్రౌఢుడు, దిట్టమైనవాడు.

**భోటుకొమ్ము** వి. ఒకటి ముందుకు ఒకటి వెనక్కు తిరిగి ఉండే కొమ్ము. **భోటుదనము(-తనము)** వి. ధూర్తత్వం. కాశ.

7.221. బోటువా(డు విణ. ఘనుడు, గొప్పవాడు.

**బోటు**[2] రూ.చూ. బోటి[2]. వి. 1. కుండ మొ. వాటిలో ఉబ్బుగా ఉండే బోటు; 2. ఏదైనా వస్తువు కిందపడకుండా పెట్టిన ఆధారం; 3. దే చెక్క ఇనపకడ్డీని బిగించటానికి పెట్టిన ఒరలచుట్టు; 4. బట్టీగోడలు పక్కలకు వాలిపోకుండా పొటిగా కట్టిన చిన్న గోడ; 5. గోడ కట్టేటప్పుడు చివరలు లోపల కుండేటట్లు పెట్టిన రాయి; 6. ఆము పెట్టేటప్పుడు వెనక వదిలిన ఖాళీస్థలం; 7. రాట్నంమీద జొన్నదంటు ముక్కను చుట్టిన నూలు; 8. నిండు కండెలో కొంతదారం ఉపయోగించుకోగా మిగిలింది; 9. చిన్నకండె; 10. రాట్నం మీద వడికిన నూలు; 11. నవారు నేతలో వాడే పేక దారం చుట్టు.

**బోటుచెక్క** అ.క్రి. నాడెముల్లుకు పేకదారం కండె గుచ్చు. **బోటుసీల(-చీల)** వి. కూచిగా చెక్క గుంజమీద ఏటవాలుగా నాటి పీటలాగే వాడే కొయ్యముక్క. **బోటెత్తు** అ.క్రి. ఉబ్బుగా ఉండు. కాశీ. 3.138. <బోటు2+ఎత్తు[1]. **బోటొగ్గు** అ.క్రి. తన్ను. గోడనానించు.<బోటు[2]+ఒగ్గు. **బోట్లకొట్టి** వి. పేకదారం కండెలు వేసుకొనే తొట్టి. **బోట్లపింజెర** వి. ఒక రకం డాబీ. **బోట్లరాటం** వి. పేకకు పనికివచ్చే దారపుకండెలు చుట్టే రాట్నం. **బోట్లిచ్చు** అ.క్రి. తాడు మొ. వాటితో గట్టిగా కట్టు. **బోట్లు** వి.బ.వ. 1. మరమగ్గం చట్రం బిగించిన పలకలు; 2. ఆములో ఆవిరిపైకి పోవటానికి రేపులకు మధ్య ఏర్పడే సందులు.

**బోటు**[3] వి. పడవ.

ఇం. *Boat*. పడవ.

<ఇం. Boat.

**బోటు**[4] రూ.చూ. బోదు[1]. వి. 1. గడ్డ లేక ముద్ద; 2. పెద్ద పిండి ముద్ద; 3. ఎద్దు నోటికి అమరేంతటి తెలకపిండి ముక్క; 4. మేక పేడు; 5. నేరుగా నిట్రంగా పెరిగిన కొండరాయి; 6. ఎత్తగుట.

**బోట్లడ్డ** వి. బోట్ల పింజెర మధ్య అమర్చిన కొయ్య గుండు.

**బోటుక** వి. పిచ్చ (పిక్క) తీయని చింతపండు.

**బోటెత్తు** చూ. బోటు[2].

**బోటొగ్గు** చూ. బోటు[2].

**బోట్లడ్డ** చూ. బోటు[4].

**బోట్లకొట్టి** చూ. బోటు[2].

**బోట్లపింజెర** చూ. బోటు[2].

**బోట్లరాటం** చూ. బోటు[2].

**బోట్లిచ్చు** చూ. బోటు[2].

**బోట్లు** చూ. బోటు[2].

**బోడ** రూ. బోడి. బోదు[2]. వి. 1. సన్యాసి. కు.సం. 12.219; 2. ఇకారం గుర్తు. కావ్య.చూ. 6.59; 3 మోడు. చంద్రాంగ. 3.61; విణ. బోడిది, జుట్టు, కొమ్ములు మొ. విశేషాలు లేనిది. ఉ.హరి. 4.42.

క. బోడ, బోడా. అసలు జుట్టు లేని లేక బట్టతలగల వ్యక్తి, బోడి, బోడి. జుట్టు, కొమ్ములు మొ. వి లేనిది; తు. బోరు. బోడి, బట్ట. వెంట్రుక లూడిపోయిన, కప్పబడిన. బోళు. బోడి, జుట్టు, కొమ్ములు మొ. వి లేని, బోళి. జుట్టు తీసేయబడిన స్త్రీ, విధవరాలు; త. పొటు, బోడి, జుట్టులేని స్థితి, గుండు; కో. బోళ్. బోడి, అసలు జుట్టులేని, బొ-ళ్ ఎళ్, బొళ్మండఎళ్. పేల వలన పూర్తిగా జుట్టు కత్తిరింపబడిన వ్యక్తి; తొ. పొ-ఎళ్ (పొఱ). కత్తిరించు, తొలగించు.

**బోడకడవ** వి. సాదా అంచుతో మూడు లేకుండా చేసిన మట్టిపాత్ర. **బోడకాకర** రూ. బూడకాకర, బోడకాకి. వి. ఇది ఆదకాకర తెగకు చెందిన చెట్టు. **బోడకాకి** రూ.చూ. బోడకాకర. వి. ఇది ఆదకాకర తెగకు చెందిన చెట్టు. **బోడకుండ** వి. అంచుగల పింజలు లేకుండా సాదాగా చేసిన మట్టి పాత్ర. **బోడకువవంఅంచు** రూ.చూ. బోడకుప్పనంఅంచు. వి. ఒకరకం కుప్పదంఅంచు. **బోడకుప్పనంఅంచు** రూ. బోడకుపనంఅంచు. వి. ఒకరకం కుప్పదం అంచు. **బోడకుంబి** వి. కప్పు ఎగరకుండా దానిమీద వేసే కట్టె. **బోడకొమ్ము** రూ.చూ. బోడికొమ్ము. వి. 1. వెనక్కు వాలిన పొట్టికొమ్ము; 2. బాగా గిటకబారి మొద్దుగాఉండే కొమ్ము. **బోడకొర** రూ.చూ. బోడక్రొర. వి. ఎన్ను గుండ్రంగా ఉండి మీద పీచులుండే రకం. **బోడక్రొర** రూ. బోడకొర, బోడిక్రొర. వి. ఎన్ను గుండ్రంగా ఉండి మీద పీచులుండే రకం. **బోడకోక** వి. అంచులేని చీర. **బోడంకట్టు** వి. జంపఖానా నేతలో అర్ధంలో రెండువైపులా తెల్లపట్టెలు, మధ్యలో ఎర్రపట్టె వొప్పున పదేట్లు వరసగా నేసే నేత. **బోడచొరవ** వి. మొండి సాహసం. పాండు. 3.21. **బోడ(డు** వి. ముండితుడు, బోడివాడు. వైజ. 4.24. **బోడతనము** వి. ముండితత్వం, పూర్తిగా తల గొరిగించుకోవటం. హరి.ఉ. 9.38. **బోడతరము** రూ.చూ. బొద్దసరము. వి. మండిని, చెమ్మనేలల్లో ముఖ్యంగా వరిచేలల్లో ఏటా లేచి పెరిగే ఒకరకం కలుపు మొక్క (Sphaeranthus indicas). **బోడదాక** రూ. బోడిదాక. వి. పక్కన బొద్దు లేకుండా ఉండే మట్టిపాత్ర. **బోడవవ** రూ.చూ. బోడిపన. వి. 1. వెనక్కు వాలిన పొట్టి కొమ్ములు; 2. బాగా గిటకబారి మొద్దుగా ఉండే కొమ్ములు. **బోడబాయి** రూ. బూడబాయి. వి. నేల మట్టాన ఉండే బావి. **బోడబావి** వి. బొరువ. **బోడసరంఅంచు** వి. ఒకరకం డిజైనులో నేసిన అంచు. **బోడసరంబావు** వి. రెండు పంచెలు. **బోడసరంచీర** రూ.చూ. బొగడసరంచీర. వి. ఒకరకం అంచు పెట్టి నేసిన చీర. **బోడసరము** రూ.చూ. బొద్దసరము. వి. పైర్లలో మొలిచే ఒకజాతి చిన్నచెట్టు. **బోడసరంపేటు** వి. అంచులో నేసే ఒకరకం డిజైను. **బోడచిప్ప (-చిప్ప)** వి. గుండ్రంగా అంచు బొడిగా ఉండే మట్టిచిప్ప. **బోడపెనగలు** వి.బ.వ. గుండ్రని పెనగలు.

**బోడంచు** చూ. బోడి.

**బోడటిక** చూ.బోడి.

**బోడమ్ము** చూ. బోడి.

**బోదవరం** రూ.చూ. బొద్దసరము. వి. చెమ్మనేలల్లో ముఖ్యంగా వరిచేలల్లో ఏటా లేచి పెరిగే ఒకరకం కలుపు మొక్క (Sphaeranthus indicas).

**బోడి** రూ.చూ. బోడ. వి. 1. ముండ, విధవ. ప్రబోధ. 3.3 ; 2. సన్న్యాసి. వైజ. 4.32 ; విశే. జుట్టు, కొమ్ములు మొ. విశేషాలు లేనిది. క్రీడా. 274.

**బోదంచు** రూ. బోదెంచు. వి. 1. మూడు నాలుగు వేళ్ళ వెడల్పు నేసిన ముద్దంచు ; 2. రంగు గీరలు లేకుండా నేసిన మైనూరంచు ; 3. గుండంచు ; 4. పెద్దపాత్రలకు పెట్టే ఒకరకం అంచు. < బోడి + అంచు³. **బోదటికె** వి. మజ్జిగ చేయటానికి వాడే సాదా అంచు ఉండే మట్టిపాత్ర. < బోడి + అటికె. **బోదమ్మ** వి. బట్టగోల. < బోడి + అమ్మ¹. **బోడిఎలవరం** వి. ముళ్ళులేని గింజలున్న ఒకరకం వడ్లు. **బోడికంటం** వి. కొట్లు మొ. వాటికి గీత లేకుండా సాదాగా పెట్టే బోదదాక అంచు. **బోడికంది** వి. ఒకరకం కందులు. **బోడికప్పు** వి. గుండ్రంగా ఉన్న ఆకు కప్పు. **బోడికుచ్చెల** వి. పైన కోప లేకుండా వేసిన జొన్నగడ్డి కుప్ప. **బోడికుసుమ** వి. చెండు బోడిగా ఉండే రకం. **బోడికొమ్మ** రూ. బోదకొమ్ము. వి. 1. వెనక్కు వాలిన పొట్టికొమ్ము ; 2. బాగా గిటకబారి మొద్దుగా ఉండే కొమ్ము. **బోడిగొర్ర** రూ.చూ. బోదగొర్ర. వి. ఎన్ను గుండ్రంగా ఉండి మీద పీచులుండే రకం. **బోడిగొల్ల** వి. సమృద్ధి. రుక్మా.చ. 3.281. **బోడికోడి** వి. నాముకోడి. **బోడిగాడు** వి. ముద్దుగా పిలవటంలోని మాట. **బోడిగిత్త** వి. కొమ్ములు కురుచైన గిత్త. **బోడిగుండు** వి. బోడితల. **బోడిగోధుమ** వి. ఒకరకం గోధుమ. **బోడిచవిక** వి. పైన కప్పు లేని గ్రామ చావిడి. **బోడించు** స.క్రి. బోడిచేయు. క. బోళిసు. బోడిచేయు, కత్తిరించు, బోఱు. బోడి ; తు. బోరుని. బోళసుని, బోళిసుని. బోడిచేయు, గొరుగు. < బోడి + -ఇంచు³. **బోడిడాబా** వి. బోడి మిద్దె కప్పుమీద పిట్టగోడలు లేని మిద్దె. **బోడితలలకు బొందు మల్లెలు చుట్టు** అ.క్రి. పనికిమాలిన పనిచేయు. **బోడితలుపు** వి. సాదా తలుపు. **బోడిదాక** రూ.చూ. బోదదాక. వి. పక్కన బొద్దు లేకుండా చేసిన మట్టిపాత్ర. **బోడిదుక్కి** వి. 1. నీరు పెట్టకుండా దున్నిన దుక్కి ; 2. వర్షాధారంగల భూమి. **బోడిపన** రూ. బోదపన. వి. 1. వెనక్కు వాలిన పొట్టికొమ్ములు ; 2. బాగా గిటకబారి మొద్దుగా ఉండే కొమ్ములు. **బోడిపల్లవర్లు** వి.బ.వ. సన్నవడ్లు. **బోడి పెడందాక** వి. పక్కన బొద్దు లేకుండా చేసిన మట్టి పాత్ర. **బోడిబావి** వి. చుట్టు చేపట్టు గోడలేని బావి. **బోడిమాలె** వి. కప్పుమీద పిట్టగోడలు లేని మిద్దె. **బోడిమిటుకుళ్ళు** వి.బ.వ. గింజ గుండ్రంగా ఉండి పెసల మాదిరిగా ఉండే ధాన్యం. **బోడిమిద్దె** వి. పై అంతస్తు లేని మేడ. **బోడిమూకుడు** వి. అంచులేని మూకుడు. **బోడింపు** వి. బోడి చేయటం, ముండనం. ఆం.భా. 2.177. **బోడిరాయి కట్టుబడి** వి. చెక్కని రాళ్ళతో కట్టే పద్ధతి. **బోడివాడు** విశే. సన్న్యాసి. పాండు. 5.179.

**బోడిక** రూ.చూ. బోడిగ². వి. 1. సేవకుడు. ప్రభు. 3.83 ప. 10 పం. ; 2. మిత్రుడు, చెలికాడు. ద్వి.సార.చ. 1.3 ప. 48 పం. ; 3. బాలకుడు. ద్వి.సార.చ. 1.10 ప. 19పం. ; 4. చెలికత్తె.

**బోడిగ¹** చూ. బోడి. వి. 1. బిందె వంటి కుండ ; 2. గాజు గిన్నె.

**బోడిగ²** రూ. బోడిక. వి. కావలివాడు. ద.హిం.శా. సంపు. 6. శా.సం. 1136. క్రీ.శ. 1814.

**బోడియ** వి. ఆడుది.

క. బోడి. పళ్ళులేని స్త్రీ.

**బోడిపెం** చూ. బోడి. వి. సారాయి బట్టీలో ఒక్క బుడ్డికి పెట్టిన పెద్ద రంధ్రానికి సరిపడేటట్లు పెట్టే చిన్న మట్టిపాత్ర.

**బోదు¹** రూ. బోటు⁴. వి. 1. కొంచెం ఎత్తైన ప్రదేశం, దిబ్బ. NICP 13. క్రీ.శ. 1541 ; 2. పెద్ద పిండిముద్ద ; 3. ఎద్దు నోటికి అపురే తెలకపిండి ముక్క ; 4. మేక పేగులు ; 5. ఎత్తు గుట్ట

**బోదు²** రూ.చూ. బోద. విశే. బోదైనది, ముండితం, ముండితుడు. ఆం.భా. 2.119 ; వి. మట్టితో చేసిన లోతైన పాత్ర.

**బోదుకట్టు** వి. ద్వారాల మీద ఉన్న గోడ. **బోదుతలుపు** వి. చెక్కడపని చేయని తలుపు. **బోదెంచు** రూ.చూ. బోదంచు. వి. 1. మూడు నాలుగు వేళ్ళ వెడల్పు నేసిన ముద్దంచు ; 2. రంగు గీరలు లేకుండా నేసిన మైనూరంచు ; 3. గుండంచు. < బోదు² + అంచు³.

**బోదెంచు** చూ. బోదు².

**బోద్దెంగుంటక** చూ. బొద్దె. వి. విత్తనం వెయ్యక ముందు మొలిచిన గడ్డి పోవటానికి మెట్టలో తోలే గుంటక.

**బోణం** రూ.చూ. బోనము. వి. ధాన్యరాశి మీద ఒక చెంబు అలంకరించి పెట్టే ఆదారం.

**బోణీ** రూ. బోణిగి, బోణీ, బోని, బోనిగ, బోనీ. వి. మొట్ట మొదట సరకు అమ్మగా వచ్చిన సొమ్ము.

సం. విభాన-, విభాను-, ప్రకారం, ద్యాను ; ప్రా. అప. విహాణ-, విహాణు ; బెం. బిహాన్, బ్యాన్ ; హిం. బిహాన్ ; మరా. బోహాణీ, బోహని. ఉదయం, ప్రారంభం, మొదటి అమ్మకం ; మరా. బోహణీ.

క. బోణి. రోజు మొదట సరుకు అమ్మేటప్పుడు చేతికి వచ్చే మొటమొదటి డబ్బు.

< క. బోణి.

**బోణిగలు** వి.బ.వ. సంక్రాంతినాడు చిన్న పిల్లల తలపై పోసే రేగిపళ్ళు. **బోణిగలుపోయు** స.క్రి. సంక్రాంతి పండుగ నాడు చిన్నపిల్లను అలంకరించి కూర్చుండబెట్టి రేగు కాయలు, చెరకు పిచ్చెలు, చింబలుంటలు, రాగిపైసలు కలిపి దిష్టి తీసి హారతి ఎత్తు.

**బోణిగి** రూ.చూ. బోణి. వి. మొట్టమొదట సరుకు అమ్మగా వచ్చిన సొమ్ము.

**బోణీ** రూ.చూ. బోణి. వి. మొట్టమొదట సరకు అమ్మగా వచ్చిన సొమ్ము.

**బోండా** వి. భక్ష్యవిశేషం.

క. బోండా. భక్ష్యవిశేషం.

< క. బోండా.

**బోత్రి¹** రూ. బోత్రె¹. వి. 1. చెలికత్తె. శార.విరా. 2.80 ; 2. ఆడది. రం.రా. కిష్కిం. 198 ప. 16 పం. ; 3. దూతి.

విక్ర. 4.147.

బోఁటికత్తియ రూ.చూ. బోఁటికత్తె. వి. దూతి. రసిక. 5.164. బోఁటికత్తె రూ. బోటికత్తియ, బోటికత్తె, బోఁటి కత్తియ. వి. దూతి. దశకు. 3.73. బోఁటికొమ్మ వి. చెలికత్తె. వసు. 4.124.

బోఁటి² విఅ. సదృశార్థకం, వంటిది, వంటివాడు మొ. వి. (ఇది షష్ఠీ ద్వితీయల్లో ఒక దానితో కూడి ఉంటుంది. భార.అరణ్య. 3.321.)

బోతకడిమి వి. గృహాది. నిర్మాణాలకుపయోగపడే కలపనిచ్చే ఒకరకం చెట్టు (Stephegyne parvifolia).

బోతలు వి. సిరాబుడ్డి.

ఇం. *Bottle*. సీసా, బుడ్డి.

<ఇం. Bottle.

బోత్తెగులు చూ. బోద².

బోద¹ రూ. బోజు¹, బోదలా, బోదీ, బోదు¹, బోదులా, బోదె¹. వి. 1. పక్షి మొ. వాటి పిల్ల. కు.సం. 5.109; 2. పక్షివిశేషం. హంస. 3.12.

సం. పోత-. లేతచెట్టు లేక చిన్న జంతువు; ప్రా. పోఅ-. బాలుడు; అ.మా. పోయిగ. పసిది; పా. పోతో.

<సం. పోత-.

బోద² విఅ. ఉబ్బిన, స్థూలమైన; వి. 1. గడ్డివామి కట్టు బడిలో నడిమి భాగం; 2. ఇంటికప్పుకు పనికివచ్చే ఒక తృణవిశేషం (Cymbopogon colaratus).

తు. బొదులుని, బొదొలుని, నానావేసు; మ. పొతిర్కక. నానా చెట్టు, పూవల్. తేమ, చెమ్మ; గోం. పొద్. తడిగా ఉన్న; పొదుప్. తడిచేయు; కుర. బొర్స్‌నా. తడిసిపోవు, చెమ్మగిలు, బొధనా. నీటిలో నానబెట్టు; బ్రా. పద్దామ్. ఉబ్బు.

బోత్తెగులు రూ.చూ. బోదతెగులు. వి. వరి, నజ్జ, గోధుమ, ధనియాలు మొ. పైర్లతెగులు. బోదకాలు వి. శ్లీపదం, ఏనుగుకాలు. బోదగడ్డి రూ. బాదగడ్డి. వి. ఆము కాల్చుకి కప్పుకి పనికివచ్చే ఒకరకం గడ్డి. బోదచలుచు అ.క్రి. ఉబ్బి ఉండు, అంతట స్థూలమై ఉండు. మను. 4.21. బోదతెగులు రూ. బోత్తెగులు. వి. వరి, నజ్జ, గోధుమ. ధనియాలు మొ. పైర్ల తెగులు. బోదవేత వి. గడ్డితో కప్పే తీరు. బోదమామిడి వి. బొమ్మమేడి. ఊతలు లేని నిరుపయోగమైన కలపకల ఒకరకం చెట్టు (Ficus hispida). బోదరాయి వి. 1. రాతికూదాలకు, స్తంభాలకు అడుగుభాగంలో మోపు కింద ఉంచబడిన గుంటగల రాయి. 2. నూరటానికి పనికివచ్చే రాయి. బోదసెనక్కాయ వి. గుత్తివేరుసెనగ. <బోద²+సెనగ+కాయ.

బోద³ వి. బోధ, తెలివి.

సం. బోధ-. తెలివి, జ్ఞానం.

<సం. బోధ-.

బోదపడు అ.క్రి. దొరుకు.

బోదడి రూ.చూ. బోదారి. వి. 1. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; 2. దోనె మలుపు తరువాత ఉన్న భాగం; 3. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె.

బోదంతం చూ. బోద². వి. అడవిలో దొరికే ఒకరకం ఆకుకూర.

బోదఁడు వి. పిల్లవాడు. కేయూ. 3.223

బోదన వి. 1. దుర్బోధనం. సారంగ. 2; 2. తెలివి. కృ.శకు. 2.144.

సం. బోధన-. బోధించటం; ప్రా. బోధణ-, బోహణం, బోధ. శిక్ష, ఉపదేశం; అ.మా. బోధణం; తు. బోద; మ. పోతం; బ్రా. బోద్.

<ప్రా. బోధణ-.

బోదరగాలి వి. పెద్దపెట్టున వీచే గాలి.

క. బోదు. లోన సారం లేకుండా (పళ్ళు మొ. వాటిలో కలిగే పెరుగుదల).

బోదలా రూ.చూ. బోద¹. వి. పక్షి మొ. వాటి పిల్ల.

బోదారసింగి వి. కేదారశృంగం, వృక్షవిశేషం. బోదార అనేది స్థలనామం కావచ్చు.

సం. శృంగిన్. వృక్షవిశేషం; ప్రా. సింగి.

<బోదార+ప్రా. సింగి.

బోదారి చూ. బోదు¹. రూ. బిదర, బొదరు, బొదర, బోదడి. వి. 1. మోటబొక్కెన నీళ్ళు కుమ్మరించే చోటు; 2. దోనె మలుపు తరవాత ఉన్నభాగం; 3. తాటిమొద్దు తొలిచి ఏర్పరచిన దోనె.

బోది రూ.చూ. బోదె¹. వి. 1. రాతిస్తంభాలకింద ఆధారంగాను అలంకారంగాను పెట్టే మలిచిన రాతిపీట; 2. బావి చుట్టూ చుట్టిన పిట్టగోడ; 3 నీరునిల్చే గుంట; 4. మిట్ట పొలానికి నీరు పారించటానికి మట్టాన్ననుసరించి పోసిన పెద్దకట్ట; 5. నూతినీళ్ళుతోడి పోసే చోట ఎత్తుగా వేసిన కట్ట; 6. చాళ్ళు విడివిడిగా దూరదూరంగా దున్నటం; 7. రెండుచాళ్ళ మధ్యభాగం; 8. తాటి కొబ్బరి, అరటి మొ. చెట్ల ప్రకాండం.

బోదిగట్టు వి. చేప ఉనికిపట్టు ఏర్పరచుకొను.

బోదిగరాయి చూ. బోది. వి. రాతిస్తంభాలకింద ఆధారంగానూ అలంకారంగానూ పెట్టే మలచిన రాతిపీట.

బోదిగె వి. రాతిస్తంభాలకింద ఆధారంగాను అలంకారంగాను పెట్టే మలిచిన రాతిపీట.

క. బోదిగె, బోదుగె, స్తంభం మీది భాగం; తు. బోదిగె; త. పోతికై; మ. పోతిక.

<క. బోదిగ.

బోదిగెరాయి వి. రాతికూదాలకు స్తంభాలకు అడుగు భాగంలో మోపు కిందఉంచబడిన గుంటగల బండరాయి.

బోదించు స.క్రి. బోధచేయు, బోధించు, నేర్పు. ద్వి. సార. చ. 2.77వ. 4 పం.

సం. బుధ్. తెలిసికొను, తెలియచేయు, బోధ-ఎరుక, జ్ఞానం.

<సం. బోధ-+-ఇంచు³.

బోదియ రూ.చూ. బోదె¹. వి. 1. ప్రకాండం, చెట్టు మొదటి నుండి కొమ్మలవరకు ఉండేభాగం. రం. రా. ఉ. 116వ· 8పం; 2. స్తంభం మీది అవయవ విశేషం. హర. 2.205; 3. తోటలో మొ. వాటిలో నీటిని ప్రవహింప

చేయటం కోసం ఏర్పరచిన చిన్న కాలువ; 4. తిర్యగర్భకం పక్షి మొ. వాటిపిల్ల; 5. శిశువు, పిల్ల.

**బోదీ** రూ. చూ. బోద[1]. వి. పక్షి మొ. వాటిపిల్ల.

**బోదు[1]** రూ.చూ. బోద[1]. వి. 1. గోము, గారాబం. యయా. 4.116; 2. పక్షిమొ. వాటిపిల్ల.

**బోదు[2]** రూ. చూ. బోదె[1]. వి. 1. మోటబావి నుంచి నీరు ప్రవహించే కాలువ; 2. నీళ్ళు పారటానికి మడిలో నాగటితో కోసిన చాలు; 3. మొక్కలకు నీళ్ళు పెట్టటానికి తీసిన చిన్నకాలువ; 4. కాంక్రీటు కట్టుబడికి కావలసిన రాళ్ళు దొరికేదిబ్బ; 5. గానుగ రాతి చక్రంతిరిగే సన్నటి గుండ్రటి కాలువ.

**బోదు[3]** వి. ఇంటి వెనక ఉన్న అరుగు.

**బోదు[4]** వి. చేసిన రంధ్రం.

**బోదు[5]** వి. నాగరం మోసే ఎద్దుగంత.

**బోదురుకప్ప** వి. బాగాబలిసి పచ్చగా ఉన్నకప్ప.

**బోదులా** రూ.చూ. బోద[1]. వి. పక్షి మొ. వాటిపిల్ల.

**బోదె[1]** రూ. బోజ, బోజె[2], బోది, బోదియ, బోదు[2]. వి. 1. ప్రకాండం, చెట్టు మొదటినుంచి కొమ్మలవరకు ఉండే భాగం. కు. సం. 3.60; 2. స్తంభం మీది అవయవ విశేషం. రం. రా. బాల. 73వ. కీపం.; 3. తోట మొ. వాటిలో నీటిని ప్రవహింప చేయటం కోసం ఏర్పరచిన చిన్న కాలువ; 4. నూతినీళ్ళు కొడిపోసే చోట ఎత్తుగా వేసిన కట్ట; 5. రెండుబాళ్ళ మధ్యభాగం; 6. బాళ్ళు విడివిడిగా దూరదూరంగా దున్నటం; 7. రాతిస్తంభాల కింద ఆధారంగాను అలంకారంగాను పెట్టేమలచిన రాతి పీట; 8. మొగరం మీద దూలం కిందగా పెట్టిన పీట; 9. కొయ్యస్తంభాలమీద నిలిపే చెక్కిన కొయ్యకమ్మ; 10. బండిచక్రంలోని అడ్డపట్టి; 11. దర్వాజా చట్రం కింది కమ్మీ; 12. తీగెలు అల్లుకోవటానికి దోహదంగా పెట్టిన దడి; 13. అరటిఊస.

క. బోదిగె, బోదుగె, స్తంభం మీది భాగం; తు. బోదిగె. స్తంభం మీది భాగం; త. పోతికై. స్తంభంమీది భాగం నేలలో నాటే వాడికొయ్య; మ. పోతిక. స్తంభం మీది భాగం, వాడికొయ్య, ఆధారంగా పాతిన కర్ర.

**బోదెకొయ్య** వి. గడపకింది కమ్మి. **బోదెదంతె** వి. పైరులో కోసేపెద్ద దంతె. **బోదెపీట** వి. స్తంభాలమీద దూలాలకి కిందఉండే పీటవంటి అవయవ విశేషం. **బోదె పూతిక** వి. ఒకరకం మొక్క (Grewia orientalis). **బోదెరోగం** వి. ముక్కువాపు. **బోదెలకాడి** వి. నాగలి, గుంటక, గొర్రు మొ. వాటికి కట్టే ఒకరకం కాడి.

**బోదె[2]** రూ.చూ. బోద[1]. వి. 1. పక్షి మొ. వాటి పిల్ల; 2. పిల్ల, శిశువు; 3. జట్టు.

**బోదె[3]**. వి. అరగజం.

**బోదెరెలు** వి.బ.వ. వడ్లు. నల్లగా బియ్యం తెల్లగా ఉండే ఒక రకం వడ్లు.

<బోద[2] + ఆరెవడ్లు.

**బోనకత్తియ** చూ. బోనము.

**బోనకత్తె** చూ. బోనము.

**బోనకర్ర** రూ.చూ. బోనగర్ర. వి. ఆనుపోసే గొట్టం.

**బోనకాడు** చూ. బోనము.

**బోనకావడి** చూ. బోనము.

**బోనగర్ర** రూ. బూనకర్ర, బోనకర్ర. వి. ఆనుపోసేగొట్టం.

<పూను + కఱ్ఱ.

**బోనగిరి** చూ. బోనము.

**బోనగిరిపూజ** చూ. బోనము.

**బోనచ్చు** చూ. బోను.

**బోనచ్చుకమ్మి** చూ. బోను.

**బోనపుకత్తె** చూ. బోనము.

**బోనపుటిక** చూ. బోనము.

**బోనపుటిల్లు** చూ. బోనము.

**బోనపుట్టిక** చూ. బోనము.

**బోనము** రూ. బోణం, బోనాము. వి. 1. అన్నం, ఆహారపదార్థం. భార. అరణ్య. 1.126; 2. భోజనపాత్ర, వంటపాత్ర. హర. 2.123; 3. మద్దెల ఎడమవైపు చర్మానికి పూసే మసి కలిపిన అన్నం. క్రీడా. 176; 4. భోజనం, భుక్తి, తినటం. ఆము. 4.126; 5. దేవతలకు నైవేద్యం చేసే అన్నం, బల్యన్నం. హంస. 2.91.

సం. భోజన-, అన్నం; ప్రా. భోణ-, భోఅణ-; అ.మా. భోణ-, భోయణ-; మా. భోఅణ-, విందు; పా. భోజన-:

క. బోన, బోనగిత్త, బోనకత్తె; తు. బోన; త. పోణమ్, పోనకమ్, పోనమ్; మ. పోనకం. అన్నసత్రం; కుఇ.బోజి. విందు.

<ప్రా. భోణ-.

**బోనకత్తియ** రూ. బోనకత్తె, బోనపుకత్తె, బోనముకత్తె, వి. వంటలక్క. పాచకురాలు. యయా. 4.185. క. బోనగిత్తి. వంటలక్క; త. పోణకత్తి. **బోనకత్తె** రూ.చూ. బోనకత్తియ. వి. వంటలక్క, పాచకురాలు. హంస. 5.85. **బోనకాడు** వి. వంటవాడు. **బోనకావడి** వి. భోజన పదార్థాలుంచే గంపలున్న కావడి. భోజ. 5.339. **బోనగిరి** వి. పెళ్ళిలో మగపెళ్ళి వారికి ఆడపెళ్ళివారు పంపే ఫలహారాలు. **బోనగిరి పూజ** వి. సన్నమూతి పూజ. **బోనపుకత్తె** రూ.చూ. బోనకత్తియ. వి. వంటకత్తె. **బోనపుటిక** రూ.చూ. బోనపుట్టిక. వి. జమీందారులు తమ పెద్ద రైతులు నగిరి పనిమీద సంస్థానానికి వచ్చినప్పుడు వారి బసకు పంపే అన్నపుబుట్ట. భోజ.5.340. **బోనపుటిల్లు**(-ఇల్లు) వి. వంటఇల్లు. **బోనపుట్టిక** రూ. బోనపుటిక. వి. అన్నం ఉంచే గంప. రం.రా. 4అ. **బోనముకత్తె** రూ.చూ. బోనకత్తియ. వి. వంటలక్క. కృష్ణార్జు. 3. **బోనముపెట్టె** వి. తోలు కప్పిన గుండ్రటి పెట్టె. **బోనంపాలి** వి. వంటచేలో బొమ్మనుపెట్టి పూజచేసి నైవేద్యంగా పెట్టే అన్నం. <బోనము + పాలి. **బోనవెచ్చము** వి. ఆహార పదార్థాలకోసం అయిన ఖర్చు. కువ.చ. 4.61.

**బోనంపాలి** చూ. బోనము.

**బోనవెచ్చము** చూ. బోనము.

**బోనాము** రూ.చూ. బోనము. వి. ఆహారం, ఆహార పదార్థాలుంచే పాత్ర. హర. 2.122.

**బోనాంపెట్టె** వి. తోలుతో కప్పిన గుండ్రటిపెట్టె. <బోనాము + పెట్టె.

**బోనాంపెట్టె** చూ. బోనాము.

**బోనాసి** రూ.చూ. భవనాశి. వి. 1. దానరులు భిక్షార్థం చేతగొని పోయే వెడల్పు మూతిగల రాగిపాత్ర ; 2. సంగటి ముద్దలు చేసేటప్పుడు నీళ్ళద్దుకోవటానికి వాడే వెడల్పు మూతిగల మట్టిపాత్ర.

**బోవి** రూ.చూ. బోడి. వి. అంగడి తీయగా అయ్యే మొదటిబేరం.

**బోవిపెట్టె** వి. డబ్బు దాచుకొనే చెక్కపెట్టె.

**బోవిగ** రూ.చూ. బోడి. వి. అంగడి తీయగానే అయ్యే మొదటి బేరం.

**బోనీ** రూ.చూ. బోడి. వి. అంగడి తీయగానే అయ్యే మొదటిబేరం.

**బోను** వి. 1. మృగాలు మొ.వాటిని పట్టటానికుపయోగించే కపట యంత్రం. పల్నా. పు. 20 ; 2. పెంపుడు మృగాలుండ టంకోసం చుట్టు కమ్ములమర్చి చేసిన ఒకరకమైనపెట్టె కట్ట టం, మొ. వి. ఉ.రా. 5.133.

క. బోన్(ఉ) ; త. పొన్. బోను, మృగాల్ని మొ. వాటిని పట్టటానికి ఉపయోగించేది.

**బోనచ్చు** వి. బోను కమ్మి నేతకు పనికివచ్చే అచ్చు. <బోను + అచ్చు[1]. **బోనచ్చుకమ్మి** రూ.చూ. బోను అచ్చు కమ్మి. వి. మగ్గంలో ఎనిమిదికర్రల అచ్చు అమర్చి నేసిన ఒకరకం కమ్మి. **బోను అచ్చుకమ్మి** రూ. బోనచ్చుకమ్మి. వి. మగ్గంలో ఎనిమిది కర్రల అచ్చు అమర్చి నేసిన ఒకరకం కమ్మి. **బోనుకోలు** రూ. బూనకోలు. వి. అనుపోసే గొట్టం. **బోనుగొట్టం** వి. అనుపోసే గొట్టం. **బోనుపెట్టె** వి. బోషాణం. **బోనుపొయ్యి** వి. అటుఇటు తీసికొని వెళ్ళతగిన మట్టిపొయ్యి.

**బోపిచ్చు** చూ. పోయు, -ఇంచు[2]. స.క్రి. పోయించు.

**బోబు** వి. కోడిపెట్ట. ధ్వన్యను.

**బోమ** వి. తిమ్మిరి.

సం. భ్రమ-. భ్రాంతి, చుట్టూ తిరగటం ; ప్రా. భమ-. <ప్రా. భమ-.

**బోము** వి. బలాత్కారం, బలవంతం.

**బోముదాయించు** అ.క్రి. అంతట మోగిపోవు.

**బోయ[1]** రూ. బోయఁడు, బోయి, బోయా, బోయీ. వి. 1. మృగ యుడు, వేటగాడు. భార. కల్య. 2.36 ; 2. చేపలుపట్టి బ్రతికే ఒకజాతివాడు, బెస్త. భార. అను. 2.265 ; 3. కిరాతుడు. పాండు. 5.212 ; 4. బోయి, పల్లకిమోసి బ్రతికే ఒకజాతివాడు. రాజవా. 2.48.

క. బోయి, బోవ. పల్లకిమోసి, చేపలుపట్టి జీవించే ఒక జాతివారు ; తు. బోయి, బోవి. పల్లకిమోసి, చేపలుపట్టి జీవించే ఒకజాతివారు ; మ. బోయ్. పల్లకి మోసేవారు, చేపలు పట్టేవారు ; పర్జి. బోయిడ్ ;

హిం. భాఈ, భుఈ. గోండుల పల్లె పెద్ద, పల్లకి మోసే వాడు, బరువులు మోసేవాడు ; ఉ. భా-ఈ, భూఈ ; పో.చూ.మరా. భోయి. పల్లకిమోసి, చేపలుపట్టి జీవించే ఒక జాతివాడు.

**బోయత** రూ. బోయెత. వి. బోయది, కిరాతజాతిస్త్రీ. అష్టమ. క. 1.48. వ. 7పం. **బోయతనము** వి. కిరాతత్వం. ఘటికా. 1.145. **బోయవాయము** వి. తిలక విశేషం. చంద్రాంగ. 2.39. **బోయవీఁడు** వి. 1. కొమ్ముకాడు, మాతంగ సదృశు డైన మనుష్యుడు. ఆం.భా. 2.289 ; 2 కిరాతశ్రేష్ఠుడు. బోయలనాయకుడు. **బోయపల్లె** వి. నిషాదుల గ్రామం. **బోయ బొంకులు** వి.బ.వ. మిక్కిలి అసత్యాలు. వేంక. పంచ. 1.456. **బోయవాఁడు** విఁ. కిరాతుడు. **బోయవీళ్లు** వి.బ.వ. కిరాతకులు లేక కొండజాతులవాళ్ళు ఉండే పల్లెలు. నె.గా. కనిగిరి శాసనం. క్రీ.శ. 1877. **బోయెత** రూ.చూ. బోయత. వి. బోయది, కిరాతజాతిస్త్రీ. హంస. 4.30. **బోయ్** వి. బోయకు బహువచన రూపమైన గౌరవ పదం. EI క్రీ.శ. 700-800. <బోయ[1] + -ఱు. **బోసాని** వి. బోయసాని. ద.హిం.శా. సంపు. 5. శా.సం. 87. క్రీ.శ. 1314. <బోయ[1] + సాని[1].

**బోయ[2]** వి. మడులు మాన్యాలుండి గ్రామాధికారి పదవిని నిర్వ హించిన బ్రాహ్మణుడు, కిరాత, కైవర్త, మృగాలకంటె భిన్నుడు. శివస్కంధవర్మ పల్లవ శాసనం.

సం. భోజక-, భోగిన్. గ్రామాధికారి ; ప్రా. భోయగ-, బోఇఅ. భోక్త ; అశో.పా. బోఇగి ; అ.మా. భోఇ, భోయగ-. భుజించేవాడు ; పా. భోజ-. భోజక-. <ప్రా. బోఇఅ.

**బోయఁడు** రూ.చూ. బోయ[1]. వి. కిరాతుడు, కేయూ. 3.48.

**బోయి** రూ.చూ. బోయ[1]. వి. చేపలుపట్టి, పల్లకిమోసి జీవించే ఒకజాతివాడు, బెస్త.

**బోయా** రూ.చూ. బోయ[1]. వి. 1. చేపలుపట్టి, పల్లకిమోసి జీవించే ఒకజాతివాడు, బెస్త ; 2. టపా తెచ్చేవాడు.

**బోయాఁడు** వి. (స్వార్థంలో) పల్లకి మోసేవాడు ; బెస్త. బసవ. 2పు. 492. పం.

**బోయాఁడు** చూ. బోయా.

**బోయెత** చూ. బోయ[1].

**బోర[1]** చూ. బోరు[2]. వి. రొమ్ము, వక్షం, కడుపు, కుక్షి. పారి. 4.21.

క. బోరె. కొంద ; త. పుర్రై. ఎత్తు.

**బోరగించు** స.క్రి. బోరగిలచేయు. వేమ. 4.21. **బోర గిలు** రూ. బోరగిల్లు. అ.క్రి. 1. రొమ్ము, భూమి మొ. వాటిని అను. భార. కల్య. 1.286 ; 2. రొమ్ము, భూమి మొ. వి అనుకొనేట్లు పడుకొను. హరి. పూ. 5.190. **బోరగిల్లు** రూ.చూ. బోరగిలు. అ.క్రి. 1. రొమ్ము, భూమి మొ.వాటిని అనుకొనేట్లు పడుకొను. ఆము. 2.61 ; 2. రొమ్ము, భూమి మొ. వాటిని అను. రాజవా. 3.121. **బోరప్రాకుడు** వి. పాము. అచ్చ.రా.బాల. 68 **బోరలించు** రూ. బోరించు, బోర్లించు, బోల్లించు. బోర్ళచ్చు, బోర్ళించు. స.క్రి. దబ్బడించు. **బోరించు** రూ.చూ. బోరలించు. స.క్రి. కుండమీద కుండ అడుగుభాగం పైకి వచ్చేటట్లు పేర్చు.

**బోర[2]** వి. 1. పత్తికట్ట ; 2. వదులు నంచులు.

త. పొర్. రాశి, ధాన్యరాశి. దగ్గరకు వేగంగా చేర్చటం.

**బోరగ** రూ.చూ. బోరువ. వి. రాబందు, గద్ద జాతికి చెందినది.

**బోరంకిపట్టి** వి. మొగరాల మీది దూలం కిందుగా కరొత్తుల మీదకు వేసిన వాసం.
క. బోరె. బదరీవృక్షం.

**బోరతలుపు** రూ.చూ. బోరుతలుపు. వి. నగరు మొ. వాటి వాకిటి పెద్ద రెక్కతలుపు.

**బోరన** రూ. బోరున, బోరన. అవ్య.ద్రు. **1.** వెంటనే, తక్షణం. భార.ఆది. 2.39 ; **2.** అధికంగా, ఎక్కువగా. భార.ఆది. 2.235 ; **3.** శీఘ్రంగా. భార.అరణ్య. 2.29 ; **4.** సంపూర్ణంగా. పద్మ. 7.29.

**బోరవిమెరుజడివాన** చూ. బోరు².

**బోరిగము** వి. చీపురు.

**బోరింగులసారి** రూ.చూ. బేరింగుసారి. వి. బాల్‌బేరింగు అమర్చిన సిమెంటుసారె.

**బోరించు** చూ. బోర¹.

**బోరు¹** వి. చిన్న గట్టు.

**బోరు²** వి. **1.** భేరి మొ. వాద్యాల ధ్వనికి అనుకరణం. రుక్మా. చ. 5.87 ; **2.** రక్తం మొ. విప్రసరించటంలో అయిన ధ్వనికి అనుకరణం. సానంద. 3.154 ; **3.** పంది మొ. వి రొప్పటంలోని ధ్వనికి అనుకరణం. శుక. 1.179 ; విశ. పెద్ద.
క. బోరె. కొంత ; క. పురై. ఎత్తు, ఉన్నతి.
**బోరవిమెరుజడివాన** వి. చప్పుడుతో కురిసే పెద్ద వాన. శుక. 2.29. < బోరు² + అనిమెరుజడివాన. **బోరుకలగు** రూ.చూ. బోర్కల్గు. అ.క్రి. శబ్దించు. ఇందు. 1.187. **బోరుకొను** అ.క్రి. బోరు కలుగు, మోగు. చంద్రికా. 6.32. **బోరుకొలుపు** రూ.చూ. బోరుకొల్పు. స.క్రి. గొప్పధ్వని చేయు. **బోరుకొల్పు** రూ. బోరుకొలుపు. స.క్రి. గొప్ప ధ్వనిచేయు. సీతారా. 1.128. **బోరుగద్దలు** వి.బ.వ. బొంతగద్దలు. **బోరుతలుపు** రూ. బోరతలుపు, బోర్తలుపు. వి. రాజగృహం మొ.వాటి తలవాకిటి పెద్దరెక్కల తలుపు. భీమ. 5.100. **బోరుబొంత** వి. గ్రద్ద జాతికి చెందిన పక్షి. **బోరుమను (-అను)** అ.క్రి. వెక్కివెక్కి ఏడ్చు. **బోర్కల్గు** రూ. బోరుకలగు. అ.క్రి. శబ్దించు. పల్నా. 210 వ. **బోర్తలుపు** రూ.చూ. బోరుతలుపు. వి. రాజగృహం మొ. వాటి తలవాకిటి పెద్దరెక్కల తలుపు. హంస. 2.137.

**బోరు³** వి. **1.** కన్నం, రంధ్రం ; **2.** విసుగు.
ఇం. *Bore.* కన్నం, రంధ్రం.
< ఇం. Bore.
**బోరుకవిరె** వి. బోరు కాలువకు ఉద్దిగట్టి తోడే మోట. **బోరుకాలవ** రూ.చూ. బోరుకాల్వ. వి. పెద్దకాలవ నుంచి మెరక పొలాలకు నీళ్ళు తీసుకుపోయే కాలవ. **బోరుకాల్వ** రూ. బోరుకాలవ. వి. పెద్దకాలవ నుంచి మెరక పొలాలకు నీళ్ళు తీసుకుపోయే కాలవ.

**బోరుక** రూ.చూ. బోర్క. వి. శిశువుల స్నానం.
**బోరుకాడించు** రూ.చూ. బోర్కాడించు. స.క్రి. బోరుకాడ చేయు, శిశువుల్ని స్నానం చేయించు. ద్వి.పరమ.వి. 2.67 వ. **బోరుకాడు** రూ.చూ. బోర్కాడు. అ.క్రి. (శిశువులు) స్నానంచేయు.

**బోరుకాడించు** చూ. బోరుక.

**బోరుకాడు** చూ. బోరుక.

**బోరుకు** రూ.చూ. బోర్క. వి. (శిశువులకు చేయించే) స్నానం.

**బోరున** రూ. చూ. బోరన. అవ్య.ద్రు. శీఘ్రంగా. కాశీ. 1.85.

**బోరులు** వి.బ.వ. బొరుగులు (మరమరాలు). ఆం.భా. 2.258.
త. పొరిపాల్.

**బోరువ** రూ. బోరగ. వి. ఒక జాతి పెద్దగద్ద.
క. బూర, బూరగ, బూరుగ, బూరుగె, బూర్ల. బూరుగుచెట్టు, బోరంగి. బూడిదరంగు రెక్కలు కల ఒక రకం పెద్దక్రిమి.

**బోరెము** వి. **1.** దూది మొ. వాటి మూట. హంస. 5.97 ; **2.** పెద్దబండిలో ధాన్యం పోయటానికి వేసే పెద్ద తట్ట ; **3.** పెద్దగోతాం ; **4.** గోనె పట్టలతో పెద్దబండికి సరిపోయేటట్లు కుట్టిన పెద్దసంచి ; **5.** కొమ్ము మువ్వలతో గుండ్రంగా అల్లిన ఒకరకం గాదె.
హిం. బోరా, బోరీ. సంచి.
< హిం. బోరా.
**బోరెముపోతు** రూ. బోరెంపోతు. వి. **1.** బోరెలు మోసే పోతు ; **2.** బలిసినవాడు. **బోరెంపోతు** రూ.చూ. బోరెముపోతు. వి. **1.** గుండుపోతు ; **2.** బలవంతుడు.

**బోరెంపోతు** చూ. బోరెము.

**బోరెల్లి** వి. కడుపు ఉబ్బే రోగం.
హిం. బోర్. ముంపు.

**బోర్కల్గు** చూ. బోరు².

**బోర్కాడించు** చూ. బోర్క.

**బోర్కాడు** చూ. బోర్క.

**బోర్క** చూ. బోర్ల. రూ. బోరుక, బోరుకు. వి. (శిశువులకు చేయించే) స్నానం. భాగ. 10. పూ. 248.
**బోర్కాడించు** రూ. బోరుకాడించు. స.క్రి. బోరుకాడ చేయు, శిశువుల్ని స్నానం చేయించు. భాగ. 10 ఉ. 31. < బోర్క + ఆడించు. **బోర్కాడు** రూ. బోరుకాడు. వి. (శిశువులు) స్నానంచేయు. < బోర్క + ఆడు.

**బోర్డరు** రూ. బాటర్, బాడర్. వి. **1.** స్తంభానికి పైనా దూలానికి కింద నగిషీగా చేసిన కట్టుబడి పనిలో దూలానికి ఆనుకున్న ఉపరితలం ; **2.** అంచు.
ఇం. *Border.* అంచు.
< ఇం. Border.

**బోర్డు** వి. **1.** కార్యనిర్వాహక సభ ; **2.** పెద్ద కొయ్యపలక.
ఇం. *Board.* వెడల్పైన సన్నని కొయ్య పలక, భోజనం ఏర్పాటుచేసే బల్ల.
< ఇం. Board.
**బోర్డుతిప్పు** అ.క్రి. దివాలాతీయు.

**బోర్తలుపు** చూ. బోరు².

**బోర్ల** క్రి.విశ. రొమ్ము కిందయ్యేటట్లు.
క. బోరల, బోరలు, బోర్ల, బోర్లు. తలకిందులుగా.
**బోర్లగొట్టు (-కొట్టు¹)** అ.క్రి. బోల్తాపడు. **బోర్లపక్క** వి. బాలక్రీడావిశేషం. **బోర్లపడు** అ.క్రి. **1.** రొమ్ము

కిందయ్యేటట్లు పడు ; **2.** మిడిసిపడు. **బోర్లపాటు** వి. మిడిసిపాటు. **బోర్లించు** రూ.చూ. బోరలించు. స.క్రి. **1.** (పాత్రాదుల్ని) ముఖం కిందయ్యేటట్లు పెట్టు ; **2.** చెదగొట్టు, కలవరపెట్టు. <బోర్ల+-ఇంచు[3]. **బోర్లేయు** రూ. బార్లేయు. స.క్రి. గట్టించిన పాత్రలను ఇంట్లో విడివిడిగా అంచు నేలమీద అడుగు పైకి ఉండేటట్లు అమర్చు. <బోర్ల+వేయు.

**బోర్లించు** చూ. బోర్ల.

**బోర్లేయు** చూ. బోర్ల.

**బోలటు** రూ.చూ. బోల్టు. వి. నట్లు బిగించే పరికరం.

**బోలతా** రూ. బోల్తా. వి. టోకరా.

హిం. బోల్తా. జ్ఞానం కల్పించే తత్త్వం, ఆత్మ, జీవనతత్త్వం, బాగా మాట్లాడేవాడు.

<హిం. బోల్తా.

**బోలి** రూ.చూ. బోలె. వి. బోదగా తపెలె మాదిరి పెద్దగ ఉండే మట్టిపాత్ర.

**బోలు** రూ. బొల్లు[2], బోళ్ళు. విశే. లోపల ఏమీ లేక గుల్లగా ఉండేది. గౌ.హరి ఉ. 6.21పం. ; వి. **1.** వదులుగా ఉండేది ; **2.** లోపల ఖాళీగా ఉండటం ; **3.** కత్తెర మధ్యలోని నిలువుకమ్మి.

క. పొల్లు, బోలు, ఖాళీ, తొర్ర, గుల్లగా ఉండటం ; త. పోల్.

**బోలుతలుపు** వి. జంట చెక్కలతో మధ్య ఖాళీ ఉంచి తయారు చేసిన తలుపు. **బోలుతెర** వి. సారె పలక మీది మట్టిని గొట్టంలాగ కొంత ఎత్తుగా పైకి తీర్చిన ఆకారం. **బోలుపోవు** అ.క్రి. భేదింప శక్యమగు. విష్ణువ. 8.223.

**బోలె** చూ. బోలు. రూ. బోలి. వి. **1.** కుండబొచ్చె. చంద్రరే. 8.76 ; **2.** సన్యాసులు చంకలో ధరించే సంచి. ఆం.భా. 2 177 ; **3.** ఒటికుండ ; **4.** చింతగింజలు వేయించే పెద్ద కుండ ; **5.** ఇనుముతో చేసిన వెడల్పాటి పాత్ర ; **6.** చిన్న మట్టిపాత్ర ; **7.** పెద్ద చిల్లి.

**బోలెడు** విశే. లెక్కపెట్ట లేనన్ని.

**బోలెటు** రూ.చూ. బోల్టు. వి. నట్లు బిగించే పరికరం.

**బోలెము**[1] వి. వేగం. జైమినిభా. 4.79.

**బోలెము**[2] వి. వేటకుపయోగించే సాధనవిశేషం. చంద్రాంగ. 2.107.

క. బోళె. ములికి కల బాణం.

**బోలెవాడు** విశే. తలకొట్లమారి, దుర్మార్గుడు. హంస. 5.113.

**బోలోటి** రూ.చూ. బోల్టు. వి. నట్లు బిగించే పరికరం.

**బోలోటు** రూ.చూ. బోల్టు. వి. నట్లు బిగించే పరికరం.

**బోల్టా** రూ.చూ. బోల్టు. వి. నట్లు బిగించే పరికరం.

**బోల్టు** రూ. బోలటు, బోలెటు, బోలోటి, బోలోటు, బోల్టా. వి. నట్లు బిగించే పరికరం.

ఇం. *bolt*. తలుపులు మొ. వాటి అడ్డగడియ.

<ఇం. bolt.

**బోల్టుమగ్గం** వి. ఒకరకం మరమగ్గం.

**బోల్తా** రూ.చూ. బోలతా. వి. **1.** బోర్లపాటు, టోకరా ; **2.** కలకిందులు.

**బోల్తాకొట్టు** అ.క్రి. **1.** బోల్తాపడు ; **2.** బండి తలకిందగు ; **3.** బండిగిల్లు ; **4.** మోసపోవు.

**బోల్లించు** రూ.చూ. బోరలించు. స.క్రి. కుండమీద కుండ అడుగు భాగం పైకి వచ్చేటట్లు పేర్చు.

**బోళపాటు** వి. మిడిసిపాటు.

హిం. భోలా. సరళ స్వభావం కలవాడు, మూర్ఖుడు.

<హిం. భోలా+-పాటు.

**బోళము** వి. **1.** గంధరసం. హంస. 2.227 ; **2.** వృక్షవిశేషం. హంస. 4.11.

క. బోల, బోళ, బోళు. వృక్షవిశేషం.

<క. బోళ.

**బోళా** విశే. కపటం లేని, బాపరికంలేని ; వి. అమాయకుడు.

హిం. భోలా. సరళ స్వభావం కలవాడు.

<హిం. భోలా.

**బోళామనిషి** వి. పొగడ్తకు ఉబ్బిపోయే మనిషి.

**బోళాబోళి** విశే. కపటంలేని.

హిం. భోలాభాలా. సరళ చిత్తం కల.

<హిం. భోలాభాలా.

**బోళు** చూ. బోయ[1].

**బోళ్ళించు** రూ.చూ. బోరలించు. స.క్రి. కుండమీద కుండ అడుగుభాగం పైకి వచ్చేటట్లు పేర్చు.

**బోళ్ళించు** రూ.చూ. బోరలించు. స.క్రి. కుండమీద కుండ అడుగుభాగం పైకి వచ్చేటట్లు పేర్చు.

**బోళ్ళు** రూ.చూ. బోలు. వి. **1.** వదులు వదులుగా ఉండేది ; **2.** లోపల ఖాళీగా ఉండటం.

**బోవంచి** రూ.చూ. బావంచి. వి. కారుగచ్చ, సోమవల్లిక (Proralea corylifolia).

**బోషడికే** వి. ఒక తిట్టు.

క. భోసడ, భోసడి. జారిణిని తిట్టేతిట్టు ;

హిం. -కే. యొక్క.

<క. బోసడి+హిం. -కే.

**బోషాణము** రూ.చూ. భోషాణము. వి. పెద్ద పెట్టె.

**బోసనము** వి. భోజనం.

సం. భోజన-. ఆహారం.

<సం. భోజన-.

**బోసావి** చూ. బోయ[1].

**బోసి**[1] విశే. **1.** అలంకారశూన్యమైన, నగలులేని. విక్ర. 7.160 ; **2.** దంతాలు లేని. రాజవా. 3.71.

క. బోడు. పళ్ళూడు, బోడువాయ్. పళ్ళూడిన నోరు ; తు. బోడుబాయి. పళ్ళులేని నోరు ; త. పొటవాయ్. పళ్ళూడిన నోరు.

**బోసికుండ** వి. సారాయి బట్టీలో ఒద్దు బుడ్డికి పెట్టిన పెద్ద రంధ్రానికి సరిపడేటట్లు పెట్టే చిన్న మట్టిపాత్ర. **బోసినోరు** వి. పండ్లూడిన నోరు. క్రీడా. 271. **బోసిపుచ్చు** స.క్రి. బోసి అయ్యేటట్లు చేయు. కాశీ. 7.84. **బోసిపులి** వి. **1.** పళ్ళులేనిపులి ; **2.** చడీచప్పుడు కాకుండా ఇతరుల ధనం అపహరించేవాడు. **బోసిమెడ** వి. నగలు లేని కంఠం. **బోసివడు(-పడు)** పళ్ళు లేనిదగు. భీమ. 3.37.

బోషి[1] రూ.చూ. బోచి. వి. సాలెగూడు.

బోస వి. దెబ్బతగిలిన చోట కలిగే ఉబ్బు.
క. బొస. అయ్యో. అబ్బు.

భోంసేయు రూ. భోంచేయు, భోంచేయు, భోంచేయు. స.క్రి. భుజించు. తిను. అష్టమ. క. 1.35 వ. 25 పం.
సం. భోజన-. ఆహారం, తిండి.
<సం. భోజన-+-ము+చేయు.

బౌగోనిటిక్క రూ.చూ. బగోనటిక. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర.

బౌదించు స.క్రి. వరుగులోని గడ్డిని కొంకి కర్రతో విడిలించి వేయు.

బౌండరీరాయి రూ. బాండురాయి[1]. వి. పొలానికి హద్దులు నిర్ణయించి ప్రభుత్వం వారు గుర్తుగా పాతినరాయి.
ఇం. *boundary*. పరిహద్దు.
<ఇం. boundary+రాయి.

బౌందిలి రూ. బౌందిలీ. వి. బౌందిలీజాతి, బుందేల్ ఖండంలో ఉండే ప్రజలు. శ్రీనాథుని చాటువ.
మరా. బుందేల్. వింధ్యపర్వత పరిసర దేశం.
<మరా. బుందేల్.

బౌందిలీ రూ.చూ. బౌందిలి. వి. బౌందిలీజాతి, బుందేల్ ఖండంలో ఉండే ప్రజలు. కృష్ణరా. 3.55.

బౌరూపు రూ. బైరూపు. వి. వేషాలు వేసేవాడు.
సం.ప్రా.హిం. బహు. చాలా, పెక్కు; సం. రూప-. ఆకారం.
<సం. బహు+సం. రూప-.

బౌళివట్టు అ.క్రి. మదించు. పర.రా.యు. 291 పు. 16 పం.
క. బవళి. మత్తువల్ల అటూఇటూ కదలు.
<క. బవళి+పట్టు.

బ్యాంకినోటు రూ.చూ. బాంకినోటు. వి. సొమ్ము చెలామణీ పత్రం.

బ్యాంకు రూ. బాంకి. వి. ధనాగారం, ధననిధి.
ఇం. *bank*. వడ్డీ వ్యాపార స్థలం.
<ఇం. bank.

బ్యాండు వి. భజంత్రీల మేళం.
ఇం. *band*. పాటకులు మొ. వారి మేళం లేక జట్టు.
<ఇం. band.

బ్యారకుసు రూ.చూ. బారకాసు. వి. సైనికులుండే నివాసాలు.

బ్రక్క రూ. బక్క. విశే. 1. చిక్కినవాడు. ఆము. 6.108; 2. దీనుడు.
క. బళ, బఱు. తాళి, పనికిరానితనం, బడ్డు, బరడు, బఱడు. తాళి, గొడ్రాలితనం, బఱడ. పిల్లలు లేనివాడు, బఱడి. గొడ్రాలు, బర్కట, బక్క, బక్కట. లేమి, తక్కువతనం, బత్తలె. లేమి; తు. బరంటు. శరీరం మీద రాలిపోయే పొరలు, సన్నం, సన్నమైన. పలుచని బరడు. గొడ్రాలు, పనికిమాలిన, బప్పెలు, బత్తెలు. సన్నం, ఆయాసం, బప్పెలె. సన్నమనిషి, బజె. తాళి, పనికిరాని; త. పళితు. చిన్నగా ఉన్న, విలువలేని, లోపం, లేమి, తాళి. పఱటున్. సన్నని మనిషి, దుర్బలుడు, పఱటి. సన్ననిస్త్రీ. గొడ్రాలు, పఱళుక. ఎండి పోవు, సన్నగా పెరుగు, పరళుక. తీయబడు, సన్నం; కో. పర్గ్ట్. పిల్లలు లేనివాడు, పర్గ్య. గొడ్రాలు; కొ. పరిడ్య. గొడ్రాలు; కువి. పస (పసి). సన్నం, ఎండు, సన్నమైన.
<క. బక్క.

బ్రతతి వి. లత.
సం. వ్రతతి-, వ్రతతీ. లత, తీగ.
<సం. వ్రతతి-.

బ్రతికిచెడిన చూ. బ్రతుకు.

బ్రతికిచెడినవాఁడు చూ. బ్రతుకు.

బ్రతికించు చూ. బ్రతుకు.

బ్రతికిపోవు చూ. బ్రతుకు.

బ్రతిమాలు రూ.చూ. బతిమాలు. స.క్రి. దైన్యంతో వేడుకొను.

బ్రతుక తలచుకొను చూ. బ్రతుకు.

బ్రతుకాడు చూ. బ్రతుకు.

బ్రతుకు రూ.చూ. బ్రదుకు. అ.క్రి. 1. జీవించు. భార. ఆది. 8.49; 2. సుఖజీవనం చేయు. మను. 3.44; వి. 1. జీవనం, సుఖజీవనం. విష్ణుపు. 1.30; 2. స్థితి, ఉనికి. విష్ణుపు. 2.79; 3 జీవనోపాయం, బతుకుతెరువు. విష్ణుపు. 6.398.
బ్రతికిచెడిన అవ్య. ఒకప్పుడు బాగా బ్రతికి ప్రస్తుతం చెడిపోయిన. <బ్రతుకు+-ఇ[13]+చెడిన. బ్రతికిచెడినవాఁడు విశే. ఒకప్పుడు శ్రీమంతుడై ధనాన్ని పోగొట్టుకొన్నవాడు. బ్రతికించు రూ.చూ. బ్రదికించు. స.క్రి. జీవింపచేయు, బ్రతికేటట్లుచేయు. భార. ఉద్యో. 2.68. <బ్రతుకు+-ఇంచు[3]. బ్రతికిపోవు రూ. బ్రదికిపోవు. అ.క్రి. 1. ఇబ్బందుల నుంచి తప్పించుకొను. భార. శాంతి. 1.62; 2. తప్పించుకొను. <బ్రతుకు+-ఇ[13]+పోవు. బ్రతుకతలచుకొను అ.క్రి. జీవితేచ్ఛ కలిగివుండు. <బ్రతుకు+-అ[7]+తలఁచుకొను. బ్రతుకాడు అ.క్రి. బతుకు. రాధికా. 3.31. <బ్రతుకు+ఆడు. బ్రతుకుగొడ్డేఱగు అ.క్రి. వ్యర్థమగు. కవిక. 1.38. బ్రతుకుచూచుకొను అ.క్రి. జీవనాధారం వెతకికొను. సిం.ద్వా. 5.152. బ్రతుకుడు వి. బతకడం. హరి. పూ. 2.171. బ్రతుకుతెరువు రూ.చూ. బ్రదుకుఁదెరువు. వి. ప్రాణరక్షణోపాయం, వృత్తి. బ్రతుకుతెరువు చూచుకొను అ.క్రి. జీవనాధారం వెదకికొను. బ్రతుకుపీడ్చు(-ఈడ్చు) అ.క్రి. కష్టంమీద జీవనం గడుపు. బ్రతుకుబండలగు అ.క్రి. బతుకు చెడిపోవు. <బ్రతుకు+బండ+-లు+అగు. బ్రతుకుభాగ్యము క్రిందఁబడు అ.క్రి. బండారం బయటపడు. శుక. 2.548. సం. భాగ్య-. ఐశ్వర్యం. <బ్రతుకు+సం. భాగ్య-+-ము+క్రిందు+-అ[7]+పడు. బ్రతుకుమందు వి. సంజీవనౌషధం. రామవ. 4.239.

బ్రదికించు చూ. బ్రదుకు.

బ్రదికిపోవు చూ. బ్రదుకు.

బ్రదిమి చూ. బ్రతుకు.

బ్రదుకు రూ. బతుకు[1], బదుకు, బ్రతుకు. అ.క్రి. 1. జీవించు. భార. ఆది. 3.14; 2. మను, సుఖజీవనంచేయు. భార. ఉద్యో. 1.348; వి. 1. జీవనలు, మనికి, సుఖజీవనం.

భార. ఉద్యో. 2.79 ; 2. జీవనోపాయం, బ్రతుకుతెరువు. భార. శాంతి. 3.307 ; 3. ఆయువు, జీవితకాలం. నీలా. 1.111.

క. బాళ్, బాళు, బద్దుకు, బళ్‌మంకు, బదుకు, బదకు, బడికు, బమంకు. జీవించు. బతుకు. బాళ్ (డు). జీవించు, జీవితం, సుఖంగా జీవించు ; కొడ. బళ్. జీవించు, బళి. జీవనవిధానం. బవె. జీవనసరళి, బదికె-. (బదికి). జీవించు, సుఖంగా జీవించు ; తు. బాళుని. బతుకు, వర్ధిల్లు, జీవించు, బాళికె, బాళ్కె, బాళు, బాళుదికె, బాళువె, బాళ్‌తర, బాళ్తె, బాళ్వె. వర్ధిల్లు, బతికిఉండు, జీవించు, బదుకు. జీవించు, జీవనోపాయం ; త. వాఴ (-ఎ-, -ఌ్-). బతుకు, జీవించు, పద్ధతి ననుసరిస్తూ సుఖజీవనం చేయు, వాఴ్చ్చి. సుఖంగా జీవించు, వాఴ్క్కయ్. జీవనోపాయం, జీవితకాలం, ఆయువు, సంసార జీవితం, సుఖంగా బ్రతుకు, వాఴుక్కై. జీవించు ; మ. వాయుక. బతుకు, జీవించు, సంతోషంగా బ్రతుకు, వాఴ్వు. సుఖజీవనం, వాఴ. (ఎక్కడో అక్కడ) జీవించు, వాఴు. జీవితం ; కో. వళ్ (వళి-). (స్త్రీ భర్తతో) సుఖంగా జీవించు ; తొ. పొళ్ప్. జీవించు, బతుకు ; కుఇ. బార్తి. ఆయువు, దీర్ఘాయువు, జీవితకాలం; కువి. బత్కలి, బత్కినై. జీవించు, బతుకు ; పర్జి. బన్క్. జీవించు ; కొలా. బత్ (బత్-). ఒకచోట జీవించు ; నా. బత్-. జీవించు.

బ్రదికించు రూ. బతికించు, బ్రతికించు. స.క్రి. జీవింపచేయు. బసవ. 5.683 పం. క. బదుకిసు, బదికిసు. జీవింపచేయు, బతికించు ; తు. బాళొవుని. వృద్ధిపొందించు, బదుకావుని. జీవింపచేయు, బతికించు, రక్షించు ; త. వాఴవి. జీవనోపాధి కల్పించు, జీవించటానికి సహాయం చేయు ; నా. బత్కిప్. బతికించు, పైకి తీసుకువచ్చు. <బ్రదుకు + -ఇంచు[3] బ్రదికిపోవు రూ.చూ. బ్రతికిపోవు. అ.క్రి. సుఖంగా జీవించు, ప్రమాదంలోనుంచి తప్పించుకొను. శుక. 4.14. < బ్రదుకు + -ఇ[13] + పోవు. బ్రదిమి రూ. బతిమి. వి. జీవనం. శివత. సా. ఉ.2. బ్రదుకు(దెరువు (-తెరువు) రూ. బ్రతుకుతెరువు. వి. ప్రాణరక్షణోపాయం, వృత్తి. భార. ఉద్యో. 3.388.

బ్రద్ద[1] రూ. దబ్బ, ద్రబ్బ, బద్ద, బద్దర. విణ. 1. పల్చనిది. బసవ. 3.1117 ; పండి. చ. 1.40వ : 2. చీలిక ; వి. శకలం, తునక. ఆం. భా. 1.79.

సం. ఛిత్త-. తునక, ముక్క.

బ్రద్దర వి. 1. శకలం, తునక ; 2. చీలిక. <బ్రద్ద[1] + -అర[3]. బ్రద్దలుసేయు(-చేయు) స.క్రి. పగలగొట్టు. ఉ. రా. 3.153.

బ్రద్ద[2] వి. బెత్తం.

పో. చూ. సం. వేత్ర-. బెత్తం.

బ్రద్దవరి రూ. బద్దవరి. వి. పేముతో అల్లిన కేడం. రం. రా. యు. 375వ. 28పం. ఉ హరి. 2.92. బ్రద్దలవారు రూ. బద్దలవారు. విణ. బ.వ. వేత్రహస్తులు, కట్టికవారు. రం. రా. యు. 335వ. 30పం.

బ్రందు అ. క్రి. తేనినిండమోపు. రం. రా. ఉ. 124వ. 11 పం.

క. బఌ. పిలుచు, అరచు ; త. వఌంగు, పలుచు.

బ్రమ రూ.చూ. బమ. వి. మోహం.

బ్రమల(బెట్టు (-పెట్టు) స.క్రి. భ్రమింపచేయు. నిరంకు. 2.33. < బ్రమ + -లు + -అ[7] + పెట్టు. బ్రమపెట్టు (-పెట్టు) స.క్రి. మోహింప చేయు, మోహపెట్టు. హర. 6.104.

బ్రమయించు చూ. బ్రమయు.

బ్రమయు అ.క్రి. 1. (కన్ను) చెదరు, మిరుమిట్లుగొను. భార. ఉద్యో. 2 280 ; 2. దిగ్భ్రమచెందు, దిక్కుతోచకుండు. ఉ. హరి. 4.189 ; 3. మోహపడు, వలపుచెందు. హర. 6.104 ; 4. భ్రాంతిపడు. మను. 3.16 ; 5. మోసపోవు. చంపూరా. 5.39.

సం. భ్రమ్. తిరుగు.

బ్రమయించు స.క్రి. భ్రాంతినొందచేయు, మోసగించు, మోహింపచేయు. కాళ. 1.48. <బ్రమయు + -ఇంచు[3].

బ్రమరి[1] వి. ప్రదక్షిణం. నిర్వ. రా. 10.30.

సం. భ్రాంమరీ. చుట్టూ తిరగటం ; ప్రా. బావరీ. ప్రదక్షిణం.

<సం. భ్రామరీ.

బ్రమరితిరుగు అ.క్రి. చుట్టివచ్చు, చుట్టితిరుగు. భార. భీష్మ. 3.97. బ్రమరివాఱు(-పాఱు[3]) అ.క్రి. చుట్టు తిరుగు. భార. ద్రోణ. 5.205. బ్రమరులువాఱు. అ.క్రి. చుట్టుతిరుగు. భాస్క. రా. సుం. 553.

బ్రమరి[2] రూ.చూ. బమ్మర. వి. 1. మూర్ఛ. ఆం. భా. 2.223 ; 2. భ్రాంతి, భ్రమ.

బ్రమరులువాఱు చూ. బ్రమరి.

బ్రమ్మపేడి రూ.చూ. బొమ్మపేడి. వి. కాకిమేడి.

బ్రమ్మపెట్టు (-పెట్టు) చూ. బమ. స.క్రి. మోహింపచేయు. హర. 6.104.

బ్రమ్మశాక వి. ఒకానొక బ్రహ్మణేతర గోత్రం, వైశ్యగోత్రం. నె. శా. శాపూరు. శా. సం. 20. క్రీ.శ. 1247.

సం. బ్రహ్మన్. విధాత. శాఖా. తెగ, జాతి.

<సం. బ్రహ్మన్ + సం. శాఖా.

బ్రమ్మాచారి రూ.చూ. బ్రమ్మచారి. వి. బ్రమ్మచారి. వటువు.

బ్రమ్మి వి. 1. సోమెదచెట్టు ; 2. పొన్నగంటికూర.

సం. బ్రాహ్మీ. పొన్నగంటికూర, ముల్లంగి, బ్రహ్మదండి.

<సం. బ్రాహ్మీ.

బ్రమ్మెత వి. బ్రహ్మహత్య. విప్రుని చంపటం.

సం. బ్రహ్మహత్యా. బాపనకొల.

<సం. బ్రహ్మహత్యా.

బ్రల్లవవిఱుగు చూ. బ్రల్లు.

బ్రల్లు వి. విరగటంలో అయినధ్వనికనుకరణం. వరమ. 5.228.

బ్రల్లనవిఱుగు అ.క్రి. పెళ్ళుమని విరుగు. భార. ఆది. 2.73. ధ్వన్యను.

బ్రవున రూ.చూ. బ్రౌను. వి. 1. గోధుమరంగు ; 2. ఎండుపొగాకురంగు రంగు.

**బ్రష్షు** రూ. బెష, బెషె, బ్రస్సు, బ్రెష్షు, బ్రెస్సు. వి. 1. సన్నటి కర్రకు ఒకచివర నారనో గుడ్డనో కట్టి తయారు చేసిన సాధనం; 2. ఒన్నివికే వెదురుబద్ద; 3. పళ్ళు తోము కొనే సాధనం; 4. బట్టలు చెప్పులు మొ. వాటిని శుభ్ర పరిచే సాధనం.

ఇం. *Brush*. కుంచె.

<ఇం. Brush.

**బ్రస్సు** రూ.చూ. బ్రష్షు. వి. సన్నటికర్రకు ఒకచివర నారనో గుడ్డనో కట్టి తయారుచేసిన సాధనం.

**బ్రహ్మ**[1] వి. బ్రహ్మదేవుడి దేవాలయం. ద. హిం. గా. సంపు. 10. గా. సం. 27. క్రీ.శ. 1129.

సం. బ్రహ్మన్ (పుం). ఋత్విక్కు, విప్రుడు, చతుర్ముఖుడు.

<సం. బ్రహ్మన్ (అర్థవిపరి.).

**బ్రహ్మకమ్మి** వి. ఉత్తరపుకట్టు, రెండు మూడు గుడ్డ ముక్కలు ఒకటిగా చేర్చి అడ్డంగా కట్టిన పెద్దకట్టు. వరాహ. 6.17. సం. బ్రహ్మన్. విధాత. <సం. బ్రహ్మన్ + కమ్మి. **బ్రహ్మకల్పము** వి. 1. మిక్కిలిగొప్ప. వేమ. 6; 2. అతి కష్టసాధ్యం. సం. బ్రహ్మకల్ప-. బ్రహ్మపదకాలం. <సం. బ్రహ్మకల్ప- + -ము (అర్థవిపరి.). **బ్రహ్మగాయ** వి. గట్టివాడు అని సరసనగా అనేచోట ఉపయోగించే పలుకుబడి. రామలిం. శ. 13. **బ్రహ్మచెవుడు** వి. చెప్ప రానంత చెవుడు. సం. బ్రహ్మన్. విధాత. <సం. బ్రహ్మన్ + చెవుడు. **బ్రహ్మత్య** వి. బ్రహ్మహత్య. పండి. చ. 8.546. సం. బ్రహ్మహత్యా. విప్రుణ్ణిచంపటం <సం. బ్రహ్మహత్యా. **బహ్మముడి** వి. వివాహంలో వధూవరుల వస్త్రాల్ని చేర్చి పురోహితుడు వేసేముడి. సం. బ్రహ్మన్. విధాత, ఋత్విక్. <సం. బ్రహ్మన్ + ముడి.

**బ్రహ్మ**[2] వి. సోమిద, సోమలత (తివ్వతీగ).

సం. బ్రహ్మన్. తత్త్వం, తపస్సు, వేదం, యోగం.

<సం. బ్రహ్మన్ (అర్థవిపరి.).

**బ్రహ్మచారంచు** వి. రెండు రకాల రంగు పోగులు, కొన్ని ఎక్కువ కొన్ని తక్కువ పెట్టినేసిన అంచు. సం. బ్రహ్మ చారిన్. వటువు.

<సం. బ్రహ్మచారిన్ + అంచు[3].

**బ్రహ్మదొండ** రూ.చూ. బమ్మదొండ. వి. దొండలో ఒకరకం కలుపు మొక్క (Echinops echinatus).

**బ్రహ్మనాడి** వి. మెదడుకు సంబంధించిన నాడి. హరి. 1.11.

సం. బ్రహ్మన్. హిరణ్యగర్భుడు. నాడీ. నాడి.

<సం. బ్రహ్మన్ + సం. నాడీ.

**బ్రహ్మప్రళయము** వి. అసాధ్యం, అతికష్టం.

సం. బ్రహ్మప్రళయ-. బ్రహ్మనాశమయ్యేకాలం.

<సం. బ్రహ్మప్రళయ- + -ము (అర్థవిపరి.).

**బ్రహ్మభేద్యం** వి. అసాధ్యం.

సం. బ్రహ్మభేద్య-. బ్రహ్మచే భేదించబడేది.

<సం. బ్రహ్మభేద్య- + -ము (అర్థవిపరి.).

**బ్రహ్మమేడి** రూ.చూ. బొమ్మమేడి. వి. వృక్షవిశేషం, కాకో దుంబరం. దీనికి మాగున్న పెద్దవైన ఆకులుంటాయి (Ficus oppositifolia). హంస. 4.11.

**బ్రహ్మరాకాసిచెట్టు** వి. పెద్దకలబంద.

సం. బ్రహ్మన్. బ్రహ్మదేవుడు, ఋత్విక్కు, విప్రుడు.

<సం. బ్రహ్మన్ + రాకాసి + చెట్టు.

**బ్రహ్మరాత** వి. అక్షరాలు తెలియకుండా రాసినరాత.

సం. బ్రహ్మన్. బ్రహ్మదేవుడు.

<సం. బ్రహ్మన్ + వ్రాత.

**బ్రహ్మవిద్య** వి. చాలాకష్టం అయినది.

సం. బ్రహ్మవిద్యా. బ్రహ్మజ్ఞానం, ఆధ్యాత్మిక విద్య.

<సం. బ్రహ్మవిద్యా (అర్థవిపరి.).

**బ్రాంది** రూ. బ్రాంది[2], బరందు. వి. వేడిమి నిచ్చే మత్తు ద్రవం.

ఇం. *Brandy*. ఒకరకం సారాయి.

<ఇం. Brandy.

**బ్రాండువవి** వి. 1. గుజ్జులమీద కట్టుబడిచేయటం; 2 గొమర్లు నాటటం.

**బ్రాంతి** రూ. బాతి, బాంతి. విణ. 1. ఘనం, గొప్పది. కు.సం. 10.145; 2. దుర్లభం. భార.ద్రోణ. 5.9; 3. అపురూపం, అపూర్వం. భాం.సాక్షి. 3.75, 4. ప్రియం, ఇష్టమైంది. భార.అరణ్య. 7.194; 5. పృథువు. గొప్పది. రం.రా.ఉ. 71 పు. 24 పం.; 6. అనుకూలం. ప్రబోధ. 5.42; 7. అధికం, ఎక్కువ. పారి. 3.38; వి. 1. ప్రీతి, ప్రేమ. భార.మౌసల. 24; 2. ఆసక్తి, వాంఛ, కోరిక. భోజ. 6.35.

సం. భ్రాంతి-. తిరగటం, తప్పుడు అభిప్రాయం, కోరిక, వాంఛ.

<సం. భ్రాంతి-.

**బ్రాంతిపడు** స.క్రి. ఇష్టపడు, ప్రియపడు, వాంఛించు. భోజ. 6.35.

**బ్రామిక** వి. అపేక్ష, కోరిక. హంస. 2.119.

సం. భ్రామక-. భ్రామికా. తిప్పేది, భ్రాంతిపెట్టేది. వ్యాకులపెట్టేది.

<సం. భ్రామికా.

**బ్రాహ్మణజాయీలు** వి.బ.వ. బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతర స్త్రీలకు పుట్టినవారు.

సం. బ్రాహ్మణజాయా. బ్రాహ్మణపత్ని.

<సం. బ్రాహ్మణజాయా + -లు.

**బ్రాహ్మణవ్యవసాయము** వి. లాభసాటికాని పని, కష్టపడలేని బ్రాహ్మణులు చేసే వ్యవసాయం ఆరంభంలోనే ఉంటుం దనటంపై వచ్చిన పలుకుబడి.

సం. బ్రాహ్మణవ్యవసాయ. బ్రాహ్మణుడు చేసే వ్యవసాయం.

<సం. బ్రాహ్మణవ్యవసాయ- + -ము (అర్థవిపరి.).

**బ్రాహ్మలిమాన్యం** వి. పురోహితుల కిచ్చిన భూమి.

సం. బ్రాహ్మణ-. బాపడు.

<సం. బ్రహ్మణ- + -లు + ఇ + మాన్యము.

**బ్రాహ్మడు** వి. విప్రుడు.

సం. బ్రాహ్మణ-. విప్రుడు.

<సం. బ్రాహ్మణ-.

బ్రాహ్మలు వి.బ.వ. బ్రాహ్మణులు. ద.హిం.గా.సంపు. 5. గా.సం. 1298. శ్రీ.శ. 1238.

బ్రాహ్మలు చూ. బ్రాహ్మడు.

బ్రిక్‌గడిచీర వి. ఇటికెల కట్టుబడి మాదిరి నమూనాలో నేసిన చీర.

ఇం. *Brick*. ఇటుక.

< ఇం. Brick + గడిచీర.

బ్రిందు వి. ఇరుకుదోటు. నృసింహ. 5.31.

క. బిర, బిరుపు. పగులు.

బ్రుంగు చూ. మురియు. అ.క్రి. 1. పూడు, దిగబడు. భార.ద్రోణ. 1.279; 2. మునుగు, మగ్నమగు. మార్క. 6.32; 3. కప్పబడు, ఆచ్ఛాదితమగు. భాస్క.రా. అయోధ్యా. 184; 4. చెడు, నశించు. రాఘవ. 120; 5. దాటగు, మరుగుపడు. చంద్రాంగ. 2.19; 6. చచ్చు. మరణించు. ఆం.భా. 3.87.

బ్రుంగుడు విణ. 1. మునిగిన, మగ్నమైన. రం.రా.ఉ. 99 పు. 19 పం.; 2. పూడిన, దిగబడిన. వరాహ. 1.56; 3. మరుగుపడిన. అష్టమ.క. 3.165 పు. 4 పం.; 4. ఆవృతం, కప్పబడిన. విష్ణుపు. 2.299. బ్రుంగుడుకన్ను వి. గుంతకన్ను. పండి.చ. 2.108 పు. బ్రుంగుడువంగుడు విణ. నిమగ్నం, అత్యాసక్తం. సిం.ద్వా. 10.94. బ్రుంగుడువడు (-పడు) అ.క్రి. 1. మరుగుపడు, దాటగు. భార.విరా. 1.168; 2. కష్టపడు, ఆచ్ఛాదితమగు. విక్ర. 8.57. బ్రుంగుడువఱచు (-పఱచు) స.క్రి. మరుగుపరుచు, కప్పిపుచ్చు. భార.స్త్రీ. 2.180. బ్రుంగుడువాటు (-పాటు) వి. మరుగుపడటం. భార.విరా. 2.192. బ్రుంగువడు (-పడు) అ.క్రి. (స్వార్థంలో) మగ్నమగు, మునుగు. కవిక. 5.117. బ్రుంచు స.క్రి. బ్రుంగచేయు.

బ్రుంచు చూ. బ్రుంగు.

బ్రుయ్యు చూ. మురియు. అ.క్రి. నశించు. భార.మౌసల. 201.

బ్రున్ఫుకన్ను వి. పుసిగట్టిన కన్ను. పండి.చ. 2.4.108 పు.

బ్రెమ్మకమ్మి వి. ఒకరకం చీరకమ్మి.

సం. బ్రహ్మన్. విధాత.

< సం. బ్రహ్మన్ + కమ్మి.

బ్రెష్షు రూ.చూ. బ్రష్షు. వి. నన్నటి కర్రకు ఒక చివర నారనో గుడ్డనో కట్టి తయారుచేసిన సాధనం.

బ్రెస్సు రూ.చూ. బ్రష్షు. వి. నన్నటి కర్రకు ఒక చివర నారనో గుడ్డనో కట్టి తయారుచేసిన సాధనం.

బ్రేకు వి. 1. మరాను చక్రాన్ని ఆపటానికి అమర్చిన పనిముట్టు; 2. మరనాడె గాడిలో ముల్లుకు గుచ్చిన గొయ్యకండె ఊచ ఊడిపోకుండా బిగించిన ఇత్తడి రేకు; 3. దాబీ కట్టుబడిలో ఓండును నిలపటానికి పెట్టిన ఇనపకాండి.

ఇం. *Break*. నిలుపు, పగలగొట్టు.

< ఇం. Break.

బ్రేణీలు వి.బ.వ. భక్ష్య విశేషం.

బ్రేపు వి. తేన్పటంలో అయ్యే ధ్వని. ధ్వన్యను.

బ్రొంగపోయినకన్ను చూ. బ్రుంగు. వి. లోతుపడిపోయిన కన్ను. పండి.చ. 2.4.108 పు.

బ్రొద్దకన్ను చూ. బొద్దు[1]. వి. నడుమ ఉబ్బిన కన్ను. పండి.చ. 2.4.108 పు.

బ్రొందకన్ను వి. లావెక్కిన కన్ను. పండి.చ. 4.108 పు.

బ్రోది రూ.చూ. ప్రోది. వి. వృద్ధి.

బ్రౌన్ రూ.చూ. బ్రౌను. వి. 1. గోధుమరంగు; 2. ఎండుపొగాకు కాడ రంగు.

బ్రౌను రూ. బ్రవను, బ్రౌన్. వి. 1. గోధుమరంగు; 2. ఎండుపొగాకు కాడ రంగు.

ఇం. *Brown*. గోధుమరంగు.

< ఇం. Brown.

బ్లాకు[1] వి. 1. నలుపు; 2. అగౌరవచిహ్నం.

ఇం. *Black*. నల్లని.

< ఇం. Black.

బ్లాకు[2] వి. 1. కొన్ని భాగాలు కలిసిన భూఖండం; 2. ప్రతిబింబపు బొమ్మ.

ఇం. *Block*. భూఖండం, మొద్దు.

< ఇం. Block.

బ్లాంకెటు వి. బనాతుపచ్చడం, దుప్పటి.

ఇం. *Blanket*. రగ్గు, దుప్పటి.

< ఇం. Blanket.

బ్లాటింగు వి. లేతగులాబి రంగు.

ఇం. *Blotting*. సిరాతో మచ్చ కావటం.

< ఇం. Blotting.

బ్లు రూ.చూ. బ్లూ. వి. వయిలెట్, సిరా రంగులు కలిసిన ఒకరకం రంగు, నీలంరంగు.

బ్లూ రూ. బురుగు[2], బులుగు, బులూ, బ్లు. వి. ఊదా సిరా రంగులు కలిసిన ఒకరకం రంగు.

ఇం. *Blue*. నీలిరంగు.

< ఇం. Blue.

# భ

**భక్తిచేయు** రూ.చూ. భక్తిసేయు. అ.క్రి. భక్తి కలిగి ఉండు.

**భక్తిసేయు** రూ. భక్తిచేయు. అ.క్రి. భక్తిచూపు. భార.ద్రోణ. 2.332.
సం. భక్తి-. దైవభక్తి, తత్పరత, సేవ.
<సం. భక్తి-+చేయు.

**భక్తురాలు** వి. కలంకారీ అద్దకం డిజైన్లలో ఒకరకం.
సం. భక్త-. భక్తుడు.
<సం. భక్త-+-ఆలు.

**భగభగ** రూ. బగబగ. వి. కాలటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. నవనాథ. 2.165 పు. 10 పం.

**భగవోనికుండ** రూ.చూ. బగవాని కుండ. వి. కూర వండుకోటానికి వాడే మట్టిపాత్ర.

**భగాయించు** అ.క్రి. పారిపోవు, పరిగెత్తు. రంగా. చ. 3.126.
హిం. భాగ్. పరుగెత్తు, భగా(నా). పరిగెత్తేటట్లు చేయు.
<హిం. భగా(నా)+-ఇంచు[3].

**భగాలు** వి. భయం మొ. వాటిలో అయ్యే ధ్వన్యనుకరణం. గౌ.హరి. ఉ. 1165.

**భగోణి** రూ. బగవాని, బగవోని, బొగవాని, బొగాని, బొగిణి, బొగోణ, బొగోణి, బొవాని, భోగాణి, భోగిణి. వి. మూతి వెడల్పుగా లోతు తక్కువగా ఉండే మట్టిపాత్ర.
మరా. భగుణే. ఒకరకం పాత్ర.
<మరా. భగుణే.

**భగ్గరి** చూ. భగ్గు.

**భగ్గు** రూ.చూ. బగ్గు. వి. 1. బద్దలవటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. వరాహ. 3.50; 2. కాటాకులో అయ్యే ధ్వనికనుకరణం. కాశ. 2.149; 3. తల్లడపాటులో అయ్యే ధ్వనికనుకరణం, తల్లడపాటులో అయ్యే ధ్వని. రాఘవ. 1.22; 4. మండటంలో అయ్యేధ్వని, అలాంటి ధ్వనికనుకరణం. ఉ.రా. 2.161.
భగ్గరి వి. భగ్గుమని మండిపడేవాడు, శీఘ్రకోపి. <భగ్గు+-అరి.

**భగ్గుండ** వి. ఊదారంగు కుంకం.
<'భగ్'(ధ్వన్యను.)+గుండ.

**భంగపడు** చూ. భంగము.

**భంగపఱచు** చూ. భంగము.

**భంగపాటు** చూ. భంగము.

**భంగపెట్టు** చూ. భంగము.

**భంగపోవు** చూ. భంగము.

**భంగము** వి. అవమానం. భార.విరా. 3.129.
సం. భంగ-. గండి, చీలిక కావటం, కోత, అల, భయం, వినీతంగా చేయటం.
<సం. భంగ-+-ము. (అర్థవిపరి.).
భంగపడు అ.క్రి. అవమానపడు. నిర్వ.రా. 1.74. భార.భీష్మ. 3.5. <భంగము+పడు. భంగపఱచు స.క్రి. అవమానపర్చు. భంగపెట్టు. ఉ.హరి. 4.98. <భంగము+-పఱుచు. భంగపాటు వి. అవమానం. భార.విరా. 2.134. <భంగము+పాటు. భంగపెట్టు స.క్రి. భంగపర్చు. భాస్క.రా. అరణ్య. 2.21. <భంగము+పెట్టు. భంగపోవు రూ.చూ. బంగపోవు. అ.క్రి. బతిమాలు. <భంగము+పోవు.

**భంగారంపురటి** చూ. బంగారము. వి. బంగారం దామరం.

**భంగారంగొడుగు** చూ. బంగారము. వి. బంగారంతో చేసిన గొడుగు. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1334. క్రీ.శ. 1470.

**భంగారముగుడి** చూ. బంగారము. వి. బంగారంతో చేసిన గుడి. ద.హిం.శా.సంపు. 4. శా.సం. 1354. క్రీ.శ. 1454.

**భంగారంపాలిక** చూ. బంగారము. వి. బంగారం పాలిక.

**భంగి** రూ.చూ. బంగి. వి. గంజాయి, కలంజం.

**భంగు** రూ.చూ. బంగు. వి. పలకపొడి, పాలువగైరా వేసి తయారు చేసే మత్తుపదార్థం.

**భజనకరవ** రూ. బజనకరవ. వి. భజనకు బుర్రకథలకు ఘట వాయిద్యంగా వాయించటానికి వాడే కుండ.
సం. భజన-. సేవ, పూజ.
<సం. భజన+కరవ (మిశ్రస.).

**భజనకెక్కు** అ.క్రి. స్తుతిపాత్రం అగు. సిం.ద్వా. 2.118.
సం. భజన-. సేవ, పూజ.
<సం. భజన-+-కున్+ఎక్కు.

**భజంత్రీమాన్యం** చూ. బజంత్రి. వి. దేవాలయాల్లో వాయించే వారి కిచ్చే మాన్యం.

**భజవణి** రూ. భజావళి. వి. ఒక స్వరస్థాయి. బసవ. 3.938 పం.
సం. భజన-. పూజింపటం;
క. భజియిసు, భజిసు. పూజించు.

**భజావళి** రూ.చూ. భజవణి. వి. సంగీతంలోని స్వరస్థాయి భేదం. అష్టమ. క. 2.109 పు. 10 పం.

**భటరరు** వి.బ.వ. భట్టారకులు, పండితులు. ద.హిం.శా. సంపు. 10. శా.సం. 24.
సం. భట్టారక-. ఋషి, సూర్యుడు, దేవుడు, గౌరవనీయుడైన వ్యక్తి, పండితుడు.
<సం. భట్టారక-+-రు.

**భటవృత్తిఇనాం** రూ.చూ. బటవర్తి ఇనాం. వి. ఊరి నౌకర్ల

కిచ్చిన పారితోషికం.

**భటవృత్తిమాన్యము** వి. బ్రాహ్మణమాన్యం. నె.శా. నెల్లూరు. 124. క్రీ.శ. 1582.

సం. భటువృత్తి-. బంటుపని.

<సం. భటవృత్తి+సం. మాన్య-+-ము.

**భట్టరు** విణ.బ.వ. పండితులు. హెన్ను.శా. 15వ శతాబ్ది.

సం. భట్టు-, భట్టారక-. పండితుడు.

<సం. భట్ట-+రు.

**భట్టారిక** వి. గ్రామదేవత. E.I. 089.811 AD.

సం. భట్టారికా. పూజ్యురాలు.

<సం. భట్టారికా (అర్థవిపరి.).

**భట్టికిరిటిగాడు** వి. దూదేకులపిట్ట (Lanius cristates).

**భట్టిగాడు** వి. దూదేకులపిట్ట (Lanius cristates).

**భట్టిప్రోలురుమాలు** రూ. బట్టిప్రోలురుమాలు. వి. ఒకరకం తలపాగ. వ్య. భట్టిప్రోలు గ్రామనామం. ఆ ఊర్లో తయారైనది.

**భట్టుమాన్యం** రూ.చూ. బట్టుమాన్యం. వి. పొగడినందుకు భట్రాజున కిచ్చింది.

**భట్రాజు** వి. 1. పొగిడేవాడు; 2. శూద్రుల్లో ఒకజాతి (వీరు మొదట పండితులు).

సం. భట్టు-. పండితుడు.

<సం. భట్ట-+రాజు.

**భట్రాజుపొగడ్త** వి. అతిశయోక్తులతో నిండిన పొగడ్త.

**భట్రాజుపొగడ్తలు** వి.బ.వ. కొగటవారి దగ్గర అడుక్కొనే వాళ్ళు.

**భట్లి** చూ. బట్టీ. వి. ఒకరకం పెద్ద ఎత్తు పాకం.

**భడవ** వి. కొంచెం ముద్దుగా తిట్టటం.

బెం. భేడుయా; హిం. భడువా. తార్పుడువాడు, భోగం వాళ్ళదగ్గర తబల మొ.వి వాయించేవాడు; మరా. భడవా. ఒకతిట్టు.

<మరా. భడవా.

**భడారి** వి. దేవుడు. ద. హిం. శా. సంపు. 10. శా. సం. 111. క్రీ. శ. 1142.

సం. భట్టారక-. దేవుడు. పండితుడు; ప్రా. భట్ట-. భట్టారగ-, భట్టారయ-.

<ప్రా. భట్టారయ-.

**భణంగి** వి. మోసగాడి.

మరా. భణంగ. పేదవాడు, తక్కువవాడు;

క. బణగు. నీచుడు. పేదవాడు.

<మరా. భణంగ.

**భండరకటువహిండి** వి. దేవుని భండారంలో పూటగాపెట్టిన ధనం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 1016. క్రీ.శ. 1402.

సం. భాండాగార-. ధనాగారం, కోశాగారం.

క. భండార. కోశాగారం. భండారి. కోశాధికారి.

**భండారము** వి. 1. కోశాధ్యక్షుడు. ద. హిం. శా. సంపు. 4. శా. సం. 687. క్రీ.శ. 1155; 2. కోశం, దేవుని నైవేద్యాని కిచ్చిన ధనం. నె. శా. ఒంగోలు. శా.సం. 89. క్రీ.శ. 1254.

సం. భాండాగార-. కోశాగారం.

<సం. భాండాగార-+-ము.

**భండారవ్యాపారి** వి. కోశివ్యాపారం చేసేవాడు, సాహుకారు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 880. క్రీ.శ. 1400.

సం. భాండాగార-. కోశం, ధనాగారం, వ్యాపారిన్. వ్యాపారం చేసేవాడు.

<సం. భాండాగార-+సం. వ్యాపారిన్.

**భండారి** వి. కోష్ఠాగారాధిపతి. ద. హిం. సంపు. 4. శా. సం. 988. క్రీ.శ. 1261.

**భండారు** రూ. బండరి,బండారి[1]. వి. కోశాధికారి. ద. హిం. శా. సంపు. 6. శా.సం. 211. క్రీ.శ. 1170.

సం. భాండాగారిక-. కోశాధ్యక్షుడు; ప్రా. భండాఅరి, భండాగారి; అ.మా. భండాగారి; పా. భండాగారిక; క. బండారి; తు. బండారి; మ. పండారి.

<ప్రా. భండాఅరి.

**భండారు అధికారి** వి. దేవ కోశాధికారి లేక ఉగ్రణాధికారి. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 100.

**భండారువు** చూ. బండారువు. రూ.చూ. బండారము. వి. భండారం. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 133. క్రీ.శ. 1147.

**భండికట్ట** చూ. బండి. వి. మోపు. ద. హిం. శా. సంపు. 6. శా. సం. 637. క్రీ.శ. 1147.

**భండివారి** చూ. బండి. వి. బళ్ళనడిపేదారి. E. I. IV. 33. క్రీ.శ. 1202.

**భత్తా** రూ.చూ. బత్తా. వి. ఉద్యోగులకు తిండికి ప్రతిదినం ఇచ్చే అలవెన్సు.

**భత్తెము** రూ.చూ. బత్తా. వి. ఉద్యోగులకు ప్రతిదినం ఇచ్చే అలవెన్సు.

**భద్రము** వి. 1. భోగమండపం. ద. హిం. శా. సంపు. 5. శా. సం. 189. క్రీ.శ. 1518; 2. రక్షణ; 3. జాగ్రత్త, జాగరూకత.

సం. భద్ర-. శుభప్రదమయిన, సుఖప్రదమయిన, అందమైన, సౌభాగ్యం, ఆరోగ్యం.

<సం. భద్ర-+-ము. (అర్థవిపరి.).

**భద్రలు** వి.బ.వ. పాచిక పందెంలో దారా. (పంద్రెండు).

సం. భద్రా. విదియ, సప్తమి, ద్వాదశి అనే తిథుల్లో ఒకటి.

<సం. భద్రా+-లు. (అర్థవిపరి.).

**భద్రింపు** రూ. చూ. బద్రింపు. వి. కట్టుబడిలో క్రమంలో తగ్గించే తగ్గింపు. పునాదిగోడపైన గోడకట్టినప్పుడు రెండు ప్రక్కలా మిగిలిన భాగాలు.

**భభ్రాజమానము** రూ. బభ్రాజమానము. వి. 1. లాభం; 2. ధనం.

సం. విభ్రాజమాన-. ప్రకాశించేది. 'విభ్రాజమాన' వివర్ణానికి వ్యతిరేకార్థకాల్లో బవర్ణం వస్తుంది. బభ్రాజమానానికి కృతకరూపమే 'భభ్రాజమానము'.

**భమిడివత్తి** రూ.చూ. పైండ్రపత్తి. వి. చిన్నకాయ, గింజనలుపు కలిగి దీపపు వత్తులకు వాడే పత్తి.

భయదు వి. పిరికివాడు.
సం. భయ-. భయం, వెరపు. భయస్థ-. భయపడే వాడు.
<సం. భయస్థ- + -డు.
భరణి రూ.చూ. బరణి². వి. వైశాఖ మాసంలో వచ్చే కార్తె.
భరణిపంద చూ. బరణి¹. వి. బరిణెలో ఉంచి ఉంచే ఔషధం.
భరతపిట్ట వి. భరతపక్షి.
సం. భరత-. ఒకరకం పిట్ట.
<సం. భరత- + పిట్ట (మిశ్రన.).
భరతంపట్టు రూ. బర్తంపట్టు. అ.క్రి. 1. కష్టమైన పనిని బలవంతంగా చేయించు; 2. శిక్షించు; 3. ఎక్కువగా భోజనం చేయు; 4. కక్షపై ఎదిరివారిని ఏడిపించు; 5. వేధించు.
సం. భరత- క్షేత్రం, ఆయుధంచే జీవించే ఒకానొక సంఘం.
<సం. భరత- + -ము + పట్టు.
భరంతి రూ.చూ. బరంతి. వి. 1. ఇంటిగోడ కాళ్ళను, గుంట వర్గాన్ని నింపటానికి ఉపయోగించే కంకరరాయి, ఇసుక మొ. వి; 2. ఇంటికి బేస్‌మెంటు గోడలు కట్టిన తరవాత గోడలమధ్య ఏర్పడిన ఖాళీ.
భరంతు రూ.చూ. బరంతు. వి. ఇంటిమట్టం.
భరంతుదిబ్బ వి. ఇంటిమట్టం.
భరందు రూ.చూ. బ్రాంది. వి. బ్రాంది.
భరపడు రూ. భరముపడు, భరంపడు. అ.క్రి. 1. పాటుపడు. కు.సం. 3.49; 2. అంగీకరించు. భార. శాంతి. 3.289; 3. పూను. భార.శల్య. 2.332; 4. కష్టపడు. హరి. పూ. 2.196; 5. బరువుచే వంగు; 6. నమ్ము; 7. భయపడు.
సం. భర-. అతిశయం, ఆసక్తి, భరించేది.
<సం. భర- + పడు.
భరముపడు రూ. చూ. భరపడు. అ. క్రి. భారం అని తలచు.
భరంపడు రూ.చూ. భరపడు. అ.క్రి. 1. పూను. ప్రయత్నించు. భార. ఉద్యో. 4.252; 2. విశ్వసించు, నమ్ము. భార. శాంతి. 5.387; 3. కష్టపడు. హరి. పూ. 2.197; 4. భయపడు. నరస. 4.61; 5. భారంతో వంగు. నరస. 4.61; 6. పూటుపడు. ఒకరు చేయవలసిన పని తానే చేస్తానని పూనికగొను.
భరవసా రూ. బరువసా, భరువసా, భరోసా. వి. 1. నమ్మకం; 2. దాకట్టు; 3. హామీ.
హిం. ఉ. భరోసా. నమ్మకం.
<ఉ. భరోసా.
భరాయించు స.క్రి. 1. భరించు; 2. నింపు; 3. కట్టుకొను.
హిం.ఉ. భరానా. నింపటం.
<ఉ. భరా(నా) + -ఇంచు³.
భరిణ రూ. చూ. బరిణె. వి. 1. కాటుక మొ.వి ఉంచుకొనే కరాటం, డబ్బి; 2. రాతిస్తంభం బొడ్డుకింద తుండిని నిలిపే చోటుకు గుర్తుగా మలచిన గుండ్రటి గుంట.

భరువసా రూ.చూ. భరవసా. వి. అసరా.
భరోసా రూ.చూ. భరవసా. వి. అభయం, హామీ.
భర్తరఫు రూ.చూ. బర్తరఫ్. వి. ఉద్యోగం నుంచి తొలగించటం.
భర్తరుఫు రూ.చూ. బర్తరఫ్. వి. ఉద్యోగంనుంచి తొలగించటం.
భర్తి రూ.చూ. బర్తి. వి. నింపటం.
భర్తీ రూ.చూ. బర్తీ. వి. 1. పునాదిగోడల మధ్యనున్న మట్టితో నింపవలసిన గుంట; 2. సంపూర్తి, నింపటం.
భర్తీచేయు స.క్రి. మిగిలినదాన్ని నింపు.
భల్లారే అవ్య. ఆశ్చర్యార్థకం, ప్రశంసార్థకం.
భల్లు రూ.చూ. బల్లు. వి. విరగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం. హరి.పూ. 9.46.
భళభళ వి. తినేటప్పుడయ్యే ధ్వనికి అనుకరణం. బహుళా. 4.24.
భళా రూ.చూ. బళే. అవ్య. సెబాసు. కళా. 4.68.
భళారె రూ.చూ. భళిరె. అవ్య సెబాసు. భళారే రూ.చూ. భళిరె. అవ్య. సెబాసు.
భళి రూ.చూ. బళే. అవ్య. సెబాసు.
హిం.ఉ. భలా. మంచిది.
భళిర రూ.చూ. భళిరె. అవ్య. సెబాసు. భళిరా. రూ. చూ. భళిరె. అవ్య. సెబాసు. భళిరె చూ. భళా. రూ. భళారె, భళారే, భళిర, భళిరా, భళిరే. అవ్య. సెబాసు. క్రీడా. 282. భళిరే రూ.చూ. భళిరె. అవ్య. సెబాసు.
భళీ రూ.చూ. బళే. అవ్య. సెబాసు.
భవనాశి రూ. బోనాసి. వి. దాసరులు భిక్షార్థం చేతగొనిపోయే వెడల్పు మూతిగల రాగిపాత్ర.
సం. భవనాశిన్. పుట్టుకను నాశంచేసేది, భవనాశిని. పుట్టుకను నాశనం చేసేది, సరయూనది;
క. బవనాసి. సన్యాసి, భిక్షాపాత్ర.
<సం. భవనాశిన్ (అర్థవిపరి.).
భవనాశి పొంతవాడు చూ. భవనాశి. విణ. పుట్టుకలను నాశనం చేయగలవాడు.
భవంతి రూ. బవంతి¹, బవుంతి, భవంతు, భవుంతు. వి. 1. చుట్టుకొల్లారం. పండి.చ. 5.498; 2. ఇల్లు; 3. ఇంటి కప్పుమీద పొగ పోవటానికి వదలిన రంధ్రం; 4. వెలుతురు కోసం కప్పుమీద కట్టిన నిర్మాణం.
ఒ. భవంతి. పెద్ద కట్టడం, భవనం.
<ఒ. భవంతి.
భవంతిగవాచి రూ. భవంతిగవాని. వి. పొగ బయటకు పోయేదారి. భవంతిగవాని రూ.చూ. భవంతిగవాచి. వి. పొగ బయటకు పోయేదారి.
భవంతు రూ.చూ. భవంతి. వి రాతి కప్పుగాని మట్టికప్పుగాని గల ఇల్లు.
భవిరి పంకులు వి.బ.వ. బంగారం శంఖు వలయాలు, ఆభరణ విశేషం. ద.హిం.గా. సంపు. 10. గా.సం. 4.51. క్రీ.శ. 1280.

భవిష్యం వి. గౌరవం.
నం. భవిష్య-. జరగబోయేది, తప్పక జరిగేది;
క. భవిష్య-. తప్పక జరిగేది, జరగబోయేది.
<నం. భవిష్య-+-ము. (అర్థవిపరి.).
భవుంతు రూ.చూ. భవంతి. వి. రాతికప్పుగాని మట్టికప్పుగాని గల ఇల్లు.
భషాకారి వి. పనికిరానిది.
నం. భాషాకారిన్. మాట్లాడేవాడు.
<నం. భాషాకారిన్.
భసాణము రూ.చూ. బసాణము. వి. పన్ను.
భసారం వి. బేడులు.
భాగ వి. తోట. ద.హిం.గా. నంపు. 10. గా.నం. 780.
హిం.ఉ. భాగ్. తోట.
<ఉ. బాగ్.
భాగవతమాడు అ.క్రి. ఎగురు, చిందులుతొక్కు.
నం. భాగవత-. పద్దెనిమిది పురాణాల్లో ఒకటి, భగవంతునికి నంబంధించినది.
<నం. భాగవత-+ము+ఆడు.
భాగవతుఁడు రూ.చూ. బాగోతి. వి. కృష్ణుడు మొ. వాళ్ళ వేషం వేసుకొని జీవించేవాడు.
భాట రూ.చూ. బాట. వి. 1. దిక్కు; 2. దారి.
భాబి వి. వదిన.
హిం. భాభీ. అన్నభార్య; ఉ. భాభీ. అన్న లేదా తమ్ముని భార్య.
<ఉ. భాబీ.
భామవేషగాడి బావమరది వి. పిడిలో విశేషం ఏమీలేదు అనే చోట ఉపయోగించే పలుకుబడి, భామాకలాపం నుంచి ఈ పలుకుబడి వచ్చింది.
భాయి వి. సోదరుడు. ప్రబంధ. 85.
హిం.ఉ. భాఈ. సోదరుడు.
<ఉ. భాఈ.
భారకించు అ.క్రి. 1. బరువెక్కు; 2. (జ్వర లక్షణం) అతిశయించు.
నం. భారక-. బరువుకలది, బరువు మోసేవాడు.
<నం. భారక-+-ఇంచు[3].
భారంగి చూ. బారంగి. వి. ఔషధి విశేషం. ఉ.హరి. 4.213.
భారతము వి. అదో పెద్దకథ అనే అర్థంలో ఉపయోగించే పలుకుబడి. కువ.చ. 3.72.
నం. భారత- వ్యాసరచిత బృహద్గ్రంథం.
<నం. భారత-+-ము. (అర్థవిపరి.).
భారతిసేనలు వి.బ.వ. ధాన్య విశేషం. హంస. 4.128.
నం. భారతి. సరస్వతి.
<నం. భారతి+సేన+-లు.
భారషి రూ.చూ. పారసి[1]. వి. పారశీకభాష.
భారి రూ.చూ. భారీ. విశ. ఎక్కువ, పెద్ద.
భారీ రూ. భారి. విశ. ఎక్కువ, పెద్ద.
హిం. భారీ. పెద్ద, బరువైన, పొడవైన, బరువుగల, విలువైన, గొప్ప, లావైన, సాధ్యంకాని, బ్రహ్మాండమైన, మోయకూడని, క్రూరమైన, భయంకరమైన, సీసపు;
త. పారి.
<హిం. భారీ.
భారీచెయ్యి వి. దండిచెయ్యి.
భావనారుషి వి. పద్మసాలీల కులదేవుడు.
నం. భావనారాయణఋషి. భావనారాయణుడనే పద్మసాలీలదేవుడు.
<నం. భావనారాయణఋషి.
భావనారుషి తిరణాల వి. పద్మసాలీలు చేసుకొనే పండుగ. భావనారుషి పండుగ వి. పద్మసాలీలు చేసుకొనే పండుగ.
భావి రూ.చూ. బావి. వి. నీటికోసం భూమిలోకి తవ్విన లోతైన గుంట.
భిస్ని వి. సేనాగ్రం. అని. 3.19.
ఉ. బినీ. ముక్కు; పార. బినీ. ముక్కు; మరాఠీ. భినీ. సేనాగ్రం.
<ఉ. బినీ.
భీమగుదెలు వి.బ.వ. ధాన్యవిశేషం. ప్రబంధ. 112.
నం. భీమ-. భయంకరమైనది.
<నం. భీమ-+గుదె+-లు (మిశ్రన.).
భీమచీల వి. బండి ఇరుసుపైన బిగించిన అడ్డలో నడుమ ఇరుసులోనికి దిగేటట్లు దూర్చి బిగించిన పొడవు ఇనప చీల. వ్యు. ద్రాక్షారామ భీమేశ్వరుడు విపరీతంగా పైకి పెరిగిపోతుంటే ఆ పెరుగుదల నాపటానికి భీమేశ్వరుడి తలపై పెద్ద చీల కొట్టారట.
నం. భీమ-. ద్రాక్షారామ భీమేశ్వరుడు.
<నం. భీమ-+చీల (మిశ్రన.).
భీముఁడు వి. బలవంతుడైన వ్యక్తి.
నం. భీమ-. ధర్మరాజు పెద్ద తమ్ముడు.
<నం. భీమ- (అర్థవిపరి.).
భుగభుగ రూ.చూ. బుగబుగ. క్రి.విశ.ద్రు. పరిమళించగా ఘుమఘుమలాడగా. భీమ. 1.118.
భుగభుగమండు అ.క్రి. కాంతితో మండు.
భుగాలున క్రి.విశ.ద్రు. హఠాత్తుగా.
భుగులుకొను రూ.చూ. బుగులుకొను. అ.క్రి. పరిమళం వ్యాపించు. ఆము. 2.85.
భుగులువచ్చు రూ. బుగులువచ్చు. న.క్రి. 1. ప్రకటిత మొనర్చు. గౌ.హరి.వ. 245; 2. కలవరపెట్టు.
భుగ్గురను(-అను) అ.క్రి. పరిమళించు, గుబాళించు. బారు చంద్ర. 4.21.
భుజబలమాడ వి. ఒకరకం నాణెం. ద.హిం.గా.నంపు 5. గా.నం. 191.
నం భుజబల-. బాహుశక్తి, బాహుశక్తి కలవాడు, ఒక రాజు పేరు కావచ్చు.
<నం. భుజబల+-మాడ (మిశ్రన.).
భుజములుప్పొంగు అ.క్రి. నంతోషించు. హంస. 4.108.
నం. భుజ-. బాహువు, చెయ్యి.
<నం. భుజ-+-ము+-లు+ఉప్పొంగు.

భుజములుమూఁడను అ.క్రి. సంతోషంతో ఉప్పొంగిపోవు. సుదంతా. 77.
సం. భుజ-. చెయ్యి
<సం. భుజ- + -ము + -లు + మూఁడు + అను.

భుజాభోజనము వి. సంతృప్తికరం అయిన భోజనం. పాండు. 2.111.
సం. భుజా. చేయి, సం. భోజన-. ఆహారం.
<సం. భుజా + సం. భోజన- + -ము (అర్థవిపరి.).

భుంభుం వి. శంఖారావానికి అనుకరణం. దశా. 4.236. ధ్వన్యను.

భూచక్రం వి. ఒకరకం బాణసంచా, భూమి మీద తిరిగే చక్రం.
సం. భూచక్ర-. భూమండలం.
<సం. భూచక్ర- + ము (అర్థవిపరి.).

భూతకాపుపెట్టు అ.క్రి. భూతాలు సోకకుండా రక్షరేకు కట్టు. హంస. 4.131.
సం. భూత-. పిశాచం.
<సం. భూత- + కాపుపెట్టు.

భూతగెణసు వి. ఒకానొక దుంప. హంస. 4.131.
సం. భూత-. పిశాచం.
<సం. భూత- + గెనుసు (మిశ్రస.).

భూతవెరిది వి. వృక్షవిశేషం. హంస. 4.11.
సం. భూత-. పిశాచం.
<సం. భూత- + నెరిది (మిశ్రస.).

భూతపాదిరి వి. వృక్షవిశేషం. హంస. 4.11.
సం. భూత-. పిశాచం.
<సం. భూత- + పాదిరి (మిశ్రస.).

భూదినుసు వి. ఒకరకం కలుపుమొక్క (Nepeta malabarica).
సం. భూ. నేల.
<సం. భూ + దినుసు.

భూదుల్సి వి. తులసి జాతికి చెందిన మొక్క (Ocimum busilicum).
సం. భూతులసి. ఒకరకం మొక్క.
<సం. భూతులసీ.

భూమట్టం రూ. భూమిమట్టం, భూమిమట్టు, భూమ్మట్టం. వి. నేలతో సమానమైన ఎత్తు.
సం. భూ. నేల, భూమి.
<సం. భూ + మట్టము.
భూమట్టాపారం వి. నేలతో సమానమైన ఎత్తు.

భూమట్టాపారం చూ. భూమట్టం.

భూమిపండు వి. చెడబుట్టినవాడు.
సం. భూమి-. నేల.
<సం. భూమి- + పండు.

భూమిలెవలు వి. నేలతో సమానమైన ఎత్తు.
సం. భూమి-. నేల; ఇం. *Level*. మట్టం.
<సం. భూమి + ఇం. Level.

భూమ్మట్టం రూ.చూ. భూమట్టం. వి. నేలతో సమానమైన ఎత్తు.

భూమ్మందం వి. నేలతో సమానమైన ఎత్తు.
సం. భూమి-. నేల.
<సం. భూమి- + మందము.

భూశయ్యమీద ఉండు అ.క్రి. చనిపోయే స్థితిలో ఉండు.
సం. భూశయ్యా, నేలమీది పక్క.
<సం. భూశయ్యా + మీఁద + ఉండు.

భూషణచేయు స.క్రి. స్తోత్రం చేయు. ప్రభు. 1.99.
సం. భూషణ-. అలంకారం.
<సం. భూషణ- + చేయు.

భూసెనగ వి. మెట్టలో పండే ఒకరకం పప్పుదినుసు, వేరుసెనగ (Arachis hypogsea).
సం. భూ. నేల.
<సం. భూ + సెనగ.

భృంగిదండ వి. మల్లవిద్యా సంబంధమైన పన్నెండు దండల్లో ఒకటి.
సం. భృంగి-. శివుని పరిచారకుల్లో ఒకడు, తుమ్మెద.
<సం. భృంగి- + దండ.

భేగము రూ.చూ. బేగము. వి. 1. గొప్ప ఇంటి స్త్రీ; 2. సయ్యదాని స్త్రీల ఇంటి పేరు.

భేటి రూ.చూ. బేటీ. వి. సమావేశం, కలుసుకోవటం.
భేటిచేయు అ.క్రి. దర్శనం చేసుకొను, కలుసుకొను.

భేటీ రూ. బేటి, బేటీ. వి. సమావేశం.
ఒ. భేటి, భేటిభా-. సమావేశం: హిం.ఉ. భేంట్. కలయిక, సమావేశం; గు. భేట, భేటవుఁ. సమావేశం; మరా. భేట్, భేటణేఁ.
<మరా. భేట్.

భేరివిజోకొట్టు అ.క్రి. నష్టను తగ్గించబోయి మరింత నష్టాన్ని చేయు. ప్రభా. 3.72.
సం. భేరి. వాద్య విశేషం.

భేరీజు రూ.చూ. బేరీజు. వి. అందాజు (అంచనా) మొత్తం.

భేషక్కు క్రి.విశే. నిస్సందేహంగా.
హిం. బేశక్. సందేహం లేకుండా; ఉ. బేషక్.
<ఉ. బేషక్.

భేషజము వి. వట్టి డంబాచారం. హరి. 3.90.
సం. భేషజ-. ఆరోగ్యకరమయిన, మందు, రోగనివారక మంత్రం, సుఖం.
<సం. భేషజ- + -ము (అర్థవిపరి.).

భేషు రూ.చూ. బేషు. విశే. శ్రేష్ఠం, మంచిది.

భోగజీతాలు వి. గుడి పరిచారకుల వేతనం. నె.గా.కందుకూరు. గా.సం. 18. క్రీ.శ. 1408.
సం. భోగ-. సుఖదుఃఖాదుల భుక్తి. భోజనం.
<సం. భోగ- + జీతము + -లు (మిశ్రస.).

భోగపతి వి. కాపరి, రక్షకుడు. ద.హిం.గా.సంపు. 6, గా.సం. 130, క్రీ.శ. 1285.
సం. భోగపతి-. మండలాధికారి.
<సం. భోగపతి- (అర్థవిపరి.).

భోగవసులు వి. దేవునికి చేసే ధూపదీపాది నైవేద్య కార్యాలు.

నె.శా. పొది. సంపు. 6. క్రీ.శ. 1312.
సం. భోగ-. భోజనం, ఆహారం.
<సం. భోగ- + పని + -లు (మిశ్రస.).

**భోగబంద** వి. కౌలు నిర్ణయించుకొని డబ్బు ముందుగా చెల్లించిన తరవాత రైతు కిచ్చిన భూమి.
సం. భోగ-. ఆహారం, సుఖదుఃఖాదుల భుక్తి, రక్షణం. బంధ-. కట్టు.
<సం. భోగ- + సం. బంధ-.

**భోగంమాన్యం** వి. దేవదాసీల కిచ్చిన మాన్యం.
సం. భోగ-. వెలయాలి కిచ్చే ధనం.
<సం. భోగ- + -ము + మాన్యము.

**భోగసత్రము** వి. దేవాలయానికి చెందిన భోజన సత్రం. ద.హిం.శా.సంపు. 6, శా.సం. 698, క్రీ.శ. 1525.
సం. భోగ-. తిండి, ఆహారం, సత్ర-, సత్త్ర. కలిసి ఉండటం.
<సం. భోగ- + సం. సత్త్ర- + -ము (అర్థవిపరి.).

**భోగ్యం** రూ. భోగ్గెం. వి. భూకామందుకు ముందుగా డబ్బిచ్చి కౌలుకు చేసే వ్యవసాయం.
సం. భోగ్య-. అనుభవించతగింది.
<సం. భోగ్య- + -ము (అర్థవిపరి.).

**భోజీ** వి. విందుభోజనం.
హిం. భోజ్. భోజనం, ఆహారం, తిండి. భోజీ. భుజించేవాడు.
<హిం. భోజ్.

**భోంచాల** వి. భోజనంచేసే గది.
సం. భోజనశాలా. భోజనాలుచేసే ఇల్లు.
<సం. భోజనశాలా.

**భోంచేయు** రూ.చూ. భోసేయు. స.క్రి. భుజించు, తిను.

**భోయీ** రూ.చూ. బోయ[1]. వి. **1.** టప్పా ఉంచేవాళ్ళు; **2.** పల్లకీలు మోసేవాళ్ళు.

**భోరన** రూ.చూ. బోరన. అవ్య.క్రి. **1.** అధికంగా, ఎక్కువగా. కు.సం. 2.44; **2.** శీఘ్రంగా. కు.సం. 8.124.

**భోషాణము** రూ. బోషాణము. వి. పెద్దపెట్టె.
సం. భూషణ-. అలంకారం.

**భోసేయు (-చేయు)** రూ.చూ. బోసేయు. స.క్రి. తిను. శా.ర్ల.సం. 17.268.

**భౌరికోమట్లు** వి.బ.వ. కోమట్లలో ఒకజాతి.
సం. భౌరిక-. రాజ ధనాగారంలో బంగారంపై ఏర్పర్చబడ్డ అధికారి.
<సం. భౌరిక- + కోమటి + -లు.

**భ్రమత** రూ.చూ. బమ్మెత వి. **1.** మోహం; **2.** మోహపెట్టటం.

**భ్రష్టాకారి** వి. చెడిపోయిన మనిషి.
సం. భ్రష్టకారిన్. భ్రష్టకార్యాల్ని చేసేవాడు.
<సం. భ్రష్టకారిన్.

**భ్రష్టు** వి. పాడవ్వటం.
సం. భ్రష్ట-. పాడయినది.
<సం. భ్రష్ట-.

**భ్రాంతము** వి. కిందిపెదవిమీది ముద్దు. హంస. 5.148.
సం. భ్రాంత-. తిరిగినది, తిరగటం, భ్రాంతి పొందింది.
<సం. భ్రాంత- (అర్థవిపరి.).

**భ్రాంతి** వి. కోరిక, వాంఛ. భాగ. 6.358.
సం. భ్రాంతి-. తిరగటం, పొరపాటు, ఒక అర్థాలంకారం.
<సం. భ్రాంతి- (అర్థవిపరి.).

# ఆంధ్ర గ్రంథ సంకేత పట్టిక

| గ్రంథ సంకేతాలు | గ్రంథ నామాలు | గ్రంథకర్తలు | శతాబ్ది |
|---|---|---|---|
| అ.చ. | అన్నమాచార్య చరిత్ర | చిన్నన్న | 16 |
| అచలా. | అచలాత్మజాపరిణయము | తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్య కవి | 18 |
| అచ్చ.భా. | అచ్చ తెలుఁగు భారవి | శ్రీరామకవి | |
| అచ్చ.రా. | అచ్చతెలుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి | 18 |
| బాల. | బాలకాండము | | |
| అయోధ్యా. | అయోధ్యాకాండము | | |
| అరణ్య. | అరణ్యకాండము | | |
| కిష్కిం. | కిష్కింధా కాండము | | |
| సుం. | సుందర కాండము | | |
| యు. | యుద్ధ కాండము | | |
| అధ్యా.రా. | అధ్యాత్మ రామాయణము | కోటమరాజు నాగయా మాత్యుఁడు | 17–1 |
| అధ్యా.సం. | అధ్యాత్మ సంకీర్తనలు | తాళ్ళపాక అన్నమాచార్యులు | 15-1 |
| అని. | అనిరుద్ధ చరిత్రము | కనుపర్తి అబ్బయా మాత్యుఁడు | 18 |
| అను. | అనుభవసారము | పాల్కురికి సోమనాథుఁడు | 13 |
| అప్ప. | అప్పకవీయము | కాకునూరి అప్పకవి | 17 |
| అభి.రా. | అభిషిక్త రాఘవము | నడిమింటి వేంకటపతి | |
| అష్టమ.క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | తాళ్ళపాక తిరువెంగళనాథుఁడు | 16 |
| అహల్యా. | అహల్యా సంక్రందనము | సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు | 18 |
| అహోబల. | అహోబల పండితీయము | అహోబలపండితుఁడు | 17 |
| ఆం.చం. | ఆంధ్ర చంద్రాలోకము | అడిదము సూరకవి | 18 |
| ఆనంద. | ఆనంద రంగరాట్ఛందము | కస్తూరి రంగకవి | 18 |
| ఆము. | ఆముక్త మాల్యద | శ్రీకృష్ణదేవరాయలు | 15–16 |
| ఆం.భా.భూ. | ఆంధ్ర భాషాభూషణము | మూలఘటిక కేతన | 13 |
| ఇందు. | ఇందుమతీ పరిణయము | కుమారధూర్జటి | 16 |
| ఇందు.ప. | ఇందుమతీ పరిణయము | తెనాలి రామభద్రకవి | 16 |
| ఉ.రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు | 17 |
| ఉషా. | ఉషాపరిణయము | పసుపులేటి రంగాయమ్మ | 17 |
| ఉ.హరి. | ఉత్తర హరివంశము | నాచన సోమనాథుఁడు | 14 |
| ఉ.హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | కక్కలపాటి లింగన | 13 |
| ఉదయ. | ఉదయ నోదయము | నారననూరన | 16–17 |
| ఉద్భటా. | ఉద్భటారాధ్య చరిత్రము | తెనాలి రామకృష్ణుఁడు | 16 |
| కకుత్స్థ. | కకుత్స్థ విజయము | మట్ల అనంతభూపాలుఁడు | 16 |
| కలి.శ. | కలివేల్పు శతకము | వైజర్సు అప్పయకవి | 18 |
| కలు.శ. | కలువాయి శతకము | దబ్బీరు నరసకవి | 19 |

